# తెలంగాణా ప్రజల సాయుధ పోరాటు చరిత్ర

## (1946 - '51)

### మొదటి భాగము

గ్రంథకర్త

దేవులపల్లి వెంకటేశ్వరరావు

ప్రొలిటేరియన్ లైన్ ప్రచురణలు

హైదరాబాదు

రచనా కాలం : 1982-84.

ప్రథమ ముద్రణ : 1988 జూలై.

వెల :
సాదాప్రతి రూ॥ 40/-
మేలుప్రతి రూ॥ 60/-

కవర్ డిజైన్ : చంద్ర

కాపీలకు, వివరాలకు :
**ఎడిటర్,**
**ప్రొలిటేరియన్ లైన్,**
**16-2-147/సి/1, మలక్‌పేట,**
**హైదరాబాదు-500 036.**

For copies and details :
**Editor, Proletarian Line,**
**16-2-147/C/1, Malakpet,**
**Hyderabad- 500 036.**

**Printed at NUTAN ART PRINTERS,**
**Malakpet, Hyderabad-500 036.**

# విషయ సూచిక

# ముందుమాట

కీర్తిశేషులు కామ్రేడ్ దేవులపల్లి వెంకటేశ్వరరావు రచించిన "తెలంగాణా ప్రజల సాయుధ పోరాట చరిత్ర (1946-'51)" మొదటి భాగాన్ని పాఠకుల ముందుంచుతున్నాము. 1984 జూలైలో రచయిత హఠాత్తుగా మరణించటంతో, ఇతరత్రా సిద్ధంగా ఉన్న ఈ పుస్తకం ఎడిటింగు పని మధ్యలో నిలిచిపోయింది. దానితో మిగిలిన ఎడిటింగు పనిని పూర్తిచేసి ఈ గ్రంథాన్ని మేము ముద్రణకు సిద్ధంచేయాల్సి వచ్చింది. ఈ గ్రంథం మొదటి భాగానికి సంబంధించినంతవరకు మేమీ పనిని పూర్తిచేయగలిగాము. రెండవ భాగాన్ని సాధ్యమైనంత త్వరలో తీసుకురావాలని ప్రయత్నిస్తున్నాము.

తెలంగాణా సాయుధపోరాటం గుణపాఠాలను కా॥ డివి ఆ విషయంపై వ్రాసిన వివిధ సిద్ధాంత రచనలలో క్రోడీకరించి, విశదం చేశారు. అయినప్పటికీ, ఆ పోరాటం గురించి సమగ్రమైన చరిత్ర అవసరం మాత్రం ఉంటూ వచ్చింది. ఈ బృహత్ కార్యానికి తగినవారైన కామ్రేడ్ డివి ఈ కర్తవ్యాన్ని చేబట్టాలని నిర్మాణంలోని శ్రేణులూ, విప్లవోద్యమ సానుభూతి పరులూ, శ్రేయోభిలాషులూ చాలాకాలంగా కోరుతూ వచ్చారు. అయితే 1968 నాటినుంచీ ఆయన కమ్యూనిస్టు విప్లవకారుల పార్టీ నిర్మాణానికి సిద్ధాంత, కార్యక్రమ, నిర్మాణ పునాదులువేసే కర్తవ్యంలో, ఒక కొత్త తరహాకు చెందిన, ఉన్నతస్థాయి విప్లవోద్యమాన్ని నిర్మించే కృషిలో పూర్తిగా నిమగ్నమై ఉన్నారు. చివరకు ఆయన జైలులో గడిపిన కాలాన్ని (1969 డిసెంబరునుంచి 1972 మే వరకు), తర్వాత బెయిలుపై బయటఉన్న కాలాన్ని సైతం ఈ పనికే వినియోగించారు. మితవాద అతివాద అవకాశవాదాలకు వ్యతిరేకంగా తీవ్రమైన సిద్ధాంతపోరాటం ఈ కృషిలో అంతర్భాగంగా ఉండినది. చారుమజుందార్, చండ్రపుల్లారెడ్డి గారలు అనుసరించిన అవకాశవాదాలను కూలంకషంగా విమర్శిస్తూ ఆయన రచించిన ప్రసిద్ధ రచనలూ, భారత జనతా ప్రజాతంత్ర విప్లవ కార్యక్రమాన్ని విశదీకరిస్తూ ఆయన రచించిన 'కోర్టు స్టేటుమెంటూ' ఈ కాలంలో వ్రాసిన రచనలలో కొన్ని.

నిజానికి 'భారత కమ్యూనిస్టు విప్లవకారుల సమైక్యతా కేంద్రం (మా-లె)' [యుసిసిఆర్ఐ (యం.యల్.)] కేంద్రకమిటీ 1975లో–కామ్రేడ్ తరిమెల నాగిరెడ్డి ఉన్నకాలంలోనే - కామ్రేడ్ డివి ఈ పుస్తకాన్ని రచించాలని నిర్ణయించి, ఆయనకి బాధ్యతను వప్పగించింది. అయితే కామ్రేడ్ నాగిరెడ్డి అకాలమరణం, సంస్థలో విచ్ఛిన్నకరశక్తులు సృష్టించిన సంక్షోభంమూలంగా, కామ్రేడ్ డివిపై నున్న బరువు బాధ్యతల దృష్ట్యా ఆయనకున్న పనుల ఒత్తిడివల్ల, ఆయన ఈ పనిని 1982 ఆగస్టులో మాత్రమే చేపట్టగలిగారు. అప్పటికి ఆయన సిద్ధాంత, రాజకీయ, నిర్మాణరంగాల్లోని తన ఇతర బాధ్యతలను నిర్వహిస్తూనే ఈ చరిత్ర రచననూ పూర్తిచేయాలనుకున్నారు. దానికి అనుగుణ్యంగానే ఈ పనిని పూర్తి చేయటానికి ఒక పథకాన్ని రూపొందించుకున్నారు.

తనపై ఉన్న ఎంతో భారమైన బాధ్యతలను నిర్వహిస్తూనే, మరోవైపు ప్రతిరోజూ కొన్నిపేజీలు వ్రాసి, కొంతకాలంలో ఈ పుస్తక రచనను పూర్తి చేయాలని ఆయన మొదట అనుకున్నారు. అయితే ఈ పద్ధతిలో ఈ పుస్తక రచన పూర్తి కావాలంటే చాలా సుదీర్ఘకాలం పడుతుందని ఆయన గమనించారు. దానితో 1982 నవంబరులో ఈ పుస్తకాన్ని డిక్టేటుచేసే పద్ధతికి పూనుకున్నారు. ఆయనకు సంబంధించినంతవరకూ ఇలా చెప్పి వ్రాయించటం కొత్త. ఎప్పటి కప్పుడు చరిత్ర కథనాన్ని కేసెట్‌లో రికార్డుచేయటం సౌకర్యంగా ఉంటుందనీ, దానివల్ల సమయం కలిసిరావటమే కాక, తిరిగి సరిచూసుకోవటానికి కూడా అనువుగా ఉంటుందనీ ఆయన గమనించారు. అప్పటినుంచీ ఆయన ఆ పద్ధతినే అనుసరించి, మొత్తం పుస్తకాన్ని ఇలా కేసెట్‌లో డిక్టేటు చేశారు. కేసెట్‌లో చెప్పటానికి ముందు ఆయన కూలంకషంగా నోట్సు సిద్ధంచేసుకొని వ్రాసుకునేవారు. ఆయన మధ్యలో ఏ భాగాలనీ వదిలిపెట్టలేదు; అసంపూర్ణంగా మిగల్చనూలేదు. ముగింపుతోసహా మొత్తం పుస్తకాన్ని పూర్తిచేశారు. ఆయన ఉండగానే, అన్ని కేసెట్లనూ వ్రాయించారు.

కేసెట్లు విని వ్రాసిన ప్రతిని (transcription) ఎడిట్ చేసే పనిని ఆయన ఆ తర్వాత చేబట్టారు. ఈ పనికి ఒక స్థూలమైన పథకాన్ని రూపొందించుకున్నారు. ఎడిటింగు పనికి ఆయన రూపొందించుకున్న పథకం ఫోటో కాపీలను ఈ పుస్తకంలో ప్రచురించాము (పేజీ-XLiv). ఈ పుస్తకంలోని మొదటి భాగాలకు తుది రూపం ఇచ్చేక్రమంలో కా॥ డి. వి. కేసెట్ ప్రతిలోని

కొన్ని భాగాలను తిరిగి వ్రాశారు. టేపు చేసిన భాగానికేకాక, మొదట్లో ఆయన వ్రాసిన, చెప్పి వ్రాయించిన భాగాలకు కూడా ఇది వర్తిస్తుంది. అయితే, పని ముందుకు సాగినాకొద్దీ, ఇలా తిరిగి వ్రాసిన భాగాలు తగ్గిపోయాయి. ఆయన మరణించే నాటికి మొదటి ఐదు అధ్యాయాలను స్వయంగా ప్రచురణకు సిద్ధం చేశారు (ముద్రణలో 220 పేజీలు). ఇందులో 192 పేజీలు ప్రింటు కూడా అయినాయి. ఆరో అధ్యాయానికి సంబంధించిన పనిని మొదలుపెట్టారు కూడా. స్వల్పమైన ఎడిటింగుతో ఈ భాగాన్ని మేము ముద్రణకు ఇచ్చాము. ఏడు, ఎనిమిది అధ్యాయాలకు సంబంధించి కూడా మొదటి వరుస ఎడిటింగు పనిని ఆయన పూర్తిచేశారు. ఈ పనిని మేము పూర్తిచేసి, ముద్రణకు సిద్ధం చేయవలసివచ్చింది. ఇక తర్వాతి అధ్యాయాలను - అక్కడక్కడ కొద్ది భాగాలను తప్ప - పూర్తిగా మేము ఎడిట్ చేయవలసివచ్చింది.

ఏడు, ఎనిమిది అధ్యాయాలకు సంబంధించి మేము ప్రధానంగా- వాక్యనిర్మాణాన్ని మెరుగు చేయటం; ఆయా భాగాలను ఒక క్రమంలో వచ్చేట్టు అమర్చటం; కొన్ని సంఘటనలకు సంబందించిన తేదీలను, వాస్తవాలకు సంబంధించిన ఇతర అంశాలను సరిచూడటం; రచయిత సూచించిన కొన్నింటినుంచి అధ్యాయాలకు తగిన శీర్షికలను ఎంపిక చేయటం; అధ్యాయాలు ఎక్కడ మొదలై ఎక్కడ పూర్తికావాలో నిర్ణయించటం; సబ్ హెడ్డింగుల నివ్వటం చేశాము.

చివరి నాలుగు అధ్యాయాలకు సంబంధించి-ఏవో కొద్ది చిన్నభాగాలు తప్ప -మొత్తం ఎడిటింగ్ పనిని మేము చేయవలసి వచ్చింది. పునశ్చరణలుగా ఉన్న వాక్య భాగాలను, పదాలను తొలగించి, డిక్టేట్ చేసిన వాక్యాలను ఒక క్రమంలో అమర్చ వలసి వచ్చింది. తరచుగా ఏదైనా విషయాన్ని మరింత స్పష్టంగా వివరించటానికి, లేదా తాను చెప్పదల్చుకున్న విషయాన్ని ఆచి, తూచి ఖచ్చితంగా చెప్పటానికి ఉద్దేశించబడినవీ పునశ్చరణలు. అనవసరమైన పదాలను తొలగించి, అవసరమైన వాటిని ఉంచటానికి ఈ పని తోడ్పడింది. అలాగే మాట్లాడినప్పుడు వచ్చే ఊత పదాలన్నిటినీ తొలగించి భాషను మెరుగు చేయటానికి, కొన్ని సందర్భాల్లో వ్యాకరణానికి అనుగుణంగా ఉండేట్టు చేయటానికీ వాక్యాలను ఎడిట్ చేయాల్సివచ్చింది. తొమ్మిదో అధ్యాయంలో చెప్పినవిషయాన్నే మళ్ళీ చెప్పటం గణనీయంగా ఉండినది. అలా పునశ్చరణగా ఉన్న వాటిల్లో ఒక భాగాన్ని అట్టి

పెట్టి, దానిలో మిగతా భాగాలలోని అదనపు అంశాలను చేర్చాము. అంతా ఒక క్రమంలో వచ్చే విధంగా సవరించవలసివచ్చింది. మిగతా అధ్యాయాలలో కొంత పునశ్చరణ ఉన్నప్పటికీ, కొద్ది భాగాలను తొలగించకుండా అలాగే ఉంచేశాము. పుస్తకంలో చర్చనీయాంశంగా ఉన్న ఏదో ఒక కొత్త విషయాన్ని విశదం చేయటానికి తోడ్పడుతుందని భావించి అలాచేశాము. ఒక్కమాటలో చెప్పాలంటే -ఏదైనా ఒక విషయాన్ని వివరించటానికి అవసరంలేని, లేదా కొత్త విషయమేమీ లేని సందర్భాలలో, పునశ్చరణ అని స్పష్టంగా కన్పడుతున్న పదాలను, భాగాలను మాత్రమే తొలగించాము.

ఎడిటింగు చేసే సందర్భంలో కేసెట్లను విని వ్రాసిన ప్రతిని కేసెట్లతో సరిపోల్చి, పొరపాట్లు లేకుండా సవరించాము.

ఇతర పుస్తకాలనుంచి ఉల్లేఖించిన భాగాలకు (కొటేషన్లకు) సంబంధించి నంతవరకూ, మాకు పెద్ద చిక్కులేమీ ఎదురవలేదు. రచయిత ఒక పుస్తకంలో నుంచి 'యథాతథ ఒడంబడిక' పూర్తిపాఠాన్ని ఉల్లేఖించాలని (కోట్ చేయాలని) సూచించారు; అది ఇంగ్లీషునుంచి తెలుగులోకి అనువాదం. ఆ అనువాదంలో చాలా లోపాలున్నందున దానిని సరిదిద్దవలసి వచ్చింది.

ఇతర పుస్తకాలనుంచి తీసుకున్న కొటేషన్లలో, ఇతర విషయాలలో చాలా భాగం స్వయంగా రచయితే ఎడిట్ చేసిన మొదటి అధ్యాయాలలోనే ఉన్నాయి. ఆయా పుస్తకాల, రచయితల పేర్లను ఆయా భాగాల్లో పేర్కొనటం జరిగింది.

ఈ పుస్తకంలోని వివిధ అధ్యాయాలకు సంబంధించి రచయిత ఒక పథకాన్ని రూపొందించుకున్నారు (పేజీ- xxxviii చూడండి). అయితే పని ముందుకు సాగుతున్న క్రమంలో అధ్యాయాల పేర్లలో, వాటి నంబరింగులో మార్పులు అవసరమైనాయి (పేజీలు-XL,XLii చూడండి). ఆయన తన నోట్సులో ఆయా మార్పులను సూచించారు. 7 నుంచి 12 వరకూ అధ్యాయాల హెడ్డింగు లను కా॥ డి వి వ్రాసుకున్న ఈ నోట్సునుంచి (పేజీలు-XL, XLii చూడండి) మేము ఎంపికచేసి తీసుకున్నాము. కా॥ డి వి వ్రాసుకున్న నోట్సులపైన, అక్కడ చర్చించిన విషయంపైన ఆధారపడి, ఆయా శీర్షికలను, ఉపశీర్షికలను సమకూర్చాము. ఆరవ అధ్యాయానికి 'ఫాసిస్టు వ్యతిరేక యుద్ధం - వర్గపోరాటాల ప్రారంభం. ధర్మవరం - హైదరాబాదు (మహాసభల) మధ్యకాలం' అని పేరు

పెట్టాలని రచయిత తన నోట్సులో సూచించారు (పేజీ-XLiiచూడండి). కానీ ఆయన ఎడిట్ చేసిన వ్రాతప్రతిలో ఆ అధ్యాయాన్ని 'ఫాసిస్టు వ్యతిరేక యుద్ధం-జాతీయ, అంతర్జాతీయ పరిస్థితులలో మార్పులు' అనే పేరుతోనే ఉంచేశారు. అందువల్ల, ఈ శీర్షికను మేము మార్చకుండా అలా ఉంచేశాము. కానీ నిజానికి ఆయన నోట్సులో సూచించిన పేరే ఆ అధ్యాయంలోని విషయాన్ని మరింత బాగా సూచిస్తుంది. 'నిర్బంధం-నిస్తబ్దత' అని రచయిత విడిగా ఒక అధ్యాయాన్ని సూచించారు (పేజీ-XL) కానీ ఆ విషయంపై చెప్పినది కొద్దిగానే ఉన్నందున మేము దానిని 8 వ అధ్యాయంలో భాగంగా చేర్చాము. అదే కారణంగా సిద్ధాంత సమస్యలపై ఉన్న భాగాన్ని 11వ అధ్యాయంలో చేర్చాము. 'నైజాం వ్యతిరేక పోరాట విజయాలు, బలహీనతల'ను-రచయిత అలా సూచించనప్పటికీ -మేము ఒక విడి అధ్యాయంగా రూపొందించాము. ఈ శీర్షిక క్రింద ఆయన విషయాన్ని సవివరంగా, కూలంకషంగా చర్చించినందున మేమీ పనిచేశాము. మొత్తం పోరాటకాలంలో జైళ్లలో నిర్బంధాలు, అక్కడ నిర్బంధించబడినవారు సాగించిన పోరాటాల గురించి రచయిత తర్వాతి కేసెట్లలో వివరించారు. దీనిని రెండవభాగములో చూడవచ్చును.

ఈ పుస్తకం చివర ప్రచురించిన వివరణలలో 1 నుంచి 30 వరకు ఉన్న వాటిని రచయితే వ్రాశారు. మిగతా వాటిని మేము చేర్చాము.

ఎడిటింగ్ బాధ్యతను నిర్వహించే సందర్భంగా-రచయితచెప్పిన విషయాన్ని ఏ మాత్రం మార్చకుండా ఉండేలా మేము పూర్తి జాగ్రత్తలు తీసుకున్నాము. ఏదైనా కొన్ని వాక్యాల్లోని భావం అస్పష్టంగా ఉన్నట్టయితే, అదే విషయాన్ని రచయిత చర్చించిన (చాలాసార్లు రచయిత అలాచేశారు) ఇతర భాగాలను చూసి, ఆయన స్వయంగా చెప్పిన మాటలను, వాక్యాలను ఆధారం చేసుకొని, అవసరమైన మార్పులను చేశాము. లేదా యథాతథంగా ఉంచేశాము.

పుస్తకంలో చేర్చవలసిన ఫోటోలకు సంబంధించి రచయిత స్థూలంగా ఒక పథకాన్ని రూపొందించుకున్నారు. కొన్ని ఫోటోలు ఆయన ఉండగానే సేకరించబడినాయి. మిగతావాటిని ఆయన రూపొందించుకున్న పథకాన్ని అనుసరించి సేకరించాము. అయితే, పోరాటం జరిగి నేటికి నాలుగు దశాబ్దాలయింది; ఆ మేరకు ఈ ఫోటోలకు పరిమితులున్నాయి. అయినా మాకు సాధ్యమైన మేరకు, ఈ భాగానికి సంబంధించి నంతవరకు ఫోటోలను సేకరించాము. పోరాటంలో అమరులైన వారి ఫోటోలు కొన్ని మాత్రమే మాకు అందుబాటులో ఉన్నాయి. వాటినే ప్రచురించాము.

ఈ గ్రంథాన్ని 600 పేజీలలో పూర్తిచేయాలని రచయిత మొదట

అనుకున్నారు. కానీ పని ముందుకు సాగినక్రమంలో, 600 పేజీలలో పూర్తి చేయటం వీలుకాదని స్పష్టమైంది. 100 పేజీలలో వస్తుందనుకున్న భాగం 200 పేజీలయిందని చెప్పవచ్చును. అందువల్ల మొదట అనుకున్నట్టు ఒకభాగంగా కాక, రెండు భాగాలుగా ఈ పుస్తకాన్ని ప్రచురించటం అవసరమైంది. రచయిత మరణంతో మాకు మరోమార్గం లేకుండాపోయింది.

తెలంగాణా పోరాటం 1940-41లో ప్రారంభమైనప్పటి నుంచీ రచయిత ఆ పోరాటం యొక్క ముఖ్య నిర్మాతగా ఉండినారన్నది తెలిసినవిషయమే. అందువల్ల, ఈ పోరాట చరిత్ర గురించిన కథనమేదైనా పోరాటంయొక్క పెరుగుదలలో, అభివృద్ధిలో ఆయన పాత్రతో విడదీయరాని విధంగా ముడిపడి ఉంటుంది. ఈ చరిత్రను డిక్టేటు చేసే సందర్భంగా రచయిత ఈ సమస్యను ఎదుర్కొన్నారు. ఉద్యమంలో తనపాత్రను వేరుచేయాలని, సాధ్యమైతే దానిని తన జ్ఞాపకాలలో చర్చించాలని ఆయన నిర్ణయించుకున్నారు. అయితే జ్ఞాపకాల రచనను చేపట్టలేకపోయారు. తన వ్యక్తిగత ప్రస్తావనలేకుండా ఆయన చరిత్రను మనముందుంచారు. అయితే పోరాటం యొక్క కీలకసమయాల్లో తన పేరుని, తన పాత్రను తప్పనిసరై ప్రస్తావించవలసి వచ్చింది. అందువల్ల కేసెట్లలో అటువంటి ప్రస్తావనలున్నాయి; అయితే అత్యంతముఖ్యమైన తరుణాల్లో మాత్రమే ఉన్నాయి. అటువంటి ప్రస్తావన లన్నింటినీ పుస్తకంలో అట్టిపెట్టాము.

ఈ పుస్తకాన్ని చాలాముందే వెలువరించాలని ఆశించాము. కానీ మేమున్న స్థితిలో అది మాకు సాధ్యపడలేదు. ఇప్పుడు మాత్రమే మాపనిని పూర్తి చేయగలిగాము. విప్లవ నిర్మాణం, ప్రజా ఉద్యమాలకు సంబంధించిన వివిధ రంగాల్లోని మాపనితో పాటు ఈ పనిని మేము చేపట్టవలసిరావటం దీనికొక కారణం. కామ్రేడ్ డి వి మరణంతో మాపని మరింత జటిలంగా తయారైంది. మరొక కారణం ఏమంటే - ఎడిట్ చేసేముందు (ఎడిట్ చేసే) విషయం గురించి కూలంకషంగా అవగాహన చేసుకోవలసి వచ్చింది. అలా కాని పక్షంలో ఈపని లోపభూయిష్టంగా తయారవుతుంది. అందువల్ల ఈ పుస్తకం ఎడిటింగు పని స్వభావం రీత్యా కేవలం అదేపనిమీద కూర్చున్నా, దానికి చాలా సమయం వెచ్చించవలసి వచ్చింది. వరుసగా అంతరాయాలు వచ్చి, మా పనిని మరింత క్లిష్టం చేశాయి. పైగా రచయిత అభిప్రాయాలు ఉన్నదున్నట్లుగా - ఎలాంటి మార్పులూ, సవరణలూ లేకుండా - పాఠకులకు చేరే విధంగా ఎంతో జాగ్రత్తగా ఎడిటింగు పనిని చేయవలసి వచ్చింది.

ఇక ఇప్పుడు రచయిత జీవితంగురించి, కృషి గురించి క్లుప్తంగా చెప్తాము.

కా|| మేడ్ డి వి స్వగ్రామం నల్లగొండ జిల్లా సూర్యాపేట తాలూకాకు చెందిన బండమీది చందుపట్ల. అయితే ఆయన (1917 జూన్ 1 నాడు) పుట్టింది మాత్రం వరంగల్ జిల్లా మానుకోట తాలూకాలోని ఇనుగుర్తి గ్రామంలో, ఆయనొక భూస్వాముల (దేశముఖుల) కుటుంబంలో జన్మించారు. వారి తండ్రి దేవులపల్లి వరదరావుగారు, తల్లి దేవులపల్లి గోపమ్మగారు. ఆయన అక్షరాభ్యాసం ఇనుగుర్తిలోనే జరిగింది. ప్రాథమిక విద్య చందుపట్ల దగ్గరఉన్న తిరుమలగిరి, నామపరం గ్రామాల్లో, మాధ్యమిక విద్య సూర్యాపేటలో సాగింది. హైస్కూలు చదువు ఖమ్మంలో సాగింది. ఈకాలంలో ఆయన ఖమ్మంలో జరిగిన మూడవ ఆంధ్రమహాసభకు హాజరైనారు. వరంగల్‌లో ఇంటర్మీడియెట్ చదివారు. తర్వాత బి. ఏ. పట్టాకోసం ఉస్మానియా విశ్వవిద్యాలయంలో చేరారు. అక్కడ విశ్వవిద్యాలయ విద్యార్థులు సాగించిన, ప్రఖ్యాతిగాంచిన 'వందేమాతరం సమ్మె' లో పాల్గొన్నారు. దాని ఫలితంగా ఇతరులు చాలా మందితోపాటు ఆయనను విశ్వవిద్యాలయం నుంచి బహిష్కరించారు. ఆ విద్యార్థులను తిరిగి చేర్చుకోటానికి విశ్వవిద్యాలయాధికారులు వారిని క్షమాపణ పత్రం వ్రాసివ్వాలని డిమాండు చేశారు. చాలామందితో పాటు ఆయనా దానికి నిరాకరించారు. తమను మళ్ళీ ఏ విశ్వవిద్యాలయం వారు చేర్చుకుంటారా అని అక్కడ తిరిగీ, ఇక్కడ తిరిగీ, చివరకు ఇతరులతోపాటు కా|| డి వి జబల్పూరు ఆర్ట్సు కళాశాలలో చేరి, తన డిగ్రీ చదువుని పూర్తిచేశారు. ఈ కాలంలోనే ఆయనకు జాతీయోద్యమం గురించి తెలుసుకునే అవకాశం, కొద్దిసేపే అయినా జాతీయోద్యమ ప్రముఖ నాయకులు కొందరిని కలిసే అవకాశం కలిగినాయి. అలాగే అప్పుడే సోషలిస్టు, కమ్యూనిస్టు సాహిత్యాలతో కూడా పరిచయమేర్పడింది. పట్టభద్రులైన తర్వాత ఆయన తన స్వగ్రామానికి తిరిగి వచ్చారు (1938).

కా|| డివి తన డిగ్రీ చదువు పూర్తి చేయటానికి కొద్ది ముందు శ్రీమతి శ్రీరంగమ్మగారిని వివాహమాడారు. కమ్యూనిస్టు విప్లవకారుడిగా ఆటుపోట్లతో కూడిన ఆయన జీవితంలోని కష్టనష్టాలన్నింటా ఆమె ఆయన వెంట నిలిచారు.

1939లో ఆయనను ఆనాటి భారత కమ్యూనిస్టు పార్టీ కంటాక్టు చేసింది.

ఇతర విషయాలతో పాటు హైదరాబాదు సంస్థానంలో కమ్యూనిస్టు పార్టీలో చేరి, పార్టీ కార్యకలాపాలలో పాల్గొనటం వల్ల వచ్చే పర్యవసానాలేమిటో ఆయనకు పార్టీవారు వివరించారు. అందులో భాగంగా ప్రాణ త్యాగానికి కూడా సిద్ధపడవలసి ఉంటుందని స్పష్టం చేశారు. ఆనాటి చట్టాల ప్రకారం కమ్యూనిస్టు పార్టీపై నిషేధం ఉండేది. పార్టీలో చేరటం వల్ల వచ్చే సమస్య లన్నింటినీ ఆలోచించుకొని దాని పర్యవసానాలన్నింటినీ పూర్తిగా గ్రహించుకొని, ఆయన పార్టీలో పూర్తి సమయమిచ్చి పనిచేసే కార్యకర్తగా చేరటానికి అంగీకరించారు. ఆనాటి నుంచీ తన జీవితంలోని చిట్టచివరి క్షణం వరకూ, ఆయన మనో వాక్కాయ కర్మలా కమ్యూనిస్టు దృఢ విశ్వాసాలకు కట్టుబడి వాటిని విడువకుండా నిలిచారు.

ఆ విధంగా కా॥ డివి రాజకీయ జీవితం కమ్యూనిస్టు పార్టీలో చేరటంతో ప్రారంభమైంది. తెలంగాణాలోనూ, మొత్తం దేశంలోనూ ఆనాడుండిన వివిధ ఉద్యమాల ప్రభావం ఆయనపై ఎంతోకొంత పడింది. అయితే ఆయన వాటిపై దృఢ విశ్వాసం ఏర్పరచుకొనేంతగా ఆయనను అవి ఆకట్టుకోలేకపోయాయి. అలాగే జాతీయోద్యమంతో, ఆ ఉద్యమ నాయకులతో ఆయనకుండిన కొద్దిపాటి సంపర్కం ఆ ఉద్యమం యొక్క తీవ్ర బలహీనతలను వెల్లడించడానికే ఉపయోగపడింది. మార్క్సిజం–లెనినిజం భావజాలమూ, పార్టీయొక్క విప్లవ కార్యక్రమమూ మాత్రమే ఆయనను ఆకట్టుకున్నాయి.

ఈ విధంగా కమ్యూనిస్టు విప్లవకారుడిగా అయన సాగించిన జీవితంలో, కృషిలో మొదటి దశాబ్దం ప్రారంభమయింది. 1946–51 కాలంలో సాయుధ పోరాటరూపం దాల్చిన తెలంగాణా ప్రజలపోరాటం (1941–'51) ప్రారంభమై అభివృద్ధి చెందిన ఈ కాలంలో ఆయన అపారమైన అనుభవం సంపాదించారు. ఆయన నల్లగొండజిల్లాలో పార్టీని ఆర్గనైజు చేశారు. ప్రజలనుంచి నేర్చుకుంటూ, వర్గ పోరాటాల నభివృద్ధి చేసే మార్గం చేపట్టారు. ప్రజలనుంచి నేర్చుకుంటూ, తగిన ఎత్తుగడలను అనుసరించే మార్క్సిస్టు–లెనినిస్టు పద్ధతిని ఆయన అనుసరించారు. దానివల్ల – పార్టీ అనుసరించిన వర్గసంకర రాజకీయాల ఊబిలో పడకుండా జిల్లాపార్టీ తప్పించుకోగలిగింది. ఈ పద్ధతిని ఆధారం చేసుకొని ఆయన– ఆనాటి పార్టీ కేంద్రకమిటీ మితవాద, అతివాద అవకాశవాదాలను ఆచరించి నప్పటికీ – తెలంగాణా సాయుధపోరాటాన్ని సక్రమమార్గంలో నడిపించగలిగారు. తెలంగాణాలో పార్టీ ఏర్పాటునుంచి మొదలుకొని వర్గపోరాటాన్ని ప్రారంభించి

అభివృద్ధిచేయటం, పోరాటం సాయుధ పోరాటరూపం తీసుకోవటం, సాయుధ పోరాటాన్ని యూనియన్ సైన్యాలకు వ్యతిరేకంగా కొనసాగించటం, సాయుధ పోరాటాన్ని విరమించాలనే డిమాండును వ్యతిరేకించటం—ఇలా తెలంగాణా పోరాట అభివృద్ధి క్రమంలోని అన్నిదశలలోనూ కూడా కా॥ డివి కీలకమైన పాత్రను నిర్వహించారు. అఖిలభారత నాయకత్వమూ, రాష్ట్రకమిటీ నాయకత్వమూ కూడా సాయుధపోరాటాన్ని విరమించాలనే నిర్ణయాన్ని ఆయనకు తెలియకుండానే తీసుకొని, అమలుచేశారన్న (*fait accompli*) విషయం ఇప్పటికి బాగా తెల్సిన విషయమే. భూపంపక కార్యక్రమాన్ని, వలంటీరు దళాల నిర్మాణాన్ని మొదట సూచించినది ఆయనేనన్న వాస్తవానికి ప్రత్యేక ప్రాముఖ్యత ఉన్నది. గ్రామీణ పేదల్లో భూమికావాలన్న తహతహ ఉందన్న విషయాన్ని 1944లోనే గ్రహించి, 1946 పోరాటకాలంలో భూమిపంపక కార్యక్రమానికి నాంది పలికిన ఆద్యుడు ఆయనే. నల్లగొండ జిల్లాలోని దేవరుప్పల గ్రామరైతాంగంనుంచి మొట్టమొదటి వలంటీరు దళాన్ని ఆయనే నిర్మించారు. ఈ క్రమం అనతికాలంలోనే విస్తరించి, ఉద్యమంగా రూపొందింది. ఈ పరిణామం తర్వాతే గ్రామ సంఘాలకు 'గుతుపల సంఘం' అన్న పేరు వచ్చింది. తెలంగాణా సాయుధపోరాటాన్ని విరమించాలన్న డిమాండుని వ్యతిరేకిస్తూ 1949లో వ్రాసిన డాక్యుమెంటులో ఆయన తెలంగాణా పోరాట అనుభవాలు భారత దేశవిప్లవానికి ఒక కొత్త మార్గాన్ని చూపెట్టాయని వివరించారు. ఆ విధంగా, మార్క్సిజం—లెనినిజం-మావో ఆలోచనా విధానాన్ని భారతదేశ విప్లవ వాస్తవ పరిస్థితులకు సరిగ్గా అన్వయించటానికి తెలంగాణాపోరాటం ప్రాతినిధ్యం వహించింది. తెలంగాణా పోరాటానికి ఆయన సమకూర్చినది (contribution) మామూలుగా గుర్తించిన దానికన్నా చాలా ఎక్కువని ఈ సందర్భంగా చెప్పాల్సి ఉంటుంది. తెలంగాణా సాయుధ పోరాటాన్ని అభివృద్ధిచేసి, నడిపించటంలో ఆయన నిర్వహించిన బహుముఖ పాత్రలో చాలాభాగం వెలుగులోకి రాలేదు. ఆయన వ్రాసిన కొన్ని రచనలతో పాటు ప్రస్తుత రచన కా॥ డివి కీలక సమయాల్లో నిర్వహించిన పాత్రను కొంత వెల్లడిచేస్తుంది. కానీ రచయిత (ఇందులో) ఖచ్చితంగా చరిత్ర రచనకే పరిమితమయ్యారు. తన పాత్రను గురించీ, ఇతరుల పాత్రగురించీ ఆయన తన జ్ఞాపకాలలో వ్రాయాలనుకున్నారు. కానీ ఆ పని చేయలేకపోయారు. తెలంగాణా పోరాటానికి కా॥ డివి సమకూర్చినది (contribution) సిద్ధాంత, రాజకీయ,

నిర్మాణ, మిలటరీ రంగాలన్నిటా ఉన్నదని చెప్పటం వరకే మేమిక్కడ పరిమిత మవుతున్నాము.

1951 నుంచి 1968 వరకు ఉన్న కాలంలో పార్లమెంటరీ పంథా ప్రాబల్యం వహించింది; విప్లవ పంథాకు తిలోదకాలివ్వటానికి మరోపేరు ఈ పంథా. ఈ కాలంలో ఆయన ఎన్నడూ పార్లమెంటరీ పంథాతో సమాధాన పడలేదు. రివిజనిస్టులకూ, నయారివిజనిస్టులకూ వ్యతిరేకంగా పోరాడి, ఆయన మళ్ళీ 1968-69 కాలంలో 'పోరాట ఉద్యమానికి పునాదులు వేయండి' అన్న సర్క్యులర్ ద్వారా, కమ్యూనిస్టు విప్లవ కారుల 'తక్షణ కార్యక్రమం'గా ప్రసిద్ధి పొందిన రచన ద్వారా విప్లవ పంథాను తిరిగి ముందుకు తెచ్చారు. కమ్యూనిస్టు విప్లవ కారుల పార్టీని నిర్మించాలంటే, దానికి రివిజనిజానికీ, నయారివిజనిజానికీ వ్యతిరేకంగానే కాక, విప్లవకారులలో ఉన్న అతివాద, మితవాద అవకాశ వాదాలకు వ్యతిరేకంగా కూడా నిర్విరామంగా పోరాటం సాగించటం అవసరమని గుర్తించటానికి ఆయనకెంతో కాలం పట్టలేదు. ఈ సుదీర్ఘ పోరాటక్రమంలో కా॥ డివి మార్క్సిజం-లెనినిజం-మావో ఆలోచనావిధానాన్ని భారతదేశ పరిస్థితులకు సరిగ్గా అన్వయించటం ద్వారా విప్లవ సిద్ధాంతాన్ని సుసంపన్నం చేశారు. ఆయన ఎంతో పట్టుదలతో సాగించిన కృషి ఫలితంగా, ఆయన స్థాపించి, అభివృద్ధి చేసిన భారత విప్లవ పంథా నిలదొక్కుకున్నది. కామ్రేడ్ తరిమెల నాగిరెడ్డితో కలిసి ఆయన కమ్యూనిస్టు విప్లవకారులను సమైక్య పరచే కృషిని సాగించటానికోసం ఏప్రెల్ 1975లో భారత కమ్యూనిస్టు విప్లవకారుల సమైక్యతా కేంద్రం (మార్క్సిస్టు-లెనినిస్టు)ని [యుసిసిఆర్ఐ (యం.యల్.)] స్థాపించారు. అవకాశవాద, విచ్ఛిన్నకర శక్తులకూ, పదవీకాంక్షతో కూడిన శక్తులకూ వ్యతిరేకంగా సిద్ధాంతపోరాటాన్ని, దానితోపాటు నిజమైన కమ్యూనిస్టు విప్లవ కారులందరినీ ఐక్యంచేసే కృషిని ఆయన - 1976 జూలైలో కా॥ నాగిరెడ్డి మరణించిన తర్వాత కూడా - కొనసాగించారు.

ఈ పోరాట క్రమంలో ఆయన తెలంగాణా అనుభవాలను విశదీకరించటంతో పాటు శ్రీకాకుళం, నక్సల్‌బరీ పోరాటాల అనుభవాలను క్రోడీకరించారు. కమ్యూనిస్టు విప్లవకారుల సంస్థను, కొత్తతరహా విప్లవ ప్రజా ఉద్యమాన్ని నిర్మించే కర్తవ్యానికి ఆయన ఎంతో ప్రాధాన్యతనిచ్చారు. ఈ దిశలో తన కృషిని ఈ పుస్తక రచన సాగిస్తున్న కాలంలో సైతం ఆయన ఏమాత్రం సడలించలేదన్న వాస్తవంచాలు, దాన్ని గ్రహించటానికి.

కామ్రేడ్ డి వి పార్టీలోని వివిధ నాయకత్వ స్థానాల్లో ఉంటూవచ్చారు. మొదట ఆయన నల్లగొండజిల్లా కమిటీ కార్యదర్శిగా ఉండేవారు. ఐక్య కమ్యూనిస్టు పార్టీలో ఆ తర్వాత కూడా ఆయన ఈ స్థానంలో కొనసాగారు. రాష్ట్రకమిటీలో ఆయన ఈ జిల్లాకు ప్రాతినిధ్యం వహించారు. 1948 మార్చిలో ఆయనను రాష్ట్రకమిటీ కార్యదర్శివర్గంలోకి తీసుకున్నారు. కార్యదర్శి వర్గంలో ఉంటూ ఆయన తెలంగాణా సాయుధపోరాట బాధ్యతలను చూసేవారు. ఈ బాధ్యతల నిర్వహణలో భాగంగానే పోరాటాన్ని విరమించాలనే వాదనలను విమర్శిస్తూ ఆయన 1949లో డాక్యుమెంటును వ్రాశారు. ఆంధ్ర థీసిసు ప్రాతినిధ్యం వహించిన పంథా ప్రాతిపదికపై ఆయనను బి.టి. రణదీవె రాజీనామా తర్వాత ఏర్పడిన కేంద్ర కమిటీలోకి తీసుకున్నారు. తర్వాత ఆయన 1968 జూన్‌లో సిపియం నుంచి బయటికి వచ్చిందాకా కూడా పార్టీ జాతీయసమితి (నేషనల్ కౌన్సిల్) లోగానీ, కేంద్ర కమిటీలోగానీ సభ్యుడిగా కొనసాగారు. నల్లగొండ ద్విసభ్య పార్లమెంటు నియోజకవర్గంలో పెద్ద మెజారిటీతో గెల్చి, ఆయన 1957-62 కాలంలో లోక్‌సభ సభ్యుడిగా ఉన్నారు. 1969లో జరిగిన ఆంధ్ర కమ్యూనిస్టు విప్లవకారుల రాష్ట్ర సదస్సులో ఆయన ఆంధ్రప్రదేశ్ విప్లవ కమ్యూనిస్టు కమిటీ కార్యదర్శిగా ఎన్నుకోబడినారు. 1975 ఏప్రెల్‌లో కామ్రేడ్ తరిమెల నాగిరెడ్డితో కలిసి యుసిసిఆర్‌ఐ (యం.యల్.)ను స్థాపించినదాకా ఆయన ఈ బాధ్యతలో కొనసాగారు. ఆ సందర్భంగా జరిగిన ఐక్యతా సదస్సులో ఆయన యుసిసిఆర్‌ఐ (యం.యల్.) కేంద్ర కమిటీ ప్రధాన కార్యదర్శిగా ఎన్నికైనారు. ఆయన చనిపోయిననాటివరకూ ఆ బాధ్యతలో కొనసాగారు.

కమ్యూనిస్టు విప్లవకారుడిగా ఆయన దాదాపు ఐదు దశాబ్దాలపాటు కృషి చేశారు. ఆయనపై మోపిన మొట్టమొదటి కేసు - ముంద్రాయిలో లంబాడీ రైతాంగం సాగించిన భూపోరాటంలో ఆయన నిర్వహించిన పాత్ర సందర్భంగా వచ్చిందన్నది గమనార్హం. ఆనాటి నిజాం ప్రభుత్వం ఈ కేసుని మోపింది. నిజానికి - మనదేశంలో వ్యవసాయ విప్లవ సిద్ధాంత, ఆచరణలకు పితామహుడిగా రూపొందిన విప్లవకారుడైన ఆయనకు నిజాం నిరంకుశ ప్రభుత్వం అర్పించిన తొలి నివాళి ఇది. ఆయన సాగించిన విప్లవకృషిలో గణనీయభాగం వివిధ నిరంకుశ ప్రభుత్వాలకు వ్యతిరేకంగా రహస్య కార్యకలాపాలతో నిండి

ఉన్నది. తెలంగాణా పోరాటకాలంలో ఆయన సుమారు ఏడేళ్ళపాటు (1946-52) రహస్య జీవితం సాగించారు. 1968 తర్వాత ఆయన సుమారు పదేళ్ళపాటు (1969; 1975-84) రహస్య జీవితం గడిపారు. చైనాపై భారత ప్రభుత్వం సాగించిన దురాక్రమణ యుద్ధాన్ని వ్యతిరేకించినందుకు ఆయనను 1962లో (1962 నవంబరు నుంచి 1963 జులైదాకా) భారత రక్షణ నిబంధనల (డిఐఆర్) క్రింద అరెస్టు చేశారు. అలాగే 1965లో పాకిస్తాన్‌పై యుద్ధం సందర్భంగా (1964 డిసెంబరు నుంచి 1966 మే దాకా) అరెస్టు చేశారు. 1969లో కా॥ నాగిరెడ్డి తదితరులతో పాటు ఆయనను అరెస్టు చేసి, వారందరిపై 'హైదరాబాదు కుట్రకేసు'ని బనాయించారు. కా॥డి వి రచించిన 'తక్షణ కార్యక్రమం' ప్రాతిపదికపై ఈ కేసుని మోపారు. వారిని 1969 డిసెంబర్ నుంచి 1972 మే దాకా నిర్బంధించి ఉంచారు. ఆ తర్వాత కామ్రేడ్ టియన్ తదితరులతోపాటు ఆయనను 1972 మేలో కఠినమైన షరతులతో కూడిన బెయిలుపై విడుదల చేశారు. 1975 జూన్‌లో శ్రీమతి ఇందిరాగాంధీ ప్రభుత్వం దేశంలో అంతరంగిక అత్యవసర పరిస్థితిని విధించినప్పుడు, వారు ఆ బెయిలును ఉల్లంఘించి తిరిగి రహస్య కార్యకలాపాలు ప్రారంభించారు. 'హైదరాబాదు కుట్ర కేసు'లో ఆయనకు, కామ్రేడ్ టియన్ తదితరులకు నాలుగేళ్ళ కఠిన జైలు శిక్ష విధించారు. అయితే కా॥ డివి ఈ కాలమంతటా రహస్య జీవితం సాగించటం వల్ల, ప్రభుత్వం ఆ శిక్షను అమలు చేయలేకపోయింది. ఈ విధంగా కా॥ డివి కమ్యూనిస్టు విప్లవకారుడిగా సాగించిన జీవితం-కృషిలో సుమారు 17 సంవత్సరాలపాటు రహస్య జీవితాన్ని, సుమారు ఐదేళ్ళపాటు వివిధ జైళ్ళలోను గడిపారు. ఈ వాస్తవాలు ఆయన కనబరిచిన మొక్కవోని విప్లవ దీక్షకు, ప్రగాఢమైన ఆయన విప్లవ విశ్వాసాలకు, ఆచరణకు ప్రత్యక్ష సాక్ష్యాలు.

కామ్రేడ్ డివి ప్రతిభావంతుడైన, విస్తారంగా రచనలు చేసిన రచయిత అన్నది బాగా తెల్సిందే. ఆయన రచనలన్నీ విప్లవోద్యమ సమస్యలతో అవిభాజ్యంగా ముడిపడినటువంటివే. నిజానికవి విప్లవోద్యమంలో ఎదురైన తీవ్ర సమస్యల సందర్భంగా అవసరమై రచింపబడినవే. ఆయన వ్రాయగలిగిన విషయాలు మరెన్నో ఉండినవి. వాటి రచనకు కావలసిన అనుభవం, అధ్యయనం, అవగాహన ఆయనకుండినవి. వాటిలో కొన్నింటిని మాత్రమే కా॥ డివి

పూర్తిచేయగలిగారు. 1968కి ముందుకాలంలో ఆయన కొన్ని వ్యాసాలను, కరపత్రాలను, డాక్యుమెంట్లను వ్రాశారు; అవి అప్పట్లో ప్రచురింపబడినాయి. ఏవో కొద్ది రచనలు తప్ప, వాటిలో చాలాభాగం ఇటీవలి కాలంలో వెలుగులోకి రాలేదు. తెలంగాణాలో నెహ్రూ సైన్యాలకు వ్యతిరేకంగా సాగిన సాయుధపోరాటానికి మార్గదర్శకత్వం అందించిన కొన్ని మిలటరీ రచనలు కూడా వాటిలో ఉన్నాయి. ఈ డాక్యుమెంట్లు సంఖ్యలో కొద్దివే అయినా, ఆయనకున్న అనుభవం, అధ్యయనం ఫలితంగా, మార్క్సిజం-లెనినిజం-మావో ఆలోచనా విధానాన్ని, చైనా విప్లవ అనుభవాలను భారతదేశ పరిస్థితులకు అన్వయించిన ఫలితంగా రూపొందినవవి. 1968 తర్వాత కాలంలోనివి భారత విప్లవ పంథాను వివరించి, విశదీకరించిన రచనలు.

ఆయాకాలాల్లో కమ్యూనిస్టు విప్లవకారులు నిర్వహించిన వివిధ పత్రికల కోసం ఆయన క్రమం తప్పకుండా రచనలు చేసేవారు. ప్రత్యేకించి తన జీవితపు చివరిభాగంలో ఆయన కమ్యూనిస్టు విప్లవకారుల అధికార పత్రికలుగా 'ప్రొలిటేరియన్ లైన్' (ఇంగ్లీషు), 'సంకేతం'లను స్థాపించటంలో నిర్ణయాత్మక పాత్రను నిర్వహించారు. వాటిద్వారా ఆయన విప్లవ కమ్యూనిస్టు జర్నలిజం ఎలా ఉండాలో చేసి చూపెట్టారు. వివిధ జాతీయ, అంతర్జాతీయ పరిణామాలను ఆయన కమ్యూనిస్టు విప్లవకారుల దృక్పథంనుంచి విశ్లేషించారు. త్వరత్వరగా మారిపోతున్న రాజకీయపరిస్థితికి తగిన విధంగా ఆయన సకాలంలో నినాదాలను అందించారు. రాష్ట్రంలోని రాజకీయ పరిణామాలను ఆయన శ్రద్ధతో పరిశీలించారు. పాలకవర్గాలు అనుసరించిన వివిధ మోసపూరిత విధానాలను, పథకాలను పూర్తిగా బట్టబయలు చేసే రీతిలో నిశితమైన, ఘాటైన విమర్శలు ఆయన రచనలలో ఉండేవి. వివిధ రూపాల్లో ఉన్న మితవాద, అతివాద అవకాశవాదాలపై సిద్ధాంత, రాజకీయపరమైన విమర్శలు, వాటిని ఎండగట్టటం ఆయన రచనలలో ఒక భాగంగా ఎప్పుడూ ఉండేవి. శుష్క వాగాడంబరానికి, పదాలగారడీకి ఆయన రచనల్లో స్థానం ఉండేదికాదు. అదే సమయంలో ఆయన తన రచనలలో అనితరమైన శక్తితో నిరాశావాదాన్ని పటాపంచలు చేసి విప్లవ ఉత్సాహాన్ని, విప్లవ విశ్వాసాలను రగిలించేవారు.

సాహిత్య, సాంస్కృతిక రంగాలు ఎదుర్కొంటున్న సమస్యలపట్ల ఆయనకు ఎంతో ఆసక్తి ఉండేది. ఈ సమస్యలపై ఆయన రచనల్లో ఇది కన్పిస్తుంది.

సాహిత్యం, సంస్కృతి, చరిత్ర, తత్వశాస్త్రాలకు సంబంధించిన వివిధ విషయాలపై వ్రాయాలని ఆయనకొక పథకం ఉండేది. అయితే సమయం చాలక పోవటం వలన వాటికి ఆయన కార్యరూపం ఇవ్వలేకపోయారు.

నిజమైన కమ్యూనిస్టు విప్లవకారుడికి ఉండాల్సిన ఉత్తమ లక్షణాలు ఆయనలో ఉండినవి. ఎన్ని అవరోధాలు ఎదురైనా చలించక, నిర్విరామంగా, నిస్వార్ధంగా విప్లవ కార్యకలాపాలు సాగించటం కమ్యూనిస్టు విప్లవకారుడిగా ఆయన సాగించిన జీవితమంతటా కన్పిస్తుంది. సత్యసంధత, చిత్తశుద్ధి, వ్యక్తిగత నిజాయితీ, నిస్వార్థబుద్ధి, త్యాగశీలత, నిరాడంబరమైన, అపార క్రమశిక్షణతో కూడిన జీవితం, మచ్చలేని శీలం – వీటన్నిటితో కూడిన అత్యున్నత విప్లవ నైతిక విలువలను ఆయన పాటించారు. తనకున్న విప్లవ విశ్వాసాల మూలంగా, ఆలోచనల్లో స్పష్టతవల్లా ఆయనకు అపారమైన విప్లవ ఆత్మవిశ్వాసం ఉండేది; అదే సమయంలో విప్లవ నమ్రత మూర్తీభవించిన వ్యక్తి ఆయన. ఒక నిజమైన కమ్యూనిస్టు విప్లవకారుడిగా ఆయనలో అహంకారానికి, ప్రగల్భాలకు, శుష్క వాగాడంబరానికి తావే ఉండేదికాదు. ఆయన యావత్ జీవితమూ, సమస్తకృషీ ఆయనకు ప్రజలంటే ఉన్న ప్రగాఢ విశ్వాసానికీ, ప్రజలనుంచి నేర్చుకునే తత్వానికీ, విప్లవ కమ్యూనిస్టు సూత్రాలను ఆచరించటంపట్ల ఆయనకుగల శ్రద్ధకీ ప్రత్యక్ష తార్కాణాలుగా ఉంటాయి. ఒక నిజమైన విప్లవకారుడిగా ఆయన తన మాటలకు, చేతలకుమధ్య అసాధారణమైన పొంతనను కనబరిచారు. ఒక్క మాటలో చెప్పాలంటే, ఆయన తన విప్లవ జీవితమంతటా మనోవాక్కాయకర్మలా నిజమైన కమ్యూనిస్టు విప్లవ కారుడిగా జీవించారు, కృషిచేశారు. కమ్యూనిస్టు విప్లవకారులు తమ గమ్యాన్ని చేరుకునే విధంగా ముందుకు సాగటానికి ఈ అమోఘమైన విప్లవ గుణగణాలను ఆదర్శంగా స్వీకరిస్తారు.

కా॥ డివి ఈ పుస్తకం ఎడిటింగు పనిని ప్రారంభించినా, పూర్తిచేయలేక పోవటం నిజంగా ఎంతో బాధాకరమైన విషయం. ఆయన 1984 జూలై 12 నాడు రాత్రి 8-30 ప్రాంతంలో చనిపోయారు. హఠాత్తుగా, క్షణాలలో ఆయన తుదిశ్వాస విడిచారు. ఆయన తన పనిని పూర్తిచేసుకొని, భోజనానికి వెళ్ళబోతుండగా హఠాత్తుగా గుండె ఆగిపోయి (heart failure) చనిపోయారు. ఆయన మరణంవల్ల భారతవిప్లవానికి తీవ్రమైన నష్టం వాటిల్లింది. ఆయన లేని లోటును

భర్తీ చేయటం సమీప భవిష్యత్తులో సాధ్యంకాని పని. అస్తమించిన నాయకుడు కా॥ డివికి ఈ సందర్భంగా శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము.

మనదేశంలో కమ్యూనిస్టు ఉద్యమానికున్న సుదీర్ఘ చరిత్రలో నాయకులకు కొదవలేదు. తరచుగా - నాయకులు ఉండటం ఒక ఎత్తు, దేశంలోని విప్లవోద్యమానికి సరైన నాయకత్వం అందించటం మరొక ఎత్తుగా ఉంటుంది. సరైన నాయకత్వం అందించగలగాలంటే, దానికి మార్క్సిజాన్ని దేశంలోని నిర్దిష్టపరిస్థితులకు సరిగ్గా అన్వయించటం అవసరమవుతుంది. సరిగ్గా ఇక్కడే మనదేశంలోని నాయకులలో అత్యధికభాగం ఘోరంగా విఫలమైనారు; రివిజనిజం, నయారివిజనిజం, ఇంకా మితవాద అతివాద అవకాశవాదాలకు సంబంధించిన వివిధ వ్యక్తీకరణల ఊబిలో వారు కూరుకొనిపోయారు. దీనికి విరుద్ధంగా కామ్రేడ్ డివి మార్క్సిజాన్ని భారత విప్లవాచరణకు తగిన రీతిలో సరిగ్గా అన్వయించి, భారత విప్లవానికి మౌలిక పంథాను రూపొందించారు. అంతేకాక, దేశంలో సాగిన వివిధ విప్లవ పోరాటాల - ప్రత్యేకించి తెలంగాణా పోరాటం యొక్క - అనుభవాలను ఆధారం చేసుకొని, ఆయనీ పంథాను విశదీకరించారు; మార్క్సిజానికి భారతీయ విశదీకరణ నిచ్చారు (Indian interpretation). ఆ విధంగా ఆయన మన దేశంలోని విశిష్టమైన మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంత వేత్తగా, కార్యశీలుడైన విప్లవ నాయకుడిగా సముచితమైన స్థానాన్ని సంపాదించుకున్నారు.

భారత విప్లవానికై ఆయన అభివృద్ధి చేసి విశదీకరించిన మౌలిక పంథా, మార్క్సిజం-లెనినిజం-మావో ఆలోచనా విధానాన్ని మనదేశంలోని వాస్తవ పరిస్థితులకు అన్వయించి ఆయన చేసిన భారతీయ విశదీకరణా (Indian interpretation) కమ్యూనిస్టు విప్లవకారుల చేతిలోగల శక్తివంతమైన, అజేయమైన ఆయుధాలు. వీటి ఆధారంగా కమ్యూనిస్టు విప్లవకారులు దేశంలో జనతా ప్రజాతంత్ర విప్లవ విజయాన్ని సాధించాలన్న తమ గమ్యాన్ని చేరుకోటానికి కృత నిశ్చయంతో ముందుకు సాగుతారు.

'తెలంగాణా ప్రజల సాయుధ పోరాట చరిత్ర (1946-51)' రచన ద్వారా కా॥ డి వి విప్లవానుభవాల అమూల్య సంపదను విప్లవకారులకు, మొత్తంగా ప్రజలకు అందజేశారు. తెలంగాణాలో సాయుధ పోరాటం 1946 నుండి 1951 వరకు సాగినా, 1940-41 నుండే ప్రజల నిర్మాణయుత

విప్లవోద్యమం ప్రారంభమయింది. రచయిత ఈ చరిత్ర రచనలో 1940-41 నుండి మొదలుకొని సాయుధ పోరాటం ప్రారంభమయ్యేవరకు సాగిన నిర్మాణ యుత కార్యకలాపాలను గురించి కూడా సవివరంగా వ్రాశారు. ఈ పుస్తకం తెలంగాణా సాయుధ పోరాటాన్నేకాక, భారత విప్లవాన్ని ఎదుర్కొంటున్న సమస్యలను అర్థం చేసుకోటానికి కూడా ఎంతగానో ఉపయోగపడుతుందనటంలో ఎలాంటి సందేహంలేదు.

ఈ పుస్తక ప్రచురణకు చాలామంది వివిధ రూపాలలో సహకరించారు. వారందరికీ మా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాము.

తేదీ : 16-6-1988

—సంపాదకులు

పుస్తక రచనకు కా॥ డివి రూపొందించుకున్న
పథకం - 1

## తెలంగాణా

25 I సామాజిక, రాజకీయ వ్యవస్థ

50 II 1940కి పూర్వం జరిగిన పోరాటాలు

50 III కమ్యూనిస్టు పార్టీ పుట్టుక, తొలిసంవత్సరాలు

50 IV యుద్ధానంతర పరిస్థితికి పూర్వం 1944-45

50 V యుద్ధానంతర వెల్లువ 1945-46

60 VI నిజాం వ్యతిరేక పోరాటం 1947-1948 సెప్టెంబరు

50 VII పోలీసు యాక్షను తర్వాత - వెనక్కి తగ్గి అడవుల్లోకి వెళ్ళుట
1948 సెప్టెంబరు - 1949 ప్రారంభం

50 VIII అడవులనుండి పోరాటం

50 IX ఇతర జిల్లాలకు విస్తరణ

50 X పోరాట విరమణ

50 XI సమస్యలు, వివాదాలు

10 XII ముగింపు

585 — అ) కోస్తా జిల్లాలకూ, రాయలసీమకూ సంబంధించి

600 ఆ) మరఠ్వాడా, కర్ణాటకలకు సంబంధించి

ఇ) అఖిల భారత పరిస్థితి

ఈ) అంతర్జాతీయ పరిస్థితి

(గమనిక : పక్కనవున్న సంఖ్యలు రచయిత వేసుకున్న పేజీల అంచనా)

## పుస్తక రచనకు కా॥ డివి రూపొందించుకున్న పథకం-2

పుస్తక రచనకు కా॥ డివి రూపొందించుకున్న
పథకం - 3

6. ఫాసిస్టు వ్యతిరేక యుద్ధం
వర్గ పోరాటాలు [illegible] పెరగడం ధర్మవరం - హైదరాబాదు గ్రామ
7. ఆంధ్రమహాసభల చరిత్ర - వీర పోరాటాలు / ఉద్యమకాలు
10 వ - 11 వ మహాసభ - Tangam.
8. యుద్ధానంతర ఉద్యమం - తెలంగాణ - కమిటీ - 1946
9. నిజాం వ్యతిరేక పోరాటం.

పుస్తక రచనకు కా॥ డివి రూపొందించుకున్న
పథకం - 3

6. ఫాసిస్టు వ్యతిరేక యుద్ధం -
వర్గపోరాటాల ప్రారంభం. ధర్మవరం - హైదరాబాదు
మధ్యకాలం

7. ఆంధ్రోద్యమంలో చీలిక - వర్గపోరాటాల ఉధృతం
10వ - 11వ మహాసభ - జనగాం

8. యుద్ధానంతర వెల్లువ - పాలకుర్తి - కడివెండి - 1946

9. నిజాం వ్యతిరేక పోరాటం

ఎడిటింగుకు కా॥ డివి రూపొందించుకున్న పథకం

Corrections (a) Language
(b) ఊతపదాలు
(c) grammer
(d) repetitions etc
(e) accuracy

2. additions (a) material from other books
(b) quotations
(c) Correct Translations
(d) foot notes
(e) Sources

3 Chapters etc. (a) numbering of the Chapters
(b) naming " "
(c) Main Headings.
(d) Sub headings:
(e) numbering wherever it is necessary

1. కరెక్షన్లు
   అ) భాష
   ఆ) ఊతపదాలు
   ఇ) వ్యాకరణం
   ఈ) పునశ్చరణలు మొ॥
   ఉ) విషయాలు ఖచ్చితంగా వున్నాయాలేవా అని సరిచూసుకొనటం (accuracy)

2. చేర్పులు
   అ) ఇతర పుస్తకాలనుంచి తీసుకున్న విషయాలు
   ఆ) కొటేషన్లు
   ఇ) సరైన అనువాదాలు
   ఈ) వివరణలు
   ఉ) మూలాధారాలు

3. అధ్యాయాలు వగైరా
   అ) అధ్యాయాలకు వరుస సంఖ్యలను ఇవ్వటం
   ఆ) అధ్యాయాలకు పేరుపెట్టటం
   ఇ) ప్రధాన శీర్షికలు
   ఈ) ఉపశీర్షికలు
   ఉ) అవసరమైన చోట్ల నంబర్లు వేయటం

# తెలంగాణ

క్రూర నైజ మును గోరికట్టగనాడు
నల్లగొండయోధులే వెలిగించిన జ్యోతి
నలుదిశల ప్రాకిందిరా ! తెలగాణ
సింహనాదము చేసెరా ! ||క్రూర||

పాతకాలపునాటి దోపిడీ దాస్యాన్ని
పారద్రోలాలనే పరమావధిని ఎంచి
ఏకమై నిలిచిందిరా ! తెలగాణ
శత్రుదండుల తరుమగా ||క్రూర||

చెమటోడ్చి పండించు రైతుకూలీలంత
పోరాడిగెలిచారు భూమిపై హక్కునూ
మార్గదర్శకమాయెరా ! తెలగాణ
భారతావనికంతకూ ||క్రూర||

ప్రజల రక్తం త్రాగి బలిసి క్రొవ్వెక్కిన
దోపిడీగుంపులు పట్నవాసము పట్ట
కళకళలాడిందిరా ! తెలగాణ
శత్రుశేషము లేకనూ ! ||క్రూర||

తరతరమ్ములనాటి బానిస విముక్తికై
తెలగాణ వనితలు వీరఘర్జనచేసి
కదనరంగముదూకిరీ ! తెలగాణ
వైరిమూకల తరుమగా ||క్రూర||

వెనుక కాలాలలో కనివినీ ఎరుగనీ
స్త్రీపురుషులందరూ ఓటుహక్కును పొంద
గ్రామప్రజరాజ్యాలనూ ! తెలగాణ
తొలినాడె చవిచూచెరా ||క్రూర||

నవజీవనమ్ముతో మందహాసముచేయు
తన గ్రామసీమలను రక్షించబూనగా
ఆయుధము చేపట్టెరా ! తెలగాణ
మేరువై నిలిచిందిరా ||క్రూర||

సైజాముపాలనను సాగనంపేవరకు
నిదురపోయేమాట ఇలలోన కల్లయనీ
రణభేరి మ్రోగించెరా ! తెలగాణ
విప్లవం నినదించెనూ ! ||క్రూర||

నాజిసైజాముతో నిచరాజీపడిన
కాంగ్రేసుధనికుల కపటనాటకమంత
తెలుసుకొని లేచిందిరా ! తెలగాణ
కాలహరణము చేయకా ! ||క్రూర||

ప్రజలరాజ్యాలనూ వమ్ముచేయుట కొరకు
కాంగ్రేసు సైన్యాలు దొరలకండగరాగ
కొండయై ఎదిరించెరా ! తెలగాణ
నెత్తురులె ఒలికించెరా !! ||క్రూర||

తెలగాణ వీరుల సమరనాదపు పిలుపు
అందుకొని ప్రజలంత భరతదేశములోన
సాగిరండని తెలిపెనూ- తెలగాణ
వేగుచుక్కై నిలిచెరా !! ||క్రూర||

తెలంగాణా ఆంధ్రదేశంలో ఒకభాగం. 1956లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడిందాకా తెలంగాణా జిల్లాలు హైదరాబాదు సంస్థానంలోనే ఉన్నాయి.

తెలంగాణాను నాలుగువైపులా తిరిగిచూస్తే భారతావనిలోని వివిధ ప్రాంతాల్లో ఉన్నట్టే పారే నదులు, కొండల వరుసలు, దట్టమైన అడవులు, సారవంతమైన మైదాన ప్రాంతాలు, సుందరమైన ప్రకృతి దృశ్యాలు కనిపిస్తాయి. ఏరోజూ అనక కష్టించి పని చేసే ప్రజలు, వారి సరసనే నివసిస్తూ భోగభాగ్యాలనుభవించే సంపన్నులు కనిపిస్తారు. శిథిలమైపోతున్న పాతకాలపు కోటలు, అపూర్వమైన శిల్ప సంపద కలిగిన దేవాలయాలున్నాయి. వేల ఎకరాలను మాగాణిగా మార్చిన పెద్దపెద్ద చెరువులున్నాయి. ప్రాచీన చరిత్రను చాటిచెప్పగల గ్రామాలు, పట్టణాలు ఎన్నో భూమిలో దాగి ఉన్నాయి. ఇతర ప్రాంతాల్లోకూడా ఇవన్నీ ఉంటే తెలంగాణాకుగల ప్రత్యేకత ఏమిటి ?

ఈ ప్రశ్నకు సమాధానం : 1946 నుండి 1951 వరకు సాగిన ప్రజల సాయుధపోరాటమే తెలంగాణాకు ప్రత్యేకతను సంతరించిపెట్టింది. దీని అర్థం ఆనాటికి ఇతర ప్రాంతాలలో ప్రజలు సాయుధులై పోరాడలేదని కాదు. కొద్దివైనా గొప్పవైనా అలాంటి పోరాటాలు సాగినవి. అల్లూరి సీతారామరాజు నడిపిన మన్యం తిరుగుబాటు (1922-24) గిరిజనుల సాయుధ పోరాటమే. బ్రిటిష్ సామ్రాజ్యవాదులతోనూ, దేశీయ ఫ్యూడల్ ప్రభువులతోనూ రైతాంగం, సైనికులు ఘర్షణపడిన ఘటనలెన్నో ఉన్నాయి. వాటిలో కొన్ని సాయుధ తిరుగుబాట్లుగా పరిణమించాయి. వీటన్నిటికీ చరిత్రలో ఉచితమైన స్థానం ఎప్పుడూ ఉంటుంది. వీటి స్థానాన్ని తగ్గిస్తే ప్రజల విప్లవ అనుభవాలనుంచి నేర్చుకోవలసిన గుణపాఠాల స్థానం తగ్గిపోతుంది, లేదా మటుమాయమైపోతుంది.

తెలంగాణా ప్రజల సాయుధ పోరాటానికున్న వాస్తవమైన ప్రత్యేకత ఏమంటే: ఇచ్చట భావిభారత విప్లవ పంథాకు సంబంధించిన ప్రయోగం (experiment) జయప్రదమైనది. ఈ ప్రయోగాన్ని ఆధారం చేసుకొని కమ్యూనిస్టు విప్లవకారులు భారత విప్లవ పంథాను రూపొందించారు. ఈ పంథా విప్లవకారులది మాత్రమే కాదు. భారత ప్రజలందరికీ సంబంధించినది. ఈ కారణం వల్లనే దీని ప్రాధాన్యతకు కూడా ప్రత్యేకత ఉంది.

తెలంగాణాలో సాయుధ పోరాటం 1946 లో ప్రారంభమైనా ప్రజల నిర్మాణయుతమైన విప్లవోద్యమం 1940-41 నుంచే ప్రారంభమయింది. దీనిని సరిగా అర్థం చేసుకోవాలంటే ఆనాటి తెలంగాణాలోని రాజకీయ సాంఘిక పరిస్థితులను అర్థంచేసుకోవలసిన అవసరముంటుంది.

# 1. హైదరాబాదు సంస్థానం–
# రాజకీయ, ఆర్థిక, సాంఘిక పరిస్థితులు

బ్రిటిష్ సామ్రాజ్యవాదులు మనదేశాన్ని జయించి వలస పాలనను నెలకొల్పినపుడు దేశంలోని మూడింట రెండుభాగాలను తమ ప్రత్యక్షపరిపాలనలో అట్టిపెట్టుకున్నారు. ఈ ప్రాంతాన్ని బ్రిటిష్ ఇండియా అనేవారు. దీనిని కొన్ని రాష్ట్రాలుగా విభజించి పాలించారు. వాటిలో ఆంధ్ర, తమిళ, కర్ణాటక, కేరళ ప్రాంతాలుగల మద్రాసు, మహారాష్ట్ర, గుజరాతు, కన్నడప్రాంతాలుగల బొంబాయి రాష్ట్రాలు ఉండేవి. దేశంలోని మిగతా మూడవవంతు ప్రాంతంలో రాజులు, మహారాజుల పరిపాలన గల స్వదేశీ సంస్థానాలు ఉండేవి. వాటిలో హైదరాబాదు సంస్థానమొకటి. చట్టరీత్యా దీని అధిపతి నిజాం నవాబు. ఇతని పూర్వవంశీకులు ఢిల్లీ మొగలాయి చక్రవర్తుల తరఫున నియమించబడిన గవర్నర్ల వంటివారు. బ్రిటిష్‌వారు మొగలాయి సామ్రాజ్యాన్ని హస్తగతం చేసుకున్న తర్వాత, నిజాం నవాబులు వారికి సామంతులైనారు. వారి ఆధీనంలో ఉన్న రాయలసీమ, మహారాష్ట్ర, విదర్భ జిల్లాలను బ్రిటిష్‌వారు స్వాధీనం చేసుకొని మిగతా ప్రాంతాన్ని నిజాం నవాబుల స్వాధీనంలో ఉంచారు. అదే హైదరాబాదు సంస్థానం.

## 1. నిజాం నవాబు రాజకీయ స్థానం

హైదరాబాదు సంస్థానానికి నిజాం నవాబు అధిపతిగా చలామణీ అవుతూ ఉండేవాడు. బ్రిటిష్ ఇండియాతో నేరుగా సంబంధంలేని పరిపాలనా యంత్రాంగం ఉన్నా, కరెన్సీ, కస్టమ్సు, పోస్టల్ సర్వీసు వంటి కొన్ని ప్రత్యేకాధికారాలు కలిగిఉన్నా సంస్థానం బ్రిటిష్‌వారి ఆధీనప్రాంతమే. నిజాం నవాబు వారి కీలుబొమ్మ. ఈయన వంశీకులు భారతదేశాన్ని జయించటానికి బ్రిటిష్‌వారికి తోడ్పడినవారు. వారిలో ఒకరు కొంత సైన్యంతో తిరుగుబాటు చేసినట్టు ఒక కథనం ఉంది. అది నిజమైనా, కాకున్నా వీరివంశం మాత్రం బ్రిటిష్ రాజభక్తి పరాయణమైనదే.

బ్రిటిష్‌వారు తలచుకుంటే స్వదేశీ సంస్థానాలను తుడిచిపెట్టి రాజులకు, మహా రాజులకు, నవాబులకు పెన్షనులనిచ్చి ఈ భూభాగమంతటిని బ్రిటిష్ ఇండియాలో చేర్చుకోగలిగేవారే. కాని దేశాన్ని రెండుగా చీల్చిపాలిస్తే లాభదాయకంగా ఉంటుందని, ప్రజలను నేరుగా కొల్లగొట్టడానికి బదులుగా స్వదేశీ సంస్థానాధీశులను ఆ పనికి ఉపయోగిస్తే తమ లాభాలకు ఎలాంటి ఆటంకం ఉండదనీ స్వదేశీ సంస్థానాలను అట్టిపెట్టే విధానాన్ని అనుసరించారు. బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్ని ప్రతిఘటించిన చరిత్ర వీరికి ఏమాత్రమూ లేదు. ప్రారంభంనుంచీ వీరు తమ మనుగడకు బ్రిటిష్‌వారిపైననే ఆధారపడి ఉన్నారనేది నగ్నసత్యం.

నిజాం నవాబు సంస్థానానికి అధిపతిగా చలామణీ అయినా బ్రిటిష్‌వారికి సామంతుడుగానే వుండేవాడు. ఇతని పూర్వీకులు 12వ అక్టోబరు, 1800 సంవత్సరాన బ్రిటిష్ వారితో దీనికి అనుగుణ్యమైన ఒప్పందాన్ని చేసుకున్నారు. దీనికి "The Treaty of Subsidia y Alliance" అని పేరు. ఆయనకు బ్రిటిష్‌వారు నామినేటు చేసిన ఒక ప్రధానమంత్రి ఉండేవాడు. ముఖ్యమైన రెవిన్యూ, పోలీసు మంత్రి పదవులు రెండూ బ్రిటిష్‌వారే నిర్వహించేవారు. ఆర్థికమంత్రిని బ్రిటిష్‌వారు నియమించేవారు. అన్నిటి కన్నా మించినది బ్రిటిష్‌వారి సైన్యం సికిందరాబాదులో మకాంవేసి ఉండేది. బ్రిటిష్‌వారి ప్రతినిధి, రెసిడెంటు[1] (Resident) అనే పేరుతో హైదరాబాదు నగరంలో ఉంటూ నిజాం నవాబు, ఆయన వంశీకుల కార్యకలాపాలను, పరిపాలనా వ్యవహారాలను ఎప్పటి కప్పుడు తెలుసుకుంటూ ఢిల్లీలోని బ్రిటిష్ ప్రభుత్వానికి రిపోర్టుచేస్తూ, వారి ఆదేశాలను నిజాం ప్రభుత్వానికి అందజేసి అమలుజరిపిస్తూ ఉండేవాడు. భోగలాలసుడైన నవాబుకు బ్రిటిష్‌వారిని ఎదిరించగల శక్తి లేకున్నా వారు ఆయన్ను అష్టదిగ్బంధనంచేశారు. నిజాం నవాబుకూ, బ్రిటిష్‌వారికీ వ్యతిరేకమైన రాజకీయోద్యమాలు తల ఎత్తకుండా చేయటానికి, తల ఎత్తినా అణచివేయటానికి ఈ దిగ్బంధనాన్ని ఉపయోగించారు. ఈ విధంగా వారు తమ ఆధిపత్యాన్ని కట్టుదిట్టం చేసుకున్నారు.

నిజాం నవాబు తాను సర్వస్వతంత్రుడననీ, బ్రిటిషువారు తన వంశీకుల నుంచి తీసుకున్న బిరారు జిల్లాలు తిరిగి తనకు ఇచ్చివేయాలనీ 1923 లో బ్రిటిషువారితో ఉత్తరప్రత్యుత్తరాలు కొనసాగించాడు. 1925 లో అప్పటి వైస్రాయి ఆయన అభిప్రాయాన్ని తిరస్కరించి, బ్రిటిషు ప్రభుత్వానికే సర్వంసహాధికారం ఉందనీ నిజాం నవాబు అందరి రాజులవలెనే ఒక సామంతుడనీ స్పష్టంచేశాడు. దీనిని బ్రిటిషు వారి "పరమాధికారము"ని (paramountcy) అంటారు. భారతదేశంలో బ్రిటిషు

పాలన ఏర్పడిన తర్వాత హైదరాబాదు సంస్థానం ఎప్పుడూ స్వతంత్ర రాజ్యంగా లేదనేది ఒక వాస్తవ విషయం.

## 2. పాలనా యంత్రాంగం

సంస్థానం భాషరీత్యా మూడు ప్రాంతాల్లో విభజింపబడి ఉండేది. అన్నిటికన్న పెద్దది ఆంధ్రులు నివసించే తెలంగాణా. దీనిలో ఎనిమిదిజిల్లాలు ఉండేవి. 1) వరంగల్లు 2) కరీంనగర్ 3) ఆదిలాబాదు 4) నిజామాబాదు 5) మహబూబునగరు 6) మెదకు 7) అత్రాపుబల్దా[2] 8) నల్లగొండ. కాంగ్రెసుపాలన ప్రారంభమైన తర్వాత వరంగల్లును విభజించి వరంగల్లు, ఖమ్మం జిల్లాలను చేశారు. అత్రాపుబల్దాను మార్చి హైదరాబాదు జిల్లా అని పేరుపెట్టారు. నేటి రంగారెడ్డి జిల్లా ఇదే. తెలంగాణా జనాభా 1941 లో సుమారు 84 లక్షలు.

సంస్థానంలోని రెండవభాగం మరట్వాడా. మహారాష్ట్ర ప్రజలు నివసించే ప్రాంతమిది. దీనిలో అయిదు జిల్లాలు ఉండేవి. 1) ఔరంగాబాదు 2) బీడు 3) పర్బనీ 4) నాందేడు 5) ఉస్మానాబాదు. ఈ ప్రాంతపు జనాభా 1941లో సుమారు 50 లక్షలు.

మూడవ భాగం అన్నిటికన్నా చిన్నది. కర్ణాటక ప్రాంతం. దీనిలో మూడు జిల్లాలుండేవి. 1) గుల్బర్గా 2) రాయచూరు 3) బీదరు. ఈ ప్రాంతపు జనాభా ఆ కాలంలో సుమారు 30 లక్షలు.

ఈ విధంగా సంస్థానంలో 16 జిల్లాలుండేవి. 1941లో జనాభా 164 లక్షలు (సుమారు). వైశాల్యం సుమారు 42000 చదరపు మైళ్ళు (సుమారు 2 కోట్ల 67 లక్షల ఎకరాలు). జనాభారీత్యా ఈ సంస్థానం అన్నిటికన్నా పెద్దది.

తెలంగాణాలో నివసించే 84 లక్షల జనాభాలో అంతా ఆంధ్రులు కారు. ఇతర జాతులవారు, ముస్లింలు వీరిలో ఒకభాగం.

కర్ణాటక జిల్లాల్లో తెలుగు ప్రాంతాలు ఉండేవి. మహారాష్ట్ర సరిహద్దు లోపల తెలుగు గ్రామాలు ఉండేవి. దీనితో తెలంగాణపు తెలుగువారి జనసంఖ్యకన్నా సంస్థానంలో తెలుగు మాట్లాడేవారి సంఖ్య హెచ్చుగా ఉండేది.

1941 నాటివరకు జనాభా లెక్కలు ఈ క్రింది విధంగా ఉన్నవి :

| సంవత్సరం | రాష్ట్ర జనసంఖ్య | తెలంగాణా జన సంఖ్య |
|---|---|---|
| 1921 | 1,24,71,770 | 64,19,298 |
| 1931 | 1,44,36,148 | 75,54,598 |
| 1941 | 1,63,38,534 | 84,32,607 |

('తెలంగాణా ఆంధ్రోద్యమం' – మొదటిభాగం. పేజి–5,
రచన : మాడపాటి హనుమంతరావు)

ఆ కాలంలో జనాభా లెక్కలు తీసేపద్ధతి కొంత లోపభూయిష్టంగా ఉందని అనుకున్నా ఈ అంకెలు ఆంధ్రుల సంఖ్యను స్థూలంగా తెలుపుతున్నాయి.

సంస్థానంలోని జిల్లాలన్నీ 4 సూబాలుగా (రాష్ట్రాలుగా) విభజింపబడి ఉండేవి. తెలంగాణాలో వరంగల్లు, మెదకు అనే రెండు సూబాలు ఉండేవి. వరంగల్లు, హైదరాబాదులు వీటి ముఖ్య స్థానాలు. సూబాలకు అధిపతులు సూబేదారులు (గవర్నర్లు), వీరికి రెవిన్యూ అధికారాలు ఉండేవి. తాలూక్దారులు (కలెక్టర్లు) జిల్లా అధికారులు. వీరికి రెవిన్యూతోపాటు పరిపాలనా అధికారాలు కొన్ని ఉండేవి. తాలూకాలకు ఇప్పటిమాదిరిగానే తాసీల్దారులు రెవిన్యూ అధికారులు.

సంస్థానంలో 1899లో స్థాపించిన ఒక శాసన సభ ఉండేది. దానిని గూర్చి మందుములవారు ఇలారాశారు :

"లోగటి నుండి కూడా (1899 నుండి) ఇక్కడ ఒక శాసనసభ ఉండేది. ఆ సభ మొత్తము ఇరవై ఒక్కమంది సభ్యులతో కూడినది. అందులో పదిహేనుమంది అధికారసభ్యులు, ఆరుగురు అధికారేతర సభ్యులు ఉండేవారు. ఈ ఆరుగురిలో ఇద్దరు జాగీర్దార్లతో, ఇద్దరు హైకోర్టు న్యాయవాదులతో ఎన్నుకోబడేవారు. ప్రధానమంత్రి ఇద్దరు సభ్యులను ఇతర ప్రజల తరఫున నియమించేవారు. ఈ సభకు చిత్తుచట్టాల గురించి మరియు సభ్యులు ప్రవేశపెట్టదలచిన తీర్మానాలపైన ఆలోచించే పరిమితమైన అవకాశము దేది. కానీ ప్రశ్నలు అడిగే హక్కు కూడ లేకుండెను. రాష్ట్ర ఆదాయము, ఋణము మొదలగు ఆర్థిక సమస్యల గురించి కాని, బడ్జెటుపైన చర్చించే అవకాశముకానీ ఏదీ లేకుండెను". ('50 సంవత్సరముల హైదరాబాద్'-పేజి-64).

దీని స్వరూప స్వభావాలను గూర్చి అంతగా వివరించటం అనవసరం. శాసనసభలోని 21 మందిలో 15 మంది నిజాం నవాబు అధికారులే ; వారు నిజాం నవాబుకోసం మాత్రమేగాక బ్రిటిషువారి ప్రయోజనాలకోసం కూడా పనిచేసే సభ్యులు. ఆరుగురు అనధికార సభ్యుల్లో ఇద్దరిని జాగీర్దారులు ఎన్నుకునేవారు. జాగీర్దారీ విధానాన్ని కాపాడటానికి పనిచేయటమే వీరి విధ్యుక్తధర్మం. ఆ విధంగా ఆ విధానాన్ని కాపాడారు కూడా. మరో ఇద్దరిని హైకోర్టు న్యాయవాదులు ఎన్నుకునేవారు. హైకోర్టు న్యాయవాదుల సంఖ్య ఎప్పుడూ పరిమితంగా ఉండుటేగాక భూస్వాములకు, పైతరగతులకూ ప్రాతినిధ్యం వహించేవారు.

ప్రభుత్వం నామినేటు చేసేవారిలో అప్పుడప్పుడు మితవాదులు ఉండేవారు. 1938 నుంచి 1941 వరకు మందుముల నరసింగరావుగారు ఉన్నట్టుగా వారు తమ

రచనలో రాశారు. కొండా వేంకట రంగారెడ్డిగారు కూడా నిర్ణీతకాలం వరకు ఉన్నారు. ఈ శాసనసభ 1946 లో అంతమైంది.

సంస్థానంలోని పెద్ద పట్టణాలు అయిదు. హైదరాబాదు రాజధాని; అన్నిటికన్న పెద్దది. సికిందరాబాదు రెండవది. ఇది బ్రిటిషువారి మిలటరీ కంటోన్మెంటు. వరంగల్లు, మరట్వాడాలోని ఔరంగాబాదు, కర్ణాటకలోని గుల్బర్గా వరుసగా మూడవ, నాల్గవ, అయిదవ స్థానంలో ఉండేవి.

హైదరాబాదు ఉస్మానియా విశ్వవిద్యాలయానికి కేంద్రం. దానికి అనుబంధమైన నాలుగు ఇంటర్మీడియేటు కళాశాలలుండేవి. వరంగల్లు, ఔరంగాబాదు, గుల్బర్గాలలో ఇలాంటి కళాశాలలు ఉండేవి. ఆనాటి సిటీ కాలేజి కూడా ఇలాంటిదే. స్త్రీలకోసం ప్రత్యేకమైన కాలేజి ఉండేది. నిజాంకాలేజి ఆనాడు మద్రాసు విశ్వవిద్యాలయానికి అనుబంధంగా ఉండేది. పట్టణాల్లో ఉండే హైస్కూళ్ళేకాక జిల్లాకొక హైస్కూలు ఉండేది. మిడిల్ స్కూలులేని తాలూకాకేంద్రాలు కూడా ఉండేవి. ఉర్దూ భాషలోనే విద్యాబోధన జరిగేది.

1920లోనే సంస్థానంలో న్యాయశాఖను వేరుచేసే సంస్కరణను ప్రవేశపెట్టారు. సంస్థానానికి ప్రత్యేకంగా హైకోర్టు ఉండేది. నాలుగు సెషన్ కోర్టులు, జిల్లా, తాలూకా కోర్టులు ఉండేవి. కోర్టు భాష ఉర్దూ. బ్రిటిష్‌వారు మనదేశాన్ని పాలించటానికి చేసిన చట్టాలన్నిటినీ ఉర్దూలోకి అనువదించి హైదరాబాదు ప్రభుత్వ చట్టాల పేరుతో అమలు జరిపినారు. ఇదిగాక ప్రత్యేకమైన చట్టాలుకూడా ఉండేవి.

పోలీసు శాఖ, అటవీ శాఖ, ఆబ్కారీ శాఖ మొదలగునవన్నీ ఉండేవి. వాటికి అన్ని స్థాయిల్లో అధికారులుండేవారు. పబ్లిక్ వర్క్స్ శాఖ ఉండేది. ప్రభుత్వానికి ప్రత్యేకమైన సైన్యంకూడా ఉండేది.

బ్రిటిష్ ఇండియాలో ఐసియస్ (ICS) ఉండినట్టుగానే సంస్థానంలో హైదరాబాదు సివిల్ సర్వీస్ (HCS) అనే శిక్షణపొందిన అధికార బృందాన్ని ప్రభుత్వం రూపొందించింది.

సంస్థానంలో ప్రత్యేక కరెన్సీ ఉండేది. దీనిని హాలీ సిక్కా (నాణెం) అని అనేవారు. బ్రిటిష్ రూపాయికన్న నిజాం రూపాయికి విలువ తక్కువ ఉండేది. పక్క రాష్ట్రాలనుంచి వచ్చే సరకులపైన కస్టమ్స్ (కరోడ్గిరీ) పన్నులు వసూలుచేసే అధికారం ఉండేది. దానిని అమలుజరపటానికి ప్రత్యేక శాఖ, అధికారవర్గమూ, ఉద్యోగులూ ఉండేవారు. ప్రభుత్వానికి పోస్టుశాఖకూడా ఉండేది. ప్రత్యేక తపాలా బిళ్ళలు, పోస్టుకార్డులు, కవర్లు ఉండేవి. సంస్థానంలో మాత్రమే వీటిని ఉపయోగించేవారు.

రైల్వేలు ఒక కాలంలో బ్రిటిష్ కంపెనీల యాజమాన్యంలో ఉన్నప్పటికీ,

తర్వాత సంస్థాన ప్రభుత్వపు ఆధీనంలోకి వచ్చినవి. రైల్వేశాఖ వీటిని నడుపుతూ ఉండేది. ఇదేవిధంగా రోడ్డుట్రాన్స్‌పోర్టును ప్రభుత్వమే స్వాధీనంచేసుకొని నడిపించింది. అయినా ప్రధాన రహదారులకు మాత్రమే పరిమితమై ఉండేది.

ఒక్కమాటలో చెప్పాలంటే బ్రిటిష్‌వారు తమ రాష్ట్రాలలో నెలకొల్పిన పరిపాలనా యంత్రాంగాన్ని సంస్థానంలో కూడా ఏర్పరిచారు. కరెన్సీ, కస్టమ్సు, పోస్టు, రైల్వేలాంటి అధికారాలు సంస్థానానికి ప్రత్యేక స్థానాన్ని కల్పించాయి.

## 3. సర్ఫేఖాసు - జాగీర్లు - మక్తాలు

సర్ఫేఖాసు : సంస్థానంలో నిజాం నవాబు, ఆయన సామంతులు ప్రత్యక్షంగా పరిపాలించే ప్రాంతాలు మూడవ వంతు భూభాగంలో ఉండేవి. (ఈదామాషా బ్రిటిష్ వలస పాలనలో స్వదేశీ సంస్థానాల భూభాగానికి సరితూగుతుంది) వీరందరిలో నిజాం నవాబు పెద్ద జాగీరుదారు. ఆయన జాగీరు ప్రాంతానికి "సర్ఫేఖాసు" (ప్రత్యేక ఖర్చులు ; స్వంత ఖర్చులు) అనే పేరు ఉండేది. దీనిమీద వచ్చే ఆదాయమంతా ఆయన స్వంత ఖజానాకు వెళ్ళేది. నేటి హైదరాబాదు జిల్లాలోని హెచ్చుభాగం ఈయన జాగీరే. తెలంగాణాలోని 646 సర్ఫేఖాసు గ్రామాల్లో 573 గ్రామాలు ఈ జిల్లాలోనే ఉండేవి. ఇదిగాక వివిధ జిల్లాలలో హెచ్చు ఆదాయం వచ్చే గ్రామాలను కొన్నింటిని సర్ఫేఖాసు కింద చేర్పించుకొని తన ఆదాయాన్ని పెంచుకున్నాడు.[8] హైదరాబాదు జిల్లా (ఆనాటి అత్రాపుబల్దా)లో కొంత భాగం సారవంతమైన భూమి ఉన్నప్పటికీ హెచ్చుభాగం అలాంటిది కాదు. ఈ ప్రదేశమంతా పచ్చికబీళ్ళమయంగా ఉండేది. ప్రతి గ్రామానికి సాగులో ఉన్నభూమి కొంత ఉంటుంది. దానిమీద వచ్చే శిస్తు అంతా ఆయనకే. ఇదిగాక పచ్చికబయళ్ళపైన, అడవులపైన ఆదాయం వస్తూ ఉండేది. హైదరాబాదు నగరం శివార్లలోనూ, సమీప ప్రాంతాలలోనూ అసంఖ్యాకంగా పండ్లతోటలు ఉండేవి. వాటినుండికూడా తగినంత ఆదాయం వచ్చేది.

"సర్ఫేఖాసు" ప్రాంతంలో కూడా కొన్ని జాగీరు గ్రామాలు ఉండేవి. ఈ ప్రాంతాలలో పెద్ద భూస్వాములు, వారి భూములను సాగుచేసే కౌలుదారులు ఉన్నారు. ఈ విధంగా కౌలుదారులకూ, నిజాం నవాబుకూ మధ్య కొన్ని దొంతర్లు ఉండేవి. వారందరి దోపిడీ భారమంతా కౌలుదారులమీద, సాధారణ రైతులమీద పడుతూ ఉండేది. పచ్చికబయళ్ళను ఏ ఏటికాయేడు వేలం వేస్తూ ఉండేవారు. కొన్ని సందర్భాల్లో 2-3 సంవత్సరాలకొకసారి వేలంవేయటంకూడా పరిపాటి. వేలం పాటదారులు ఒకరే ఉండవలసిన అవసరంలేదు. పెద్దవారికి అనుబంధంగా ఉండే చిన్నవారు ఎందరో ఉంటారు.

వీటిని ఉపయోగించుకునే రైతులు, గొర్ల కాపరులు — మధ్య దొంతరలందరికీ లాభ సాటిగా ఉండేవిధంగా హెచ్చు పన్నులను కట్టవలసివచ్చేది. ఇప్పటికీ ఇదే పరిస్థితి.

గ్రామాలన్నీ భూస్వాముల, పెత్తందారుల ప్రాబల్యంలో ఉండుట సహజం. సెటిల్‌మెంటు (బందోబస్తు) ఏర్పాట్లు కూడా సర్ఫేఖాసు ప్రాంతంలో ఎప్పుడూ సరిగ్గా లేవు. దీనితో సాధారణ రైతులకు స్వంత భూమికీ, కౌలు భూమికీ తేడాలేని స్థితి ఏర్పడింది. తమతమ భూములకు సాంప్రదాయమైన సరిహద్దులపై ఆధారపడి సాగు చేసుకునేవారు. సెటిల్మెంటు జరిగినచోట భూమి సరిహద్దులు సరిగా నిర్ణయం కానందున రైతులు వారిలోవారు తగాదాపడి పెత్తందార్లకు ముడుపులు చెల్లించుకోవలసి వచ్చేది. వీరిలో కొందరు పైరవీకార్లుగా (Touts) తయారై సంవత్సరాల తరబడి రైతులను ఆఫీసులచుట్టూ తిప్పుతూ అప్పులపాలు చేసేవారు. ఈ విధంగా వారు భూమి శిస్తులతో పాటు పైరవీల ఖర్చులు కూడా భరించి దివాలాతీసేవారు.

నిజాం నవాబుకు సొంతపరివారమూ, సొంతసైన్యమూ, సొంత అధికారవర్గమూ ఉండేవి. రైతులూ, సామాన్యప్రజలూ పన్నులు చెల్లించుటేకాక, వీరి భోగలాలసత్వానికి అవసరమైన పనులు ఉచితంగానో, నామమాత్రమైన పరిహారంతోనో చేయవలసివచ్చేది. గ్రామాలనుంచి సప్లై అయ్యే గొర్లు, మేకలు, కోళ్ళు, వంటచెరకు మొదలగునవన్నీ వారికి అందించవలసి వచ్చేది. ఒకమాటలో చెప్పాలంటే, ఒకచట్టమూ, ఒక పరిపాలనా విధానమూ లేకపోవుటవలన ఆయన సామంతులూ, భూస్వాములూ, పెత్తందారులూ ఎవరిశక్తికొలదివారు ప్రజలను కొల్లగొట్టి అనుభవించేవారు.

"పోలీసుచర్య" తర్వాత ఈ "సర్ఫేఖాసు" ప్రాంతాన్నంతా ఆనాటి హైదరాబాదు మిలటరీ ప్రభుత్వం ప్రత్యక్షంగా పరిపాలించసాగింది. నిజాంనవాబు స్వంత ఖర్చులకు వివిధ రూపాల్లో సుమారు కోటి రూపాయలు (ప్రతి సంవత్సరం) ముట్ట జెప్పింది. అపారమైన ఆదాయాన్నిచ్చే భూములన్నిటినీ ఆయన స్వంత ఆస్తిగా గుర్తించింది. లోపభూయిష్టమైన ఆనాటి 'మిలటరీ' పరిపాలన ఫలితంగా నేటికీ తమ భూములపై యాజమాన్యపు హక్కులు సంపాదించలేక కోర్టుల చుట్టూ, ఆఫీసుల చుట్టూ తిరుగుతూ ఉన్న రైతులు ఎందరో ఉన్నారు. హక్కులు సాధించుకున్న వారు కూడా ఎన్నో వ్యయప్రయాసలనుభవించవలసివచ్చింది. ఈ వ్యయాన్ని లెక్కవేస్తే పట్టా హక్కులు సాధించిన భూముల ధరకు మించిపోతుంది.

పాయెగా : నిజాం నవాబుగారి దగ్గరి బంధువుల స్వాధీనంలో ఉండే జాగీర్లను పాయెగా ప్రాంతమనేవారు. వీరికి అదనపు అధికారాలు సౌకర్యాలు ఉండేవి.

జాగీరు పాలన : సంస్థానమంతటా జాగీరు ప్రాంతాలు ఉండేవి. పెద్ద జాగీర్లు కొన్నింటికి సంస్థానాలని పేరు. (నిజాం నవాబు సంస్థానమూ, ఈ సంస్థానమూ ఒకటే కాదు. ఈ సంస్థానాధీశులు తక్కిన జాగీర్దారులకన్న తమకేవో ప్రత్యేకతలున్నాయని చెప్పుకునేవారు) కొన్ని పెద్ద జాగీర్లూ, మరికొన్ని చిన్న జాగీర్లూ ఉండేవి. ఒక్కొక్క ప్రాంతమే జాగీరుగా ఉన్న ప్రాంతంకూడా చాలా ఉండేది. వీటిలో పెద్ద జాగీరు ప్రాంతాలు కొన్నింటికి రెవిన్యూ, పోలీసు, న్యాయశాఖ అధికారాలు ఉండేవి. ఇవి కొందరికి తాలూకా స్థాయివరకూ, మరికొందరికి జిల్లాస్థాయివరకూ ఉండేవి. ఈ అధికారులందరికీ (సర్ఫేఖాసు, పాయెగా, జాగీరు) సాధారణ ప్రభుత్వోద్యోగులకన్న స్వల్పమైన వేతనాలు ఉండేవి. వారి ఆదాయమంతా ప్రజలను కొల్లగొట్టి సంపాదించేదే. జాగీర్లలో చీటికీ మాటికీ పన్నులు వసూలు చేసేవారు. కొన్ని గ్రామాలలో ప్రజలు 40 రకాల పన్నులు చెల్లించవలసివచ్చేది.

తెలంగాణాలో ఉన్న సుమారు 10వేల గ్రామాల్లో 2600వరకు జాగీరుగ్రామాలు ఉండేవి. నిజాం నవాబు గ్రామాలు కాక జాగీరు గ్రామాలే నాల్గవ వంతుకన్నా హెచ్చుగా ఉండేవి. వైశాల్యం కూడా ఈ దామాషాలోనే ఉండేది. నిజాం నవాబు గ్రామాలను కలిపితే ఇవి మూడవ వంతుకన్నా హెచ్చుగా ఉండేవి.

ఇలాంటివే మక్తాలనే ప్రాంతాలుండేవి. మక్తాదారులు ప్రభుత్వానికి ప్రతి సంవత్సరం కొంత డబ్బు చెల్లించేవారు. జాగీర్దారులలో డబ్బు చెల్లించేవారు కొందరూ, చెల్లించనివారు కొందరూ ఉండేవారు. ఇవిగాక అగ్రహారాలు ఉండేవి.

ఈ ప్రాంతాల ప్రజలంతా సాధారణంగా చెల్లించుకోవలసిన పన్నులతోబాటు జాగీర్దారుల, మక్తాదారుల స్వంత అవసరాలకోసం (పెళ్ళిళ్ళు, పుట్టుకలు, చావులు, భవనాల కోటల నిర్మాణాలు) పెద్దమొత్తాలలో చెల్లించవలసివచ్చేది. వారు ప్రజలకోసం చేసే సౌకర్యాలు శూన్యం. కొత్త చెరువుల నిర్మాణం లేదు. పాత చెరువుల మరమ్మతు లేదు. విద్య, వైద్య సదుపాయాలు బొత్తిగా ఉండేవి కావు. ఈ స్థితిలో పన్నుల భారం జాగీరు ప్రజలను బాగా కృంగదీసింది.

జాగీర్దారులు, మక్తాదారులు చనిపోయినప్పుడు వారి తర్వాత ఆ హక్కులు ఎవరికి సంక్రమించాలనే సమస్యపైన వారి సంతానంలోనూ, వారి దాయాదులలోనూ ఎప్పుడూ తగాదాలు చెలరేగుతూ ఉండేవి. తీర్పు హక్కు నిజాం నవాబుకే ఉండుటవలన ఆయన కొంత డబ్బు (దీనినే నజరానా అంటారు) తీసుకొని వారసుణ్ణి నిర్ణయించేవారు. దీనివలన ఆయనకు వచ్చే ఆదాయం చాలా ఉండేది.

జాగీర్దారుల్లో ముస్లింలు, హిందువులు ఉండేవారు. హిందువుల్లో తెలుగువారు,మహారాష్ట్రులు, కర్ణాటకులేగాక కాయస్థులు కూడా ఉండేవారు.

నిజాం ప్రభుత్వ కాలంలో జాగీరు పరిపాలనను సంస్కరించాలని ప్రయత్నాలు జరిగినవి. కాని ఫలించలేదు. సమర్ధవంతంగా పరిపాలన సాగుతున్న కొన్ని పెద్ద జాగీర్లను మినహాయించి, చిన్న జాగీరు ప్రాంతాలన్నింటినీ ఆ గ్రామాలున్న జిల్లాలలో, తాలూకాలలో కలిపివేయాలని, జాగీర్దారులకు నష్ట పరిహారం చెల్లించాలని ప్రభుత్వం నియమించిన ఒక కమీషన్ సూచించింది[4]. నిజాం నవాబుకూడా పెద్ద జాగీర్దారే. ప్రభుత్వపు ఉన్నతాధికారులలో అత్యధిక భాగం జాగీర్దారులే. ఈ కారణంవలన కమీషన్ సూచనలు అమలులోకి రాలేదు. జాగీరు పరిపాలన యథాతథంగా ఉండిపోయింది.

జాగీరుదారు చనిపోయి, ఆయన వారసత్వం తగాదాలో ఉన్నప్పుడు లేదా జాగీర్దారు కొడుకు మైనరుగా ఉన్నప్పుడు ప్రభుత్వమే దానిని స్వాధీనం చేసుకొని 'కోర్టు ఆఫ్ వార్డ్స్' ద్వారా పరిపాలన సాగించేది. ఇలాంటి ఏర్పాట్లవలన ప్రజల ఇబ్బందులు తగ్గిపోయేవనీ, పరిపాలనా వ్యవహారాలు సవ్యంగా సాగిపోయేవని ఒక అభిప్రాయం ప్రబలంగా ఉండేది. ప్రభుత్వాధికారులే పరిపాలనా వ్యవహారాలను నిర్వహించేవారు కావున వారు ప్రభుత్వ చట్టాలను ఏదోమేరకు అమలుజరిపేవారు. ఉన్నంతలో ఆ పరిపాలన మెరుగుగా ఉండేది కూడా.

జాగీర్దారులందరికీ తమ తమ ఆర్థిక స్థోమత, హోదానుసరించి హైదరాబాదులో పెద్ద భవనాలుండేవి. (ఇవి ఇప్పటికీ ఉన్నవి.) ముస్లిం, కాయస్థ జాగీరుదారుల నివాసం హైదరాబాదులోనే. కానీ తెలుగు జాగీర్దారుల్లో హెచ్చుభాగం కొంతకాలం గ్రామాల్లో గడుపుతూ మరికొంతకాలం హైదరాబాదులో గడిపేవారు. వారికి గ్రామాల్లో "స్వంత భూములు", 'స్వంత' వ్యవసాయాలు కూడా ఉండేవి. ఈ వ్యవసాయాల వలన లాభమెంత ఉన్నా లేకున్నా ఇవి వారివారి అధికార దర్పాన్ని ప్రదర్శించుకోడానికి ఉపయోగపడేవి. వీరి వ్యవసాయభూముల్లో పాలేర్లు, కూలీలు నామమాత్రపు కూలీలతో పనిచేసేవారు. వీరితోపాటు రైతులంతా తమ నాగళ్ళతో ఈ భూములను దున్నిపెట్టవలసి ఉండేది. ఇదంతా వెట్టిచాకిరిలో ఒకభాగం. ఇదిగాక జాగీరుదారులకు చేతిపనివారంతా ఉచితంగా చాకిరీచేయవలసిఉండేది. ఇది కూడా వెట్టిచాకిరే. పట్టణాలలో ఉండేవారికి ఇలాంటి చాకిరీ ఒత్తిడి కొంతవున్నప్పటికీ, గ్రామాల్లో నివసించే జాగీర్దారులకు చాలా పనిచేయవలసి వచ్చేది.

## 4 ఫ్యూడల్ భూస్వామ్య వ్యవస్థ - భూమి కేంద్రీకరణ

జాగీర్దారీ విధానం కూడా ఫ్యూడల్ భూస్వామ్య వ్యవస్థలో ఒక భాగమే. దీనిని గురించి ఇదివరకే వివరించాము. జాగీర్దారీ వర్గానికి జాగీరు భూములపై చట్టరీత్యా

ఎలాంటి అధికారం లేనప్పటికీ వారు దానిని వివాదాంశంగా మార్చారు. ఈ విధానం రద్దయినప్పుడే ఆ సమస్యపై చర్చ ముగిసింది. జాగీర్దారీ విధానం రద్దుకావటంతో ఒక దొంతర మాత్రమే తొలగిపోయింది. కాని రైతాంగానికంతటికీ భూమిపై యాజమాన్య మేర్పడలేదు.

ఖాల్సా ప్రాంతంలోని కూడా నాలుగింట మూడువంతుల భూమిపై భూస్వాములు, మిగతా నాలుగవ వంతు భూమిపై రైతులు యజమానులైనారు. ఈ సందర్భంలో శ్రీ మందుముల వారు తమ గ్రామంలోని భూమి యాజమాన్యాన్ని గూర్చి ఇలా రాశారు: "ఆ కాలంలో మాఊరి పెద్ద భూస్వాములుగా మా నాయనగారు, కరణం మరియు మాలీ పటేలు-ఈ ముగ్గురే ఉండేవారు. సేద్యంలో ఉన్న భూమిలో మూడు భాగాలు ఈ ముగ్గురు పెద్ద భూస్వాముల స్వాధీనంలో ఉంటే, తక్కిన ఒకభాగం గ్రామంలోని ఇతర భూస్వాముల స్వాధీనంలో ఉండేది". ('50 సంవత్సరముల హైదరాబాదు' : పేజి 16). ఈ గ్రామం మహబూబునగరు జిల్లాలోనిది. జనగామ తాలూకాలోని "గుమ్మడివెల్లి ఊరిలో గ్రామాధికారులకు మూడుపాళ్ళ భూమి, రైతుల కొక పాలు-పట్టాలున్నవి" (గోలకొండ పత్రిక-18-7-1935).

ఇవి రెండూ రెండు జిల్లాలలోని గ్రామాలే అయినా అంతటా భూమి యాజమాన్యం సుమారుగా ఇదేవిధంగా ఉండేది. భూస్వాముల భూమిని సాగుచేసే కౌలుదారులకూ, పాలేరులకూ భూమిపై యాజమాన్యం దొరకవలసిన కర్తవ్యం ఈనాటికీ మిగిలి ఉంది.

జాగీరు ప్రాంతంలో కూడా భూస్వాములున్నందున, జాగీర్దారీ వర్గమంతా భూస్వామ్యవర్గమైనందున ఈ కర్తవ్యం ఆ ప్రాంతాలకు కూడా వర్తిస్తుంది.

నేరుగా ప్రభుత్వం కింద ఉన్న ఖాల్సా ప్రాంతంలో భూమి యాజమాన్యం, భూమిశిస్తు విధానం రకరకాలా ఉంటూ వచ్చింది. భూమి యాజమాన్యం స్థూలంగా ఈ విధంగా ఉండేదని చెప్పవచ్చును.

1) భూస్వాముల యాజమాన్యం : భూమి భూస్వామి ఆస్తి. సాగుచేసేది కౌలుదారులు, పాలేరులు, వ్యవసాయకూలీలు.

2) రైతుల యాజమాన్యం : భూమి రైతుల ఆస్తి. వారు కష్టించి సాగు చేసేవారు.

ఈ రెండు రకాల యాజమాన్యంలోగల భేదం మౌలికమైనది. అందరూ భూమికి యజమానులే అయినా, కొందరు భూమిపై కష్టించరు ; ఇతరులు కష్టిస్తారు. ఈ భేదాన్ని పాటి చక సాగుదారులనీ (Farmers), పట్టాదారులనీ (Land owners) అంద రినీ ఒకేగాటగట్టి మాట్లాడటం పరిపాటి. గ్రామీణజీవితంలో భూస్వాములు నిర్వహించిన, నిర్వహిస్తున్న పాత్రను గుర్తించకపోవటంవల్లనే ఇలా జరుగుతుంది.

భూస్వాములు తమభూమికి పట్టాదారులు; యజమానులు. సాధారణంగా తమ్ము లందరినీ షిక్మీదారులని రికార్డుచేసేవారు. వీరు పట్టాదారులు కాకున్నా వారికున్న బాధ్యత లన్నీ ఉండేవి. పట్టాదారు శిస్తు చెల్లించనప్పుడు అతని తమ్ములైన షిక్మీదారులనుంచి శిస్తు వసూలుచేసేవారు. ఈ నిబంధన భూస్వాములకన్నా సాధారణ రైతులకే హెచ్చుగా వర్తించేది. భూస్వాములు శిస్తు చెల్లించకపోతే ఆ మొత్తమంతా బకాయి పడి ఉండేది. వారికున్న పలుకుబడితో తమ శిస్తు వసూలును వాయిదా వేయించగలిగేవారు. కానీ రైతులు శిస్తు చెల్లించక తప్పేదికాదు. 'శిస్తూ, చావూ ఈ రెండూ తప్పవ'నే సామెత ఆ కాలంలో వాడుకలో ఉండేది. రైతుల్లో పట్టాదారు చెల్లించకుంటే అతని అన్న దమ్ములనుంచి శిస్తు వసూలు చేసేవారు. ఇలాంటి షిక్మీదారుకూ, కౌలుదారుగా ఉండే షిక్మీదారుకూ భేదం ఉంటుంది.

1907 లో భూమి రెవిన్యూ చట్టాన్ని ప్రకటించి దానిలో భూమి యాజమాన్యాన్ని నిర్ణయించారు.

12 సంవత్సరాలు వరుసగా భూస్వామి భూమిని సాగుచేస్తూ నిర్ణయించుకున్న కౌలుచెల్లించిన వారిని షిక్మీదారులని చట్టరీత్యా ప్రభుత్వం గుర్తించింది. కాని ఈ నిబంధన అమల్లోకి రాలేదు.

ఇదేవిధంగా 1936 లో పాలేర్ల నియామకాన్ని క్రమబద్ధం చేస్తూ ప్రభుత్వం ఒక చట్టంచేసింది. కాని ఈ చట్టం కూడా అమల్లోకి రాలేదు.

నిజాం సంస్థానంలో సాగుభూమిని సర్వేచేసి భూస్వాములకు రైతాంగానికి భూమిపై యాజమాన్యాన్ని అంగీకరించటానికి పూర్వం ప్రభుత్వం కొన్ని గ్రామాల కూటమిని వేలంవేసి హెచ్చుగా డబ్బు చెల్లించే వ్యక్తికి ఆ గ్రామాల్లో పన్నులు వసూలు చేసుకునే హక్కును ధారాదత్తం చేస్తూ ఉండేది. ప్రారంభంలో ఒకటి లేక రెండు సంవత్సరాల కొకసారి వేలంపాటపెట్టినప్పటికీ, క్రమంగా ఒకరే హెచ్చుకాలం దాకా ఆ హక్కులను అనుభవించసాగారు. ఆ వ్యక్తి చనిపోతేనో, లేక పన్నులు చెల్లించ లేకపోతేనో లేదా మరొకరు హెచ్చుగా పన్నులు (వేలంపాటలో) చెల్లించటానికి సిద్ధమైతేనో మార్పులు జరుగుతూ ఉండేవి. క్రమంగా ఈ వ్యక్తులు బలపడి ఒక్కొక్క ప్రాంతానికి అధిపతులయినారు. వంశపారంపర్యంగా వస్తూవున్న స్థానిక రాజరిక కుటుంబాలు ఈ తరగతిలో చేరలేదు. వారు సామంతరాజులుగానే ఉంటూ వచ్చారు. వారు కూడా నిజాం నవాబులకు కప్పం చెల్లించుకునేవారు. కొన్ని జాగీరులు సంస్థానాలు ఈ కోవకు చెందినవే.

ఇలాంటి వ్యక్తులనుండి కప్పాన్ని సేకరించడానికి అవసరమైన పరిపాలనా

వ్యవస్థ ఆకాలంలో ఉండేది. అవసరమైనప్పుడు యుద్ధాలలో పాల్గొనడానికినిర్ణీతసంఖ్యలో సైన్యాన్నికూడా వారు పంపవలసి ఉండేది. వీరిలో కొంతరు తమ బలాన్ని పుంజుకొని తిరుగుబాట్లుచేస్తూ ఉండేవారు. నిజాం నవాబులుకూడా తమ సైన్యాలను పంపి తిరుగుబాట్లను అణచివేసేవారు. ఇదంతా ఈ వ్యవస్థలో సహజంగా జరుగుతుంది.

ప్రభుత్వానికి చెల్లించాల్సిన మొత్తంపై (డబ్బు) ఒడంబడిక (వేలంపాటద్వారా) కుదిరిన తర్వాత ఈ వ్యక్తులకు గ్రామప్రజలనుంచి పన్నులు వసూలుచేసుకోడానికి సంపూర్ణ సర్వాధికారాలు ఉండేవి. రైతులనుండి ధాన్యం, చేతి పనులవారినుండి ఏదో రూపంలో కొంత పరిహారం తీసుకునేవారు. క్రమంగా వీరంతా పెద్ద దోపిడీదారులై ప్రజలను పీడించేవారు. వీరు గ్రామ పరిపాలననంతటినీ సాగిస్తూ ఉండేవారు. వీరు సాగించే దౌర్జన్యాలకుకూడా అంతులేకుండా ఉండేది. వారివారి హోదానుబట్టి కొందరికి న్యాయవిచారణ తీర్పులపేరుతో మరణ శిక్షలు కూడా విధించడానికి అధికారాలుండేవి.[6]

రైతులు సాగుచేసే భూమి విస్తీర్ణాన్ని నిర్ణయించడానికి ప్రాచీన కాలపు పద్ధతులను అనుసరించేవారు. రైతు ఒక జత పశువులతో సాగుచేయగలిగిన భూమిపై ధాన్య రూపంలో శిస్తు నిర్ణయించేవారు. బలాఢ్యుడైన రైతు బలమైన పశువుల జతతో హెచ్చు భూమిని దున్నగలుగుతాడు. బలహీనుడు బక్క పశువులతో తక్కువ భూమిని దున్నగలుగుతాడు. భూమి స్వభావాన్నిబట్టి కూడా దున్నగలిగిన భూమిలో హెచ్చుతగ్గులుంటాయి[7]. తర్వాత కాలంలో బిగాల[8] పేరుతో విస్తీర్ణాన్ని నిర్ణయించేవారు. ఈ పద్ధతి సర్వే సెటిల్‌మెంటుకు పూర్వం అమల్లో ఉన్నది. దీనికి చేతి కొలతలనే ఉపయోగించేవారు. సర్వే సెటిల్‌మెంటు జరుపుటతో భూమి విస్తీర్ణాన్ని ఒక క్రమ పద్ధతిలో నిర్ణయించగలిగారు. దీనిని పూర్తిచేయటానికి ప్రభుత్వానికి కొంతకాలంపట్టింది.

సర్వే సెటిల్‌మెంటు సమయంలో సామంతరాజులుగా తయారైన మధ్య దళారీలతో ప్రభుత్వం రాజీపడింది. వీరికి పెద్దమొత్తంలో భూమిపై యాజమాన్యపు హక్కును ఇవ్వటానికి అంగీకరించింది. కొంత భూమిపై శిస్తును తగ్గించి, లేదా శిస్తు లేకుండానే పట్టా హక్కులను ఇచ్చివేసింది. ఈ భూములను సేరీ సావరాలనేవారు. ఇదిగాక వారు ప్రభుత్వానికి చెల్లించే పన్నులోని 10, 7.5, 5 శాతాన్ని "రుసుం" పేరిట ఇవ్వటానికి అంగీకరించింది. వీరే దేశముఖులు, దేశపాండ్యాలుగా ప్రసిద్ధిపొందినారు[9]. ఈ "రుసుం" (గౌరవ వేతనం) వారి హోదాను తెలుపుతుందేగాని వారికి చట్టరీత్యా గ్రామాలపైన అధికారాలేమీ సంక్రమించలేదు. జాగీర్దార్లు, మక్తాదార్లుకూడా దేశముఖులు, దేశపాండ్యాలుగా ఉండేవారు. వారికి ఈ హోదాతో ఇతర గ్రామాల్లో భూములుండేవి. ఇదే విధంగా సర్ఫేఖాసు జాగీరు ప్రాంతాల్లోకూడా జాగీర్దారులు కాని దేశముఖులు, దేశ పాండ్యాలు ఉండేవారు.

సర్వే సెటిల్మెంటు ఫలితంగా భూస్వాములకే గాక రైతాంగానికి కూడా కొంత భూమిపై యాజమాన్యపు హక్కు దొరికింది. కులాలవారీగానూ, చేతివృత్తులవారికీ[10] కూడా ఇనాముల రూపంలో భూమి సంక్రమించింది. వీరంతా పూర్వం నుంచీ ఈ భూమిని సాగుచేసినవారే[11].

కరువుకాటకాల వలన భూస్వాముల వెట్టిచాకిరీ, ఇతర దోపిడీలను భరించలేక చేతిపనులవారు తరచుగా గ్రామాలను వదిలివెళ్ళేవారు. స్వయంపోషక గ్రామీణ వ్యవస్థలో వీరిపాత్ర చాలా ముఖ్యమైనది. సాంప్రదాయసిద్ధమైన జీవితం గడిపేవారికి వీరి అవసరం హెచ్చుగానే ఉంటుంది. భూస్వాములకు, కాయకష్టంచేయని ఇతరకులాల వారికి (బ్రాహ్మణులు, వైశ్యులు) వీరి అవసరాన్నిగూర్చి చెప్పనవసరమేలేదు. వీరు ఇతరప్రాంతాలకు వలసపోకుండా గ్రామంలోనే ఉండిపోవటానికి వీలుగా భూమి వసతిని కలిగించి ఒకమేరకు రైతులుగా మార్చారు. ఇతరకులాల, వృత్తులవారి పరిస్థితి కూడా ఇంతే. ఈ పరిణామంతో వీరిలో చాలామంది గ్రామాలను వదిలిపోకుండా మిగిలినారు. అప్పటికీ పెద్దకరువులు దాపురించినప్పుడు రైతులతో సహా గ్రామీణ ప్రజల్లో అత్యధికులు నీటిఆధారం ఉన్న ప్రాంతాలకు వలసవెళ్ళేవారు. సర్వే సెటిల్మెంటు ఫలితంగా వీరందరికీ భూమిపైన యాజమాన్యపు హక్కు దొరికినంతమాత్రాన కరువు కాటకాలు లేకుండా పోలేదుకదా! ప్రజలు పూర్తిగా వదిలివెళ్ళిన ఇలాంటిగ్రామాలను 'బేచిరాగు'[12] లనేవారు.

పెద్దగ్రామాలు, చిరకాలంగా నివాసయోగ్యంగా ఉన్న గ్రామాలన్నీ నదీతీరాననో పెద్ద చెరువులకు అందుబాటులోనో ఉన్నవి. ఇక్కడి ప్రజలు కరువుకాటకాలను తట్టుకొని మనగలిగేవారు.

సర్వే సెటిల్మెంటు ఫలితంగా రైతులు అంతవరకూ ధాన్యరూపంలో చెల్లిస్తున్న భూమి శిస్తును డబ్బురూపంలో చెల్లించవలసి వచ్చింది. అంతకుముందు ప్రధానంగా వస్తువుల మార్పిడి పద్ధతి అమల్లోఉండేది[18]. అప్పుడు రైతులకు తమ పంటలను డబ్బు రూపంలో విలువగట్టి అమ్ముకోవలసిన అవసరం కలుగలేదు. కానీ భూమిపన్ను విధానంతో వచ్చిన మార్పుతో రైతుల ఆర్థికజీవితం అస్తవ్యస్తమైంది. సాధారణ రైతులకు కుటుంబ అవసరాలకుపోను మిగిలేపంట చాలాతక్కువ. అనేక సందర్భాలలో మిగులు కూడా ఉండదు. అమ్ముకొని డబ్బు తెచ్చుకోవడానికి మార్కెటు సౌకర్యాలు లేవు. దీనిఫలితంగా వారు కొత్తగా ఏర్పడిన విధానాన్ని అనుసరించి డబ్బురూపేణా శిస్తులు చెల్లించలేకపోయినారు; శిస్తుల బకాయీలు పేరుకొనిపోయినవి. ఈ అవకాశాన్ని ఉపయోగించుకొని భూస్వాములు (దేశముఖులు, పటేలు పట్వారీలు) ఆ బకాయీలను

చెల్లించి భూమికి యజమానులైనారు. కొందరు ప్రభుత్వంపై తమకున్న పలుకుబడిని ఉపయోగించి శిస్తులను కూడా చెల్లించక లక్షల రూపాయలు బాకీపడి (బకాయిలు) కొంతకాలానికి ఆ మొత్తాలను మాఫీ చేయించుకోగలిగారు.[14]

కొందరు భూస్వాములు రైతులకు యాజమాన్యం సంక్రమించవలసిన భూములను వారికి తెలియకుండానే తమపేర పట్టా చేయించుకున్నారు. రైతులు ఎప్పటి మాదిరిగానే ధాన్యరూపంలో శిస్తు చెల్లించేవారు. భూస్వాములు వాటిని వసూలుచేసుకొని అనుభవించే వారు. క్రమంగా వారిని కౌలుదార్లుగా మార్చారు. కరువుకాటకాల సమయంలో రైతులు గ్రామంనుంచి వెళ్ళిపోయినప్పుడు వారి భూములను స్వాధీనంచేసుకునేవారు.

భూస్వాములకే భూమి యాజమాన్యం కట్టబెడితే శిస్తులు సులభంగా వసూలు అవుతాయని, ఆదాయం పెరుగుతుందని వారికి పట్టాలివ్వడానికి ప్రభుత్వం వెనుకాడలేదు. కాగా ప్రోత్సహించింది కూడా. దీనికోసం అవసరమైన నిబంధనలను ప్రభుత్వం రూపొందించింది. మందుముల నరసింగరావుగారు స్వానుభవముతో ఈ విధంగా తెలుపు తున్నారు: "ఈ పరిస్థితుల్లో ఆకాలపు ప్రభుత్వంవారు 1907 కు సరియగు 1318 ఫసలీ సంవత్సరంలో "భూముల నవీన సేద్యపుచట్టం" ద్వారా రైతులకు కొన్నిహక్కుల నిచ్చి పట్టాలపైన భూములు తీసుకొనడానికి ప్రోత్సహించినారు. బావులు త్రవ్వించుకొని మాగాణి సేద్యం చేసినచో మెట్టశిస్తే తీసుకొనబడునని, మరియు సేద్యానికి తేవడానికి అట్టి భూముల్లో నుండే కలప నరికి లాభం పొందవచ్చునని ఉత్తరువులు చేసినారు. ఈ విధంగా ప్రోత్సహించినందువలన చాలామట్టుకు భూమి సేద్యంలోకి వచ్చేసింది. ఈ క్రొత్త రూల్సుననుసరించి కరణాలు మాలిపటేండ్లు భూములు నవీనంగా సేద్యంపైన తీసుకున్నారు". (50 సంవత్సరముల హైదరాబాదు–పేజి–17).

ఈ రూల్సును కూడా దేశముఖులు, కరణాలు, మునసబులు (పటేండ్లు) ఉపయోగించుకున్నారు. అదనపు భూములను సాగులోకితెచ్చి భూమి పరిమితిని పెంచుకున్నారు. భూమిలోని కలపను అమ్ముకొని లాభపడినారు. రైతులు కూడా లాభపడటానికి అవకాశమున్నప్పటికీ ఉపయోగించుకోగలిగినవారు చాలా స్వల్పం.

ఇజారా బంజర్లు: గ్రామీణ ప్రాంతాలన్నీ అడవులమయమై ఉండుటవలన, చిట్టడవులను నరికించి, సేద్యంచేయించి తన ఆదాయాన్ని పెంచుకోడానికి ప్రభుత్వం బంజర్లను 'ఇజారా' (కంట్రాక్టు) ద్వారా సాగుచేసే పద్ధతిని ప్రవేశపెట్టింది. దీనిననుసరించి భూస్వాములు నిర్ణీత విస్తీర్ణంగల భూమిని–500 లేక 1000 ఎకరాలు–సాగులోకి తెచ్చే బాధ్యతను తీసుకోవాలి. చెరువులను, కుంటలను (చిన్న చెరువులను) నిర్మించి మాగాణి సాగుచేయించాలి. ఈ భూమిని సాగుచేసేవారితో ఒక గ్రామాన్ని ఏర్పరుచాలి. ఇదంతా

ఒక నిర్ణీత సమయంలో-25, 30, 50 సంవత్సరాలు-జరిగిపోవాలి. ఈ ఏర్పాట్ల ప్రకారంగా అంతా జరిగి నిర్ణీతకాలం పూర్తయిన తర్వాత భూస్వాములకు నాల్గవభాగం వరకు భూమిపై శిస్తులేకుండా యాజమాన్యం ఇచ్చేవారు. తక్కిన భూమిపై మామూలు శిస్తురేట్లను విధించేవారు. ఈ భూములన్నీ రైతులు సాగుచేసినప్పటికీ యాజమాన్యం భూస్వాములకే చెందేది. యాజమాన్యంలో ఉన్న భూమిని అనుసరించి వారి హోదా కూడా పెరుగుతూ ఉండేది. ఇలాంటి గ్రామాలు సుమారు 400 ఉండేవి.

ఈ విధంగా దేశముఖులు, పటేలు పట్వారీలు, ఈ శ్రేణికి చెందని ఇతర భూస్వాములు భూముల్లో హెచ్చుభాగాన్ని ఆక్రమించుకున్నారు. ఈ భూమి కేంద్రీ కరణకు దారితీసిన పరిణామాలు ఇవి :

1) ప్రభుత్వం సామంతుల నుంచి లేదా వారితో సమానమైన ఇతర పెద్దల నుంచి పన్నులు వసూలుచేసే హక్కునూ (ప్రధానంగా ధాన్యరూపంలో), గ్రామాలపై సంపూర్ణ సర్వాధికారాలు చలాయించే హక్కులనూ స్వాధీనంచేసుకున్నప్పుడు-భూమిని సర్వే సెటిల్మెంటు చేయించి గ్రామస్థాయివరకు తన పరిపాలనా యంత్రాంగాన్ని విస్తరించినప్పుడు-పెద్ద భూఖండాలపై వారి యాజమాన్యాన్ని అంగీకరించింది. గ్రామా ల్లోని అతిసారవంతమైన భూములన్నీ వారికే కట్టబెట్టింది.

2) సర్వే సెటిల్మెంటు సందర్భంలో అధికారులకు తోడ్పడినవారు వీరే కావడం మూలాన, ఉభయులూ లాలూచీపడి సాధారణ రైతుల సాగులోఉన్న భూములపై యాజమాన్యాన్ని (పట్టాహక్కులను) సంపాదించగలిగారు.

3) కరువుకాటకాలవలన, డబ్బు రూపేణా శిస్తులు చెల్లించలేకపోవుటవలన సాధారణ రైతుల భూములన్నిటిపైనా వీరు యాజమాన్యాన్ని సంపాదించగలిగారు.

4) సాగుకు ఉపయోగపడే బంజరు భూములను ఇజారా పద్ధతిపై రైతులద్వారా సాగుచేయించి ఆ భూములపై యాజమాన్యాన్ని సంపాదించగలిగారు.

5) పరిపాలనా యంత్రాంగంలో కీలకస్థానాల్లో ఉంటూ తమ అధికారాన్ని ఉపయోగించుకొని పెద్దపెద్ద భూఖండాలపై యాజమాన్యాన్ని సంపాదించారు.

ఇలాంటి భూస్వాములు సర్ఫేఖాసు, సంస్థానాలు, జాగీరు, మక్తా ప్రాంతాల్లో ఉన్నారని ఇదివరకే వివరించాము. నిజాం నవాబుతో సహా తక్కినవారంతా (సంస్థానా ధీశులు, జాగీర్దారులు, మక్తాదారులు, అగ్రహారీకులు) పెద్ద భూస్వాములేనని గుర్తుంచు కుంటే తెలంగాణా ప్రాంతమంతా భూస్వాముల మయమేనని స్పష్టమవుతుంది. అంత మాత్రాన భూమి అంతటికీ భూస్వాములే యజమానులయిపోయారనుకోకూడదు. స్థూలంగా యాజమాన్యం ఈ క్రింది విధంగా ఉండేది.

1) ఒక గ్రామంలోని భూమి అంతటిపైన ఒకే భూస్వామి కుటుంబానికి యాజమాన్యం ఉండేది. కొన్ని సందర్భాల్లో ఇద్దరో ముగ్గురో భూస్వాముల కుటుంబాల వారు యజమానులుగా ఉండేవారు. ఇలాంటి గ్రామాల్లో పనిపాటలవారికి (చాకలి = రజక; మంగలి = నాయీ బ్రాహ్మణులు; మాదిగ = చర్మకారులు మొదలగువారు) కొంత భూమిపై అమ్ముకునే హక్కులేని యాజమాన్యపు (ఇనాము) హక్కు ఉండేది. ఇలాంటి గ్రామాలు హెచ్చుసంఖ్యలో కూడా ఉండేవి.

2) గ్రామాల్లో తరచుగా 50 నుంచి 75 శాతంవరకు భూమిపై భూస్వాములే యజమానులుగా ఉండేవారు. మిగిలిన 50 శాతం నుంచి 25 శాతంవరకు భూమిపై రైతులే యజమానులు. వీరిలో ధనిక, మధ్య, పేదతరగతి రైతులంతా ఉండేవారు. ఈ విధంగా హెచ్చుభూమి కొద్దికుటుంబాల భూస్వాముల చేతుల్లో ఉండేది. దీనికి విరుద్ధంగా హెచ్చుకుటుంబాల (సామాన్య రైతుల) చేతుల్లో కొద్దిపాటి భూమి ఉండేది.

3) కొన్ని గ్రామాల్లో భూస్వాముల యాజమాన్యంలో ఉండే భూమి శాతం కొంత తక్కువగానే (25 శాతం నుంచి 30 శాతం వరకు) ఉండేది. మిగతా భూమికి ధనిక, మధ్య, పేదతరగతి రైతులు యజమానులుగా ఉండేవారు.

4) మరికొన్ని గ్రామాల్లో భూస్వాములు వారసత్వంగా మాత్రమే మిగిలి ఉండేవారు. ఆర్థికంగా దివాలాతీసి, తమ భూములను క్రమంగా అమ్మకొని సామాన్య జీవితం గడుపుతూ ఉండేవారు. ఇలాంటి గ్రామాల్లో ఇతర భూస్వాముల స్వాధీనంలో తగినంతగా భూమి ఉండేది.

భూమి కేంద్రీకరణకు సంబంధించిన వివరాలు ప్రభుత్వం ఎప్పుడూ ప్రకటించ లేదు. వీటిని బయటపెట్టటానికే భయపడుతూ ఉండేదని స్పష్టమవుతుంది. అయినా 1950-51 లో ప్రభుత్వం వేరే సందర్భంలో ఉదహరించిన వివరాలను బట్టి 500 ఎక రాలకు మించిన పట్టాలు నల్లగొండ జిల్లాలో 252, మహబూబునగరు జిల్లాలో 144, వరంగల్లు జిల్లాలో 155 వరకు ఉన్నవి. ఈ అంకెలు భూమి కేంద్రీకరణ లేదని చెప్ప టానికి కూడా ఉపయోగించవచ్చును. 500 ఎకరాలకు మించిన పట్టాలని చెపుతున్నారే గాని మించిన భూమి ఎంత అని చెప్పటంలేదు ప్రభుత్వం. ఆ భూమి 10వేల ఎకరాలు కావచ్చును. 50 వేల ఎకరాలు కూడా కావచ్చును. వాస్తవమేమంటే ఆయా జిల్లాలలో పెద్ద భూస్వాముల సంఖ్యకు ఇచ్చట ఉదహరించిన పట్టాలసంఖ్య దగ్గరగా ఉంటుంది.

తెలంగాణాలో పడావా ఉన్న పట్టాభూమి 41 లక్షల 37వేల ఎకరాలు ఉన్నట్టు ప్రభుత్వపు లెక్కలే చెబుతున్నాయి. ధనిక రైతులు పశువుల మేపుకోసం పడావా పెట్టిన భూమిని దీనినుంచి మినహాయిస్తే సుమారు 40 లక్షల ఎకరాలు భూస్వాములు పడావా

పెట్టినదే. ఈ భూములు వారి పచ్చికబయళ్ళు. రైతుల పశువులను మేపుకోనిచ్చి వారి నుంచి డబ్బు వసూలుచేసి, ఆ భూమిని సాగుచేస్తే వచ్చే పంటకన్నా హెచ్చు ఆదాయాన్ని సంపాదించేవారు. లక్షల ఎకరాల పడావు భూమి భూమికేంద్రీకరణకు మరొక ఉదాహరణ.

## 5. భూమి శిస్తు విధానం

ప్రభుత్వ ఖజానాకు అత్యధికమైన ఆదాయాన్ని రాబట్టటమే భూమి శిస్తును నిర్ణయించే ప్రధాన సూత్రం. దీనికి సంబంధించిన నిబంధనలు అనేక చిక్కులతో కూడి ఉండటంవలన పటేలు పట్వారీల, పై అధికారుల దయాదాక్షిణ్యాలకు లోనై రైతులు శిస్తులు చెల్లించేవారు.

మెట్టభూమి : మెట్ట భూమిపై శిస్తు దాదాపు ఒకే విధంగా ఉండేది. సారవంతమైన నేలకు హెచ్చుగాను, సారహీనమైన నేలకు తక్కువగాను ఉండేది. తరచుగా సారహీనమైన నేలను సారవంతమైనదానికింద లెక్కగట్టి హెచ్చు శిస్తును నిర్ణయించేవారు. రైతులు కష్టించి భూసారాన్ని పెంచినా శిస్తును హెచ్చించవలసిందే. నల్లరేగడి భూముల రేటు హెచ్చుగా ఉండేది. ఎన్నిపంటలు వేసినా సంవత్సరమంతటికీ ఒకే శిస్తు.

మాగాణి భూమి : దీనిపై శిస్తు నిర్ణయించిన విధానం రైతులను అనేక ఇబ్బందులపాలు చేసింది.

1. చెరువులకింది మాగాణిపై రెండు పంటలకూ రెండు విధాల శిస్తు నిర్ణయించారు. మొదటి పంట (వానాకాలం = ఆబి = సారువా- ఇప్పుడు ఖరీఫు అని అంటున్నారు.) శిస్తులో సగం రెండవ పంట శిస్తు ఉండేది. చెరువులో నీరుంటే సాగుచేసినా చేయకున్నా శిస్తు చెల్లించితీరవలసిందే. వర్షాకాలపు చివరన వచ్చే మఖకార్తెను (ఆగస్టు 15 ప్రాంతం) చివరి గడువుగా నిర్ణయించినా చెరువులోకి నీళ్ళువస్తే చాలు, సాగుచేసినా చేయకున్నా పట్టాదారు శిస్తు చెల్లించాల్సిందే. చివరి రోజుల్లో సాగుచేసిన భూమిలో పంట తక్కువ. అప్పటికప్పుడు సాగుపని పూర్తికావటం అసాధ్యం. చెరువులలో అత్యధికభాగం చిన్నవి. కుంటలు అంతకన్నా చిన్నవి. ఒక కారు పంట పండాలంటే అవి నాలుగైదుసార్లు నిండాలి. బావులు ఉంటేనే పంటలు పండేవి. ఆ స్థితిలో నిబంధనలమేరకు పట్టాదారులంతా శిస్తులు చెల్లించవలసివచ్చేది.

రెండవ పంట (వేసంగి = తాబి = దాళవా- ఇప్పుడు రబీ అని అంటున్నారు) మొదటిపంట సాగుచేసిన భూమి అంతటినీ రెండవ పంటకు సాగుచేయరు. నీటి సప్లయిని

బట్టి మూడవవంతు లేదా నాలుగవ వంతు భూమినీ రెండవ పంట భూమి అని ఖరారు చేసేవారు. ఏ సంవత్సరానికా సంవత్సరం చెరువులోని నీటి నిలువనుబట్టి ఈ భూమిని నిర్ణయించేవారు. దీనిని "తహబందీ"[15]అనేవారు. భూస్వాముల భూములముందే ఉండుట వలన రెండవ పంట నీటిలో హెచ్చుభాగం వారి మాగాణికే అందేది. భూస్వాముల అనుగ్రహానికి పాత్రులైన ధనిక రైతులకు అవకాశం ఉండేది. సాధారణ రైతులంతా బావుల కింద రెండవ పంటను సాగుచేసుకునేవారు. చెరువునిండా నీరుంటే కొన్ని రోజులవరకు నీరు అందేది.

2. బావుల కింద సాగయ్యే భూములు (జేరు బావులీ) : తెలంగాణాలో బావులు ప్రధానమైన జలాధారాలు. ఇవి ఈనాడే కాదు ; పురాతనకాలంనుంచీ ఉపయోగ పడుతున్నాయి. ఇవి నాలుగు విధాలు.

1. 1905 నాటికే ఉన్న బావులు. సెటిల్మెంటుకు పూర్వం తవ్విన బావులు. వీటిని పాతబావులనేవారు (కదీం బావులీ). ప్రతి బావికింద దాని నీటి సప్లయినిబట్టి కొన్ని ఎకరాల భూమిని మాగాణి అని నిర్ణయించేవారు. ఇది నాలుగునుంచి పది ఎకరాలదాకా ఉండవచ్చును. ఇలాంటి భూముల్లో వరిపంటతోబాటు పుగాకు, మిర్చిలాంటి వ్యాపార పంటలుకూడా పండించేవారు. ఈ భూమిపై చెరువుకింద మాగాణి రేటులో సగమూ లేక అంతకన్నా హెచ్చుగా (మూడింట రెండు వంతులు) వసూలు చేసేవారు. తరచుగా ఇది చెరువుకింది మాగాణి రేటుతో సమానంగా ఉండేది.

2. సమిష్టి జలాధారం (ముష్తరికా జరియా) : భూమికి బావి ఆధారంతో బాటు చెరువునీటి ఆధారం ఉన్నప్పుడు ఈ రెండింటిని కలిపి సమిష్టి జలాధారంగల భూమి అని నిర్వచించేవారు. చెరువులో నీరుంటే చెరువు నీటి రేటునూ, నీరు లేకుంటే బావి రేటునూ వసూలుచేసేవారు.

3. కాలీ బావులు : భూమి యజమాని ప్రభుత్వపు అనుమతితో తన స్వంత ఖర్చుతో బావిని తవ్వుకొని మాగాణిని సాగుచేస్తే 15 సంవత్సరాల వరకు మెట్టశిస్తు, తర్వాత 15 సంవత్సరాలు దానికి రెట్టింపు తీసుకొని 30 సంవత్సరాల తర్వాత పాత బావుల మాగాణిరేటు వసూలుచేసేవారు.

4. 1905 తర్వాత తవ్వుకున్న బావులకింది భూమిపై మెట్టభూమి రేటునే వసూలుచేసేవారు.

3. సాగు చేయకున్నా శిస్తులు : ఏవో కొన్ని అవాంతరాలవలన చెరువులకింది భూమిని, బావికింది (జేరు బావులీ) భూమిని సాగుచేయకున్నా భూమి యజమానులు శిస్తులు చెల్లించుకోవలసిందే. చెరువు ఆయకట్టులో మెరక భూమికి (ఎత్తున

ఉన్న భూమి) కాలువఉండేదికాదు. లేదా తరుణం మించినతర్వాత నీరు రావటంవల్ల సాగు చేయటం అసాధ్యమయ్యేది. ఇదేవిధంగా పాతకాలపు బావులు పూడిపోవడంవల్లనో, మరో కారణంవల్లనో నిరుపయోగమైనప్పుడు భూమిని సాగుచేయటంఅసాధ్యమయ్యేది. అయినా ప్రభుత్వం శిస్తులు వసూలుచేసేది. దీనిని 'బిలా వర్ఘూ పడావా' (ఏ కారణంలేకనే బీడు పెట్టటం) అనేవారు.

4. చెరువు నీరు పంటకాలమంతా అందకున్నా ప్రభుత్వం శిస్తులు వసూలుచేసేది. పంటలు బొత్తిగా ఎండిపోయినప్పుడు అరుదుగా శిస్తులు మాఫీ అయ్యేవి. ఏ కొద్ది పంట పండినా శిస్తులు తప్పక పోయేవి. మహబూబునగరు జిల్లాలోని ఈ క్రింది సంఘటనను ఉదాహరణగా చూపవచ్చును.

"బిలకల్లు అను గ్రామములో రుసులు చెఱువు అను గొప్ప చెఱువు కలదు. ఇది పర్వత ప్రాంతములలో ఉన్నది. వానాకాలములో ఈ చెఱువు నీటివలన శీత జ్వరములకు భయపడి అక్కడ దున్నేటట్లు లేదు. ఇదివరకు చాలామంది ఈ శీత జ్వరముల వాతబడి మరణించిరి. పండినపంట వచ్చిన రోగములకు మందుకు సరిపోవును. సర్కారీ రకములకు మరెక్కడినుంచియైనను తెచ్చి కట్టవలసిందే.

"ఇటువంటి చెరువుకు గిర్దావరుగారును, పట్వారిగారుసు కలిసి ఆలోచించి "1800 రూ॥ల రకము బిలావర్ఘూపడావ" పెట్టినారు. ఈ భయముతో అనేకులు వేసంగి మొత్తము పొలము దున్ని రోగముపాలైరి. అందు కొంతమంది మరణించిరి. వేసంగి పండిన పంటలు సర్కారీ రకములకు సరిపోక ఇదివరకు పెద్దలు సంపాదించి పెట్టిన వస్తువులనమ్మి రకములు కట్టబడెను." (గోలకొండ పత్రిక 19-8-1935)

5. పర్రె కాలువలు, యాతాలు : తెలంగాణాలో ఎండిపోయిన ఏరులు, వాగులు చాలా ఉన్నాయి. వాటిలోని ఇసుకను తవ్వి, కాలువను తీసి ఊటతో మాగాణి సాగుచేసేవారు. ఇలా సాగుచేసిన భూమిపై మాగాణి శిస్తును తీసుకునేవారు. ఇదంతా రైతుల శ్రమ. ప్రభుత్వానికేమీ ప్రమేయంలేదు. అయినా శిస్తును చెల్లించాలి.

లోతున ఉన్న నీటిని ఇద్దరు మనుష్యులు తొట్టిసాయంతో నీళ్ళతోడి భూమికి నీళ్ళుపెట్టేవారు. దీనిని యాతం అంటారు. ఈ పద్ధతులు ఇప్పటికీ ఆంధ్రప్రదేశ్‌లోని వివిధ ప్రాంతాల్లో అమలులో ఉన్నవి. ఆ కాలపు తెలంగాణాలో యాతంతో సాగయ్యే భూమిపై మాగాణి శిస్తు వసూలు చేసేవారు.

6) భూస్వాములు-పన్నుల భారం : గ్రామీణ ప్రాంతాల్లో నాలుగింట మూడు వంతుల భూమి భూస్వాములకే ఉండుటవలన, భూస్వాములకు కూడా రైతుల మాదిరి గానే పన్నులభారం ఉండేది. హెచ్చు ఆదాయాలు కలిగిన భూస్వాములు ఈ పన్నులను

సులభంగా చెల్లించేవారు. తమ అధికారహోదాలైన పటేలుపట్వారీగిరీలను ఉపయోగించి పన్నులభారాన్ని తగ్గించుకునేవారు. కానీ సాధారణ రైతులు ఈ భారాన్ని మోయలేక కుంగిపోయారు. పేదలు భూములను అమ్ముకున్నారు.

ఈ పన్నులను మాఫీచేయాలని కోరినవారిలో భూస్వాములే ముందున్నారు. ఆంధ్ర మహాసభలో తెలంగాణా రైతు సమస్యలపై, జాగీరు రైతు సమస్యలపై తీర్మానాలు చేసారు. తర్వాత కాలంలో బావులక్రింది పన్ను, పర్రెకాలువలు, యాతం మొదలగు వాటిపై పన్నులు మాఫీ అయినవి. వాటివలన రైతులతోపాటు భూస్వాములు కూడా లాభపడినారు.

## 6. జలాధారాలు

భూసారం, నీటి వనరులకు భూమి సాగువిధానానికి కొంత సంబంధం ఉంటూ వచ్చింది.

భూస్వాములు సారవంతమై, నీటివనరులు సంతృప్తికరంగా ఉన్న భూములనే పాలేళ్ళ ద్వారా సాగుచేసేవారు. వీటిలో హెచ్చుభాగం మాగాణి, మెట్టభూమిలో కొంత భాగం పచ్చికబీళ్ళుగా ఉండేవి. అప్పటికీ మిగిలిపోయిన మాగాణిని, మెట్టభూమిని కౌలు దారుల ద్వారా సాగుచేయించేవారు.

పెద్దచెరువులు నిండటానికి తగినంత నీటిప్రవాహం ఉన్న గ్రామాల్లో దేశముఖులో, ఇతర పెద్దభూస్వాములో ఉండేవారు. నీటిప్రవాహం చాలినంతగాలేని చిన్న చెరువులు (కుంటలు) ఉన్నచోట చిన్నభూస్వాములు ఉండేవారు. నదులు, వాగులవంటి నీటివనరులనుంచి కాలువలు తవ్వి వాటినుంచి వచ్చే నీటితో (జాలుతో) భూస్వాములతో సహా రైతులంతా మాగాణి సాగుచేసుకునేవారు. ఇవిగాక తెలంగాణా అంతటా విస్తారంగా బావులకింద సాగుచేసే విధానం పురాతనకాలంనుంచీ అమల్లోఉంది. ఒక్కొక్క గ్రామంలోని జనాభా, భూమి స్వభావాన్ని అనుసరించి 20, 30, 50, 100 సంఖ్యలో బావులు ఉండటమేగాక వాటి సాయంతో మాగాణి సాగవుతూ ఉంటుంది.

ప్రాచీనకాలపు పెద్ద జలాధారాలు తగిన సంఖ్యలో ఉన్నవి. వరంగల్లు జిల్లాలోని పాకాల, లక్నవరం, రామప్పలాంటి చెరువులు చరిత్రప్రసిద్ధమైనవి. ఇవి కాకతీయ రాజుల కాలంలో నిర్మించినవి. ఇవి ఆకాలపు సాంకేతిక పరిజ్ఞానానికి ప్రతిబింబాలని నిస్సందేహంగా చెప్పవచ్చును. అయినా వేలాది శ్రమజీవుల కష్టఫలితమే ఈ చెరువుల నిర్మాణమనే అంశాన్ని మనం మరువకూడదు. తెలంగాణా అంతటా చిన్నవీ, పెద్దవీ

అన్నీ కలిపి సుమారు 20 వేలవరకు పాతకాలపు చెరువులు, కుంటలు ఉన్నవి. నిజాం నవాబు కాలంలో ప్రభుత్వం కొన్ని పెద్ద జలాధారాలను నిర్మించింది. వాటిలో నిజాం సాగరు (నిజామాబాదు జిల్లా) ముఖ్యమైనది. పాలేరు, వైరా (నేటి ఖమ్మం జిల్లా), దిండి (నల్లగొండ), కోయిలసాగర్, సరళాసాగర్ (మహబూబునగరం) మొదలైనవి చిన్నవే అయినప్పటికీ ఈ కోవకు చెందినవే. ఇదేవిధంగా మంజీరా (గోదావరి), మూసీ (కృష్ణా) ఉపనదులకు కాలువలు తవ్వి మెట్టభూమిని కొంతవరకు మాగాణిగా మార్చగలిగింది. తుంగభద్ర ఆనాటి మద్రాసు ప్రభుత్వంతో కలిసి నిర్మించిన సమిష్టి ప్రాజెక్టు.

పెద్ద జలాధారాల సాయంతో సాగుకావలసిన భూమి అంతా చాలాకాలం దాకా సాగుకాలేదు. స్థానిక భూస్వాములు, రైతులు తమకు అందినంతవరకు సాగుచేసారు. ఈ భూముల్లో హెచ్చుభాగంపై పట్టణాల్లో ఉండే భూస్వాములకూ, ఉన్నతాధికారులకూ సంపన్నవర్గాలకూ యాజమాన్యపు హక్కు (పట్టా హక్కు) ఉండేది. (ఇప్పటికీ ఈ స్థితి ఒకమేరకైనా కొనసాగుతున్నది.) ఈ భూస్వాముల్లో హెచ్చుమందికి తమకు ఎంతభూమి ఉందనే సంగతి మాత్రమే తెలిసేది. కాని ఆ భూమి ఎక్కడుంది ? దాని సరిహద్దు లెక్కడ ? అనే అంశంమాత్రం తెలియకపోయేది. తాము పెద్ద భూస్వాములని అనిపించు కోవటం, దానికి సంబంధించిన హోదాను అనుభవించడమే వారికి కావలసినది. దాని తర్వాతనే ఆదాయపు సమస్య ఉత్పన్నమయ్యేది. స్థానికంగా ఉండే పటేలు పట్వారీలు (మున్సబులు, కరణాలు) వీరికి ఏజెంట్లుగా ఉంటూ, తమకు అందుబాటులో ఉన్న రైతులతో సాగుచేయించి వారినుంచి కౌలును (దీనిని మునాఫా అని కూడా అంటారు. మునాఫా అంటే లాభం) ధాన్యం రూపంలోనో, డబ్బు రూపంలోనో వసూలుచేసుకొని, దానిలోని కొంతభాగాన్ని తమజేబులో వేసుకొని మిగతాభాగాన్ని పట్టణాల్లో ఉన్న భూస్వాములకు చెల్లించేవారు. భూమిలో హెచ్చుభాగం క్రమంగా సాగవుతూవచ్చింది. నేడు సాగవుతున్న భూమి అంతా స్థానిక రైతులు సాగులోకి తెచ్చిందే. వీరిలో మధ్యతరగతి పేదరైతులే హెచ్చుగా ఉన్నారు. ఈ ప్రాంతమంతా దట్టమైన అడవులు, కొండలతో నిండి ఉండుట వలన ప్రజలు మలేరియా వ్యాధిగ్రస్తులై ఉండేవారు. కొందరు చనిపోవటం సహజం. ఇలాంటివారిలో గిరిజనులే హెచ్చుసంఖ్యలో ఉండేవారు.

నిజాం సాగరువంటి పెద్ద జలాధారాల వలన స్థానిక భూస్వాములు హెచ్చుగా లాభపడినప్పటికీ, వారూ, స్థానిక రైతులు ఆభూమిని (ఆయకట్టు) సాగుచేయలేక పోయారు. ప్రభుత్వం కొంత పెట్టుబడిని పెట్టి ప్రోత్సహించినప్పటికీ, వారు తమవైపు నుంచి కావలసిన పెట్టుబడిని సమకూర్చుకోలేక పోయారు. పట్టాభూములేగాక, ప్రభుత్వపు బీడు భూములు కూడా సాగుకావలసి ఉండేది. వీటన్నిటి దృష్ట్యా కృష్ణా, గుంటూరు, ఉభయ

గోదావరి జిల్లాలనుంచి అన్నితరగతుల రైతులు వలసవెళ్ళి భూములను కొనుగోలుచేసి సాగుచేశారు. భూస్వాముల నుంచి భూములుకొన్నారు. వారు తమకు కావలసిన లేదా సాగుచేయగల భూమిని అట్టిపెట్టుకొని మిగిలిన భూమిని అమ్ముకున్నారు. దీనిలో వారు కౌలుదారులను వెళ్ళగొట్టి అమ్ముకున్న భూమి కూడా ఉన్నది. ఇదిగాక ప్రభుత్వ భూములను-అవి తరచుగా భూస్వాముల స్వాధీనంలోనే ఉంటాయి-కూడా పట్టాలు చేయించుకొని సాగులోకి తెచ్చారు.

భూమిని సంపాదించాలనే ఆసక్తి, చొరవఉన్న భూస్వాములు, పెత్తందార్లు, ఉద్యోగులు ఇతర జిల్లాలనుంచి ప్రాజెక్టు ప్రాంతానికి వెళ్ళి భూమిని సంపాదించి సాగు చేశారు. సాధారణంగా సమిష్టి కుటుంబంలోని కొందరు స్వగ్రామంలోనే ఉంటూ మిగిలినవారు నిజాంసాగరు కింద సాగుచేయడానికి వెళ్ళేవారు. ఉద్యోగస్తులు తమ సంపాదనలో కొంతభాగాన్ని పెట్టుబడిగా ఉపయోగించారు.

అందుబాటులోఉన్న మైదానప్రాంతాల నుంచి-కరీంనగరు, మెదకు, హైదరాబాదు జిల్లాల నుండి-వ్యవసాయ కూలీలు వెళ్ళి కూలీపనులు చేసుకోసాగారు.

ఈ పరిస్థితి ప్రాజెక్టు ప్రాంతాలన్నిటిలో ఏర్పడింది. ప్రభుత్వం తన రెవిన్యూ ఆదాయాన్ని పెంచుకోవటానికి ఇలాంటి వలసలకు అవకాశమిచ్చింది. పరిపాలనా యంత్రాంగాన్నికూడా దీనికనుగుణ్యంగా ఏర్పాటు చేసింది.

సేద్యపు నీటి ప్రాజెక్టుల నిర్మాణంచేసి ప్రభుత్వం మాగాణి రేటును పెంచింది. 1930-35 ప్రాంతపు ధాన్యపు ధరలు తక్కువ ఉండుటవలన స్థానిక రైతులు భూమి శిస్తు చెల్లించలేకపోయేవారు. మెట్టను మాగాణి సాగుచేయటానికి పెట్టుబడిలేక కొంత భూమిని అమ్ముకునేవారు. ప్రభుత్వ మాగాణి సాగుకు స్థానిక రైతులకు సాయం చెయ్యక, వలసవచ్చినవారిపై ఆధారపడేది. జంగా హనుమయ్య చౌదరిగారు వైరా ప్రాజెక్టు రైతుల ఇబ్బందులను తెలుపుతూ రాసిన వ్యాసంలోని ఈ క్రింది భాగాలు ప్రభుత్వ వైఖరిని అర్థం చేసుకోడానికి ఉపయోగపడుతాయి :

" 'అయ్యా, ఈ శిస్తు మేము భరింపజాల'మని సుబేదారు[16] సాహెబుతోను, బంబోబస్తు నాజాం[17] సాహెబుతోనూ సోమవరపు రైతులు వైరా క్యాంపులో చెప్పు కొనగా 'మీ గ్రామము మొత్తముమీద సరాసరిన ఎకరము ఒకటికి రూ॥ 16-00 లు శిస్తు మాత్రమే విధింపబడినది. ఈ శిస్తు మీరు ఎందుకు ఇచ్చుకొనలేరు ? ఇది న్యాయ మైన శిస్తు. ఇంతకు తగ్గించుటకు వీలులేద'ని శెలవిచ్చియున్నారు. 'ఈ శిస్తు మీకు భార మైన యెడల భూమికి విడుదల ఇచ్చి లేచిపొండు. ఇతరచోట్లనుండి రైతులు వచ్చి భూమిని సాగుచేయుదురు. అంగ్రేజు[18]నుండి వలసినంతమంది రైతులు వచ్చెదరు' అని

చెప్పిరి. 'తాత తండ్రుల కాలమునుండి ఈ రాష్ట్రములో నివసించుచున్న మేము మా భూములను, ఇండ్లను వదిలివేసి ఎచ్చటికేగవలయును? మీరీ వైరా ప్రాజెక్టు కట్టినది మమ్ములనందరిని వెళ్ళగొట్టుటకేనా?' అని రైతులడిగిరి. అందుకు జవాబు రాలేదు.మాకు మునుపటి మెట్టశిస్తు భారము కాలేదు. మా భూములను మెట్టసాగు చేసుకొందుము. మీ ప్రాజెక్టులోని నీరు కోరినవారికి సప్లైచేయుడు. మాకందరికి విధిగా సప్లైచేయునెడల నీటి తీరువ మెట్టశిస్తుమీద యకరా ఒకటికి నాలుగు లేక అయిదు రూపాయలు విధింపుడు. మీరు మా ఆదాయ వ్యయములను గమనింపకుండా ఒక్క బండ మా నెత్తిపై పెట్టినచో మేము మోయజాలము. మోయుటకు మాయొద్ద బలముకూడా లేదు. దుర్భర దరిద్ర దశలో ఉన్నాము." (గోలకొండ పత్రిక : 6-4-36)

కొత్తగా విధించిన మాగాణి శిస్తు సగటున ఎకరాకు 16 రూ॥లు అని అధికారి అన్నాడే కాని వ్యాసకర్త 18 రూ॥లు ఉందని అంటున్నాడు. ఈ రేటు గిట్టుబాటుకాదని వ్యాసకర్త నిరూపించాడు కూడా. అధికారి మాటల్లో భూములను వదిలిపొమ్మని బెదిరింపు, "అంగ్రేజు" (బ్రిటిషు) ప్రాంతంవారు వచ్చి సాగుచేస్తారనే ధీమా రెండూ ఉన్నాయి. ప్రాజెక్టులక్రింద మాగాణి సాగుకావడానికి ప్రభుత్వం ఆధారపడింది వలస వచ్చే వారిమీద, స్థానిక భూస్వాములమీద, ధనిక రైతులమీద.

వరంగల్ జిల్లాలో సుమారు 2 లక్షల ఎకరాల భూమి, జిల్లాలన్నిటిలో కలిపి 10 లక్షల ఎకరాల భూమి వలసలకు (Colonisation) సిద్ధంగాఉందని ప్రభుత్వం 1930 నాటికే లెక్కలు తయారుచేసి ప్లానులను సిద్ధంచేసింది. ఇదేవిధంగా అప్పటికే సుమారు 20 లక్షలమంది వలసవచ్చారని శ్రీరంగా పేర్కొన్నారు. (గోలకొండ పత్రిక 20-1-1936). తర్వాత కాలంలో మరికొన్ని లక్షల సంఖ్యలో వచ్చారు. ఈ విధంగా మాగాణి ప్రాంతాన్ని సాగుచేసినవారిలో వలసవచ్చినవారు గణనీయంగా ఉన్నారని స్పష్టం.

నిజాంసాగర్‌తోపాటు బోధన్‌లో పెద్ద షుగర్ ఫ్యాక్టరీని నెలకొల్పడంతో భూస్వాములు, రైతులు - కొత్తవారూ, పాతవారూ - చెరకు సాగుచేయసాగారు. వీరుగాక హైదరాబాదులో ఉండే పారిశ్రామికులు సంపన్నులలో కొందరు భూములను సంపాదించి- ఇవి తరచుగా ప్రభుత్వం ఉచితంగా ఇచ్చిన భూములు - ట్రాక్టర్లు అధునాతనమైన ఇతర వ్యవసాయ పనిముట్లద్వారా సాగుచేశారు. చెరకు వ్యాపార పంట కావడం, ప్రభుత్వం అందించిన సౌకర్యాలవలన, వీరందరికీ వ్యవసాయం లాభసాటిగా ఉండుటేగాక, తమ తమ హోదాలను పెంచుకోవడానికి తోడ్పడింది. షుగర్ ఫ్యాక్టరీ యాజమాన్యంలో కూడా పెద్దపెద్ద వ్యవసాయ క్షేత్రాలలో చెరుకును పండించసాగారు.

చెరకు పండించిన భూమిపోను మిగిలినదంతా వరిపంటకు ఉపయోగపడింది.

బోధన్‌లో షుగర్ ఫ్యాక్టరీ నిర్మాణం జరుగక ముందునుంచే నిజామాబాదు మెదకు జిల్లాలలో చెరకు పండించి బెల్లం తయారుచేసేవారు. దీనితో కొత్తగా నిర్మించిన నిజాంసాగరు క్రింద భూమి సాగుదారులకు చెరకు సాగుచేయడానికి ఇబ్బందికలుగలేదు. మిగిలినవారంతా వరిసాగు చేయసాగారు.

తెలంగాణాలోని తక్కిన ప్రాజెక్టు ప్రాంతాలలో ఆనాటికి పరిశ్రమలు లేవు. వరిపంటే ప్రధానమవటంవలన రైసుమిల్లులు మాత్రం ఏర్పడి పనిచేయసాగాయి. ఈ ప్రాంతాలకు రైతులు, కూలీలు వలసలురావడం సర్వసామాన్యం. స్థానిక రైతులు ఆర్థికంగా బలహీనులు ; వెనకబడిన వ్యవసాయ పద్ధతులకు అలవాటుపడి ఉండుట వలన ప్రారంభంలో ప్రాజెక్టువలన లాభంపొందలేకపోయారు. వలసవచ్చినవారు కొంత పెట్టుబడిని వెంటతెచ్చుకొని మెరుగైన వ్యవసాయ పద్ధతులను అనుసరించినందున వారిలో కొంతమంది ఆర్థికంగా బాగుపడినారు. దీనిలో రుణాలుచేసి తెచ్చిన పెట్టుబడి చాలా ఉంది. అయినా వారిలో భూస్వాములు, ధనిక, మధ్యతరగతి, పేదరైతులుగా విభజన తప్పలేదు.

ఇలాంటి ప్రాజెక్టు ప్రాంతాలలో రైతాంగపు సాధారణ జీవితంలో కొంత మార్పు రావటం సహజం. బావులకింద సాగుచేస్తూ, రాత్రింబవళ్ళు అచ్చుటే జీవితాన్ని గడిపే బాధలు తగ్గిపోయినవి. పొలాన్ని సాగుచేసి, పైరునూ పంటనూ కాపాడుకోవడమే ప్రధానమైన పని అవటంతో వెనకటిబాధలు తగ్గి జీవితవిధానంలో కొంతమేరకు మార్పువచ్చింది. అయినా స్థానిక భూస్వాములు తమ దోపిడీ విధానాన్ని స్వల్పంగా మార్చుకున్నారేగాని మౌలికంగా మార్చుకోలేదు.

## 7. భూమి సాగుకు సంబంధించిన కొన్ని సంఖ్యా వివరాలు

ప్రభుత్వం భూస్వాములకు, రైతులకు కొన్ని రాయితీలిచ్చి బీళ్ళను సాగు చేయించటానికి ప్రయత్నించినా సాగయిన భూమి స్వల్పమే. భూస్వాములు మాత్రమే ఈ సౌకర్యాన్ని ఉపయోగించుకొని రైతాంగాన్ని దూరంగా ఉంచటంవలన బీళ్ళలో హెచ్చుభాగాన్ని సాగుచేయించలేకపోయింది. దీనిఫలితంగా సాగులోలేని భూమి అధికమయింది.

1950 కాలపు లెక్కల ప్రకారం తెలంగాణా ప్రాంతపు వైశాల్యం సుమారు 2 కోట్ల 66 లక్షల ఎకరాలు. దీనిలో సాగుచేస్తున్న భూమి 92 లక్షల ఎకరాలు.

సాగుచేసేవారు భూస్వాములూ, అన్నితరగతుల రైతులేగాక కౌలుదారులు కూడా ఉండేవారు.

పడావా (బీడు) భూమి సుమారు 40 లక్షల ఎకరాలు. ఇది భూమి అంతటిలో 6వ భాగం. ఇదంతా మెట్టభూమి. ధనికరైతులు తప్ప తక్కిన రైతులంతా తమకున్న భూమిని సాగుచేస్తారు. ఈ కారణం వలన పడావు భూమిలో అత్యధికభాగం భూస్వాముల యాజమాన్యంలో ఉన్నదే. పాలేర్లతో, కౌలుదారులతో సాగుచేయించగలిగిన భూమికన్న అదనంగా కొన్నిలక్షల ఎకరాలపై భూస్వాములు యాజమాన్యం కలిగి ఉన్నారని దీనివలన స్పష్టమవుతున్నది. ఫ్యూడల్ భూస్వామ్యవ్యవస్థకున్న లక్షణాలలో ఇదొకటి.

సాగుకులాయకై ఎవరూ సాగుచేయనిస్థితిలో ఉన్నది మరో 20లక్షల ఎకరాలు. మొత్తంలో ఇది 13వ భాగం. భూమిలేని రైతులు, కూలీలు, చాలీచాలని భూమిగల రైతులు ఎందరో ఉన్నచోట ఇంతభూమిని సాగుచేయకపోవటం ఫ్యూడల్ లక్షణాలలో మరొకటి.

తెలంగాణాలో సుమారు 55 లక్షల ఎకరాల అడవి ఉండేది. ఇది మొత్తంలో అయిదవభాగం. ఇదిగాక మరో అయిదవభాగం సాగుకులాయకుగాని భూమి ఉండేది. పేదలు దీనిలో కొంతభాగాన్ని అయినా సాగుచేయగలరు.

ఈ విధంగా 60 లక్షల ఎకరాలకు మించిన భూమి నిరుపయోగంగా మిగిలిపోయింది. దీనిని సాగుచేయగల గ్రామీణపేదలు అనేకులున్నప్పటికీ ఈ స్థితి ఏర్పడటం ఫ్యూడల్ భూస్వామ్య వ్యవస్థ మూలాననే.

## 8. పరిశ్రమలు

సంస్థానంలో బలమైన ఫ్యూడల్ భూస్వామ్య వ్యవస్థ ఉన్నప్పటికీ దాని సరసనే రవాణా సౌకర్యాలు, పరిశ్రమలు కొన్ని పరిమితుల్లో అభివృద్ధి అయినవి. నిజాం నవాబు బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు తాబేదారు కావటంతో బ్రిటిష్ పెట్టుబడి చేరుకున్నది. సంస్థానానికి ఇతర ప్రాంతాలకన్న బొంబాయితోనే హెచ్చుగా సంబంధం ఉండటంవలన అక్కడి పెట్టుబడిదారులు, వ్యాపారస్తులు తమ పెట్టుబడులతో పరిశ్రమలను నెలకొల్పారు. ఇవిగాక ప్రభుత్వ పెట్టుబడితో, స్థానిక ప్రైవేటు పెట్టుబడితో ఏర్పడిన పరిశ్రమలు కూడా అభివృద్ధి అయినవి. వీటిలో పెద్ద పరిశ్రమలన్నీ క్రమంగా ప్రభుత్వ పరిశ్రమలైనాయి. లేదా ప్రభుత్వ పెట్టుబడితో

ప్రైవేటు యాజమాన్యంగల పరిశ్రమలై ప్రైవేటు పెట్టుబడిదారులకు లాభదాయక మైపోయాయి.

నిజాం సంస్థానాన్ని స్వతంత్ర రాజ్యంగా చూపెట్టటానికి కరెన్సీ, కస్టమ్సు, పోస్టులాంటి శాఖలపై నిజాం ఆధిపత్యాన్ని అంగీకరించటమేగాక, తగినన్ని పరిశ్రమ లను ఏర్పాటు చేయటానికి బ్రిటిషువారు పూనుకున్నారు. నిజాం ప్రభుత్వం వారు చెప్పినట్టు నడుచుకున్నది. బ్రిటిష పెట్టుబడులతో ప్రారంభమైన కొన్నిటికి క్రమంగా నిజాం ప్రభుత్వమే యజమాని అయింది. పెద్ద ప్రైవేటు పరిశ్రమలన్నిటికీ ప్రభు త్వమే పెట్టుబడులు అందించి పెట్టుబడిదారులకు లాభాలు సమకూర్చింది. దీనికోసం పారిశ్రామిక ట్రస్టు ఫండును (Industrial Trust Fund) ఏర్పరచింది. ఈ సంస్థ మేనేజింగ్ ఏజెన్సీ (Managing Agency) విధానాన్ని సృష్టించి, ప్రైవేటు పెట్టుబడిదారులకు పెట్టుబడిలేకనే అపారమైన లాభాలను సమకూర్చింది.

బొంబాయిలోని దళారీ పారిశ్రామికవేత్త అయిన టాటాల మిలాఖతుతో ప్రభుత్వం కొన్ని పరిశ్రమలను ఏర్పరచింది. తన పెట్టుబడితోనే కొన్ని పరిశ్రమ లను ఏర్పరచింది. 1942లో సంస్థానంలోని లక్షాధికారులతో, కోటీశ్వరులతో హైదరాబాదు స్టేటు బ్యాంకును ఏర్పరిచింది. సంస్థానంలో అప్పటికే బ్రిటిషువారి ఇంపీరియల్ బ్యాంకు, ఇతర బ్యాంకు శాఖలు ఉన్నప్పటికీ స్థానిక కోటీశ్వరుల లావా దేవీలు స్వేచ్ఛగా జరుగటానికి ఈ బ్యాంకు అవకాశమిచ్చింది.

చివరకు 1945 లో బ్రిటిష్ సామ్రాజ్యవాదులు గోదావరి లోయను పెద్ద పారి శ్రామిక కేంద్రంగా మార్చటానికి ప్లాను సిద్ధంచేశారు. దీని ప్రకారం రామగుండం, దాని పరిసరాల్లో అనేక విధాలైన పరిశ్రమలుంటాయి. బస్తరు ప్రాంతంలో లభ్య మయ్యే కాకిరాయిని (Iron Ore) ఉపయోగించి ఉక్కు ఫ్యాక్టరీని నెలకొల్పా లనీ, ఉక్కు పరిశ్రమ ఆధారంతో మరెన్నో పరిశ్రమలను వృద్ధిచేయాలనీ ఈ ప్లాను సారాంశం. దీనికోసం అవసరమైన పెట్టుబడిని, యంత్రాలను సాంకేతిక పరి జ్ఞానాన్ని బ్రిటిష్ పెట్టుబడిదారులు సమకూర్చాలనుకున్నారు. ఆనాడు దీనికి హైదరాబాదు మాంచెస్టరు[19] (Manchester of Hyderabad) అని పేరు పెట్టారు. దీని మారు రూపమే నేడీ ప్రాంతంలో అభివృద్ధి అవుతున్న పరిశ్రమలు.

1940 నాటికి ఏర్పడిన కొన్ని ముఖ్యమైన పరిశ్రమలు ఈ విధంగా ఉన్నవి :

1. రైల్వేలు : సంస్థానంలో 1874 నాటికే రైల్వేలు పనిచేయటం ప్రారం భించాయి. బ్రిటిష్‌వారు వాటి యాజమాన్యం హస్తగతం చేసుకొని 'నిజాం గ్యారంటీడ్ స్టేట్ రైల్వే' అనే కంపెనీ (NGSR) నడిపించింది. 1930 లో కంపెనీ రైల్వేలను

నిజాం ప్రభుత్వానికి విక్రయించింది. అప్పటినుంచి నిజాం ప్రభుత్వమే నిజాం స్టేటు రైల్వే (NSR) పేరుతో నిర్వహించింది. ప్రభుత్వానికి దీని ద్వారా ప్రతి సంవత్సరం ఆదాయం ఉండేది. 1938 నాటికి రైల్వేలలో పెట్టుబడి 15 కోట్ల 78 లక్షల రూపాయలు. రైల్వే కార్మికుల సంఖ్య 20 వేలు.

2. సింగరేణి బొగ్గుగనులు : 1889 నాటికే వీటినుంచి బొగ్గుతియ్యటం ప్రారంభమైంది. 1937 నాటికి కొత్తగూడెంలోనూ 1941 నాటికి బెల్లంపల్లి (తాండూరు) గనుల్లో బొగ్గు తీయసాగారు. అప్పటివరకు గనులు బ్రిటిష్ కంపెనీ యాజమాన్యాన ఉండేవి. ఒక రిపోర్టు ప్రకారం ఈ గనుల్లో 1939 నాటికి పనిచేస్తున్న కార్మికులసంఖ్య 11,960.

3. రోడ్డు ట్రాన్స్పోర్టు : సుమారు 1932 లో ప్రధాన రోడ్డు మార్గాలను జాతీయంచేసి ప్రభుత్వమే బస్సులు నడిపించసాగింది. ప్రారంభంలో రోడ్డుట్రాన్స్పోర్టు రైల్వేశాఖ కింద ఉండేది. తర్వాత విడదీసి ప్రత్యేక డిపార్టుమెంటు కిందికి తెచ్చారు. దీనికి బ్రిటిష కంపెనీలతో ఉన్న మిలాఖతు ఏర్పాట్ల ప్రకారం బస్సు ఇంజనులను కంపెనీ సప్లయిచేసేది. బస్సుల నిర్మాణం ఆల్విన్‌లో జరిగేది. 1937-38 నాటికి దీనిపై పెట్టుబడి సుమారు 55 లక్షల రూపాయలు.

4. హైదరాబాదు కన్‌స్ట్రక్షన్ కంపెనీ : లాయకలీ అనే పెద్ద వ్యాపారస్థుడు 5 లక్షల రూపాయల పెట్టుబడితో 1934లో ఈ కంపెనీని ప్రారంభించాడు. ప్రభుత్వ భవనాల నిర్మాణాన్ని కంట్రాక్టుకు తీసుకొని విపరీతమైన లాభాలు గడించాడు. తర్వాత ప్రభుత్వమే పెట్టుబడులుపెట్టి ఈ కంపెనీని వృద్ధిచేసింది.

5. బోధన్ షుగర్ ఫ్యాక్టరీ : నిజాంసాగర్ ప్రాజెక్టు పూర్తి అయిన తర్వాత దానికింద చెరకు పండించి షుగరు తయారు చేయాలని నిజాం షుగర్ ఫ్యాక్టరీని నెలకొల్పారు. కొందరు జాగీరుదారులు, పెద్ద భూస్వాములు, పెట్టుబడిదారులు దీనిని ప్రారంభించారు. వారు కొంత పెట్టుబడిని సమకూర్చినా హెచ్చుభాగాన్ని ప్రభుత్వమే భరించింది. 1933 లో 73 లక్షల 50 వేల రూపాయలతో ఫ్యాక్టరీ ప్రారంభమయింది.

6. సిర్పూరు పేపరు మిల్లు : 1938లో 1కోటి 23 లక్షల రూపాయలతో ప్రారంభించారు. దీనిలో ప్రభుత్వ పెట్టుబడి 38 లక్షల 93 వేలు.

7. షాబాదు సిమెంటు ఫ్యాక్టరీ : ఇప్పుడు ఈ ఫ్యాక్టరీ గుల్బర్గా జిల్లాలో ఉన్నది. దళారీ గుత్త పెట్టుబడిదారుడు టాటా బ్యాంకుసాయంతో నెలకొల్పారు. పరిసర ప్రాంతాల్లో ఉండే రాయి సిమెంటుకు ఉపయోగపడుతుంది. ఇప్పుడు ఇది పెద్ద ఫ్యాక్టరీ.

8. జౌళి మిల్లులు : హైదరాబాదులో దివాన్ బహదూర్ రాంగోపాల్ మిల్లులు1922లో ఏర్పడినవి. కార్మికుల సంఖ్య సుమారు 1300. ఆజంజాహీ మిల్లులు వరంగల్లులో 1934లో స్థాపించారు. కార్మికుల సంఖ్య 2300. ప్రైవేటు యాజమాన్యమే అయినా వీటికి ప్రభుత్వ సహాయం ఉండేది. ప్రారంభంలో ఆజంజాహి మిల్లు వరంగల్లు పరిసర ప్రాంతాల్లో పండించిన పత్తిని మిల్లులో ఉపయోగించేది. మిల్లు తరఫున పత్తిపండించే రైతులకు రుణాలిచ్చి, ఎరువులు, విత్తనాలు సప్లయి చేసేది. తర్వాత ఈ విధానాన్ని మార్చి పత్తిని దిగుమతి చేసుకోసాగారు. పత్తి పండించే రైతులు దివాలా తీసి వేరే పంటలు పండించసాగారు.

9. వజీరు సుల్తాన్ టుబాకో (పుగాకు) కంపెనీ : ఒక జాగీర్దారీ కుటుంబం, మరికొందరు పెట్టుబడిదారులు కలిసి ఒక కంపెనీ ఏర్పరిచారు. తెలంగాణాలోని వివిధ ప్రాంతాలలో పండే నాటు పొగాకుతో దేశంలో అన్నిటికన్న తక్కువ ధర కలిగిన చార్మినార్ సిగరెట్లను ఫ్యాక్టరీలో తయారుచేసి అమ్మేవారు. ఇంపీరియల్ టుబాకో కంపెనీ (ITC) ఒత్తిడికి తట్టుకోలేక 1930లో ఆ విదేశీ కంపెనీకి అమ్మివేశారు. అప్పటి హైదరాబాదు ప్రభుత్వానికి దీనిలో భాగం ఉండేది.

10. ఆల్విన్, ఆస్బెస్టాస్ కంపెనీలు : ఆల్విన్ 1942లో ప్రారంభమైనది. బస్సులు, ఇతర ఇంజనీరింగ్ వస్తువులు తయారుచేసేవారు. ఆస్బెస్టాస్ కంపెనీలో షాబాదు సిమెంటుతో ఆస్బెస్టాస్ రేకులు తయారుచేసి ఇండ్లకూ, భవన నిర్మాణాలకూ ఉపయోగించేవారు.

11. బియ్యం, ఆయిలు మిల్లులు : గ్రామాల్లో తాలూకా జిల్లా కేంద్రాల్లో ఉండే పెద్ద భూస్వాములు (దేశముఖులు, జాగీర్దార్లు), ఫ్యూడల్ దోపిడీ ద్వారా సంపన్నులైన షాహుకారులు (వైశ్యులు, మార్వాడీలు), వడ్డీ వ్యాపారంద్వారా సంపాదించిన డబ్బుతో బియ్యం మిల్లులు ఏర్పాటు చేసేవారు. మార్కెటుకువచ్చే వడ్లను కొని, బియ్యం పట్టించి పట్టణ కేంద్రాల్లో, హైదరాబాదులో అమ్ముకునేవారు. టోకు వ్యాపారస్తుల్లో కొందరికి మిల్లుల్లో వాటాలు ఉండేవి. వీరంతా బియ్యం మిల్లులకు యజమానులై వ్యాపారంలో ప్రవేశించారు. ఈ క్రమం 1930 నాటికే ప్రారంభమయింది.

పుగాకు, మిర్చితోపాటు నూనెగింజలు కూడా తెలంగాణా వ్యాపార పంటలే. ఆముదాలు, నువ్వులు చిరకాలంనుంచీ పండేపంటలు. వేరుశెనగపంట 1920-25 మధ్య కాలంలో ప్రారంభమై క్రమంగా వృద్ధిపొందినది. ఈ విధంగా వేరుశెనగ మిల్లులు 1930

తర్వాత వృద్ధిపొందినవి. 1940 తర్వాత కూడా గానుగద్వారా ఆముదం తయారుచేసే వారు. ఆముదం నూనెలు బొంబాయికి ఎగుమతి అయ్యేవి.

12. ఇవిగాక హైదరాబాదు, సికిందరాబాదు నగరాల్లో చిన్నచిన్న ఇంజనీరింగు పరిశ్రమలు ఉండేవి.

తెలంగాణాలో కొన్ని పరిశ్రమలు ఉన్నప్పటికీ బొంబాయి, మద్రాసు రాష్ట్రాలను పోల్చిచూస్తే చాలాతక్కువ. సర్కారు, రాయలసీమ జిల్లాల్లో తెలంగాణాలో ఆనాడున్న కొన్ని పెద్ద పరిశ్రమలు లేనప్పటికీ, బియ్యం, నూనెమిల్లులు చాలా హెచ్చుగా ఉండేవి.

ఫ్యూడల్ కుటుంబాలనుంచి వచ్చినవారు కొందరు పెట్టుబడిదారులై ఫ్యూడల్ బూర్జువా వర్గంగా రూపొందారు. బొంబాయి, ఇతర రాష్ట్రాలనుంచి పార్శీలు, గుజరాతీలు, మార్వాడీలు వచ్చి ధనార్జనచేసి పెట్టుబడిదారులయినారు. వీరందరికీ ప్రభుత్వం పెట్టు బడులు అందించి లాభాలను సమకూర్చింది. ఈ విధంగా ఫ్యూడల్ బూర్జువావర్గం, అధికార బూర్జువావర్గం రెండూ మిళితమైన స్థానిక బూర్జువావర్గమొకటి 1940 నాటికే ఏర్పడింది.

## 9. వ్యవసాయంలో పెట్టుబడిదారీ సంబంధాలు

మనదేశంలో 1940 నాటికి వ్యవసాయంలో ఏమేరకు పెట్టుబడిదారీ సంబంధాలు ఏర్పడినవి ? ఫ్యూడల్ వ్యవస్థపై వాటి ప్రభావం ఏమేరకు పడింది అనే అంశాన్ని ఇచ్చట చర్చించలేము. భారతదేశంలోని వివిధ ప్రాంతాల్లో సంస్థానాన్ని ఆనుకొని ఉన్న ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటక ప్రాంతాల్లోని ఆర్థిక పరిణామాల ప్రభావం ఏదో ఒకమేరకు సంస్థానం పైనా, తెలంగాణా పైనా పడుతూ వచ్చింది. అయినా ఫ్యూడల్ వ్యవస్థను బలహీనపరిచి దెబ్బతీసే శక్తులు తెలంగాణా ప్రజానీకంలోనే ఉద్భవించి అభివృద్ధికావలసి ఉంటుంది. కొత్తగా అభివృద్ధిపొందిన ఈ ఫ్యూడల్ బూర్జువా వర్గం అలాంటి పాత్రను నిర్వహించగలిగిందా ? అనే ప్రశ్నకు లేదని సమాధానం చెప్పవలసి ఉంటుంది.

నూనెగింజల వంటి వ్యాపారపంటలు మార్కెటుకోసం పండించటం ప్రారంభమై చాలాకాలమయింది. ఆముదాలు వాటిలో ముఖ్యమైనవి. క్రమంగా వేరుశెనగపంట ప్రారంభమైంది. పట్టణ జనాభా పెరగటం వలన, ఆహారధాన్యాలను, నూనెగింజలను, ఇతర వ్యవసాయ పంటలను మార్కెటుకోసం పండించటం ప్రారంభమైనది.

నిజాం సాగరు క్రింద సాగయ్యే చెరకు తోటల్లో పెద్దభూస్వాములు ట్రాక్టర్లు లాంటి ఆధునిక యంత్ర సామగ్రిని ఉపయోగించారు. ఆనాటికి గ్రామాల్లో వ్యవ సాయానికి కరెంటు సప్లయి లేదు. హైదరాబాదు నగరం చుట్టూ, జిల్లా తాలూకా

కేంద్రాలలో కొందరు ఆయిల్ ఇంజనులు ఉపయోగించేవారు. జిల్లాలలో వీటిని ఉపయోగించినవారు భూస్వాములే. కొన్ని ప్రాంతాల్లో "రాహటు" అను బొక్కెనల మోటలు ఉపయోగించేవారు. పూనా ప్రాంతంలో (మహారాష్ట్ర) తయారైన అభివృద్ధికరమైన వ్యవసాయ పనిముట్లను జనసమూహం ముందు ప్రదర్శించేవారేగాని ఉపయోగించేవారు అరుదు.

గ్రామీణ జనాభాలో నూటికి 15 నుంచి 20 వరకు కూలీలున్నా వీరు భూస్వాములకు బానిసలై పనిచేసేవారు. ధనిక రైతులకు అర్ధబానిసలై పనిచేశారు. ఈ విధంగా వీరికి బానిసత్వమే ప్రధానమైనా పెట్టుబడిదారీయుగంలో కూలీలై ఉండటమే ఒక పెట్టుబడిదారీ లక్షణమని చెప్పాలి.

గ్రామాలనుంచి వలసవెళ్ళే కూలీలు, గ్రామీణపేదలు పరిశ్రమల్లోనూ వ్యవసాయ క్షేత్రాల్లోనూ కూలీలై పనిచేసేవారు. ఇతరప్రాంతాలనుంచి తెలంగాణాకు వలసవచ్చిన వారు గ్రామాల్లో మెరుగైన పద్ధతుల్లో వ్యవసాయం చేసి పంటలు పండించేవారు.

ఈమేరకు అతిస్వల్పమైన పెట్టుబడిదారీ సంబంధాలు అభివృద్ధిఅయినా ఫ్యూడల్ భూస్వామ్య వ్యవస్థలో పెద్దమార్పు రాలేదు. సామ్రాజ్యవాదుల వత్తాసుతో సాగిన ఫ్యూడల్ పరిపాలనతో బాటు సంస్థానానికి బయటి ప్రపంచంతో సంబంధం లేకపోవుటే దీనికి ముఖ్యమైన కారణం.

ప్రభుత్వానికి ఇతరవిధాల ఆదాయం పెరగటం వలన బావులకింద వసూలుచేసే మాగాణి శిస్తును రద్దుచేసింది. ఇది రైతులకే గాక భూస్వాములకు కూడా భారంగా ఉండేదనే సంగతి మరచిపోగూడదు.

## 10. విద్య-విజ్ఞానం-సంస్కృతి

విద్యావిధానం : హైదరాబాదు ప్రభుత్వం స్కూళ్ళను కాలేజీలను తానే నడిపించేది. విద్యావ్యవస్థపై గుత్తాధికారం కలిగి ఉండేది. ప్రైవేటు విద్యాసంస్థలు చాలా అరుదుగా ఉండేవి. వాటిని ప్రభుత్వం అనుమతించకపోయేది. ప్రభుత్వం నడిపించిన స్కూళ్ళద్వారా చేసిన విద్యాభివృద్ధి చాలా స్వల్పం.

పాతకాలపు స్కూళ్ళలో కూడా చినబాలశిక్ష, పెద్దబాలశిక్ష, ఉత్తరాలు చదువ నేర్పే పాతకాలపు ప్రాథమిక శిక్షణ చాలాకాలం నడిచింది. శతకాల్లోని, భాగవతంలోని పద్యాలను నేర్పటం ఈ శిక్షణలో ఒకభాగం. స్కూలు టెక్స్టు పుస్తకాలు ఉన్నప్పటికీ సామాన్యులు కోరే ఈ శిక్షణను ప్రాథమిక పాఠశాల టీచర్లు కాదనలేకపోయేవారు.

కొత్తవిధానం అమలుకావడానికి పూర్వం ఇదే అమలులో ఉన్నందున దీనిని మానివేయటానికి కొన్నిసంవత్సరాలకాలం అవసరమయింది. ప్రారంభంలో ఉర్దూలో విద్యాభ్యాసం ఉన్నప్పటికీ కింది తరగతులలో తెలుగుపుస్తకాలను కొనసాగించారు. కందుకూరు వీరేశలింగం గారు రచించిన వాచకాలు వీటిలో కొన్ని. క్రమంగా మొదటితరగతినుంచే ఉర్దూలో విద్యాభ్యాసం సాగింది. తెలుగు రెండవభాషగా (second language)గా ఉండేది. ప్రారంభంలో ఉర్దూ టెక్స్ట్ పుస్తకాలన్నీ ఉత్తరహిందూస్థానంనుంచే దిగుమతి అయ్యేవి. వీటిలో ఉపయోగించిన భాష కఠినమైనందున తెలుగు విద్యార్థులకు పాఠాలను అర్థంచేసుకోవటం అతికష్టంగా ఉండేది. క్రమంగా సంస్థానంలోనే టెక్స్టు పుస్తకాలను తయారుచేసి దిగుమతిని మానివేశారు. ఇవికొంత సులువైన ఉర్దూ భాషలో ఉండేవి.

చరిత్రకు సంబంధించిన పుస్తకాలు పాఠాలన్నింటిలో ముస్లిం చక్రవర్తుల రాజుల, వారి ప్రధానుల, వారి దర్బారుల్లోని విద్యావంతుల వర్ణనలే హెచ్చుగా ఉండేవి. ముస్లిం రాజులు హిందూరాజులపై విజయాలు సాధించి వారిని ఓడించిన ఘట్టాలను సవివరంగా రాసేవారు. ఇస్లాం మతాన్ని బోధించే పాఠాలు హెచ్చుగా ఉండేవి. అక్కడక్కడా ముస్లిం చక్రవర్తుల దర్బారులో ఉండే హిందువులను గురించిన పాఠాలు కూడా ఉండేవి. కాని ఆంధ్రుల రాజ్యాలను, జీవిత పరిస్థితులను గురించి ఎక్కడా ఉదహరించకపోయేవారు. ఉదహరించినా నాలుగుమాటలు చెప్పి దాటవేసేవారు. బ్రిటిష్‌వారు పెట్టిన ఒరవడి ఇదే. హిందూయుగము, ముస్లింయుగము, బ్రిటిష్‌యుగము అని విభజించి చరిత్రను రాయటం ఆనాడు పరిపాటి. ప్రాథమిక, మాధ్యమిక పాఠశాల తరగతుల్లో 'దక్కను చరిత్ర' ను చెప్పేవారు. ఇది ప్రధానంగా నిజాం నవాబు, అతని పూర్వీకుల చరిత్రరూపంలో ఉండేది. హైదరాబాదు సంస్థానపు "భూగోళం" బోధనాంశంగా ఉండేది. సామాన్య గణితం, సైన్సు వంటి కోర్సులన్నీ ఉర్దూలోనే చెప్పేవారు.

హైస్కూలు, కాలేజీ తరగతుల్లోని టెక్స్టు పుస్తకాలన్నీ ఉర్దూలో తర్జుమా చేయించారు. చరిత్ర, తత్వశాస్త్రం మొదలగు పుస్తకాలనే గాక, సైన్సు, గణితశాస్త్రం (mathematics) పుస్తకాలను కూడా తర్జుమా చేయించారు. వీటిలో వాడిన ఉర్దూ భాష పార్శీ, అరబ్బీ మయంగా ఉండేది. విద్యార్థులకు వాటిలోని విషయంతోపాటు (subject matter) భాషను కూడా అర్థంచేసుకోవటం కష్టసాధ్యమయ్యేది. వాటి ఇంగ్లీషు మూలగ్రంథాలు సులభంగా అర్థమయ్యేవి. ఇంగ్లీషు భాషకు సంబంధించిన పుస్తకాలను ఇతర రాష్ట్రాలనుంచి దిగుమతి చేసుకునేవారు.

ఉర్దూ భారతదేశపు భాషల్లో ఒకటి. బ్రిటిషువారి తోడ్పాటుతో నిజాంప్రభుత్వం ఉర్దూను విశ్వవిద్యాలయ స్థాయివరకు బోధనాభాషగాచేసి అమలు జరిపింది. దేశీయ

బాషల్లో ఒకటైనప్పటికీ కొద్దిమందికి తప్ప సంస్థాన ప్రజల మాతృభాషల్లో ఒకటికాదు. తెలుగు, మరాఠీ, కన్నడం వారివారి మాతృభాషలు. వీటికి ప్రత్యామ్నాయంగా ఉర్దూను ప్రవేశపెట్టి పరాయి భాషాధిపత్యాన్ని ప్రజలపై రుద్దింది నిజాం ప్రభుత్వం. దీని ఫలితంగా ఆంధ్రుల్లో విద్యావ్యాప్తి తగ్గిపోయింది. ఈ వాస్తవాన్ని గుర్తించక నెహ్రూ నుంచి రాజగోపాలాచారి వరకు ఈ విధానాన్ని ఆకాశానికెత్తారు. అయినా సంస్థానంలో కాంగ్రెసు పరిపాలన ఏర్పడగానే, దానిని రద్దుచేసి ఇంగ్లీషును ప్రవేశపెట్టారు. ప్రస్తుతం తెలుగును బోధనాభాషగా చేస్తున్నారు.

ఈ పరిస్థితుల్లో పేద మధ్యతరగతి రైతుబిడ్డలు స్కూళ్ళల్లో చదవడమే అరుదు. సమాజంలోని అసమానతతోపాటు పేదరికం కూడా దీనికి అడ్డువచ్చేది. ధనిక రైతు కుటుంబాల విద్యార్థులు తమ గ్రామంలోని స్కూల్లో రెండవతరగతి నుంచి నాల్గవతరగతి వరకు చదివి తరువాత వ్యవసాయవృత్తిలో ప్రవేశించేవారు. భూస్వాముల బిడ్డలు బస్తీలకు వెళ్ళి మిడిల్ స్కూళ్ళలో, హైస్కూళ్ళలో చదివేవారు. ఆకాలపు హైస్కూలు విద్యను నేటి కాలేజీ విద్యకన్న మిన్నగా పరిగణించేవారు. అంతమాత్రాన మిడిల్‌స్కూళ్ళు, హైస్కూళ్ళు భూస్వాముల బిడ్డలతోనే నిండిఉండేవనుకోవటం పొరపాటు. అక్కడక్కడా గ్రామీణ రైతుకుటుంబాల నుంచి వ్యక్తులు స్కూళ్ళలోచేరి చదువుకునేవారు. పట్టణాల్లోని అన్నితరగతులవారూ తమ బిడ్డలను స్కూళ్ళకు పంపించి తమ శక్తికొలది చదివించేవారు. ఈమేరకు భూస్వాములు, ధనవంతులకే గాక మధ్యతరగతి వారికి కూడా చదువు అందుబాటులో ఉండేది. ఉద్యోగాలు చేసుకొనేవారంతా తమ బిడ్డలను చదివించేవారు. సంపన్నులకు ఇబ్బంది ఉండేదికాదు. కష్టజీవుల, "హరిజనుల" సంఖ్య చాలా స్వల్పంగా ఉండేది.

ఉద్యోగాల్లో చేరిన ఆంధ్రులలో తమకో భాష, సంస్కృతి ఉన్నదని భావించేవారు ఉండటమే అరుదు. విద్యార్థులలో అలాంటి ఉద్యమాలు అభివృద్ధికాలేదు. స్కూల్లో, కాలేజీలో చేరిననాటినుండి ఉద్యోగంలో ప్రవేశించే రోజుకోసం నిరీక్షించేవారిలో ఇలాంటి భావాలు ఉండటం అసాధ్యం. తమతమ భాషా సంస్కృతులను అభిమానిస్తే దానిని ప్రభుత్వ వ్యతిరేకతగా పరిగణించే రోజులవి. అయినా భాషాభిమానంగల విద్యార్థులు తమ విద్యను పూర్తిచేసుకొని ఉద్యోగులయినవారు కూడా కొందరున్నారు.

1922 నాటి హైదరాబాదు ఆంధ్రునిలో తాను ఆంధ్రుడననే చైతన్యం కూడా లేని దుస్థితిని గూర్చి మాడపాటి హనుమంతరావుగారు ఇలా రాస్తున్నారు.

"ఆకాలమున రాజధానీ నగరమగు హైదరాబాదు పురమున ప్రజాహిత కార్యములందభిరుచిగలవారందరును మహారాష్ట్రులుగనే యుండిరి. ప్రజల పక్షమున విద్యాసంస్థ

లను స్థాపించువారు వారే. ఉన్నతవిద్యావిభూషితులగు పురుషులును, స్త్రీలును వారిలో నుండియే కానవచ్చుచుండిరి. సభలందును, సమావేశములందును గణపతి ఉత్సవముల వంటి సమారంభములందును కర్తృత్వము, యోగ్యతా ప్రదర్శనము అంతయు వారిదిగనే యుండినది. తెలుగువారిలో విద్యాధికుడెవడైనను, ఎచ్చటనైనను వెక్కిరించినట్టు కానవచ్చినను అతనియందు ఉత్సాహముగాని, దేశకార్య తత్పరతకాని మందునకైన గోచరమగుచుండలేదు. హైదరాబాదు నగరము, నిజాంరాష్ట్రాంధ్రప్రాంతములోనిదగుట వలన అది తన నగరమేయని అతనికి స్మరణయే యుండలేదు. తన మాతృభాష తెలుగని అతనికి సాధారణముగా తోచుటయేలేదు. అతని వేషములోను, అతని భాషలోను సాధారణముగా ఆంధ్రత్వము వెదుకదగినదై యుండెనని చెప్పిన జాలును"! ('తెలంగాణా ఆంధ్రోద్యమము'-మొదటిభాగం-పేజి 13-14).

ఈ దుస్థితి 1940 దాకా కొనసాగింది.

గ్రంథాలయాలు : ఆంధ్రోద్యమాన్ని ప్రారంభించకముందే హైదరాబాదులో శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయాన్ని (1901), హనుమకొండలో రాజరాజనరేంద్ర ఆంధ్రభాషానిలయాన్ని (1904) స్థాపించారు భాషాభిమానులు. అప్పటినుంచి వివిధ జిల్లా తాలూకా, ముఖ్యగ్రామకేంద్రాల్లో గ్రంథాలయాలు వెలిశాయి. వీటికి రాజుల, మహారాజుల పేర్లు పెట్టటమేగాక ఆర్థికసాయం చేసినవారిలో ఆనాటి జమీందారులు, సంస్థానాధీశులు, జాగీర్దారులున్నారు. ఇలాంటి వారిలో మునగాల రాజాగారొకరు. గ్రంథాలయాలలో కొన్నిటికి దేవుళ్ళ పేర్లున్నాయి. మరికొన్నిటికి "విజ్ఞాన"మనే పదంతో ప్రారంభమైన పేర్లున్నాయి. (విజ్ఞానప్రకాశినీ గ్రంథనిలయం). స్థాపకుల అభిరుచులనుబట్టి పేర్లు నిర్ణయమయ్యేవి.

ఆకాలంలో గ్రంథాలయాలనే "విప్లవకేంద్రాల"ని భావించి ప్రభుత్వం వాటి కార్యకలాపాలను సాగనివ్వక అడుగడుగునా ఆటంకపరుస్తూ ఉండేది.

పత్రికలు-సాహిత్యకృషి : తెలుగు పత్రికల సంఖ్య చాలా తక్కువ. 1) తెలుగు పత్రిక 2) నీలగిరి పత్రిక 1922లో వెలువడినవి. గోల్కొండ పత్రిక 1926లో వెలువడింది. ఇవి వారపత్రికలు. ఇవిగాక సాహిత్యమాసపత్రికలుండేవి.

పై మూడు పత్రికల యజమానులు భూస్వాములే.

1) తెలుగు పత్రిక : మానుకోట (మహబూబాబాదు) తాలూకాలో ఇనుగుర్తి గ్రామంనుంచి ఒద్దిరాజు సీతారామచంద్రరావు, రాఘవ రంగారావు సోదరుల సంపాదకత్వాన వెలువడి సుమారు 5 సంవత్సరాలు నడిచి ఆగిపోయింది. వీరు ఈ పత్రికను నడుపుటేగాక కొన్ని పుస్తకాలను రచించి ప్రకటించి సాహిత్యసేవచేశారు.

2) నీలగిరి పత్రిక : నల్లగొండనుండి వెలువడి సుమారు 5 సంవత్సరాలపాటు నడిచి ఆగిపోయింది. గ్రంథాలయోద్యమం, ఆంధ్రోద్యమానికి సంబంధించిన వార్తలు, వ్యాసాలు వచ్చేవి షబ్నవీసు వెంకట రామనరసింహారావు సంపాదకులు (నల్లగొండను సంస్కృతంలో నీలగిరి అనేవారు).

3) గోలకొండ పత్రిక : కేంద్రస్థానం హైదరాబాదు. ఈ పత్రిక ఇటీవలనే ఆగిపోయింది. ముందు వారపత్రిక, తరువాత ద్వైవారపత్రిక రూపంలో వెలువడింది. సురవరం ప్రతాపరెడ్డిగారు దీనికి సంపాదకులు. ప్రభుత్వాన్ని విమర్శించటానికి ఆ రోజుల్లో అవకాశాలు లేవు. మితవాద రాజకీయాలుగల ఈయన విమర్శించగలిగేది స్వల్పమే. అయినా ఆ కాలపు రైతుల ఇబ్బందులను గూర్చి వార్తలు ప్రకటించేవారు. సంఘ సంస్కరణ సమస్యలు, సాహిత్యం, పరిశోధనలు మొదలగు సమస్యలపై వ్యాసాలను, అప్పుడప్పుడు భూస్వాముల అక్రమాల వార్తలను కూడా ప్రకటించేవారు. ఆంధ్రోద్యమ ప్రచారానికి ఈ పత్రిక ఎంతో ఉపయోగపడింది. ఈ పత్రికకు ప్రభుత్వపు ఉన్నత ఉద్యోగాలలో ఉండే రాజాబహదుర్ వెంకటరామారెడ్డి (పోలీసు శాఖ), పింగిలి వెంకట రామారెడ్డి (న్యాయశాఖ)లాంటి పెద్దల మద్దతు ఉండేది. ఆ కారణాన ప్రభుత్వం దీనిని మూసివేయలేదు. కొద్ది ఆటంకాలతో నడిచింది.

సురవరం ప్రతాపరెడ్డిగారు "గోలకొండ కవుల సంచిక" అను ఒక కవితా సంకలనాన్ని ప్రకటించారు. 'తెలంగాణాలో కవులు లేరనీ, కవిత్వమంటే ఎవరికీ తెలియదనీ' ఎవరో ఒక పెద్దమనిషి అన్నారట. సురవరం ప్రతాపరెడ్డిగారు తెలంగాణాలో కూడా కవులున్నారని రుజువుచేయటానికి ప్రయత్నించారు. గోలకొండ పత్రికలో కవులకు విజ్ఞప్తిచేసి తమతమ కవితలను పంపమన్నారు. ఆయనకు పరిచయమున్న కవులకు స్వయంగా ఉత్తరాలు రాశారు. అంతా తమతమ కవితలను పంపించారు. వాటన్నిటినీ పుస్తకరూపంలో ప్రకటించారు. తెలంగాణాలోకూడా కవులు గణనీయంగా ఉన్నారని, వారికి ఎలాంటి ప్రోత్సాహంలేక కాలగర్భంలో దాగిఉన్నారనీ ఈ సంచికద్వారా రుజువుచేశారు. ఈ సంచికద్వారా లెక్కలోకి వచ్చినవారు 183 మంది పూర్వకవులు, 354 మంది ఆధునికులున్నట్లు ముద్దసాని రాంరెడ్డిగారు రాసిన ప్రతాపరెడ్డిగారి జీవిత చరిత్రలో పేర్కొన్నారు.

సంచికలోని కవితలన్నీ పాత ఫక్కీలోనే ఉన్నవి. అయినా తెలుగు భాషాభివృద్ధికి ఎలాంటి అవకాశంలేని ఆ రోజుల్లో ఈ సంచిక ప్రాధాన్యత ఎంతో ఉండేది.

సురవరం ప్రతాపరెడ్డిగారు గొప్ప రచయిత.

కొందరు చారిత్రక పరిశోధనలు చేశారు. తమ పరిశోధనలను వ్యాసాలరూపంలో

ప్రకటించారు. ఇలాంటివారిలో దూపాటి రమణాచార్యులొకరు. వీరు హనుమకొండ హైస్కూలులో తెలుగు పండితులు.

కొందరు వేరువేరు పేర్లతో "గ్రంధ మాల"లను స్థాపించి పుస్తకాలను ప్రచురించారు. కాని ఇవి ఎంతోకాలం నడువలేదు. ఇలాంటి వాటిలో "దేశోద్ధారక గ్రంధ మాల" ఒకటి. దీనిని స్థాపించినవారు వట్టికోట ఆళ్వారు స్వామి. జాతీయవాది. జాతీయ చైతన్యాన్ని, రాజకీయ చైతన్యాన్ని కలిగించే చిన్నపుస్తకాలను ప్రచురించేవారు. ఒక్కొక్కరినుంచి రు. 10 ల విరాళం సేకరించి ఆ విలువకు సరిపోవు పుస్తకాలను చందాదారులకు పంపేవారు. దీనిని స్థాపించినది 1938లో. ఈ గ్రంధమాల వారి జీవితాంతమూ నడిచింది.

జనగామ తాలూకాలోని జీడికల్లు ప్రాంత నివాసి గంగుల శాయిరెడ్డిగారు సామాన్య రైతు కుటుంబంలో జన్మించి ఆంధ్రోద్యమంలో పనిచేశారు. సామాన్య రైతుల నిత్య జీవితాన్ని ప్రతిబింబించే పద్యాలు రాశారు. ఇవి ఆ కాలంలో ఒక పుస్తకరూపంలో వెలువడినవి.

తెలుగు సాహిత్యాన్ని అభివృద్ధి చేయటానికి కొంతకృషి జరిగినప్పటికీ జాతీయ భావాలనూ, రైతాంగపు జీవితాన్ని ప్రతిబింబించే సాహిత్యం అతి స్వల్పం. దీనినే అభివృద్ధికర సాహిత్యమని చెప్పాలి. ఆనాటికి విప్లవ సాహిత్యం వెలువడలేదు.

పట్టణాలకు కొత్త పేర్లు - గ్రామాల పేర్ల వక్రీకరణ : నిజాం ప్రభుత్వం వారు తాలూకా జిల్లా కేంద్రాల్లోని కొన్నింటిపేర్లను మార్చి తమకు నచ్చిన పేర్లను పెట్టారు. మహబూబునగరు ఒక జిల్లాకేంద్రం. పాలమూరు అను పెద్ద గ్రామం దీనిని ఆనుకొని ఉన్నది. దీనినే జిల్లా కేంద్రంగా మార్చి మహబూబునగరు అని పేరుపెట్టారు. పూర్వం మహబూబునగరమనే గ్రామమైనా, పట్టణమైనా అక్కడలేదు. వరంగల్లు జిల్లాలోని తాలూకా కేంద్రమైన మానుకోటకు మహబూబాబాదు అను పేరు పెట్టారు. స్థానికులు, చుట్టుపట్టు గ్రామాలవారు ఇప్పటికీ ఈ చిన్న పట్టణాన్ని 'మానుకోట' అని పిలుస్తారు. "కోట" అనే పేరు చివరకు వచ్చే గ్రామాలపేర్లు ఎన్నో ఉన్నాయి. మహబూబు అలీఖాన్ 1911కు పూర్వం రాజ్యంచేసిన నిజాంనవాబు. మహబూబ్ నగరానికి, మహబూబాబాద్ పట్టణానికి అయన పేరును పెట్టినారని స్పష్టం అవుతుంది.

నల్లగొండ జిల్లాలో హుజూరునగరు అనే తాలూకా కేంద్రం ఉన్నది. దీని అసలు పేరు పోచెంచెర్ల. సుమారు 30 ఏండ్లకు పూర్వం ప్రజలు అంతా ఇదేపేరుతో పిలిచేవారు.

కరీంనగరు సమీపాన సుప్రసిద్ధమగు ఎలగందల అనే పెద్ద గ్రామమున్నది. దీనికి చారిత్రక ప్రాధాన్యత ఉన్నది. బమ్మెర పోతన రచించిన శ్రీమదాంధ్ర మహాభాగవతంలోని కొంతభాగాన్ని రచించిన యలగందల నారయ ఈ గ్రామనివాసి అని ఒక అభిప్రాయముంది.

నిజామాబాదుకు సమీపాన ఇందూరు అనే పెద్దగ్రామం ఉన్నది. ఆ పేరును వదిలి నిజామాబాదు అనే పేరుపెట్టారు.

పూర్వం ఆదిలాబాదు జిల్లాకేంద్రం ఆసిఫాబాదులో ఉండేది. దీనికి అసలుపేరు జనగామ. ఈ చిన్న పట్టణాన్ని "జిల్ల జనగామ" అనే పేరుతో ఇటీవలిదాకా ప్రజలు పిలిచేవారు. ఇలాంటి ఉదాహరణలు మరికొన్ని చూపవచ్చును.

గ్రామాలపేర్ల చివరకు "పాడు" అనే పదం ఉండటం సహజం. పాడు అనే పదానికి పల్లె అని అర్థం. దానిని "పహాడ్" అని మార్చారు. రావిపాడుకి రావి పహాడ్ అనీ, కోటపాడుకు కోట పహాడ్ అనీ పాతర్ల పాడుకి పాతర్ల పహాడ్ అనీ మార్చివేశారు. పహాడు అనే పదానికి "కొండ" అని అర్థం. 'కొండ' అనే పదం చివరకు వచ్చే గ్రామాలపేర్లు ఎన్నో ఉన్నాయి. వాటిని 'కొండ'కు బదులు "పహాడ్" అని ఎక్కడా మార్చలేదు. అవి యథాతథంగానే ఉన్నాయి.

ప్రజలందరి నాలుకలపై ఉండే పట్టణాల, గ్రామాల పేర్లను మార్చి వక్రీకరించటం ఆంధ్ర సంస్కృతిని అణచివేయటానికి చేసిన ప్రయత్నాలలో ఒకభాగమే.

పురాతత్వ పరిశోధన : చారిత్రక ప్రాధాన్యతగల ప్రదేశాలు భూగర్భంలోనూ బయటా ఉన్నాయి. బయట ఉన్నవాటికి రక్షణలేదు. లోపల ఉన్నవాటిని తవ్వి తీసే నాథుడులేడు. ఆ కాలంలో జరిగిన పనిమాత్రం నామమాత్రం. గతాన్ని పరిశోధించటమంటే ఆంధ్రుల చరిత్రలోని తెలియని ఎన్నో విషయాలను బయటికిలాగడమే. ఆంధ్రుల సంస్కృతి అంటే గిట్టని నిజాం నవాబులు వీటిని నిర్లక్ష్యం చేశారంటే మనం ఆశ్చర్యపడనవసరంలేదు.

పండుగలు - కళారూపాలు : దసరా, ఉగాది, సంక్రాంతి, దీపావళి పండుగల్లో అన్ని వర్గాలవారూ పాల్గొనటం సహజం. అయినా దసరాకి, ఉగాదికి ప్రత్యేకత ఉండేది.

ఊరేగింపులు తీయవలసిన ఏ పండుగలకైనా ప్రభుత్వ అనుమతి అవసరమయ్యేది. దేవుళ్ళ పెళ్ళిళ్ళు, ముత్యాలమ్మ, మైసమ్మ పండుగలు ఈ కోవకు చెందినవి. దేవుళ్ళ పెళ్ళిళ్ళ సమయంలో హరికథలు చెప్పేవారు. వాటికి అందరూ హాజరయ్యేవారు. ఆ కాలంలో మిగిలిపోయిన కళారూపాల్లో ఇదొకటి.

ముత్యాలమ్మ, మైసమ్మ పండుగల సందర్భంలో కష్టజీవులు ఊరేగింపుగా బయలు దేరి సందర్భోచితమైన పాటలు పాడేవారు. నృత్యాలు చేసేవారు. వీటిలో వీరత్వం ఉట్టి పడుతూ ఉండేది; ఉత్తేజకరంగా ఉండేవి.

బతకమ్మ పండుగ : ఈ పండుగ స్త్రీలది. దసరాకు ముందువస్తుంది. తొమ్మిది రోజులవరకు సాగుతుంది. మాదిగ, మాలలు తప్ప అన్నికులాలవారు దీనిలో పాల్గొం టారు. అయినా దీనిలో "ఉన్నత" కులాలవారికే ప్రాధాన్యత ఉండేది. ఇళ్ళల్లోనుంచి బయటికివెళ్ళని భూస్వాముల స్త్రీలు కూడా బయటకువెళ్ళి పండుగ సంబరాల్లో పాల్గొనే వారు. సాయంత్రం నాలుగుగంటలకు ఇళ్ళలోనుంచి బయలుదేరి ఆటలుపాటలు పూర్తి చేసుకొని చీకటిపడేవరకు ఇళ్ళు చేరుకుంటారు. సామూహికంగా వెళ్ళి సామూహికంగా తిరిగివస్తారు. మొదటిరోజు, చివరిరోజు బాజాభజంత్రీలతో ఊరేగింపులు జరిగేవి. లక్ష్మి, గౌరి పూజలతోపాటు స్త్రీల నిత్యజీవిత సమస్యలు పాటల్లో కథావస్తువులుగా ఉండేవి.

కాముని పండుగ : హోలీకి ముందు 15రోజులవరకు సాగుతుంది. కష్టజీవులైన రైతులు కూలీలు దీనిలో పాల్గొంటారు. అంతా యువకులు, యువతులే. చక్కని పాటలు, కోలాటం లాంటి నృత్యాలుంటాయి. యువకులు పాడే కొన్ని పాటల్లో పేద రైతుకూలీల నికృష్టపు జీవితాన్ని, గ్రామంలోని పటేలు పట్వారీల దోపిడీని సూచన ప్రాయంగా చెప్పే కథావస్తువులుంటాయి.

హోలీ పండుగ : లంబాడీల పండుగ. స్త్రీలు బాగా అలంకరించుకొని, స్త్రీలు పురుషులు తమ తండాలను వదిలి, గ్రామాలకు వెళ్ళి, ఆటపాటలతో కాలంగడుపుతారు. స్త్రీలు విడిగాను, స్త్రీపురుషులు సామూహికంగానూ నృత్యంచేస్తారు. పాటల్లోనూ, నృత్యం లోనూ లాలిత్యం, వీరత్వం ఉంటుంది. పట్టణాల్లో అంతా పాల్గొంటారు. రంగులు చల్లు కోవటం వంటి కార్యక్రమాలు అందరికీ తెలిసినవే.

మొహర్రం పండుగ : అందరికీ తెలిసిన పండుగ. ముస్లింలదే అయినా గ్రామీణ ప్రజలంతా పాల్గొంటారు. తరచుగా ఈ పండుగరోజుల్లో హిందువుల పండుగలు కూడా వస్తాయి. నిజాం ప్రభుత్వకాలంలో హిందువులు తమ పండుగలను వాయిదావేసి తర్వాత జరిపేవారు. సనాతన ధర్మపరాయణులు ఆరోజుల్లో పండుగలు జరపటం "తప్పు" అని సర్దుబాటుతనాన్ని ప్రదర్శించారు.

వీధి భాగవతులు గ్రామాలకువచ్చి ప్రహ్లాదచరిత్రం, శశిరేఖాపరిణయం లాంటి ఆటలు ఆడేవారు. భూస్వాములు ఆడించే ఆటలేకాక ఒక్కొక్క కులం వారి తరఫున డబ్బిచ్చి ఆడించేవారు. భూస్వాములేగాక కులాలవారు కూడా ప్రతి ఆటకు కొంత డబ్బు, బియ్యం మొదలగునవి ఇచ్చేవారు. ఇచ్చే డబ్బు మొత్తం స్వల్పంగా ఉండేది.

అప్పుడప్పుడు తోలుబొమ్మలాటవారు వచ్చి ప్రదర్శనలిచ్చేవారు. వీరి ఆటల్లో 'కీచకవధ' ఒకటి.

ప్రతికులానికి కొందరు గురువులు ఉండేవారు. వారు గ్రామాలకువచ్చి తమకు రావలసిన వార్షికాలు వసూలుచేసుకొని వెళ్ళేవారు. ఆ సమయంలో కొన్ని కథలు చెపుతుండేవారు. గొల్లలకు (యాదవులకు) సంబంధించిన వారు చెప్పే కథలు కొన్ని ఉత్తేజకరంగా ఉండేవి. యుద్ధాలు, పోరాటాలు వీటి కథావస్తువులుగా ఉండేవి.

కథా వస్తువులన్నీ ప్రధానంగా పౌరాణికమైనవీ ; సాంప్రదాయకమైనవీ ; భక్తి పరమైనవీ. అక్కడక్కడ చారిత్రక అంశాలు కనిపిస్తూ ఉంటాయి.

ప్రజల్లో రాజకీయ సాంఘిక చైతన్యాన్ని కలిగించటానికి ఈ కళా రూపాలను ఉపయోగించగల సాహిత్య సాంస్కృతిక ఉద్యమాలు ఆ రోజుల్లో లేవు. ప్రజలు అరుదుగా ఉపయోగించే కళారూపాలు వారి నిత్యజీవితంలో భాగం కాలేకపోయినవి. ప్రభుత్వ నిర్బంధాలతోపాటు, ఈ ఉద్యమాలు లేకపోవుటవలనకూడా సాహిత్య సాంస్కృతిక రంగాలు ముందుకు రాలేకపోయాయి. చారిత్రకంగా కాలదోషం పట్టిన ఫ్యూడల్ వ్యవస్థ వీటిని అభివృద్ధి చేయలేకపోయింది.

# 2. గ్రామీణ జీవితం – వివిధ వర్గాలు

గ్రామీణ ప్రాంతంలో వివిధ వర్గాల సాధారణ జీవితం ఈ విధంగా ఉండేదని చెప్పవచ్చును.

## 1 భూస్వాములు[20]

దేశముఖులు, పటేలు పట్వారీలు, ఈ కోవకు చెందని ఇతర భూస్వాములు గ్రామాలలో నివసించటం పరిపాటి. కొందరు జాగీర్దారులు, మఖ్తాదారులు కూడా గ్రామాల్లో నివసించేవారు. వీరంతా తెలుగువారే. ముస్లిం భూస్వాములు కొందరు గ్రామాలలో, మరికొందరు బస్తీలలో ఉండేవారు. పెద్ద భూస్వాములు బస్తీల్లోనూ (హైదరాబాదు నగరం, జిల్లా, తాలూకా కేంద్రాలు) గ్రామాల్లోనూ ఉండేవారు. చిన్న భూస్వాములకు ఒకే గ్రామంలో, పెద్ద భూస్వాములకు హెచ్చు గ్రామాల్లో భూమి ఉండేది. వారి కేంద్ర స్థానాల్లో (Head Quarters) కోటలు (గడీలు) ఉండేవి. వీటిచుట్టూ మట్టితో, రాతితో లేక రెండూ కలిపి కట్టిన ఎత్తైన ప్రహరీ గోడలు, అన్ని వైపులా బురుజులు ఉండేవి. మందపు ఇనుపకడ్డీలతో, పిడులతో తయారుచేసిన బలమైన తలుపులు, ఎత్తైన 'దర్వాజాలు' (గుమ్మాలు) ఉండేవి. కాలక్రమంలో ఇవి శిథిలమై కొన్ని గ్రామాల్లో అవశేషాలు మాత్రమే మిగిలిపోయినవి. బురుజులతో కూడిన కోట లున్నప్పటికీ లోపల ఇళ్ళు అన్ని సందర్భాలలో పెద్దవిగా ఉండేవి కావు. భూస్వామి కుటుంబాన్నిబట్టి, హోదానిబట్టి ఇల్లు రెండు భాగాలుగా ఉండేది. ముందుభాగం అధికార వ్యవహారాలు నడిపించటానికి ఉపయోగపడేది. అచ్చటికి భూస్వాములు ప్రజలను పిలి పించేవారు. లేదా స్వయంగా ప్రజలే వచ్చి తమ సమస్యలను చెప్పుకునేవారు. భూస్వాములు విచారణచేసి దండించేవారు ; వ్యక్తులు చెల్లించవలసిన జుర్మానాలను నిర్ణయించేవారు. ప్రజలను హింసించేది ఇక్కడే. దెబ్బలు కొట్టడానికి కొరడాలు, చిన్నకర్రలు ఉపయోగించేవారు. చెట్టుకి వేళ్లాడదీసి కొట్టేవారు. వారు సాగించే దురాగతాలకు అది కేంద్రం. ఆ ప్రదేశపు వాతావరణం భయానకమై ఉండేది.

అక్కడికి వెళ్ళినవారు ఏటూ తోచని స్థితిలో ఉంటూ దొరగారికి (దేశముఖుకు) దాసోహ మనేవారు. ఎదురుతిరిగేవారు అరుదు. అలాంటివారు ఆ స్థలానికి వెళ్ళేవారు కాదు.

దొరలకు చిన్న గుమాస్తాలు, పెద్ద గుమాస్తాలు ఉండేవారు. సలహాలు చెప్పేవారు పెద్ద గుమాస్తాలు. వీరూ భూస్వాములే. దొరల నివాసంలేని గ్రామాలలో లావాదేవీలు, భూములపై రాబడులు మొదలగునవి వారి తరపున చూడటానికి కొందరుండేవారు. వీరిలో అత్యధికులు స్థానిక భూస్వాములు. స్వస్థానంలో అవసరమైన మేరకు గుమాస్తాలు పనిచేసేవారు. దొరలే పటేలు పట్వారీలయితే ఆ పనులకోసం ప్రత్యేకంగా గుమాస్తాలను నియమించేవారు. రికార్డులు రాసి ప్రభుత్వ ఆఫీసులకి వెళ్ళే పనులుచేసే బాధ్యత వారిది. అధికారం చలాయించేది దొరలు.

దొరలకు వ్యవసాయం చేయించటానికి 'సేరిదారులు' ఉండేవారు. వీరు పేద కుటుంబాలనుంచి వచ్చినవారే అయినా, నోరు చేసుకొని, అవసరమైనప్పుడు దౌర్జన్యాన్ని ప్రయోగించే శక్తి కలవారిని ఈ పనులకు ఉపయోగించేవారు. దొరగారియెడ భక్తి విశ్వాసాలు ప్రదర్శిస్తూ, ఆయన కనుసన్నలలో నడుస్తూ ఉండాలి. పాలేర్లతో పనులు చేయించేవారు వీరే. కూలీలను పిలిచి పనిచేయించి, కూలీలిచ్చి పంపించేవారు వీరే. ఈ విధంగా వీరు గ్రామపేదలపై దొరల తరపున కొంత అధికారం చలాయించేవారు. కేంద్రస్థానంలో ఉన్న సేరిదారుల దౌర్జన్యాలు హెచ్చుగా ఉండేవి. తమ యజమానులకు అందుబాటులో ఉంటూ వారుచెప్పిన పనులన్నిటినీ చేయించేవారు వీరే. ఇతర గ్రామాల లోని సేరిదారులు కూడా పెత్తనం చలాయించేవారు. గ్రామంలో దొరగారు లేనందున అక్కడఉండే గుమాస్తా, సేరిదారు ఇద్దరూ కలిసి చిన్నదొరల్లాగా వ్యవహరించేవారు. కొన్ని సందర్భాలలో అసలుదొరకన్నా వీరే హెచ్చుగా దోపిడీ దౌర్జన్యాలు సాగిస్తూ పెద్ద ఆస్తులను సంపాదించేవారు.

దొరలకు భూములున్న గ్రామాలన్నిటిలో వ్యవసాయాలు ఉండేవి. పంటకు ధరలు లేని ఆరోజుల్లో వ్యవసాయం లాభసాటిగా ఉందాలేదా అన్న ప్రశ్న వారిని ఎప్పుడూ ఎదుర్కోలేదు. చౌక కూలీలు, నామమాత్రపు జీతాలుగల పాలేర్లు, నామమాత్రపు పరిహారంతో లభ్యమయ్యే ఎడ్లు, వెట్టిచాకిరీ, రైతులు తమ నాగళ్ళతో ఉచితంగా భూమిని దున్నటంలాంటి సాంప్రదాయకమైన దోపిడీవలన నామమాత్రపు పెట్టుబడితో వ్యవసాయం సాగిపోయేది. పెట్టుబడి ఏమైనాఉంటే అది పాలేర్ల జీతాలు, కూలీల కూలి మాత్రమే. విస్తారమైన పచ్చికబీళ్ళు (మెట్టభూములు) ఉండుటవలన పశువులను పెంచటం సులభమయ్యేది. దీనివలన వ్యవసాయానికి కావలసిన పశువులు (ఎడ్లు, దున్నలు) ఉచితంగా లభించేవి. అయినా దర్జాకోసం అవసరమైన మేరకు పెద్ద ఎడ్లజతలనూ,

కచ్చడాలకోసం బాగా పరిగెత్తే గిత్తలనూ ఇతర ప్రాంతాలనుంచి కొనితెచ్చేవారు. గ్రామాల్లో ఏ రైతుకైనా మంచి ఎడ్లు (కోడెలు) ఉన్నట్టు తెలిస్తే వాటిని ఉచితంగా లేదా నామమాత్రపు ధరఇచ్చి తోలుకొచ్చేవారు. ధనిక రైతులు దొరగారి ప్రాపకాన్ని సంపాదించటానికి వాటిని ఆయనకిచ్చేవారు.

పెద్దభూస్వాములు మెట్టవ్యవసాయంపై ఎలాంటి ఫలసాయాన్ని ఆశించకపోయే వారు. మొత్తంమీద చూస్తే పంటహెచ్చుగానే ఉండేది. కాని ఎకరానికి సగటువంట చాలా తక్కువగా ఉండేది. తరచుగా విత్తనాలు, ఖర్చులు పోను మిగులుఉండేదికాదు. జొన్నపంట పశువుల మేతకోసమే ఉపయోగపడేది.

వరిపంట స్థితివేరు. వీరికి భూములుగల గ్రామాల్లో సాధారణంగా పెద్ద చెరువులు, ఇతర నీటివనరులు బాగా ఉన్నందున వరిపంటకు ప్రాధాన్యత ఇచ్చేవారు. సారవంతమైన మొదటిపొలాలన్నీ (మాగాణి) వీరివే. దీనిఫలితంగా సాగునీరును వీరే కంట్రోలుచేసి తమ పొలాలకు ఉపయోగించేవారు రైతుల, ఇతరపేదల భూములు చివరకు ఉండుట వలన నీటికోసం వీరి దయాదాక్షిణ్యాలపై ఆధారపడవలసివచ్చేది. మొత్తంగా చూసి నప్పుడు భూస్వాములకు వరిపంట ప్రధానమైనదిగా ఉండటమే గాక, ఖర్చులుపోను కొంత మిగులు ఉండేది. దీనిని నాగులకు ఇచ్చి ధాన్యపు నిల్వలను పెంచుకునేవారు. వర్షాభావమున్నప్పుడు, రెండవపంటకు (వేసంగి) నీరులేనప్పుడు, నీరుచాలనప్పుడు బావుల నుంచి మోటలసాయంతో పొలానికి నీరందించేవారు. పాలేర్లు రాత్రుల్లో మేల్కొని ఈ పనిచేసేవారు.

దొరగారి నిత్యకృత్యం ఈ విధంగా ఉండేది : ఉదయమేలేచి, కాలకృత్యాలు తీర్చుకొని ఆఫీసు భాగంలోకి వచ్చి కూర్చొని వ్యవహారాలు నడిపించేవారు. కొందరు స్నానంచేసి, ఫలహారం (దీనిని ఉర్దూలో నాష్తా అంటారు) పూర్తి చేసుకొని తయారయ్యే వారు. కొందరు పూజలు చేసేవారు. మరికొందరు ముఖంపుల్ల నోట్లో వేసుకొని మధ్యాహ్నందాకా ఆ పుల్లని నములుతూ వ్యవహారమంతా పూర్తి చేసుకొని 'అంతః పురా'నికి చేరుకునేవారు. వారివారి అభిరుచులు, సాంప్రదాయాలను బట్టి నిత్యజీవితం నడుస్తూ ఉండేది.

ప్రతిదొరగారికీ ఒకపెద్దగుర్రం ఉండేది. దానికోసం ఒక "సైసు" నామ మాత్రపు జీతంతో ఉండేవాడు. ఆ గుర్రానికి కావలసిన మేత (పచ్చిగడ్డి) పనివారు (మాదిగవారు) ప్రతిరోజూ తెచ్చివేయాలి. గుర్రానికి దాణా, ఇతర పోషణ పెద్దఎత్తున జరిగేది. గ్రామాలలో నేటికీ 'పెద్దగుర్రాన్ని మేపినట్టుగా' అన్న సామెత ఒకటుంది. ఏవిధంగానూ ఉపయోగపడని ఖర్చు అని దీని అర్థం. ఈ గుర్రంమీద దొరవారు స్వారీ

చేసి పశువుల కొట్టాలు, తోటలు (మామిడి తదితర పండ్లతోటలు) పొలాలు చూచి తిరిగి ఇల్లుచేరుకొనేవారు. వీరు పెద్దగుర్రమెక్కి ఊళ్ళోనుంచి వెళుతూఉంటే ప్రజలు భయపడేవారు. గుర్రపుస్వారి వారిదర్పాన్ని పెంచుకోవడానికి ఉపయోగపడేది. కొద్దిమంది స్వంతకార్లను ఉపయోగించేవారు.

సమిష్టి కుటుంబం జీవితం వీరికి మామూలు. కుటుంబ సభ్యులు పెద్దవారు కాగానే వేర్వేరు గ్రామాల్లో మకాంవేసి తమ ఆధిపత్యాన్ని చెలాయించేవారు. కొందరు ఉద్యోగాలు చేసేవారు. మరికొందరు లాయర్లుగా (వకీళ్లుగా) ఉండేవారు. ఇవన్నీ వీరి ప్రాబల్యాన్ని పెంచడానికి ఉపయోగపడేవి. తమ కుటుంబంనుంచి లాయరుంటే కేసులు నడుపటానికి అదనపు సౌకర్యమే గదా ! ఉద్యోగాలు పై అధికారుల ప్రాపకం సంపాదించటానికి, చేసే అక్రమాలను సమర్థించుకోటానికి, అబ్కారీ కాంట్రాక్టులలాంటి ఆదాయపు వనరులను సంపాదించటానికి ఉపయోగపడేవి.

ఈ పరిస్థితి మామూలుగా చెరువులు, మెట్టభూములు ఉన్న ప్రాంతాలలో ఉండేది. నల్లరేగడి భూమి ఉన్న ప్రాంతాలలో సాగు మరో విధంగా ఉండేది. అక్కడ పొగాకు, మిర్చి, ఇతర వ్యాపార పంటలు పండించవలసివచ్చేది. వీటితోపాటు జొన్నలు మొదలగు ఆహార ధాన్యాలనుకూడా పండించేవారు. ప్రారంభంలో భూస్వాములు ఇలాంటిభూములను సాగుచేయటానికి ఆసక్తి కనపరచలేదు. వాటిని పచ్చికబయళ్ళవరకు పరిమితం చేసి పశువులను పోషించేవారు. క్రమంగా వీరుకూడా వ్యాపార పంటలు పండించసాగారు. భూమి విస్తీర్ణం హెచ్చుగా ఉండటంవలన ఊళ్లో అందరికన్నా వీరిపంట మొత్తంమీద హెచ్చుగా ఉండేది. ఆ పంటకూడా వీరి డాబుదర్పాలకే ఉపయోగపడేది.

సారవంతమైన భూములు లేని ప్రాంతాలలో ఆముదాలవంటి వ్యాపార పంటలు పండించవలసివచ్చేది. హెచ్చుభూమిలో పంటను వేస్తే ఎంతపండినా అది హెచ్చుగానే కన్పించేది.

కృష్ణా, గుంటూరు జిల్లాల సరిహద్దు తాలూకాలలో ఉండే దొరలు ఒకమేరకు వ్యవసాయాన్ని కట్టుదిట్టంగా జేసుకొని పంటను పండించేవారు. అయినా వారు చాలా భూమిని పచ్చికబయళ్ళ రూపంలో మేపులకు (ఇతరుల పశువులు మేయడానికి) కౌళ్ళకిచ్చి విపరీతంగా డబ్బుగడించేవారు. లాభసాటిగా ఉంటే మాగాణిని సాగుచేసేవారు. లేకుంటే కౌళ్ళకు, భూమి పాళ్ళకు రైతులకిచ్చి ఆదాయాన్ని పెంచుకునేవారు.

దౌర్జన్యయుతంగా దోపిడీచేయటం ఈ విధంగా ఉండేది ; ఒక దొరగారు తన అవసరాలకూ, భోగ విలాసాలకు కావలసిన వస్తువులకూ అవసరమైన ధనాన్ని తన ఆస్తినుంచి ఖర్చుచేయటానికి మారుగా ప్రజలనుంచి వసూలుచేసేవాడు. తన ఇంట్లో

పెళ్ళిళ్ళు ఇతర శుభకార్యాలకు, చావుల్లాంటి అశుభ కార్యాలకు కావలసిన డబ్బు, ధాన్యం, ఇతర సామాను ప్రజలనుంచి రావలసిందే. తాను నిర్మించే భవనాలకు కావలసిన డబ్బుతోపాటు రాయి, సున్నం మొదలైన సరుకు, సామాగ్రి ప్రజలనుంచి రావలసిందే. రైతులు తమ బళ్ళతో రాయి, ఇటుక, సున్నం తోలాలి. కూలీలు ఉచితంగానో, నామ మాత్రపు కూలీకో పనిచేయాలి. ప్రత్యేక నైపుణ్యంతో చేయవలసిన పనులనుమాత్రం నిపుణులతో చేయించేవారు. వారి ఖర్చులనుకూడా ప్రజలే భరించాలి. ఒక కారు కొన్నప్పుడూ, లేదా మరొక విలువైన వస్తువు తెచ్చినప్పుడు ఇదే పరిస్థితి ఉండేది. వివాహాలు మొదలైన శుభకార్యాలు జరిగినప్పుడు ప్రజలు విధిగా వెట్టిచాకిరీ చేయడమే గాక కానుకలనుకూడా చెల్లించుకోవలసివచ్చేది.

మరోరకపు నికృష్టమైన దోపిడీ ఉండేది. ఒకరైతు మరో రైతునుంచి ఒక వేయి రూపాయల విలువచేసే భూమిని కొన్నప్పుడు దొరలకు, పటేలు పట్వారీలకు మరో వేయి రూపాయలు ముడుపుచెల్లించినప్పుడే అతనికి దానిపైన యాజమాన్యం సంక్రమించేది. కుటుంబ తగాదాలు, ఆస్తి తగాదాలు మొదలైనవాటి తీర్పులన్నీ దొరలే చేసేవారు. వీటికోసం ప్రజలు తమ శక్తికి మించిన డబ్బును (వందలు, వేల రూపాయలు) చెల్లించుకోవలసివచ్చేది. దొరల ఆదాయంలో ఇదొక ముఖ్యమైన భాగం.

కొందరు దొరలు వడ్డీ వ్యాపారం చేసేవారు. ధాన్యాన్ని నాగులకు ఇచ్చేవారు. చిన్న దొరలైతే ప్రజలను నేరుగా దోచుకునేవారు. పెద్దవారైతే సంపన్నులకు, మధ్య దళారీలకు, వ్యాపారస్తులకు పెద్దమొత్తాలను వడ్డీలకిచ్చేవారు. ఈ విధంగా ధనాన్ని చాలావరకు పోగుచేసుకొని నిలువచేసేవారు. పెద్దమొత్తాలు ఇచ్చే సందర్భంలో వడ్డీ తక్కువగా ఉండేది [నూరు రూపాయలకు నెలకు అర్ధ రూపాయి (50 పై॥), ఆరణాలు (37 పై॥), పావలా (25 పై॥)]. కొద్దిమొత్తాలు ఇస్తే రూపాయినుంచి అయిదు రూపాయలవరకు వడ్డీ తీసుకునేవారు. వీరేగాక 'అంతఃపురం'లోని స్త్రీలుకూడా వడ్డీ వ్యాపారాన్ని నడిపేవారు.

ఆబ్కారీ కాంట్రాక్టులనుంచి దొరలు పెద్ద ఆదాయాన్ని పొందేవారు. కొంత కాలందాకా ఏవో ఒకటి రెండు కుటుంబాలే వీటిపై గుత్తాధిపత్యం వహించేవి. తర్వాత ప్రభుత్వం ఆ పద్ధతిని రద్దుచేసి ఒక్కొక్కరికీ కంట్రాక్టు ఇవ్వసాగింది. దొరలు వాటిని సంపాదించి తమ ఆదాయాన్ని పెంచుకోవడమేగాక గ్రామ ప్రజలపై తమ ఆధి పత్యాన్ని బలపరచుకునేవారు.

అక్రమమైన డబ్బును ప్రజలనుంచి వసూలుచేయటానికి, ప్రజలను అదుపులో పెట్టడానికి, దొరలు కిరాయి మనుషులను పోషించేవారు. వారివారి తాహతునుబట్టి

ఒకరిద్దరినుంచి వందమందివరకు వీరి సంఖ్య ఉండేది. దోపిడీద్వారా వచ్చే ఆదాయంలో కొంతభాగం వారికిచ్చేవారు. ప్రజలను కొల్లగొట్టి జీవించటానికి వారికి అండగా ఉండే వారు. వీరు దొరలపై భక్తి విశ్వాసాలను ప్రదర్శిస్తూ ప్రజలపాలిటి యమభటులై వ్యవహరించేవారు.

వీరు దొంగల ముఠాలను కూడా పోషించేవారు. ఈ ముఠాలు తరచుగా అడవి ప్రాంతాల్లో పనిచేసి దారినవెళ్ళే ప్రయాణీకులను దోచితెచ్చిన నగలు, డబ్బు, వస్త్రాల నుంచి దొరలు తమభాగాన్ని తీసుకొని కొన్నిటిని అమ్మి ఖజానాను నింపుకునేవారు. తమకు అవసరంలేని వస్తువులను ఆ ముఠాలకిచ్చేవారు.

ఈ విధంగా భూస్వాములు భూమినే గాక ధనధాన్యాలను కూడా పోగుచేసుకొని సంపన్నులై, గ్రామీణ జీవితంపై పూర్తిగా పట్టు సంపాదించి, రైతాంగాన్ని ఇతర ప్రజానీకాన్ని తమ ఇనుప గుప్పిటిలో పెట్టుకొని నిరంకుశ ప్రభువులై గ్రామీణ ప్రాంతంలో రాజ్యంచేశారు

ఈ లక్షణాలు భూస్వామ్యవర్గానికి సర్వసామాన్యమైనప్పటికీ కొందరు సాంప్రదాయమైన దోపిడీని మాత్రమే సాగిస్తూ జీవించేవారు.

వీరుగాక హైదరాబాదులో, కొన్ని ఇతర పట్టణాలలో నివసించే భూస్వాములు కొందరుండేవారు. వీరు పెద్ద భూఖండాలకు యజమానులుగా ఉంటూ 'స్వంతసాగు' చేస్తూ, మిగతా భూమిని కౌలుదారులకు ఇచ్చేవారు. భూమినుంచేగాక ఆబ్కారీ, అడవి కంట్రాక్టులనుంచి ఆదాయం వచ్చేది. తరచుగా ఇదే హెచ్చుగా ఉండేది. వీరు ప్రభుత్వం నుంచి దొరికే ఇతర సౌకర్యాలను అనుభవించేవారు. ఈ విధంగా వారు బాగా ధనాన్ని సంపాదించి బ్యాంకుల్లో నిలువచేసి పరిశ్రమల్లో కూడా పెట్టుబడులు పెట్టేవారు. వీరు గ్రామాలలో దౌర్జన్యపూరితమైన, అక్రమమైన దోపిడీలకు తలపడకపోయేవారు. తరచుగా చట్టాల పరిధిలోనే తమ దోపిడీని సాగించేవారు. వీరివలన గ్రామప్రజలమీద ఒత్తిడి తక్కువగా ఉండేది. వీరు విద్యావంతులై ప్రభుత్వోద్యోగాల్లో ఉండేవారు. దానధర్మాలు చేసేవారు. సంస్థలకు విరాళాలిచ్చేవారు. అయితే కొందరు భూస్వాములు ఒకవైపు క్రూరులుగా ఉంటూనే మరోవైపున సాహిత్యం, సంగీతం వంటి కళలను ఆదరించేవారు. సంస్థలకు కూడా విరాళాలిచ్చేవారు. ఇలాంటి వారిలో సాధారణ భూస్వాములేగాక దేశముఖులు, జాగీర్దారులు, మఖ్తాదారులు కూడా ఉండేవారు.

భూస్వాములు దౌర్జన్యపరులు కానంతమాత్రాన సామాన్యప్రజలు సుఖజీవితం అనుభవించేవారనుకోవడం తప్పు. భూస్వాములు ఎలాంటివారైనా గ్రామీణ ప్రజలకు దున్నుకోడానికి భూమి ఉండదు. భూస్వామ్యవ్యవస్థ భారం ఏదోమేరకు మోయవలసి

వస్తుంది. మౌలికమైన భూమిసమస్య గ్రామీణప్రజలందరిది. భూస్వాముల దౌర్జన్యంలేని ప్రాంతాల్లో కూడా భూమిసమస్య అపరిష్కృతంగానే ఉండేది.

గ్రామాల్లో ఉంటూ దౌర్జన్యయుతమైన పరిపాలనసాగించే ఫ్యూడల్ భూస్వాములు (దేశముఖులు, జాగీరుదారులు, మక్తాదారులు, పెద్దభూస్వాములైన పటేలు పట్వారీలు) ఆంధ్రోద్యమాన్ని తొలిదశలో కూడా వ్యతిరేకించేవారు. వీరంతా ఆంధ్రులే.

వీరికి తోడుగా దివాలా తీసిన భూస్వాములుకూడా తగినంతసంఖ్యలో ఉండేవారు. దుర్వ్యసనాలు, లిటిగేషను, కలిసిరాకపోవటం, సోమరిపోతులై తమ ఆస్తిపాస్తులను చూసుకోలేని అసమర్థత, అతిగా వైభవభక్తులు కావటం మొదలగు కారణాలవలన దివాలా తీసినవారు తగినంత సంఖ్యలో ఉండేవారు. వీరు గ్రామప్రజలమీద ఎలాంటి దౌర్జన్యం చేయలేకపోయేవారు. తమకున్న ఆస్తిపాస్తులనుకూడా ఇతరులకు కట్టిపెట్టి గ్రామాల్లోని ధనికుల దయాదాక్షిణ్యాలపై ఆధారపడి జీవించేవారు. క్రమంగా వీరిలో చాలా మంది గ్రామ జీవితంలో అనామకులుగా మిగిలిపోయేవారు. లేదా బస్తీలకు వెళ్ళి ఏదో ఉద్యోగం చూచుకునేవారు.

వీరుగాక మరొకతరహా భూస్వామ్యవర్గంకూడా ఉండేది (ఇప్పటికీ ఉన్నారు). వీరు ధనిక రైతులుగా ఉంటూ అప్పులు, నాగులద్వారా ధనాన్ని పోగుచేసుకొని పేదల భూములను తాకట్టుపెట్టుకొని, కొనివేసి క్రమంగా భూస్వాములైనారు. మరికొందరు పూర్తిగా వడ్డీలు, నాగులవలన వచ్చిన ఆదాయంతోనే ధనవంతులైనారు. అయితే వీరి జీవితం కొన్ని అంశాలలో ఫ్యూడల్ భూస్వాముల జీవితానికి భిన్నంగా ఉండేది. ఫ్యూడల్ భూస్వాముల ప్రాబల్యంవలన వీరు రైతాంగంనుంచి భూమిని యథేచ్ఛగా కొనలేకపోయేవారు. వారి ప్రాపకం, అండదండలతోమాత్రమే భూమిని తాకట్టుపెట్టు కునేవారు, కొనేవారు, తమ అప్పులను వసూలుచేసుకోగలిగేవారు. అయినా కొందరిలో ఫ్యూడల్ భూస్వాములంటే వ్యతిరేకత ఉండేది. వీరే ఇటీవలి కాలంలో గ్రామాల్లో పెత్తనంచేసే భూస్వాములుగా తయారైనారు. వ్యాపార పంటలు పండే ప్రాంతాల్లో వీరి లావాదేవీలు బాగా సాగేవి. హెచ్చు మోతాదులో ధనాన్ని కూడబెట్టగలిగేవారు కూడా. మాగాణి ప్రాంతాల్లో నీటివనరులు నమ్మకమైనవిగా ఉండటంవలన వీరి ఆదాయానికి ఎలాంటి ఆటంకాలు ఉండకపోయేవి. అప్పులవసూళ్ళు నమ్మకంగా జరగడం వలన వీరు త్వరలో సంపన్నులయ్యేవారు. వెనుకబడిన జీవిత ప్రమాణంవలనకుటుంబ ఖర్చులు చాలా తక్కువ, ఆదాయంలో మిగులు హెచ్చు. సంపన్నులైనప్పటికీ సాంప్రదాయాన్ననుసరించి కుటుంబమంతా పొలానికి (చేనుకు) వెళ్ళి కష్టించేవారు. ఇలాంటివారు కొన్ని ధనిక రైతు లక్షణాలు కలిగిన భూస్వాములై ఉండేవారు. వారు

పాలేర్లతో, కూలీలతో హెచ్చుగా పనిచేయించి వ్యవసాయ ఆదాయాన్ని పెంచేవారు. వీరు తమ వ్యవసాయానికి బలమైన పశువులను, గట్టి పనిముట్లను ఉపయోగించేవారు. పశువులు తగినన్ని ఉండటంవలన పెద్ద మోతాదులో ఎరువులను పొలంలో వేయగలిగే వారు; అప్పులు పెట్టిన పేదలనుంచికూడా ఎరువులను తీసుకొని తమ పొలాల్లో వేసి పంటను బాగా పండించేవారు. ఈ తరహా భూస్వామ్యవర్గాన్ని ధనిక రైతులని నిర్వ చించటం పరిపాటి అయింది. వీరు తమకు తాము మధ్యతరగతికి చెందినవారమనికూడా చెప్పుకుంటారు.

ఆంధ్ర మహాసభ వార్షిక సమావేశాల్లో జాగీరు రైతుల, తెలంగాణా రైతుల సమస్యలపై తీర్మానాలు చేసేవారు. ఆనాటి మితవాద నాయకత్వపు దృష్టిలో రైతు లంటే కష్టించి పనిచేసే రైతులేకాదు. భూస్వాములతో సహా భూమి యజమానులంతా రైతులని వారి అభిప్రాయం. జాగీర్లలో ఉండే భూస్వాములు జాగీరు "రైతు"ల్లో, ఖాల్సా ప్రాంతంలో ఉండే భూస్వాములు తెలంగాణా "రైతు"ల్లో చేరేవారు. భూమిపై శిస్తుభారం తగ్గాలని కోరేవారిలో వీరే ముందుండేవారు. నాటికీ, నేటికీ భూస్వాములు తమను తాము రైతులని చెపుతూనే ఉన్నారు. వీరికి సాగుదారులని (farmers) మరోపేరు ఉంది. భూస్వాముల వర్గ స్వభావాన్ని మరుగునపరిచి, వారిని రైతుల్లో కలిపివేయటానికి మితవాద నాయకులు 1930నుంచే ప్రయత్నించారు. మితవాద నాయకుల్లో చాలామంది జాగీరు, ఖాల్సా ప్రాంతాల భూస్వాములే. ఇలాంటి భూస్వాము లంతా ఆంధ్రోద్యమపు తొలిదశలోనూ, తర్వాత కాలంలోనూ కలిసివచ్చారు. ప్రజా ఉద్యమమూ, వర్గపోరాటమూ ముందుకు సాగుతున్నాకొద్దీ వారు దూరమవుతూ వచ్చారు; కొందరు తటస్థులైనారు.

## 2. ధనిక రైతులు

ధనిక రైతులు ఒక విస్పష్టమైన జీవిత విధానం కలవారు. వీరి కుటుంబమంతా పొలంలో పనిచేస్తూ, పాలేర్లతో, వ్యవసాయ కూలీలతో పని చేయిస్తూ తమస్వాధీనంలో ఉన్న భూమిని సాగుచేస్తారు. తమ కుటుంబం సాగుచేయగలిగే దానికన్నా హెచ్చుగా భూమి వీరి స్వాధీనంలో ఉందని దీని అర్థం. స్వయంగా పనిచేయటంవలన పాలేర్లతో, కూలీలతో ఇతరులకన్నా హెచ్చుగా పనిచేయిస్తారు. పంటకూడా హెచ్చుగానే పండి స్తారు. తమ మిగులు ధాన్యాన్ని, ఆదాయాన్ని నాగులకు, వడ్డీలకు ఇచ్చి సంపదను పోగుచేసుకొని భూములు సంపాదించేవారు. వెనుకబడిన జీవిత విధానం వలన కుటుంబ

ఖర్చులుకూడా చాలా తక్కువగా ఉండేవి. ఆ కాలంలో కాఫీ, టీ లు ఎలా ఉంటాయో వారికి తెలియదు. పండుగల సమయంలో సాంప్రదాయకంగా చేసే పిండివంటలుతప్ప ఇతరములు వారెరుగరు. మొరటుగా ఉండే నేత బట్టలను కట్టుకునేవారు. చొక్కాలు కూడా వేసుకునేవారు కాదు. ఇలాంటివారికి ఫ్యూడల్ భూస్వాములనుంచి ఒత్తిడి హెచ్చుగా ఉండేది. వారు తమకున్న అధికారాలతో ధనిక రైతులను దోపిడీచేస్తూ అణచిపెడుతూ ఉండేవారు. భూములను తాకట్టుపెట్టుకోనీయకపోయేవారు ; కొన నీయకపోయేవారు. ఖర్చులు, మామూళ్ళ పేరుతో డబ్బు, ధాన్యం ఒకటేమిటి, వారు పండించే ప్రతిపంటలో కొంతభాగాన్ని రాబట్టుకునేవారు. ధనిక రైతులు తమ నాగళ్ళతో వారి పొలాలను దున్నిపెట్టవలసివచ్చేది. వారి ఇళ్ళలో పెళ్ళిళ్ళు మొదలగు శుభ కార్యాలకు, చావులు మొదలగు అశుభ కార్యాలకు కొన్ని ముడుపులు చెల్లించవలసి వచ్చేది. ఈ విధంగా తమ ఆదాయంలో కొంతభాగాన్ని ఫ్యూడల్ భూస్వాములకోసం ఖర్చుపెట్టటం తప్పనిసరి అయ్యేది. ఆస్తిపాస్తులు, మిగులు ఆదాయం ఉండటంవలన నిర్బంధపు జీవితం వారికి సరిపడకపోయేది. కానీ అణిగి, మణిగి ఉండకపోతే తమ దోపిడీ సాగటంకూడా కష్టమయ్యేది. ఈ విధంగా వారిలో ఒకవైపున భూస్వామ్య వ్యతిరేకత, మరోవైపున భూస్వాములతో రాజీపడే తత్వం ఈ రెండూ స్పష్టంగా కన్పించేవి. వీరు ఎప్పుడూ భూస్వామ్య వ్యతిరేక పోరాటాలకు నాయకత్వం వహించలేదు. కానీ ఆ పోరాటాలలో కలిసివచ్చేవారు.

స్వయంగా కష్టించటం వలన రైతాంగంతో, తక్కిన కష్టజీవులతో వీరికి సన్నిహితమైన సంబంధాలు ఉండేవి. రైతాంగంతో సంబంధ బాంధవ్యాలు కూడా ఉండేవి. ధనికరైతులంతా ఒకానొకకాలంలో మధ్యతరగతిరైతులుగానో, పేదరైతులుగానో ఉండేవారు. అనేక కారణాలవలన వారిలో కొందరు క్రమంగా ధనికరైతులైనారు. ఇది వీరి ప్రత్యేకత. ఫ్యూడల్ భూస్వాములకు ధనికరైతులతోగానీ, ఇతర రైతాంగంతో కానీ ఇటువంటి సాన్నిహిత్యం ఉండకపోయేది. తుదకు ఒకేకులానికి చెందినవారైనా ఉభయులూ వేర్వేరుగానే ఉండేవారు. కొన్ని సందర్భాల్లో ఒకేకులంలోని ఫ్యూడల్ భూస్వాములలోని పేదమధ్యతరగతి కుటుంబాలకూ, సంపన్నులైన సాధారణ భూస్వామ్య కుటుంబాలకూ సాంఘిక సంబంధాలు ఏర్పడేవి.

పైశ్రేణికి చెందిన ధనికరైతులలో కొందరు క్రమంగా భూస్వాములుగా మారిపోయేవారు. సమిష్టి కుటుంబ జీవితం దీనికొక సాధనంగా ఉండేది. తగినంత భూమి ఉండటంతో పాటు నలుగురో, అంతకన్నా హెచ్చుగానో అన్నదమ్ములుంటూ, వారంతా కుటుంబాలతో సహా పొలంలో పనిచేయటంవలన పాలేర్లకోసం, కూలీలకోసం అయ్యే ఖర్చు తగ్గిపోయేది.

అంతా ఇంటివారే కావటంతో పంటను కాపాడుకోవటం సులభమయ్యేది. కుటుంబ ఖర్చులు కూడా చాలా తగ్గిపోయేవి. తండ్రిలేక అన్నదమ్ములలో ఒకరు వడ్డీవ్యాపారం, నాగులు మొదలగు లావాదేవీలు చూసుకునేవారు. అతడే సాధారణంగా దేశముఖులతో సంబంధం కలిగి ఉండేవాడు. ఇతడు కూడా అవసరమైనప్పుడు తక్కినవారితోపాటు పొలంలో కష్టించటం పరిపాటి.

సారవంతమైన నీటి వనరులుకల భూమి ఉన్న ధనిక రైతులకు మిగులు ఆదాయం హెచ్చుగా ఉంటుంది. వ్యాపార పంటలు పండే (నల్లరేగడి) భూమిలో మిగులు అంతా నగదుగానే ఉండేది కనుక వడ్డీ వ్యాపారం హెచ్చుగా సాగేది. పెద్ద నీటివనరులకింద భూములున్నవారి పరిస్థితికూడా ఇంతే. తమ భూమి అంతా మాగాణిగా మారిపోవడంతో ప్రాజెక్టు వచ్చిన కొద్దికాలానికే ధనిక రైతులు భూస్వాములై పోవటం మామూలు. అయినా నిత్యజీవితంలో కొంతకాలంపాటు ధనిక రైతు లక్షణాలు కొనసాగుతూ ఉండేవి.

పంటలు నమ్మకంగా పండే మంచి భూములుగల ధనిక రైతులలో కొందరు సంపదను పోగుచేసుకొని భూస్వాములుగా మారటం పరిపాటి. నీటి వనరులు లేని ప్రాంతాల్లో ఎప్పుడో ఒకప్పుడు కరువు వచ్చినప్పుడు తమ మిగులు ఆదాయంతో దానిని తట్టుకో గలిగేవారు. కాని వరుసగా కొన్ని ఏళ్ళవరకు కరువు వచ్చినప్పుడుమాత్రం వీరుకూడా ఆర్థికంగా దెబ్బతినేవారు.

ధనిక రైతుల కుటుంబ కష్టం ఆచార సాంప్రదాయాలపై ఆధారపడి ఉంటుంది. కొన్ని కులాలలో స్త్రీలలో చేనుకువెళ్ళి పనిచేసే సాంప్రదాయంలేదు. అప్పుడు కుటుంబ శ్రమ తగ్గిపోతుంది. పాలేర్లపై కూలీలపై హెచ్చుగా ఆధారపడవలసివస్తుంది. అయినా స్త్రీలు ఇంట్లో ఉండి పాడి, కోళ్ళ పెంపకం, వడ్డీ వ్యాపారం మొదలగు పనులన్నీ చేసి సంపదను సమకూర్చటానికి తోడ్పడేవారు.

గ్రామీణ జీవితంలో ధనిక రైతు పాత్రకు ఒక ప్రత్యేకత ఉంటుంది. ముందు ధనిక రైతు ఎవరో నిర్ణయించుకుంటే అతని పాత్రను సరిగ్గా అర్థం చేసుకోవచ్చును. కొన్ని రాజకీయ కారణాలవలన "స్వంతసాగు" చేసే పెద్ద భూస్వాములు కూడా తమకు తాము రైతులమని చెప్పుకోవటం నాటికీ నేటికీ సాగుతూనే ఉన్నది. భూస్వాములే రైతులుగా చలామణీ అవుతున్నప్పుడు ఒక ధనికరైతుని ధనికరైతని చెప్పటం అసాధ్యమైపోతుంది. ఇలాంటి వారందరినీ మధ్యతరగతి రైతులనీ లేదా సాధారణ రైతులనీ చెప్పేవారు. ఇది శాస్త్రీయ దృక్పథం కాదు. ఆనాటి కమ్యూనిస్టుల్లో కూడా ఈ జబ్బు బాగానే వ్యాపించి ఉండేది.

వీరుకూడా రాత్రింబవళ్ళూ (మెట్ట ప్రాంతాల్లో) పొలాలదగ్గరే జీవితం గడుపుతూ

ఉండేవారు. ఒక కుటుంబానికి ఒక బావి, ఆ బావికింద 5 నుంచి 10 ఎకరాలవరకు మాగాణి, దానిని ఆనుకొని, లేదా దానికి అందుబాటులో సుమారు 25 నుంచి 50 ఎకరాల వరకు మెట్టభూమి ఉండేది. పశువులు, పశువుల కొట్టం, నివాసానికి ఒక గుడిసె అక్కడే ఉండేవి. పశువులను కాపాడుకుంటూ మాగాణి మెట్టభూమిని సాగుచేస్తూ ఉండే వారు. మాగాణికి ఆనుకొని ఉన్న ఒకటిరెండు ఎకరాల భూమిలో మిర్చి, పొగాకు మొదలగు వ్యాపార పంటలు పండించేవారు. దీనికోసం రాత్రింబవళ్ళు వీరు అక్కడే వుండి మోటలు (కపిలలు) కొట్టేవారు. మధ్యాహ్నానికి పూర్వమే స్త్రీలు సద్దులు తెచ్చి పెడితే అక్కడే తిని ఉండేవారు. ఇంటికి వెళ్ళటం చాలా అరుదు. కుటుంబంలో చాలా మంది ఉన్నప్పుడు కొందరు ఇంటికి వెళ్ళివస్తూ ఉండేవారు. కొన్ని ప్రాంతాలలో బావి దాపుననే ఇళ్లు వేసుకొని కుటుంబం, లేక కుటుంబాలన్నీ అక్కడే నివసించేవి. ఇలాంటి ఇళ్ళ సముదాయాన్ని ఆ కుటుంబం పేరుగల 'గూడెం' అని పిలిచేవారు. ఇప్పటికీ ఇలాంటి గూడెములు (గూడాలు) చాలా ఉన్నాయి. ఇలాంటి సమిష్టి జీవితం వ్యవసాయం బాగా సాగవడానికి, పొదుపుకు, ఆదాయాన్ని పెంచడానికి ఉపయోగపడేది.

నల్లరేగడి భూములు, నీటివనరులు ఉన్నచోట ధనిక రైతు జీవితంలో కొంత మార్పు ఉండేది. ఉదయం వెళ్ళి పగలంతా పనిచేసుకొని సాయంత్రం తిరిగి వచ్చేవారు. దినమంతా శ్రమచేసి పాలేర్లతో పనిచేయిస్తూ పంటను కాపాడుకునేవారు. కొన్ని ప్రాంతాలలో పాలేర్లకు అన్నంపెట్టే ఆనవాయితీ ఉండటంవలన స్త్రీలు పురుషులకి తెచ్చే సద్దులతో పాటు పాలేర్లకు కూడా సద్దులు తెచ్చిపెట్టేవారు.

మొత్తంగా చూసినప్పుడు మెట్టప్రాంతాలలో ధనిక రైతులు తమపొలాలలో ఇళ్ళు ఉంటే తప్ప ఇంటి దగ్గర ఉండటం అరుదు. కొన్ని ప్రాంతాలలో ఇప్పటితరం ధనిక రైతు జీవితంలో స్వల్పమైన మార్పువచ్చింది. కుటుంబ కష్టం తగ్గింది. వ్యయం పెరిగింది. పాలేర్లు, వ్యవసాయ కూలీలపై హెచ్చుగా ఆధారపడవలసి వస్తున్నది. ఇటీవలి కాలంలో పెద్దభూస్వాములూ, దివాలాతీసినవారూ అమ్ముకున్న భూములలో కొంతభాగాన్ని కొని కొందరు ధనిక రైతులు భూస్వాములైనారు.

## 3. మధ్యతరగతి రైతు

వీరంతా శ్రమజీవులే. కుటుంబమంతా రాత్రింబవళ్ళు కష్టించి పనిచేసేవారు. బిడ్డలను చదివించుకోడానికి నోచుకోక వారితో పొలంలో పనిచేయించేవారు. కూలీలను అరుదుగా పెట్టుకునేవారు. ముఖ్యంగా మాగాణి నాటు సందర్భంలో కూలీల అవసరం

కలిగేది. తక్కిన పనులన్నీ ఇంటివారే చేసుకొనేవారు. ఎదిగిన కొడుకులు లేనప్పుడు పశువుల కాపుకోసం చిన్నపాలేరును సంవత్సర జీతంపై పెట్టుకునేవారు. ఇలాంటి పాలేరుకు రైతురే తిండిపెట్టేవారు. ధనికరైతులకు వీరికిగల భేదమంతా పాలేర్ల కూలీల సంఖ్య స్వల్పంగా ఉండటమే. కుటుంబకష్టం హెచ్చుగా ఉంటుంది. కూలీల కష్టం తక్కువగా ఉంటుంది. కరువుకాటకాలు వచ్చినా, ఇంట్లో ఎవరైనా దీర్ఘకాలంవరకు జబ్బునపడినా, మరే కష్టాలు వచ్చినా మధ్యతరగతి రైతులు అప్పులపాలై క్రమంగా భూమిని రుణ దాతకు తెగనమ్మి, పేదరైతు, కౌల్దారు, లేక పాలేరుస్థాయికి తగ్గిపోయేవారు. వీరిపై భూస్వాముల, పటేలుపట్వారీల దోపిడీ బాగాసాగేది. గీత మొదలగు వ్యవసాయేతర వృత్తులు కలవారు తమ వృత్తితోపాటు వ్యవసాయపు పని కూడా చేసుకునేవారు.

పెద్దగ్రామాల్లో మధ్యతరగతి రైతుల సంఖ్య హెచ్చుగా ఉండేది. వారికి స్వంత భూమి ఉండటమే దీనికి కారణం. భూస్వామి ఎంతపెద్దవాడైనా పెద్దగ్రామంలో ఉండే భూమికంతటికీ అతడు యజమానికావటం అసంభవం. అది నాసిరకపుదే కావచ్చు, కుంటలలాంటి జలాధారాలక్రింద వున్నదే కావచ్చు, లేదా మెట్టభూమే కావచ్చు. ఎంతో కొంత భూమిపై మధ్యతరగతి రైతులకు యాజమాన్యం (పట్టా) ఉండేది. కొన్ని సందర్భాలలో కౌల్దారులలో కూడా కొందరు మధ్యతరగతి రైతులు ఉండేవారు. చిన్న గ్రామాల్లో భూమిఅంతా, లేదా భూమిలో అత్యధికభాగం భూస్వామిదే కావడం వలన ఇలాంటివారు ఏ ఒకరిద్దరో ఉండేవారు.

వ్యాపారపంటలు పండే నల్లరేగడి ప్రాంతాలలో, నీటివసతులు గల ప్రాజెక్టులు ఉన్నప్రాంతాలలో మధ్యతరగతిరైతు జీవితంలో కొద్దిమార్పు ఉండేది. కుటుంబమంతా కష్టించటం మామూలే. కాని రాత్రింబగళ్ళు ఇల్లును కూడా వదిలి పొలంలో ఉండవలసిన అవసరం ఉండేదికాదు. పంటలకాలంలో కాపలా ఉండేవారు మిగతాకాలాల్లో దినమంతా పనిచేసి సాయంత్రం ఇల్లుచేరుకునేవారు. ప్రాజెక్టు ప్రాంతాల్లో పనిలేనిరోజులు కూడా ఉంటాయి. ఆకాలంలో వేరే పనులుచేసి కొంత అదనపు ఆదాయాన్ని సమకూర్చు కునేవారు.

మధ్యతరగతిరైతు అవడానికి సమిష్టి కుటుంబ జీవితం చాలా ఉపయోగపడేది. భూమి కొద్దిగా ఉన్నప్పుడు లేదా కౌలుభూమిని సాగుచేసినప్పుడు కుటుంబ సభ్యులంతా రాత్రింబవళ్ళు పనిచేయడమేగాక మిర్చి, పొగాకులాంటి వ్యాపారపంటలు పండించేవారు. పశువులను పోషించేవారు. తమకున్న కొద్దిభూమిలో ఎరువు బాగావేసి, ఒకటికి నాలుగు సార్లు దున్ని హెచ్చుపంట పండించేవారు. ఈ విధంగా— విడిగాఉంటే పేదరైతులై జీవించవలసినవారు కలసివుంటూ మధ్యతరగతి రైతులై జీవించేవారు. కుటుంబ పెద్దలు

చెప్పినట్లు నడుచుకోవటం వారి సాంప్రదాయం. నాలుగైదు సంవత్సరాలపాటు పంటలు కలిసివస్తే వీటిలో ఒకటి రెండు ధనిక రైతు కుటుంబాలయ్యేవి.

మధ్యతరగతి రైతుల్లో కొందరు పేదరైతుల స్థాయికి దిగిపోవటం మామూలు. ఇలాంటి పరిస్థితులు ఏర్పడటానికి భూస్వామ్య దోపిడీ ప్రధానకారణమైనప్పటికీ అనావృష్టిలాంటి అంశాలన్నీ తమవంతు పాత్రను నిర్వహించేవి.

వీరు ఫ్యూడల్ వ్యతిరేక పోరాటాలలో చివరంటూ పాల్గొనేవారు. ఈ కుటుంబాలనుంచి వచ్చిన కార్యకర్తలు నిలకడతో పనిచేసేవారు; ఇలాంటివారు ప్రజలను మధ్యలో వదిలివేసి వెళ్ళిపోవడం అరుదు. ఈ పరిస్థితి ఇప్పటికీ కొనసాగుతున్నది.

## 4. పేద రైతులు

తమ కుటుంబాన్ని పోషించుకోవడానికి చాలినంత భూమిలేక వ్యవసాయ కూలీలై, ఇతర వృత్తులు చేసుకొని జీవించేవారిని పేదరైతులంటాము. వీరు సాగుచేసే చిన్న కమతాన్ని కొన్ని ప్రాంతాల్లో 'గుడ్డం' అని అంటారు. సాగుభూమిలో హెచ్చు భాగానికి భూస్వాములే యజమానులు కావటంవలన ఇలాంటివారి సంఖ్య చాలా హెచ్చుగా ఉండేది. కొందరు పట్టాదారులు, మరికొందరు కౌల్దారులై ఉండేవారు. కొందరికి పట్టా భూమి ఉన్నా అది చాలక కొంత భూమిని కౌలు తీసుకొని జీవించేవారు. కుటుంబంలో ఒకరు తమకున్న భూమిని సాగుచేస్తే, మరొకరు పాలేరుగానో, దినకూలిగానో పనిచేసేవారు. స్త్రీలూ, పిల్లలూ తమ భూమిలో పనిచేయటంతోపాటు ఇతరులకు కూలిపనికి వెళ్ళేవారు. భూమి సాగుచేసే వ్యక్తి కూడా మిగులు సమయంలో కూలిపని చేసేవాడు. 'పైకులాలకు' చెందినవారు తమ జీవితం దుర్భరంగాఉన్నప్పుడే పాలేర్లుగానూ, కూలీలుగానూ పనిచేసేవారు. తరచుగా వీరు భూస్వాముల భూమిని కౌలుకో, పాలుకో సాగుచేసి తమ రైతు జీవితాన్ని నిలబెట్టుకునేవారు. 'వెనుకబడిన కులాల'కు చెందినవారైతే పాలేర్లుగానూ, దిన కూలీలుగానూ పనిచేయటం సర్వసామాన్యం.

వీరి జీవితం నికృష్టంగా ఉండేది. భూమి చాలకపోవటంవలన తరచుగా అప్పులకు పరిగెత్తవలసివచ్చేది. అప్పులవాళ్ళు (భూస్వాములు, షావుకార్లు, ధనిక రైతులు) ఇతనికున్న ఆస్తిమీద కన్నువేసి అప్పులు పెట్టేవారు. ఒకానొక దశలో ఆ భూమిని అప్పులవారికి కుదువబెట్టి, తర్వాత తెగనమ్మి తన పశువులను కూడా అప్పులక్రింద ఇచ్చివేసేవాడు. ఈ మార్పులననుసరించి అతడు కౌల్దారయ్యేవాడు, లేదా భూమి పాలుకుచేసే రైతుగా మారిపోయేవాడు. కొంతకాలం తర్వాత పాలేరుగానో వ్యవసాయ

కూలీగానో తయారయ్యేవాడు. 'పూలు అమ్ముకున్నచోట కట్టెలమ్ముకునే' ఈ కొత్త జీవితాన్ని భరించలేక వీరిలో కొందరు ఇతర ప్రాంతాలకు వలసవెళ్ళేవారు. పరిసర పట్టణాలు, హైదరాబాదు, విజయవాడ సింగరేణి బొగ్గు గనులు ఇలాంటివాటిలో ముఖ్యమైనవి. ఈ ప్రాంతాలలో వలసవచ్చినవారు నేటికీ అసంఖ్యాకంగా ఉన్నారు. బొంబాయి తదితర జౌళి మిల్లులుగల ప్రాంతాలకు వెళ్ళిన చేనేతవారి సంగతి సరేసరి. వీరిలో చాలామంది వలసవెళ్ళటానికి పూర్వం పేదరైతులే.

కుటుంబపోషణకు తమకున్న భూమి చాలనప్పుడు కూలీపని చేయవలసివచ్చేది. అప్పుడు తమ భూమిని సాగుచేయటాన్ని వెనక్కి పెట్టి కూలీపనికి ప్రాధాన్యతనిచ్చేవారు. అప్పులవారూ, దొరలూ కూలీకి రమ్మన్నా లెక మరోవిధమైన పనిచెప్పినా సాగును వదిలివేసి వారి పనులకు వెళ్ళవలసివచ్చేది. 'దరిద్రుని తలగడుగ వడగళ్ళవాన' అన్నట్టుగా తనకున్న ఎకరాన్ని, అరఎకరాన్ని సాగుచేసుకోనీయకుండా వీరు అతనిని నిర్బంధంగా కూలీగా మార్చివేసేవారు. వేరేవృత్తులవారైతే ముందు దొరల అవసరాలను తీర్చి, తర్వాత ఇతరులకోసం తమ వృత్తిపని చేయవలసివచ్చేది. దొరలకు చేసేదంతా వెట్టిచాకిరేగనుక తమ ఆదాయానికి గ్రామ ప్రజలపై ఆధారపడవలసివచ్చేది. అదీ స్వల్పమే. ఫలితం దరిద్రం.

తనకున్న భూమికి తగిన నీటివనరులు లేకపోవుటవలన సాగు చేసుకోవటమే కష్టం. కొన్ని సందర్భాలలో పశువులు కూడా ఉండేవికావు. తనకున్న ఎరువుని అప్పులవారికి, దొరలకు ఇవ్వవలసివచ్చేది. దానితో తనపొలానికి ఎరువు ఉండదు. అప్పటికీ సాగుచేస్తే మంచివిత్తనాలు దొరకవు. నాసిరకం విత్తనాలను ఉపయోగిస్తే సగంపైరు భూమిలోనే చచ్చిపోయేది. కూలీపనులకు, వెట్టిపనులకు వెళ్ళడంవలన మిగిలిన పైరును కూడా కాపాడుకోవడం సాధ్యంకాకపోయేది. పంట సమయంలో కూడా దొరల పనులకు వెళ్ళవలసిరావడంవలన పైరును, పంటను కాపాడుకోవటం సాధ్యపడేదికాదు. దీనితో పైరు పశువులపాలై, పంట పక్షులపాలై విత్తనాలు కూడా మళ్ళక, వాటితో నాగుల ధాన్యం బాకీని తీర్చలేక భూమిని పోగొట్టుకున్న అభాగ్యులెందరో ఉండేవారు.

పేదరైతులు పంటలు ఇంటికి వచ్చిన రోజుల్లోనే రెండుపూటలు కడుపునిండా అన్నం తినేవారు. తక్కిన రోజుల్లో అర్ధాకలితో జీవించేవారు. అప్పులు తెచ్చుకున్నా, కడుపునిండా తింటే అప్పులభారం పెరుగుతుందని తగ్గించి తినవలసి వచ్చేది. ఇంటి యజమానికి తిండిలో హెచ్చుభాగం దొరికేది. ఆడవారు, పిల్లలు తగ్గించితినేవారు. గంజి లేక నీళ్ళలో కలిపిన అన్నం వారి మామూలు ఆహారం. పంటరోజుల్లో కారంతో పొడి అన్నం తినేవారు. పండుగరోజుల్లో అప్పుచేసి మాంసం తినటం పరిపాటి. కల్లు, సారాయి

తాగాలని కోరుకునేవారేగాని దొరకటం అరుదు. పండుగరోజుల్లో మాంసంతోపాటు దీనిని కూడా సేవించేవారు.

పేదరైతులు ఒంటినిండా బట్టలు వేసుకోవడం అరుదు. చొక్కా ఉండేదే కాదు. నెత్తికి చుట్టుకోటానికి పాతగుడ్డ ఉండేది. దినమొలకాకుండా మోకాళ్ళవరకు ఏదో ఒక గుడ్డ ఉండేది. చలిని తట్టుకోడానికి ఒక గొంగడి లేదా దుప్పటి ఉండేది. ఒకసారి దానిని ఖరీదుచేస్తే 10-20 ఏళ్ళు ఉపయోగపడేది. చిరిగిపోయిన గుడ్డలకు మాసికలు వేయటం నిత్యకృత్యం. పిల్లలకు చిన్నతనంలో గుడ్డలుండేవికావు. పెద్దవాళ్ళవుతున్నా కొద్దీ చిరిగిన గుడ్డలతో ప్రారంభించి క్రమంగా తక్కిన వారిలో చేరేవారు. పెద్దవారికీ, బట్టలుకట్టే పిల్లలకూ ఉన్న తేడా ఏమంటే : పెద్దలు సంవత్సరానికి ఒకసారైనా కొత్త బట్టలు కట్టేవారు. కానీ పిల్లలకు ఆ భాగ్యమైనా అబ్బకపోయేది.

వారిలో చదువుకోవాలనే ఆకాంక్ష చాలా ఉన్నప్పటికీ బడి (స్కూలు) దరిలోకి వెళ్ళటంకూడా సాధ్యపడేది కాదు. చిన్నతనం నుంచీ కష్టించి పనిచేయాలి. కూలీ పనికి వెళ్లాలి. పశువులను కాయాలి. కుటుంబ పోషణకు ఇదంతా అవసరం. ఈ పరిస్థితుల్లో వారికి చదువు అసాధ్యమయ్యేది.

కలరా, స్ఫోటకంలాంటి అంటువ్యాధులు సోకినప్పుడు అర్ధాకలితో ఉండే పేద రైతులు వీటికి హెచ్చుగా గురయ్యేవారు. సాంప్రదాయకమైన నాటువైద్యులతో మంత్రగాళ్ళతో ఈ జబ్బులు తగ్గకపోయేవి. అవి కొంతకాలంపాటు వీరిని బాధించి కొందరి ప్రాణాలను తీసి తగ్గిపోయేవి. ఈ విధంగా గ్రామీణ దారిద్ర్యాన్ని అనుభవించే వారిలో హెచ్చుభాగం వీరే. అన్ని కులాలలోనూ వీరి సంఖ్య ఏదో మేరకు ఉండేది. "వెనుకబడిన కులాల" వారిలో అత్యధికభాగం వీరే.

## 5. కౌలుదారులు

1954లో ప్రభుత్వం ప్రకటించిన అసమగ్రమైన లెక్కలప్రకారం తెలంగాణాలో ఒకకోటి 16 లక్షల ఎకరాల పట్టా భూమిలో 24 లక్షల 68 వేల ఎకరాల భూమిని (దాదాపు నాలుగోవంతు) 8లక్షల 35 వేల కౌలుదార్లు కౌలుపై సాగుచేసేవారు. 1940 నాటికి కౌల్దార్ల సంఖ్య, వారు సాగుచేసే భూమి విస్తీర్ణం ఇంతకన్నా హెచ్చుగానే ఉండేది.

కౌలుదారులు కూడా పేద రైతులే. వారు పండించే పంట చాలా తక్కువ. చాలాకాలం ఒకే భూమిలో కౌలుదారై సాగుచేసేవారు. ఒకమేరకు ఆ భూమిని పంటకు

తెచ్చుకోవడానికి ప్రయత్నించేవారు. అయినా నీటి వనరులు, తగిన పశువులు, ఎరువులు వేయటానికి అవకాశం లేకపోవటంవలన పంట తగ్గిపోయేది. దీనితోపాటు దొరలకు కౌలు చెల్లించాలి. చిరకాలంగా కౌలును చేస్తున్న భూములపై కౌలురేటు కొంత తక్కువ ఉన్నప్పటికీ, ఇతర రూపాలలో ముడుపులు చెల్లించవలసివచ్చేది. తన పశువులతో వారి పొలాలను దున్నవలసివచ్చేది. పెంచుకున్న కోళ్ళనూ, గొర్రెలనూ, మేకలనూ ఉచితంగా ఇవ్వవలసివచ్చేది. అవసరమైనప్పుడు ఎట్టి ప్రతిఫలం లేకుండానే వారి పనులన్నీ చేయవలసివచ్చేది. ఈ విధంగా వారు తమ భూమిని పేరుకుమాత్రమే సాగు చేసేవారు. రైతులని పేరేకాని వారు తమ కష్టమంతా తమభూమిలోకాక భూమి వెలుపల చేసేవారు.

ఒకటి రెండు సంవత్సరాలకోసం కౌలుకు తీసుకునే భూముల్లో కౌలురేటు హెచ్చుగా ఉండేది. ఎకరానికి 50 రూపాయలనుంచి వందరూపాయలవరకు (మాగాణిలో), మెట్టలో 5-10 రూపాయలు అంతకన్న హెచ్చుగా ఉండేది. ఎకరానికి 4 బస్తాలనుంచి 8 బస్తాల వరకు ధాన్యం ఉండేది. దీనిని మక్తా అనేవారు. భూమిపాలు : చెరువుకింద సాగయ్యే భూమిలో పండిన పంటలో సగభాగం భూస్వామికి, మిగిలినది రైతుకు చెందేది. ఖర్చులను (విత్తనాలు, కూళ్ళు, వేసిన మేరకు ఎరువులు) ఉమ్మడిగా (చెరిసగం) భరించే వారు. బావులకింద సాగయ్యే పొలాలలో (మాగాణి) ఒకభాగం భూస్వామికి, రెండు భాగాలు రైతుకు చెందేవి. ఖర్చులు సాధారణంగా రైతే భరించవలసివచ్చేది. ధాన్యానికి, వ్యాపారపంటలకు ధరలులేనప్పుడు కౌలురేట్లు ఎంతతక్కువ ఉన్నా కౌలుదార్లు నష్టపడేవారు.

కౌలుదార్లను భూస్వాములు ఎలా ఇబ్బంది పెట్టేవారో ఈ క్రింది సంఘటన స్పష్టం చేస్తుంది :

"(గుమ్మడివెల్లి) ఈ ఊరిలో గ్రామాధికారులకు మూడు పాళ్ళ భూమి, రైతుల కొకపాలు పట్టాలున్నవి. కావున కౌల్దారు ఇమ్మడి ముమ్మడేగాక అయిదింతలు పదింతలు పట్టెదారులకు మునాఫలిత్తురు. ఈ ఏడు బాబీ కిస్తులో సర్కారీరకం బాకీపెట్టుటచే కౌల్దారుల పశువులు జప్తీచేసి తహశీల్ కచేరివారు పట్టుకొనిపోయిరి. కౌల్దారులు పట్టె దార్లకు ముందువచ్చే సన్ 1335 ఫసలీ కౌలురకము ఇయ్యగా సర్కారీలో ఉన్న పశువులు విడుదల అయ్యెను. కౌల్దారుకు ఏ విధమయిన హక్కు లేనప్పటికి సర్కారి రకమునకు బాధ్యులగుటయెట్లో !" (గోలకొండ పత్రిక : 18-7-1935)

ఈ వార్తలో కొన్ని అంశాలు స్పష్టమవుతున్నవి. 1) గ్రామములో నాలుగింట మూడువంతుల భూమి గ్రామాధికారులైన భూస్వాముల చేతుల్లో ఉన్నది. ఒకవంతు

మాత్రమే రైతుల యాజమాన్యంలో ఉండుటవలన భూస్వాముల భూమిని కౌలుతీసుకొని సాగుచేయటం తప్పని సరి అయ్యేది. 2) కౌలు శిస్తులు భూమి శిస్తుకన్నా రెండు రెట్ల నుంచి 10 రెట్లవరకు చెల్లించవలసివచ్చేది. 3) కౌలుదారులు భూస్వాములకు ఇవ్వవలసిన కౌలు శిస్తు ముందే చెల్లించారు. కాని భూస్వాములు ప్రభుత్వానికి చెల్లించవలసిన శిస్తు చెల్లించలేదు. 4) ప్రభుత్వం భూమి శిస్తును భూస్వాములనుంచి వసూలు చేయక కౌలుదార్లనుంచి వసూలుచేయ తలపెట్టి వారి పశువులను జప్తుచేసింది. 5) కౌల్దార్లు రాబోయే సంవత్సరపు శిస్తును ముందే చెల్లించి పశువులను విడిపించుకువచ్చారు. 6) భూస్వామి కౌల్దారులను భూమినుంచి వెళ్ళగొడితే రక్షణ ఇవ్వటానికి ప్రభుత్వం నిరాకరిస్తుంది. కానీ భూస్వామి చెల్లించవలసిన శిస్తును ఆ భూమిని సాగుచేసినంత మాత్రాన కౌల్దారునుంచే వసూలుచేసింది. బాధ్యతకు కౌల్దారు కాని, హక్కుకు కాదని ఇది స్పష్టంచేస్తున్నది. ప్రభుత్వమూ, భూస్వాములూ కలిసి చేసిన దౌర్జన్యమిది. ఇలాంటి సంఘటనలు ఎక్కడో ఒకచోట జరిగేవని అనుకోవటం పొరపాటు. భూస్వాములు కౌల్దారులను ఇబ్బందిపెట్టాలనుకున్నప్పుడు ఇలాంటి దుర్మార్గపు పనులు చేసేవారు.

## 6. వ్యవసాయ కూలీలు

పేదరైతు జీవితం లేక పూర్తిగా వ్యవసాయకూలీలై జీవించేవారి సంఖ్య కొద్దిగా ఉండేది. భూమిఒత్తిడి అంతగా లేనందున ప్రతికుటుంబానికీ ఎకరమో, అర ఎకరమో భూమి ఉండేది. దానిని సాగుచేసుకుంటూ తమ మిగతాకాలాన్ని భూస్వాముల ధనిక రైతుల పొలాల్లో లేక భూస్వాములకు ఇతరవిధాల చాకిరీచేయటంలో గడిపేవారు. అప్పటికీ గ్రామాల్లో బొత్తిగా భూమిలేని వారిసంఖ్య కొద్దోగొప్పో ఉండేది. జాగ్రత్తగా పరిశీలిస్తే ఇలాంటివారిలో కొందరు బ్రతుకుతెరువుకోసం ఇతరగ్రామాలనుంచి వచ్చిన వారు, మరికొందరు కాలక్రమంలో తమ భూమినంతటినీ పోగొట్టుకొని కౌలుదారులుగా కూడా జీవించనోచుకోనివారు. అయినా పెద్దగ్రామాల్లో 10 నుంచి 15 శాతం వరకు ఇలాంటివారు ఉండేవారు. చిన్నగ్రామాల్లో చాలా స్వల్పంగానే ఉండేవారు.

పాలేర్లుగా ఉండేవారు దొరలకు, ఇతర భూస్వాములకు, ధనికరైతులకు ఊడిగం చేయాల్సిందే. వారికిచ్చే జీతం బహుకొద్ది. వారుచేసే పని హెచ్చుగా ఉండటంవలన జీవితం నికృష్టంగా ఉండేది. బాగా వెనుకబడినప్రాంతాల్లో నెలసరిజీతం సుమారు 20 శేర్ల వడ్లు ఉండేది. గట్టిధాన్యమైతే (జొన్నలు, సజ్జలు) దానిలో సగంమాత్రమే ఉండేది. మధ్యస్థంగా ఉండే ప్రాంతాలలో నెలకు 40 శేర్లు, 4 అణాలు (తూము వడ్లు,

పావలా) ఉండేది. దీనితోబాటు సంవత్సరానికి పైజీతంపేరుతో కొంతధాన్యం, ఒక చెప్పుల జోడు అదనంగా ఇచ్చేవారు. 2-3 సం॥ల దాకా జీతం ఉండేవారికి ఒక గొంగడి కూడా ఇచ్చేవారు. (ఇది కొన్ని ప్రాంతాల్లో మాత్రమే అమల్లో ఉండేది). మంచిధాన్యానికి బదులు నాసిరకం ధాన్యాన్ని ఇచ్చేవారు. సరిహద్దు ప్రాంతాలైన (కృష్ణా, గుంటూరు) హుజూరునగరు, ఖమ్మం, మధిర తాలూకాలలో రోజూ అన్నంపెట్టి సంవత్సరానికి 200 రూపాయల నుంచి 600 రూపాయల దాకా ఇచ్చేవారు. ఇలాంటి జీతంలో పనిగంటలు, పనిభారం హెచ్చుగా ఉంటుంది. ఇతరప్రాంతాల్లో ఇద్దరుముగ్గురు పాలేర్లు చేసేపని ఒక్కరే చేస్తారు ; చేయిస్తారు. ధాన్యం తీసుకునేవారు. ఏనెలజీతం ఆనెల తీసుకొని కుటుంబపోషణ చేసుకునేవారు. కుటుంబ అవసరాలకోసం ధాన్యమూ, డబ్బూ అప్పుతీసుకొని దానిని తీర్చడంకోసం సతమతమవుతూ ఉండేవారు. తరచుగా పైజీతంపేరుతో ఇచ్చే ధాన్యం, డబ్బు అప్పుకింద చెల్లించినా నాగు, వడ్డీకి సరిపోయేది కాదు. దీని ఫలితంగా ప్రతి సంవత్సరం తీసుకునే అప్పు పోగవుతూ అతని జీవితంలో తీర్చలేని స్థితి ఏర్పడేది. వారసత్వంగా లభించిన ఈ అప్పును తీర్చలేక అతని మగ సంతానం బాల్యంనుంచీ పెద్దవాళ్ళయిందాకా పాలేర్లుగానే జీవించేవారు. అనేక సందర్భాలలో మూడు లేక నాలుగు తరాలదాకా వారికి ఈ జీవితం తప్పనిసరి అయ్యేది.

శేరిదారులు పాలేర్లపై దౌర్జన్యం చేసేవారు. క్రూరంగా వ్యవహరించేవారు. పని చేయలేదనీ, దొంగతనం చేశాడనీ, ఇంకేదైనా కారణం చూపెట్టి వారిని దెబ్బలుకొట్టేవారు. పాలేర్ల సంఖ్య హెచ్చుగా ఉన్నప్పుడు పని ఒత్తిడి తక్కువ ఉండేది. కొన్ని సందర్భాలలో సేరిదారులే కాక, తెలివైన కొందరు పాలేర్లు తాము దొరల పాలేర్లమన్న ధీమాతో గ్రామ రైతులపైన, ఇతర పేదలపైన పెత్తనం చేసేవారు. దొరలు ఇలాంటి సంఘటనలను చూసీచూడనట్టు దాటవేసేవారు.

చెరువులో నీళ్ళు ఉన్నంతవరకూ పొలాన్ని దున్ని నాటుకు సిద్ధంచేయటమే ప్రధానమైన పనవుతుంది. అయినా మెట్టసాగులో సంవత్సరమంతా పని ఉంటుంది. తొలకరిలో విత్తనాలు వేయటం ప్రారంభించి ఒక పైరు తర్వాత మరొకపైరు వేయటానికి భూమిని దున్ని సిద్ధంచేసేవారు. ముందు సజ్జలు, తర్వాత పెసలు, నువ్వులు, ఆముదాలు, జొన్నలు ఇలాంటివి ఒకదాని తర్వాత ఒకటి వేయవలసివచ్చేది (వాతావరణాన్నిబట్టి, ప్రాంతాలనుబట్టి ఈ వరుసక్రమం ఉండేది). దున్నవలసిన భూమికూడా చాలా ఉండేది. సాధారణ రైతు మాదిరిగా శ్రద్ధతో సాగు (అంతర్ కృషి) చేయకున్నా పనిమాత్రం హెచ్చుగా ఉండేది. చెరువులో నీరు లేనప్పుడు రెండవపంటకోసం (వేసంగి = దాళ్వా) మిర్చి, పొగాకులాంటి తోటలు పెంచటానికి మోట తోలవలసి వచ్చేది.

మాగాణికి నీరు పెట్టటానికి రాత్రి రెండుగంటలనుంచీ ఉదయం 8 లేక 9 గంటలదాకా నిద్ర మానుకొని పనిచేయవలసివచ్చేది. కొన్ని సందర్భాలలో జట్లుగా పనిచేసేవారు. మళ్ళీ సాయంత్రం 4 నుంచీ రాత్రి 7 గంటలదాకా నీటి పని సాగేది. నీటి ఎద్దడి హెచ్చుగా ఉన్నప్పుడు దాదాపు 24 గంటలూ జట్లుజట్లుగా పనిచేసేవారు. అన్నిటి కన్నా నికృష్టమైన పని ఇదే ఉండేది. వీరు తమ ఇళ్ళల్లో భోజనంమాత్రమే చేసే వారు. కుటుంబ జీవితం స్వల్పం. పని ఒత్తిడి లేనప్పుడు ఇంటిదగ్గర కొంతకాలం గడపటానికి అవకాశముండేది. పశువులు, పంట కాపలా కాయడానికి రాత్రిళ్ళు వెళ్ళి అక్కడే పడుకోవలసి వచ్చేది. పాలేర్ల సంఖ్య హెచ్చుగా ఉన్నప్పుడు ఈ పనులలో కొంత సర్దుబాటుకు అవకాశముండేది. ఈ విధంగా తక్కువ ఆదాయం హెచ్చు పనితో పాలేర్లు బాధపడుతూ ఉండేవారు.

దేశముఖులుకాని భూస్వాములు, పటేళ్ళు, ధనిక రైతులనుంచి భూస్వాములైనవారు తమ వ్యవసాయాన్ని తామే అజమాయిషీ చేసుకుంటారు. వారికి పాలేర్లు హెచ్చుగంటలు పనితోబాటు కేంద్రీకరించి చేయాల్సివచ్చేది. ఫలితం కొద్దిజీతంతో హెచ్చుశ్రమ. దౌర్జన్యాలు, క్రూరత్వం మాత్రం ఉండకపోయేవి. ఈరకపు భూస్వాములు హెచ్చు పంటలు పండించగలిగేవారు. అప్పులుతీరక రెండుమూడు తరాలదాకా పాలేరులై పని చేయటం వీరిదగ్గర కూడా పరిపాటి. పట్వారీల వ్యవసాయాలు తరచుగా అస్తవ్యస్తంగా ఉండేవి. పాలేర్లతో శ్రద్ధగా పనిచేయించే స్థితి వీరిలో ఎప్పుడూలేదు. దీనిఫలితంగా పాలేర్లకు కొంత వెసులుబాటు ఉండేది.

ధనికరైతులు స్వయంగా కష్టంచేయటంవలన పాలేర్లు వారితో సమానంగా, కొన్నిసార్లు హెచ్చుగా పనిచేయవలసివచ్చేది. ఒకమేరకు సౌమ్యమైన ప్రవర్తన ఉన్నప్పటికీ పని హెచ్చుగానే చేయవలసివచ్చేది. పాలేర్లను సంతృప్తిపరచటానికి అప్పుడప్పుడూ ఇంత అన్నంబెట్టి, కల్లుపోయించి తమ పనులను సాగించుకునేవారు. మొత్తంమీద పాలేర్లది అర్ధబానిస జీవితం. వారు ఒకరినుంచి మారాలనుకుంటే ఇవ్వ వలసిన అప్పునంతా తీర్చాలి. సహజంగా అతను తీర్చలేనందున కొత్త యజమాని ఆ అప్పులను తీరుస్తానని ఒప్పుకోవాలి. లేదా చెల్లించాలి. ఈ విధంగా కొంతకాలాన్ని వెళ్ళబోసి, విసిగి తనకున్న ఎకరాన్ని, అరఎకరాన్ని లేక పూరిగుడిసెను అప్పుకింద కట్టివేసి అందుబాటులోఉన్న బస్తీలకువెళ్ళి పొట్టపోసుకునేవారు. కొన్ని సందర్భాలలో కుటుంబంలోని ఒకరిద్దరు వెళ్ళిపోయి తమ సంపాదనలో కొంతభాగాన్ని మిగిల్చి అప్పు లను తీర్చేవారు. తాకట్టుపడిన భూమిని విడిపించుకునేవారు.

పాలేర్లతోపాటు రోజుకూలీలు ఉండేవారు. వీరందరి సంఖ్య జనాభాలో 15 నుంచి

20 శాతం. స్త్రీలు పాలేర్లుగా పనిచేసే సాంప్రదాయంలేదు. అయినా పాలేర్ల కుటుంబాలు తప్పనిసరిగా యజమానుల పొలాల్లో (మెట్ట, మాగాణి) పనిచేయవలసివచ్చేది. వారి సంఖ్య చాలనప్పుడు గ్రామంలోని ఇతర కూలీలు వచ్చేవారు. తరచుగా భూస్వాముల కమతాలు పెద్దవిగా ఉండటంవలన గ్రామంలోని పేదరైతు, కూలీ కుటుంబాలవారంతా వాటిలో పనిచేసేవారు. దొరలు తమ అధికారదర్పంతో కూలీలందరినీ సమీకరించటం వలన చిన్నతరహా భూస్వాములు, ధనిక రైతులు ఇబ్బందిపడేవారు. చేసేదేమీలేక తమ తమ పాలేర్ల కుటుంబాలతో పని ప్రారంభించి, దొరల కమతాల్లో పని పూర్తి అయిన తర్వాత వీరిపొలాల్లో పనిపూర్తి అయ్యేది. చిన్నభూస్వాములు, ధనిక రైతులు దొరల అక్రమవసూళ్ళు, పెత్తనపు భారాన్ని మోయటంతోపాటు వ్యవసాయపనుల్లో వచ్చే ఈ ఇబ్బందులను కూడా అనుభవించవలసివచ్చేది. అనేక సందర్భాల్లో దొరలమధ్య, చిన్న భూస్వాములమధ్య జరిగే సంఘర్షణలకు ఇలాంటి పరిణామాలు మూలకారణమయ్యేవి.

పాలేరుల జీవిత స్థితిగతులను మెరుగుపరచాలనే పేరుతో, నిజాంప్రభుత్వం 1936 లో ఒకచట్టాన్ని చేసింది. ఇలాంటిది ఒకటి ఉన్నదని ఇతరదేశాల్లో, ఇతర రాష్ట్రాల్లో ప్రచారం చేసుకోటానికి చేసిన చట్టమేకాని అమలుజరుపటానికి కాదు. దీనిలోని ముఖ్యాంశాలు :

1. పాలేరులను ఒక సంవత్సరంవరకే నియమించాలి.
2. పాలేరుల రుణాలపై 6 శాతానికి మించిన వడ్డీ ఉండకూడదు.
3. పాలేరులను వ్యవసాయం పనులకు, ఇంటి పనులకు మాత్రమే ఉపయోగించాలి.

దీని ప్రకారం పాలేరు ఒక సంవత్సరం వరకే పనిచేయాలి. జీవితాంతం పని చేయనవసరంలేదు. అప్పు రాబట్టుకోడానికి భూస్వామి దావా వేయవలసిందే కాని అప్పుకింద పనిచేయాలని నిర్బంధించటానికి వీలులేదు. హెచ్చువడ్డీని తీసుకోకూడదు. శాశ్వత బానిసత్వంనుండి ఏక్సాలా బానిసత్వానికి మార్పుని సూచిస్తుందీ చట్టం. అయినా పాలేరు ఒప్పందాన్ని ప్రతి సంవత్సరం పునరుద్ధరిస్తూ (renew చేస్తూ) శాశ్వత బానిసత్వాన్ని యథాతథంగా పొడిగించవచ్చును. అయినా భూస్వాములకు ఈ అవసరం కూడా కలుగలేదు. చట్టం అమల్లోకి రాలేదు. ఇలాంటి చట్టమున్నదని ఎవరికీ తెలియదు.

## 7. వెట్టిచాకిరీ చేసేవారు

వెట్టిచాకిరీ రెండు విధాల అమలుజరిగేది. అధికారులకు చేసే వెట్టిచాకిరీకి, గ్రామంలోని దొరలకు, పటేలు పట్వారీలకు చేసే వెట్టిచాకిరీకి కొంత బేధం ఉండేది.

నిబంధనల ప్రకారం అధికారులు తాము చేయించుకునే వెట్టిచాకిరీకి కొంత డబ్బు ఇచ్చుకోవాలి. అయినా ఇచ్చేవారు కాదు. ప్రతి గ్రామంలో సాధారణంగా ఒక పాక, కొంత ఆవరణ, కూర్చోటానికి ఒక అరుగుగల "చావుడి" ఉండేది. చిన్న అధికారులు వస్తే దీనిలోనే మకాం వేసేవారు. ప్రతిరోజూ దానిని ఊడ్చి నీళ్లు చల్లటానికి ఒకరు అవసరమయ్యేది. వారికి మంచినీళ్ళుతెచ్చి, వంటచేసి, కూర్చోటానికి పడుకోటానికి మంచాలు తెచ్చి చెప్పిన పనులు చేయాల్సివచ్చేది. కుమ్మరులు నీళ్లు తెచ్చి వంటచేసేవారు. చాకలివారు మంచాలు తెచ్చి ఇతర పనులు చేసేవారు. సామానును మరో గ్రామానికి చేరవేసేవారు. మాదిగలు చావడిని ఊడ్చేవారు. వారివెంట ఇతర గ్రామాలకు వెళ్ళేవారు. వారికి కావలసిన భోజన సామాగ్రి అంతా కోమట్లు అందించవలసివచ్చేది. కొన్ని సందర్భాలలో దొరలు, పటేలు పట్వారీలు తమ ఇళ్ళలోనే వీరిని మకాం చేయించేవారు. ఈ విధంగా చావడిలో ఉద్యోగస్థుల అవసరాలకోసం ఎప్పుడూ కొందరు పని చేయవలసి వచ్చేది. ఒక గ్రామంనుంచి మరో గ్రామానికి వెళ్ళడానికి రైతుల ఎడ్ల జతలు ఉపయోగించేవారు. బస్తీలలో ఉండే అధికారులకు కూడా వెట్టిచాకిరీ పనివారు ఊడిగం చేయవలసివచ్చేది. వారి ఫర్మాయిషీ ప్రకారం కట్టెలు, కోళ్ళు, యాటలు మొదలగునవన్నీ పటేలు పట్వారీలు పంపిస్తే వీరు చేర్చేవారు. ఈ పనులన్నీ అప్పటి కప్పుడే చేయవలసివచ్చేది. పై అధికారులు దౌరాకు (టూరుకు) వస్తే గ్రామంలోని సాధారణ ప్రజలందరినీ సమీకరించి పనులు చేయించేవారు. పూర్వం ఆయా బస్తీలలో ఉండే కోమట్లు అధికారుల అవసరాలకు తగినంత సామాగ్రి (బియ్యం, నెయ్యి మొదలగునవి) తీసుకొని వారివెంట వెళ్ళవలసివచ్చేది. ఆ పద్ధతి కొంతకాలానికి రద్దయింది. కాని దొరలు, పటేలు పట్వారీలు రైతులనుంచి అవసరమైన సామానులు, డబ్బుపోగుచేసి వచ్చినవారికి మర్యాదచేసేవారు. బస్తీ కోమట్లకు తప్పినప్పటికీ గ్రామాల్లోని కోమట్లకు, రైతులకు, సాధారణప్రజలకు మాత్రం వెట్టిచాకిరీ తప్పలేదు.

పోలీసుపటేలు "రోజునాంచా"ను (వారానికొకసారి గ్రామంలోని శాంతిభద్రతల గురించి పంపే రిపోర్టు) పంపటానికి వెట్టిపనివారిని ఉపయోగించేవారు. పట్వారీ శిస్తులు వసూలుచేసే సమయంలో, భూములను కొలతవేసే సమయంలో (ఏభూమి ఏమేరకు సాగయిందీ, ఎప్పుడుసాగయిందీ సర్వేనెంబరు ప్రకారం వివరాలు సేకరించుట. ఈ పని ప్రత్యేకంగా మాగాణికి సంబంధించినది), జమాబందీ సమయంలో (తహశీలు ఆఫీసుకు వెళ్ళి రికార్డు, సంవత్సరపు లెక్కలన్నింటిని అప్పగించిరావటం), వెట్టిపనివారిని ఉపయోగించేవారు. ఈ విధంగా ప్రభుత్వపు పనులనే పేరుతో వెట్టిచాకిరీ పెద్దఎత్తున సాగేది.

**దొరల ఇళ్ళలో వెట్టిచాకిరి :** ఇదిగాక దొరల, పటేలు పట్వారీల ఇళ్ళలో

స్త్రీలూ, పురుషులూ వెట్టిచాకిరీ చేయవలసి వచ్చేది. ఊడ్చిచల్లడం, బట్టలుతకడం, వారి ఇళ్ళలో అవసరమైన కారం, పిండి, పొడులు తయారుచేసే పనుల బాధ్యత స్త్రీలది. పురుషులు ప్రతిరోజూ లాంతర్లు శుభ్రంచేసి, కిరోసిన్ నింపి వెలిగించేవారు. ఇతర గ్రామాల్లో ఉండే బంధువులకు ఉత్తరాలు తీసుకువెళ్ళి జవాబులు తెచ్చేవారు. పయనమై వెళుతున్నప్పుడు బండ్లను తోలేవారు; బండ్లవెంట నడిచేవారు (ఆకాలంలో బండ్లు ప్రధాన రవాణా సాధనాలు.) ఈ పనులన్నింటికీ దొరలు 'బిచ్చాల'నీ 'మామూళ్ళ'నీ సంవత్సరం పేరిట కొంత పరిహారం ముట్టజెప్పేవారు. కొన్ని సందర్భాలలో ఇనాం భూములకు చెల్లించే శిస్తును దొరలే చెల్లించేవారు. ఇది మామూలు శిస్తులో నాల్గవ వంతువరకు ఉండేది.

దొరల వ్యవసాయపు పనుల్లో కూడా వెట్టిచాకిరీ ఉండేది. 'తెగ'లనే (వంతు) పేరుతో మాదిగలు సంవత్సరమంతా పనిచేసేవారు. పాలేర్లకు కావలసిన చెప్పులు, మోట బొక్కెనలకు తొండాలు తయారుచేసి ఇచ్చేవారు. చనిపోయిన పశువుల తోళ్ళను తీసి, శుభ్రంచేసి (ఊని), తొండాలకు, చెప్పులకు, ఇతర పనిముట్లు కొన్నింటికి ఉపయోగించేవారు. ఈ పనులన్నింటికీ కొంత 'పరిహారం' ఉండేది. చేసిన చాకిరీనిబట్టికాక, పండిన పంటనుబట్టి ఈ 'పరిహారా'న్ని నిర్ణయించేవారు. మొత్తంగా చూసినప్పుడు చేసినపనికన్నా 'పరిహారం' చాలా తక్కువగా ఉండేది.

తరతరాలుగా సాగిన ఈ వెట్టిచాకిరీని చేయడానికి పనివారు క్రమపద్ధతి ఏర్పరచుకునేవారు. 'వంతుల'వారీగా పనిచేయడమే ఈ క్రమం. ఒక సంవత్సరం కొన్ని కుటుంబాలు పనిచేస్తే మరుసటి సంవత్సరం మరికొన్ని కుటుంబాలవారు పనిచేసేవారు. కొన్ని సందర్భాలలో రెండు సంవత్సరాలకొకసారి మారుతూ ఉండేవి. ఇదే విధంగా దొరల, భూస్వాముల సంఖ్య హెచ్చుగా ఉన్నప్పుడు వెట్టిపనివారుకూడా "వంతుల" ప్రకారం మారుతూ ఉండేవారు. పని, ఆదాయంలోని హెచ్చుతగ్గులను సర్దుకోవటానికి వీరికున్న ఇనాం భూములను, ఉన్నమేరకు పట్టా భూములను సాగుచేసుకొనటానికి ఈ పద్ధతి ఉపయోగపడేది. వ్యవసాయంలో వచ్చే ఆదాయాన్ని తమ వాటాల ప్రకారంగా పంచుకునేవారు.

వీరంతా పేదరైతులు, వ్యవసాయ కూలీలే. కాని వీరికి ఎలాంటి స్వేచ్ఛలేదు. ఇష్టమున్నా లేకున్నా వెట్టిపని చేయాల్సిందే. ఈ విధానం బానిస సమాజ లక్షణం. ఫ్యూడల్ వ్యవస్థలో దీనికి బలమైన స్థానం వుంది. ప్రభుత్వ నిబంధనలు నిర్నిబంధంగా వెట్టిచాకిరి చేయాలని సూచించేవి. అయినా నామమాత్రపు ప్రతిఫలం ఇవ్వాలని కూడా నిర్దేశించేవి. అధికారులు వీటిని అమలుజరుపలేదు. దొరలకు భూస్వాములకు ఈ

నిబంధనలు వర్తించేవికావు. వారు యథేచ్ఛగా వెట్టి చేయించుకునేవారు. వెట్టిపనివారు తమ "పరిహారా"నికి దొరల దయాదాక్షిణ్యాలపై ఆధారపడేవారు.

## 8. చేతిపనివారు - ఇతర వృత్తులవారు

1. నేత పనివారు : దాదాపు అన్ని గ్రామాల్లో ఉండేవారు. కొందరు దొరల దోపిడీకి తట్టుకోలేక ఇళ్ళనువదిలి దేశాంతరం వెళ్ళేవారు. మహారాష్ట్రలోని బొంబాయి, తదితర నగరాలలోని జవుళి మిల్లులలో పనిచేసేవారిలో అత్యధికులు తెలంగాణానుండి వెళ్ళినవారే. దొరల ఒత్తిడి తక్కువ వున్న గ్రామాలలో వారు తమ వృత్తిని సాగించుకోగలిగేవారు. కేవలం ఈ వృత్తిమీదనే ఆధారపడి కుటుంబాన్ని పోషించుకోలేక కూలీ పనిచేసి జీవించేవారు. వీరిలో అరుదుగా రైతులు ఉండేవారు. వీరి సంఖ్య హెచ్చుగా ఉన్నచోట కొందరు మాస్టరు వీవర్లయి పేద నేతపనివారిని దోచుకునేవారు. వారు దొరలకు బట్టలు చౌకగా నేసి అందించవలసివచ్చేది. వారి ఇండ్లలో వెట్టిపనులు కూడా చేయవలసివచ్చేది. ఈ వృత్తిలో పద్మశాలీలేకాక మాలలు, ఇతర కులాలవారు కూడా పరిమితమైన సంఖ్యలో ఉండేవారు.

2. గీత పనివారు (గౌండ) : ఈత, తాటిచెట్లు ఉన్న గ్రామాలన్నిటిలో వీరు ఉంటారు. చెట్ల సంఖ్యనుబట్టి వీరి కుటుంబాల సంఖ్య ఉండేది. చెట్లను గీసి కల్లు అమ్మే వృత్తితోపాటు వీరు సాధారణ రైతులు కూడా. వీరిలో సంపన్నులు అప్పులు పెట్టి పేదల భూములను తాకట్టు పెట్టుకొని చౌక ధరకు కొనేవారు. తరచుగా కుల పెద్దలు సంపన్నులు కూడా. వీరు దొరల, పటేలు పట్వారీల ప్రాపకాన్ని సంపాదించి, కులంపై తమ పెత్తనాన్ని కాపాడుకునేవారు. అన్ని కులాల్లో ఇలాంటిసాంప్రదాయమే ఉంటుంది. కల్లు గీతకు సంబంధించిన కంట్రాక్టులు, హర్రాజు (వేలంపాట) లాంటి పనులన్నీ భూస్వాములే చూసుకునేవారు. తరచుగా వారే తమపేరిట వేలంపాడి కొంత లాభంతో గీతపని వారికిచ్చేవారు. దీనికి 'పొంపుబాటు' అని పేరు.

దొరలకు, పటేలు పట్వారీలకు, కిరాయి మనుష్యులకు నీళ్ల కలపని కల్లును పోయాలి. సాయంత్రం కాగానే వారి ఇంటికి కల్లును తీసుకొనివెళ్ళి అప్పగించాలి. ఎన్ని గ్రామాలకు దొర అయితే అన్నిగ్రామాలనుండి కల్లుతెచ్చి అందించవలసిందే. కొన్ని సందర్భాలలో ఇతర పనివారు మోసుకొని తెచ్చేవారు. ఆలస్యమైతే చెడిపోతుందని దగ్గరి గ్రామాలనుంచి తచ్చేవారు. "పొందుబాటు"లో ప్రతి చెట్టుకూ హెచ్చుగా పన్ను నిర్ణయించటం, ఉచితంగా కల్లు సప్లయిచేయటంలాంటి దోపిడీకి వీరు గురి అయ్యేవారు.

3. కంసాలి వారు, వడ్రంగులు, కమ్మరులు (విశ్వబ్రాహ్మణులు) : వ్యవసాయ పనిముట్లు తయారుచేయడానికి, మరమ్మతు చేయడానికి వడ్రంగులు, కమ్మరులు అవసరం. తరచుగా ఈ రెండు పనులూ ఒకరే చేసేవారు. వీరికి ఇనాములు, స్వంత భూములు ఉన్నప్పటికీ వ్యవసాయంలో ఎప్పుడూ రాణించలేదు. భూస్వాముల వ్యవసాయం పెద్దది కావటంవలన వారి పనుల్లోనే వీరి కాలమంతా గడిచేది. అయినా పేద, మధ్యతరగతి, ధనిక రైతులకు పనిముట్లు అందించవలసి ఉండటంవలన వీరి ఇళ్ళ దగ్గరనే కొలిమి ఉండేది. అక్కడే గ్రామస్థులంతా చేరి ఒకవైపున తమ పనిముట్లను తయారుచేయిస్తూ మరోవైపున కబుర్లు చెపుతూ కొద్దిసేపు విశ్రాంతి తీసుకునేవారు. ఒకరికొకరు సహకరించేవారు కూడా.

వీరుగాక వెట్టిపనులు చేసేవారంతా చేతిపనివారే. మాదిగలు తోలుపని చేసేవారు (చర్మకారులు). చాకలి, మంగలి, కుమ్మరులంతా తమతమ వృత్తి పనులు విధిగా చేసేవారు. దూదేకులవారు ముస్లిములు.

4. వర్తకులు (కోమట్లు, వైశ్యులు) : ప్రతి గ్రామంలో అక్కడి జనాభాను బట్టి వర్తకులు ఉండేవారు. శివారు పల్లెల్లో, కుగ్రామాల్లో ఒక వర్తకుని కుటుంబ పోషణకు అవసరమైన ఆదాయం ఉండదు. పెద్దగ్రామాలనుంచి వర్తకులు వచ్చి సరకులను అమ్మి తిరిగి ఇళ్ళకు చేరుకునేవారు. ఉప్పు, మిరపకాయలు, చింతపండు, ఉల్లిపాయలు, నూనె, బెల్లం, కొబ్బరి మొదలైనవి వీరు అమ్మే నిత్యావసర సరుకులు. సామాన్యప్రజలు ధాన్యమిచ్చి సరుకులు తీసుకునేవారు. దొరలు, భూస్వాములు తమకవసరమైన సరుకులను తీసుకొని చెల్లించవలసిన మొత్తాన్ని సంవత్సరానికి ఒకటిరెండు వాయిదాల్లో చెల్లించేవారు. దౌర్జన్యపరులైన భూస్వాములను అడగటానికి వర్తకులు భయపడేవారు. వారు ఇచ్చింది తీసుకొని సంతృప్తిపడే కొందరు ఈ దోపిడీకి తట్టుకోలేక దివాలాతీసి ఇతర గ్రామాలకు వలసవెళ్ళిన సందర్భాలు చాలా ఉన్నాయి. వర్తకుల కుటుంబాలు హెచ్చుగా ఉన్నప్పుడు దొరలకు, అధికారులకు సరకులను వంతులవారీగా సప్లైచేసేవారు. దొరల ప్రాపకం సంపాదించినవారు జాగ్రత్తగా డబ్బును కూడబెట్టి సంపన్నులయ్యేవారు. వీరు భూమిని సంపాదించి భూస్వాములైన సందర్భాలు కూడా ఉన్నాయి. వీరు పిరికితనానికి పెట్టింది పేరు. ఎంత సంపన్నుడయినా నోరున్న పేదవాడికి కూడా లోకువగా ఉండేవారు. ఆ కాలంలో ధైర్యవంతులు ఉండుట అరుదు.

5. గొర్ల కాపరులు (యాదవులు) : గ్రామాల్లో మెట్టభూములు, పచ్చిక బయళ్ళ శాతం హెచ్చుగా ఉండటంవలన పెద్ద ఎత్తున గొర్రెలు, మేకలను (జీవాలను) పెంచేవారు. ఈ వృత్తిననుసరించేవారు గొల్లలు (యాదవులు). వీరికి అరుదుగా

స్వంత భూములుండేవి. పోరంబోకు, బంచరాయి, చెరువులోతట్టు మొదలగు ప్రభుత్వ భూములతో పాటు భూస్వాముల బీళ్ళను మేపుకు ఉపయోగించేవారు. మెట్టచేలను కోసి వదిలివేసిన భూమిలో వాటిని మేపేవారు. మొత్తంగా చూసినప్పుడు ఏ గ్రామంలో ఉన్న గొర్రెలు మేకలకు ఆ గ్రామంలో ఉండే భూమి సరిపోయేది.

గొల్లలు దొరలకు, పటేలు పట్వారీలకు వారి ఇళ్ళలో జరిగే శుభ అశుభ కార్యాలకు, ఊళ్లో జరిగే దసరా, మైసమ్మ, ఇతర ముఖ్యమైన పండుగలకు గొర్లను మేకలను ఉచితంగా ఇవ్వవలసివచ్చేది. ఈ విధంగా తాము పెంచి పోషించిన వాటిలో కొన్ని భూస్వాముల ఇళ్ళకు వెళ్ళేవి. వీరికేగాక గ్రామాల పర్యటనకు (దౌరా = టూరు) వచ్చే అధికారులకూ, తాలూకా కేంద్రాల్లో ఉండే పోలీసు, రెవిన్యూ అధికారులకు కొన్నిటిని ఇవ్వవలసివచ్చేది. ఇదంతా వారిపాలిట మోయలేని బరువు. అందరివలెనే వీరిలో కూడా కులపెద్దలు ఉండేవారు. వారు ఒకమేరకు సంపన్నులై వడ్డీవ్యాపారాలు చేసేవారు కొన్ని గ్రామాల్లో వీరిలో భూస్వాములు ఉండేవారు.

6. బెస్తవారు (గంగ పుత్రులు) : నదులు, పెద్ద చెరువులు ఉన్నచోట బెస్త వారు చేపలుపట్టి అమ్ముకునేవారు. గ్రామాలలో వీటి గిరాకీ చాలా ఉండేది. వీరుగూడా దొరలకు కావలసిన చేపలు ఉచితంగానే పట్టిఇచ్చేవారు. తాము పట్టిన చేపల్లో నాణ్యమైనవి వారికి కానుకగా ఇవ్వవలసివచ్చేది. పంటల సమయంలో వారుపెట్టే 'బిచ్చా' లతో సంతృప్తిపడేవారు. వీరిలో చాలామంది నిరుద్యోగులే. దరిద్రాన్ని అనుభవించలేక బస్తీలకు వెళ్ళిపోయేవారు. హైదరాబాదులోనూ, మద్రాసులోనూ వీరిజనాభా చాలా ఉంది.

ఈ విధంగా గ్రామాల్లో వృత్తులన్నిటికి కుల ప్రాతిపదిక ఉండేది. ప్రతికులానికి ఒక కులపెద్ద ఉండేవాడు. ఈ కులపెద్దలంతా దొరలను, పటేలు పట్వారీలను ఆశ్రయించుకొని ఉండేవారు. వారు కోరిన ముడుపులన్నింటిని తమతమకులాలవారినుండి వసూలుచేసి చెల్లించేవారు. వారికి ఏజెంట్లుగా కూడా పనిచేసేవారు. తమకున్న భూములపై శిస్తులను చెల్లించటానికి రెవిన్యూ మొదలగు ఆఫీసు పనులకు వారి సహాయం తీసుకునేవారు. గొర్రెల, మేకల పెంపకం లాంటివి తప్ప ఒకవృత్తివారు మరొక వృత్తిని అవలంబించటం అరుదు. (వీరి పేదరికానికి చిహ్నమనికాబోలు 'సాలెవానికి గుడ్డ కరువు, మాదిగవానికి చెప్పు కరువు' అనే సామెత గ్రామాల్లో వాడుకలో ఉంది.)

అంతటా ఉన్నట్టుగానే తెలంగాణాలో కూడా అస్పృశ్యత ఉండేది. మాల మాదిగలతోపాటు వీరితో సంబంధం ఉన్న ఇతర తెగలవారిని అస్పృశ్యులుగా భావించేవారు. వీరి ఇళ్ళు గ్రామానికి ఆనుకొని చివర్లో ఉండేవి. ఇతరుల ఇళ్ళకూ, వీరి

ఇళ్ళకూ మధ్యన ఒక దారిమాత్రం ఉండేది. ఊళ్లో నడవటానికి అంతటా ఒకే విధమైన నిర్బంధాలు లేవు. వీధుల్లో చెప్పులేసుకొని నడవటమా లేదా అనేసమస్య అన్నిగ్రామాల్లో ఒకేవిధంగా లేదు.

సంపన్నులు కూడా దొరలతో సమానంగా కూర్చోవటం అసంభవం. దొరగారి భవనాన్ని మించిన ఇంటిని ఏసంపన్నుడూ కట్టవీలులేదు. ఆయనను మించిన దర్జాతో ఎవరూ ఉండటానికి వీలులేకపోయేది. దొరలు ప్రదర్శించే ఈ అసమానత్వం తగాదాలకు దారితీసేది. సంపన్నులు తమ డబ్బు, బంగారం ఇంట్లో దాచుకునేవారు. అప్పుడప్పుడు జుర్మానాల రూపంలోనో, అప్పులపేరుతోనో కొంత డబ్బును లాగి వారు మరీ ధనవంతులు కాకుండా జాగ్రత్తపడేవారు. అప్పులను తిరిగి చెల్లించటం వీరికి అలవాటుండదు. వాటికి ఎగనామం పెట్టేవారు. దివాలాతీసినవారు తమ భూములను అప్పులకింద కట్టిపెట్టేవారు.

## 9. గిరిజనులు

1) లంబాడీలు : గ్రామాల్లోకాక విడిగా నివసించే వారిలో లంబాడిలు ముఖ్యులు. వీరిది ఆదివాసి జీవితం. వీరు పూర్వం వ్యవసాయం, వ్యాపారం రెండుపనులూ చేసేవారు. ఒకప్రాంతపు పంటను మరోప్రాంతానికి చేర్చి, ఆప్రాంతపు పంటను తమ ప్రాంతాలకు తెచ్చి అమ్మేవారు. ఉదా : నల్లగొండ జిల్లాలోని దేవరకొండ ప్రాంతంలో ఆముదాలు పండేవి. దేవరకొండ కరువుప్రాంతం కావటంవలన ఆ తాలూకా ప్రజలకు ఆహారధాన్యాల అవసరం ఉండేది. జిల్లాలోని ఇతర ప్రాంతాలలో ఆముదాలపంట అతి స్వల్పంగా ఉండేది. లంబాడీలు ఆహారధాన్యాలను తీసుకువెళ్ళి దేవరకొండ ప్రాంతాలకి చేర్చి, అక్కడినుండి ఆముదాలు తెచ్చి మార్కెట్లో అమ్మేవారు. ఒక్కొక్కసారి 20 నుంచి 50 దాకా బండ్లు కట్టుకొనివెళ్ళి తిరిగివస్తుండేవారు. బళ్ళకు పూర్వం గోనె సంచుల్లో ధాన్యాన్ని నింపి, ఎద్దులమీద తీసుకొనివెళ్ళేవారు. ఇదంతా "వస్తువులమార్పిడి" రూపంలో జరిగిన వ్యాపారం. మార్కెట్లు ఏర్పడి, రోడ్ల నిర్మాణం జరిగిన తర్వాత ఈ వ్యాపారం పూర్తిగా ఆగిపోయింది.

వీరు తాము సాగుచేసే మెట్ట, మాగాణి భూమికి అందుబాటులోఉన్న ప్రదేశంలో పాకలు వేసుకొని నివసిస్తారు. ఒక కుటుంబానికి చెందినవారంతా ఒకేచోట ఉంటారు. కుటుంబంపెరుగుతున్నకొద్దీ ఇళ్ళసంఖ్య పెరుగుతుంది. వీరి వేషభాషలు,ఆచారవ్యవహారాలు అన్నీ ఉత్తరాదివారివి. కొన్నిఅంశాలలో మహారాష్ట్రులతో పోలిఉన్నట్టు కన్పిస్తుంటాయి.

వీరు భూమిని చక్కగా సాగుచేస్తారు. మెట్టభూమిని సాగుచేయటంలో చాలా నైపుణ్యం ఉంది. చిన్నచిన్న బావులు తవ్వి వాటి సాయంతో మిర్చి, దినుసుగడ్డ (చిలగడదుంప), ఉల్లి మొదలగు వ్యాపారపంటలు పండిస్తారు. జొన్నలు వీరి ప్రధాన ఆహార ధాన్యం. రొట్టె చేసుకొని తినటం మామూలు. స్త్రీలు తెల్లవారుఝామున సుమారు 3 గంటలకు లేచి జొన్నలు విసిరి రొట్టెలు చేసి మగవారికి ఇస్తారు. పొలం పని అంతా మగవారే చేస్తారు. స్త్రీలు వారికి తోడుగా ఉంటారు. వీరిలో కొద్దిమంది ధనవంతులు కూడాను.

అడవులకు దగ్గరలో ఉన్న లంబాడీలు పశువులను పెంచి వ్యాపారం చేస్తుంటారు. అలాంటివారిలో వేలసంపన్నులుకూడా ఉన్నారు. ప్రారంభ దశలో వీరికి భూమిపై అంత ఆపేక్ష లేకున్నప్పటికీ, క్రమంగా వస్తుమార్పిడి వ్యాపారం తగ్గిపోవటంతో భూము లపై స్థిరపడిపోయారు. కొందరు భూస్వాముల కౌల్దారులైనారు. అడవి ప్రాంతాల్లో ఉండేవారు అక్కడి భూములను సాగుచేసేవారు. దీనికై వారు భూస్వాములకేగాక, ఫారెస్టు ఉద్యోగులకు కూడా లంచాలు చెల్లించవలసివచ్చేది. గ్రామాలకు దూరంగా ఉండటంవలన, ఆచార వ్యవహారాలు వేరుగా ఉండటంవలన భూస్వాముల దోపిడీ డబ్బు, ధాన్యంవరకే పరిమితమై ఉండేది. దెబ్బలు కొట్టటం, తిట్టటం, ఇతరవిధాల హింసించటం తక్కువే. వీరిలో హెచ్చుభాగం పేద, మధ్యతరగతి రైతులుగా ఉండేవారు. వ్యవసాయ కూలీలుగా మారినవారు బస్తీలకు వెళ్ళి పనులు చేసుకునేవారు. కానీ క్రమంగా వారి సంఖ్య పెరిగి దగ్గరి గ్రామాలలో పాలేర్ల, రోజు కూలీల స్థాయికి దిగి పనిచేయసాగారు. కొన్ని సందర్భాలలో దూరప్రాంతాలకు వెళ్ళి ఏదో ఒక పనిచేసి జీవితాన్ని సాగించవలసి వచ్చేది. వీరిలో ఆదివాసుల ఆచారాలన్నీ ఉండేవి. ముఖ్యంగా తండాలోని వారు వచ్చిన ఆదాయాన్ని సమానంగా పంచుకునేవారు. పెళ్ళిళ్ళు, దుస్తులు ఆదివాసుల సాంప్రదాయాన్ని అనుసరించే ఉంటాయి.

2) చెంచులు, కోయలు, కొండరెడ్లు, గోండులు : తెలంగాణాలో అడవులు, కొండలుగల ప్రాంతం చాలాఉంది. గోదావరి, కృష్ణా నదీతీరానగల మహబూబునగర్, నల్లగొండ, వరంగల్ (ఆనాటి), కరీంనగర్, ఆదిలాబాద్ జిల్లాల్లో ఇలాంటి ప్రదేశం చాలా ఉంది. ఇతర జిల్లాల్లో కూడా ఇలాంటి ప్రాంతం ఉంది. కృష్ణానదీ తీరంలో చెంచులు, గోదావరినదీ తీరంలో కోయలు, కొండరెడ్లు, గోండులు ప్రధానమైన గిరిజన తెగలు. ఈ ప్రాంతాల్లో జనాభా కేంద్రీకరణ తక్కువ. అడవి ఫలసాయాన్ని సేక రించుకొని జీవించేవారు. తమతమ పల్లెలకు ఆనుకొని ఉన్న కొద్దిపాటి భూమిని వర్షా ధారంతో సాగుచేసుకొని వచ్చేపంటతో ఒకటి రెండు నెలలు జీవించి మిగతా కాలమంతా

అడవుల ఫలసాయంపై ఆధారపడేవారు. కలప వ్యాపారస్తులకు, అడవి కంట్రాక్టర్లకు కూలీపని చేసేవారు. ఫారెస్టు అధికారుల, భూస్వాముల దోపిడీకి గురి అయ్యేవారు. సింగరేణి, బెల్లంపల్లి బొగ్గుగనులు, సిరిపూరు పేపరు మిల్లు మొదలగు పరిశ్రమలు ఏర్ప డటంవలన వీరిలో కొందరు కూలీలుగా మారిపోయారు. పాకాల, లక్నవరం, రామప్ప మొదలగు పెద్ద చెరువులున్న ప్రాంతాలలో కొందరు పాలేర్లూ, దినకూలీలూ అయినారు. తక్కినవారికన్నా గోండులు భూమిని సాగుచేయడంలో కొంత నైపుణ్యం కలిగిన రైతులు.

ఆదిమ కమ్యూనిస్టు సమాజపు ప్రత్యేక లక్షణాలన్నీ ఈ తెగలలో ఉండేవి. ప్రతి పల్లెకూ, ప్రతి తెగకూ ఒక పెద్ద ఉండేవాడు. వారికి ఆ తెగమీద శాసించే అధి కారం ఉండేది. చెంచులు, అడవులకు చివరలో ఉండే కోయలు తెలుగుభాష మాట్లాడే వారు. లోపలి భాగంలో ఉండే కోయలు మాట్లాడేది మాండలికమైన తెలుగుభాష. గోండులకు ప్రత్యేక భాష ఉంది. పరిశోధకులు ఈ భాషలో కూడా అత్యధిక భాగం తెలుగు పదాలే ఉన్నాయని, కొద్దిగా ఇతర పదాలు ఉన్నాయని ఒక అభిప్రాయం కలిగి ఉన్నారు. (జర్మన్) పురాతత్వ శాస్త్రవేత్త హెమెన్‌డ్రాఫ్ గోండు ప్రాంతాలు తిరిగి పరిశోధన చేసి రచించిన Tribal Hyderabad (ట్రైబల్ హైదరాబాద్) అనే పుస్త కంలో వీరి చరిత్రనే గాక ఆచార, సాంప్రదాయాలను కూడా వివరించాడు. వారి ఆర్థిక సమస్యలను పరిశీలించి చాలినంత భూమి లేకపోవటమే వారి ప్రధాన సమస్య అని తేల్చి చెప్పాడు.

పల్లెలోని గిరిజన జీవితాన్ని పరిశీలిస్తే అది ఎంత నికృష్టంగా ఉంటుందో మన కర్థమవుతుంది. పెద్దవారికి, చిన్నవారికి ఒంటినిండా కట్టడానికి బట్టలుండవు. గోచి పాతలు, అర్ధనగ్నంగా ఉంచే పాతగుడ్డలు మాత్రమే కట్టుకోగలిగేవారు. బట్టలకు గూడా పేలికలు, గుడ్డపేగులు అనేపదాలను వాడుతూ ఉంటారు. చలికాలంలో అడవులు, కొండల్లో చలి తీవ్రంగా ఉంటుంది. దానినుంచి శరీరాన్ని రక్షించుకోవటానికి గొంగళ్లు, దుప్పట్లు ఉండవు. మొద్దులను తెచ్చి నెగడు వేసుకొని చలికాలమంతా గడుపుతారు.

తమ పల్లెను చుట్టూ ఉన్న కొద్ది భూమిని మాత్రమే సాగుచేసుకుంటారు. పల్లె లోని ఇళ్ళ సంఖ్యనుబట్టి ఆ భూమి విస్తీర్ణం ఉంటుంది. "పోడు"[21] వ్యవసాయ పద్ధతి ఉండటంవలన వారు ఒకేచోట చిరకాలంగా నివసించటం సాధ్యంకాదు. ప్రతి రెండు, మూడు సంవత్సరాలకు ఒకసారి భూమితోపాటు ఇళ్ళనుకూడా మారుస్తూ ఉంటారు. ఈ కారణాన వీరికి స్వంత భూములు ఉండవు. కొందరు కొంతకాలంపాటు స్థిరంగా నివసించి పల్లెచుట్టూ ఉన్న భూమిని సాగుచేసుకునేవారు. జనాభా పెరుగుతున్నప్పుడు సాగు భూమికి ఆనుకొని ఉన్న ఫారెస్టును కూడా నరికి కొత్తసాగుచేసేవారు. ఇదిగాక కూడా

అందుబాటులో ఉన్న భూమిని పోడు సాగుకు ఉపయోగించేవారు. ప్రధానమైన పంట మొక్కజొన్నలు, జొన్నలు, సజ్జలు మొదలగు ధాన్యాలు. చిక్కుళ్ళు ఉలవలు వంటి పప్పుధాన్యాలు పండించి నిల్వచేసుకొని వేసవికాలంలో ఉపయోగించేవారు. పంట స్వల్పంగా ఉండటం వలన పంటలేని కాలంలో అంబలి, అడవిలో దొరికే దుంపలు, ఆకు కూరలు, కాయలు తిని జీవించేవారు.

ఫారెస్టు అధికారులు వారినుంచి జుర్మానాలు (ఫైన్స్), లంచాలు, కోళ్ళు, గొర్లు, మేకలు, అడవిలో దొరికే తేనె, సారెపప్పులాంటి విలువైన పదార్థాలను బలవంతంగా వసూలుచేస్తుంటారు. వీటికి ఎలాంటి ప్రతిఫలం ఉండదు. ఫారెస్టు పనుల సమయంలో ఫారెస్టు అధికారులకు వెట్టిచాకిరీ చేయవలసివచ్చేది.

వీరు నిజాయితీపరులు, అమాయకులు. ఈ అవకాశాన్ని ఉపయోగించుకొని భూస్వాములు, వడ్డీ వ్యాపారస్తులు వీరి భూములను కాజేసినందున పాలేరులై, కూలీలై జీవించవలసివస్తున్నది.

మైదానప్రాంతాలవారిని అనుమాన దృష్టితో చూడటం పరిపాటి. కొంత పరిచయం ఏర్పడి, తమకు హానిచేయరని నమ్మకం కలిగిన తర్వాతనే నిర్భయంగా మాట్లాడేవారు. ఇంటికి వచ్చినవారికి శాయశక్తులా అతిథి సత్కారాలు చేయటం వీరి సాంప్రదాయం.

గోండులకు వ్యవసాయం చేయటంలో కొంత నైపుణ్యం ఉన్నందున వారు భూమిని జీవనాధారం చేసుకున్నారు. అయినా అడవిఫలసాయాన్ని సేకరించి, అమ్ముకొని వచ్చే ఆదాయాన్ని వ్యవసాయాదాయానికి చేర్చి జీవిస్తూ ఉంటారు. ఆచారవ్యవహారాల్లో కూడా కొంత అభివృద్ధి ఉండేది. వీరుండేప్రాంతం కూడా అడవి, కొండలు ఉన్న ప్రాంతమేకనుక ఫారెస్టు అధికారుల, భూస్వాముల దోపిడీ వీరికి తప్పదు. ఇతర గిరిజనుల సమస్యలన్నీ వీరికి కూడా ఉండేవి.

మైదానప్రాంతాలతో వీరికి సంబంధాలు లేనందువలన వీరి స్థితిగతులు ఎవరికీ తెలిసేవికావు. మంత్రగాళ్ళనీ, వింతప్రవృత్తిగలవారనీ వీరిని గురించి కథలు చెప్పు కోవటం మైదానప్రాంతాల ప్రజలకు పరిపాటి. గనుల, పరిశ్రమల ప్రాంతాల్లో, పెద్ద చెరువులున్నప్రాంతాల్లో వీరు కూడా పనిచేయటంవలన మైదానాలవారికి, వీరికి సంబంధాలు ఏర్పడినాయి. వీరి జీవిత విధానంలో కూడా కొంత మార్పువచ్చింది. దీనితో గిరిజనుల యెడ ఉన్న అపోహలు కొంతవరకు తొలగిపోయాయి. అయినా అంతా కలిసిపోలేదు.

మొత్తంమీద, ప్రభుత్వ నిర్బంధాల వల్లనేమీ, భూస్వాముల ప్రాబల్యంవల్లనేమీ గ్రామీణప్రజల జీవితం నిస్తబ్దంగా ఉండేది. పండుగల సమయంలో, ఇళ్ళలో పెండ్లిళ్ళు జరుగుతున్నప్పుడు ప్రజల్లో సంచలనం ఉండేది. అది కూడా తాత్కాలికమైనదే.

# 3. రైతాంగ పోరాటాలు (1940 వరకు)

హైదరాబాదు సంస్థానంలో ఒకభాగమైఉన్న తెలంగాణాపై భారతదేశంలో ఆ కాలంలో నడిచిన రైతాంగపోరాటాల ప్రభావం చాలా పరిమితమే. కాని తెలంగాణాలో నికృష్టమైన ఫ్యూడల్ దోపిడీ విధానం సాగుతూ ఉన్నందున దానికి గురైన రైతులు, బానిసలు, అర్ధబానిసలుగా ఉన్న కూలీలు పోరాటాలు సాగించారు.

1930 నాటికి కాంగ్రెసు సత్యాగ్రహం ప్రజాఉద్యమ స్వరూపం తీసుకుంది. ఆనాటికి సైమన్ కమీషన్‌ను బహిష్కరించటం లాంటి రాజ్యాంగ సమస్యలపై ఆందోళన నడిచింది. పెద్ద ప్రజావెల్లువ వచ్చింది. కాంగ్రెసులో సంపూర్ణ స్వాతంత్ర్యం కావాలనే అతివాద తీర్మానాలు ఆ కాలంలోనే వచ్చినాయి. దీనితోపాటు వివిధప్రాంతాలలో రైతాంగ పోరాటాలు వచ్చాయి. కాంగ్రెసులోఉండే అతివాదశక్తులు వాటికి నాయకత్వంవహించాయి. అయినా ఈ పోరాటాలకు అనేక పరిమితులు ఉండేవి. జమీందారీ ప్రాంతాల రైతులకు రైత్వారీ ప్రాంతాల వారితో సమానమైన హక్కులుండాలనే నినాదాలతో ఆ పోరాటాలు నడిచేవి. ఆంధ్రరాష్ట్రంలో కూడా అలాంటి పోరాటాలు నడిచాయి. శ్రీకాకుళం జిల్లాలో (ఆ కాలంలో విశాఖపట్నం జిల్లాలో ఒకభాగంగా ఉండేది), కృష్ణాజిల్లాలో జమీందారీ రైతుల పోరాటాలు నడిచినవి. ఇతరప్రాంతాల్లో కూడా ఇలాంటి పోరాటాలే నడిచాయి. ఈ పోరాటాలన్నింటిలో బ్రిటిష్ ప్రత్యక్ష పరిపాలనకిందఉన్న రైత్వారీప్రాంతాల్లో రైతులకున్న హక్కులు తమకు కావాలని రైతులు కోరేవారు. ఉదా : రైత్వారీ ప్రాంతాలలో ఎకరానికి 4 రూపాయలు శిస్తువుంటే జమీందారీ ప్రాంతంలో కూడా 4 రూపాయలు ఉండాలనీ, బ్రిటిష్ ప్రభుత్వం వసూలుచేయని ఇతర పన్నులేవీ ఉండ కూడదనీ నాయకత్వం కోరేది. దీనికి అవసరమైన చట్టాలు లేనందున జమీందారులు కోర్టులకెక్కారు. వారికి భూమిపైన శిస్తులు వసూలుచేయటం తప్ప మరేవిధమైన హక్కులు లేవని కోర్టులు తీర్పులు ఇచ్చాయి. శిస్తు వసూలుచేసే హక్కు జమీందారుకు ఉండటం వలన దాన్ని అమలుజరపటం సాధ్యంకాకపోయేది. ఈ అవకాశాన్ని ఉపయోగించుకొని అతడు అక్రమంగా విపరీతమైన పన్నులువేసి వసూలుచేసేవాడు. దీనికి వ్యతిరేకంగా పోరాటాలు నడిచాయి. భూమి సమస్యలు కూడా వచ్చాయి. భూములను ఆక్రమించుకోటానికి

రైతులు ముందుకువెళ్ళారేగాని ఎక్కడా కూడా నాయకత్వం పోరాటాన్ని నడిపించ టానికి సిద్ధంకాలేదు.

తెలంగాణా ప్రాంతంలో కూడా ఇలాంటి పోరాటాలే నడిచాయి. జాగిర్దారులకు, పెద్ద భూస్వాములకు వ్యతిరేకంగా రైతాంగపు పోరాటాలు నడిచినవి. జాగీరు రైతులు ఖాల్సా రైతులతో సమానమైన హక్కులు కావాలన్నారు. అంతా వెట్టిచాకిరి ఇతర అక్రమాలకు వ్యతిరేకంగా, భూమికోసం పోరాడారు.

## 1. బేతవోలు రైతుల పోరాటం

బేతవోలు మక్తా కొన్ని గ్రామాల సముదాయం. దానికి ముఖ్యస్థానం బేతవోలు. ఇవిగాక జెర్రిపోతులగూడెం, పోలినేనిగూడెం (ఫూస్ట్లీపురం), ఆచార్యులగూడెం (ఆచెర్లగూడెం), చెన్నారిగూడెం, కొమ్ముల బండ తండ, సీతారాం తండ అను గ్రామా లున్నవి. ఇవన్నీ కలిస్తే అయిదారు వేల జనాభావున్న ప్రాంతమిది. ఆ రోజుల్లో బేతవోలు పెద్ద గ్రామంకింద లెక్క. దీనిలో మక్తాదారుడు ప్రభుత్వానికి కొంత రుసుము చెల్లించుకోవలసి ఉండేది. ఇది పోగా మిగతా శిస్తులు రైతులనుంచి వసూలు చేసుకొని ఆ మొత్తాన్ని తానే అనుభవించేవాడు. ఈ మేరకు అతనికి చట్టపరమైన హక్కు ఉండేది. అయినా ఈ పరిధి దాటి చట్టవిరుద్ధంగా పెద్దఎత్తున శిస్తులు పన్నులు వసూలుచేసేవాడు. దుర్మార్గులైన జాగీర్దారులు, దేశముఖులు వసూలుచేసే ప్రతి పన్నునూ ఇతడుకూడా వసూలుచేసేవాడు. ప్రజల రక్తాన్ని జలగలాగా పీల్చటానికి, వారిని కొల్లగొట్టడానికి పేరొందినాడు ఈ మక్తాదారు. ఇతనికి ఒక్కటైనా సుగుణం లేదనీ, బంధువులు కూడా ఇతన్ని హర్షించలేకపోయేవారనీ ప్రతీతి.

ఇతడు సంస్కృత పండితుడు. జ్యోతిష్యశాస్త్రం నేర్చినవాడు. ప్రతి సంవ త్సరం పంచాంగాలు రాసి, స్వంత ఖర్చుతో అచ్చు వేయించి, తన బంధువులద్వారా తనకు తెలిసిన ఇతరులద్వారా ఉచితంగా పంచిపెట్టేవాడు. పంచాంగాలపై తన గొప్ప తనాన్ని డిగ్రీలున్నవారు రాసుకున్నట్టు తానే వర్ణించుకునే సందర్భంలో "......సంతత భగవత్పద పరిచర్యాలబ్ధ కవితా మాధుర్యధుర్యుండును, సంగీత విద్యారస హృద యుండును, భూతటాక ప్రవర్ధన పరిశ్రమ నిపుణుండును, చిత్రవిచిత్ర ఛాయాపట నిర్మాణ చతురుండును, జ్యోతిష వైద్యవిద్యాద్యనుభవజ్ఞానుండును......హూణ యవన రాజ్య సంబంధ గ్రామ ప్రభువర్యుండును దేశముఖ్, దేశపాండ్యా, మక్తాదార్ ఇత్యాది బిరుదాంకితుండును, సకల విభవ రాజమాన బేతవోలు రాజధానీశుండునునగు తడకమళ్ళ

సీతారామచంద్ర రాయ" అని రాసుకునేవాడు. హైదరాబాదు సంస్థానంలో మఖ్తాదారు రాజాగారు అవడానికి వీలు లేకుండేడిది. అయినా ఈయనకు రాజాగారని పిలిపించుకోవాలనే ఆకాంక్ష హెచ్చుగా ఉండేది. దీనికోసం కృష్ణాజిల్లాలోని కొన్ని జమీందారీ గ్రామాలు కొనివేసి రాజాగారయ్యాడు. కొత్తగా కొన్న గ్రామాలపై వచ్చే ఆదాయం తక్కువ అయినా ఫలానా గ్రామాలకు రాజాగారనే బిరుదు తగిలించుకోడానికి హక్కులేర్పడినవి. ఆయన కోరిక కూడా ఇదే. ఈయన గ్రంథాలయాలకేమీ, సాహిత్యసంస్థలకేమీ విరాళాలిచ్చిన పాపానపోలేదు. తిరుగుబాటు చేసిన రైతులపై కక్షసాధించటానికి తనజీవితాన్ని ధారబోసి విఫలుడైనాడు.

పరగణా ప్రాంతంనుంచి బేతవోలు చెరువుకు నీరువెళ్ళాలి. బెజవాడవెళ్ళే రోడ్డును ఆనుకొని మద్దులచెరువనే ఒకపెద్ద చెరువు ఉంది. ఆ చెరువునుంచి వెళ్ళే మిగులునీరు బేతవోలు చెరువుకు వెళ్ళాలి. జమీందారీ భాషలో చెప్పాలంటే ఈ చెరువు మునగాల రాజాకు, బేతవోలు చెరువు అక్కడి మఖ్తాదారుకు చెందినవి. మిగులునీరు బేతవోలు చెరువులోకి వెళ్ళకుండా మునగాలరాజా కట్టుదిట్టాలు చేశాడు. ఈ ఒక్క చెరువు నీరేగాక ఆ ప్రాంతంనుంచి వెళ్ళే నీరును బేతవోలు చెరువుకు, కుంటల్లోకి వెళ్ళకుండా మత్తడుల (wein) ఎత్తును పెంచాడు. బేతవోలు చెరువుకు నీరు తగ్గిపోయింది. దానివలన రావలసిన పన్నులు తగ్గిపోతాయి. తన భూమికి నీటిపారుదల సౌకర్యం లేకుండాపోతుంది. ఈ కారణంవలన నీటి సమస్యపై ఇద్దరూ తగాదాపడ్డారు. మఖ్తాదారు నడిగూడెం రాజాగారిపై మద్రాసులో దావావేశాడు. దీనికోసం నీటివాలు ప్రాంతానికి సంబంధించిన జమీందారుల కొందరిని కూడగట్టాడు. పైరవీ నడిచింది. మఖ్తాదారు గెలిచాడు. మునగాల జమీందారు ఓడిపోయాడు. దీనితో కక్షసాధించటానికి మునగాల జమీందారు మళ్ళీ ఒకసారి బేతవోలు ప్రాంతపు రైతుబాంధవుడైనాడు.

బేతవోలు మఖ్తాదారు వసూలుచేసే అక్రమపన్నులు ఈ విధంగా ఉండేవి.

1) సెంట్ల పన్ను : మఖ్తా గ్రామంలోని భూములను సర్వే సెటిల్‌మెంటు చేయించిన సందర్భాన వసూలుచేసిన పన్ను. నిజాం సంస్థానంలో ఇతర ప్రాంతాల్లో జరిపినట్టు తన మఖ్తా ప్రాంతంలో జరిపించలేదు. ఆనాటి మద్రాసురాష్ట్రంలో అమలు ఉన్నట్టు జరిపించాడు. సంస్థానంలో ఎకరానికి 40 గుంటలు ఉండేవి. కాని మద్రాసురాష్ట్రంలో 100 సెంట్లు ఉండేవి (ఆంధ్రప్రదేశ్‌లో ఇప్పుడు అమలులో ఉన్నది ఈ పద్ధతి). 40 కన్న 100 హెచ్చు సంఖ్య కావటంతో పన్నురాబడి హెచ్చుగా ఉంటుందని ఈ పద్ధతిని అనుసరించాడు. అయినా దీనిని కొలత వరకే పరిమితంచేశాడు. (ఉదా : గుంటకు రూపాయి పన్నువేస్తే ఎకరానికి 40 రూపాయలే ఆదాయం వస్తుంది. సెంటుకు

రూపాయివేస్తే 100 రూపాయలు వస్తాయి.)

2) బండికి బిగేడు జొన్న చొప్ప : రెండున్నర గజాల తాడుతో గట్టిగా బిగదీసి కడితే ఎంత చొప్ప ఉంటుందో దానిని బిగేడు చొప్ప అంటారు. రైతుకు పంట భూమిలో ఎన్ని బండ్ల చొప్ప తయారయితే అన్ని బిగుళ్ళ చొప్పను మఖ్తాదారుకు ఇచ్చుకోవాలి. దీనిని మఖ్తాదారు తన పశువులకు వాడుకునేవాడు లేదా అమ్ముకునేవాడు. నేటి ధర బిగేడు చొప్పకు 10 రూపాయలకు మించి ఉంటుంది.

3) మడవ మోపులు : మాగాణి పొలానికి నీరుపోయే పిల్ల కాలువను మడవ అంటారు. రైతు కుటుంబంలోని సభ్యులు మాగాణి భూమిని పంచుకున్నప్పుడు ఇలాంటి కాలువల సంఖ్యతోపాటు రైతు ఇచ్చుకోవలసిన గడ్డిమోపుల సంఖ్య పెరుగుతుంది.

4) ఆడబిడ్డ గంపలు : రైతులు తమ కళ్లాలలో ధాన్యాన్ని కొలిచే సమయాన ముందు రాసినుంచి ఒక గంపనిండా ధాన్యాన్ని తీసి మఖ్తాదారుఇంటికి పంపాలి. ఆయనకు ఆడ తోబుట్టువులు ఉండేవారో లేదో తెలియదుగాని కూతుళ్లుమాత్రం ఉన్నారు. ఈ ధాన్యం వారి "హక్కు".

సాధారణంగా రైతులు తమ పంటనుంచి "ఆడబిడ్డ గంప" పేరుతో ఒకగంపెడు ధాన్యాన్ని, వేరుశెనగవంటి వ్యాపార పంటలను తీసి దాచిపెడతారు. ఇంట్లో ఆడపిల్ల పుట్టిననాటినుండి ఈ కార్యక్రమం అమలు జరుగుతుంది. ఈ పంటను దాచి పెళ్ళి తర్వాత అమ్మాయికి డబ్బురూపంలోనైనా, ధాన్యరూపంలోనైనా ఇచ్చివేస్తారు. ధనిక రైతులు, భూస్వాములు నాగులకు, వడ్డీలకు ఇచ్చి పెంపుచేస్తారు. వరకట్న పిశాచం సర్వత్రా వ్యాపించిన ఈ రోజుల్లో ఆడబిడ్డ గంపల సాంప్రదాయం తగ్గిపోయింది.

5) దేవుని పన్ను : దేవుని పండుగనాడు (కల్యాణ ఉత్సవంలాంటిది) బండ్లుకల రైతులు ఇంటికి ఒక ప్రభ కట్టిన బండికట్టాలి. రైతులంతా ఇంటికి ఒక రూపాయి చొప్పున దేవునికి కానుక చెల్లించాలి. ఈ విధంగా పోగైన డబ్బు మఖ్తాదారుకే చేరుతుంది.

6) ఒక రైతునుంచి మరొక రైతు భూమిని కౌలుకు లేక మఖ్తాకు తీసుకున్నప్పుడు జరిగే ఒప్పందాన్ని కాగితంపై రాసుకుంటారు. దీనికి ఒక రూపాయి పన్నును మఖ్తాదారుకు చెల్లించేవారు. ఇదేవిధంగా భూమినుంచి వైదొలగినప్పుడు మరొక రూపాయి చెల్లించేవారు. మఖ్తాదారునుంచి తీసుకున్న కౌలుభూమికి కూడా ఇది వర్తిస్తుంది.

7) రైతులు కూలీలంతా తమకున్న పశువులలో ఒక్కొక్క పశువుకు రూపాయిన్నర (150 పైసలు) చొప్పున పుల్లరిపన్ను చెల్లించేవారు. ఈ పన్ను వసూలు సమయంలో మఖ్తాదారు ప్రజలను తీవ్రంగా బాధించేవాడు.

ఒకరైతు పుల్లరిపన్ను చెల్లించలేక తనకు పశువులు లేవని చెప్పాడు.

దొర (మఖ్తాదారు) నౌకరులు రైతుమాట ఎంతవరకు నిజమో తేల్చుకోటానికి రైతు ఇంటికి వచ్చారు. వారిరాకను ముందేకనిపెట్టిన రైతు వారికన్నుగప్పటానికి తనకున్న పశువులు రెండింటి కాళ్ళు కట్టిపడవేసి వాటిపైన గడ్డి కప్పివేశాడు. నౌకరులు వెళ్ళిపోయినతర్వాత రైతు గడ్డి తీసివేసి పశువులను చూచుకునేసరికి, ఊపిరి ఆడక అవి చచ్చిపోయి పడి ఉన్నాయి.

8) ఎవరింటికైనా చుట్టాలువస్తే ఇంటివారు చుట్టాలకోసం పన్నులు చెల్లించుకోవలసి వచ్చేది. ఇదేవిధంగా గ్రామస్థులు చుట్టాల ఇంటికి వెళ్ళితే వారు గ్రామాన్ని వదిలివెళ్ళి నందుకు పన్ను చెల్లించుకోవలసివచ్చేది.

9) చెరువుకు గండ్లుపడితే వాటిని పూడ్చాలనే పేరుతో కొంత పన్నులు చెల్లించవలసి వచ్చేది.

10) చేనేతపనివారు మగ్గాలపైన పన్ను చెల్లించేవారు.

11) పెళ్ళిళ్ళసమయంలో పన్ను చెల్లించటం తప్పనిసరి.

12) మఖ్తాదారు స్త్రీలపై వివిధరకాల పన్నులు విధించేవాడు. మంత్రసాని పన్ను చెల్లించాలి. వ్యభిచారిణులు పన్నులు చెల్లించవలసిందే. అమ్మాయి రజస్వల అయితే పన్ను చెల్లించాలి. సంతానం కలిగితే పన్ను చెల్లించాలి.

13) భూమిపై ఎకరానికి రు. 2-50 లు శిస్తు వసూలుచేసేవాడు. ఇది అక్రమము. చుట్టుపట్టునఉన్న ఖాల్సాగ్రామాలకన్న ఈ శిస్తు సగటున రు. 1-50 హెచ్చుగా ఉంటుంది. కొన్నివేల ఎకరాల విస్తీర్ణంగల ఈ మఖ్తాలో భూమిమీదనే వేల రూపాయలు అక్రమంగా వసూలుచేసేవాడు. (ఉదా : రైతుల స్వాధీనంలో 10 వేల ఎకరాల సాగు భూమి ఉంటే 15 వేల రూపాయల అక్రమ పన్నులు వసూలుచేసేవాడు.)

మఖ్తాదారు అక్రమంగా వసూలుచేసే పన్నులలో ఇవి కొన్ని మాత్రమే. ఏదో నెపాన చీటికి మాటికి పన్నులు వసూలుచేయటం మఖ్తాదారుకు పరిపాటి.

సంతానంలేనివారు దత్తపుత్రులను తెచ్చుకున్నప్పుడు వారి ఆస్తిఅంతా దత్త పుత్రులకు చెందదు, సగభాగం మఖ్తాదారుకు, మిగతాసగం దత్తపుత్రునకు చెందేది. ఇల్లరికం తెచ్చుకున్నా అమ్మాయికి ఆమెభర్తకు సగం ఆస్తిమాత్రమే వచ్చేది.

గ్రామస్థుల ఇళ్ళలో పళ్ళచెట్లున్నా (జామ, నారింజ మొ॥), కరివేప చెట్లున్నా వాటిచుట్టూ లోతుగాతవ్వి, కూకటివేళ్ళతో పెకిలించి, తీసుకవెళ్ళి, తనఇంటి ఆవరణలో నాటించేవాడు. మఖ్తాదారు ఉపయోగపడే చెట్లు ఏవిఉన్నా, వాటిని పరిహారం ఇవ్వకనే కొట్టించి తీసుకపోయేవాడు.

తీవ్రమైన దోపిడీని తట్టుకోలేక అన్ని వర్గాల ప్రజలు మఖ్తాదారుకు వ్యతిరేకంగా

తిరుగుబాటు చేశారు. వీరిలో ధనిక, మధ్యతరగతి, పేదరైతులు, కూలీలు ముఖ్యులు. ఈ తిరుగుబాటు మూడు దశల్లో నడిచింది. మొదటి దశ : 1925 నుంచి 1932 (సుమారు) వరకు. ఈ దశలో రైతాంగం తిరుగుబాటు చేసినా స్థానిక నాయకత్వం బలహీనమైనది. దీనివెనుక బయట ఉన్న ఫ్యూడల్ శక్తులు బాగా పనిచేశాయి. మునగాల జమీందారు కోర్టు వ్యవహారాలకు కావలసిన పెట్టుబడిని పెట్టాడు. ఇతడు పెద్ద జమీందారేగాక బేతవోలు మఖ్తాదారు వసూలుచేసిన అక్రమ పన్నులన్నింటినీ వసూలు చేసేవాడు ; ఇతడు ప్రజలపై సాగించిన దౌర్జన్యాలకు, దుర్మార్గాలకు హద్దులేదు. అయినా కక్ష సాధించుకోటానికి ఈ పనిచేశాడు.

రైతుల తరఫున పైరవీ చేసినవారు హుజూరునగరు తాలూకాలోని కందిబండ గ్రామ దేశముఖులు. వీరు బేతవోలు మఖ్తాదారుకు దగ్గరి బంధువులు. పెద్దభూస్వాములు. అయినా పరస్పరం ఏర్పడిన కక్షల కారణాన వారు మునగాల రాజావైపున చేరి రైతులకు పైరవీకారులయినారు. రైతుల పక్షాన సంపన్నులు, పలుకుబడిగల పెద్ద ఫ్యూడల్ భూస్వాములున్నా వారు కొంతకాలంవరకే పోరాడగలిగారు. రైతులను లొంగదీయటానికి మఖ్తాదారు అనేక దుర్మార్గాలుచేశాడు. కిరాయి మూకలతో రైతులను దెబ్బలు కొట్టించాడు ; దొంగకేసులు పెట్టించి అరెస్టు వారెంట్లు జారీచేయించి కోర్టులచుట్టూ తిప్పించాడు ; గ్రామాల్లో కూడా వారిని అనేక విధాల ఇబ్బందులపాలు చేశాడు. మునగాల జమీందారు పైరవీ (litigation)కి డబ్బు ఇచ్చినా స్థానిక నాయకత్వం రైతుల ఐక్యతను, మనోనిబ్బరాన్ని కాపాడలేకపోయింది. దీని ఫలితంగా రైతుల్లో చాలామంది మఖ్తాదారుకు లొంగిపోయారు. కొందరు గ్రామం వదిలి వెళ్ళిపోయారు.

సుమారు 1934 – 35లో మళ్ళీ పోరాటం ప్రారంభమయింది. దీనిలో కూడా ధనిక, మధ్యతరగతి, పేద రైతులు, కూలీలు పాల్గొన్నారు. దీనికి నాయకత్వం వహించింది ఏ పేదరైతులో, కూలీలో కాదు. ఒక భూస్వామే నాయకత్వం వహించాడు. అతనిపేరు మంత్రిప్రగడ రాజగోపాలరావు. అతడు పట్వారీ (గ్రామ కరణం). మఖ్తాదారుకు లోబడి పనిచేసేవాడు. రెండవ శ్రేణికి చెందిన భూస్వామి, పెత్తందారీ కుటుంబమతనిది. కాంగ్రెసు అభిమాని – గాంధేయ భావాలుకలవాడు. మునగాల జమీందారుకు కాంగ్రెసు అభిమాని అని పేరు. ఈ కారణంవల్లనే మునగాల జమీందారుకి, మంత్రిప్రగడ రాజగోపాలరావుగారికీ సంబంధం ఏర్పడింది.

రాజగోపాలరావు మఖ్తాదారుకు వ్యతిరేకంగా రైతులను సమీకరించి తిరుగుబాటుకు నాయకత్వం వహించాడు. తిరుగుబాటులో పాల్గొన్నది రైతాంగమే అయినా నాయకత్వపు వర్గస్వభావం వేరే ఉంది. ఇతడు ఉన్నత విద్యను అభ్యసించినట్టుగా కన్పించదు.

సాధారణంగా తెలంగాణాలో ఉర్దూ రాకుండా ఆఫీసుపనులు నడువని కారణాన ప్రతి పట్వారీ తెలుగుతోపాటు ఉర్దూ నేర్చుకోవటం మామూలే. సుమారు 1930 ప్రాంతంలో ఈ పోరాటం ప్రారంభమయిందని చెప్పవచ్చును.

ఆంధ్రోద్యమం వ్యాపించే సమయంలో 1926 - 1928లో నల్లగొండ జిల్లాలో నల్లగొండ, తిప్పర్తి, సూర్యాపేటలలో సభలు జరిగినవి. తిప్పర్తిలో రైతు సంఘం నిర్మాణానికి నిర్ణయించారు. ఈ నిర్ణయానికి, బేతవోలు రైతాంగ ఉద్యమానికీ ఏమైనా సంబంధమున్నదా లేదా అనే సంగతి పరిశీలించవలసిన అంశం. మునగాల పరగణాలో పోరాటం ప్రారంభమయింది 1930 ప్రాంతంలోనే. ఈ రెండింటికీ కొన్ని పోలికలు కన్పిస్తాయి. పరగణాలో కూడా ఉద్యమానికి నాయకత్వంవహించినవారు అక్కడి కరణాలు, మున్సబులు, వర్తకులు, స్థానిక పెత్తందార్లు. వీరిలో కొందరు భూస్వాములు కూడా ఉన్నారు. పోరాటపు మొదటి దశలో మనకీ లక్షణం కనిపిస్తుంది. ఒక అంశంలో మాత్రం భేదముంది. మునగాల జమీందారు బేతవోలు పోరాటం నాయకత్వాన్ని బల పరిచాడు. కానీ, బేతవోలు మఖ్తాదారు మునగాల పరగణా రైతు నాయకత్వాన్ని బల పరచలేదు. రెండుచోట్ల కూడా నాయకత్వాలు స్థానిక భూస్వాముల చేతుల్లో ఉన్నప్ప టికీ మునగాలలో వర్తకులు, మరికొందరు నాయకత్వంలో భాగస్వాములయినారు.

పోరాటం ప్రారంభమయిన సమయంలో గ్రామ ప్రజల్లో ఐక్యత ఉండేది. రైతులలో చీలిక లేదు. ధనిక రైతులు, ఇతర రైతులూ, వివిధ కులాలకు చెందినవారు అంతా ఐక్యంగా ఉండేవారు. అయినా ముఖ్య గ్రామమైన బేతవోలులో ఐక్యత బల హీనంగా ఉండేది. జెర్రిపోతులగూడెం పోరాటానికి ప్రధాన కేంద్రం.

**కోర్కెలు :** రైతాంగపు కోర్కెలలో కొన్నిచట్టబద్ధమైనవి, మరికొన్ని చట్టపరిధిలో లేనివి లేదా అస్పష్టంగా ఉన్నవి ఉండేవి.

1) అక్రమ పన్నుల రద్దు : అక్రమ పన్నులన్నీ రద్దు కావాలనేది ఒక కోరికగా ఉండేది. చట్టరీత్యా ఈ పన్నులు వసూలు చేయటం చెల్లనందున రైతులు ఇవ్వ నిరాక రించేసరికి, వాటంతట అవే రద్దయేవి. పోరాటం జరిగిన ప్రతి ప్రాంతంలో ఈ లక్షణం కన్పించేది. దేశముఖులు, జాగీర్దార్లు, మఖ్తాదార్లు, అక్రమ పన్నులు వసూలుచేయ టానికి లీగల్ సాధనమేమీ లేకపోయేది. కాగా ప్రజల్లో ఉండే వెనుకబడిన తత్వం, ఫ్యూడల్ సాంప్రదాయాలతోబాటు దౌర్జన్యం మాత్రమే వారి సాధనాలు. అందుకొరకే అక్రమంగా వసూలుచేసే పన్నులన్నీ తిరుగుబాటు ప్రారంభంలో వాటంతట అవే రద్దయిపోయాయి.

అక్రమపన్నులు, వెట్టిచాకిరీ రద్దుకావాలనే కోర్కెలు ఎంత కష్టసాధ్యమో

అంతతేలికైనవి కూడా. మఖ్తాదారు (ఫ్యూడల్ భూస్వామి) వీటిని తనంతటతాను మాని వేయటం అసాధ్యం. ప్రజలు కూడా ఇలాంటి పన్నులు చెల్లించటం, వెట్టిచాకిరీ చేయటం సాంప్రదాయమని భావిస్తారు. వీటికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేయటంతో మాయమై పోయాయి. మఖ్తాదారు వీటిని అమలుజరుపటం అసాధ్యమైపోయింది. కొన్ని నెలల తర్వాత ప్రజలు ఇవన్నీ గతానికి సంబంధించినవని భావించారు. కథల్లాగా చెప్పుకునే వారు. ఈ విధంగా ప్రజలు వెట్టిచాకిరీ, అక్రమపన్నులు రద్దుకావాలనే కోర్కెను పోరాటం ప్రారంభంకాగానే సాధించారు.

ఆ కాలంలో సామాన్య ప్రజలేగాక భూస్వాముల్లో కొందరు కూడా ఇన్నివిధాల అక్రమపన్నులు వసూలుచేయటాన్ని అసహ్యించుకునేవారు. ఈ మఖ్తాదారు చాలా దుర్మార్గుడని అనుకునేవారు కొందరైనా ఉండేవారు. స్వయంగా చేయకపోయినా దుర్మార్గాలు చేసే భూస్వామిని గొప్పవాడని కీర్తించే భూస్వాములు కూడా ఉండేవారు. వెట్టిచాకిరీ చేయించటం, అక్రమపన్నులు వసూలుచేయటం భూస్వామ్యవ్యవస్థలో భాగమై నప్పటికీ, భూస్వాములంతా ఒకేస్థాయిలో ప్రజలను దోచుకోలేదు. అనేక కారణాలవలన వారిలో భేదాలు కూడా వుండేవి. రైతాంగ పోరాటాలు సాగినప్పుడు ఇవి ప్రస్ఫుట మయ్యేవి.

2) భూమిశిస్తు, భూమి అమరకం : భూమిశిస్తు ఎంత ? భూమిమీద అధికారం ఎవరిది ? రైతుల హక్కులేమిటి ? మఖ్తాదారు హక్కులేమిటి ? ఇది ప్రధానమైనదేగాక ఎడతెగని సమస్యగా అయింది. ఆనాటి జాగీరు మఖ్తాల చట్టాలన్నీ అస్పష్టంగా ఉండేవి.

పోరాటపు తొలిరోజుల్లో రైతులంతా ఐక్యమై తిరుగుబాటు చేసినప్పుడు తమకు కొన్ని భూములు రావాలని కోరటమే గాక, వాటిని ఆక్రమించటానికి ప్రయత్నించారు. ఇది మాభూమి, మాకు కావాలని ముందుకుసాగితే, 'లేదు-కోర్టుల ద్వారా పరిష్కారం చేసుకోవాల'ని ఆ నాయకుడు భూమిని ఆక్రమించే చర్యను కోర్టులకు లాగాడు. ఇదే విధంగా శిస్తులు కూడా. రైత్వారీ గ్రామాల్లోకన్నా ఈ గ్రామాల్లో శిస్తులు హెచ్చుగా ఉన్నాయనీ, వాటిని తగ్గించాలనీ మరోకోరిక. శిస్తు ఎంత చెల్లించాలనే అంశం నిర్ణయించిన దాకా తగాదా ఉండేది. దీనివలన రైతులు శిస్తులు చెల్లించకపోయేవారు. లేదా తహశీల్‌లో చెల్లించేవారు. ఇది కూడా కోర్టులో తేలవలసిన సమస్య అయింది.

3) భూమిపై యాజమాన్యం : ఇతడు భూమిపై వచ్చే ఆదాయాన్ని తాను అనుభవించటమేకాక గ్రామంలోని భూమిలో కొంతభాగాన్ని 'తనద'ని నిర్ణయించి ఛోటా నిజాంలాగా వ్యవహరించాడు. నిజాం తనకోసం 'సర్ఫేఖాస్' అనే ప్రాంతాన్ని కేటాయించి దానిపైవచ్చే పన్నులను తానే అనుభవించినట్టు, ఈయన తానొక 'సర్ఫేఖాస్'ను సృష్టించు

కున్నాడు. అది స్వంతభూమి. దానిలో కొంతభాగం తాను సాగుచేసేవాడు. మిగిలిన భాగాన్ని కౌలుకు ఇచ్చేవాడు. ఈ భూమిపై భూమిశిస్తేగాక కౌలురేటును కూడా వసూలు చేసి అనుభవించే హక్కును సృష్టించుకున్నాడు. రైతుల కోర్కెలలో ఆయన 'సర్ఫెఖాస్'ను రద్దుచేసి భూమిపై కౌలు రేటు ఉండకూడదనీ, సాధారణమైన శిస్తులే వసూలుచేయాలనేది ఒకటి. పాలేర్లద్వారా సాగుచేసే 'శేరీ' భూమిపై ఇలాంటి కోర్కె లేదు. రైతులనుంచి అక్రమంగా స్వాధీనం చేసుకొని తన 'శేరీ'లో కలిపివేసిన భూమి తిరిగి తమకివ్వాలని రైతులు కోరిన ఉదాహరణలు లేవు. మక్తా గ్రామాల నుంచి వసూలయ్యే పనులన్నీ తన జేబులోకి వెళ్ళే "సర్ఫెఖాస్" అనీ, మరో 'సర్ఫెఖాస్' అక్రమమనీ అతనికి తెలుసు.

పెద్దబీడని, చిన్నబీడు అని 1100 ఎకరాల రెండు భూఖండాలు ఉండేవి. ఇదిగాక మరొక 700ఎకరాల భూమికూడా ఉండేది. పశువులమేపు పేరుతో సాగునుంచి విడవిసి బీడు పెట్టిన భూమి ఇది. రైతులు దీనిపై "పుల్లరి" పన్నులుచెల్లించి పశువులను మేపుకోవాలి. రైతులు దీనిని పట్టాలపై ఇవ్వాలని కోరారు. పోరాటపుకోర్కెలలో ఇదొకటి. కోర్టులలో తనకు అనుకూలంగా తీర్పుజరగదేమోనని భయపడి ఈ భూమినంతటినీ అన్యాక్రాంతం చేయాలని నిశ్చయించాడు. హుజూరునగరు తాలూకాలోని రేవూరు గ్రామానికి చెందిన పకీరురెడ్డి అను వ్యక్తిని (ఏజెంటును) తెచ్చి అతనికి తనఖా (కుదువ) పెట్టినట్టు కాగితాలు సృష్టించాడు. అతడు మక్తా గ్రామాల రైతులను కాదని, ఇతరగ్రామాల రైతులను తెచ్చి సాగుచేయించటానికి ప్రయత్నించాడు. వారు సాగుచేయటానికి సిద్ధమయ్యేసరికి, ఐక్యంగాఉన్న రైతులు కొత్తవారిని బెదిరించి వెళ్ళగొట్టారు. ఈవిధంగా అతని ప్రయత్నాన్ని భగ్నంచేశారు.

చిన్నబీడు, పెద్దబీడుది యాజమాన్యపు సమస్యే. దీనిపై శిస్తు (పుల్లరి) వసూలు చేయకూడదని తమకు పట్టాకావాలని రైతులు కోరితే, 'లేదు, నాకు అలాంటి అధికారం వున్నది' అని మక్తాదారు అనేవాడు. దీనిపై పైరవీ నడిచింది.

4) సర్వేసెటిల్మెంటు : అన్ని జాగీరు, మక్తాప్రాంతాల్లో ఉన్నట్టుగానే బేతవోలు మక్తా గ్రామాల్లో కూడా సర్వేసెటిల్మెంటు (బందోబస్తు) సమస్య ఉండేది. ఇతర గ్రామాల్లో సర్వే సెటిల్మెంటు జరుగకపోయేది. కానీ ఇక్కడి మక్తాదారు దానిని జరిపించినట్టుగా చేశాడు. దీనికోసం కొన్ని మాయోపాయాలు పన్నినాడు. ఆనాటి మద్రాసు రాష్ట్రంలో సర్వేసెటిల్మెంటు ఒకవిధంగా జరిగింది. ఎకరానికి 100 సెంట్లు అనే లెక్కలు దానికనుగుణ్యంగా వచ్చినవి. హైదరాబాదు సంస్థానంలో ఆనాటి బొంబాయి రాష్ట్రంలో మాదిరిగా జరిగింది. ఎకరానికి 40 గుంటలనే లెక్కలు ఆ రాష్ట్రం నుంచి

వచ్చినవే. మఖ్తాదారు ఈరెంటినీ సమ్మిళితంచేసి హెచ్చు పన్నులు రాబట్టుకోవటానికి వీలుగా సర్వే సెటిల్మెంటు చేయించాడు. ఇంతేకాదు. ఎకరానికి రూపాయి, అంతకు తక్కువ ఉండాల్సిన మెట్టశిస్తును రూ. 2-50 వరకు పెంచాడు. పక్కన ఉన్న రైత్వారీ (దివానీ) గ్రామాల్లో అమల్లోఉన్న పద్ధతి కావాలని రైతులు కోరుతూవచ్చినారు.

రైతులు రుణభారం వల్లనో, పండిన పంట శిస్తుకు చాలకపోవటంవల్లనో శిస్తులు కట్టలేక వదిలివేసిన భూములను మఖ్తాదారు తీసుకునేవాడు, లేదా కొంత డబ్బు తీసుకొని ఇతరులకు కట్టిపెట్టేవాడు. ఇలాంటి అధికారం మఖ్తాదారుకు ఉన్నదా, లేదా అనేది భూమిపై యాజమాన్యపు సమస్యతో ముడిపడి ఉండేది.

ఈ సమస్యలను కోర్టులు, రెవిన్యూ ఆఫీసులద్వారా పరిష్కారం చేసుకొనుటకు సిద్ధంచేసాడు రాజగోపాలరావు. పైరవి ప్రారంభమై సంవత్సరాల తరబడి నడిచింది. రైతులు ఆర్థికంగా కూడా బాగా దెబ్బతిన్నారు. అయినా చాలాకాలందాకా నడిచింది.

మఖ్తాదారుతో తగాదా రావటంతో రైతులు సూర్యాపేటలోని తహశ్శీలు ఆఫీసుకు వెళ్ళి శిస్తులు కట్టి తిరిగి వెళ్ళేవారు. రాజగోపాలరావు పట్వారీ అవటంవలన ఏ రైతు ఎంత శిస్తు ఇవ్వాలో తనదగ్గర ఉన్న రికార్డునిబట్టి నిర్ణయించి తహశీలులో దాఖలుచేసేవాడు. ఇతని పట్వారీ గిరిని మఖ్తాదారు రద్దు చేయించాడు. ఆస్తులను లాగివేశాడు. అతని ఇంటిని మాత్రం మిగిల్చాడు. పైరవీలో పట్వారీగిరి కూడా ఒక సమస్య అయింది.

పైరవీ నడిచిన తీరు : అన్ని స్థాయిల్లో లాయర్లుండేవారు. రైతుల పక్షాన పని చేసేవారొకరు, జమీందారు (మఖ్తాదారు) తరఫున పనిచేసేవారు మరొకరు. చేతవోలుకు తాలూకా కేంద్రమైన సూర్యాపేటలో అమృతరెడ్డి అనే ప్లీడరు రైతుల పక్షాన పనిచేసేవారు. జమీందారుల పక్షాన వేములపల్లి వెంకటకృష్ణయ్య పనిచేసేవారు. వీరిద్దరూ పెద్దలే. అన్ని గ్రామాల్లోకూడా వీరికి భూస్వాములైన ఏజెంట్లు ఉండేవారు. తగాదాలు పెట్టుకున్నప్పుడు ఒక భూస్వామి ఒక ప్లీడరు దగ్గరకి, రెండో అతను మరో ప్లీడరు దగ్గరకు వచ్చేవాడు. జిల్లా, రాష్ట్ర స్థాయిలో కూడా ఇదేవిధంగా ఉండేది. ఇద్దరూ గ్రామంలో ఉండే రైతులను భూస్వాములను పంచుకునేవారు. ఈ స్థితి నేటికీ ఉన్నా—పైరవీలే ప్రాథమిక దశలో ఉన్న ఆ కాలంలో దీనికి కొంత ప్రత్యేకత ఉండేది.

కోర్టులు, ఆఫీసులు రెండుమూడు రకాలుగా ఉండేవి. భూములకు సంబంధించిన పైరవీ అంతా (లిటిగేషన్ అంతా) తాలూకా, జిల్లా, అంతకు మించిన స్థాయిలో రెవిన్యూ ఆఫీసుల్లోనూ, కోర్టుల్లోను సాగిపోతూ ఉండేది. ఇన్ని కోర్టులలోనూ, ఆఫీసుల్లోనూ వ్యవహారం నడవటంవలన ఎడతెగని సుదీర్ఘమైన పోరాటమైపోయింది. ఇవిగాక సీటి

పారుదల శాఖ (ఆబుపాషీ), సర్వే సెటిల్మెంటు (బందోబస్తు) శాఖలో కూడా పైరవీ అవసరమయ్యేది.

ప్రధానంగా రెవిన్యూ, సివిల్, క్రిమినల్ శాఖలలో ఆ రోజుల్లో కేసులు నడిచినవి. వాటిని నడిపినది రాజగోపాలరావు. ఆయన చేసేపని— సూర్యాపేటనుంచి నల్లగొండకు, నల్లగొండనుంచి హైదరాబాదుకు వెళ్లి కేసులు చూసుకోవటం. వకీళ్ళకు ఫీజులనీ, కేసుల ఖర్చులనీ వందలవేల రూపాయలు వసూలుచేసారు. ఇలా కొన్ని సంవత్సరాలలో వసూలుచేసిన డబ్బు లెఖ్ఖవేస్తే అది రైతులు మఖ్తాదారునుంచి భూమిని కొనటానికి చాలినంత ఉందని తేలింది. ప్రతి సంవత్సరమూ ఎంతడబ్బు వసూలు చేసేవారో దీనివలన స్పష్టమవుతుంది.

నిర్మాణ రూపం : గ్రామంలో రైతు సంఘం ఉండేది. దానికి నాయకులు ఉండేవారు. రాజగోపాలరావు ఇంత డబ్బు కావాలని వారికి చెప్పేవారు. వారు వసూలు చేసేవారు. ఎకరానికి లేక కుటుంబానికి ఇంత అని నిర్ణయించేవారు. ఆ ప్రకారమే వసూలు చేసి ఆయన చేతికిచ్చేవారు. ఆయన ఖర్చుపెట్టేవారు. ఆ రోజుల్లో పార్టీ జరిపిన విచారణలో వసూళ్ళ ఖర్చులు సక్రమంగా లేవని తేలింది. అయినా ఆయన నిస్వార్థంగా, ప్రతిఫలం ఆశించక రైతాంగంకోసం పనిచేసేవారని చలామణీ అయ్యేవారు.

పోరాట రూపాలు : ప్రారంభంలో ప్రజలంతా ఐక్యమై మఖ్తాదారు అధికారాన్ని ధిక్కరించి పన్నులివ్వమని నిరాకరించిన చర్యను మిలిటెంటు విప్లవాత్మకమైన చర్యగా మనం నిర్ధారణ చేయవచ్చును. ఈ స్థితి ఎంతోకాలం లేదు. తర్వాత జరిగినదంతా లీగల్ పోరాటమే. అది రెండవ దశ. పైరవీ అయినా చట్టపరమైన కోర్కెలకోసం చేసిన పోరాటం. ప్రజలలో ఐక్యతను నిలబెట్టటానికి చేసిన కృషి దీనిలో ఒకభాగం. ఎందుకంటే ప్రజలు చీలితే నాయకత్వానికి రైతాంగంలో బలం తగ్గిపోతుంది. కేసులు గెలవడానికి అవకాశాలు సన్నగిల్లుతాయి. పైరవీ కోసం చేసే వసూళ్ళు తగ్గుతాయి. ఇతర విధాలా ఇబ్బంది ఉంటుంది. ఈ కారణాన గ్రామ రైతాంగంలో చీలికరాకుండా, బలం తగ్గకుండా ఉండటానికి అవసరమైన ఏర్పాట్లు జాగ్రత్తగా చేసుకునేవారు నాయకులు.

1938 నాటికి సుమారు 10 సంవత్సరాలపాటు బేతవోలు రైతులు పోరాటం సాగించారు. వారి కోర్కెలు :

1) వెట్టిచాకిరీ రద్దు కావాలి.
2) అక్రమ పన్నులు రద్దుకావాలి.
3) రైత్వారీ (దివానీ) గ్రామాల మాదిరిగా పన్నులులేని సమిష్టిభూములుండాలి.
4) మాగాణి మెట్టశిస్తురేట్లు పక్కనున్న రైత్వారీగ్రామాలతో సరిసమానంగాఉండాలి.

5) రైతులకు తమ భూమిని అమ్ముకోడానికి, ఇతరుల భూమిని కొనడానికి హక్కు ఉండాలి.

6) మఖ్తాదారుకు పటేలుపట్వారీలను తొలగించే, సస్పెండుచేసే అధికారం ఉండకూడదు.

రైతాంగం 10 సంవత్సరాలదాకా ఆర్థికభారాన్ని మోస్తూ ఎలా పోరాటం సాగించ గలిగారు అనే ప్రశ్నరావచ్చును.

1) బేతవోలు చెరువు పెద్దది. ఎప్పుడూ నీరుండేది. దానిపక్కన కొన్ని చిన్నచిన్న చెరువులు కూడా ఉన్నాయి. ఇవన్నీ మాగాణి సాగుకు ఉపయోగపడేవి. 1930 నాటికే వేరుశెనగ పంట ప్రారంభమయింది. ఇది వ్యాపారపంట కావటంతో రైతులకు కొంత ఆదాయం ఉండేది. బేతవోలు ప్రాంతము అటు ఆనాటి హుజూరునగర్ తాలూకాకు, ఇటు మునగాల పరగణాకు మధ్యన ఉన్నది. నల్లగొండ జిల్లాలోని చాలా ప్రాంతాలకన్నా వ్యవసాయం అభివృద్ధిపొంది, హెచ్చువంటలు పండించే ప్రాంతమిది. ఈ కారణంవలన పెద్దరైతులూ, చిన్నరైతులూ అంతా పైరవీవలన వచ్చిన ఆర్థికమైన ఒత్తిడిని చాలాకాలందాకా తట్టుకొని ఉండగలిగినారని స్పష్టమవుతున్నది. వ్యవసాయం వెనుకబడిఉన్న ఇతరగ్రామాలలో సాధ్యంకాని పని ఇది. కొద్దిపాటి ఆదాయాలుకల రైతులున్న గ్రామాలలో ఇన్ని సంవత్సరాల పోరాటం సాగడం అసంభవం కానప్పటికీ కష్టసాధ్యమే. పైరవీలు సాగినప్పుడే ఆర్థికసమస్య ముందుకువస్తుంది. విప్లవాత్మకంగా సాగే పోరాటాలకు ఈ సమస్య ప్రధానమైనదికాదు.

2) ఈ పోరాటానికి ప్రారంభంనుంచీ నడిగూడెం (మునగాల) రాజాగారి మద్దతు ఉంటూ వచ్చింది. ఈయన ఆర్థికంగా ఏమేరకు సాయంచేశాడనేది మనకు తెలియదు. సూర్యాపేట తాలూకాకేంద్రంలో రైతులపక్షాన పనిచేసిన వకీలుకు ఈయన తోడ్పాటు కూడా ఉండేది. రాజగోపాలరావు (పైరవీకారు) హైదరాబాదులో రాజాగారి భవనంలో మకాంవేసి ఉండేవాడు. సుదీర్ఘకాలం పోరాటం కొనసాగటానికి రాజాగారి మద్దతు కూడా ఒక కారణమే. ఇలాంటి పోరాటాలకు రాజాగార్ల సహకారం అరుదుగా లభిస్తుంది.

3) 1940నుంచి (ఎనిమిదవ ఆంధ్రమహాసభ - చిలుకూరు) కమ్యూనిస్టులు ఈ ప్రాంతపు రైతులతో సంబంధాలు ఏర్పరచుకున్నారు. రైతు యువకులు కమ్యూనిస్టు పార్టీలో చేరారు. పక్కనే ఉన్న చిలుకూరు (హుజూరునగరు తాలూకా) పరిసర ప్రాంతాలు కమ్యూనిస్టు పార్టీకి బలమైన కేంద్రాలయినాయి. ఈ పరిణామం 1946దాకా పోరాటం కొనసాగటానికి తోడ్పడింది.

4) 1946 నాటికి కమ్యూనిస్టు పార్టీ రైతాంగానికి భూమి పంపకంచేసి పోరాటా

నికి నాయకత్వం వహించింది. తర్వాత కాలంలో పార్టీ నాయకత్వాననే రైతాంగ పోరాటం నడిచింది.

బేతవోలు ప్రాంత రైతాంగ పోరాటం, సుదీర్ఘ కాలందాకా సాగడానికి గల కారణాలలో ఇవి ముఖ్యమైనవి.

ప్రజలు ప్రారంభంలో విప్లవాత్మకంగా తిరుగుబాటు చేసినప్పటికీ కాంగ్రెసు వాది నాయకత్వాన ఉద్యమం లీగల్ మార్గాల్లో నడిచింది. కమ్యూనిస్టుపార్టీ రైతాంగంలో ప్రవేశించిన ఆరు సంవత్సరాలకు (1946లో) నల్లగొండ జిల్లా విప్లవోద్యమంలో ఒక భాగమైంది. అప్పటినుంచి సాయుధ పోరాటం సాగింది. ఈ విధంగా సుమారు 20 సంవత్సరాలు సాగిన పోరాటమిది.

## 2. కొలనుపాక జాగీరు రైతాంగ పోరాటం

కొలనుపాక నల్లగొండ జిల్లాలోని ఆలేరుకు 6 కిలోమీటర్ల దూరాన ఉంటుంది. పెద్ద గ్రామం; ప్రాచీనమైనది; జైనుల పుణ్యక్షేత్రం. పెద్ద జైనదేవాలయం ఉంది. కొలనుపాక చుట్టూ ఉన్న మరికొన్ని గ్రామాలుకూడా ఈ జాగీరు ప్రాంతంలోనివే. వీటన్నిటికీ పలుకుబడిగల నవాబు తురాబుయార్ జంగ్ అధిపతి. ఇక్కడి పెద్ద భూస్వాములూ చిన్న భూస్వాములూ అంతా ఆంధ్రులు. వారిలో కొందరికి ఆంధ్రోద్యమంతో సంబంధం ఉండేది. ఆరుట్ల సోదరులు ఈ గ్రామస్తులే.

జాగీర్దారు, జాగీరు ఉద్యోగులు ప్రజలతో వెట్టిచాకిరీ చేయించటమే గాక రైతుల నుంచి అక్రమ శిస్తులు వసూలుచేసేవారు. ఇక్కడి పెద్దలకు ఆంధ్రోద్యమంతో సంబంధం ఉన్నప్పటికీ, భూస్వాములూ, రైతులూ చాలాకాలందాకా అక్రమ శిస్తులు చెల్లించారు; ప్రజలంతా వెట్టిచాకిరీ చేశారు. వీరిలో సంచలనం కలిగింది మతం మార్పిడి సందర్భంలో. జాగీర్దారు మద్దతుతో అధికారులు మాదిగ, మాలవారిని ఇస్లాం మతంలోకి మార్చినవెంటనే ఆరుట్ల రామచంద్రా రెడ్డి, లక్ష్మినరసింహారెడ్డి మరికొందరు కలిసి మతం మార్పిడిని వ్యతిరేకించారు. ఆర్య సమాజీయులను పిలిచి వారిని తిరిగి హిందూ మతంలోకి మార్పించారు. ఈ సందర్భంలోనే వెట్టిచాకిరిని మాన్పించారు. అక్రమ పన్నులను చెల్లించ నిరాకరించి, ఖాల్సా గ్రామాల పన్నులనే చెల్లించసాగారు. ఈ పోరాటంలో వారంతా నిర్బంధానికి గురి అయినారు; జైళ్ళకు వెళ్ళారు; విడుదలై బయటికి వచ్చారు. తర్వాత కాలంలో గ్రామ యువకులు స్టేటు కాంగ్రెసు సత్యాగ్రహంలో పాల్గొన్నారు.

ఈ పోరాటంలో కొన్ని ప్రధాన బలహీనతలున్నాయి:

1) మతంమార్పిడితో సంబంధం : హరిజనులు మతం మార్చుకోవటంతో గ్రామ పెద్దల్లో సంచలనం కలిగిందేకాని అంతకుముందు కలుగలేదు. జాగీరు ప్రజలపై అక్రమ శిస్తులు, పన్నులద్వారా జరుగుతున్న దోపిడీకి ఈ పెద్దలంతా గురిఅయినవారే. తాలూకా లోని ఇతర గ్రామాల్లో ఏదో ఒకరూపంలో పోరాటాలు సాగుతూ ఉన్నప్పటికీ వీరిలో కదలికలేదని స్పష్టమవుతున్నది. మతంమార్పిడి సమస్యపై వచ్చిన సంచలనానికి మతతత్వప్రేరణ ఉన్నది. భూస్వాముల, ధనికరైతుల పొలాలలో పనిచేసే వారిలో హెచ్చుమంది మాదిగ మాలలే. ఈ కారణాన వారి ఆర్థిక ప్రాబల్యాన్ని ఉపయోగించి ఆర్యసమాజీయుల సాయంతో వారిని తిరిగి హిందువులను చేయగలిగారు.

2) సమీపప్రాంతాల్లో జాగీరు ప్రజల పోరాటాలు సాగుతున్నా ఈ గ్రామాల్లో కూడా అక్రమ శిస్తులు, అక్రమపన్నులు, వెట్టిచాకిరి లాంటి సమస్యలపై స్థానిక పెద్దలు ముందే చొరవ తీసుకొని వీటిపై పోరాటాలు నడుపలేదు. దీనిఫలితంగా దుర్భరమైన వెట్టిచాకిరితో బాధపడే మాదిగ, మాల కులాలవారికి జాగీరు పరిపాలనయెడ ఉన్న వ్యతిరేకతను పెడమార్గానపట్టించి ఇస్లాంలో చేరినంతమాత్రాన కష్టాలు తొలగిపోతాయనే అభిప్రాయం కలిగించగలిగారు. వారిని తిరిగి హిందువుల్లోకి చేర్పించటానికి వెట్టిచాకిరి లాంటి సమస్యను తీసుకున్నారేగాని మతం మార్పిడికి సంబంధం లేకుండా స్వతంత్రంగా ఈ సమస్యలను తీసుకోలేదు.

3) అన్ని గ్రామాల్లో మాదిరిగానే కొలనుపాక గ్రామాల్లో భూమి, కూలిసమస్య లున్నవి. ఇవి బయటికి రాలేదు. దీనివలన పోరాటానికీ, ఉద్యమానికీ బలం చేకూరలేదు.

ఈ విధంగా కొలనుపాక ప్రాంతపు జాగీరు రైతాంగ ఉద్యమానికి నిర్మాణ యుతమైన పోరాట స్వభావానికన్నా, నాయకుల ప్రాబల్యం, మతతత్వ ప్రభావం హెచ్చుగా ఉండేది. క్రమంగా ఇది స్టేటు కాంగ్రెసు ఉద్యమంలో కలిసిపోయింది.

## 3. పరిటాలజాగీరు రైతాంగపోరాటం–జాగీర్దారు ఏజెంటు హత్య

పరిటాల హైదరాబాదు-విజయవాడ రోడ్డుపైన విజయవాడకు సమీపానగల ఒక గ్రామం. ఈ జాగీరుకు సంబంధించిన క్లుప్తమైన సమాచారం ఈ విధంగా ఉంది :

"నైజాం ఇలాకా, వరంగల్లు జిల్లా మధిర తాలూకాలో నవ్వాబ్ కమాల్ యార్ జంగ్ జాగీర్దారుకు కానాత్ తాలూకా అనే పేరుతో పరిటాల, బత్తినపాడుగని, ఆత్కూరు, మొగులూరు, కొడవటికల్లు, ఉస్తేపల్లి మరియు మల్లవెల్లి మొత్తం ఏడుగ్రామాలుండేవి. ఈ గ్రామాలు పూర్తిగా నైజాం ఇలాకాతో ఏమాత్రం సంబంధం లేకుండా అప్పుడు

బ్రిటన్ ఏలుబడిలో ఉన్న ప్రస్తుత ఆంధ్రరాష్ట్రపు గ్రామాదులమధ్య వో సముద్రంలో దీవులలాగా ఉండేవి."

"పీటి సాలీనా ఆదాయము సుమారు 90,000 కల్దారు రూపాయలుండేవి. అప్పటిలో జాగీర్దారులకు తమ ఏలుబడిలో ఉన్న భూభాగంమీద సివిల్, క్రిమినల్ అధికారాలుండేవి. వారు సర్వస్వతంత్రులు. నైజాంకు ప్రతి సంవత్సరం పేష్కష్ రూపంలో కొంతధనం ఇస్తూ ఉండేవారు. పరిటాల గ్రామం తాలూకాకు ప్రధానస్థానంగా ఉండి, అచ్చట జాగీర్‌దార్ తరపున ఒక తహసీల్దారు, ఫస్టుక్లాసు మేజిస్ట్రేటు మరియు పోలీసు సబిన్‌స్పెక్టర్, 15-20 మంది సిబ్బందితో ఉండేవారు. జాగీర్దారులు హైదరాబాదులో నివసిస్తూ తమ అనుయాయులద్వారా ప్రభుత్వం సాగిస్తూ ఉండేవారు."

"ఈ గ్రామాలు నైసర్గికంగా చుట్టూ అప్పటి బ్రిటిష్ భూభాగంతో చుట్టబడి యుండుటచేత అచ్చటి రాజకీయ చైతన్యప్రభావము తరచు ఈ జాగీరుగ్రామాల ప్రజల మీద పూర్తిగా ఉండేది. జాగీరుప్రజలకు తరచు చుట్టువట్టు గ్రామాదులతో సంబంధ బాంధవ్యాలుండుటవలన వీరుగూడ తరచు అచ్చటి రాజకీయాల్లో పాల్గొనేవారు. తత్ఫలితంగా ప్రజలలో రాజకీయచైతన్యం హెచ్చుగా ఉండేది".

"నవాబ్ కమాల్ యార్‌జంగ్ తండ్రి ఖాన్‌ఖానాన్ గారి హయాంలో లంకా సుబ్బయ్యశాస్త్రి అనేవ్యక్తి వృద్ధుడయిన నవాబువద్ద పలుకుబడి సంపాయించి ఎట్టి అధికారహోదా లేకుండా, తరచు ఈ గ్రామాలలో నిరంకుశదమననీతిద్వారా 7-8 సంవత్సరములు నియంతగా వ్యవహరించి ప్రజలను పీడించినాడు. తత్ఫలితంగా ప్రజలలో రాజకీయ చైతన్యం ప్రబలి ఈ వ్యక్తియొక్క నియంతృత్వాన్ని శాసనబద్ధంగా అణచుటకు సాముదాయక ప్రయత్నములు లెక్కకు మిక్కిలిగా జరిగినవి. ఈ శాస్త్రిగారి జీవితకాలంలో జాగీరు దుష్పరిపాలన గురించి విచారించుటకు హైదరాబాదు ప్రభుత్వం ఒక విచారణ సంఘం నియమించి విచారణ జరిపారు కూడా. కాని ఫలితం శూన్యమైనది. తుదకు ప్రజలు విసిగి వేసారి ఈయనను హత్యచేసినారు. అప్పటినుంచి ఈ తాలూకాను జాగీరుదారు, వారి సిబ్బంది ప్రత్యేకంగా వేయికళ్ళతో కనిపెట్టుతూ ప్రజా చైతన్యమును అరికట్టుటకు సర్వవిధాలా ప్రయత్నిస్తూ వచ్చారు. కాని ప్రజలు పరిసర పరిస్థితుల ప్రభావంవల్ల ఎప్పటికప్పుడు రాజకీయంగా ముందంజవేస్తూ జాగీరు ప్రభుత్వ దమన నీతిని బహిరంగంగా ఖండిస్తూండేవారు".. (దేశోద్ధారక గ్రంథమాల వారు ప్రచురించిన 'తెలంగాణం' వ్యాస సంకలనంలోని శ్రీ మాదిరాజు రామారావు రచించిన 'పరిటాల ప్రజా ఉద్యమం' నుంచి - పేజీ - 179-180).

ఈ జాగీరు గ్రామాలకు కొన్ని ప్రత్యేక లక్షణాలున్నాయి. 1) రెవిన్యూ,

పోలీసు, జ్యుడీషియల్ (న్యాయశాఖ) అధికారాలు జాగీరుదారుకే ఉన్నాయి. 2) విజయవాడకు సమీపాన ఉండుటేగాక, చుట్టూ ఆనాటి బ్రిటిష్ పరిపాలన ఉన్న కృష్ణా జిల్లా గ్రామాలున్నాయి. జాతీయోద్యమ ప్రభావం వలన ఈ గ్రామాల్లో రాజకీయ చైతన్యం హెచ్చుగానే ఉండేది. అయినా ఈ గ్రామాల ప్రజలు జాతీయోద్యమంలోనూ, జాగీరు వ్యతిరేక పోరాటంలోనూ పాల్గొనటానికి అవకాశాలు స్వల్పం. కాంగ్రెసు నాయకులు ఈ గ్రామాలు నిజాం ప్రాంతంలోనివని వీటిని వదిలివేసేవారు. తెలంగాణా ప్రాంతానికి దూరంగా ఉండటంవలన జాగీరు వ్యతిరేక పోరాటాల ప్రభావం ఈ గ్రామాల ప్రజలపై లేకుండా పోయింది. అయినా జాగీరుదారీ దోపిడీ తీవ్రంగా ఉండటం వలన తమ సరసనే ఉన్న గ్రామాల రైతులపై పన్నులభారం తమకన్న తక్కువగా ఉండటంవలన రైతులు వాటిని తగ్గించుకోటానికి కృషి చేస్తూ వచ్చారు. మాదిరాజు రామకోటేశ్వరరావు పన్నుల భారాన్ని తగ్గించటానికి చేసిన పైరవీని గురించి తన స్వీయచరిత్రలో ప్రస్తావించారు.

శాస్త్రియొక్క "నియంతృత్వాన్ని శాసనబద్ధంగా అణచుటకు సాముదాయిక ప్రయత్నములు లెక్కకు మిక్కిలిగా జరిగినవని" సీతారామారావుగారు రాస్తున్నారు. జాగ్రత్తగా పరిశీలిస్తే ఈ ప్రయత్నాలు 1920కి పూర్వం జరిగి ఉంటాయనుకోవచ్చు. ఈ ప్రయత్నాలు 1) "సాముదాయక"మైనవి, 2) శాసనబద్ధమైనవి. ప్రజలంతా పాల్గొనటం వలన సాముదాయకమైనవి. ప్రజలకు నాయకత్వం వహించింది ఎవరు? భూస్వాములా? ధనిక రైతులా? లేక సాధారణ పైరవీ కారులా? మనకు తెలియదు. కృష్ణా జిల్లాలో వృద్ధి పొందిన జాతీయోద్యమ ప్రభావం ఏదో మేరకు ఉంటుంది. కనుక స్థానిక పెద్దల నాయకత్వంలోనే ఈ ప్రయత్నాలు జరిగాయని స్పష్టమవుతుంది.

2) ఈ ప్రయత్నాలు శాసనబద్ధంగా చేయటమంటే, ఆనాడు నిజాం సంస్థానంలో ఉన్న జాగీరు చట్టాలకులోబడి పైరవీలు జరిగాయని స్పష్టమవుతుంది. ఇవి అస్పష్టంగా ఉండుటేగాక రైతుల హక్కులను గుర్తించలేదు. ఈకారణంవలన రైతులు లిటిగేషన్‌లో (పైరవీ) వ్యయప్రయాసలకు లోనై తమకు అనుకూలమైన ఫలితాలను పొందలేక పోయారు.

3) ఈ ఏజెంటు (శాస్త్రి) దుర్మార్గాలు చేశాడు. ప్రజలు వీటిని ప్రతిఘటించారు. దీనినే శాసనబద్ధంగా 'అణచి' వేయటమని రాశారు.

చివరకు ఈ ప్రయత్నాలవలన జాగీరుదుష్పరిపాలన నలుగురిదృష్టిలోకివచ్చింది. దీనిని విచారించటానికి ఆనాటి నిజాం ప్రభుత్వం ఒక విచారణసంఘాన్ని నియమించటమే జాగీరు పాలన ఎంతదుర్మార్గంగా సాగిందో స్పష్టంచేస్తుంది.

తమ ప్రయత్నాలన్నీ విఫలమైనప్పుడే ప్రజలు శాస్త్రిని చంపారు. వారు దూరాన

హైదరాబాదులో ఉన్న జాగీర్దారును శత్రువని భావించలేదు. కళ్ళ ఎదుటనే ఉంటూ ఏరోజూ అనక దుర్మార్గాలుచేసే శాస్త్రినే వారు తమ శత్రువుగా భావించి చంపివేశారు. వారు తమకు అందుబాటులోఉన్న లీగల్ మార్గాలను ఉపయోగించిన తర్వాతనే ఈపని చేశారనేది గమనించదగిన అంశం.

తెలంగాణాలోని లోతట్టు ప్రాంతాలకూ, ఈ గ్రామాలకూ సంబంధం లేకపోయినా అక్కడి జాగీరు, ఫ్యూడల్ వ్యతిరేక పోరాటాల్లో కూడా ఇలాంటి సంఘటనలే జరిగినవి.

## 4. మునగాల రైతాంగ పోరాటం

కృష్ణా జిల్లాలో ఒకభాగమైన మునగాలప్రాంతం 1959 జూలైలో నల్లగొండ జిల్లాలో కలిసిపోయింది. ఒక జమీందారు పాలనకింద ఉన్న ఈ ప్రాంతాన్ని పూర్వం నుంచి పరగణా అని వ్యవహరించేవారు. ఇక్కడి రైతాంగ ఉద్యమం తెలంగాణాలో నిర్మాణయుతమైన ప్రజాఉద్యమం ప్రారంభం కాకముందే ప్రారంభమైంది. ఆ దశలో రెంటికీ సంబంధం లేకున్నా, క్రమంగా సన్నిహితమై విలీనమైపోయినవి. నల్లగొండజిల్లా ప్రజాఉద్యమంపై పరగణా రైతాంగ పోరాటప్రభావం ఎప్పుడూ ఉంటూ వచ్చింది. పరగణా చుట్టూ తెలంగాణా ప్రాంతం ఉండటం, జమీందారీ రైతాంగపు సమస్యలు తెలంగాణా రైతాంగ సమస్యలతో పోలి ఉండటంవలన ఈ ప్రాంతంలో సాగిన రైతాంగ పోరాటంలోని కొన్ని ముఖ్యలక్షణాలను తెలుసుకోవటం అవసరం.

పరగణాలో సుమారు 40వేల జనాభా ఉన్నది. నాయని రంగారావు జమీందారు; తెలంగాణాలోని జాగీర్దారుతో సమానం. ఈయన తెలంగాణాలో కొన్ని గ్రామాలకు దేశముఖు. ఆ గ్రామాల్లో ఈయనకు కొంత భూమి ఉండేది.

పరగణా ప్రజలపై దోపిడీ దౌర్జన్యాలు ఎలా ప్రారంభమైనదీ తటవర్తి వెంకటేశ్వరరావు "మునగాల పరగణా ప్రజా ఉద్యమ చరిత్ర"లో ఇలా రాశారు :

"మునగాల జమీందారు తన వారసత్వ వ్యాజ్యము దత్తత చెల్లదని కీసరవారు తెచ్చిన వ్యాజ్యములు వరంగల్లు, హైదరాబాదు, బందరు, మదరాసు కోర్టులలో నడిచినవి. ఇవి తరువాత లండన్ ప్రీవీ కౌన్సిల్‌వరకు వెళ్ళి అక్కడ రంగారావు జమీందారేగెల్చినా ఖజానా ఖాళీ అయినది. ఇంకా ఇతర వ్యాజ్యముల ఖర్చులకింద ఖాళీ అగుచున్న ఖజానాను పూర్తిచేయుటకు జమీందారు అన్ని ప్రయత్నములు ప్రారంభించాడు. శిస్తులు పెంచుట, ప్రజలపై జరిమానాలు విధించు సివిల్, క్రిమినల్ పవర్సు ఉపయోగించుట,

వెట్టిచాకిరీ, అనేక అక్రమాలద్వారానూ, దౌర్జన్యాల ద్వారానూ ధనము సంపాదించుట ప్రారంభించాడు.

"మంచి బీడు, మంచి పంట భూములు ఏదో ఒక మిషతో కాజేయుట ప్రారంభించాడు. తన నౌకర్లను యమకింకరులుగా తీర్చిదిద్దాడు. శిక్షణ పొందిన ఈ నౌకర్లు ప్రజలను పలు విధముల పీడించుట ప్రారంభించారు. ఈ క్రూర కార్యములవల్ల లక్షలాది రూపాయలు జమీందారు ఖజానాకు జమపడ్డాయి. వేలాది ఎకరములు ప్రజల భూములు జమీందారు స్వంతం చేసుకున్నాడు". (పేజి-16)

జమీందారీ ప్రాంతం కృష్ణా జిల్లాలో ఉండటంవలన బ్రిటిషు ఇండియాలోనూ, దేశముఖుగిరీ, భూములు తెలంగాణాలో ఉండటంవలన హైదరాబాదు సంస్థానంలోనూ ఈయన వ్యాజ్యాలు నడిచినవి. వ్యాజ్యాలలో ఖజానా ఖాళీ అయితే, దానిని నింపటానికి ప్రజలనే కొల్లగొట్టసాగాడు. అక్రమ పన్నులతో సంతృప్తి పడలేదు. వేలాది ఎకరాల ప్రజల భూములను స్వాధీనం చేసుకొని పెద్ద భూస్వామి అయినాడు. ఇదంతా 1930 నాటికే జరిగిపోయింది.

ఈ దౌర్జన్యాలను ఎదిరించటానికి 1930లో జమీన్ రైతు సంఘాన్ని ఏర్పరచటానికి కృషి జరిగింది. ఈ కృషిలో ముందున్నవారు గ్రామ కరణాలు, మునసబులు, పెద్ద రైతులు, వర్తకులు. వీరికి ఆనాటి కాంగ్రెసు నాయకుల తోడ్పాటు ఉండేది. 1930 తర్వాత కాంగ్రెసు సహాయ నిరాకరణ ఉద్యమం ప్రారంభిస్తే, బ్రిటిష్ ప్రభుత్వం దాన్ని అణచివేయటానికి కొన్ని చర్యలు తీసుకున్నది. ఆ సమయంలో రైతు ఉద్యమాన్ని జమీందారు ఎలా విచ్ఛిన్నం చేసిందీ తటవర్తి ఇలా వివరించాడు.

"......ఈ అవకాశం తీసుకొని మునగాల జమీందారు బ్రిటిషు ప్రభుత్వంతో తన ఎస్టేటులో కాంగ్రెసువారు రైతుసంఘం పేరుతో అశాంతి కలుగజేస్తున్నారని, వీరంతా కాంగ్రెసువారని చెప్పి, తాను బ్రిటిషు ప్రభుత్వం కలిసి ఇచ్చటి రైతు ఉద్యమాన్ని అన్నిరకాల దౌర్జన్యాలు కొనసాగించి క్రూరంగా అణచివేసారు. దేశంలోనూ మనరాష్ట్రంలో సంఘటిత రైతు ఉద్యమం లేనందున రైతు సంఘం విచ్ఛిన్నం చేయబడింది."......"జమీన్ రైతుసంఘ నిర్మాణానికి ముందుశ్రేణిలో నిలబడ్డ రైతుసంఘ ప్రముఖులపై జమీందారు దౌర్జన్యకాండ ప్రారంభించారు. రైతు సంఘాన్ని విచ్ఛిన్నం చేయుటకు జమీందారు దీక్షవహించాడు. యమకింకరులను మించిన తన సిబ్బందిని గ్రామాలపైకి తోలి రైతు నాయకులను కొట్టించుట, వారి వ్యవసాయం బందుచేయించుట, వందలవేల రూపాయలు జరిమానాలు వసూలుచేయుట, కొందరి ఇళ్ళను, పశువుల

కొట్టాలను పీకించాడు. కొంతమందిని ఎస్టేటునుండి వెళ్ళగొట్టాడు. సంఘంలో చేరినవారికి అన్నివిధముల సాంఘిక బహిష్కారము అమలుజరిపాడు." (పేజి-17-18)

ఇన్ని నిర్బంధాలు ప్రయోగించినా రైతుఉద్యమం అణగిపోలేదు. 1933 సెప్టెంబరులో ఆంధ్రరాష్ట్ర జమీన్‌రైతు నాయకుడు నెల్లూరు వెంకట్రామానాయుడుగారు రహస్యంగా పరగణాకు వెళ్ళి అక్కడి పరిస్థితులను పరిశీలించి ఒక నివేదికను ప్రకటించారు. దానిలోని ముఖ్యభాగాలు ఈ విధంగా ఉన్నవి :

"శిస్తు వసూలు-నిర్బంధములు (1935): మునగాల ఎస్టేటు రైల్వేలైనుకు చాలా దూరముగానున్నది. బస్సులకు కూడా చాలా దూరమనియే చెప్పవలెను. బెజవాడ నుండి జమీందారీకి ముఖ్యస్థానమగు నడిగూడెమునకు చేరుటకు ఒక దినమంతయు కష్టపు ప్రయాణము చేయవలెను. ఈ జమీన్‌లో కొంతభాగము నైజాము రాష్ట్రములోనూ, కొంతభాగము కృష్ణాజిల్లాలోనూ ఉన్నది. ఈ విధముగా ఈ జమీన్ గ్రామములు రెండు ప్రభుత్వములలో నుండుటవలన జమీందారుగారు స్వంత బందెలదొడ్లలో పశువులను నిర్బంధించుట, రైతుల మోటలు సాగకుండా బొక్కెనలను ఎత్తుకొనిపోవుట, పండిన పైరును కోయనీయకుండుట, పంట కుప్పలను నూర్చనీయకుండుట మొదలగు అతికఠిన పద్ధతులు ఈ సంస్థానములో విరివిగా ఉపయోగింపబడుచున్నవి. ఈ పద్ధతుల వలన రైతులు నీరసస్థితియందు వలసినవారగుచున్నారు. ఈ దిక్కుమాలిన సంస్థానములో పూర్వము శ్రీనాధుని కాలములో ఆచరణలో నుండినట్లు శిస్తు బాకీదారుల ఇండ్లముందు కంపపాతుట, వారిని యెండలో వంగబెట్టుట, వారి మెడలో గుదెలు తగిలించుట మొదలగు అనాగరిక పద్ధతులకు వారు లోనగునట్లు చేయుచున్నారు. శిస్తులు బాకీలుపడు రైతులు జమీందారుగారి తరఫున శిస్తులు వసూలుచేయు సిబ్బందివలన తమ స్త్రీలకు అగౌరవము కలుగునని కూడా భయపడుచున్నారు. పైన వర్ణించబడినట్టియు, నమ్ముటకుసైతము వీలు కానట్టియు, దుర్భరమైనట్టియు ఈ పద్ధతులను బహిరంగ పరుచుటకు ఈ కష్టములను గూర్చి నిష్పక్షపాత విచారణ జరుపుటకును ఇందలి రైతులు సభలద్వార కోరుచుండిరి.

"శిస్తులు రెమిషనులు : ఈ జమీందారీలో చక్కగా పనిచేయుచుండిన ఒకసంఘముండెను. ఈ సంఘమునకు మూలధనము కూడా నుండెను. ఈ సంఘమునకు సాయపడువారు లేనందున జమీందారుగారి జులుంవలన కృశించిపోయెను.

"ఇచ్చట గవర్నమెంటు ఉద్యోగుల సహాయము జమీందారుకే అధికముగాగలదు. ఇచ్చట రైతులు సుఖమనేదెట్టియో యెరుగక ఉదయము మొదలు సాయంత్రం వరకు కాయకష్టంచేసి శరీరమును ప్రాణములను నిలువబెట్టుకొనగల్గుచున్నారు. ఈ జమీందారీలో వర్షములు తక్కువ. భూములు సారవంతమైనవికావు. అయినను శిస్తులు మాత్రము

దుర్భరముగా వున్నవి. నందిగామ తాలూకాను మిక్కిలి బీదతాలూకాలో చేర్చవలసి యున్నది. అట్టి ఈ తాలూకాలలో మునగాల గ్రామములు మిక్కిలి సారహీనమైనవి. లేటు దివాన్ బహద్దూర్ ఆరోగ్యస్వామి మొదలియార్‌గారి ఆధిపత్యమున జరిగిన ఆర్థిక విచారణలో గవర్నమెంటు గ్రామాలలో మెట్టభూములపై విధించబడు రు. 4-00 ల శిస్తును, మాగాణి భూములపై విధించబడు రు. 12-00 శిస్తును అత్యధిక శిస్తులని నిర్ణయించబడెను. జమీందారీలోని మెట్టభూములపై విధించబడు రు. 12-00 లు మొదలు 4 రూప్యముల శిస్తును, మాగాణి భూములపై 10 రూప్యములు మొదలుకొని 18 రూప్యముల వరకు శిస్తులకు రైతుల శక్తికి మించిన శిస్తులనియే చెప్పవలెను. జమీన్‌లోని మాగాణి భూములకన్న గవర్నమెంటు గ్రామాల మాగాణి భూములకు నీరు సప్లయిచేయు మునియేరు నీటి సప్లయి ఎక్కువ నమ్మకమైనదై యున్నది. సర్కారు గ్రామాలలో రైతులు బావులపై ఆధారపడుట లేకపోగా జమీన్ రైతులు అధిక ధనము వ్యయముచేసి తవ్విన బావులపై తమ జీవనమునకు ఆధారపడవలసినవారై యున్నారు. గవర్నమెంటు గ్రామాలలో పైరులు పండనప్పుడు రెమిషనులు ఇవ్వబడుచుండగా జమీన్ గ్రామాలలో బావుల ఆధారమున పండించు రెండవపంటకు మాత్రము రెమిషన్ ఇచ్చుచూ మొదటి పంటకు రెమిషన్ ఇవ్వక 12 మొదలు 18 రూప్యములు మాగాణి శిస్తులు వసూలు చేయుచున్నారు. వానలు కురియక పైరుఎండిపోయిన సంవత్సరములకు సైతము చెరువుల ఆధారపు పైరులకు, బావుల ఆధారపు పైరులకును కలిపి కృత్రిమ లెక్కలు తయారు చేసి రు. 18 లు మొదలుకొని 27 రూప్యముల వరకు రైతులవద్దనుండి వసూలుచేసి యున్నారు. అత్యధిక ఎండలవలనను, సకాలవర్షములు లేకపోవుట వలనను నిరుపయోగ మగు భూములవలన జీవించు రైతులు దుర్భర శిస్తులు చెల్లింపజాలరనుట నిశ్చయము.

"40 వేలు వరుమానము లక్షాముప్పదివేలగుట : మునగాల ఎస్టేటులోని రైతులకు 1908 వ సంవత్సరం వరకు జిరాయితీ హక్కు లేకుండెను. ఆ సంవత్సర ప్రాంతమున జిరాయితీ హక్కు రైతులకు సంక్రమింపజేయు మిషతో అనాదినుండియు అమలులో నుండిన తరములు హెచ్చింపబడగా రైతులు ఒప్పుకొనవలసినవారైరి. పూర్వపు తరములపై సందర్భములను బట్టి రెండు అణాలు, నాలుగు అణాలు హెచ్చింప బడినట్లు తెలియుచున్నది. ఈ తరముల హెచ్చింపు సమయముననే సర్వే హెచ్చికలచే తేలిన విస్తీర్ణమునకు అధికశిస్తులు అంటకట్టబడినవి. అంతకుపూర్వముండిన 46 వేల రూపాయలు ఎస్టేటుకౌలు లక్షా 30 వేల రూ॥లకు ఏకకాలమున పెరిగినది. ఈ విధమున 20 వంతులు పెరిగిన కౌలు రాతిమయమగు 18 మజరాలు కలిగిన 24 గ్రామాలలో నుండు రైతులవలన రాబట్టుకొనబడుచున్నది.

"ఎస్టేటు కౌలు ఇంత అధికముగా హెచ్చినను పూర్వము నిర్ణయించిన రు. 4008 ల పేష్కస్ హెచ్చింపబడక అట్లేయున్నది.

"నిర్బంధ కాయకష్టము : నడిగూడెం గ్రామములోని రాజాగారి గుర్రములకు కావలసిన పచ్చిగడ్డి అంతయు గ్రామాలలోని హరిజనులు సప్లయి చేయుచున్నారు. నడిగూడెము గ్రామములో కాని, పక్క గ్రామాలలో కాని 5 రోజులకు మించకుండా పనిచేయుటకు ఒక్కొక్క గ్రామములోని ప్రతి హరిజన కుటుంబమునుండి ఒక్కొక్కరిని పంపవలసినవారైరి. ఈ విధముగా వచ్చువారికి నామకార్థపుకూలీ పుచ్చుకొను 40మంది హరిజనులు నడిగూడెంలో సదా పనిచేయుచుందురు. చాకలివారు కూడా ఇట్టికష్టములే అనుభవించుచున్నారు.

"కమతము భూములు - దానివలన రైతులకు కష్టము : ప్రతి గ్రామము లోనూ జమీందారుకు స్వంత కమతము భూములు కలవు. ఈ భూములు రైతాంగపు భూములకు మించి ఉన్నవి. రైతుల భూములకంటే ముందుగా జమీందారు భూములకే చెరువులోని నీరు ముందుగా ఇవ్వబడవలెను. ఇందువల్ల రైతుల మాగాణి భూములకు తగినంత నీరు సకాలంలో లభించుటలేదు. ఇంతేగాక హరిజనులకు రైతులకు నామ కార్థపు కూలీ పద్ధతిన రాజాగారికి వెట్టిపనులు అనగా ఉచితంగాను, నిర్బంధముగాను పనిచేయవలసిన వారు అగుచున్నారు. నాటుటకేమి, కోతలకేమి గ్రామములో ఇవ్వబడు కూలీలో రాజాగారికి పనిచేయువారికి సగము కూలి మాత్రము ఇవ్వబడుచున్నది. ఇబ్బడి శిస్తు మాత్రమే (?) తాము కమతము భూములు సాగుచేయమని రైతులు చెప్పినందుకు రాజాగారు విననందున ఈ మధ్యస్థపు ప్రయత్నము ఈ సంవత్సరము వదిలివేయ బడినది.

"చెరువుల మరమ్మతుల ఖర్చులు రైతులు భరించుట : చెరువులోని నీరు వలన రైతులకు అంతగా లాభము లేక ఎస్టేటుకే లాభము లభించుచున్నను చెరువు మరమ్మతులకుగాను య. 1కి 10 రూ॥లు వంతున రైతులవద్దనుండి వసూలు చేయబడు చున్నవి. చెరువుల మరమ్మతుకు కావలసిన సున్నము, రాయి, ఇటుకలు రైతులే తోలవలసినవారగుచున్నారు. రైతులు వెట్టి పనులు చేయకున్నను, చెరువులలోను అలాకు పరిచినను, చెరువుల మరమ్మతులకు రైతులు డబ్బు ఇచ్చుటకు నిరాకరించిననూ అట్టివారికి ఈ క్రింది నిర్బంధములు కలుగుచున్నవి. వారి పశువులను అనాధీనపు భూము లలో మేపుకొనుటకుగాని, రాళ్ళు తీసుకొనుటకుగాని నీటి తొట్లకు ఉపయోగించుటకుగాని వీరికి స్వాతంత్ర్యము లేదు. పుల్లరి చెల్లించిననూ బంజరు భూములలోను, కంచెలలోను వారి పశువులను మేపుకొననివ్వరు. విద్యాధికుడనియు, పండిత పోషకుడనియు, ఉదా

రాయామలు (?) కలవాడనియు పేరువడిన ఈ జమీందారుగారి సమర్ధ పరిపాలనయొక్క-ఫలితములు త్రివిధములైనవి.

"1) రైతులయొక్క దుర్భర దారిద్ర్యము (2) మనో క్లేశము (3) నిస్సహాయతములై ఉన్నవి. (25-1-1935వ తేదీ 'జమీన్ రైతు' వారపత్రిక నుండి)"

(మునగాల పరగణా ప్రజా ఉద్యమ చరిత్ర - పేజి - 24-28)

సుదీర్ఘమైన ఈ నివేదికలో జమీందారు 1930 నాటికి రైతుల భూములను ఆక్రమించుకొని యాజమాన్యం సంపాదించిన ముఖ్యాంశం ఎక్కడా కనపడదు. "ప్రతి గ్రామంలోనూ జమీందారుకు స్వంత కమతం భూములు కలవు. ఈ భూములు రైతాంగపు భూములకు మించి ఉన్నవి" అని నివేదికలో రాశారేగాని, ఈ భూములు జమీందారుకు ఎక్కడినుంచి వచ్చాయి? పూర్వంనుంచి ఉన్నవేనా ? అనే అంశాలను నివేదిక పరిశీలించలేదు. ఈ విధంగా జమీన్ రైతు సంఘం భూమి సమస్య జోలికి వెళ్ళలేదు. అక్రమ పన్నులు, వెట్టిచాకిరి లాంటి చట్ట విరుద్ధమైన కార్యకలాపాలకే పరిమితమయింది. తెలంగాణాలోని దుర్మార్గులైన దేశముఖులు, జాగీర్దారులు చేసే అక్రమాలే ఇవి.

ఈ విధంగా సుమారు 7 సంవత్సరాలు మునగాల రైతు ఉద్యమం కాంగ్రెసు, జమీన్ రైతు సంఘ నాయకత్వాన నడిచింది. 1937లో కమ్యూనిస్టులు రంగంలోకి ప్రవేశించారు.

1937లో కాంగ్రెసు ప్రభుత్వాలు ఏర్పడినవి. తర్వాత "......పశ్చిమ కృష్ణా జిల్లా కాంగ్రెసు తరఫున, కృష్ణా జిల్లా కాంగ్రెసు సోషలిస్టు పార్టీ తరఫున శ్రీ చండ్ర రాజేశ్వరరావు, శ్రీ వెల్లంకి విశ్వేశ్వరరావుగార్లు మునగాల యెస్టేటుకు రహస్యంగా వచ్చారు. వీరుభయులు అనేక గ్రామాలు తిరిగి ఇచ్చటి పరిస్థితులు విచారించారు. అనేక మందిని గ్రామాలలో కలుసుకొని వారినుండి జమీందారు దౌర్జన్యం గూర్చి, వెట్టిచాకిరి, దోపిడీలను గూర్చి తెలుసుకున్నారు. కొన్ని గ్రామాలలో బహిరంగ సభలు పెట్టారు. ప్రజలు భయంతో ఉపన్యాసములు వినుటకు బయటకు రాలేక ఇండ్ల నుండి, గోడలచాటున ఉండి నాయకుల ఉపన్యాసములను శ్రద్ధతో విన్నారు. బయటపడిన జమీందారు తమనేమి చేస్తాడోననే భయమే ఇందుకు కారణం. సభలలో నాయకుల ముందు కూర్చున్నది జమీందారు నౌకర్లు మాత్రమే." (పేజి 28-29)

భూస్వాముల పోలీసుల నిర్బంధం తీవ్రంగా ఉండే ప్రదేశాల్లో ఇప్పటికీ ఈ విధంగానే ఉన్నది.

ఈ ఇద్దరు నాయకులు చేసిన ప్రకటనలో ఈ క్రింది విషయాలున్నట్టు తటవర్తి రాశాడు :

"మునగాల, లింగగిరిపరగణాలు కృష్ణా జిల్లాలోని భాగాలయినా నల్లగొండ జిల్లాలో దీవుల్లా ఉండుటవలన అప్పటి తెలంగాణాలోనిపరిస్థితులు ఇచ్చటకూడా ఉండేవి. మునగాల జమీందారు బహు నిరంకుశుడు. ఇతర దోపిడీ దౌర్జన్యాలకు తోడుగా వెట్టిచాకిరి అన్ని కులాల వారితో చేయించేవాడు. జమీందారు ఇచ్చే సోలెడు ముక్కిపోయిన జొన్నలు అంబలి కాచుకు త్రాగి కూలీలు జమీందారు పొలంలో పనిచేయడం, బండలు పగులకొట్టి రాళ్ళు బయటికి తీయటంలాంటి పనులు చేసేవారు. రైతులు యే ప్రతిఫలం లేకుండా జమీందారు భూములు దున్నేవారు. చాకళ్ళు బట్టలు ఉతకటంతో పాటు జమీందారు లంకంత కోటలో వూడ్చి నీళ్ళు చల్లేవారు. మంగళ్ళు క్షవరాలుచేసి వళ్ళు పట్టటంతో పాటు దున్నపోతులకు కూడా క్షవరాలు చేసి స్నానాలు చేయించేవారు. కుమ్మర్లు దొరవారికి, వారి నౌకర్లకు కావలసినన్ని కుండలు వగైరా ఏ ప్రతి ఫలం లేకుండానే ఇచ్చేవారు. వారికి ఒకటి రెండు ఎకరాలు ఈనాము భూములు మాత్రం ఉండేవి. జమీందారు ఉద్యోగులు వర్తకులవద్ద డబ్బు ఇవ్వకుండానే సరుకులు తీసుకునేవారు. ఇక జమీందారు బ్రాహ్మణులను కూడా ఊరికనే వదలలేదు. ప్రతి బ్రాహ్మణుల కుటుంబం జమీందారుకు ఉచితంగా విస్తళ్ళు కుట్టి ఇవ్వవలసివచ్చేది. ఈ దుర్మార్గులను ఎదిరించినవారి ప్రాణ, మాన, ఆస్థులకు రక్షణఉండేదికాదు. (విశాలాంధ్ర రజితోత్సవ ప్రత్యేక సంచికలోని చంద్ర రాజేశ్వరరావుగారి వ్యాసం నుండి)" (పై పుస్తకం ; పేజి - 28 - 29)

ఆకాలంలో కమ్యూనిస్టుపార్టీపై నిషేధం ఉండేది. కమ్యూనిస్టులు కాంగ్రెసు లోనూ, సోషలిస్టు పార్టీలోనూ చేరి పనిచేసేవారు.

ఈ నాయకులు వెట్టిచాకిరి వివరాలు బయటపెట్టారేగాని భూమి సమస్యపై మాట్లాడలేదు.

ఆనాటి పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెసు కమిటీ అతివాదుల చేతుల్లో ఉండేది. దాని తరపున పరగణా పరిస్థితులను విచారణ చేయటానికి ఆరుగురితో ఒక కమిటీ వేశారు. దానిలో ఒక కమ్యూనిస్టు (నండూరి ప్రసాదరావు) ఉన్నాడు. ఈ కమిటీ అందజేసిన నివేదికలో ప్రజలపై జరుగుతున్న అన్యాయాల వివరాలున్నవి. కాని భూమి సమస్యపై నోరు మెదపలేదు. ఇనాం భూములను స్వాధీనం చేసుకున్న ఉదాహరణలు ఇలాఇచ్చారు.

"...1928 లో సర్వే చేయబడి భుక్తములో ఉన్న విస్తీర్ణమునకు పట్టాలీయ బడెను. రీసర్వే చేయబడినప్పుడు జాస్తి తేలిన భూమి విస్తీర్ణము తనదని జమీందారు భుక్తదారుల నుండి లాగేసేవాడు. చాకిరి ఇనాములు అన్ని తనవేనని కాజేసినాడు.

"పై ఈనాములకు సంబంధించిన దావాలలో జమీందారు గెలిచాడు.

"ఈనాముదారులను కంటెస్టు చేయనీయలేదు. దౌర్జన్యంగా విజయవాడ జగ్గయ్య పేటలకు పోకుండా పొలేరు వద్ద మనుషులను పెట్టి ఆటంకం కలిగించాడు.

"స్వల్పంగా అప్పులు పెట్టి వాటిని పెంచి ఈ బాకీల క్రింద చాకిరి ఈనాములను జమీందారు రిజిస్టరు చేయించుకున్నాడు.

"రేపాలలో దేవదాసీల ఈనాము, కుంభహారతి ఈనాము, శిరిపురంలో భట్రాజుల ఈనాములను జమీందారు దౌర్జన్యంగా స్వాధీనం చేసుకున్నాడు. కోర్టులో వేసిన దావాల సంఖ్యను బట్టి, యక్సపార్టీ అయిన దావాలడిక్రీలను బట్టి జమీందారు మోసం, దౌర్జన్యం తెలియుచున్నది." (పైపుస్తకం-పేజీ 35).

ఇలా లాక్కున్న భూములు కొన్ని ఉన్నప్పటికీ రైతుల నుంచి లాక్కున్న భూములే హెచ్చుగా ఉన్నవి.

"మునగాల జమీందారు 1925 నుండి 1937 వరకు అనేక రూపాలలో రైతుల భూములు ఆక్రమించాడు. చాకిరి ఈనాములు, టి. డి. ఈనాములు, శిస్తుల బకాయీల క్రింద కట్టుకున్న భూములు, హక్కుదారుకు తెలియకుండా దావా, డిక్రీలు, వేలం మొదలగు కర్మకాండలు జరిపి స్వాధీనం చేసుకున్న భూములు, రైతుసంఘంలో చేరారని కొందరి భూములు, ఇద్దరి వ్యక్తులమధ్య తగాదాలువస్తే పరిష్కరించినందుకుగాను ఇద్దరి వద్ద తీసుకున్న భూములు, నాగులగల్లా బాకీల క్రింద రిజిష్టరు చేయించుకున్న భూములు, సాముదాయక భూముల ఆక్రమణ క్రింద స్వాధీనంచేసుకున్న భూములు—ఈ విధమైన అన్యాక్రాంతములు ఎస్టేటు మొత్తంమీద మెరకభూమి య. 3293.37 సెంట్లు, మాగాణి య. 336.59 సెంట్లు. ఈ మొత్తం జమీందారు ప్రజల నుండి ఆక్రమణ భూములు మొత్తం య. 3629.96 సెంట్లు." (పై పుస్తకం పేజి 39-40).

12 సంవత్సరాలకాలంలో జమీందారు రైతులనుంచి లాక్కున్న భూమి విస్తీర్ణం మెట్ట, మాగాణి కలిసి య. 3629.96 సెంట్లు. అంతకుముందు లాక్కున్నదెంత? ఇదిగాక జమీందారుకు స్వంతకమతమేమైనా ఉండెనా? ఈ ప్రశ్నలకు సమాధానంలేదు.

కమ్యూనిస్టులు విచారణ కమిటీలో ఉన్నప్పటికీ, జమీందారు భూమి సమస్య ముందుకురాలేదంటే వారు ఆనాటికి ఆ సమస్యకు ప్రాధాన్యత ఇవ్వలేదని స్పష్టమవుతుంది.

మద్రాసురాష్ట్రంలో ఏర్పడిన కాంగ్రెసు ప్రభుత్వం ఏర్పరిచిన 'ఎస్టేటు ల్యాండు అక్టు విచారణ కమిటీ' నివేదికలోనూ, శాసనసభలో ప్రవేశపెట్టిన బిల్లులోనూ జమీందారు కమతాలను గూర్చి అక్రమంగా ఆక్రమించుకున్న భూములను గూర్చి మాట్లాడలేదు. జమీందారీ వ్యవస్థను రద్దుచేయాలని కమిటీ సిఫార్సులలోలేదు. ప్రవేశపెట్టిన బిల్లులోనూ లేదు. ఈ విధంగా జమీందారీ విధానాన్ని, జమీందారుల కమతాలను అట్టిపెట్టడానికి

కాంగ్రెసు నిర్ణయించుకున్నది. బిల్లుపై చర్చలు జరిగాయేకాని, శాసనసభ బిల్లును ఆమోదించలేదు. నాయకులు రైతుసంఘ కార్యకలాపాలను తీవ్రతరం చేశారు. గ్రామాల్లో తిరిగి బహిరంగసభల్లో ఉపన్యసించి ప్రజలను ఉత్తేజపరిచారు. రైతుసంఘ సభ్యత్వాన్ని చేర్పించారు. దీనిఫలితంగా "అన్ని కులములవారు, వృత్తులవారు జమీన్ రైతు సంఘంలో చేరారు. జమీందారుకు వెట్టిచాకిరి చేయుట మానుకున్నారు. జరిమానాలు చెల్లించుట మానుకున్నారు. జమీందారు నౌకర్లను చూచి ప్రజలు భయపడటం మానుకున్నారు. ఎస్టేటు గ్రామాల ప్రజానీకంలో నవ చైతన్యం వెల్లివిరిసింది. 'మాకొద్దు జమీందార్ల పొందు' నినాదం మారోమ్మోగింది." (పై పుస్తకంపేజి-51).

వెట్టిచాకిరి రద్దయింది. యమకింకరులలాగా కన్పించే జమీందారు నౌకర్లంటే ప్రజలకు భయం తొలగిపోయింది. ధైర్యంతో పోరాడటానికి ముందుకువచ్చారు. ఇది తొలి విజయం ; గొప్ప విజయం.

ప్రజల తిరుగుబాటు పురోగమనం : రైతు సంఘంలో చేరిన వారిపై జమీందారు అదేపనిగా సంఘ బహిష్కరణ చేయిస్తూ ప్రజలను ఇబ్బంది పెడుతూ వచ్చారు. తొలి విజయంతో ఆత్మ విశ్వాసం ఏర్పడిన ప్రజలు సంఘ బహిష్కరణకు లొంగిపోలేదు. దేవుని ఉత్సవ సందర్భంలో జరిగిన ఒక సంఘటన వివరాలు ఈ విధంగా ఉన్నవి :

"రేపాలలో దీపావళికి దేవుని ఉత్సవాలు జరుగుతాయి. ఈ ఉత్సవానికి మంగళ్ళు కాగడాలు జేయుట ఆచారం. ఈ ఆచారం ప్రకారం మంగళ్ళు దేవాలయానికి కాగడాలు వేయుటకు వెళ్ళారు. అచ్చట జమీందారు ఉద్యోగులు మంగళ్ళను కాగడాలు వేయడానికి వీలులేదు. 'మీరు రైతు సంఘంలో జేరినారు, కనుక మీరు ఇచ్చటనుండి వెళ్ళిపోండి' అని గట్టిగా చెప్పారు. అందుమీదట మంగిళ్ళు దేవాలయ ఆవరణనుండి తిరిగి వచ్చారు. తమ సాటి సోదరులను కాగడాలు వేయకుండా నిషేధించారని కోపంతో చాకళ్ళు దేవుని వాహనము మోయుటకు నిరాకరించినారు. దానితో రెండురోజులు జరిగే శివకేశవుల ఊరేగింపు ఉత్సవాలు నిలిచిపోయినవి. జమీందారు గారి ముఖ్య దైవము శ్రీ లక్ష్మి నరసింహస్వామికి ప్రతి సంవత్సరం జరుగు ఉత్సవము ఈ సంవత్సరము ఆగిపోయింది." (పై పుస్తకం పేజి - 51)

చేతివృత్తులవారిని లొంగదీసుకోటానికి జమీందారు చేసిన ప్రయత్నం వమ్ము అయింది. ఉత్సవమే ఆగిపోయింది. అతడు పరాజయం పొందాడు.

రైతుసంఘ నాయకులు దేవుని ఉత్సవానికి ప్రత్యామ్నాయంగా ఒకసభ జరిపారు. ఘర్షణ తీవ్రమై పోలీసులు రంగంలోకి దిగారు. ప్రజలు లొంగిపోవటానికి నిరాకరించారు. ఈ సమయంలో ఇరుపక్షాల పరిస్థితి ఈవిధంగా ఉంది :

"ఇచ్చటినుండి ఎస్టేటు అన్నిగ్రామాలలోను, ఎస్టేటువారికి ప్రజలకు ఘర్షణ ప్రారంభమైంది. ప్రభుత్వము జమీందారు ప్రజలపై ఇచ్చే ప్రతి ఫిర్యాదును స్వీకరించి కేసులు పెట్టుట ప్రారంభించారు. రైతుల ఫిర్యాదులపై ఏచర్యా తీసుకునేవారు కారు.

"జమీందారీ విధానం రద్దుకావాలి, లంచగొండితనం నశించాలి, పోలీసు జులుం నశించాలి అను నినాదాలు అన్ని గ్రామాల ప్రజలు స్వీకరించారు.

"మునగాలలో రాత్రిపూట నగర సంకీర్తన చేయుచున్న బాలురపై పోలీసులు రాళ్ళతో కొట్టుటవరకు వచ్చింది.

"సివిల్ స్వభావం కలిగిన విషయాలలో కూడా పోలీసులు జోక్యంకలిగించుకొని క్రిమినల్ కేసులు పెట్టుట ప్రారంభించారు."

"ప్రజలు జమీందారుపై తిరుగుబాటు : ప్రజలు చిరకాలంగా జమీందారువల్ల, పోలీసులవల్ల యమయాతనలు అనుభవించారు. ప్రజలలో సహనం నశించి తిరుగుదాడి ప్రారంభించారు.

"జమీందారుకు, వీరి నౌకర్లకు పనిపాటలు వారు చేయకుండా బహిష్కరించారు. శిస్తులు కట్టుట మానుకున్నారు. పోలీసుల సహకారంతో జమీందారు జప్తులు ప్రారంభించాడు. స్త్రీల మెడలో ఉన్న ఆభరణాలను కూడా జప్తుచేయుట ప్రారంభించాడు. రైతులు ధైర్యంగా ఎదుర్కొన్నారు. ప్రజలు జమీందారుతో తాడోపేడో తేల్చుకో దలచుకున్నారు." (పై పుస్తకం - పేజి - 52)

ప్రజలు వెనుకపట్టు పట్టలేదు. కాగా ముందుకే సాగటానికి నిశ్చయించారు. కాని నాయకత్వం లొంగుబాటుతనం ప్రారంభించింది.

నాయకులు కాంగ్రెసుకు లొంగుబాటు : లొంగుబాటుతనం ఉత్సవ సమయంలోనే ప్రారంభమైంది. బహిరంగ సభ జరిపిన తీరు ఈ విధంగా ఉన్నది.

"ఈ ఉత్సవాన్ని ప్రజలు మరొక విధంగా జరుపనిశ్చయించారు. పశ్చిమ కృష్ణా జిల్లా కాంగ్రెసు సంఘ ప్రతినిధి, రైతు సంఘ నాయకులు శ్రీ నండూరి ప్రసాదరావు గారిని రేపాల తీసుకొనిపోయి శ్రీ మహాత్మా గాంధీ, శ్రీ పండిత జవహర్‌లాల్, శ్రీ సుభాష్ చంద్రబోసు, ఆచార్య యన్. జి. రంగాగార్ల ఫోటోలను అలంకరించిన బండ్లమీద ఉంచి బ్రహ్మాండమైన ఊరేగింపు జరిపి వేలాదిమంది ప్రజలతో సభజరిపారు"
(పేజి - 52)

కాంగ్రెసు, కమ్యూనిస్టు పార్టీ ఐక్య సంఘటన రోజులవి. ఈ పోరాటంలో అతివాద కాంగ్రెసువర్గం కలిసి వస్తున్నదేగాని, పోరాటానికి నాయకత్వం వహించలేదు. పరగణాలో కాంగ్రెసువాదులు పోరాటంలో పాల్గొంటున్నారు. రైతు సంఘానికి కూడా

నాయకులే. రాష్ట్ర రైతు సంఘం తరఫున పనిచేస్తున్న కార్యకర్తలంతా సోషలిస్టు పార్టీలో పనిచేస్తున్న కమ్యూనిస్టులే. ఊరేగింపులో ఉపయోగించిన ఫోటోలు మితవాద అతివాద కాంగ్రెసు నాయకులవి. (బోసు, రంగాలు అతివాదులు. ఆనాటి కమ్యూనిస్టులు నెహ్రూను కూడా అతివాదిగానే పరిగణించారు). కాని సోషలిస్టు నాయకుల ఫోటోలు లేవు. ఆనాటి ఆంధ్ర సోషలిస్టుపార్టీ నాయకత్వం కమ్యూనిస్టుపార్టీ చేతుల్లో ఉన్నందున వారి ఫోటోను ఉపయోగించటానికి అభ్యంతరం ఉండకూడదు. స్థానిక కాంగ్రెసువాదులు అలాంటి అభ్యంతరం తెలిపిన ఉదంతంలేదు. ఇలాంటి పరిస్థితుల్లో కాంగ్రెసు నాయకులనే పెట్టి ఊరేగించటం కాంగ్రెసుకు లొంగుబాటుతనాన్ని ప్రదర్శించటమే. అప్పుడు మద్రాసులో కాంగ్రెసు ప్రభుత్వం రాజ్యంచేస్తున్నది. కాంగ్రెసుతో ఐక్యసంఘటన అంటే ప్రజలపై కాంగ్రెసు నాయకత్వాన్ని స్థిరపరిచి తాము వెనక్కి ఉండటమే అనే అవగాహన కమ్యూనిస్టుల్లో ఉండేది. జమీందారుతో రాజీపడే కాంగ్రెసు మితవాద నాయకత్వాన్ని ప్రజలనుంచి దూరంచేయాలనే అవగాహన లేదు. కైతాంగపు భూమి సమస్యను పట్టించుకోని కాంగ్రెసు 'అతివాదుల్లో' అతివాదానికన్న మితవాదమే హెచ్చుగా ఉన్నదనీ, దీనిని ఆనాటి పార్టీ నాయకత్వం గుర్తించలేదనీ దీనినుంచి స్పష్టమవుతున్నది.

ఉద్యమాన్ని పెడమార్గానపట్టించే సత్యాగ్రహపోరాటరూపం : కాంగ్రెసుతో ఐక్యసంఘటన ఉన్నంతమాత్రాన సత్యాగ్రహ పోరాటరూపాన్ని అనుసరించటం తప్పని సరికాదు. కాంగ్రెసు ప్రారంభించిన సత్యాగ్రహం ప్రజాపోరాట స్వరూపం తీసుకునే సరికి, నాయకత్వం ప్రజాపోరాటాన్నేగాక సత్యాగ్రహాన్ని కూడా ఆపివేసింది. ప్రజలు సాధారణ పోరాటరూపాలు అనుసరించటానికి సిద్ధంగాఉన్నప్పుడు వారికి సత్యాగ్రహ పోరాటమార్గాన్ని చూపెట్టడం ఆ పోరాటాన్ని పెడమార్గాన పెట్టడమే. ఒక గ్రామంలో వ్యవసాయ కూలీ సమస్యపై, మరొక గ్రామంలో భూమి సమస్యపై సత్యాగ్రహాన్ని నిర్వహించారు. కూలీ సమస్యపై జరిగిన సత్యాగ్రహవివరాలు ఇలా ఉన్నవి :

"కలుకోవలో జమీందారుకు య. 22 ల (కమతం) మాగాణి భూమి ఉన్నది. లోగా ఈ భూమిని రైతులచే వెట్టికి సేద్యం చేయించుకునేవాడు. ఈ సంవత్సరం రైతులు వెట్టి మానుటచే విధిలేక కూలీలచేత కోత, కట్టుబడి వగైరా పనులు చేయించుకున్నాడు. రైతులు ఇచ్చే య. 1 కి 40 మానికలు ధాన్యం కూలి ఇస్తానని చెప్పి కూలీలచేత పనులు చేయించుకున్నాడు. 72 మంది హరిజన కూలీలు 14 రోజులు పనిచేశారు.

"కూలి ధాన్యం కొరకు కూలీలు నడిగూడెం దివాణానికి వెళ్ళారు. జమీందారు ఉద్యోగులు కొట్టు అడుగున ముక్కిపోయిన ధాన్యం య. 1 కి 30 మానికలు ఇస్తామన్నారు. కూలీలు య. 1 కి 40 మానికలు మంచిధాన్యం ఇవ్వమన్నారు. మంచిధాన్యం

ఇచ్చేదిలేదని దివాణం ఉద్యోగులు చెప్పారు. మాకు సంఘమే ఇప్పిస్తుందని చెప్పి కూలీలు తిరిగివచ్చారు. మరునాడు కూలీలు కోటకువెళ్ళి కూలి ఇమ్మని అడిగారు. ఎస్టేటు ఉద్యోగి య. 1 కి 25 మానికెలు ఇస్తాము తీసుకుపొండి అన్నారు. (ముక్కిపోయినవి). కూలీలు నిరాకరించారు." (పేజి 52-53).

పోరాటం సాగించి వెట్టిచాకిరిని రద్దుచేసుకున్న ప్రజలు పోరాటం ద్వారానే కూలీ సాధించుకోవలసివచ్చింది. ఎకరానికి 40 మానికలు తక్కువే అయినా, వెట్టిచాకిరి చేసే రోజుల్లో న్యాయమైన కూలి అని అనుకోవాలి. అయితే వీరు 'హరిజన' కూలీలు. వీరికి స్వల్పమైన భూమి ఉండవచ్చును. అయినా కూలీలే.

కూలీధాన్యం ఇచ్చే సమయానికి జమీందారు తగ్గించి ఇస్తామన్నాడు. కూలీలు తీసుకోనిరాకరించారు. ఇంతవరకు సరిగానే ఉన్నది. నాయకులు మరొకసారి అడిగించి, కూలీలతో సత్యాగ్రహం చేయించారు. "మొదటిరోజు 500 మందితో, రెండవరోజు 1000 మందితో, మూడవరోజు 3000 మందితో సత్యాగ్రహం జరిగింది. జమీందారు కోటముందు బైఠాయింపు చేసిఉంటారు వీరంతా. జమీందారు ముందు వారిని బెదిరించి, ప్రభుత్వ బలాన్ని ప్రదర్శించాడు. వచ్చినవారు "కృష్ణాజిల్లా కలెక్టరు, జిల్లా పోలీసు సూపరింటెండెంటు, కాంగ్రెసు నాయకులు శ్రీ బి. ఎస్. మూర్తి, చీఫ్ పార్లమెంటరీ కార్యదర్శి శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు, బెజవాడ సబ్‌కలెక్టరు వగైరాలు 24-12-38 న మూడు లారీలనిండా పోలీసులతో హుటాహుటిన ఎస్టేటుకు వచ్చారు.

"వీరంతా రైతు కూలీలను దబాయించారు. రైతుకూలీలు భయపడకుండా తాము కూలీకోసమే పోరాడుతున్నామని, మరొకందుకు కాదని ధైర్యంగా అధికారులకు జవాబు ఇచ్చారు.

"బెజవాడ సబ్‌కలెక్టరు కూలీలను విచారించి వాస్తవాన్ని అర్థంచేసుకొని కలుకోవ వెళ్ళి య. 1 కి 40 మానికల చొప్పున కలుకోవలోనే కోసిన పొలములోని ధాన్యము ఇప్పించాడు. కూలీల శాంతియుత సత్యాగ్రహపోరాటం విజయవంతమయింది."(పేజి-54)

బి. యస్. మూర్తి హరిజన నాయకుడు. అయ్యదేవర కాళేశ్వరరావు కాంగ్రెసు పెద్దనాయకుల్లో ఒకరు. వీరితోబాటు కలెక్టరు, పోలీసు సూపరింటెండెంటు, మూడులారీల పోలీసులు. "వీరంతా రైతుకూలీలను దబాయించారు. రైతుకూలీలు భయపడకుండా తాము కూలీకోసమే పోరాడుతున్నామని, మరొకందుకు కాదని ధైర్యంగా అధికారులకు జవాబు ఇచ్చారు." (పేజి 54) వచ్చినవారు వెళ్ళిపోయారు.

సబ్‌కలెక్టరు ఈ పెద్దనాయకులకన్న హెచ్చుగా ఇంగితజ్ఞానాన్ని ప్రదర్శించి కూలీలు కోరిన రేటును మంచివడ్లను ఇప్పించాడు. "కూలీల శాంతియుత సత్యాగ్రహ

పోరాటం విజయవంతమయింది."

సాధారణ పోరాట రూపాలు నిరుపయోగమైనాయా ? ఇలాంటి "శాంతియుత సత్యాగ్రహ పోరాటం" అవసరమా ? దీనిని ప్రజలు కావాలని కోరుకున్నారా ? ఇలాంటి ప్రశ్నలకు జవాబు చెప్పటం అవసరం. పెద్ద భూస్వామి అయిన జమీందారుకు వ్యతిరేకంగా వ్యవసాయ కూలీల పోరాటమిది. అప్పుడే సంఘటిత శక్తితో వెట్టి చాకిరిని రద్దుచేసుకున్న రైతుల్లో, కూలీల్లో ఉత్సాహమూ, పోరాటచైతన్యమూ ఉంది. జమీందారీ వ్యతిరేక పోరాటంలో అప్పటికే పాల్గొంటున్న చిన్న భూస్వాములు, ధనిక రైతులు సహేతుకంగా ఉన్న కూలీల కోర్కెలను బలపరచటమే కాక, సత్యాగ్రహంలో రైతులు కూడా పాల్గొన్నారు. ఈ విధంగా రైతుకూలీ ఐక్యత దృఢంగా ఏర్పడింది. ఒప్పందానికి విరుద్ధంగా జమీందారు ఇస్తానన్న తక్కువ కూలీని, ముక్కిపోయిన ధాన్యాన్ని కూలీలే తమకు తామే నిరాకరించారు. దీనిలో నాయకుల ప్రమేయమేమీ లేదు. నాయకులు అప్పుడు చేయవలసింది ఒప్పందం ప్రకారం కూలీ ధాన్యాన్ని రాబట్టుకోడానికి కూలీలకు మార్గాన్ని చూపెట్టడం. ఈ మార్గం సత్యాగ్రహ పోరాటం కాదు ; ఆ గ్రామంతోబాటు ఇతర గ్రామాల్లోకూడా జమీందారు కమతాల్లో కూలీలతో సమ్మె చేయించటం.

1930 నాటికి జమీందారు రైతులనుంచి అక్రమంగా స్వాధీనం చేసుకున్న భూమి య. 3629-96 సెంట్లు, య. 336-59 సెంట్లు మాగాణి, య. 3293-37 సెంట్లు మెట్ట ఉంది. ఇదంతా ఒకే గ్రామంలో కాక వివిధ గ్రామాల్లో "స్వంత" కమతాల రూపంలో ఉన్నది. అవి మాగాణి కోత రోజులు. (డిసెంబరు నెల). ఇతర గ్రామాల్లో కూడా మాగాణి కోతకు వచ్చి ఉన్నది. జమీందారుకు ఆ గ్రామాల్లో కూడా కోతపనులు జరుగాలి. అన్ని గ్రామాల్లో రైతు సంఘంబలం ఒకే విధంగా లేకపోవచ్చును. బలమున్న గ్రామాల్లో కూలీల సమ్మెలు చేయిస్తే, పోరాటం విస్తృతమయ్యేది. బలహీనంగా ఉన్న గ్రామాల్లోకూడా కూలీలు పోరాటానికి ముందుకు వచ్చేవారు.

సత్యాగ్రహంలో మొదటి రోజు 500, రెండవ రోజు 1000, మూడవ రోజు 3000 పాల్గొన్నారు. వీరిలో కొందరు రైతులున్నా కూలీలు కూడా అధిక సంఖ్యలోనే ఉన్నారు. వారంతా కలుకోవ గ్రామస్థులే కాదు. ఇతర గ్రామాల కూలీలు కూడా. వారు నడిగూడెంలోని రాజాగారి కోటముందు సత్యాగ్రహం చేయటానికి బదులు తమతమ గ్రామాల్లో సమ్మె చేసి పక్క గ్రామాల్లో సమ్మె చేయించటానికి తోడ్పడితే పోరాటానికి బలం చేకూరేది. రైతు కూలీ ఐక్యత బలపడేది. నాయకులకు రైతుకూలీలు ఏ వైపున కదులుతున్నారో స్పష్టంగా కనిపిస్తున్నప్పటికీ, వారి కదలికకు విరుద్ధంగా పోరాటాన్ని ఒకే గ్రామానికి సంకుచితపరిచారు. దీనికి సత్యాగ్రహం ఒక సాధనమైంది.

ఆంధ్ర కమ్యూనిస్టులు అప్పటికే వ్యవసాయ కూలీల పోరాటాలు నడిపిన అనుభవం ఒక మేరకు గడించారు. ఆ అనుభవాలనుండి గుణపాఠాలు నేర్చుకుంటే సత్యాగ్రహానికి బదులు సాధారణ పోరాట రూపమైన సమ్మెనే ఉపయోగించేవారు ; కూలీలను సమ్మె చేయనిచ్చేవారు.

కమ్యూనిస్టులకు సత్యాగ్రహపు జబ్బు కాంగ్రెసువారి సహవాస దోషంతో వచ్చింది. మునగాల రైతాంగ పోరాటపు ఆ దశలో కాంగ్రెసువాదులు స్థానిక ఉన్నత వర్గాలవారు సాధారణ పోరాట రూపాలను వ్యతిరేకించినట్టు, సత్యాగ్రహమే కావాలని పట్టుబట్టినట్టు నిదర్శనాలు లేవు. ఒకవేళ పట్టుబట్టినా ప్రజాతంత్ర పద్ధతులను అనుసరించి నిర్ణయించటానికి అవకాశం ఉండేది. (వివిధ గ్రామాల రైతు కూలీలను సమావేశపరిచి, అన్ని గ్రామాల్లో సమ్మెచేయాలా ? లేక జమీందారు కోటముందు సత్యాగ్రహం చేయాలా అనే సమస్యను వారిముందుంచి ఓటింగుద్వారా తేల్చవచ్చును.)

సమ్మె విజయవంతమైన మాట నిజమే. ఇతర గ్రామాలకు వ్యాపిస్తుందనే భయంతో డిప్యూటీ కలెక్టరు ఒకే గ్రామపు కూలీల కోర్కెలను అంగీకరించి అమలు జరిపించి జమీందారు ప్రయోజనాలను కాపాడినాడు. వారి కోర్కెలను నిరాకరిస్తే సత్యాగ్రహం నిరుపయోగమైనదని అన్ని గ్రామాల్లో సమ్మెకు పూనుకుంటే అటు జమీందారు పరిస్థితి, ఇటు కాంగ్రెసు ప్రభుత్వపు పరిస్థితి క్లిష్టమయ్యేది.

రైతాంగ ఉద్యమం ముందున్నది కూలీల కోర్కెలు అంగీకరించారా లేదా అనే సమస్య ఒకటే కాదు. సమస్య పరిష్కారానికి ఎలాంటి పోరాట రూపం అనుసరించాలి ? అనే సమస్య కూడా ముందుకువచ్చింది ; అది ప్రధాన సమస్య కూడా. ఈ సమస్యను గుర్తించటంలోనూ, పరిష్కరించటంలోనూ నాయకత్వం విఫలం కావటమేగాక తప్పుదోవ పట్టింది కూడా.

వాస్తవమేమంటే కమ్యూనిస్టులు నాయకత్వంలోని కీలకస్థానంలో ఉన్నప్పటికీ సాధారణ పోరాట రూపమైన సమ్మెను కూలీల ముందుంచలేకపోయారు. కాంగ్రెసుతో ఐక్యసంఘటన కోసం ఈ పోరాటరూపాన్ని వదులుకొని, దీన్ని నీళ్ళుగార్చే సత్యాగ్రహాన్ని అనుసరించారు.

"బ్రహ్మయ్య అవార్డు" : పోరాటరూపం సత్యాగ్రహమే అయినా పోరాటంలో కూలీలే జయించారు. ప్రజావెల్లువ తగ్గుముఖం పట్టలేదు.

"ఈ కలుకోవ కూలీల పోరాటం విజయం సాధించటంతో ప్రజలకు ఎక్కడలేని ఆత్మవిశ్వాసాన్ని ధైర్యాన్ని కలిగించింది. ఈ ప్రజాశక్తి ముందు ప్రభుత్వం, జమీందారు లొంగిరాక తప్పలేదు. మునగాల ప్రజలు చైతన్యంతో జమీందారు అత్యాచారాలను

యెదుర్కొనుటకు సిద్ధంగా ఉన్నారని కాంగ్రెసు నాయకులు, పోలీసు అధికారులు, ఇతర ప్రభుత్వ అధికారులు అర్థంచేసుకున్నారు.

"అందరూ కలిసి రాజీ చేస్తామన్నారు. రాజీ సంభాషణలు ప్రారంభించారు. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘ కార్యదర్శి శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారు మధ్యవర్తిగా రాజీ చేసుకొనుటకు రైతుసంఘము, జమీందారు అంగీకరించారు.

"కాంగ్రెసు నాయకులు శ్రీ బి. యస్. మూర్తి, చీఫ్ పార్లమెంటరీ కార్యదర్శి శ్రీ అయ్యదేవర కాళేశ్వర రావు పంతులు, కృష్ణా జిల్లా కలెక్టరు, జిల్లా పోలీసు సూపరింటెండెంటు మొదలగువారు, రైతు నాయకులు జనవరి 9, 10 — 1939వ తేదీలలో సమావేశము జరిపి రాజీ షరతులు రూపొందించి 10వతేదీన ఒడంబడికమీద సంతకములు చేయించిరి. జమీందారుల తరపున కుమార రాజా శ్రీ రామకృష్ణారెడ్డి, రైతు సంఘము తరపున శ్రీ వెలిదండ రంగారావు, శ్రీ కోదాటి వెంకట నరసింహారావు, శ్రీ నండూరి ప్రసాదరావు, శ్రీ నల్లపాటి వెంకటరామ నర్సయ్య, శ్రీ ఉప్పల రామయ్య, శ్రీ కందుల రాములు సంతకములు చేశారు". (పై పుస్తకం పేజి 55)

"మునగాల జమీందారుగారికిన్ని, రైతులకున్నూ కలిగిన వివాదములను గూర్చిన రాజీ పరిష్కార సందర్భమున పరిష్కారం గొట్టిపాటి బ్రహ్మయ్యగారి ఎదుట రైతుల తరపున మునగాల రైతు సంఘం వారు దాఖలు చేసిన వారి కోర్కెలను గూర్చి రైతుల తరపునను, జమీందారుగారి తరపునను చెప్పుకున్న వాదనలను విని ఇందులో జతపరచిన నిర్ణయములు ఇచ్చుటనైనది.

"ఈ నిర్ణయముల ప్రకారము రైతులకు సంబంధించిన కోర్కెలు నిర్వర్తింపబడును. యిందులకు ఇరుపక్షములవారును అంగీకరించుటయైనది. సదరు నిర్ణయముల ప్రకారము జమీందారుగారు రైతులమధ్య వ్యవహారములన్నియు పరిష్కారం కావలెను. ఇందులను గూర్చి వచ్చిన సందేహములు, తగాదాలను గూర్చిన అంత్యపరిష్కారము బ్రహ్మయ్యగారిదే అయియున్నది.

"1. పట్టాలు : ముందు పట్టాలలో సర్వే నెంబర్లవారి భూములను హద్దులువేసి ఇవ్వవలెను.

"2. ఈనాముల గూర్చి : చాకలి, మంగలి, కుమ్మరి, వడ్రంగి, పౌరోహితం వగైరా వృత్తులవారి అనుభవంలో ఉన్న చాకిరి ఈనాముల జమీందారుగారు వ్యాజ్యములు వేసి జయం పొందియుండిరి. సదరు భూములకు పై వృత్తులవారికి పట్టాలనివ్వవలెను.

" ఆ తరపు (అతరాఫు = చుట్టుపట్టు) జమీందారీ రైతు భూమి శిస్తురేటు [అతరావు (అతరాఫు) రేటులు హెచ్చు తగ్గులుంటే ఆ రేటులు Average రేటు...

పల్లానికి పల్లపు రేటు —— మెరకకు మెరక రేటు]లో సదరు ఈనాములకు పట్టాను ఇచ్చుటకు నిర్ణయం. వారు ఎవరికీ నిర్బంధముగా చాకిరీ చేయవలసిన బాధ్యత లేదు.

(బ్రహ్మయ్య అవార్డునుంచి, పై పుస్తకం పేజి 54-55)

పోరాటం డిసెంబరు చివరి వారంలో జరిగింది ఇతర గ్రామాల్లో కూడా వరిపంట కోతలు పూర్తి కాలేదు. జొన్నపంట చేతికి రావలసి ఉంది. రెండవ వరిపంట నాట్లు కోతలు మిగిలి ఉన్నవి. ఈ పరిస్థితుల్లో ఎప్పుడైనా, ఎక్కడైనా రైతు కూలీ సమస్యలపైన పోరాటం ప్రారంభం కావచ్చును. రానున్న పోరాటాలను ఆపటానికి పరగణా ప్రజల దృష్టిని రాజీవైపుకు మరల్చటానికి కాంగ్రెసు నాయకులు ఈ ప్రయత్నం చేసారు. రాష్ట్ర కాంగ్రెసు కమిటీ కార్యదర్శిని పరిష్కర్తగా నియమించారు. ఆలస్యం చేస్తే మళ్ళీ పోరాటాలు వస్తాయని భయంతో జనవరి (1939) 10వ తేదీ నాటికే వారు తమ తీర్పునిచ్చారు దీనిని "బ్రహ్మయ్య అవార్డు" అనేవారు. (దీనిని రూపొందించటానికి కాంగ్రెసు నాయకులే గాక కలెక్టరు, పోలీసు సూపరింటెండెంటు, తాసిల్దారులు కూడా తోడ్పడినారు) "అవార్డుపై సంతకం చేసినవారిలో రైతు సంఘం తరఫున కాంగ్రెసువాదులే గాక కమ్యూనిస్టులు కూడా ఉన్నారు. అవార్డు ఉపోద్ఘాతం ఇలా ఉంది. "మునగాల జమీందారుకిన్నీ రైతులకున్నూ కలిగిన వివాదములను గూర్చిన రాజీ పరిష్కార సందర్భమున పరిష్కారం గొట్టిపాటి బ్రహ్మయ్యగారి ఎదుట రైతుల తరఫున మునగాల రైతు సంఘంవారు దాఖలుచేసిన వారి కోర్కెలను గూర్చి రైతుల తరఫునను, జమీందారు గారి తరఫుననూ చెప్పుకున్న వాదనలను విని ఇందులో జతపరచిన నిర్ణయములు ఇచ్చుటనైనది.

"ఈ నిర్ణయముల ప్రకారము రైతులకు సంబంధించిన కోర్కెలు నిర్వర్తింపబడును. ఇందులకు ఇరుపక్షములవారు అంగీకరించుటయైనది. సదరు నిర్ణయముల ప్రకారము జమీందారుగారు రైతుల మధ్య వ్యవహారములన్నియు పరిష్కారము కావలెను. ఇందులను గూర్చి వచ్చిన సందేహములు, తగాదాలను గూర్చిన అంత్య పరిష్కారము బ్రహ్మయ్య గారిదే అయియున్నది." (పేజి - 55)

రైతు సంఘం కోర్కెలనేగాక, ఉభయ పక్షాలవాదనలు విన్నతర్వాత బ్రహ్మయ్య గారు తీర్పునిచ్చారు. తీర్పును అమలు జరిపే సందర్భంలో "వచ్చిన సందేహములు తగాదాలను గూర్చిన అంత్య పరిష్కారము" పరిష్కర్తదే.

పరిష్కర్త అధికార పార్టీకి చెందినవారైనా ప్రైవేటు వ్యక్తి. తన నిర్ణయాలను అమలు జరిపించటానికి ఆయనకు ఎలాంటి అధికారాలు లేవు. జమీందారు అమలుజరిపితే అవి అమలు జరుగుతాయి. కాదంటే వాటికి చెత్తకుండీలో వేసే కాగితపు విలువే.

'అవార్డు'లో 15 అంశాలు (పాయింట్లు) ఉన్నాయి. దాదాపు అన్నీ భూములకు సంబంధించినవే. అయితే కొన్ని జమీందారు లీగల్ బాధ్యతలను పునరుద్ఘాటించేవి. ఉదా : "1) ముంచు పట్టాలలో సర్వే నెంబర్లవారిభూములకు హద్దులువేసిఇవ్వవలెను." తమ భూములను సర్వే చేయటానికి రైతులు జమీందారుకు డబ్బు చెల్లించుకున్నారు. హద్దులు వేసే బాధ్యత జమీందారుదే. ఆ బాధ్యతనే పునరుద్ఘాటించారు పరిష్కర్త.

జమీందారు అక్రమంగా లీగల్ హక్కులు సంపాదించిన భూములపై ఆ హక్కులను రద్దుచేసి గ్రామీణపేదలకు ఆ భూములపై తిరిగి అధికారాన్ని కలిగించేవి ఉన్నవి. ఉదా : "నెం. 2) ఈనాముల గూర్చి : చాకలి, మంగలి, కుమ్మరి, వడ్రంగి, పౌరోహితం వగైరా వృత్తులవారి అనుభవంలోఉన్న చాకిరి ఈనాముల జమీందారుగారు వ్యాజ్యములు వేసి జయం పొందియుండిరి. సదరు భూములకు పైవృత్తుల వారికి పట్టాల నివ్వవలెను.

"ఆతరపు జమీందారీ రైతు భూమిశిస్తు రేటు (అతరాపురేటులు హెచ్చుతగ్గులుంటే ఆ రేటులు Average రేటు...పల్లానికి పల్లపురేటు-మెరకకు మెరకరేటు) లో సదరు ఈనాములకు పట్టాను ఇచ్చుటకు నిర్ణయం. వారు ఎవరికి నిర్బంధముగా చాకిరీ చేయవలసిన బాధ్యత లేదు." (పేజి 55).

ఈనాము భూములన్నీ తనవేనని జమీందారు కోర్టులో దావావేసి "జయం పొంది యుండిరి." కోర్టులకు జమీందారుకు ఉన్న మిలాఖతు ఎంతదూరం వెళ్ళిందో దీనివలన స్పష్టమవుతుంది. అయినా ఆ కోర్టు ఆర్డరును అమలుజరుపవద్దనీ, ఈనాముదారులకే భూములపై పట్టాలివ్వాలనీ పరిష్కర్త తీర్పుచెప్పారు. ఈనాముదారులు 'నిర్బంధపు చాకిరీ'ని రద్దుచేశారు. ఈ చర్య బ్రిటిష్ చట్టాలకు అనుగుణ్యంగా ఉంది ; కొత్తదికాదు.

అన్నిటికన్నా ముఖ్యమైనవి 3, 4 అంశాలు :

"3. హక్కుదారులకు తెలియకుండా రెవిన్యూ వేలంవెయ్యబడిన భూములు ఇతరులకు విక్రయింపబడినవి. రాజాగారికని వారి బంధువుల పేరిటను ఉద్యోగస్తుల పేరును కొట్టివేయబడిన భూములను గూర్చి.

"1930 వ సంవత్సరము నుంచి సేల్ అయిన భూములకు అట్టి భూములకుగాను ఇవ్వవలసిన సేల్ మొత్తమును దరిమిలా improvement కు అయిన కిమ్మత్తును రైతులు ఇచ్చేయెడల వారికి వారి భూములకు పట్టాల నివ్వవలెను. సదరు భూములకు మరొక రైతుకు న్యాయముగా పట్టాఇవ్వబడి ఆయన హక్కు భుక్తములో ఉండినయెడల అందులను గూర్చి యెట్టిచర్య తీసుకోనక్కరలేదు." (పేజి 56)

1930 నాటికి పూర్వం జమీందారు వేలంవేసిన రైతుల భూముల సమస్యను దీనిలో ముట్టుకోలేదు. ఈ భూములను రైతులు పోగొట్టుకున్నది అవార్డు వచ్చేనాటికి

ఎనిమిది సంవత్సరాలూ, అంతకన్న హెచ్చుకాలమూ. జమీందారు అక్రమాల వలన అన్యాక్రాంతమైన భూములు వారికి తిరిగిరావలసిందే. చిన్నరైతుల స్వాధీనంలో ఉన్న భూములను తిరిగి తీసుకోవటం న్యాయం కానందున వాటిని వదిలివేయవచ్చును.

ఈ భూముల మీద కొత్తసాగుదారులు చేసిన మరామ్మతులకు 'కిమ్మత్తు' (వెల) ఇవ్వనవసరంలేదు. ఈకాలంలో వారు పంటను అనుభవించారు. పంటభాగం 'కిమ్మత్తు' దాదాపు సరిసమానంగా ఉంటుంది. రాజాగారు, వారి బంధువులు పెద్ద మరామ్మతులు చేయిస్తే వాటి 'కిమ్మత్తు'ను ఇచ్చుకునే శక్తి రైతులకు ఉండదు. అలాంటి భూములను ఉచితంగా ఆయా రైతులకు ఇవ్వటం న్యాయం.

"4. దౌర్జన్యముగా రాజాగారు భుక్తపరుచుకున్న భూములను గూర్చి :

"ఈ భూములు తమవని రైతులు ఆధారము చూపవలెను. సదరు భూములను జమీందారు ఏ ఆధారములను పురస్కరించుకొని స్వాధీనపరచుకొనెనో జమీందారుగారు చూపవలెను." (పేజి-56)

ఎవరిముందు ఈ "ఆధారాల"ను చూపాలి? ఎవరు పరిష్కరించాలి? అనే ప్రశ్నలకు దీనిలో సమాధానం లేదు. అతిముఖ్యమైన ఈ సమస్యను దాటవేశారు పరిష్కర్తగారు. "దౌర్జన్యంగా రాజాగారు భుక్తపరచుకున్న భూములను" తిరిగి రైతులకు ఇప్పించటానికి పరిష్కర్త సిద్ధంగాలేరని దీనివలన స్పష్టమవుతున్నది. ఇలాంటి భూమి 336-59 ఎకరాల మాగాణి, 3293.37 ఎకరాల మెట్ట. దీనివెల ఎంత ఉందో ఊహించవచ్చును.

జమీందారు అక్రమస్వాధీనంలో ఉండే భూమి యాజమాన్యం ఎవరిదో తేల్చగల అధికారం రెండే రెండు సంస్థలకు ఉంటుంది 1) ప్రభుత్వం, 2) ప్రజలు ఎన్నుకున్న కమిటీ. పరిష్కర్తచేసిన నిర్ణయంలో రైతులు కోర్టుకు వెళ్ళాలనే సూచన ఇమిడి ఉన్నప్పటికీ ఆమాటను స్పష్టంగా చెప్పలేదు. వెట్టిచాకిరి చేసే పేదల ఇనాంభూములను కోర్టులద్వారా స్వంతం చేసుకున్న జమీందారు, తన 'స్వాధీనం'లో ఉన్న భూములను ఆ కోర్టుల ద్వారా రైతుల స్వాధీనం కానిస్తాడా? మిగిలినది ప్రజలెన్నుకున్న కమిటీ. అవార్డులో ఇలాంటి ప్రతిపాదన సూచనప్రాయంగానైనా లేదు. ఈ విధంగా పరిష్కర్త ఇలాంటి భూములపై రైతుల కోర్కెను నిరాకరించాడు.

'అవార్డు'లోని ఇతర అంశాలను పరిశీలిస్తే తెలంగాణాలోని జాగీర్దారులు, దేశ ముఖులు చేసే దురాగతాలన్నీ మునగాల జమీందారు చేశాడని స్పష్టమవుతున్నది. ఉభయ పక్షాలు బ్రహ్మయ్యగారి మధ్యవర్తిత్వానికి అంగీకరించారేగాని, ఎవరైనా తీర్పును అమలుజరుపకపోతే తీసుకోవలసిన చర్యలేమిటో అవార్డులో స్పష్టంచేయలేదు. రైతు

సంఘం వారు అవార్డును అంగీకరించటమే గాక చివరిదాకా అమలు జరుపాలని కోరినారు. జమీందారు ముందు అంగీకరించి సంతకపు సిరాతడి ఆరకమునుపే దానిని అమలుజరుప నిరాకరించాడు.

భూమికోసం సత్యాగ్రహం : జమీందారు ముందు పేచీలుపెట్టి తర్వాత రాజీని అమలుజరుపటానికి నిరాకరించాడు. కాంగ్రెసు నాయకులు చేసిన ప్రయత్నాలు విఫలమైనాయి. దీనితో రైతుసంఘ నాయకులు ఒడంబడికను అమలుజరిపించటానికి సత్యాగ్రహం చేయటానికి నిర్ణయించుకున్నారు.

"సత్యాగ్రహులకు శిక్షణ ఇచ్చుటకు నెలరోజులలో నాలుగు క్యాంపులలో పదకొండువందలమందికి శిక్షణ ఇచ్చిరి. వీరికి శ్రీ నండూరి ప్రసాదరావు, శ్రీ మోటూరు పరంధామయ్య, శ్రీ జోస్యభట్ల సత్యనారాయణగార్లు రాజకీయాలు, కవాతు, సత్యాగ్రహ ధర్మాలు మొదలగు విషయాలు బోధించారు.

"ఈ క్యాంపులకు అన్ని కులములవారు, అన్నివృత్తులవారు ఉత్సాహముతో వచ్చి నాయకులు బోధించిన విషయములు శ్రద్ధతో విన్నారు." (పేజి-60)

అధ్యాపకులు నండూరి ప్రసాదరావు, మోటూరు పరంధామయ్య, జోస్యభట్ల సత్యనారాయణ. మొదటివారు నేటి సిపియం, మిగిలిన ఇద్దరూ సిపిఐ వారు. ముగ్గురూ కమ్యూనిస్టులు. వారు 11 వందల మందికి నేర్పినవి వర్గపోరాట సూత్రాలుకాదు; "సత్యాగ్రహధర్మాలు"-కాంగ్రెసువాదులకన్నా వీరే ఈ "ధర్మాలను" చక్కగా నేర్పి ఉంటారు! కాంగ్రెసువాదులు సత్యాగ్రహ ధర్మాలను, కమ్యూనిస్టులు వర్గపోరాట సూత్రాలను నేర్పాలిగాని, కమ్యూనిస్టులే సత్యాగ్రహధర్మాలను నేర్పడమేమిటి? వర్గ పోరాట సూత్రాలను నేర్పితే వచ్చిన 11వందల మంది విద్యార్థులు సత్యాగ్రహం చేయ నిరాకరిస్తారు. కాంగ్రెసువాదులు సత్యాగ్రహ ధర్మాలను బోధిస్తే విద్యార్థులు మీసంగతేమిటని కమ్యూనిస్టులను అడిగేవారు; కాంగ్రెసువాదుల బోధనలను ఖాతరు చేయక పోయేవారు. కమ్యూనిస్టులే కాంగ్రెసువాదుల బాధ్యతలను స్వీకరించుటతో వర్గపోరాట సూత్రాలు మరుగునపడిపోయాయి; సత్యాగ్రహధర్మాలు ముందుకువచ్చాయి. కాంగ్రెసువాదులకు సత్యాగ్రహ ధర్మాలను బోధించనవసరం లేకుండానే పనిజరిగిపోయింది.

స్కూలుభవన ఆక్రమణ-నిర్బంధవిధాన ప్రారంభం : "రామాపురం ప్రజలచే గ్రామంలో ప్రాథమిక పాఠశాల భవనం కట్టబడినది. ఈ భవనాన్ని జమీందారు దౌర్జన్యంగా ఆక్రమించాడు. తిరిగి రామాపురం ప్రజలు 1939 లో ఈ భవనాన్ని ఆక్రమించి ఎర్రజెండా, కాంగ్రెసు జెండాలను కట్టారు. ఈ భవనంలోనే రైతాంగ విద్యానిలయం ప్రారంభించబడింది." (పేజి-61)

ఈ విద్యాలయంలోనే సత్యాగ్రహులకు శిక్షణ ఇచ్చారు.

"జమీందారుచే బెజవాడ సబ్‌కలెక్టరు వద్ద పెట్టబడ్డ పిటిషన్ మీద ఎక్సుపార్టీగా 144 వ సెక్షను ఇచ్చారు. ఈ జమీందారు చర్య రాజీ షరతులు ఉల్లంఘించడమే. పాఠశాల అదివరకే ప్రారంభించబడినందున కొనసాగించబడినది. ఈ పాఠశాల నిర్వాహకులైన శ్రీ నండూరి ప్రసాదరావుగారి మీద, మరొక 29 మంది మీద కేసులు పెట్టబడినవి." (పేజి-61)

ఎర్రజెండాపై కాంగ్రెసు ప్రభుత్వం 144 వ సెక్షన్ను విధించడం సహజమే. కాని కాంగ్రెసు జెండాపై కూడా 144 వ సెక్షన్ను విధించి కాంగ్రెసు ప్రభుత్వం చరిత్రను సృష్టించింది. కాంగ్రెసుజెండా ఎర్రజెండాతో నేస్తంకట్టినందుకు కాబోలు ఈ శిక్ష.

సత్యాగ్రహం : రైతులకు జమీందారు నుంచి రావలసిన భూమి సుమారు 3600 ఎకరాలు. అయినా సత్యాగ్రహానికి నిర్ణయించింది ఒక రైతు భూమిపైననే. ఆయన ఇమ్మడి పాపయ్యగారు. 1930 లో రైతుఉద్యమ ప్రారంభకుల్లో వారొకరు.

సత్యాగ్రహ కమిటీ ఏర్పడి సన్నాహాలన్నీ జరిగినవి. కమిటీకి అధ్యక్షుడు కాంగ్రెసువాదికి బదులుగా కమ్యూనిస్టు నాయకుడు నండూరి ప్రసాదరావుగారే ఉన్నారు.

ఈభూమి నడిగూడెం గ్రామంలో ఉంది. ఈ గ్రామం జమీందారు ముఖ్యస్థానం (Head Quarters). సత్యాగ్రహం ప్రారంభం అయినది 1939 జూన్ 2వ తేదీ. అప్పటికి తొలకరి వానలు కురిసినాయా లేదా తెలియదు. (జూన్ 7-8 వ తేదీలనుంచి తొలకరి ప్రారంభం). "...యిమ్మడి పాపయ్యగారికి రావలసిన భూమిమీద జమీన్ రైతుసంఘం ఉపాధ్యక్షులు శ్రీ ఉప్పల రామయ్యగారి నాయకత్వాన 8 మంది అరకలు కట్టుకొని భూమిలో ప్రవేశించగానే వారిని పోలీసులు అరెస్టుచేసి తీసుకొనిపోయారు." (పేజి-61)

భూమిని దున్నకముందే భూమిలో ప్రవేశించినవారిని అరెస్టుచేశారని దీనినుంచి స్పష్టమవుతున్నది. వెంటనే కమ్యూనిస్టు నాయకులను అరెస్టుచేశారు. దారిలో మూడు గ్రామాలనుంచి 300 మంది స్త్రీలు వచ్చి పోలీసులను అడ్డగించారు. నాయకుల సలహాపై వారు తిరిగి వెళ్ళిపోయారు. రెండవ వరుస సత్యాగ్రహంలో 43 గురిని అరెస్టు చేశారు. లాఠీఛార్జిలో సత్యాగ్రహులకు తీవ్రంగా గాయాలు తగిలాయి. మళ్ళీ సత్యాగ్రహం. మళ్ళీ అరెస్టులు. ఈ సత్యాగ్రహాలన్నీ అదే భూమిపై. మరోభూమి దాపుకు వెళ్ళలేదు. సత్యాగ్రహం సాగుతూనే ఉన్నది. "144వ సెక్షన్ ధిక్కరించిన వని 42 పశువులను అరెస్టుచేసి పోలీసులు బందెలదొడ్డిలో పెట్టారు. వీటికి మేత, నీళ్ళు

కూడా పెట్టక బాధించారు. కాంగ్రెసు ప్రభుత్వం 144వ సెక్షను ప్రజలమీద ప్రయోగించటం మాత్రమేగాక, పశువుల మీద కూడా ఉపయోగించి చరిత్ర సృష్టించింద"ని తటవర్తి రాశాడు. (పేజి-62) బ్రిటిష్ ప్రభుత్వం కన్న కాంగ్రెసు ప్రభుత్వం గొప్పదని (!) చెప్పడానికి ఇదొక మచ్చుతునక.

ఈ విధంగా 17 రోజులు సత్యాగ్రహం కొనసాగింది. 350 మంది జైళ్ళకు వెళ్ళారు. 72 మందికి శిక్షలువేసి రాజమండ్రి జైలుకు పంపించారు. తక్కిన వారిని త్వరలో విడుదల చేశారు. నలుగురు కమ్యూనిస్టు నాయకులకు ఒక్కొక్క సంవత్సరం శిక్షలువేసారు. సత్యాగ్రహుల ఆస్తులను జప్తుచేయటానికి వచ్చిన పోలీసులను ప్రజలు ఎదిరించారు. పోలీసులు వచ్చినదారిన వెళ్ళిపోయారు. కాంగ్రెసు సోషలిస్టు పార్టీ (కమ్యూనిస్టులు) రైతుసంఘం రాష్ట్రవ్యాపితంగా బహిరంగసభలుపెట్టి పోలీసు లాఠీఛార్జి, అరెస్టులను ఖండించాయి. ఈ విధంగా కొంత ఆందోళన నడిచింది. కాంగ్రెసు పెద్దలు వచ్చి సత్యాగ్రహాన్ని ఆపమని సలహాఇచ్చారు. రైతుసంఘ నాయకత్వం ఆపివేసింది. ఈ పోరాటంలోని మరో ప్రత్యేకత ఏమంటే : "పోరాటం నడిపే ముఖ్య నాయకులు అరెస్టు అయినా పోరాటం కొనసాగుతూనే ఉంది. శ్రీ ఘట్టు గోపాలకృష్ణయ్య, శ్రీ సామినేని రామయ్య, శ్రీ కోదాటి వెంకట నరసింహారావు, శ్రీ వెలిదండ రంగారావు, శ్రీ జూలూరు రామనరసయ్యగార్లు రహస్యంగా ఉండి పోరాటాన్ని నడిపారు." (పేజి-64-65) వీరిలో ఘట్టు గోపాలకృష్ణయ్య, జూలూరు రామనరసయ్యగారలు కమ్యూనిస్టులు. సామినేని రామయ్య కమ్యూనిస్టు అభిమాని. కోదాటి వెంకట నరసింహారావు, వెలిదండ రంగారావుగారలు కాంగ్రెసువాదులు. కాంగ్రెసు రాజ్యంలో, కాంగ్రెసువాదులు రహస్యంగా ఉంటూ కాంగ్రెసు ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాటాన్ని నడుపవలసి వచ్చింది. పోరాటంలోని ప్రత్యేకతల్లో ఇదొకటి.

కాంగ్రెసు నాయకులు రాజీ ఒడంబడికను అమలుజరువడానికి కొంత ప్రయత్నించారు. ఇంతలో రెండవ ప్రపంచయుద్ధం ప్రారంభమైంది. కాంగ్రెసు మంత్రివర్గాలు రాజీనామా ఇచ్చాయి. మద్రాసు మంత్రివర్గం రాజీనామా ఇచ్చేముందు సత్యాగ్రహులను విడుదల చేసింది. కమ్యూనిస్టు నాయకులను విడుదలచేయలేదు. వారు శిక్షాకాలం పూర్తి చేసుకున్న తర్వాతనే బయటికి వచ్చారు. తాము సత్యాగ్రహం చేసినా ప్రభుత్వం వారిని సత్యాగ్రహులని గుర్తించలేదు. 'వ్రతం చెడినా సుఖం దక్కకపోవడమి'దే.

పోరాట ఫలితాలు : చివరకు "జమీందారు 1930 లో ఇమ్మడి పాపయ్యగారి నుండి దౌర్జన్యంగా తీసుకున్న భూమిని పాపయ్యగారికి వదిలి"వేసినప్పటికీ వందలాది రైతులకు రావలసిన ఇలాంటి భూమిరాలేదు. ఆనాటి పరిస్థితుల్లో వారు తమతమ

భూముల్లోకి వెళ్ళి దున్నుకోడానికి సిద్ధంగా ఉన్నవారే. భూమికై చేసిన సత్యాగ్రహం, ఆ సందర్భంలో వచ్చిన ప్రజల కదలికను పరిశీలిస్తే ఇది స్పష్టంగా కనిపిస్తుంది. నాయకత్వం అలాంటి కార్యక్రమాన్ని రైతులకు అందివ్వకపోవటంవల్లనే రైతులు తమ తమ భూముల్లోకి వెళ్ళలేదు. కాగా సత్యాగ్రహమనే పేరుతో ఆందోళనను ఒకరి భూమి మీదనే కేంద్రీకరించారు. సత్యాగ్రహం ద్వారా రైతులు తమతమ భూములను తిరిగి సాధించుకోవచ్చునని బుజ్జగించారు ; భ్రమింపజేశారు ; వారిని పెడమార్గాన పెట్టారు. ఇలాంటి పనులు చేయటం కాంగ్రెసు నాయకులకు చెల్లుతుందే కాని కమ్యూనిస్టులకుకాదు. కాగా పరగణాలో ఈ పనిచేసింది కమ్యూనిస్టులే.

రైతు సంఘం బలంగా ఉన్న గ్రామాల్లో రైతులు తమతమ భూములను దున్ను కుంటే రైతాంగ ఉద్యమం బలపడేది ; విప్లవోద్యమంగా అభివృద్ధి చెందేది. నిర్బంధ విధానం ఇంతకన్నా తీవ్రంగా ఉండేది. అయినా ప్రజలు దాన్ని ఎదుర్కొగలిగేవారు. అప్పుడు ఎలాంటి పోరాట రూపాలు అనుసరించవలసివచ్చేదీ చర్చించి నిర్ణయించటానికి అవకాశం ఉండేది. సత్యాగ్రహం అలాంటి మార్గాన్ని అనుసరించటానికి అవకాశమివ్వ లేదు. సత్యాగ్రహం ఆందోళన జరిగిన కాలమంతా రైతులు భూమిదున్నే తరుణమని మరిచిపోకూడదు.

కలుకోవ వ్యవసాయ కూలీల సమస్యను సాధారణ పోరాట రూపాలు అనుస రించక సత్యాగ్రహం పేరుతో పెడమార్గాన పట్టించారు ఆనాటి కమ్యూనిస్టు నాయకులు.

2) "మూడు మాసాల అనంతరం సత్యాగ్రహ ఖైదీలు విడుదల" కావటం విజయమేమీ కాదు. మరో మూడు మాసాలలో శిక్షలు పూర్తి చేసుకొని ఇళ్ళు చేరుకునే వారు. నాయకుల సలహాతో సత్యాగ్రహాన్ని ఆపివేయటం, మంత్రివర్గం రాజీనామా చేయటం విడుదలకు దోహదం చేశాయి.

3) "జమీందారీ వెట్టిచాకిరీ దౌర్జన్యాలను, దోపిడీని ప్రజానీకం" "సంఘ శక్తితో", పోరాటంతో "నిర్మూలించగలిగింది" సత్యాగ్రహం ప్రారంభించక ముందే ఈ దశ పూర్తయింది. సత్యాగ్రహానికి, దీనికి ఎలాంటి సంబంధం లేదు. వ్యవసాయ కూలీల సమస్య, భూమి సమస్య ముందుకు వచ్చినప్పుడే సత్యాగ్రహం ప్రారంభమైంది. ఈ సమస్యలను ఒకే గ్రామానికి, ఒకే వ్యక్తికి కుదించి ఉద్యమాన్ని పెడమార్గాన పట్టిం చింది సత్యాగ్రహం.

4) "కాంగ్రెసు ప్రభుత్వము ప్రజల పక్షమునకంటె జమీందారు యెడలనే పక్షపాత దృష్టితో వ్యవహరిస్తుందనే వాస్తవం ప్రజలు ప్రత్యక్షంగా ఆచరణలోచూచి అర్థం చేసుకున్న" మాట నిజమే. కాని అన్ని గ్రామాల్లోనూ వ్యవసాయ కూలీ, భూమి

పోరాటాలను నడిపిస్తే, అప్పుడే పూర్తిగా ఏకాకి అయ్యేది. సత్యాగ్రహ పోరాటాలు కాంగ్రెసులాంటి సంస్కరణవాద నాయకత్వాన్ని బలపరుస్తాయే కాని బలహీనపరుచవు.

ఆంధ్ర రైతు ఉద్యమం, కమ్యూనిస్టు పార్టీ మునగాల రైతాంగ పోరాటంనుంచి గుణపాఠాలు నేర్చుకున్న ఉదాహరణలు లేవు. ఈ పోరాటంలో ముందుకు వచ్చిన భూమి సమస్యను పరిశీలించి ఎక్కడ ఏ దశలో ఈ సమస్యను తీసుకోవాలి? ఏ పోరాట రూపాలు అనుసరించాలి? అనే ప్రశ్నలకు పార్టీ సమాధానం చెప్పలేదు. వ్యవసాయ విప్లవానికి కీలకమైన భూమి సమస్యను ముందుకు తెచ్చిన విప్లవోద్యమంగా దీనిని గుర్తించలేదు. 1946 దాకా భూమి సమస్య ముందుకు రాలేదు. 1946లో చెల్లపల్లి జమీందారీ ప్రాంతంలో మళ్ళీ భూమి సమస్య ముందుకు వచ్చింది. కానీ నాయకత్వం దానిని కుదించివేసి పోరాటాన్ని మరొకసారి నీళ్ళుకార్చింది.

మొత్తంమీద కమ్యూనిస్టు పార్టీ తొలి రోజుల్లో నడిపిన గొప్ప పోరాటమిది.

ఉద్యమం మొదటి దశ : 1930 నుంచి 1935 వరకు. ఈ కాలంలో ఇది పూర్తిగా సంస్కరణవాదుల (కాంగ్రెసు) చేతుల్లో ఉంది. ఈ కాలంలో జమీందారు చట్ట విరుద్ధంగా చేసిన అక్రమాలు మాత్రమే బయటకు వచ్చాయి. జమీన్ రైతు సంఘానికి నిర్మాణ స్వరూపమిచ్చే కృషికూడా ఫలించలేదు. రైత్వారీ ప్రాంతంలో రైతులకు ఉండే హక్కులు పరగణా రైతులకు కూడా కావాలనేదే వారి కోరిక. దీనితోపాటు వెట్టి చాకిరీ రద్దు కావాలనే కోర్కెకు ప్రాధాన్యత ఉండేది.

రెండవ దశ : 1937-38 : కాంగ్రెసులోని అతివాదుల, కమ్యూనిస్టుల సమిష్టి నాయకత్వం. అయినా కమ్యూనిస్టు పార్టీ నిర్మాణం జరుగలేదు. అతివాదులమధ్య కమ్యూనిస్టుల మధ్య స్పష్టమైన విభజన జరుగలేదు. కమ్యూనిస్టులు మాత్రం నాయకులుగా ఉండేవారు.

మూడవ దశ : 1938-39 : ఈ కాలంలో వ్యవసాయ కూలీ భూమి సమస్యలు ముందుకు వచ్చినవి. వెట్టిచాకిరి రద్దు అయిన తర్వాత ఉన్నత దశలో ముందుకు వచ్చిన వర్గ పోరాటపు సమస్యలు. విప్లవోద్యమాన్ని ముందుకు తీసుకువెళ్ళటానికి ప్రత్యక్ష పోరాట రూపాలు అనుసరించాల్సిన సమస్యలు. సత్యాగ్రహం ఈ పోరాటాన్ని పెడ మార్గాన పట్టించింది. రైతాంగ విప్లవోద్యమాన్ని సంస్కరణవాద ఉద్యమంగా మార్చటానికి కాంగ్రెసు నాయకులు ప్రయత్నించారు. కమ్యూనిస్టు నాయకులు స్వయంగా సంస్కరణవాదులైపోయారు. కాంగ్రెసు నాయకుల స్థాయికి దిగజారారు. స్థానిక నాయకులు పోరాట పంథాను మాని లీగల్ కార్యకలాపాలకు పరిమితమైనారు.

ఆంధ్ర కమ్యూనిస్టు నాయకత్వం, ఈ అనుభవాలనుంచి సరైన గుణపాఠాలను

తీయలేదు ; అవి ఇతర ప్రాంతాలకు వర్తించవని భావించింది. పార్టీ సాధించిన పలుకు బడిని ఎన్నికల్లో ఉపయోగించుకుంటూ వచ్చింది. నాయకత్వపు ఈ బలహీనత, తప్పు దృక్పథం తెలంగాణా విప్లవోద్యమానికి నాయకత్వం వహించే సందర్భంలో కూడా ప్రత్యక్షమైంది.

## 5. కౌలుదారీ రైతుల పోరాటాలు

అన్ని మెట్టప్రాంతాల మాదిరిగానే తెలంగాణాలో కూడా సాగుభూమి విస్తీర్ణం పరిమితమైనదే. పూర్వంనుంచీ సాగులో ఉన్న భూములపై వచ్చే ఆదాయం చాలక కొత్త భూములను సాగు చేయించి వాటినుంచి తన ఆదాయాన్ని పెంచుకోవాలని నిజాం ప్రయత్నించాడు. దీనికి అనుగుణ్యంగానే ఇజారా బంజర్ల[22] రూపంలో 1,40,000 ఎకరాల భూమి సాగులోకి వచ్చింది. ఇది 420 గ్రామాల్లో 10,000 మంది రైతులు సాగుచేసినది. వీరంతా కష్టించే రైతులే అయినా చట్టరీత్యా భూస్వాములే వాటికి యజమానులయ్యారు. తరచుగా దేశముఖులు, దేశ పాండ్యాలు, కొన్ని సందర్భాలలో జాగీర్దారులు, మఖ్తాదారులు ఇజారాదారులై ఉండేవారు. దానితో వారు పట్టాదారులు, సాగుచేసేవారు కౌలుదారులు అయ్యారు. ప్రభుత్వానికి ఇజారాదారుకూ రాతపూర్వకమైన ఒప్పందం ఉండేది. దాని ప్రకారం ఇజారా బంజరుదారు 1) చెరువు వేయించాలి. 2) దానికింద మాగాణి సాగుచేయాలి. 3) అందుబాటులో ఉన్నమేరకు మెట్ట సాగుచేయాలి. 4) ఒక గ్రామాన్ని (ఆబాదీ) కట్టించాలి. 5) వీటన్నిటికీ కాల నిర్ణయం ఉండేది.

చెరువు కింది మాగాణీ 50 నుంచి 100 ఎకరాల వరకు ఉంటుంది. చిన్న చెరువుల (కుంటలు) కింద 5 నుంచి 30 ఎకరాలవరకు ఉంటుంది. మాగాణిని, దానిని ఆనుకొని ఉండే మెట్టభూమిని సాగుచేయాలి. మాగాణికీ, మెట్టకూ నిర్ణీతమైన దామాషాలేదు. హెచ్చు తగ్గులు ఉండేవి. 100 ఎకరాల మాగాణితో 300 నుంచి 400 ఎకరాలు మెట్ట భూములున్న ప్రాంతాలు ఉన్నాయి. 50 ఎకరాలు మాగాణితో పాటు 300 ఎకరాలు మెట్టకలవీ ఉన్నాయి. సాగుచేయడానికిగల అవకాశం ఇజారా— బంజరుదారు శక్తి స్తోమతపై, భూమి విస్తీర్ణంపై ఆధారపడి ఉండేది. చెరువును వేసి మాగాణి, మెట్టను సాగు చేయటంతోబాటు ఒక గ్రామాన్ని ఏర్పరచాలి. దానిని "ఆబాదీ"అనేవారు. ఆ గ్రామంలో ఇళ్ళ సంఖ్య 5 నుంచి 30 వరకు ఉండవచ్చును. ఏదో ఒక ఊరు మాత్రం ఏర్పడాలి.

ఈ పనులన్నీ పూర్తి కావడానికి నిర్ణీతమైన వ్యవధి ఉంటుంది. తరచుగా 20 నుంచి 30 సంవత్సరాలవరకు ఒప్పందం అమల్లో ఉండేది. ఈ కాలంలో ఇజారా –

బంజరుదారు ప్రభుత్వానికి శిస్తు చెల్లించాల్సిన అవసరం ఉండదు. తర్వాత పట్టా భూముల రేటు ప్రకారం భూమికి శిస్తు చెల్లించేవాడు. నిర్ణీతమైన గడువు పూర్తి అయిన తర్వాత అతడు పట్టేదారు అయ్యేవాడు.

ఒప్పందం ప్రకారం అతనికి కొన్ని సౌకర్యాలుండేవి. స్వయంగా భూమిని సాగు చేయలేక రైతులను తెచ్చి వారితో సాగు చేయించేవాడు. స్వయంగా సాగు చేసుకున్న సందర్భాలు కూడా ఉండేవి. కొంత భూమిని తాను సాగుచేసి మిగిలినది రైతులతో సాగుచేయించిన కేసులున్నాయి. తన గ్రామంలోనూ, ఇతర గ్రామాల్లోనూ చాలినంత భూమి ఉంటే కొత్త ప్రదేశానికొచ్చి, సాగుచేయాల్సిన అవసరమేముంది? అలాంటి సందర్భాల్లో భూమినంతా రైతులకే ఇచ్చి, వారినుంచి కౌలు శిస్తు లేక మక్తా ధాన్యాన్ని తీసుకొని సాగుచేయించేవారు. ఇజారా బంజర్లలో భూస్వాములు "స్వయంగా" సాగుచేసే భూమి కొంత ఉన్నప్పటికీ, రైతులు సాగుచేసుకునే భూమి హెచ్చుగా ఉంటుంది. సర్వ సాధారణంగా భూమి అంతా రైతుల స్వాధీనంలోనే ఉంటుంది. భూస్వాములు పట్టాదార్లు కావటంతో రైతులు కౌలుదార్లు అయ్యారు. ఇరుపక్షాల మధ్య తగాదాలు వచ్చినప్పుడు "ఈ భూములపై మాకు పట్టాఇప్పిస్తామని మమ్మల్ని తీసుకొచ్చి మాచే సాగుచేయించార"ని రైతులు చెప్పుతారు. "ఇజారాలు మంజూరీ చేయించటానికి చాలా ఇబ్బంది పడ్డాం. ఆ కారణంవలన పట్టా హక్కు మాకే ఉండాలని, రైతులు కౌలుదారులై ఉండవచ్చు"నని భూస్వాములు చెపుతారు. వాదనలు ఎలా ఉన్నప్పటికీ భూస్వాములు పట్టాదారులైనారు, రైతులు కౌలుదారులైనారు.

ఒప్పందం ప్రకారం నిర్ణీతమైన గడువు పూర్తికాగానే సాగైన భూమి అంతా రైత్వారీ భూమిలో ఒక భాగమైపోతుంది. సర్వే సెటిల్మెంటు జరిపి అన్నిటిమాదిరిగానే దీనిపై శిస్తును నిర్ణయిస్తారు. ఇజారా - బంజరుదారు దీనిని చెల్లించవలసి వస్తుంది. ఒప్పందం ప్రకారం చెరువును వేసి, మాగాణి, మెట్టభూమిని సాగుచేసి (చేయించి) గ్రామాన్ని ఏర్పాటుచేస్తే ఇతనికి కొన్ని రాయితీలిచ్చేవారు. నాల్గవ వంతు భూమివరకు శిస్తులేకుండా పట్టా ఇచ్చేవారు. దీనిని సేరీ భూములనేవారు. తాటి, ఈత చెట్లపై అబ్కారీ హక్కులిచ్చేవారు. గ్రామానికి మాలీ పటేలుగిరీ ఇచ్చేవారు. ఇవన్నీ ఒప్పందానికి లోబడి ఉండేవి.

ఏ కారణంవల్లనైనా ఇజారా బంజరుదారు ఒప్పందంలో ఉన్న షరతులను పూర్తిచేయని స్థితి ఏర్పడితే, ఈ రాయితీలు రద్దుకావడమే గాక సాగుభూమిలో శిస్తులు కూడా వసూలుచేసేవారు. తరచుగా చెరువు తెగిపోతున్న సందర్భంలోనో, ఇజారాదారు దివాలా తీసిన సందర్భంలోనో ఇలాంటి పరిస్థితి ఏర్పడేది.

ఇవిగాక మరికొన్ని సమస్యలు వీరు ఎదుర్కోవలసి వచ్చేది. మాదిరాజు రామ కోటేశ్వరరావుగారు స్వీయ చరిత్రలో రాసిన ఈ భాగాలనుంచి అవి స్పష్టమవుతాయి:

"1) నైజాములోని బంజరు ఇజారాల నియమములను, వాటి స్వభావములను తెలుసుకొని, అనగా పరిశోధన చేసి పురాతన ఫర్మానులను, దివాను ఉత్తర్వులను సంపాదించి శ్రీ మునగాల రాజాగారి ఇజారా గ్రామములలో వారిపైనున్న అక్రమ పన్నుల భారమును తప్పించి, వారి హక్కులు వారికి స్థిరపరిపించగలిగితిని. వారివంటి ఇతర ఇజారాదారులకట్టి సౌకర్యములు దొరికి యుండలేదు. నేను సాధించిన ఫర్మాను వగైరాలను ఎందరో ఉపయోగించుకొనిరి.

"2) వారి ఇజారాల భూమి గవర్నమెంటువారు ఆక్రమించుకొని వారిని భుక్త పరుచుకొననీయకుండా నిరోధించుచు శిస్తులు వసూలుచేయుటకు జమాబందీలలో ప్రతి సంవత్సరము ఉత్తర్వులు ఈయబడుచుండెడివి. వాటిని గురించి జిల్లా కలెక్టరు, సుబేదారు, రెవిన్యూమంత్రి వరకు అప్పీళ్ళు అగుచుండెడివి. ఆ కేసులో ఫారెస్టు, షికారుగా॥, రెవెన్యూ డిపార్టుమెంటుల ప్రత్యేక ఉత్తర్వులనేగాక సెటిల్‌మెంటు ప్లానులు లెఖ్ఖలను పట్టికూడా వాదన జరుగుచుండెడిది. నేను శ్రీ రాజానాయన వెంకట రంగారావుగారి తరపున వకీలుగా 50 సంవత్సరములు పనిచేసితిని. ఈ కేసులో నేను సంపాదించిన రెవిన్యూ సెటిల్మెంటు అనుభవము, విజ్ఞానము సహాయకారి అయినది. ప్రతి కేసులోను శ్రీ రాజాగారికే జయముకలుగుచు వచ్చినది.

...........................

"4. తుంగతుర్తి నరసింహారావుగారి తాలూకు కర్లపల్లి ఇజారా గ్రామములో షుమారు మూడునాలుగువేల ఎకరములు భూమినితీసి రిజర్వు ఫారెస్టులో చేర్చుకొనవలయునని వాదన జరుగుచుండెను. దానిలో రెవిన్యూ సెటిల్‌మెంటు కాగితములు ప్లానుల పైన వాదనయుండెను. నేను నరసింహారావుగారి పక్షమునను, వారి కుమారుల పక్షమునను సెటిల్‌మెంటు కమీషనర్‌గారి వద్ద వాదించి పార్టీకి న్యాయము కలిగించితిని."

(పేజీ 192, 193, 194)

ఇవి భూస్వాముల సమస్యలు. ఆయన పైరవీచేసింది వారితరపుననే. అయినా ఇలాంటి భూముల సమస్యలలో కొన్నిటిని పైవివరాలనుబట్టి అర్థంచేసుకోవచ్చును.

1) ఇజారా బంజరు తుది నిర్ణయాలు నిజాంనవాబు తన ఫర్మానాల ద్వారా చేసేవాడు. రెవిన్యూ డిపార్టుమెంటుకు (మాల్గుజారీ) ఇలాంటి నిర్ణయాలుచేసే అధికారాలు లేవు.

నిజాంనవాబు ఫర్మానాలు పొందడం వ్యయప్రయాసలతో కూడినపని. గ్రామాల

నుంచి హైదరాబాదు వరకు ప్రయాణంచేసి ఫర్మానా అయిందాకా నిరీక్షించి గ్రామం చేరుకొని పనిప్రారంభించాలి.

2) తర్వాత ఉత్పన్నమయ్యే సమస్యలన్నిటికీ ఫర్మానాలోని అంశాలే పునాదిగా ఉండేవి. అవి భూస్వాములకు కూడా అందుబాటులో లేకుండేవి. వాటికోసం పెద్దపైరవీ చేయవలసి వచ్చేది. అవి లభ్యంకాక మానుకునేవారెందరో ఉండేవారు.

3) రెవిన్యూ అధికారులు ఇజారా భూములను మామూలు భూములక్రిందలెక్కించి శిస్తువిధించేవారు ; వసూలుచేసేవారు. దీనిని మాఫీ చేయించుకోడానికి పైరవీ చేయాల్సి వచ్చేది.

4) ఇజారా గడువు లోపల, ఆ తర్వాత సెటిల్మెంటుసమస్యలుత్పన్నమయ్యేవి.

5) ఫారెస్టుగ్రామాల్లో ఇజారాభూమిని ఫారెస్టులో కలుపుకోడానికి డిపార్టుమెంటు వారు ఎప్పుడూ ప్రయత్నం చేసేవారు.

భూములను యిజారాదారులే సాగుచేస్తే ఇబ్బందులన్నీ వారే అనుభవించేవారు. కాని వీరంతా పెద్దభూస్వాములు. మునగాల రాజాగారు మరీ పెద్దభూస్వామి. వీరు ఇజారా భూములను "స్వయంగా" సాగుచేయరు. రైతులే సాగుచేస్తారు. భూమిని ప్రభుత్వంవారు ఆక్రమించుకున్నా, అపరాధ శిస్తువేసినా చెల్లించవలసిన వారూ, కష్టాలనుభవించవలసిన వారూ రైతులే. ఇజారాదారులు తమ కష్టనష్టాలను రైతులమీద నెట్టడం సులభమే కదా !

సాగుచేసే రైతులు ఎదుర్కొన్న ముఖ్య సమస్యలు మరికొన్ని ఉండేవి. పూర్వ కాలంలో డబ్బు చలామణీ స్వల్పం. శిస్తును ధాన్యరూపంలో చెల్లించేవారు. బీడును సాగుచేసిన తొలిరోజుల్లో శిస్తు ఉండేది కాదు. సాగుచేయడమే ప్రధాన సమస్య అయ్యేది. బీడును దున్నితే మొదటి సంవత్సరము కౌలు లేదా పంటలో భాగం ఇవ్వక, ఉచితంగా సాగుచేసుకునే సాంప్రదాయమొకటి ఇటీవలిదాకా గ్రామాల్లో ఉండేది. రైతులు బంజరు భూమినంతా ఒకేసారి సాగుచేయక- ప్రతి సంవత్సరం కొంత సాగుచేస్తూ ఉండే వారు. చెట్టుకొట్టి నేలను చదునుచేయడానికి కొంత సమయం అవసరమయ్యేది. ఇదంతా ఒక కొలిక్కి వచ్చిన తర్వాత ఇజారాదారు ధాన్య రూపంలోనో డబ్బు రూపంలోనో శిస్తులు వసూలు చేసేవాడు. ఇజారా గడువు పూర్తయిన తర్వాత, సెటిల్మెంటు జరిగి శిస్తు నిర్ణయమైన తర్వాత ఏదో ఒక దశలో రైతులు చెల్లించే డబ్బు,ధాన్యం హెచ్చించే సమస్య వచ్చేది.

ఇజారా గడువు తీరేలోగా గ్రామాన్ని ఏర్పాటు చేయాలి. చెరువు నిర్మాణం పూర్తికావాలి. మాగాణి, మెట్టభూమి సాగు పూర్తికావాలి. కార్యక్రమమంతా

పూర్తిఅవడానికి కొన్ని ఇబ్బందులు ఉండేవి. తరచుగా చెరువులు తెగిపోయేవి. అప్పుడు మళ్ళీమళ్ళీ వేయవలసివచ్చేది. గండ్లు పూడ్చడం మామూలు. 30 - 50 సంవత్సరాల గడువులో రెండు మూడు సార్లు గనుక చెరువు తెగిపోతే రైతులతో పనిచేయించి చెరువు వేయించేవారు. కానీ మూడు నాలుగు కుటుంబాలు వేస్తే ఏ చెరువూ పూర్తికాదు. వర్షం వచ్చేలోగా పూర్తిచేయాలి. లేకుంటే వేసిన కట్ట కొట్టుకు పోతుంది. కావున సమయానికి పూర్తికావాలని కూలీలను పెట్టవలసివచ్చేది. వారికి భూమి నిస్తామని ఆశపెట్టి పని చేయించేవారు. లేదా కరువు సమయాల్లో పనిలేనివారికి గంజి పోసి వారితో చెరువులకు కట్టలు వేయించేవారు. తరచుగా ఇజారాదారులు భూమిని ఆశ పెట్టి పనిచేయించేవారు. వారు దేశముఖు, దేశ పాండ్యాలైతే గ్రామప్రజలతో వెట్టిచాకిరీ చేయించేవారు. ఈ విధంగా గ్రామమేర్పడి భూమి సాగులోకి వచ్చేనాటికి రైతులు అనేక కష్టాలపాలయ్యేవారు.

తొలిరోజుల్లో అంతా సవ్యంగా జరిగిపోయినట్టు కన్పించినా ఇజారాదారు హక్కులేమిటి ? రైతుల హక్కులేమిటి ? అనేది ఒక ముఖ్య సమస్య అయింది. ఆ కాలపు నిజాం ప్రభుత్వం ఒక చట్టం చేసింది. 1907లో రెవిన్యూ చట్టాన్ని అనుసరించి 12 సం॥లు వరుసగా రైతు స్వాధీనంలో ఉంటే- అతనికి ఆ భూమిమీద "ఖబ్జా హక్కు" (Possession Right) ఉంటుంది. ఇది అస్పష్టమైన రెవిన్యూచట్టం. ఇజారాదారులే పటేల్, పట్వారీలు, పలుకుబడిగలవారు అవడంవలన రైతులు సాగుచేస్తున్నట్టు రికార్డులు ఉండవు. దానితో వారికి లీగల్ హక్కు ఉండదు. ఇలాంటి చట్టమొకటి ఉన్నదని తెలిసిన భూస్వాములు శిస్తు విషయంలో ముందు పట్టింపుచేయక, రికార్డు విషయంలో జాగ్రత్తపడే వారు. క్రమంగా రైతులనుంచి శిస్తులను కౌలును వసూలు చేయసాగారు.

విడిపోతున్న భూస్వాముల కుటుంబాలకు హెచ్చు ఆదాయం అవసరమయ్యేది. దానితో క్రమంగా కౌలుశిస్తులను పెంచేవారు. లేదా భూములను అమ్ముకునేవారు. అమ్మితే కొనగలిగిన రైతుకు ఇబ్బంది ఏమీలేదు. ఆ మేరకు సమస్య పరిష్కారమయ్యేది. ఈ సందర్భంలో ఇజారా బంజరు రైతులు ఎదుర్కొన్న మరికొన్ని ఇబ్బందులు ఈ క్రింది వార్తలో స్పష్టమవుతున్నవి :

"తిర్మలగిరి బమ్మెర సమీపమునగల కుగ్రామము. ఇక్కడ ఇజారాదార్లు ఇద్దరన్నదమ్ములు. పెద్దవారు గ్రామము నా పేర బంజర ఉన్నదని, తమ్ముడు నా వాటాకు వచ్చినదని సర్కారీ రకము కట్టుటచే, పెద్ద దొర పోలీసులో కార్రవాయి (కేసులు పెట్టడం మొ॥) జేయగా రైతులు పెక్కు ఇక్కట్టుల పాలయిరి. తుదకిద్దరన్నదమ్ములు ఒడంబడిక జేసుకొనిరి. గానవారికి ఈతాబీ కిస్తులో రైతులు రకము కట్టిరి.

కానీ బంజరు పన్ను సర్కారీలో బాకీ ఉండుటచే పెద్దవారు జన్గామ తహసీలు కచేరీలో అర్జీ ఇచ్చి రైతుల పశువులన్నింటినీ జప్తు చేయించిరి. చిన్నవారు రైతుల నగలు నాణెముల నమ్మించి సర్కారీ శిస్తు చెల్లించుటచే పశువుల విడిచిరి. ఈ పల్లెలో బంజరుదార్లకు స్వంతము జిరాయితీ[23] ఉన్నది. రైతులు సర్కారీ రకమునకు మునాఫా[24]లిత్తురు. కానీ బంజర పన్ను 'సొంతము మరల రైతులచే వసూలు చేయుట ధర్మవిరుద్ధము కాదా? ఆ కాలమునుండి ఈ కాలమువరకు బాధలు రైతులపాలు, ఫలితము బంజరదార్ల పాలు."

(గోలకొండ పత్రిక 18-7-1935)

ఇక్కడ ఇజారా భూమినంతా ఇద్దరు అన్నదమ్ములు పంచుకున్నారు. పంపకం జరిగినంతమాత్రాన వెంటనే ఎవరి భూములు వారికి పట్టాలు జరుగలేదు. దీని ఫలితంగా ఏర్పడిన అన్నదమ్ముల తగాదాలవలన రైతులు ఇబ్బందిపడవలసి వచ్చినది. సివిల్ కోర్టులో తగాదా తేలవలసి ఉండగా పోలీసు జోక్యం చేసుకోవటంవలన సమస్య తీవ్రమైంది. అన్నదమ్ములమధ్య రాజీ జరిగినప్పటికీ పాతకాలపు బంజరుపన్ను కట్టలేదనే మిషతో రైతుల పశువులను జప్తీచేసి, ఇతర విధాలుగా ఇబ్బందిపెట్టారు. ఈ పన్ను చెల్లించవలసింది బంజరుదారులే కాని రైతులు కారు. అయినా రైతులనే ఇబ్బందిపెట్టారు. రైతుల హక్కులను గుర్తించని ప్రభుత్వం బంజరుదారులు చెల్లించవలసిన పన్నును రైతులను నిర్బంధించి వసూలుచేసింది. దీనిని మించిన అక్రమం మరొకటుండదు.

పూర్వం కౌలుశిస్తు రూపాయికి పావలానుంచి రూపాయికి రూపాయివరకు ఉండేది. ఉదా : ఒక భూమి (ప్లాటు)పై 10రూ॥ల శిస్తువుంటే రూపాయికి పావలా చొప్పున రు॥ 12½లు, అర్ధ రూపాయి రేటు ఉంటే 15 రూ॥లు, రూపాయికి రూపాయి ఉంటే 20 రూ॥లు ఇవ్వాలి. 10 రూ॥లు పోను మిగతా డబ్బు ఇజారాదారుకు మిగిలేది. డబ్బు చలామణీ పరిమితంగా ఉన్న ఆ కాలంలో ఈ స్వల్పమైన మిగులుకూడా పెద్దఆదాయమే అయ్యేది. హెచ్చు భూములున్నవారు ఈ పద్ధతిని ఇజారాప్రాంతంలో అమలుజరిపేవారు.

క్రమంగా సాగు భూములపై ఒత్తిడి హెచ్చయింది. భూస్వాముల కుటుంబాలు చీలినందున వారు "స్వంత" సాగు పేరుతో రైతులను భూమినుంచి వెళ్ళగొట్టేవారు. కరువుకాటకాల రోజుల్లో రైతులు కౌలుశిస్తు చెల్లించని అదను చూచుకొని ఇజారాదారు వారిని భూమినుంచి తొలగించేవాడు. కొన్ని సమయాల్లో తనకు అనుకూలమైన భూమిని తీసుకొని రైతులకు మరోచోట ఇచ్చేవాడు. అప్పుడు కౌలుదారులు తాము సాగుచేసుకునే భూమిని కాపాడుకునే సమస్య ముందుకువచ్చేది.

కొన్ని సందర్భాలలో శిస్తు ధాన్యరూపంలో ఉండేది. పండినపంటలో ఖర్చులు (విత్తనాలు, నాటుకూలీ మొ॥) పోను సగభాగం కౌలుచెల్లించేది. (కొన్నిప్రాంతాలలో

దీనిని మక్తా అనేవారు) ధాన్యానికి క్రమంగా ధరలు పెరగడంవలన రైతులు తమ పంటలో భాగమివ్వడానికి ఇష్టపడేవారు కారు. మెట్టభూమిపై నగదుకౌలు ఉండేది. పంట స్వల్పంకావడం దీనికి కారణం. అంతేకాక పంటలు చాలారకాలు ఉండటంవలన వాటిలో భాగం పెట్టుకోవడం సాధ్యంకానిపని. అయినా దానిపై కూడా కౌలుశిస్తును పెంచడానికి భూస్వాములు ప్రయత్నించేవారు. ఈవిధంగా ఇజారాబంజర్లలో భూమిపై ఖబ్జాహక్కు, కౌలుశిస్తు తగ్గింపు ముఖ్యసమస్యలైనవి.

వీటికితోడుగా మరికొన్ని సమస్యలుండేవి. కౌలుదారులంతా తమ నాగళ్ళ పశువులతో భూస్వామి "స్వంతసాగు" భూమిని దున్నేవారు. వీటికి "వెట్టిఅరకల"ని పేరు. పెద్దదేశముఖులకు, జాగీరు, మక్తాదారులకు కౌలురైతులుకాని సాధారణ రైతులు దున్నవలసి వచ్చేది. ఇవిగాక అక్రమవసూళ్ళు ఎన్నో ఉండేవి. ఇజారా గ్రామాలలో ఇనాం భూములుకల చాకలి, మాదిగ మొదలగు "పనిపాటలవారు" ఉండేవారు. వారూ వెట్టిపనులు చేయాల్సినవారే.

భూస్వామికి భూములు చాలా ఉన్నప్పుడు, వాటిని అతడు "స్వంత" సాగు చేయలేనప్పుడు కొంత భూమిని కౌలుకిచ్చేవాడు. మాగాణిపై ఎకరానికి 4 బస్తాలు (పాతకాలపు కొలత), రైతుల ఒత్తిడి హెచ్చయినప్పుడు 4 బస్తాలకన్న మించిఉండేది.

సాధారణరైతు ఎకరానికి నాలుగు బస్తాలివ్వటం ఆకాలంలో అసాధ్యం. 1925-30 సంవత్సరాల కాలంలో ధాన్యపు ధరను చూస్తే నగదుకౌలు, ధాన్యపుకౌలు మధ్య భేదమేమీ ఉండదు. ధరలు పెరుగుతున్నకొద్దీ ధాన్యపుకౌలు (ఎకరానికి నాలుగుబస్తాలు) భారమైంది. కౌలుదారీ రైతాంగంలో అసంతృప్తికి ఇదొక కారణం.

ఈ సమస్యపై డెల్టాప్రాంతాలకూ తెలంగాణాకూ ఆకాలంలోనే పోలికలేదు.

ఖబ్జాహక్కు (**Possession Right**) : భూస్వాములు కౌలుదారులను వారి భూములనుంచి తొలగించటానికి ప్రయత్నించేవారు. అప్పుడు రైతులకు ఇదొక జీవన్మరణ సమస్య. తమ భూమిని కాపాడుకోటానికి ఏంచేయాలి ? అనే ప్రశ్న వారిని వేధించేది. కరువుల సమయంలో కౌలుచెల్లించలేరు. 1-2 సంవత్సరాలపాటు అప్పులు తెచ్చి చెల్లించినా ఇలా ఎంతోకాలం సాగించలేరు. క్రమంగా భూమిని వదులుకోవటం తప్పనిసరి అయ్యేది. చాలా కొద్దిమంది మాత్రమే భూమిని కాపాడుకోడానికి కోర్టుకు ఎక్కేవారు.

తాలూకాకేంద్రాలకు కోర్టులు రావటంతో వకీళ్ళు తమ సంపాదనకోసం రైతులను కోర్టుకెక్కడానికి ప్రోత్సహించేవారు. గ్రామాల్లోని పైరవీకారులు రైతులవైపుచేరి ఖబ్జా హక్కు ఉంటుందని నచ్చచెప్పి నెమ్మదిగా వారిని కోర్టులకీడ్చేవారు. పట్వారీ రైతులకు అనుకూలంగా ఉండే రికార్డులను తయారుచేసి 12 ఏండ్లనుంచీ, లేక అంతకుముందునుంచీ

భూమి వారి (కౌలుదారుల) స్వాధీనంలో ఉన్నదని, వారు దీనికి హక్కుదారని చూపెట్టే వారు. అప్పుడు భూస్వాములు నిస్సహాయులై పోయేవారు. ఇలాంటి సందర్భాలు అరుదు. భూస్వామి, పట్వారి ఒక్కరే అయితే రైతులే నిస్సహాయులు. కొంతపైరవీ నడిచిన తర్వాత సర్వసాధారణంగా రైతులు ఓడిపోయేవారు. 1930 ప్రాంతంలోనూ, అంతకు ముందూ ఇలాంటిపోరాటాలు నడిచినవి. ఏదో ఒకరూపంలో స్థానికంగా ఏర్పడిన రైతు సంఘాల నాయకత్వాన కౌలుదారులంతా ఐక్యమయ్యారు. లాయర్లు వీటిని ప్రోత్సహించే వారు. కేసులు నడిపించటానికి ఈ సంఘాలు వారికి అవసరమయింది. అయినా కౌలు దారులకు ఖబ్జాహక్కులు దొరకలేదు. భూస్వాములు కూడా కౌలుదారులను పెద్దఎత్తున బేదఖల్ చేయలేకపోయారు.

ఇజారా బంజర్లు ఉన్న గ్రామాలలో సాగిన పోరాటాలు కౌలురేట్లను పెంచటానికి వ్యతిరేకంగా, బేదఖళ్ళకు వ్యతిరేకంగా మాత్రమేగాక వెట్టిచాకిరీ, అక్రమవసూళ్ళకు వ్యతిరేకంగా కూడా సాగేవి. ఈ విధంగా ఫ్యూడల్ వ్యతిరేక సమస్యలన్నీ మిళితమై ఉండేవి. పెద్దభూస్వాములకు వ్యతిరేకంగా సాగిన పోరాటాలు జయప్రదంకాలేదు. వారు స్వయంగా బలవంతులు. అధికారులపై పలుకుబడిగలవారు. మరొక బలవంతుడైన భూస్వామితప్ప కొద్దిపాటి భూస్వామి కూడా అతన్ని ఎదిరించలేడు. కాని రైతులు బలహీనులైన చిన్నభూస్వాములను ఒత్తిడిచేసి తమభూములను కాపాడుకోగలిగినారు. పైరవీల ద్వారానో, మరోవిధంగానో సర్దుబాటు చేసుకున్నారు.

కౌలుదారులు ఆర్థికంగా బలహీనులు. పోరాటానికి ఐక్యత మీద ఆధారపడవలసి ఉండేది. అందరికీ ఒకేవిధమైన సమస్యలు ఉన్నందున వాటి ఆధారంతో ఐక్యంకావటానికి అవకాశం ఉండేది. కానీ వారికి ఐక్యపరిచే నాయకత్వం ఎప్పుడూ కొరవడి ఉండేది. పోరాటాలు సాగినచోట పైరవీకారులు, చిన్నభూస్వాములు నాయకత్వం వహించేవారు. కౌల్దారులలోని ధనికరైతులు, కులపెద్దలు అప్పులు పెట్టేవారు, గ్రామస్థాయిలో వీటికి నాయకత్వం వహించేవారు. భూస్వాములతో వీరు రాజీపడటం సర్వసామాన్యం. కౌలుదార్ల ఐక్యతను విచ్ఛిన్నంచేసి సంఘాన్ని దెబ్బతీయటం భూస్వాములకు పరిపాటి. ఈవిధంగా కౌలుదారీ రైతుల పోరాటాలు అనేక ఒడిదుడుకులతో సాగిపోయినవి.

1920 సంవత్సరానికి పూర్వమే ఇజారా రైతుల పోరాటమొకటి జరిగినదనీ, రాజీద్వారా అది పరిష్కారమైనదనీ మాదిరాజు రామకోటేశ్వరరావుగారు ఇలా రాస్తున్నారు :

"మధిర తాలూకాలో వెంసూరు పట్టికొంత అరణ్యప్రదేశమునకు చెందియున్నది. అచ్చట అలవాల శేషగిరిరావు, కాళ్ళూరు జోగారావుగార్లు చాలా పలుకుబడిగలవారు.

అధికారవర్గము భృత్యానభృత్యులు. ప్రజలు దాసదాసీలుగా ఉండెడివారు. జోగారావు గారి ఇజారాగ్రామమగు అమ్మపాలెములోని కొంతభూమిని వెంకటాపురము కాపురస్తుడు పుచ్చకాయల చెన్నారెడ్డి అనే పెద్దరైతు సేద్యంచేసెడివాడు. అతని బంధుమిత్రులు ఆగ్రామములోనే 20 ఇండ్లవారుండెడివారు. శిస్తుల విషయంలో రైతులకు జోగారావుగారి మధ్య భేదాభిప్రాయము వచ్చెను. స్థానిక పైజమీందారి ప్రముఖులేకమైరి. కాక్మూరి జోగారావు జమీందార్ల ప్రభృతుల పార్టీ ఒకటిన్ని, చెన్నారెడ్డి రైతుపార్టీ ఒకటిన్ని ఏర్పడినవి. నేను రైతుపార్టీ తరఫున వకీలుగా ఏర్పడితిని. రెవిన్యూలోనూ, క్రిమినల్ లోనూ కేసులసంఖ్య పెరుగుచు వచ్చినది. తుదకు ఒక చెరువువద్ద పెద్దపోరాటము జరిగినది. పోలీసువారు ఉభయపార్టీలలోని 50మందిపైన బల్వా (రైటింగు) కేసుపెట్టిరి. నావద్ద వారి కేసులసంఖ్య 30 వరకు ఉండవచ్చునని నాకు జ్ఞాపకము.

"...మాపార్టీ నాయకుడు చెన్నారెడ్డి స్థితిగలవాడు. చాలామందికి పెట్టుబడి పెట్టెడివాడు. అసత్యము కలలో ఎరుగడు. చాలా పెద్దమనిషి. జమీందార్ల ప్రయత్నముచే ఆయనపైన బ్రిటిష్ పోలీసువారు ఒకడాకా కేసుపెట్టిరి. అందువలన ఆయన ప్రచ్ఛన్నముగా ఉండవలసి వచ్చినది.........సబ్‌కలెక్టరుగారు స్థానిక పరిస్థితులను బాగుగా తెలుసుకొని పోలీసు, క్రిమినల్ కేసులవలన శాంతి జరుగదనిన్నీ, సంధిమూలమున శాశ్వతమగు శాంతికుదర్చవచ్చుననియును చెప్పి నన్ను ప్రయత్నము చేయుమని చెప్పిరి......ఉభయపార్టీలు మా మధ్యవర్తిత్వము అంగీకరించిరి. క్రిమినల్ కేసులో విచారణ చాలాభాగము పూర్తియైనందున వాయిదాను మార్పించి రాజీప్రయత్నము ప్రారంభించితిమి. రాజీకొరకు 8 రోజులు వరుసగా పనిచేసితిమి. సుమారు 70 వివాదములు పరిష్కారము చేయగలిగితిమి. దీనికి ముఖ్యకారణము పార్టీలలో ఎవరును మాఎదుట అసత్యము మాట్లాడలేదు. అందువలన పరిష్కారములో మాకు ఎక్కువ ఆలస్యము పట్టినదికాదు. ఇన్ని వివాదములు పరిష్కారము చేసినందువలన అచ్చట 3, 4 గ్రామములలోని కరణములు జమీందారుల పార్టీకిని, రైతుపార్టీకిని శాశ్వతమైన రాజీకుదిరి శాంతిస్థాపన జరిగినది. ఈ మూడురోజులు కలెక్టరుగారు కూడా అచ్చటనే ఉండి ఏరోజుకారోజు సంగతులను తెలుసుకొనుచుండిరి. ఈవిధముగా శాంతిస్థాపనచేసి బయలుదేరి రాగలిగితిని..." (స్వీయచరిత్ర, పేజి 157-160)

ఈ సంఘటన 1915 సంవత్సరములో జరిగినది. గ్రామం అడవిప్రాంతం దగ్గరలో సర్కారు జిల్లాలో ఉన్నది. అక్కడ జాతీయోద్యమం, రైతాంగఉద్యమం ప్రారంభమవుతున్న రోజులు. అయినా తెలంగాణాలో ఆంధ్రోద్యమం ప్రారంభంకాలేదు. భూస్వాములు పెద్దతరగతికి చెందినవారు. "పలుకుబడిగలవారు, అధికారవర్గము భృత్యాన

భృత్యులు, ప్రజలు దాసదాసీలుగా నుండెడివార"ని మాదిరాజువారే చెప్తున్నారంటే (స్వీయ చరిత్ర) వారి ఫ్యూడల్ ఆధిపత్యం ఏ మేరకు సాగేదో దీనితో అర్థం చేసుకో వచ్చును.

పెద్ద భూస్వాములకూ మరో "పెద్ద రైతు"కూ మధ్య "శిస్తుల విషయం"లో తగాదా వచ్చింది. అమ్మపాలెం ఇజారా గ్రామమైనందున ప్రధానంగా ఇది కౌలుశిస్తుకు సంబంధించినది తప్ప మరొకటి కాదు. చెన్నారెడ్డి ఒంటరి వ్యక్తి కాదు సరికదా 20 కుటుంబాల బంధుమిత్రులు కూడా కలవాడు. "పెద్దరైతు", "స్థితిగలవాడు. చాలా మందికి పెట్టుబడి పెట్టేవాడు" అని ఆయన చెప్తున్నాడు. పెట్టుబడి పెట్టడమంటే అప్పులివ్వడం. ఈ విధంగా చెన్నారెడ్డి సంపన్నుడైన భూస్వామి అని స్పష్ట మవుతున్నది. తన వెనుకనున్న 20 కుటుంబాల సాయంతో, తనకున్న ఆర్థికబలంతో పెద్ద భూస్వాములతో పోరాటం సాగించాడు.

కేసుల సంఖ్య 30వరకు వచ్చిందంటే వాటిలో సివిల్, క్రిమినల్, రెవిన్యూ కేసులన్నీ ఉంటాయి. ఇవి చాలక పెద్ద భూస్వాములు సర్కారు జిల్లాలలో బ్రిటిష్ అధి కారుల పంచజేరి చెన్నారెడ్డిపై దొంగతనపు కేసు పెట్టించారు. అతడొక సంపన్నుడైన భూస్వామి కావడంతో ఈ కేసుల భారాన్ని తట్టుకోగలిగాడు.

రైతులను భూములనుంచి తొలగించే సమస్య కాదది. కౌలు శిస్తులను పెంచే సమస్య మాత్రమే. దీనితోబాటు "ప్రజలను దాసదాసీలతో" సమానంగా చూచే ఫ్యూడల్ ఆధిపత్యానికి వ్యతిరేకమైన సమస్యలు ఉండవచ్చును. ఆత్మ గౌరవమున్న ఏ వ్యక్తి అయినా ఈ దారుణాన్ని సహించడు. చెన్నారెడ్డి, ఆయన అనుచరులు ఆ భూస్వాము లకు వ్యతిరేకంగా తిరుగుబాటు చేయడం సహజం. పరిష్కారమైనవి 70వివాదాలుండెనని రచయిత చెప్పాడు. ఉభయ పక్షాలమధ్యన ఎన్ని సమస్యలున్నాయో ఇవి స్పష్టం చేస్తు న్నాయి. అయినా ప్రధానమైనవి కౌలుశిస్తు రేట్ల హెచ్చింపు, ఫ్యూడల్ ఆధిపత్యం.

పోరాటానికి నాయకత్వం వహించింది సంపన్నుడైన భూస్వామి. బంధుమిత్రు లైన రైతులంతా ఆయన నాయకత్వాన్ని అంగీకరించారు. పోరాటమంతా కోర్టులచుట్టే నడిచినట్టు స్పష్టమవుతున్నది. ఏ దశలోనైనా ఈ పోరాటం ప్రజల తిరుగుబాటు స్వభా వాన్ని సంతరించుకున్నదీ, లేనిదీ తెలియదు.

తెలంగాణాలో ఏ ఉద్యమమూ లేని 1915 కాలంలో ఇలాంటి పోరాటం నడువటం గొప్ప విశేషం.

రచయిత చెన్నారెడ్డి సత్య నిరతిని, సుగుణాలను పేర్కొని మెచ్చుకున్నాడు. ధనిక రైతు భూస్వామిగా మారినప్పుడు ఒకవైపున దోపిడీ సాగించినా కష్ట జీవుల్లో

ఉండే సద్వర్తన ఆయన్ను వదలదు. దౌర్జన్యపరులైన ఫ్యూడల్ భూస్వాముల్లో ఇలాంటి సద్వర్తన అరుదు.

1930 ఆర్థిక మాంద్యం నుంచి మనదేశం బయటపడిన తర్వాత ధాన్యానికీ, వ్యాపార పంటలకూ క్రమంగా ధరలు పెరిగినవి. దాని ఫలితంగా భూస్వాములు కౌలు దారులను భూములనుంచి తొలగించి, అప్పటికే తమ స్వాధీనంలో ఉన్న 'స్వంత సాగు' భూమిని విస్తరించసాగినారు. కౌలు రేట్లను హెచ్చించారు. వీటితోబాటు వెట్టిచాకిరీ, అక్రమ పన్నులులాంటి ఫ్యూడల్ దోపిడీ సమస్యలు కూడా ఉండేవి. వీటికి వ్యతిరేకంగా పోరా టాలు సాగినవి. ఇవన్నీ ప్రధానంగా లీగల్ పోరాటాల రూపంలోనే సాగిపోయాయి.

అమ్మపాలెంలో సాగిన పోరాటం ఇలాంటివాటిలో ఒకటి.

ఆంధ్రమహాసభ కౌలుదారుల సమస్యలపై ఎప్పుడూ ఎలాంటి తీర్మానాలు చేయ లేదు. జాగీరు రైతుల సమస్యలు, వెట్టిచాకిరీ, పన్నుల భారంవరకే ఈ తీర్మానాలు పరి మితమయ్యేవి. కారణం నాయకులలో అనేకులు కౌలుదారీ రైతులుగల భూస్వాములు. వాస్తవానికి 1940 వరకు ఆంధ్ర మహాసభ భూస్వాములకు వ్యతిరేకమైన ఏ ఒక్క సమస్యపైనా తన వైఖరిని ప్రకటించలేదు.

1938లో నిజాం ప్రభుత్వం "ఆసామీ షిక్మీ" అనే ముసాయిదా చట్టాన్ని ప్రక టించిందే కానీ దానిని చట్టం చేయలేదు. దానిననుసరించి అది చట్టమయ్యేనాటికి 6సంవత్స రాలు వరుసగా సాగుచేసిన కౌలుదారుకు రక్షణ ఉంటుందని, వారిని కొన్ని సందర్భాల్లో తప్ప తొలగించడానికి వీలులేదని ప్రకటించింది. దానినిచూచి భూస్వాములు కౌలుదారు లను పెద్దఎత్తున బేదఖలు చేయసాగారు. దీని ఫలితంగా వారిలో తీవ్రమైన అసంతృప్తి బయలుదేరింది.

## 6. అమ్మపాలెం రైతుల పోరాటం – కాళ్ళూరు రాజేశ్వరరావు హత్య

1915 నాటికే అమ్మపాలెంలో (ఆనాటి వరంగల్లు జిల్లా, ఈనాటి ఖమ్మం జిల్లా) కాళ్ళూరు జోగారావు, అలువాల శేషగిరిరావు ఇద్దరు భూస్వాములకు, రైతులకూ కౌలు శిస్తు, మరికొన్ని సమస్యలపై తగాదా వచ్చిందనీ, సుమారు 30 కేసులు, 70 వివాదా లున్న వారి సమస్య కేసులద్వారా పరిష్కారం కాదని గ్రహించి ఒక పెద్ద అధికారి, ఇరుపక్షముల మధ్య రాజీ నెలకొల్పమని సూచించినట్టు, తాము రాజీ చేసినట్టు మాదిరాజు రామకోటేశ్వరరావు "స్వీయ చరిత్ర"లో రాశారు. (పేజి 157 – 160)

కాళ్ళూరు రాజేశ్వరరావు కూడా ఆ కుటుంబానికి చెందినవారే. భూమికి పట్టాదారని ఆనాటి సమాచారం. పెద్ద భూస్వామి కావటంవల నా ఎకరాల ఆయనకూ భూములు వాటిపై పన్నులసమస్యలు ఉండేవి. ఆ గ్రామ రైతులకూ, గ్రామంలోనో ఇతనికి రైతులతో భూమి సమస్యమీద తగాదావచ్చింమంలోనో, మరో కౌలుభూముల సమస్యలే ఉంటాయి. రైతులకూ, భూస్వామికీ మధ్యది. ఇజారాగ్రామంలో కోర్టులో వ్యాజ్యం నడిచింది. (దీని స్వరూప స్వభావాలనుగూర్చి మీకోసం చాలాకాలం రైతులు కోర్టులో ఓడిపోయారు. కోర్టువారు కాళ్ళూరు రాజేశ్వరరావులేవు.) తర్వాత తీర్పు ఇచ్చారు. రైతులు డబ్బు నష్టపడి నిస్సహాయులైనారు. పట్టరానికోనుకూలంగా భూస్వామిని చంపివేశారు. సంఘటన వివరాలు ఆ కాలంలో ప్రజలు ఇలా చెప్పరైతులు

ఓడిపోయిన రైతులు భూస్వామికి లొంగిపోయినట్టు నటించారు. తాముఓడిపో వారమనీ, సాగు చేసుకోవడానికి భూములను, వాటి సరిహద్దులను చూపించమనీ వాటిని సాగుచేసి శిస్తులు కడతామనీ రైతులు ప్రాధేయపడినారు. భూస్వామి విజయగర్వంతో పెద్ద గుర్రంపై స్వారీ చేస్తూ వచ్చాడు౭౮. రైతులంతా చీలి రెండు భాగాలై ఆయనకు ఇరువైపులా చేరి గుర్రం దిగి రైతులతో మాట్లాడుతూ ఉన్న సమయంలో కొందరు ఒక వైపున, తక్కినవారు మరోవైపున తిరిగి అతన్ని చంపి ముక్కలు ముక్కలు చేశారు. తర్వాత అతని శవాన్ని పోస్టుమార్టం కోసం ఖమ్మం తీసుకెళ్ళారు. శవాన్ని చూడటానికి కొన్ని వందలమంది ప్రజలు అస్పత్రికి వెళ్ళారు. ఈ సంఘటన ఖమ్మంలో పెద్ద సంచలనం కలిగించింది. ఈ హత్య 1932 - 1933 కాలంలో జరిగింది.

ఈ భూస్వామి గొప్ప పండితుడని పేరు. మాదిరాజు రామకోటేశ్వరరావుగారు ఈయనను 'విద్యావంతుడ'నీ, 'జమీందార'నీ రాశారు (పేజి 199). స్వయంగా పండితులై ఇతర పండితులను గౌరవించటం ఫ్యూడల్ సాంప్రదాయాలలో ఒకభాగమే. కాని రైతులయెడ ఇలాంటి భూస్వాములు కూడా చాలా క్రూరంగా వ్యవహరించేవారు. రైతులు గత్యంతరం లేక భూస్వామి హత్యకు తలపడ్డారు.

రైతులపై హత్య కేసు నడిచింది. కొందరికి యావజ్జీవశిక్షపడింది. 1942-43లో కొన్ని కేసుల్లో జైలుకు వెళ్ళిన కమ్యూనిస్టు కార్యకర్తలూ (సూర్యాపేట) వీరూ ఒకే జైలులో ఉండేవారు. అప్పుడు రైతులు తమ గాధను వారికి వినిపించారు.

1932-33 నాటికే రైతులు భూస్వాములను హత్యచేసేవారని దీనితో స్పష్టమవుతూ ఉంది. అప్పటికి ఆంధ్రోద్యమం ప్రారంభమై 10 సంవత్సరాలైనా ఆంధ్ర మహాసభ ఏర్పడి 2 సంవత్సరాలే అయింది. ఆంధ్రోద్యమం ప్రభావం వారిపై పడలేదు. ఫ్యూడల్ భూస్వామ్య వ్యతిరేక కార్యక్రమం లేకపోవుటే దీనికి కారణం. దీర్ఘకాల

పోరాటం ్రత్తన ఆతులు దివాలా తీసారు. అడవి ప్రాంతంలో వారి ఆదాయాలు పరిమిత మవడంతో పైరవీలో (లిటిగేషన్) వారి ఆర్థిక స్థితి అస్తవ్యస్తమైపోయింది. దీనితోపాటు ఓడిపోయామనే కక్షతో రైతులు భూస్వామిని చంపేశారు.

ఈ పోరాటంలో రైతులకు గాంధీవాదుల నాయకత్వం లభించలేదని స్పష్టమవు తున్నది. గ్రామంలో ఉండే రైతుపెద్ద పైరవీకారు కావచ్చును. బస్తీలో ఉండే వకీలు (ప్లీడరు) కోర్టు వ్యవహారాలు చూచి ఉంటాడు. మాదిరాజు రామకోటేశ్వరరావు ఈ భూస్వామిని గూర్చి 1924లో వెంకటాపురం గ్రామానికి వెళ్ళిన సంఘటనను వివరిస్తూ ఇలా రాశారు:

గ్రామ రైతులు నా క్లయింట్లుగనుక ఆ గ్రామములో కొంత డబ్బు ఇచ్చిరి. అచ్చటికే చుట్టుపక్కల గ్రామములలోని కొందరిని పిలిపించితిని. వారిలో ముఖ్యుడు శ్రీ కాళ్ళూరు రాజేశ్వరరావు, విద్యావంతుడు, జమీందారు అయి ఉండెను. ఆయన తన ఇంటికి అమ్మపాలెం మమ్ములను తీసుకొని వెళ్ళి విందుచేసి ఉచితరీతిని ఆర్థిక సహాయము చేసెను. అచ్చటనుంచి ఒకరోజు వేంసూరు వెళ్ళితిమి. అచ్చట శ్రీ అలవాల లక్ష్మీనర సింహారావు వకీలు, వారి అన్నగారు శేషగిరిరావులు ఇంకా కొందరు రైతులు డబ్బు సహాయము చేసిరి......" (పేజి 199 - 200)

ప్రకాశంగారు 'స్వరాజ్య' పత్రికకోసం విరాళాలు సేకరిస్తున్న విషయమది. మాదిరాజుగారు కాళ్ళూరివారినుంచి, అలవాలవారినుంచి కూడా పత్రికకోసం డబ్బులు వసూలుచేశారు ; వారు ఇచ్చారు. వీరు ఒకవైపున "అధికారవర్గము భృత్యానభృత్యులు, ప్రజలు దాసదాసీలుగా నుండెడి" (పేజి 157) భూస్వాములు, ఇలాంటి వారికి ఆ కాలపు జాతీయోద్యమంతో సంబంధాలు ఉండేవి.

1915 నాటికే కాళ్ళూరి కుటుంబానికీ, రైతులకూ తగాదాలు ఉండేవని, అవి పరిష్కారమైనవనీ ఇదివరకే చెప్పాము. అయినా మళ్ళీ తల ఎత్తి 1932-33 నాటికి ఆ కుటుంబంలోనే మరొకరి హత్యకు దారితీసిందని దీనివలన స్పష్టమవుతున్నది. ఈ తగాదాలు మధ్యలో దాపురించినవి కావు. 1915 నాటికే తలఎత్తి 1932-33 నాటికి హత్యారూపమందుకున్నవి. ఈ విధంగా అది సుమారు 20 సంవత్సరాలదాకా సాగిన దీర్ఘకాలిక పోరాటం. 1915లో ఉన్న చెన్నారెడ్డిగారి నాయకత్వం, తర్వాత కాలంలో ఉండెనో లేదో పరిశీలించవలసిన అంశం. ఒక విషయం మాత్రం స్పష్టం. భూస్వాముల దోపిడీ దౌర్జన్యాలకూ, చాలా బలహీనమైనవే అయినా జాతీయోద్యమంతో వారికిగల సంబంధాలకూ ఎలాంటి పొంతనా లేదు. జాతీయోద్యమం ఫ్యూడల్ వ్యతిరేక ఉద్యమ

స్వభావాన్ని సంచరించుకోలేకపోవడమే దానికి కారణం. సంతరించుకున్నా మితవాద నాయకత్వం ఎప్పుడూ జమీందారీ వర్గంతో మిలాఖతు అయి ఉండేది.

## 7. మునుగోడు రైతులపోరాటం; దేశముఖు హత్య

మునుగోడుగ్రామం నల్లగొండ తాలూకాలోనిది. అక్కడ రామిరెడ్డి అనే దేశముఖు ఉండేవాడు. పెద్ద ఆస్తిపరుడే గాక గ్రామానికి పోలీసుపటేలు, పైరవీకారు కూడా. తహసీల్దారుకు, కలెక్టర్లకు (తాలూక్దారులు), ఇతర అధికారులకు నెయ్యిని నింపిన కుండలను, ఇతర రుచిగల పదార్థాలను (మామిడిపండ్లు మొ॥), పచ్చళ్ళను సప్లయిచేసి వారి అభిమానాన్ని (మెహర్బానీ) చూరగొనేవారు. లంచాలిచ్చి తనకూ, తన అనుయాయులకూ అనుకూలంగా తీర్పులు చెప్పించుకునేవాడు. గ్రామప్రజల్లోని అన్నదమ్ములమధ్య, దాయాదులమధ్య, చివరికి భార్యాభర్తలమధ్య తగాదాలు సృష్టించి, అక్రమమైన కేసులు సృష్టించి, వారిని కోర్టులచుట్టూ తిప్పేవాడు. వాటిలో కొన్నికేసుల్లో తానే తీర్పు చెప్పేవాడు. ఎవరు హెచ్చుమొత్తం లంచమిస్తే వారివైపు తీర్పు చెప్పేవాడు. రెవిన్యూ ఆఫీసులకు, కోర్టులకు వెళ్ళే కేసుల స్థితికూడా ఇంతే. అధికారులకు ఇచ్చే లంచాల్లో తానొక నిర్ణీతమైన భాగాన్ని అట్టిపెట్టుకొని, మిగతా మొత్తాలను వారివారికి చేర్చేవాడు.

ఇతని దాయాదుల్లో చాలామంది పేదలు; సాధారణరైతులు (మధ్యతరగతి), పేదరైతులు. కుటుంబ అవసరాలకోసం కుటుంబపోషణకై కొంత ఆదాయాన్ని సంపాదించడానికీ వారు తమఇళ్ళలో రహస్యంగా సారాయిని తయారుచేసి, అమ్మేవారు. సామాన్యప్రజలు కూడా ఈ వృత్తిని అనుసరించేవారు. దేశముఖు, ఎక్సైజు (ఆబ్కారీ) ఆఫీసర్లతో వీరి ఇళ్ళపైన దాడులు చేయించి, స్త్రీలను అవమానించి, ఆడ, మగ వారందరిని దెబ్బలుకొట్టి, హింసించి లంచాలు తీసుకునేవాడు. దీనితో ప్రజల్లోనేగాక దాయాదుల్లో కూడా వ్యతిరేకత పెరిగిపోయి ఇతన్ని చంపటానికి తయారైనారు. దాయాదుల్లోని ఒకరి నాయకత్వాన వారంతా ఐక్యమయినారు. ఒకనాడు అతడు దేశముఖును తుపాకీతో కాల్చినాడుకాని దేశముఖు చనిపోలేదు. గాయపడి బతికిపోయాడు. ఆ వ్యక్తిపై కేసు నడిచింది; శిక్షపడింది; కొంతకాలానికి జైలునుంచి విడుదలై ఇల్లుచేరుకున్నాడు. అయినా దేశముఖుపై ఉన్న వ్యతిరేకత తగ్గలేదు. కాగా తీవ్రమైనది.

సుమారు 1941-42 కాలంలో ఒకనాడు దేశముఖు తనకచ్చడంలో నల్లగొండకు బయలుదేరినాడు. అధికార్లకోసం నేతిడబ్బాలు, పచ్చడిజాడీలు కచ్చడంలో పెట్టుకొని

త్తెస్తున్నాడు. ఇతని రాకపోకలను కనిపెడుతూ ఉన్న ప్రజలు, దాయాదులు దారిలో మాటుగాచారు. దోమలపల్లి అనే గ్రామ శివారులో కచ్చడాన్ని ఆపివేసి దేశముఖును కొట్టిచంపారు. ఇంకా బతికిఉన్నాడనే అనుమానంతో శవాన్ని కచ్చడంలోనేవేసి నిప్పంటించారు. కచ్చడంలోఉన్న నెయ్యిని మంటల్లో పోశారు. దీనితో శవం కూడా కాలి బూడిదై పోయింది.

కేసు నడిచింది. సుమారు 9మందికి యావజ్జీవ శిక్ష పడింది.

పోలీసు శాఖలో ఉద్యోగం చేస్తున్న దేశముఖు కొడుకు ఉద్యోగాన్ని మానివేసి ఇల్లు చేరుకున్నాడు. వెనుకటి పద్ధతులు మాని కొత్త పద్ధతులలో దోపిడీ సాగిస్తూ తన పెత్తనాన్ని చలాయిస్తున్నాడు.

దాయాదులు పేద మధ్య తరగతి రైతులక్షణాలుండటంవలన సులభంగా తక్కిన ప్రజలతో ఐక్యం కాగలిగారు. దేశముఖు అనేపేరు, కుటుంబ సాంప్రదాయం వారిలో ఒకరు నాయకుడు కావడానికి తోడ్పడింది. దేశముఖు చనిపోవటంవలన అతడు సాగించే దుర్మార్గాలు తగ్గిపోయాయేకాని, భూస్వామ్య వ్యవస్థ దెబ్బతినలేదు. అతని భూమిని రైతాంగం పంచుకోలేదు. అతని కుటుంబంవారు ఇప్పటికీ భూస్వామ్య వ్యవస్థలో ఒక భాగమే.

## 8. విసునూరు దేశముఖుకు వ్యతిరేకంగా పోరాడిన బందగీ హత్య

1939 నాటికి ఫ్యూడల్ దోపిడీ దౌర్జన్యాలకు పేరుపడిన విసునూరురామచంద్రా రెడ్డికి (జనగామ తాలూకా) వ్యతిరేకంగా కొన్ని పోరాటాలు సాగాయి. వాటిలో ఒక దానికి బందగీ అను యువకుడు నాయకత్వం వహించాడు. దాని వివరాలు 'జనగామ ప్రజల వీరోచిత పోరాటాలు' (1945) అన్న పుస్తకంలో ఈ విధంగా ఉన్నాయి :

"దేశముఖు[26]కు తాబేదారుగా ఉంటే పరుల సొత్తు ఎంతయినా చేజిక్కుతుంది. ఎదిరించితే ఉన్న సొత్తు పోతుంది.

కామారెడ్డి గూడెంలో షేకుబందగీ అనే మహమ్మదీయ రైతుయువకుడుండేవాడు. వారంతా అయిదుగురు అన్నదమ్ములు. అందరికన్నా పెద్దవాడు అబ్బసలి[27]. అంతా విభాగం చేసుకొని వేరుగా జీవించాలనుకున్నారు. పెద్దవాడని గౌరవించి అబ్బసలికి 8 ఎకరాల భూమిని జ్యేష్ట భాగం క్రింద ఇచ్చారు. తక్కింది సమానంగా పంచుకున్నారు. చిన్నవారు నలుగురు కలిసి వ్యవసాయం చేసుకునేవారు. అబ్బసలి తన జ్యేష్ట భాగపు

8 ఎకరాలు అమ్ముకున్నాడు. దేశముఖు దగ్గర ప్రాపకంసంపాదించి ఆయనసహాయంతో తమ్ముల భూమిలో కొంత కొట్టివేయాలని నిశ్చయించాడు. దేశముఖును ఆశ్రయించి అభయహస్తాన్ని తీసుకున్నాడు.

ఇంటికి వచ్చి తమ్ములతో భూమిని మళ్ళీ పంపకంచేసి మళ్ళీ తనకు జ్యేష్ఠభాగం కావాలని పేచీ పెట్టాడు. తమ్ములు 'ఇదివరకు ఇస్తే భూమిని అమ్మి పాడుచేశావు. మళ్ళీ ఇస్తే మళ్ళీ అమ్ముకుంటావు, మేము ఇవ్వము' అని అన్నారు. 'మీరెవరు నాకివ్వడానికి? భూమి పట్టా నాది నేను దున్నుకుంటాన'న్నాడు పెద్దన్న. భూమికొరకు తగాదాలు జరిగినవి. కోర్టుకెక్కినాడు అబ్బసలి. మూడు సంవత్సరాలు నడిచింది. ఆ తగాదా కోర్టులో తుదకు తమ్ములవైపుననే ఫైసలా అయింది.

అయితే తమ్ములవైపున పోరాటానికి బందగీ సాహెబు నాయకత్వం వహించాడు. ఇతడు అప్పటికి 25 సంవత్సరాల యువకుడు మాత్రమే. అతనిలో ప్రజల్లో కలిసిపోయే స్వభావం బాగా ఉంది. ప్రజలను ఉత్తేజపరిచి, సంఘటితశక్తితో కార్యాచరణకు దిగునట్లు చేయగలిగేవాడు. అన్నతో వచ్చిన ఈ మూడు సంవత్సరాల పోరాటంలో కొంత అనుభవం గడించాడు. దేశముఖు అండజేరిన తన అన్నను జయించడానికి ప్రజాబలం, ధైర్యసాహసాలు అవసరమని గుర్తించి వాటిని సమకూర్చుకొని పోరాటాన్ని సాగించి జయించాడు. దౌర్జన్యంతో కూడిన దేశముఖు అధికారాన్ని మొదటిసారిగా దెబ్బతీసాడు ఈ పేదయువకుడు.

పరాజితులైనందున బందగీ ప్రతికక్షులకు నిద్రపట్టలేదు. దేశముఖు ఒకనాడు ఇలా అనుకున్నాడు. 'నేను నాపేరుతో ప్రజలనుభయపెట్టి అధికారం చలాయించుతాను. నా అధికారమున్న ప్రదేశంలో అందరూ నాకు తలయొగ్గి ఉండాల్సిందే. ఎవరైతే తల ఎత్తుతారో వారి అంతు కనుక్కోవాలి. అయితే ధనికులను జయించడం సులభం. ఒక్కసారి ఇల్లు దోపిడీచేయించితే, వారు శాశ్వతంగా నాకు బానిసలవుతారు. కాని పేదవాడైతే ఎలా?' బాగా ఆలోచించి బందగీని అతని పాలివారి[28]తోనే లొంగదీయాలని నిశ్చయించాడు. తన శక్తినంతా కేంద్రీకరించి పాలివారికి సహాయం చేస్తానని వాగ్దానం చేశాడు.

పకీరు అహమ్మదు బందగీ సోదరులకు దగ్గరిపాలివాడు. దేశముఖు దగ్గర నౌకరీ చేయడం మొదలెట్టినాడు. అతనికి ఇంకేమి కొదువ? అతను ప్రజల ఇండ్లను దోపిడీ చేయవచ్చును. ఆస్తిని స్వాధీనం చేసుకోవచ్చు. లంచాలు తీసుకోవచ్చు. ఇంకా ఏమేమో చేయవచ్చు. బందగీని ఎదిరించడానికి ప్లాను అంతా సిద్ధమయింది.

ఏమిటా ప్లాను? బందగీ సోదరులు అనుభవించే భూమిఅంతా వారి తండ్రి, పకీరు అహమ్మదు తండ్రి వేరఅయినాక (ఇద్దరు అన్నదమ్ములు) ఇతడు మాత్రమే సంపాదించాడనీ, దానిలో బందగీ సోదరులకు హక్కులేదనీ తగాదా. అధికారులను కట్టుకొని, పైరవీలో బందగీని లొంగదీసి, ఆస్తిని స్వాధీనం చేసుకొని, గ్రామం నుంచి వెళ్ళగొట్టితే తలంటిపోసుకొని నిశ్చింతగా నిద్రపోవచ్చును.

ఆ ప్రకారమే కేసులు ప్రారంభమైనవి. బందగీ పేదవాడు. అయినా కష్టజీవి. ఎన్ని ఆమడల దూరమైనా కాలినడకతోనే పూర్తిచేసేది. కామారెడ్డిగూడెం నుంచి జనగామ (16 మైళ్ళు) నడవడమంటే అతనికి లెక్కేలేదు. అందువలన కేసులకై తిరగ డంలో అతన్ని వ్యయప్రయాసాలు ఎదుర్కోలేదు. అయితే బందగీ ఒంటరిగాడా? ముమ్మాటికీగాదు. దేశముఖుచే పీడించబడుచున్న వేలకొద్ది ప్రజల సహాయసానుభూతులు బందగీ వెంటనున్నవి. ప్రజలు అతన్ని కాపాడటానికి అన్నివిధాల జాగ్రత్తగా ఉండే వారు. ఒంటరిగా రేయింబవళ్ళు తిరిగేవాడు. తెల్లవారగనే లేచి రెండుజాములదనుక గ్రామంలో ప్రతిఇంటికి తిరిగి, ప్రజలను ఉత్తేజితులచేసి తర్వాత భోజనానికివెళ్ళేవాడు. కొద్దికాలంలోనే బందగీ సర్వజనప్రియుడైనాడు. కేసులు ప్రారంభమైనవి. అడుగడుగునా ప్రతికక్షులకు పరాజయాలే. దేశముఖు జోసిళ్ళతో రూపాయిలను కుమ్మరించి కేసులు నడిపిస్తున్నాడు. ఒకపూట పస్తుండి, మైళ్ళకొద్ది నడిచి పీడితప్రజల సహాయంతో కేసులు నడిపిస్తున్నాడు బందగీ. ఒకవైపు ధనసంపన్నులు, మంచి దిట్టమైన పైరవీ కారులు దేశముఖు గడీముందు దాసానుదాసులై పడిఉన్నారు. నిజంగా బందగీ స్థితి విచారిస్తే ఆయన నౌకర్లలో నాల్గవశ్రేణి (దర్జా) లో కూడా చేరడు. కానీ బందగీ మానవుడుగా జీవించాలనుకున్నాడు. అతడు దేశముఖు ఇంట్లో పేదలకు భాగమివ్వమని కోరలేదు. ఆస్తిని పంచి ఇవ్వమనలేదు. భాగ్యభోగాలను తగ్గించుకొమ్మనలేదు. అతడు కోరింది ఒక్కటే కోరిక. ఈ గ్రామ ప్రజల ధనమానప్రాణాలు దౌర్జన్యపరుడు, క్రూరుడైన దేశముఖు చేతులలో ఉండకూడదనీ, ప్రజలు ఆత్మరక్షణకై పూనుకోవాలనీ అతని కోరిక. తన జీవనాధారమైన నాలుగెకరాల భూమిని అక్రమంగా ఆక్రమించుకొని చిప్పచేతికివ్వాలనే దేశముఖు దురుద్దేశ్యాన్ని, దురాచరణను ప్రతిఘటిస్తూ తన ఈ ఆశయాన్ని సాధించుతున్నాడు బందగీ.

పన్నెండు సంవత్సరాల పోరాటం సాగింది దేశముఖు, బందగీలమధ్య. బందగీ తెల్లని శరీరం కందలేదు; కమలలేదు; అతని ఉత్సాహంలో మార్పులేదు; సంవత్సరాల తరబడి సాధించుతున్న విజయాలను చూచి గర్వించలేదు; ప్రజలే జయించుతున్నా రనుకున్నాడు; ప్రజల్లో అతనికి వచ్చిన గౌరవాన్ని చూసి మురిసిపోలేదు. ఇదంతా

ప్రజలసొత్తే అనుకున్నాడు. అతడు తరచుగా ఈమాటలు అనేవాడట. "దొరా, నేను పేద పకీరువాణ్ణి. నీవు అరవై గ్రామాలకు దొరవు. నీవు నీసాటి దొరలను ఎదిరించాలి గాని పూటకు గతిలేని పేదవాణ్ణి నన్నా? ఇది నీ చాతగానితనం గాని మరొకటికాదు."

పోరాటం ఆఖరైంది. తుదిసారి కూడా కోర్టుఫైసలా బందగీ సోదరులవైపే అయింది. బందగీ ధైర్యసాహసోపేతమైన పోరాటం ఫలితం విజయవంతంగా ఉండటం వలన ప్రజలు హర్షించారు. ప్రపంచంలో దేశముఖును మించిన శక్తిలేదనుకునే ప్రజలు, సంఘటితశక్తితో ఏమిచేయగలరో, ఏమిచేసి చూపించగలరో తెలుసుకున్నారు. ఇదే బందగీ సాధించిన ప్రధాన విజయం.

పైరవీ పూర్తికాకమునుపే దేశముఖు, అతనిపార్టీ బందగీని లొంగదీయటం అసాధ్యమని తెలుసుకొని చంపించడానికి కుట్రలు పన్నసాగారు. సంవత్సరానికిపూర్వం ఒకరు కత్తితో నరకడానికి వస్తే కత్తిని చేతితో పట్టుకొని చావుతప్పించుకున్నాడు బందగీ. హంతకుడు కత్తిని అతనిచేతినుంచి లాగివేసాడు. వ్రేళ్ళుతెగి నెత్తురువరదలై కారింది. కాని వాడు ప్రాణాన్ని తీయలేకపోయాడు

ప్రతికక్షులు ఒక సంవత్సరందాకా సమయానికి నిరీక్షించారు. తుదకు కోర్టులో బందగీ గెలిచాడు. మరుసటిరోజే దేశముఖుముందు ఒక ప్రధానసమస్య వచ్చిపడింది-— "ఇప్పుడు ప్రజానాయకత్వం ఎవరిది ?" "బందగీది."- "ప్రజలు ఎవరిని అనుసరించుతారు ?" "పన్నెండు సంవత్సరాలు అవిచ్ఛిన్నంగా పోరాడి, విజయలక్ష్మిని వరించిన బందగీని." ప్రజలనుంచి తాను తీసుకునే వేలకొలది లంచాలగతేమి ? తన ఏజెంటుల చిన్నలంచాలు ఏమవుతవి ? తనగూండాలు ఎలాజీవించాలి ? అన్నిటికీ తిలోదకాలే ! ఇక దేశముఖు చేసే పనేముంది ? 'మంత్రివర్గం' ప్లానులు ఎన్నితయారుచేస్తే ఏమిలాభం? గుండాల చేతుల్లో చిలుమెక్కిన కత్తులు, లొట్టపాకులు ఎన్నిఉంటే ఏమిఫలం? మొత్తం మీద అధికారం సాగాలా, లెదా ? ఈ సమస్య అతన్ని కలవరపెట్టింది. పరిష్కారమార్గం నబడేవరకు ఆకలిలేదు, దప్పిలేదు. నిద్ర అసలేలేదు. ఇల్లు చిన్నబోయింది. ఏంచెయ్యాలి ?

మన 'దేశముఖు'కు వడిశాల వెంకటరెడ్డి దేశముఖు జ్ఞాపకం వచ్చాడు. ఆయన సల్పిన పోరాటం, అతని ఇంటిని దోయించడం, తుదకు అతడు హత్యగావింపబడటం కండ్లముందుకు వచ్చింది. ఆ సంఘటనలన్నిటిని మనస్సుకు తెచ్చుకున్నాడు. కొంచెం భయంవేసింది. 'ఇలాంటి పనులను మరొకసారిచేసి సమర్థించుకోగలనా' అనుకున్నాడు. లేకుంటే గత్యంతరం ? గాజులు తొడుగుకొని ఇంట్లో కూర్చోడం ? 'ఛీ ఇంత పాడు

బతుకా ? నేనైనా జీవించాలి. లేక బందగియైనా. ప్రస్తుతం నాజీవితానికి ప్రమాదంలేదు. అందువలన పడిశాల దేశముఖుకు పట్టినగతి బందగీకి పట్టాలి.'

గుండెను రాయిచేసుకొని తన ఏజెంట్లను రప్పించి, ఆహారనిద్రలుమాని తయారు చేసిన తన ఈ స్కీమును వారిముందు పెట్టాడు. వారికి గుండెకొట్టుకోవడం సాగింది. భార్యాపిల్లలు జ్ఞాపకం వచ్చారు. శరీరాలు చెమటతో నిండిపోతే దస్తీలతో తుడుచు కుంటూ ఛేష్ అంటే ఛేష్ అన్నారు ఏజెంటులు. లేకుంటే దేశముఖుగారు తినే మీగడ పెరుగన్నపు ఎంగిలి మెతుకులు దొరకవు తినడానికి. అటుతర్వాత రూపాయి జీతపు సర్దారులను పిలిపించి కార్యక్రమం ఇచ్చాడు. "నీపెత్తనం పోయినాక మేమంతా ఉండటం ఎందుకు" అన్నారు ఆ చిన్నదొరలు. ప్లాను విషయం చేతిలోనుంచి దాటి పోకుండా జరుగవలసిన కట్టుదిట్టాలన్నీ జరిగినవి. కార్యక్రమానికి ఉపక్రమించాలి.

ఒకనాటి సాయంత్రం సమయం. కామారెడ్డి గూడెంలో చంద్రమౌళి ప్రజలకు తేనె పూసిన కత్తి. ఆతని ఇంట్లో ఆ సాయంత్రాన కొద్దిపాటి సందడిగా అనిపించింది ప్రజలకు. ఏదో అనుకున్నారు ప్రజలు. కల్లుకుండలు చేరినవి, మాంసంవచ్చింది. ప్రత్యే కంగా భట్టిపెట్టి తయారుచేసిన సారాయికూడా తెప్పించబడింది. దేశముఖుల పార్టీ అంతా తాగుడు, తిండిలో మునిగి ఉంది. ఆ రాత్రంతా మత్తెక్కి మరుసటిరోజు కార్యక్రమం గురించికూడా మాట్లాడారు అక్కడివారు.

చంద్రమౌళి వద్దవాడు. అతని ఇంటిపక్కనే బందగీ పక్షానఉన్న అతనిపాలివారి ఇల్లు ఉంది. కొద్ది రాత్రి అయింది. ఆ ఇంటి ఒక వద్ద యువకుడు మంచంమీద పడుకొని ఏదో ఆలోచించుతూ ఉండగా కన్ను మలిగింది. ఇంతలో ఒక అబ్బాయి వచ్చి అతడు మేల్కొలో ఉన్నాడనుకొని చంద్రమౌళి ఇంట్లో రేపు మన బందగీని చంపుతారని అను కొంటున్నారని చెప్పాడు. కానీ మంచంమీద ఉన్న అతను వినలేదీ మాటను.

ఇక్కడ బందగీ ఆ రాత్రే తన మరుసటి దినపు కార్యక్రమాన్ని నిర్ణయించాడు. ఉదయం 8 గంటలకు సూర్యాపేటనుంచి జనగామ వెళ్ళే బస్సులో వెళ్ళి హైకోర్టునుంచి వచ్చిన 'అహకాములు' (ఆర్డర్సు) తెచ్చుకొని తన ఆస్తివిషయమై చిక్కులు తొలగించు కుందామనుకున్నాడు. రాత్రి ఇంట్లో కుటుంబంతో హాయిగా గడిపాడు. భావిజీవితంలో తమ ఆస్తికి రక్షణ కలిగించుకోగలిగామని, సంతోషంగా జీవితం గడుపుదామని, ఇంట్లో ఉన్నవారికి నచ్చచెప్పి తానుకూడా సంతృప్తిపడ్డాడు. అందరికవలెబందగీ నిద్రపోయాడు.

ఉదయం 8 గంటల సమయం. గ్రామానికి బస్సు నిలిచే స్థలానికి మధ్య రెండు ఫర్లాంగులదూరం ఉంటుంది. దారికి ఇరుపక్కల పంటచేలు దట్టంగా ఉన్నవి. దారికి ఇరుపక్కల దట్టంగా కంచెవేసి ఉండుటవలన దానిచాటున మనుషులు కూడా దాగు

దాగుకోడానికి అవకాశం ఉంది. గ్రామంనుంచి వస్తుంటే కుడివక్కన ఉండే చేను బందగీ పక్షాన ఉన్న రైతుదికూడాను.

బస్సు సమయమైందని బందగీ బయలుదేరాడు ; పేదవాడు, నిరాడంబర జీవి. ఎప్పుడూ పోతూ వస్తూ ఉండేవాడు గనుక, గ్రామస్థులు అతని వెంట బస్సుదగ్గరికిపోయి పంపించి రావాలనుకోలేదు. బందగీకూడా ఎప్పటిమాదిరే ప్రయాణమైనాడు.

ఊరివెలుపలికి రాగానే బస్సు చప్పుడయింది. బస్సును అందుకోవాలని చకచక నడిచాడు. బస్సు ఫర్లాంగుదూరాన. తాను రోడ్డుకు 10 గజాల దూరంవరకు వచ్చాడు. కన్నుమూసి తెరచినంతనే, పక్కనఉన్న కంచెలో నుంచి ఇద్దరు సాయుధులు పైన పడ్డారు ఒకడు కొడవలితో, రెండవవాడు గొడ్డలితో. మొదటివాడు బందగీని పట్టుకొని వంగబెట్టినాడు. రెండవవాడు నరికివేశాడు. క్షణంలో బందగీ తల, శరీరం వేరైనవి. హంతకులు మాయమైనారు.

ఆ కష్టజీవి, ఆ యువకుని ఉడుకునెత్తురు ఎంత ప్రవహించిందో తెలుసుకోవడం అవసరం. ఆ న్ని చంపిన ప్రదేశంలో ఆ నెత్తురు అరగజంలోతువరకు ఇంకిపోయింది. అంతవరకు మన్నుగడ్డకట్టి, గడ్డపారపోటుకు కూడా పగలకుండా అయింది.

ఇంతలో బస్సు వచ్చింది. అటు బస్సులోనివారు, ఇటు గ్రామప్రజలు గుమి కూడారు. ఆబాలగోపాలం కన్నీరుమున్నీరుగా ఏడ్చినారు.

జయించింది ఎవరు ? ఓడింది ఎవరు ? బందగీ జయించాడు. దేశముఖు ఓడిపోయాడు.

సంతోషించింది ఎవరు ? ఏడ్చిందెవరు ? దేశముఖు, అతనిపార్టీ సంతోషించారు. ప్రజలు, అతని కుటుంబంవారు ఏడ్చారు.

మెడపైన గొడ్డలివ్రేటు పడేవరకు బందగీ వయస్సు ముప్ఫయిసంవత్సరాలట.

కేసు నడిచింది. సాక్ష్యంలేదు. పైరవీలేదు. రెండు సంవత్సరాల తర్వాత హంతకులు విడుదలయ్యారు. ఇదంతా జరిగి మూడు సంవత్సరాలయింది.

బందగీ చావు విన్నంతనే ఇతరప్రదేశాలలో ఉన్న అతని సోదరులు వచ్చారు. అతన్ని బస్‌స్టేజి దగ్గరనే పూడ్చి, గోరీకట్టారు. గోరీ చుట్టూ చెట్లను నాటినారు.

గోరీకట్టడానికి రాళ్ళుకావలసి వచ్చినవి. ఎవరైనా రాళ్ళను ఇస్తే వారిని గూడా పట్టి చూస్తామని రైతులను బెదిరించారు. కామారెడ్డిగూడెం రైతులు భయపడలేదు. తమ బందగీ స్మారక చిహ్నానికై తమ బండ్లతో, తమఎడ్లతో అందరూ తలా ఒకరాయి తోలిపెట్టారు.

గోరీ తయారైంది. చుట్టూ చెట్లు పెరుగుతున్నవి. ప్రతి సంవత్సరం అక్కడ

ఉర్సు కూడా జరుగుతుంది. హిందువులు, ముస్లింలు సమాన ఆదరాభిమానాలతో ఉర్సులో పాల్గొని తమ ప్రియమైన నాయకుని స్మరించుకుంటారు.

హిందువులు ఏదైనా పనికై పోతున్నా, శుభకార్యాలు జరుపుకున్నా బందగీ సమాధి చుట్టూ ప్రదక్షిణం చేసి, మొక్కి వెళతారు. పోయిన పని అయి తీరుతుందని పుణ్య ముంటుందని విశ్వసించుతారు.

నేడు బందగీ [redacted]. [illegible]

అతడు దేశముఖుతో పోరాటాన్ని సాగించి ప్రజల్లో దౌర్జన్యాన్ని ఎదిరించే సాంప్రదాయాలను మొదటిసారిగా నిర్మించాడు. వాటి ఫలితంగానే నేడు ఆ ప్రాంతపు ప్రజలు ఆంధ్ర మహాసభలో చేరారు." (పేజీలు 19-25)

ఈ కథనం ప్రకారం బందగీ సాగించిన పోరాటం సుమారు 10 సంవత్సరాలు. అతని హత్యతో (1942) తాత్కాలికంగా ఆగింది. మళ్ళీ ఆంధ్ర మహాసభ, కమ్యూనిస్టు పార్టీల నాయకత్వాన 1944 నుంచి కొనసాగింది.

సమస్య వ్యక్తిగతమైనదే (పేద కుటుంబాల ఆస్తి పంపకం). అయినా ఫ్యూడల్ దోపిడీ దౌర్జన్యాలు, అధికార తత్వంతో దీనికి అవినాభావ సంబంధం ఉంది.

1) అందరికన్న పెద్దవాడు (అబ్బాస్ అలీ) దేశముఖు ఏజెంటుగా మారడమే తడవుగా, దేశముఖు సాంప్రదాయసిద్ధమైన ఆస్తి పంపకపు పద్ధతిని తారుమారుచేసి తన ఆశ్రితునికి అనుకూలంగా మార్చడానికి ప్రయత్నించాడు.

2) బందగీ దానిని వ్యతిరేకించి కోర్టుకెక్కాడు. దేశముఖు అండదండలుగల అన్న (అబ్బాస్ అలీ)తో ప్రత్యక్షంగా ఢీకొనడం ఆచరణయోగ్యంకాదు. ఇరుపక్షాల బలాబలాల మధ్యనున్న అసమానతే దీనికి కారణం. ఫలితంగా కోర్టుకెక్కాడు. కేసులో గెలిచాడు.

3) మళ్ళీ తగాదా ప్రారంభమైంది. ఈసారి బందగీ గ్రామప్రజలందరినీ ఐక్యపరిచాడు. వీరిలో ధనిక రైతులుకూడా ఉన్నారు. అప్పటికి గ్రామంలో భూస్వాములు లేరు. ప్రజలంతా సహాయ సానుభూతులందజేశారేగాని కార్యాచరణకు పూనుకోలేదు. మరే ఇతర సమస్యలపై పోరాటాలు లేవు. కోర్టులద్వారా లీగల్ పోరాటమే ప్రధాన రూపమైంది. అయినా అతడు నాయకుడై ముందుకు వచ్చాడు. ఈ మేరకు ఇది పేద రైతు నాయకత్వమే. ఇతనిది కష్టజీవి జీవితం. రైతు జీవితమేగాని తిరుగుబోతు (లంపెన్) జీవితం కాదు.

4) దేశముఖు, అతని ఏజెంట్లు అధికారులను కూడగట్టుకొని పైరవీని (లిటిగేషన్‌ని) తారుమారుచేసి తమకనుకూలమైన తీర్పును తెచ్చుకోలేకపోయారు. వారిని వ్యతిరేకించే పేదరైతుకు న్యాయం కలగడం ఆశ్చర్యకరమే అయినా జరిగినమాట వాస్తవం. తమ

వైపుననే తీర్పువస్తుందని దేశముఖు చివరిక్షణందాకా నమ్ముకొని కూర్చోవచ్చును.

5) ఆ కాలంలో కామారెడ్డిగూడెం, దేవరుప్పుల గ్రామంలోని శివారు పల్లె. అయినా సుమారు 200 ఇళ్ళుగల గ్రామమది. 1941లో జరిగిన ఎనిమిదవ ఆంధ్ర మహాసభ (చిలుకూరు) తర్వాత దేవరుప్పులలో ఒక గ్రామ సంఘం ఏర్పడినట్టు ఈ పుస్తకంలోనే మరోచోట ఉంది (పేజి ) ఆనాటికి దేశముఖుకు వ్యతిరేకంగా ఆంధ్ర మహాసభ ఆ ప్రాంతంలో ఎలాంటి కార్యక్రమాన్ని అమలుజరుపలేదు.

6) దేశముఖు దౌర్జన్యాలను వ్యతిరేకించే సమయాన హిందూ ముస్లిం విభేదాలు అడ్డం రాలేదు. అంతా ఐక్యంగా ఉన్నారు. (బందగీ వెంట మరికొన్ని ముస్లిం కుటుంబాలు ఉండేవి). రైతులు, కూలీలు ఇతనిని తమ నాయకుడని గుర్తించారు.

7) అయినా ఇతనికొక రాజకీయ దృక్పథం లేదు. ప్రజలకు సంఘ నిర్మాణం లేదు. అతనికి ఉండేదల్లా తన పోరాటం న్యాయ సమ్మతమైనదనే విశ్వాసం. హత్యకై తన ఇంటిపక్కనే జరుగుతున్న కుట్రను కూడా కనిపెట్టలేని నిర్మాణ రాహిత్యం స్పష్టంగా కనిపిస్తుంది. కోర్టులు న్యాయం కలుగజేస్తాయన్న భ్రమలు, ఓడిపోయిన శత్రువు చేతులు ముడుచుకొని కూర్చుంటాడనే ధీమా అతని హత్యకు దారితీసింది.

8) ఈ పోరాటం ఒక గ్రామానికే పరిమితమైనా, తెలంగాణాలో స్టేటు కాంగ్రెసు సత్యాగ్రహం, వందేమాతరం (విద్యార్థుల) సమ్మె జరిగిన కాలంలో కొనసాగింది. కమ్యూనిస్టు కార్యకలాపాలు, ఆంధ్ర మహాసభ నాయకత్వాన ప్రజా ఉద్యమం ప్రారంభం కావటానికి పూర్వమే బందగీని హత్యచేశారు.

ఈ విధంగా కామారెడ్డి గూడెంలో బందగీ నాయకత్వాన జరిగిన పోరాటం 1944లో ఆంధ్ర మహాసభ, కమ్యూనిస్టు పార్టీల ఆధ్వర్యాన జరిగిన సుదీర్ఘమైన పోరాటానికి నాందీ ప్రస్తావన అయింది. పోరాటాలు విఫలమయినప్పటికీ అవి రాబోయే పోరాటాల విజయానికి సోపానాలు కాగలవని ఈ అనుభవాలు నిరూపిస్తున్నాయి.

## 9. గోండుల తిరుగుబాటు

ఆదిలాబాదు జిల్లాలో అడవి ప్రాంతాలు హెచ్చుగా ఉన్నాయి. ఇచ్చట గోండులు అను గిరిజనులు నివసిస్తారు. వారి జీవనాధారానికి అడవిఫలసాయం మాత్రమే ఆధారం కాదు. అడవిని నరికి భూమిని సాగుచేసి పండిన పంటతో జీవించేవారు. ఈ విధంగా వ్యవసాయంతోబాటు అడవి ఫలసాయాన్ని పోగుచేస్తూ జీవితాన్ని గడిపేవారు.

అడవులను క్రమబద్ధం చేయాలనే చట్టాలు ఆనాడేకాదు, ఈనాడు కూడా గిరిజనుల

జీవిత విధానానికి గొడ్డలిపెట్టు అయినవి. రిజర్వు అడవుల చట్టాలు గోండుల (ఇతర గిరిజనులకు కూడా) పాలిట మృత్యుదేవతలైనవి.

మైదాన ప్రాంతాలకు సంబంధించిన భూస్వాములు కొంత అడవి ప్రాంతాన్ని పట్టా చేయించుకున్నారు. దానిలో గోండులు పోడుకొట్టి సాగుచేసిన భూమి కూడా ఉన్నది. ఈ భూమిపై గోండులకు పట్టాలివ్వటానికి మారుగా, భూస్వాములకివ్వటంతో గోండు రైతులు కౌలుదార్లయినారు. వారు స్వేచ్ఛగా అనుభవిస్తున్న అడవి ఫలసాయం భూస్వాముల వశమైపోయింది.

మైదాన ప్రాంతాలనుండి వర్తకులు, ధనిక రైతులు ఈ ప్రాంతాలకు వచ్చి వడ్డీ వ్యాపారంచేసి, భూములను చౌకధరలకు కొని, భూస్వాములయినారు. వారివెంట వచ్చిన వారు చిన్న రైతులయినారు. వీరిరాకతో గోండులు తమ భూములను (పోడుసాగు) వదులుకోవలసి వచ్చింది. దీని ఫలితంగా గిరిజనులలో కొందరు వ్యవసాయకూలీలై పోయినారు.

సరిహద్దున ఉన్న మహారాష్ట్రనుంచి వేరే తెగల గిరిజనులు ఈ ప్రాంతం వలస వచ్చినారు. వారు అడవి ఫలసాయాన్ని ఉపయోగించటంతోపాటు, అడవిని నరికి భూమిని సాగుచేయటం మొదలుపెట్టినారు. గోండులు పోడుసాగుచేసి వదిలివేసిన భూమిని స్వాధీనం చేసుకోసాగినారు. దీనిఫలితంగా ఈ ప్రాంతంలో నివసించే గోండులు వాటిని వదిలివేయవలసివచ్చింది.

ఈ ప్రాంతంలో పెద్దపరిశ్రమలు కూడా నెలకొన్నవి. సిరిపూర్‌లో పేపరుమిల్లు 1938 లో ఏర్పడింది. దీనితో విశాలమైన అడవి ప్రాంతం పరిశ్రమల స్వాధీనంలోకి వచ్చింది. గోండులు అడవి కూలీలై, ఫ్యాక్టరీ కూలీలైపోయారు. దీనివలన వీరి జీవితం మెరుగుపడలేదు. కాగా ఉన్న వ్యవసాయం క్షీణించింది. చాలామంది భూమిని కూడా కోల్పోయారు.

గోండులు ఈ ప్రాంతంలో అనాదిగా నివసిస్తున్నారు. ఒకానొక కాలంలో వారి రాజ్యాలు ఉన్నాయి కూడా. ఫ్యూడల్ బానిస రాజ్యాలలాగా సైనిక రాజ్యాలు కావివి. భక్తి విశ్వాసాలపై ఆధారపడిన గిరిజన రాజ్యాలు. తమకు పూర్వం ఒక రాజ్యం ఉండిన దనీ, ఆ రాజ్యం లేకున్నా కనీసం అంతవరకూ అడవిలో అనుభవించుతున్న స్వేచ్ఛ కూడా గోండులు కానివారి వత్తిడివలన నశించిపోతున్నదనీ వారు భావించసాగారు. ఇలాంటి భావాలు ఆంధ్రదేశపు గిరిజనుల్లో ఏదో మేరకు ఉన్నాయి కూడా. ఈశాన్య ప్రాంతపు గిరిజనులు స్వాతంత్ర్యం, స్వయం నిర్ణయ హక్కుకోసం సాగిస్తున్న పోరాటం అందరికీ తెలిసినదే.

ఈ పరిణామాలవలన గోండుల్లో అసంతృప్తి పెరిగింది. పోలీసులు చట్ట ప్రకారం అడవిని కాపాడాలని వారిని వేధించారు. భూస్వాములకు వారిని అణచిపెట్టి దోచుకోవటంలో తోడ్పడినారు. అడవి అధికారుల లంచగొండితనానికి హద్దు ఉండదుకదా ! గోండులు భూములు కోల్పోవటమేగాక, బహుముఖ దోపిడీతో విసుగెత్తిపోయి తిరుగుబాటుకు సిద్ధపడినారు.

ఆసిఫాబాదు తాలుకాలో బాబెఝరీ ప్రాంతం తిరుగుబాటుకు కేంద్రమైనది. భూమికోసం, స్వేచ్ఛకోసం వారు చేసిన తిరుగుబాటును అణచటానికి శాంతిభద్రతల పేరుతో పోలీసులు ప్రత్యక్షమయ్యారు. గోండులు తిరుగబడ్డారు ; పోలీసులను అక్కడి నుంచి తరిమివేశారు. కొన్నాళ్ళ తర్వాత హెచ్చుబలంతో వచ్చి పోలీసులు వారిపై కాల్పులు సాగించారు. ఆ సందర్భంలోనే కొమరం భీము చనిపోయాడు. కాల్పులతో సంతృప్తి పడక, గోండులను స్త్రీ పురుషులనే విచక్షణలేక తీవ్రంగా హింసించారు. ఈ విధంగా గోండుల తిరుగుబాటును 1940లో ప్రభుత్వం అణచివేసింది. నిజాం ప్రభుత్వం ఈ వార్తను వెంటనే బయటికి రానివ్వలేదు. కొన్నాళ్ళ తర్వాతనే పత్రికల్లో ఈ వార్త ప్రచురింపబడినది. తర్వాత కాలంలో ప్రభుత్వం గోండుల స్థితిగతులను విచారణచేసి వారి అసంతృప్తిపై నీళ్ళు చల్లటానికి సుమారు లక్ష ఎకరాల భూమిని రిజర్వు అడవి నుంచి విడదీసి వారికి పట్టాలిచ్చింది. విచారణ చేసింది హెమింద్రాఫ్ అనే జర్మన్ మానవ శాస్త్రజ్ఞుడు (ఆంత్రోపాలజిస్టు). విచారణకు సంబంధించిన వివరాలు ఆయన రచించిన 'ట్రైబల్ హైదరాబాదు' అనే పుస్తకంలో ఉన్నాయి.

కొమరం భీము గోండులందరికీ సాంప్రదాయకంగా ఉన్న పెద్ద నాయకుడు కాకున్నా స్థానిక నాయకుడే. అతడు తన ప్రాంతంలోని వారిని సమీకరించి ఐక్యం చేశాడు. సంఘర్షణ సమయంలో వారు విల్లంబులను ఉపయోగించారు. ఐక్యతతో కూడిన ప్రతిఘటనముందు పోలీసులు నిలువలేకపోయారు. తర్వాత హెచ్చుబలంతో వచ్చి వారి ప్రతిఘటనను అణచివేశారు.

గోండులు కానివారిని ప్రతిఘటించక, నేరుగా పోలీసులపై తిరుగుబాటు చేయటం దీనిలోని ప్రత్యేకత. అనేక కారణాలవలన ఏర్పడిన అసంతృప్తితోబాటు ఏదో మేరకు ఉన్న రాజ్యకాంక్ష కూడా దీనికి దారితీసింది.

ఏది ఎట్లున్నా ఈ తిరుగుబాటు ఆనాటి ప్రభుత్వానికి కనువిప్పు కలిగించేదేకాని, ఆంధ్ర మహాసభ నాయకులకు, వారిలోని "అతివాదు"లకు మాత్రం చీమకుట్టినట్టుగానైనా లేదు. వారంతా గోండుల సమస్యతో దూరంగానే ఉన్నారు.

# ముగింపు

ఇక్కడ ఉదహరించిన పోరాటాలు ఆ కాలంలో సాగినవాటిలో కొన్నిమాత్రమే. ఇవి ఫ్యూడల్ వ్యవస్థ నగ్న స్వరూపంలో అమలుజరిగిన జాగీరు, మక్తా ప్రాంతాలలోనే కాక ప్రభుత్వం కొత్తగా ప్రవేశపెట్టిన ఫ్యూడల్ భూస్వామ్య వ్యవస్థకు వ్యతిరేకంగా కూడా సాగినవి. ఈ విధంగా ప్రభుత్వం ప్రవేశపెట్టిన మార్పులవలన రైతాంగానికి ఫ్యూడల్ దోపిడీ భారం తగ్గలేదని, కాగా మరో రూపంలో కొనసాగిందనీ స్పష్టమవుతున్నది.

జాగీరు, మక్తా గ్రామాలలో సర్వే సెటిల్మెంటునుంచి వెట్టిచాకిరీ అక్రమ వసూళ్ళవరకు అన్నీ సమస్యలే. వీటికి వ్యతిరేకంగా ప్రారంభమైన పోరాటాలు ముందు విప్లవాత్మకంగానూ, తిరుగుబాటు స్వరూపంలోనూ సాగినవి. అన్ని వర్గాల రైతాంగం, వ్యవసాయ కూలీలు, చేతివృత్తులవారు ఐక్యమైనారు. తరచుగా చిన్న భూస్వాములే నాయకత్వం వహించారు. ప్రజా వెల్లువ తగ్గగానే ఉద్యమం కోర్టులచుట్టూ నడిచింది.

ఇదేవిధంగా ఫ్యూడల్ భూస్వామ్య వ్యవస్థ ఉన్నచోట కౌలుదార్ల పోరాటాలు, అన్యాక్రాంత భూమికోసం, అక్రమ పన్నులు ఇతరదౌర్జన్యాలకు వ్యతిరేకంగా పోరాటాలు నడిచినవి. వీటికిగూడా చిన్న భూస్వాములే నాయకత్వం వహించారు. ఇవిగూడా కోర్టుల చుట్టూ నడిచినవి.

ఈ పోరాటాలు నడిపిన నాయకులకు వ్యక్తిగతమైన విశ్వాసాలు (గాంధేయ భావాలు మొ॥) ఉన్నప్పటికీ, ఉద్యమానికి ఏ సిద్ధాంత నిర్మాణ పునాదీ లేదు. ఆ కాలంలో తెలంగాణాలో ప్రజలను నడిపించగల రాజకీయ పార్టీలు, ప్రజా సంఘాలు ఏర్పడలేదు. గ్రామీణ ప్రజలు ఏ గ్రామానికాగ్రామంలోనూ, ఆనుకొని ఉన్న కొన్ని గ్రామాల సముదాయంలోనూ ఐక్యమై పోరాడినారు. ఫ్యూడల్ భూస్వాములు ప్రభుత్వ సహాయంతో కొన్నిటిని త్వరగా అణచివేయగలిగారు. మరికొన్ని కొంతకాలందాకా కొనసాగినవి.

పోరాటాలు దెబ్బతిని ఏమిచేయాలో తెలియని స్థితిలో ప్రజలు భూస్వాములని చంపివేయటం గమనించదగిన అంశం. వారిలో సంఘటిత శక్తిపై విశ్వాసం ఏర్పడిన పోరాటపు మొదటిరోజుల్లో వారీ చర్యలకు పూనుకోలేదు. ఈ విధంగా ఆ దశలో దీని అవసరం ఏర్పడలేదు. కాని సంఘటితశక్తి దెబ్బతిని, లీగల్ పోరాటాలలో నీరసపడి, ఓడిపోయి, నిరాశానిస్పృహలకు లోనై ఉన్న తరుణంలోనే ఈ హత్యలు జరిగినవి. హత్యలు జరిగినవెంటనే దానికి బాధ్యులైనవారు అరెస్టయినారు, కేసులు నడిచినవి,

శిక్షలుపడినవి. శిక్షాకాలం పూర్తిచేసుకున్న తర్వాతనే వారు జైలునుంచి విడుదలై వచ్చారు. వారికోసం ఎలాంటి ప్రజాందోళనాలేదు. ఏసంస్థలూ వారిని ఆదుకోలేదు.

వీటిని అప్రయత్నంగా నడిచిన (Spontaneous) పోరాటాలని నిర్వచించ వచ్చును. వీటికి స్పష్టమైన, నిర్మాణయుతమైన నాయకత్వం లేదు, సిద్ధాంతం లేదు. విప్లవ సిద్ధాంతం, విప్లవ నిర్మాణమటుంచి, సంస్కరణవాద సిద్ధాంతాలూ నిర్మాణాలూ కూడా ఈ పోరాటాలకు లేవు ఉన్నదంతా స్థానికమైనది. ప్రజలనుంచి పుట్టుకొని వచ్చి కొద్దికాలంలోనే అదృశ్యమైపోయినవి.

మునగాల పరగణాలో సాగిన పోరాటం ఈ పోరాటాలకు భిన్నమైనది. దానికి రాష్ట్రస్థాయిలో రైతుసంఘ నిర్మాణమూ, నాయకత్వమూ ఉన్నాయి. కొద్దికాలం గడచిన తర్వాత విప్లవపార్టీ అయిన కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన్ని అందించగలిగింది. ఈవిధంగా దీనికి విప్లవ సిద్ధాంత పునాదులు కూడా ఏర్పడినాయి. తమ సంఘటిత శక్తిపైనా, నాయకత్వంపైనా విశ్వాసమున్న ప్రజలు జమీందారునూ, అతని ఏజెంట్లనూ హత్యచేయటం అవసరమని భావించలేదు. సంఘటిత శక్తితోనే తమ హక్కులను సాధించుకోవాలని కోరుకున్నారు, పోరాటంచేశారు. కమ్యూనిస్టులతో సహా తక్కిన నాయకులంతా పోరాటాన్ని లీగల్ మార్గాన పట్టించి దానినొక సంస్కరణవాదఉద్యమంగా మార్చినారు. విప్లవ సిద్ధాంత పునాదులను బలహీనపరిచి, గాంధేయభావాలను ప్రజలపై రుద్దడానికి ప్రయత్నించారు.

బందగీ సాగించిన పోరాటం ఈకోవకు చెందదు. ఫ్యూడల్ భూస్వామి దౌర్జన్యానికి వ్యతిరేకంగా అతడు సాగించిన పోరాటానికి స్థానిక ప్రజల అండదండలున్నప్పటికీ, వారు దానిలో పాల్గొనలేదు. అతను సాగించింది లీగల్ పోరాటం. ఫ్యూడల్ భూస్వామి తన అనుచరులతో సహా ఈ లీగల్ పోరాటంలో ఓడిపోయిన సమయంలోనే అతనిని చంపించినాడు. ఓటమికి హత్యకు అన్ని సందర్భాల్లో సంబంధం ఉంటూ వచ్చింది. భేదమల్లా కొన్ని సందర్భాల్లో రైతులు భూస్వామిని చంపినారు. వేరు సందర్భంలో ఫ్యూడల్ భూస్వామి పేదరైతును చంపినాడు.

ఈ పోరాటాలన్నీ తర్వాతకాలంలో కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంలో నడిచిన తెలంగాణా విప్లవోద్యమానికి భూమికగా పనిచేసినవి. ఏదారీతెన్నూలేని రైతాంగం అనేక కష్టనష్టాలకోర్చి సాగించిన పోరాటాలు వృధాకాలేదు. తమ అనుభవాల నుంచి గుణపాఠాలు నేర్చుకొని తర్వాత కాలంలో నిర్మాణయుతమైన విప్లవోద్యమానికి పూనుకున్నారు. కమ్యూనిస్టులు వారికి నాయకత్వాన్ని అందించినారు. ఈ విధంగా ఈ పోరాటాలు ప్రాధాన్యతను సంతరించుకున్నాయి.

# 4. రాజకీయ సంస్కరణోద్యమాలు

## 1. ఆంధ్రోద్యమం

తెలంగాణాలో ఆంధ్రోద్యమం పరిమితమైన సాంస్కృతికోద్యమంగా ప్రారంభమై క్రమంగా విప్లవోద్యమంగా రూపొందినది. ఇలాంటి పరిణామానికి ఆనాటి ప్రత్యేక పరిస్థితులు తోడ్పడినవి. కొన్ని ఇతరదేశాల్లో కూడా ఫ్యూడల్ వ్యతిరేక విప్లవోద్యమాలు సాంస్కృతిక ఉద్యమాల రూపంలో ప్రారంభమైన ఉదాహరణలు ఉన్నాయి.

ఆకాలంలో హైదరాబాదు నగరంలోనూ, సంస్థానంలోనూ తెలుగువారి సంఖ్య హెచ్చుగా ఉన్నప్పటికీ రాజకీయ, సాంఘిక జీవితంలో మహారాష్ట్రుల ప్రాబల్యమే ఉండేది. వారిలో వామన్ నాయక్ ముఖ్యులు. ఈయన జాగీర్దారు; అబ్కారీ కంట్రాక్టరు. సంపన్నుడు. దానధర్మాలు చేసేవాడు. వివేకవర్ధనీ ఎడ్యుకేషనల్ సొసైటీ వ్యవస్థాపకుల్లో ముఖ్యులు. సనాతన ధర్మవాది. కొంతకాలందాకా ఆంధ్రోద్యమ కార్యకలాపాల్లో కూడా పాల్గొన్నాడు.

శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషానిలయం (హైదరాబాదు) రాజరాజనరేంద్ర ఆంధ్ర భాషానిలయం (హనుమకొండ) లాంటి గ్రంథాలయాలను స్థాపించి నిర్వహించటం తప్ప ఆంధ్రులు స్వయంగా సాగించిన ప్రజాహిత కార్యకలాపాలు లేవు. అలాంటి సమయంలో హైదరాబాదు నగరంలో సమావేశమైన ఒక బహిరంగసభలో ఆంధ్రులకు జరిగిన అవమానం ఆంధ్రోద్యమానికి నాంది-ప్రస్తావన అయింది.

కీ॥ శే॥ మాడపాటి హనుమంతరావుగారు ఈ సంఘటనను ఈవిధంగా పేర్కొన్నారు.

"11, 12 నవంబరు 1922 తేదీలలో హైదరాబాదు పట్టణమున నిజాం రాష్ట్ర సంస్కార మహాసభ సమావేశమయ్యెను. దానికి విఖ్యాత చరిత్రుడును మహిళా విశ్వవిద్యాలయ స్థాపకుడునగు కర్వేపండితుడు అగ్రాసనాధిపత్యము వహించెను. వారి అధ్యక్షోపన్యాసములో చాలాభాగము మహారాష్ట్రములోనూ, కొంత ఇంగ్లీషులోను ఉండెను. ఇది ఆంధ్రులగు కొందరికి మనస్తాపకారణమైనది. రెండు దినములు అనేక తీర్మానములు అంగీకరింపబడినవి. వానిపైన జరిగిన ఉపన్యాసములు ఇంగ్లీషులోను, ఉర్దూలోనూ,

మహారాష్ట్రములోను ఉండెను. నగరములోని సుప్రసిద్ధ న్యాయవాది శ్రీ ఆలంపల్లి వేంకట రామారావుగారు ఒక తీర్మానముపైన తెలుగులో నుపన్యసించ నారంభించగా సభాసదులు-ముఖ్యముగా మహారాష్ట్రులు-విననొల్లక చప్పట్లు చరిచి ఉపన్యాసకుడు ప్రసంగమునాపి కూర్చుండునట్లు చేసిరి! తెలంగాణములోని ప్రధాన నగరమున, ఆంధ్రులు బహుళ సంఖ్యాకులుగానున్న రాజధానీ నగరమున, ఆంధ్రభాషలో నుపన్యాసము జరుగుట అసంభవమగుట సభలోనున్న పలువురాంధ్రులను దుఃఖితుల జేసెను. సభాకార్యములు పూర్తి కాకముందే వారు వెడలిపోయిరి!

"ఆనాటి రాత్రియే ఆంధ్రోద్యమము నారంభించు సంకల్పముతో ఆంధ్రజనసంఘ మనునది స్థాపింపబడెను." (తెలంగాణా ఆంధ్రోద్యమము-మొదటిభాగము-పేజి 17)

ఈ సంఘటనలో కొన్ని అంశాలు స్పష్టమవుతున్నవి. 1) సంఘసంస్కార సభ మహారాష్ట్రులకు సంబంధించినదేకాదు. హైదరాబాదు నగరవాసులంతా దానిలో పాల్గొన్నారు. ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటకులతోపాటు నగరంలోని ఇతరులు కూడా ఉన్నారు. ముస్లింలు, క్రిస్టియన్లు పాల్గొనకపోవచ్చును. అయినా మహాసభను మహారాష్ట్రుల మహాసభ మాదిరిగా జరిపేశారు.

2) ఆంధ్రుడు తెలుగులో మాట్లాడేసమయాన అవహేళన చేసినవారిని మహాసభ నిర్వాహకులు ఎందుకు మందలించలేదో, తర్వాతనైనా ఎందుకు వివరించలేదో తెలియదు.

3) ఆ న్యాయవాది ఉర్దూలో మాట్లాడితే అభ్యంతరంలేకపోయేది. కానీ తెలుగులో మాట్లాడినందువలన అవహేళనపాలు కావలసివచ్చింది. నగరంలో ఆంధ్రులు ఎంత దయనీయస్థితిలో ఉండేవారో దీనివలన స్పష్టమవుతున్నది.

4) మహాసభ ముగియగానే కొద్దిమందైనా ఆంధ్రులు సమావేశమయినారంటే, వారిలోని సంచలనాన్ని, ప్రాథమికదశలో ఉన్న వారి జాతీయ చైతన్యాన్ని స్పష్టం చేస్తున్నది.

5) సర్కారు రాయలసీమ జిల్లాల్లో ఆంధ్రోద్యమం 1912 లో ప్రారంభమై ఒక స్వరూపమందుకున్న కాలమది.

6) 1922వ సంవత్సరం బ్రిటిష్ ఇండియాలోని ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటక ప్రాంతాల్లో ఉత్తరహిందూస్థానంలో కాంగ్రెసు నాయకత్వాన బ్రిటిష్ వ్యతిరేక జాతీయోద్యమం సాగుతున్న కాలం. ప్రజలు పెద్దఎత్తున దీనిలో పాల్గొన్నారు. దాని ప్రభావం గాఢ నిద్రావస్థలోఉన్న నిజాంసంస్థాన ఆంధ్రులపైన ముఖ్యంగా నగరంలోని వారిపైన ఉండటము యాదృచ్ఛికమేమీకాదు.

మహాసభ పూర్తి అయిన రోజుననే (12-11-21) రాత్రి 8 గంటలకు

పదకొండుమంది ఆంధ్రులు సమావేశమై "ఆంధ్ర జనసంఘాన్ని" స్థాపించారు. వారు : 1) కీ.శే. టేకుమాల రంగారావుగారు, 2) మిట్టా లక్ష్మినరస్సయ్యగారు, 3) ఆదిరాజు వీరభద్రరావుగారు, 4) నడింపల్లి జానకిరామయ్యగారు, 5) మందుముల నరసింగరావుగారు, 6) బూర్గుల రామకృష్ణారావుగారు, 7) కొమ్మవరపు సుబ్బారావుగారు, 8) బూర్గుల నరసింగరావుగారు, 9) కీ.శే. డా॥ పందిటి రామస్వామినాయుడుగారు, 10) బోయినేపల్లి వేంకట రామారావుగారు, 11) మాడపాటి హనుమంతరావుగారు.

(పై పుస్తకం - పేజి-18).

(పుస్తకంలో అడ్రసులతోపాటు వారి వృత్తులనుకూడా ఉదహరించారు.)

ఆరోజే మహాసభలో అవమానితుడైన ఆలంపల్లి వేంకట రామారావుగారు ఈ సమావేశానికి ఎందుకు రాలేదో మాడపాటివారు స్పష్టంచేయలేదు. హాజరైన వారిలో కొందరు డాక్టర్లు ఇతర మేధావులేగాక, ఫ్యూడల్ వర్గాలనుంచే వచ్చిన లాయర్లున్నారు. బూర్గుల రామకృష్ణారావు, మందుముల నరసింగరావు ఈ కోవకు చెందినవారే. తర్వాత కాలంలో మితవాద రాజకీయాలకు నాయకత్వం వహించింది వీరే.

ఆ సందర్భంలో వారు నాలుగు నియమాలను అంగీకరించారు అవి :

"1) ఈ సంఘమునకు "నిజాం రాష్ట్రాంధ్ర జనసంఘము" అని పేరు.

2) నిజాం రాష్ట్రమునందలి ఆంధ్రులయందు పరస్పర సహానుభూతి కలిగించి వారి అభివృద్ధికై ప్రయత్నించుట ఈ సంఘముయొక్క ఉద్దేశ్యము.

3) ఈ రాజ్యములోని ఆంధ్రులకొరకు సంఘములను, సంస్థలను స్థాపించుట, ఉన్నవానికి సహాయము చేయుట, ఉపన్యాస సభలను సమావేశపరచుట మున్నగు కార్యములవలన పై ఉద్దేశ్యము నెరవేర్పబడును.

4) ఈ రాజ్యములోని ప్రతి ఆంధ్ర వ్యక్తియు పదునెనిమిది సంవత్సరముల కంటె మించిన వయస్సు కలిగి, చదువను వ్రాయను నేర్చియున్నచో ఈ సంఘమున సభాసదుడు కావచ్చును." (పై పుస్తకం - పేజి-21)

వీటిలోని ప్రధానాంశములు మూడు :

1) "ఆంధ్రులు" అనే శబ్దాన్ని ఉపయోగించారు. ఎంతబలహీనంగా ఉన్నప్పటికీ ఇది వారిలోని ఆంధ్ర జాతీయ చైతన్యానికి నిదర్శనం.

2) ఆంధ్రులను ఐక్యపరచాలనే ఆకాంక్షను ప్రదర్శించారు.

3) స్త్రీ పురుష భేదం లేకుండా 18 సంవత్సరాలకు మించిన వయస్సుగల వారందరికీ సభ్యత్వం ఉండాలని నిర్ణయించారు. ఇది ప్రజాతంత్రమైనఅంశం. చదువను,

వ్రాయను నేర్చియున్న వారికే పరిమితమై ఉండటంవలన అసంఖ్యాకంగాఉన్న చదువురాని వారికి సంస్థను అందుబాటులో లేకుండా చేశారు.

వ్యవస్థాపకులకు ఆంధ్రజాతి, ఆంధ్రులను ఐక్యపరిచే కార్యక్రమం మొదలగు అంశాలపై అస్పష్టత ఉండేదని క్రమంగా బయటపడింది. అయినా ఆంధ్ర ఫ్యూడల్ వర్గాలలో జాతీయ భావాలూ, విద్యాధికులలో ప్రజాతంత్ర భావాలు ఏర్పడినట్లు దీని వలన స్పష్టమవుతున్నది. సర్కారు, రాయలసీమ జిల్లాలలో ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం కోసం సాగుతున్న ఉద్యమప్రభావం కూడా వీరిపై ఉండవచ్చును. దీనిలో జమీందారులు కూడా చేరారు. మాడపాటి హనుమంతరావుగారు కృష్ణాజిల్లా సరిహద్దుల్లో ఉన్న ఎర్రుపాలెం (మధిర తాలూకా) నివాసి. వారిపై ఈ ఉద్యమ ప్రభావం కొంతమేరకైనా ఉంటుంది.

ఈ స్థితిలో ముందుకు సాగింది మితవాదుల కృషి. అయినా వారంతా దీనిని "ముల్కీ"లకే (సంస్థాన నివాసులు) పరిమితం చేయాలని సంకల్పించినట్టు ఈ క్రింది మాటలు స్పష్టం చేస్తున్నవి.

"పై నియమములనుబట్టి సంఘ సభ్యత్వము నిజాము రాష్ట్రవాసులగువారి వరకు మాత్రమే పరిమితముగానుంచవలయునని అప్పటి ముఖ్య కార్యకర్తలగువారు భావించియుండినట్లు ఎవరికైనను స్ఫురింపక మానదు. ఆ కాలమునను హైదరాబాదు నగరమునందు తాత్కాలికముగ నివసించియున్నవారు నిజాం రాష్ట్రేతరులగునాంధ్రులు కొందరుండిరనుట నిస్సంశయము. అట్టివారు ప్రభుత్వోద్యోగములందును, ఇతర వృత్తులందును ఉండియుందురు. అట్టివారు ఈ సంఘమున చేరలేదని తోచుచున్నది. ఇందునకు పైన వివరించబడిన నియమముల పరిమిత స్వభావమే కారణమని చెప్పవలయును."

(పేజి - 23-24, పై పుస్తకం)

ఆ సందర్భంలోనే ఎన్నుకోబడిన కార్య నిర్వాహక వర్గము (ఎగ్జిక్యూటివ్)లో 15మంది సభ్యులుండిరి. వారిలో ఫ్యూడల్ వర్గానికి చెందిన లాయర్లు ఇతర విద్యావంతులతోపాటు సికిందరాబాదుకు చెందిన వర్తకులొకరు ఉండిరి. ఆ కాలంలో సికిందరాబాదు బ్రిటిషు ఆధిపత్యములోఉన్న కంటోన్మెంటు. అయినా వర్తకులు ఒక జాతీయ శక్తిగా ముందుకు రావటమనేది ముఖ్యమైన పరిణామం.

కార్యనిర్వాహకవర్గంలో కార్మిక వర్గానికి, సాధారణ రైతాంగానికి ఎలాంటి ప్రాతినిధ్యం లేదు.

సరిగ్గా ఒక సంవత్సరానికి (1-4-1923) హనుమకొండలో "ఆంధ్రజనకేంద్ర సంఘము" ఏర్పడింది. "—ఆంధ్రోద్యమ కార్యములను ఎక్కువ విశాలముగను, ఎక్కువ

క్రమబద్ధముగను సాగించుటకును" కేంద్రసంఘాన్ని ఏర్పాటుచేశారు. ఈ సంవత్సర కాలంలో కొంతపని జరిగింది. సంఘం పనిచేసిన 10 సంవత్సరాల్లో ఈక్రింది సమావేశాలు జరిగినవి.

| | | | | |
|---|---|---|---|---|
| మొదటి సమావేశం | ... | హైదరాబాదు | ... | 27-7-1923 |
| రెండవ సమావేశం | ... | నల్లగొండ | ... | 21-3-1924 |
| మూడవ సమావేశం | ... | మధిర | ... | 21-2-1925 |
| నాల్గవ సమావేశం | ... | సూర్యాపేట | ... | 30-5-1928 |

అమలు జరుపవలసిన కార్యక్రమానికి సంబంధించిన ఉపనియమావళిని మొదటి సమావేశంలో అంగీకరించారు. దానిలో ఈక్రింది అంశాలున్నాయి.

1) గ్రంథాలయములను, పఠన మందిరములను, పాఠశాలలను స్థాపించుట.
2) విద్యార్థులకు సహాయము ప్రోత్సాహము చేయుట.
3) విద్వాంసులను గౌరవించుట.
4) తాళపత్ర గ్రంథములను శాసనముల ప్రతులను సంపాదించుట, పరిశోధించుట.
5) కరపత్రముల మూలముననూ, లఘుపుస్తకముల మూలముననూ, ఉపన్యాసముల మూలముననూ విజ్ఞానమును వ్యాపింపజేయుట.
6) ఆంధ్రభాషా ప్రచారమునకై పలయు ప్రయత్నములు సలుపుట. వ్యాయామములను, కళలను ప్రోత్సాహపరచుట.
7) అనాథలగువారికత్యవసరమగు సహాయముచేయుట.

వీటిని పరిశీలిస్తే, ఆంధ్రభాషా సంస్కృతికి పరిమితమైన కార్యక్రమంతోపాటు చివరిఅంశంలో జీవకారుణ్యమైన పనులు కూడా ఉన్నాయి. గ్రామ, పట్టణ ప్రజలకు సంబంధించిన ఏసమస్యలూ లేవు. తుదకు పారిశ్రామికుల అవసరాలను కూడా గుర్తించ లేదు.

ప్రతి సంవత్సరమూ ఒక సమావేశాన్ని జరిపినా మూడవ-నాల్గవ సభల మధ్య కాలంలో అలా జరుపలేకపోయారు. సమావేశానికి ప్రభుత్వఆజ్ఞ దొరకకపోవుటే దీనికి కారణం.

వేతనంతో పనిచేసే 'కార్యకర్తను నియమించటానికి రెండవ సమావేశంలో నిర్ణయించి అమలుజరిపినారు. సంస్థలకు పూర్తిసమయమిచ్చి పనిచేసే కార్యకర్తలుండాలనే దృష్టి ఆనాటినుంచే ఉంది.

రాజకీయాలు లేవని చెప్పే మితవాద రాజకీయాలు ఎలా ఉంటాయో ఈ క్రింది వాక్యాలలో చూడవచ్చును.

"...ఆంధ్ర గ్రంథాలయ పఠన మందిరముల విరివిగా స్థాపించి మాతృభాష యెడనభిమానము కల్పించి,ఆంధ్రవాఙ్మయవ్యాప్తికిని, పత్రికా పఠనమునకును, రాజధానీ నగరమునుండి జిల్లాల, తాలూకాల ప్రధాన స్థలములవరకే కాక పల్లెటూళ్ళవరకును మార్గమేర్పరచుటయు, గ్రామస్థులగు సామాన్య ప్రజలకు అచ్చటి అనుదిన జీవితము నందు ప్రభుత్వోద్యోగులవలన కలుగుచుండు కష్టములనుండి విముక్తి కలిగించుటకై శక్తికొలది యత్నించుటయు, ఉద్యమమునందు రాజకీయ లక్షణములు ఏ మాత్రము కానరాకుండునట్లు తగినంత జాగరూకతతో పనిగొనుచుండుటయు, ప్రభుత్వమువారికిని అధికారులకును కార్యకర్తలపై ఎట్టి అనుమానము కలుగకుండునట్లు వర్తించుచుండుటయు ఉద్యమముయొక్క ప్రారంభ దశలో అనివార్యమైనది." (పై పుస్తకం, పేజి-50-51)

ఆంధ్ర భాషా సంస్కృతులను ప్రోత్సహించే కార్యకలాపాలతోపాటు "గ్రామస్థులగు సామాన్య ప్రజలకు అచ్చటి అనుదిన జీవితమునందు ప్రభుత్వోద్యోగులవలన కలుగుచుండు కష్టములనుండి విముక్తి కలిగించుటకై శక్తికొలది యత్నించుటయు" అనేది ప్రభుత్వ యంత్రాంగంతో ఘర్షణపడే కార్యక్రమం. ఉద్యోగుల వెట్టిచాకిరీ, లంచాలు, దుష్ప్రవర్తనకు వ్యతిరేకంగా పనిచేయటము చిన్న విషయమేమీ కాదు. అయినా "శక్తికొలది యత్నించుట" అనే పేరుతో ప్రభుత్వ ఉన్నతాధికారులతోమాట్లాడి సర్ది వేసేవారు ఈ పెద్దలు.

గ్రామాల్లో సామాన్యప్రజలు ఉద్యోగుల వలన మాత్రమే కష్టాలు అనుభవించ లేదు. దేశముఖులు, పటేలు పట్వారీలవలన అంతకన్న ఎన్నోరెట్లు కష్టపడేవారు. ఈ భూస్వామ్యవర్గాన్ని గూర్చి వీరు మాట్లాడలేదు. నాయకత్వంలోఉన్న మితవాదులూ, వీరూ సన్నిహితులు కావడమే దీనికి కారణం.

"రాజకీయ లక్షణములు ఏమాత్రము కానరాకుండునట్లు" జాగ్రత్తపడినా ప్రభుత్వం నుంచి ఆటంకాలేమీ తప్పలేదు. ఆదినుంచీ ఈ ఉద్యమంతో సంబంధం ఉన్న బూర్గుల, మందుములవారలు కాంగ్రెసు మితవాద రాజకీయాలతో ఏదోమేరకు సంబంధం కలిగిఉండేవారు. తుదకు 1937 నాటికి, (ఆరవ మహాసభ-నిజామాబాదు)వారి హయాం లోనే ఈ సంస్థ మితవాద రాజకీయాల్లోకి దిగక తప్పలేదు.

సుమారు 8 సంవత్సరాలపాటు సాగిన కేంద్రసంఘం కార్యకలాపాలు ఈవిధంగా ఉండేవి :

1) గ్రంథాలయోద్యమం : కొన్ని ముఖ్యపట్టణాలలో గ్రంథాలయాల ఏర్పడి పనిచేసినవి. గ్రామాల్లో ఏర్పడినవే చాలాస్వల్పం. వాటిలో మూతపడినవి హెచ్చు. భూస్వాములకు ఆసక్తి లేకపోవడమేగాక, వాటి ఏర్పాటును వ్యతిరేకించేవారు.

ఎనిమిదిసంవత్సరాల కాలంలో రెండేరెండు గ్రంథాలయ మహాసభలు జరిగాయి. మధిరలో (నేటి ఖమ్మం జిల్లా) ఒకటి, సూర్యాపేటలో రెండవది. ఇవి ఆంధ్రజనకేంద్ర సంఘ సమావేశాల సందర్భంలో వరుసగా 1925, 1926 లో జరిగినవి. ఈ రెండింటికి పింగిలి వేంకటరామారెడ్డిగారే అధ్యక్షులు. వీరు పెద్ద భూస్వాములు, సంపన్నులు, రాజభక్తి పరాయణులు. రెడ్డిహాస్టలు మొదలగు సంస్థలకు విరాళాలిచ్చినవారు. గౌరవ సెషన్సు జడ్జి హోదాలో చాలాకాలం పనిచేసినారు. నిజాం వ్యతిరేక పోరాటకాలంలో మంత్రి అయినారు.

2) వర్తక సంఘాలు : వర్తకులకు ఉద్యోగులవలన కలిగే వెట్టిచాకిరీ మొదలగు బాధలను తప్పించడానికి ఏర్పడినవి. ఇతరులు కూడా ఉన్నప్పటికీ ఆ కాలపు తెలంగాణా వర్తకుల్లో వైశ్యులే హెచ్చు సంఖ్యలో ఉన్నారు. "ఆంధ్రోద్యమమారంభ మయిన కొలది దినములకే ఎట్లెట్లో వర్తకులకు ఇట్టి బాధలనుండి తప్పించుకొను ఉపాయము వెదుకవలయునని యాతురత కలిగెను. ఇట్టి ఉద్దేశ్యము తెలంగాణములో— అందును నల్లగొండ జిల్లాలో —మొట్టమొదట సూర్యాపేట వర్తకులకు కలిగినదని మాకు జ్ఞప్తికలదు" (పై పుస్తకం ; పేజీ 71–72) అని మాడపాటివారు రాశారు. ఆంధ్ర జనసంఘం ఏర్పడిన సంవత్సరానికే (డిసెంబరు 1922) ఈ సంఘం ఏర్పడటం స్థానిక వర్తకుల చైతన్యానికి నిదర్శనం. ఫిబ్రవరి 1929 లో ఆ జిల్లాలోని తిప్పర్తి గ్రామములో జరిగిన సభల సందర్భంలో 'వర్తక స్వాతంత్ర'మను చిన్న పుస్తకాన్ని విడుదలచేశారు. దీనిలో వారికిగల హక్కులను వివరించారు.

3) వెట్టి చాకిరి : ఇది ఆంధ్రోద్యమ మితవాద నాయకత్వానికి కక్కలేని మింగలేని సమస్య అయింది. తమ వైఫల్యాన్ని ఈ విధంగా చెపుతున్నారు.

"ఆంధ్రోద్యమపు ప్రథమ దశయందు గ్రామములలో వెట్టిచాకిరీ చేయుచు పలు కష్టములు అనుభవించుచుండినట్టి నోరులేని ప్రజలందు కొంత ప్రబోధము కలిగినదని చెప్పుటకు సంశయము లేదు. ఈ పని వర్తకుల విషయమున ఎంతత్వరలో లాభప్రదమై వారి కష్టముల నివారించుటలో జయముగాంచినదో, దానిలో శతాంశమైనను, పాపము, ఈ పేదవారి విషయమున కాలేదనియు, జయము కాంచలేదనియు విచారముతో ఒప్పు కొనవలసియున్నది. దీనికి కారణములు ఎక్కువ వివరముగా నుడువబనిలేదు. యథార్థ మేమనగా, వర్తకుల కష్టములు చాలాకొలది; అత్యంత పరిమితములు. కనుక వారి కష్టములు

అవలీలగా తీరగల్గినవి. వెట్టిచాకిరి వారి ఇబ్బందులు చిరకాలాగతములు. అతి విశాల ములు. అతి దీర్ఘములు. కనుకనే నేటికిని తీరలేదు. ఇంకను ఎంతోకాలమువరకు తీర జాలవు. అయినను వీరికొరకు జరిగిన కొలది సేవయు ఫలదాయకమేయైనదని చెప్ప వలయును." (పై పుస్తకము ; పేజి - 77)

వెట్టిచాకిరి సమస్యపై జరిగిన కృషి స్వల్పమే అయినా ఫలదాయకమైనదని వీరి అభిప్రాయం. మరోవైపున గ్రామీణ ప్రాంతాలవారు దీని ఫలితాన్ని అనుభవించలేక పోయారనికూడా అంగీకరించారు. పట్టణాల్లో ఉండే వర్తకులకుమాత్రమే ఈ కృషివలన ఫలితం కలిగింది. వారిలో సంపన్నులు, మధ్యతరగతివారుండుట దీనికొక కారణము. వీరంతా నగరాల్లో ఉండుటవలన వీరిపై దేశముఖులు, పటేలు పట్వారీల ఒత్తిడి చాలా స్వల్పంగానే ఉండినది. కాని ఆ రోజుల్లో గ్రామాల్లో ఉన్న వర్తకుల వెట్టిచాకిరి అంతం కాలేదు. ఫ్యూడల్ భూస్వాముల ఆధిపత్యం సాగినంతవరకూ వారూ గ్రామాల్లో వెట్టి చాకిరి బాధలు అనుభవించారు; కమ్యూనిస్టులు గ్రామీణ ప్రాంతాలకు వెళ్ళి, భూస్వాము లకు వ్యతిరేకంగా ప్రజలను సంఘటితపరచి, వెట్టిచాకిరికి వ్యతిరేకంగా పోరాటాలు నడిపి నప్పుడు వర్తకులు కూడా పోరాటంలో కలిసివచ్చి వెట్టిచాకిరీనుంచి విముక్తి పొందినారు. తర్వాతకాలంలో ఆంధ్ర మహాసభలోని మితవాదులు, కమ్యూనిస్టుల మధ్య ఏర్పడిన సంఘర్షణకు దారితీసిన సమస్యల్లో ఇదొకటి. "గ్రామాధికారులగు పటేలు పట్వారీలకును. దేశముఖు దేశపాండ్యాలకును అలవాటైపోయినది. అంతే కాదు. వారు ఆ విధముగా పని చేయుటకు బద్ధులైయున్నారనియు వారికియ్యబడు ఇనాము భూములు ఇట్టి సేవచేయుటకే యనియు అభిప్రాయమేర్పడిపోయినది. ఇందువలన అట్టి బీదవారికి కలుగుచున్న ఇబ్బం దులు నిజముగా హృదయము అనునది ఏ మూలనైనను కలవారికి దుఃఖదాయకముగా నుండక మానదు!" (పై పుస్తకము పేజి - 78-79) ఈ మాటల్లో సమస్య తీవ్రతను వారే అంగీకరించారు. కమ్యూనిస్టులు "దుఃఖించడానికి" బదులు ప్రజలను సంఘటిత పరిచి వారిపోరాటాలకు నాయకత్వము వహించారు. గ్రామీణ పేదల బాధలు "ఈనాటికి" పోలేదని గ్రంథకర్త అంగీకరిస్తున్నారంటే కాంగ్రెసు పరిపాలనలో కూడా వారికి ముక్తి కలుగలేదని స్పష్టమవుతున్నది. వారు ఇది రచించిన కాలంలో తెలంగాణా ప్రజలు పెద్దఎత్తున కాంగ్రెసు ప్రభుత్వపు పోలీసు-మిలటరీ నిర్బంధాన్ని అనుభవించారు. దీనితో బాటు వారు ప్రభుత్వ అధికారులకూ, పోలీసులకూ, మిలటరీ వారికీ పునఃస్థాపితులైన భూస్వాములకూ వెట్టిచాకిరీ చేయవలసివచ్చింది.

ఈ సమస్యపై చొరవచేసి పనిచేసింది ఆంధ్రోద్యమ మితవాద నాయకులు కాదు. ఆంధ్రోద్యమ నియమావళిలోను, ఉపనియమావళిలోనూ, ప్రారంభపు సమావేశంలోనూ

ఈ సమస్యను మాటవరుసకైనా ఉదహరించలేదు. 1922 డిసెంబరులో ఏర్పడిన సూర్యాపేట వర్తకసంఘం "ఉద్యోగుల దుస్తంత్రములను ప్రతిఘటించుట అవసరమ"ని (పేజి-72) నిశ్చయించినట్టు గ్రంథకర్త రాశారు ఈసంఘమేర్పడిన నాలుగునెలలలోనే నిజాంనవాబు తన జన్మదినోత్సవ సందర్భమున వెట్టిచాకిరీని నిషేధించారు. అయినా ఆ శాసనం అమలుజరుగలేదు. అప్పుడు ఈ సమస్యపై తీర్మానాలూ, రాయబారాలూ ప్రారంభమైనవి.

4. రైతుసంఘాలు : 1929 ఫిబ్రవరి వరకు జరిగిన ఏసభల్లోనూ రైతు సంఘాల నిర్మాణాన్ని గూర్చి చర్చకు రాలేదు. అంతకుముందేజరిగిన నల్లగొండ సభల్లో వ్యవసాయదారుల సభ జరిగింది. తిప్పర్తిలో జరిగిన సభల్లో రైతుసంఘ మేర్పడింది. దీని పరిధి ఏమిటో స్పష్టంగా ఎక్కడా చెప్పలేదు. మాడపాటి వారు వీటిని గూర్చి ఇలా రాశారు. "ఆకాలమున తిప్పర్తి, సూర్యాపేట మున్నగు కొన్నిచోట్ల రైతు సంఘములు కూడా స్థాపితములైనవి. కాని అవి ఎక్కువగా వృద్ధికిరాలేదు. అందునకు కొన్ని కారణములు కానవచ్చుచున్నవి. 1) రైతులకు గల కష్టములు, చిక్కులు అపరిమితములుగా నుండుట, 2) గ్రామములో వారికి ప్రమాణబుద్ధియు, పట్టుదలయు గల నాయకులు లేకపోవుట. (ఒకటి, రెండు రైతుసంఘములకు నాయకులయినవారు రైతులను ఎక్కువగా శ్రమపెట్టి, తాము ఈ పేరున లాభముపొందియుండుట మేమెరుగుదుము.) 3) రైతులలో చదువు వచ్చినవారు లేకయుండుట ఇత్యాదులు" (పై పుస్తకం; పేజి 145)

రైతుసంఘాలు అభివృద్ధిలోకి రాలేదని వారే అంగీకరించారు. దానికి గల కారణాలను అస్పష్టంగా చెప్పారు. వారికష్టాలు చట్టాలూ, అధికారులవలననే రాలేదు. గ్రామాల్లో తిష్ట వేసుకొనిఉన్న జాగీర్దారులు, మక్తాదారులు, దేశముఖులు, పటేలు పట్వారీల వలన వచ్చిన కష్టాలు అపారం. మితవాద నాయకులకు ఉండే సంబంధం వారితోనే. నాయకులలో చాలామంది వీరే.

ఆనాడే రైతుసంఘాలనే పేరుతో కొందరు స్వప్రయోజనాలునెరవేర్చుకొన్నారనీ, రైతులను ఇబ్బందిపెట్టారనీ దీనివలన తెలుస్తున్నది.

5. లఘుపుస్తకాలు : ఆనాటి ఆంధ్రోద్యమ నాయకులు గ్రంథాలయములతో పాటు పాఠశాలలను కూడా స్థాపించడానికి కృషిచేశారు. ప్రభుత్వం దానికి అడ్డుపడింది. కొన్ని లఘుపుస్తకములను ప్రకటించారు. వాటిపేర్లు : 1) నిజాంరాష్ట్రాంధ్రులు 2) నిజాం రాష్ట్రాంధ్రుల అభివృద్ధి మార్గములు 3) వర్తక స్వాతంత్ర్యము

4) మొహతర్పా-మగ్గప్రపన్ను 5) వెట్టిచాకిరీ, ఇవిగాక 'నిజాంరాష్ట్రపు జనపరి గణనము', "నిజాంరాష్ట్ర ప్రశంస" అనే కరపత్రాలను కూడా ప్రకటించారు.

6. బహిరంగసభలు : ఆంధ్రోద్యమ ప్రచారానికి బహిరంగ సభలను ఒక సాధనంగా ఉపయోగించుకోవాలని మితవాద నాయకులు ఆదినుంచీ ప్రయత్నించారు. కానీ ప్రభుత్వం అడ్డుపడుతూ వచ్చింది. ఆంధ్ర జన సంఘం ఏర్పాటు చేయటానికి 2 నెలలముందే రాజకీయ సభలను నిషేధించింది ; ప్రభుత్వాను మతితో జరుపాలనే నిర్బంధాన్ని ప్రవేశపెట్టింది. మాడపాటి హనుమంతరావుగారు పేర్కొన్న కొన్ని ముఖ్యమైన సభలు ఇవి :

| | |
|---|---|
| సూర్యాపేట సభలు (మొదటి) | 17, 18 ఆగస్టు 1923 |
| సూర్యాపేట సభలు (రెండవ) | 28, 29, 30 మే 1928 |
| మిర్యాలగూడెం సభలు | 28, 29, 30 జూన్ 1928 |
| నల్లగొండ సభలు | 27, 28 ఆగస్టు 1928 |
| తిప్పర్తి సభలు | 14, 15 ఫిబ్రవరి 1929 |

ఈ సభలపై మాడపాటి వారు ఈ విధంగా వ్యాఖ్యానించారు :

"పైన వివరింపబడిన గొప్ప సభలును, నల్లగొండ జిల్లాలోనే జరిగినవి. వీనివలన అచ్చటి జనసామాన్యములో-ముఖ్యముగా వర్తకులలోను, రైతులలోను —ఎక్కువ ప్రబోధము కలిగినది. ఇతర జిల్లాలలో కూడా పలుతావుల ఇట్టి సభలు జరిగినవి. ప్రభుత్వమువారు రాజకీయేతరములగు సభలను జరుపుటలో కూడ ఆటంకములు కల్గించక యుండినచో సభల మూలమున ఇంకను ఎక్కువ ప్రచారము జరిగియుండును." (పేజి-127-128 ; పైపుస్తకం)

వారు ఇతర జిల్లాలలో జరిగిన సభల పేరులనైనా ఉదహరించలేదు. అలా చేయటానికిగల కారణాలనుకూడా చెప్పలేదు. అవి ఇంత ప్రధానమైనవి కావని చెప్పవలసి ఉంటుంది. మధిరలో జరిగిన గ్రంథాలయ సభనుమాత్రం వారు వేరే సందర్భంలో పేర్కొన్నారు.

సభలు జరిగిన తీరు చూస్తే 1928 నాటికి నల్లగొండ జిల్లా ప్రజల్లో గణనీయమైన సంచలనం మాత్రమేగాక నిర్మాణ స్వరూపం కూడా కనిపిస్తుంది. 1928లో "సూర్యాపేటలో సమావేశమైన సభలు : 1) కేంద్ర సంఘ చతుర్థ సమావేశము, 2) ద్వితీయ ఆంధ్ర గ్రంథాలయ మహాసభ, 3) స్థానిక వర్తక సంఘ వార్షికోత్సవము, 4) గ్రంధాలయ వార్షికోత్సవము, 5) భజన సమాజ

వార్షికోత్సవము, 6) స్త్రీల సభ, 7) ఆంధ్ర యువక మహాసభ, 8) ఆంధ్ర సంఘ సంస్కార మహాసభ, 9) వైశ్యుల సభ "

(పై పుస్తకం ; పేజి - 115-116)

ఇతర ప్రదేశాలలో జరిగిన సభల సంఖ్య ఇంతకన్న తక్కువగాఉండినది. అయినా ఇవన్నీ విస్తృత ప్రాతిపదికపై జరిగినవి. వీటిలో ప్రజలు పాల్గొన్నారు. సూర్యాపేటలో తొమ్మిదిరకాల సభలు జరుగుటే దీనికి ఉదాహరణ.

నల్లగొండ సభలలో వ్యవసాయకులదొకటి జరిగింది. దీనితో సభల పరిధి **(scope)** పెరిగింది. అయితే దీనికి రైతులసభ అని పేరు పెట్టలేదు.

తిప్పర్తిలో (అప్పటి నల్లగొండ తాలూకా) కీ.శే. సురవరం ప్రతాపరెడ్డిగారి అధ్యక్షతన రైతుల సభ జరుగుటేకాక రైతు సంఘం ఏర్పడింది. ఇది స్థానికమైనది. కొన్ని ప్రాంతాల్లో రైతు సంఘాలేర్పడి కొంతకాలం పనిచేసి అదృశ్యమైనవి. సుదీర్ఘకాలం సాగిన బేతవోలు మఖ్తా రైతుల పోరాటం స్థానిక రైతు సంఘ నాయకత్వాన నడిచింది.

7) కార్యకర్తలపై ప్రభుత్వ దమననీతి : ఆంధ్రజన కేంద్ర సంఘం ఉద్యమ ప్రచారంకోసం కార్యకర్తల అవసరాన్ని ముందే గుర్తించింది. ప్రభుత్వోద్యోగాల్లో తమ బాధ్యతను నిర్వహిస్తూనే పనిచేసినవారు ముగ్గురు. వీరిలో ఒకరు మహిళ. వీరుగాక పూర్తి సమయమిచ్చి పనిచేసి సంస్థను బలపరిచిన వారు శ్రీ ఉన్నవ వెంకటరామయ్యగారు. వీరిని గురించి మాడపాటి గారు ఈ విధంగా వివరించినారు :

"నిజాంరాష్ట్రపు ఆంధ్రోద్యమమునకు గొప్ప గౌరవమును తెచ్చి, దానిని ఉన్నత స్థితికి తెచ్చిన ప్రచారకులలో అందరికంటె ఎక్కువగా ప్రశంసించదగిన వారు శ్రీ ఉన్నవ వెంకటరామయ్యగారు. వీరి ప్రచారపద్ధతి, పోయినచోటులందెల్ల అచ్చటివారి విశ్వాసమును గడించిన వీరివర్తనము, సంఘకార్యకర్తల హృదయములందు వీరు స్థాపించుకొనినస్థానము-ఇది అసాధారణములని చెప్పవచ్చును. గ్రామములందు పర్యటనముచేయు వట్ల, వీరు జీతముపైన పనిచేయు ఉగ్యోగియని తలంచుటకు వీలులేకుండెను. వీరు ఉద్యమ నాయకులుగాని సామాన్యులు కారను భావము ప్రజల మానసక్షేత్రములందు స్థాపితమగుచుండెను. వీరు ఇంచుమించు ఎనిమిదిసంవత్సరముల కాలము ప్రచారముసల్పిన తర్వాత మహాఘనత వహించిన నిజాము ప్రభుత్వమువారి పోలీసుశాఖ యొక్క సూచననను సరించి, విధిలేక, వీరిని ఉద్యోగము నుండి తొలగించవలసివచ్చింది. (పైపుస్తకం ; పేజి-97).

మితవాద నాయకులు లాయర్లు, డాక్టర్లు మొదలగు వృత్తులుగలవారు. వారికి తీరిక ఉండేదికాదు. ఈ కారణాన కార్యకర్తలను ఏర్పాటుచేసి పనిచేయించే వారు. సాధారణంగా కేంద్రసంఘంవైపున ఒకరే ఉండేవారు. ఆ ఒక్కరిపై కూడా ప్రభుత్వపు కన్నెర్ర. ఏలినవారిని సంతృప్తిపరచటానికి నాయకులు కార్యకర్తనే తొలగించివేశారు. కార్యకర్తలపై నిర్బంధం నేటికీ కొనసాగుతునే ఉన్నది.

వీరుగాక గంగుల శాయిరెడ్డిగారిని కూడా ఉదహరించారు. వారు తర్వాత కాలంలో కూడా పనిచేసినారు.

8) భూస్వాముల దమననీతి : జాగీర్దారులు, సంస్థానాధీశులతో సహా భూస్వాములలో కొందరు ఆంధ్రోద్యమాన్ని కొంతకాలందాకా బలపరుస్తూవచ్చినారు. అయినా ప్రారంభంనుంచీ వారిలో హెచ్చుమంది ఆంధ్రోద్యమంపై దాడిచేసినవారే. తిప్పర్తి సభల సందర్భంలో జరిగిన ఒక ఘటనను వారీవిధంగా పేర్కొన్నారు.

"తిప్పర్తి సభలు చాలా జయప్రదముగా జరిగినవి. దీనివలన ఆంధ్రోద్యమము కొంత బలపడినదనుట నిస్సంశయము. ఇచ్చటి దేశముఖుగారు "సంఘమును భంగము చేసెదన"ని ఎల్లయ్య గారిని బెదిరించిరట! తుదకు దొరవారే ఓడి పోయిరి! (పైపుస్తకం; పేజి 127)

ఎల్లయ్య గారు స్థానిక ప్రముఖవర్తకుడు. వీరిఆధ్వర్యాన సభలు జరిగినవి.

భూస్వాములు ఈ నినాదంతో తర్వాతి కాలంలో కూడా రైతులపై దాడి చేశారు. అన్ని సందర్భాల్లోనూ వారే ఓడిపోయారు.

## ఆంధ్ర మహాసభలు

1930 వరకు జరిగిన ఆంధ్రోద్యమ సభలను గూర్చి మాడపాటిగారు ఇలా రాస్తున్నారు :

"......ఇంతకుముందు తెలంగాణమునందు జరిగిన సభలు దాదాపుగా అన్నియును స్థానిక సంస్థలకుగాని, స్థానిక వ్యవహారములకుగాని సంబంధించి నవై యుండినవి. వానిలో రెండు మహాసభలు కూడా జరిగినమాట నిజమే. కాని, అవి రెండును ఆంధ్ర గ్రంథాలయ మహాసభలు మాత్రమే."

(తెలంగాణా ఆంధ్రోద్యమము ; రెండవ భాగము – పేజి–1)

కేంద్ర సంఘం ఉన్నప్పటికీ సభలూ, కార్యకలాపాలూ అన్నీ స్థానిక మైనవేనని వారే అభిప్రాయపడుతున్నారు.

"మహాసభ స్థాపించు సంకల్పాన్ని" వివరిస్తూ "అరువది లక్షలకుమించిన నిజాం రాష్ట్రాంధ్రుల కష్టసుఖములను తెలుసుకొనుటకును వారి సమిష్టి అభిప్రాయ మును నిర్మించుటకు మహాసభయొకటి అవసరమను భావము అంతకు కొన్ని సంవత్సరములకు ముందే ప్రచారముగాంచుచుండెను" అని రాశారు. చివరికి ఆ అభిప్రాయం కార్యరూపం దాల్చింది మార్చి 1930 లో. మెదకు జిల్లాలోని జోగిపేటలో 3, 4, 5 తేదీలలో మొదటి మహాసభ సమావేశమైనది. అధ్యక్షుడు సురవరం ప్రతాపరెడ్డిగారు. ఆయన అధ్యక్షోపన్యాసంలో "...సంఘ దురాచార ములను గురించియు "పర్దా" పద్ధతిని గురించియు చెప్పునప్పుడు ధర్మశాస్త్రముల యొక్కయు, ఇతర సంస్కృత గ్రంథములయొక్కయు ఉల్లేఖనములును, బాల్య వివాహ నిషేధమునకనుకూలముగానభిప్రాయమిచ్చు సందర్భమున బ్రహ్మచర్య ధర్మనిర్వహణము, ఆశ్రమ ధర్మపాలనమునెడనభిమాన ప్రకటనమును, ఇత్యాది లక్షణములు..."ఉన్నట్లు మాడపాటివారు రాస్తున్నారు. (పైపుస్తకం; పేజి-6-7) ఈ మహాసభలో 32 తీర్మానాలు చేశారు. దాదాపు అన్నీ సంఘ సంస్కరణలు, ప్రైవేటు పాఠశాలలు, పరిపాలనా వ్యవహారాలలో మాతృభాషనుఉపయోగించటం ఇలాంటి సమస్యలకు సంబంధించినవే. అయినా పౌరసత్వాలు, రైతు సంఘాలు, వెట్టిచాకిరిపైకూడా తీర్మానాలు చేశారు. అవి ఈ విధంగా ఉన్నవి :

"బహిరంగ సభల విషయమున ప్రభుత్వంవారు జారీచేసిన 53 నిషాన్ (నెంబరు) 17 వై 1339 ఫ. గష్తి ప్రజలయొక్క నైసర్గికములగు హక్కులకు భంగము కలిగించుట చేతను అభివృద్ధికి ఆటంకముగానుండుట చేతను ఈ గష్తిని (సర్క్యులర్) రద్దుచేయుటకు ప్రభుత్వమువారు ప్రార్థింపబడుచున్నారు."

(పై పుస్తకం ; పేజి-234-235)

మితవాద నాయకులు మొదటినుంచి చివరిదాకా "ప్రార్థించారు". కాని వారి మొరలను ప్రభుత్వం ఎప్పుడూ ఆలకించలేదు. ఆనాటి పరిస్థితుల్లో తప్పని సరి అని చెపుతారేకాని వాస్తవానికి ఇది వారి రాజకీయ వైఖరి. ఈ సర్క్యులరు రాజకీయమైనది. ప్రజల పౌరహక్కులను అణచివేసేది. ప్రజాందోళన లేకున్నా దీనిని రద్దుచేయాలని తీర్మానించటం కూడా ఆందోళనలో ఒక భాగమే.

మరొక తీర్మానంలో "నల్లగొండ జిల్లాలో కొన్ని స్థలములందు జరిగిన విధముననే దేశమునందెల్ల రైతుసంఘముల స్థాపించి వారి యోగక్షేమమునకై

తగిన విధమున యత్నించుటకు ఈ మహాసభవారు దేశములోని విద్యాధికవర్గమును ప్రార్థించుచున్నారు. (పైపుస్తకం-పేజి-238)

నల్లగొండ జిల్లాలో అప్పటికే రైతుసంఘాలేర్పడినట్టు దీనివలన స్పష్టమవుతున్నది. వాటి ప్రాధాన్యతను గుర్తించి ఇతర జిల్లాల్లో ఏర్పరచాలనే అభిప్రాయం ఈ తీర్మానంలో ప్రస్ఫుటమవుతున్నది. అయితే వీరు కోరింది "విద్యాధికవర్గాన్ని", ఆ రోజుల్లో విద్యాధికవర్గమంటే భూస్వాముల బిడ్డలు. వారికన్న సాధారణ కార్యకర్తలు ఈ పనులు బాగా చేయగలిగేవారు.

కస్టమ్సు పన్నును (కరోడ్గిరి) రద్దుచేయాలని కోరలేదు. నూలుబట్టలపైన మాత్రం రద్దుచేయాలని కోరారు. సరిహద్దుప్రాంతాల్లో ప్రజలు కస్టమ్సు పన్ను వలన అనేక ఇబ్బందులకు గురిఅయ్యేవారు. ఈ విషయం నాయకులకు తెలుసు.

బాల్యవివాహాల దురాచారాన్ని నిర్మూలించాలని ప్రవేశపెట్టిన తీర్మానాన్ని ఆమోదించారు. కాని దానికొక శాసనాన్ని చేయాలన్న సవరణ వీగిపోయింది. వామన్ నాయక్‌గారు తీర్మానానికి అనుకూలించారు. శాసనాన్ని చేయాలనే మరో తరహా సంఘ సంస్కరణవాదులు మైనారిటీలో ఉండిపోయారు. అంతేకాదు. ఆహ్వాన సంఘాధ్యక్షుడు మఖ్దాదారు, సనాతన ధర్మపరాయణుడు. సంఘ దురాచారాలను పేర్కొంటూ, సంఘ సంస్కరణలను కావాలనే ఆహ్వానసంఘ అధ్యక్షోపన్యాసాన్ని అయన తయారుచేయలేదు. కేంద్ర నాయకులు తయారు చేస్తే, దానిని చదివి వినిపించి దానిలోని అభిప్రాయాలు తమవికావని, కేంద్ర నాయకులవని బహిరంగంగా ప్రకటించారు. (పై పుస్తకం; పేజి-5, 6, 7) ఆనాటి ఆంధ్రోద్యమ నాయకత్వపు మిశ్రమ స్వభావాన్ని ఈ సంఘటన స్పష్టం చేస్తుంది. ఈ మిశ్రమంలో సనాతనవాదులైన ఫ్యూడల్ భూస్వాములూ, సంఘ సంస్కరణవాదులూ ఉండేవారు.

రాజకీయ బహిరంగసభలపై నిషేధాన్ని రద్దుచేయాలని అన్ని మహాసభల్లోనూ తీర్మానించారు. నిజాం ఫ్యూడల్ నిరంకుశప్రభుత్వం రాజ్యంచేస్తున్నప్పుడు నిషేధాలు ఉండటం సహజం. కాని నేటి "ప్రజాస్వామిక రాజ్యం"లో కూడా పోలీసు అనుమతి లేకుంటే ఏ రాజకీయ బహిరంగసభా జరుగదు.

రెండవ మహాసభ దేవరకొండలో జరిగింది (1931 లో). అధ్యక్షులు బూర్గుల రామకృష్ణారావు దీనిలో కూడా పౌరసత్వాలకోసం తీర్మానించారు. ఆంధ్రేతర నాయకులు పెద్ద సంఖ్యలో హాజరు కావటమేగాక చర్చల్లో పాల్గొని

సంఘ సంస్కరణలకు అనుకూలంగా తీర్మానాలను చేయించటానికి తోడ్పడ్డారు. రావి నారాయణరెడ్డిగారు ఈ అంశాన్ని గురించి ఇలా రాశారు :

"కీ. శే. వామన్ నాయక్ సాంఘిక విషయాలలో అభివృద్ధి నిరోధక అభిప్రాయాలు కలవారు. ప్రథమాంధ్ర మహాసభలో వారు పాల్గొని తమకుండే వ్యక్తిత్వ ప్రభావమువలన తమ అభిప్రాయములను నెగ్గించుకున్నారు. ఈ విషయము తెలుసుకొని కీ. శే. కేశవరావుగారు (ఆర్య సమాజ అధ్యక్షులు, హైకోర్టు న్యాయమూర్తి, సాంఘిక విషయాల్లో అభ్యుదయంగోరేవారు) ద్వితీయాంధ్ర మహాసభకు శ్రీ వామన్ నాయక్‌గారికి పోటీగా హాజరయ్యారు. వీరిద్దరి నాయకత్వంలో సాంఘిక సమస్యలపై తీవ్రమైన వాదోపవాదాలు మహాసభలో జరిగి వోటింగులో శ్రీ కేశవరావుగారి పక్షం నెగ్గింది. ద్వితీయాంధ్ర మహాసభలో ఇంకో విషయం కూడా జరిగింది. పౌరసత్వాలు ఇతర రాజకీయ సమస్యలను గురించి మహారాష్ట్ర నాయకులు నైజాం ప్రభుత్వాన్ని ఖండిస్తూ చాలా ఘాటైన ఉపన్యాసాలు ఇచ్చారు. ఈ ఉపన్యాసాల ఫలితంగా ప్రభుత్వం కొల్లాపురంలో జరుప నిశ్చయించిన తృతీయాంధ్ర మహాసభకు అనుజ్ఞ నిరాకరించిరి. దీనికి ప్రతీకారంగా ఆంధ్ర నాయకులీ కార్యక్రమం గురించి ఆలోచించక దీర్ఘకాలం ప్రభుత్వంతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి అవమానకరమైన షరతులకంగీకరించి తృతీయాంధ్ర మహాసభ ఖమ్మంమెట్టులో జరుపుటకు నిశ్చయించినారు."

(దేశోద్ధారక గ్రంథమాల ప్రచురించిన 'ఆంధ్రోద్యమం' అన్న వ్యాస సంకలనంనుండి ; "తెలంగాణా రాజకీయోద్యమము-చరిత్ర" ; పేజీ-16)

సంఘ సంస్కరణలవంటి సమస్యలపై అభ్యుదయ భావాలుగల మహారాష్ట్ర నాయకుల ఉపన్యాసాలు ప్రభుత్వానికేగాక ఆనాటి ఆంధ్ర నాయకులకు కూడా తలనొప్పి కలిగించాయి. వీటికి పౌరసత్వాలపై వారిచ్చిన ఉపన్యాసాలు కూడా తోడైనాయి. ఇవన్నీ కలిసి మూడవ మహాసభకు ముప్పుతెచ్చాయి. కొల్లాపురం (మహబూబునగరం)లో జరుగవలసిన మహాసభను ఖమ్మంలో జరుపాల్సి వచ్చింది. 1932లో జరుగవలసినది 1934లో జరిగింది. అవమానకరమైన షరతులతో ప్రభుత్వం అనుమతిస్తే, ఇంతే చాలని మితవాద నాయకులు మహాసభ జరిపారు.

మహారాష్ట్ర నాయకులు హైదరాబాదు నివాసులు. ఆనాటి సంస్థాన రాజకీయాల్లోనేగాక తెలంగాణా రాజకీయాల్లోకూడా వారికిగల ఆధిక్యత దానివలన

స్పష్టమవుతున్నది. వారూ మితవాదులే. ఆంధ్ర నాయకులు మితవాదుల్లో మిత వాదులు. వీరంతా "ఈనాటి స్వాతంత్ర్య సమరయోధులు".

రైతు సమస్యలకు ప్రాధాన్యత : ఖమ్మంలో 1934 చివరన సమావేశ మైన మూడవ మహాసభకు స్థానిక సనాతనవాదులు అవాంతరాలు కలిగించారు. దానితో ప్రభుత్వం సంఘసంస్కరణ సమస్యలను కూడా చర్చించవద్దని ఆదే శించింది. దానివలన ఏర్పడిన పరిణామాలను రావి నారాయణరెడ్డి ఈ విధంగా వివరించారు :

"ఆంధ్రమహాసభ నాయకులకీసందర్భమున ఒక సమస్య ఎదుర్కొన్నది. "రాజకీయ సమస్యలు చర్చించకూడదు, సాంఘిక సమస్యలూ చర్చించకూడదు" అని ప్రభుత్వ నిషేధము. మరేమి చర్చించాలె? ఈ సమస్యకొక పరిష్కార మార్గము ఆలోచించారు. మహాసభలో రైతుసమస్యలపై తీర్మానాలు ప్రవేశ పెట్టారు. రైతు సమస్యలపై తీర్మానాలే మహాసభ కార్యక్రమంలో ప్రధాన స్థానము పొందినవి. బావులక్రింది భూములకు మాగాణి భూములపై ఉండే అధిక పన్ను తగ్గాలనియు, జమాబందీలో రైతులకుండే ఇబ్బందులు పోవాలనియు, జాగీర్లలో బందోబస్తు జరగాలెననియు ఇత్యాది సమస్యలకు ప్రాముఖ్యత ఇవ్వ బడింది. అంటే ఇంతకుపూర్వం మహాసభలో రైతు సమస్యలు రాలేదని కాదు. స్వల్పంగా చర్చించబడేవి గూడా. కానీ తృతీయాంధ్ర మహాసభలో ఇవ్వబడ్డ ప్రాముఖ్యత ఎన్నడూ లేదు." (పై పుస్తకం ; పేజి-20-21)

ఇది వాస్తవంకాదు. ప్రభుత్వం నిషేధించింది తీర్మానంపై చర్చలను, కాని తీర్మానాన్నికాదు. తీర్మానం ప్రభుత్వానికి అనుకూలమైనదే. తీర్మానంపై చర్చలకు అవకాశమిస్తే దానిని వ్యతిరేకించేవారు ప్రభుత్వాన్ని విమర్శించ వచ్చునని చర్చలను నిషేధించారు. దీనిని అధిగమించటానికి అధ్యక్షులవారే తీర్మానాన్ని ప్రకటించారు. ఏకగ్రీవంగా ఆమోదించిన తీర్మానమని దీని అర్థం. ఆ తీర్మానమిది :

"తెలంగాణా రైతుల అవసరములు :

"5. (అ) రైతుల ఆర్థిక కష్టములను దృష్టిలో నుంచి మ.ఘ.వ. ప్రభువు గారు గడచిన మూడు సంవత్సరముల కాలములో తమంతటతామే అపారప్రేమతో చేసిన మాల్గుజారి తగ్గింపునకును, ఇతర సౌకర్యములకును తెలంగాణా రైతుల పక్షమున ఈ మహాసభవారు ప్రభుత్వమువారికిని, ప్రభువుగారికిని మనఃపూర్వక

మగు కృతజ్ఞతను, ఆర్థిక పరిస్థితులను బట్టి కరుణాదృష్టినే ప్రసరింపజేయుదురని పూర్ణవిశ్వాసమును ప్రకటించుచున్నారు.

"(ఆ) తెలంగాణా రైతులకుగల ప్రత్యేక కష్టములను తొలగించుటకుగాను ప్రధానమంత్రిగారు నల్లగొండలో వాగ్దానము చేసిన ప్రకారము యేర్పాటులను జేయుటకై ప్రభుత్వమువారికి ఈ మహాసభవారు వినయపూర్వకముగా విజ్ఞాపనము చేసికొనుచున్నారు."

(తెలంగాణా ఆంధ్రోద్యమము, రెండవభాగము, పేజి 260-261)

ప్రభుత్వం కోరిన హామీలు :

"1. ప్రభుత్వము వారేర్పరచిన భూముల ధారాలను (పన్నులను) తగ్గించ వలసినదని తీర్మానించకూడదని.

"2. ప్రభుత్వాధికారులకొరకు పనులు చేయవద్దని ప్రజలకు బోధించ కూడదు.

"3. పైవిగాక ప్రభుత్వము వారితో కార్యకర్తలకు ఘర్షణము కల్గించు నట్టి ఏ ఇతర సభా చర్యలను జరుపకూడదు.

"4. ఈ నియమములను ఉల్లంఘించినచో అందలి జవాబుదారీ కార్యదర్శియై ఉండగలదు." (పై పుస్తకం; పేజి-44)

ఈ హామీలు ఇన్చినతర్వాతనే ప్రభుత్వం మహాసభ సమావేశానికి అనుమతించింది. సనాతన ధర్మవాదుల ఒత్తిడికి లొంగిపోయి వదులుకున్న తీర్మానాలు, దేవాలయాల్లో హింస, బాల్య వివాహ నిషేధాలు, కన్యాశుల్క వరశుల్క నిర్మూలన, వివాహ వ్యయాలను తగ్గించటం, నిమ్నజాతుల విద్యాభివృద్ధి, పరిశుభ్రతలకు సంబంధించినవి.

సనాతన ధర్మవాదులు ప్రభుత్వ సహాయంతో, ఇదే సందర్భంలో జరిగిన మహిళా మహాసభను ఆటంకపరచడానికి ప్రయత్నించారు. వారికి 'మనస్తాపాన్ని కలిగించే' తీర్మానాలు చేయకూడదని ప్రభుత్వ ఉన్నతాధికారులు హెచ్చరించారు. నాయకులు ఈ షరతులను నిరాకరించారు. అంతటితో ఆ సభ జరిగిపోయింది.

ఆటంకాలు కలిగించిన సనాతన ధర్మవాదులు, 1930 పూర్వం ఆంధ్రోద్యమంతో సంబంధం ఉన్నవారే. ఇరుపక్షాలవారు రాజభక్తులే. కొద్దోగొప్పో సంఘ సంస్కరణలు కావాలనేవారిని వ్యతిరేకించేవారు సనాతన ధర్మవాదులు. ప్రభుత్వం వీరిని ప్రోత్సహించేది. వీరు ఆనాడు దెబ్బలాటకు సిద్ధమయ్యారని ఒక వార్త

బయలుదేరింది. ఆనాటి సనాతన ధర్మవాదుల్లో అగ్రహారీకులు, పెద్ద భూస్వాములు, పెద్ద వర్తకులు ఉన్నారు.

వీరంతా తర్వాత కాలంలో కాంగ్రెసువాదులైనారు. ఒక విశేషమేమంటే-మహాసభకు స్థానిక హైస్కూలు విద్యార్థులు కూడా హాజరయినారు.

నాల్గవ మహాసభ సిరిసిల్ల (కరీంనగర్ జిల్లా) లో 1935 డిసెంబరు 30, 31; 1936 జనవరి 1 తేదీల్లో సమావేశమైంది. అధ్యక్షులు మాడపాటి హనుమంతరావుగారు. అప్పటికి మహారాష్ట్ర నాయకుల ప్రాబల్యం తగ్గిపోయింది. స్థానిక సనాతన ధర్మవాదులు బలహీనంగా ఉండిరి. భారతదేశంలో బ్రిటిష్ పాలకులు 1935 ఇండియా చట్టం పేరుతో నూతన రాజ్యాంగ సంస్కరణలు అమలుజరుపుతున్న రోజులు. నైజాం నవాబు తన 25 సంవత్సరముల పరిపాలనను పూర్తి చేసుకొని రజితోత్సవం జరుపుకున్న సంవత్సరమది. ఈ పరిస్థితుల్లో మామూలు షరతులకు లోబడి మహాసభను సమావేశపరచుకోవచ్చునని ప్రభుత్వం అనుమతించింది.

ఈ మహాసభలో మొదటిసారి జాగీరు ప్రజలు, తెలంగాణా రైతు పేరుతో రైతుల కోర్కెలను కొన్నింటిని ప్రకటించారు. ఖాల్సా ప్రాంతపు (ప్రభుత్వం నేరుగా పరిపాలిస్తున్న ప్రాంతం) ప్రజల సౌకర్యాలు జాగీరు ప్రజలకు కావాలని కోరినారు. జాగీర్లు రద్దుచేసినప్పుడే ఈ కోరిక నెరవేరుతుంది. కాని మహాసభ అలాంటి కోరికను కోరలేదు. దానికి బదులు సౌకర్యాలను మాత్రమే కావాలన్నది. అంతటితో ఆగక వాటిని స్పష్టీకరించింది కూడా. అయిదు సంవత్సరాలలోపున అన్ని జాగీరు గ్రామాల భూములను సెటిల్మెంటు (బందోబస్తు) చేయించాలని వివరించారు. దీనితో అయిదేళ్ళదాకా జాగీరు భూములపై అక్రమంగా పన్నులు వసూలుచేయటానికి అంగీకరించారు. జాగీర్దారుల రైతుల "బాధ్యతలను" "హక్కులను" నిర్దేశించే చట్టం కావాలన్నారు. జాగీర్దారులు పన్నులు వసూలు చేసే హక్కును అమలుజరిపారు; రైతులు పన్నులు చెల్లించే బాధ్యతను నిర్వహించారు. ఇక మిగిలిందేమిటి? వచ్చి ఫ్యూడల్ దోపిడీదారులైన జాగీర్దారులను, వారితో బాధపడే రైతులను ఒకేగాట కట్టినారు వీరు. వీరు కోరినది జాగీర్దారులు బుద్ధిమంతులై ఉండాలనీ, రైతులపై పన్నులభారం తగ్గాలనీ మాత్రమే. జాగీర్దారీ విధానాన్ని రద్దుచేయాలనికాదు. దానిని రద్దుచేస్తే జాగీర్దారుకు హక్కులూ ఉండవు, బాధ్యతలూ ఉండవు.

ఈ మహాసభలో "తెలంగాణా రైతు" మొదటిసారి ప్రత్యక్షమయ్యాడు. ఈ సమస్యపై చేసిన తీర్మానంలో బావులతో సాగయ్యే భూమిపై వసూలుచేస్తున్న మాగాణి శిస్తును (జేరుబావులి) రద్దుచేయాలనే కోరికఉంది. వ్యవసాయ పనిముట్లు, పశువుల మేత, వంట చెరకు మొదలగు వాటికి సౌకర్యాలు కలుగజేయాలనే కోర్కెలు కూడా ఉన్నవి. ఇక్కడ కూడా భూస్వామికి, రైతుకూ తేడా చూపలేదు. భూస్వామి భూమికి యజమాని కావటంతో భూస్వామినీ, రైతునూ ఒకే గాటకట్టి భూస్వామిని రైతు అన్నారు మితవాద నాయకులు.

అప్పటికే కౌలుదారుల కడగండ్లు గోలకొండ పత్రికద్వారా వార్తల రూపంలో బయటి ప్రపంచానికి తెలిసినవి. అయినా వారిని తెలంగాణా రైతుల్లో చేర్చలేదు. వాస్తవానికి రైతుల్లో సగభాగం వీరే.

ఆంధ్ర మితవాద నాయకులు తమ రాజభక్తి పరాయణత్వాన్ని ఈ మహాసభలో ప్రకటించుకున్నారు. మహాసభ రెండవ తీర్మానం ఇలా ఉంది :

"రజతోత్సవము

"గడచిన 25 సంవత్సరముల నుండి మనరాష్ట్రములోని ప్రజల బిడ్డలవలె కాపాడుచు, రాష్ట్రముయొక్క సర్వతోముఖాభివృద్ధికై నిరంతరకృషి సల్పుచు రాజ్యమును పాలించుచున్న మహాఘనత వహించిన ప్రభువర్యులగు నవాబ్ సర్ మీర్ ఉస్మానలీఖాన్ బహాదరు ఫతె హజగుంవారి దివ్యసముఖమున, రజతోత్సవ సందర్భమున ఈ మహసభవారు తమ హృదయపూర్వక భక్తివిశ్వాసములను వెల్లడించుచు, వినయపూర్వకముగా తమ అభినందనమును సమర్పించుకొనుచు శ్రీవారి యొక్కయు, వారి కుటుంబము యొక్కయు ఆయురారోగ్యైశ్వర్యముల అభివృద్ధికై దయామయుడగు పరమేశ్వరుని ప్రార్థించుచున్నారు.

(పై పుస్తకము పేజి-268)

ఈ తీర్మానాన్ని అధ్యక్షపీఠం నుండి ప్రకటించి, చర్చకు ఆస్కారం లేకుండాచేశారు మితవాదనాయకులు. చర్చలు సాగితే ప్రతినిధుల్లో కొందరు తీర్మానాన్ని వ్యతిరేకించవచ్చునని, దానితో తమకొంప మునిగిపోతుందని వారు భయపడినారు.

నిజాంనవాబు పాలన అంతమై కాంగ్రెసుపాలన వచ్చే సమయానికి వారు కాంగ్రెసువాదులైనారు. తర్వాత వారు "నిజాంప్రభువరేణ్యుల"ను తెగనాడటం ప్రారంభించారు.

ఐదవ మహాసభ షాదునగరు (మహబూబునగరుజిల్లా)లో 1936 చివరలో సమావేశమైనది. అధ్యక్షుడు కొండా వెంకటరెడ్డిగారు.

ఈ మహాసభలో "తెలంగాణా రైతు"పై తీర్మానానికి అదనపు కోర్కెలు చేర్చారు. ఇవి రైతుల రోజువారీ ఇబ్బందులకు సంబంధించినవి. వీటిని అంగీకరిస్తే ప్రభుత్వం చట్టాల్లో, నిబంధనల్లో కొన్ని మార్పులు చేయాలి. ప్రభుత్వ ఆదాయం తగ్గుతుంది. ఇదిగాక ప్రత్యేకంగా నీటిపన్నుపై ఒక తీర్మానం చేశారు. దానిలో బావులతో సాగయ్యే మాగాణిపై మెట్టశిస్తు మాత్రమే తీసుకోవాలని, చెరువు నీటితో సాగయ్యే భూములపై మెట్టపన్నును, నీటిపన్నును విడివిడిగా నిర్ణయించాలని కోరినారు. ఇది ఆనాటి మద్రాసు రాష్ట్రంలో అనుసరించిన విధానం.

ఈ మహాసభలో నాయకులు రాజభక్తి పరాయణత్వంలో మరొక అడుగు ముందుకువెళ్ళి తమ విధేయతను ప్రకటించారు. ఐదవ జార్జి చక్రవర్తి చనిపోయి ఆరవ జార్జి చక్రవర్తి పాలన ప్రారంభంఅయిన రోజులవి.

నాలుగవ, అయిదవ మహాసభల్లో చేసిన పౌరసత్వాలకు సంబంధించిన (సర్క్యులర్ నెం-53) తీర్మానాలు లేవు. దానికిగల కారణాలను ఎవరూ వివరించలేదు. ప్రభుత్వంతో సామరస్య పూర్వకంగా ఉండటానికే ఇలా చేశారనేది స్పష్టం. మహాసభలకు ప్రభుత్వ అనుమతి లభించటానికి ఇది కూడా ఒక కారణం.

బహిరంగ సభకు పదివేలమంది ప్రజలు హాజరయినారు. ఆనాటి పరిస్థితుల్లో ఇది పెద్ద సంఖ్య. వృద్ధిపొందుతున్న ప్రజల చైతన్యానికి ఇది సూచన.

మహాసభను ఆహ్వానించినవారు, నిర్వహించిన వారిలో జాగీర్దారులు, మక్తాదారులు, పెద్ద భూస్వాములు ముఖ్యులు. షాదునగరు ఒక జాగీరు ప్రాంతానికి కేంద్రస్థానం. నిజాం నవాబుకు ప్రధానమంత్రిగా ఉన్న మహారాజా కిషన్ పర్షాద్ (కృష్ణ ప్రసాద్) ఈ ప్రాంతానికి జాగీర్దారు. మాహారాజాగారివి, ఆయన అధికార వర్గానివి సహాయసానుభూతులు మహాసభ నిర్వాహకులకు లభించినవి. ఆంధ్ర మహాసభ మితవాద నాయకులకు ఒక తరహా ఫ్యూడల్ వర్గపు అండదండలు ఏ మేరకు ఉండెనో దీనివలన స్పష్టమవుతున్నది.

రాజకీయ సంస్థగా రూపొందడం : ఆరవమహాసభ నిజామాబాదులో 1937 చివరిలో సమావేశమైనది. అప్పటికి బ్రిటిషు ఇండియా రాష్ట్రాల్లో ఎన్నికలు పూర్తయి చాలా రాష్ట్రాల్లో కాంగ్రెసు ప్రభుత్వాలు ఏర్పడినవి. దీనితో నిజాం ప్రభుత్వం సంస్థానంలో రాజ్యాంగ సంస్కరణకోసం ఆందోళన బయలు

దేరుతుందని భయపడింది. మితవాదులను బుజ్జగించి కాంగ్రెసు అనుకూల శక్తులను దెబ్బతీయాలని కొన్ని సంస్కరణలను ప్రవేశపెడతామని ప్రకటించింది. దీని కోసం ఒక కమిటీని కూడా నియమించింది. అరవముత్తు అయ్యంగారు దానికి అధ్యక్షుడు. రాజభక్తి పరాయణుల్లో, మితవాదుల్లో రాబోవు సంస్కరణ స్వరూప స్వభావాలెలా ఉండాలో చెప్పటానికి ఉబలాటం ప్రారంభమయింది. ఆ సమయంలో సమావేశమైన మహాసభ ఇది, దీనికి అధ్యక్షుడు మందుముల నరసింగరావు.

రాజకీయ సంస్కరణపై చేసిన తీర్మానం ఈ మహాసభ ప్రత్యేకత తీర్మానంలో ఒక అంశం ఈ విధంగా ఉంది.

"1. ఈ రాజ్యాంగ సంస్కరణముల మూలమున ఏర్పడు సంస్థ లేక సంస్థలు నిజమైన ప్రజా ప్రాతినిధ్యము వహించినవిగా నుండి పాలకవర్గమువారు ఈ సంస్థలకు బాధ్యులై యుండవలయును." (పై పుస్తకము పేజి-299)

దీనిలో ప్రజలు ఎన్నుకోవాలనే ప్రసక్తి ఎక్కడాలేదు. ఎన్నికలున్నప్పుడే "నిజమైన ప్రజా ప్రాతినిధ్యం" ఉంటుంది. "పాలకవర్గంవారు ఈ సంస్థలకు బాధ్యులై ఉండాలం"టారే గాని పాలకవర్గం వారిని ఎవరు ఏర్పాటుచేయాలి ? అనే ప్రశ్నకు సమాధానంలేదు. కాంగ్రెసువాదులుకోరిన బాధ్యతాయుత ప్రభుత్వం మాట ఈ తీర్మానంలో బొత్తిగాలేదు.

పౌరసత్వపు హక్కులను రాజ్యాంగం గ్యారంటీ ఇవ్వాలని కూడా కోరినారు. మహాసభ తరఫున ప్రణాళికను తయారుచేసి ప్రభుత్వానికి అందించాలని నిర్ణయించారు. కాని దానిని అమలుచేయలేదు.

ఈ తీర్మానంతో మహాసభ రాజకీయస్వభావాన్ని సంతరించుకున్నదని మితవాద నాయకులు చెపుతూ ఉంటారు. వారిపాలిటికీతీర్మానం సాహసోపేతమైన చర్యకావచ్చును. సంస్థానం చుట్టూఉన్న రాష్ట్రాల్లో కాంగ్రెసు ప్రభుత్వాలేర్పడటం వలన వచ్చిన ధైర్యంతో ఈ తీర్మానం చేశారు ; ప్రభుత్వం కూడా కాదనే స్థితిలో లేదు.

ఆంధ్రమహాసభకు రాజకీయాలతో సంబంధం లేదని నాయకులు ఎంత చెప్పుకున్నా నిజాం ప్రభుత్వం దీనిని రాజకీయసంస్థగానే పరిగణించింది. గ్రంథాలయాలను "విప్లవ కేంద్రాల"ని భావించింది. ఉన్న ఒకేఒక కార్యకర్తను రాష్ట్రం నుంచి వెళ్ళగొట్టించినది. వార్షిక సమావేశాలకు అనుమతించకుండా ఇబ్బంది పెట్టింది. ఇవన్నీ రాజకీయాలుగాక మరేమిటి? నిజాం సంస్థానంలో ప్రభుత్వానికి ఇష్టంలేని ప్రతిపని రాజకీయమే.

గత రెండు మహాసభల్లో వదిలివేసిన పౌరసత్వాలపై (సర్క్యులర్ నెం. 53) ఈ మహాసభలో మళ్ళీ తీర్మానించారు.

రైతు సమస్యలపై ఇదివరకటికన్నా వివరాలను చేర్చి తీర్మానాన్ని రూపొందించి, ఆమోదించారు. దీనిలో మాగాణిభూములపై పన్నులను తగ్గించాలనే కోరికలే ప్రధానమైనవి. ప్రభుత్వ ఖర్చులు లేక, రైతులే స్వయంగా నీటివనరులను ఏర్పరచుకొని భూమిని సాగుచేస్తే దానిపై నీటిపన్ను ఉండకూడదని తీర్మానపు సారాంశం. ఇదేవిధంగా జాగీరు ప్రజల సమస్యలపై మరికొన్ని వివరాలతో తీర్మానించారు. పన్నులు విధించటంలోనూ, పరిపాలనా వ్యవహారాల్లోనూ ఇతర ప్రాంతాలతో సమానంగా ఉండాలని దాని సారాంశం.

నిజాం సాగరుతో సాగయ్యే భూములపై నీటిపన్నును తగ్గించాలనీ ఆయకట్టులోని ప్రభుత్వ భూములను రైతులు ఉచితంగా తమ పశువులను మేపుకోటానికి అవకాశం ఉండాలని తీర్మానించారు. ఈ విధంగా రైతుల సమస్యలపై తీర్మానాల సంఖ్య పెరిగిపోయింది.

ఈ మహాసభలో ఒక ముఖ్యమైన సంఘటన జరిగింది. ఆహ్వాన సంఘం తరఫున మహాసభకు వచ్చిన ప్రతినిధులలో ఒక ముస్లిం, ఒక మహారాష్ట్రీడు ఉన్నారు. వారు ఉర్దూలో ఉపన్యసిస్తే కొందరు అభ్యంతరం తెలిపి, ఆంధ్ర మహాసభ నియమావళిననుసరించి ఉపన్యాసాలు తెలుగు భాషలో ఉండాలని పట్టు పట్టారు. దీనితో భాషా సమస్య చర్చనీయాంశమైనది.

అప్పటి నియమావళిలో "మహాసభ కార్యక్రమం, చర్చలు, కవిలె(రికార్డు) ఆంధ్ర భాషయందే జరుగవలయును" అని ఉన్నది. దీనిని నాల్గవ మహాసభలో అంగీకరించి "ఐదవ మహాసభలో పై నియమము జాగరూకతతో, గట్టిగా పాలింప బడినదని" మాడపాటివారు రాశారు. (పై పుస్తకం పేజి-120). కాని ఆ సమస్యపై అభిప్రాయ భేదాలేర్పడటానికి ఎంతోకాలం పట్టలేదు.

మహాసభ చర్చించి మెజారిటీ ఓటుతో ఉర్దూలో ఉపన్యసించవచ్చునని తీర్మానించింది. ఓడిపోయినవారు "అభివృద్ధి పక్షమ"ని ఒక గ్రూపును ఏర్పరిచారు. దీనిలో ముఖ్యులు సురవరం ప్రతాపరెడ్డిగారు. మొదటి ఆంధ్ర మహాసభకు అధ్యక్షులు. ఇతరులు యువకులు. ఉర్దూ మాట్లాడటానికి అవకాశమివ్వాలనేవారిలో పెద్దలతోపాటు అప్పటికి యువకుడైన రావినారాయణరెడ్డి కూడా ఉన్నాడు.

"ఆంధ్ర మహాసభ ఆంధ్ర భాషా మహాసభకాదు. ఆంధ్ర ప్రాంతము (తెలంగాణము)లోని ప్రజలందరి బాగోగుల చర్చించి అభిప్రాయముల ప్రకటించి,

తీర్మానములు అంగీకరించుటకై ఏర్పడిన సభ. కనుక దీనిలో ఆంధ్రేతర భాషను ఎవరును మాట్లాడనేకూడదని విధించుట న్యాయముకాదనియు..." (పై పుస్తకం-పేజి-121) వారి అభిప్రాయం.

వాస్తవమేమంటే ముస్లింలు, మహారాష్ట్రులు తెలంగాణంలో నివసించినంత మాత్రాన ఆంధ్రులమని భావించరు. వారు ముస్లింలు, మహారాష్ట్రులే. వారికి తమ మాతృభాషలున్నాయి. తెలంగాణా ప్రాంతంలో నివసించుతున్నంతమాత్రాన ఆంధ్ర మహాసభలో చేరటానికి, ఆంధ్ర మహాసభకు ప్రతినిధులవటానికి, మాట్లాడటానికి అర్హులుకారు. ఆంధ్ర మహాసభ ఆంధ్రులకోసమే ఏర్పడినది. నియమావళిని భాషా ప్రాతిపదికపై రూపొందించటంవలన ఈ పరిస్థితి ఏర్పడింది.

తెలంగాణా ప్రాంతంలో నివసించే వారందరూ ఆంధ్రమహాసభలో చేర వచ్చునని వాదించేవారిలో కొందరు దీనిని కాంగ్రెసులాంటి సంస్థగా రూపొందించాలనే కోరికగలవారే. నాయకుల్లో కొందరు కుటుంబసభ్యులతో తప్ప రోజంతా ఉర్దూ మాట్లాడేవారే. ఆ కారణాన వారికి మహాసభలో ఉర్దూలో మాట్లాడవద్దని పట్టింపులేదు. అవకాశమిస్తే వారే సమావేశాల్లో ఉర్దూలో ధారాళంగా ఉపన్యసించేవారు.

మొదటి రెండు మహాసభల్లో వామన్‌నాయకు, కేశవరావు గారు సమావేశాల్లో పాల్గొని తమ ప్రాబల్యాన్ని చూపగలిగినారు. వారు చనిపోయిన తర్వాత మళ్ళీ ఆరవ మహాసభలో ఈ సమస్య ఎదురయింది. నిజామాబాదు సరిహద్దు జిల్లా కావటం దీనికొక కారణం. తర్వాత కాలంలో మహాసభ నియమావళిని సవరించి ఆంధ్రేతరులకు స్థానం కల్పించారు.

ఆరవ మహాసభ తర్వాత స స్థానంలో రాజకీయశక్తుల అలజడి (సత్యాగ్రహ ఉద్యమాలు ; విద్యార్థుల వందేమాతరం సమ్మె), ప్రభుత్వ నిర్బంధ విధానం కొనసాగింది. సుమారు రెండు సంవత్సరాల తర్వాత మామూలు పరిస్థితులు ఏర్పడిన తర్వాతనే ఏడవ మహాసభ జరిగినది.

ముగింపు : ఆరవ మహాసభ (నిజామాబాదు) నాటికి ఆంధ్రోద్యమానికి 16 సంవత్సరాలు పూర్తి అవుతాయి. మొదటి 9 సంవత్సరాలు గ్రంథాలయ సభలు, ఇతర సభలతో కాలం గడిచినది. తర్వాత 6 సంవత్సరాలలో దానికొక నిర్మాణ స్వరూపమేర్పడి వార్షిక సభలు జరుపుకోసాగింది. ఈ నిర్మాణ స్వరూపమే ఆంధ్రమహాసభ ఈ 16 సంవత్సరాల కాలంలో ఆంధ్రోద్యమం రాజకీయ ప్రజాఉద్యమ స్వభావాన్ని సంతరించుకోలేదు. రైతాంగ ఉద్యమ స్వభావాన్ని

అందుకోలేదు. ఈకాలంలో రైతులు కూలీలు చేతులు ముడుచుకొని కూర్చోలేదు. వారు తిరుగుబాట్లు చేశారు ; పోరాటాలు సాగించారు. కొన్ని సఫలమైనా, విఫలమైన పోరాటాలే హెచ్చు. వీటితో ఆంధ్రోద్యమం దూరంగా ఉంది. వీటియెడ కనీసమైన సానుభూతిని కూడా ప్రకటించలేదు. తిరుగుబాట్లు చేసి, పోరాటాలు సాగించిన రైతులంతా ఆంధ్రులే. ఆంధ్రమహాసభ నియమావళి ననుసరించి ఆంధ్రులా కాదా అనే సంశయానికి కూడా ఆస్కారంలేనంత స్వచ్ఛమైన ఆంధ్రులు వీరు. అత్యధిక సంఖ్యాకులు. వీరిని కాదంటే మిగిలిన ఆంధ్రోద్యమమేమిటి ?

తీర్మానాలు చేసి ఎవరిళ్ళకు వారువెళ్ళే నాయకుల సంస్థగా ఉండిపోయిందే కాని వివిధ స్థాయిలలో ఉన్న నాయకులు కార్యకర్తలై పనిచేసే సంస్థగారూపొందలేదు. ఉన్న ఒకే ఒక కార్యకర్తను (ఉన్నవ వెంకటరామయ్యగారు) నియమిస్తే ప్రభుత్వం ఆయనకు ఉద్వాసన పట్టించింది.

వెట్టిచాకిరి పనివారి విషయమై (బలోతాదారులు) తీర్మానాలు చేశారు. కానీ అవి ప్రభుత్వాధికారులు చేయించే వెట్టిచాకిరికే పరిమితమైనవి. భూస్వాములకు చేసే చాకిరిపై మహాసభ మౌనం వహించింది. పన్నులను తగ్గించమన్నారేగాని భూస్వాములు వసూలుచేసే అక్రమపన్నుల మాట ఎత్తుకోలేదు. గ్రామాధికారుల (పటేలు పట్వారీలు) కష్టాలను గూర్చి తీర్మానాలు చేశారు కాని వారు రైతులను పీడించిన సమస్యను ఎత్తుకోలేదు. ఈ విధంగా భూస్వాములు ప్రజలపై సాగించే దోపిడీ, పీడన, నిర్బంధం విషయమై ఆంధ్ర మహాసభ మౌనం వహించింది.

తెలుగుభాషా వ్యాప్తికై ప్రయత్నించింది. కాని ప్రభుత్వం ఉస్మానియా విశ్వవిద్యాలయాన్ని స్థాపించి ఉర్దూను బోధనా భాషగా చేసిన ఒక ముఖ్యమైన పరిణామాన్నిగురించి మాట్లాడలేదు. తెలుగు, మహారాష్ట్ర, కన్నడ ప్రజలనుంచి వసూలుచేసిన పన్నులనుంచి పోగైన ధనంతో వారి భాషలను అణచివేస్తూ ఉంటే నోరెత్తని ఉద్యమం అది. ఈ కారణాన దీనిని సంపూర్ణమైన భాషా సాంస్కృతిక మైన ఉద్యమమని చెప్పటానికి వీలులేదు. అలాంటి లక్షణాలు అతి స్వల్పంగా ఉన్నాయనిమాత్రం చెప్పవచ్చును.

ఈ దశలో ఆంధ్రోద్యమం ఎప్పుడూ ప్రభుత్వ వ్యతిరేక స్వభావాన్ని సంతరించుకోలేదు. కాగా ప్రభుత్వ అనుకూల సంస్థగా ఉంటూవచ్చింది. ఆంధ్ర మహాసభ నాయకత్వాన్ని ప్రభుత్వం ఎప్పుడూ తమకు వ్యతిరేకమైనదని భావించ లేదు. మాడపాటివారు ఉదహరించిన ఒక సంఘటన దీనికి తార్కాణం. 1939 ప్రారంభంలో ప్రభుత్వం తొమ్మిది సంస్థలను మతపాక్షికములని ప్రకటించింది.

దానిలో ఆంధ్ర మహాసభను చేర్చలేదు. మహారాష్ట్ర పరిషత్తును చేర్చారు. ఆంధ్ర మహాసభను చేర్చనందుకు ఆంధ్ర మితవాద నాయకులు సంబరపడ్డారు.

(పేజీ-111, ఫుట్‌నోట్)

మహారాష్ట్ర పరిషత్తులో మతతత్వవాదులున్నమాట నిజమే. ఆంధ్రమహాసభలో లేనిమాట కూడా నిజమే. కాని ప్రభుత్వపు గీటురాయి వేరేవిధంగా ఉండేది. ఒకఉద్యమం ప్రభుత్వానికి అనుకూలమైనదాకాదా అనేదే ఆ గీటురాయి. ఆ దృష్టితో చూచినప్పుడు ఆంధ్రమహాసభ ప్రభుత్వ వ్యతిరేకమైనది కాదని ప్రభుత్వం నిర్ణయించుకున్నదని తెలుస్తున్నది. మజ్లిస్ ఇత్తెహాదుల్ ముసల్మిన్‌పై ప్రభుత్వ అభిప్రాయమేమిటో వారు స్పష్టంచేయలేదు. ఈ సంస్థను ప్రభుత్వం బలపరచటమేగాక ప్రోత్సహిస్తూ వచ్చింది. "ఆంధ్రోద్యమము ఎట్టిదైననగుగాక. మతపాక్షిక సంబంధము కలదిమాత్రముకాదనియు, నేడు కాకపోయిన ముందెప్పటికైనను రాజకీయము కాక మానదనియు, అప్పుడీ యుద్యమ పరిణామములు భయంకరములుగా నుండవచ్చుననియు ప్రభుత్వమువారూహించి యుండినట్లు మంచి ఆధారములు కలవ'ని వారనటానికి ఏ ఆధారమూ లేదు. ఆంధ్రమహాసభ బలీయమైన ప్రజాసంస్థగా రూపొందడానికి కారణాలు వేరేవున్నవి. వాటిని నాటి ప్రభుత్వం ఊహించగల భౌతిక పరిస్థితులు ఆనాడు లేవు. రాజభక్తి పరాయణులూ, నిజాం రాచరికానికి వ్యతిరేకులుకాని మితవాదులమయమై ఉండటం వల్లనే ప్రభుత్వం దీనికి మతతత్వపు రంగును పులమలేదు. మహాసభలకు యువకులు ప్రతినిధుల హోదాలో హాజరైనప్పటికి సంస్థ విధానాలపై అతివాద రాజకీయాల ప్రభావంలేదు. తీర్మానాలు చేయటంవరకే పరిమితమై ప్రజల్లోకి వెళ్ళనందున సంస్థకు ప్రజాపునాది ఏర్పడలేదు. మతతత్వమూ, అతివాద రాజకీయాలు, ప్రజాఉద్యమ పునాదిలేని ఆంధ్రమహాసభతో ప్రభుత్వానికి తగాదా ఎందుకు ? అఖిలభారత కాంగ్రెసుతో సంబంధంలేని సంస్థ అవటంవలన ప్రభుత్వ దాడికి గురికాలేదు. ఇది అన్నిటికన్న ముఖ్యమైన అంశం.

వివిధ జిల్లాలలో వార్షిక మహాసభలు సమావేశమైనప్పుడు స్థానిక నాయకత్వం ఏర్పడింది. ఇది కూడా మితవాద స్వభావం కలిగినదే. అయినా దీనిలో కొందరు యువకులు ముందుకు వచ్చారు. వారిలో ముఖ్యులు రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి, జమలాపురం కేశవరావు గారలు. మొదటి ఇరువురు కమ్యూనిస్టు పార్టీలో చేరారు. చివరివారు కాంగ్రెసులో చేరారు. వీరుగాక స్థానిక యువకులనేకులు తర్వాత కాలంలో రాజకీయాల్లోకి వచ్చినారు.

## 2. స్టేటు కాంగ్రెసు సత్యాగ్రహం

సంస్థానంలో 1899లో ఏర్పడిన శాసనసభ 1946 దాకా పనిచేసింది. దీనిలో ఎన్నికైనవారి సంఖ్యను పెంచాలని మితవాదులు, విద్యాధికులు కోరుతూ వచ్చారు. ఈ కోరికలకు, బ్రిటిష్ ఇండియా రాజకీయాలకూ సంబంధం ఉండేది.

1918 నుంచి 1921 వరకు ప్రధానమంత్రిగా ఉన్న సర్ అలీ ఇమాం రాజకీయ సంస్కరణలను ప్రవేశపెట్టడానికి ప్రయత్నించినాడు. కాని సంస్థానంలో వాటికోసం ఏ ఉద్యమమూ సాగనందున ప్రభుత్వం ఆ ప్రయత్నాన్నే మానుకున్నది.

1923లో కాకినాడలో అఖిలభారత కాంగ్రెసు మహాసభ సమావేశమైంది. ఆ సమయంలో సంస్థాన ప్రజల మొదటి మహాసభ సమావేశమైనదని "ఈసభలో హైదరాబాదు రాష్ట్రములో ప్రజాఉద్యమాల గురించి, మరియు వాక్స్వాతంత్ర్యము మరియు బహిరంగ సభలపైన మోపబడిన నిబంధనముల గురించిన విషయాలు బాగా చర్చింపబడినవి." అని మందుములవారు రాశారు.

(50 సంవత్సరముల హైదరాబాదు : పేజి – 85)

ఇదేవిధంగా 1927 మద్రాసులో జరిగిన కాంగ్రెసులో స్వదేశ సంస్థానాలను గురించి చేసిన తీర్మానం ఈ విధంగా ఉంది :

"దేశీయ సంస్థానాధీశుల మరియు వారి ప్రజల ఉభయుల శ్రేయస్సు కొరకు సంస్థానాధీశులు, ప్రజా ప్రాతినిధ్య సంస్థలు మరియు బాధ్యతాయుత ప్రభుత్వము, వారి రాజ్యములలో స్థాపించవలసిన అవసరమున్నదని కాంగ్రెసు అభిప్రాయపడుచున్నది." (పై పుస్తకం : పేజి – 100)

1931లో అకోలాలో జరిగిన రాజకీయ మహాసభను గూర్చి ఆయన ఇలా రాస్తున్నారు :

"ఈ మహాసభ చాలా విజయవంతంగా సాగినది. రాబోవు సంవిధానము ననుసరించి దేశీయ రాజ్యాల ప్రజలకు భారత శాసనసభల్లో ప్రాతినిధ్యము ఉండవలయునని, హైదరాబాదు రాష్ట్ర ప్రతినిధులు ప్రజలచే ఎన్నుకోబడినవారుగా ఉండవలయునని హైదరాబాదు రాష్ట్రములో నిజాం ప్రభువరేణ్యుల చత్రచ్ఛాయ క్రింద బాధ్యతాయుత ప్రభుత్వమునొసంగవలయునని, తీర్మానములు ఆమోదింపబడినవి." (పై పుస్తకం : పేజి – 119)

సంస్థానంలో రాజకీయ సభలను జరపటాన్ని ప్రభుత్వం నిషేధించేది. ఆ కారణాన సంస్థానం వెలుపల అలాంటి సభలు సమావేశమయ్యేవి. సరిహద్దున ఉన్న సర్కారు జిల్లాలలో ఒకటికూడా జరుగలేదు. అవి మహారాష్ట్రలోని పూనా లోనో, బిరారు ప్రాంతంలోని పట్టణాల్లోనో సమావేశమైనవి. కాంగ్రెసునాయకులు గానీ, తెలంగాణా మితవాదులుకానీ వీటిని సర్కారు, రాయలసీమ జిల్లాల్లో జరుప టానికి చొరవ తీసుకోలేదు. సంస్థాన పాలక వర్గాలకు వీరికీ ఉన్న సంబంధాల వలన వీరు ఈ పని చేయలేదని స్పష్టమవుతున్నది.

పూనాలో 1928లో హిందూ మహాసభ ప్రోత్సాహంతో ఒక రాజకీయ మహాసభ జరిగింది. ఉపన్యాసాల్లోనూ ఇతర విషయాల్లోనూ ముస్లిం వ్యతిరేకత ఉన్నది. మహాసభ ప్రభావం మహారాష్ట్ర రాజకీయాల్లోనేగాక హైదరాబాదునగర రాజకీయాల్లోకూడా ఉంటూ వచ్చింది.

అకోలాలో జరిగిన మహాసభ ఇలాంటిదికాదు. దీనిలో పాల్గొన్నవారు పరి మితమైన మితవాద జాతీయవాదులు, ముస్లిం జాతీయవాదులు కూడా పాల్గొన్నట్టు మందుములవారి కథనం. అప్పటికి కాంగ్రెసు తీర్మానాల్లో ఉన్న బాధ్యతాయుత ప్రభుత్వ ఆశయాన్ని అకోలా సభలో సంస్థానానికి చెందినవారు కూడా ప్రక టించారు.

సంస్థాన వ్యవహారాల్లో జోక్యం కలుగజేసుకోము అని కాంగ్రెసు పదేపదే చెప్పటం వలన తెలంగాణా మితవాదులు నిజాం "ప్రభువరేణ్యుని" దయాధర్మా లకై నిరీక్షించారు. 1935 రాజ్యాంగం అమల్లోకి వచ్చిన తర్వాత బ్రిటిష్ ఇండియాలో ఎన్నికలు జరిగినవి. అనేక రాష్ట్రాల్లో 1937 నాటికి కాంగ్రెసు మంత్రివర్గాలేర్పడినవి. ఆ సమయంలో సంస్థానంలో ప్రవేశపెట్టవలసిన రాజకీయ సంస్కరణలను సిఫారసు చేయటానికి అరవముదన అయ్యంగారి అధ్యక్షతన ప్రభుత్వం ఒక కమిటీని వేసింది. ఆ కమిటీముందు తమ అభిప్రాయాలను తెలుపటానికి హైదరాబాదు ప్రజా పరిషత్తు (Hyderabad People's convention) అను తాత్కాలిక సంస్థను ఏర్పరచి దాని తరఫున ఒక నివే దికను ఆ కమిటీకి పంపించారు. ఈ పరిషత్తులో ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటకులే గాక ముస్లింలు తదితరులు కూడా ఉన్నారు. వారంతా మితవాదులు, సంపన్న కుటుంబాలకు చెందినవారు. తర్వాత కాలంలో వారు కాంగ్రెసువాదులైనారు కూడా. ముస్లింలలో ఒకరుమాత్రం కాంగ్రెసును అంటిపెట్టుకొని ఉన్నారు.

ప్రభుత్వం ప్రకటించిన సంస్కరణల సారాంశం ఈ విధంగా ఉంది :

1) వృత్తులవారి ప్రాతినిధ్యం, సంస్థానాధీశులు, జాగీర్దారులు, భూస్వాములు, వ్యవసాయకులు, న్యాయవాదులు మొదలగువారు.

2) ఇప్పుడున్న విధంగా ఒక ప్రదేశాన్ని నియోజకవర్గమని నిర్ణయించటానికి బదులు వర్గాలవారీగా (class and profession) నిర్ణయించారు.

3) హిందూ ముస్లింల సమాన ప్రాతినిధ్యం, సరిసమానత్వం-ఎన్నుకున్న వారిలోనూ, నామినేటు చేసిన వారిలోనూ ఉంటుంది.

4) శాసనసభ్యుల సంఖ్య 85. దీనిలో 42 మంది ఎన్నుకున్న వారుంటారు.

5) ఓటర్లకు నియమితమైన ఆస్తి ఉండాలి. లేదా చదువు రావాలి.

6) నిజాం నవాబుకు సర్వాధికారాలు ఉంటాయి. శాసనసభలో ఆమోదించిన తీర్మానాలను, శాసనాలను నిరాకరించటానికి ఆయనకు సంపూర్ణమైన అధికారం ఉంటుంది. ప్రభుత్వం శాసనసభకు బాధ్యత వహించదు.

ఈ సంస్కరణలను ఇత్తెహాదుల్ ముసల్మిన్‌వారు నిరాకరించినారు. బాధ్యతాయుత ప్రభుత్వం కావాలని కోరినవారు తిరస్కరించినారు. ప్రభుత్వం కూడా వాటిని అమలు జరుపటానికి 1946 వరకు ఎలాంటి చర్యతీసుకోలేదు.

కాంగ్రెసు సత్యాగ్రహం : 1935 చట్టం ప్రకారం స్వదేశ సంస్థానాల రాజులకు కేంద్రంలో ప్రాతినిధ్యం ఉంటుంది. నిర్ణీత సంఖ్యగల ప్రతినిధులను వారు నామినేటు చేయవచ్చును. దీనివలన కాంగ్రెసు నాయకులకు మరొకసమస్య ఎదురైనది. రాష్ట్రాల్లో తాము మెజారిటీ సంపాదించినా కేంద్ర శాసనసభలో మెజారిటీ వచ్చే అవకాశాలు మృగ్యమైనాయి. ఈ పరిస్థితులను దృష్టిలోపెట్టుకొని ఒకవైపున ఫెడరేషన్‌ను బహిష్కరించింది. రెండవవైపున సంస్థానాలలో బాధ్యతాయుత ప్రభుత్వం కోసం ఆందోళన ప్రారంభించింది. హైదరాబాదు సంస్థానంలో కూడా స్టేటుకాంగ్రెసును ఏర్పరచింది. దీనికొరకు తాత్కాలిక కమిటీని ఏర్పరిచి సభ్యత్వం చేర్చుకోసాగారు. సంస్థ ఆశయం బాధ్యతాయుత ప్రభుత్వమే. తాత్కాలిక కమిటీ సభ్యులు 1) జి. రామాచారి, 2) పి. వి. జోషి, 3) బూర్గుల రామకృష్ణారావు, 4) జనార్దనరావు దేశాయి, 5) యస్. వి. నాయక్, 6) రామకృష్ణ ధూత. వీరిలో ఆంధ్రులు ఒక్కరే. సగభాగం జనాభాగల ఆంధ్రుల ప్రాతినిధ్యం ఎంత బలహీనంగా ఉందో దీనివలన తెలుస్తుంది. ఈయన కూడా తర్వాత రాజీనామా చేసినాడు.

ప్రభుత్వం దీనిని నిషేధించింది. మితవాద నాయకులు నిషేధాన్ని తొలగించటానికి ప్రయత్నించారు. పేరును మారిస్తే తొలగిస్తామన్నది ప్రభుత్వం. పేరును మార్చి నేషనల్ కాన్ఫరెన్సు అని కొత్తపేరు పెట్టారు. అయినా నిషేధాన్ని కొనసాగించారు. మితవాద నాయకులు (బూర్గుల రామకృష్ణారావు మొదలగు వారు) రాజీనామా చేసి తమకు స్టేటు కాంగ్రెసుతో సంబంధం లేదని ప్రకటించి ఇంట్లో కూర్చున్నారు.

దీని తర్వాతనే సత్యాగ్రహం ప్రారంభమయినది. 1938 అక్టోబరు 24 నాడు మొదటి జట్టువారు కోఠీ బస్‌స్టాండు ముందు, అక్కడ సమావేశమైన ప్రజలముందు స్టేటుకాంగ్రెసుపైనున్న నిషేధాన్ని ధిక్కరించి తాము స్టేటు కాంగ్రెసు సభ్యులమని ప్రకటించుకున్నారు. ఈ జట్టులోని అయిదుగురిలో రావి నారాయణరెడ్డిగారొక్కరే ఆంధ్రుడు. ఆంధ్ర మితవాదులెవ్వరూ సత్యాగ్రహంలో పాల్గొనలేదు. నాయకుడు (గోవిందరావు నానల్) ప్రకటన చేయగానే పోలీసులు అయిదుగురిని అరెస్టుచేశారు. ఈ విధంగా రెండునెలల కాలంలో హైదరాబాదు నగరంలో 18 జట్లవారు సత్యాగ్రహంచేసి అరెస్టు అయినారు. వారి సంఖ్య నూటికి మించి ఉంటుంది. డిసెంబరు 24 నాడు సత్యాగ్రహాన్ని ఆపివేశారు. తర్వాత అందరినీ విడుదల చేశారు.

సత్యాగ్రహంలో తెలంగాణా నుంచి పాల్గొన్నవారి సంఖ్య చాలా తక్కువ. సకల ప్రయత్నాలూ చేసినా పాల్గొన్నది కొద్దిమంది మాత్రమే. దాదాపు వీరంతా యువకులే. సత్యాగ్రహంలో ఉత్తేజితులైనవారు స్వల్పమని ప్రజలపై పెద్ద ఎత్తున ప్రభావం కలుగజేయలేకపోయిందనీ ఈ కొద్ది సంఖ్య తెలియజేస్తున్నది.

సత్యాగ్రహులని పోగుచేయటానికి రెడ్డి హాస్టలు ఒక కేంద్రం. సత్యాగ్రహంలో పాల్గొన్న ఒక రెడ్డి హాస్టలు విద్యార్థిని అరెస్టుచేసి అమానుషమైన హింసలకు గురిచేశారు. ఆ విద్యార్థి పేరు రాంరెడ్డి. ఇలాంటి హింసాకాండ నేటికీ కొనసాగుతున్నది. ప్రభుత్వాలు మారుతున్నాయేగాని హింసాకాండ తీరుతెన్నులు మారటంలేదు.

విడుదలైనవారికి గాంధీగారిపైనున్న భ్రమలు తొలగిపోయాయి. ఎలాంటి హామీలు లేక బేషరతుగా సత్యాగ్రహాన్ని ఆపివేయటాన్ని వారు ఉద్యమానికి వెన్నుపోటు పొడిచినట్టుగా భావించారు.

గాంధీవాది, స్టేటు కాంగ్రెసు సత్యాగ్రహుల రెండవ జట్టుకు నాయకత్వం వహించిన స్వామి రామానంద తీర్థ సత్యాగ్రహ విరమణ పట్ల

సత్యాగ్రహుల మనోభావాలను ఈవిధంగా వెల్లడించాడు: "స్టేటు కాంగ్రెసు ఉద్యమాన్ని తాత్కాలికంగా ఆపివేసిన సమయంలో మేము జైలులో ఉన్నాము. శ్రీ నానల్, ఆయన కమిటీ (వారు) చాలారోజులక్రింద విడుదలైనారు. ఆయన ఉద్యమాన్ని ఆపివేశారు. ఈ విధంగా ఉద్యమాన్ని తాత్కాలికంగా ఆపివేయటానికి అధికారముద్రకూడావడింది. ఈ నిర్ణయపు ఔచిత్యాన్ని మేము అర్థం చేసుకోలేకపోయాము. మాలో కొందరము మహాత్మాజీ సలహా తప్పని భావించి ఆయనపై కోపావేశులమైనాము. స్టేటు కాంగ్రెసు ధ్వంసమైపోతుందనీ మతతత్వవాదులది పైచేయి అవుతుందనీ మేము వాదించేవారము. కానీ నిస్సహాయులమైన మేము తగు సమయానికై నిరీక్షించటం తప్ప చేయగలిగినది ఏమీలేదు." (హైదరాబాదు స్వాతంత్రోద్యమ స్మృతులు : ఇంగ్లీషు ప్రతి : పేజి - 106 - 107)

తర్వాత కాలంలో ఆయన తన అభిప్రాయాన్ని మార్చుకొని పోరాట విరమణ సరైందని భావించారు. కానీ సత్యాగ్రహాన్ని ఆపివేసిన సమయంలో గాంధీవాదులకు కూడా గాంధీగారి చర్య మింగుడుపడలేదని దీనివలన స్పష్టమవుతున్నది.

సత్యాగ్రహ విరమణతో వ్యవహారం ఆగిపోలేదు. స్టేటు కాంగ్రెసు సత్యాగ్రహులు విడుదలైనారు. ఆర్యసమాజీయులు జైలులోనే ఉండిపోయారు. ఈ పరిణామాన్ని గూర్చి స్వామీజీ ఇలా రాశారు :

"......అకస్మాత్తుగా ఒకరోజు ఉదయాన స్టేటు కాంగ్రెసు సత్యాగ్రహులు విడుదల కానున్నారని ఆర్డర్లు చేరినవి. మాకు ముల్లు గుచ్చుకున్నట్టనిపించింది. (We felt the pinch). పోరాటం ఇంకా కొనసాగుతున్నదని తెలిసికూడా వేలాది యువసత్యాగ్రహులను విడిచి స్వేచ్ఛాజీవులమై బయటికి వెళ్ళటం బాధాకరమైనది. అయినా మేము నిస్సహాయులం."

(పై పుస్తకం : పేజి - 107)

ఇదంతా గాంధీజీ వెన్నుపోటు కళ చలువే. వీరుదహరించిన "యువ సత్యాగ్రహులు" ఆర్య సమాజీయులు. వారప్పటికీ సత్యాగ్రహాన్ని సాగిస్తూనే ఉన్నారు. తమ మతపరమైన కోర్కెలను అంగీకరించిన తర్వాతనే వారు సత్యాగ్రహాన్ని విరమించారు. నిజాం ప్రభుత్వం స్టేటు కాంగ్రెసు కోర్కెలను అంగీకరించనప్పటికీ గాంధీగారు సత్యాగ్రహాన్ని విరమించారు. ఈవిధంగాసత్యాగ్రహులు ప్రభుత్వానికి లొంగిపోయి విడుదలయిన అవమానాన్ని భరించవలసివచ్చింది. ఈ రెండు సంస్థలూ వాటి అనుయాయుల మధ్యన ఉన్న ప్రధాన భేదమిది.

ఆర్యసమాజపు మతతత్వాన్ని, దాని ప్రభావాన్ని గూర్చి గోరంతను కొండంతగా చూపెట్టారు గాంధీగారు. వైదికమతాన్ని సంస్కరించాలని కోరే ఈ సంస్థకు ప్రజల్లో పలుకుబడి అతిస్వల్పం. అది కూడా కొన్ని పట్టణాల్లోని హిందూమధ్యతరగతి ప్రజలవరకే పరిమితమైనది. తెలంగాణాలో మరీ తక్కువ. ఆర్యసమాజ సత్యాగ్రహులలో అత్యధికభాగం సంస్థానం వెలుపలివారు కావటమే దీనికి నిదర్శనం. కాగా కాంగ్రెసువాదులు రెండు నెలల్లో సుమారు 4 వందలమంది సత్యాగ్రహం చేసి జైలుకువెళ్ళారు. వీరే గ్రామాల్లో, పట్టణాల్లో ప్రచారం చేసి, ప్రజలను పోరాటంలోకి సమీకరిస్తే ప్రభుత్వాన్ని లొంగదీయటం సులభమయ్యేది. కానీ గాంధీగారు ప్రజాపోరాటానికే వ్యతిరేకులు. మతతత్వపు బూచిని చూపెట్టి ప్రజలు పోరాటంలోకి దిగకుండా జాగ్రత్తపడ్డారు. ఈ విధంగా వారు ప్రజలంటే భయపడి తాను ప్రారంభించిన సత్యాగ్రహ ఉద్యమానికే వెన్నుపోటు పొడిచారు.

గాంధీగారికి, ఆయన అనుయాయులకు, గాంధీ వాదానికి తెలంగాణాలో బలహీనమైన స్థానమేర్పడటానికి ఇదొక బలమైన కారణం.

## 3. ముస్లింలు-మజ్లిస్ ఇత్తెహాదుల్ ముసల్మీన్

భారతదేశమందంతటి వలెనే హైదరాబాదు సంస్థానంలో కూడా ముస్లింల సమస్య ఉండేది. నిజాం నవాబు ముస్లిమవడం వలన దీనికొక ప్రత్యేకత ఏర్పడింది.

పూర్వం ఈ సమస్యలేదని, తర్వాతనే పాలకులు ఈ సమస్యను తెచ్చిపెట్టారని ఒక అభిప్రాయముంది. ఇది చాలావరకు సరైనదే. పూర్వం కూడా అధికారవర్గంలోనూ, సైన్యంలోనూ పోలీసులలోనూ ముస్లింలే ప్రాబల్యం వహించేవారు. ముస్లిమేతరులు ముఖ్యంగా ఆంధ్రులు (తెలంగాణా) హెచ్చుగా ఉన్న ప్రాంతంలో వారికి తగిన ప్రాధాన్యత లేనప్పుడు అదొక సమస్యగాకుంటే మరేమిటి ? ఈ మేరకు పూర్వం కూడా ఇదొక సమస్యగానే ఉండేది. పాలకుల సహనము, ఉదారత్వం, ఉన్నతవర్గాల రాజభక్తి పరాయణత్వం వలన ఇది లేనట్టుగానే కన్పించింది. ఎంత బలహీనంగా ఉన్నా రాజ్యాంగ సంస్కరణలకోసం ఉద్యమం ప్రారంభమయ్యేసరికి పాలకులు తమ నిజస్వరూపంతో బయటపడినారు. ఇలాంటి సమస్యలను ముందుకు తెచ్చినారు.

గతంలో హిందువులు, ముస్లింలు సోదరభావంతో ఉండేవారని చెప్పేదంతా దీనికి లోబడినదే.

ఇక్కడ రాజు ముస్లిం (నిజాంనవాబు). తెలుగువారు, మహారాష్ట్రులు, కర్ణాటకులు ప్రజలు. స్థానికులైన ముస్లింలలో కూడా భూస్వాములూ, రైతులూ, కూలీలూ ఉన్నప్పటికీ, వారిలో మధ్యతరగతి ఉద్యోగులే హెచ్చుగా ఉండేవారు. ఉత్తర హిందూస్థానం నుండి, దక్షిణాది రాష్ట్రాలనుంచివచ్చిన ముస్లింలు గణనీయమైన సంఖ్యలో ఉండేవారు. అయినా ముస్లింల సంఖ్య తక్కువే ఉండేది.

చివరి నిజాం నవాబు (ఏడవ) అధికారంలోకి వచ్చిందీ (1911), బ్రిటిష్ ఇండియాలో రాజ్యాంగ సంస్కరణల కోసం ఉద్యమం ప్రారంభమైనదీ దాదాపు ఒకే సమయం. దాని ప్రభావం సంస్థానంపై కూడా పడింది. క్రమంగా హిందూ ముస్లిం విద్వేషాలకూ, కల్లోలాలకూ దారితీసింది. దీనిఫలితంగా ఇక్కడ కూడా ముస్లిం రాజకీయాలు ప్రారంభమైనవి. కీ. శే. మందుముల నరసింగరావుగారు ఇలా రాశారు :

"...కాని బ్రిటిష్ భారతప్రాంతములో వ్యాపించిన మతకలహములు ఇక్కడ వ్యాపించడానికి ఈ రాష్ట్రం సరిహద్దులు అడ్డుపడలేదు. ఇక్కడ కొన్ని హిందూ ముస్లిం కలహములు, అల్లర్లు జరుగగానే 1926 లో "ఇత్తెహాదుల్ ముస్లిమీన్" అను సంస్థకు పునాదులు వేయబడ్డవి. రాష్ట్ర మతశాఖకు సంబంధించిన ఒకపెద్ద అధికారి సదర్ యార్‌జంగు అనువారు అధ్యక్షత పదవి స్వీకరించినారు. మొత్తముపైన ఇక్కడినుంచి హైదరాబాదు రాష్ట్ర ముస్లిం రాజకీయాలు ఆరంభమవుతాయి". (50 సంవత్సరముల హైదరాబాదు : పేజి-83).

1923లోనూ, తర్వాతా సంస్థానంలో హిందూ ముస్లిం కలహాలు జరిగినవి. మూడు సంవత్సరాలు తిరుగక ముందే ముస్లింల సంస్థ ఏర్పడింది. ప్రభుత్వమే చొరవతో ఏర్పాటుచేసి ఒక ఉన్నతాధికారికి ఆ బాధ్యతను అప్పగించింది. ఇదంతా నిజాం ఒక్కడే చేశాడనడం సరికాదు. అప్పటికే బ్రిటిష్‌ఉన్నతాధికారులు సంస్థాన పరిపాలనా వ్యవహారాలను నడిపించేవారు. వారి తోడ్పాటుతో ఏర్పడినదే ఈ సంస్థ. ఏర్పడిననాటికే ఆంధ్రోద్యమం మొదటి దశలో ఉంది.

బహద్దూరు యారుజంగు అను ముస్లిం జాగిర్దారు నాయకత్వాన ఈ సంస్థ క్రమంగా బలం పుంజుకున్నది. ఆయనతో బాగా పరిచయమున్న శ్రీ మందుముల వారు ఆయనను గూర్చి ఇలా రాశారు :

"వీరు ఇత్తెహాదుల్ ముసల్మీన్ సంస్థ అధ్యక్ష పదవినలంకరించి దర్బారులో నిజాం ప్రభువరేణ్యుల మన్ననలు పొంది హైదరాబాదు రాష్ట్ర ముస్లింల నాయకత్వం వహించిరి." (పై పుస్తకం : పేజి - 148)

పాలకులకూ, ఈ సంస్థకూ ఉన్న సంబంధాన్ని మరింత స్పష్టంచేస్తున్నదీ వివరణ.

ఆయన ప్రతిభా విశేషాలను ఇలా రాశారు :

"బహద్దురు యార్‌జంగు ఇస్లాం మతము గురించి ప్రత్యేకంగా ఖురాన్ యొక్క భాష్యము, ఇస్లాం చరిత్ర మొదలగు విషయాలగురించి బాగా అధ్యయనం చేసినారు. ఆరు అడుగులకంటె ఎత్తుగల ఆజానుబాహుడు. మరియు ఆయన గర్జన ధ్వని సభలలోని సభ్యులను ఆకర్షించేది. ఆయన ఉర్దూ భాషలో బాగా ఉపన్యసించేది. మంచి వక్త అనుకోబడేవారు." (పేజి - 148)

1935 రాజ్యాంగం అమలులోకి రావడంతో కేంద్రంలో స్వదేశీ సంస్థానాల ప్రాతినిధ్యం సమస్య ముందుకు వచ్చిన సందర్భంలో "ఇత్తెహాదుల్ ముసల్మీన్" ఈ విధంగా ప్రకటించింది :

"1) హైదరాబాదు ప్రభుత్వము సర్వ స్వాతంత్ర్యముగల రాజరికంగా నుండవలెను. ఆసపుజాహీ వంశీకుడైన ఒక ముస్లిం సభ్యుడు రాజుగానుండవలెను.

"2) భారత సమాఖ్య సంవిధానములో హైదరాబాదుకు తప్పనిసరిగా చేరవలసివస్తే, దాని రాజకీయాధికారములో యేలాటి లోపం కలుగకూడదు. మరియు ఆర్థికాభివృద్ధికి ఉన్న అవకాశములు దెబ్బతినకూడదు.

"3) దేశాభివృద్ధికై ప్రస్తుత రాజ్యాంగ చట్టములో మార్పులు తప్పనిసరిగా చేయవలసివస్తే ముస్లింల రాజకీయ ఉన్నతికి దెబ్బతగిలేలాంటి మార్పును దక్కను ముస్లిములు కదాపి అంగీకరించరు.

"అ) శాసన సభ మరియు స్థానిక స్వపరిపాలన సంస్థలలో ముస్లిములు చట్టరీత్యా అధిక సంఖ్యలో ఉండవలెను.

"ఆ) ప్రత్యేక నియోజకవర్గములద్వారా ముస్లిముల స్థానాలు నింపివేయవలెను.

"4) ఉర్దూ భారతదేశ ప్రజలందరి భాషగ, మరియు హైదరాబాదు రాష్ట్ర భాషగా పరిగణింపబడినది. కావున హైదరాబాదు ప్రభుత్వ భాషగా మరియు

ప్రాథమిక పాఠశాలలో, విశ్వవిద్యాలయములో బోధనా భాషగా యెల్లప్పటికి భాయముండవలెను.

"5) ఉద్యోగాలు ముస్లిముల చారిత్రక, రాజకీయ గౌరవ సమస్యనేగాక ఆర్థిక సమస్యకూడ. కావున ఈ విషయములో మత సంబంధమైన "దామాష" అను ప్రశ్న ఉత్పన్నము కాజాలదు. ముస్లిములు ఉద్యోగాలు వదులుకొనుటకు యెల్లప్పటికీ సిద్ధంకారు." (పై పుస్తకం : పేజి : 157 - 158)

ఇవి ఆనాటి ప్రభుత్వపు విధానాలే. వీటికి ప్రభుత్వపు ఆమోదముద్ర ఉందని వేరే చెప్పనవసరంలేదు.

మతంమార్పిడి ఉద్యమం ( Conversion movement ) : హిందువుల్ని ముస్లింలలోకి చేర్చుకోవడం. సమాజంలో అట్టడుగున ఉంటూ అందరి కన్నా బలహీనులు మాదిగ, మాలలు ("హరిజనులు"). క్రీస్తుమతంవారైనా, ఇస్లాం మతంవారైనా ముందు వీరినే తమతమ మతాలలోకి ఆకర్షించుకోడానికి ప్రయత్నించారు. క్రైస్తవ మతంలో చేరినందువలన రాజకీయమైన సమస్యలు రాలేదు. కాగా ఆ మతం బాగా వ్యాపించింది. ఇస్లాంలో చేర్చుకోవటము ప్రారంభ మైన తర్వాత ఇదొక పెద్ద సమస్యగా ముందుకువచ్చింది. పేదలైనవారికి కొన్ని సౌకర్యాలు కలుగజేసి మరికొన్నిటిని వాగ్దానాలు చేసి వారిని ఇస్లాం మతంలోకి చేర్చుకునేవారు. హిందూ భూస్వాములు దీన్ని వ్యతిరేకించారు. వీరు (మాదిగ, మాలలు) ముస్లింలవగానే తమ పనులు (వెట్టిచాకిరి, ఇతర వ్యవసాయ పనులు) సాగటం కష్టమనీ, తమతో సమానంగా ఉండాలని కోరుతారని వారి భయం. మాదిగ మాలలు కానివారు కూడా వెట్టిచాకిరీ పొలంపనులుచేసినప్పుడు వీరు ఇస్లాం స్వీకరించటంవలన వారికివచ్చే నష్టమేమీ లేకుండెడిది. అయినా సంస్థానంలో ముస్లింలకున్న ప్రత్యేక రాజకీయ స్థానం వలన తమ చెప్పుచేతల్లో ఉండే మాదిగ, మాలలు పైస్థాయికి రావటానికి వారు ఇష్టపడలేదు. ధనికరైతులనుంచి, వర్తకుల నుంచి కొంత డబ్బు ప్రోగుచేసి దాని సాయంతో మతాంతీకరణను నిరోధించ ప్రయత్నించినారు. అయినా ఇస్లాంను స్వీకరించిన మాలమాదుగుల నుండి భూస్వాములు ఇబ్బందులు ఎదుర్కోలేదు. కాగా వారు ఫ్యూడల్ వ్యతిరేక పోరాటాల నుంచి దూరంగా ఉన్నారు. రాజకీయ కారణాలవల్లనే హిందూభూస్వా ములలో అత్యధికులు మతంమార్పిడిని వ్యతిరేకించారు. హరిజనులను ఇస్లాంలోకి చేర్చటానికి ప్రప్రక్రియగా ఆర్యసమాజీయులు "శుద్ధి" కార్యక్రమాన్ని అమలుజరిపి కొందరిని తిరిగి "హిందువులు"గా మార్చారు. దీని ఫలితంగా హిందూ-ముస్లిం

కొట్లాటలు చెలరేగాయి. దీనితో మాలమాదుగులను మూకుమ్మడిగా ఇస్లాంలోకి చేర్చటం మానివేశారు. అయినా వ్యక్తులుగా మతం మార్చుకోవటం కొనసాగింది.

ఇస్లాంలోకి మార్చే ఉద్యమాన్ని "తబ్లీగ్-ఎ-ఇస్లాం" అనేవారు. (ఇస్లాం మతప్రబోధం వ్యాప్తి). తెలంగాణాలోనే కాక మరట్వాడా కర్ణాటక జిల్లాల్లో కూడా ఈ ఉద్యమం విఫలమైంది. మాలమాదిగలు ఇస్లాంను స్వీకరించడానికి ఆసక్తి కనవరుచలేదు. దీనివలన అస్పృశ్యతా నివారణ జరుగుతుందని, సమాజంలో గౌరవప్రదమైనస్థానాన్ని సంపాదించగలుగుతామని వారు భావించలేదు.

పట్టణాల్లో చదువుకున్నవారు, మధ్యతరగతివారు హరిజన సేవకసంఘం, అస్పృశ్యతా నివారణ వంటి సంఘసంస్కరణోద్యమాల వైపున ఆకర్షింపబడినారు. అక్కడక్కడ డాక్టర్ అంబేద్కర్ గారి అనుయాయులు కూడా ఉండేవారు. ఆంధ్రోద్యమ సభలలో పై సంస్థల నాయకులు పాల్గొనేవారు; వాటి ఆశయాలను ప్రచారం చేసేవారు. ఆంధ్రమహాసభ ఆ దశలో అనుసరించిన వెట్టిచాకిరీ వ్యతిరేక కార్యక్రమం వీరిపై ప్రభావం కలుగజేసినట్టుగా ఆధారాలేమీ కన్పించలేదు.

**అనల్ మలిక్ సిద్ధాంతం :** ఇతనికాలంలో "అనల్ మలిక్" అను సిద్ధాంతం ప్రచారంలోకి వచ్చింది. "నేను రాజును" అని దాని అర్థం. "ప్రతి ముస్లిం నేను రాజును అని అనుకోవాలి. ఈ దేశంలో మిగిలిన ఒకే ముస్లిం రాజ్యమైన ఈ సంస్థానాన్ని ముస్లిములంతా కాపాడుకోవాలి", అనే నినాదాన్ని వ్యాపింపజేశారు. విద్యార్థుల ప్రార్థనా గేయాల్లో ఈ అర్థంవచ్చేది ఒకటి ఉండేది. ముస్లింలలో ముఖ్యంగా చదువొచ్చినవారిలో ఈ సిద్ధాంతం కొంతవరకు వేళ్ళూనుకున్నది.

**ముల్కీ ఉద్యమం :** "ములుకు" అనేది ఉర్దూ పదం. దేశమని దీని అర్థం. ముల్కీలంటే దేశీయులు. వీరిని స్వదేశీయులు అనికూడా అనవచ్చును. హైదరాబాదు సంస్థానంలో పుట్టిపెరిగినవారిని ముల్కీలని నిర్వచించారు. క్రమంగా 15 సంవత్సరాలపాటు నివసించినవారిని "ముల్కీ"లుగా పరిగణించారు.

దేశంలో బ్రిటిష్ పరిపాలనవలన వృద్ధి అవుతున్న నిరుద్యోగాన్ని తట్టుకోలేక వివిధ ప్రాంతాల ముస్లింలు సంస్థానంలోకి వచ్చి ఉద్యోగాలు సంపాదించుకునేవారు. ప్రభుత్వం ఇలాంటిరాకను ప్రోత్సహించేది. కానీ ఆ ప్రాంతాల హిందువులకు అలాంటి ప్రోత్సాహం ఉండేదికాదు. దక్షిణ ప్రాంతంనుంచి కొద్దిమంది ముస్లింలు మాత్రమే రాగలిగారు. దీని ఫలితంగా స్థానిక ముస్లింలు తమకు రావలసిన ఉద్యోగాలన్నీ ఉత్తర హిందూస్థానం నుంచి వచ్చిన వారంతా కొట్టేస్తున్నారని

వారి రాకను వ్యతిరేకించసాగారు. ఈ విధంగా ఈ సమస్య హిందూ ముస్లింల మధ్య వచ్చినది కాదు. స్థానిక ముస్లింలు ఇతర రాష్ట్రాలనుంచి, ముఖ్యంగా ఉత్తర హిందూస్థానంనుంచి వచ్చిన ముస్లింలకు వ్యతిరేకంగా తెచ్చిన ఉద్యమమే ఇది. మందుముల నర్సింగరావులాంటి మితవాదులుకూడా దీనిని బలపరిచినారు. సంస్థానం లోని ఉద్యోగాలను ముల్కీలకే ఇవ్వాలని నిజాం నవాబు ఫర్మానా జారీచేశాడు. అయినా ఇతర రాష్ట్రాలవారు నిరాటంకంగా వచ్చినారు. బొంబాయికి చెందిన సర్ అక్బర్ హైదరీ ప్రభుత్వంలోని కీలక స్థానంలో ఉంటూ తనకు కావలసినవారంద రినీ తీసుకొచ్చాడు. అతని మాటకు ప్రభుత్వంలో ఎదురులేదు. తుదకు అడవి (ఫారెస్టు) కంట్రాక్టర్లుకూడా బొంబాయినుంచి వచ్చేవారు. రైల్వే ఉద్యోగాలలో కూడా అతనికి సంబంధించినవారిని పెట్టేవాడు. వీరంతా ముస్లింలే. ఇతడు ముందు ఆర్థిక మంత్రి, తర్వాత ప్రధాన మంత్రి అయినాడు. పలుకుబడి గలిగిన ఏ ఉద్యోగయినా నాటికీ, నేటికీ చేస్తున్న పని ఇదే.

## 4. ఆర్యసమాజం

ఇస్లాంలోకి మతంమార్పిడి ఉద్యమం (conversion movement) ప్రారంభమైన తర్వాత ఆర్యసమాజం బలంపుంజుకున్నది. ఈ సంస్థ ఉత్తర హిందూస్థానం నుంచి వచ్చినది. ఆకాలంలో పంజాబ్ రాష్ట్రంలో ఇది చాలా బలంగా ఉండేది. ఇప్పుడు కూడా పంజాబు, హర్యానా, ఢిల్లీ ప్రాంతాలలో పని చేస్తున్నది. దక్షిణదేశంలో ఈ సంస్థ నామమాత్రంగా ఉంది. ఇతర ప్రాంతాల స్థితి కూడా ఇంతే. సంస్థానంలోని ఆనాటి ప్రత్యేక పరిస్థితులలో ఈ సంస్థ బలం పుంజుకున్నది.

ఆర్య సమాజం అంటే ఏమిటో ఆ కాలపు ప్రజలకు అంతగా తెలియదు. పట్టణాలలో నివసించేవారికి (హైదరాబాదు, జిల్లా, తాలూకా కేంద్రాలలో) ఒక మేరకు తెలిసింది. ఆర్య సమాజీయులు పట్టుదలతోచేసిన ప్రచారమే దీనికి కారణం.

దీనిని వైదిక మత సంస్కరణోద్యమమని చెప్పవచ్చును. ఈ సంస్థ ద్వారా దీనికొక నిర్మాణ స్వరూపమేర్పడినది. వారి నిర్వచనం ప్రకారం "హిందువు" అనే పదం తప్పు ; "హిందువులనేవారు లేరు ; వారంతా ఆర్యులు" హిందువు అనే పదానికి బానిస అని అర్థమనీ, పాశ్చాత్యులు వారిని బానిసలుగా చూపెట్టడానికి రూపొందినదే ఈ పదమని వారు చెపుతారు. ఈ కారణం వలన

"మనం హిందువులము కాము. ఆర్యులము" అని వారు చెప్పేవారు. "హమ్ కౌన్ హై ? క్యాహై ?" అంటే మనం ఎవరము ? గతంలో మనం ఏ విధంగా ఉన్నాము ? ఆర్య సమాజ ప్రచారకుల మొదటి ఉపన్యాసం దీనిపైనే ఉంటుంది. దీనిలోనే మనం ఆర్యులమనీ, ఇది వేదాలలో ఉన్న పదమనీ, "హిందువుల"నే పదం వాటిలో లేవనీ చెపుతారు. ఈ అంశాలన్నీ చక్కగా వివరించి, 'మనం పూర్వకాలంలో చాలా గొప్పవారము. ఈ దుస్థితి ముస్లిం రాజులు, బ్రిటిష్‌వారి వలన వచ్చింది. సంస్థానంలో ముస్లిం రాజు ఉండటంవలన బానిసత్వం వచ్చింది మనం స్వతంత్రులం కావాలంటే వేదకాలానికి వెళ్ళి జీవించాలి"— అనేది వారి ఉపన్యాస సారాంశం. 'మనం హవనం చేయాలి' అని కూడా చెపుతారు. కొందరు ఆధునిక విజ్ఞాన శాస్త్రమంతా వేదాలలో, ఇతర సంస్కృత గ్రంథాలలో పొందు పరచి ఉందనీ, పాశ్చాత్యులు వాటిని తమ దేశాలకు తీసుకువెళ్ళి నేటి విజ్ఞాన శాస్త్రాన్ని అభివృద్ధి చేశారని చెపుతారు. పునరుజ్జీవనవాదానికి (revivalism) ఒక రూపం.

దయానంద సరస్వతి రచించిన 'సత్యార్థప్రకాశిక' అనే ఒక గ్రంథ మున్నది. దానిలో ఆయన అన్ని మతాలను విమర్శించి వైదికమతమే అన్నిటి కన్న శ్రేష్టమైనదని స్థిరపరిచాడు. తనవాదనల్లో సిక్కుమతాన్ని కొంత మెచ్చు కున్నా దాన్ని కూడా విమర్శించాడు. క్రైస్తవమతాన్ని తీవ్రంగా విమర్శించాడు. ఇస్లాం అంతా అజ్ఞానమేనని చెప్పాడు. కొంత హేతువాదమున్నా దానితోపాటు కటువైన విమర్శన కూడా ఉంది. ఆయామతాల ఛాందసులు ఈ విమర్శనను సహించలేరు. వారి అనుయాయులు దీనిని అర్థంచేసుకోవడం కూడా కష్టమే. దయానంద సరస్వతి వేదాలలో ప్రక్షిప్తమైన అంశాలెన్నో ఉన్నాయని చెప్పడమే గాక, వాటినన్నిటిని తీసివేసి వాటిని తిరిగిరాసినట్టుగానూ, అవే నిజమైన వేదాలనీ ఆర్యసమాజంవారు చెపుతారు. ఆర్యసమాజీయులంతా "సంధ్యావందనం" చేయా లంటారు. వారి సంధ్యావందనం సంప్రదాయమైనదానికి భిన్నంగానూ, క్లుప్తంగానూ ఉంటుంది. పెళ్ళితంతు కూడా ఇదేవిధంగా ఉంటుంది.

మనుధర్మశాస్త్రంలోని షోడశ సంస్కారాలను సమర్థించటమే కాక ఈకాలంలో కూడా ఆచరించాలంటారు ఆర్యసమాజీయులు. అయితే పుట్టుకతోని ఏకులమూ ఏర్పడదంటారు. నాలుగు వర్ణాలూ (కులాలు) వృత్తిరీత్యా ఉంటా యనీ, వుండాలనీ వారి అభిప్రాయం. ఎవరైనా బ్రాహ్మణుడు, క్షత్రియుడు, వైశ్యుడు, శూద్రుడు కావచ్చునని ఖచ్చితంగా చెప్పేస్తారు. తమ వాదనాపటిమతో

దీనిని రుజువుచేయడానికి ప్రయత్నిస్తారు వేదాల్లో కూడా ఈ విధానమే ఉందని వాదిస్తారు.

అస్పృశ్యత : వారు అంటరానితనాన్ని వ్యతిరేకిస్తారు. వేదాలలో దీనికి స్థానం లేదంటారు. దీనికి వ్యతిరేకంగా ప్రచారం చేస్తారు. దీనిని నిర్మూలించడం తమ కార్యక్రమమని చెపుతారు. వితంతు వివాహాలను ప్రోత్సహిస్తారు. మూర్తి పూజను (విగ్రహారాధన) ఖండిస్తారు. విగ్రహారాధన వేదాల్లో లేదని తర్వాత తెచ్చిపెట్టినదని చెపుతారు. ప్రతివారూ విగ్రహంలేకనే ప్రార్థన చేయాలని బోధిస్తారు. దేవుని ప్రార్థనతో ఉపన్యాసాన్ని ప్రారంభిస్తారు; దానితోనే ముగిస్తారు.

స్వచ్ఛందంగానూ, వేతనాలపైనా పనిచేసే ప్రచారకులు ఆకాలంలో తగిన సంఖ్యలో ఉండేవారు.

ఉత్తర హిందూస్థానంలో ఇస్లాం తాకిడినుంచి తట్టుకోడానికి పంజాబులో సిక్కుమతం పెద్దఎత్తున వ్యాపిస్తున్న సమయంలో వైదికమతాన్ని కాపాడటానికి ఆర్యసమాజాన్ని స్థాపించాడు దయానంద సరస్వతి. ఆయన గొప్పపండితుడు. శ్రద్ధానందుడు వారి అమరవీరుల్లో ముఖ్యుడు.

కీ॥ శే॥ పండిత నరేంద్రజీ ఆకాలంలో యువకుడు. హిందీలో మంచి వక్త. ఉత్తేజకరమైన ఆయన ఉపన్యాసాలను వినడానికి పెద్దసంఖ్యలో యువకులు వచ్చేవారు. ప్రభుత్వం ఆయనంటే వణికిపోయేది. ఒకసారి ప్రభుత్వం ఆయనను మనానూరులో నిర్బంధించింది. ఈ ప్రదేశాన్ని సంస్థానంలోని "కాలాపాని" అనేవారు. (బ్రిటిష్ హయాంలో అండమాన్ దీవులను 'కాలాపానీ' అనేవారు. నల్లనీరు అని దాని అర్థం. రాజకీయ ఖైదీలను ఇక్కడి జైల్లో ఉంచేవారు. సావర్కారు తన జైలు జీవితాన్ని అక్కడ గడిపారు). మహబూబునగరు జిల్లాలోని నల్లమల అడవులలో అమరాబాదు సమీపాన ఉంది ఈ గ్రామం.

హైదరాబాదు వీరి కేంద్రకార్యాలయం. కొన్ని జిల్లాల్లో శాఖలుండేవి. తర్వాత కాలంలో కొన్ని తాలూకా కేంద్రాలకు వ్యాపించింది. ప్రభుత్వ మద్దతు ఉన్న ముస్లింల ఒత్తిడిని తట్టుకోలేని వర్తకులు కొందరు దీనినాశ్రయించారు. మార్వాడీలు, ఇతర ఉత్తర హిందూస్థానీయులు దీనికి వత్తాసుగా ఉండేవారు. ఆర్యసమాజీయులు శాకాహారులైనా మాంసాహారులు కూడా దానిలో చేరేవారు. అన్నికులాలవారు-ముఖ్యంగా యువకులు-ఆర్యసమాజంలో చేరేవారు. హైదరాబాదు నగరంలో తప్ప ఇతర ప్రదేశాల్లో దీనికి బలం స్వల్పం.

ఏమతంవారైనాగాని "శుద్ధి" ద్వారా ఆర్యసమాజంలో చేర్చుకుంటారు. ఇస్లాం స్వీకరించిన హిందువులందరినీ తిరిగి హిందువుల్లోకి చేర్చుకోవాలంటారు. సనాతన ధర్మంలో ఇతర మతాల్లోకి చేరిన వారిని తిరిగి తమలోకి తీసుకునే కార్యక్రమమూలేదు. అందువలన దానికి అవసరమైన కర్మకాండలేదు. దానికి విరుద్ధంగా ఆర్యసమాజంవారు ఇస్లాంను వదిలి వైదిక ధర్మాన్ని అవలంబించే వారిపై కేంద్రీకరించి "శుద్ధి" కార్యక్రమాన్ని అమలుజరిపారు. మతం మార్చుకున్నప్పుడు వెంటబడి తిరిగి "వైదికమతంలోకి" తీసుకొచ్చేవారు. కొన్ని సందర్భాల్లోనే ఇది సాధ్యమయ్యేది.

ఆర్యసమాజం మతపరమైన సంస్థ. గాంధీగారి అహింసా సిద్ధాంతాన్ని తీవ్రంగా విమర్శించినా ఆ సంస్థ సభ్యులు కాంగ్రెసు రాజకీయాల్లో పాల్గొనేవారు. పండిత వినాయకరావు విద్యాలంకార్, ఆకాలంలో సంస్థాన ఆర్యసమాజ నాయకుడు. ఆయన బూర్గుల మంత్రివర్గంలో సభ్యుడు.

వైదిక మతాన్ని సంస్కరించటానికి ఎందరో కృషిచేశారు ఎన్నో సంస్థలు ఏర్పడినవి. వాటిలో ఆర్యసమాజం ఒకటి. మూఢ విశ్వాసాలను, మూఢాచారాలను వ్యతిరేకించినా ఫ్యూడల్ వ్యవస్థనూ, దానిద్వారా ఏర్పడే సాంప్రదాయాలనూ సమర్థించేవారు. మనుధర్మశాస్త్రాన్ని పూజనీయంగాభావించుటే దీనికి తిరుగులేని నిదర్శనం. ఫ్యూడలిజంతో బాటు పెట్టుబడిదారీ విధానాన్ని కూడా సమర్థించేవారు. పరిశ్రమలు వా పారాభివృద్ధి కావాలని కోరేవారు. పట్టణాలలో వీరిని బలపరిచే వారంతా ఈకోవకు చెందినవారే.

ఫ్యూడలిజాన్ని బలపరచటం వలన ఈ సంస్థకు వర్గరీత్యా భూస్వాముల మద్దతుఉండేది. వారిలో హెచ్చుమంది సనాతన ధర్మపరాయణులే. బ్రాహ్మణేతర భూస్వాములు కూడా ఈ కోవకు చెందినవారే. వారి కొడుకులు స్కూళ్ళలో, కాలేజీల్లో చదువుకున్నప్పుడు ఏదోమేరకు ఆర్యసమాజ భావాలతో ప్రభావితులైనారు. అయినా ఈ సంస్థ ఫ్యూడల్ భూస్వాముల ఆదరణ సంపాదించలేదు. వైదికమతాన్ని సంస్కరించాలనే భావాలు వారికి గిట్టకపోవుటే దీనికి ప్రధాన కారణం.

మతప్రమేయమే సర్వస్వమైనా నిజాం ప్రభుత్వాన్ని వ్యతిరేకించే మిలిటెంటు సంస్థగా ముందుకువచ్చింది. మతస్వాతంత్ర్యం కోసం సత్యాగ్రహం చేసి, కొన్ని హక్కులను సాధించింది. ఈమేరకు పట్టణప్రజల దృష్టిని ఆకర్షించ

గలిగింది. కాని నిజాం ప్రభుత్వం మారి, దానిస్థానంలో కాంగ్రెసు ప్రభుత్వం రావటంతో ఈ సంస్థకు రాజకీయాల్లో స్థానం లేకుండా పోయింది.

## 5. సంఘసంస్కరణోద్యమాలు

తెలంగాణాలో చెప్పుకోదగిన సంఘ సంస్కరణోద్యమాలు తలఎత్తలేదు. వ్యాపించలేదు. సర్కారు జిల్లాల్లోని ఉద్యమాల ప్రభావం అతిస్వల్పం. వితంతు వివాహాల నిషేధమున్నవారిలో వాటిని జరిపించటానికి చేసిన కృషి ఫలించలేదు. ఖమ్మంలో జరిగిన మూడవ ఆంధ్రమహాసభలో బాల్యవివాహాన్ని వ్యతిరేకించే "పెద్దలు" దానికి సంబంధించిన తీర్మానాన్ని చర్చకు రాకుండా ఆపివేయగలిగినారు. ఈ విధంగా సంఘ సంస్కరణోద్యమం నీరసంగా ఉండినది; ఉద్యమ వ్యతిరేకుల దాడికి తట్టుకోలేకపోయింది. దీనికిగల కారణం ప్రభుత్వ జోక్యమే. సంస్థానంలో హిందువులకు మతస్వాతంత్ర్యం లేనట్టే. సంఘ సంస్కరణోద్యమానికి కూడా స్వాతంత్ర్యంలేదు. అయినా సంఘ సంస్కరణోద్యమాన్ని దెబ్బ తీయటానికి, సనాతన ధర్మవాదాన్ని బలపరిచింది. ఈ వైఖరి ఆర్యసమాజ వ్యతిరేకతలో బయటపడింది. ఖమ్మం ఆంధ్రమహాసభలో కూడా ప్రభుత్వం తటస్థంగా ఉన్నట్టు నటిస్తూ సనాతన ధర్మవాదులను బలపరిచింది.

సర్కారు జిల్లాల్లో పరిస్థితి మరోరకంగా ఉండినది. బ్రిటిషు సామ్రాజ్యవాదులు ఈ ఉద్యమాలను వ్యతిరేకించలేదు. ఈ ఉద్యమాల వలన తమ రాజ్యాధికారానికి ప్రమాదం లేకపోవుటే దీనికి కారణం. ఉద్యమ నాయకులు సంఘ సంస్కరణ వ్యతిరేకులతో మాత్రమే పోరాడవలసి వచ్చింది. దీనివలన వారికి తమ ఉద్యమాలను బలపరచుకోడానికి సౌలభ్యమేర్పడింది.

కులప్రాతిపదికపై ఏర్పడిన సంస్థలు : తెలంగాణాలో సంఘ సంస్కరణోద్యమాలు లేకున్నా కులప్రాతిపదికపై సంస్థలు ఏర్పడినవి. ప్రజల్లో ఐక్యత లేకుండా చేయటానికి ప్రభుత్వం వీటిని ప్రోత్సహించింది. వీటిలోముఖ్యమైనది రెడ్డి హాస్టలు. దీనిద్వారా కులతత్వానికి అంకురార్పణ జరిగింది. తర్వాత కాలంలో ఇదొక మహావృక్షమై ఇతర కులాలకు వ్యాపించింది.

సర్కారు, రాయలసీమ జిల్లాలలో ఏర్పడిన సంస్థలకు తెలంగాణాలో ఏర్పడిన వాటికి ఒక భేదముంది. ఆ జిల్లాలలో ఎన్నికల తతంగం చాలాకాలం క్రిందటే ప్రారంభమైంది. దానికీ కులసంస్థలకూ అవినాభావ సంబంధం ఉంది.

కాని తెలంగాణాలో ఆకాలంలో ఎన్నికల ప్రమేయంలేదు. అయినా పక్కనేఉన్న తెలుగు జిల్లాల ప్రభావం ఇక్కడ కూడా పడింది.

రెడ్డిహాస్టలు, ఆమాటకొస్తే ఇతరకులాల సంస్థలూ ప్రారంభంలో ఏదో ఒక ప్రత్యేక కులానికి వ్యతిరేకంగా ఏర్పడినవికావు. తమతమ కులాల అభ్యున్నతి కోసమే ఏర్పడినవి. కాని కులప్రాతిపదికపై ఇలాంటి సంస్థలు ఏర్పడుటతో కుల తత్వానికి పునాదిపడింది. పేదలు, ధనికులనే తారతమ్యం లేకుండా కుల ప్రాతిపదికపై సంఘటితపడసాగినారు. ఈ సంస్థల ద్వారా ఆయాకులాల పేదలు లాభపడింది అతిస్వల్పం కాని సంపన్నులు మాత్రం బాగా లాభపడినారు. వారు తమతమ కులాలకు నాయకులై పెద్ద పదవులను సంపాదించుకున్నారు.

ఎన్నికలులేని నిజాం సంస్థానంలో ఏ కులంవారికిపదవులూలేవు. ఉద్యోగాలూ లేవు. వాటికోసం తగవులూ లేవు. కులభేదంలేకుండా హిందువులంతా ఉద్యోగాలు కావాలని కోరేవారే. ఈ కారణాన కులతగాదాలు పొటమరించలేదు. కాని కుల సంఘాలు మాత్రమేర్పడినవి. వాటిలో మున్నూరు కాపులసంఘం ముఖ్యమైనది. గోలకొండ యాపారులు కూడా (నియోగుల్లో ఒకశాఖ) 1938 ప్రాంతంలో హైదరాబాదులో ఒక హాస్టలును ఏర్పాటుచేశారు. ఒక సంవత్సరమైన తర్వాత ఇది మూతపడిపోయింది. ఆంధ్రమహాసభ ఇలాంటి సంఘాలను ప్రోత్సహించింది. ఆంధ్రమహాసభ నాయకులే కులసంఘాల నాయకులైనారు. సురవరం ప్రతాపరెడ్డి గారు రెడ్డిహాస్టలుకేగాక 'యాదవ సంఘానికి, ముదిరాజ సంఘానికి, గౌడ సంఘానికి కూడా కార్యదర్శిగా ఉంటూ' పనిచేసినారని ముద్దసాని రాంరెడ్డి రాసిన జీవిత చరిత్రలో ఉన్నది (పేజి-20). ఎన్నికలులేని కాలంలో కులతగాదాలు కూడా లేవనే యథార్థాన్ని తెలుపుతున్నదీ పరిణామం.

1936, 1946 లో ఉమ్మడి మద్రాసురాష్ట్రంలో కాంగ్రెసు అధికారంలోకి రాగానే తెలంగాణాలో కులసంస్థలు బలపడసాగినవి. దగ్గరి భవిష్యత్తులో ఎన్నికలు రానున్నాయని దూరదృష్టిగల సంపన్నులు ఏర్పాటుచేసిన కుల సంఘాలే ఇవి.

1937 పూర్వం తెలంగాణాలో ఆర్యసమాజం తప్ప సంస్కరణోద్యమాలన్నీ నామమాత్రంగానే ఉన్నాయి. ఆనాటి ప్రభుత్వం వీటిని అణచివేయకున్నా ప్రోత్సహించలేదు. సంఘ సంస్కరణాభిలాషులు అటు ప్రభుత్వాన్ని కాదని, ఇటు సనాతన ధర్మవాదులని కాదని తమ కార్యక్రమాన్ని సాగించలేకపోయినారు.

## 6. విద్యార్థి ఉద్యమం – వందేమాతరం సమ్మె

సంస్థానంలో నిర్మాణయుతమైన విద్యార్థి ఉద్యమం ఎప్పుడూ లేదు.

స్కూళ్ళలో కాలేజీలల్లో అధికార యూనియన్లు (official unions) మాత్రం ఉండేవి. వాటికి ఎన్నికలు జరిగేవి. స్కూల్‌డే, కాలేజీ డేలాంటి సందర్భాల్లో వాటికి కొంత పాత్ర ఉండేది. అంతటితో అది అంతర్థానమయ్యేది. యూనియన్ ఫీజు (రుసుం) వసూలుచేసి వాటికి ఖర్చుపెట్టేవారు. ఉద్యోగాలు ఇవ్వడంలో యూనియన్ నాయకులకు కొంత ప్రాధాన్యత ఉండేది. పెద్ద ఉద్యోగాలు దొరకడానికి యూనియన్ నాయకత్వం ఒక సాధనంగా ఉండేది. ఈ కారణాన చాలామంది దీనికోసం డబ్బు ఖర్చుపెట్టి నాయకులయ్యేవారు.

వందేమాతరం సమ్మెకు పూర్వం ఒక సమ్మె జరిగింది. దానిని గురించి వివరాలు లేకున్నా, అది పెద్ద ఎత్తున జరిగిందని, అంతా పాల్గొన్నారని చెప్తుంటారు. సమ్మె విచ్ఛిన్నకారులైన కొందరికి పెద్ద ఉద్యోగాలు ఇచ్చారని విద్యార్థులు చెప్పేవారు. అయినా విద్యార్థుల సమస్యలు ఎప్పటిలాగానే ఉండినవి. చదువుకున్నవారు తక్కువే అయినా వారిలో నిరుద్యోగులు చాలా హెచ్చు. దొరికే ఉద్యోగాల్లో ముస్లింలకు ప్రాధాన్యత ఉండేది. దీనితో ముస్లిమేతరులకు ఉద్యోగాలు దొరకడమే దుర్లభమయ్యేది. ముస్లిమేతర విద్యార్థులకు స్కాలర్‌షిప్పులలాంటి సౌకర్యాలు బహుస్వల్పం.

హైస్కూళ్ళలోనూ, కాలేజీలలోనూ విద్యార్థులు నెత్తిన టోపీపెట్టుకోవటం తప్పనిసరి. తలపై ఏమీ లేకుండా రావటానికి వీల్లేదు. కనీసం తువ్వాలయినా చుట్టుకోవాలి. హైస్కూల్లో కూడా దీన్ని పాటించాల్సివచ్చేది. మహారాష్ట్రలలో ఇలాంటి సాంప్రదాయం ఉన్నప్పటికీ దానిని పాటించేవారూ, పాటించనివారూ ఉంటారు.

1936లో పరీక్షలకు ముందు రోజుల్లో కాలేజీ విద్యార్థులకు యూనిఫారం ఉండాలని నిర్బంధం చేసారు అధికారులు. ఎలాంటి యూనిఫారం ఉండాలి? అది మూడు రకాలు. 1) పైజామా, షేర్వానీ, టోపీ. గాంధీ టోపీతోసహా విద్యార్థి తన ఇష్టం వచ్చిన టోపీ పెట్టుకోవచ్చును. షేర్వానీ ఊదారంగు (blue)లోనైనా, నల్లగానైనా ఉండాలి. పైజామా మామూలే. 2) సూటు వేసుకోవచ్చు. రంగులో మార్పులేదు. 3) ఓవరు కోటు, ప్యాంటు. —— సూటువేసుకునేవారు

కొద్ది సంఖ్యలో ఉండేవారు. షేర్వానీ, పైజామా వేసేవారి సంఖ్య హెచ్చుగా ఉండేది.

ఈ దుస్తులను వేసుకోవాలని నిర్బంధించినప్పుడు కొందరు విద్యార్థులు సమ్మె చేయాలని ఆలోచించారు. కానీ అది పరీక్షల సమయం. దానితో ఈ ఆలోచన మాను కున్నారు. ఈ నిర్బంధపు దుస్తులు వందేమాతరం ఉద్యమందాకా కొనసాగాయి. ఆంధ్ర నాయకులలో కొందరు —కందుకూరి వీరేశలింగం పంతులు, సర్వేపల్లి రాధాకృష్ణన్ మొదలగువారు తలపాగా, పొడుగాటి కోటుఉండే దుస్తులు వేసినప్ప టికీ విద్యార్థులకది రుచించలేదు. చొక్కా, పంచె ఉండే సాదా దుస్తులే కోరుకునే వారు. వారిలో కొందరికైనా ఈ పరాయి దుస్తులంటే ఏవగింపు ఉండేది. తమ సంస్కృతిని అణచివేయటానికి తీసుకున్న చర్యగా కొందరు భావించేవారు.

## 1. విద్యార్థులపై స్టేటు కాంగ్రెసు సత్యాగ్రహ ప్రభావం

సత్యాగ్రహం జరుగుతున్న సందర్భంలో ఉస్మానియా యూనివర్సిటీ విద్యార్థులలో కూడా సంచలనం కలిగింది. వారంతా జట్లు జట్లుగా వచ్చి సత్యాగ్రహ కార్యక్రమాన్ని చూసి వెళ్ళేవారు. అది వారిలో చర్చనీయాంశంగా ఉండేది.

ఆ కాలంలో యూనివర్సిటీలో మూడు హాస్టళ్ళుండేవి. (ఇప్పటికీఉన్నాయి.) ఇప్పటి 'సి' హాస్టలును, "టెంపొరరీ" హాస్టలు (తాత్కాలికమైన హాస్టలు) అనేవారు. 'ఎ', 'బి' హాస్టళ్ళ నిర్మాణానికి పూర్వం దీన్ని కట్టించారు. అప్పుడు దానికి ఆ పేరుపెట్టారు. అది తర్వాతకూడా కొనసాగింది. ఈ మూడు హాస్టళ్ళలో ఉండే "హిందూ" విద్యార్థులకోసం ఒక్కొక్క హాస్టలులో ఒక్కొక్క రూమును ప్రార్థనకొరకు ప్రత్యేకించేవారు. వాటిలో కృష్ణునివి రామునివి పెద్దపెద్ద ఫోటో లుండేవి. రాత్రి 8 లేక 9 గంటలకు ప్రార్థన సమయం. ప్రార్థనకు వెళ్ళినవారు తమకు నచ్చిన భక్తిపాటలు పాడవచ్చును. ప్రార్థన చేయటం ఒక నియమమే కాని నిర్బంధమేమీ లేదు. ప్రార్థన గది ఒకటి ఉన్నదని, అక్కడికి వెళ్ళి ప్రార్థన చేయాలని చాలామంది విద్యార్థులకు తెలియదు గోకులాష్టమి (జన్మాష్టమి) లాంటి పండుగరోజున విద్యార్థులను పిలిచి పూజలు చేసేవారు.

స్టేటు కాంగ్రెసు సత్యాగ్రహ ఉద్యమంతో వచ్చిన ఊపులో "సి" హాస్టలు విద్యార్థులు కొందరు ప్రార్థన చేయాలనే ప్రతిపాదన చేశారు. మొదటిరోజున ఇద్దరో ముగ్గురో ఉన్నారు. రెండవనాటికి సంఖ్య పెరిగింది. కొందరు హిందీ పాటలు, మరికొందరు మరాఠీ పాటలు చదివేవారు. అయినా ఇవి ప్రార్థనకు

సంబంధించినవే. నాలుగైదురోజుల తర్వాత 'వందేమాతరం' అనే గేయాన్ని చదివినారు. ఇలా రెండుమూడు రోజులు సాగింది. ఈలోగా 'ఎ','బి' హాస్టల్ విద్యార్థులకు కబురు వెళ్ళింది. అంతా చదువటం ప్రారంభించారు. ('వందేమాతరం' గేయం చదవడం 'బి' హాస్టలులో ప్రారంభమైనదని కొందరి అభిప్రాయం) ఇంతలో యూనివర్సిటీ అధికారులకు ఈ సంగతి తెలిసింది. అధికారులు హాస్టళ్ళలోని విద్యార్థులను విడివిడిగా పిలిచి, 'ఇది సరైనది కాదు, మీరు మానేయాల'ని చెప్పారు. పత్రికలలో వందేమాతరం గేయం పుట్టు పూర్వోత్తరాలపై కొందరు వ్యాసాలు రాశారు. ఇదొక మతపరమైన గేయమనీ, దీనివలన మత కల్లోలాలు హెచ్చవుతాయనీ, ఈ కారణాలవలన ఏ హాస్టలులోనైనా, ఏ ప్రభుత్వ సంస్థలోనైనా దీన్ని గుర్తించటానికి చదివే సాంప్రదాయాన్ని పాటించటానికి వీల్లేదని ఈ వ్యాసాల సారాంశం. మరోవైపున అధికారులు గేయాన్ని చదువవద్దన్నారు. దీనితో విద్యార్థుల పట్టుదల హెచ్చింది. 'ఇది ప్రార్థన గది. ఆ గదిలో విద్యార్థులు ఏ పాట పాడితే ఏమిటి? రాముడిమీద, కృష్ణుడిమీద పాడితే మీరు వద్దనరుకదా! వందేమాతరం పాడితే ఎందుకు వద్దనాలి? దీనిపై శాసించటానికి వీల్లేద'ని విద్యార్థుల వాదన. ఇవి ప్రభుత్వ హాస్టళ్ళు, విద్యార్థులు తమ ఇష్టం వచ్చింది పాడుకోవటానికి వీల్లేదని అధికారుల వాదన.

'సి' హాస్టలు వార్డను 'హిందువు'. భారతీయ తత్వశాస్త్రపు శాఖాధిపతి. ఆయన అధికారదర్పంతో కాక సర్దుబాటు చేసినట్లుగా చెప్పాడు. తక్కిన హాస్టళ్ళ వార్డెనులుకూడా గొడవచేయలేదు; సర్దడానికే ప్రయత్నం చేసారు. అయినా వందేమాతరం గేయాన్ని పాడవద్దని అంతా అన్నారు. విద్యార్థులు పాడేదే ఖాయమని అన్నారు. అధికారులు హెచ్చరిక చేశారు. దీనితో ప్రార్థన గదుల్లో విద్యార్థుల సంఖ్య పెరుగసాగింది. అంతవరకు పాడుబడినట్టుగా ఉండే గదులు విద్యార్థులతో నిండి కళకళలాడినవి. వారి మొహాల్లో ఉత్సాహమేకాక, దీక్ష, పట్టుదల కొట్టవచ్చినట్టుగా కన్పించింది. విద్యార్థుల సంఖ్య ప్రతిరోజూ పెరిగిపోతూ ఉండటమే దీనికి నిదర్శనం. దీనితో అధికారులు గేయాన్ని నిషేధిస్తూ నోటీసులు జారీచేశారు. అయినా విద్యార్థుల సంఖ్య మరికొంత పెరిగి గదులు క్రిక్కిరిసిపోయాయి. అంతా వస్తే గదులు సరిపోయేవి కావు. చివరిరోజున ప్రభుత్వ ఆజ్ఞలను ధిక్కరించి ఒక్కొక్క హాస్టలులోని హిందూ విద్యార్థులంతా వచ్చారు స్థలంచాలక బయట నిలుచోవలసివచ్చింది. మామూలు ధ్వనితోకాక బిగ్గరగా గొంతెత్తి 'వందేమాతరం' గేయాన్ని పాడారు. ప్రార్థన పూర్తి చేసుకొని ఎవరి గదుల్లోకివారు వెళ్ళిపోయారు.

తెల్లవారేవరకు విద్యార్థులను హాస్టళ్ళనుంచి వెళ్ళగొడుతున్నట్టు ఒక నోటీసును నోటీసు బోర్డుపై పెట్టారు. ఉదయం ఉపహారం ఉంటుందనీ, మధ్యాహ్న భోజనం ఉండదనీ, గదులను ఖాళీచేయాలని స్పష్టంచేశారు నోటీసును చూచి విద్యార్థులు తమ సామానంతా సర్దేసుకున్నారు. హాస్టళ్ళనుంచి ఎక్కడికి వెళ్ళాలి? సిటీకి పోదామని అనుకున్నారు. సిటీకి కబురు చేశారు. ఉదయం 8 గంటలవరకు లారీలు రానేవచ్చాయి. సామానును లారీలలో నింపారు. "సామానులు ఎక్కడికీ పోవు. మీరు లారీలవెంట రావలసిన పనిలేదు. లారీలు జైనమందిరానికి వెళ్తాయి. అక్కడికి రమ్మ"ని చెప్పివెళ్ళారు.

ముస్లిం విద్యార్థులలో చాలామంది మతతత్వవాదులున్నా అంతా ఒకేవిధంగా వ్యవహరించలేదు. కరడుగట్టినవారు అధికారవర్గంతో కలిసివున్నా ఎవరూ ఘర్షణ పడలేదు. హిందూ విద్యార్థులతో సన్నిహితంగానూ, స్నేహభావంతోనూ ఉండేవారు చాలా బాధపడ్డారు. కొందరు ఆ రోజును మిత్రులు విడిపోవలసిన దుర్దినమైనట్టుగా భావించారు. వారిలో విచారమూ, సమ్మెచేస్తున్న విద్యార్థులలో ఉత్సాహమూ ఈ రెండూ ప్రస్ఫుటమైనవి.

వందేమాతరం సమ్మె పూర్వాపరాలపై వేర్వేరు కథనాలు కన్పిస్తున్నాయి. వాటిలో ముఖ్యమైనది "హైదరాబాదులో స్వాతంత్ర్య పోరాటమ"ను పుస్తకం లోనిది. (నాల్గవ సంపుటము). సెప్టెంబరు 1938 నెలలోనే 'బి' హాస్టలులోని ప్రార్థనాగదిలో ఈ గేయం చదువప్రారంభించారని, అకారణాన గదిని మూసివేసి, తర్వాత తెరిచి పాడనిచ్చారని, రంజాన్ సెలవుల తర్వాత నవంబరు 28వ తేదీన కాలేజీలు తెరిచారనీ, అనాడే నిషేధపుటుత్తరువులు జారీచేశారనీ ఆ పుస్తకంలో రాశారు. (పేజి 104).

నిజాం పరిపాలనా కాలంలో రంజాన్ నెలలో స్కూళ్ళకు, కాలేజీలకు ఒకపూట మాత్రమే సెలవుండేది. నెలరోజులు సెలవులు లేవు. స్టేటు కాంగ్రెసు సత్యాగ్రహం అక్టోబరు 24న ప్రారంభమైంది. డిసెంబరు 24 (1938) నాడు చివరిజట్టు జైలుకెళ్ళింది. సత్యాగ్రహసమయంలో హాస్టళ్ళు, కాలేజీలు మూసివేయ లేదు. విద్యార్థుల్లో సంచలనం ప్రారంభమయింది మొదటి సత్యాగ్రహపుజట్టు జైలుకు వెళ్ళిన తర్వాతనే. ఈ మధ్యకాలంలోనే 'వందేమాతరం' సమస్య ఉత్పన్న మైంది. ఈ వాస్తవాలకు అనుగుణ్యంగా లేదీ కథనం.

ఉస్మానియా యూనివర్సిటీ హాస్టల్సునుంచి బహిష్కరింపబడిన విద్యార్థు లంతా ఊరేగింపుతో వెళ్ళాలని నిర్ణయం. వీరంతా సుమారు వందమందికి మించి

ఉంటారు. హాస్టళ్ళనుంచి ఊరేగింపు అడిక్‌మెట్, పుత్లీబౌలీ, గౌలిగూడా వరకు వెళ్ళి అక్కడ ఆగిపోయింది. దారిపొడవునా పోలీసులున్నా జోక్యం కలిగించు కోలేదు. అయినా ఎప్పుడు ఏంచేస్తారో అన్నట్లుగా ఉండినది వాతావరణం. విద్యార్థులనుంచే కొందరిని వాలంటీర్లను ఏర్పాటుచేసి వారుండవలసిన స్థలాలను నిర్ణయించారు. విద్యార్థులు అటుఇటు వెళ్ళకుండా సరైనమార్గాన వెళ్ళేట్టు చూడటమే వారి బాధ్యత.

విద్యార్థులు గౌలీగూడా చేరేవరకు సుమారు 1-2 గంటలు అయింది. కీ॥ శే॥ వామన్ నాయక్‌గారి భవనంలో భోజనాల ఏర్పాట్లు చేశారు. భోజనం పూర్తి కాగానే అందరూ జైనమందిరం చేరుకున్నారు.

సాయంత్రం బహిరంగసభ జరిగింది. బహిష్కరింపబడిన విద్యార్థులే కాక ఇతరులు కూడా హాజరయినారు. కొందరు ముందుకువచ్చి ఉపన్యాసాలిచ్చారు. ఒక కార్యాచరణ కమిటీ ఏర్పడింది. ఉపన్యాసకుల్లో కొందరు కమిటీలో వున్నారు. ఎవరైనా ముందుకువచ్చి ఉపన్యాసమివ్వడానికి వీలుండేది. ముందు కర్తవ్య మేమిటి ? అనే ప్రశ్న ఉదయించింది. కాలేజీ విద్యార్థులంతా సమ్మెచేయాలని పిలుపు ఇచ్చారు. యూనివర్సిటీ కాలేజీ, సిటీ కాలేజీలో ఉండే హిందూ విద్యార్థు లంతా సమ్మెలో పాల్గొన్నారు. దీనితో హైదరాబాదులో సమ్మె విజయవంత మైనది. నిజాంకాలేజీ, టెక్నికల్ కాలేజీ విద్యార్థులు పాల్గొనలేదు.

కొందరు విద్యార్థులు వరంగల్, ఔరంగాబాద్, గుల్బర్గా నగరాలకు వెళ్ళి ఆ కాలేజీల విద్యార్థులతో సమ్మె చేయించారు. అంతా విజయవంతంగా సాగింది. మొత్తం 600 మంది విద్యార్థులు బయటకు వచ్చేసారు. అంతా కాలేజీ విద్యార్థులే. జైనమందిరంలో ప్రతిరోజు బహిరంగసభ జరిగేది. విద్యార్థి నాయకులు ఉత్తేజ కరమైన ఉపన్యాసాలు ఇచ్చేవారు. రోజులు గడిచిపోయాయి. యూనివర్సిటీ అధికారులు ఒకరోజును నిర్ణయించి ఆనాటివరకు విద్యార్థులు వచ్చి చేరకపోతే వారిని తొలగించివేస్తామని నోటీసు ఇచ్చారు. ఆనాడు ఎవ్వరూ వెళ్ళలేదు. కొంత వ్యవధినిచ్చి తొలగించారు. అయినా సమ్మెమాత్రం నూటికి నూరుపాళ్ళు విజయ వంతమయింది. తర్వాత ఏంచేయాలనే సమస్య విద్యార్థుల ముందుకి వచ్చింది. ఎవరిజిల్లాలకు వారు వెళ్ళి విద్యార్థులతో స్కూళ్ళలో సమ్మెలు చేయించాలనీ, గ్రామాలకువెళ్ళి రైతులలో ప్రచారంచేసి వాళ్ళందరినీ పన్నులు కట్టకుండా చేయాలనే ఆలోచనలు విద్యార్థులలో కలిగినవి. ఉపన్యాసాలల్లో కూడా అలాంటివి వ్యక్తమయినవి.

ఆ సమయంలో విద్యార్థులకు సహాయం చేయాలనే ఉద్దేశ్యంతో ఒక కమిటీ ఏర్పడ్డది. దానిలో రాజభక్తి పరాయణులు కూడా ఉన్నారు. విద్యార్థులు తిరిగి యూనివర్సిటీలో కాలేజీల్లో చేరడానికి సిద్ధంగాలేరనీ, వీరిని జిల్లాలకు, గ్రామాలకు వెళ్ళకుండా చేయడానికి వీరిని ఇతర యూనివర్సిటీలలో ప్రవేశం (అడ్మిషన్లు) సంపాదించటానికి ప్రయత్నించాలని వారు ఆలోచించారు.

ఈ సమస్యపై సురవరం ప్రతాపరెడ్డిగారు ఇలా రాశారు :

"హైదరాబాదు పరిపాలకునియందు రాజభక్తి కలిగియుండిన రాజబహద్దూరు వేంకట రామారెడ్డిగారు వందేమాతరం ఉద్యమంపై పరిపూర్ణమైన సానుభూతిని ప్రకటించియుండిరి. వీరు వందేమాతరం ఉద్యమ నాయకులతో గాఢమైన సంబంధము కలిగియుండిరి. ఈ ఉద్యమమునకు రాజకీయాల ప్రభావము మరియు మత ప్రభావము పడగూడదని రాజబహద్దూరుగారు గట్టి పట్టుదలతో విద్యార్థి నాయకులకు తగు సలహాలు ఇచ్చియుండిరి. ఆ సలహాల ఫలితంగా వందేమాతరఉద్యమము ఆనాటి రాజకీయాలకు మిక్కిలి దూరముగా ఉండుట జరిగినది. ఇది రాజబహద్దూర్‌గారి దూరదృష్టికి మంచి నిదర్శనము. ఆనాడు ఈ ఉద్యమము రాజకీయాలతో సంబంధం లేనిరీతిగా నిర్వహించవలసిన ఆవశ్యకత యుండెను. ఎందుకనగా సరిగా ఆ కాలముననే హైదరాబాదు రాజకీయ వాతావరణము మిక్కిలి తీవ్రముగా నుండెను. స్టేటు కాంగ్రెసు పక్షాన ఒకవైపు సత్యాగ్రహము జరుగుచుండెను. ఇంకొకవైపున ఆర్యసమాజము హిందూ మహాసభలు విడివిడిగా సత్యాగ్రహములు జరుపుచుండెను. ఈ రాజకీయాల సుడిగుండములో విద్యార్థుల వందేమాతర ఉద్యమము పడగూడదనియు, రాజకీయ ప్రయోజనాలకొరకు ఈ ఉద్యమము వినియోగపడగూడదనియు, రాజబహద్దూర్‌గారు గాఢముగా విశ్వసించి విద్యార్థి నాయకులకు ఇందుకనుగుణముగా సలహాలను ఇచ్చియుండిన సంగతి ఆనాటి ఉద్యమ నిర్వాహకులకు తెలిసిన సంగతే! ఈ ఉద్యమము కళాశాలలవరకే పరిమితము కావలెననియు, ఇది మాధ్యమిక ఉన్నత పాఠశాలలకు వ్యాప్తి చెందకూడదనియు కొత్వాలు వేంకట రామారెడ్డిగారు నిశ్చయించుకొని ఆ విధముగా నిర్మాణాత్మకమైన సూచనలు విద్యార్థి నాయకులకు ఇచ్చియుండిరి. ఈ విధముగా ఆనాడు వందేమాతర ఉద్యమము ఉస్మానియా విశ్వవిద్యాలయమునకును, దానికి అనుబంధమైన కళాశాలకు మాత్రమే పరిమితమగుటలో రాజబహద్దూర్ వేంకట రామారెడ్డిగారు ముఖ్యపాత్ర వహించియుండిరి."

("రాజబహద్దూర్ వేంకటరామారెడ్డి, ఒ.బి.ఇ." : పేజీలు 144-145)

రాజాబహద్దూర్‌గారి ఆధ్వర్యాన నడిచిన రెడ్డి హాస్టలులో ఉస్మానియా యూనివర్శిటీ, సిటీ కాలేజీలలో చదివే విద్యార్థులు గణనీయమైన సంఖ్యలో ఉండే వారు. వారంతా సమ్మెలో పాల్గొన్నవారే. వారిలో అచ్యుతరెడ్డిగారు కార్యాచరణ కమిటీకి అధ్యక్షులు. (వీరు తర్వాత కాలంలో కాంగ్రెసు నాయకులైనారు. మంత్రిగా ఉండి చనిపోయారు). రాజాబహద్దూర్‌గారు వీరి ద్వారా ప్రత్యక్షం గానూ, డబ్బు సమకూర్చడం ద్వారా పరోక్షంగానూ ఈ ఉద్యమంతో సంబంధం కలిగిఉండేవారు. ఉద్యమం స్కూళ్ళ స్థాయికి వెళ్ళగూడదని ప్రజాఉద్యమ స్వరూపం తీసుకోకూడదని రాజభక్తి పరాయణులైన రాజబహద్దూరుగారు ప్రయత్నించి కొంతవరకు సఫలులైనారని దీనివలన స్పష్టమవుతున్నది.

విద్యార్థుల ప్రతినిధివర్గమొకటి దేశంలోని యూనివర్సిటీలకు వెళ్ళి ప్రవేశ మిప్పించమని అడిగారు. తెలుగువారిదైన ఆంధ్రాయూనివర్సిటీ అడ్మిషన్ ఇస్తుందనే భ్రమలతో వెళ్ళారక్కడికి. కట్టమంచి రామలింగారెడ్డిగారు దానికి వైస్‌ఛాన్స్‌లర్. ఆంధ్రాయూనివర్సిటీలో "మీకు అడ్మిషన్ దొరకదని" చెప్పారు. నిజాం నవాబు ఆంధ్రా యూనివర్సిటీకి సంవత్సరానికి రెండు లక్షల రూపాయల విరాళం ఇస్తున్నాడని ఆ కారణంవల్లనే ఆయన అడ్మిషన్లు ఇవ్వనిరాకరించాడని తర్వాత తెలిసింది. నిజాం ప్రభుత్వానికి కట్టమంచివారికి మంచి సంబంధాలున్నా యని కూడా తెలిసింది.

అక్కడి నుంచి బెనారసు యూనివర్సిటీకెళ్ళారు. సర్వేపల్లి రాధాకృష్ణన్ గారు దానికి వైస్ ఛాన్సలర్. అది హిందూ యూనివర్సిటీ. దాని గురించి ఎన్నో గొప్పలు చెప్పేవారు. అక్కడైనా ప్రవేశం దొరుకుతుందని ఆశఉండేది. కాని వారు కూడా 'లేద'న్నారు. నిజాం ప్రభుత్వం ఆ యూనివర్సిటీకి కూడా ప్రతి సంవత్సరమూ రెండు లక్షల రూపాయల విరాళంఇస్తున్నదని తెలిసింది. ఆంధ్రా, బెనారసు యూనివర్సిటీలేమిటి? తమకు అడ్మిషన్ దొరకకపోవడమేమిటి? తాము చేసే సమ్మె దేశభక్తియుతమైన, అఖిలభారత ప్రాధాన్యత కలిగిన గొప్పపోరాటం కదా! తమను గుర్తించేవారు ఎవరూలేరే అనే సందేహం వచ్చింది విద్యార్థులకు. ఈ రెండింటిమీదా ఆశవదులుకొని తక్కిన యూనివర్సిటీలన్నీ వరుసగా తిరిగి వచ్చినారు. అంతా 'మాకు సాధ్యంకాదంటే మాకు సాధ్యంకాద'ని చెప్పేశారు. నిరుత్సాహంతో తిరిగి వస్తూ నాగ్‌పూర్‌లో ఆగి అక్కడి వైస్-ఛాన్సలర్‌ను కలుసుకున్నారు. ఆయనపేరు కేదార్. ప్రతినిధులు చెప్పిన మాట సావధానంగా విని ఆయన "మీరు వచ్చి అడ్మిషన్ కావాలంటే ఎక్కడినుంచి వస్తుంది? నాకూ

ఇవ్వాలనే ఉంది. 'వందేమాతరం' గేయంకోసం మీరు సమ్మెచేసి త్యాగం చేశారు. మిమ్మల్ని గౌరవించవలసిందే. కానీ ఇక్కడ యూనివర్సిటీ సెనేట్, కాంగ్రెస్ ప్రభుత్వం ఉన్నాయి. తమకు తాముగా మీకు అడ్మిషన్ ఇవ్వడానికి వారు అంగీకరించరు. అందువలన ముందు మీరు ఇక్కడికి వచ్చేసేయండి. వచ్చి బజారున పడితే (ఊరేగింపులు మొదలగు ఆందోళనలు) నేను ఒత్తిడిచేసి సెనేట్‌ను, ఇతర యూనివర్సిటీ అధికార వర్గాన్ని ఒప్పించి అడ్మిషన్ సంపాదిస్తాను. ఖర్చులకు డబ్బు కావలిస్తే 'నేను ఇల్లిల్లు తిరిగి సమకూరుస్తాను', అని అన్నాడు. ప్రతినిధి వర్గం హైదరాబాదు తిరిగివచ్చి బహిరంగ సభలో ఈ విషయం చెప్పారు. అందరూ వెళ్ళడానికి నిర్ణయించుకున్నారు. నాగపూర్‌లో రైలు దిగిన తర్వాత ఊరేగింపుగా వెళ్ళారు. అక్కడ ఉండటానికి తాత్కాలికమైన ఏర్పాట్లు చేశారు. తర్వాత స్థిరమైన ఏర్పాట్లు చేశారు. అడ్మిషన్లకొరకు ప్రయత్నాలు ప్రారంభమైనాయి. సెనేట్ సమావేశాలు జరిగాయి. ఆ సందర్భంలో వైస్-ఛాన్సలర్ వాదించడం, ఇతరులు కాదనడం, ప్రభుత్వం జోక్యంకలిగించుకోవడం, విద్యార్థులు ఊరేగింపులు తీయడం, బహిరంగ సభలు జరగటం – ఇదంతా రెండు మూడు నెలలపాటు జరిగిన తర్వాత అడ్మిషన్లు ఇవ్వటానికి అంగీకరించారు. సైన్సు విద్యార్థులంతా నాగపూర్‌లో, ఆర్ట్సు విద్యార్థులు జబల్‌పూర్‌లో చదివినారు. పరీక్షలు పూర్తి చేసుకొని అంతా ఇళ్ళకు తిరిగివచ్చారు.

ఈ సందర్భంలో జరిగిన రెండుమూడు ఘటనలకు కొంత ప్రాధాన్యత ఉంది.

1) విద్యార్థులంతా నాగపూర్‌లో ఉన్న మొదటిరోజుల్లో గాంధీగారిని వారి ఆశ్రమాన్ని చూసిరావాలని విద్యార్థులు అనుకున్నారు. లారీలను ఏర్పాటుచేసుకొని సేవాగ్రామ్‌కి వెళ్ళారు. ఇంటర్వ్యూ సమయం 5నిముషాలు మాత్రమే. సాయంత్రం వేళ. ఆయన రాగానే అంతా నిశ్శబ్దంగా ఉన్నారు. గాంధీగారే మాట్లాడటానికి ముందు చొరవ తీసుకున్నారు. నివాస, భోజన వసతులు ఎలా ఉన్నాయని ప్రశ్నించారు. చదువులు పూర్తిచేసుకొని ఇళ్ళకు తిరిగివెళ్ళిన తర్వాత ఏం చేస్తారని ప్రశ్నించారు. కొందరు ప్రజాసేవ చేస్తామని, మరికొందరు హరిజనసేవ చేస్తామని చెప్పారు. కాంగ్రెసులో పనిచేస్తామని ఇంకొకరు అన్నారు. తర్వాత ఒకరు లేచి 'వందేమాతరం సమస్యమీద సమ్మెచేసివచ్చాం. ఇది ఎలా పరిష్కారమవుతుంది? ఎప్పుడు పరిష్కారమవుతుంది' అని అడిగారు. "బహుత్ కఠిన్ సమస్యా హై" అన్నాడాయన. 'ఇది చాలాక్లిష్టమైన సమస్య, అంత తేలికగా పరిష్కారం

కాద'ని చెప్పేశాడు. 'ఇక వెళ్ళిపొండి' అని 5 నిముషాల సమయం పూర్తికాగానే వెళ్ళిపోయారు. దీని ఫలితంగా వారిలో వివిధ ఆలోచనలు బయలుదేరినవి. 'వందే మాతరం'లాంటి చిన్న సమస్యను కూడా ఈయన ఇంత క్లిష్టమైన సమస్య అంటాడే, ఇది పరిష్కారం కావడం చాలా కష్టం అంటున్నాడే, పరిష్కారం కాదా ?' అని కొంతమందిలో అనుమానమేర్పడినది. ఇంత పెద్ద నాయకుడు ఈయన ఈ రకంగా చెప్తున్నాడేమిటి అని మరొక ఆలోచన.

2) త్రిపుర కాంగ్రెస్ మహాసభ : త్రిపుర జబల్‌పూర్‌కు దగ్గరగా ఉంటుంది. ప్రభుత్వం కాంగ్రెస్ వారిదే కావటంతో పెద్దఎత్తున ఏర్పాట్లు జరిగాయి. సుభాష్ చంద్రబోసు అధ్యక్షుడు. పట్టాభి సీతారామయ్య గాంధీజీ అభ్యర్థిగా పోటీచేసి ఓడిపోయాడు. సుభాష్ చంద్రబోస్ గెలిచాడు. గాంధీగారు హాజరుకాలేదు. త్రిపుర కాంగ్రెసును చూడటానికి వెళ్ళిన వందేమాతరం విద్యార్థుల కోసం ప్రత్యేక ఏర్పాట్లు చేశారు.

3) సరోజినీదేవి జబల్పూరు పర్యటన సందర్భంలో ఆమెను విద్యార్థులు ఆహ్వానించారు. ఆమె జాతీయ, అంతర్జాతీయ రాజకీయాలపై ఉపన్యసించింది. ఒకవిద్యార్థి—"హైదరాబాదులో మేము 'వందేమాతరం' సమస్యపై సమ్మెచేసి ఇక్కడికి వచ్చాం. మాకోసం మీరు ఏంచేస్తున్నారు?" అని అడిగినాడు. దానికామె ఏ సమాధానమూ చెప్పలేదు. దీనితో విద్యార్థుల్లో ఆమెపై వ్యతిరేకత వచ్చింది. ఈమె హైదరాబాదు నివాసి. నిజాం ప్రభుత్వం ఆమెను హైదరాబాదు రాకుండా నిషేధించింది. ఈ సమస్య విషయమై ఆమె ఇంత నిస్సహాయంగా ఉన్నదేమిటి అనే అనుమానం కలిగింది.

4) సుభాష్ చంద్రబోస్ వచ్చాడు. మామూలుగా మాట్లాడాడు. ఈ సమస్యపై ఆయన కల్పించుకోలేదు.

5) నాగపూర్‌లో ఉన్న సమయాన బి.యన్. ముఖర్జీ అను ఒక కమ్యూనిస్టు నాయకుడు కొందరు విద్యార్థులను మాత్రం కలిసివెళ్ళాడు. వారితో సంబంధాలు పెట్టుకోవడానికి కృషిచేయలేదు.

విద్యార్థులు పరీక్షలు పూర్తి చేసుకొని ఇళ్ళకు చేరుకున్నారు. రాతపూర్వకంగా క్షమాపణకోరిన వారినందరినీ క్లాసులలో చేర్చుకుంటామని యూనివర్సిటీ అధికారులు ప్రకటించారు. హెచ్చుమంది క్షమాపణ ఇచ్చి చేరారు. కొద్దిమంది మాత్రం నాగపూర్‌లోనే తమతమ చదువులను కొనసాగించారు. కొందరు ఉద్యోగాలు చూచుకున్నారు.

విద్యార్థులు తిరిగివచ్చిన తర్వాత జరిగిన పరిణామాన్ని గూర్చి కొన్ని అభిప్రాయాలీవిధంగా ఉన్నాయి :

రాజాబహద్దూరు వేంకట రామారెడ్డిగారి జీవితచరిత్రలో కీ. శే. సురవరం ప్రతాపరెడ్డిగారు ఇలా రాశారు.

"వందేమాతర ఉద్యమ నాయకులైన విద్యార్థులకు, మరియు ప్రభుత్వమునకు మధ్య గౌరవప్రదమైన ఒడంబడికను కుదిరించుటకు ఆ రోజులలో రాజా బహద్దుర్ వేంకటరామారెడ్డిగారు విశేషమైన కృషి గావించియుండిరి. ఏవిధముగనైనను ఉభయులకు రాజీచేయవలెనని వారి సంకల్పమైయుండెను. ఈ రాయబారాలను నిర్వహించుటకు అప్పటి హైదరాబాదు ప్రభుత్వము వీరిని ప్రత్యేకముగా అర్థించియుండెను." (పేజి-145-146)

రచయిత "కృషి" ఫలితాన్ని, ఒడంబడికలోని ముఖ్యాంశాలను గూర్చి మౌనంగా ఉన్నారు.

కీ. శే. మందుముల నరసింగరావుగారు తన "50 సంవత్సరముల హైదరాబాదు" అను పుస్తకంలో "కొన్నిరోజుల తర్వాత విశ్వవిద్యాలయంవారు తమ నిషేధాజ్ఞలను రద్దుచేసుకొని 'వందేమాతరం' గీతం పాడటానికి అంగీకరించిరి" అని రాశారు. కీ. శే. స్వామి రామానంద తీర్థ "...తర్వాత దశలో అధికారవర్గం పూర్వపు ఆర్డరును రద్దుచేసి 'వందేమాతరం' పాడనిచ్చారని తన 'హైదరాబాదు స్వాతంత్ర్య పోరాట స్మృతులు' అనే పుస్తకంలో రాసారు. (ఇంగ్లీ ప్రతి-Memories of Hyderabad Freedom Struggle -పేజి-99)

హైదరాబాదు ప్రభుత్వ రికార్డులను ఆధారం చేసుకొని రాసిన మరొక పుస్తకంలో కూడా క్షమాపణ గూర్చి ప్రస్తావించలేదు. దానిలో ఈ విధంగా ఉంది :

"ఉస్మానియా అధికారవర్గాలు తమ సర్క్యులర్‌ను (వందేమాతరం గేయాన్ని నిషేధిస్తూ జారీచేసిన సర్క్యులరు-రచయిత) ఉపసంహరించడానికి సిద్ధంగా లేకుండిరి. కాని కొన్ని మంచి ఏర్పాట్లు (terms) చేయటానికి సిద్ధంగా ఉండిరి; చేశారు కూడా. రాజీ జరిగేట్టు ఉండె. కానీ రాజకీయ నాయకుల మొండి పట్టుదల వలన అవి వెనక్కుపోయాయి." (హైదరాబాదు స్వాతంత్ర్యపోరాటము, ఇంగ్లీషు ప్రతి-నాల్గవ సంపుటం పేజి-115)

ఈ విధంగా సమ్మెచేసిన విద్యార్థులంతా ఎలాంటి పరిష్కారం లేకనే తిరిగి కాలేజీల్లో చేరిపోయారు. తర్వాత "వందేమాతరం" సమస్యను లేవదీసినవారేలేరు.

## 2. 'వందేమాతరం' గేయం-దాని ప్రాధాన్యత

గేయం పూర్తి పాఠం ఈ విధంగా ఉంది.

"వందేమాతరం
సుజలాం సుఫలాం మలయజ శీతలాం
సస్యశ్యామలాం మాతరం
శుభ్రజ్యోత్స్నా పులకిత యామినీం
పుల్లకుసుమిత ద్రుమదళ శోభినీం
సుహాసినీం సుమధురభాషిణీం
సుఖదాం, వరదాం మాతరం
సప్తకోటి కంఠ కలకల నినాదకరాళే,
ద్వి సప్తకోటి భుజైర్ధృత ఖరకరవాలే,
అబలాకేనో మా! ఏతో బలే!
బహుబల ధారిణీం నమామితారిణీం
రిపుదళవారిణీం మాతరం!
తుమీ విద్యా, తుమీ ధర్మ
తుమీ హరి, తుమీ కర్మ
త్వం హి ప్రాణః శరీరే!
బహుతే తుమీ మాం శక్తి
హృదయే తుమీ మాం భక్తి
తోమారయీ ప్రాప్తి మాగఢం మందిరే మందిరే॥
త్వం హి దుర్గా దశప్రహార ధారిణీమ్
కమల కమలదళ విహారిణీమ్
వాణీ విద్యాదాయిని నమామిత్వాం,
నమామి కమలాం, అమలాం, అతులాం
సుజలాం సుఫలాం మాతరం
వందేమాతరం
శ్యామలాం సరళాం సుస్మితాం భాషిణీం
ధరణీం భరణీం మాతరమ్॥

ఈ గేయం బంకిం చంద్ర ఛటర్జీ (1838-1894) రాసిన "ఆనంద మఠం" అనే బెంగాలీ నవలలోనిది. 18వ శతాబ్దంలోని రెండవ అర్థభాగంలోని నవాబుల పరిపాలనకు వ్యతిరేకమైన ప్రజల తిరుగుబాటు కథా వస్తువు. ఈ నవాబులు భోగలాలసులై బ్రిటిష్ కంపెనీలకు తొత్తులై ప్రజలను ఏ విధంగా కొల్లగొట్టేవారో వర్ణిస్తుందీ నవల. ఆనాటి బెంగాల్ కరువు దృశ్యాలను చక్కగా చూపెట్టాడు బంకిం చంద్ర ఛటర్జీ. ఈ నవల రచనా కాలం 1882.

మాతృ దేశాన్ని కీర్తించడమే ఈ గేయం సారాంశం. నవలలో ఈ గేయాన్ని ఈ ముందు మాటలు చెప్పి ప్రారంభిస్తాడు :

"మాకు దేశం తప్ప ఇంకొక తల్లి తెలియదు. 'జననీ జన్మ భూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' మా మాత జన్మభూమి, మాకు మరొక తల్లి తండ్రి లేరు. భార్యా పిల్లలు లేరు. ఇల్లు వాకిలి లేదు. మాకు సర్వమూ దేశమాతే! సుజల, సుఫల, మలయజ, శీతల, సస్యశ్యామల అయిన మాతే మాకు సర్వం."

ఇవన్నీ మాతృదేశంగురించి చెప్పిన మాటలే.

దీనిలో దుర్గను, లక్ష్మి సరస్వతులను పేర్కొన్నాడు. మాతృభూమే సర్వస్వమని చెప్పడానికే ఉద్దేశించబడినా దీనిలో మత ప్రమేయమున్నది. తిరుగుబాటుదారులు దైవభక్తి కలవారు ; దైవపూజ చేసేవారు.

వారు పూజించే మూర్తులను గురించి ఇలా వర్ణిస్తాడు రచయిత :

"ఒక ప్రకాండ చతుర్భుజ మూర్తి విగ్రహం ఉంది. శంఖచక్రగదా పద్మధారి కౌస్తుభ శోభితము అయివుంది ఆ మూర్తి. ఎదురుగా సుదర్శనచక్రం స్థాపితమై వుంది. ఎదురుగా మధుకైటభులు రక్తప్రవాహంలో మునిగి ఉన్నట్లు ఒక చిత్రం ఉంది. ఎడమవైపు కమలమాలాలంకృతయై ముక్తకుంతల లక్ష్మి విచారంతో కూచుని ఉన్న చిత్రం వుంది. దక్షిణవైపు సరస్వతి పుస్తకం వాద్య యంత్రం దగ్గర పెట్టుకొని రాగరాగిణులు అయిన చెలికత్తెలు పరివేష్టించివుండగా కూర్చొని వుంది. విష్ణువు అంకస్థలంలో ఒక మోహినీమూర్తి విగ్రహం వుంది. ఈ మూర్తి లక్ష్మి సరస్వతులకంటే సుందరంగా ఉంది ; శోభగా ఉంది". (పేజి 44) సుందరంగానూ, శోభగానూ వున్న ఆ మూర్తిని "అమ్మ" అన్నాడు. ఆమె వర్ణన కూడా ఉంది.

అంతేకాదు. "హిందూమతం మరుగున పడుతున్న సమయం అది. అనేకులు హిందూమతాన్ని పునరుద్ధరించుకొనడానికి ప్రయత్నాలు చేస్తున్నారు. రోజురోజుకు సంతానుల సంఖ్య పెరిగిపోతోంది. ప్రతినెల వేలకొద్దీ గ్రామీణులు

సంతానసాంప్రదాయంలో ప్రవేశించి ముసల్మానులశాసనాన్ని అతిక్రమిస్తున్నారు." (పేజి - 105) అని హిందూ ముస్లింల సమస్యను ముందుంచాడు.

ఈ దృష్టితో చూస్తే మతపరమైన అంశాలెన్నో ఈ నవలలో ఉన్నాయి. ఇవి సనాతన ధర్మపరాయణులకు మాత్రమే అంగీకారయోగ్యంగా ఉంటాయి. 'హిందూ' మతంలోని సంస్కరణోద్యమాలలో వీటికి తావులేదు. ఉదా : విగ్రహారాధనను వ్యతిరేకించే వారు వీటిని వ్యతిరేకిస్తారు. ఇదేవిధంగా బౌద్ధులు, సిక్కులు కూడా వీటిని అంగీకరించరు. దక్షిణాదిన వీటిని వ్యతిరేకించే ద్రవిడకజగం (తమిళనాడు)లాంటి ఉద్యమాలున్నాయి. ఇక ముస్లింలు, క్రైస్తవులు సనాతన ధర్మాన్ని వ్యతిరేకించేవారేకదా ! ఈ విధంగా మతపరంగా చూస్తే మనదేశంలోని కొందరిని మాత్రమే, అదీ సనాతన ధర్మపరాయణులను మాత్రమే ఆకట్టగలుగుతుంది గేయం.

కానీ ఈ గేయం జాతీయోద్యమంలో నిర్వహించిన పాత్ర మరోవిధంగా ఉంది. 1905లో బ్రిటిష్ సామ్రాజ్యవాదులు బెంగాల్‌ను విభజింప పూనుకున్నారు. దానికి వ్యతిరేకంగా బెంగాలులోనే పెద్ద జాతీయోద్యమం బయలుదేరింది. దేశమంతా వ్యాపించింది. బలీయమైన ఈ ఉద్యమాన్ని చూచి బ్రిటిష్ పాలకులు భయపడి బెంగాల్ విభజనను తాత్కాలికంగా మానుకున్నారు.

'వందేమాతరం' గేయం ఈ ఉద్యమంలో గొప్ప పాత్రను నిర్వహించింది. అప్పటికే గణనీయమైన జనాభాగా ఉన్న ముస్లింలు, క్రైస్తవులు ఈ ఉద్యమంలో ఏ మేరకు పాల్గొన్నారనేది చర్చనీయాంశమైనప్పటికీ, బెంగాలులోని విశాల ప్రజానీకాన్ని ఈ గేయం ఐక్యం చేయగలిగింది. పోరాటంలోకి సమీకరించగలిగింది. ప్రజానీకానికి ఈ గేయపు పూర్వాపరాలు తెలియకపోయినా, మాతృదేశపు భక్తి, మాతృదేశాన్ని విభజించగూడదనే ఆకాంక్షతో వారీ గేయాన్ని అనుసరించారు. అదే విధంగా ఈ గేయం వారిలో మాతృదేశపు భక్తిని కలిగించింది. మాతృదేశం ఐక్యంగా ఉండాలనే ఆకాంక్షను బలపరిచింది. ఇస్లాంలోని సంస్కరణోద్యమాలు, బెంగాలీ భాషవలన కలిగిన ఐక్యత దీనికి దోహదంచేసింది. గేయంలోని మతపరమైన అంశాలు పక్కకు వెళ్ళిపోయి దానిలోని జాతీయతే ప్రధానమైన వస్తువు అయింది.

కాంగ్రెసు నాయకత్వం దీనిలోని మతపరమైన అంశాలను తీసివేసి వివాదాస్పదంకాని భాగాలనే పేరుతో మొదటి చరణాలను మాత్రమే జాతీయ గేయరూపంతో ఉపయోగించింది ; ఉపయోగించుతున్నది. గేయంలోని మతపర

మైన అంశాలపై తీవ్రమైన వాగ్వివాదాలు చెలరేగిన తర్వాతనే నాయకత్వం ఈ పని చేసిందనేది సుస్పష్టం. ఈ గేయంలోని మరికొన్ని అంశాలు :

సంస్కృతపదాలతో నిండివున్నప్పటికీ ఇది బెంగాలీ గేయం. "అబలా కేనోమా ! ఏతోబలే !" "తోమార యీ ప్రతిమాగడం మందిరే మందిరే"లాంటి చరణాలు బెంగాలీ భాషలో ఉన్నవి. అన్నిభాషల్లో సంస్కృతపదాలున్నప్పటికీ భాషలు వేరేకదా !

"సప్తకోటి కంఠ కలకల నినాద కరాళే" అనే చరణంలో ఆనాటి బెంగాలులో ఏడుకోట్ల ప్రజలున్నారని స్పష్టమవుతున్నది. ఇది కథాకాలంనాటి దానికన్న బంకించంద్ర చటర్జీ కాలపు బెంగాలు జనాభా కావచ్చును. తర్వాత కాలంలో దీనిని భారతదేశ జనాభాకంతటికీ వర్తింపజేస్తూ, 'త్రింశత్కోటి' కంఠాలనీ, 'ద్విత్రింశత్కోటి' కరాలనీ మార్చారు. అయినా మొదటి చరణాలనే ప్రచారంచేస్తున్నారు పాలకులు, అభిమానులు. ఇవి మాతృదేశ స్తవనంలోని వివాదరహితమైన అంశాలు. అయినా కాంగ్రెసు నాయకత్వాన నడిచిన భారత జాతీయోద్యమం భారతీయులందరినీ ఐక్యంచేయగల, మతవిభేదం పాటించని జాతీయగేయాన్ని సృష్టించలేకపోయింది. వివాదాస్పదమైన బంకించంద్ర చటర్జీ గేయాన్ని స్వీకరించవలసివచ్చింది. అనుక్షణమూ బ్రిటిష్ సామ్రాజ్యవాదులతో రాజీపడటానికి అర్రులు చాచుకుంటూ కూర్చున్న మితవాద జాతీయ నాయకత్వం లోని ప్రధాన బలహీనతల్లో ఇదొకటి.

## 7. కార్మికోద్యమం

తెలంగాణాలో పరిశ్రమలు చాలా తక్కువ. ఈ కారణాన కార్మికుల సంఖ్య కూడా చాలా తక్కువే. క్రమంగా పరిశ్రమలు ఏర్పడి 1939 నాటికి వాటికి ఒక స్వరూపం ఏర్పడింది. దీనితో కార్మికుల సంఖ్య కూడా పెరిగింది. హైదరాబాదు నిజాం రైల్వేకు కేంద్రస్థానం. బొగ్గు గనులు తెలంగాణా జిల్లాలలోనే ఉన్నవి ఇదేవిధంగా ఇతర పరిశ్రమలు కూడా. వీటి మూలాన కార్మికుల సంఖ్య క్రమంగా పెరిగింది.

ఆ కాలంలో సంఘటితమైన కార్మికోద్యమం లేదు. బ్రిటిష్ ఇండియాలో ఏర్పడి పనిచేసిన కార్మిక సంఘాల శాఖలు సంస్థానంలో ఏర్పడలేదు. ప్రభుత్వం అలాంటి శాఖలు ఏర్పడటానికి ప్రతిబంధకం ఏవైతేనేమి సంఘటిత కార్మికోద్యమ

నిర్మాణం జరుగలేదు. అయినా కొన్ని సమ్మె పోరాటాలు సాగుతూ వచ్చినవి. వాటిని గురించిన సమాచారం అంతగాలేదు. మందుముల నరసింగరావుగారు రైల్వే ఉద్యోగులు, కార్మికులు చేసిన సమ్మెను ఈ విధంగా వివరించారు :

"నాకు జ్ఞాపకమున్నంతవరకు 1928 సం॥లో అనుకుంటాను, కార్మికులలో అలజడి బయలుదేరినది. నిజాం రైల్వే ఉద్యోగులు, కార్మికులు సమ్మె ఆరంభించినారు. హైదరాబాదు రాష్ట్ర చరిత్రలో ఇది ప్రప్రథమంగా జరిగిన సమ్మె. ఫతేవుల్లాఖాన్ మరియు రాఘవేంద్రరావుగారలు ఈ సమ్మె నాయకులు. రాఘవేంద్రరావు రైల్వే ఉద్యోగి. కాని ఫతేవుల్లాఖాన్ రైల్వే ఉద్యోగి కాడు. ఈ సమ్మెతో హైదరాబాదు రాష్ట్రంలో కార్మికోద్యమం ప్రారంభమైనదని చెప్పవచ్చును. అప్పుడు సంఘాలగురించిన చట్టాలు యేవీలేవు."

(50 సంవత్సరముల హైదరాబాదు - పేజి-97)

ఈ సమ్మెకు నాయకత్వం వహించిన ఫతేవుల్లాఖాన్, రాఘవేంద్రరావుగారలు తర్వాత కాలంలో కమ్యూనిస్టులతోకలిసి రైల్వే కార్మికోద్యమంలో పని చేశారు. ఫతేవుల్లాఖాన్ ట్రేడు యూనియనిస్టుగా, రాఘవేంద్రరావు జాతీయ వాదిగా ఉండేవారు. 1935 లో మరొక సమ్మె కూడా జరిగింది.

తర్వాత కాలంలో సింగరేణి, కొత్తగూడెం బొగ్గుగనుల్లో 35-36 ప్రాంతంలో ఒక సమ్మె నడిచింది. ఈ సమ్మె కొన్ని రోజులు సాగింది. ప్రభుత్వం వారి కోరికలను కొంతవరకైనా అంగీకరించినట్టు ఆ కాలపు వార్తలు తెలుపుతున్నాయి. మితవాదులదే అయినా గోలకొండ పత్రిక దానిని బలపరిచింది.

ఈ విధంగా తెలంగాణా వ్యాప్తంగానూ, సంస్థాన వ్యాపితంగానూ నిర్మాణయుతమైన కార్మికోద్యమం లేకున్నా కార్మికులు స్థానిక నాయకత్వాన సమ్మెలు చేశారు. తమ కోరికలను కొంతవరకైనా సాధించుకోగలిగారు.

## ముగింపు

1939నాటికి తెలంగాణాలో సాగిన ఉద్యమాలే బహుస్వల్పం. దాదాపు వాటన్నిటినీ ఇక్కడ ఉదహరించాము. ఇవిగాక హరిజన సేవక సంఘం, ఖద్దరు ధారణకు సంబంధించిన కార్యకలాపాలు కొన్ని సాగుతూ ఉండేవి. ఇవిగాక స్థానికంగా చిన్నచిన్న సంఘాలు ఉండవచ్చును.

ఇవన్నీ సంస్కరణవాద స్వభావం కలిగినవే. వీటి నాయకత్వాన నడిచిన ఉద్యమాలు ఎప్పుడూ ప్రజల్లోకి వెళ్ళలేదు. ఈ విధంగా వాటికి ప్రజాపునాది ఏర్పడలేదు. ఆంధ్రోద్యమం మితవాద ఉద్యమమే అయినా దానికి కొంత ప్రాధాన్యత ఉంది. దీనికి ప్రధాన కారణం తర్వాతకాలంలో ఆంధ్రమహాసభ నాయకత్వాన ప్రజల విప్లవోద్యమ నిర్మాణం జరుగుటే. ఇదే లేకుంటే దేశంలో ఏర్పడి అదృశ్యమైన అన్ని మితవాద సంస్థలలాగే ఇది కూడా ఒకటిగా ఉండి పోయేది. ఏది ఎట్లున్నా నిజాంప్రభుత్వం ఆంధ్రుల భాషా సంస్కృతులను అణచిపెట్టిన కాలంలో ఆంధ్రోద్యమం ఉపయోగకరమైన పాత్రనే నిర్వహించింది.

బ్రిటిష్ ఇండియాలో మాదిరిగా తెలంగాణాలో గాంధీభావాలకూ, కాంగ్రెసు ఉద్యమానికీ స్థానమేర్పడలేదు. మితవాద కార్యకలాపాలు కూడా అనేక పరిమితు లలో సాగినవి. ప్రభుత్వం వీటన్నిటినీ అనుమాన దృష్టితో చూడటమేగాక, వీటికి ఏమాత్రం అవకాశమిచ్చినా అసంతృప్తులైన ప్రజలు వీటిలో చేరి ప్రభు త్వానికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేస్తారని, తమపాలనకు ముప్పువస్తుందని భయపడింది. ఈ కారణాన ఎలాంటి ప్రజాకార్యకలాపాలకు కూడా అవకాశం లేకుండా పోయింది. ఈ మితవాద శక్తులకు ప్రభుత్వం పెట్టే ఆటంకాలను అధిగమించగల శక్తి లేదు. ప్రజల్లోకి వెళ్ళినప్పుడే ఈ ఆటంకాలను అధిగమించడం సాధ్యమవుతుంది. వెన్నెముకలేని మితవాదులు దీనికి సాహసించలేకపోయినారు.

సంఘ సంస్కరణ కార్యక్రమం ఉన్న ఆర్యసమాజానికి కొంత మిలిటెన్సీ ఉన్నప్పటికీ మతప్రమేయం ఉన్న తెలంగాణా ప్రజలను, ముఖ్యంగా రైతుకూలీ లను ఆకర్షించలేకపోయింది. ఇతర సంస్కరణోద్యమాలు కూడా కులాలకు, కులాలలోని పైతరగతులకు పరిమితమై అతిస్వల్పమైన ప్రభావాన్ని కలుగజేసినవి. ప్రభుత్వం కులసంఘాలను తప్ప ఇతర సంస్కరణోద్యమాలన్నింటినీ వ్యతిరేకించే విధానం అనుసరించటం వలన నాయకత్వం ఆ ఉద్యమాలను అభివృద్ధిచేయలేక పోయినది. నాయకులంతా ప్రభుత్వ అనుచరులు కావటమే దీనికి కారణం. కొన్ని సందర్భాలలో వారు ప్రభుత్వాన్ని వ్యతిరేకించినప్పటికీ మితవాదులుగానే వ్యవహ రించారు. దీని ప్రభావం ఆ ఉద్యమాలపై కూడా పడినది.

స్టేటు కాంగ్రెసు ఉద్యమ పరిస్థితి మరీ అధ్వాన్నంగా ఉండిపోయినది. ఈ సంస్థ చాలా ఆలస్యంగా ఏర్పడింది. ప్రజల్లోకి వెళ్ళకముందే ప్రభుత్వం దీనిని నిషేధించింది. దీనికి ఏ కార్యక్రమమూ లేక అఖిలభారత కాంగ్రెసుతో తమ

భవిష్యత్తును ముడివేసుకొని కూర్చోవటంవలన 1939 నాటివరకు ఇదొక నామ మాత్రపు శక్తిగానే మిగిలిపోయింది.

ఈ విధంగా మితవాద రాజకీయాలు, సంఘసంస్కరణోద్యమాలు ప్రజలను ఆకట్టుకోవటంలో విఫలమైనవి. ఒకవైపున ప్రజలు, మరొకవైపున మితవాద సంఘసంస్కరణ నాయకత్వం ఉంటూ ఈ రెండింటిమధ్య గండిని పూడ్చగల అతివాద నాయకత్వం ఏర్పడలేదు. బ్రిటిష్ ఇండియాలో ఉన్న మితవాద కాంగ్రెసు నాయకత్వమూ ఏర్పడలేదు. ఈ కారణాన ఈ గండిని పూడ్చటానికి విప్లవశక్తులు అవసరమైనవి. ఇవి ఆనాటికి ఏర్పడలేదు. తర్వాత కాలంలోనే ఏర్పడి విప్లవోద్యమానికి నాయకత్వం వహించినవి. ఇతర సంస్థానాల్లో కూడా దాదాపు ఇదే పరిస్థితులు ఉండినా నిజాం నవాబుకు ఫ్యూడల్ భూస్వాములు తప్ప సాంఘిక పునాదిగా పనిచేసేవర్గం తెలుగు ప్రజల్లో ఏర్పడలేదు. ఫ్యూడల్ భూస్వాములంతా నిజాం నవాబుకు వినయవిధేయులై ఉన్నప్పటికీ, మత రాజకీయాల ప్రభావం వలన వారి విధేయతకు పరిమితి ఏర్పడింది. సర్కారుజిల్లాల్లోని మితవాద సంఘసంస్కరణోద్యమాల ప్రభావం వారిపై ఏదోమేరకు పడి కాంగ్రెసులోని మితవాదవర్గాలవైపు చూచే స్థితి క్రమంగా ఏర్పడింది. కాంగ్రెసు అధికారంలోకి వచ్చిన కాలంలో ఆ సంస్థ తమ వర్గప్రయోజనాలను కాపాడగలుగుతుందని విశ్వసించి తమ విధేయతను మార్చుకొని కాంగ్రెసుకు అనుయాయులైనారు. అయితే ఈ పరిణామం సర్కారుజిల్లాలలో మాదిరిగా కాక పెద్దఎత్తున సాగిన విప్లవోద్యమ ఫలితంగానే జరిగిపోయింది.

# 5. కమ్యూనిస్టు కార్యకలాపాల ప్రారంభం
## ( 1939-1941 )

స్టేటుకాంగ్రెసు సత్యాగ్రహులు జైలునుంచి విడుదలైన తర్వాత నిజాం ప్రభుత్వం ఆ సంస్థపైన విధించిన నిషేధాన్ని తొలగించ నిరాకరించింది. సంస్థ పేరును మార్చుకొమ్మన్నది. సరే కానిమ్మని మార్చి 'నేషనల్ కాన్ఫరెన్సు' అని పేరుపెట్టారు. అప్పటికీ నిషేధాన్ని తొలగించలేదు. రెంటాచెడిన రేవడలైనారు స్టేటుకాంగ్రెసు నాయకులు. నాయకులేగాక అనుచరులు కూడా దిక్కుతోచక ఉన్న ఆ సమయంలో ఆంధ్రరాష్ట్ర కమిటీ సంస్థానంలో కమ్యూనిస్టు పార్టీని ఏర్పరచటానికి కృషిచేసింది.

## 1. పార్టీ నిర్మాణపు తొలిరోజులు

ఆంధ్రరాష్ట్రకమిటీ ఏ ఒక్కరిమీదనో ఆధారపడక అందుబాటులో ఉన్న ప్రతివారితో సంబంధాలు ఏర్పరచుకున్నది. కృష్ణాజిల్లా సరిహద్దున ఉన్న మధిర, ఖమ్మం తాలూకా గ్రామాలతో వారికి సులభంగా సంబంధాలు ఏర్పడినవి. మధిర తాలూకాలోని కొన్ని సరిహద్దు గ్రామాల్లో అప్పటికే స్టేటుకాంగ్రెసు సత్యాగ్రహంలో పాల్గొని, ఆ సంస్థలో పనిచేసిన యువకులు ఉండేవారు. ఈ గ్రామాల్లో ముఖ్యమైనది అల్లినగరం. మధిర స్టేషన్‌కు సమీపాన ఉంటుంది. సరిహద్దు గ్రామాలలో బలమైన కమ్యూనిస్టు కేంద్రాలు ఉండేవి. నందిగామ తాలూకాలోని వీరులపాడు ఆ కేంద్రాలలో ఒకటి. అక్కడి కార్యకర్తలద్వారా మధిర, ఖమ్మం తాలూకాల్లోని యువకులతో ఆంధ్రకమిటీవారు సంబంధాలు నెలకొల్పుకోవటం సులభమయింది. బంధుత్వమూ, తదితర సంబంధాలు దీనికి తోడ్పడినవి.

ఖమ్మంలో కమ్మహాస్టల్ ఒకటి ఉండేది. దానిలో పొట్లూరు సుందరం వార్డనుగా పనిచేసేవాడు. అతడు కృష్ణాజిల్లా కమ్యూనిస్టుపార్టీ, రైతుసంఘం

కార్యకర్త. ఆయనను ఖమ్మం పంపించి ఆయనద్వారా ఈ సంబంధాలన్నిటికీ ఒక నిర్మాణస్వరూప మివ్వటానికి ప్రయత్నించినారు.

స్టేటు కాంగ్రెసులోని అతివాదులు, ముఖ్యంగా రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి, ఆరుట్ల సోదరులు, గంగసాని గోపాలరెడ్డి సత్యాగ్రహంలో పాల్గొన్న మరికొందరితో క్రమంగా సంబంధాలేర్పరచుకున్నారు. ఏ కార్యక్రమమూ లేక గందరగోళస్థితిలో ఉన్నవీరు కమ్యూనిస్టు భావాలతో ప్రభావితులైనారు. రావి నారాయణరెడ్డిగారు అప్పటికే నెహ్రూ 'సోషలిజం' తో ఆకర్షితులైనట్టు తమ "స్మృతుల్లో" చెప్పుకున్నారు.

హైదరాబాద్ నగరంలో "కామ్రేడ్స్ అసోసియేషన్" అనే సంస్థ డిసెంబరు 1939లో ఏర్పడింది. ఇది సోషలిస్టు భావాలుగల యువకులు విద్యాధికుల సంస్థ. దీనికి ప్రజా ఉద్యమ నిర్మాణ కార్యక్రమం లేదు. కొందరు వ్యక్తుల సమూహమైన సంస్థ ఇది. వీరిలో ముఖ్యులు మఖ్దూం మొహియుద్దీన్, సయ్యద్ ఆలం కుంద్ మీరీ, రాజబహదూర్ గౌర్, ముర్తుజా హైదర్, సయ్యద్ ఇబ్రహీం. మఖ్దూం మొహియుద్దీన్ అప్పటికే ఉత్తరప్రదేశ్‌లోని సోషలిస్టు రచయితలతో సంబంధం ఏర్పరచుకున్నాడు.

వీరే కాక మరట్వాడాలో (సంస్థానంలోని మహారాష్ట్ర జిల్లాలు) ఉండే అతి వాదులలో కొందరితో సంబంధాలేర్పడినవి. వారిలో వందేమాతరం విద్యార్థి ఉద్యమంలో పాల్గొన్న వి.డి. దేశపాండే, అప్పటికే బొంబాయిలోని కమ్యూనిస్టు పార్టీతో సంబంధం ఉన్న చంద్రగుప్త చౌదరి మొదలగువారు ఈ శ్రేణుల్లోకి చేరినారు. ఈ విధంగా 1939-40 కాలంలో కమ్యూనిస్టు పార్టీవైపుకు వచ్చిన వారంతా అతివాదులూ, సాయుధవిప్లవాన్ని అభిమానించేవారైనా విభిన్న ధోరణులకు చెందినవారు. మార్క్సిజం-లెనినిజాన్ని అంగీకరించి కమ్యూనిస్టులైనారు. వీరంతా ఒకేసారి, ఒకేనాడు పార్టీలోకి రాలేదు. ముందు వచ్చినవారు ఖమ్మం - మధిర కార్యకర్తలని చెప్పవచ్చును. తర్వాత వచ్చినవారు రావినారాయణ రెడ్డి వారి అనుచరులు, ఇతర మాజీ సత్యాగ్రహులు. కొద్దిరోజుల తర్వాత 'వందేమాతరం' విద్యార్థులైన సర్వదేవభట్ల రామనాథం, దేవులపల్లి వెంకటేశ్వరరావు, ఖమ్మంలోని చిర్రావూరి లక్ష్మి నరసయ్య, పెరవెల్లి వెంకట రమణయ్య వచ్చినారు. తర్వాత హైదరాబాదు నగరపు కామ్రేడ్స్ అసోసియేషన్‌వారు. ఇది స్థూలమైన వరుస క్రమమని చెప్పవచ్చును.

పార్టీ కార్యకలాపాల్లో తోడ్పడటానికి మునిపల్లె రామారావుగారను మరో కార్యకర్తను పార్టీ పంపించినది. వారు నల్లగొండ జిల్లాలో కొంతకాలం పనిచేసి తర్వాత హైదరాబాదు నగరానికి వెళ్ళి అక్కడ పార్టీని నిర్మించడానికి చాలా కృషిచేసినారు. చంద్ర రాజేశ్వర రావుగారు నగరంలో మూడు నెలలపాటు మకాంవేసి ఎందరో యువకులకు రాజకీయ శిక్షణా తరగతులు నిర్వహించారు.

పార్టీ నిర్మాణాన్ని ఏర్పరచటానికి తొలి చర్యలు పూర్తి కాకముందే ఆలేరు (నల్లగొండ జిల్లా)లో రైతు మహాసభను జరపటానికి నిర్ణయించారు. ఇది తెలంగాణాలో రైతు మహాసభ ఏర్పాటు చేయడానికి మొదటిప్రయత్నం. మహారాష్ట్ర కర్ణాటక ప్రాంతాలనుంచి ప్రతినిధులను సమీకరించాలని మహాసభ నిర్వాహకులు ప్రయత్నించారు. ప్రభుత్వం మహాసభకు అనుమతివ్వలేదు. రైతు సంఘ కార్యకలాపాలేవైనా వ్యవసాయ విప్లవానికి దారితీస్తాయని భయపడి వాటిని మొగ్గలోనే తుంచివేయాలని, రైతు మహాసభను ముందే నిషేధించింది.

ఆంధ్రమహాసభ మితవాద సంస్థ. దీనిలో ఉంటూ పనిచేయుటవలన ఉపయోగంలేదని, స్టేటు కాంగ్రెసులో ఉండి పనిచేస్తూనే రైతుసంఘాన్ని నిర్మించి దానిద్వారా రైతుల్లో పనిచేయాలని పార్టీ ముందు నిర్ణయించింది. కానీ స్టేటు కాంగ్రెసుపై నిషేధాన్ని తొలగించటానికి నిజాం ప్రభుత్వం నిరాకరించింది. దీనితో స్టేటుకాంగ్రెసులో చేరి పనిచేయటం సాధ్యంకాని స్థితి ఏర్పడింది. మితవాద సంస్థ అనే కారణంతో ఆంధ్రమహాసభలో పనిచేయకూడదని దానిని వదిలివేసినారు. అప్పుడే కమ్యూనిస్టుపార్టీలో చేరిన రావి నారాయణరెడ్డి ప్రభృతులు, స్టేటు కాంగ్రెసు, ఆంధ్రమహాసభల్లో ముఖ్యస్థానాల్లో ఉండటం వలన పార్టీ ఈ విధంగా నిర్ణయించింది. తరువాత రైతుసంఘాన్ని ఏర్పాటుచేసి దానిద్వారా రైతుల్లో పని చేయాలని నిర్ణయిస్తే దానిని కూడా ప్రభుత్వం నిషేధించింది. ఈ చర్యను ఆచరణలో రైతుసంఘాన్ని నిషేధించటమేనని పార్టీ నాయకత్వం పరిగణించింది. ఈ పరిణామాలన్నింటిని దృష్టిలో ఉంచుకొని రైతుసంఘం నిర్మాణప్రయత్నాలను మానుకొని తిరిగి ఆంధ్రమహాసభలో చేరి పనిచేయాలని ఆంధ్రకమిటీ నిర్ణయించింది.

దాదాపు ఇదేసమయాన మల్కాపురంలో ఏడవ మహాసభను జరుపటానికి ఆంధ్రమహాసభవారు నిర్ణయించారు. మల్కాపురం హైదరాబాదు – విజయవాడ రహదారిపై హైదరాబాదుకు 40 కి.మీ. దూరంలో నల్లగొండ జిల్లాలో ఉంది. ఈ మహాసభకై ఏర్పడిన ఆహ్వానసంఘంలో స్టేటుకాంగ్రెసులోని హైదరాబాదు

జిల్లాకు చెందిన అతివాద కార్యకర్తలు సభ్యులుగా ఉండేవారు. వారిలో రావి నారాయణరెడ్డి ముఖ్యులు. వారంతా ఆహ్వానసంఘంలో ముఖ్యమైన బాధ్యతలు తీసుకున్నారు కూడా.

## 2. మితవాదులు–అతివాదులు

సంస్థాన రాజకీయాల్లో మితవాద అతివాదులను గూర్చి మందుముల నరసింగరావు ఈ విధంగా రాశారు.

"అవి ఆంధ్రమహాసభలో మితవాదులు, అతివాదులు, జాతీయవాదులు, కమ్యూనిస్టులు అంతా కలిసి పనిచేసే రోజులు. స్టేటుకాంగ్రెసు సత్యాగ్రహోద్యమంలో పాల్గొని జైళ్ళకు వెళ్ళినవారు అతివాద జాతీయవాదులుగాను జైళ్ళకు వెళ్ళనివారు మితవాదులుగాను భావించబడుటమారంభమైనది. స్టేటుకాంగ్రెసు సత్యాగ్రహుల తుదిజట్టు లీడరుగా జైలుశిక్ష అనుభవించిన కాశీనాథరావువైద్యగారు మితవాదిగానే యెంచబడినారు. మాడపాటి హనుమంతరావు పంతులుగారు క్రియాశీల రాజకీయాలతో ఎప్పుడూ సంబంధముంచుకోలేదు. కొండా వెంకటరంగారెడ్డి, బూర్గుల రామకృష్ణరావుగారలు స్టేటుకాంగ్రెసు ప్రథమ సత్యాగ్రహములో పాల్గొనలేదు. నేను కూడ జైలుకు వెళ్ళలేదు. పత్రికా సంపాదకునిగానే ఉండిపోయినాను. మానసికంగా మాఅందరిదీ మితవాదతత్వమే-అందులో సందేహమేమీలేదు." (50 సంవత్సరముల హైదరాబాదు ; పేజి-238-239).

ఈ విధంగా జైలుకి వెళ్ళడమే అతివాదానికి గీటురాయని ఆ రోజుల్లో భావించారు. వాస్తవమేమంటే జైలుకు వెళ్ళిన పెద్దలంతా మితవాదులే. త్వరలో బాధ్యతాయుత ప్రభుత్వమొస్తుందని జైలుకి వెళ్ళినవారే అలాంటి ప్రభుత్వంలో శాసనసభలో సభ్యులవుతామనీ, తమకే ఈ పదవులన్నీ దక్కుతాయనీ వారు ఆశించినారు.

బాధ్యతాయుత ప్రభుత్వమేవస్తే తమనుకాదని అతివాదులు పదవులన్నిటినీ సొమ్ముచేసుకోలేరనీ, ప్రభుత్వంతో జరిగే ఏ రాజీలోనూ తమకే ప్రాధాన్యత ఉంటుందనీ మితవాదులు భావించారు. ఈ దృష్టితో చూస్తే అంతా మితవాదులే. కొందరు జైలుకువెళ్ళిన మితవాదులు, తక్కినవారు అలావెళ్ళని మితవాదులు. మొదటిశ్రేణికి చెందినవారిని అతివాదులన్నారు.

జైలుకువెళ్ళిన యువకులు కూడా ఈ శ్రేణికి చెందినవారే. అయినా "క్రియాశీల రాజకీయాలు కలవార"ని వారికిపేరు. వీరిలో కొందరు కమ్యూనిస్టు పార్టీవైపుకు వచ్చి, పార్టీ కార్యక్రమ ప్రభావంతో "క్రియాశీలురై"నారు. విడిగావుంటే వీరు కూడా జైలుకివెళ్ళిన మితవాదులై ఉండేవారు. కొంతకాలానికి వీరు మితవాద కమ్యూనిస్టులైపోయినారు.

మందుములవారు ఈ అంశాన్నే మరికొంత వివరించారు :

"బ్రిటిష ఇండియాలోని మితవాదులు కాంగ్రెసును వదిలిపెట్టి లిబరల్ ఫెడరేషన్ అను తమది వేరే ఒక వ్యవస్థ నిర్మించుకున్నట్లు హైదరాబాదు మితవాదులు తమ మాతృసంస్థనుంచి వెళ్ళిపోలేదు. అతివాదులతో సహకరిస్తూ వారితో కలిసి పనిచేసేవారు. ఈ విషయంలో హైదరాబాదు ప్రభుత్వము కూడ తోడ్పడినది. మితవాద, అతివాద, జాతీయవాద మరియు కమ్యూనిస్టు అనే యే తారతమ్యము లేకుండా వివిధములైన ఆలోచనలు సాంప్రదాయములుగలవారందరితోనూ ప్రభుత్వమువారి ప్రవర్తన ఒకే విధంగానుండేది.

(పై పుస్తకం ; పేజి - 239)

నిరంకుశత్వం నగ్నంగా తాండవిస్తున్న సంస్థానంలో పరిస్థితులు మరో విధంగా ఉండజాలవు. మితవాదులంతా అఖిలభారత కాంగ్రెసు నాయకత్వంపై పు అర్రులుజాచుకొని నిరీక్షిస్తూ ఉండేవారు. నిజాం ప్రభుత్వం కాంగ్రెసు పలుకుబడిని తగ్గించాలని ప్రయత్నిస్తూ వచ్చింది. జాతీయ శక్తులు పుంజుకోగూడదని, బలపడకూడదనీ ప్రభుత్వం కృతనిశ్చయమై ఉండేది. కమ్యూనిస్టుల పరిస్థితికూడా ఇదే విధంగా ఉండేది. మితవాద నాయకులపై పరిమితమైన నిర్బంధాలు ఉండేవి. కార్యకర్తలపై ప్రారంభంనుంచీ తీవ్రమైన నిర్బంధాలు కొనసాగినవి.

## 3 ఏడవ ఆంధ్ర మహాసభ (మల్కాపురం)

అప్పుడు ఆంధ్ర మహాసభ మితవాదుల నాయకత్వంలోనే ఉన్నది. ఆహ్వాన సంఘం కూడా మితవాదుల చేతులలోనే ఉంది. కొండా వెంకట రంగారెడ్డిగారు దానికి అధ్యక్షులైనారు. అయినా ప్రతినిధుల్లో అతివాదులే హెచ్చు సంఖ్యలో ఉన్నారు. వారిలో క్రొత్తగా కమ్యూనిస్టు పార్టీలో చేరినవారు కొందరున్నారు. వారంతా కమ్యూనిస్టులని ఆనాటికి ఎవ్వరికీ తెలియదు. వారితోసహా అతివాద జాతీయవాదులు (Left nationalists) అధిక సంఖ్యలో ఉన్నారు,

18 నెలలు గడిచినా స్టేటు కాంగ్రెసు సత్యాగ్రహ ప్రభావం, విద్యార్థుల వందే మాతరం సమ్మె ప్రభావం ప్రతినిధుల అభిప్రాయాలపై స్పష్టంగా కన్పించింది.

మందుముల రాంచంద్రరావుగారు ఎన్నికైన అధ్యక్షులు. ఆయన మితవాది అయినా స్టేట్ కాంగ్రెస్ సత్యాగ్రహంలో జైలుకు వెళ్ళినారు. ఈ కారణాన వారికి అతివాదులతో సన్నిహిత సంబంధం ఉండేది. ఆ పరిస్థితులలో వారిని మధ్యేమార్గ వాది **(middle of the roader)** అని పరిగణించవచ్చును.

మహాసభలో రాజ్యాంగ సంస్కరణలయెడ అనుసరించవలసిన వైఖరి చర్చకు వచ్చింది. అతివాదులందరూ (కమ్యూనిస్టులు, కాంగ్రెసువాదులు) ఈ సంస్కరణలను పూర్తిగా నిరాకరించాలని వాదించారు. మితవాదులు సంస్కరణ లను పూర్తిగా నిరాకరించవద్దన్నారు. తుదకు రాజ్యాంగ సంస్కరణలను తిరస్క రించాలనే తీర్మానాన్ని అత్యధిక మెజారిటీతో మహాసభ ఆమోదించింది. తీర్మానం పూర్తిపాఠం ఈ విధంగా ఉన్నది :

"ప్రభుత్వమువారు ప్రకటించిన రాజ్యాంగ సంస్కరణలు అసంతృప్తి కరంగాను, నిరాశాజనకముగాను, దేశ భావ్యభివృద్ధికి హానికరముగానున్నవి. వివిధ కారణములవలన, ముఖ్యముగా నిజామాబాదు సభయందుగావింపబడిన తత్వమునకు విరుద్ధముగానున్నందునను, ప్రజా పరిషత్తువారి సూచనలలోని సిద్ధాంతములకు ప్రతికూలముగానున్నందున, శాసనసభ యెదుట మంత్రివర్గము బాధ్యత వహించ వలయునను తత్వము అంగీకరింపబడినందునను, బహు సంఖ్యాకులకు దేశీయులకు ప్రాతినిధ్యము దొరకకుండ వృత్తి పూర్వకమగు విభాగములపై ప్రాతినిధ్యము నేర్పరచుటవలనను పౌరసత్వ హక్కులు లేకుండుటచేతను, అల్పసంఖ్యాకులకు సగముకన్నెనెక్కువ ప్రాతినిధ్యమిచ్చి ఆధిక సంఖ్యాకులకు తక్కువ ప్రాతినిధ్య మిచ్చి అల్ప సంఖ్యాకుల తెగగా మార్చుటచేతను, ప్రజలచే ఎన్నుకొనబడిన సభ్యులు అల్ప సంఖ్యలోనుండుటచేతను, మరియు నూతన సంస్కరణములలో సాధారణ మార్పులవలన బాగుపడనట్టి పుట్టుదోషములనేకములున్నందునను ఈ మహాసభవారు ఈ రాజ్యాంగ సంస్కరణలను నిరాకరించుచు, దీనితో యేలాటి సంబంధముంచుకొనకూడదని విదేశీయులను హెచ్చరించుచున్నారు."

(ఆంధ్రోద్యమం—రెండవ భాగం ; పేజి 321)

ఈ తీర్మానం సమగ్రంగా ఉన్నది. 'నూతన సంస్కరణములలో సాధారణ మార్పులవలన బాగుపడనట్టి పుట్టుదోషములనేకములున్న'వని స్పష్టం చేసింది. ఈ కారణాలవలన రాజకీయ సంస్కరణలను తిరస్కరించటం సరైందే. మితవాదులు

"నిరాకరించుచు" "యేలాటి సంబంధముంచుకొనకూడద"ను పదాలను తొలగించాలనే సవరణను ప్రతిపాదించారు. దీనితో మితవాదులకు రాజీబేరాలకు అవకాశం ఏర్పడుతుంది. ఈ సవరణను గెలిపించుకోటానికి మితవాదులు ఎంతో ప్రయత్నం చేసారు. అయినా సవరణ వీగిపోయింది. అప్పటికి సంస్థలో అతివాద శక్తుల ప్రాబల్యం ఏర్పడిందని ఈ పరిణామం స్పష్టంచేసింది.

మహాసభలో ఖమ్మం, మధిర తాలూకాల నుంచి వచ్చిన ప్రతినిధులు విప్లవగేయాలు, జాతీయగేయాలు, రైతుసమస్యలపై గేయాలు చాలా ఉత్తేజకరంగా పాడి మహాసభకు కొత్తశోభను సమకూర్చినారు. ఉత్సాహకరమైన వాతావరణంలో సాగటానికి తోడ్పడినారు. పూర్వపు మహాసభల్లో లేని కొత్తవిశేషమిది.

ఈ మహాసభలో అతివాదశక్తులది పైచేయి అయినా మైనారిటీలో ఉన్న మితవాదులు ఆంధ్రమహాసభను బహిష్కరించలేదు ; దానిలోనే ఉన్నారు. తగిన సంఖ్యలో కార్యవర్గంలో ఉండటమేగాక, బాధ్యతగల స్థానాలన్ని వారికే దక్కినవి. రాజ్యాంగ సంస్కరణలను బహిష్కరించాలని తీర్మానాన్ని ప్రతిపాదించినవారు, బలపరిచినవారెవరూ వాటిని స్వీకరించలేదు.

మల్కాపురం మహాసభ తర్వాత దాని పనివిధానంలో స్వల్పమైన మార్పు వచ్చింది. అధ్యక్షుడు అన్నిజిల్లాల్లో పర్యటనచేసి అక్కడి పరిస్థితులను స్వయంగా తెలుసుకోవటానికి ప్రయత్నించాడు. పూర్తి సమయమిచ్చి పనిచేసే కార్యకర్తలను ఏర్పాటుచేసి వారిద్వారా ఆంధ్రమహాసభ రోజువారి కార్యకలాపాలను సాగించాలనే ఒక అభిప్రాయం ఉండేది. కేంద్ర కార్యవర్గంలోని పార్టీ ప్రతినిధులు ఇలాంటి సూచనలు చేశారు. తక్కినవారు అంగీకరించారు. పూర్తి సమయమిచ్చి పనిచేసే కార్యకర్తలను నియమించే సాంప్రదాయం అప్పటికే ఉన్నది.

కొత్త అధ్యక్షుని హయాంలో ఆంధ్రమహాసభ కేంద్రకార్యాలయం క్రమబద్ధంగా పనిచేయసాగింది. రైతులపై అక్రమంగావిధించే పన్నుల సమస్యలు తీవ్రంగా ఉండేవి. పనిచేసేవారు లేక, వ్యయప్రయాసలకు భయపడి జిల్లాస్థాయిలోనూ, హైదరాబాదులోనూ రైతులు పైరవీ (లిటిగేషన్) చేయటం అసాధ్యమయ్యేది. దీనిని దృష్టిలో ఉంచుకొని, ఖర్చులు భరించలేని సాధారణ రైతులందరికీ అక్రమ పన్నులను రద్దుచేయించటానికి లీగల్ సహాయానికి ఏర్పాట్లు జరిగినవి. దీనివలన రైతులకు ఉపయోగం కలిగింది ; ఆంధ్రమహాసభ పలుకుబడి వ్యాపించింది. కొంత సమయమిచ్చి పనిచేసేవారు రావటంతో ఆంధ్రమహాసభకు తన కార్యకలాపాలను తానుగా సాగించగల్గిన స్తోమత ఏర్పడింది. ఇలాంటి

మార్పుకు కమ్యూనిస్టులు ఎంతో దోహదంచేశారు. పూర్వకాలపు అధ్యక్షులు లాంఛనప్రాయంగా జిల్లాలలో పర్యటన చేసేవారు. తీరిక సమయాల్లో తమకు పరిచయమున్న ప్రదేశాలకు వెళ్ళేవారు. కాని ఈ అధ్యక్షుడు బాగా పర్యటించారనీ "తెలంగాణములోని 120 గ్రామములు జూచిరి. 4500 మైళ్ళు పర్యటన జరిగినదని" మాడపాటివారు రాశారు (ఆంధ్రోద్యమం ; రెండవభాగం, పేజి 148)

## 4. కమ్యూనిస్టుల కార్యక్రమం

కమ్యూనిస్టుపార్టీ కొద్దిరోజుల్లోనే తన కార్యక్రమాన్ని రూపొందించింది. దానిలోని ముఖ్యమైన అంశాలు :

1) ప్రభుత్వ చట్టాలను ఉపయోగించటం : నిజాం సంస్థానంలో చట్టాలు ఎన్నో ఉన్నాయి. వాటిలో హెచ్చుభాగం బ్రిటిష్ ఇండియాలో అమల్లో ఉన్నవే. వాటిని ఉర్దూ భాషలో ఉన్నది ఉన్నట్టుగా తర్జుమాచేసి నిజాం సంస్థానపు చట్టాలని ప్రకటించింది. కొన్నిటిలో స్వల్పమైన మార్పులు చేర్పులు చేసింది. చట్టాలలో ప్రజలకు అనుకూలమైన అంశాలు నూటికి ఒకవంతు కూడా లేవు. ఉన్నమేరకు అమలుజరగటంలేదు. గ్రామాల్లో భూస్వాముల, పట్టణాల్లో అధికారుల రాజ్యం నడుస్తున్నది. వారిమాటే చట్టమై అమలుజరుగుతున్నది. ఈ పరిస్థితులలో చట్టాలను అమలుజరుపటం కోసం ప్రజలను సమీకరించాలి. చట్టాలను అమలు జరిపించట్టానికి కృషిచేయాలి. దీనిద్వారా ప్రజలలో చైతన్యం కలిగించాలి. దీనినే పార్టీ సభ్యులకు కార్యక్రమ రూపంలో అందించారు.

ఉదా : రైతులకున్న హక్కులే స్వల్పం. ఆ మేరకు వాటిని అమలు జరుపుతూ అక్రమాలను అరికట్టాలి. పటేలు పట్వారీలు భూమిమీద వసూలుచేసే శిస్తును చట్టాన్ని అనుసరించి వసూలుచేయించాలి. అసలు శిస్తునే ఇప్పించాలి. చట్టాన్ని అమలుజరిపే ఒక చర్య ఇది. నిబంధనల ప్రకారం వెట్టిచాకిరి చేయాలి కాని, చాకిరిచేయించేవారు డబ్బులు చెల్లించాలి. రైతులకు, వ్యవసాయ కూలీలకు, చేతివృత్తులవారికి, వర్తకులకు చట్టరీత్యా ఉన్నమేరకు సౌకర్యాలు కల్గించాలి. ఇదే కార్యక్రమ సారాంశం. దీనివలన రైతాంగంతో ఇతర ప్రజానీకంతో పార్టీకి సంబంధాలు ఏర్పడుతాయి. వీటి సాయంతో ప్రజాఉద్యమాన్ని నిర్మించాలి.

2) ఐక్యసంఘటన ఏర్పరచాలి : ఆంధ్రమహాసభలో మితవాదులతో, అతివాద జాతీయవాదులతో ఐక్యసంఘటన ఏర్పరచి వారితో కలిసి పనిచేయటం.

అతివాదులు, అతివాద జాతీయవాదులు, కమ్యూనిస్టులు, వారి అభిమానులంతా అతివాదులే. ఆ రోజుల్లో జాతీయవాదులు కాళోజీ నారాయణరావు, కోదాటి నారాయణరావు మొదలగువారు ఖమ్మంలో ఉండేవారు. డాక్టరు ఉపేంద్రరావు సోషలిస్టు. ఆయన అతివాది. వారందరిని కలుపుకొని పనిచేయాలనేది పార్టీ కార్యక్రమంలోని ముఖ్యాంశం. అతివాదులంతా కలిసి పనిచేయటం సహజమే. ఆనాటి ప్రత్యేకత ఏమంటే : భారతదేశమంతటా కమ్యూనిస్టుపార్టీపై నిషేధం ఉన్నది. ఆ నిషేధం హైదరాబాదుకు కూడా వర్తిస్తుంది. ఆకారణాన తాము కమ్యూనిస్టులమని వారు బహిరంగంగా చెప్పుకోలేదు. అతివాదులంతా ఒక గ్రూపుగా ఏర్పడకపోయినా వారు మితవాదులను తేలికగా వ్యతిరేకించగలిగినారు. కాని మితవాదులతో కలిసి పనిచేయాలా లేక వారిని తరిమి వేయాలా అనే సమస్య చర్చకు వచ్చినప్పుడు మితవాదులను కూడా కలుపుకురావాలి ; అప్పుడున్న యుద్ధ పరిస్థితి, నిజాం నవాబు నిరంకుశ పరిపాలనను దృష్టిలో పెట్టుకొని మితవాదులను దూరం చేసుకోకూడదని పార్టీ నిర్ణయించింది. చట్టాలు అమలుజరిపే మేరకు వారు పార్టీతో కలిసి రావటానికి అవకాశముంటుంది. కనుక వారినికూడా కలుపుకు రావాలనేది ఈ కార్యక్రమంలో ఒకముఖ్యాంశం. దానికి అనుగుణ్యంగానే మహాసభ చేసిన ఇతర తీర్మానాలు ఉన్నాయి. రాజ్యాంగ సంస్కరణలపై చేసిన తీర్మానంతో మితవాదులను కలుపుకురావటానికి అవకాశం లేకున్నా జాతీయ భావాలు కలిగినవారంతా సంస్కరణలను తిరస్కరించాలని కోరినందువలన అటువంటి తీర్మానం చేయటం సాధ్యమైంది. మితవాదులు దానిని వ్యతిరేకించినా అది విప్లవాత్మకమైన తీర్మానమని వారానాడు భావించలేదు. ఆ కారణాన వారు ఆంధ్ర మహాసభనుంచి వెళ్ళిపోలేదు.

3) ఆంధ్ర మహాసభను ప్రజా సంస్థగా రూపొందించాలి : ఆలేరు రైతు మహాసభను ప్రభుత్వం నిషేధించటంతో పార్టీకి రైతాంగంలో పనిచేయటానికి ఒక సంస్థ అవసరమైనది. ఆంధ్ర మహాసభలో ఉంటూ రైతాంగంలో పనిచేయవచ్చునా లేదా అనే అంశాన్ని పరిశీలిస్తే, చేయటానికి అవకాశం ఉన్నదని స్పష్టమైంది. అప్పటివరకు జరిగిన అన్ని మహాసభల్లో రైతుల సమస్యలపై తీర్మానాలలో స్పష్టమైన కోర్కెలున్నవి. వాటి ఆధారంతో పని ప్రారంభించవచ్చును. అవసరమైన మరికొన్ని తీర్మానాలు చేయవచ్చును. ఈ విధంగా రైతాంగంలో పనిచేసి ఆంధ్ర మహాసభను ఒక ప్రజా సంస్థగా రూపొందించవచ్చును. అప్పుడున్న సంస్థకు పరిమితమైన నిర్మాణం ఉండేది. ప్రభుత్వ అనుమతికి లోబడి సంవత్స

రానికొకసారి సమావేశమై తీర్మానాలు చేసి, నాయకులూ ప్రతినిధులూ ఎవరిళ్ళకు వారు వెళ్ళే ఏ ప్రజా కార్యక్రమం లేని స్థితిని మార్చి, కార్యకర్తలను నియమించి గ్రామాలకు వెళ్ళాలనీ, గ్రామాల్లోనూ పట్టణాల్లోనూ ఉండే ప్రజల సమస్యలు తీసుకొని పనిచేసి దానిని ఒక ప్రజా సంస్థగా రూపొందించాలనీ పార్టీ నిర్ణయించింది.

4) పార్టీ నిర్మాణం : పార్టీ రహస్యంగా పనిచేయాలి. పార్టీపై నిషేధం, యుద్ధ పరిస్థితి, సంస్థానంలో నిజాం నిరంకుశ పరిపాలనవలన విప్లవ పార్టీ బహిరంగంగా పనిచేయలేదు. ఆ కారణాన పార్టీని రహస్యంగా నిర్మించాలి, పని చేయించాలి అనేది ఈ కార్యక్రమంలోని మరో ముఖ్యమైన అంశం. దానికనుగుణ్యంగా కొందరిని పార్టీ ఆర్గనైజర్లుగా నిర్ణయించింది. సర్కారు జిల్లాలనుంచి కొందరు వచ్చి పనిచేయటానికి ఏర్పాటుచేసింది. దీనికై అప్పుడే పార్టీలో చేరిన దేవులపల్లి వెంకటేశ్వరరావును, పెరవెల్లి వెంకటరమణయ్యను (ఖమ్మం) పార్టీ ఆర్గనైజర్లుగా నిర్ణయించింది. తక్కినవారంతా ఆంధ్రమహాసభలోనూ, ట్రేడు యూనియను విద్యార్థి సంఘాల్లోనూ పనిచేయాలని నిర్ణయం జరిగింది. ఈ విధంగా పార్టీని ఆంధ్రమహాసభ నుంచి విడదీసి స్వతంత్రంగా పనిచేసి నిర్మించే కార్యక్రమం ఆ రోజుల్లోనే ప్రారంభమయింది.

మల్కాపురం మహాసభ తర్వాత పార్టీ నిర్మాణపు కృషి ప్రారంభమైంది. ఆదశలో ఉన్నతస్థాయిలో జరిగిన కొన్ని ఘటనలను తెలుసుకోవటం అవసరం.

1. రావి నారాయణరెడ్డిగారి స్వగ్రామమైన బొల్లెపల్లిలో ముఖ్యుల సమావేశాన్ని ఏర్పాటుచేసినారు. వారిలో జమలాపురం కేశవరావుగారు ఒకరు. ఆ సందర్భంలో ఆయనతో కమ్యూనిస్టుపార్టీ విషయాలు మాట్లాడినారు. అతివాద భావాలతో ఈ నిజాం వ్యతిరేక ఉద్యమంలో ఉంటామనీ, విప్లవకార్యక్రమంతోగాని కమ్యూనిస్టుభావాలతోగాని ఏకీభవించననీ వారు స్పష్టంగా చెప్పినారు. సంభాషణ అంతా స్నేహపూర్వకమైన వాతావరణంలో సాగిపోయింది.

2. ఖమ్మంలో పార్టీ కార్యకర్తలకోసం నడిపిన రాజకీయ శిక్షణా తరగతులు, ఖమ్మం, నల్లగొండ కామ్రేడ్స్ ముఖ్యులు 5-6 గురికి చాలా రహస్యంగా క్లాసులు నడిచినవి. వాటిలో గతితార్కిక భౌతికవాదం, రాజకీయ ఆర్థికశాస్త్రం (Political economy) సోషలిజాన్ని గురించి మార్క్స్ బోధనలను వివరించి చెప్పినారు. ప్రజాపోరాటాలను నడిపే సమయంలో అనుసరించవలసిన ఎత్తుగడలను కూడా వివరించినారు. ప్రజలు పోరాటానికి సిద్ధ గా ఉన్నప్పుడు పార్టీ ఎప్పుడూ వారిని వెనక్కుపట్టించకూడదు. పార్టీ ప్రజలతో ప్రజలముందు

ఉంది నడపాలి అనేది ఈ ఎత్తుగడలలో ఒకటి. చెప్పినవారు చంద్రరాజేశ్వర రావుగారు. మొదటినుంచి చివరిదాకా సమగ్రంగా ఉన్నవి. మార్క్సిజాన్ని అర్థం చేసుకోవటానికి ప్రయత్నిస్తున్న ఆ విద్యార్థులకు ఇవి ఎంతో ఉపయోగపడినవి.

3. ఖమ్మం జిల్లా, తిరువూరు తాలూకా సరిహద్దుల్లో ఉన్న తునికిపాడు గ్రామంలో పార్టీ ముఖ్యుల సమావేశమొకటి ఏర్పాటుచేసినారు. దానిలో కార్యక్రమాన్ని చర్చించి నిర్ణయించారు. పార్టీ నిర్మాణం, పార్టీ నాయకులు కార్యకర్తలు ఆంధ్రమహాసభలో చేరి పనిచేయటంలాంటి విషయాలు చర్చకువచ్చాయి. నాయకత్వం మొదటిసారి సమావేశమయి పార్టీ కార్యక్రమాన్ని చర్చించటం వలన దానికి ప్రత్యేకత ఉంది. అంతకు పూర్వం కొన్ని సమావేశాలు జరిగినా ముఖ్య విషయాలను చర్చించిన ఈ సమావేశానికి ఎంతో ప్రాముఖ్యత ఉన్నది.

4. సూర్యాపేట తాలూకాలోని చందుపట్ల గ్రామంలో పార్టీ కార్యకర్తలు రాత్రి పాఠశాలలు పెట్టి సాధారణ రైతుకూలీ యువకులకు అక్షరజ్ఞానంతోపాటు రాజకీయాలు చెప్పినారు. ఈ పాఠశాలలో శిక్షణపొందిన యువకులు కొందరు పార్టీ ఆంధ్రమహాసభ కార్యకర్తలై తమ బాధ్యతలను నిర్వహించినారు. అదే విధంగా సూర్యాపేటలోని ఆర్యసమాజ యువకులకు పార్టీ రాజకీయాలు, సిద్ధాంతాలు వివరించి నచ్చజెప్పి వారిలో కొందరిని పార్టీవైపుకు ఆకర్షించగలిగినారు. దీనికోసం ముఖాముఖి తలపడక, వారితో కలిసిమెలిసి ఉంటూ చర్చలు సాగించినారు. నల్లగొండ జిల్లాలోని ఇతర ప్రాంతాల్లో కూడా ఈ వైఖరిని అనుసరించి వారిలో ప్రచారం చేయసాగినారు.

మొత్తంగా చూస్తే ఈ కార్యకలాపాలన్నీ కొద్దిస్థాయిలో ప్రారంభమైనవని చెప్పవచ్చును. మల్కాపురం మహాసభ పూర్తికాగానే ఇవి ప్రారంభం కాలేదు. చిల్కూరు మహాసభకు పూర్వం, 7వ మహాసభ చివరికాలంలో కొద్దికొద్దిగా ప్రారంభమైనవి.

పార్టీ నిర్మాణంకోసం ఆనాడుచేసిన ప్రారంభ కృషి ఇది.

కామ్రేడ్స్ అసోసియేషన్ : పార్టీ కార్యకర్తలు పూర్తి సమయం ఇచ్చి పని చేసేవారు అవటం, నిస్వార్థమైన సేవ చేయటంవలన జాతీయభావాలు కలవారంతా వారిని బాగా అభిమానించారు. కాని పార్టీ అప్పటికి బహిరంగంగా పని ప్రారంభించలేదు. 'కామ్రేడ్స్ అసోసియేషన్'లో సోషలిస్టు భావాలున్నవారే అయినా కొందరు కాంగ్రెసు అభిమానులు కూడా దానితో సంబంధాలేర్పరచుకున్నారు. ఆ

సంబంధాలనుగూర్చి మందుములవారు తన '50 సంవత్సరముల హైదరాబాదు' పుస్తకంలో ఇలా రాశారు :

"కామ్రేడ్స్ అసోసియేషన్ హైదరాబాదు పట్టణములో డిసెంబరు 1939లో స్థాపించబడింది. దీని ప్రారంభోత్సవము శ్రీ కాశీనాథరావు వైద్యగారి అధ్యక్షతన జరిగెను. ఈ సంస్థ కార్యదర్శిగా సయ్యద్ ఇబ్రహీం, తమ అసోసియేషన్ ముఖ్య ఉద్దేశ్యము కులమత పక్షపాత ఉద్యమాలను రూపుమాపడము మరియు అన్ని కులాలవారిని ఒకే వేదికపై తేవడమని తెలిపిరి. ఆ సమయాన నేను ఈ సంఘము యొక్క పవిత్ర ఉద్దేశ్యములను పొగుడుచు కామ్రేడులకు నా శుభాకాంక్షలు అంద జేసితిని. ప్రముఖ జాతీయవాది సిరాజుల్ హసన్ తిర్మాజిగారు హిందూ ముస్లిం ఐక్యత గురించి ఉపన్యసించిరి." (పేజి-238) 'ఆశ్చర్యకరమైన విషయం ఏమి టంటే బూర్గుల రామకృష్ణారావుగారు కూడా దానికి ప్రోత్సాహకులుగా ఉండటం' అని రావి నారాయణరెడ్డిగారు రాసినారు. ఈ విధంగా నిజాం వ్యతిరేక కార్యకలా పాలయెడ మితవాదులుకూడా తొలిరోజుల్లో సానుభూతి ప్రకటించేవారు.

కామ్రేడ్స్ అసోసియేషన్ ముఖ్యులు పార్టీలో చేరి కార్మిక, విద్యార్థి ఉద్య మాలను నిర్మించటానికి కృషి చేసినారు. ఆ సంస్థ సభ్యుల్లో కొందరు విద్యార్థులు కూడా ఉండటంవలన వారిద్వారా విద్యార్థి ఉద్యమాన్ని నిర్మించటానికి అవకాశం కలిగింది. అప్పటికి ఉన్న సంబంధాలను ఉపయోగించుకొని అఖిల హైదరాబాదు విద్యార్థి సంఘాన్ని ఏర్పాటు చేయటానికి పార్టీ ప్రారంభ చర్య తీసుకున్నది. సయ్యద్ ఆలం ఖుందు మీరి, ఓంకార్ ప్రసాద్, జవ్వాదురజ్వీ వరుసగా విద్యార్థి సంఘాల్లో తమ బాధ్యతలను నిర్వహించారు. మఖ్దుం మొహియొద్దీన్, రాజ బహా దూర్ గౌర్ మరికొందరు కార్మిక సంఘాలలో పనిచేయసాగినారు.

హైదరాబాదు నగరంలో పార్టీ సంబంధాలేర్పరచుకొన్న వారిలో "ఆంధ్రకేసరి" వారపత్రిక సంపాదకుడు గుండవరం హనుమంతరావుగారొకరు. ఆ రోజుల్లో పత్రికలకు ప్రభుత్వం అనుమతి దొరకడమే చాలా కష్టం. సత్యాగ్ర హాలు, ఇతర ఉద్యమాల పర్యవసానంగా నిరంకుశత్వం సడలినట్టు కన్పించటానికి ప్రభుత్వం కొన్ని పత్రికలను అనుమతించింది. వాటిలో "ఆంధ్రకేసరి" ఒకటి. అనుమతి రావటానికి పూర్వం లిఖిత మాసపత్రిక రూపంలో వచ్చేది. ప్రకాశం పంతులుగారి పేరుపెట్టడం ఆయనపై ఉండే భక్తి, గౌరవభావంవల్లనే. ఆయన పార్టీతో సంబంధాలు ఏర్పరచుకోగానే తన పత్రికను పార్టీకి అప్పగించాడు. వివిధ సమస్యలపై వ్యాసాలు, వార్తలు ఉండేవిధంగా దానిని జాగ్రత్తగా

నడిపించటానికి స్థానిక పార్టీ ప్రయత్నించింది. కాని అది ఎంతోకాలం మనగలుగ లేదు. కొన్నాళ్ళ తర్వాత దాన్ని మూసేసి ఆయనకు వేరే బాధ్యతలను అప్ప గించినారు. హైదరాబాదులో పార్టీ కార్యకర్తగా పనిచేసినాడు. తర్వాత కాజీపేటకు వెళ్ళి రైల్వే వర్క్‌ర్లలో పనిచేసినాడు.

కె.సి. గుప్త అను యువకుడు 'అణాగ్రంథమాల'ను స్థాపించినాడు. దాని ప్రత్యేకత ఏమిటంటే ఆయన ప్రచురించే పుస్తకాన్ని అణా (6 పైసలు) వెలకు అమ్మేవాడు. వర్తమాన సమస్యలను వివరించే పుస్తకాలు అవి. సోషలిజంపై ఒక పుస్తకాన్ని ఆయన ఆ గ్రంథమాల తరఫున ప్రచురించినాడు. అందరికీ అందు బాటులో ఉండే వెలగల ఆ పుస్తకాలు వెంటనే అమ్ముడుపోయేవి. ఈ కారణాన వరుసగా పుస్తకాలను ప్రచురించటానికి ఎంతో అవకాశం ఉండేది. ఆ గ్రంథమాల వ్యాపార సరళిలో నడిచింది.

## 5. యుద్ధ వ్యతిరేక కార్యకలాపాలు

1939 సెప్టెంబరులో బ్రిటిషువారు జర్మనీపై యుద్ధం ప్రకటించినతర్వాత జాతీయవాదులు, కమ్యూనిస్టులు ఉభయులూ యుద్ధాన్ని వ్యతిరేకించినారు. అయినా సంస్థానంలో ఉండే నిరంకుశ పరిపాలనలో జాతీయవాదులూ, మితవాదులూ— ఎవరూ యుద్ధానికి వ్యతిరేకంగా ప్రచారం చేయటానికి ముందుకురాలేదు. కాని కమ్యూనిస్టులు ఇతర యువకులు ఈ పనిచేసినారు. ఖమ్మంలో యువకులు కొందరు యుద్ధానికి వ్యతిరేకంగా గోడలమీద నినాదాలు రాశారు. రహస్యంగా రాసినవే అయినా పోలీసులు ఆ యువకులను అరెస్టుచేశారు. రాజద్రోహ నేరపు కేసు పెట్టారు. కోర్టులో కేసు నడిచింది. దీనిలో డిఫెన్సు లాయరుగా పనిచేసినవారు నాగులవల్లి కోదండరామారావు (ఎన్. కె. రావు–హైదరాబాదు). ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఏకేసునయినా నిర్భయంగా నడుపుతాడని ఆయనకు పేరు ఉండేది. అలా నడిపినాడు కూడా. అక్కడి కమ్యూనిస్టులు, జాతీయవాదులు ఆ కేసుకు సహాయం చేశారు. అలాంటి జాతీయవాదులలో కోదాటి నారాయణరావు కూడా ఒకరు. కేసులో వారికి శిక్షలుపడ్డాయి. తర్వాత వారు విడుదల అయ్యారు. యువకులు గోడలమీద నినాదాలు రాయటంవలన ఖమ్మం నగరంలోనూ, దగ్గరి ప్రాంతాల్లోనూ ప్రజల్లో బాగా సంచలనం కలిగింది.

ఈ కాలంలో పార్టీ యుద్ధానికి వ్యతిరేకంగా పనిచేసినప్పటికీ, ప్రజా ఉద్యమాన్ని నిర్మించే కార్యక్రమంలోనే నిమగ్నమైంది. రహస్య సాహిత్యాన్ని తెచ్చి పంపకంచేసి చదివించటం ఈ కార్యక్రమంలో ఒకభాగం. ఆంధ్రరాష్ట్ర కమిటీ నడిపే "స్వతంత్ర భారత్" అను రహస్యపత్రిక తెలంగాణాలోని పార్టీ యూనిట్లకు అందుతూ ఉండేది. దానిలో ఉత్తేజకరమైన వ్యాసాలూ, వార్తలూ ఉండేవి. ఆ పత్రిక యువకులను బాగా ఆకర్షించేది. పార్టీ కార్యకర్తలు గ్రూపు సమావేశాలలో యుద్ధానికి వ్యతిరేకంగా ప్రచారం చేసేవారు. ప్రజల్లో పనిచేసి వారిని కదిలిస్తే ప్రభుత్వం దానిని యుద్ధవ్యతిరేక కార్యక్రమమని నిర్బంధ విధానాన్ని అమలుజరిపేది. బద్దం ఎల్లంరెడ్డిగారిని ఈ నెపంతోనే కరీంనగర్ జిల్లాలో గృహనిర్బంధం చేశారు. ఆనాడు అందరూ యుద్ధాన్ని వ్యతిరేకించేవారే. కరీంనగరు జిల్లాలో కరువు పరిస్థితులు ఏర్పడినందున రైతుల ప్రదర్శన జరిపించి ఆయన దానికి నాయకత్వంవహించాడు. దీనిఫలితమే గృహనిర్బంధం. వరంగల్, కరీంనగర్, మహబూబునగర్, ఆదిలాబాద్, నల్లగొండ జిల్లాల్లో పార్టీ యూనిట్లు ఏర్పడినవి. ఇక్కడి ఆర్యసమాజీయులు, జాతీయవాదులు, కాంగ్రెసువాదులు సహకారం చేస్తుండేవారు. ఈ పరిస్థితి ఏర్పడటానికి కొన్ని కారణాలు ఉన్నాయి:

1. పార్టీ నిర్మాణపు తొలిదశ. కార్యకర్తల సంఖ్య స్వల్పమే అయినా ఇంతమంది కార్యకర్తలు పనిచేయటం ఇదే మొదటిసారి. వారంతా యువకులు. వారి పనితీరు, త్యాగశీలతను చూచి జాతీయభావాలుగలవారందరూ ఆకర్షితులయ్యేవారు.

2. పార్టీ ప్రజలతో సంబంధాలు నెలకొల్పుకొనే స్థితిలోనే ఉంది కాని వర్గపోరాటాలు ప్రారంభంకాలేదు.

3. యుద్ధకాలంలో గాంధీవాదులు నిరాశా నిస్పృహలతో ఉన్నారు. వ్యక్తి సత్యాగ్రహం చేయటానికి ముందుకువచ్చినవారి సంఖ్య అతిస్వల్పం.

## 6. ఇతరుల కార్యకలాపాలు

ఆ కాలంలో కార్యరంగంలో ఉన్నది పార్టీ ఒకటేకాదు. ఇతర రాజకీయ శక్తులు కూడా తమతమ కార్యకలాపాలను ఏదోఒకమేరకు ప్రారంభించాయి మితవాదులు ఎప్పుడూ మితవాదులే. కాంగ్రెసువాదులు గ్రంథాలయాలు, ఖద్దరు ప్రచారం మొదలగు పనులు చేసినారు.

ఖమ్మం జాతీయవాదులకు కేంద్రంగా ఉండేది. వీరు స్వతంత్రులుకారు ; కాంగ్రెసు అభిమానులు ; గాంధీగారి అనుచరులు, వర్తకులు, వివిధ వృత్తుల్లో ఉన్న యువకులు. కమ్యూనిస్టు పార్టీ - జాతీయవాదులమధ్య సంబంధాలు ఎప్పుడు చర్చనీయాంశంగా ఉండేవి. వీరిలో సోషలిస్టులు కూడా ఉండేవారు. వీరిలో అభిప్రాయభేదాలున్నా అందరిదీ అహింసా మార్గం, గాంధీవాదం. వీరి కార్యకలాపాలకు అనేక పరిమితులు ఉండేవి. మౌలికమైన అభిప్రాయభేదాలున్న ప్పటికీ ప్రారంభంలో పార్టీకీ, వారికీ మధ్య మంచి సంబంధాలే ఉండేవి.

సత్యాగ్రహంచేసి ఆర్యసమాజం కొన్ని హక్కులను సాధించుకున్నది. వాటిసాయంతో పెద్ద ఎత్తున తన ప్రచారం సాగించింది. అప్పటికే కొన్ని జిల్లా కేంద్రాలలో దానికి కార్యాలయాలు ఉండేవి. తాలూకా కేంద్రాలలోకూడా ఏర్పాటు చేయటానికి ప్రయత్నించింది. యువకులను ఆకర్షించడానికి చాలావరకు కృషి చేసింది. కొంతవరకు ఫలితం కూడా సాధించింది. సూర్యాపేటలో (నల్లగొండ జిల్లా) ఒక భవనాన్ని ఖరీదుచేసి కార్యాలయాన్ని ఏర్పాటుచేశారు. దాని ప్రారం భోత్సవానికి మహాత్మా నారాయణ స్వామిని తీసుకొచ్చారు. ఆ సందర్భంలో జరిగిన బహిరంగ సభకు 5 వేల మంది హాజరైనారు. ఆ పరిస్థితుల్లో 5 వేలమంది హాజరుకావటమనేది చిన్న విషయం కాదు. ఆర్య సమాజంయెడ ప్రజల్లోగల ఆకర్షణకు దానిని గీటురాయిగా అర్థం చేసుకోవచ్చును.

ఈ పరిస్థితుల్లో 8వ ఆంధ్రమహాసభ సమయం వచ్చింది.

## 7. ఎనిమిదవ ఆంధ్ర మహాసభ (చిలుకూరు)

ఏడవ మహాసభ కాలం పూర్తి అయి ఎనిమిదవ ఆంధ్ర మహాసభ జరిగే నాటి పరిస్థితిని పరిశీలిస్తే ప్రజలలో పార్టీ కార్యకలాపాలు ప్రారంభమైనవి. పార్టీలో, ఆంధ్ర మహాసభలో పనిచేసే కార్యకర్తలు కొందరు తయారయ్యారు. వారు పార్టీ కార్యకలాపాలు సాగించారు. ఆ పరిస్థితుల్లో ఎనిమిదవ ఆంధ్ర మహా సభకోసం సన్నాహాలు ప్రారంభమయినాయి. ఇది చిలుకూరులో జరిగిన మహాసభ. చిలుకూరు నల్లగొండ జిల్లాలోని హుజూరునగరు తాలూకాలో హుజూరు నగరు-కోదాడు మధ్యన రోడ్డుపై ఉన్న పెద్ద గ్రామం. వాస్తవానికి మహాసభను చిలుకూరులో జరపాలని ముందు నిర్ణయించలేదు. సమీపంలో ఉన్న బేతవోలులో జరుపాలని ఆ గ్రామాల రైతుల పోరాటాన్ని నడుపుతున్న

మంత్రి ప్రగడ రాజగోపాలరావు కోరారు. ఆంధ్రమహాసభ దానికి అంగీకరించింది కూడా. అక్కడి మఖ్తాదారు ప్రభుత్వాన్ని ఆశ్రయించి మహాసభకు అనుమతి దొరకనివ్వలేదు. దానితో మహాసభ నిర్వాహకులకు ఇదొక సమస్య అయింది. మరో గ్రామంలో జరుపాలంటే బేతవోలు ప్రజలు అందుబాటులో ఉండరనీ, మహాసభ నిర్వహణ కష్టమవుతుందనీ భావించారు. బేతవోలు సరిహద్దుగ్రామమైన చిలుకూరులో జరిపితే రెండు విధాలా సౌకర్యంగా ఉంటుందని అనుకున్నారు. మొదటిది: చిలుకూరు రోడ్డుమీది గ్రామం. పెద్ద కేంద్రం కాకున్నా ఇటు కోదాడు, అటు హుజూరు నగరు మధ్యలో ఉంటుంది. ఆ విధంగా మహాసభ ప్రతినిధుల రాకపోకలకు సౌకర్యంగా ఉంటుంది. రెండవది : మఖ్తా ప్రాంతపు సరిహద్దుగ్రామం కావటంతో బేతవోలు ప్రజలంతా వచ్చి సహకరించటానికి అవకాశముంటుంది. ఈ కారణాల వలన మహాసభను చిలుకూరులో జరుపాలని నిర్ణయించారు. మహాసభ ఏర్పాట్లలో బేతవోలు ప్రజలతోపాటు చిలుకూరు ప్రజలు కూడా బాగా సహకరించారు. స్థానిక యువకులు పనిచేశారు. పెద్దలు సహకరించారు. దొడ్డా నర్సయ్య ఈ గ్రామానికి చెందినవాడే. ఆయన ఏర్పాట్లలో పాల్గొనడమేగాక మహాసభ తర్వాత కమ్యూనిస్టు పార్టీ కార్యకర్తగా పనిచేశాడు.

రోడ్డు పక్కనే ఉన్న మెట్ట భూమిలో పందిళ్ళువేసారు. వాటిలో మహాసభకొక హాలు, ప్రతినిధుల బసలు ఏర్పాట్లు చేశారు. అఖిల భారత కాంగ్రెసు నమూనాలో కొద్ది స్కేలులో ఈ సౌకర్యాలన్నీ ఒక క్రమ పద్ధతిలో జరిగినవి. ఆంధ్ర మహాసభ కేంద్ర కార్యాలయంనుంచి వట్టికోట ఆళ్వారుస్వామిని మహాసభ ఏర్పాట్లన్నిటినీ అజమాయిషీ చేయటానికి పంపారు. గ్రామంలోనే లక్ష్మారావుగారి ఇంట్లో ఆహ్వాన సంఘ కార్యాలయాన్ని ఏర్పాటుచేశారు. ఆళ్వారుస్వామి అక్కడే ఉంటూ ఆ కార్యకలాపాలన్నిటినీ చూచేవారు. ఆళ్వారుస్వామి నల్లగొండ జిల్లాలో పుట్టి పెరిగినవాడు. హుజూరునగరు తాలూకాకూ చిలుకూరుకూ కొత్తవాడుకాదు. పనులు చేయటంలో చొరవ, దక్షత కనపరిచారాయన. పనులన్నీ సకాలంలో పూర్తి అయినాయి.

అప్పటికే సూర్యాపేట తాలూకాలో పార్టీ, ఆంధ్ర మహాసభ కార్యకలాపాలు ప్రారంభమయినాయి. కార్యకర్తలు జట్టుజట్టుగా ఏర్పడి, సూర్యాపేట తాలూకాలో అందుబాటులో ఉన్న గ్రామాల ప్రజల్లో పెద్ద ఎత్తున ప్రచారంచేసి మహాసభకు ప్రజలను సమీకరించారు. 'ఆంధ్ర సంఘంలో చేరండి, ఆంధ్ర సభను చూడండి' అనే పాటలనుకూడా కొన్నింటిని రచించి, వాటిని పాడుతూ ప్రజలను

ఉత్తేజపరిచారు. సూర్యాపేట, హుజూర్‌నగర్ తాలూకాల ప్రజలు ఈ ప్రచారం వలన బాగా ప్రభావితులయారు. అంతేగాక చిలుకూరు సరిహద్దుల్లో మునగాల పరగణా గ్రామాలు ఉన్నాయి. మునగాల పరగణాలో 1938, 1939లో జరిగిన రైతాంగ పోరాటం అప్పుడే ముగిసింది. ఆ ప్రాంతంనుంచి ప్రజలూ, కార్యకర్తలూ మహాసభకు వచ్చారు. ఈ విధంగా అన్నివైపులనుంచి కార్యకర్తలే గాక ప్రజల సహకారం కూడా పెద్ద ఎత్తున లభించింది. బహిరంగసభకు వచ్చిన ప్రజల సంఖ్యను చూసినా ఈ పరిస్థితి స్పష్టంగా కన్పిస్తుంది.

ఈ మహాసభకు ఎవరు అధ్యక్షులు కావాలనేది చర్చనీయాంశంకాలేదు. మితవాద నాయకుల్లో తమకు అధ్యక్షపదవి కావాలని ముందుకువచ్చేవారెవరూ కన్పించలేదు. ముఖ్యులంతా కూడా అప్పటికే అధ్యక్షులైనారు కూడా. ఏడవ మహాసభలో రాజ్యాంగ సంస్కరణలపై అతివాదుల తీర్మానం నెగ్గడంతో తమకు కాలదోషం పట్టిందనీ, అతివాదులే అధ్యక్షులు కావాలనీ వారు భావించారు. మందుముల రామచంద్రరావు తర్వాత రావినారాయణరెడ్డి అధ్యక్షుడు కావాలని మితవాదులే ప్రతిపాదించారు ; అంతా ఆమోదించారు. తీవ్రమైన నిర్బంధవిధానం ఉన్న యుద్ధసమయం కావటం కూడా దీనికి ఒకకారణం. ఈకారణాలన్నిటివలన రావినారాయణరెడ్డిని 8వ ఆంధ్రమహాసభకు అధ్యక్షుడిగా ఉండటానికి మితవాదులే గాక కాంగ్రెసు అనుకూలురు కూడా అంగీకరించారు. అప్పటి నాయకత్వంలో మితవాదులు మైనారిటీలోఉన్నా వారిబలం పూర్తిగా తగ్గిపోలేదు.

ఈ మహాసభలో కొన్ని నూతన పరిణామాలు కనిపించాయి. ఒకటి రాజ్యాంగ సంస్కరణలను బహిష్కరిస్తూ చేసిన 7వ మహాసభ తీర్మానాన్నే ఈ మహాసభలో పునరుద్ఘాటించారు. వివాదాంశం కాలేదు. ఆ కారణాన దాని ప్రత్యేకత ఏమీలేదు. కాని శ్రీ రావి నారాయణరెడ్డి తన అధ్యక్షోపన్యాసంలో జాతీయ, అంతర్జాతీయ విషయాలను కూడా సమీక్షించినాడు. అప్పటికే ఆయన కమ్యూనిస్టుపార్టీ సభ్యుడు. పార్టీ సూచనలమేరకే ఈ అంశాలన్నీ తన అధ్యక్షోప న్యాసంలో చేర్చాడు. దానితోపాటు నిజాం నవాబు ఛత్రఛాయలక్రింద బాధ్యతా యుత ప్రభుత్వం కావాలనే కోరిక కూడా దానిలో ఉన్నది. 'ఛత్రచ్ఛాయల'నే పదాన్ని అధ్యక్షపదవిలోఉన్న విప్లవపార్టీ నాయకులు ఉపయోగించవచ్చునా లేదా అని ఆనాడూ, తర్వాతా చర్చనీయాంశం కాలేదు. ఆనాటి కమ్యూనిస్టుపార్టీ నిజాం రాజ్యాన్ని, బ్రిటిష్ రాజ్యాన్ని కూలదోయటమే తన లక్ష్యంగా పెట్టు కున్నది. అయినా సంస్థ లీగాలిటీని కాపాడుకోటానికి మితవాదులతోనూ, కాంగ్రెసు

అభిమానులతో ఉన్న ఐక్య సంఘటనను కొనసాగించటానికి ఆనాడు ఈ పదాలను ఉపయోగించటం అవసరమని పార్టీ భావించింది. కానీ తర్వాతకాలంలో ఈ వైఖరి మారింది.

రాజ్యాంగ సంస్కరణలపై ఏ తీర్మానం చేయలేదు. 7వ మహాసభలో వాటిని బహిష్కరించాలని తీర్మానాన్ని ప్రవేశపెట్టినవారు రావినారాయణరెడ్డిగారే అయినా ఆయన అధ్యక్షతన సమావేశమైన ఎనిమిదవ మహాసభలో ఆ సమస్యను ముట్టుకోలేదు. మితవాదులతో సంఘర్షణను తప్పించటమేకాక వారి సహకారాన్ని సంపాదించటానికి ఈ పని చేశారని స్పష్టమవుతున్నది. మహాసభ చేసిన తీర్మానాలు ఇదివరకటికన్నా సమగ్రంగా ఉన్నాయి. బద్దం ఎల్లారెడ్డి, హనుమయ్య చౌదరిగార్ల గృహ నిర్బంధాన్ని ఖండిస్తూ ఒక తీర్మానాన్ని ఆమోదించారు. ఇంతకు మినహా తీర్మానాలన్నీ పాత ఫక్కీలోనే ఆమోదించారు. అధ్యక్షుడు అతివాది అయినా మితవాదులకూ, అతివాదులకూ మహాసభలో ఘర్షణ రాలేదు. తీర్మానాలన్నీ పరస్పర ఆమోదంతో ఆమోదించారు.

ఆంధ్రమహాసభ నియమావళిలో కొన్ని మౌలికమైన మార్పులు తెచ్చారు. దానిని అఖిలభారత కాంగ్రెసు నియమావళి నమూనాలో రూపొందించారు. సభ్యత్వరుసుం రూపాయి నుంచి నాలుగణాలకు (25 పైసలకు) తగ్గించారు. సభ్యత్వం ప్రాతిపదికపై మహాసభ ప్రతినిధులను, కమిటీలను ఎన్నుకోడానికి ఏర్పాట్లు చేశారు. ఈ విధంగా ఆంధ్రమహాసభను సంపూర్ణమైన ప్రజాతంత్ర సంస్థగా రూపొందించారు.

ఖమ్మం, మధిర ప్రాంతాలు చిలుకూరుకు సమీపంగా ఉండటంవలన అక్కడినుంచి హెచ్చుసంఖ్యలో ప్రతినిధులు రావటమేకాక జాతీయ గేయాలు, రైతుగేయాలు పాడి మహాసభ ప్రతినిధులను, బహిరంగసభకు హాజరైన ప్రజలను ఉత్తేజపరిచారు. ఖమ్మం, మధిర ప్రాంతాలవారి మాదిరిగా పాడేవారు ఆనాటికి నల్లగొండ జిల్లాలో తయారుకాలేదు.

మహాసభకు మితవాదులంతా హాజరయ్యారు. గాంధీవాదులంతా వచ్చారు. కామ్రేడ్స్ అసోసియేషన్ సభ్యులు కూడా ఈ మహాసభకు హాజరుఅయినారు. వారిలో ఆలం ఖుందుమీరీ ముఖ్యులు. ఆయన ఉర్దూలో ఉత్తేజకరమైన ఉపన్యాస మిచ్చాడు. విద్యార్థులను, ఉర్దూభాష నేర్చుకున్న ఇతరులను తన వాగ్ధాటితో బాగా ఆకర్షించాడు. ఎలాంటి ఇబ్బందులు లేకుండానే మహాసభ జరిగిపోయింది.

మహాసభ పూర్తయిన తర్వాత అధ్యక్షుడు తెలంగాణా అంతటా పర్యటించాడు. పూర్వం అధ్యక్షుని పర్యటనలో కార్యకర్తలను, ప్రజలను సమీకరించక పోయేవారు. తాలూకా, జిల్లా కేంద్రాలకు వెళ్ళి అక్కడఉన్న పెద్దమనుషుల సన్మానాలనందుకొని వచ్చేవారు. గ్రంథాలయాల్లో, రేక సంపన్నుల ఇళ్ళలో చిన్నచిన్న సమావేశాలుజరిగేవి. గ్రామాలకు వెళ్ళటం అరుదు. ఇప్పుడు అంతకన్నా ఒకడుగు ముందుకువెళ్ళి ప్రజాసమీకరణ ప్రారంభమైనది. అధ్యక్షులు వెళ్ళినచోట ప్రజలు గుమికూడేవారు. ఆయన మాట్లాడుతూ ఉండేవాడు. ఈ సమీకరణ క్రమంగా ఒక సాంప్రదాయమైపోయింది. చట్టరీత్యా ఇవి రాజకీయమైనవే అయినా, వీటికి ప్రభుత్వం అనుమతి అవసరమున్నా లెక్కచేయక సభలు జరిగేవి. ప్రభుత్వం చూసీ చూడనట్టుగా ఉండేది.

## 8. ప్రచార కార్యక్రమం

ఈ కాలంలో ఆంధ్రమహాసభ కొన్ని సమస్యలపై ప్రచార ఉద్యమాలను నడిపించింది. ఒక్కొక్క సమస్యకు ఒక్కొక్క వారాన్ని నిర్ణయించింది. ఆ సమస్యపై కరపత్రాలనువేసి పంపకానికి విస్తృతమైన ఏర్పాట్లను చేసింది. సాధ్యమైనన్ని చోట్లల్లో సభలుపెట్టి, వాటిలో ప్రజలకు కరపత్రాలను చదివి వినిపించి, ప్రజలకు అర్థంకాని అంశాలను వివరించి చెప్పే ఏర్పాట్లను చేసింది.

సభలు బహిరంగ ప్రదేశాల్లో జరుపకపోయేది. పెద్ద ఆవరణ ఉన్న ఇళ్ళలో నాలుగు గోడల మధ్య ఈ సభలు జరిగేవి. ఆవరణ విస్తీర్ణం తగినంతగా ఉండుటవలన కొన్ని వందలమంది ప్రజలు హాజరుకావడానికి వీలుండేది. ఏ గ్రామ ప్రజలు ఆ గ్రామంలో సమావేశం కావడానికి వీలుండేది. నాలుగు గోడల మధ్య జరిగేవి బహిరంగ సభలు కావని పోలీసుల జోక్యాన్ని అరికట్టగలిగినారు కార్యకర్తలు.

ఈ విధంగా జరిపినవి : 1) విద్యావారం (19 నుండి 25 అక్టోబరు 1941 వరకు), 2) డిటెన్యూ డే (detenue day) అను పేర రాజకీయ ఖైదీల దినము (5వ డిసెంబరు 1941), 3) బేగారీ వారం (25 డిసెంబరు నుండి 1వ జనవరి 1942 వరకు) (తెలంగాణా ఆంధ్రోద్యమము, రెండవ భాగం : 155వ పేజి), వెట్టిచాకిరి వారం వీటన్నిటిలో అతి ప్రధానమైనది. ఈ వారంలో తెలంగాణా అంతటా వెట్టిచాకిరి నిబంధనలను ప్రజలకు వివరించాలని, వెట్టిపనివారు

వాటిని అనుసరించి పనిచేయాలనీ, తాము చేసే పనికి పరిహారం కోరాలనీ ఆంధ్ర మహాసభ నిర్ణయించింది. దానిననుసరించి కేంద్రంనుంచే కరపత్రాలు అచ్చు వేయించి పంచారు. ఆ సమయంలో ప్రజలను సమీకరించటానికి కార్యకర్తలు ప్రయత్నం చేశారు. ఈ కార్యక్రమం రెండు విధాల అమలు జరిగింది. కొన్ని ప్రాంతాలలో కార్యకర్తలు కరపత్రాలు పంచి, ఒక మేరకు వివరించి చెప్పారు.

నల్లగొండ జిల్లాలో కమ్యూనిస్టు పార్టీ కార్యకర్తలు పనిచేసే సూర్యాపేట తాలూకా, దానికానుకొని ఉన్న నల్లగొండ, హుజూర్ నగర్ తాలూకాల్లో ప్రజలను సమీకరించటమే కాక ఆ నిబంధనలను అనుసరించి తాముచేసేపనికి పరిహారం కోరాలని ప్రజలకు ఉద్బోధించారు. చాలా గ్రామాల్లో ప్రచారం చేసినప్పటికీ, అన్ని గ్రామాల్లో ప్రజలు నిబంధనలను అమలుజరుపుకోలేకపోయారు. 10–15 గ్రామాల్లో వెట్టిపనివారు తాము చేసిన పనికి పరిహారం కోరటానికి బదులు వెట్టి పనులే చేయబోమని చెప్పారు. వెట్టిపనిచేసే కష్టజీవుల చైతన్యం వెట్టిచాకిరి చట్టాలను అమలుజరిపేదానికన్నా దానిని నిరాకరించే స్థాయికి వెళ్ళిందని సూచన ప్రాయంగా తెలుస్తున్నది. 'మీరు ఎందుకు వెట్టి చేయర'ని అధికారులు అడిగే వారు. దానికి సమాధానంగా పనివారు సంఘం 'చిట్టీ' చూయించేవారు. చిట్టీ అంటే సభ్యత్వపు రసీదు. ఆంధ్ర మహాసభలో చేరిన ప్రతివ్యక్తికి నాలుగణాల సభ్యత్వ రుసుము ముట్టినట్టు ఒక రసీదు ఇచ్చేవారు. దానితో అతను ఆంధ్రమహాసభ సభ్యుడయ్యేవాడు. వెట్టిచాకిరీ చేసేవారు ఆ రసీదును ('చిట్టీ'ని) తమదగ్గరే దాచి పెట్టుకొని, అధికారులు వెట్టివేయమని అన్నప్పుడు 'లేదు, మేం వెట్టిచేయం' అని సమాధానమిచ్చేవారు. 'ఎందుకు చేయరు' అని ప్రశ్నిస్తే 'మేం సంఘంలో చేరాము' అని సమాధానమిచ్చేవారు. 'సంగమంటే ఏమిటి ?' అని అడిగితే ఆ 'చిట్టీ' (రసీదు) చూపించేవారు. 'సంఘం చిట్టీ'ని చూపించి 'మేము సంఘంలో చేరాము; వెట్టిపని చేయనవసరంలేదు' అని చెప్పేవారు. నిబంధనల సంగతి ఎలా ఉన్నప్పటికీ సాంప్రదాయంగా వస్తున్న వెట్టిచాకిరీ చేయ నిరాకరించటం అధికారులకు అవమానకరంగా ఉండేది. వారు దీనిని ప్రభుత్వాన్ని ధిక్కరించినట్టుగా భావించారు. ఏం చేయాలి ? అని పై అధికారులు ఆలోచించసాగారు. ఈ సంఘటన తర్వాత కొందరు ఆంధ్రమహాసభను 'చిట్టీల సంగం' అనీ, సభ్యత్వపు రసీదులను 'సంగం చిట్టీ' అని అనేవారు. జిల్లా అంతటా, తెలంగాణా అంతటా ఇలా జరిగిందని చెప్పటానికి వీల్లేదు. కొన్ని గ్రామాల్లో మాత్రం ఇలా జరిగింది.

ఇతర గ్రామాల్లో పై విధంగా వెట్టిపనివారిని సిద్ధం చేస్తే వెట్టిపనిని

నిరాకరించేవారా లేదా అనే ప్రశ్నకు ఈ అనుభవాలే సమాధానమిస్తాయి. తక్కిన గ్రామాల్లోకూడా కార్యకర్తలు వెట్టిచాకిరీని నిరాకరింపచేయగలిగేవారు. కాని చట్టాలను అమలుజరపాలనే కార్యక్రమాన్ని ఒక చివరికి తీసుకెళ్ళి చట్టాలకు పరిమితం అయ్యారు. చివరకు వెట్టిచాకిరి నిబంధనలనే అమలుజరుపలేకపోయారు.

ఇది ఎత్తుగడల సమస్య. ప్రజల్లో కార్యకలాపాలను సాగించటానికి చట్టాలను ఉపయోగించుకోవాలి అనేది, చట్టాలకు పరిమితం కావటమనేది వేరువేరు సమస్యలు. ప్రజలు చట్టం పరిధులు దాటి వెట్టిచాకిరీని నిరాకరించటానికి సిద్ధంగా ఉన్నప్పుడు ఒకవైపున వెట్టిచాకిరి చేస్తూనే రెండవ వైపున దానికి పరిహారం కావాలని కోరటం ప్రజలను చట్టపు పరిధుల్లో ఉంచటానికి ప్రయత్నించటమే. చట్టాలకు పరిమితం కావాలనే ఒక అవగాహన ఇతర ప్రాంతాల కార్యకర్తలలో పనిచేసింది. ఈ కారణాన వారు ప్రజలను వెట్టిచాకిరీని నిరాకరించటానికి సిద్ధం చేయలేకపోయారు.

ఈ పని ఆంధ్ర మహాసభద్వారా చేయాలా ? లేక కమ్యూనిస్టు పార్టీ ద్వారా చేయాలా ? అనే సమస్య ఆనాడు ఎదుర్కొలేదు. పోరాట గమనంలోనే ఈ సమస్య ముందుకు వచ్చింది. అయినా ఈ దశలోనే వెట్టిచాకిరీ వ్యతిరేక ప్రచారం వర్గపోరాట స్వభావం సంతరించుకున్నదని గుర్తించాలి.

రెండవది : చట్టానికి పరిమితం కావటంతో వర్గ సామరస్య స్వభావం ఏర్పడుతున్నది. వెట్టిపనివారు తాము పనిచేయమని నిరాకరించటానికి హక్కు లేదు. వారు తప్పనిసరిగా పనిచేయాలి. ఆ మేరకు అది వెట్టిచాకిరి. దానికి పరిహారం ప్రభుత్వం నిర్ణయించింది. కాని పనిచేసేవారు తాము న్యాయమనుకున్న డబ్బును కూలీ రూపంలో అడగటానికి హక్కులేదు. ఈ హక్కు ప్రధానమైన సమస్య. ఈ హక్కును వదిలివేయటంవలన ఆంధ్ర మహాసభ నిర్ణయాన్ని అమలుజరిపిన తీరు వర్గ సామరస్యమైనది. ఆంధ్ర మహాసభలోని మితవాదులు కాంగ్రెసు అనుచరులు వర్గ సామరస్య సిద్ధాంతాన్నీ కారా చరణనూ అనుసరించే వారే. కొన్ని గ్రామాల్లో వెట్టిచాకిరి 'మేం చేయమని' నిరాకరించినా ఇతర ప్రాంతాల్లో ప్రచారం మాత్రం సాగించి. వెట్టిచాకిరీ కొనసాగుతూ వచ్చింది. ప్రజలపై దాని ప్రభావం లేకపోలేదు. కాని అప్పటికి వెట్టిచాకిరీ సాగిపోయింది. ప్రభుత్వం తన నిబంధనలను అమలుజరిపించటానికి ఎలాంటి చర్యలూ తీసుకోలేదు.

వెట్టిలో రెండురకాలు. గ్రామాధికారులు అంటే పటేలుపట్వారీలు, తక్కిన దేశముఖులు చేయించుకునే వెట్టి; అధికారులు చేయించుకునే వెట్టి. పటేలు పట్వారీలు, చిన్నభూస్వాములు చేయించే వెట్టిచాకిరికి వ్యతిరేకంగా కేంద్రీకరించ లేదు. వారు సాంప్రదాయబద్ధమైన నామమాత్రపు పరిహారాన్ని ఇచ్చేవారు. ఆకాలంలో చిన్నభూస్వాములు ఆంధ్రమహాసభ కార్యకలాపాల్లో కలిసివచ్చేవారు. పార్టీని వ్యతిరేకించలేదు. తమ దోపిడీకి అప్పటికప్పుడే ప్రమాదమేర్పడుతుందని వారు భావించలేదు. ప్రధానంగా ప్రభుత్వానికీ, పెద్దదేశముఖులకూ వ్యతిరేకంగా ఈ సమస్యను తీసుకొని పనిచేశారు. అయినా పెద్దదేశముఖులున్న ప్రాంతాలకు కార్యకర్తలు వెళ్ళలేదు. పార్టీకి అంత సంఖ్యాబలంలేదు. శక్తిసామర్థ్యాలు కూడా ఏర్పడలేదు.

## 9. విద్యార్థి ఉద్యమం

అదేకాలంలో పార్టీ విద్యార్థుల్లోకి వెళ్ళి పనిచేసి విద్యార్థులనుంచి కార్యకర్తలను తయారుచేసే కార్యక్రమాన్ని కూడా తీసుకున్నది. అఖిల హైదరాబాదు విద్యార్థి సంఘం (All Hyderabad Students Union) ఏర్పడింది. కామ్రేడ్స్ అసోసియేషన్ నుంచి పార్టీలోకి వచ్చినవారు విద్యార్థిసంఘ నిర్మాణానికి కృషిచేశారు.

నల్లగొండ జిల్లాలో విద్యార్థుల్లో పనిచేసే సందర్భంలో కొత్త అనుభవాలు వచ్చాయి. ఒకవైపునుంచి విద్యార్థి సంఘాలు ఏర్పాటుచేసి వారి సమస్యలను తీసుకొని పనిచేసేవారు. రెండోవైపునుంచి వారిని పార్టీ సిద్ధాంతాలవైపు ఆకర్షించ టానికి ప్రత్యేక కృషిచేశారు. నల్లగొండ పట్టణంలో హిందూ విద్యార్థులు ఆర్య సమాజం ప్రభావంలో ఉండేవారు. కమ్యూనిస్టుపార్టీ రాజకీయాలు, సిద్ధాంతాలు చెప్పే సమయాన వారు ఆర్యసమాజ ప్రచారకులు చెప్పిన, తాము నేర్చుకున్న అంశాలపై ప్రశ్నలు వేసేవారు. ఉదా॥ : దేవుడున్నాడా లేడా ? ఈ ప్రశ్నలకు వివరమైన సమాధానాలిచ్చి వారి ప్రచారంలోని మౌలికమైన తప్పులను గూర్చి నచ్చజెప్పిన తర్వాత సంతృప్తిపడి కమ్యూనిస్టు అభిప్రాయాలను అంగీకరించే వారు. ఈ పనంతా పూర్తికావటానికి రెండు మూడు సమావేశాలు అవసర మయ్యేవి.

విద్యార్థులు 'మెస్సు'ల్లో (mess) ఉంటూ చదువుకునేవారు. 10-15 మంది ఒక ఇల్లు అద్దెకు తీసుకొని వంట ఏర్పాట్లు చేసుకొని ఉండేవారు. అంతా ఒకే గ్రామానికి చెందినవారు, దగ్గరి బంధువులు కావటంతో వారిలో ఐక్యత ఉండేది; రాజకీయ తరగతులు నిర్వహించటం సులభమయ్యేది. ఈ విధంగా కొంతకాలం కృషిచేసిన తర్వాత వారు క్రమంగా ఆర్యసమాజం ప్రభావం నుంచి బయటపడి పార్టీలోకి వచ్చారు. తర్వాత కాలంలో వారు పోరాటంలో ముఖ్యమైన పాత్రను నిర్వహించారు.

ఇతర జిల్లాల్లో కూడా ఇలాంటి కృషి సాగింది. కరీంనగర్‌లో ఇలాంటి మెస్సు ఒకటి ఉండేది. అక్కడి విద్యార్థులేగాక, ఆ రోజుల్లో పనిచేయటానికి ముందుకు వచ్చిన యువకులకు క్లాసులు తీసుకున్నారు. నిజాం వ్యతిరేక పోరాటంలో చనిపోయిన ప్రభాకరరావు ఈ క్లాసులకు హాజరైనవారిలో ఒకరు. వరంగల్ జిల్లాలో ఈ ప్రయత్నం బాగా కొనసాగింది. ఖమ్మం, మధిర తాలూకాల్లో చాలామంది కార్యకర్తలు పనిచేయటానికి ముందుకువచ్చారు. వీరంతా రాజకీయ తరగతులకు హాజరైనవారే.

ఇతర జిల్లాల్లో విద్యార్థుల పరిస్థితి వేరుగా ఉండేది. వరంగల్లు (హనుమకొండ)లో ఆర్యసమాజం, సనాతనవాదంతో పాటు గాంధీవాదం కూడా విద్యార్థుల్లో వ్యాపించి ఉండేది. ఖమ్మంలో ఆర్యసమాజం బలహీనం. సనాతనవాదం, గాంధీవాదం బలంగా ఉండేవి. ఇతర జిల్లాకేంద్రాల్లో ఆర్యసమాజం, గాంధీవాదం ప్రభావం ఏదో ఒకమేరకు ఉండేది. ఈ సిద్ధాంతాలకు వ్యతిరేకంగా అవసరమైన పోరాటం సాగలేదు.

విద్యార్థుల్లో ముందు కమ్యూనిస్టులు మాత్రమే పని ప్రారంభించలేదు. కాంగ్రెస్ అనుయాయులు కూడా చొరవతీసుకున్నారు. డాక్టరు మర్రి చెన్నారెడ్డి విద్యార్థిగా ఉన్నప్పుడే 'ఆంధ్ర విద్యార్థి సంఘా'న్ని స్థాపించి తెలంగాణా జిల్లాల్లో శాఖలు నెలకొల్పడానికి ప్రయత్నించాడు. కాని విస్పష్టమైన పోరాట కార్యక్రమం లేనందున ఆ సంఘం విద్యార్థులను ఆకర్షించలేకపోయింది.

## 10. కార్మికోద్యమం

అప్పటివరకు పార్టీ నిర్మాణం తొలిదశలో ఉండటం వలన ట్రేడు యూనియన్ కార్యకలాపాలు పెద్దఎత్తున సాగకున్నా కార్మికుల్లో పనులు మాత్రం

ప్రారంభమైనాయి. హైదరాబాదులో అప్పటికే రైల్వే కార్మికుల యూనియన్ ఉండేది. మఖ్దుమ్ రైల్వేకార్మికుల్లో పనిచేయటం ప్రారంభించాడు. రైల్వేలో ఫజులుల్‌హక్ అని ఒక ట్రేడుయూనియనిస్టు ఉండేవాడు. ఆయనకు ఏపార్టీ రాజకీయాలతో సంబంధంలేదు. ఆయన కొంతకాలందాకా అధ్యక్షుడుగా ఉన్నాడు. రామచంద్రరావు, రాఘవేంద్రరావు సోదరులు జాతీయవాదులు ; రైల్వే ఉద్యోగులు. (వీరిలో ఇద్దరిని గూర్చి ఇదివరకే చెప్పాము).
వారు ఆ యూనియన్ కార్యకలాపాల్లో ప్రముఖపాత్ర నిర్వహించారు. మఖ్దుం రైల్వే ఉద్యోగులలో కార్మికులలో పనిచేయటం వలన రైల్వే యూనియన్ బలపడటమేగాక పార్టీ పలుకుబడి వ్యాపించింది. ఆయన చక్కని ఉపన్యాసకుడు. రైల్వేకార్మికులేగాక ఇతరులు కూడా ఆయన ఉపన్యాసం వినటానికి అక్కడికి వచ్చేవారు. కార్మికులలో ముస్లింల సంఖ్య గణనీయంగా ఉండుటవలన వారూ ఆయన బహిరంగసభలకు హాజరయ్యేవారు. దీనివలన ముస్లింలలో పార్టీకి అనుకూలమైన వాతావరణం ఏర్పడసాగింది.

సింగరేణి బొగ్గుగనుల్లో తీవ్రమైన నిర్బంధం ఉండేది. ఆకాలంలో దానిని నిషిద్ధప్రాంతమని (Prohibited area) ప్రభుత్వం ప్రకటించి బయటి వారెవరూ రాకుండా చేసిన ఫలితంగా అక్కడికివెళ్ళి కార్మికుల్లో పనిచేయటం కష్టమైన సమస్యగా ఉండేది. వరంగల్ జిల్లా నాయకులు రహస్యంగా అక్కడికి వెళ్ళి సంబంధాలనునెలకొల్పి పనిచేశారు క్రమంగా పార్టీని, ట్రేడు యూనియన్‌ను ఏర్పాటు చేయటానికి అవసరమైన పునాదులు వేశారు. ఈ విధంగా పనిచేసిన వారిలో ముఖ్యులు సర్వదేవభట్ల రామనాథం, పెరవెల్లి వెంకట రమణయ్య (జిల్లా కార్యదర్శి).

ఆంధ్రమహాసభ కార్యకలాపాలు కూడా అధ్యక్షుని పర్యటన వరకే పరిమితంకాలేదు. వివిధ జిల్లాలలో కార్యకర్తలు పనిచేయ ప్రారంభించారు. విద్యార్థులలోనూ, కార్మికులలోనూ, రైతులలోనూ, ఇతరవృత్తులవారిలోనూ పని చేయటానికి కావలసిన కృషి ఆకాలంలో ప్రారంభమైంది. పార్టీ ప్రాథమిక యూనిట్లు ఏర్పడటంతో అంతా శక్తి వంచనలేక ఏమేరకు అవకాశముంటే ఆమేరకు కృషిచేసి ప్రజలను సంఘటితపరచటానికి పార్టీ కార్యకర్తలు ప్రయత్నించారు.

# 11. మునగాల రైతాంగ ఉద్యమం-లీగల్ కార్యకలాపాలు

1939లో కాంగ్రెసు మంత్రివర్గం రాజీనామా ఇవ్వటానికి పూర్వం మునగాల పరగణా సత్యాగ్రహంలో అరెస్టయినవారిని విడుదలచేసింది. కొన్నాళ్ళ తర్వాత నాయకులు (నండూరు ప్రసాదరావుగారు మొ॥నవారు) విడుదలైనారు. ఉన్నంతలో పార్టీని పునర్నిర్మించి రహస్య బహిరంగ కార్యకలాపాలను సాగించారు. కొన్ని విజయాలను కూడా సాగించారు. వాటి వివరాలు ఇలా ఉన్నాయి :

"1940 సంవత్సరం నుండి సామ్రాజ్యవాద యుద్ధవ్యతిరేక ప్రచారం కమ్యూనిస్టుపార్టీ ప్రారంభించింది. ఆంధ్రరాష్ట్ర కమ్యూనిస్టుపార్టీ రహస్యంగా ప్రచురించిన 'స్వతంత్ర భారత్' పత్రిక, పార్టీ ప్రచురించిన రహస్య సాహిత్యము పరగణా అన్ని గ్రామాలకు పంపిణీ చేయబడేది. ఈ సాహిత్యము, పత్రిక పార్టీ సానుభూతిపరులకు రహస్యంగా చదివి వినిపించేవారు.

రహస్య బహిరంగసభలు : సామ్రాజ్యవాదయుద్ధ కాలంలో యుద్ధం యెడల కమ్యూనిస్టుపార్టీ వైఖరిని వివరించుటకు కృష్ణాజిల్లా కమ్యూనిస్టు నాయకులు శ్రీ ముక్కామల నాగభూషణంగారు పరగణాలో సంచారంచేసి రహస్య బహిరంగ సభలలో ఉపన్యసించారు (పోలీసులకు తెలియకుండా) పగలు ప్రజలలో ప్రచారం చేసి, రాత్రి బహిరంగసభలు జరిపి సభలలో నాగభూషణంగారు కొమరబండ, రామాపురం, నడిగూడెం, శిరిపురం, రేపాల, మాధవరం గ్రామాల సభలలో సామ్రాజ్యవాదయుద్ధంలో బ్రిటిష్ప్రభుత్వం భారతప్రజల అనుమతి లేకుండా నిరంకుశంగా భారతదేశాన్ని యుద్ధంలోకిలాగి కోటానుకోట్ల రూపాయిలు యుద్ధ భారాన్ని దేశప్రజలపై రుద్దినవైనం, భారత రాజకీయపార్టీలమీద, రైతాంగం మీద, కార్మికవర్గంమీద భారతరక్షణ చట్టాన్ని ఉపయోగించి వేలాదిమందిని జైళ్ళలో పెట్టడం, ఇతర నిరంకుశ పద్ధతులు ఉపయోగించి ప్రజలను పలు బాధలకు గురిచేయటం ఈ క్రూర నిర్బంధవిధానానికి వ్యతిరేకంగా భారత కమ్యూనిస్టుపార్టీ ప్రజలకు ఇచ్చిన పోరాట కార్యక్రమాన్ని ఉత్తేజకరమైన ఉపన్యాసాలను శ్రీ నాగభూషణంగారు ఈ సభలలో ఇచ్చి ప్రజలను ఉత్తేజ పరిచారు." (తటవర్తి వెంకటేశ్వరరావు ; మునగాల పరగణా ప్రజాఉద్యమ చరిత్ర పేజి-67-68).

జమీందారు, ప్రభుత్వం కేసులతో స్థానిక నాయకులను వేధించారు. 1940లో జిల్లా బోర్డు ఎన్నికలు జరిగినవి. వాటిలో రైతు సంఘ నాయకుడు విజయం సాధించాడు. కోఆపరేటివు యూనియన్ ఎన్నికల్లోకూడా ఈ నాయకులు గెలిచారు. సంవత్సరం తిరుగక ముందే జిల్లాబోర్డు రద్దయింది.

సామ్రాజ్యవాద యుద్ధకాలమంతా ఒడంబడికను (బ్రహ్మయ్య అవార్డు) అమలుజరుపాలని "మెమొరాండము సమర్పించి" అధికారులతో రాయబారాలు నడిపిస్తూ కాలం గడిపారు నాయకులు. కాని 1939 వరకు సాగిన పోరాటాన్ని సమీక్షించి సరైన గుణపాఠాలు తీసుకొని మళ్ళీ పోరాటాన్ని కొనసాగించటానికి పార్టీ నిర్ణయించలేదు.

సామ్రాజ్యవాద యుద్ధకాలంలో బ్రిటిషు ప్రభుత్వాన్ని సాయుధ విప్లవం ద్వారా కూలదోయాలనేదే పార్టీ కార్యక్రమం. జమీందారీ విధానం రద్దుచేయటం దీనిలో ఒక భాగం. దీని అర్థం జమీందారీ పరిపాలనను తొలగించటమే కాదు. జమీందారు భూములను రైతు కూలీలకు పంపకం చేయటం కూడా. అప్పటికే ముగిసిన సత్యాగ్రహంలో వారు భూములను పంచుకోటానికి సిద్ధంగా ఉన్నారని స్పష్టమైంది. అయినా పార్టీ నాయకత్వం ఈ కార్యక్రమాన్ని స్థానిక పార్టీకి అందించలేదు. బ్రిటిష్ ప్రభుత్వానికీ జమీందారుకూ వ్యతిరేకంగా అమలుజరిపే ఈ కార్యక్రమంలో స్థానిక కాంగ్రెసువాదులు కొందరు కలిసి వచ్చేవారు. తక్కిన వారు తటస్థంగా ఉండేవారు. వారితో ఏర్పడిన ఐక్య సంఘటన విచ్ఛిన్నమైపోతుం దనే భయానికి కూడా ఆస్కారంలేదు. కొన్ని సందర్భాల్లో అలాంటి పరిస్థితి ఏర్పడినా అది తాత్కాలికమే అవుతుంది. విప్లవ కార్యక్రమానికి ప్రాధాన్యత ఇచ్చి ప్రజలను విప్లవోద్యమంలోకి సమీకరిస్తే కాంగ్రెసువాదులు కొందరు వైదొలగినా, క్రమంగా ధనిక రైతులు, వారి రాజకీయ ప్రతినిధులు ఐక్య సంఘటనలోకి వస్తారు.

బ్రహ్మయ్య అవార్డును అమలుజరుపాలని అధికారులచుట్టూ తిరగటానికి బదులు రైతు సంఘ నాయకత్వాన ప్రజలే అమలుజరుపుకోవాలని ప్రచారంచేసి వారిని సమీకరించి సిద్ధంచేస్తే ఆ కార్యక్రమానికి పోరాట రూపం ఏర్పడేది. ఈ పోరాటం భూమికోసం పోరాటంగా అభివృద్ధి అయ్యేది. కానీ అలాంటి కార్య క్రమాన్ని పార్టీ అనుసరించలేదు.

ఈ వైఖరి ఆనాటి పార్టీ కార్యక్రమానికి విరుద్ధమైనది. 1930లో రూపొం దించిన కార్యక్రమంలో భారత విప్లవ లక్ష్యాలలో ఒకటి ఈ విధంగా ఉంటుందని

స్పష్టంచేశారు :

"భూస్వాముల, అధికారంలో ఉన్న రాజుల, చర్చిల, బ్రిటిషు ప్రభుత్వ ఉద్యోగుల, వడ్డీ వ్యాపారస్తుల భూములను, అడవులను, ఇతర ఆస్తిని నష్టపరిహారం చెల్లించకనే స్వాధీనం చేసుకోవాలి. వాటిని కష్టజీవులైన రైతాంగానికి అప్ప గించాలి. రైతులు వడ్డీ వ్యాపారస్తులకు, బ్యాంకులకు (చెల్లించవలసిన) అప్పులను రద్దుచేయాలి".

ఈ లక్ష్యాలను సాధించటానికి వివిధ ప్రాంతాల్లో పాక్షిక కోర్కెలను కూడా రూపొందించవచ్చును. కాని పరగణాలో అప్పటికే ఉద్యమం భూమి పంప కపు దశకు చేరుకున్నది. మిగిలినదల్లా దానికి అనుగుణ్యమైన నినాదాలను రూపొందించి కార్యాచరణను పూనుకోవడమే. ఆనాటి కమ్యూనిస్టు అంతర్జాతీయ మహాసభ కూడా ఇలాంటి కార్యక్రమాన్నే ఇచ్చింది. అయినా మనదేశంలో పార్టీ ఆ కార్యక్రమాన్ని అమలుజరుపలేదు. సత్యాగ్రహంయెడ చూపిన ఆసక్తి విప్లవ పోరాట రూపాల్లో చూపలేదు.

బొంబాయి, మదరాసు, కలకత్తా లాంటి కీలక కేంద్రాల్లో కార్మికుల సమ్మె ప్రారంభమై, ఢిల్లీలో సాయుధ తిరుగుబాటు ద్వారా అధికారాన్ని హస్తగతం చేసుకొని తర్వాతనే జమీందారీ విధానాన్ని రద్దుచేసే కార్యక్రమాన్ని చేపట్టాలనేదే పార్టీ వైఖరి. ఈ తప్పు వైఖరివలననే జమీందారీ విధానాన్ని రద్దుచేసి, జమీం దారుల భూమిని పంచుకోటానికి రైతాంగం ముందుకు వచ్చినప్పటికీ పార్టీ నాయ కత్వం వహించటానికి ముందుకురాలేదు. ఈ విధంగా రైతాంగ విప్లవోద్యమాన్ని నీళ్ళు కార్చింది. ఈ దుస్థితి 1940 నాటికే ఏర్పడిందని మునగాల రైతాంగ పోరాట చరిత్ర చెపుతున్నది.

# 6. ఫాసిస్టు వ్యతిరేక యుద్ధం– జాతీయ అంతర్జాతీయ రాజకీయాలలో మార్పులు

సంస్థానంలో పార్టీ నిర్మాణానికి పునాదులు వేసి ప్రజలతో సంబంధాలను ఏర్పరచుకోటానికి ప్రయత్నిస్తున్న సమయంలో రెండవ ప్రపంచ యుద్ధ గమనంలో మార్పు వచ్చింది. జూన్ 21, 1941 నాడు నాజీ జర్మనీ రష్యాపై యుద్ధం ప్రారంభించింది. సైనిక బలాలను కేంద్రీకరించి కొద్ది రోజుల్లోనే రష్యా భూభాగంలోకి చొచ్చుకొనిపోగలిగింది. రష్యాకూడా పెద్దఎత్తున నాజీ జర్మనీని ప్రతిఘటించసాగింది. అప్పటివరకు రష్యాను వ్యతిరేకిస్తున్న బ్రిటన్, ఫ్రాన్సులు దానికి మిత్రదేశాలైనవి. అమెరికా కూడా ఈ దేశాల్లో చేరింది. ఈ విధంగా ఒక వైపున సోషలిస్టు దేశమైన రష్యా, సామ్రాజ్యవాద దేశాలైన అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సులు ఒక కూటమిగా ఏర్పడి మిత్రదేశాలైనవి ఫాసిస్టు దేశాలైన జర్మనీ, ఇటలీ, జపానులు అప్పటికే ఒక కూటమి (axis)గా రూపొంది యుద్ధంసాగిస్తూ వివిధ దేశాలను దురాక్రమణ చేస్తూ వచ్చాయి.

వలసదేశాలు లేని జర్మనీ, ఇటలీ, జపానులు వివిధ దేశాలను ఆక్రమించుకొని వాటిపై రాజ్యం చేయాలనే లక్ష్యంతో యుద్ధం సాగించాయి. ఇవి సామ్రాజ్యవాద దేశాలు. రష్యా తన దేశాన్ని నాజీలనుంచి విముక్తి చేయటమే కాక నాజీ జర్మనీ దురాక్రమణకు గురైన దేశాలన్నిటినీ విముక్తి చేస్తానని, ఆ దేశాల ప్రజలు తాము కోరిన రాజ్యాలను ఏర్పరచుకునే హక్కులను గౌరవిస్తానని ప్రకటించింది. ఈ విధంగా తనకు ఎలాంటి సామ్రాజ్యవాద ప్రయోజనాలు లేవని స్పష్టంచేసింది. నిజమైన సోషలిస్టు దేశం సామ్రాజ్యవాదాన్ని వ్యతిరేకిస్తుంది ; తాను స్వయంగా ఎలాంటి సామ్రాజ్యవాద ప్రయోజనాలను కాంక్షించదు. సామ్రాజ్యవాదదేశాలైన అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సులు ఇలాంటి ప్రకటనలే చేసాయి.

కానీ అవి చేసే యుద్ధం తమ ఆధీన దేశాలను, వలస దేశాలను కాపాడుకోటానికే. ఈ విధంగా విరుద్ధ ప్రయోజనాలుకల దేశాలతో ఫాసిస్టు వ్యతిరేక కూటమి ఏర్పడింది.

మనదేశం ఆనాటికి బ్రిటిష్ వలసరాజ్యమే. కాంగ్రెసు నాయకత్వం ఫాసిజాన్ని వ్యతిరేకించినప్పటికీ, తమకు అధికారాన్ని అప్పగిస్తేనే బ్రిటిష్ సామ్రాజ్యవాదులు ఫాసిస్టులతోసాగించే యుద్ధాన్ని బలపరుస్తామని ప్రకటించారు. రష్యాచేస్తున్న ఫాసిస్టు వ్యతిరేక యుద్ధాన్ని మాటల్లో బలపరిచారు. కాని బ్రిటిషు సామ్రాజ్యవాదులు అధికారాన్ని అప్పగించటానికి సిద్ధంగా లేనందున ఆచరణలో ఏమీచేయలేమని ప్రకటించారు.

ఆనాటి భారత కమ్యూనిస్టు పార్టీ మూడవ కమ్యూనిస్టు మహాసభకు (Third Communist International=Comintern) శాఖగా ఉండేది. ఆ మహాసభ నిర్ణయాలను అమలుజరుపటం పార్టీ విద్యుక్తధర్మం. అయినా నూతన పరిస్థితుల్లో యుద్ధంయెడ ఏవైఖరి అనుసరించాలనే విషయాన్ని పార్టీ నాయకత్వం చర్చించి ఒక నిర్ణయానికి రావడానికి కొన్ని నెలలు అవసర మైంది. చివరికి మనదేశానికి కూడా ఇది ప్రజాయుద్ధమని నిర్వచించి రష్యానేగాక బ్రిటిష్ సామ్రాజ్యవాదులను కూడా బలపరిచి, యుద్ధంలో ఫాసిజాన్ని ఓడించ టానికి తమవంతు పాత్రను నిర్వహించాలని పార్టీ నాయకత్వం నిర్ణయించింది. శ్రామికవర్గ అంతర్జాతీయతను అనుసరించి ప్రపంచ శ్రామికవర్గానికంతటికీ ఇది ప్రజాయుద్ధమని పార్టీ నిర్వచించింది. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ప్రకటనలో అలాంటి నిర్వచనంలేదు. అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సుదేశాల శ్రామికవర్గం యుద్ధంలో తమతమ ప్రభుత్వాలకు తోడ్పడాలని కోరింది ఆ ప్రకటన. పార్టీ నాయకత్వం దాన్ని తప్పుగా అన్వయించి, తప్పు నిర్ణయాలకు వచ్చింది. బ్రిటిషు ప్రభుత్వాన్ని కూలదోసే విధానాన్ని మౌలికంగా మార్చి, దానిని బలపరచటానికి నిర్ణయించింది.

రావినారాయణరెడ్డి అధ్యక్షతన చిలుకూరులో జరిగిన మహాసభ జూన్ 1941 (మొదటివారం)లో సమావేశమైంది. ఆనెలలోనే రష్యాపై నాజీ జర్మనీ యుద్ధం ప్రకటించింది. 1942 ప్రారంభంలో కమ్యూనిస్టుపార్టీ తన విధానాన్ని మార్చుకున్నది. దీనిఫలితంగా బ్రిటిషుప్రభుత్వం పార్టీపై నిషేధాన్ని తొల గించింది. పార్టీ బహిరంగంగా పనిచేయసాగింది.

సంస్థానంలోకూడా కొత్తగా ఏర్పడిన పార్టీకి బహిరంగంగా పనిచేసేఅవకాశం కలిగింది. అప్పటివరకు పార్టీనాయకులు, కార్యకర్తలు పార్టీతోఉన్న సంబంధాలను

రహస్యంగా అట్టిపెట్టి వివిధ ప్రజాసంఘాల పేరుతో వ్యవహరించేవారు. ఆకారణాన వారు కమ్యూనిస్టులని స్పష్టంగా అందరికీ తెలియలేదు. పార్టీవిధానం మారిన కొద్దినెలలకు మాత్రమే అందరికీ తెలిసింది. ఆంధ్రదేశంలో పార్టీ బహిరంగంగా పనిచేయటం ప్రారంభించిన కొద్దిరోజుల్లో రాష్ట్రకమిటీ పంపిన పార్టీ ఆర్గనైజర్లు తిరిగి తమ జిల్లాలకు వెళ్ళిపోయారు. తెలంగాణాలోని జిల్లా కమిటీలు, కార్యకర్తలూ నేరుగా రాష్ట్ర కేంద్రంతో సంబంధం పెట్టుకొని పనిచేయసాగారు.

ఇదంతా ముగిసే సమయానికి తొమ్మిదవ ఆంధ్ర మహాసభ సమీపించింది. దానికి అధ్యక్షులు ఎవరు కావాలనే సమస్య నాయకత్వంముందుకు వచ్చింది. పాత నాయకులు ఎవరూ ముందుకు రాలేదు. అప్పటివరకు అధ్యక్షులైనవారిలో ఒకరు తప్ప ఏడుగురు హైదరాబాదు నివాసులే. ఒకరు తప్ప అంతా మితవాదులే. ఏడవ మహాసభ (మల్కాపురం)లో మితవాదులు పొందిన ఓటమితో భయపడి పోయిన హైదరాబాదు నాయకులు తిరిగి అధ్యక్ష పదవిని స్వీకరించటానికి సాహ సించలేదు. రాజ్యాంగ సంస్కరణలను బహిష్కరించాలనే తీర్మానం అమల్లో ఉండటంకూడా దీనికొక కారణం. మళ్ళీ మరొక అతివాది ఎన్నికవుతాడని ఆశించారు. వరుస క్రమంలో (order of priority) ఉన్నవారు బద్దం ఎల్లా రెడ్డిగారు. అప్పటివరకు గృహ నిర్బంధంలో ఉన్నారు. ప్రభుత్వం నిషేధాన్ని తొలగించటం వలన బయటికి వచ్చారు.

పార్టీ మళ్ళీ ఈ బాధ్యతను స్వీకరించాలా లేదా అనే సమస్యను నాయ కత్వం చర్చించింది. తామీ బాధ్యతను నిర్వహించలేమనీ, హైదరాబాదు నగర మితవాదులెవ్వరూ దీనికి సిద్ధంగా లేరనీ, ఆదినుంచీ ఆంధ్రోద్యమంతో సంబంధం ఉన్న మాదిరాజు రామకోటేశ్వరరావు సిద్ధపడవచ్చునని రావినారాయణరెడ్డి అభి ప్రాయపడినారు. వారికోసం ప్రయత్నించాలని పార్టీ నిర్ణయించింది. ఇలాంటి అభిప్రాయానికి వారప్పుడు తగిన కారణాలను చూపించలేకపోయారు. ఈ అంశాన్ని వారు ఇలా వివరించారు :

"...ఏడు, ఎనిమిది ఆంధ్ర మహాసభలు మనకు చాలా అనుకూలంగా పరిణమించాయి. కానీ నిర్మాణ బలహీనతల మూలంగా ఈసారి మితవాదుల్లోకల్లా మితవాదులైన మాదిరాజువారికి అధ్యక్షత అప్పగించవలసి వచ్చింది. ఆ రోజుల్లో కమ్యూనిస్టు పార్టీమీద కేంద్రీకరణ ఎక్కువ చేయటంవల్ల ఆంధ్ర మహాసభ నిర్మాణంమీద ఎక్కువ శ్రద్ధ వహించటానికి వీల్లేకపోయింది. అందుకనే

పరిస్థితులు ఎంత అనుకూలంగా అయినప్పటికీ నాయకత్వం తిరిగి మితవాదుల పాలపడింది." (వీర తెలంగాణా – నా అనుభవాలు – జ్ఞాపకాలు : పేజి : 23)

ఆనాడు మితవాదులు, "జాతీయపక్షంవారు" ఈ బాధ్యతను నిర్వహించటానికి సిద్ధంగా లేకుండిరి. కమ్యూనిస్టు నాయకులకే అవకాశాలు హెచ్చుగా ఉండేవి. వీరు మితవాదులకు కూడా ఆమోదయోగ్యంగా ఉండేవారు.

బహిరంగసభల్లో మాట్లాడటం, పార్టీ కమిటీ సమావేశాలకు హాజరుకావటం, ప్రభుత్వ అధికారులతో మాట్లాడటం తప్ప వీరుచేసిన పని, చేయగలిగిన పని మరొకటిలేదు. పార్టీ నిర్మాణ కార్యకలాపాలను చూడటానికి ప్రత్యేక ఆర్గనైజర్లు ఉండేవారు. రాష్ట్రకేంద్రంతో వారికి నేరుగా సంబంధాలు ఉండేవి.

వాస్తవమేమంటే ఏడవ మహాసభ రాజ్యాంగ సంస్కరణలను బహిష్కరించాలని తీర్మానించింది. ఈ తీర్మానం ప్రభుత్వ వ్యతిరేకమైనది. 8వ మహాసభ ఆ తీర్మానాన్నే కొనసాగించటానికి నిర్ణయించింది. ఆనాటి ప్రజాయుద్ధపాలసీ ప్రభుత్వాన్ని బలపరిచేదిగా ఉంది. ఆంధ్రమహాసభకు అధ్యక్షుడుగా ఉంటూ ప్రభుత్వానికి అనుకూలమైన విధానాన్ని కొనసాగించటానికి అవకాశము ఉండదని భావించి ఆ బాధ్యతనుంచి తప్పుకున్నారు. పార్టీముందు ఈ కారణాలను చూపెట్టలేదు.

ఈ కారణాలవలన వరంగల్లు నివాసి మాదిరాజు రామకోటేశ్వరరావును (న్యాయవాది) ఆంధ్రమహాసభ అధ్యక్షస్థానాన్ని స్వీకరించటానికి సిద్ధం చేశారు. ఈ ప్రయత్నాలు కమ్యూనిస్టులవైపునుంచే సాగినవి. అధ్యక్షుని హోదాలో రావి నారాయణరెడ్డి ఆయనదగ్గరకు వెళ్ళి ఆయనతో మాట్లాడి ఒప్పించటానికి ప్రయత్నించాడు. ఆయన హైదరాబాదు మితవాదులతో సంప్రదించి ఆ బాధ్యతను స్వీకరించటానికి అంగీకరించాడు.

## 1. తొమ్మిదవ ఆంధ్రమహాసభ (ధర్మవరం)

మహాసభను వరంగల్లు జిల్లాలోని ధర్మవరం గ్రామంలో సమావేశపరచటానికి నిర్ణయించారు.

ఇది వరంగల్లు సమీపాన ఉన్నది. ఆహ్వానసంఘం ఏర్పడి పనులు ప్రారంభమైనవి. మాదిరాజు రామకోటేశ్వరరావుగారు ఆహ్వానసంఘ అధ్యక్షుడిగా ఉంటూ పనిచేశారు. ఆహ్వానసంఘంవారు బద్దం ఎల్లారెడ్డిగారో లేక

రావినారాయణరెడ్డిగారో అధ్యక్షులుగా ఎన్నికవుతారని అనుకున్నారు.కమ్యూనిస్టులు అప్పటికి వరంగల్లు ఆజంజాహి మిల్లు కార్మికులలోనూ, కాజీపేట రైల్వేకార్మికుల లోనూ విద్యార్థులలోనూ పనిచేసి ప్రజల్లో గుర్తింపుపొందినారు. తగినంతమంది కార్యకర్తలు పనిచేస్తుండటం వలన వారి నిర్మాణబలం కూడా పెరిగింది. వీరంతా ఆహ్వానసంఘంతో చేరి పనిచేయసాగినారు. ఇలాంటి యువకులందరికీ మాదిరాజు వారు అధ్యక్షులవటం నిరుత్సాహం కలిగించింది. అయినా ఈ నిర్ణయాన్ని పార్టీ ఆమోదించిందని తెలిసి తమవంతు బాధ్యతను చక్కగా నిర్వహించారు. వారితో పాటు కాంగ్రెసువాదులు, జాతీయభావాలున్న ఇతరులు పనిచేసినారు. మాదిరాజు వారు అధ్యక్షులు కావటంవలన అక్కడి వర్తకులు అదనంగా సహాయపడినప్పటికి నిరుత్సాహ వాతావరణంలోనే తొమ్మిదవ మహాసభ ప్రారంభమయినది.

మహాసభ కార్యక్రమాలు కమ్యూనిస్టులకేగాదు, కాంగ్రెసువాదులకు కూడా సంతృప్తి కలిగించలేదు. అధ్యక్షుడు మహాసభ కార్యక్రమాలు సాగుతున్నప్పుడు ఆ ప్రదేశానికి వచ్చిన ప్రభుత్వాధికారులకు మర్యాదలు చేస్తూ రాజభక్తి పరాయ ణత్వాన్ని వెల్లడించడాన్ని అంతా అసహ్యించుకున్నారు. అయినా మహాసభను విజయవంతంగా జరుపాలని పట్టుదలతో అంతా కలసికట్టుగా పనిచేసి తమతమ బాధ్యతలను నిర్వహించారు.

ఈ పరిస్థితుల్లో జరిగిన రెండు ముఖ్యమైన పరిణామాలు మనం గమనించ వల్సి ఉంటుంది. కమ్యూనిస్టు నాయకులు మహాసభలో "ప్రజాయుద్ధ" పాలసీని రాజకీయ సంస్కరణలకు అన్వయింపజేస్తూ తీర్మానాన్ని మార్చడానికి ప్రయ త్నించారు. రాజ్యాంగ సంస్కరణలను తిరస్కరించాలని ఏడవ మహాసభలో (మల్కాపురం) ఆమోదించిన తీర్మానాన్ని మార్చివేసి, సంస్కరణలను కొన్ని షరతులతో అంగీకరించాలనే తీర్మానాన్ని ప్రవేశపెట్టారు. తీర్మానం ఈ విధంగా ఉంది :

"రాజ్యాంగ సంస్కరణములు : 12) ప్రభుత్వమువారిచే ప్రకటింపబడిన రాజ్యాంగ సంస్కరణములు మిక్కిలి అసంతృప్తికరముగను, నిరాశాజనకము గను, దేశాభివృద్ధికి హానికరముగను ఉన్నవి. ప్రజాస్వామిక సిద్ధాంతమునకిందు స్థానము లేకపోవుటయేగాక, అట్టి సిద్ధాంతములకు ప్రతికూలమగు ఫాసిస్టుసిద్ధాంత పునాదులపై సంస్కరణలు నిర్మింపబడియున్నవి. ఫాసిస్టు రాజ్యాంగ విధానము నందుండు వృత్తిపూర్వక ప్రాతినిధ్యమేర్పడియున్నది. ప్రస్తుతము అమలులోకి రానున్న రాజ్యాంగ సంస్కరణములలోని అంతర్భాగములయిన జిల్లా కాన్ఫరెన్సు

లతోను, మరియు సలహా సంఘములతోను, ఇకముందు అమలులోనికి రాబోవు ఇతర అంతర్భాగములతోను ప్రజలేపాటి సంబంధముంచుకొనకూడదని ఈ మహా సభవారు దేశీయులను హెచ్చరించుచున్నారు.

"మల్కాపురము మహాసభ తర్వాత ఉద్భవించిన అంతర్జాతీయ పరిస్థితులను దృష్టియందుంచుకొని, ఫాసిస్టు దురాక్రమణ శక్తులకు ప్రతికూలంగా దేశీయులను సమీకరించే ఉద్దేశం కూడా దృష్టియందుంచుకొని ప్రభుత్వంవారు సంస్కరణలయందు క్రింది సవరణలను కావించినచో మల్కాపురము తీర్మానమును పునరాలోచించుటకు ఈ మహాసభవారు స్థాయి సంఘమునకు అధికారమిచ్చుచున్నారు.

"1) శాసన సభలు, స్థానిక సంస్థలు ప్రజాస్వామిక సిద్ధాంతములపై ఆధారపడి ప్రాంతీయ పద్ధతి (territorial basis)న ఎన్నికలు జరుపవలయును.

"2) ప్రజాసామాన్యముచే ఎన్నుకొనబడిన శాసన సభా సభ్యులనుంచి మంత్రివర్గమును నియమించవలయును.

"3) రాజకీయాభివృద్ధికి హిందూ, మహమ్మదీయ సఖ్యము అవసరము కావున నిర్దుష్టమైన సమిష్టి ఎన్నికల విధానము ప్రవేశపెట్టవలెను.

"4) సంపూర్ణ పౌరసత్వ హక్కులను ఇవ్వవలయును."

(తెలంగాణా ఆంధ్రోద్యమం-రెండవభాగం-352, 353, 354)

పోల్కంపల్లి వెంకట రామారావు సమర్థులైన లాయరు. పార్టీ సభ్యుడు కాకున్నా అతివాదిగా ఉంటూ పార్టీకి తోడ్పడుతూ ఉండేవాడు. ఈ సందర్భంలో కూడా పై తీర్మానాన్ని ఆయనే రూపొందించి ప్రవేశపెట్టాడు.

ఏడవ మహాసభ తీర్మానంలో రాజ్యాంగ సంస్కరణల్లో "పుట్టుదోషాలున్నా"యని నిర్ధారణ చేశారు. ఇది సరైందే. పరిస్థితులు మారినంత మాత్రాన కొన్నిమార్పులు చేర్పులవలన పుట్టుదోషాలు తొలగిపోవు. పరిస్థితులు మారినవనే పేరుతో ప్రభుత్వంతో రాజీపడే విధానాన్ని అనుసరించారు. ఇది మితవాదుల విధానానికి అనుగుణ్యంగా ఉన్నదేకాని నిజమైన ప్రజాతంత్ర విధానం కాదు. విప్లవవిధానం అసలేకాదు.

వృత్తి ప్రాతినిధ్యానికి బదులు ప్రాంతీయ ప్రాతినిధ్యం కావాలనే కోరిక బ్రిటిష్ పార్లమెంటరీ విధానానికి అనుగుణ్యంగా ఉన్నది. మనదేశపు నేటి పార్లమెంటరీ వ్యవస్థలో ఇదేపద్ధతి అమల్లోఉన్నది. బూర్జువా ప్రజాస్వామికంలో

ఇలాంటి విధానాలున్నప్పటికీ ఇవి మాత్రమే ప్రజాస్వామికమైనవని చెప్పవీలు లేదు. ప్రాంతీయ ప్రాతినిధ్యంకన్నా వయోజన ఓటింగుహక్కు ముఖ్యమైనది. దానిని కోర్కెలలో చేర్చలేదు. పరిమితమైన ఓటింగుహక్కుతోనైనాసరే ప్రాంతీయ ప్రాతినిధ్యం ఉంటే చాలునని దీని అర్థం.

మంత్రిమండలిని ఎన్నుకోవాలనేది మరోకోరిక. శాసనసభ అధికారాలేమిటి ? నిజాం అధికారాలేమిటి ? అనే సమస్యకు సంబంధంలేని ఈ కోరిక సారాంశం– శాసనసభకు ఎన్ని పరిమితులున్నాసరే ఎన్నుకున్న మంత్రిమండలి ఉంటే చాలుననేదే.

సంయుక్త నియోజకవర్గాలు కావాలనే కోరిక కూడా ఈ కోవకు చెందినదే. ఒకమతానికి ప్రాతినిధ్యం ఇచ్చే విధానం ఏస్వరూపంలోఉన్నా అది ప్రజాతంత్ర వ్యతిరేకమైనదే.

పౌరసత్వాలు కావాలనే కోరిక కొత్తదేమీకాదు. అన్ని మహాసభల్లోనూ దీన్ని పునరుద్ఘాటిస్తూ వస్తున్నారు. దీనిపై ఎవరికీ ఎలాంటి భేదాభిప్రాయంలేదు.

ఈ కోర్కెలు మితవాద స్వభావం కలవి. ఏ దేశంలోనైనా యుద్ధ కాలంలో అన్నిపార్టీల ప్రభుత్వాన్ని ఏర్పాటుచేసి, యుద్ధాన్ని కొనసాగిస్తారే కాని తీవ్రమైన మార్పులు ప్రవేశపెట్టరు.

ఈ విధంగా "పుట్టుదోషాలు"కల రాజ్యాంగ సంస్కరణలను కొన్ని షరతులతో అంగీకరించాలనే తీర్మానం, ప్రజాతంత్రం కోసం, ఫాసిజానికి వ్యతిరేకంగా సాగించే పోరాటానికి ఏవిధంగానూ తోడ్పడదు ; తోడ్పడలేదు. దీనివలన లాభపడింది మితవాదులే. 7వ మహాసభలో అతివాద, మితవాదుల మధ్య వచ్చిన చీలిక ఒకమేరకు సమసిపోయి ఐక్యమయినారు.

రాజ్యాంగ సంస్కరణలను ఏదో రూపంలో అంగీకరించాలని కోరే మితవాదులలో కొందరు చాలా ఉత్సాహంతో దీనిని బలపర్చారు. కాంగ్రెసు అనుయాయులు కొందరు దీనిని వ్యతిరేకించారు. చర్చలు మాటుగా సాగినాయి. యుద్ధంవలన ఏర్పడిన పరిస్థితుల కనుగుణ్యంగా వైఖరిలో మార్పు అవసరమని పార్టీ తరపున మాట్లాడేవారి వాదన. తీర్మానాన్ని బలపరిచే మితవాదులు, ఇతరులు ఈ వాదనను బలపరుస్తూ మాట్లాడారు. అలాంటి మార్పులేమీ లేవనీ, సంస్కరణల బహిష్కరణ యథాతథంగా కొనసాగవలసిందేనని కాంగ్రెసు అనుయాయుల అభిప్రాయం. అయినా కాంగ్రెసువారు మైనారిటీలో ఉన్నారు. మెజారిటీలో వున్న కమ్యూనిస్టులు, వారి అనుచరులు, మితవాదుల ఓట్లతో ఈ తీర్మానం

నెగ్గింది. రాజ్యాంగ సంస్కరణలను నిరాకరించాలనే పూర్వపు తీర్మానం దీనితో రద్దయిపోయింది. ఇదొక ముఖ్యఘటన.

రెండవది : రష్యా నాజీజర్మనీతో సాగిస్తున్న యుద్ధం ప్రజాయుద్ధం అనే నినాదాలతో కమ్యూనిస్టులు ఒక ప్రదర్శన చేసారు. మితవాదులకు ఇది ఇబ్బంది కలిగించినా వారు దీనినంతగా పట్టించుకోలేదు గానీ, కాంగ్రెసువాదులు దీనిపై రభస చేశారు.

ఈ తీర్మానం మందుముల నరసింగరావులాంటి వారికి వరప్రసాదమనిపించింది. అప్పటివరకు వీరు వ్యక్తిగతంగా ప్రభుత్వంతో రాయబారాలు నడిపించేవారు. కాని ఈ తీర్మానంతో ఆంధ్రమహాసభ తరఫుననే ఈ పనిని సాగించవచ్చునని వారు భావించారు. ఈ మార్పుకు దారితీసిన పరిణామాలను గూర్చి కోదాటి నారాయణరావుగారు ఈ విధంగా రాశారు.

"...అదొక విచిత్ర ఘటన. రాత్రి జరిగిన విషయ నిర్ణయ సభలో అధిక సంఖ్యాకులు కమ్యూనిస్టులతో సహా రాజ్యాంగ సంస్కరణలను బహిష్కరించవలెనని తీర్మానించారు. సంస్కరణలను ఖండిస్తూ నిప్పులు చెరిగారు. సంస్కరణలను ఆమోదించవలెననే వర్గనాయకులైన శ్రీ మందుముల నరసింగరావు గారు సమావేశానంతరం కమ్యూనిస్టు నాయకుల చేరబిలిచి వారికి ప్రజా యుద్ధపు పాలసీని వివరించి చెప్పి, ప్రభుత్వంతో సహకరించటం ఆ పాలసీ రీత్యా వారి విధి అవుతుందని నచ్చచెప్పారు. దాంతో వారు రంగుమార్చారు. వారు అంతర్జాతీయ పాలసీని హైదరాబాదు పరిస్థితులలో ఏ విధంగా అనుసరించవలయునో ఆలోచించుకోలేకపోయారు. భారతదేశంలోనే వారు అనుసరించిన పాలసీ తప్పని రుజువయింది. హైదరాబాదులో అంతకంటే తప్పని అక్షరాలా తేలింది. ఆ రాత్రి అంగీకరించిన కమ్యూనిస్టులు తెల్లవారే వరకే రాజ్యాంగ సంస్కరణలను కొన్ని మార్పులతో అంగీకరిస్తామన్నారు. ఆనాటినుండి నరసింగరావుగారు కమ్యూనిస్టు పార్టీకి సలహాదారైనారు. రాజ్యాంగ సంస్కరణలను బహిష్కరించవలెననే వర్గం మైనార్టీగా ఉండిపోయింది......" ("తెలంగాణం" వ్యాససంకలనం-పేజి-212)

మహాసభ సమావేశమైన కాలంలో పాత తీర్మానాన్ని మార్చాలా లేదా అనే అంశాన్ని కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం చర్చించింది. మార్చకూడదనే అభిప్రాయం కూడా వారిలో బలంగానే ఉండినది. అయినా అత్యధికులు మార్చ వచ్చునని భావించినారు. ఈ మార్పుకు నరసింగరావుగారి సలహాయే కారణమని చెప్పటం నిరాధారమైనది. నరసింగరావుగారు ఈ సమస్యను ఆంధ్ర మహాసభలో

పనిచేసే పార్టీ నాయకులతో (రావినారాయణరెడ్డి మొ॥న వారు) చర్చించి ఉండ వచ్చును. అంతేకాని వారెప్పుడూ పార్టీ నాయకులకు సలహాదారుల హోదాలో పనిచేయలేదు. 9వ మహాసభకు పూర్వమూ, తర్వాతా కమ్యూనిస్టులు మందుముల వారితో సంఘర్షణపడిన విషయం ఆనాటి రాజకీయాలతో సంబంధమున్న వారందరికీ తెలిసినదే.

కమ్యూనిస్టులు ఫాసిస్టు వ్యతిరేక విధానాన్ని భారతదేశ పరిస్థితులకూ, సంస్థాన పరిస్థితులకూ అన్వయించటంలో తీవ్రమైన తప్పులు చేశారనేమాట నిజం. వీటిని ఏదోమేరకు వారు అంగీకరించారు కూడా. కానీ అఖిలభారత కాంగ్రెసు నాయకులు (గాంధీ, నెహ్రూ, పటేల్) అంతకన్నా తీవ్రమైన తప్పులు చేశారు. ఆ తప్పుల దుష్ఫలితాలను నాటికీ, నేటికీ మనదేశ ప్రజలు అనుభవించుతూనే ఉన్నారు. కాంగ్రెసు చేసిన తప్పులన్నిటినీ కమ్యూనిస్టు పార్టీ బలపరచనందుకే వారి విమర్శ.

విషయ నిర్ణయ సభలో రాజ్యాంగ సంస్కరణల సమస్యపై జరిగిన చర్చలను మాడపాటి వారు, మందుములవారు, రావినారాయణరెడ్డిగారు తమ తమ రచనలలో ఎక్కడా ఉదహరించలేదు.

తర్వాత పరిణామాలను వారు (కోదాటి) ఈ విధంగా వ్యాఖ్యానించారు :

"...ప్రధాన సిద్ధాంతంతోనే ఏకీభవించని మహాసభ నిర్వాహణలో తాము పాల్గొనజాలమని వారు ఆంధ్రమహాసభ స్థాయి సంఘంలో ఉండ నిరాకరించారు. ఈ వర్గానికి శ్రీ మందుముల రామచంద్రరావుగారు నాయకత్వం వహించారు. అధ్యక్షులైన శ్రీ మాదిరాజు రామకోటేశ్వరరావుగారు ఏమీతోచక తికమకలో పడ్డారు. ఈ విధంగా ధర్మవరం మహాసభ మూడు వర్గాలకు స్పష్టంగా దారి తీసింది.

"కొంతకాలంవరకు ఆంధ్రమహాసభ అయోమయ స్థితిలో ఉండిపోయింది. తర్వాత ఏదో ఒకవిధమైన అతుకుల బొంతవంటి రాజీ కుదిరి అందరూ ఆంధ్ర మహాసభ స్థాయీ సంఘంలో చేరారు." (పై పుస్తకం - పేజి-212-213)

ఆంధ్రమహాసభ ఎన్నడూ గాంధీవాదాన్ని అంగీకరించలేదు. మితవాదుల నాయకత్వం ఉన్నంతవరకూ వారు ప్రభుత్వ "జోహుకుం" సిద్ధాంతాన్నే అమలు జరిపారు. కమ్యూనిస్టుల నాయకత్వాననే అది ప్రభుత్వ వ్యతిరేక పోరాటసంస్థగా పరిణమించింది. కాంగ్రెసువాదులు పోటీ సంస్థను ఏర్పాటుచేసి దాని చివరి మహా సభల నాయకులైనారేగాని, ఐక్యంగా ఉన్న ఆంధ్రమహాసభకు వారెప్పుడూ

నాయకులు కాలేదు. మందుముల రామచంద్రరావు వారి "వర్గానికి" నాయకత్వం వహించారంటే, ఈ వర్గమంతా మితవాదవర్గం కావటమే. ఇతర మితవాదులకూ వీరికీ ఉన్న భేదమంతా వారు జైళ్ళకు వెళ్ళలేదు. వీరు జైళ్ళకు వెళ్ళారు. అంతే కాక వారు ఉభయులకూ అంగీకారయోగ్యమైనవారు.

ఈ సంఘటననే మహాసభ అధ్యక్షుడు ఈ విధంగా వివరించారు.

"......శ్రీ రామకృష్ణారావు పక్షమువారి వాదము ఓడిపోయినది. దీని పర్యవసానముగా సభానంతరము స్థాయి సంఘ సభ్యులలోనుండి 30మంది సభ్యులు తమ రాజీనామాలను నాకందజేశిరి. అందులో ముఖ్యముగా శ్రీ రామకృష్ణారావు, మందుముల రామచంద్రారావు, పరచ రంగారావు ప్రభృతులుండిరి. నాకు ముఖ్యాతిముఖ్యులగు 30 మంది సభ్యులు వైతొలగినప్పుడు కమ్యూనిస్టువాదులు, ఉద్రేక యువకులు మాత్రము మిగిలిరి. ఆ కారణమున నేను వెంటనే కార్యవర్గమును నియమించుకొనజాలకపోయితిని. నేను ప్రత్యేకంగా వారందరిని సమాధానపరిచి రాజీనామాలను ఉపసంహరింపజేసితిని." (మాదిరాజు రామకోటేశ్వరరావుగారి స్వీయచరిత్ర, పేజి 349-350).

బూర్గుల రామకృష్ణారావుగారు మితవాది అయినా కాంగ్రెసు అనుయాయుల్లోనే చేరారు. "ముఖ్యాతిముఖ్యుల"యిన వారంతా రాజీనామా చేసి అధ్యక్షుని వదిలిపోయారు. ఈవిధంగా వారు అప్పుడే మహాసభ విచ్ఛిన్నానికి తలపడినారు. కాని కమ్యూనిస్టులు అలాంటి పనిచేయలేదని వారే అంగీకరించవలసివచ్చింది. అయినా మితవాదులు మితవాదులే. ఏగూటిపక్షులు ఆగూటికి చేరుకున్నట్టు వెంటనే వీరంతా ఒకచోటుకి చేరుకున్నారు.

అంతర్జాతీయ పరిస్థితులపై చేసిన తీర్మానంలోని ముఖ్యభాగం ఇది :

"13. అంతర్జాతీయ పరిస్థితులు సన్నిహితములగుటచే అమానుషమయిన ఫాసిజం యొక్క ప్రమాదము హైదరాబాదు రాష్ట్రమునకు సమీపించినదని మహాసభవారు అభిప్రాయపడుచు ఈ సందర్భమున ప్రభుత్వమువారు పూనుకొని ప్రారంభించిన సన్నాహములకు స్వాగతమొసగుచున్నారు. సికింద్రాబాదు దక్షిణ హిందూదేశమునకు ఒక ముఖ్యకేంద్రముగా నున్నందునను, యుద్ధజ్వాలలు భారత దేశ ద్వారమునకే సమీపించిన కారణమునను హైదరాబాదు సంస్థానము కూడ ఎప్పుడో ఒకప్పుడు శత్రుసైనిక దాడికి గురియగుట అసాధ్యమైన విషయము కాదు. కాబట్టి ఇట్టి ప్రమాదములను గమనించినచో విమానదాడి రక్షణ, మరియు

దేశరక్షణకై ప్రజలను సంఘటితపరచుట ముఖ్యావసరమని పరిస్థితులే తెలుపుచున్నవి..."

(తెలంగాణా ఆంధ్రోద్యమం-రెండవభాగం-పేజీలు 352, 353, 354)

దీనిలో ప్రభుత్వ యుద్ధప్రయత్నాలను బలపరచటంతో ఆగక అవి సంతృప్తికరంగా లేవని చెప్పారు. ఆ సమస్యపై కొన్ని సూచనలను కూడా చేశారు. ఇదేవిధంగా "మిత్రమండలి"తో సానుభూతి ప్రకటిస్తూ "14. ఫాసిజం యొక్క నైచ్యమును, పశుత్వమును దృష్టియందుంచుకొని స్వాతంత్ర్య రక్షణార్థము ఫాసిజం, నాజీజం శక్తులతో యుద్ధమొనర్చు దేశీయులతో ఈ మహాసభవారు సానుభూతిని చూపించుచున్నారు. ఎన్నికైనను ఫాసిజంయొక్క అపాయమును రూపుమాపనున్న చైనా వీరులు, యోధులగు రష్యనులు, వీరులగు బ్రిటిషు అమెరికా దేశీయులు మరియు ఆక్రమిత రాజ్యముల జనసామాన్యపు సమిష్టి యుద్ధప్రయత్నమును ఈ మహాసభవారు శ్లాఘించుచున్నారు. ఫాసిజం, నాజీజంను ప్రతిఘటించి మానవసమాజమును శాశ్వత బానిసత్వము నుండియు అధఃపతనము బొందించు వ్యవస్థ నుండియు విముక్తిగావించ ప్రయత్నించుచున్న దేశములతో ఈ మహాసభ సంపూర్ణ సానుభూతిని వెల్లడించుచున్నది." (పై పుస్తకం పేజీలు 352, 353, 354) అని స్పష్టంచేశారు. దానిలో సామ్రాజ్యవాద ప్రభుత్వాలను (బ్రిటన్, అమెరికా) శ్లాఘించలేదు. ఆ దేశాల ప్రజలనే శ్లాఘించారు. రష్యా, చైనా ప్రజలను గురించి వేరే చెప్పవలసిన అవసరంలేదు. ఈ ప్రజలు తమతమ దేశాల విముక్తికోసం పోరాడినారేగాని, "మానవ సమాజమును శాశ్వత బానిసత్వము నుండియు, అధఃపతనముబొందించు వ్యవస్థల నుండియు విముక్తిగావించుచున్నార"ని చెప్పటం అతిశయోక్తిమాత్రమే గాక సామ్రాజ్యవాదుల బానిసత్వంక్రింద మగ్గుతున్న మనదేశంలో ప్రజలు స్వాతంత్ర్యపోరాటాన్ని కొనసాగించవలసిన అవసరాన్ని గుర్తించకపోవటమే. ఆనాటి కమ్యూనిస్టు పార్టీ ఏర్పరచుకున్న తప్పు అవగాహన దీనిలో ప్రతిబింబిస్తున్నది.

మితవాదులు ఈ వైఖరితో ఏకీభవించారు. కాంగ్రెసువాదులు రాజీనామా చేసి దూరంగా ఉండటంవలన మితవాదులు కమ్యూనిస్టుల అంగీకారంతో "అంతర్జాతీయ పరిస్థితులు" "మిత్రమండలితో సానుభూతి" సమస్యలపై మహాసభ తీర్మానాలు చేసింది. అంతర్జాతీయ పరిస్థితులపై ఆంధ్ర మహాసభ తీర్మానాలు చేయటం ఇదే తొలిసారి.

మహాసభ ఆవరణలో "ప్రజాయుద్ధ"మనే నినాదాలతో కమ్యూనిస్టులు ప్రదర్శనలు చేయటం అనవసరం. అనుభవరాహిత్యంవలన చేసిన పని ఇది. మాడపాటివారు ఈ అంశాన్ని ఈ విధంగా వివరించారు.

"అంతకు పూర్వము ఆంధ్రోద్యమమునందు తీవ్రవాదులుగా మాత్రమే పరిగణింపబడుచుండిన ప్రముఖ కార్యకర్త - శ్రీ రావినారాయణరెడ్డిగారు - ఆంధ్రోద్యమమునకేగాక, భారతదేశ జాతీయోద్యమాశయములకు గూడా అతీత ములుగానుండు క్రొత్త ఆదర్శములవలన ప్రేరేపితులైయున్నట్లు కానవచ్చినది. ఆంధ్రోద్యమముతోనెట్టి సంబంధమును అంతకుముందులేని ఆంధ్రులును, ఆంధ్రేత రులును వారికి సహచరులుగానుండి నూతనాదర్శములను ప్రకటించుచుండుటయు, నినాదములతో గుంపులు గుంపులుగా సభామంటపము చుట్టును తిరుగుచు పాటలు, గీతములు పాడుచుండుటయు, ప్రారంభమునుండియు ఆంధ్రోద్యమముయొక్క సంప్రదాయములకలవాటుపడియుండిన నాయకులకేగాక, తెలివికలవారగు గ్రామ వాసులకు కూడా ఆశ్చర్యము, సందేహము, భయము కల్పించుచుండినవి!"

('తెలంగాణా ఆంధ్రోద్యమము', రెండవ భాగము, పేజి : 160-161)

కమ్యూనిస్టు పార్టీ ఆంధ్రమహాసభలోచేరి పనిచేయటానికి నిర్ణయించటంతో సంస్థ స్వరూప స్వభావాలు మారిపోయినవి. ఏడు, ఎనిమిదవ మహాసభలలో ఈ మార్పు స్పష్టంగా కన్పించింది. అయినా ఎవరూ దీనిని ఆక్షేపించలేదు. కాగా ఆహ్వానించారు కూడా. ఏ కార్యక్రమమూ లేక అయోమయ స్థితిలో ఉన్న ఆనాటి కాంగ్రెసువాదులు దీని లోతుపాతులను అర్థంచేసుకోలేకపోయారు. తీరా తొమ్మిదవ మహాసభలో కమ్యూనిస్టులు బలమైన, స్వతంత్రమైన రాజకీయశక్తిగా వృద్ధిపొందినారని మొదటిసారి తెలుసుకొని వారు దిగ్భ్రాంతులైనారు. "ప్రజా యుద్ధ" నినాదానికన్న ఈ బలమే వారి వ్యతిరేకతకు ముఖ్య కారణం.

ఆంధ్రేతరులు ఆంధ్ర మహాసభలో సభ్యులు కావటానికి, బాధ్యతగల స్థానాలలో ఉండటానికి వీలుగా నియమావళిని ఎనిమిదవ మహాసభలో మార్చారు. ఆరవ మహాసభ (నిజామాబాదు) సమయంలో చెలరేగిన వాగ్వివాదాల ఫలితమే ఈ మార్పు. ఆంధ్రేతరులు మితవాదులకు, కాంగ్రెసు వాదులకు అనుకూలు రైతే వారికభ్యంతరం ఉండేదికాదు. ఆరవ మహాసభ (నిజామాబాదు)లో ఆంధ్రే తరులు (ముస్లింలు, మహారాష్ట్రులు) పాల్గొనటాన్ని సమర్థించిన మితవాదులకు, కాంగ్రెసు వాదులకు, తొమ్మిదవ మహాసభ నాటికి "ఆంధ్రోద్యమముతోనెట్టి సంబంధమును అంతకు ముందులేని ఆంధ్రేతరులు" ఉంటే ఆశ్చర్యమెందుకు ?

సందేహమెందుకు ? భయమెందుకు ? కమ్యూనిస్టుపార్టీలో చేరి ఆంధ్ర మహాసభ కార్యకర్తలైన వారు ఈ మహాసభకు వచ్చారు. కార్మిక సంఘాల్లోనూ, ఇతర సంస్థల్లోనూ పనిచేసేవారుకూడా వచ్చారు. వారంతా ఆంధ్రులే అయినా పూర్వపు మహాసభల్లో పాల్గొనలేదు. కొందరు ఆంధ్రేతరులు కూడా ఉన్నారు. అంత మాత్రాన వీరికి సందేహం, భయం ఎందుకు కలగాలి ?

పూర్వపు ఆంధ్ర మహాసభల్లో ప్రపంచయుద్ధం, జాతీయ అంతర్జాతీయ సమస్యలపై తీర్మానాలు చేయలేదు. ఈ మహాసభలో మొదటిసారిగా ఈ సమస్యలను చర్చించి తీర్మానాలను ఆమోదించారు. ఆ సందర్భంలో వివిధ దృక్పథాల వారిని సంప్రదించి వారి అభిప్రాయాలను సమన్వయించి తీర్మానాలను రూపొందించటానికి వ్యవధి అవసరమైనది. ఆ కారణం వల్లనే సమావేశాలు ఆలస్యంగా జరిగినవి. అసాధారణమే అయినా వీటివలన సందేహానికి భయానికి తావులేదు.

నిరుత్సాహపూరితమైన వాతావరణంలో మహాసభ ముగిసింది. దీనిని అందరూ అంగీకరించారు. ఈ స్థితికి కారణాలు :

1) కమ్యూనిస్టులు, ఇతర అతివాదశక్తులు బలపడుతున్న సమయంలో రాజకీయానుభవంలేని, మితవాదుల్లో మితవాది ఆంధ్రమహాసభకు అధ్యక్షుడు కావటం. దీని బాధ్యత కమ్యూనిస్టులదే.

2) కాంగ్రెసువాదులు బాధ్యతగల స్థానాలను స్వీకరించటానికి నిరాకరించారు. దీనివలన ఒక ప్రతిష్ఠంభన ఏర్పడింది. కాంగ్రెసువాదుల్లో బూర్గుల రామకృష్ణారావువంటి మితవాదులు కూడా ఉన్నారు. ఈ ప్రతిష్ఠంభన మితవాదులకే గాక కాంగ్రెసువాదులకు కూడా నిరాశ కలిగించింది. దీనిబాధ్యత తర్వాతికాలంలో "జాతీయపక్షం"గా ఏర్పడిన కాంగ్రెసువాదులదే.

ఈ విధంగా మాదిరాజు రామకోటేశ్వరరావుగారి అధ్యక్షత ఆంధ్రమహాసభ పురోగమనాన్ని రెండు సంవత్సరాలు వెనక్కులాగింది. ముందుకుసాగే ప్రజా ఉద్యమం, వెనక్కులాగే మితవాద నాయకత్వం – ఈ రెండూ పరస్పర విరుద్ధమైన అంశాలు.

## 2. ధర్మవరం మహాసభ తర్వాత పార్టీ, ఆంధ్రమహాసభ కార్యకలాపాలు

ధర్మవరం (తొమ్మిదవ) మహాసభతర్వాత ఆంధ్రమహాసభ కార్యకలాపాలు మామూలుగా సాగిపోయినవి. పార్టీ కార్యకలాపాలు కూడా తీవ్రతరం అయినవి.

పార్టీ అన్నిరంగాల్లో ముందంజవేసింది. ప్రజలు కదిలి పోరాటాలు సాగిన సమయంలో ప్రభుత్వ నిర్బంధవిధానం తీవ్రంగా ఉండేది. ఇతర సందర్భాల్లో తక్కువగా ఉండేది.

అన్నిజిల్లాల్లో కూడా పార్టీ, ఆంధ్రమహాసభ కార్యకలాపాలు ముందుకు సాగినవి. కొన్ని ఇబ్బందులున్నా బహిరంగసభలకు అనుమతి దొరుకుతూ ఉండేది. పార్టీ తరఫున బహిరంగసభలు జరిగినవి. అదేవిధంగా విద్యార్థిఉద్యమం, ట్రేడు యూనియన్ ఉద్యమం ముందుకుపోయాయి.

అప్పటికే అన్ని జిల్లాల్లో వెట్టిచాకిరీకి వ్యతిరేకంగా ఏదో రూపంలో ప్రచారం జరుగుతూ ఉండేది. నల్లగొండ జిల్లాలో ఈ ప్రచారం దీనివరకే పరిమితం కాలేదు. కౌల్దార్ల సమస్యలు కూడా ముందుకు వచ్చినవి. అది కూడా సూర్యాపేటకు చుట్టుపక్కల ఉన్న గ్రామాల్లో, సమీప ప్రాంతాల్లో ఈసమస్యలు ఎదురైనవి. కార్యకర్తలు గ్రామాలకు వెళ్ళి రైతులకు ఆంధ్ర మహాసభ సభ్యత్వం ఇచ్చే సమయాన కౌలుదారులుకూడా సభ్యులైనారు. వారు తమ సమస్యలను చెప్పుకున్నారు. ఈ సమస్యయొక్క స్వభావమేమంటే : ఈ ప్రాంతంలో కొందరు మాత్రం పెద్ద భూస్వాములున్నారు. తక్కినవారంతా చిన్న భూస్వాములు. శక్తి లేకనో లాభసాటిగా ఉంటుందనో వారు 'తమ' భూములను కౌలుకిచ్చేవారు. వీటిలో కొన్ని ఇజారా బంజరు భూములు. తక్కినవి రైత్వారీ భూములు. పెద్ద భూస్వాముల్లో ఒకరిద్దరుతప్ప తక్కినవారంతా ఆంధ్రమహాసభ అభిమానులే.

ఆంధ్రమహాసభ కార్యక్రమాలు ప్రారంభమై వెట్టిచాకిరీని నిరాకరించే స్థితి ఏర్పడగానే వీరు భయపడి భూములనుంచి కౌలుదారులను ఒక్కొక్కరిని వెళ్ళ గొట్టటానికి ప్రయత్నించారు. పెద్ద భూస్వాముల్లో సూర్యాపేట దేశముఖు ముఖ్యుడు. ఆయన పెద్ద గుమాస్తాకూడా పెద్ద భూస్వాముల కుటుంబానికి (కోదాటివారు) చెందినవాడే. అయినా సూర్యాపేట దేశముఖుకన్న చిన్నభూస్వామే. ఈ కుటుంబానికి ఆంధ్రోద్యమంతో ప్రారంభంనుంచీ సంబంధాలుండేవి. సూర్యాపేటలో జరిగిన సాంస్కృతిక కార్యకలాపాలలో ప్రముఖ పాత్రను నిర్వహించారు. కమ్యూనిస్టు పార్టీ ఆంధ్ర మహాసభ కార్యకలాపాలు "వీరి గ్రామాల్లో" కూడా సాగినవి. దాసాయిగూడెం, భక్తళాపురం ఇలాంటి గ్రామాల్లోనివి. ఈ గ్రామాలనుంచి కార్యకర్తలు పార్టీ, ఆంధ్ర మహాసభల్లో పనిచేయ టానికి ముందుకు వచ్చారు.

చిన్న భూస్వాములు కూడా రైతులను భూములనుంచి వెళ్ళగొట్టటానికి ప్రయత్నించేవారు. స్థానికంగా ఉండే వడ్డీ వ్యాపారస్థులు లేక ధాన్యాన్ని నాగుల కిచ్చి రైతులను తమ గుప్పిట పెట్టుకునేవారు ఈ అవకాశాలనుపయోగించుకొని భూస్వాముల భూములను తాకట్టుపెట్టుకోటానికి, కొనివేయటానికి ప్రయత్నం చేసేవారు. కౌలుదారీ రైతులకు వారు సాగుచేసే కౌలుభూములు చెందితే వారు రైతులనుండి చౌకధరకు కొనవచ్చును. కౌలు భూములపై తగాదాలు జరిగితే పైరవీ (litigation) కోసం కావలసిన డబ్బంతా వడ్డీ వ్యాపారస్థులు అప్పుగా ఇచ్చేవారు. తుదకు భూమి రైతులకే చెందితే, వారి భూముల్లో కొంతభాగాన్ని తాము అప్పుకింద తీసుకోవచ్చునని వారు రైతులకు తోడ్పడుతూ ఉండేవారు. వల్లభాపురం (సూర్యాపేట - విజయవాడ రోడ్డు), చింతల చెర్వు, అక్కలదేవి గూడెం (సూర్యాపేట - ఖమ్మం రోడ్డు) పరిసర గ్రామాల్లో కౌలుదారుల సమస్య లుండేవి. వీటిలో కొన్ని ఇజారా బంజరు గ్రామాలు. ఈ గ్రామాల్లో చిన్న భూస్వాములేగాక, దివాలా తీసినవారు కూడా ఉండేవారు.

ఆంధ్ర మహాసభ కార్యకర్తలు ఈ గ్రామాలకు వెళ్ళినప్పుడు వారిని వడ్డీ వ్యాపారస్థులు ఆదరంగా చూసేవారు ; వారితో సహకరించేవారు. వారి వర్గ స్వభావాన్ని సరిగా అర్థం చేసుకోలేక వారు చెప్పిన మాటలను కొంతమేరకైనా పాటించే వారు ఆనాటి కార్యకర్తలు. ఈ పొరపాట్లు జరిగినా ఈ ప్రాంతంలో కౌలుదారుల సమస్యమాత్రం తీవ్రంగా ఉండేది. కౌలుదారులు వరుసగా సాగుచేస్తున్న భూముల నుంచి తొలగించకూడదని వారి కోరిక. కౌలురేట్లను, మక్తారేట్లను (ధాన్యరూపంలో ఇచ్చేకౌలు) హెచ్చించకూడదని వారి మరో కోరిక. ఆంధ్రమహాసభ గ్రామ సంఘాల్లో వారి కోరికలను బలపరిచేవారు ఉండటంవలన కౌలుదారులకు గ్రామ సంఘాల మద్దతు ఉండేది వడ్డీ వ్యాపారస్థులు కూడా సంఘాల్లో ఉండేవారు. దానివలన కూడా వారికి సంఘాల మద్దతు దొరకటం సులభమయ్యేది.

ఈ కోరికలను భూస్వాములు అంగీకరించలేదు. అంతటితో ఆగక వారు ప్రభుత్వానికి ఫిర్యాదుచేశారు.

ఆంధ్రమహాసభ కార్యకర్తలు పెద్దభూస్వాములకు వ్యతిరేకంగా పనిచేయ ప్రారంభించారు. సూర్యాపేట దేశముఖు వారిలో ముఖ్యుడు. ఆయన సూర్యాపేట తాలూకాలోని 80 గ్రామాలకు దేశముఖు. ఆ గ్రామాల్లో ఆయనకు 10 వేల ఎకరాలకు మించిన భూమి ఉండేది. దీనిని పాలేర్లతో సాగుచేయటం వలన ధాన్యం బాగా పండేది. ఆయన భూస్వామి కావటంతోపాటు రైసుమిల్లు యజమాని కూడా

కావటంవలన పండిన ధాన్యంలో హెచ్చుభాగాన్ని తన రైసుమిల్లుకు తరలించే వాడు. అతను తన భూములను పాలేర్లతో సాగుచేయించినా కొంత మెట్టభూమిని కౌలుకిచ్చేవాడు. కౌలుదారులలో కొందరు సూర్యాపేట పరిసర గ్రామాలలో ఉండేవారు (ఉదా : దాసాయిగూడెం). ఆ గ్రామాల కౌలుదార్లు ఆంధ్రమహాసభ నాయకత్వాన కౌలుశిస్తులను పెంచటాన్ని కౌలుభూముల నుండి బేదఖలు చేయ టాన్ని వ్యతిరేకించారు. ఆంధ్రమహాసభ కార్యకర్తలే వారిని సంఘటితపరిచారు. దీనితో అతడు చిన్నభూస్వాములను కూడగట్టుకొని ప్రభుత్వంతో కుమ్మక్కైనాడు.

ఇదొక వర్గపోరాటం. కౌల్దార్లు భూస్వాములకు వ్యతిరేకంగా సాగించిన వర్గపోరాటం. సంప్రదింపుల ద్వారా పరిష్కారానికోసం అవకాశమే లేకుండా పోయింది. భూములనుంచి తొలగించకుండా ఉంటే కౌలుశిస్తుల్లో అవసరమైన సర్దుబాట్లు చేసుకోటానికి రైతులు సిద్ధంగా ఉన్నారని ఆంధ్రమహాసభ కార్యకర్తలు వారికొక సూచనచేశారు. కానీ భూస్వాముల ప్రతినిధులు దానిని పట్టించుకోలేదు. కేసులుపెట్టి ఉద్యమాన్ని అణచివేస్తే భూములనుంచి కౌలుదారీ రైతులను తరలించ వచ్చుననీ, అప్పుడు కౌలుశిస్తుల సమస్యరాదనీ వారి అంచనా. శిస్తులు పెంచినా రైతులు ప్రతిఘటించలేరని కూడా వారు భావించారు. భూస్వాములు అందరూ కుమ్మక్కై కేసులమీద కేంద్రీకరించారు. పరిష్కారానికి వారు సిద్ధపడలేదు. ఒక గ్రామంలో (అక్కలదేవి గూడెం) భూస్వామి కౌలుదారులిద్దరిని కోర్టుకీడిస్తే పార్టీ, ఆంధ్రమహాసభ కార్యకర్తల తోడ్పాటుతో వారే గెలిచారు. తమ భూము లను దక్కించుకున్నారు.

ఆంధ్రమహాసభలో పనిచేస్తున్న పార్టీ కార్యకర్తలు సూర్యాపేట స్థానిక ప్రజల్లో కూడా పనిచేశారు. అప్పుడు సూర్యాపేట సుమారు 10వేల జనాభాగల చిన్నపట్టణం. రెండోమూడో రైసుమిల్లుల్లో సుమారు 100 - 150 మంది కార్మికులు, మార్కెటులో మరో 50 మంది హమాలీలు పనిచేసేవారు. వీరందరిని కూలి సంఘాల్లో సంఘటిత పరిచారు. తక్కువ కూలీతో హెచ్చుపనిచేస్తూ కార్మికుల జీవితం దుర్భరంగా ఉండేది. కూలీరేట్లు పెంచాలని, పనిగంటలను తగ్గించాలని, వర్తకులు ఇండ్లల్లో కూలీలతో పనులు చేయించకూడదని కూలీలు తమ సంఘాలద్వారా కోరినారు. దేశముఖులతో మిలాఖతయిన కొందరు వర్తకులు ఈ కోరికలను అంగీకరించలేదు. వారు ఇతరులను కూడా తమవెనుక సమీకరించు కోటానికి ప్రయత్నించారు.

కూలీల సంఖ్య కొద్దిదే అయినా వారు పోరాట చరిత్రగలవారు. 1927-30 లో ప్రభుత్వ ప్రోత్సాహంతో హిందూ ముస్లిం కలహాలు చెలరేగి నప్పుడు వారు ముందుశ్రేణిలో నిలుచుని ప్రతిఘటించారు.

వర్తకులంతా వర్తకసంఘంలో సంఘటితపడి ఉండేవారు. (ఇప్పటికీ అదేవిధంగా ఉన్నారు). తెలంగాణాలో వర్తకులు స్థాపించుకున్న మొదటి వర్తక సంఘం ఇది. ఆంధ్రోద్యమానికి, ఆంధ్రమహాసభకూ తోడ్పడుతూ ఉండేదీ సంఘం. సంఘసభ్యులైన వర్తకులు కొందరు కూలీల కోర్కెలను ఒకమేరకైనా అంగీకరించడానికి సుముఖంగాఉన్నా, దేశముఖుబృందం ససేమిరా అన్నారు. దీనిఫలితంగా సమ్మె అనివార్యమయింది. సుమారు 20 రోజుల వరకు సమ్మె నడిచింది. ప్రభుత్వం పార్టీపైన తీవ్ర నిర్బంధవిధానాన్ని ప్రయోగించింది.

**కేసులు-వాటి పరిణామాలు :** ఒకవైపున కౌలుదారుల కోర్కెలను అంగీకరించని భూస్వాములు ప్రభుత్వానికి ఫిర్యాదుచేశారు. మరోవైపున వెట్టిచాకిరీ, లెవీధాన్యం సమస్యపై స్థానిక ఆంధ్రమహాసభ కార్యకర్తలు పోరాటవైఖరి అనుసరించటంతో ప్రభుత్వాన్ని కూలదోయటానికి ప్రయత్నం చేస్తున్నారని వారిపై (వారంతా కమ్యూనిస్టుపార్టీ సభ్యులు కూడా) ప్రభుత్వం కేసులు పెట్టింది. కౌలుదారులు భూమినుంచి తొలగిపోమని అన్నందుకు, కూలీలు సమ్మెచేసినందుకు కేసులు పెట్టలేదు. వాటికి సంబంధించిన ఉద్యమాన్ని, సమ్మెపోరాటాన్ని నడిపి నందుకు రాజద్రోహం, ప్రభుత్వాన్ని కూలదోయటం లాంటి ఆరోపణలతో వారిని అరెస్టుచేశారు. చాలారోజులు జైల్లో పెట్టారు. కేసుల విచారణ సాగింది. ఆంధ్ర మహాసభ అభిమానులు చేసిన సహాయంతోపాటు హైదరాబాదు లాయరు, జాతీయ వాది అయిన నాగులపల్లి కోదండరామారావు లీగల్ డిఫెన్సు సహాయం చేశారు. అయినా ఆరునెలలు శిక్ష అనుభవించవలసివచ్చింది. నిర్బంధానికి గురిఅయిన వారిలో డి. సుబ్బారావు, దేవులపల్లి రాఘవేంద్రరావు, సి. తిరుమలరావు, సి. యాదగిరిరావు మొదలైనవారున్నారు.

కేసులు రాజకీయపరమైనవి. భూస్వాములు, దేశముఖులు, ప్రభుత్వం కుమ్మక్కై పెట్టినవీ కేసులు ; అదే విధంగా నడిపించారు. పోలీసు తరఫున సాక్ష్యమిచ్చినారు. కార్యకర్తలు ప్రభుత్వాన్ని ఏ విధంగా స్తంభింపజేయటానికి ప్రయత్నం చేసిందీ. ప్రభుత్వాన్ని ఏ విధంగా కూలదోయటానికి పనిచేసిందీ చెప్పారు. వీరికి రహస్య నిర్మాణమొకటి ఉన్నదని, ఆనిర్మాణానికి నాయకత్వం

ఉన్నదని పోలీసులు తమ వాదనలో స్పష్టంచేశారు. కొన్నాళ్ళు కేసు నడిచిన తర్వాత శిక్షలు పడ్డాయి. శిక్షలనుభవించి కార్యకర్తలు బయటకు వచ్చారు.

కార్యకర్తల అరెస్టు సందర్భంలో జైల్లో ఈనాడు సర్వసామాన్యంగా కన్పించే హింసాకాండ ఆనాడు అంతగా లేకపోయినా కొంతకాలందాకా పార్టీ ఆంధ్ర మహాసభ కార్యకలాపాలు స్తంభించిపోయినవి. కార్యకర్తలు శిక్షాకాలాన్ని పూర్తి చేసుకొని జైలునుంచి బయటకు వచ్చిన తర్వాత తిరిగి కార్యకలాపాలు సాగినవి.

పోరాటాల్లో పాల్గొనటంవలన కార్యకర్తలు బాగా అనుభవాలను, అంతకు పూర్వం లేని అనుభవాలను సంపాదించగలిగినారు. నిర్బంధాలవలన గట్టిపడ్డారు. ప్రజా సమస్యలను ఇదివరకటికన్నా హెచ్చుగా ఆకళింపు చేసుకున్నారు.

పార్టీ ప్రజాయుద్ధ పంథాను అనుసరించి పనిచేయటం ప్రారంభించిన తర్వాతనే ప్రభుత్వం ఈ కేసులు నడిపింది కమ్యూనిస్టులు ప్రభుత్వంతో కుమ్మక్కైనారని కాంగ్రెసువాదులు చేసిన ప్రచారం నిరాధారమైనదని తేలి పోయింది. దీనితోపాటు పార్టీ ప్రజలకొరకు త్యాగం చేయగలిగినటువంటి సంస్థ అనే గుర్తింపు వచ్చి ప్రజలలో జాతీయశక్తులలో పార్టీ యొక్క ప్రతిష్టను, పలుకుబడిని ఇనుమడింపజేసింది.

పార్టీ నాయకత్వంలో ఈ పోరాటాల గురించి రెండభిప్రాయాలు కన్పించి నాయి. ఇవన్నీ వర్గపోరాటాలే. వీటిని నడిపించటమే సరియైనది. ప్రజాయుద్ధ పాలసీ అమలుజరుపుతున్నప్పటికీ ప్రజలు, ముఖ్యంగా కౌల్దారీ రైతులు పోరా టానికి ముందుకు వచ్చినప్పుడు దానిని నడుపటం అవసరం. కష్టజీవులు సిద్ధ మైనప్పుడు వెట్టిచాకిరీని ఆపివేయటం సరైనదే. గ్రామసంఘాలను బాగా నడిపించి, స్థానిక పటేలు పట్వారీల దేశముఖుల దోపిడీని వ్యతిరేకించటం సరియైనదే. సమస్యలను పరిష్కరించటంలో ఏవైనా పొరపాట్లు జరుగవచ్చును. అయినా ఈ విధానం సరియైనదని జిల్లాకమిటీ అభిప్రాయపడింది. కాని స్టేటు నాయకత్వం లోని కొందరు ఈ పోరాటాలను తొందరపాటుపనులన్నారు. ఇలాఅనటం అప్పటి నుంచే ప్రారంభమైందని చెప్పవచ్చు. ఎందుకంటే ఇతర ప్రాంతాల్లో ఇలాంటి పోరాటాలు అభివృద్ధికాలేదు. అధికారులతో భూస్వాములతో మాట్లాడి సమస్యలను పరిష్కరించాలనీ, పోరాటాలు నడుపటం తప్పు అనీ వారి అభిప్రాయం. జిల్లా కమిటీ "ప్రజాయుద్ధ" పాలసీకి విరుద్ధంగా నడుస్తున్నాయని భావించలేదు. నాయకత్వం కూడా అలా చెప్పలేదు. అవగాహన లోపించినా పోరాటాలు ప్రజా ఉద్యమానికి తోడ్పడినవి.

చిన్న భూస్వాములకు వ్యతిరేకంగా ఇలాంటి పోరాటాలు నడపాలా లేదా అనేది పరోక్షసమస్య. వారి అభిప్రాయమేమిటంటే—— చిన్న భూస్వాములను వదిలి పెట్టాలి. కౌల్దారీ సమస్యపైగాని, వెట్టిచాకిరి సమస్యపైగానీ, అక్రమ వసూళ్ళు మొదలైన సమస్యలపై కానీ వీరికి వ్యతిరేకంగా పోరాటం సాగించటం తప్పు; పెద్ద భూస్వాములకు వ్యతిరేకంగానే పోరాటం సాగించాలని వారి అభిప్రాయం. వారి ఈ అభిప్రాయం కూడా తప్పే. ప్రారంభంలో పార్టీ కార్యకర్తలు చిన్న భూస్వాములు ఉండే గ్రామాల్లో పనిచేసినప్పుడు అక్కడి రైతులకు వెట్టిచాకిరీ చేసేవారికి ఉండే సమస్యలే ముందుకువస్తాయి; వేరే సమస్యలు ముందుకురావు. కార్యకర్తలు కూడా ఈ సమస్యలనే తీసుకొని పనిచేస్తారు. ముందుకొచ్చిన సమస్యలను వదిలివేయటం సాధ్యంకాదు. రెండవది : తొలిరోజుల్లో కార్యకర్తలు సమస్యలన్నీ సంప్రదింపుల ద్వారానే పరిష్కరించారు. భూస్వాములు రాజీ పరిష్కారాలకు అంగీకరించనప్పుడు ప్రజలు పోరాటాలు సాగించవలసివచ్చింది. మూడవది : పెద్ద భూస్వాములు ఉమ్మడిసమస్యల నాధారంచేసుకొని చిన్న భూస్వాములను కూడగట్టినారు. కొన్ని సందర్భాలలో వీళ్ళను ముందుకుపెట్టి, తమ భూములను కొల్లగొట్టపరం చేయటానికి ప్రయత్నిస్తున్నారనీ, తమకు మరో ఆధారం లేదనీ, పేరుకు భూస్వాములే కాని సంపన్నులుకాదనీ, అలాంటివారిపై పోరాటాలు నడుపుతున్నారనీ ఆంధ్రమహాసభ కార్యకర్తలపై దుష్ప్రచారం చేయటానికి భూస్వాములు ఇలాంటి ఎత్తుగడలను అనుసరించారేకాని పెద్ద భూస్వాములను ఆరోజుల్లో ముట్టుకోలేదనటం అబద్ధం. ఆనాటికే పెద్దభూస్వాము లకు వ్యతిరేకంగా పోరాటం ప్రారంభమైంది. అయితే హెచ్చుగ్రామాల్లోమాత్రం అలా సాగలేదు చిన్నభూస్వాములకు వ్యతిరేకంగా ఒకమేరకు మాత్రమే ఉద్యమాన్ని నిర్మించారు. ఏదోవిధంగా పార్టీతో, సంఘంతో రాజీకొస్తేనే ఉపయోగంగా ఉంటుందని చిన్నభూస్వాములు భావిస్తే సంప్రదింపుల ద్వారా సమస్యల పరిష్కారమనే ఎత్తుగడ ఉపయోగపడుతుందేకాని మరోవిధంగా కాదు. నాల్గవది : అప్పటి పార్టీ కార్యకర్తలకు, స్థానిక ఆంధ్రమహాసభ నాయకత్వానికి ఉన్న అనుభవం పరిమితమైనది. చిన్న భూస్వాములకు, పెద్ద భూస్వాములకు మధ్యనున్న విభేదాలను ఉపయోగించుకొని చిన్నభూస్వాములను తటస్థంచేయగల రాజకీయ స్తోమత తక్కువ. అయినా రాజీకొరకు జిల్లాకమిటీ కొన్ని సూచనలు (offers) కూడా చేసింది. అయినా ఫలితం కలుగలేదు.

ఈ కాలంలో ఆహార సమస్య తీవ్రమైంది. యుద్ధం పేరుతో ప్రభుత్వం ఆహార ధాన్యాల ధరలను కంట్రోలు చేసింది. రేషనింగు ఏర్పాటుచేసింది. ధరల కంట్రోలువలన చీకటిబజారు (Black Market) పెరిగిపోయింది. రేషనింగువలన సామాన్య ప్రజలకు ఆహార ధాన్యాలు, ఇతర జీవితావసర వస్తువులు దుర్లభ మైనవి. ఇదేవిధంగా గ్రామీణ ప్రాంతాల్లో ప్రభుత్వం వ్యవసాయదారులనుంచి లెవీ ధాన్యం వసూలు చేయసాగింది. పేరుకు వ్యవసాయదారులే అయినా భార మంతా కష్టజీవులైన సాధారణ రైతులమీదనే వేసింది. దేశముఖులు, పటేలుపట్వా రీలు నాలుగింట మూడువంతుల భూమిపై యజమానులైవుంటూ, హెచ్చుభాగాన్ని "స్వంతసాగు" చేసేవారు. ధాన్యాన్ని ఎగగొట్టేవారు. వారికి మిగులుధాన్యమున్నా వారినుంచి మిగులు ధాన్యం వసూలుచేయలేకపోయేది. మిగులు ధాన్యంలేని కష్ట జీవులైన రైతులనుంచి నిర్బంధంగా వసూలు చేసేవారు. ప్రభుత్వపు ఈ చర్య రైతులకు దుర్భరంగా ఉండేది.

ఆంధ్ర మహాసభలోనూ విడిగానూ పనిచేస్తున్న కమ్యూనిస్టులు ఈ సమస్యను తీసుకొని పనిచేయసాగారు.

ఈ కాలంలో ఆంధ్ర మహాసభ నిర్మాణం ఒక క్రమపద్ధతిననుసరించి అభివృద్ధి చేయటానికి కృషి జరిగింది. తెలంగాణాకు ఒక కేంద్ర సంఘం ఉండేది. మహాసభలో ఎన్నుకున్న స్థాయీ సంఘం, కార్యవర్గం, అధ్యక్షులనే వారు ఉండేవారు. జిల్లా సంఘాల్లో ఉండే లాయర్లు అధ్యక్ష కార్యదర్శులుగా ఉండేవారు. తాలూకా కేంద్రాలనుంచి ఒక్కరో ఇద్దరో పరిస్థితులనుబట్టి జిల్లా సంఘాల్లో ఉండేవారు. అదేవిధంగా తాలూకా సంఘాల్లోకూడా తాలూకా కేంద్రాల్లో ఉన్న వకీళ్ళు, పెద్ద వర్తకులు, గ్రామాల్లో ఉండే పెద్ద భూస్వాములు కొందరు ఉండేవారు. సాధారణంగా అధ్యక్షులు పర్యటనకు వచ్చినప్పుడు లేక మహాసభకు వెళ్ళి తిరిగివచ్చిన తర్వాత మొదటి ఉత్సాహంతో అలాంటి కమిటీలు ఏర్పాటు చేసేవారు. ఎప్పుడో మహాసభలకు పూర్వం సమావేశంకావటమేగాని ఈ కమిటీలు పనిచేయకపోయేవి. రికార్డుమాత్రం ఉండేది. మినిట్స్, తీర్మానాలు రాసేవారు. ఉత్తర ప్రత్యుత్తరాలు సక్రమంగా ఉండేవి.

కమ్యూనిస్టు కార్యకర్తలు పనిచేయటం ప్రారంభించిన తర్వాత గ్రామాల్లో ప్రచారం సాగింది. గ్రామ సంఘాలు ఏర్పాటు అయినవి. 4 అణాల సభ్యత్వ రుసుం వసూలుచేసి సభ్యులను చేర్పించారు. సభ్యుల సమావేశంలో గ్రామకమిటీని ఎన్నుకునేవారు. ఈ విధంగా ఏర్పడిన గ్రామ కమిటీలను గ్రామ సంఘాలని

పిలిచేవారు. గ్రామ కమిటీలు ఏమి చేయాలి ? వాటి బాధ్యతలేమిటి? సామాన్యంగా గ్రామ సంఘాల్లో ఉండేవారిపై సంఘపు పనులు ఆధారపడి ఉండటం సహజం. పటేలు పట్వారీలు ప్రభుత్వ ఉద్యోగస్థులయినందున వీటిలో ఉండకపోయేవారు. దేశముఖులు కూడా ఉండకపోయేవారు. ఊళ్ళో వుండే పటేలు పట్వారీలకను కూలురు వీటిలో ఉండేవారు. అదే విధంగా వడ్డీ వ్యాపారం, ధాన్యాన్ని నాగుల కివ్వటం ఇలాంటి పనులు చేసేవారు వీటిలో ఉండేవారు. తమతో వీరికుండే నిత్య సంబంధాలవలన, తాము వీరిపై ఆర్థికంగా ఆధారపడి ఉన్నందువలన సహజంగా ప్రజలు వీరిని గ్రామ సంఘాల్లో ఉండాలని కోరేవారు. వీరు అధ్యక్షులుగానో మరో బాధ్యతగల స్థానంలోనో ఉండేవారు. ఈ విధంగా ఏర్పడిన గ్రామ సంఘాలు చేసే పనులలో ఒకటి : గ్రామాలలో ఉండే ఏ తగవులైనాగాని, అంటే రైతులమధ్య లేక కూలీలు రైతుల మధ్య —వర్గ స్వభావమేమీ ఉండదు కానీ— పరస్పరం ఉండే తగాదాలు లేక స్థలంకొరకు, భూమిలో భాగం పంచు కోటానికి లేక ఇలాంటి చిల్లర తగాదాలు, భార్యాభర్తల తగవులతోసహా అన్నీ— అప్పటివరకు పటేలు పట్వారీలు, దేశముఖులదగ్గరికి తీర్పుకోసం వెళ్ళే తగాదా లన్నీ— గ్రామ సంఘాలు తీర్చటానికి ప్రయత్నం చేసేవి. గ్రామ సంఘ నాయకులకు కార్యకర్తలు అవసరమైన సూచనలు చేసేవారు. ఐక్యంగా ఉండాలనీ, వ్యయప్రయాసలు లేకనే తగవులు పరిష్కరించుకోవాలనీ కార్యకర్తలు ప్రజలకు విజ్ఞప్తి చేసేవారు. ఈ విధంగా తగాదాలు పరిష్కారం కావటంవలన పటేలు పట్వారీలకు రావలసిన ఆదాయం తగ్గిపోయేది. ఈ చర్య వారికి కోపకారణ మైనది. దీనితోపాటు పోలీసులకు కేసులద్వారా రావలసిన లంచాలు కూడా ఆగి పోయి పోలీసువారికి కోపకారణమైనది.

రెండవది : ఆంధ్ర మహాసభ ద్వారా సాధారణరైతులకు కొంత సహాయం చేయాలని ఏడవ మహాసభ కాలంలోనే (మల్కాపురంలో) నిర్ణయం చేశారు. ఒక మేరకు అమలుజరిపినారు కూడా. పన్నులు విధించే సందర్భంలో, వసూలుచేయ టంలో జరిగే అక్రమాల సందర్భంలో రైతులకు సహాయం అందించటానికి కొంత కృషి జరిగింది. గ్రామ సంఘాలు ఏర్పడి పనిచేయటంతో ఈ కృషి హెచ్చుగా సాగింది. దీని ఫలితంగా పటేలు పట్వారీలకు ప్రభుత్వపు అక్రమ పన్నులవలన వచ్చే ఆదాయం కొంత దెబ్బతిన్నది.

మూడవది : పట్వారీలు "ఖర్చుల" పేరుతో వసూలుచేసేవారు. ఈ కరణాలు రూపాయికి రెండణాల (12 పైసాల) చొప్పున వసూలుచేసేవారు. కొందరు హెచ్చుగానే వసూలుచేసేవారు. ఉదా॥కి 8 రూపాయల శిస్తు ఉన్నట్ట యితే రైతు 9 రూపాయలు చెల్లించవలసివచ్చేది. కార్యకర్తల కృషి ఫలితంగా "ఖర్చుల" ద్వారా పట్వారీలకు వచ్చే ఆదాయం తగ్గిపోయింది.

గ్రామ సంఘాలద్వారా ఈ మూడు పనులు నెరవేరటంతో సంఘాల పలుకుబడి వ్యాపించింది. సంఘాలకు అధికారాలు లేకున్నా స్థానిక పోలీసు రెవిన్యూ అధికారులు వీటిని పోటీ ప్రభుత్వాలనే భావించారు. ప్రజలుకూడా వారి అధికారాన్ని కాదనటానికి గ్రామ సంఘాలను ఒక సాధనంగా ఉపయోగించారు. దేశముఖులు, పటేలు పట్వారీలు ప్రభుత్వానికి మారుగా గ్రామాల్లో పనిచేస్తూ వారిమాటే చట్టమై చెల్లుబడి అవుతున్నప్పుడు, వారి అధికారాన్ని కాదనే ఏ శక్తి నైనా వారు గ్రామ స్థాయిలో పోటీ ప్రభుత్వమని భావించటం అసాధారణమేమీ కాదు.

**మిత్రమండలి :** ఇదేసమయంలో భువనగిరిలో మిత్రమండలి అను ఒక సంస్థ ఏర్పడింది. దీనికోసం చొరవతీసుకున్నది, నాయకత్వం వహించినది కమ్యూ నిస్టులు (ఆరుట్ల లక్ష్మీనరసింహారెడ్డి). భువనగిరి నల్లగొండ జిల్లాలో అన్నిటి కన్నా పెద్ద వర్తకకేంద్రం. బియ్యం, జొన్నలు వంటి ఆహారధాన్యాలే కాక ఆముదము కూడా ఇక్కడినుంచి ఎగుమతి అయ్యేది. సుమారు 60 ఆముదపు గానుగలు పనిచేస్తూ ఉండేవి. వర్తకుల్లో యువకులు తగినంతమంది ఉండేవారు. అధికారులు పెట్టే బాధలు సహించలేక సంఘటితపడి ఎదిరించాలని నిర్ణయించుకొని నాయకత్వం వహించమని కమ్యూనిస్టులను కోరినారు. ఆంధ్రమహాసభ ద్వారా ఈ పని నెరవేరటానికి అవకాశమున్నప్పటికీ వారు తమకొక క్రొత్తసంస్థ కావాలని కోరినందువలన ఈ సంస్థను స్థాపించవలసి వచ్చింది. అప్పటికి ఆంధ్రమహాసభ తాలూకా కమిటీ కూడా ఏర్పడింది. కానీ అన్నిటి మాదిరిగా ఇది కూడా నిస్తబ్దంగా ఉండిపోయింది.

మిత్రమండలిలో స్థానిక పెద్దలు, యువకులు పెద్దసంఖ్యలో చేరినారు. వీరిలో షావుకార్లు, ఇతర మధ్యతరగతివారు కూడా ఉన్నారు. దీనితో ఇది వర్గవిభేదాలు లేకుండా చేరినవారందరి సంస్థగా రూపొందినది. దీని తరఫున ఒక గ్రంథాలయాన్ని ఏర్పరచి పత్రికలు తెప్పించి యువకులందరినీ ప్రతిరోజూ

ఆ గ్రంథాలయానికి వచ్చే విధంగా సమీకరించినారు. గ్రంథాలయంలో ప్రతివారం, ప్రతినెలా సమావేశాలు జరుగుతూ రాజకీయ కార్యకలాపాలకు కేంద్రమైనది. యువకులలో పార్టీయెడ అభిమానం కూడా పెరిగింది. షావుకార్లైనప్పటికీ వారిలో హెచ్చుమంది పార్టీయెడ వ్యతిరేకతకు మారుగా అనుకూలతనే ప్రదర్శించారు. అధికారులవల్ల వర్తకులకు కలిగిన ఇబ్బందులను పోగొట్టడానికి కృషిచేయటం, వర్తకులకు వ్యతిరేకంగా కూలీలను సంఘటితపరిచి, వారి సమస్యల పరిష్కారానికి కృషిచేయకపోవటం, వారి బిడ్డలైన యువకులను జాతీయ భావాలను కలిగించే రాజకీయాల్లోకి ఆకర్షించటం వలన ఈ అభిమానం ఏర్పడిందని మనం చెప్ప వచ్చును. రావి నారాయణరెడ్డి గ్రామం భువనగిరికి సమీపాన ఉండటం వలన వారికి, వర్తకులకు ఏదోమేరకు సంబంధాలు ఉంటూ వచ్చినవి. ఈ విధంగా ఈ కమ్యూనిస్టు నాయకులను వర్తకులు "మంచి కమ్యూనిస్టు"లని భావించేవారు. దీని అర్థం వర్గపోరాటాలకు నాయకత్వం వహించిన కమ్యూనిస్టులు పీరి దృష్టిలో చెడ్డ కమ్యూనిస్టులు.

మితవాదులు స్వయంగా పనిచేయకున్నా ఒక గాంధీవాదిని కార్యకర్తగా నియమించారు. ఆయన నల్లగొండ తాలూకాలోని చెరుకుపల్లి ప్రాంతంలో పని చేశాడు. ఆయన పేరు జి. యస్. గుప్త. ఆదిలాబాద్ నివాసి. చెరుకుపల్లి ఒక పెద్ద దేశముఖు ముఖ్యకేంద్రం (Head quarters). ఆయన గ్రామాలు చెరుకుపల్లి ప్రాంతంలోనేగాక దానికి ఆనుకొనిఉన్న మిర్యాలగూడెం తాలూకాలో కూడా ఉండేవి. ఈ గ్రామాల్లో పాలేర్లతో "స్వంతసాగు" చేయించాడు. పెద్ద భూస్వామి. ఈయన ప్రజలపై అక్రమాలు సాగించటానికి తన సమకాలీనుల కెవరికీ తీసిపోడు.

జి. యస్. గుప్తాగారు ఈయన అక్రమాలకు వ్యతిరేకంగా సత్యాగ్రహం చేస్తూ ఆందోళన సాగించాడు. అయినా దేశముఖు తన కిరాయి మనుషులతో ఇతన్ని కొట్టించాడు.

ఈ కార్యకర్త గ్రామ సంఘాలను ఏర్పరిచాడు. మిర్యాలగూడెం తాలూకా లోని పాములపాడు అనే గ్రామంలో రసూల్ సాహెబు అను ముస్లిం భూస్వామి మహాసభలో చేరి గ్రామ సంఘానికి అధ్యక్షుడైనాడు.

చెరుకుపల్లికి సమీపాన చందుపట్ల అను పెద్ద గ్రామమున్నది. అక్కడ

ఉండేది మరొక దేశముఖు. అక్కడ ఒక గ్రామ సంఘమేర్పాటు చేశాడు.

గ్రామ సంఘాలు ఏర్పాటుచేసిన తర్వాత వెట్టిచాకిరి అక్రమవసూళ్ళు ఒకమేరకు తగ్గిపోయాయి. కాని గ్రామ సంఘ నాయకులతో దేశముఖు పైరవీ నడిపించాడు. జిల్లా, తాలూకా నాయకుల్లో వకీళ్ళు ముఖ్యులు కావటంతో ఈ నాయకులే ఇరుపక్షాల తరఫున వకీళ్ళయినారు. కేసుల్లో బాగా డబ్బు సంపాదించారు. ఒకవైపున దేశముఖుతో రైతులు పోరాడుతూ ఉన్నప్పుడు మరో వైపున ఆంధ్రమహాసభ నాయకులు దేశముఖుతో భాయీభాయీలై తిరిగిన తీరు తెన్నులు ఈ సంఘటనలో తెలుస్తుంది. మాదిరాజువారు తన అధ్యక్ష పర్యటన సందర్భంలో చెరుకుపల్లి దేశముఖు జరిపిన సన్మానం గురించి ఇలా రాసుకున్నాడు:

"మొదట చందుపట్లవెళ్ళి మధ్యాహ్నమువరకు ఉంటిమి. అచ్చట ఒక గ్రామసంఘముండెను. స్థానిక ప్రజలు కార్యకర్తలతో సమావేశము జరిపి సాయంత్రం నాలుగు గంటలకు చెరుకుపల్లి సమీపమునను చేరితిమి. అచ్చట ఒక గ్రామసంఘముండెను. దేశముఖు గద్దం నరసింహారెడ్డిగారు నాకు మిత్రులు. ఉద్యమాభిమాని ఆయన కుమారుడు నారాయణగారు 9 జతల యెడ్లు కట్టిన బండిని తెచ్చిరి. వారివెంట నూరుమంది ప్రజలుండిరి. ఒక పోలీసు ఇన్‌స్పెక్టరు కూడా వచ్చి వారిని కొంత బెదిరించెను. దానిపైన నారాయణరెడ్డిగారు మోటారు వద్దకు వచ్చి ఊరేగింపు చేయవద్దని పోలీసువారంటున్నారు అని రంగారావుతో చెప్పెను. తుదకు మేము మోటారులోనే ఉండునట్లును, 9 జతల యెడ్లుగల శకటము ముందుండునట్లును, వాయిద్యములు లేకుండా ప్రజలవెంట నడుచుచు తీసుకొని వెళ్ళునట్లు ఏర్పాటుచేసిరి. అలాగే మేము వెళ్ళి ఆ రాత్రి చెరుకుపల్లిలో నుంటిమి. దేవాలయావరణలో సభ జరిగెను. శ్రీ రంగారావుగారు, నేను ఉపన్యాస మిచ్చితిమి. ఇన్‌స్పెక్టరు కూడా అచ్చటనే ఉండెను. చెరుకుపల్లి నుండి 7వ తేదీ ఉదయమున సూర్యాపేట వచ్చితిమి." (స్వీయచరిత్ర, పేజి-387)

ఈ పర్యటననాటికి దేశముఖుకు వ్యతిరేకంగా పోరాటం ప్రారంభమైంది. అయినా రైతుల కోర్కెలను, వారి దేశముఖు వ్యతిరేకతను లెక్కచేయకుండా దేశముఖులతో మితవాద నాయకులు ఏ విధంగా సన్మానాలు పొందినదీ దీనివలన స్పష్టమవుతున్నది. పోలీసులు జోక్యం కల్గించుకోవడం, నాయకులు, వారు రాజీకి వచ్చి సర్దుకోవటం మామూలు ఫక్కీలోనే సాగిపోయింది. పోరాటం ప్రారంభించిన రైతులు ఈ ఊరేగింపులో పాల్గొన్నదీ లేనిదీ వారు స్పష్టంచేయలేదు. వర్గ

సామరస్య ధోరణి కలిగిన ఆ కార్యకర్త జిల్లా నాయకుల ఆదేశానుసారం రైతులను సమీకరించి ఉంటాడు. ఆ కారణాననే అధ్యక్షుడు దేశముఖు, రైతుల మధ్య ఉన్న సంఘర్షణను గూర్చి ఎక్కడా చెప్పలేదు. ఆ కాలంలో ఇక్కడి దేశముఖును జిల్లాలోని పెద్ద దేశముఖుల్లో ఒకరిగా పరిగణించేవారు.

చెరుకుపల్లి ప్రాంతపు ఉద్యమ నాయకత్వంలో కొన్ని ప్రమాదకర బలహీనతలు ఆ రోజుల్లోనే పొడసూపినవి. తాలూకా, జిల్లా ఆంధ్ర మహాసభ నాయకులు గ్రామానికివస్తే వారికి అవసరమైన పనులు, ఏర్పాట్లకు వెట్టిచాకిరీ విధానాన్ని కొనసాగించారు. ఉదా : నాయకులకు చాకలివారు బట్టలుతకాలి. ఇతర వృత్తులవారు తమతమ పనులు చేయాలి. ఈ విధంగా చేయాలని గ్రామ సంఘం తీర్మానించింది. సంఘ అధ్యక్షుని పర్యవేక్షణలో ఈ తీర్మానం అమలు జరిగేది. ఈ విధంగా దేశముఖు వెట్టి స్థానంలో సంఘం వెట్టి తయారైంది. దేశ ముఖు వెట్టి సంవత్సరంలోని మున్నూట అరవై రోజులూ సాగేది ; సంఘనాయకుల వెట్టి వారు వచ్చినప్పుడు సాగేది. రెండింటిమధ్య ఈమాత్రం భేదం ఉండేది.

ఇదేవిధంగా తాలూకా జిల్లా కేంద్రంలోని నాయకులైన వకీళ్ళు ఈ గ్రామం నుంచీ, ఇతర గ్రామాలనుంచీ చొప్ప మొదలగు వస్తువులను తెప్పించుకునేవారు. గ్రామ సంఘ నాయకులద్వారా ఈ ఏర్పాట్లు జరిగేవి. వారు రైతులనుంచి నిర్బంధంగా వసూలుచేసి పంపేవారు. ఈ విధంగా తెప్పించిన వస్తువులన్నీ నాయ కులు రికార్డులలో రాసిపెట్టారు ; వారు దీనిని నేరమని భావించలేదని స్పష్ట మవుతుంది.

గ్రామాలకు వెళ్ళే ఆంధ్రమహాసభ నాయకులలో కొందరు తమపనులు తాము చేసుకోటానికి అలవాటుపడినవారే. వారికి ఈ పనుల అవసరమేమీ ఉండదు. కానీ వకీళ్ళలాంటి పెద్దలు, ఫ్యూడల్ సాంప్రదాయాలకు అలవాటుపడిన వారికి "సంఘం వెట్టి" అవసరమైనది. సంఘ నాయకులు కూడా దొరలతో పోటీపడి తాముకూడా దొరలతో సమానమని ప్రదర్శించుకోటానికి ఈ తప్పుడు మార్గాన్ని అనుసరించి ఉంటారు. ఈ గ్రామాలు కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన్ని అంగీక రించిన తర్వాత "సంఘం వెట్టి" రద్దయినది. జి.యస్. గుప్త గాంధీవాది అయినా కమ్యూనిస్టులతో కలిసి పనిచేశాడు. జిల్లాలోని మితవాదులు ఆయనను ఎంతో ఒత్తిడి చేసినా లెక్కచేయలేదు.

ఈ ప్రాంతంలో సాగింది ఫ్యూడల్ వ్యతిరేక పోరాటమే అయినా సంస్కరణ వాద నాయకత్వాన సాగటంవలన ప్రజలు వెట్టిచాకిరీని నిర్మూలించలేకపోయారు. నాయకత్వంలో పెత్తందారులు చేరటం, రైతాంగంలో ఫ్యూడల్ సాంప్రదాయాలు బలంగా నాటుకొని ఉండటం వలన "సంఘం వెట్టి"ని ఎవరూ వ్యతిరేకించలేదు. తుదకు నల్లగొండకు వెట్టిచొప్పను పంపించటం తప్పని గ్రామ నాయకులు భావించలేదు. తెప్పించటం తప్పని జిల్లా కేంద్రంలో ఉన్న నాయకులు భావించలేదు. అంతా సవ్యంగా పరస్పర అంగీకారంతో సాగిపోయింది.

ఆంధ్రమహాసభ అధ్యక్షుడు మితవాది అయినా వివిధ జిల్లాల్లో పర్యటన చేశాడు. అక్కడి మితవాద నాయకులను కలుసుకున్నాడు. కాని ఎక్కడా కార్యకర్తల సమావేశం జరిపినట్లు, స్థానిక సమస్యలను చర్చించినట్లు కన్పించలేదు. కమ్యూనిస్టులు పనిచేస్తున్న ప్రాంతాల్లో కూడా పర్యటించినట్లు తన స్వీయచరిత్రలో రాశారు. వారు నినాదాలిచ్చేవారనీ, తమను మితవాదుల మాదిరిగా గౌరవించలేదనీ రాసుకున్నాడు. కమ్యూనిస్టులు ప్రజలను సమీకరిస్తారు. నినాదాలతో, సంఘటితబలంతో వారి చైతన్యాన్ని అభివృద్ధిపరుస్తారు. ఇది ఆంధ్రమహాసభ మితవాదులకు కొత్తవిషయం. దీనినర్థం చేసుకోలేక కమ్యూనిస్టు వ్యతిరేకతతో వారియెడ ప్రజల్లో దురభిప్రాయం కలిగించటం మామూలుగా సాగిపోయింది.

వరంగల్లు జిల్లాలో కమ్యూనిస్టులు ఆంధ్రమహాసభలో చేరి ముఖ్య బాధ్యతలను నిర్వహిస్తూ కాంగ్రెసువాదులతో కలిసి పనిచేసేవారు. కమ్యూనిస్టులు సామాన్య ప్రజల్లో పనిచేస్తే తక్కినవారు ఉన్నతవర్గాలతో కలిసిమెలిసి ఉండేవారు. అధ్యక్షుని హోదాలో పర్యటించిన మాదిరాజు రామకోటేశ్వరరావు తన అనుభవాలను ఉదహరిస్తూ, "వెంకట్రామారావుగారు గృహస్థు మర్యాదగా చేసిన విందు చూసి ధనవంతుడయ్యెను రామనాథంగారిట్లనిరి. 'మీరెక్కడికి వెళ్ళినను ధనవంతులవద్ద ఉండటము, వారు మీకు జమీందారీ, బూర్జువావర్ధతులతో విందులు చేయుటయు జరుగుతవి. మేము బీద చాకలింట బసచేసి, బీద కుమ్మరింట తిని రావలసి వస్తుంది.' ఈ మాటలు వారికభ్యాసములేగనుక జవాబు చెప్పక ఊరకుంటిమి", అని రాశారు.

పేదలకోసం పనిచేస్తూ వారితో కలిసిమెలిసి ఉండటమే కమ్యూనిస్టుల విధానం. దాని కనుగుణంగా 'బీదకుమ్మరింట తినివస్తామని' అని ఉంటారు

రామనాథంగారు. ఈవిధంగా అనటం వారికభ్యాసమని సాచివేయటానికి ప్రయత్నించారు మాదిరాజువారు. కానీ సంస్థలో అప్పటికే ఏర్పడిన విభజనను ఈ సంఘటన సూచిస్తున్నది. ఒకవైపున భూస్వాముల, సంపన్నుల పక్షాన చేరిన మితవాదులు, మరొకవైపున సామాన్యప్రజల పక్షానఉన్న కమ్యూనిస్టులు. దీనిని అంగీకరించటానికి సిద్ధంగాలేని మితవాదనాయకుడు చెప్పే సమాధానమేముంటుంది? అధ్యక్షుని పర్యటన వివరాలన్నీ వారికీ భూస్వాములకూ, సంపన్నులకూ ఉన్న మిలాఖతునే స్పష్టంచేస్తుంది. ఈ వివరాలు ఆయన స్వీయచరిత్రలో ఉన్నాయి.

అప్పటి వరంగల్లు జిల్లా ఆంధ్రమహాసభ అధ్యక్షుడు జమలాపురం కేశవరావుగారు కాంగ్రెసువాది. కార్యదర్శి సర్వదేవభట్ల రామనాథంగారు కమ్యూనిస్టు. జిల్లాలో ఈ రెండు రాజకీయ దృక్పథాలుకలవారు తమలోతమకు ఎన్ని రాజకీయ భేదాభిప్రాయాలున్నా కలిసిపనిచేశారు. తర్వాతకాలంలో క్రమంగా విడిపోయినారు.

## 3. నేటి హైదరాబాదు - మన కర్తవ్యం

అదే కాలంలో కొత్త పాలసీని వివరిస్తూ "నేటి హైదరాబాదు - మన కర్తవ్యం" అనే పుస్తకాన్ని దేవులపల్లి వెంకటేశ్వర రావు, బద్దం ఎల్లారెడ్డిగార్ల పేర్లతో రాష్ట్రకమిటీ ప్రచురించింది. ఆ పుస్తకం రాష్ట్ర కమిటీ తరఫున ఒకరు రాసిందేకాని ఈ రచయితలురాసినదికాదు. ఆనాటి ప్రత్యేక రాజకీయ కారణాలవలన, అంటే ఆనాటి ప్రభుత్వం బయటివారు రచయితలుగా ఉన్నపుస్తకాలను నిషేధించే అవకాశం ఎక్కువగా ఉన్నందున నిజమైన రచయితకుబదులు సంస్థాన నివాసుల పేర్లను చేర్చారు. సురవరం ప్రతాపరెడ్డిగారు గోలకొండ పత్రికలో దానిని సమీక్షిస్తూ కొన్ని భాగాలను తీసి చూపెట్టి, పై రచయితలు రాసిన పుస్తకం కాదనీ, సర్కారు జిల్లాలవారు రాసిందనీ విమర్శించారు. పార్టీయెడ ఆయనకున్న వ్యతిరేకతతో పార్టీని కించపరచటానికి ఆయన ఈ పనిచేసినప్పటికీ, విమర్శ సరియైనదే. 'నేటి హైదరాబాదు-మన కర్తవ్యాలు' అనే పుస్తకంలో వివరించిన ముఖ్యాంశాలు ఇవి :

సంస్థానంలో ఉన్న ఫ్యూడల్ పరిపాలనా యంత్రం జాగీర్లు, దేశముఖులు, దోపిడీ విధానం పీటికి సంబంధించిన భాగం. 1941-42 నాటికి ఉన్న రాజకీయ

పరిణామాలు ; అప్పటివరకు అమలుజరిపిన సంస్కరణలు, మార్పులు; అయ్యంగార్ కమిటీ సిఫార్సులు, వాటి పరిశీలన— ఈ అంశాల వివరణ ఉంది. ఇత్తెహాదుల్ ముసల్మీన్‌పై విమర్శలను తగ్గించి ఆ సంస్థలో ప్రజాతంత్ర లక్షణాలు ఉన్నవని, ప్రజాతంత్ర శక్తులు క్రమంగా అభివృద్ధి పొందుతున్నాయనీ, ముస్లిం ప్రజలలో ప్రజాతంత్ర భావాలు వృద్ధి పొందుతున్నాయనీ, వాటిని గమనించాలని చెప్పటానికి ఆ భాగాన్ని వివరంగా రాశారు. హిందూ-ముస్లిం ఐక్యత అవసరమనీ, ఇరుపక్షాల్లో ఉన్న ప్రజాతంత్ర శక్తులన్నీ ఐక్యం అవటానికి అవకాశముందనీ చెప్పారు. యుద్ధంలో ఫాసిజాన్ని ఓడించటానికి హిందూ ముస్లిం ఐక్యత అవసరముందనీ, అది రాజకీయ స్థాయిలోకూడా అవసరమనీ చెపుతూ, సంస్థానంలో అప్పుడున్న ప్రభుత్వం స్థానే ఇత్తెహాదుల్ ముసల్మీన్ ప్రతినిధులు, ఆంధ్ర మహాసభ, మహారాష్ట్ర, కర్ణాటక పరిషత్తు ప్రతినిధులతో ప్రభుత్వం ఏర్పడాలనీ, దానిలో ఇత్తెహాదుల్ ముసల్మీన్ వారికి సగం స్థానాలు, ఈ మూడు సంస్థలవారికి సగం స్థానాలు ఉన్న ఒక ప్రభుత్వం ఏర్పాటు చేయాలనీ చెప్పారు. ఇది ఆనాటి పార్టీ ప్రధానమైన రాజకీయ నినాదం. దీనిని పార్టీ 1943నుంచి 1945వరకు ప్రచారం చేసింది. ధర్మవరం మహాసభలో తీర్మానరూపంలో వచ్చినప్పుడు కాంగ్రెసువాదులు దీనిని వ్యతిరేకించినారు. ఈ విధానంలో కొన్ని మౌలికమైన తప్పులున్నాయి. ఆనాటి ముస్లిం ప్రజలలో ప్రజాతంత్ర శక్తులనేవి ఉన్నవి. రైతులు, కూలీలు ఆ శక్తుల్లో ఒక భాగం. మధ్యతరగతివారిలో వ్యక్తులుగా మాత్రమే ఉండిపోయినారు. కానీ వారిలో అలాంటి చైతన్యం స్వల్పంగానే ఉండినది. అంతమాత్రాన ఇత్తెహాదుల్ ముసల్మీన్ సంస్థలో ప్రజాతంత్ర శక్తులున్నాయని సంస్థ నాయకత్వం ప్రజాతంత్రయుతమైనదని అనటం తప్పు. నిజాం రాజరికాన్ని కాపాడటమే సంస్థ లక్ష్యం. మైనారిటీలో ఉన్న ముస్లింలకు మెజారిటీ ముస్లిమేతరులకన్నా ప్రాబల్యం ఉండాలని నొక్కి చెప్పింది. నిజమైన ప్రజాస్వామికవాది దేశంలో ప్రజాస్వామ్యం ఏర్పడాలంటే స్వదేశ సంస్థానాలు రద్దు కావాలని కోరుతాడు. ఈ కారణాన నిజాం సంస్థానం రద్దు కావాలని కోరటం కనీస ప్రజాస్వామిక కర్తవ్యమవుతుంది. దీనికి విరుద్ధంగా నిజాం రాజరికాన్ని కాపాడే లక్ష్యంతో 'ఇత్తెహాదుల్ ముసల్మీన్' అనే సంస్థలో ముస్లింలందరినీ ఐక్యంచేయటం ప్రజాతంత్ర విరుద్ధమైనది. ఈ కారణాన దీని పునాదే ప్రజాతంత్ర విరుద్ధమైనది. ఈ పునాదిగల సంస్థను ప్రజాస్వామిక శక్తిగా అభి

వర్ణించి దానిలో ప్రజాస్వామిక శక్తులు బలపడుతున్నాయనటం తీవ్రమైనతప్పు. ముస్లిం ప్రజలు ట్రేడు యూనియన్, రైతు సంఘాలలో చేరి తమ హక్కుల కోసం పోరాడుతున్నప్పుడు, అలాంటిది ప్రజాతంత్ర పరిణామమని అంగీకరించ వచ్చును. మరోవిధంగా దీనిని ప్రజాతంత్ర సంస్థ అని అనలేము.

కాంగ్రెసు, ముస్లింలీగు సమాన ప్రాతినిధ్యంతో కేంద్రంలో ప్రభుత్వ మేర్పాటుచేయాలని, ముస్లిం ప్రజల జాతీయభావాలకు ప్రతిబింబమే పాకిస్తాన్ నినాదంలోని అంతర్యమని ఆనాటి కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ విధానం. సంస్థానంలో ఈ నినాదం పైవిధంగా అమలుజరిగింది. "నేటి హైదరాబాదు-మన కర్తవ్యం" అను పుస్తకంలోని రాజకీయ సారాంశం ఇదే.

అయితే తర్వాతకాలంలో ఈ విధానంవల్ల చాలా నష్టాలు జరిగినవి. వాటితోపాటు నిజాం నిరంకుశత్వానికి వ్యతిరేకంగా పార్టీ, ఆంధ్రమహాసభలు రాజీలేని పోరాటం సాగించిన ఫలితంగా ఈ నష్టాలు ఒకమేరకైనా తగ్గిపోయినవి. ప్రజల్లో పార్టీ, ఆంధ్రమహాసభ బలపడినవి.

## 4. జాతీయ పక్షం

ధర్మవరం మహాసభలో తమ ఓటమిని చూచిన కాంగ్రెసువాదులు సంఘటితపడాలని భావించారు. జాతీయ పక్షమనే పేరుతో ఒక పార్టీని ఏర్పరచటానికి పూనుకున్నారు. ఈ పక్షం ఏ విధంగా ఏర్పడిందీ కోదాటి నారాయణరావుగారు ఇలా రాస్తున్నారు :

"హైద్రాబాదు స్టేటుకాంగ్రెసుపై నిషేధం తొలగలేదు. అఖిలభారత జాతీయ కాంగ్రెసు విధానాలను అనుసరించుటకు ఆంధ్రమహాసభలో మితవాద నాయకత్వమొకవంక, కమ్యూనిస్టువర్గం మరియొకవంక అవరోధంగా ఏర్పడ జొచ్చాయి. కమ్యూనిస్టుపార్టీ సువ్యవస్థీకృతమైన రాజకీయపక్షం. అదిముందే అన్నిరంగాలను కార్యక్రమాలను ఏర్పరచుకొని ఆ విధానాల ననుసరించి పని చేస్తుంది. కాబట్టి యుద్ధరంగంలోకి సైన్యంవలె అది వ్యవహరించగలుగుతుంది. ఏరంగంలోనయినా మిగతా వారందరు కప్పల తక్కెడగా ఉండిపోతారు. ఈ విషయం హైదరాబాదులో జరిగిన 10వ మహాసభలో రుజువైంది. ఆ మహాసభకు అధ్యక్షులయిన శ్రీ కొండా వెంకటరంగారెడ్డి తన అధ్యక్షోపన్యాసంలోనే జాతీయ

వాదులు కాంగ్రెసులోకి పోయింది, కమ్యూనిస్టులు కమ్యూనిస్టుపార్టీకి పోయింది, ఆంధ్ర మహాసభ మాది అన్నారు. యథార్థానికి ఆయన అధ్యక్షులు కావటానికి కారణభూత మయింది ఈ శక్తులే. మితవాద నాయకులలో అప్పటివరకు రాజకీయాలలో నిమగ్నులై ఉన్నవారు శ్రీ మందుముల నరసింగరావు ఒక్కరే. ఆయన మొదటి నుండీ సంస్కరణల ఆమోదించి శాసనసభల్లోచేరిపోవలెననే అభిప్రాయంకలవారు. ఆయన మాట నెగ్గించుకోవటానికి ఎప్పటికి ఏది ప్రస్తుతం అయితే ఆ మార్గాన్ని అవలంబించేవారు. కమ్యూనిస్టేతర వర్గాలలో స్పష్టమయిన మార్గదర్శకత్వంలేక అయోమయావస్థలలో ఉండేవారు. దీని ప్రయోజనం కమ్యూనిస్టుపార్టీకి సిద్ధించేది. ఎందుకంటే లోకులు కమ్యూనిస్టుపార్టీ పాలసీతో ఏకీభవించకున్నా మితవాద నాయకత్వంతో అసంతృప్తిగా ఉండేవారు. ఈ పరిస్థితులన్నిటిని చూచి అఖిల భారత జాతీయకాంగ్రెసు విధానాన్ని అనుసరించవలెనని సంకల్పించిన యువకులు ఆంధ్రమహాసభ వేదికగాక ప్రత్యేకంగా ఆంధ్రజాతీయపక్షం అనే పేరుతో మరొకసంస్థను నెలకొల్పారు. దీని వ్యవస్థ ఇంచుమించు కమ్యూనిస్టుపార్టీ వలెనే ఉండేది. కార్యకర్తలకు మాత్రమే ఈ పక్షంలో తావుండేది. ప్రధాన కార్యదర్శి నాయకుడుగా వ్యవహరించేవాడు. సమిష్టి నాయకత్వ పద్ధతిని ఈ పక్షం అనుస రించేది. వివిధ రంగాలలో కృషిచేసే కార్యకర్తల నియమించి వారి రిపోర్టులపై సమీక్షించేది. సంఖ్యాబలంలో తక్కువ అయినప్పటికీ, రంగంలో తన పేరుతో ప్రవేశించినప్పటికీ, ఈపక్షం తెలంగాణా రాజకీయాలలో అత్యంత ప్రముఖమైన పాత్ర నిర్వహించింది. ముఖ్యంగా భారత జాతీయ కాంగ్రెసు నాయకులు కారా గారాల్లో ఉన్నప్పుడు బయటనే కార్యక్రమం తెలియక ప్రజలు-ముఖ్యంగా కాంగ్రెసు కార్యకర్తలు అయోమయ అవస్థలోనున్నప్పుడు-సరియైన పద్ధతిలో ఆలోచించి స్పష్టమైన కార్యక్రమం తెలంగాణాకు ఇవ్వగలిగింది ఈపక్షం. స్టేటు కాంగ్రెసుపై ఆంక్షతొలగి, పోరాట కార్యక్రమం ప్రారంభమైన తర్వాత ఈపక్షం తన ఉనికి అవసరం లేదని తీర్మానించుకున్నది. పోరాటం తర్వాత సభ్యులందరిని దేశాభ్యుదయానికై నిర్మాణకార్యక్రమంలో నిమగ్నులకమ్మని ఆదేశిస్తూ రాజకీయ రంగం నుండి నిష్క్రమించింది." (దేశోద్ధారక గ్రంథమాల ప్రచురించిన "తెలంగాణం" అన్న వ్యాససంకలనం నుండి; 'తెలంగాణాలో రాజకీయోద్యమాలు-సింహావలోకనము' : పేజి-213-215).

ఈ పేరాలలో కోదాటివారు జాతీయ పక్షం ఎలా పుట్టిందీ, ఎలా అంత

మయింది సంక్షిప్తంగా చెప్పారు. ఈ పక్షం మనుగడ సాగించింది నాలుగు సంవత్సరాలే. ఆంధ్ర మహాసభలో కమ్యూనిస్టులు బలమైన శక్తిగా రూపొందిన తర్వాతనే కాంగ్రెసువాదులు జాతీయ పక్షమనే పేరుతో సంఘటితపడటానికి ప్రయత్నించారు. కమ్యూనిస్టుపార్టీ నిర్మాణ పద్ధతులను అనుకరించారు. కమ్యూనిస్టులకు ప్రతీకగా (anti-dote) ఉంటూ వచ్చారు. తెలంగాణాలో గాంధీవాదుల నిర్మాణ కార్యక్రమం ప్రజలను ఎప్పుడూ ఆకర్షించలేదు. ఫ్యూడల్ వ్యతిరేక కార్యక్రమం ఉన్న రాజకీయ పార్టీలే ప్రజలను ఆకట్టుకోగలిగాయి. ఆ కాలంలో అలాంటిపార్టీ కమ్యూనిస్టు పార్టీయే. ఆంధ్ర మహాసభ ప్రజల అభిమానాన్ని చూరగొన్నది వెట్టిచాకిరి నిర్మూలనవంటి ఫ్యూడల్ వ్యతిరేక కార్యక్రమాన్ని అమలు జరిపిన ఫలితంగానే. జాతీయ పక్షంవారికి అలాంటి కార్యక్రమం లేదు.

ఆంధ్ర మహాసభ వివిధ రాజకీయశక్తుల ఐక్యవేదిక. ఈ పరిస్థితి 7వ మహాసభ (మల్కాపురం, 1940) నాటికే ఏర్పడింది. 8వ మహాసభ (చిలుకూరు, 1941)వరకు కొనసాగింది. 9వ మహాసభతర్వాత కాంగ్రెసువాదులంతా "ఆంధ్ర జాతీయ పక్షం"గా ఏర్పడి ఈ ఐక్య వేదికను విచ్ఛిన్నంచేయ ప్రారంభించారు.

కాంగ్రెసువాదులు ఒక పక్షంగా ఏర్పడి, కమ్యూనిస్టులమాదిరిగానే ఆంధ్ర మహాసభ లోపల వెలుపల పనిచేసి, తామూ బలపడి ఆంధ్ర మహాసభను బలపరచటానికి ఎన్నో అవకాశాలు ఆ రోజుల్లో ఉండేవి. కాని వారు ఈ అవగాహనతో బయలుదేరలేదు. 'అఖిలభారత జాతీయ కాంగ్రెసు' విధానాన్ని అనుసరించాలని బయలుదేరారు. ఆనాడు కాంగ్రెసు కార్యక్రమంలో బ్రిటిషు ప్రభుత్వంతో రాజీపడటం, దేశంలో చెలరేగుతున్న విప్లవోద్యమాన్ని అడ్డుకోవడమనే రెండే రెండు అంశాలుండేవి. సంస్థానంలో దానికి అనుగుణ్యమైనకార్యక్రమం: నిజాంతో రాజీపడటం, కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన పురోగమిస్తున్న ఫ్యూడల్ వ్యతిరేక ఉద్యమాన్ని అరికట్టడం (contain). మొదటిపని అఖిల భారత జాతీయ కాంగ్రెసు నాయకత్వానికి వదిలివేశారు. రెండవ పనికి పూనుకున్నారు. దానితో జాతీయ పక్షం వారి పుణ్యమా అని ఆంధ్రమహాసభ అప్పటివరకూఉన్నరాజకీయ శక్తుల ఐక్యవేదిక కాకుండాపోయింది.

'కార్యకర్తలకుమాత్రమే ఈ పక్షంలో తావుండేది' అని కోదాటివారు చెపుతున్నారు. బూర్గుల రామకృష్ణారావు, మందుముల రామచంద్రరావు వీరిద్దరూ కార్యకర్తలు కారు. తమవృత్తులను చూచుకునే లాయర్లు. అయినా వీరిని చేర్చుకున్నారు.

ఈ విధంగా జాతీయపక్షం మితవాదులు, "యువకులు" చేరిన ఒక మధ్యస్థపు గ్రూపుగా రూపొందినది.

అఖిలభారత జాతీయ కాంగ్రెసునాయకులు జైళ్ళలోఉన్న ఆ సమయంలో తెలంగాణాలోని కాంగ్రెసువాదులకు వారి విడుదలకై నిరీక్షిస్తూ ఉండటమేతప్ప విస్పష్టమైన కార్యక్రమమేదీ లేదు. అయినా బాధ్యతాయుత ప్రభుత్వం, అహింసా విధానం అనే నినాదాలతో కాంగ్రెసును అభిమానించేవారిని సమీకరించటానికి ఈ పక్షం పూనుకున్నది. ఆనాటి కమ్యూనిస్టు పార్టీ బాధ్యతాయుత ప్రభుత్వానికి వ్యతిరేకం కాదు. అహింసా విధానాన్ని అంగీకరించకున్నా విప్లవాత్మకమైన విధానాన్ని కూడా అనుసరించలేదు. నల్లగొండజిల్లాలోని కొన్ని పరిమితప్రాంతాల్లో (సూర్యాపేట) వర్గపోరాట పంథాను అనుసరించి పనిచేసింది. ఆంధ్ర మహాసభ కార్యవర్గం ఆగస్టు 9నాటి కాంగ్రెసు తీర్మానాన్ని బలపరిచినా మితవాదుల నాయకత్వాన ఉన్న జాతీయ పక్ష నాయకత్వం అంతకుమించి ఏమీ చేయలేకపోయింది. వారి నాయకులంతా జైలుకు వెళ్ళాక బయటనే ఉన్నారు. ప్రజాకార్యక్రమమేమీ తీసుకొని పనిచేయలేకపోయారు.

మితవాదులైన బూర్గుల రామకృష్ణారావు, మందుముల రామచంద్రరావు జాతీయ పక్షంలో చేరటంతో తక్కిన మితవాదులు ఈ పక్షాన్ని కాదనలేకపోయారు. కాని వీరితోపాటు పూర్తిగా సంలీనం కాలేకపోయారు.

# 7. ఆంధ్రోద్యమంలో చీలిక - వర్గపోరాటాల ఉధృతి

## 1. పదవ ఆంధ్రమహాసభ (హైదరాబాదు, 1943 మే)

సురవరం ప్రతాపరెడ్డిగారి సంపాదకత్వాన నడిచే 'గోలకొండ' నూటికి నూరుపాళ్ళు కమ్యూనిస్టు వ్యతిరేక పత్రిక. మితవాదులను, జాతీయపక్షంవారిని అదేపనిగా సమర్థించింది. ఈ సమయంలోనే 'తెలంగాణా' అనే పత్రిక వెలువడింది. దానిని జాతీయపత్రిక అని చెప్పుకునేవారు. జాతీయపక్షం వారి కార్యకలాపాలు, నాయకుల ప్రకటనలతో నిండిఉండేదీ పత్రిక. అది కూడా కమ్యూనిస్టు వ్యతిరేకమైన పత్రిక. జాతీయపక్షానికి హైదరాబాదు నగరంలోనూ, వరంగల్ జిల్లాలోనూ కొంతస్థానం ఏర్పడింది. దానిలో కూడా ఖమ్మం ప్రాంతమనేది ముఖ్యమైనది ఇతరజిల్లాల్లో కూడా స్వల్పంగా ఉండేది.

ఈ పరిస్థితులలో 10వ ఆంధ్రమహాసభ సన్నాహాలు జరిగాయి. ఈ మహాసభ నాటికి పార్టీ కార్యకలాపాలు బాగా విస్తరించాయి. పార్టీ నిర్మాణరీత్యా బలపడింది. మితవాదులు, జాతీయపక్షంవారు అనుసరిస్తున్న కమ్యూనిస్టువ్యతిరేక విధానం, ఆంధ్రమహాసభను దానికై ఉపయోగించుకునే ప్రయత్నాలను పార్టీ నాయకత్వం గుర్తించింది. మళ్ళీ పోటీచేసి రాబోవు మహాసభలో ముఖ్యమైన పాత్రను నిర్వహించాలనీ అధ్యక్షస్థానానికి కూడా పోటీచేయాలనే అభిప్రాయానికి పార్టీ వచ్చింది. ఆంధ్రమహాసభ కార్యక్రమాలను గ్రామాలవరకు విస్తరింపజేయటంతో సభ్యత్వం పెరిగింది. గ్రామస్థాయిలో సభ్యత్వం చేర్పించటం, గ్రామ కమిటీలు ఏర్పాటుచేయటం, ఈ కమిటీలన్నీ ఎన్నుకోబడిన కమిటీలుగా ఉండటంతో ఆంధ్రమహాసభకు స్థిరమైన ప్రజాస్వామిక పునాది ఏర్పడింది. కార్యకర్తలు కూడా తగినంతమంది ఉండటంతో హెచ్చుగ్రామాలకు విస్తరించి పెద్ద

ఎత్తున సభ్యత్వం చేర్పించారు. ఆంధ్రమహాసభలోని మితవాదులు, జాతీయపక్షం వారు కూడా సభ్యత్వం చేర్పించారు.

మాదిరాజువారు అధ్యక్షుని హోదాలో కమ్యూనిస్టుల ప్రాబల్యాన్ని అరికట్టలేకపోతున్నారనీ, వారిని అణచివేయాలంటే నిరంకుశుడైన అధ్యక్షుడు ఒకరు కావాలని మితవాదులు ఆలోచించి కొండా వెంకట రంగారెడ్డిగారిని ఎంపిక చేశారు దీనికి సంబంధించిన వివరాలను కొన్నింటిని మాదిరాజువారు తమ "స్వీయ చరిత్ర"లో ఈ విధంగా రాస్తున్నారు :

"నా అధ్యక్ష కాలములో పూర్వమువలె ఏకాభిప్రాయముతో ఉద్యమము నడుపుటకు బేధభావములుద్భవించెను. మొదటినుండియు శ్రీ మాడపాటి హనుమంత రావుగారు మాకు నాయకుడుగాను, శ్రీ వెంకట రంగారెడ్డిగారు, శ్రీ రామకృష్ణా రావు, మందుముల నర్సింగరావు, రామచంద్రరావుగార్లు నేనును వారికి అనుయాయులుగానుండి అభేదముగా నడుచుచుండెడివారము. అందేమి మార్పురాలేదు. గాని ఆంధ్ర మహాసభ బురకాలో కమ్యూనిస్టు సిద్ధాంతముల ప్రచారముచేయు రావినారాయణరెడ్డిగారి పార్టీ బలపడుచుండెను. వారి సహాయమునాకు లభించుటకు బదులు ప్రతిఘటనకు సిద్ధపడుచుండిరి. శ్రీ వెంకట రంగారెడ్డిగారు పట్టుదలతోను తన పలుకుబడి వెంటను ఈ పార్టీవారికి వినిపించి అణగబెట్టునని మేమనుకొని దశమాంధ్రమహాసభకు అధ్యక్షత వహించవలసినదని శ్రీ రంగారెడ్డిగారిని కోరితిమి. అనారోగ్యముగానుండుటచే విశ్రాంతి తీసుకొనుచుండిరి. అయినను పోటీకి నిలిచి ప్రచారము చేయజాలననియును, లోగడవలెనే ఏకగ్రీవముగా ఎన్నుకుంటే ఉండెదననియును బదులు చెప్పిరి. నియమావళిమారినది. ఎన్నికలుజరుగక తప్పదు. కనుక మేమా ప్రచారముచేసి గెలిపించెదమని నేనును, శ్రీ రామచంద్ర రావుగారును బాధ్యత తీసుకొంటిమి." (పేజి : 367–368)

ఆంధ్ర మహాసభ ప్రజాసంస్థగా రూపొందటంతో వర్గవిభేదాలు బయటికి వచ్చినవి. భూస్వాముల ప్రతినిధులైన మితవాదులు ఒకవైపున, వారికి వ్యతిరేకంగా రైతాంగ ప్రయోజనాలకై పోరాడే కమ్యూనిస్టులు, ఇతర ప్రజాతంత్ర శక్తులు మరొకవైపున సంఘర్షణపడసాగినారు. భూస్వాముల ప్రయోజనాలను కాపాడటానికి రంగారెడ్డిగారే సమర్థులని మితవాదులు నిర్ణయించుకున్నారు. కమ్యూనిస్టులు కరడుగట్టిన ఈ అభివృద్ధి నిరోధకుణ్ణి వ్యతిరేకించాలని నిర్ణయించి బద్దం ఎల్లారెడ్డిగారిని పోటీపెట్టి ప్రచారం చేశారు.

మితవాదులు వారికున్న అంగబలాన్ని, అర్థబలాన్ని పూర్తిగా ఉపయోగించారు. గ్రామాల్లో ఉండే భూస్వాములు తాలూకా, జిల్లా కేంద్రాల్లో లాయర్లను కూడగట్టుకొని సభ్యత్వం చేర్పించటానికి పూనుకున్నారు. సభ్యత్వ పోటీలో వారివైపునుంచి అక్రమాలు జరిగినవి. అనేక సందర్భాల్లో భూస్వాములకు సభ్యత్వఫారాలు పుస్తకాలుఇస్తే అన్నిటిపైన ఒకరి వేలిముద్రలే వేయించి సభ్యత్వం చేర్పించినారు. లాయర్లు కూడా ఇదేవిధంగా చేశారు. ఈ విధంగా సభ్యత్వపు డబ్బుతోపాటు సభ్యత్వఫారాలను కూడా వారు కేంద్రానికి పంపించి తమ సభ్యత్వాన్ని కృత్రిమంగా పెంచుకున్నారు. కమ్యూనిస్టుపార్టీ కార్యకర్తలు, వారితో సహకరించేవారు ఇలాంటి సభ్యత్వం చేర్చనందున వారి సభ్యత్వం ఎంత హెచ్చుగాఉన్నా మితవాదులకన్నా తక్కువగా ఉండింది. దీనిఫలితంగా మితవాది కొండా వెంకటరంగారెడ్డిగారు గెలిచినారు. కమ్యూనిస్టుపార్టీ అభ్యర్థి బద్దం ఎల్లారెడ్డిగారు ఓడిపోయినారు.

కొండా వెంకటరంగారెడ్డి కరడుగట్టిన ఫ్యూడల్‌భావాలు కలిగిన వ్యక్తి, లాయరు. నిరంకుశత్వానికి ఆయన మారుపేరు. గ్రామాల్లో దురాగతాలు చేసే భూస్వాములకు ప్రతినిధిగా కూడా ఉండేవాడు. భూస్వాముల ప్రతినిధిగానే నిజాం 'శాసనసభకు' సభ్యుడైనాడు. అయినా ప్రారంభం నుంచీ ఆంధ్రమహాసభతోనూ, మాడపాటి హనుమంతరావుగారితోనూ సన్నిహిత సంబంధంఉన్న వ్యక్తి. ఈయన పదవ ఆంధ్రమహాసభకు అధ్యక్షుడయినాడు.

హైదరాబాదు నగరంలో మహాసభ జరిగింది. రెడ్డి హాస్టల్‌లో ఏర్పాట్లు పెద్దఎత్తునే జరిగినవి. మాడపాటి హన్మంతరావుగారితో సహా ఆయన అనుచరులంతా తగినంతమంది హాజరయినారు. కమ్యూనిస్టులు, వారి సన్నిహితులు గణనీయమైన సంఖ్యలో ప్రతినిధులై వచ్చారు. మహాసభ ఆవరణలో ప్రదర్శనలు చేశారు. పాటలు పాడారు. ఈ విధంగా మహాసభ ఉత్తేజకరమైన వాతావరణంలో జరిగింది. దానిలో అదనంగా చేసిన తీర్మానాలేమీలేవు. వెనుకటి తీర్మానాలనే తిరిగి చేశారు. మితవాదులకు తగినంత మెజారిటీ ఉన్నప్పటికీ అధ్యక్షుడు రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి, ఆరుట్ల లక్ష్మినరసింహారెడ్డి గారలను కార్యవర్గ సభ్యులుగా నియమించారు. కమ్యూనిస్టులే అయినా వీరికి "మంచి కమ్యూనిస్టుల"ని పేరు. వీరిని ప్రత్యేకమైన మర్యాదతో చూసేవారు.

## 2. కమ్యూనిస్టులను అణచుటకు ప్రయత్నాలు-ప్రతిఘటన

ఈ మహాసభ జరిగిన తర్వాత అధ్యక్షుడు తీసుకున్న మొదటి చర్య నల్లగొండ జిల్లాలో ఆంధ్ర మహాసభనుంచి కమ్యూనిస్టు కార్యకర్తలను వెళ్ళగొట్ట టానికి ప్రయత్నం చేయుట మహాసభకు సన్నాహాలు జరుగుతున్నప్పుడే సూర్యా పేట తాలూకాలోని దేశముఖులు, భూస్వాములు అంతా కలిసి ఒక అర్జీని ఆంధ్ర మహాసభ అధ్యక్షునికి పంపుకున్నారు. కమ్యూనిస్టులు తమ కార్యకలాపాలద్వారా వ్యవసాయపు పనులు సాగనివ్వకుండా చేస్తున్నారని హింస, వర్గపోరాటాలను ప్రబోధిస్తున్నారని ,తమను అనేక విధాల ఇబ్బంది పెడుతున్నారని, ఆంధ్ర మహాసభ తరపున వారిపై చర్య తీసుకోవాలని దానిలో రాశారు. ఈ భూస్వాము లంతా ముందు ప్రభుత్వ పక్షానచేరి కమ్యూనిస్టు కార్యకర్తలపై కేసులుపెట్టించి, రైతాంగ-కార్మిక ఉద్యమాన్ని అణచివేయించ ప్రయత్నించారు. ఈ ప్రయ త్నంలో విఫలమై మితవాద నాయకత్వం సహాయంతో కమ్యూనిస్టు పార్టీని ఆంధ్ర మహాసభనుంచి విడదీసి ఏకాకిగా చేసి, మళ్ళీ ప్రభుత్వ సహాయంతో పార్టీని అణచివేయాలని వారి ప్లాను. దేశముఖులు, భూస్వాములు కలిసిచేసిన ప్రయత్నమిది. ఒక్క సూర్యాపేట తాలూకాలోనేకాక ఇతర తాలూకాల్లోనూ, ఇతర జిల్లాలలోనూ ఉన్న తమతమ అనుచరులనుంచి మితవాదనాయకులు ఇలాంటి అర్జీలను సంపాదించారు.

కమ్యూనిస్టులను ఆంధ్రమహాసభనుంచి తొలగించడానికి మొదటి ప్రయ త్నంగా వారు సూర్యాపేట వచ్చారు. అధ్యక్షులైన కొండా వెంకటరంగారెడ్డివెంట మాడపాటి హనుమంతరావు కూడా ఉన్నారు. ఇదంతా కమ్యూనిస్టుపార్టీ వ్యవహార మని కార్యవర్గంలో ఉన్న కమ్యూనిస్టు సభ్యులైన రావినారాయణరెడ్డిగారిని వెంట తీసుకువచ్చారు. గ్రంథాలయోద్యమానికి, ఆంధ్రోద్యమానికి అభిమానిగా ఉన్న అమరవాది వెంకటనర్సయ్యగారి ఇంట్లో బసచేశారు. విచారణ ప్రారంభించారు. పెద్ద భూస్వామి అయిన సూర్యాపేట దేశముఖుతో, మరో భూస్వామి కోదాటి వెంకటేశ్వరరావుగారితో మాట్లాడినారు. పార్టీకి వ్యతిరేకంగా, ఆంధ్రమహాసభ కార్యకర్తలకు వ్యతిరేకంగా వారు రిపోర్టిచ్చారు. ఇతరగ్రామాలనుంచి భూస్వాములు వచ్చి మొరపెట్టుకున్నారు. ఇంతకుపూర్వమే వారు రాసిచ్చిన దరఖాస్తులను ఆధారంగా చేసుకొని కార్యకర్తలను పిలిపించి మాట్లాడారు. వారు సంజాయిషీ

ఇచ్చుకోవాలని చెపుతూ కొన్ని ప్రశ్నలు వేశారు. వాటిలో ముఖ్యమైన అంశాలు ఇవి :

మొదటిది : 'ఆంధ్రమహాసభ అన్నివర్గాలకూ సంబంధించిన సంస్థ. దీనిలో ఆంధ్రులంతా ఉంటారు. భూస్వాములుంటారు, తక్కిన రైతులూ ఉంటారు. పనిపాటల వారు (వెట్టిచాకిరీ చేసేవారు), కష్టజీవులూ అంతా ఉంటారు. అన్నివర్గాలకు సంబంధించిన ఈ సంస్థలో అంతా ఐక్యంగా ఉండాలంటే, ఒకరికి వ్యతిరేకంగా ఇంకొకరి పోరాటం కూడదు. రైతులు భూస్వాములకు వ్యతిరేకంగా ఆంధ్ర మహాసభ ద్వారా పోరాటం జరుపకూడదు. అదేవిధంగా వ్యవసాయ కూలీలు, పేదరైతులు, పనిపాటలవారు (వెట్టిచాకిరీ చేసేవారు) భూస్వాములకు వ్యతిరేకంగా పోరాడకూడదు. వర్గపోరాటానికి దీనిలో స్థానంలేదు. అలాంటప్పుడు మీరెందుకు వర్గపోరాటాలు నడిపిస్తున్నారు ?'

రెండవది : 'ఇది అహింసా సిద్ధాంతంతో దానికి అనుగుణ్యంగా నడిచే సంస్థ. మీరు కమ్యూనిస్టులు; హింసను ఆరాధిస్తారు. హింసాయుతమైన సిద్ధాంతాన్ని కలిగియున్నవారికి ఈ సంస్థలో స్థానంలేదు. మీరు ఉండటానికి వీల్లేదు. మీరు అహింసను అంగీకరిస్తే తప్ప ఈ సంస్థలో ఉండటానికి వీలుండదు. దీనిలో ఉండాలంటే మీ సిద్ధాంతాన్ని వదులుకోవలసి ఉంటుంది.'

మూడవది : మీ కార్యకలాపాలను, ముఖ్యంగా వర్గపోరాటాన్ని, లేక అలాంటి కార్యకలాపాలు సాగించుకోవాలన్నా, మీ పాలసీని ప్రచారం చేసుకోవాలన్నా మీ పార్టీద్వారా చేసుకోవలసిందేకాని ఆంధ్రమహాసభ ద్వారా చేసుకోవటానికి వీల్లేదు.

నాల్గవది : కమిటీలు కార్యకర్తలందరికీ నెలకు 15 రూ॥ల చొప్పున వేతనంఇచ్చేవి. "మీరు వేతనం తీసుకునే కార్యకర్తలు కావటంతో సంస్థకు నౌకర్లుగా పనిచేయాలికాని, సంస్థ నాయకులమాదిరిగా స్వతంత్రంగా పనిచేయటానికి వీల్లేదు. ఈ సంస్థ నాయకుల పర్మిషన్‌తోనే, వారేపని చేయాలంటే అపనే చేయాలి." ఆయనన్నమాట : "తుమ్ గులామ్‌హో. హమారే ఇజాజతుకే శివా తుమ్‌కుచ్ నైకర్‌సక్‌తే", అని ఆయన ఉర్దూలో అన్నాడు. (మీరు నౌకర్లు. మా అనుమతి లేకుండా మీరేమీ చేయటానికి వీల్లేదు). ఆయన 'గులాం' (నౌకరు) అనే పదాన్ని ఉపయోగించాడు. చాలాదురుసుతనంతో, అహంభావంతో మాట్లాడిన విషయాలివి.

కార్యకర్తలు తమ అభిప్రాయాలను ఓపికతో స్పష్టంగా వివరించారు.

'ఈ సంస్థలో అందరూ ఉన్నమాట నిజమే. ఆంధ్రుల సర్వతోముఖాభి వృద్ధికై కృషిచేయటమనేది సంస్థ లక్ష్యం. భూస్వాములకు భూములున్నాయి. అన్నివసరులున్నాయి. వాళ్ళ అభివృద్ధికోసం చేయాల్సిన కృషి ఏమీ ఉండదు. కానీ పేదప్రజలు, సామాన్య రైతులు, కూలీలు, వెట్టిచాకిరీ చేసేవారు దోపిడీకి గురవుతున్నారు. వారి అభివృద్ధికోసం పనిచేయవలసిన అవసరం ఎంతోఉంటుంది. మేము చేస్తున్నది ఈ లక్ష్యానికనుగుణ్యంగా వున్నదేకాని విరుద్ధంగా లేదు.' అని వారి మొదటి అంశానికి సమాధానం చెప్పారు.

'ఆంధ్ర మహాసభ చేసిన తీర్మానాలకనుగుణ్యంగానే కార్యకర్తలు పని చేస్తున్నారు. రైతు సమస్యలపై రైతులమీద జరుగుచున్న దోపిడీ సమస్యలపై ఆంధ్ర మహాసభచేసిన తీర్మానాలను ఎత్తిచూపి, ఈ తీర్మానాలకు లోబడే తాము పనిచేస్తున్నట్టు స్పష్టం చేశారు. ఈ తీర్మానాలను అమలుచేయటమే వర్గపోరాటమైతే అది తీర్మానాల ప్రకారం సమర్థనీయమే అవుతుంది. ఒకసారి తీర్మానాలు చేసిన తర్వాత వాటిని అమలుజరుపవద్దనడానికి మీకు అధికారం లేదు. కాగా వాటిని అమలుజరుపడానికి మాకు సంపూర్ణమైన అధికారమున్నది', అని కార్యకర్తలు చెప్పారు. ఇది రెండవ అంశము.

'ఎవరి కార్యక్రమాలను వారి పార్టీలద్వారా అమలు జరుపుకోవచ్చును. కమ్యూనిస్టు పార్టీకోసం పనిచేసేవారు చేస్తున్నారు. దానినిగూర్చి చెప్పవలసిన అవసరం లేదు. అది మీ పరిధిలో ఉన్న సమస్య కాదు. దానిని పార్టీ చూసు కుంటుంది. మేము ఆంధ్రమహాసభలో చేసిన తీర్మానాల ప్రకారంగానే పని చేస్తున్నాము. పార్టీ తీర్మానాలు కూడా ఇవే అయితే దానికి ఎవరూ చేయగలిగిన దేమీ లేదు. మీరు పార్టీ తీర్మానాలను వ్యతిరేకించాలంటే ఆంధ్రమహాసభ తీర్మా నాలను కూడా వ్యతిరేకించాలి. ఒకసారి తీర్మానాలు చేసిన తర్వాత వాటిని అమలుజరుపవద్దనడానికి మీకెలాంటి అధికారమూ లేద'ని మరోసారి స్పష్టం చేశారు.

అహింస సమస్య : 'ఆంధ్రమహాసభ తీర్మానాలలో, లక్ష్యాలలో అహింసను తప్పనిసరిగా అనుసరించాలని ఏమీలేదు. ఈ కారణం వలన హింసా, అహింసలు చర్చనీయాంశాలు కావు. మేమెక్కడా హింసను ప్రబోధించలేదు. అంతా సవ్యం

గానే సాగిపోతున్నది. కార్యకలాపాలన్నీ ప్రజాపోరాటాల పరిధిలో సాగినవేకాని అంతకన్నా మించినదేమీ లేదు' అని స్పష్టంచేసి చెప్పారు.

వేతనాల సమస్య : 'మేము వేతనం తీసుకున్నంతమాత్రాన ఎవరికీ గులాములముకాము, నౌకర్లమూకాము. అయినా మీరు ఈసమస్యను లేవనెత్తినందున మేము వేతనాలు వదులుకుంటున్నాము. ఇవి మాకవసరం లేదు. మేము వేతనంలేని కార్యకర్తలుగానే పనిచేస్తామ'ని వారు చెప్పారు.

'అయితే వేతనం తీసుకోని కార్యకర్తలు పనిచేయడానికి వీల్లేదు. కార్యకర్తలుగా మిమ్ములను తొలగిస్తామ'ని అధ్యక్షులు అన్నారు.

అప్పుడు కార్యకర్తలు 'మమ్ముల బహిష్కరిస్తే బహిష్కరించవచ్చు కానీ పనిచేయకుండా మమ్ములను ఆపలేరు. నాలుగణాల సభ్యత్వమున్నంతవరకు మాకు ఆంధ్రమహాసభతో నిర్మాణయుతమైన సంబంధముంటుంది. ఆంధ్రమహాసభకోసం పనిచేయటానికి మాకు హక్కుంటుంది. ఈహక్కు మీరు తీసుకోవటానికి మీకేమీ అధికారంలేద'ని వారు స్పష్టంచేసి చెప్పారు. అంటే 'వేతనం ఇచ్చి నిర్ణయింపబడే కార్యకర్తలుగా లేకున్నప్పటికీ పనిచేయటానికి మాకు అధికారం వున్నద'ని నొక్కి చెప్పారు. ఆ సందర్భంలో రావినారాయణరెడ్డిగారు జోక్యంకల్గించుకొని 'గులాం' అనడం చాలా తప్పు, అభ్యంతరకరమైన విషయమని గట్టిగా వాదించారు. అధ్యక్షుని పక్కనే సలహాదారుగావున్న మాడపాటి హనుమంతరావుగారు కూడా వారన్న మాటలు (గులాం-నౌకర్లు) తప్పని చెప్పారు. విచారణ తర్వాత వీరిని వేతనాలుపొంది పనిచేసే కార్యకర్తల స్థానంనుంచి తొలగించారు.

పెద్దలు విచారణకోసం వస్తున్నారని తెలిసి, నల్లగొండజిల్లా కమ్యూనిస్టు కమిటీ కార్యదర్శిగా వున్న దేవులపల్లి వెంకటేశ్వరరావు వచ్చే సమస్యలన్నిటినీ సుమారుగా అంచనావేసి (అప్పటికే అవి ప్రచారంలోవున్నవి), వారికేవిధంగా సమాధానాలు చెప్పాలో కార్యకర్తలకు వివరించి వారిని సిద్ధంచేశారు. వారు కూడా చాలా చక్కగా నైపుణ్యం, కరుకుదనంతో నిష్కర్షగా సమాధానాలు చెప్పారు. వారి సమాధానాలకు కొండా వెంకట రంగారెడ్డితో సహా ఆ మితవాద నాయకత్వమంతా ఖంగుతిన్నారు. జిల్లా కమ్యూనిస్టు కమిటీ కార్యదర్శిని కూడా పిలిచి మాట్లాడాలనే ఒక ప్రతిపాదనను వారు చర్చించుకొని దాని సాధకబాధకాలన్నీ ఆలోచించి, ఆ ప్రతిపాదనను వదులుకున్నారు. దానికి కారణాలు : మొదటిది : ఆయన పార్టీ కార్యదర్శి, ఆంధ్రమహాసభలో ఆయనకెలాంటి హోదా లేదు.

తమతూ, వారికి సంబంధమేమీ లేనప్పుడు ఒక ఆధీనమైన కార్యకర్తగానో, లేక నాయకుడుగానో వారు ఆయనతో మాట్లాడటం సాధ్యంకాదు. సమానస్థాయిలో చర్చించడానికి వారు సిద్ధంగా లేకుండిరి. రెండవది : సాధారణ కార్యకర్తలే ఇంత చాకచక్యంగా, ఇంత ప్రతిభావంతంగా, ఇంత నిష్కర్షగా సమాధానం చెప్పినప్పుడు వారి నాయకుడిని ఇవే ప్రశ్నలడిగినా లేక మరే విషయాలడిగినా ఎలాంటి సమాధానం చెపుతాడో, ఇంకెంత కరుకుగా వుంటుందో అనుకొని అడగటానికి, మాట్లాడటానికి భయపడినారని వారి అంతరంగిక చర్చలు విన్నవారు పార్టీకి రిపోర్టుచేశారు.

వాస్తవమేమంటే వారితో మాట్లాడటానికి కార్యదర్శికి ఎలాంటి అభ్యంతరమూ లేకుండినది. కార్యకర్తల ద్వారా వారి వసతి ఏర్పాట్లుచూసింది కార్యదర్శియే. వారు రాగానే అందరినీ మర్యాదపూర్వకంగా పలుకరించి మాడపాటి హనుమంతరావుగారితో సంభాషించి వెళ్ళిపోయాడు. వారు కోరితే ఎలాంటి హోదా సమస్య లేకనే, మాట్లాడటం సాధ్యమయ్యేది. కార్యకర్తలు లొంగిపోవటానికి నిరాకరించటంతో భయపడి కార్యదర్శితో మాట్లాడే ప్రతిపాదనను విరమించుకున్నారు.

అధ్యక్షుని చర్యవలన ఆంధ్రమహాసభ నిర్మాణానికి నష్టం జరుగలేదు. పార్టీకి నష్టం జరుగలేదు. జిల్లాలో సుమారు ఐదారుగురు కార్యకర్తలుండే వారు. వారిని తొలగించటం వలన నెలకు ఒక్కొక్కరికి ఇచ్చే 15 రూపాయలు ఆగిపోయాయి. ఆ మేరకు వారు కార్యకర్తలు కారని ప్రకటించారు. కార్యకర్తలు తాము నాలుగణాల సభ్యుల హోదాతో గ్రామాల్లో తిరిగి ఆంధ్రమహాసభ కార్యక్రమాలను అమలు జరుపుతామని వారి ముందు ప్రకటించారు. దానికి వారు చేయగలిగిందేమీలేదు. నాలుగణాల సభ్యులను తొలగించే అధికారం నియమావళి ప్రకారం వారికిలేదు. దానితో వారు వచ్చిన దారినే వెళ్ళారు. వారాశించిన ఫలితాలేవీ సాధించలేకపోయారు. కాగా వారే అభాసుపాలయ్యారు.

నల్లగొండ జిల్లాలో కమ్యూనిస్టులను ఆంధ్రమహాసభ నుంచి వెళ్ళగొట్టాలని కొండావెంకట రంగారెడ్డిగారు (అధ్యక్షుడు) చేసిన ప్రయత్నాలు వమ్ముకావటంతో ఇతర జిల్లాలలోవారు ఈ పనిలోచేయ సాహసించలేదు. ఈ జిల్లాలలో ఆంధ్రమహాసభ పరిస్థితి వేరుగా ఉండేది. ఈ జిల్లాలలో సూర్యాపేట తాలూకాలో మాదిరిగా ఆంధ్రమహాసభ నాయకత్వాన భూస్వాములకు వ్యతిరేకంగా రైతాంగ పోరాటాలు అప్పటికి ప్రారంభం కాలేదు. నల్లగొండజిల్లా అంతటా సూర్యాపేట

తాలూకా పరిస్థితిలేదు. ఆ రోజుల్లోనే నల్లగొండ, మిర్యాలగూడెం తాలూకాల్లో జి.యస్. గుప్తా అనే కార్యకర్త నాయకత్వాన భూస్వామ్య (దేశముఖు) వ్యతిరేక పోరాటాలు నడిచాయి. ఆయన గాంధీవాది కావటం, ఆ పోరాటాలు మితవాద నాయకులకు లాభసాటిగా ఉండటం వలన వీరు అతన్ని ఆక్షేపించలేదు. భువనగిరి తాలూకా ఆంధ్రమహాసభ నాయకులైన ఆరుట్ల సోదరుల (వీరు కమ్యూనిస్టులే) కార్యకలాపాలను వీరు ఆక్షేపించలేదు. ఆంధ్రమహాసభ కార్యవర్గంలో వున్న రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి, ఆరుట్ల లక్ష్మీనరసింహారెడ్డి గారలు కమ్యూనిస్టులు. వీరికి నాయకత్వ స్థానంలో ఉండటానికి అర్హత ఉన్నప్పుడు ఇతర కమ్యూనిస్టులు కార్యకర్తల హోదాలో ఎందుకు పనిచేయరాదో వారు స్పష్టం చేయలేదు కార్యకర్తలు "గులాము"లై పని చేయాలనే అవగాహనను, కోరికను వారు దాచుకోలేదు. అయితే వారు తర్వాత కాలంలో ఇలాంటి మితవాద కమ్యూనిస్టులను కూడా సహించలేక పోయారు.

## 3. తెలంగాణా వ్యాపితంగా మితవాదులకూ అతివాదులకూ సంఘర్షణ

దీనితో రెండు పక్షాల మధ్య పెద్దఎత్తున పోరాటం ప్రారంభమయింది కమ్యూనిస్టువ్యతిరేక ప్రచారాన్ని ఒక ఉద్యమంగా ప్రారంభించారు. కమ్యూనిస్టులు ఏ సమస్యనూ విడిచిపెట్టక అన్నిటికీ సమాధానం చెప్పుతూ వచ్చారు. తెలుగు పత్రికలు ఈ ప్రచారంలో బాహాటంగా పాల్గొన్నాయి. "గోలకొండ", "తెలంగాణా"లు మితవాదులకు, జాతీయపక్షం వారికి అనుకూలంగా పనిచేశాయి. కమ్యూనిస్టుల కనుకూలంగా "మీజాన్" అనే తెలుగుదిన పత్రిక తోడ్పడింది. దీనిపై కొంత వివరణ ఇవ్వటం అవసరం.

**'మీజాన్' పత్రిక–అడివి బాపిరాజు :** 'మీజాన్' పత్రిక యజమాని 1920 ప్రాంతంలో కాంగ్రెస్ ఉద్యమంలో పాల్గొన్న ఒక ముస్లిం మితవాది. తర్వాత ముస్లిం లీగ్‌తో సంబంధం ఏర్పరచుకున్నాడు. అతడు హైదరాబాదు వచ్చి ఒక ప్రెస్‌పెట్టి ఇంగ్లీషు, ఉర్దూ, తెలుగులో మూడు దినపత్రికలు నడిపించాడు. తెలుగు పత్రికకు సంపాదకులు అడివి బాపిరాజుగారు. ఆయన తాను జాతీయవాదినని చెప్పుకునేవారు. కాంగ్రెసు వాదికీ, జాతీయవాదికీ భేదముందనే

వారు. రష్యాను అభిమానించేవారు. నాజీ సైన్యాలను ప్రతిఘటించి పోరాడిన ఆనాటి రష్యా ఎర్రసైనికులను కీర్తిస్తూ ఉత్తేజకరమైన గేయాన్ని రాశారు. వారి ద్దరికి గల పాతకాలపు స్నేహాన్ని పురస్కరించుకొని తన పత్రికకు సంపాదకు డుగా ఉండాలని వారిని ఆ పత్రిక యజమాని పిలిచాడు. బాపిరాజుగారు గొప్ప రచయితకావడంతో ఆయనపేరును కూడా ఉపయోగించుకోవాలని ప్రయత్నించాడు. తెలుగు "మీజాన్"కు అడివి బాపిరాజు స్వతంత్రంగా తాను అనుకున్న విధంగా సంపాదకీయాలు రాయటానికి వీల్లేదు. ఇంగ్లీషు ఎడిటర్ (దానియజమాని) రాసిన సంపాదకీయాన్ని ఉర్దూలో తర్జుమా చేసి ఉర్దూ పత్రికలో వేసే వారు. తెలుగులో ఉన్నదున్నట్టుగా పూర్తి తర్జుమాకాక, దానికి భిన్నంకాని విధంగా తెలుగులో తిరిగి సంపాదకీయం రాసివేయాలనే షరతు మీద ఆయనను నియమించారు. ఆయన దానికి ఒప్పుకొని పనిచేయటం ప్రారంభించాడు. ఈ కారణం వలన పత్రికలోని సంపాదకీయ వ్యాసం తప్ప, యజమాని అభిప్రాయాలు ఎక్కడా ప్రతిబింబించేవి కావు. తక్కిన భాగమంతా అడివి బాపిరాజుగారి స్వాధీనములోనే ఉండేది.

రెండవది : ఆ రోజుల్లో "తెలంగాణా" అనే ఒక దినపత్రిక వెలువడింది. "గోలకొండ" అనే ద్వైవార పత్రిక కూడా వచ్చేది. ఈ రెండిటి పోటీలో నిల దొక్కుకోవడం 'మీజాన్'కు అవసరమైంది. ముస్లిం ప్రారంభించిన పత్రిక కావడం, పేరు కూడా ఉర్దూలోనే ఉండటం వలన (మీజాన్ = త్రాసు) తెలుగు ప్రజలలో ఆదరాభిమానాలు అంతగా ఉండవు. వాటిని సంపాదించుట కోసమే అడివి బాపిరాజుగారిని తెచ్చారు.

మూడవది : ఈ సంఘర్షణలో కమ్యూనిస్టులను బలపరిచి వారి తరపున వుండే వారు పనిచేస్తున్న ప్రాంతాలంతటా ఈ పత్రికను అమ్ముకోడానికి అవకాశ ముంటుంది. ఈ కారణాల వలన ఈ సంఘర్షణలో కమ్యూనిస్టులను బలపరచటానికి పత్రిక వారు నిర్ణయించుకున్నారు. దీని ఫలితంగా పార్టీ, ఆంధ్రమహాసభ కార్య కలాపాలకు సంబంధించిన వార్తలన్నింటిని, వాటి పాలసీలను సమర్థిస్తూ ఇచ్చే ప్రతిప్రకటనను పత్రికలో వేసుకోసాగారు. నాలుగుపేజీల పత్రికలో సుమారు ఒకటిన్నర నుండి రెండు పేజీల దాకా ఆంధ్రమహాసభ, పార్టీకి సంబంధించిన వార్తలు ప్రకటనలు వేసేవారు.

నాల్గవది : అడివి బాపిరాజుగారు సామాన్య రచయితలను ప్రోత్సహించి

వారికి సూచనలిచ్చి, కథలు గేయాలు రాయించి ఆ పత్రికలో వేసేవారు. సూర్యాపేటలో ఆవుల పిచ్చయ్య అనే స్థానిక కార్యకర్త, పేద కుటుంబానికి చెందినతను ఉండేవాడు. అతను పార్టీ కార్యకర్తగా ఉండటమేగాక కథలు, గేయాలు రాసేవాడు. అతన్ని పిలిచి, మాట్లాడి, సూచనలిచ్చి చక్కగా రాయటానికి తోడ్పడ్డారు. ఆయన కథలను, గేయాలను "మీజాన్"లో వేస్తుండే వారు.

ఐదవది : వారి రచనలు—హిమబిందు, తుఫాను, గోనగన్నారెడ్డి, కోనంగి మొదలగునవి—'మీజాన్'లో సీరియల్‌గా వస్తూఉండేవి. ప్రతిరోజూ పత్రికలోని ఒక పేజీ తగ్గకుండా సీరియల్ ఉండేది. ఈ రచనలన్నీ కొత్తవి. ఏరోజుకారోజు రాసినవి. వారి అభిమానులు సర్కారు జిల్లాలలో హెచ్చు సంఖ్యలో ఉండటం వలన ఆ ప్రాంతాలలో పత్రిక వ్యాపించటానికి సదుపాయం కలిగింది.

తెలంగాణా జిల్లాలన్నిటిలో పార్టీ, ఆంధ్రమహాసభ శాఖలు పనిచేస్తూ వుండటం వలన పత్రిక బాగావ్యాపించింది. రాజకీయ ప్రకటనలూ, వార్తలతో నిండి వుండుట వలన రాజకీయ స్థాయి కలిగిన పత్రిక అని అంతా గుర్తించ సాగారు. "గోలకొండ" "తెలంగాణా" పత్రికల పోటీని తట్టుకొని నిలబడ గలిగింది.

ఆనాటి నిజాం ప్రభుత్వం కమ్యూనిస్టుపార్టీకేగాక కాంగ్రెసుకూ వ్యతిరేకంగా ఉండేది. కాంగ్రెసు బలపడకుండా చేయడానికి విశ్వప్రయత్నం చేసేది. అటు కాంగ్రెసునూ, ఇటు కమ్యూనిస్టు పార్టీని బలహీనపరచటానికి ఈ తగాదాలను ఉపయోగించింది. కమ్యూనిస్టు పార్టీని బలహీనపరచటానికి తన నిర్బంధ విధానంతోపాటు ఆంధ్రమహాసభలోని మితవాదులను ఉపయోగించింది. ప్రభుత్వానికి, కాంగ్రెసుకూ ఉన్న తగాదాలను కమ్యూనిస్టు పార్టీ ఉపయోగించుకున్నది. దీనివలన పార్టీ కార్యక్రమాన్ని పెద్దఎత్తున ప్రచారం చేయటానికి, పార్టీ సమీకరణ శక్తి పెరగటానికి కూడా ఈ పత్రిక తోడ్పడింది. వారి వైరుధ్యాలను ఉపయోగించుకొని, పార్టీని బలపరచుకొనడానికి అనుసరించిన విధానమిది. ఆ మేరకు అది ఉపయోగపడిందని దీనివలన స్పష్టమవుతున్నది.

**మితవాదుల దుష్ప్రచారం :** మితవాదులు చేసిన దుష్ప్రచారపు తీరుతెన్నులను అర్థం చేసుకోవాలంటే సురవరం ప్రతాపరెడ్డిగారు గోలకొండ పత్రికలో ప్రచురించిన రెండిటిని— ఒకటి వ్యాఖ్య, మరొకటి వార్త —ఉదహరిస్తే చాలు.

ఒకటి : పార్టీలో అందరూకూడా పరస్పరం కామ్రేడ్ అని సంబోధించటం మామూలే. పార్టీ సభ్యులు కానివారుకూడా అలా సంబోధించిన ఉదాహరణ లున్నాయి. "కామ్రేడ్" అనే పదానికి నీచమైన అర్థాన్ని సృష్టించడానికి ప్రయత్నించారు. కామ + రేడు అని దాన్ని విడదీశారు. 'కామ' అనేది సెక్సుకు సంబంధించిన వ్యవహారమనీ, రేడు అంటే రాజు అనీ వివరించి, కమ్యూనిస్టులంతా సెక్సిస్టులనీ అరాజకవాదులనీ, సెక్సు విశృంఖలత్వాన్ని ప్రోత్సహించేవారనీ గోలకొండ పత్రికలో వ్యాఖ్యానించారీ మహాపండితులు!

ఇలాంటి ప్రచారమే సర్కారు జిల్లాలలో కూడా పార్టీపై సాగింది. 'ములకోల' అనే ఒక పత్రిక ఉండేది ఆ రోజుల్లో. ఒకతరహా కాంగ్రెసువాదులు దానిద్వారా నీచమైనప్రచారం సాగించేవారు. ఆ ప్రచారం ఎంతదూరం వెళ్ళిందంటే కొందరు 'వెంగమ్మ' అనే ఒక నాటకాన్ని ప్రదర్శించసాగారు. దానిలో పార్టీ నాయకులలో లేని సెక్సు అరాచకత్వాన్ని చూపెట్టడానికి ప్రయత్నించారు. ఆ నాటకాన్ని ప్రదర్శించవద్దని కమ్యూనిస్టు పార్టీ ముందు హెచ్చరించింది. ఎక్కడ ప్రదర్శించినా దాన్ని సాగకుండా చేస్తామని ప్రకటించింది. ప్రదర్శించడానికి ప్రయత్నించినచోటల్లా అవసరమైనప్పుడు బలప్రయోగంచేసి — ప్రదర్శించనీయకుండా చేసింది. కొద్దికాలంలోనే ఆ ప్రచారానికి నామరూపాలు లేకుండా పోయినవి. ఇలాంటి దుష్ప్రచారమే తెలంగాణాలో జరిగింది. సురవరం ప్రతాపరెడ్డిగారు 'గోలకొండ' పత్రిక ద్వారా ఈ ప్రచారాన్ని కొనసాగించారు.

రెండవది : ఒక అమ్మాయిని కమ్యూనిస్టులు ఎత్తుకుపోయారనే పెద్ద శీర్షికతో ఒక అబద్ధపు వార్తను గోలకొండపత్రికలో ప్రకటించారు. అది అసహ్యకరమైన, నీచమైన ప్రచారమని వేరే చెప్పనవసరంలేదు.

సురవరం ప్రతాపరెడ్డిగారు గొప్ప సాహిత్యవేత్తనీ, రచయితనీ ఇతరులతో పాటు కమ్యూనిస్టులు కూడా ఆయనను గౌరవించారు. అయినా ఆయన కరడుగట్టిన ఫ్యూడల్ భూస్వామ్యవర్గానికి ప్రాతినిధ్యం వహించి ఆ దృక్పథాన్ని ప్రతిబింబించే రాజకీయాలతో కమ్యూనిస్టు వ్యతిరేక ప్రచారంలో ప్రధానపాత్ర వహించాడు. ఆ రోజుల్లో నిజాం వ్యతిరేకత వున్నవారంతా–సిద్ధాంతరీత్యా కమ్యూనిస్టులకు వ్యతిరేకులయినా–కమ్యూనిస్టులయెడ సదభిప్రాయం కలిగివుండేవారు. కానీ ఆయన ఒకవైపున నిజాంరాజ్యంలో సాహిత్యాన్ని, తెలుగుసంస్కృతిని ప్రభుత్వం అణచివేస్తున్నదని దానిని తాము ఉద్ధరిస్తామని చెప్పుకుంటూ, నిజాం

ప్రభుత్వానికి వ్యతిరేకంగా పనిచేస్తున్న కమ్యూనిస్టులపై దుష్ప్రచారం చేశారు. దీనితో వారి వర్గస్వభావం స్పష్టంగా బయటపడింది. ఆయన కోరే నిజాంవ్యతిరేక సంస్కృతి - ఫ్యూడల్ వ్యతిరేక సంస్కృతికాదు. సురవరం ప్రతాపరెడ్డిగారు సాహిత్యవేత్త అయినంతమాత్రాన అభివృద్ధికరమైన సంస్కృతికి ప్రాతినిధ్యం వహిస్తాడనుకోవడం, ప్రజలనూ, ప్రజలయొక్క జీవితాలను గౌరవిస్తాడనుకోవడం పొరపాటని దీనివలన స్పష్టమవుతున్నది. అంతేకాదు. ఈయన కూడా సంఘ సంస్కర్తఅయినప్పటికీ కమ్యూనిస్టులను వ్యతిరేకించే సందర్భంలో తానొక సంఘ సంస్కర్తననే అంశాన్ని మరచిపోయాడు. ఫ్యూడల్ అనుకూల రాజకీయాల ప్రభావం ఇలా ఉంటుంది. పెద్ద భూస్వాములు సాహితీవేత్తలూ, పండితులూ అయినప్పటికీ, పండితులను అభిమానించినప్పటికీ వారు ప్రజలనేవిధంగా హింసించే వారో ఇంతకుముందే వివరించాము. సాహిత్యవేత్తలు కొందరు ఈకోవకు చెందిన వారే.

**మితవాదులతో పోరాటు తీవ్రత-గొడ్డలిపెట్టు కరపత్రం :** ఆంధ్ర మహాసభ కార్యకర్తలు తెలంగాణా జిల్లాలలో నియమావళి ప్రకారం సభ్యత్వం చేర్పించారు. సభ్యులు ఎన్నుకున్న గ్రామకమిటీలను ఏర్పరిచారు. తాలూకా కమిటీలనేర్పరిచి జిల్లాకమిటీల ఎన్నికలకు సిద్ధమయ్యారు. దీనితో మితవాదులు ఖంగుతిన్నారు. ముఖ్యంగా కొండా వెంకట రంగారెడ్డి, మందుముల నర్సింహారావు గారలు తమ అనుచరులందరినీ కూడదీయటానికి ప్రయత్నించారు. అయినా అక్రమ సభ్యత్వం చేర్పించటం సాధ్యంకాదని గమనించారు. రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి, ఆరుట్ల లక్ష్మినర్సింహారెడ్డిగారలు (కమ్యూనిస్టులు) కార్యవర్గ సభ్యుల హోదాలో సభ్యత్వఫారాలను పంచటం సభ్యత్వాన్ని చేయించటం మొదలగు పనులన్నింటినీ పర్యవేక్షించటానికి కావలసిన ఏర్పాట్లన్నీ చేశారు. దానివలన వారు వెనుకటిలాగా సభ్యత్వం చేర్పించి తమ ప్రత్యర్థులను ఓడించటానికి ధైర్యం చేయలేకపోయినారు. ఆ సంవత్సరం ఎన్నికలూ, మహాసభా వాయిదావేయాలని ఒక తీర్మానంచేశారు. దానితో కొండా వెంకట రంగారెడ్డిగారు అధ్యక్షులుగా కొనసాగుతారు. కార్యవర్గం ఎప్పటిలాగే ఉంటుంది. దానిఫలితంగా ఆంధ్రమహా సభ వారిచేతిలో ఉంటుంది. ఈ ప్లానుకనుగుణ్యంగా ఎన్నికలను వాయిదావేశారు. ఈ తీర్మానం చేసిన వెంటనే ముగ్గురు కార్యవర్గసభ్యులు (కమ్యూనిస్టులు)—రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి, ఆరుట్ల లక్ష్మినరసింహారెడ్డి —తమ సంతకాలతో

ఒక ప్రకటన చేశారు. దాని శీర్షిక "ఎన్నికలు జరుపక పోవటం ఆంధ్రమహాసభ అభివృద్ధికే గొడ్డలిపెట్టు". "గొడ్డలిపెట్టు కరపత్రం" అని దీనికి పేరుండేది. ఆ ప్రకటనలో ముఖ్యమైన అంశాలు : మితవాదులు చేసిన ఆరోపణలన్నింటికి దానిలో సమాధానం ఉంది. మితవాదులు సంస్థలో ఉంటూ ఉద్యమ పురోగమనాన్ని ఏవిధంగా అరికట్టారో, రైతులలో గ్రామీణపేదలలో పనిచేయటానికి ఏవిధంగా అవరోధమైనారో వివరించారు. ఆంధ్రమహాసభ లక్ష్యమైన "ఆంధ్రుల సర్వతో ముఖాభివృద్ధి అంటే— సామాన్యప్రజల హక్కులకోసంచేసిన తీర్మానాలను అమలు జరుపటమేనని వర్గపోరాటమనే పేరుతో ఆంధ్రమహాసభ తీర్మానాలను అమలు జరుపడానికి మితవాదులు అవరోధంగా తయారయినారనీ స్పష్టంచేశారు. ఇలాంటి సమస్యలన్నిటికీ దానిలో సమగ్రంగా సమాధానం ఇచ్చారు. ప్రజాతంత్రయుతంగా ఎన్నికలు జరిపితేనే ఆంధ్రమహాసభ బలపడుతుందనీ, ఎన్నికలు జరుపక, ఆపివేయటమంటే ఆంధ్రమహాసభ అభివృద్ధిని ఆటంకపర్చటమేననీ, ఈ వైఖరి ఆంధ్రమహాసభ అభివృద్ధికి గొడ్డలిపెట్టుగా తయారవుతుందనీ ముగించారు. ఆంధ్రమహాసభకు ఎన్నికలు జరుపాలని దానిలో కోరారు. ఇదొక పెద్దకరపత్రం. అన్ని అంశాలనూ చక్కగా, సమగ్రంగా, సూటిగా, వివరంగా రాసిన (ప్రకటన) కరపత్రమిది. దీనిని పదివేలువేసి కార్యకర్తలు తెలంగాణా అంతటా పంచారు. ఆరోజుల్లో ఇదేమీ చిన్నవిషయంకాదు. ఆ ప్రకటనను చూసి వారు భయపడి— కమ్యూనిస్టులు మితవాదులను జాతీయవాదులను తుడిచివేసి కొత్త నాయకత్వం కావాలంటున్నారని వ్యాఖ్యానించారు. ప్రకటనలో "కొత్తనాయకత్వమ"నే పదాలు వుండవచ్చును. ఎన్నికల ద్వారా ఏర్పడిన కొత్తనాయకత్వం ఆంధ్రమహాసభను ఉద్యమాన్ని నడుపగలుగుతుందని దీనిలో ఉండవచ్చును. 'కొత్త నాయకత్వం' అనే మాటను చూసి తమను ఆంధ్రమహాసభ నుండి తీసివేయాలని కమ్యూనిస్టులు ప్రయత్నిస్తున్నారని ఈ కారణం వలన తాము దూరంగా వుంటామనీ ప్రకటించారు.

**సంస్థలోని సంక్షోభంపై మందుములవారి వివరణ :** ఈ పరిస్థితులకు దారితీసిన పరిణామాలను మందుముల నరసింగరావుగారు ఈవిధంగా వివరించారు:

"అంతవరకు కమ్యూనిస్టుపార్టీ, జాతీయపక్షం మరియు మితవాదులు— అందరూ ఆంధ్రమహాసభ వ్యవస్థలో కలిసియే యుండిరి. కానీ మితవాదులు,

జాతీయపక్షంవారు యెవరూ కమ్యూనిస్టుల కార్యక్రమము, విధానముతో ఏకీభ వించలేదు. అయితే అప్పటికి ఇంకా వేరుపడలేదు. కానీ ఘూరైన పార్టీ తగాదాలు వ్యవస్థలో బయలుదేరినవి." (50 సంవత్సరముల హైదరాబాదు, పేజీ-334).

అంతా ఆంధ్ర మహాసభలో కలిసి వున్నమాట నిజమే. మితవాదులు కమ్యూనిస్టులు భూస్వామ్య వ్యతిరేక పోరాట కార్యక్రమాన్ని అంగీకరించలేదు. కాని ఇత్తెహాదుల్ ముసల్మినుతో రాజీపడాలనే అంశాన్ని అంగీకరించారు. మందుముల నరసింగరావుగారే స్వయంగా ఆ సంస్థ అధ్యక్షుడైన బహదూరు యారుజంగ్‌తో సంప్రతింపులు జరిపారు. అవి ఒకానొక దశలో ఆగిపోయాయి.

వారు భూస్వామ్య వ్యతిరేక కార్యక్రమానికి బద్ధశత్రువులు. ఆ కార్యక్రమంమీదనే కమ్యూనిస్టులకూ, మితవాదులకూ తీవ్రమైన అభిప్రాయ భేదాలొచ్చాయి. ఆంధ్రమహాసభ చీలిపోవడానికి కారణమిదే.

జాతీయ పక్షంవారు కమ్యూనిస్టులతో ఎప్పుడూ ఏ సమస్యపైనా ఏకీభ వించలేదు. ఫ్యూడల్ దౌర్జన్యాలకు తామూ వ్యతిరేకమేనని అనేవారు కాని, వాటికి వ్యతిరేకంగా కమ్యూనిస్టులు నడిపించిన పోరాటాలలో ఎప్పుడూ కలిసి రాలేదు. తొలిదశలో తటస్థంగా ఉండేవారు. అయినా పెరుగుతున్న కమ్యూనిస్టుల పలుకు బడితో ఈర్ష్యాపరులై ఉండేవారు. మందుములవారు ఇలా రాశారు :

"పదనొకండవ ఆంధ్రమహాసభ జరుగుటకు పూర్వము భువనగిరి స్థాయి సంఘ సమావేశంలో జరిగిన చర్చలను మరియు ధోరణిని దృష్టిలోనుంచుకోవలసి యుంటుంది. ఈ సమావేశములో కమ్యూనిస్టు సభ్యులు అంతవరకు చలామణిలో నున్న పాత నాయకత్వంమారి, నవీన నాయకత్వం రావలెనని పట్టుపట్టిరి. వారి ఉద్దేశ్యము ముసలి నాయకత్వమునకు మారుగా యువక నాయకత్వము కాదని వారి ఉపన్యాసములు స్పష్టముగా తెలుపుచుండెను. అనగా జాతీయ నాయకత్వ మంతమొంది కమ్యూనిస్టు నాయకత్వము ఆంధ్ర మహాసభ వ్యవస్థలో స్థాపించ వలెనని కమ్యూనిస్టులు ధృఢ సంకల్పముతో ప్రయత్నించినారు. జాతీయ పక్షం వారు తటస్థ విధానం అవలంబించి కమ్యూనిస్టులకు సహాయపడిరి. ఓటుకుపెట్టగా అధిక సంఖ్యలోనున్న జాతీయ పక్షంవారు తటస్థ విధానం అవలంబించి ఓటు చేయక బుద్ధిపూర్వకముగా వదులుకొనిరి. మితవాదులు ఓటుచేసిరి. కాని ఓడి పోయిరి. ఆ కారణంగా అల్ప సంఖ్యలోనున్న కమ్యూనిస్టులు తమ ఓట్లతో గెలు పొందిరి. కనుక కమ్యూనిస్టులని వెల్లడియైన శ్రీ నారాయణరెడ్డి నాయకత్వమున

వారి అనుయాయులతో, వారి ఇష్టానుసారము పదనొకండవ ఆంధ్రమహాసభ భువనగిరిలో జరుపబడెను." (పై పుస్తకము, పేజి : 334-335)

కమ్యూనిస్టులు కార్యవర్గంలోనేగాక స్థాయీ సంఘంలోకూడా మైనారిటీలో ఉండేవారు. వారు పట్టుబట్టినంతమాత్రాన వారి తీర్మానాలను స్థాయీ సంఘం అంగీకరించదు; తిరస్కరిస్తుంది కూడా. మితవాదులు జాతీయ పక్షం వారిని కూడగట్టుకోలేకపోవడంవల్లనే—వారు తటస్థులైనారు; మితవాదులు మైనారిటీలో వుండిపోయారు. జాతీయ పక్షంవారు కమ్యూనిస్టులకు "సహాయపడిం"దేమీలేదు. వారికి కొన్ని స్వప్రయోజనాలుండేవి. వరంగల్ జిల్లాలో వారూ, కమ్యూనిస్టులూ కలిసి పనిచేసేవారు స్టేటు కాంగ్రెసు భవితవ్యం తేలని ఆ స్థితిలో ఆంధ్ర మహాసభను వదిలిరావటానికి వారు సిద్ధంగా లేకుండిరి. మితవాదులు కూడా సహాయ నిరాకరణకై నిర్ణయించుకున్నారేగాని, వైదొలగి పోటీ సంఘాన్ని ఏర్పరచటానికి అప్పటికి ఇంకా నిర్ణయించుకోలేదు, ఈ కారణాన జాతీయ పక్షం వారు తటస్థంగా వుండిపోయారు.

"జాతీయనాయకత్వమంతమొంది కమ్యూనిస్టు నాయకత్వా"న్ని స్థాపించాలని కమ్యూనిస్టులు నిర్ణయించుకున్నారనుట అర్థరహితమైనది. నిరంతరమూ చేసిన కృషి ఫలితంగా వారు ప్రజల్లోనూ, జాతీయవాదుల్లోనూ అపారమైన పలుకుబడి సంపాదించగలిగారు. ఆ పలుకుబడి ఎంతఉందో వారికే తెలియలేదంటే అతిశయోక్తి కాదు. అయినా ఆ స్థితిలో వారు ఆంధ్రమహాసభను స్వాధీనం చేసుకోగలుగుతామని భావించలేదు. మితవాదులు అస్త్రసన్యాసం చేయటంతో కమ్యూనిస్టులు ఆంధ్ర మహాసభ నాయకత్వాన్ని స్వీకరించటానికి నిర్ణయించారు.

జాతీయ నాయకత్వాన్ని అంతమొందించాలని కమ్యూనిస్టులు ఎప్పుడూ కోరలేదు. దానితో ఐక్యసంఘటనగా ఏర్పడి పనిచేయాలన్నదే వారికార్యక్రమం. మితవాదులు, జాతీయ పక్షంవారు దూరంగా ఉన్నప్పటికీ ఇతర మితవాదులూ, జాతీయవాదులూ కమ్యూనిస్టులతో కలిసివచ్చారు. వారితో ఐక్యత సాధించడానికి కమ్యూనిస్టులు ప్రత్యేక కృషిచేశారు. 11వ మహాసభలో వీరంతా పాల్గొన్నారు.

మందుములవారు "జాతీయ పక్షం ఉదాసీనత"ను గూర్చి ఇలా రాశారు :

"జాతీయ పక్షంవారి తటస్థ విధానమును కొంత వ్యాఖ్యానించటము అవసరమని తలుస్తాను. లేనియెడల ఈ విషయం అసందర్భంగానే ఉండిపోతుంది.

మహాసభలోని మితవాదులు సేవాతత్పరతతో రాత్రింబగళ్ళు ప్రజల్లో గనమై ఒక ఆశయసిద్ధికై ప్రయత్నించువారుకారని, మరియు వీరికి ఒక కార్యక్రమ మనునది లేదని మితవాదుల గురించి జాతీయపక్షం వారి భావన. కావున మిత వాదులది ఒక మునుగుతున్న పడవయని ఆ పడవలో తాము ఉన్నయెడల వారితో సహా తాము మునగడం తథ్యమని వారి అభిప్రాయం. కనీసం తామైనా మునగకుండా సురక్షితంగానుండుటకు మితవాదుల సహవాసము పనికిరాదని వారితో దూరముగా నుండుట అవసరమని నమ్ముతూ జాతీయపక్షంవారు తటస్థ విధానము నవలంబించిరి." (పై పుస్తకము-పేజీ 335)

నల్లగొండ జిల్లాలో జాతీయపక్షంవారి సంఖ్యాబలం కూడా లేకుండేది. వరంగల్లు జిల్లాలో సంఖ్యాబలంతోపాటు ఖమ్మం, మధిర తాలూకాల్లో ధనిక రైతులు భూస్వాములలో కొందరు జాతీయపక్షంవారికేగాక కమ్యూనిస్టులకు గూడా అభిమానులుగా ఉండేవారు. జాతీయపక్షంవారు వీరిని వదులుకోవటానికి సిద్ధంగా లేక తటస్థంగా ఉండటానికే నిర్ణయించుకున్నారు. మితవాదులను అనుసరిస్తే వీరి నుంచి దూరమవుతామని భయపడ్డారు.

**సంస్థలోని బలాబలాలపై మితవాదుల తప్పుడుఅంచనా :** మితవాదులు నాయకత్వం నుంచి తప్పుకోవడానికి కారణమేమిటి ? (1) ఎన్నికలద్వారా తాము మెజారిటీ సంపాదించగలుగుతామని వారికి ధైర్యం, ఆత్మవిశ్వాసం కొరవడింది. దీని ఫలితంగా ఎన్నికలకు సిద్ధంకాలేకపోయారు. (2) తాము లేకుండా కమ్యూనిస్టులు స్వయంగా ఆంధ్రమహాసభను నిర్వహించలేరని వీరికొక అభిప్రాయం ఉండేది. దానికి కారణాలు :

1) తమవల్లనే వర్తకులు, భూస్వాములు మొదలగు ఉన్నతశ్రేణివారంతా డబ్బులిస్తారు. ఆ విధంగా ఆంధ్రమహాసభ పనిచేస్తున్నది తమవలననే. తామే లేకుంటే కమ్యూనిస్టులు సామాన్యప్రజలపైన గ్రామీణ పేదలపైన ఆధారపడవలసి ఉంటుంది. పేదలివ్వగలిగిన డబ్బేమీలేదు. ఈ కారణంవలన వీరు కార్యకర్తలను పోషించలేరు. కార్యాలయాలను నడుపలేరు. నాయకులు పర్యటించలేరు. ఇదంతా జరుగాలంటే ఆర్థికంగా మితవాదులపైన, వారి పలుకుబడిపైన ఆధారపడవలసి ఉంటుంది.

2) తాము ఆంధ్రమహాసభలో వుండటం వలననే కమ్యూనిస్టుల మీద ప్రభుత్వ నిర్బంధ విధానం లేదు. తామే వైదొలగితే ప్రభుత్వం కమ్యూనిస్టు

లను దారుణంగా అణచివేస్తుంది. వారు నిస్సహాయులై ఉంటారు. ఈ రెండు కారణాలవల్ల వీరు ఈ ఆంధ్రమహాసభను నిర్వహించలేరు. ఒకవేళ నిర్వహించ టానికి సిద్ధమైతే ప్రభుత్వం వీరిని అణచివేస్తుంది. కొంచెం బిగుసుకొని కూర్చు న్నట్టయితే కమ్యూనిస్టులు కాళ్ళబేరానికొచ్చి నాయకత్వాన్నంతా చేతికిచ్చి తాము చెప్పినట్లు వింటామని హామీఇచ్చి 'పడుంటారని' వారి అభిప్రాయం.

3) వారికి మరో అభిప్రాయం కూడా ఉండటం కద్దు. ఆంధ్రమహాసభలో "మంచి కమ్యూనిస్టుల"నే వారు కొందరున్నారు. (రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి, ఆరుట్ల లక్ష్మీనరసింహారెడ్డిగారలకు మంచి కమ్యూనిస్టులని పేరు.) వీరి అనుచరులు అన్నిజిల్లాల్లో ఉండేవారు. గ్రామాల్లో పనిచేసి ప్రజలను సమీకరించే కార్యకర్తలంతా చెడ్డ కమ్యూనిస్టులని దీని అర్థం. వీరిని హింసావాదు లనో మరోపేరుతోనో పిలిచేవారు. ఈ రెండు ధోరణులవారినీ విడదీయడానికి ఏదైనా ప్రయత్నం చేసి ఉంటారు.

కొత్త నాయకత్వం అంటే కమ్యూనిస్టుల యొక్క నాయకత్వమనే అంశంపై వారు కేంద్రీకరించి, తమను తొలగించడానికోసం ప్రయత్నంచేస్తున్నా రనీ, ఇంతకాలం నుంచి తాము పునాదులువేసి, నిర్మించి, పెంచి పెద్దచేసిన ఆంధ్ర మహాసభను ఆక్రమించుకొని తమను వెళ్ళగొట్టడానికి ప్రయత్నంచేస్తున్నారనీ ప్రచారంచేశారు. రెండవవైపున కమ్యూనిస్టులు ఆంధ్రమహాసభను నిర్వహించ లేరనీ, నిర్వహించటానికి ప్రయత్నించినా ప్రభుత్వం వీరిని అణచివేస్తుందనీ ఈ కారణాన కమ్యూనిస్టులు కాళ్ళబేరానికి రాకతప్పదనే అంచనాతో ఉన్నారు. కాని కమ్యూనిస్టులు అలాంటి కాళ్ళబేరానికి రావడానికి సిద్ధంగాలేరనీ, ఎన్నికలు జరపాల్సిందేననీ, ఎన్నికల ఫలితాలను బట్టి సమిష్టి నాయకత్వం ఏర్పడవలసిందే కాని, మితవాదులకే నాయకత్వం ఉండదనీ, కమ్యూనిస్టులతో అంతా కలిసి కట్టుగా పనిచేయాలనీ, తాము ఎవరినీ తొలగించదలచలేదని కమ్యూనిస్టులు స్పష్టం చేశారు.

మితవాదుల అంచనాలన్నీ తలక్రిందులైనాయి. కమ్యూనిస్టులు చరిత్రా త్మకమైన బాధ్యతను స్వీకరించి దొరికిన మహదవకాశాన్ని ఉపయోగించుకున్నారు.

# 4. ఐక్యతకోసం కృషి

అయినా మితవాదులు బిగుసుకునే కూర్చున్నారు. వారితో కొంత దూరంగా వున్న జాతీయ పక్షంవారుకూడా మితవాద స్వభావం కలవారే. ఈ అవకాశాన్నుపయోగించుకొని కమ్యూనిస్టులకూ మితవాదులకూ మధ్య ఐక్యత ఏర్పడకుండాచేసి, మితవాదుల తోడ్పాటుతో వేరే ఆంధ్రమహాసభను ఏర్పాటు చేసి కాంగ్రెసుకు బదులుగా ఆ సంస్థను ఉపయోగించాలనే లక్ష్యంతో జాతీయ పక్షం వారు ముందుకు వచ్చారు. మితవాదులతో సంప్రదింపులు చేశారు. ఒక వైపున ఈ రెండు శక్తులూ ఐక్యంకావడానికి ప్రయత్నిస్తూ ఉంటే, మరోవైపున ఆంధ్రమహాసభలో అందరూ ఎప్పటిలాగానే కలిసిపనిచేయాలనీ, ఎన్నికల ఫలితంగా ఏ నాయకత్వం వస్తే దానిని అంతా అంగీకరించాలనీ, ఎవరూకూడా తమ అభిప్రాయాలను ఆంధ్రమహాసభపై రుద్దకూడదని కమ్యూనిస్టులు ప్రచారం చేశారు. అయినా ఆంధ్రమహాసభ చీలడం దాదాపు ఖాయమనే పరిస్థితులేర్పడి నవి. సంస్థలో ఐక్యత సాధించటానికి రెండు వైపులనుంచి ప్రయత్నాలు సాగినవి.

**1. స్వామి రామానందతీర్థ ప్రయత్నం :** ఆయన స్టేటు కాంగ్రెసు నాయకుడైనప్పటికీ ప్రభుత్వం ఆ సంస్థను నిషేధించింది. దానికి నిర్మాణమేమీ లేదు. తెలంగాణాలో ఆయన అనుచరులు వేళ్ళమీద లెక్కించగలిగినంత మంది ఉండేవారు. సంస్థలో ఐక్యతను సాధించటంకోసం ఆయన ఇరుపక్షాలతో సంప్రదించాడు. కాని "అభిప్రాయభేదాలు మౌలికమైనవి" కావడం వలన రెండు గ్రూపులు విడిపోయాయని తాను రచించిన "హైదరాబాదు స్వాతంత్ర్య పోరాటపు స్మృతుల"లో (పేజి 148) రాశారు.

**2. రాజబహద్దూరు వెంకట్రామారెడ్డి గారు (కొత్వాలు) ఐక్యత కోసం చేసిన కృషి :** ఇరుపక్షాల వారిని ఆహ్వానించి తన ఇంట్లోనే సమా వేశపరిచారు. మితవాదుల తరపున మందుముల నర్సింగరావు, జాతీయపక్షం తరపున మందుముల రామచంద్రరావు మరికొందరు వచ్చారు. కమ్యూనిస్టులవైపు నుంచి రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి, ఆరుట్ల లక్ష్మినర్సింహారెడ్డి, దేవులపల్లి వెంకటేశ్వరరావు ఉన్నారు. మధ్యన హాలులో ఉన్న ఒక పెద్ద

టేబులుకు రెండు పక్కలా ఇరుపక్షాలవారిని కూర్చోబెట్టారు. వెంకటరామారెడ్డి గారు మధ్యలో కుర్చీవేసుకొని కూర్చున్నారు. ఎవరెవరి ఆరోపణలేమిటో చెప్ప మని సూచించారు. మితవాదులు, జాతీయపక్షంవారు పాతపాటలే పాడారు. కౌల్దార్ల సమస్యలు హింస-అహింస మొదలగు వాటిని లేవనెత్తారు. వారి ఆరో పణలకన్నిటికీ కమ్యూనిస్టులు సమాధానం చెప్పారు. వినడం కొరకు మామూలుగా ఆయన దగ్గరికి వచ్చే విద్యార్థులేకాక 'లా' కాలేజీనుంచి డిగ్రీకాలేజీనుంచి సుమారు 50 మంది విద్యార్థులు, పెద్దవారు ఈ సంభాషణలను చర్చలను వినాలని వచ్చారు. అంతా చుట్టూ నిలబడి ఆసక్తిగా విన్నారు.

వారు తెచ్చిన సమస్యలన్నిటికి సమాధానం చెప్పినతర్వాత చివరకు ఒక అమ్మాయి సమస్యను తీసుకు వచ్చారు. కమ్యూనిస్టులు నీచులని "నిరూపించ టానికి" ఆ అమ్మాయిని ఇంటినుంచి ఎత్తుకుపోయారని ఆరోపించారు. 'ఏమిటి ఆ సంగతి?' అని వెంకటరామారెడ్డి గారుఅడిగారు దానికి సంబంధించిన వివరాలన్నీ తెలిసిన వారిలో ఒకరు ఇది పూర్తిగా అసత్యమని ఆరోపణను ఖండించారు.

ఆ సందర్భంలో ఈ వివరాలు చెప్పారు: ఆ కుటుంబం వారు పార్టీకి సన్నిహితులు. శాయశక్తులా పార్టీకి సహాయపడినారు. ఆంధ్రమహాసభతో సంబంధమున్నవారు, కృష్ణా జిల్లాలోని ఒక కమ్యూనిస్టు కుటుంబంతో సంబంధ మున్నవారు. వారి అమ్మాయి కొద్దిగానే చదువుకున్నప్పటికీ పార్టీతో సంబంధాలుండుటవలన కమ్యూనిస్టు అభిప్రాయాలేర్పరచుకున్నది. తన భవి ష్యత్తును తాననుకున్న విధంగా రూపొందించుకోవాలని నిర్ణయించుకున్నది. ఆ కుటుంబంతో తమకు ఎలాంటి వైషమ్యంలేదు. భార్య చనిపోయి పిల్లలున్న ఒక వ్యక్తికి ఆ అమ్మాయిని ఇచ్చి పెళ్ళి చేయాలని కుటుంబంవారు ప్రయత్నించారు. తనకు ఇష్టంలేని వివాహాన్ని తిరస్కరించి ఆ సందర్భంలో ఆ అమ్మాయి పార్టీకి కబురు చేసింది. కాని పార్టీ కార్యకర్తలు, పార్టీ నాయకత్వం అందుకోలేక పోయినారు. పెళ్ళి రోజులుదగ్గరకు వస్తున్నాయని గమనించిన ఆ అమ్మాయి ఎవరికి చెప్పకనే బెజవాడలో ఉన్న పార్టీ ఆఫీసుకు వెళ్ళిపోయింది. స్థానిక పార్టీకి ఈ సంగతి తెలిసిన వెంటనే ఆమెకోసం వెతికారు. కుటుంబం వారు కూడా వెతికారు. చివరకు విజయవాడలోని పార్టీ ఆఫీసులో ఉందని తెలిసింది. ఆమె పార్టీ ఆఫీసు చేరగానే సురక్షితంగా ఉందనే విషయాన్ని ఆ కుటుంబం వారికి వివరంగా చెప్పించారు. అక్కడివారు బంధువులతో ఉంచాలనికూడా ప్రయత్నం

చేశారు. కాని ఆమె ఇష్టపడలేదు. ఆఫీసులోనే ఉంటూ చదువుకొంటున్నది. ఎవరైనా వెళ్ళి ఆమెతో మాట్లాడవచ్చును. ఏ ఆటంకమూ లేదు.

ఈ వివరాలు విన్న రాజాబహదూర్‌గారు కమ్యూనిస్టులను కోపగించ లేదు. మితవాదులనే బాగా చివాట్లు పెట్టారు. 'మీరంతా' ఇలాంటి రెండవ వివాహాలు ఉచితంకాదు, పెద్దవాళ్ళకు చిన్న పిల్లల్నిచ్చి పెళ్ళి చెయ్యటం మంచిది కాదు; వారి ఇష్టమైన వారినే పెళ్ళి చేసుకోవాల'ని ఉపన్యాసాలు ఇస్తూ ఉంటారు. గద్దెలమీద తీర్మానాలు చేస్తూ ఉంటారు. ఆంధ్రమహాసభలో కూడా ఇటువంటి తీర్మానాలు జరిగినవి. దీనికి విరుద్ధంగా మీరెందుకు ఇలాంటి నీచమైన పనికి ఒడిగట్టారు? వారుచేసిన పనిలో తప్పేమిటి? దానిని హర్షించాలి కాని నిందించటం మంచిదికాద'ని అన్నారు. దీనితో వారు కోపంతో తాము తెచ్చిన ఫైళ్ళను (రికార్డులన్నీ ఫైళ్ళలో తీసుకువచ్చారు) నేలకు కొట్టి వెళ్ళిపోయారు. అక్కడ వున్నవారంతా నవ్వారు చూడటానికి వచ్చిన విద్యార్థులంతా వారు ఎంత పనికి మాలినవారో తెలుసుకున్నారు. ఆంధ్రమహాసభలో ఐక్యతకోసం జరిగిన ఈ సంప్రదింపులు రాజాబహద్దరు వెంకటరామారెడ్డిగారిఆధ్వర్యాన జరిగి నప్పటికీ రాజారామదేవరాయ్ (వనపర్తి) లాంటి పైవర్గాలవారు వీటిని ప్రోత్స హించారు.

రాజాబహద్దరు వెంకటరామారెడ్డిగారి జీవితచరిత్రలో సురవరం ప్రతాపరెడ్డి గారు ఈ అంశాన్ని గూర్చి ఇలా రాశారు :

'ఆంధ్రోద్యమము పట్ల వీరికి గాఢమైన అభిమానముండెను. ఆంధ్ర మహా సభ ఐకమత్యముతో పనిచేయవలెనని వీరు సదా ఆకాంక్షించియుండిరి. ఆంధ్రో ద్యమమున అభిప్రాయభేదాలు పొడ చూపిన సందర్భములందు ఐకమత్యసాధనకు వీరు కృషిచేసిన నిదర్శనాలు కలవు. ఆంధ్రమహాసభలో తీవ్రమైన అభిప్రాయ భేదాలు పొడసూపి, సంస్థ శ్రీరావి నారాయణరెడ్డి ప్రభృతుల ఆధీనమైనతర్వాత 1947 సంవత్సరమున పదకొండవ మహాసభ భువనగిరిలో జరిగినది. ఈ పద కొండవ మహాసభకు రాజాబహద్దరు వేంకటరామారెడ్డిగారు వెళ్ళి చూచియుండిరి. ఆంధ్రనాయకులు పరస్పర విభేదాలు తొలగించుకొని దేశాభివృద్ధికి కృషిచేయవలె నని రాజాబహద్దరుగారు ఆకాంక్షించి యుండిరి. ఆంధ్రాభ్యుదయమునకు తోడ్పడు యే ఉద్యమమునకైనను చేయూతనిచ్చుట వారి ఆశయమై యుండెను". (పేజి 185)

పై సంఘటన ఒక నిదర్శనం. వారు భువనగిరి మహాసభకు వెళ్ళి చూడ టానికి కారణము కమ్యూనిస్టులయెడ అభిమానమునుకోవటం తప్పు. వారికి రావి నారాయణరెడ్డిగారి యెడ అపారమైన అభిమానం ఉండేది. తాను స్థాపించిన రెడ్డి హాస్టలులో విద్యార్థిగా ఉన్నవారు ఆంధ్రమహాసభకు రెండవసారి అధ్యక్షులు కావటం వారికి సంతోషదాయకమైనది (ఉన్నత పదవులందుకున్న హాస్టలు విద్యార్థులందరినీ ఆయనబాగా అభిమానించేవారు.) ఆయన ఆధ్వర్యాననడిచిన ఐక్యతా ప్రయత్నాలను భగ్నంచేసింది మితవాదులేనని తెలుసుకున్నారు. భువనగిరి మహాసభ జరిగేనాటికి మితవాదులు తము మహాసభను జరుపుకోలేదు. అంతేకాక విప్లవ రాజకీయాలవైపు వెళుతున్న ఆంధ్రోద్యమాన్ని రావినారాయణరెడ్డివంటి మితవాద శక్తులద్వారా అదుపులో ఉంచటం పాలక వర్గాలకు శ్రేయస్కరమని ఆయన భావించారు. వందేమాతరం ఉద్యమ సందర్భంలో ఆయన చేసినపని ఇదే. ఆంధ్రోద్యమాన్ని అభిమానించినా, మరోపనిచేసినా రాజభక్తి పరాయణత్వానికి లోబడే చేశారు. ఎప్పుడూ ఆ పరిమితులు దాటలేదు.

## 5. పదకొండవ మహాసభ (భువనగిరి, 1944 మే)

ఐక్యతకోసం చేసిన ప్రయత్నాలను మితవాదులు భగ్నంచేశారు. దీని ఫలితంగా ఇరుపక్షాలవారూ రెండు వైపులుగా కృషిసాగించారు. మితవాదులు జాతీయపక్షం వారితో కలిసి వేరే మహాసభను ఏర్పాటు చేయటానికి ప్రయత్నించారు. మరోవైపున పదకొండవ ఆంధ్రమహాసభ కొరకు ప్రయత్నం జరిగింది. దీనికొరకు ఆంధ్రమహాసభ కార్యకర్తలందరూ కూడా ముందుకువచ్చారు. వీరంతా నూటికి నూరుపాళ్ళు పార్టీవారుకారు. 'ఈ మితవాదులు సరిగా పనిచేయరు పని చేసేవారిచేతిలో ఆంధ్రమహాసభ ఉండాల'నికోరే ఒక మితవాదవర్గంకూడాఉండేది. వారు హైదరాబాదు నగరంలోనేగాక జిల్లా తాలూకాకేంద్రాల్లోకూడా ఉండేవారు. వారంతా పై మితవాదులలో చేరలేదు. కమ్యూనిస్టులకే సాయంచేశారు. అప్పటికే ఆంధ్రమహాసభలో పనిచేసే కమ్యూనిస్టు కార్యకర్తలు గణనీయమైన సంఖ్యలో తయారైనారు.

ఆ పరిస్థితుల్లో జిల్లా స్థాయిలో ఆంధ్రమహాసభ ఎన్నికలు జరిగాయి. అప్పటికేతాలూకా, గ్రామకమిటీలు ఏర్పడ్డాయి. సభ్యత్వాన్ని ఆధారంగా చేసుకొని

గ్రామకమిటీలు ఏర్పడ్డాయి. ఒక గ్రామంలో చేరిన ప్రాథమిక సభ్యులంతా పూర్వమే ఉన్న, లేక కొత్తగా గ్రామకమిటీలను ఎన్నుకున్నారు. అదేవిధంగా తాలూకా జిల్లా కమిటీలను నియమావళి ప్రకారమే ఎన్నుకున్నారు. ఇవన్నీ ప్రతి నిధుల సమావేశంలో ఎన్నుకున్న కమిటీలు. ఈ కమిటీల్లో మితవాదుల అను కూలురు దూరంగా ఉన్నారు. దాదాపు అన్ని ప్రాంతాల్లో ఎలాంటిగొడవలులేకనే మితవాదులు తమ స్థానాలను వదిలివేశారు. అప్పటికే వరంగల్లు, కరీంనగర్, ఆదిలాబాద్ మొదలగు జిల్లాలలో జాతీయవాదులు, కమ్యూనిస్టులు కలిసి కీలక స్థానాల్లో ఉండేవారు. వారు అలాగే ఉండిపోయారు. నల్లగొండ జిల్లాలో మాత్రం మితవాదులు అగ్రస్థానాల్లో ఉండేవారు. వారు ఏ స్థానాలకూ పోటీచేయక వదిలి వేశారు. జిల్లా కమిటీలు ఏర్పడ్డవి అన్నిస్థాయిల్లో నియమావళి ప్రకారం క్రమ బద్ధంగా ఎన్నుకున్న కమిటీలు రూపొందినవి. తరువాత పదకొండవ ఆంధ్ర మహాసభను భువనగిరిలో జరపాలని కేంద్రకార్యవర్గం వారు నిర్ణయించారు.

భువనగిరిలో కమ్యూనిస్టుల చొరవతో ఏర్పడిన మిత్రమండలి అను యువజన సంఘం అప్పటికే పనిచేస్తూ ఉండేది. వర్తకులంతా దీనితోసహకరించే వారు. వీరే 11వ మహాసభ సందర్భంలో బాగా తోడ్పడ్డారు. సంపన్నులైన వర్తకులెవ్వరూ కమ్యూనిస్టులకు సహకారం చేయరని మితవాదులు భావించారు కాని అలాంటిదేమీ జరుగలేదు. అంతా సహకారం చేశారు. చుట్టుపట్టు గ్రామా ల్లోని రైతులూ,భూస్వాములూ సహకరించారు. మహాసభకు ఏకొరత లేకనే అన్ని ఏర్పాట్లు జరిగినాయి.

మహాసభకు ఆహ్వానసంఘమొకటి ఏర్పడింది. అంతకుముందే వరంగల్లులో ఆజంజాహి మిల్లులో కార్మికుల సుదీర్ఘమైన సమ్మె జరిగింది. ఆ సందర్భంలో సమ్మె నాయకులైన సర్వదేవభట్ల రామనాథంగారిని జిల్లా నుంచి బహిష్కరిం చింది ప్రభుత్వం. దీని ఫలితంగా వారు హైదరాబాదుకు వచ్చారు. వారు భువన గిరి వచ్చి ఆహ్వానసంఘం తరపున పూర్తిగా బాధ్యత వహించి పనిచేసి కార్య క్రమాన్ని నిర్వహించారు. స్థానిక నాయకులైన ఆరుట్ల లక్ష్మీనరసింహారెడ్డి, ఆరుట్ల రాంచంద్రారెడ్డిగారలు పనిచేశారు. ఆంధ్రమహాసభ జిల్లా అధ్యక్షులుగా ఎన్నుకోబడిన దేవులపల్లి వెంకటేశ్వరరావు కూడా అక్కడే వుంటూ మహాసభ ఏర్పాట్లన్నీ చూశారు.

పెద్దపాకలు (Pendals) వేసి ప్రతినిధుల సమావేశం, భోజన, నివాస

వసతికోసం ఏర్పాట్లు చేశారు ఆహ్వానసంఘం వారు. అన్ని జిల్లాలనుంచి ప్రతినిధులు పెద్ద సంఖ్యలో వచ్చారు. ప్రారంభంలో ఊరేగింపు జరిగింది.

**అధ్యక్షోపన్యాసంలోని ముఖ్యమైన అంశాలు :** ఫాసిస్టు వ్యతిరేక యుద్ధ పంథాకు అనుగుణ్యంగా ప్రభుత్వంతో సహకారం చేయటం, లేవీధాన్యం వసూలు నిబంధనల్లో మార్పులపై సూచనలు, ఆహారధాన్యాల పంపకం మొ॥ సమస్యలపై సూచనలు,ముస్లింలసంస్థఅయినఇత్తెహాదుల్‌ముసల్మీన్‌కుసగంస్థానాలు,ఆంధ్రమహాసభ, మహారాష్ట్రపరిషత్తు, కర్ణాటకపరిషత్తు ఈ మూడింటికికలిపి సగంస్థానాలతో, సంస్థాన మంత్రివర్గం ఏర్పాటు చేయాలని ఒక సూచనకూడా దానిలో ఉంది. పార్టీ పాలసీకి అనుగుణ్యంగా చేసినసూచన మాత్రమే ఇది. కాని మహాసభలో తీర్మానం తీసుకురాలేదు. రాజ్యాంగ సంస్కరణల గురించి అంతకు ముందున్న తీర్మానమే యథాతథంగా ఉన్నది. జాతీయ పక్షానికి చెందినటువంటి కొందరు హాజరయి హింస, అహింసావాదం సమస్యనుతెచ్చారు. ఆంధ్రమహాసభ అహింసా విధానానికి కట్టుబడి ఉంటుందని తీర్మానించాలని పట్టుబట్టారు. సుదీర్ఘమైనచర్చల తర్వాత, 'అలాంటిది ఎప్పుడూ చేయలేదు ఇప్పుడు చేయవలసిన అవసరంలేద'ని ఆ సూచనను నిరాకరించారు. నియమావళిలో ఒక ముఖ్యమైన మార్పు చేశారు అంతవరకున్న నాలుగణాల సభ్యత్వాన్నుంచి అణా సభ్యత్వానికి మార్చారు. సామాన్య, పేదరైతులు, కూలీలు సభ్యులుగా చేరడానికి వీలు కలిగించటమే ఈ మార్పు ఉద్దేశ్యం. ఆంధ్రమహాసభలో శ్రామిక నియంతృత్వాన్ని ఏర్పాటు చేయటమే ఈ సవరణ సారాంశమని చెపుతూ మితవాదులు దీనినొక వివాదస్పదమైన సమస్యగా తరువాత రోజుల్లో మార్చారు.

ప్రతినిధులు కార్యవర్గాన్ని ఎన్నుకున్నారు. దానిలో పార్టీ నాయకులతో బాటు పార్టీయేతరులు కూడా తగినంత సంఖ్యలో ఉన్నారు. ఈ సందర్భంలో కీ॥శే॥ పోల్కంపల్లి వెంకట్రామారావుగారు నిర్వహించిన పాత్రను ఉగ్గడించటం అవసరం. వారు సమర్థులైన లాయరు (బి.ఎ,ఎల్.ఎల్.బి). రాజకీయాల్లో అన్ని సమయాల్లో ముందు అతివాదులవైపున, కమ్యూనిస్టుపార్టీ ఏర్పడిన తర్వాత దానివైపున ఉంటూ కమ్యూనిస్టులు ప్రతిపాదించిన ముఖ్యతీర్మానాలను బలపరిచేవారు. వాటిని ఎంతో నైపుణ్యంతో ప్రతినిధులకు వివరించి ఆ తీర్మానాలకు బలాన్ని సంపాదించేవారు. వారిని కార్యవర్గంలోకి ఎన్నుకున్నారు. వీరు పార్టీలో చేరకున్నప్పటికీ చివరిదాకా అభిమానులుగానే ఉన్నారు. బద్దం ఎల్లారెడ్డిగారిని ప్రధాన

కార్యదర్శిగా ఎన్నుకున్నారు. కీ॥శే॥ పట్టికోట ఆళ్వారుస్వామిని అర్గనైజింగు సెక్రటరీగా నియమించారు. వీరు ఆంధ్రమహాసభ ఆఫీసుతోపాటు నిర్మాణాన్ని కూడా చూచేవారు. ఆళ్వారుస్వామి రచయితమాత్రమే కాదు. ఆయన నల్లగొండ జిల్లాలోని ఒక గ్రామంలో జన్మించారు. తొలి జీవితంలో పేదరికంఅనుభవించారు. అనేకరకాల పేదతనంతో పోరాటంచేసి పైకివచ్చినటువంటివారు. స్కూలు,కాలేజీ విద్యలేకనే స్వయంగా కష్టించి చదువుకొని రచయిత అయినాడు. బాగా సంపన్న జీవితం గడపటానికి అవకాశం ఉండికూడా దానిని స్వీకరించలేదు తన కాళ్ళ మీద తాను నిలబడి జీవించాలనే లక్ష్యంతో కృషిచేశాడు. ఆ విధంగా చివరంటా జీవించాడు. ఆ నాటికే దేశోద్ధారక గ్రంథమాలను ఏర్పాటు చేసి ఎన్నో పుస్త కాలను దానిద్వారా ప్రచురించాడు. జాతీయభావాలు వ్యాపించటానికి ఈ రచనలు ఎంతో తోడ్పడ్డాయి. ముందు జాతీయవాదిగా తరువాత కమ్యూనిస్టుగా తన రాజకీయ జీవితాన్ని సాగించాడు. ఆయనకు ఆంధ్రమహాసభతో బాటు సికిందరా బాదు గుమాస్తాల సంఘంతో సంబంధం ఉండేది.

## 6. ఆర్యసమాజం వారి వైఖరి

తెలంగాణా జిల్లాలలో కమ్యూనిస్టుపార్టీ బలపడుతున్నాకొద్దీ ఆర్యసమాజం ప్రభావం క్రమంగా తగ్గిపోయింది. యువకులంతా పార్టీవైపు మొగ్గుచూపారు. అయినా పార్టీని నిజాం వ్యతిరేక శక్తిఅనీ, ప్రజలముందుండి నిజాంతో పోరాడే వారిలో వీరే ముఖ్యులనీ ఆర్యసమాజంవారు గుర్తించారు. ఆ దృష్టితో సహకార భావాన్ని ప్రదర్శించేవారు. దీనికి ఉదాహరణగా ఒక సంఘటనను పేర్కొన వచ్చును. 11వ ఆంధ్రమహాసభకు కొన్ని నెలలముందు, ఆర్యసమాజ నాయకు లైన పండిత నరేంద్రజీగారు నల్లగొండకు వచ్చారు. అప్పటికే నల్లగొండ హైస్కూలు విద్యార్థులంతా పార్టీవైపుకు వచ్చారు. ఏ ఆర్యసమాజ సభలోనైనా విద్యార్థులు గణనీయమైన సంఖ్యలో హాజరయ్యేవారు. నల్లగొండలో కూడా విద్యార్థులలో వారికి చాలాపలుకుబడి ఉండటంవలన వారే సభలకు పెద్ద సంఖ్యలో హాజరయ్యేవారు. వారంతా కమ్యూనిస్టు పార్టీతో ప్రభావితులైనందున స్థానిక ఆర్యసమాజ నాయకుడు సమావేశాన్ని తనకుతానుగా జరుపలేకపోయాడు. సభకు విద్యార్థులు రాకపోవచ్చుననీ, ఇతర స్థానికులు కొద్దిమంది మాత్రమే

ఉంటారనీ, ఆవిధంగా సభ పేలవంగా ఉంటుందనీ ఆందోళనపడినాడు. ఆ సమయంలో అక్కడున్న జిల్లా కమ్యూనిస్టు కమిటీ కార్యదర్శి దగ్గరకువెళ్ళి నరేంద్రజీగారు ఉపన్యసించే సభకు విద్యార్థులను పంపించమని కోరారు. 'నరేంద్రజీగారు తమ ఉపన్యాసంలో పార్టీని కమూనిస్టు సిద్ధాంతాలను విమర్శిస్తే యువకులైన విద్యార్థులు ప్రశ్నలు వేయవచ్చును. దానివలన మీకు, వారికి ఇబ్బందిగా ఉంటుంది. మీరు మరోవిధంగా భావించవచ్చును. ఈ పరిస్థితుల్లో విద్యార్థులను పంపటం ఎలా సాధ్యమవుతుంది?' అని కార్యదర్శి వారిని ప్రశ్నించారు. 'అలాంటిదేమీ లేదు అంతా సాఫీగా జరిగేట్టు చూస్తాము. హెచ్చుమందివచ్చే పరిస్థితిలేదు. పెద్దమనుషులు వచ్చినప్పుడు నలుగురు ఉంటే బాగుంటుందని ఆయన సహకారం కావాలని సద్భావంతో అడిగారు. కార్యదర్శి అంగీకరించి విద్యార్థులందరినీ వెళ్ళమని చెప్పారు. వారు సిద్ధమవుతున్న సమయంలో ఆయన కార్యదర్శిని కూడా సభకు ఆహ్వానించారు. ఆయన మళ్ళీ అదేప్రశ్న వేశారు. 'అలాంటిదేమీ ఉండదు. మిమ్మలను ఆహ్వానిస్తున్నప్పుడు ఆ బాధ్యతను మాకు వదిలిపెట్టండి, అంతా సవ్యంగా జరిగిపోతుందని మానమ్మకమ'ని చెప్పారు. ఆయనకూడా వెళ్ళారు.

నరేంద్రజీ తమ ఉపన్యాసంలో సాధారణంగా చెప్పే విషయాలన్నీ చెప్పారు. కమ్యూనిజాన్ని గురించిచెప్తూ 'భగవంతుడు ఉన్నాడా లేడా అనే సమస్యపై తప్ప కమ్యూనిస్టుల ఆర్థిక సామాజిక సిద్ధాంతాలతో భేదించవలసిందేమీలేద'ని స్పష్టంగా నిర్మొహమాటంగా చెప్పేసారు. ఈ అంశాన్ని విని సభకు హాజరయిన వారంతా సంతోషపడినారు. వారు నిస్వార్థంగా, నిష్కర్షగా చెప్పారవి అందరూ భావించారు. తరువాత వారు కార్యదర్శితో మాట్లాడారు. మాటల సందర్భంలో వారు ఆంధ్రమహాసభలో మితవాదులకు వ్యతిరేకంగా కమ్యూనిస్టులు చేస్తున్న పోరాటాన్ని ఎంతో హర్షించారు. మితవాదులు ప్రభుత్వానికి అనుకూలమైనవారని, అనేకవిధాల ఇబ్బంది పెట్టేవారనీ, వారితో చెలిమి నిరుపయోగమనీ స్పష్టంగా చెప్పారు. పార్టీ కార్యకలాపాలపై వారికున్న అభిమానాన్ని స్పష్టంగా వ్యక్తపరిచారాసందర్భంలో. కమ్యూనిస్టుపార్టీ నిజాం వ్యతిరేకశక్తుల అభిమానాన్ని ఎలా చూరగొన్నదో చెప్పటానికి దీనినొక నిదర్శనంగా చూపవచ్చును.

ఇలాంటి పరిస్థితులలో భువనగిరిలో ఆంధ్రమహాసభ జరిగింది: ప్రజా ఉద్యమ చరిత్రలో నూతన అధ్యాయాన్ని ప్రారంభించింది.

## 7. ప్రజావెల్లువ (Mass Upsurge)

భువనగిరి మహాసభ జయప్రదంగాముగిసిన తర్వాత ఈ విజయాలన్నింటినీ సంఘటిత పరచాలనీ, పార్టీ, ఆంధ్రమహాసభ నాయకత్వాలు నిర్ణయించాయి. జిల్లాకమిటీ తన కార్యకర్తలను వివిధప్రాంతాలకు పంపి పార్టీని నిర్మించటానికి కృషిచేసింది అదేవిధంగా ఆంధ్రమహాసభ జిల్లాకమిటీ కార్యకర్తలను కూడా సమావేశపరిచి పదకొండవ మహాసభ తీర్మానాలను అమలు జరుపుటకు కార్యక్రమాన్ని అందించింది. హైదరాబాదు నగరంతోసహా ఇతర జిల్లాలలో కూడా ఈ కార్యకలాపాలు పెద్దఎత్తున సాగాయి. అంతటా ప్రజల్లో పెద్ద ఎత్తున సంచలనం కనిపించింది.

భారతదేశమంతటా ప్రజాకార్యకలాపాలకు అనుకూలమైన పరిస్థితులు ఏర్పడినవి.

కాంగ్రెసు, బ్రిటిషు ప్రభుత్వం మధ్య సంప్రదింపులు ప్రారంభమైనవి. కాంగ్రెసును, ముస్లింలీగును కలిపి ఒక ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయటానికి ప్రయత్నం జరిగింది. కాంగ్రెసు 1946 ఎన్నికల్లో పాల్గొనడానికి సన్నాహాలు చేయ ప్రారంభించింది. ఆగస్టు 1942 ఉద్యమ సందర్భంలో అరెస్టయినవారు విడుదల అయ్యారు.

కమ్యూనిస్టుపార్టీ రైతాంగానికి, కార్మికవర్గానికి, పట్టణ మధ్య తరగతి ప్రజలకూ నాయకత్వం వహించింది. దీనికి ఎన్ని పరిమితులున్నా సంస్థాన చరిత్రలో మొదటిసారిగా ఇలాంటి పరిణామ మేర్పడింది. మహాసభ చివరిరోజున హాజరైన ప్రజలు స్వయంగా దీనిని చూశారు. పత్రికల్లో వచ్చిన వార్తలవల్ల నేమీ, జిల్లాలోని వివిధ ప్రాంతాలనుంచి వచ్చిన ప్రతినిధులు తమ స్వస్థానాలకు తిరిగి వెళ్ళిన తర్వాత జయప్రదంగా ముగిసిన మహాసభ విశేషాలను ప్రచారం చేసినందువల్లనేమీ, మితవాదుల అనుచరులు చేసిన దుష్ప్రచారం వల్లనేమీ సామాన్యప్రజలు మహాసభ ప్రాధాన్యతను గుర్తించసాగారు. ఫ్యూడల్ భూస్వాములను—దేశముఖులు, జాగీర్దారులు, మక్తాదారులు—ఎదిరించడానికి తమకు అండ

దండలున్నాయని గుర్తించారు. మితవాదులు ఆంధ్రమహాసభనుంచి తొలగి పోయి నందున సామాన్య ప్రజానీకానికి ఆత్మవిశ్వాసం ఏర్పడింది. తమ తమ ప్రాంతాలలో తాము పోరాటానికి సిద్ధం కావచ్చును, సిద్ధం కావాలి అనే వైఖరి వారిలో ఏర్పడింది.

11వ ఆంధ్రమహాసభ పూర్తి అయిన తర్వాత తాలూకా కేంద్రాల్లోని ఆంధ్రమహాసభ కార్యాలయాలు బాగా పనిచేయసాగాయి. భువనగిరి కార్యాలయంలో ఆరుట్ల రామచంద్రారెడ్డిగారు ఉన్న సమయాన మడిపడగ అను గ్రామం నుంచి ఒక రైతు వచ్చారు. ఆ గ్రామం భువనగిరి, జనగాం తాలూకాల సరిహద్దున ఉన్నది. భువనగిరి తాలూకాకు చెందినది. అది ఒక మక్తా గ్రామం. మక్తాదారుడు చిన్నవాడే అయినా దోపిడీ హెచ్చుగానేఉండేది. దోపిడీని తట్టుకోలేక వచ్చిన ఆ రైతు తమ గ్రామంలో సంఘం ఏర్పాటుచేసి, దోపిడీలేకుండా చేయాలని, వారు తమ గ్రామానికి రాకపోతే ఆఫీసులోనే తానుండి పోతాననీ పట్టు బట్టాడు. ఆరుట్ల రాంచంద్రా రెడ్డిగారు ఆ గ్రామానికి వెళ్ళారు. గ్రామంలో పెద్ద బహిరంగ సభ జరిగింది. ఆయనకు అప్పటికే జాగీరు రైతుల పోరాటంలో కొంత అనుభవం ఉంది. బహిరంగ సభలో మక్తా రైతులకున్న "హక్కు"లేమిటో స్పష్టం చేశారు. వెట్టిచాకిరీ అక్రమవసూళ్ళను కూడా నిలిపివేయాలని చెప్పారు. అంతటితో వెట్టిచాకిరీ అక్రమ వసూళ్ళు ఆగిపోయినవి.

బహిరంగ సభకు వచ్చిన చుట్టుపక్కల గ్రామాల ప్రజలు ఆయన తమ తమ గ్రామాలకు రావాలనీ, "సంఘం" ఏర్పాటు చేయాలనీ కోరారు. ఆయన వెళ్ళి "సంఘాలు" ఏర్పాటు చేశారు. "సంఘం" ఏర్పాటు చేయటమంటే ఏమిటి? ఊరేగింపు జరిపి, బహిరంగ సభను నిర్వహించి ఆయన ప్రసంగించటం, వెట్టి చాకిరీ, అక్రమ వసూళ్లు వగైరాలు ఆపివేస్తున్నట్లు ప్రకటించటం, గ్రామ సంఘ కమిటీ నాయకుల పేర్లను ప్రకటించటం—వీటితో "సంఘ"మేర్పాటు పూర్తయేది.

ప్రతి గ్రామంలో భూస్వాముల దోపిడీ, కౌలుదారుల, మక్తా జాగీరు రైతుల సమస్యలు ఉండేవి. అయినా ఈ ప్రాంతంలో విసునూరు దేశముఖు సాగించిన దోపిడీ దౌర్జన్యాలగురించి ప్రత్యేకించి చెప్పడం అవసరం.

**విసునూరు రామచంద్రారెడ్డి దోపిడీ దౌర్జన్యాలు :** విసునూరు దేశముఖు పూర్తిపేరు రాపాక రామచంద్రారెడ్డి. సాధారణంగా విసునూరు రామచంద్రారెడ్డి అని పిలిచేవారు. విసునూరు గ్రామం అతని కేంద్రస్థానం.

ఆ గ్రామం రోడ్డుకు దూరంగా లోపలి భాగంలో ఉంటుంది. సూర్యాపేట-జనగామ రోడ్డును కలిపే చిన్న రోడ్డును విసునూరుదాకా వేయించుకున్నాడు కారుమీద స్వగ్రామానికి వెళ్తూ ఉంటాడు. కడివెండిలో ఆయన తల్లి ఉండేది అది రెండవ ముఖ్య స్థానం అని చెప్పవచ్చు. కడివెండి మీదుగానే విసునూరు వెళుతూ ఉండేవాడు.

ఇతను అరవై గ్రామాలకు దేశముఖు అని పేరు. ఇవి జనగామ, మానుకోట, వరంగల్, సూర్యాపేట తాలూకాల్లో ఉండేవి. కొన్నిటిలో అతని తమ్ముడుండేవాడు. తనకున్న గ్రామాలతోపాటు అందుబాటులో ఉన్న గ్రామాలన్నిటిలోనూ — ఆ గ్రామాలలో దేశముఖులు, జాగీర్దారులు, మక్తాదారులు ఉన్నా— పెత్తనం చేయటం అతనికి మామూలు. స్థానిక భూస్వాముల మధ్యన ఉన్న తగాదాలను పురస్కరించుకొని ఆ గ్రామాల పెత్తందార్లను తన అదుపులో తెచ్చుకోడానికి ప్రయత్నించేవాడు. ఈ లక్ష్యాన్ని సాధించటానికి అతడు చేసిన దుర్మార్గాలకు హద్దూపద్దూ లేదు. అతన్ని ఎదిరించేవారిని, వారెవరైనా చంపించటానికి వెనుదీయడు. అతని అధిపత్యాన్ని అంగీకరించని ధనవంతుల, భూస్వాముల, జాగీర్దారుల, మక్తాదారుల ఇళ్ళను లూటీ చేయించేవాడు. వారి పంటలను నాశనం చేయించేవాడు. వారిని లొంగదీసుకోడానికి అవసరమైన పనులన్నీ చేసేవాడు. విసునూరులో పోలీసు స్టేషను ఉండేది (ఇప్పటికీ ఉంది). దానిలో అతనికి అనుకూలమైన సబ్ ఇన్‌స్పెక్టరు (అమీను) ఉంటాడు. సబ్ ఇన్‌స్పెక్టరు మారితే తనకు అనుకూలమైన అతనినే తెచ్చుకుంటాడు. అనుకూలం కాని అతన్ని బదిలీ (transfer) చేయించి పంపిస్తుంటాడు. ఈ విధంగా పోలీసు స్టేషను అంతా అతని స్వాధీనంలో ఉంటుంది. దీనికి తోడుగా 70-80 మంది సాయుధ మూకలుంటారు. వారిలో కొందరికి తుపాకులు ఉండేవి. తక్కినవారికి బరిసెలు, కర్రలు మొ॥ ఉండేవి. దోపిడిలు చేయటం వారి ప్రధాన కార్యక్రమం. ఆ మూకకు కొందరు కమాండర్లు కూడా ఉండేవారు. లూటీలో ఒక పద్ధతి ఉండేది. ధాన్యం లూటీచేస్తే ఈ 70-80 మందికి పంచి ఇస్తాడు. డబ్బు, బంగారం మొదలగు విలువైన వస్తువులు ఆయనకే చెందుతాయి. ఇదంతా అతని అక్రమ ఆర్జన. ఊళ్ళలో దోచుకొనివచ్చిన ధాన్యం, ఇతర వస్తువులతో గూండాలను పోషించటంవలన వారుచేసే అక్రమాలకు హద్దూపద్దూ ఉండేదికాదు. తగాదాల సందర్భంలో రెండువైపులా డబ్బులు వసూలుచేసేవాడు. ఇంట్లో తన

కూతురు పెళ్ళైతే ఖర్చులన్నీ ప్రజలనుంచీ, భూస్వాములు, సంపన్నులనుంచీ వసూలుచేసేవాడు. కారు కొనుక్కుంటే దాని ధరను గ్రామీణులనుంచి రాబట్టే వాడు. ఏ పనికోసమైనా కావలసిన డబ్బంతా గ్రామాల ప్రజలనుంచి వసూలు చేయటం పరిపాటి. ఈ వసూళ్ళను కుటుంబానికింత అని నిర్ణయించేవారు. పేద కుటుంబాలవారంతా వెట్టిచాకిరీ చేసేవారు. భూమివున్నవారు దానికనుగుణ్యంగా డబ్బు చెల్లించేవారు. ఇతని అక్రమ వసూళ్ళగురించి ఒక ఉదాహరణ : ఒక పెద్ద ఇల్లు కట్టించాలని సంకల్పించాడు. చుట్టూ ప్రహరీ గోడతో ఒక పెద్ద కోటను పోలిన భవనం ఇది. ఆ ఇంటికయ్యే ఖర్చంతా కూడా రైతులనుంచి వసూలుచేశాడు. దీనికొరకు తాపీపనివారిచేత పనిచేయించాడు. కూలీలచేత తట్టలు మోయించాడు. ఆ గ్రామస్తులే కాకుండా ఇతర గ్రామాలనుంచి వంతులవారీగా వచ్చి పనిచేశారు. ఈ రకంగా వెట్టిచాకిరీతో ఆ ఇల్లు కట్టించాడు. ఇలాంటి తీవ్రమైన దోపిడీతోబాటు ఇతని మనుషులు ప్రజలను కొట్టేవారు, తిట్టేవారు ; వారిపై చేయగల దుర్మార్గాలన్నీ చేసేవాడు.

దినచర్య : ఉదయం లేచి స్నానం, పూజలు పూర్తిచేసుకొని బాగా సరిపోయేంత ఫలహారాన్ని (heavy breakfast, నాష్తా అని ఉర్దూలో అంటారు). చేసివచ్చి ఆఫీసులో కూర్చునేవాడు. పనులు పూర్తి అయిందాకా—అవసరమైతే ఒకటి, రెండు, మూడు గంటలదాకా—వుండి తర్వాత భోజనంచేసి విశ్రాంతి తీసుకునేవాడు. ఇదంతా ఒక దర్బారులాగా ఉండేది. రెండువైపులా చెప్పుకునేవారు. అతనొక జడ్జిలేదా కలెక్టరులాగా వ్యవహరించి తీర్పులు చెప్పేవాడు.

ఆ ప్రాంతాల్లో చోటా నిజాం నవాబులాగా వ్యవహరించేవాడు. అతడు చేసిన దుర్మార్గాలకు ఉదాహరణగా బందగీ హత్యను చూపెట్టవచ్చును. దీని వివరాలు ఇంతకుముందే చెప్పాము.

విసునూరు దేశముఖుకు కడివెండి రెండవకేంద్రస్థానం.కడివెండి గ్రామంలో ఇతని తల్లి ఉంటుండేది. ఆమె అక్కడ రాజ్యంచేసేది. ఆమెకు చేతికింది మనుషులు ఎందరో ఉండేవారు. వడ్డీవ్యాపారం చేస్తుండేది. ఇతర విధాలకూడా దుర్మార్గంగా వ్యవహరించేది. సాధారణంగా దేశముఖ్ కుటుంబాలలో స్త్రీలు అంత దుర్మార్గంగా ఉండరు. సౌమ్యంగా ఉంటారని ప్రతీతి. కొన్ని సందర్భాల్లో ఆ విధంగా ఉండేవారుకూడా. కానీ ఇక్కడ మాత్రం ఈ తల్లికి కొడుకులాగానే ఆయన ఉంటే, కొడుక్కు తల్లిలాగానే ఈమె ఉండేది. ఉదాహరణకు : ఎవరైనాపోయి

'అమ్మా' అని అడిగితే "అరేయ్ 'అమ్మా' అంటావేంరా, నీ అయ్యకు పెళ్ళాన్నం టావ్'అనేది. ఈ రకంగా ప్రతిదానికి తిట్టేది. తుదకి ఏం పిలవాలని వాళ్ళకి సమస్య వచ్చినప్పుడు 'అయ్యా' అని పిలవాలని ఆమె నిర్ణయం చేసింది. ఎవ రొచ్చినా ఆమెను 'అయ్యా'అని పిలువవలసిందే. మామూలుగా ఇతర గ్రామాలలో 'దొరసాని'అని పిలుస్తారు. ఆమెను గురించి ఈ రకమైన సంఘటనలెన్నో కథలు కథలుగా ఉంటాయి.

ఆతను పేదవాళ్ళనేరాదు. కలిగిన సంపన్నులను గూడా బాగా దోచు కుంటాడు. విసునూరు సరిహద్దునే ఉన్న పాలకుర్తిలోకూడా ఒక దేశ్‌ముఖు ఉన్నాడు. ఇతర భూస్వాములున్నారు. గ్రామంచాలా పెద్దది. దేశ్‌ముఖ్ కుటుం బాలతో సహా ఆ గ్రామాన్నంతటినీ అతను కంట్రోలు చేస్తుండేవాడు.

ఇతడు సామాన్య పేదల్నేకాక తనకు లొంగి సామంతులుగా ఉండ నిరాక రించే మక్తాదారులను, దేశ్‌ముఖులని పీడించేవాడని చెప్పటానికి ఇతను బమ్మెర గ్రామ మక్తాదారులపై జరిపిన దౌర్జన్యం మరొక ఉదాహరణ. దీనిని గురించి 'జనగామ ప్రజల వీరోచిత పోరాటాలు'అనే పుస్తకంలో ఈ క్రింది వివరణఉంది:

"బమ్మెర విసునూరుకు సమీపానఉన్న ఒక మక్తా గ్రామం. నర్సింహారావు మక్తాదారు. మక్తాదారుకు కంచెలో మంచి చెట్లు చాలా వున్నవి. దేశముఖుకి అనుగ్రహం కలిగినప్పుడల్లా ఈ కంచెనుంచి తనకు కావలసిన కట్టెను తెప్పించు కునేది. చేసేదిమీలేక మక్తాదారు పిరికోరికను తీర్చవలసి వచ్చేది. గతసంవత్సరం దేశముఖు కుమార్తె వివాహం వచ్చింది. వంటచెరకు కావలసివుంటే ఎక్కడ దొరుకుతుందా అని విచారించనవసరం లేకుండాపోయింది. బమ్మెర మక్తాదారు కంచెమీద సహజమైన అనుగ్రహం కలిగింది. ఇరవై బండ్లకట్టెను కొట్టించిపంపు మని ఆజ్ఞాపించాడు మక్తాదారును. పాపం ఆయనకు ఏదో చిక్కువచ్చినందున గ్రామంలో లేకుండెనట. గుమాస్తాలు దేశముఖుగారెవ్వరో మరిచి తమ యజమాని రాగానే ఈ సంగతి తెలియజేస్తామని చెప్పిపంపినారు. సరేఁఅన్నాడు దేశముఖు. ఇంతలో మక్తాదారు ఇంటికి వచ్చినాడు. సంగతి విచారించి కొంపమునిగిందను కొన్నాడు. వెంటనే ఇరవై బండ్ల కట్టెను విసునూరు 'రాజధాని'కి రవాణా చేసు కొన్నాడు. అరవై వేల అడుక్కొళ్ళ రూపాయలతో బిడ్డపెండ్లి చేశాడు. ఝుమ్మ్మగా జరుగుతుంది. బమ్మెరనుంచి కట్టెబండ్లువచ్చినవని కన్యాదాతకుకబురు పోయింది. కొద్ది సేపటిలో బండ్లు తిరిగిపోయినవి.

ఒకనెల పూర్తికాక మునుపే దేశముఖు "దేశభక్తు"డయ్యాడు. బొమ్మెర రైతులను పిలిపించుకున్నాడు. 'మీ శిస్తులు తగ్గించే బాధ్యతనాది. మీరు మీ మక్తాదారుకు రకాలు చెల్లించనవసరంలేద'ని అన్నాడు. చైతన్యంలేని ఆరైతులు ఎదురుగావున్నది తీరనిఆకలిచే బాధపడుతున్న పెద్దపులిఅని తెలుసుకోకఇంతకన్న మేలు లేదనుకున్నారు. రైతులనుంచి ప్రాంసరినోట్లు తయారయినవి. రూపాయలువచ్చి 'విసునూరు రాజమందిరంలో' పడ్డవి. మక్తదారుల కుప్పలుమాయం. గరిసెల్లో వడ్లు మాయం. గ్రామంలో విసునూరు రౌడీలుచేరి నాదర్‌షా రాజ్యం సాగిస్తున్నారు.

ఈసమయంలో మక్తాదారు గట్టిగానిలిచి దేశముఖును ఎదిరించాడు. పరిస్థితులు వ్యతిరేకంగా మారినవి. రైతులువచ్చి 'అయ్యా మాకేది దారి?' అని అడిగారు. ఎక్కడిదారి? గోదారి! 'గేటుదాటివస్తే తుపాకితో కాలుస్తా'నన్నాడు, 'దేశ భక్తుడు'. రైతులకు ఎటూ తోచలేదు. కాసేపు ఊరకున్నారు. వెంటనే భటులువచ్చి రైతులను ఒయటికి గెంటివేశారు" (పేజి 14-15)

పింగళి వెంకట్రామారెడ్డిగారిది పెద్ద దేశముఖు కుటుంబం. హైదరాబాదులో ఉంటూ తెలంగాణాలో ఉండే ఎక్సైజులో ఎక్కువభాగం వాళ్ళే కాంట్రాక్టు తీసుకున్నారు. దానిమీద పెద్ద ఆదాయం ఉండేది. వరంగల్లు జిల్లాలో, ఇంకా ఇతర జిల్లాల్లో కొన్నివేల ఎకరాల భూమికూడా వారికి ఉండేది. ఆకుటుంబంలో పింగళి కోదండరామారెడ్డి అనేవారు వారి వ్యవహారాలనుచూస్తుండేవారు. ఆయనకు విసునూరు రామచంద్రారెడ్డికి ఏదో తగాదా వచ్చింది. పింగళి కోదండరామారెడ్డిని అరెస్టు చేయించాడు. బహుశా పోలీసు అధికారులను కట్టుకొని ఏదో నెపాన అరెస్టు చేయించాడు. వారుకూడా పెద్ద దేశముఖులు కావటంతో విడుదలయ్యారు. కానీ ఆ పగ తరువాతకూడా కొనసాగింది. భూమి, డబ్బు, హోదా, ప్రభుత్వములో వారికున్న పలుకుబడి వీటన్నిటిని చూస్తే పింగళివాళ్ళు ఇతడినిమించిన వాళ్ళే. అలాంటివాళ్ళను కూడా అరెస్టు చేయించాడితను. ఈవిధంగా ఇతనంటే సామాన్య ప్రజలకు భయం. సంపన్నులకు, భూస్వాములకు, చివరికి పెద్ద ఫ్యూడల్ భూస్వాములకు కూడా వ్యతిరేకత. ఈవిధంగా అతను తన రాజ్యంలో ఏకాకి అయినప్పటికీ పట్టుదలతో దుర్మార్గాలు చేస్తుండేవాడు. అతనికి హైదరాబాదులో కొంతమంది వకీళ్ళుండేవాళ్లు. ఏ దుర్మార్గంచేసినా కేసులలో సీరు ఆదుకునేవాళ్ళు. అదేవిధంగా అధికారవర్గంలో కూడా ఒకభాగాన్ని తనచేతుల్లో

పెట్టుకొని వ్యవహారాలన్నీ సాగించేవాడు.

"జనగామ ప్రజల వీరోచిత పోరాటాల"నే పుస్తకంలో ఇతను సాగించిన దోపిడీ దౌర్జన్యాల గురించి వివరమైన సమాచారం ఉన్నది.

**గ్రామసంఘాల ఏర్పాటు :** జనగామ తాలూకాలో విసునూరు దేశముఖు గ్రామమైన కడివెండికి శివారుపల్లె సీతారాంపురం. ఇది సూర్యాపేట-జనగామ రోడ్డుపైన ఉంటుంది. ఈ రోడ్డుకు రెండుమూడు మైళ్ళ దూరాన కడివెండి ఉంటుంది. కడివెండి పెద్దగ్రామం. దీనితో పోల్చినప్పుడు సీతారాంపురం చిన్న గ్రామమే. ఇక్కడ నుంచి ఆకుల వెంకయ్య అనే ఒకవ్యక్తి ఆరుట్ల రామచంద్ర రెడ్డిగారు తమ గ్రామానికివచ్చి బహిరంగసభను పెట్టాలని కోరినాడు. ఆ గ్రామంలో దోపిడీ గూర్చి చెప్పాడు. అతడు గంపనెత్తిన పెట్టుకొని ఇంటింటికి తిరిగి కూరగాయలు అమ్ముకునేవాడు. తాను అమ్ముకునే కూరగాయల్లో కొంత భాగాన్ని విసునూరు దొరకు అతని గుమాస్తాలకు ఇవ్వవలసివస్తుంది. వారి భాగాన్ని వారికి చెల్లించినతర్వాత తక్కినవి అమ్ముకోవాలి. ఇలాంటి దోపిడీ చాలాకాలం నుంచి సాగుతూవచ్చింది. దేశముఖు, వారి గుమాస్తాలు, గూండాలు అతనిమీద దుర్మార్గాలుచేసి ఒత్తిడి చేస్తున్నట్లు చెప్పాడు. దాన్ని దృష్టిలో ఉంచుకొని, ముఖ్యంగా ఈ గ్రామాలలో జరిగిన బహిరంగసభల ప్రభావంతో అతడువచ్చి పిలిచాడు. విసునూరు దేశముఖు అప్పటికే తెలంగాణాలో బాగా పేరుపడ్డ దుర్మార్గుడు. వెనకాముందూ ఆలోచించి, తప్పనిసరయి ఆరుట్ల రామ చంద్రారెడ్డి అక్కడికి వెళ్లాడు. ఆ మేరకు ధైర్యంచేశాడని చెప్పవచ్చు. వెళ్ళటం తోనే వ్యవహారం ఆగదు. పూలదండలు వెయ్యటం, బళ్ళుకట్టి, డప్పు వాయిద్యా లతో ఊరేగించటం ఇవన్నీ జరిగిపోయాయి. ఈయన ఉబ్బి తబ్బిబ్బు అయ్యాడు. ఆ దేశముఖు కోటముందు స్థలం ఎక్కువగా ఉంటుంది. అక్కడ మీటింగు పెట్టాడు. ఆయన ఉపన్యాసంలో ఆ పోరాటంయొక్క సాధకబాధకాలు సమస్యలు వివరించి చెప్పటంకాకుండా-ఆ దేశముఖు ఎంతటివాడు, కొడ్తాంతిడ్తాం, వాడటు వంటివాడు, వీడటువంటివాడు-అనే ధోరణిలో సాగిపోయింది. 'దొరంతటివాడినే తిడ్తున్నాడు. ఈయనెంతటివాడో' అన్న అభిప్రాయం ప్రజల్లో కలిగింది. ఆ తర్వాత వాళ్ళు సంఘమేర్పాటుచేశారు. మీటింగుపెట్టారు, వెట్టిచాకిరీని ఆపి వేశారు. అక్రమ వసూళ్లు ఆపివేశారు.

ఆ సంఘానికి ఎవరు ముందుకువస్తే వారే పెద్దలు. వారిలో కొందరు భూస్వాములు, వడ్డీ వ్యాపారస్థులు, కులపెద్దలు ఉన్నారు.

అక్కణ్ణుంచి దేవరుప్పల వచ్చారు. సంపన్నులున్న పెద్దగ్రామం అది. పంటలు చాలా పండుతాయి. అక్కడ భూస్వాములు, సామాన్య రైతులు ఉన్నారు. ఊరేగింపు జరిగింది. మీటింగు పెట్టారు. బందగీ స్వగ్రామమైన కామారెడ్డిగూడెం దేవరుప్పల గ్రామానికి శివారుపల్లె. మీటింగుపెట్టి అక్కడకూడా సంఘం ఏర్పాటుచేశారు. ఆ సంఘంలో భూస్వాములు కూడా చేరారు. అక్కడి భూస్వాములు కొద్దివాళ్ళేం కారు.

ఆ తర్వాత ముంగ్రడాయికి చెందిన లంబాడీ రైతులు ఆహ్వానించారు. అక్కడికి వెళ్ళారు. ఈ గ్రామం విసునూరు దేశముఖుకి సంబంధించినదికాదు. అక్కడున్న భూస్వాములు వేరే కుటుంబానికి చెందినవాళ్లు. ఆ కుటుంబాలకు, రెడ్డిహాస్టలుకు సంబంధాలుండె. ఆ రకంగా ఆరుట్ల రామచంద్రారెడ్డిగారికికూడా కొంత తెలిసినవాళ్లు. అక్కడి రైతులు ఒక చిన్న కుంటక్రిందవున్న 50ఎకరాల మాగాణిని పూర్వకాలంనుంచీ (50-100 ఏళ్ళనుంచి) సాగుచేసుకుంటున్నారు. ఇక్కడి భూస్వాములు వారిని ఆ భూమినుండి తొలగించారు. ఆ రైతులు ఈ సమస్యను ముందుకు తీసుకువచ్చారు.

ఆ తర్వాత దేవరుప్పల పక్కనే ఉన్న ధర్మాపురం అనే ఒక గ్రామానికి వెళ్లారు. అక్కడ వేరే భూస్వాములున్నారు. ఆ భూస్వాములుగూడా ఆరుట్ల రామచంద్రారెడ్డిగారికి తెలిసినవాళ్ళే. ఆ భూస్వాములు మాగాణినుండి రైతులను తొలగించి ఆ భూములను స్వంతం చేసుకునేవాళ్లు. మెట్టలో కొంతభాగాన్ని బీడు పెట్టించి వాటిమీద లాభపడుతుండేవాళ్లు. వీరు పెద్ద భూస్వాములు.

ఈ రకంగా ఈ సందర్భంలో ఆరుట్ల రామచంద్రారెడ్డి చుట్టుపక్కల గ్రామాలన్నింటికి వెళ్ళి సంఘాలు పెట్టాడు. ఈ ఉద్యమం 30-40 గ్రామాలకు పాకింది. ఈ గ్రామాలన్నింటిలో సంఘాలు ఏర్పడ్డాయి. సభ్యత్వ ఫారాలు తీసుకొని సంఘంలో చేరారు. దీనితో ఆ భూస్వాములందరూ బస్తీలకు వెళ్ళి, ఏం చేయాలి ? వీళ్ళపై నిర్బంధం ఎట్లా తీసుకురావాలి ? అని ఆలోచించారు. చందాలు వసూలు చేశారు. 20 వేల నుండి 50వేలదాకా వసూలుచేశారని ఆ రోజుల్లో తరచుగా చెప్పుకునేవారు. ఆ తరవాత అధికారులను పట్టుకొని నిర్బంధాన్ని తీసుకురావటానికి ప్రయత్నాలు మొదలుపెట్టారు.

**నిర్మాణయుతమైన కార్యకలాపాల ప్రారంభం :** ఆరోజుల్లో జనగామ తాలూకా నల్లగొండ జిల్లాలో ఉండేది. ఈ గ్రామాల్లో భూస్వాములువేసే దుర్మార్గాలు–దోపిడీగురించి జిల్లా కమ్యూనిస్టు కమిటీకి అంతకు పూర్వం చూచాయగా తెలుసు. ఆరుట్ల రామచంద్రారెడ్డి పర్యటనచేసి సంఘాలు ఏర్పాటు చేస్తున్నారని తెలిసి తీవ్రమైన నిర్బంధం వస్తుందనీ, దానిని ఎదుర్కొనడానికి సన్నాహాలు చేయాలని కమిటీ కార్యదర్శి దేవులపల్లి వెంకటేశ్వరరావు గ్రహించారు. ఇలా జరుగుతుందన్న సంగతిమాత్రం వారికి ఆరుట్ల రామచంద్రరెడ్డి ద్వారాకాక ప్రజలద్వారా, ఇతరత్రా తెలిసింది. వారిని జిల్లా కమిటీ సమావేశానికి పిలిచి—ఆయన జిల్లా కమిటీ సభ్యుడుకూడా—రిపోర్టుతీసుకున్నారు. ఆయన వెళ్ళడం, జరిగిన ఊరేగింపులు, బాజాభజంత్రీలు, వాళ్ళ మర్యాదలు—వాటి గురించి చెప్పాడేగాని సమస్యల గురించి ఏమీచెప్పలేక పోయాడు. చెప్పిందల్లా వెట్టిచాకిరీ, అక్రమ వసూళ్ళు—వీటికి సంబంధించిన విషయాలేకాని ఇతర సమస్యలు, వాటి లోతుపాతులు చెప్పలేకపోయాడు. ప్రజల చైతన్యం, వారు ఏ స్థితిలోవున్నారు ఇటువంటివేవీ చెప్పలేక పోయాడు. మీటింగులకు వచ్చేవారు విన్నారు. ఊరేగింపులలో పాల్గొన్నారు. అంతేకాని గ్రామాల్లో ఎవరు మనకు అనుకూలంగా వున్నారు? ఎవరు వ్యతిరేకంగా వున్నారు ? అక్కడి శక్తులేమిటి ? అన్న అవగాహనకూడా ఆయనకు లేకుండింది. స్థానికంగా కొద్దిగానే (నలుగు రైదుగురు) మిలిటెంట్సు ముందుకు వచ్చారు. వారుకూడా అంతంత మాత్రంగానే తెలిసీతెలియకుండా ఉంటుండేవారు. ఈ దేశముఖు, అక్కడున్న భూస్వాముల స్వభావం చూస్తే—జిల్లా తాలూకా అధికారులు వాళ్ళకు అందుబాటులో ఉండటమేకాకుండా, కేంద్ర ప్రభుత్వ స్థాయిలోకూడా వాళ్ళకు సంబంధాలున్నాయని తెలిసి ఆంధ్రమహాసభ కేంద్రానికి ఈ విషయం చెప్పటం మంచిదని తెలిపారు.

జిల్లా కమిటీ ఈ పరిస్థితులను చర్చించి, పార్టీ నిర్మాణాన్ని అభివృద్ధి చేయాలనీ, ఆంధ్రమహాసభ నిర్మాణాన్ని సంఘటితపరచాలనీ నిర్ణయించింది. దీనికొరకు కామ్రేడ్ దేవులపల్లి వెంకటేశ్వరరావు నేరుగా ఉద్యమాన్ని నిర్వహించాలని నిర్ణయించింది. పార్టీ నిర్మాణం కొరకు కొంతమంది కార్యకర్తలను పంపించాలని నిర్ణయించింది. సూర్యాపేటనుండి ముగ్గురు కార్యకర్తలను పంపించింది. వారిలో కె. రామచంద్రారెడ్డి, జనగామ, భువనగిరి తాలూకాల సరిహద్దు గ్రామాలతో సంబంధం కలిగి ఉండటానికి, చకిలం యాదగిరిరావు పాలకుర్తి

ప్రాంతపు గ్రామాల్లో పని చేయాలని ఏర్పాటు జరిగింది. మూడవ అతను వెంకటేశ్వరరావు. ఈయన కృష్ణాజిల్లా నివాసి. సూర్యాపేట ప్రాంతంలో పని చేసే సమయానికి ఇతనికి 18 సంవత్సరాలు కూడా నిండలేదు. పాటలుపాడి ప్రజలను ఉత్తేజ పరిచేవాడు.నిర్మాణయుతమైన కార్యకలాపాలకు ఇది ప్రారంభం.

ప్రభుత్వంనుండి, ఫ్యూడల్ భూస్వాములనుండీ రానున్న నిర్బంధాన్ని గురించి జిల్లాకమిటీకి అంచనా వున్నది. అక్కడి పరిస్థితులను అధ్యయనంచేసి కోర్కెలు తయారుచేసి కార్యక్రమాలను రూపొందించటం కొరకు కేంద్రాన్ని సంప్రదించారు. అక్కడ నిర్ణయించిన విషయాలు : ఆంధ్రమహాసభ అధ్యక్షులు రావినారాయణరెడ్డిగారు, జిల్లా అధ్యక్షులు దేవులపల్లి వెంకటేశ్వరరావుగారు, ఆర్గనైజింగు కార్యదర్శి పట్టికోట ఆళ్వారుస్వామిగారు, స్థానికులు జిల్లా ఆంధ్ర మహాసభకు కార్యదర్శిగావున్న ఆరుట్ల రామచంద్రారెడ్డిగారు — ఈ నలుగురు ఆ ప్రాంతాన్ని పర్యటించి పరిస్థితులన్నిటిని తెలుసుకొని రిపోర్టుచేయాలి. ఒక రిపోర్టు తయారుచేసి దానిని ప్రభుత్వానికి ఇవ్వాలి. ఆ దేశముఖులు, భూస్వాములమీద చర్యలు తీసుకోవాలనీ, వెట్టిచాకిరీ, ఇతర అక్రమాలు జరుగకుండా చూడాలనీ, భూముల సమస్యలను పరిష్కరించాలనీ— ఇటువంటి డిమాండ్సుతో ప్రభుత్వానికి మెమొరాండం ఇవ్వాలి. ఈ ఫ్యూడల్ దోపిడీ విధానాన్ని, ఇక్కడ జరుగుతున్న దుర్మార్గాలన్నింటినీ వివరిస్తూ పుస్తకం రాసి, పెద్దఎత్తున ముద్రించి పంపకం చేయాలి. కా॥ డివి నేరుగా ఆ ఉద్యమాన్ని నడుపటానికి జిల్లాకమిటీ తీసుకున్న నిర్ణయాన్ని వాళ్లు ధృవపరిచారు.

**ఆంధ్ర మహాసభ నాయకుల పర్యటన :** దీని తర్వాత పర్యటన కోసం ఏర్పాట్లు జరిగినవి. ' ఈ నలుగురు పర్యటనకోసం వెంటనే బయలుదేరారు. ఒక్కొక్క గ్రామంలో ఉండి అక్కడి పరిస్థితులు తెలుసుకున్నారు. ఆ విధంగా చాలా గ్రామాలు పర్యటనచేశారు. ఈ సందర్భంలో పరిస్థితులన్నీ తెలుసుకోవటానికి అవకాశాలు ఏర్పడ్డాయి. రావినారాయణరెడ్డిగారు, ఆరుట్ల రామచంద్రారెడ్డిగారు ఉపన్యాసాలిస్తుండేవారు. ఆ ప్రజలనుచూసి ఉత్తేజపడి పట్టికోట ఆళ్వారుస్వామిగారు ప్రజల్ని బాగా ఆకట్టుకోగలిగిన విధంగా మాట్లాడారు కా॥ దేవులపల్లి వెంకటేశ్వరరావుగారు మాత్రం ఉపన్యాసాలు, ఇతరవాటన్నిటిలో ఉండకుండా ప్రజల్లోకి వెళ్ళి ప్రజల సమస్యలను వివరంగా తెలుసుకోవటానికి ప్రయత్నంచేశారు. రైతుపేరు, అతను ఏ విధంగా దోపిడీ చేయబడ్డాడు ః ఏ

విధంగా దౌర్జన్యాలకు గురయ్యాడు ? అతనిప్పుడు ఏం కోరుతున్నాడు ? ఇలాంటి వివరాలతో అనేక సంఘటనలు తెలుసుకున్నారు. వారందరు ఓపిగ్గా చెప్పారు. పక్కనున్న వాళ్లు వారికి తెలిసినవాళ్ళనందరినీ కూడా పిలిచి వాళ్ళతో చెప్పించే వారు. వాళ్ళతో ప్రజలతో పీరుండి ఆ రిపోర్టులన్నీ సేకరించారు. దాదాపు 40 గ్రామాలవరకు వారు పర్యటనచేశారు. ఈ గ్రామాలన్నింటినుంచి ఈ రిపోర్టులు వచ్చినాయి.

ఆ గ్రామాల్లో మీటింగుపెట్టి రిపోర్టులు తీసుకున్నారు. ఈ సందర్భంలోనే కొన్ని వాస్తవాలు బయటకు వచ్చినాయి. ముంద్రాయి రైతుల భూమి సమస్య పీటిలో ఒకటి. దానిచరిత్రంతా సమగ్రంగా అడిగి తెలుసుకున్నారు. వావిళ్ళ అనే గ్రామం నుండి తిరిగి వస్తున్నప్పుడు ఒకరైతు దాదాపు ఒక మణుగు ధాన్యానికి పోగొట్టుకున్న కొంత భూమిని తిరిగి తనకు ఇప్పించమని కోరాడు. సంఘం రావటంతో వెట్టిచాకిరీ అక్రమ వసూళ్ళు ఇవన్నీకూడా ఆగిపోవటంతో అప్పులిచ్చి భూస్వాములు, దేశముఖులు లాక్కున్న భూములు సంఘం తిరిగి ఇప్పిస్తుందనే అభిప్రాయం వాళ్ళలో కలిగించి. వాళ్ళల్లో అనేకరకాల అభిప్రాయాలుకూడా ఉండేవి. కొందరేమో 'నిజాం నవాబు మంచివాడేకాని అతనిక్రింద వున్న ఈ దేశముఖులు, భూస్వాములు దుర్మార్గులు. ఈ ఫిర్యాదులతో అతని దగ్గరికి వెళ్ళితే వీళ్ళందర్నీ చక్కబెట్టిస్తాడు', అని అనుకునే వెనుకబడిన చైతన్యం కలిగినవాళ్ళుకూడా ఉండేవాళ్ళు. ఒక గ్రామంలో పర్యటన పూర్తిచేసి తిరిగి వస్తున్న సందర్భంలో రెండురకాల అభిప్రాయాలు వచ్చాయి. సామాన్య స్త్రీలు 'మా తల్లిదండ్రులు, మా భర్తలు కూడా తీర్చలేని కష్టాలను సంఘం వారొచ్చి తీర్చారు. మమ్మల్నెట్లా కాపాడుతారో ముందు' అన్నారు. దీనినొక హెచ్చరిక అనుకోవచ్చును. వారి నిస్సహాయతను తెలియజేసే అంశంకూడా అందులో ఉన్నది. ఒకవ్యక్తిమాత్రం—అతను కష్టం చేసేవాడైనా భూస్వాముల ఏజెంటని చెప్పవచ్చును-'మా ఇష్టానికి మేం వెట్టిచాకిరీచేస్తే మీకెందుకు అభ్యంతరం ఉండాలి?' అని ఆశ్చర్యకరమైన ప్రశ్నవేశాడు. ఈప్రశ్నకు సమాధానం చెప్పడంకూడా కష్టం. 'అభ్యంతరమేమున్నది. మీకిష్టమైతే చేసుకోండి,' అని అక్కడున్న నాయకులు సమాధానం చెప్పారు. ఒకభూస్వామి ఉన్నప్పుడు కొంత వెనుకబడిన చైతన్యం కలవారూ, అతనికి ఏజెంట్లూ సహజంగా అక్కడ ఉంటారు. బలమైన భూస్వామి అయితే ఎక్కువగా ఉంటారు. చిన్నభూస్వామి

అయితే ఒకడూ, అరా ఉంటారు. పైన పేర్కొన్న భూస్వాముల ఏజెంటుని విడవిస్తే తక్కినవాళ్ళల్లో మాత్రం చైతన్యం కనిపించింది.

వెట్టిచాకిరీ, అక్రమవసూళ్ళు, ఇతర దౌర్జన్యాలు ఇవన్నీ మొదటి వరుస లోనే తొలగిపోయాయి. మీటింగుపెట్టి 'మీరు వెట్టిచాకిరీ చేయవలసిన అవసరం లేదు. అక్రమ వసూళ్ళకొరకు డబ్బులు ఇవ్వవలసిన అవసరంలేదు. భూస్వాములకు తలవంచవలసిన అవసరం లేదు.' అని ప్రకటించగానే ఆ దేశముఖులు, భూస్వాములే స్వయంగా లొంగిపోయారు. ఒక్కొసారి నాయకులు వెళ్ళిపోయిన తర్వాత తిరిగి వెట్టిచాకిరీ చేయించుకోవటం, అసలు ఉద్యమాన్నే అణచివేసి తిరిగి తమ పెత్తనాన్ని ఏదోఒక సర్దుబాటుతో పునరుద్ధరించాలనే లక్ష్యంతో వాళ్ళు పనిచేయటం మొదలుపెట్టారు. అయినా వెట్టిచాకిరీ, అక్రమవసూళ్లు, దౌర్జన్యాలు—ఇటువంటివన్నీ మొదటి వరుసలోనే ఆగిపోయాయని చెప్పవచ్చు. దీనికొక ఉదాహరణ : సంఘంవెళ్ళే నాటికి విసునూరు దేశముఖు భవనానికి గేటొకటి తయారు రావలసి ఉన్నది. తక్కిన భాగమంతా పూర్తయింది. 1943-44 నాటి ధరల ప్రకారం గేటుకొరకు ఇరవైవేల రూపాయలు ఖర్చవుతుందని అంచనా. దానికి ఏగ్రామం నుంచి ఎంతెంత డబ్బు ఎట్లా వసూలుచేయాలో లెక్కలువేసి వసూలు చేసేసమయానికి అక్కడ ఆంధ్రమహాసభ కార్యక్రమాలు ప్రారంభమైనాయి. ఆ గేటుకు వసూలు చేయవలసిన డబ్బంతా ఆగిపోయింది.

దీనితో సంవత్సరం, పది సంవత్సరాలు లేదా యాభై సంవత్సరాల క్రితం రైతులు పోగొట్టుకున్న భూముల సమస్య ముందుకువచ్చింది. ఇటువంటి భూములు తమకు చెందాలనే ఆకాంక్ష సామాన్య రైతులు, కూలీలు, పేద రైతులు—వీరందరిలో కన్పించింది. 'పోయిన భూములు తిరిగి రాబట్టుకోవాలి, వెట్టిచాకిరీ చెయ్యము' అనిచెప్పటం తేలికేగాని, ఆ భూమిలోకి వెళ్ళి నాది అని దున్నుకుంటానని అనటం తేలికైన విషయంకాదు. అందుకొరకు ప్రజలు ఈ సమస్యను పరిష్కరించమని నాయకత్వం ముందుపెట్టారు.

రెండోది : దీని తర్వాత దేశముఖులు, భూస్వాములు ఏంచేయనున్నారు? ఏదోవిధంగా నిర్బంధాన్ని తీసుకువస్తారని వారి గూండాదళాలను ప్రయోగిస్తారని నాయకత్వానికి అంచనా ఉంది. ప్రస్తుతానికి ప్రజా వెల్లువనుచూసి వారు ఎక్కడికక్కడ నక్కి ఊరుకున్నారు. ఆరుట్ల రామచంద్రారెడ్డిగారు మాత్రం ఎక్కడకు వెళ్ళినా తనను భూస్వాములు చంపటానికి ప్రయత్నం చేస్తున్నారని,

కుట్ర పన్నుతున్నారని ఎప్పుడూ భయం ప్రదర్శిస్తూ ఉండేవారు. చీమ చిటుక్కు-మన్నా తనను చంపటానికే వచ్చినట్టు ఆయన భయపడటం పర్యటన సందర్భంలో బయటపడింది. రిపోర్టులలో వ్రాసే రాతలలో గూడా అది బయటపడింది. అది ఆయన మానసిక భయమే (psychosis) తప్ప వాస్తవంకాదు. ప్రజలు పెద్ద ఎత్తున కదిలినప్పుడు ఈ గూండాలు ఇళ్ళలోనుంచి కూడా కదలకుండా దూరంగా ఉంటారు. ప్రజల కదలికలేనప్పుడు చూసి అణచివేస్తారు. ఇది సర్వసామాన్యంగా జరిగే పరిణామం. గ్రామాల్లోకూడా భయపెట్టేవాళ్ళు కొందరుంటారు. తనను ఎదిరించిన బందగీని చంపించాడనీ, పెద్ద భూస్వాములైనా పింగళి కోదండరామా రెడ్డిలాంటివారిని కూడా అరెస్టు చేయించాడనే వార్తలు విసునూరు దేశముఖు గురించి ప్రజల్లో ప్రచారంలో ఉన్నాయి. ఇటువంటి వార్తలు ప్రజల్లో సామాన్యంగా భయం కలిగిస్తాయి. జాగ్రత్తగా ఉండమని వాళ్ళు సహజంగా చెప్తే, తనను చంపించడానికి ప్రయత్నిస్తున్నారని తన నీడను చూసి ఈయన భయపడేవాడు.

పర్యటన పూర్తయిన తర్వాత ఆంధ్రమహాసభ కేంద్ర కార్యాలయం ఈ క్రింది నినాదాలను విస్తృతంగా ప్రచారంచేసింది.

1) వెట్టిచాకిరీ, అక్రమ వసూళ్లలాంటి వెనుకటి పద్ధతుల పునరుద్ధరణను వ్యతిరేకించాలి.

2) రైతులు పోగొట్టుకున్న భూములను వారికి తిరిగి అప్పజెప్పాలి.

3) అక్రమమైన క్రూరమైన దౌర్జన్యాలకు పాల్పడే ఫ్యూడల్ భూస్వాములపై కఠిన చర్యలు తీసుకోవాలి.

ఈ పర్యటన సందర్భంగా తెలిసిన సమాచారాన్ని తర్వాతి కాలంలో పుస్తకరూపంలో (జనగామ ప్రజల వీరోచిత పోరాటాలు) ప్రచురించారు.

**ముంగ్రడాయి సంఘటన :** నిర్బంధ విధానాన్ని ఏ విధంగా ఎదుర్కోవాలి ? ఇంకా ఏ రూపంలో వాళ్ళు నిర్బంధాన్ని తీసుకువస్తారు ? దాన్ని ఏ విధంగా ఎదుర్కోవాలి ? అనే సమస్యలు అప్పటి ఆంధ్రమహాసభ ముందు, పార్టీముందు వచ్చాయి. వీటినిగురించి ఆలోచిస్తూ, ముందు ఈ భూముల విషయంలో కొంత సంప్రదింపులు జరపాలి అని పార్టీ, ఆంధ్రమహాసభలో నిర్ణయించటం జరిగింది. మైదం చెరువు లంబాడీ రైతులకు (ముంగ్రడాయి) సంబంధించిన భూస్వాములతో

సంప్రదింపులు చేస్తే భూమిహక్కు తమదేనని, భూమిని ఇవ్వటం సాధ్యంకాదనీ వాళ్లు నిరాకరించారు. ఈ భూమిని రైతులకు తిరిగి ఇప్పించటానికి ఏంచేయాలి ? అని ఆలోచించి నిర్ణయించటానికి లీగల్ సలహా తీసుకున్నారు. భూమిని ఆక్ర మించుకోవటంలో వచ్చే సాధక బాధకాలను ఆలోచించారు. ఈ సమస్యను చర్చించడానికి రాష్ట్రకమిటీ ఆర్గనైజరు శ్రీ ఎస్.వి.కె. ప్రసాదు, దేవులపల్లి వెంకటేశ్వరరావు, ఆరుట్ల రామచంద్రారెడ్డి—ఈముగ్గురు దేవరుప్పలలో సమావేశమై ఉండగా అక్కడికి మంద్రాయినుంచి ఒక రైతు వచ్చాడు. భూస్వాములు, దేశ ముఖులు వాళ్ళ రౌడీలతో సహా వచ్చారనీ, వాళ్ళదగ్గర ఆయుధాలున్నాయనీ, వారివేగాక ఇతర గ్రామాలనుంచికూడా కొన్ని అరకలు తెప్పించారనీ, భూమిని ఏక్షణాన్నైనా దున్నవచ్చుననీ, తమకు సహాయం కావాలనీ చెప్పాడు. అప్పటికే ఈ రైతులు బయటికి వచ్చివున్నారనీ, భూస్వాములను దున్ననీయవద్దని అను కుంటున్నారనీ చెప్పాడు. అప్పటికప్పుడు ఆ సమస్యను మరికొంత చర్చించి భూస్వాములు దౌర్జన్యంగా ఆక్రమించుకోవటానికి సిద్ధంగావున్నారనీ, పార్టీ ఆంధ్రమహాసభ వైపునుంచి దాన్ని ఎదిరించటానికి సన్నాహాలు ఏమీ చేయలేదనీ, అటువంటి పరిస్థితిలో రైతులుమాత్రమే వెళ్ళి ఆటకాయించినా ఉపయోగమేమీ ఉండదనీ, కాగా వారు దౌర్జన్యానికి తలపడినా, తుపాకులు కాల్చినా తాత్కాలి కంగా ఉద్యమానికి నష్టం కలుగవచ్చుననీ, సన్నద్ధంగా ఉండి ఎదిరించటంవలన ఉపయోగం ఉంటుందేకాని, ఇలా ఎదిరించటం వలన ఉపయోగం ఉండదనీ, ఈ దృష్టితో భూస్వాములను ఎదిరించకుండా ప్రస్తుతానికి లంబాడీ రైతులను ఆపటం సరిగ్గా ఉంటుందనీ నిర్ణయించారు. ఈ నిర్ణయాన్ని అమలు చేయటానికి ఆరుట్ల రామచంద్రారెడ్డి వెళ్ళాలని కూడా చెప్పారు. ఆయన తానొక్కడే వెళ్ళలేనని చెప్పినందున దేవులపల్లి వెంకటేశ్వరరావుకూడా ఆయనవెంట ఉండటానికి నిర్ణ యించారు. ఇద్దరూ బయలుదేరిన 5-6 నిముషాలకు తాను అక్కడకు వెళ్ళలేననీ ధైర్యంచాలటంలేదనీ, తానుముందు ఆ భూమిని ఇప్పిస్తానని వాగ్దానం చేసాననీ, ఇప్పుడు వెనక్కు-పొమ్మని చెప్పటం తనకు నామోషీగా ఉంటుందనీ అందుకొరకు అక్కడికి వెళ్ళటానికి సిద్ధంగాలేననీ చెప్పాడు. 'అలాంటిదేమీలేదు. నిర్ణయం చేశాము. వుండి అన్నిటికీ, అన్నివిధాలా సహాయపడతా'నని దేవులపల్లి వెంకటేశ్వరరావుగారు నచ్చజెప్పటానికి ప్రయత్నించారు. ఈ విధంగా మాట్లా డుతూ కొద్దిదూరం వచ్చిన తర్వాత తనకు భయమేస్తున్నదనీ, తనను ఆ

భూస్వాములు చంపుతారనీ, తానక్కడికి వెళ్ళితే ప్రమాదం ఉంటుందనీ, తనకు కాళ్ళు రావటంలేదనీ ఇక వెళ్ళనని చేతులెత్తి కూర్చున్నాడు. అలాంటిపరిస్థితుల్లో ఆయనను తిరిగివెళ్ళిపొమ్మని చెప్పి దేవులపల్లి వెంకటేశ్వరరావుగారు ఒక్కరే స్వయంగా రైతుని వెంట తీసుకొని ఆ ముంద్రాయి లంబాడీ తండా దగ్గరికి వెళ్ళారు. దారిలో ఆ తండా దగ్గర ముంద్రాయి భూస్వాములకు చెందిన ఒక రైసుమిల్లున్నది. అందులో ముంద్రాయి భూస్వాముల మనుషులంతా మకాంవేసి ఉన్నారు. దేవులపల్లి వెంకటేశ్వరరావు అక్కణ్ణుంచి వెళ్ళి మీద కట్ట కూర్చున్న రైతులకు నిర్ణయం గురించి చెప్పారు. మొదట రైతులు అంగీకరించలేదు. రెండు మూడు గంటలు వాళ్ళతో మాట్లాడి నచ్చజెప్పిన తర్వాత వాళ్ళు తిరిగి ఇళ్ళల్లోకి వెళ్ళిపోయారు. బహుశా ఆ రాత్రో మరుసటిరోజో భూస్వాములమనుషులు ఆ భూమిని దున్నారు. ఇదీ జరిగిన విషయం. ఆరుట్ల రామచంద్రారెడ్డి గాని, ఇతరులుగానీ దీన్ని ఎప్పుడూ సవ్యంగా చర్చించలేదు. భూస్వాముల మనుషులు దున్నినప్పుడు రైతులు వారి నెదిరించారనీ, రైతులు దున్నేసారనీ—ఇలాంటి అసత్య విషయాలన్నీ రాస్తున్నారు.

భూస్వాములు భూమి మీదికి వచ్చినప్పుడు కొందరు పోలీసులను కూడా వెంట తెచ్చుకున్నారు. పోలీసులు భూస్వాములతో కుమ్మక్కై రైతులపై అబద్ధపు కేసుకూడా పెట్టారు.

ఈ సంఘటన సందర్భంగా లంబాడీ రైతులు పక్క గ్రామాలకు కబురు చేశారు. ధర్మాపురం తండారైతులు వారి బంధువులు. తమవారికి తోడ్పడాలని అక్కడికి వచ్చారు. ముంద్రాయి రైతులు కూడా కొంద్దరు వచ్చినారు. ఇతర గ్రామాలనుంచి కొద్ది సంఖ్యలో వచ్చినారు.

**పాలకుర్తి సంఘటన :** పాలకుర్తిలో శివరాత్రి సందర్భంలో జనసమ్మర్దం ఎక్కువగా ఉంటుంది. సుమారు లక్షమంది ఆ సమయంలో వస్తారని అంచనా. ఆ రోజు ఒక బహిరంగ సభ ఏర్పాటుచేసి ఉపన్యసించాలని ఆరుట్ల రామచంద్రా రెడ్డిగారు జిల్లాకమిటీతో సంప్రదించకనే నిర్ణయించుకున్నారు. తిరునాళ్ళలో బహిరంగ సభలను ఏర్పాటు చేయటానికి జిల్లాకమిటీ ఎప్పుడూ వ్యతిరేకమే. సామాన్యంగా ఆ సమయంలో ప్రజలు తిరనాళ్ళ మనస్తత్వంతో ఉంటారనీ, రాజకీయాలు చెప్పినా పట్టించుకోరనీ, అలాంటి అవకాశాన్ని ఉపయోగించుకోవటం వల్ల మంచి ఫలితాలేమీ ఉండవనీ కమిటీ అభిప్రాయం. ఈ కారణంవల్లనే ఈ

బహిరంగసభకోసం కమిటీ నిర్ణయించలేదు. ఆయన తనకుతానే నిర్ణయంచేసి అమలు జరిపినాడు. బహిరంగసభ ఉంటుందని తెలిసి ఆయన ఆదేశం మేరకు సంఘాలున్న గ్రామాలనుంచి కూడా ప్రజలు పెద్ద సంఖ్యలో వచ్చారు. సభ జరిగింది. విసునూరు రామచంద్రా రెడ్డి గూండాలు తనను చంపడానికి ప్రయత్నిస్తున్నారన్న భయం ఆయనను వెంటాడుతూఉండేది. తన ఉపన్యాసాల్లోనూ, ప్రజలతో మాట్లాడే సమయాన ఈ భయాన్ని వెల్లడించేవాడు. ప్రజలు కూడా నిజమేననుకునేవారు. ఎందుకైనా మంచిదని పాలకుర్తికి చెందిన 20 మంది చురుకైనయువకులు వలంటీర్లుగా పనిచేస్తూ సమావేశంలో కాపలాకాస్తూనిలుచున్నారు. ఆయన ఉపన్యసించే సమయాన ఇద్దరు విసునూరు దేశముఖు గుండాలు సమావేశంలో ఉన్నారు. మారువేషాలతో సాధారణ రైతుల్లాగా గొంగళ్ళు కప్పుకొని అందరిలో కూర్చుని ఉన్నారు. వారిలో ఒకరు ఓనమాల వెంకన్న; పేరుపడిన రౌడీ నాయకుడు. పాలకుర్తి వలంటీర్లు వారి ముఖాలుచూసి గుర్తుపట్టి ఫలానా వారు వచ్చారని కేకవేశారు. కోపంతో గూండాలను దెబ్బలుకూడా కొట్టారు. గూండాలదగ్గర కత్తులులేవు. అందరిలాగా కర్రలు వెంట తెచ్చుకున్నారు. దెబ్బలు తినగానే భయంతో పరుగెత్తి వెళ్ళిపోయారు. మరోవైపు తనని చంపటానికి వచ్చిన గూండాలని భయపడి ఆరుట్ల రామచంద్రా రెడ్డి కొందరు రైతులను వెంట తీసుకొని అప్పటికప్పుడు పరిగెత్తాడు. ఒక ఇంటికి చేరుకొని వెంటనే రహస్యంగా గ్రామం వదిలి వెళ్ళిపోయాడు.[29] బహిరంగ సభకు వచ్చిన ప్రజలూ, తిరునాళ్ళకు వచ్చినవారంతా చెల్లాచెదరైపోయినారు. కొన్నిగంటల్లో ఆ ప్రదేశమంతా నిర్మానుష్యమై పోయింది.

విసునూరు దేశముఖు ఈ అవకాశాన్ని జారవిడువలేదు. పాలకుర్తి గ్రామ సంఘ నాయకులపైన, వలంటీర్లపైన, ఇతర గ్రామాలకు చెందిన మరికొందరిపైన **హత్యాప్రయత్నమనే సెక్షన్ (attempt to murder)** కింద కేసుపెట్టాడు. ఈ సాకుతో పోలీసులు, రౌడీలు గ్రామాలమీద పడి దౌర్జన్యాలు చేయసాగారు.

ఆరుట్ల రామచంద్రా రెడ్డిని విసునూరు గుండాలు చంపటానికి వచ్చినారనే వార్త అన్నిగ్రామాల్లో వ్యాపించి, భయానక వాతావరణం నెలకొన్నది. ప్రజల వెల్లువకు తట్టుకోలేక, అప్పటివరకు కుక్కినపేనులాగా పడివున్న విసునూరు గూండాలు పాలకుర్తిలోనూ, ఇతరగ్రామాల్లోనూ విచ్చలవిడిగా తిరుగుతూ ప్రజలను బెదిరించసాగారు. ఆరుట్ల రామచంద్రా రెడ్డితో సహా సంఘనాయకులంతా

అరెస్టయినారనీ, ప్రజలు దేశముఖుకు లొంగిపోవాలనీ విస్తృతంగా ప్రచారం చేశారు. వాస్తవంగా జరిగిందేమిటి? అనే విషయం స్పష్టంగా తెలియకముందే ఆరుట్ల రామచంద్రారెడ్డిని దేశముఖు చంపడానికి ప్రయత్నించాడనే వార్త మాత్రం దేశముఖుల వర్గానికి అనుకూలంగా ఉపయోగపడింది. వారి అనుచరులు కావాలని ప్రచారం చేశారు. సంఘంవైపున ఉన్నవారిలో బలహీనులు ఆ సమయంలో బయటికి వచ్చి ప్రజల్లో పిరికిమందు పోయసాగారు. దీనితో వారిలో తాత్కాలికమైన నిస్తబ్దత ఏర్పడింది. దానితో ప్రజల్లో భయం ఎక్కువైపోయింది. ఈ పరిస్థితుల్లో ప్రజల్లో ధైర్యం కలిగించి ఆంధ్రమహాసభ వైపున నిలబెట్టవలసిన కర్తవ్యాన్ని పార్టీ నిర్వహించవలసి వచ్చింది. దీనికై దేవులపల్లి వెంకటేశ్వరరావు ముందు పాలకుర్తికి వచ్చారు. అంతకుముందు ఆయన ముంద్రాయి లంబాడీ రైతుల కోరికప్రకారం సుమారు నెలరోజులు వారి తండాలోనే ఉంటూ పరిస్థితులు తెలుసుకుంటూ దగ్గరి గ్రామాలకు వెళ్ళి పని చూసుకొని తిరిగి తండాకు చేరుకునేవాడు. పాలకుర్తి సంఘటనతో ఏర్పడిన పరిస్థితులను దృష్టిలో ఉంచుకొని తన ముంద్రాయి కార్యక్రమాన్ని తగ్గించుకొని పాలకుర్తి గ్రామానికి వచ్చాడు. భయగ్రస్తులైన ప్రజలకు ధైర్యంతో ఉండవలసిన అవసరాన్ని గూర్చి చెప్పాడు. గ్రామాల్లో తీవ్రమైన భయానక వాతావరణం ఉన్నప్పటికీ, వారు ఆంధ్రమహాసభ నుంచి దూరంకాలేదు. అప్పటినుంచి కొన్ని నెలలదాకా కేసులు నడిచాయి.

**గ్రామసంఘాల స్వరూప స్వభావాలు :** గ్రామసంఘాల నాయకత్వంలో భూస్వాముల నుంచి పేదరైతులు, వెట్టిచాకిరీ చేసేవారు, వ్యవసాయ కూలీలవరకు ఉండేవారని ఇదివరకే రాశాము. ఈ భూస్వాముల పాత్ర ఏమిటి? వారు సంఘ నాయకత్వంలోకి చేరవలసిన అవసరమేమిటి? ప్రజలు వీరి నాయకత్వాన్ని ఎందుకు అంగీకరించవలసి వచ్చింది? అనే ప్రశ్నలకు సమాధానాలు చెప్పాలంటే అక్కడి వాస్తవ పరిస్థితులను వివరించటం అవసరం.

దేవరుప్పుల ఒక పెద్దగ్రామం. ఆ గ్రామ సంఘ నాయకత్వంలో కొందరు భూస్వాములు ఉండటమేగాక వారి ప్రాబల్యం కూడా హెచ్చుగానే ఉండేది. వీరిలో ఒకరు అధ్యక్షులు. వారిదొక సమిష్టి కుటుంబం. ఇద్దరన్నదమ్ములు. వారికి 20 ఎకరాల వ్యవసాయం ఉండేది[80]. వారు ఆ గ్రామంలోని ప్రజలకేగాక చుట్టుపక్కల వున్న గ్రామాల ప్రజలకు డబ్బు వడ్డీలకు ఇచ్చేవారు; నాగులకి ధాన్యానిచ్చేవారు.

ఈ విధంగా వారు దోపిడీదారులు కూడా. అయినా వారు కూడా విసునూరు దేశముఖు దోపిడీకి గురైనవారిలో ఒకరే. అంతేగాక, తమనుంచి అప్పులు తీసుకున్న గ్రామప్రజలు సంఘంలో చేరడానికి సిద్ధంగా ఉన్నప్పుడు తామూ ప్రజలతోపాటు చేరకపోతే తమయెడ వ్యతిరేకత ఏర్పడుతుందనే భయంతో చేరారు. ఆ కుటుంబానికి మాత్రం విసునూరు రామచంద్రారెడ్డి యెడ వ్యతిరేకత ఉండేది. ఇలాంటి ధనవంతులైన భూస్వాములు సంఘంలో ఉంటే, వారి తోడ్పాటుతో దేశముఖుని ఎదుర్కోవటం సులభమని ప్రజలు కూడా వీరి నాయకత్వాన్ని అంగీకరించారు. ఇతర పెత్తందార్లు, కులపెద్దలు కూడా సంఘ నాయకత్వంలో ఉండేవారు. గ్రామం చాలా పెద్దదైనందున గ్రామంలో వివిధ కులాలవారు నివసించటమేగాక వారిలో ధనికరైతులు కూడా ఉండేవారు. కులపెద్దలతో సహా వారంతా సంఘంలో చేరినారు.

దేశముఖుకు సన్నిహితులైన భూస్వాముల కుటుంబం సంఘంలో చేరలేదు. మరొక భూస్వాముల కుటుంబం (పట్వారీ) తటస్థంగా ఉండేది. ఈ కుటుంబం వారికి దేశముఖుయెడ వ్యతిరేకత వున్నా సంఘంలో చేరటానికి సిద్ధపడలేదు. "హరిజనులు" కొద్దిరోజులముందే ఇస్లాం మతాన్ని స్వీకరించినందున సంఘంలో చేరలేదు. నిజాం నవాబుకు భక్తులుగా ఉండాలని వారికి ముస్లిం గురువులు బోధించారు. అయినా వారు అటు దేశముఖువైపూ చేరలేదు; ఇటు సంఘంలోనూ చేరలేదు ; తటస్థంగా ఉండేవారు. తక్కినవారంతా సంఘంలో చేరారు.

కడివెండిలో సంఘనాయకుడు దావూదురెడ్డి అనే భూస్వామి. అతను రోమన్ కాథలిక్కు మతస్తుడు. న్యాయంకోసం సత్యం కోసం నిలబడాలని కోరేవాడు. ఇటువంటి మతప్రమేయంకల పెద్దమనిషి విసునూరు దేశముఖు దౌర్జన్యాలను వ్యతిరేకించటానికి ముందుకువచ్చాడు. ప్రజలు అతన్ని గ్రామసంఘానికి అధ్యక్షునిగా ఎన్నుకున్నారు. కడివెండి గ్రామంలో వున్న రోమన్ కాథలిక్కు రైతులు సంఘంలో చేరారు. కాని ఇతరగ్రామాల్లోనివారు ఈ దశలో తటస్థంగా ఉన్నారు). వడ్డీవ్యాపారం చేస్తూ ధాన్యాన్ని నాగులకు ఇచ్చే మైతరగతి వ్యక్తి మరొక గ్రామ సంఘానికి నాయకుడు.

ముంగ్రడాయి గ్రామసంఘానికి సాధారణరైతులే నాయకులైనారు. వారిలో లంబాడీ రైతుపెద్దలు ముఖ్యులు. వారిలో భూస్వాముల నుంచి వచ్చినవారు లేరు. పాలకుర్తి పరిస్థితి వేరు. ఆ గ్రామానికి వేరే ఒక దేశముఖు ఉండేవాడు. అతడు

విసునూరు దేశముఖుకు అనుకూలుడు. అయినా సంఘంఏర్పడిన తర్వాత తటస్థుడయినాడు. అయినా ఇక్కడి పటేలు కూడా ఒక భూస్వామి. అతని తండ్రి శివభక్తుడు. కొడుకు గ్రామసంఘ అధ్యక్షుడు. భూస్వామి కావటంతో దేశముఖుకు లొంగివుండటానికి సిద్ధంగా లేక సంఘంలో చేరాడు. ఆయనను మినహాయిస్తే తక్కిన నాయకులు రైతుపెద్దలే. వారు సామాన్యరైతులే అయినా గ్రామ ప్రజల్లో పలుకుబడిగలవారు. వారితోపాటు వెట్టిచాకిరీ చేసేవారుకూడా వుండేవారు. వారిలో కొందరు కులపెద్దలు. వారిలో ఒకటి చాకలి అయిలమ్మ కుటుంబం. ఆమె భర్త నర్సింహ సంఘ నాయకులలో ఒకరు. వారి కొడుకులిద్దరు వలంటీర్లు. ఆరుట్ల రామచంద్రారెడ్డి పెట్టిన బహిరంగ సభను కాపలా కాసిన వలంటీర్లలో వారిద్దరూ వున్నారు. తండ్రితో సహా వీరిద్దరినీ అరెస్టుచేశారు. దీనితో ఆ కుటుంబంలో అయిలమ్మ, ఆమె కోడళ్ళిద్దరూ, కూతురు, చిన్నపిల్లలూ మాత్రమే మిగిలిపోయారు. పోషించే మగవారు ముగ్గురూ జైలుకు వెళ్ళారు. దగ్గరేవున్న మల్లంపల్లి గ్రామ మఖ్తాదారు భూమిని కౌలుకుచేస్తూ, తమ చాకలి వృత్తిని సాగిస్తూ మధ్యతరగతి రైతు జీవితం గడుపుతూవున్న ఆ కుటుంబానికి గ్రామ ప్రజల్లో బాగా పలుకుబడివుండేది. వీరుగాక గ్రామంలోని సంఘ నాయకులనూ, వలంటీర్లుగా పనిచేసిన ఇతరులనూ కూడా అరెస్టుచేశారు.

గ్రామ "హరిజనులు" మొదటి రోజుల్లో దేశముఖుకు అనుకూలంగా వున్నారు. అయినా ప్రజలకు వ్యతిరేకంగా దుర్మార్గపు పనులు చేయటానికి సిద్ధంగాలేరు. సంఘ నాయకత్వం చేసిన కృషిఫలితంగా క్రమంగా తటస్థులైనారు.

గ్రామాలయొక్క, గ్రామసంఘాలయొక్క లక్షణాలను చూస్తే భూస్వాములనుంచి పేదరైతులు, వ్యవసాయకూలీలవరకు గ్రామసంఘాలలో వున్నారు. అయినా ఒకటో రెండో కుటుంబాలు దేశముఖువైపున కూడా ఉన్నాయనే అంశాన్ని గుర్తుంచుకోవాలి. కొన్ని గ్రామాల్లో హెచ్చుగా ఉండేవారు.

**ఆదాయ వ్యయాలు :** గ్రామ సంఘంలో భూస్వాములు స్వయంగా ధనవంతులైనా సంఘానికి కావల్సినఖర్చులన్నీ సంఘ సభ్యులనుంచివసూలు చేసి తమ దగ్గర దాచిపెట్టినారు. వీరే రుణదాతలు కావటంతో డబ్బు వసూళ్ళు కొంత సులభమైనవి. ఆ డబ్బునుంచి కేసులకూ, సంఘం తరఫున వచ్చే నాయకులకూ, కార్యకర్తలకూ భోజనపు ఏర్పాట్లకోసం ఖర్చుచేయాలని గ్రామసంఘాల్లోనే

నిర్ణయించారు. దానిననుసరించి ఖర్చుచేసేవారు. ముంద్రాయి, పాలకుర్తి కేసులతో ఖర్చులుకూడా ప్రారంభమైనవి. మొదట్లో గ్రామ నాయకులు కొంత డబ్బు ఇచ్చారుకూడా.

ఈ విధంగా ప్రజలనుంచి డబ్బులు వసూలుచేసి కేసులకు ఖర్చుచేయటం గ్రామ సంఘాల కార్యక్రమంలో ఒకభాగం. గ్రామ సంఘ నాయకత్వం ఉచితంగా న్యాయసహాయంచేయాలి దీనివలన ప్రజలు తమ తగాదాల తీర్పుకు దొరలదగ్గరికి వెళ్ళనవసరం ఉండదు ; డబ్బు ఇచ్చుకోనవసరం ఉండదు. ఇది కూడా సంఘాల కార్యక్రమంలో ఒక ముఖ్యభాగమే. ప్రజలకు ఈ కార్యక్రమం వలన ఎంతో సౌకర్యం కలిగింది దానిననుసరించి తగాదాలున్నవారు సంఘ నాయకులదగ్గరికి వచ్చి తీర్పులు చేయించుకొని తిరిగి వెళ్ళేవారు. ఈ చర్యవలన మూడు సత్ఫలితాలు కలిగినవి. 1) సంఘం ప్రజల్లో ఐక్యతను నెలకొల్ప గలిగింది. 2) దేశముఖుకు ఆయన తాబేదార్లకు ప్రజలు చెల్లించవలసిన డబ్బులో పెద్దభాగం మిగిలిపోయింది. 3) వారి అక్రమ ఆదాయం దెబ్బ తిన్నది.

## 8. కేసులు - నిర్బంధం

వెట్టిచాకిరీ, అక్రమ వసూళ్ళనుంచి విముక్తిపొందిన ప్రజలు, భూస్వాములు అక్రమంగా స్వాధీనం చేసుకున్న తమ భూముల సమస్యను గూర్చి ఆలోచించ సాగారు. ముంద్రాయిలోని లంబాడీ రైతుల భూమి సమస్య ఇలాంటిదే. దీనిని, ఇలాంటి ఇతర సమస్యలను పరిష్కరించకముందే పోలీసులు, దేశముఖులు కుమ్మక్కై నిర్బంధాన్ని ప్రయోగించారు. ఈ సందర్భంలో వచ్చిన కేసులు : ఒకటి ముంద్రాయి భూమి ఆక్రమణకు సంబంధించినది. దేవులపల్లి వెంకటేశ్వర రావుతోబాటు కొందరు లంబాడీ రైతులపై ఈ కేసును నడిపించారు. కేసుకోసం కోర్టుచుట్టూ తిరగటమేగానీ కేసు విచారణ సమయంలో వారంతా జైలులో ఉండ వలసిన అవసరం కలుగలేదు. పర్మిషన్ లేకుండా రాజకీయ మీటింగులు పెట్టారనే ఆరోపణతో నలభై గ్రామాల సంఘనాయకులపై కేసులుపెట్టారు. రావినారాయణ రెడ్డి, దేవులపల్లి వెంకటేశ్వరరావు, ఆరుట్లరామచంద్రారెడ్డి, ఆళ్వారుస్వామిగార్ల పర్యటన సందర్భంలో ఊరేగింపులు, బహిరంగ సభలు జరిగినవి. అంతకుముందు

ఆరుట్ల రామచంద్రారెడ్డి వెళ్ళిన గ్రామాల్లోకూడా బహిరంగ సభలు జరిగినవి. వీటికి పర్మిషన్‌లేదు. దీనితో గ్రామ సంఘనాయకులమీద ఆ కేసులు పెట్టారు. అవన్నీ బెయిలబుల్ కేసులు కావటం వలన వెంటనే వారిని బెయిల్‌పై విడుదల చేశారు. అన్నిటికన్నా తీవ్రమైనది పాలకుర్తి కేసు. అది హత్యా ప్రయత్నమనే నేరం. సుమారు 20 మందిపైన ఆ కేసు పెట్టారు. దానిలో ఆరుట్ల రామచంద్రారెడ్డితోపాటు స్థానికులు, ఇతరగ్రామాల యువకులు వున్నారు. పాలకుర్తిలో అయిలమ్మ కుటుంబంలోని ముగ్గురు మగ వారితోబాటు పాలకుర్తి భూస్వామి కొడుకు కూడా కేసులో ఉన్నాడు. వీరిలో హెచ్చుభాగం అరెస్టయ్యారు. భూస్వామికొడుకు మాత్రం అరెస్టుకాలేదు. తప్పు కున్నాడు. తాను అరెస్టయితే దేశముఖులు తనని చంపుతారని ఆరుట్ల రామచంద్రా రెడ్డిగారే తరచుగా చెపుతూ ఉండటంవలన అలాంటి వదంతి వ్యాపించింది. దీనిలో నిజమెంత వున్నప్పటికీ, ఆయన అరెస్టువలన ప్రజలలో నిరుత్సాహమేర్పడ వచ్చునని, ఆ కారణాన ఆయన అరెస్టు కావద్దని పార్టీ నిర్ణయించింది. దానిననుస రించి కొద్దిరోజులు అరెస్టుకాకుండా ఉన్నాడు. ఆ సమయాన్ని ఉపయోగించు కొని విసునూరు దేశముఖు మనుషులు జైల్లో ఉన్న యువకులను, పెద్దమనుషు లను నిరుత్సాహపరిచి లొంగదీయటానికి ప్రయత్నిస్తున్నారని పార్టీకి తెలిసింది. వెంబడే ఒకరిద్దరు నాయకులు వారితోవుంటూ సాధారణ రైతుల, ఇతర యువకుల మనోనిబ్బరాన్ని నిలబెట్టాలనీ, దీనికై ఆరుట్ల రామచంద్రారెడ్డి, మరికొందరు కార్యకర్తలు అరెస్టుకావాలనీ నిర్ణయించింది. ఆ నిర్ణయం అమలు జరుగటానికి అవసరమైన ఏర్పాట్లుచేశారు. అరెస్టయిన ఆరుట్ల రామచంద్రారెడ్డిని గ్రామాలలో తిప్పి ప్రజలను నిరుత్సాహపరచటానికి, దిగజార్చటానికి ప్రయత్నించారు. తర్వాత ఆయనను జైల్లో పెట్టినారు. దీనిఫలితంగా అరెస్టయినవారంతా ధైర్యంగా ఉన్నారు. ప్రజల్లో భయానక వాతావరణం వున్నా, దేశముఖుకు లొంగలేదు. కేసు నడిచింది.

ఈస్థితిలో ప్రజల్లోవున్న నిరుత్సాహాన్ని పోగొట్టి వారిని ఆంధ్రమహాసభ వైపున నిలపటానికి ప్రయత్నించవలసిన అవసరం ఏర్పడింది. ఈ సంఘటనలకు పూర్వమే జిల్లాకమిటీ సమావేశమై ఈప్రాంతంలో పార్టీ నిర్మాణానికై కార్య కర్తలను పంపాలని నిర్ణయించి పంపించింది. ఆరుట్ల రామచంద్రారెడ్డి స్థానికంగా ముందుకువచ్చిన యువకులతో పార్టీ నిర్మాణానికి ప్రాతిపదిక వేయలేదు. కాగా

భూస్వాములు, వడ్డీ వ్యాపారస్థులు, కులపెద్దలతో సంఘాలను ఏర్పాటుచేశాడు. పార్టీ నిర్మాణ అవసరాన్ని గుర్తించకపోయే పెదధోరణి ఒకటి అభివృద్ధి అయింది. దాని ప్రతినిధులలో ఈయన ఒకరు. కమ్యూనిస్టుపార్టీ నల్లగొండ జిల్లా కమిటీ కార్యదర్శి, నల్లగొండజిల్లా ఆంధ్రమహాసభ అధ్యక్షుడు అయిన దేవులపల్లి వెంకటేశ్వరరావు ఉద్యమ నిర్వహణకు సంపూర్ణమైన బాధ్యతను స్వీకరించాడు. అప్పటివరకు సాగుతున్న ఆంధ్రమహాసభ కార్యకలాపాలు-అరెస్టులు, గూండా దళాలు తలఎత్తడంలాంటి నిర్బంధంతో స్తంభించాయి. ప్రజలలో భయవాతావరణం ఏర్పడినా వారెవరూ లొంగిపోలేదు. అందరూ సంఘం నిలబడాలని కోరుతూ ఉన్నారు. అయినా బహిరంగంగా ముందుకువచ్చి పనిచేయటానికి, సంఘంతో బహిరంగ సంబంధాలు ఏర్పరచుకోటానికి ధైర్యంచేయలేదు. అలాంటి స్థితిలో దేవులపల్లి వెంకటేశ్వరరావు వివిధ గ్రామాలకువెళ్ళి ప్రజలను రహస్యంగా కలుసుకొని, లేదా ఏదయినా గ్రామంవెళ్ళే సమయంలో దారిలో పొలాల్లో, చేలల్లోవున్న రైతులను కలుసుకొని వారికి ధైర్యంచెపుతూ, వారి అభిప్రాయాలను, సమస్యలను తెలుసుకుంటూ వారితో సంబంధాలు ఏర్పరచుకునేది.

**కేసుల నిర్వహణ :** మరోవైపున కేసులు నడిపించే సమస్య ముందుకువచ్చింది. దాదాపు 30-40 కేసుల్లో సుమారు 200 మంది చిన్న, పెద్దరైతులను ఇరికించటం వలన వాటిని నడిపించటానికి ప్రత్యేకంగా ఒక కార్యకర్త అవసరం ఏర్పడింది. దీనికొరకు పైరవీకారులను ఏర్పాటుచేస్తే, డబ్బులు ఖర్చుచేసి, అక్రమాలకు పాల్పడుతారని వారిని నియమించలేదు. కేసు నడిపించుటలో అనుభవంవున్న సూర్యాపేట తాలూకా కార్యకర్త నల్లు ప్రతాపరెడ్డికి పార్టీ ఈ బాధ్యత అప్పగించింది. ఆయన చక్కగా పనిచేసి తన బాధ్యతను నిర్వహించాడు. ఈ విధంగా మరికొందరు కార్యకర్తలను పంపించి అక్కడి ఉద్యమాన్ని కాపాడటానికి పార్టీ కృషిచేసింది. జనగామ తాలూకా కేంద్రస్థానం. మున్సిపు మేజిస్ట్రేటు కోర్టువున్నది కూడా అక్కడే. వ్యాపారకేంద్రమైనా పెద్ద పల్లెటూరులాగా ఉండేది. కేసులన్నీ అక్కడే నడుస్తున్నందున కార్యకర్తలూ రైతులూ తరచుగా జనగామ వెళ్ళవలసివచ్చేది. జనగామ కొత్తప్రదేశం కావటంతో అక్కడి రైతులు, గుమాస్తాలు, వర్తకులతో సంబంధాలు ఏర్పాటుచేసుకొని వారి సహాయాన్ని పొందినారు. ఆంధ్రమహాసభ కార్యకర్తలు క్రమంగా ఒక ఆఫీసును ఏర్పాటుచేశారు. ఈ పనులలో బుచ్చిరెడ్డి అను కార్యకర్త తోడ్పడినాడు.

అతడు స్థానికుడు. 1938 లో స్టేటుకాంగ్రెసు సత్యాగ్రహంతో సంబంధం వున్న వ్యక్తి.

కోర్టులో కేసులు నడిపే సందర్భంలో కోర్టు లంచాలు, ఇతర నిర్బంధాలను ఎదుర్కోవటం అవసరమయింది. దీనికై రెండు ఉదాహరణలు చాలు.

ఒక సందర్భంలో రైతులు కొందరికి జమానతు (జామీను, బెయిలు) దొరికింది. కోర్టులో జామీను దొరికినా వారికి అక్కడుండేటువంటి సిరిష్తాదారు (హెడ్ క్లర్కు) కొంతముడుపు చెల్లిస్తేనే విడుదలచేసే ఆర్డర్లను జారీచేస్తాడు. లంచం ఇవ్వలేదని అతను వాటిని తొక్కిపట్టినాడు. కార్యకర్తలు ఆతనివద్దకు వెళ్ళి అడిగినా ఆతడు "డబ్బులివ్వకుంటే ఆర్డర్లు జారీ చేసేది లేద"ని స్పష్టంగా చెప్పాడు. అప్పుడు లంచం ఇచ్చి జామీనుమీద విడిపించుకోవాలా లేక జెయిల్‌లో ఉండటానికి సిద్ధపడాలా అనే సమస్య ముందుకు వచ్చింది. కార్యకర్తలు రైతులతో మాట్లాడి వారిని సిద్ధం చేశారు. లంచం ఇవ్వకుండా వారిని విడుదల చేయాల్సిన అవసరముందనీ దానికై సంఘం తరఫున పోరాడుతామనీ, వారు లంచం ఇవ్వకుండా వదిలిపెడితే మంచిదే, లేకపోతే—ఒకరోజు, అవసరమైతే మరో రోజు అదనంగా జైలులో ఉండాలనీ, ఇబ్బందులు ఉన్నా సహించాలనీ రైతులకు నచ్చజెప్పినారు. జైల్లో వున్న రైతులు కూడా సంతోషంతో సహకరించారు. తర్వాత సిరిష్తాదారుతో లంచం ఇచ్చేది లేదనీ దేనికైనా సిద్ధమేననీ స్పష్టంచేశారు. అతడు ఇరకాటంలో పడ్డాడు. కార్యకర్తలు మేజిస్ట్రేటు దగ్గరికివెళ్ళి జరిగిన వివరాలు చెప్పారు. ఆయన వెంటనే విడుదల చేయించాడు. దీనితో కోర్టు లంచాలు ఆగిపోయినవి. ఇదొక విజయమే అయినా ఆంధ్రమహాసభ కేసులు, వాటిలో వున్న 200 మంది రైతులకే పరిమితమైనది. కోర్టుకు వచ్చే సాధారణ ప్రజలకు వర్తించలేదు. కార్యకర్తలు దీనికి ప్రజాందోళన స్వరూపమివ్వలేదు.

అందరూ నెత్తిరుమాలుతోకాని లేదా నెత్తికి గుడ్డచుట్టుకొని లేదా టోపీ పెట్టుకొని కోర్టులోకి రావలసి ఉండేది. కార్యకర్తలూ, నాయకులెవరూ నెత్తికి గుడ్డచుట్టకపోయేవారు. ఖద్దరు టోపీలు ధరించలేదు. కేసు సందర్భంలో హాజరవుతున్న దేవులపల్లి వెంకటేశ్వరరావును నెత్తిపై గుడ్డలేదనే కారణాన కోర్టు హాలు లోపలికి రావటానికి వీలులేదని అక్కడున్న చప్రాసి (ప్యూను) అడ్డగించాడు. 'రూల్సులో అలాంటిదేమీలేదు. వెళ్ళటం ఖాయం' అని చెపితే ఆ ప్యూను

మొరాయించి రానివ్వలేదు. అంతకుముందే లాయరుతో మాట్లాడితే 'అలాంటి రూల్సేవీ లేవు. వీళ్ళు పొగరుబోతనంతో వ్యవహరిస్తున్నార'ని చెప్పారు. ఆయన ఎన్. కె. రావుగారు. 'దేవులపల్లి వెంకటేశ్వరరావుమీద కేసున్నది. వెళ్ళనివ్వకపోతే బాధ్యత నీదే అవుతుంది. మున్సిఫ్ మేజిస్ట్రేటుకు చెప్తాము' అని చెప్పారు. ఈ సంగతంతా గమనిస్తున్న మున్సిఫ్ మేజిస్ట్రేటు ప్యూన్‌ని పిలిచి 'సంగతేమిట'ని అడిగాడు. అతను చెప్పాడు. 'రానివ్వు' అని చెప్పాడాయన. దానితో నెత్తిపై గుడ్డలేకుండా కోర్టుకు రావటమనేది మామూలైపోయింది. పాత సాంప్రదాయం పోయింది. క్రమంగా కోర్టు స్టాఫ్ కూడా సహకరించారు. పనులు సవ్యంగా జరిగిపోయేవి.

మజ్లిస్ ఇత్తెహాదుల్ ముసల్మీన్‌తో సంబంధమున్న లాయరు హైదరాబాదు నుంచి వచ్చి కేసులో సహాయపడ్డాడు. ఆయనపేరు వఫాఖానీ. అప్పటి పార్టీ పాలసీ ఫలితంగా మజ్లిస్ ఇత్తెహాదుల్ ముసల్మీన్‌తో పార్టీకి మంచి సంబంధాలు ఏర్పడినవి. వారు ఈ కేసులయెడ ఆసక్తిని కనపరచి సాయం చేయటానికి సిద్ధపడినారు. శ్రీ వఫాఖానీ అలాంటివారిలో ఒకరు. ఈయనగాక ప్రముఖ జాతీయవాది నాగులపల్లి కోదండరామారావు ముఖ్యమైన అన్ని కేసుల్లో ముందుకు వచ్చి సాయపడినారు. ఆరుట్ల లక్ష్మీనరసింహారెడ్డి భువనగిరిలో ప్లీడరు వృత్తిలో వుంటూ కేసుల సమయంలో జనగామకు వచ్చి పనిచేసి వెళ్ళేవారు. ఈ విధంగా స్థానిక ప్లీడర్ల సాయంలేకనే కేసులు నడిచినవి. (ఆరోజుల్లో విసునూరు దేశముఖు తన ప్రత్యర్థుల తరఫున పనిచేసే ఏప్లీడరునైనా డబ్బిచ్చి తనవైపుకు తిప్పుకొని కేసుల్లో తనకు అనుకూలమైన తీర్పులను చేయించుకునేవాడు. ఆ కారణాన ఆంధ్ర మహాసభ కేసులకు స్థానిక ప్లీడర్లను ఏర్పాటుచేయలేదు) హైదరాబాదు లాయర్లు ఫీజు తీసుకోలేదు. రాకపోకలు, భోజనవసతి ఖర్చులు భరిస్తే వచ్చి కోర్టుపని చూచుకొని వెళ్ళిపోయేవారు. ఈ ఖర్చులు కూడా భారమైనా అదనపు భారం (ఫీజు) లేని సౌకర్యం కలిగినది. ప్రజలు గ్రామసంఘాల ద్వారా ఇచ్చిన డబ్బుతో ఆ కేసులను నడిపించింది ఆనాటి నాయకత్వం.

పాలకుర్తి కేసును క్రింది కోర్టులో ప్రాథమిక విచారణ జరిపి సెషన్సుకు పంపించారు.

సెషన్సు జడ్జిపేరు గులాం పంజతన్. విసునూరు దేశముఖు స్నేహితుడు. అతని అవసరాలను తీర్చటానికి దేశముఖు ఎంతైనా ఖర్చుచేసేవాడు. దేశముఖు

ఎన్ని దురాగతాలను చేసినా ఆయనను తప్పించడానికి బాఖరుహుస్సేన్ అనే లాయరు కోర్టు పనులుచూసేవాడు. పబ్లిక్ ప్రాసిక్యూటరు ఒకరున్నప్పటికీ ప్రభుత్వం బాఖరు హుస్సేన్‌ను పోలీసు తరపున పనిచేయటానికి అదనంగా ఏర్పాటు చేసింది. రైతుల, ఆంధ్రమహాసభ కార్యకర్తల తరపున పనిచేసేది ఎవరు అనే ముఖ్య సమస్య ఎదురైంది. ముఖ్యుడు, సీనియరు లాయరైన శ్రీయుతులు నాగులపల్లి కోదండ రామారావు ముందుకువచ్చి శ్రద్ధగా పనిచేశారు. సమర్థుడేకాక నిర్భయంగా వాదించగలవాడని పేరొందినవాడు. మరొకరు కొండా లక్ష్మణ్. కొత్తగా ప్రాక్టీసు ప్రారంభించిన యువకుడు. ఆయనలో ప్రభుత్వ వ్యతిరేకత బాగా ఉండేది. కాంగ్రెసు అనుచరుడైనా అతివాద అభిప్రాయాలు కలవాడు. ఆయనకు కమ్యూనిస్టుపార్టీతో సంబంధం లేకున్నా చేనేత పనివారి సమస్యలపై కలిసి పనిచేసేవాడు. చేనేత సంఘానికి అధ్యక్షుడు కూడా. (ఆరోజుల్లో కమ్యూనిస్టులు చేనేత సంఘాలను పెద్దఎత్తున ఆర్గనైజు చేశారు.) ఆరుట్ల లక్ష్మీనరసింహారెడ్డి కూడా ప్లీడరే. ఆయన కూడా హైదరాబాదులో మకాంవేసి కేసుకోసం పనిచేశాడు. ఈ ముగ్గురు ఆంధ్రమహాసభ తరపున పని చేసిన లాయర్లు.

కేసు విచారణ ప్రారంభమై సాగుతూవుంటే అడుగడుగునా అవరోధాలు కలిగించసాగినాడు జడ్జి. పోలీసులు, వారితరపున పనిచేసిన లాయరు సంగతి వేరే చెప్పనవసరంలేదు. విసునూరు రామచంద్రారెడ్డితో సంబంధం ఉన్న ఈజడ్జి ఏదో ఒక సందర్భంలో బహిరంగంగా పక్షపాతాన్ని ప్రదర్శించాడు. దాన్ని అవకాశంగా తీసుకొని కేసుని మరో జడ్జికి ట్రాన్సుఫరుచేయాలని హైకోర్టులో పిటిషను పెడితే హైకోర్టు దానినంగీకరించినది. సెషన్సు కోర్టులో రెండోజడ్జి వుండటంవలన హైకోర్టువారు కేసును ఆయనకు మార్చారు. రెండవ జడ్జి పింగళి వెంకట్రామారెడ్డిగారు. మాజీ సుప్రీంకోర్టు జడ్జి జగన్‌మోహన్ రెడ్డిగారి తండ్రి. పాతకాలపు మనిషి. అయినా నిష్పక్షపాతంగా తీర్పులిస్తాడని ప్రభుత్వ వర్గాల్లో ప్రతీతి. పెద్దభూస్వామి, సంపన్నుడు అయిన ఆయనను ప్రభుత్వం గౌరవ జడ్జీగా నియమించింది. ఆ పదవిని ఆయన సమర్థవంతంగా నిర్వహించాడని ఆరోజులలో అందరూ అంగీకరించిన విషయం. ఆయన కోర్టులో కేసు విచారణ తిరిగి ప్రారంభమైంది. విచారణ సందర్భంలో ఇటు ఆంధ్రమహాసభ లాయర్లు, అటు విసునూరు దేశముఖు పట్టుదలతో కేసును నడిపించారు. అయినా

ఈమార్పే విసునూరు దేశముఖుకు మొదటి ఓటమి. విసునూరు కుటుంబం పింగళి వారి కుటుంబాలమధ్య ఒక తీవ్రమైన కలహం సాగింది. ఇంతకుముందే చెప్పినట్లుగా ఆయన సోదరుడు పింగళి కోదండరామారెడ్డిని ఒక అబ్కారీ కేసు వ్యవహారంలో హత్యానేరాన్ని అపాదించి అరెస్టుచేయించాడు. పై కోర్టులో మాత్రమే ఆయన విడుదలయినాడు. విసునూరు దేశముఖు సాగించేదుర్మార్గాలు జడ్జీగారికి బాగా తెలుసు. దీనితో తన కుట్రలకూ కుయుక్తులకూ ఈ జడ్జీ అవకాశమివ్వడనే భయం విసునూరు దేశముఖుకు ఏర్పడింది. అయినా తన ప్రయత్నాన్ని మానుకోలేదు.

విచారణ సందర్భంలో కొన్ని ముఖ్యమైన సంఘటనలు జరిగినవి. ఈ కేసులో పోలీసు తరఫున వచ్చిన సాక్షులను విచారించిన సందర్భంలో పోలీసులు ఒక ముసలమ్మను సాక్షిగా తెచ్చారు. ఆమె ముద్దాయిలలో ఒకరి తల్లి. దొరగారికి, పోలీసులకు అనుకూలంగా సాక్ష్యం చెప్పితే ఆమె కొడుకుపై వున్న కేసును కొట్టివేయించి విడుదలచేయిస్తామని పోలీసులు ఆమెకు చెప్పారు. ఆమె చాలా పెద్దమనిషి. వైశ్య కుల స్తురాలు. సరేనని భయానికి ఒప్పుకున్నది. రెండో వైపునుంచి సంఘ నాయకులు వచ్చి అడిగారు. వారికి ఈ సంగతిచెప్పి ఏంచేయాలని అడిగింది. సంఘ నాయకులు కూడా ముందు ఒప్పుకొమ్మనీ, తర్వాత తాము చెప్పినట్టు సాక్ష్యంచెప్పమనీ ఆమెకు సలహా ఇచ్చారు. ఆమెకు చెప్పవలసిన అంశాలన్నీ వివరంగా చెప్పి పోలీసుకు, దేశముఖుకు వ్యతిరేకంగా సాక్ష్యమిప్పించటానికి ఆమెను తయారుచేశారు సంఘనాయకులు. ఆమె పోలీసుల తరఫున సాక్ష్యం చెప్పటానికి కోర్టులోకొచ్చింది. పింగళి వెంకట్రామారెడ్డిగారు ఆంధ్రుడు. తెలుగు బాగా వచ్చును ఆమె మాట్లాడటానికి భయపడుతూ వుంటే జడ్జీగారు 'భయపడకు పెద్దమనిషీ' అని ధైర్యం చెప్పారు. అంతకుముందు ఆయన ఇతరులతో ఉర్దూలో మాట్లాడటం చూచి భయపడిన ఆమె తనతో తెలుగులో మాట్లాడటం వలన నిర్భయంగా మాట్లాడింది. సంఘ నాయకులు ఆమెకు చెప్పినట్లుగానే సాక్ష్యం చెప్పింది. జడ్జీగారుమధ్యమధ్య ప్రశ్నలువేసికొంతసమాచారాన్నిరాబట్టుకోగలిగారు. పోలీసులతరఫున ఇచ్చినఈసాక్ష్యంతో దేశముఖుకు తలగొట్టినట్లయింది. పోలీసులకు కూడా ఇదొక తీవ్రమైన సమస్య అయింది. కానీ ఆమెను ఏమీ అనటానికి ధైర్యం చేయలేకపోయారు. కోర్టుహాలు నుంచి బయటకు రాగానే ఆమెకు నాయకులు రక్షణ కల్పించి ఇంటికిపోయే ఏర్పాట్లు చేశారు.

ఆంధ్రమహాసభ తరఫున పనిచేసిన లాయర్లు డిఫెన్సు సాక్షులను కొందరిని తేవాలని నిర్ణయించారు. దానికై ఏర్పాట్లు కూడా చేశారు. సాధారణంగా క్రిమినల్ కేసులో ఇలాంటిది జరుగదు. ప్రాసిక్యూషన్ సాక్ష్యాన్ని చిత్తుచేసి ముద్దాయిలను విడిపించుకుంటారు లాయర్లు. కానీ దేశముఖు-పోలీసులు తమ సాక్ష్యాలను కట్టుదిట్టంగా చెప్పించారు. ముసలమ్మ సాక్ష్యం వారికి వ్యతిరేకంగా ఉంది. మరికొందరి సాక్ష్యాల్లో కొంత బలహీనత ఉంది. అయినా ఈ బలహీనతలపై ఆధారపడక డిఫెన్సు సాక్ష్యాన్ని గట్టిగా చెప్పించి కేసును కొట్టివేయించాలని డిఫెన్సు లాయర్లు ప్రయత్నించారు. దీని పర్యవసానంగా 30-40 మందిని డిఫెన్సు సాక్ష్యాన్నివ్వటానికి సిద్ధపరిచారు. వారందరూ కూడా సంఘసభ్యులైన రైతులు. ఈ సాక్ష్యాల సాయంతో కేసును ఎదురుతిప్పటానికి ప్రయత్నం చేశారు. అది విజయవంతమయింది కూడా. ఆరుట్ల రామచంద్రారెడ్డిని చంపటానికి దేశముఖు గూండాలు వచ్చినారనీ, ఆ సమయాన బహిరంగసభకు వచ్చిన వారు ఆత్మరక్షణకోసం గూండాలను కొట్టారనీ, అంతేకానీ వారిపై హత్యాప్రయత్నమేమీ లేదని సాక్షులు చెప్పారు. అన్నిగ్రామాలనుంచీ వారిని తీసుకొచ్చి తాము తిరణాలకేగాక బహిరంగసభకు హాజరైనట్టూ, ఆ సమయంలోనే విసునూరు గూండాలు ఆరుట్ల రామచంద్రారెడ్డిని చంపటానికి వచ్చినట్టూ, అప్పుడు అక్కడున్నవారు గూండాలను కొట్టినట్టూ, వారికి గాయాలు తగిలినట్టూ సాక్షులు చెప్పారు. సాక్షులను చక్కగా శిక్షణ ఇచ్చి చెప్పించటంతోబాటు తమసంఘాన్ని కాపాడుకోవాలనీ, తమ నాయకులను, రైతులను విడిపించుకోవాలనీ వారంతా పట్టుదలతో ఉండటం వల్లనే అలా చెప్పగలిగారు. డిఫెన్సు కొరకు సాక్ష్యాలను ఈ విధంగా చెప్పించారు. ఈ సంఘటనకు సంబంధించిన వాస్తవాలను ఇంతకు ముందే వివరించాము.

సాక్ష్యం చెపుతున్న సమయాన సాక్షులను భయపెట్టటానికి విసునూరు రామచంద్రారెడ్డి (దేశముఖు) ఒకసారి కోర్టుకువచ్చి, పక్కనేవున్న మరోగదిలో కూర్చుని వారు చెప్పేవి వినటానికి ప్రయత్నిస్తున్నట్టు నటించాడు. ఈ సంగతిని చూపెట్టి భయపెట్ట ప్రయత్నిస్తున్నాడని జడ్జికి ఫిర్యాదుచేస్తే, ఆయన అతన్ని పట్టి తెప్పించమని ఆర్డరు ఇచ్చాడు. జడ్జిమాటను పక్క గదిలోనుంచి విన్న దేశముఖు అప్పటికప్పుడే కాలేసుకొని వెళ్ళిపోయాడు. సాక్షులపై ఈ సంఘటన చాలా ప్రభావం కలిగించింది. 'ఏదేదో చాలా గొప్పవాడనుకున్నాం. ఎన్నో

దుర్మార్గాలు చేసి ఎంతమందికైనా శిక్షలు వేయిస్తామనుకున్నాం. ఆర్డరు రాకముందే పిరికిపందలా పారిపోయాడు. పీడపని ఇంతేకదా' అని అనుకున్నారు. వారు తిరిగి తమతమ గ్రామాలకు వెళ్ళినప్పుడు ఈ అంశాన్ని ప్రత్యేకించి ప్రచారం చేశారు. ప్రజలకు దేశముఖు బలహీనతను తెలుసుకోడానికి అవకాశం కలిగింది. సంఘంపై ఇదివరకటికన్నా హెచ్చుగా విశ్వాసమేర్పడింది. ఈ సంఘటనలన్నీ అతి స్వల్పమైనవి. సర్వ సామాన్యమైనవి. కాని ఆ రోజుల్లో ప్రజలున్న స్థితిలో వీటికి ఎంతో ప్రాధాన్యత ఉంది. తమ బలంపైన, సంఘటిత శక్తిపైన ప్రజలకున్న విశ్వాసం ఎన్నో రెట్లు పెరిగింది. దేశముఖులను (పెద్ద భూస్వాములను) మించిన శక్తి లేదనే భావం తొలగిపోయింది. పార్టీ, ఆంధ్రమహాసభ కార్యకర్తలు ఈ కేసులద్వారా లీగల్ రంగంలో ఎన్నో అనుభవాలు గడించారు.

కేసు విచారణ పూర్తయిన తర్వాత జడ్జీ కేసును పూర్తిగా కొట్టివేయటమే గాక విసునూరు రామచంద్రా రెడ్డిపైనా, పోలీసుల ప్రవర్తనపైనా చాలా తీవ్రమైన ఆక్షేపణలు తెలియజేశారు. ఈ కారణాన ఆయన తీర్పుకు కొంత ప్రాధాన్యత ఏర్పడింది. కేసు ప్రారంభమై పూర్తి అయ్యేవరకు ఒక సంవత్సరకాలం పట్టింది. ఆరుట్ల రామచంద్రా రెడ్డితో సహా అందరూ విడుదలయ్యారు.

ఇక్కడ ఒక విషయం చెప్పాల్సివుంటుంది. ఈ కేసులన్నింటిలో పాలకుర్తి హత్యాప్రయత్నపు కేసు తీవ్రమైనదని ఇదివరకే చెప్పాము. విసునూరు దేశముఖు తన గ్రామ సరిహద్దునే వున్న పాలకుర్తి ప్రజలను లొంగదీసుకోవటానికి తరచుగా గూండాలను పంపి భయానక వాతావరణాన్ని వ్యాపింప చేయటానికి ప్రయత్నించేవాడు. ఆ కారణాన దేవులపల్లి వెంకటేశ్వరరావు పాలకుర్తిలోనే ఎక్కువకాలం గడుపుతూ గ్రామాల్లో పనిచేసే పార్టీ కార్యకర్తలకు పనులు అప్పగించి అవి సరిగా జరిగేట్టు చూచేవాడు. కేసుల వ్యవహారాలన్నీ చూసేవాడు. ఆయన వున్న రోజుల్లో గూండాలు గ్రామంలో కాలుపెట్టలేకపోయారు. ఆకారణాన గ్రామ ప్రజలు ఆయన ఆ ఊళ్ళో వుండాలని పట్టుపట్టేవారు. క్రమంగా కొందరైనా ధైర్యంతో గూండాలను ఎదిరించేవారు.

పాలకుర్తి శివాలయంలో అర్చకుడుగావున్న ఒక బ్రాహ్మణునికి (పెద్ద మనిషి) ఆ గ్రామంలో చాలాపలుకుబడి వుండేది. గ్రామస్థులంతా పాలకుర్తి సోమేశ్వరుడి భక్తులుగా వుండేవారు. ఆయనపై కూడా బాగా విశ్వాసం వుండేది. ఆయన ఇల్లు గ్రామానికి దూరంగా దేవాలయానికి సమీపంలో ఉండేది. కొన్నాళ్ళ

దాకా ఆంధ్రమహాసభయెడ తటస్థంగా వున్న ఆయన దేవులపల్లి వెంకటేశ్వర రావులేని సమయాన గ్రామంలోకి వచ్చి అందరినీ కలిసి ధైర్యంగా వుండమని చెప్పారు. "ఆంధ్రమహాసభ, కమ్యూనిస్టు పార్టీవారు చేస్తున్నపని సరైనది, సక్రమమైనది. కష్టాలు ఎప్పుడూ ఉండేవికావు. త్వరలోనే తొలగిపోతాయి. మీరు ధైర్యంగా ఉండండి. ఆంధ్రమహాసభ, కమ్యూనిస్టుపార్టీ కార్యకర్తలకు చక్కగా మీచేతనైనంత సహాయం చెయ్యండి. నా వైపునుంచి కూడా నేను చేయగలిగినంతా చేస్తాను. నేను శివాలయం అధికారిని. నాకుండే పరిమితులు నాకున్నాయి. అందు కోసమే ఇంతకాలంనుంచీ నేను మూకీభావం వహించి వున్నాను," అని దేవులపల్లి ఊళ్ళోలేని సమయంలో ఈ మాటలు అందరికీ చెప్పివెళ్ళాడు. ఆయన చెప్పిననాలుగు మాటలవల్ల ప్రజల్లో అంతకుపూర్వంకన్నా హెచ్చుగా ధైర్యం చేకూరింది. ప్రజల కదలిక బాగా వున్నప్పుడు ఇలాంటి సంఘటనలు మామూలుగా జరిగిపోతూ వుంటాయి. కాని, నిర్బంధం తీవ్రంగా వున్నప్పుడు అరుదుగా జరుగుతాయి. అంతేగాక ఫ్యూడల్ భూస్వాములను ఆశ్రయించుకొని వుండేవారు ప్రజలకు వత్తాసుగా వుంటి మాట్లాడటానికి ప్రత్యేక ప్రాధాన్యత వుంటుంది. వారు ఫ్యూడల్ వ్యతిరేక ఉద్యమాల్లో కలిసిరావటానికి ఇదొక తార్కాణం. మునగాల పరగణా రైతాంగ ఉద్యమపు ప్రారంభదశలో ఇలాంటి అనుభవాలను చూడవచ్చును.

ఈ కేసు నడుస్తున్న కాలంలోనే మరికొన్ని ముఖ్యమైన ఘటనలు జరిగినవి. అయిలమ్మ పంటపై దాడి-ప్రతిఘటన, నల్గొండ పట్టణంలో చందన్‌సింగ్ అనే ఎస్.ఐ. దౌర్జన్యాలు వాటిలో కొన్ని.

**అయిలమ్మ పంటపై గూండాల దాడి-ప్రతిఘటన :** ఎంతకీ ప్రజలు లొంగకపోవటం, కేసులో గెలువలేననే అధైర్యం చుట్టుకోవటంతో పాలకుర్తి గ్రామ నాయకత్వంలో ముఖ్యులుగావున్న అయిలమ్మ కుటుంబాన్ని ఏ విధంగా నైనా లొంగదీయాలని విసునూరు దేశముఖు తలంచాడు. అయిలమ్మ భర్త మల్లంపెల్లి (సమీపగ్రామం) మక్తాదారునుంచి కొంతభూమిని కౌలుకు తీసుకున్నాడు. అయిలమ్మ భర్తను, ఇద్దరు కొడుకులను హత్యాప్రయత్నపు కేసులో జైల్లో పెట్టిన విషయాన్ని ఇదివరకే వ్రాశాను. స్థానిక రైతుల సహకారంతో ఆమెకున్న సుమారు 2 లేక 3 ఎకరాల మాగాణి భూమిని, కొంత మెట్టను సాగుచేసుకున్నది. మొదటి పంటపండి చేతికొచ్చింది. రౌడీలతో ఈ పంటను స్వాధీనం చేసుకుంటామని విసునూరు దేశముఖు మనుషులు ప్రచారం చేశారు. ఈ సంగతి దేవులపల్లికి

తెలిసి సూర్యాపేటనుంచి కార్యకర్తలను, వలంటీర్లను పంపి, పంటను కోయించి, కుప్పగొట్టించి అయిలమ్మ ఇంటికి చేర్చటానికి ఏర్పాట్లు చేశాడు. దేశముఖు గ్రామంలో భయానక వాతావరణాన్ని సృష్టించిన ఫలితంగా ఎవరూ సాయంరాని స్థితిలో కార్యకర్తలు, వలంటీర్లు వచ్చి పొలంకోసి కుప్పగొట్టారు. రాశిపోశారు. అప్పటివరకు గూండాలు దరిదాపున కనిపించలేదు. దీనితో గూండాలు రారనే ధీమా ఏర్పడింది. గూండాలు వస్తే ఎదుర్కోవటానికి ఏర్పాట్లు చేయలేదు. అలసత్వం వేశారు. అదనంగా ప్రయత్నాలేమీ చేయలేదు. ఇంతలో గూండాలు అకస్మాత్తుగా రాత్రివేళవచ్చి కుప్పదగ్గరున్న కార్యకర్తలపై దాడిచేసి ముఖ్యులను పట్టుకుపోయారు. అరెస్టయినవారిలో భీంరెడ్డి నర్సింహారెడ్డి, కటుకూరు రామ చంద్రారెడ్డి, చకిలం యాదగిరిరావు, ఇతరులు వున్నారు. వారిని విసునూరు పోలీసుస్టేషన్లో బంధించి తీవ్రంగా హింసించారు. వీరందరినీ చాలా దౌర్జన్యాలకు గురిచేశారు. ఆసనంలో కారంపెట్టి చిన్నచిన్న కర్రలను లోపలికి దూర్చి హింసించారు. దాహంవేసి మంచినీళ్ళు కావాలంటే ముంతలలో మూత్రంపట్టి నోట్లో పోశారు. వద్దంటే బలవంతంగా నోర్లు తెరిపించి నోట్లో మూత్రంపోశారు. ఇలాంటి అమానుషపు హింసలకు గురిచేసి కొద్దిరోజుల తర్వాత కోర్టులో హాజరుపరిచారు. కోర్టులోవారినిహాజరుపరచకముందేఅరెస్టయినవారిజాడతెలియటంలేదనిఆంధ్రమహా సభ కేంద్రకార్యాలయంవారు ఆరుట్ల లక్ష్మినరసింహారెడ్డిని పాలకుర్తికిపంపించారు. ఆయన రఘునాథపల్లి (స్టేషన్)లో తనమిత్రుని కచ్చడంబండిని తీసుకొని పాల కుర్తికి వచ్చాడు. గ్రామంలో కాపలాకాస్తున్న గూండాలు ఆయన్ని పట్టుకొని బాగా దెబ్బలుకొట్టి, కచ్చడాన్ని పాలకుర్తి చెరువులో పడేసి బురదలో తొక్కి కనపడకుండా చేశారు. గడ్డలన్నీ లాక్కొని, ఒంటిమీద గుడ్డలు లేకుండాచేసి, వెళ్ళగొట్టారు. భయగ్రస్తులైన ప్రజలు ఇదంతా జరుగుతూఉంటే ఏమీ చేయలేక పోయారు. తుదకు మాట్లాడటానికి కూడా ధైర్యం చేయలేదు. నిస్సహాయస్థితిలో ఆయన పాలకుర్తిలో చేరకముందే వెళ్ళిపోవలసి వచ్చింది. సరిహద్దున ఉన్న బమ్మెర అను గ్రామానికి చేరుకొని అక్కడి మఖ్తాదారు ఇంటికివెళితే ఆయన లక్ష్మినరసింహారెడ్డిగారికి ఆశ్రయమిచ్చాడు. గుడ్డలిచ్చి, స్నానంచేయించి, అన్నం పెట్టించి, అవసరమైన డబ్బు చేతికిచ్చి, బండికట్టించి, రక్షణకోసం వెంట కొందరు రైతుకూలీలను ఇచ్చి దగ్గరున్న రైల్వేస్టేషనుకి చేర్చి హైదరాబాదుకి పంపిం చాడు. ఆ విధంగా ఆయన నిస్సహాయ స్థితిలో తిరిగి రావలసివచ్చింది. ఇది

చాలా తీవ్రమైన విషయమైనందున ఆంధ్రమహాసభ కేంద్రం తరపున రావి నారాయణరెడ్డి మొదలైనవారు డైరెక్టర్ జనరల్ అండర్సన్ (ఇంగ్లీషు ఆయన)కు ఒక మెమోరాండం ఇచ్చారు. ఆయన నల్గొండ ఎస్.పి.ని విచారణచేసి రిపోర్టు పంపమని ఆజ్ఞాపించాడు.

**నల్లగొండలో కార్యకర్తపై పోలీసుదాడి :** అదే సమయాన నల్లగొండ టౌనులో చందన్‌సింగ్ అను పోలీసు అమీను (ఎస్ ఐ.) ఉండేవాడు. అతను దుర్మార్గాలకు ప్రతీతి. హిందూపోలీసువాడని హిందూలాయర్లు, హిందూ భూస్వాములు కొందరు ఆయనను అభిమానించేవారుకూడా. తాను హిందువునని చెప్పుకొని హిందువులతో కలిసివున్నట్టు నటిస్తూ వారిలో నిరుత్సాహాన్ని కలిగించేవాడు. ప్రభుత్వానికి సమాచారం చేరవేసేవాడు. దేవులపల్లి వెంకటేశ్వరరావు నల్లగొండలో మాట్లాడిన బహిరంగ సభలకు హిందువు వేషంతో వచ్చి చెప్పినవన్నీ విని నోట్ చేసుకొని వెళ్ళేవాడు. ఈ పనికోసం సిఐడీలు వున్నప్పటికీ పై అధికారుల ప్రాపకం సంపాదించటానికి ఇతను ప్రత్యేక శ్రద్ధ తీసుకునేవాడు. ఆంధ్ర మహాసభ వ్యవహారాలు మాట్లాడటానికి దేవులపల్లి వెంకటేశ్వరరావు కలుసుకున్న లాయర్ల ఇళ్ళకు వెళ్ళి ఆయనకూ, ఆంధ్రమహాసభకూ, కమ్యూనిస్టుపార్టీకి వ్యతిరేకంగా మాట్లాడుతూ వారిని పరోక్షంగా భయపెట్టడానికి ప్రయత్నించేవాడు.

బి. యలమంద పానగల్లు నివాసి. స్థానిక కార్యకర్త. ఆఫీసులో వుంటూ నల్లగొండ చుట్టుపక్కల గ్రామాలలో పనిచేసేవాడు. ఎస్.ఐ. తనదగ్గరవున్న పోలీస్ కానిస్టేబుల్ వెంకటాద్రికి మరికొందరిని సహాయాన్నిచ్చి యలమందను ఒకటికి రెండుసార్లు దెబ్బలు కొట్టించాడు ఏ కారణమూ ఏ సమస్యాలేకనే, కేవలం భయానక వాతావరణాన్ని సృష్టించటానికి ఈ పని చేయించాడు. దీనిని తీవ్రమైనదిగా పరిగణించి ఈ సమస్యను కూడా ఒక మెమొరాండం ద్వారా అండర్సన్ పోలీసు నాజం (ఐ.జి.) దృష్టికి తీసుకొచ్చారు ఆంధ్రమహాసభ నాయకులు. దానిపై ఎంక్వయిరీ చేయటానికి తానే నల్లగొండ వెళుతున్నానని ఆయనను కలుసుకున్న నాయకులకు చెప్పాడు. వెళ్ళాడు కూడా. దేవులపల్లి ఆయన వచ్చిన సమయానికి నల్లగొండకు వెళ్ళి ఆయనతో కలిసి మాట్లాడినాడు.

**విచారణ తతంగం :** నాయకులూ, కార్యకర్తలు ఇలాంటి పెద్దఅధికారులరాక ఒక బూటకమనీ, వారు వచ్చి చేసేదేమీ వుండదనీ ముందే అర్థం చేసుకున్నారు. ఏ పోలీసు ఆఫీసర్లపై ఆరోపణలు (charges) చేశారో వారిపై ఏ చర్యా

తీసుకోకుండా, వారి సమక్షంలో జరిగే విచారణ ఒక తతంగమని భావించి తెలుగు లోనే కాక ఉర్దూలో కూడా కరపత్రాలు తయారుచేయించి దాచిపెట్టి వుంచారు. భారతీయులకన్నా బ్రిటిషువారే నయమన్నట్టు మర్యాదతోఆహ్వానించి 'తెలుగులో మాట్లాడుతారా ? ఉర్దూలో మాట్లాడుతారా ? ఇంగ్లీషులో మాట్లాడుతారా ? ఇంగ్లీషులో మాట్లాడితే ఇబ్బంచేలేదు. తెలుగు లేక ఉర్దూలో మాట్లాడితే కావలసిన అనువాదంకోసం ఏర్పాట్లు చేస్తాము' అని అండర్సన్ చెప్పాడు. 'అవసరం లేదు వచ్చీరాని ఇంగ్లీషులోనే మాట్లాడుతాం' అని చెప్పాడు దేవులపల్లి ప్రారంభంలోనే. అండర్సన్ మాట్లాడటం ప్రారంభించి, ప్రభుత్వంమీద, పోలీసులమీద మీరు దుష్ప్రచారం చేస్తున్నారు. (పత్రికలలో ఆంధ్రమహాసభ తరపున ఇచ్చిన ప్రకటనలను పురస్కరించుకొని) అని దురుసుతనం ప్రదర్శించాడు. "మేము మీపై దుష్ప్రచారం చేస్తున్నామనే నిర్ణయానికి వచ్చిన తర్వాత మీరుచేసే విచారణ ఏమిటి ? పోలీసువారు చేసేదంతా సరిగానే ఉంటుంది. సంఘ కార్యకర్తలే దుర్మార్గాలు చేస్తున్నారనే తీర్పేకదా మీరు ఇచ్చేది. ఇలాంటి విచారణవల్ల ఉపయోగమేమిటి ?" అని నిలదీసి అడిగాడు దేవులపల్లి. దానిపై అండర్సన్ చిర్రుబుర్రులాడినాడు. ఈ విచారణవల్ల ఉపయోగమేమీ లేదని దేవులపల్లి మరోసారి చెప్పి లేచివెళ్ళారు. మళ్ళీ మర్యాదలతో పంపించాడు. విచారణే జరగలేదనేది స్పష్టం. ఆయన అదేరోజు వెళ్ళిపోయిన గంటలోపల కరపత్రాలన్నీ నల్లగొండ అంతటా కార్యకర్తలు, విద్యార్థులు పంచేశారు. అప్పటికప్పుడు కరపత్రాలనెలా పంపకం చేయగలిగారని పోలీసులు కంగుతిన్నారు. పట్టణ ప్రజలు ఆశ్చర్యంతో సంతోషపడినారు. అమీను (ఎస్.ఐ.) బాగా రెచ్చిపోయాడు. కాగా చేయగలిగేదేమీ లేక వెంకటాద్రి (కానిస్టేబుల్)తో బూతులు తిట్టించి సర్దుకున్నాడు.

ఒకవైపున పాలకుర్తిలో అయిలమ్మ కుటుంబం మీద తీవ్రమైన నిర్బంధాన్ని ప్రయోగించి లొంగదీయటానికి ప్రయత్నించటం, ఆ కుటుంబానికి సాయం చేయటానికి వెళ్ళిన కార్యకర్తలను అమానుషంగా హింసించటం, మరోవైపున నల్లగొండలో స్థానిక కార్యకర్తను పోలీసు అమీను (ఎస్.ఐ.) తీవ్రంగా హింసించటం కమ్యూనిస్టుపార్టీ, ఆంధ్రమహాసభలకు ఇవి తీవ్రమైన సమస్యలైనవి. వీటిపై కొంత ఆందోళన చేసేసరికి ప్రభుత్వం విచారణ తంతు నడిపించింది.

**పార్టీని, ఆంధ్ర మహాసభను సంఘటితపరచటానికి కృషి :** పార్టీని సంఘటితపరచటానికి రాజకీయ క్లాసులను తెలంగాణా అంతటా కూడా

ఆర్గనైజు చేశారు. హైదరాబాదు నగరంలో ఒక క్లాసు, వరంగల్ జిల్లాలోని (ప్రస్తుతం ఖమ్మంజిల్లా) కారేపల్లిలో మరొకక్లాసు ఏర్పాటుచేశారు. ఈ క్లాసుల్లో పార్టీ, ప్రజాసంఘాల నిర్మాణంలాంటి సమస్యలతోపాటు ప్రత్యేకంగా కొత్త పాలసీని వివరించారు. ఈ వివరణ 'నేటి హైదరాబాదు — మన కర్తవ్యం,' అను పుస్తకంలో రూపొందించిన ఆనాటి పార్టీపాలసీకి అనుగుణ్యంగా ఉండేది.

**కాంగ్రెసు అనుకూల ధోరణి :** ఈ క్లాసుల్లో మరో ప్రత్యేకత కూడా ఉంది. హైదరాబాదులో జరిగిన క్లాసులకు గాంధేయవాది, కాంగ్రెసువాది స్వామి రామానందతీర్థను పిలిచి ఉపన్యాసం ఇవ్వమంటే ఆయన అహింసా సిద్ధాంతం మీద ఉపన్యాసం ఇచ్చాడు. కమ్యూనిస్టుల దీక్ష, క్రమశిక్షణను మెచ్చుకున్నాడు. అహింసా సిద్ధాంతం చాలా గొప్పదనీ, తాను తన అనుచరులు దానికి కట్టుబడి వున్నామనీ చెప్పి వెళ్ళిపోయాడు. పార్టీ క్లాసులకు కాంగ్రెసు వాదినీ, గాంధేయ వాదినీ పిలిచి ఉపన్యాసాలివ్వమనటం అసాధారణమైనది. ఇంతటితో ఆగక రామా నందతీర్థను వరంగల్ జిల్లాలో పర్యటన చేయాలని పార్టీ తరఫున ఆహ్వానించారు. ఖమ్మం, మధిర తాలూకాలలో ఆయనకు స్వాగతం చెప్పి బహిరంగ సభలను ఏర్పాటు చేయటానికి పెద్దఎత్తున ఏర్పాట్లు చేశారు అక్కడిపార్టీవారు. ఆయన పర్యటన సాఫీగా సాగిపోయింది. ఆయనను అభిమానించేవారు, పార్టీవారు ఐక్యంగా ఉన్నట్టు ఆ పర్యటనలో స్పష్టమైంది. నల్లగొండ జిల్లాకు కూడా ఆయనను ఆహ్వానించి పర్యటనకు ఏర్పాటు చేయాలని రాష్ట్ర కేంద్రంనుంచి నల్లగొండజిల్లా కమిటీకి ఒక సూచన వచ్చింది. జిల్లా కమిటీ సమావేశమై ఆ సూచనను నిరాకరించింది. పర్యటనకు జిల్లాలో అవకాశంలేదనీ, ఎప్పుడూ కాంగ్రెసువారితో పోరాడుతూ వారినే ఆహ్వానించటం వలన ఉద్యమం దెబ్బతింటుందనీ స్పష్టం చేసింది. జనగాం పోరాటంలో దేశముఖులకు మితవాదులు సహాయం చేస్తున్నట్టు అప్పటికే స్పష్టమయింది. మందుముల నర్సింగరావుగారు తన'రయ్యేత్'పత్రికలో సంపాదకీయంరాస్తూ (7 జనవరి, 1945) జనగామ తాలూకాలో కమ్యూనిస్టులు ఆంధ్రమహాసభ పేరుతో దౌర్జన్యాన్ని ప్రోత్సహిస్తున్నారనీ, దానిని ప్రభుత్వం గమనించి తగు చర్యలు తీసుకోవాలని సూచనప్రాయంగా చెప్పాడు. దేశముఖుల దౌర్జన్యాలు పెచ్చుమీరిపోతున్నాయనీ, వారికి వ్యతిరేకంగా ప్రజలు తిరుగుబాటు చేస్తే, దానివలన ప్రభుత్వానికి కూడా ముప్పువస్తుందనీ ఆ కారణాన వారి దౌర్జన్యాలను అదుపులో పెట్టాలని 'మీజాన్' పత్రిక రాసింది. జాతీయపక్షానికి చెందిన

మందుముల రామచంద్రరావు ఆంధ్రమహాసభను 'అరాచక సంస్థ' అని నిందించాడు. నల్లగొండ జిల్లాలో ఒకరిద్దరు వ్యక్తులు తప్ప జాతీయపక్ష సభ్యులు కూడాఎవరూ లేకుండిరి. ప్రజల దృష్టిలో మితవాదులూ, గాంధేయవాదులూ అంతా ఒకటే. అలాంటి స్థితిలో స్వామీజీని ఆహ్వానించటమంటే ప్రజలనుంచి ఏకాకులైన మిత వాదులకూ, ఇంకా ఏర్పడని జాతీయపక్షానికి జీవిగంజి పోయటమేనని పార్టీ భావించింది. కాగా స్వామి రామానందతీర్థ ఉభయ పక్షాల మధ్య ఐక్యత కావా లన్నాడే కాని పోటీ సంస్థ వారి విచ్ఛిన్న కార్యకలాపాలను ఖండించలేదు.

## 9. పోటీ ఆంధ్రమహాసభ (మదికొండ, 1945 మార్చి)

రాజకీయపార్టీలు, ప్రజాసంస్థలు చీలటం, పోటీ సంస్థలు ఏర్పడటం ఈ నాటి రాజకీయ జీవితంలోని విశిష్ట లక్షణమేమీకాదు ఈ క్రమం 1944లోనే ప్రారంభమైనది. ఆంధ్రమహాసభను చీల్చి పోటీసంస్థను ఏర్పరచిన ఘనత మిత వాదులకూ జాతీయపక్షం వారికే దక్కింది.

భువనగిరిలో పదకొండవ ఆంధ్రమహాసభ జయప్రదంగా ముగిసినతర్వాత మితవాదులు, జాతీయపక్షంవారు ఆంధ్రమహాసభలో తిరిగి చేరటానికి బదులు పోటీ సంస్థను ఏర్పాటు చేయటానికి నిర్ణయించుకున్నారు.

ఢిల్లీ కాంగ్రెసు నాయకులు జైలునుంచి విడుదలై బ్రిటిషువారితో రాజీ సంప్రదింపులు జరుగుతున్నరోజులవి. ఒకవైపున పార్టీ నాయకత్వం కాంగ్రెసుతో ఐక్య సంఘటనా విధానాన్ని కొనసాగిస్తూవుంటే, కమ్యూనిస్టులు బ్రిటిషు సామ్రాజ్యవాదులతో రాజీకి ఆటంకంగా పరిణమిస్తారని భావించి, వారిని కాంగ్రెసు నుంచేగాక అఖిలభారత సంస్థానప్రజల మహాసభనుంచి బహిష్కరించటానికి ప్రయత్నిస్తున్న రోజులవి. ఈ పరిస్థితులు కూడా మితవాదులకూ, జాతీయపక్షం వారికీ ఆంధ్రమహాసభను చీల్చడానికి దోహదంచేశాయి.

ఈ పరిణామాల గురించి మాడపాటివారు ఈ విధంగా వ్యాఖ్యానించారు : "పదనొకండవ ఆంధ్రమహాసభ జరిగినతర్వాత కమ్యూనిస్టు పక్షావలంబులగు ఆంధ్ర నాయకులకు ఆంధ్ర మహాసభపైన లభించిన యాధిపత్యమును వారు తమ పక్షమునకు బలము కలిగించుటలో ప్రత్యక్షముగను పరోక్షముగను ఉపయోగించు కొనసాగిరి. ఈ మహాసభకు పూర్వము భువనగిరిలో జరిగిన స్థాయీ సంఘ

సమావేశమున, అధిక సంఖ్యాకులగు జాతీయపక్ష నాయకులు తమయధికారమును వదులుకొనుటవలన కలిగిన పరిణామమునకు చింతిల్లి, ఊరకుండుట నిరుప యోగమని భావించి, తుదకు ఆంధ్రమహాసభ పునరుద్ధరణమత్యంతావశ్యకమని నిశ్చయించిరి". (పేజి : 187, 'తెలంగాణా ఆంధ్రోద్యమము', రెండవ భాగం)

ఆంధ్ర మహాసభలోని "కమ్యూనిస్టు పక్షావలంబుల"లో కొందరు కమ్యూనిస్టు పార్టీ పుట్టకముందునుంచీ ఆ సంస్థలో పనిచేస్తూ వచ్చారు. అలాంటి వారిలో రావినారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి ముఖ్యులు. కమ్యూనిస్టుపార్టీలో చేరిన నాటి నుండి పనిచేసినవారు చాలా సంఖ్యలో ఉన్నారు. వారిలో సర్వదేవభట్లరామనాథం వంటివారు నాయకత్వ స్థానాల్లో కూడా ఉన్నారు వీరు ఆంధ్రమహాసభలో చేరి చేసిన నిస్వార్థ సేవ మితవాదులకోసం కాదు ; జాతీయపక్షంవారికోసం అంతకూ కాదు. ఆ సేవ ప్రజలకోసం ; ఆంధ్రమహాసభను ప్రజా సంస్థగా రూపొందించటంకోసం. ఆ సేవ చేయటం వలననే పార్టీ బలపడింది. పార్టీ పలుకు బడి పెరిగింది. రాజకీయ పార్టీకి తమ పార్టీని బలహీనపరచుకునే నిస్వార్థసేవ అనేది ఉండదు. కమ్యూనిస్టులు తమ పార్టీ వేదికనుంచేకాక ఆంధ్రమహాసభ ద్వారాకూడా ప్రజలకు సేవచేశారు. దానివలన వారు బలపడినారు ; వారి పలుకు బడి పెరిగింది.

మితవాదులు, జాతీయ పక్షంవారు తమ అధికారం వదులుకోవడంవలన ఏర్పడిన పరిణామాలకు "చింతిల్లిన" మాట నిజమే. దీనికి మారుగా తమ తప్పును గుర్తించారనుట సరిగా ఉంటుంది. 11వ ఆంధ్రమహాసభ జయప్రదంగా జరుగుటే కాక తీవ్ర నిర్బంధ విధానమున్నప్పటికీ జనగామ తాలూకాలో ఫ్యూడల్ వ్యతిరేక రైతాంగ ఉద్యమం ముందుకుపోతున్నది. ఇలాంటి సందర్భాల్లో "చింతిల్ల"టానికి బదులుగా ఆంధ్రమహాసభలో చేరితే చేసిన తప్పును సవరించుకునేవారయ్యేవారు. దానికిబదులుగా వారు పోటీ సంస్థను ఏర్పరచి మాతృసంస్థకేగాక రైతాంగ ఉద్యమానికి కూడా వెన్నుపోటు పొడిచారు.

పునరుద్ధరణ కార్యక్రమాన్ని బహిరంగంగా ప్రకటించటానికి పూర్వం పత్రికలద్వారా వాదోపవాదాలు సాగినవి. మితవాదులు తమను "నాన్ పార్టీ" వారని చెప్పుకున్నారు. తమకు ఏ పార్టీలేదని చెప్పుకోవటమే ఈ పేరులోగల ఆంతర్యం ; తాత్కాలికంగా వారు జాతీయపక్షంనుంచి దూరంగావున్నా క్రమంగా వారిలో కలిసిపోయారు. దూరంగా ఉన్నది కమ్యూనిస్టులనుంచే. అది సహజం కూడా.

దీనితో కమ్యూనిస్టులు మితవాదులనూ, జాతీయపక్షంవారినీ కలిపి ఎదుర్కో వలసి వచ్చింది. వీరితో సిద్ధాంతరంగంలోనే గాక కార్యక్రమంపై కూడా పోరాడ వలసి వచ్చింది. సిద్ధాంతరంగంలో హింస, అహింసా సూత్రాలపై పోరాటం జరిగింది. కార్యక్రమంలో భూస్వామ్యవిధానం యెడ ఎలాంటి వైఖరి అనుసరించా లనే సమస్యపై పోరాటం సాగింది. జాతీయపక్షంవారు తాము ఫ్యూడలిజానికి వ్యతిరేకంగా పోరాడుతున్నామనీ, నిజాంతో పోరాడుతామని చెప్తూ ఉండేవారుగాని ఆచరణలో చేసినదేమీలేదు. ఈ విధంగా కమ్యూనిస్టు పార్టీ స్వతంత్రంగానూ ఆంధ్రమహాసభ ద్వారానూ ఫ్యూడల్‌వ్యతిరేక పోరాటాన్ని మితవాదులకు జాతీయ పక్షానికి వ్యతిరేకంగా సిద్ధాంతపోరాటాన్ని సాగించింది. ఈ రెంటినీ సమన్వయం చేస్తూ, సమర్థవంతంగా సాగించటంతో నిజాం వ్యతిరేకశక్తులపై దీనిప్రభావం ఎంతగానో పడింది.

అటు నాన్‌పార్టీవారు, ఇటు జాతీయపక్షంవారూ కమ్యూనిస్టుపార్టీ పైన మాత్రమే గాక ఆంధ్రమహాసభపైన కూడా నీచమైన ప్రచారం చేశారు. "ఆంధ్ర మహాసభ అరాచక సంస్థ" అను శీర్షికతో గోలకొండపత్రిక (15-11-1944)లో మందుముల రామచంద్రరావు ఒక వ్యాసం రాసినట్లు మాడపాటివారు తమ పుస్తకంలో (పేజి 191) ఉదహరించారు. స్వయంగా తప్పులుచేసి ఎదుటివారిని దూషించటమెందుకు ?

మాదిరాజు రామకోటేశ్వరరావుగారు ఈ పరిణామాన్ని గూర్చి స్వీయ చరిత్రలో కొంతరాశారు. పోటీ ఆంధ్రమహాసభ వరంగల్లుకు సమీపాన కల మడికొండలోనే జరిగింది. వారూ, జాతీయపక్షానికి చెందినవారూ ఈ మహాసభ నిర్వాహకులు కావటంతో కొన్ని వివరాలు కూడా రాయగలిగారు.

తాము కూడా ఆంధ్రమహాసభ సభ్యత్వాన్ని చేర్పించి ఎన్నికల్లో పాల్గొని మహాసభ నాయకత్వాన్ని కైవసం చేసుకోవాలని అభిలషించినారనీ, అప్పటి ఆంధ్రమహాసభ నాయకులు (కమ్యూనిస్టులు) దీనిని సాగనివ్వలేదని మితవాద నాయకులు (నాన్ పార్టీవారు) మాదిరాజువారు రాస్తున్నారు.

"ఆంధ్ర మహాసభను చేతిలోనికి తీసుకొని నడుపవలెననిన విరివిగా ప్రాథమిక సభ్యులను చేర్చి బలము చేకూరిన పిమ్మట ఆహ్వానసంఘము నేర్పాటు చేయవలెను. ఇది సక్రమ మార్గమని నిశ్చయించుకొంటిమి. సభ్యత్వ ఫారములు జిల్లా సంఘము నుండి తీసుకొనవలెను. అందుకని నేను ఖమ్మంలో జిల్లా సంఘ

కార్యస్థానమునకు వెళ్ళితిని. అధ్యక్షులుగా శ్రీ చిర్రావూరి లక్ష్మీనరసయ్య పని చేయుచుండెను. వారితో కలిసి ఒక వెయ్యిఫారములను తీసుకొంటిని. వాటిని కొందరు స్నేహితుల కిచ్చితిని ఇంకా 4వేల ఫారములు పంపుమని లక్ష్మీనరసయ్య గారికి వ్రాసితిని. నా ప్రయత్నమును గ్రహించి వారు కార్యకర్తల పేర్లు, అర్హతలు తెలిపినచో పంపెదమని జవాబిచ్చిరి. వారిని యాచించుటచే లాభము లేదనుకొంటిని. వరంగలులోనే మొదటి పర్యాయము 40 వేల ఫారములు అచ్చు వేయించితిని. కొన్ని పట్నం పంపితిని." (స్వీయచరిత్ర పేజి 376-377).

వీరు ముందు పోటీసంస్థను ఏర్పాటుచేయటానికి నిర్ణయించి సభ్యత్వం చేర్పించటమంటే, ఆ సభ్యత్వం పోటీసంస్థకు చెందినదే అవుతుంది కాని ఆంధ్ర మహాసభది కాదు. ఈ కారణాన వరంగల్లు జిల్లా కమిటీ అధ్యక్షుడు పోటీసంస్థ వారిని అనుమానించి కార్యకర్తల పేర్లను, అర్హతలను తెలుపాలని వారిని ఆదేశించారు. ఈ ఆదేశాన్ని పాటించటమే 'యాచన'గా కన్పిస్తే వారు సభ్యత్వఫారాలను అడగటమే తప్పు.

నల్లగొండ, వరంగల్లు జిల్లాలలో పోటీసంఘానికి వ్యతిరేకంగా తీవ్రంగా ప్రచారం సాగింది. బహిరంగసభల్లో, ఉపన్యాసాలు, పత్రికల్లో వ్యాసాలతో, పాటల ద్వారా కూడా ఈ ప్రచారం నడిచింది. నల్లగొండ జిల్లాలోని ఒక కార్యకర్త (సి. యాదగిరిరావు, ప్రస్తుతం సిపియంలో వున్నారు) "ఎందుకయ్యా పోటీసంఘం మందుములయ్యా, వున్న సంఘం చాలును పులిజాల రంగయ్యా..." అనే గేయాన్ని రచించాడు. దీనిని ఆబాలగోపాలం పాడి వారి నిజస్వరూపాన్ని బట్టబయలు చేశారు. కీ. శే. ఆలువాల వెంకయ్య (సూర్యాపేట) "నాన్‌పార్టీవారి నడక చూడండి. వారి వెనుక చూడండి" అనే గేయాన్ని రాసి ప్రచారానికి తోడ్పడ్డాడు. ఇతర జిల్లాలలో ఇలాంటి పాటలనే పాడుతూ వారి విచ్ఛిన్నక రాజకీయాలను ప్రజలకు వివరించారు. మాదిరాజువారు తాము ఖమ్మం పర్యటనకు వచ్చినప్పుడు 500 మంది "ఊరేగింపుగా వచ్చి",

"1. పోటీసభ ఎందుకయ్యా మాదిరాజయ్యా

2. ఉన్నసభలు చాలవా ? మందుములయ్యా

3. ................ రంగారెడ్డయ్యా" అని పాడినట్టు

స్వీయచరిత్రలో రాసుకున్నారు. (పేజీ-378)

తుదకు సభ్యత్వపు ఫారాలివ్వలేదనే నెపాన వారు బజారుకెక్కి మాకు పోటీ సంస్థను ఏర్పాటు చేయటంతప్ప వేరే మార్గంలేదని ప్రచారం చేసుకున్నారు.

జాతీయపక్షము వారున్న 32వేల సభ్యత్వాన్ని చేర్పించగల నిర్మాణ యంత్రం వారికిలేదు. భూస్వాముల స్టాంపు పాడ్స్‌ను వుపయోగించి వేలు ముద్రలతో, దొంగ సంతకాలతో చేర్పించిన సభ్యత్వమే హెచ్చు. అయినా ఇతర ఏడు జిల్లాలన్నిటిలో కూడా వరంగల్లు జిల్లా సభ్యత్వంకన్న తక్కువే (30 వేలు)నని స్పష్టమవుతున్నది. దీనితో ఈ జిల్లాలలో జాతీయపక్షపు బలహీనతకూడా స్పష్టమవుతున్నది.

కొంత సభ్యత్వం చేర్పించినప్పటికీ మితవాదుల, జాతీయపక్షంవారి పొత్తు కప్పల తక్కెడగానే ఉంటూ వచ్చింది. డబ్బిస్తేనే కదులుతామనే ధోరణిని జాతీయ పక్షం వారనుసరించారు. మితవాదులు డబ్బుపోగుచేసి వారితో పనిచేయించారు.

ఎలాగైతేనేమీ మడికొండలో మితవాదులు, జాతీయపక్షంవారూ కలిసి పోటీ మహాసభను జరిపించారు. దీనికి సంబంధించిన వివరాలను మాదిరాజువారు స్వీయచరిత్రలో (పేజి 376-384) రాశారు. తమ పరిమితులను బలహీనతలను వారు ఇలా రాసుకున్నారు.

"గాని యువక జాతీయవాదులు సంశయాత్మకులైరి. పునరుద్ధరణ సమ్మతమేకాని వృద్ధ నాయకత్వము ఇష్టములేదు. ఇదే దృష్టితో మహాసభసమయమున కూడా వారు మావెంట ఉన్నను మాటలలోను, క్రియలలోనూ యథోచిత సహకారమే కనుపరిచిరి. ఈ విషయమును మేము గ్రహించితిమి. సభ ముగియగానే కేశవరావుగారిని పిలిచి ముందు మీపాలసీ ఎట్లుండును అని శ్రీ నర్సింగరావు ప్రశ్నించిరి. తమ అనుయాయులతో సంప్రదించి చెప్పుటకు కొంత అవకాశము కోరెను. ప్రతినిధులందరూ వెళ్ళిపోయినను శ్రీ హనుమంతరావు, రంగారెడ్డి, నర్సింగరావుగార్లు నేను అచ్చటనే ఒకరోజంతయు ఉంటిమి. కేశవరావు మొదలగు 50 మంది జాతీయపక్షమువారు సమావేశమై 3, 4 గంటలసేపు చర్చలు జరుపు కొని తుదినిర్ణయము చేసుకొని సహకారము చేయుదుమని చెప్పి వెళ్ళిపోయిరి. సభ్యులు హయ్యదాబాదు నాయకులు వెళ్ళిపోయిరి. మరు రోజునుంచి మిగిలిన వస్తుసామాగ్రిని విక్రయించి ఇవ్వవలసిన బాకీలు ఇచ్చివేసితిమి. నేనును శ్రీ రామేశ్వరరావుగారును అడ్వాన్సుగా ఇచ్చిన డబ్బుమాత్రము పూర్తిగాభర్తీ కాలేదు." (పేజి-385).

ప్రజల సహకారంలేని మహాసభలు ఇలాగే జరిగిపోతాయి. జాతీయపక్షం వారు మితవాదులలో విలీనంకాలేదనీ, విడిగానే వుంటూ తమ పాలసీలను నిర్ణయించుకునే వారని కూడా దీనివలన స్పష్టమవుతున్నది. కమ్యూనిస్టు వ్యతిరేకతతో పరిమితమైన సహకారం చేశారు. వీటన్నిటి ఫలితంగా వారికి కార్యదర్శి పదవిని కార్యవర్గంలో కొన్ని స్థానాలను ఇచ్చారు.

మహాసభలో మితవాదులు ఆనవాయితీగా చేసే తీర్మానాలతోబాటు జాతీయ పక్షంవారి దృక్పథాన్ని ప్రతిబింబించేవి కూడా కొన్నిటిని చేర్చారు. దీనిఫలితంగా వెట్టిచాకిరీని నిషేధించాలనీ, స్టేటు కాంగ్రెసుపై నిషేధాన్ని తొలగించాలనీ తీర్మానించటంతోబాటు స్థాయీసంఘ సభ్యులవరకు ఖద్దరు ధరించాలని తీర్మానించారు. ఆ కాలపు ఆంధ్రమహాసభ నాయకుల్లో కొందరే ఖద్దరు ధరించేవారు.

అప్పటికే జనగామ తాలూకాలో దేశముఖులకు వ్యతిరేకంగా రైతాంగ వుద్యమం నడుస్తున్నది. దీన్నిగూర్చి మాట్లాడలేదు కాని ఆ దేశముఖులంతా మహాసభకు హాజరుకావటమేకాక దానిని నిర్వహించడానికి సంపూర్ణంగా సహకరించినారు.

మితవాదులు దీనిని 12వ మహాసభ అని నామకరణంచేశారు. ఈవిధంగా భువనగిరి మహాసభను 11వ మహాసభ అని గుర్తించారు. దాదాపు ఇదే సమయాన ఖమ్మంలో 12వ ఆంధ్రమహాసభ జరిగింది.

**చీలికకు పునాది వర్గవైరుధ్యాలా? కులవిభేదాలా? :** ఆంధ్రమహాసభలో కులవిభేదాల వలన చీలిక వచ్చిందనీ, పోటీసంస్థ నాయకులంతా ప్రధానంగా బ్రాహ్మణులనీ, ఆంధ్రమహాసభ నాయకత్వం బ్రాహ్మణేతరులదనీ ఒక అభిప్రాయం ఖమ్మం, మధిర తాలూకాల్లో వ్యాపించిఉండేది. ఈ అభిప్రాయానికి ఎలాంటి ఆధారంలేదు.

అన్నిప్రాంతాల్లో ఉన్నట్టుగానే తెలంగాణాలోకూడా కులవిభేదాలు ఉండేవి. హైదరాబాదులో రెడ్డిహాస్టలు, ఖమ్మంలో కమ్మహాస్టలు, ఇలాంటి ఇతర సంస్థలు వీటిని బలపరచి కులతత్వాన్ని పెంచి పోషించాయి. ఈరెండు తాలూకాల్లో ఆంధ్రమహాసభ, కమ్యూనిస్టు పార్టీలో కూడా కులతత్వం చోటు చేసుకున్నది. కాని ఈ రెండు తాలూకాలతోసహా తెలంగాణా ఆంధ్రమహాసభను చీల్చేస్థాయికి అవి చేరుకోలేదు. ప్రభుత్వఉద్యోగాలకూ, ఎన్నిక పదవులకూ తగాదాపడుతున్నప్పుడు

పాలకవర్గాలు కులతత్వాన్ని రెచ్చగొడుతాయి. ప్రతి కులంలోని ఉన్నత శ్రేణివారు దీనిని ఉపయోగించుకొని తమ స్థానాన్ని బలపరచుకుంటారు. నిజాం నిరంకుశపాలనలో ఆంధ్రుల్లో ఏకులానికీ ఉద్యోగాలులేవు, ఎన్నికలులేవు. ఇలాంటి సమయంలో ఆంధ్రమహాసభ నాయకులు కులవిభేదాలను ఉపయోగించి సంస్థను చీల్చినారనుట ఏదా కుల ప్రాతిపదికపై చీలినదనుట అవాస్తవము

పోటీసంస్థ నాయకుల్లో బ్రాహ్మణులేగాక బ్రాహ్మణేతరులు కూడా గణనీయంగా ఉన్నారు. కొండా వెంకటరంగారెడ్డి, వేములపల్లి భాస్కరరావువంటి భూస్వాములు ప్రతినిధులై వున్నారు. రాజా బహద్దరు వెంకటరామారెడ్డి స్వయంగా హాజరై వారిని దీవించారు.

వాస్తవమేమంటే మితవాదులంతా భూస్వాముల, పెద్ద వర్తకుల ప్రతినిధులు. జాతీయ పక్షంవారికి ఖమ్మం, మధిర తాలూకాల్లోని వర్తకులతో ధనిక రైతులతో సంబంధం ఉండేది. ఈవిధంగా వీరికి అగ్రశ్రేణులతో సంబంధం ఉన్నా, రైతాంగంలో కూడా కొందరి మద్దతు ఉండేది.

కమ్యూనిస్టుల నాయకత్వాన ఉన్న ఆంధ్రమహాసభలో గ్రామీణప్రాంతంలో ఫ్యూడల్ వ్యతిరేకంగా వుండే రైతాంగమేగాక పోరాటంలో కలిసివచ్చే భూస్వాములుకూడా వున్నారు. పట్టణాల్లోని వర్తకుల్లో కొందరు, లాయర్లు, డాక్టర్లు మొదలగు వృత్తులవారిలో కొందరున్నారు. ఈవిధంగా ఫ్యూడల్ శక్తులైన పెద్ద భూస్వాములు, ఫ్యూడల్ వ్యతిరేక శక్తులమధ్య చీలికే ఆంధ్రమహాసభలోని చీలిక. ఫ్యూడల్ వ్యతిరేక ఉద్యమం పురోగమిస్తున్నకొద్దీ ఆంధ్రమహాసభలోని విభేదాలు తీవ్రతరమైనవి. జనగామ తాలూకాలోని ఫ్యూడల్ వ్యతిరేక రైతాంగ ఉద్యమంతో ఈవిభేదాలు ఉన్నతస్థాయికి చేరుకొని సంస్థ చీలిపోయింది.

## 10. పన్నెండవ ఆంధ్రమహాసభ (ఖమ్మం, 1945 ఏప్రిల్)

ఈపరిస్థితుల్లో జరిగింది ఖమ్మం ఆంధ్రమహాసభ. ప్రాథమిక సభ్యులు హెచ్చు సంఖ్యలో చేరినందున ప్రతినిధులు కూడా ఆ దామాషాలో హెచ్చుమంది వచ్చినారు. బహిరంగ సభకు వచ్చినప్రజలు సుమారు 35-40 వేలు. సర్వదేవభట్ల రామనాథం ఆహ్వాన సంఘానికి అధ్యక్షులు. ప్రతినిధుల సమావేశానికి, వారి బసలకు, భోజనాలకు ఏర్పాట్లు బాగా జరిగినవి. బహిరంగసభ జయప్రదంగా

జరిగింది. ఆ సమయంలో నిర్బంధ వాతావరణం ఆవరించి ఉంది. నల్లగొండ జిల్లాలో (ఒకగాము) ఏక్షణాన్నైనా పెద్ద ఎత్తున నిర్బంధం వస్తుందనే వాతావరణం అక్కడ వ్యాపించింది. ఈపరిస్థితుల్లో ఆంధ్రమహాసభ జరిగింది జయప్రదంగా.

రాజకీయ కార్యకలాపాలు, ఆంధ్రమహాసభ ప్రజలకు అందించిన కార్యక్రమ ప్రభావం ఈమహాసభపై కన్పించింది.

ఆ కాలంలో పార్టీలోనూ, ఆంధ్రమహాసభలోనూ కులతత్వపు ఛాయలు కనిపించాయి. వరంగల్లు జిల్లాలో (నేటి ఖమ్మంజిల్లా) జిల్లా ఆంధ్రమహాసభ అధ్యక్షులుగా ఎవరుండాలనే సమస్య వచ్చినప్పుడు ఈఘోరణి బయటపడింది.

**పోటీ సంస్థవారి దుష్ప్రచారం :** ప్రజల్లో పోటీ సంస్థవారు తీవ్రమైన దుష్ప్రచారం చేశారు. "బుర్రకథలు, ప్రభబండ్లు, బాకాలు మొదలగు పలు విధములైన చిత్రవిచిత్రములతో కార్యక్రమమారంభించి అమాయక ప్రజలను బాగా ఆకర్షించుటకై ప్రయత్నించి"నట్లు ఆనాటి గోలకొండ పత్రిక రాసింది. "ఆంధ్రమహాసభ చిహ్నము ఆవంతైనను లేక కేకలు, బొబ్బలు, నినాదములతో శక్తిజాతర బోలి హింసారూపముల గల భావములను బొంది, పవిత్రమైన ఆంధ్ర మహాసభను మరపించి తుదకు జాతరగా మార్పు కలుగజేసిరి" అని మాడపాటి వారు తెలంగాణా ఆంధ్రోద్యమములో రాశారు. ఇదంతా మితవాదుల, జాతీయ పక్షం వారి దుష్ప్రచారమే. ఖద్దరు ధరించి కాంగ్రెసు నాయకులకు 'జై' అంటూ పైపనులన్నీ చేస్తే వారికి అభ్యంతరం వుండదు. కాని కాంగ్రెసు వేషభాషలు లేకుంటే అంతా ఆక్షేపణీయమే. అంతేకాదు. ఖద్దరుధరించి ఎన్నిహింసాకృత్యాలు చేసినా చెల్లుబడి అవుతుంది. కాని ప్రజలు తమ సాంప్రదాయాలననుసరించి ప్రభబండ్లు కడితే అవి హింసకు మారురూపాలవుతాయి. వచ్చిన ప్రజలు ఆంధ్రులా లేక హింసారాజ్యం నుండి దిగుమతి చేయబడినవారా? బుర్రకథలు నేడు కాంగ్రెసు ప్రభుత్వాలకు ప్రచార సాధనమైన కళగా ఉపయోగపడు తున్నది. ప్రభబండ్లు శక్తిజాతరలోనే ఎందుకు కన్పించాలి? ప్రజల ఉత్సాహాన్ని ప్రదర్శించే సాధనం ఎందుకు కాగూడదు? దీనిని హింసారూపమనేవారు ప్రజలంటే భయపడేవారే. త్వరలో ప్రారంభం కానున్న సాయుధపోరాటానికి సన్నద్ధమవు తున్న ప్రజలు సంరంభమే మహాసభ సందర్భంలో కనిపించిన దృశ్యం.

## 11.పార్టీ, ఆంధ్రమహాసభ కార్యకలాపాల విస్తరణ

ఇంత తీవ్రమైన నిర్బంధవిధానం అమలు జరుగుతున్నప్పుడు తెలంగాణా లోని ఇతర జిల్లాలలోని పరిస్థితులు ఏమిటి? నిర్బంధవిధానానికి వ్యతిరేకంగా ఇతర జిల్లాల్లో కొద్దోగొప్పో ప్రచారం జరిగి లెవీధాన్యం లాంటి సమస్యలపై కొంత పనిచేసినా పెద్దఎత్తున ప్రజల సమీకరణ జరుగలేదు. భూస్వాములకు వ్యతిరేకంగా పోరాటాలు ప్రారంభంకాలేదు. వరంగల్ జిల్లాలో ఖమ్మం సమీపాన తల్లాడరుపల్లి అను ఒక జాగీరు గ్రామంలో ఆ జాగీర్దారుకు వ్యతిరేకంగా ప్రజల పోరాటం పార్టీ, ఆంధ్రమహాసభ నాయకత్వాన నడిచింది. కొద్దికాలం నడిచి లిటిగేషన్‌లో పడింది. మహబూబాబాదు తాలూకా దౌర్జన్యపరులైన పెద్ద భూస్వాములు కేంద్రీకరించివున్న ప్రాంతం. ఆ రోజుల్లో ఆ ప్రాంత ప్రజల్లో పని ప్రారంభమయింది. అంతకుపూర్వం ప్రజా ఉద్యమానికి దూరంగా వున్న ప్రాంతంలో పార్టీ కార్యకలాపాలు ప్రారంభమైనవి. వరంగల్ తాలూకాలో అంతకుముందే ప్రారంభమైనాయి. ఈ విధంగా వరంగల్ జిల్లా ఆంధ్రమహాసభ, పార్టీ కార్యకలాపాలకు ఒక బలమైన కేంద్రంగావుంటూ వచ్చింది. అయినా అప్పుడు కూడా ఫ్యూడల్ వ్యతిరేక ఉద్యమం బలహీనంగా ఉంటూవచ్చింది. కరీంనగర్ జిల్లాలో మొదటినుంచీ కొంత ఉద్యమం నడిచింది. దానికి సిరిసిల్లా తాలూకా కేంద్రంగా ఉండేది. ఆ ప్రాంతాలలో కూడా ఆంధ్రమహాసభ కార్యకలాపాలు ప్రారంభమైనాయి. ఆదిలాబాద్‌జిల్లాలో కూడా ఇదే పరిస్థితి. ఈవిధంగా తెలంగాణా అంతటా పార్టీ, ఆంధ్రమహాసభ కార్యకలాపాలు క్రమంగా తీవ్రమైనాయి. కాని అవన్నీ లీగల్ పరిమితుల్లో సాగినవి. వాటి స్వభావం ఇది. నల్లగొండ జిల్లాలో కూడా ఈ ధోరణి బలంగా ఉన్నా ఆ పరిధులను దాటటానికి అడుగడుగునా ప్రయత్నించింది అక్కడి పార్టీ నాయకత్వం.

వరంగల్ జిల్లాలో పార్టీ, ఆంధ్రమహాసభ నిర్మాణాలు బలంగా ఉండేవి. ఆజిల్లాకు అదనంగా వున్నబలం కార్మికోద్యమం. కొత్తగూడెం బొగ్గు గనులలో కార్మిక యూనియన్ ఏర్పడి అభివృద్ధిఅయింది. వరంగల్ నగరంలో ఆజంజాహి మిల్లు వర్కర్లలో పార్టీ చొరవతో నిర్మించిన ఆజంజాహి మిల్ వర్కర్ల యూనియన్ కూడా బలపడింది. ఖమ్మంలో హమాలీలు, ఇతర కూలీ పనివారల సంఘాలు ఏర్పడి పనిచేశాయి.

హైదరాబాదులో కార్మికోద్యమం, విద్యార్థి ఉద్యమం బలపడినవి. ఆహార సమస్యపై మహిళా సంఘం పనిచేయసాగింది. హైదరాబాదులో తెలుగురాని మహిళలు పెద్ద సంఖ్యలో ఉండేవారు. (ఇప్పటికీ వున్నారు). చదువుకున్న తెలుగు స్త్రీలు ఉర్దూ భాషను అర్థం చేసుకునేవారు. యశోదాబేన్ అను ఆమె గుజరాతీ మహిళ. ఆమె హైదరాబాదు నగర స్త్రీలలో బాగా పనిచేసింది. హిందీలో గంటల తరబడి ధారాళంగా ఉపన్యసించగలిగేది. జిల్లాలకు వెళ్ళి ఉపన్యసించి నప్పుడు ఆమె హిందీ ఉపన్యాసాలను తెలుగులో అనువదించి చెప్పేవారు. చక్కగా శ్రావ్యంగా మాట్లాడటంవలన త్వరలోనే ఆమె ప్రజలను ఆకట్టుకో గలిగింది. ఆమె భర్త రతిలాల్ ప్రభుత్వ ఉద్యోగంలోవున్నా ఉద్యమానికి చేయ గలిగిన సాయమంతా చేసేవాడు. ఈ విధంగా పార్టీ, ఆంధ్రమహాసభ, ఇతర ప్రజాసంఘాల కార్యకలాపాలు పెద్దఎత్తున ముందుకు సాగినవి.

## 12. మితవాదులు-జాతీయపక్షంవారి ఐక్యత తీరుతెన్నులు

మడికొండలో జరిగిన పోటీ ఆంధ్రమహాసభను వీరు జాతీయాంధ్ర మహా సభ అని పిలువసాగారు. జాతీయ పక్షాన్ని ఆంధ్రజాతీయ పక్షమన్నారు. మహా సభ సందర్భంలో ఉభయులూ రాజీకివచ్చారేకాని కలిసిపోలేదు. అంతకుముందు కూడా వారి సంబంధాలు కప్పల తక్కెడలాగా కొనసాగినాయేకాని సాఫీగాలేవు. మహాసభ తర్వాత సంవత్సరమంతా వారు చేసినపని కమ్యూనిస్టు వ్యతిరేక ప్రచారమే. నిర్మాణ కార్యక్రమాన్ని అమలు జరిపామని జాతీయ పక్షంవారు చెప్పుకునేవారు. మితవాద నాయకులు పోటీ సంస్థను ఏర్పాటు చేసిన సమయాన, మితవాద నాయకులు కొంత నిధిని పోగుచేసి ఇస్తామని వాగ్దానంచేశారు. ఆ మేరకు ఇచ్చినట్టు చెప్పుకున్నారు, అయినా కలతలు కొనసాగినవి. మాదిరాజు వారు స్వీయ చరిత్రలో ఇలా రాశారు :

"...అనుకున్న మాట ప్రకారము కంది గ్రామములో 13వ ఆంధ్రమహా సభ శ్రీజమలాపురం కేశవరావుగారి అధ్యక్షతన జరిగెను. నేను స్థాయిసంఘ సభ్యుడనుగా సభకు వెళ్ళితిని. మూడవరోజున శ్రీ కోదాడ నారాయణరావుగారు ఒక కరపత్రమును చదివిరి. అందు 12వ సభ జరిపి నడిపిన శ్రీ రంగారెడ్డి, నర్సింగరావుగార్ల పైనను నా పైనను దూషణలతో నిండియుండెను. అందుకు కేశవ

రావుగారు విచారమును వెలిబుచ్చెను. వృద్ధ, యువక, అతివాద, మితవాద పరస్పరారోపణలతో ద్వేషము పెంచుకొని బహు నాయకత్వముతో ఉద్యమ పతనమునకు కాలము వచ్చినదనుకొంటిమి." (పేజి-887)

పోటీ ఆంధ్రమహాసభలో జాతీయపక్షంవారు పైచేయి సంపాదించి మితవాదులను వెనక్కు నెట్టినారని పైమాటలు స్పష్టం చేస్తున్నవి. మితవాదుల పతనమే ఉద్యమ పతనమని ఈయన చెప్పారు. అయినా మితవాదులు బలహీనపడినారే గాని తుడిచిపెట్టుకొని పోలేదు. తమ బలాన్ని పుంజుకోటానికి ప్రయత్నించి సఫలులైనారని తర్వాతకాలపు పరిణామాలే తెలియజేశాయి.

జమలాపురం కేశవరావుగారి అధ్యక్షోపన్యాసం క్లుప్తంగా ఉన్నది. కాంగ్రెసు నాయకుని ఉపన్యాసం మాదిరిగా వున్నదేకాని, అప్పటివరకు మితవాద నాయకుల సుదీర్ఘ ఉపన్యాసాల మాదిరిగా లేదు. నిర్మాణ కార్యక్రమంతో పాటు "ఆందోళనా కార్యక్రమం" రావాలన్నారేగాని అదేమిటో వివరించలేదు. అప్పటికే కమ్యూనిస్టులు ఫ్యూడల్ వ్యతిరేక పోరాటాలు నడుపుతూ ప్రభుత్వాన్ని, భూస్వామ్య వర్గాన్ని ఎదుర్కొంటున్నారు. ప్రజలపైనా, తమ కార్యకర్తలపైనా దాని ప్రభావం చాలావున్నది. వారిని సంతృప్తిపరచటానికి అన్నమాటలే ఇవి. జాతీయపక్షం వారినిగూర్చి అన్న మాటలివి :

"మన రాష్ట్రంలో జాతీయోద్యమం అత్యంత క్లిష్ట పరిస్థితులలో వున్న సమయంలో ఆంధ్ర జాతీయపక్షమేర్పడి నేటిదనుక తీవ్రకృషిచేసి, జాతీయోద్యమాన్ని ఒక నిర్దిష్టమైన స్థాయికి తీసుకొని వచ్చింది. ఆంధ్ర జాతీయపక్షం వారి కృషివల్ల నేడు దేశంలో జాతీయ చైతన్యం బాగా కలిగింది. ఈ కార్యకర్తల కృషిని అభినందిస్తూ ఇకముందు వీరు తమ పక్షమును మహాసభలో లీనంచేసి సంపూర్ణ బాధ్యతతో కృషిచేయాలని కోరుతూవున్నాను." ("సర్దార్ సింహగర్జన" —సర్దార్ జమలాపురం కేశవరావుగారి వ్యాస సంకలనం-పేజి—184)

కేశవరావుగారుకూడా జాతీయపక్షానికి చెందినవారే కావటంవలన ఆపక్షాన్ని పొగడటంలో ఆశ్చర్యం లేదు. కాని వారికి కూడా జాతీయపక్షం తలనొప్పిగా తయారైంది. ఆ కారణాన విడిగా ఉండటం అనవసరమని భావించారు.

ఈ మహాసభ పూర్తి అయిన కొద్దిరోజులకే స్టేటు కాంగ్రెసుపై నిషేధం తొలిగింది. దానితో జాతీయ పక్షానికి, పోటీ ఆంధ్ర మహాసభకు కాలదోషం పట్టింది. రెండూ రద్దు అయినవి.

ఈ ప్రతిజ్ఞాపాఠాలను పరిశీలిస్తే ఈ రెండు సంస్థల ఉనికి తాత్కాలిక మైనదనీ, ఆంధ్రమహాసభను విచ్ఛిన్నంచేసి తమ చెప్పుచేతల్లో ఉండే సంస్థలను ఏర్పాటు చేసుకోవటమే ఈ సంస్థల నాయకుల ధ్యేయమని స్పష్టమవుతుంది. పోటీ ఆంధ్రమహాసభ స్టేటు కాంగ్రెసుకు మారుపేరులా వ్యవహరించిందేగాని ఆంధ్ర మహాసభ సాంప్రదాయాలను కొనసాగించలేకపోయింది. మాడపాటివారు ఈ పరి ణామాన్ని ఇలా వివరించారు.

"దీని తర్వాత మరియొక మహాసభ మహబూబునగరము జిల్లాలోని జడచర్లయను వర్తక స్థలమున 18-5-1947 నుండి 20-5-1947 వరకు శ్రీ జమలాపురం కేశవరావుగారి అధ్యక్షతతో "పదునాల్గవ ఆంధ్రరాష్ట్రకాంగ్రెసు" అనుపేర జయప్రదముగా జరిగినది. ఇది హైదరాబాదు రాజ్యముయొక్క స్టేటు కాంగ్రెసుకు సంబంధించిన ప్రాంతీయ ఆంధ్ర మహాసభయేకాని, తెలంగాణము యొక్క స్వతంత్ర ఆంధ్రమహాసభ కాదు. ఈ యంశమును పైన సూచింపబడిన పేరే తెలుపుచున్నది. కనుక పదమూడవ అంధ్రమహాసభయే ఈ యుద్యమ చరిత్రకార్యముల కొరకు తుదిమహాసభగా పరిగణింపబడినది" (తెలంగాణా ఆంధ్రోద్యమము, రెండవ భాగము – పేజి – 106).

## 13. ముగింపు

"ప్రజాయుద్ధ" పాలసీని ఒక చివరంటూలాగి అమలుజరిపిన పద్ధతి ఈ కాలమంతటా కన్పిస్తుంది. దాని సామ్రాజ్యవాద వ్యతిరేక స్వభావాన్ని చూడలేక సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటానికి తిలోదకాలివ్వటమే ఆనాటి పార్టీచేసిన మౌలికమైన తప్పు. అయినా ఆ తప్పును సవరించుకునే అవకాశాలు వుండేవి. రష్యాపై నాజీలు యుద్ధం సాగించి ఆ దేశపు భూభాగాన్ని కొంత ఆక్రమించినా ఒకదశకు వచ్చేసరికి రష్యా నాజీ జర్మనీని తిప్పికొట్టింది. స్టాలిన్‌గ్రాడు (రష్యాలో పెద్దనగరం. ఇప్పుడు దానిపేరు ఓల్గాగ్రాడ్) యుద్ధం అన్నిటికన్నా ముఖ్యమైనది. స్టాలిన్‌గ్రాడును జర్మను సైన్యాలు చుట్టివేస్తే దాన్ని వశం కానివ్వకుండా చివరంటా రష్యా సైనికులు పోరాడారు. ఆ సందర్భంలో వారు అపారమైన త్యాగాలు చేయవలసివచ్చింది. వారు నాజీ సైనికులను తిప్పికొట్టి

ముట్టడిని భగ్నంచేశారు. 1943 జనవరి 31న నాజీ సైన్యాలను తరిమివేయటంతో స్టాలిన్ గ్రాడ్ యుద్ధం పూర్తయింది. వెంటనే ఎదురుదాడి ప్రారంభించారు.

ఈ సందర్భంగా గమనించవలసిన మరో అంశమేమంటే బ్రిటిష్, అమెరికా సామ్రాజ్యవాదులు నాజీ జర్మనీకి వ్యతిరేకంగా వెంటనే రెండవ రంగాన్ని తెరవక రష్యాపై యుద్ధభారమంతా పడవేశాయి. నష్టాలు, త్యాగాలు అన్నీ రష్యావైపు నుంచే జరిగేవిధంగా తాము పక్కన ఉండి ఒకరకంగా రష్యాని బలహీనపరిచి తమ సామ్రాజ్యవాద ప్రయోజనాలు కాపాడుకున్నాయి. ఈ పరిస్థితులలో రష్యా దాదాపు ఒంటరిగా పోరాడి అనేక త్యాగాలు చేసి నష్టాలకు గురి అయి జర్మనీ సైన్యాలపై ఎదురుదాడి (offensive) ప్రారంభించింది.

1943వ సంవత్సరమంతా ఇటు రష్యా సైనికులు, అటు అమెరికా, బ్రిటను సైనికులు నాజీ జర్మనీ, జపాను, ఇటలీలోని ముసోలిని సైన్యాలను తరుముతూ ఉన్నారు. రష్యా సైనికులు ఎదురుదాడిని తీవ్రంచేసి జనవరి 1944 నాటికి రష్యానంతటినీ విముక్తిచేసి బెర్లిన్ నగరాన్ని (ఆనాటి జర్మనీ రాజధాని) స్వాధీనం చేసుకోడానికి ముందుకుసాగారు. దీనిఫలితంగా మే 1945లో జర్మనీ, ఆగస్టు 9, 1945న జపాను లొంగిపోయాయి. రెండవ ప్రపంచ యుద్ధం పూర్తయింది.

ఈ పరిణామాలను పరిశీలిస్తే రష్యాకు ప్రమాదము జనవరి 1943లోనే తప్పిపోయింది. జాగ్రత్త కొరకు ఇంకా కొంతకాలం చూడాలనుకున్నప్పటికీ 1943 అంతా రష్యా అఫెన్సివ్‌లోనే వుండటంతో 1943 చివరినాటికి లేదా 1944 ప్రారంభానికి ఆ ప్రమాదం నిస్సందేహంగా తొలగిపోయిందని స్పష్టమవుతున్నది. ఆనాటికి రష్యా గెలుపు, ఫాసిజం ఓటమి తథ్యమని తేలిపోయింది. ఇవన్నీ గమనించవలసిన అంశాలు. ఎందుకంటే రష్యాకు ప్రమాదం ఏర్పడిందన్న విషయమే బ్రిటిష్ ప్రభుత్వాన్ని బలపరచటానికి ప్రధాన కారణమైతే, రష్యా జయించటం తథ్యమని తేలిన '43 చివరినాటికి, లేదా '44 ప్రారంభంలో బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పోరాటాన్ని తీవ్రతరం చేయవలసి ఉండింది. అలాంటిదేమీ చేయక కాంగ్రెసు – ముస్లింలీగు ఐక్యత కావాలని జేక అధికార మార్పిడి సమయంలో ఒకరకంగా బ్రిటిష్ సామ్రాజ్యవాదులను బలపరిచే ధోరణి అంతా ముందుకువచ్చింది. 1944 ప్రారంభం నాటికే పార్టీలో, పార్టీ నాయకత్వంలో వర్గసామరస్య ధోరణి బలపడివుంది. దాని కనుగుణ్యంగానే

ఆ పోరాటాన్ని తీవ్రతరంచేసే కార్యక్రమాన్ని మానుకున్నారని దీనితో స్పష్ట మవుతున్నది.

కాగా జరుగుతున్న కార్మికుల సమ్మెలనుకూడా పార్టీ నాయకత్వం ఆపి వేసింది. ఉదాహరణకు ఆజంజాహి మిల్లు (వరంగల్లు) వర్కర్లలో ఎక్కువ వేతనాలు, మరికొన్ని సౌకర్యాలకోసం సమ్మె ప్రారంభించారు. పార్టీకి బలమైనస్థానం ఉన్న యూనియన్ నాయకత్వాన సమ్మెసాగింది. సర్వదేవభట్ల రామనాథంగారు యూనియన్ అధ్యక్షులు. రెండు నెలలకు మించి సమ్మె కొనసాగింది. ప్రభుత్వం, మేనేజిమెంటు కూడా బిగించుకొని కూర్చున్నవి. కోర్కెలపై ఎలాంటి ఒప్పందం కుదరలేదు. ఆ సమయంలో పార్టీ ఒకనిర్ణయం తీసుకొని సమ్మెను బేషరతుగా ఉపసంహరించింది. "సమ్మెవల్ల ఉత్పత్తి దెబ్బతింటుంది; యుద్ధ కృషికి అవ రోధంగా ఉంటుంద"ని కారణాలను చూపెట్టింది. సర్కారు జిల్లాల్లోకూడా ఇలాంటి సంఘటనలు అనేకం జరిగాయి. విజయవాడలో మునిసిపల్ కార్మికులు సమ్మెచేస్తే ఈ అవగాహనతోనే దానిని ఉపసంహరించింది పార్టీ నాయకత్వం. (పార్టీ రాష్ట్ర కమిటీలో ఇదొక తీవ్రమైన చర్చనీయాంశమైంది కూడా). ఈ అంశాలన్నింటిని మనం దృష్టిలో ఉంచుకుంటే, పార్టీ ఈ "ప్రజాయుద్ధ పంథా"ను ఒక చివరకు తీసుకెళ్ళి కార్మికుల సమ్మెలను కూడా జరగకుండా చేసిందని స్పష్టమౌతుంది. ఇదేవిధంగా ప్రభుత్వం నిర్బంధంగా వసూలుచేసే లెవీధాన్యం యెడ పార్టీ అనుసరించిన వైఖరి సామరస్యపూరితమైనది. దీని వలన సామాన్య రైతులపై అక్రమాలు ఎన్నో జరుగుతూ ఉండేవి. చిన్న రైతులకు, ధనిక రైతులకు, భూస్వాములకు ఒకే రేటు ప్రకారం వారుసాగుచేసే ప్రతి ఎకరానికి నిర్ణీతమైన ధాన్యాన్ని వసూలు చేసేది ప్రభుత్వం. ఈ ధాన్యానికి ధరను నిర్ణయించి ప్రభుత్వమే రైతులకు డబ్బు చెల్లించాలి. రైతులకు ధర సరిగా ఇచ్చేవారు కారు. తూకంలో అన్యాయం జరుగుట మామూలే. ఇలాంటి అక్రమాలు ఎన్నో జరిగేవి.

దాదాపు గ్రామాలలో ఉండే భూస్వాములంతా—పటేలు పట్వారీలు, దేశ ముఖులు—ఈ ధాన్యాన్ని వసూలుచేసి తమ కొట్టులలో నిలువచేసి ప్రభుత్వానికి లెక్క చెప్పేవారు ధాన్యాన్ని వారు నాగులకిచ్చి లాభాలు గడించేవారు. లేదా తాము ఇవ్వవలసిన ధాన్యాన్ని ఎగవేసి, రైతులిచ్చిన ధాన్యాన్ని ప్రభుత్వానికి అప్పగించి తప్పుడు లెక్కలతో ఈ వ్యవహారాన్ని సరిపెట్టేవారు. ఈ విధంగా

భూస్వాములు తాము ఇవ్వవలసిన ధాన్యాన్ని దక్కించుకునేవారు. పేద మధ్య తరగతి ధనిక రైతులను బాధించి వసూలుచేసి తాము లాభపడేవారు. ఇది చాలా కంటకంగా ఉండేది. వసూలు అయిన ధాన్యానికి రైతులకు డబ్బు అందేదికాదు. తరచుగా పటేలు పట్వారీలు ధరను చెల్లించ నిరాకరించేవారు. రైతులుకూడా అడగ సాహసించేవారుకారు భూమిపై లెవీరేటు హెచ్చుగా ఉండేది.

కమ్యూనిస్టుపార్టీ లెవీధాన్యాన్ని వసూలు చేయటానికి గ్రేడేషన్ పద్ధతి ననుసరించాలని సూచించింది. దీనిప్రకారం భూస్వాములకు హెచ్చురేటు, ధనిక రైతుల భూమిపై తక్కువరేటు ఉంటుంది. చిన్న రైతులను (మధ్య, పేద తరగతి) మినహాయించాలని కూడా పార్టీ సూచించింది.

ఈ ప్రతిపాదనలను ప్రభుత్వం అంగీకరించలేదు. తరచుగా ఈ నిర్బంధ ధాన్యసేకరణ రైతులకూ, భూస్వాములూ ప్రభుత్వాధికారులకూ మధ్య సంఘర్షణలకు దారితీసేది. అయినా "ప్రజా యుద్ధపంథా" ననుసరించి పార్టీ, ఆంధ్ర మహాసభ నాయకులు సామాన్య రైతులనుంచి ప్రభుత్వానికి ధాన్యాన్ని ఇప్పించే వారు. అధికారులు సహకరించిన చోట రైతులకు ఇబ్బందులు తగ్గేవి. సహక రించని చోట ఇబ్బందులు హెచ్చు. అయినా ప్రభుత్వానికి సహకరించే ధోరణే బలంగా పనిచేసింది. ఈ ధోరణి రైతాంగ పోరాటాలు అభివృద్ధి కావటానికి అవ రోధంగా పరిణమించింది. అయినా తరచుగా సంఘర్షణలు జరిగాయి.

రైతుకూలీ సామరస్యం అనే ఒకనినాదాన్ని పార్టీ ఈకాలంలో ఇచ్చింది. 'అధికాహారోత్పత్తిని చేయటానికి రైతుకూలీ సామరస్యము'ని పూర్తి నినాదం. రైతులెవరు? తమకుతాము రైతులమనుకునే భూస్వాముల సంగతేమిటి? అనే విషయం ఇటుఅటు తేల్చకుండా ఉన్నారు. తాము, తమకుటుంబం కష్టించక, పాలేర్లతో భూములను సాగుచేసే భూస్వాములుకూడా తమకుతాము రైతులమనే చెప్పుకుంటారు. కుటుంబమంతా కష్టించే ధనికరైతులు కూడా పాలేర్లను నియోగిస్తారు. రైతుకూలీ సామరస్యమనే నినాదపుసారాంశం: భూస్వాములు, ధనిక రైతులు, కూలీలు అంతా సామరస్యంగా ఉండాలి. వ్యవసాయ కూలీలు తమ కోర్కెలకోసం సమ్మెచేయకూడదు. చేస్తే వ్యవసాయోత్పత్తి—అధికోత్పత్తి దెబ్బతింటుంది. ఆ దృష్టితో భూస్వాములతో సామరస్యంతో మెలుగుతూ చర్చల ద్వారా కూలీల సమస్యలను పరిష్కరించుకోవాలి. ఈవిధానాన్ని అమలుజరిపి గ్రామీణ ప్రాంతాల్లో వ్యవసాయ కూలీల సమ్మెలనురాకుండా ఆపివేసింది పార్టీ నాయకత్వం.

ఇది భూస్వాములతో, ధనిక రైతులతో సామరస్య విధానం. ఈ దృష్టితో చూచినప్పుడు వర్గ సామరస్య విధానాన్ని సర్వత్రా అమలుజరిపిందిఆనాటి పార్టీ నాయకత్వం. బ్రిటిష్ సామ్రాజ్యవాదుల పెట్టుబడిదారులు, భూస్వాములు, ధనిక రైతులతో వర్గ సామరస్య విధానమనుసరించుటతో వర్గ పోరాటమనేది లేకుండా చేసిన కథా ఇది. అయినా దానిని అధిగమించి అనేక ప్రాంతాల్లో పోరాటాలు వచ్చాయి. పార్టీ నాయకత్వం వాటిని మధ్యలో ఆపివేసింది.

నల్లగొండ జిల్లాలో కౌల్దార్ల పోరాటాలు (1942-1943) ఈ పాలసీకి భిన్నంగానే నడిచినాయి. కాని రాష్ట్ర నాయకత్వం వీటిని అలాంటివని అప్పుడు (ఎప్పుడూ) చెప్పలేదు. దానికి ప్రధాన కారణాలలో ఒకటి: భూస్వామ్య తోపిడీ. రెండవది : ఈ పోరాటాలను నడపటం వల్ల పార్టీ పలుకుబడి, ప్రతిష్ట అపారంగా పెరిగిపోయింది. కాంగ్రెసులోని అత్యధిక సంఖ్యాకులు కమ్యూనిస్టులు బ్రిటిష సామ్రాజ్యవాదుల ఏజెంట్లు అని దుష్ప్రచారం చేస్తూ వారిని ప్రజలనుంచి దూరం చేయ ప్రయత్నించే సమయంలో ఈ పోరాటాలు కమ్యూనిస్టు పార్టీకి ఎంతో బలాన్ని చేకూర్చాయి. వీటివలన 'ప్రభుత్వానికి వ్యతిరేకమైన పార్టీ', 'మిలిటెంటుగా ధైర్యంగా ప్రజలముందుండి పోరాడేద'ని కమ్యూనిస్టు పార్టీకి గుర్తింపు వచ్చింది. ఈ కారణం వల్లనే ఆనాటి పార్టీ నాయకత్వం ఈ పోరాటాలను ఖండించ లేదు. అంతేకాదు. ఈ పోరాటాలను స్థానిక నాయకత్వం (జిల్లాకమిటీ) ప్రారంభించింది; నడిపించింది. ఈ దశలో రాష్ట్ర నాయకత్వానికి ఎలాంటి ప్రమేయం లేదు. తీవ్ర నిర్బంధ విధానం వలన పోరాటాలు తాత్కాలికంగా దెబ్బతిన్నప్పుడు, ఆంధ్రమహాసభలోని మితవాద నాయకత్వం పార్టీ కార్యకర్తలపై చర్య తీసుకో డానికి తయారైనప్పుడు మాత్రమే ఈ సమస్య చర్చకు వచ్చింది. ఆ స్థితిలో రాష్ట్ర నాయకత్వం సమర్థించిందే కాని కాదనలేదు.

ఇలాంటి తొందరపాటు పనులవలన నిర్బంధాన్ని కొని తెచ్చుకుంటున్నా రనీ, ఇతర జిల్లాలలో ప్రభుత్వ అధికారులతో కలిసి మాట్లాడి ఏ నిర్బంధం లేకనే తమ సమస్యలను పరిష్కరించుకుంటున్నారనీ తెలంగాణా పార్టీ నాయ కత్వంలో ఒక బలమైన అభిప్రాయం ఉండేది. కాని వారెవ్వరూ "ప్రజాయుద్ధ" పంథాతో ముడిపెట్టి ఈ సమస్యను చర్చించలేదు; తప్పని అభిప్రాయపడలేదు. ఇదొక ప్రత్యేక పరిస్థితి. జాతీయ జీవనంలో, అన్ని రాష్ట్రాల్లో, అన్ని ప్రాంతాల్లో పోరాటాలను అభివృద్ధిచేసి ముందుకు తీసుకుపోవలసిన సమయంలో ఒక్క

నల్లగొండ జిల్లాలోనే పార్టీ నాయకత్వంలో పోరాటాలు కొద్దిపాటిగానైనా అభివృద్ధి అయినవి. తక్కిన ప్రాంతాలలో సామరస్యంగానే కార్యకలాపాలు సాగినాయి. వరంగల్ జిల్లాలో ఆజం జాహి బట్టలమిల్లు కార్మికులు సాగించినది ట్రేడు యూనియన్ హక్కులకోసం సాగిన పోరాటమే. అధిక వేతనాలు మొదలగు సౌకర్యాలకోసం జరిగిన పోరాటమే. రాజకీయ పోరాటమేమీ కాదు. అయినా అది ఈ "ప్రజాయుద్ధ" పంథా దృష్టితో చూస్తే బట్టల ఉత్పత్తిని దెబ్బతీసే పోరాటమే. ఆ పోరాటాన్ని తప్పని నిర్ణయించి ఆపివేసింది ఆనాటి పార్టీ నాయకత్వం. ఈ విధంగా వర్గ సామరస్య విధానం తెలంగాణాలోని కొన్ని ప్రాంతాలలో అమలు జరుగలేదు. ఇతర ప్రాంతాలలో అమలు జరిగింది. రెండవ ప్రపంచ యుద్ధం పూర్తయినదాకా ఈ విధానమే కొనసాగింది.

ఈ కాలంలో పార్టీ చేసిన కృషి, దాని ఫలితంగా అభివృద్ధి అయిన ఉద్యమాన్ని పరిశీలిస్తే రెండు ధోరణులు కనిపిస్తాయి. వర్గ పోరాటానికి అనుకూలమైన ధోరణి ఒకటి, వర్గసామరస్య ధోరణి మరొకటి. ఈ రెండింటి మధ్య ఏ స్థాయి లోనూ సిద్ధాంతపోరాటం సాగలేదు. కార్యాచరణలో మాత్రమే ఇవి ప్రతిబింబిం చాయి.

కాంగ్రెసు ఆగస్టు 1942 తీర్మానం ఆమోదించిన నాటికి రష్యా, ఇతర దేశాల పరిస్థితులు కూడా చాలా ప్రమాదంగా వుండేవి. ఫాసిజం అఫెన్సివ్‌లో వుండేది. అది స్పష్టంగానే కనిపిస్తున్నది. ఆ సందర్భంలో పార్టీ నాయకత్వం బ్రిటిషు సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని, ఫాసిస్టు వ్యతిరేక పోరాటాన్ని విడదీసి చూడలేనటువంటి స్థితి వుందనేది స్పష్టం. దాన్ని మనం అర్థం చేసుకో వచ్చు. కానీ ఫాసిజం ఓడిపోవటం మొదలు పెట్టిన తర్వాత కూడా, ఈ పరిణా మాన్ని గుర్తించినప్పటికీ, బ్రిటిషుసామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా సాగించవలసిన పోరాటాన్ని సాగించలేదు. అప్పుడు నిరాశా నిస్పృహలతో కూడిన వాతావరణం దేశంలో వుంది. ఎందుకంటే కాంగ్రెసు నాయకత్వంకూడా కార్యక్రమమేమీ ఇవ్వ లేదు. వారి విధ్వంసక కార్యక్రమాలన్నీ విఫలమైనాయి. కానీ ఇక్కడ మనం గుర్తుంచుకోవలసిందేమిటంటే కాంగ్రెసు నాయకత్వం రెండునాల్కలతో వ్యవహ రించింది. కార్యకర్తలకు, ప్రజలకు చూపెట్టడానికి విధ్వంసక కార్యక్రమంతో కూడుకున్న పోరాటాన్ని నడిపింది. బ్రిటిషు సామ్రాజ్యవాదంతో రాజీ కొరకు, అంతర్జాతీయంగా ఫాసిస్టు వ్యతిరేక స్వభావాన్ని సంపాదించుకోవటానికి

ఈ పోరాటం అహింసాయుతమైనదని చెప్తూ వచ్చారు. ఈ విధ్వంసక కార్యక్రమ మనేది ఏమీలేదని స్పష్టంచేశారు. తర్వాత కూడా వరుసగా ఇదే సాగుతూ వచ్చింది. దీనితో కాంగ్రెసు ఫాసిస్టు అనుకూలం కాదనటం తప్పు. నెహ్రూతో పాటు మరికొందరు ఫాసిజానికి వ్యతిరేకంగా వున్నవారే. అయితే ఫాసిజానికి వ్యతిరేకంగా ఉండటం వేరు. దానికి వ్యతిరేకంగా పోరాడటం వేరు. మాటల్లో ఫాసిజానికి వ్యతిరేకంగా వున్నప్పటికీ ఆచరణకు సంబంధించి గాంధీగారి కార్యక్రమమే నెగ్గింది. ఆ కార్యక్రమంయొక్క సారాంశం ఏమిటంటే బ్రిటిషు సామ్రాజ్యవాదం ఓడిపోయి, జపాను ఫాసిజం గెలిస్తే, ఫాసిజంతో రాజీ పడదాం. లేక ఫాసిజం ఓడిపోయి బ్రిటిషు సామ్రాజ్యవాదం, రష్యా, అమెరికాలు గెలిస్తే బ్రిటిషు సామ్రాజ్యవాదంతో రాజీపడదాం. 1942 మార్చి - ఏప్రిల్లో వచ్చిన 'క్రిప్స్‌మిషన్' విఫలమవటానికి ఎవరుగెలుస్తారు, ఎవరు ఓడుతారన్నది తేలక పోవటమే ప్రధాన కారణం. రాజీపడే కార్యక్రమం ఎలాగూ ఉన్నది కనుక, ఎవరు అధికారంలోకివస్తే వారితో రాజీపడాలనే ధోరణి ఆగస్టు '42 తీర్మానంలో వుంది. తర్వాత వారి కార్యకలాపాలన్నీ ఆ ధోరణిలో నడిచాయి. బ్రిటిషు సామ్రాజ్య వాదం, రష్యా, అమెరికాలు—ఇవన్నీ గెలవటం ఖాయమని తేలినప్పుడు వీరు బ్రిటిషు సామ్రాజ్యవాదంతో రాజీపడటం ప్రారంభించారు. మే 1944 లో గాంధీగారిని విడుదలచేసిన తర్వాత రాజీ సంప్రదింపులు ప్రారంభమైనాయి.

కేంద్ర శాసనసభ (central legislative assembly)లో కాంగ్రెసు నాయకుడైన భూలాభాయి దేశాయి, ముస్లింలీగు నాయకుడైన లియాఖత్ అలీ-వీరిద్దరూ సంప్రదింపులు జరిపి మే '45లో ఒక అంగీకారానికి వచ్చారు.

కేంద్రంలో కాంగ్రెసు ముస్లింలీగు సమాన స్థానాలు కలిగివున్న మంత్రి వర్గాన్ని ఏర్పాటు చేసుకోవటానికి అంగీకారం ఈఒప్పందంలోని ప్రధాన అంశం. ఇది జరిగిన తర్వాత దీనిని మార్చి, మెలికలు త్రిప్పి ఇంగ్లాండులోవున్న బ్రిటిష్ సామ్రాజ్యవాద పాలకులు హిందువులకూ, ముస్లిములకూ సమాన ప్రాతి నిధ్యం అనే పునాదివేశారు. దాంతో మళ్ళీ తగాదావచ్చి చర్చలు విఫలమయ్యాయి. ఇక్కడ గమనించవలసిందేమిటంటే కాంగ్రెసు-ముస్లింలీగుకు సమాన స్థానాలనే ప్రతిపాదనను గాంధీగారి అంగీకారంతో భూలాభాయిదేశాయి ఒప్పుకున్నారు. ఇత్తె హాదుల్ ముసల్మీన్ ముస్లింలీగుకు మారుపేరుగా (proto type) వున్న సంస్థ. వారితో సమానస్థానాలు కావాలనే సూచన—పార్టీ దృష్టితో, మార్క్సిజం-

లెనినిజం దృష్టితో చూచినప్పుడు తప్పయినప్పటికీ—ఆనాడు కాంగ్రెసు చేసుకున్న ఒప్పందానికి అనుగుణ్యంగానే వున్నది. అలా వున్నప్పుడు ఇక్కడి జాతీయ వాదులైనా, జాతీయపక్షంవారైనా, మరొకరైనా దాన్ని వ్యతిరేకించవలసిన అవసరమేమిటి? వాస్తవంలో వారుకూడా దానికి అనుకూలురే.

**రాష్ట్రకమిటీ విభేదాలు :** రాష్ట్రస్థాయిలోనూ, రాష్ట్రానికి కేంద్రానికి మధ్య కొన్ని విభేదాలు వుండేవి.

ముఖ్యంగా సుభాష్ చంద్రబోసునూ, జపాను ఫాసిజాన్ని ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ బలపరిచేవారిని పంచమాంగ దళమని నిర్వచించకూడదని రాష్ట్రకమిటీ సభ్యులలో కొందరు వాదించేవారు. ఆవిధంగా నిర్వచించాలనే వారు కొద్దిమంది వుండేవారు. కేంద్ర కమిటీవిధానం వారిని పంచమాంగదళం అనాలనే వారికి అనుకూలంగా ఉండేది. తీవ్రమైన చర్చలతర్వాత కేంద్ర కమిటీవిధానాన్ని వ్యతిరేకించేవారు వెనక్కుతగ్గారు. ఈ విభేదాలు కిందిదాకా రాలేదు. పైస్థాయిపరకే ఉండిపోయినవి. క్రిందిస్థాయిలో వర్గపోరాట సూత్రాలను అమలు చేసేవారు కొందరైనా ఉండేవారు.

# 8. యుద్ధానంతర విప్లవ వెల్లువ —1946 సాయుధ ప్రతిఘటన

1945-46 నాటికి మద్రాసు రాష్ట్రంలోని ఆంధ్రప్రాంతంలో కూడా ఎన్నికలకోసం సన్నాహాలు జరిగాయి. సుందరయ్యగారు రచించిన 'విశాలాంధ్రలో ప్రజారాజ్యం' అను పుస్తకాన్ని పార్టీ తరపున విడుదలచేశారు. ప్రజారాజ్యంలో ప్రాజెక్టులూ, పరిశ్రమలతో ఆంధ్రరాష్ట్రాన్ని సర్వతోముఖంగా అభివృద్ధి చేస్తామనే పార్టీ నినాదాన్ని వివరించారు. 'విశాలాంధ్ర' నినాదాన్ని అందరూ హర్షించారు. పార్టీ ఈ పుస్తకాన్ని వేల సంఖ్యలో పంపకంచేసి ఈ నినాదాన్ని ప్రచారం చేసింది. సర్కారు, రాయలసీమ జిల్లాల్లో ఎన్నికల్లో ఈ నినాదంతో కమ్యూనిస్టుపార్టీ పోటీచేసింది. పాత రాజ్యాంగం ప్రకారం పరిమితమైన ఓటు హక్కుతో (Limited Franchise) జరిగిన ఎన్నికలవి. కార్మికుల నియోజక వర్గంనుంచి పిల్లలమర్రి వెంకటేశ్వర్లు గెలిచారు.

## 1. పాలకుర్తిలో విచారణ - స్థానిక ప్రజలనుండి వలంటీరుదళ నిర్మాణం

**ప్రజా ప్రతిఘటనకు నిర్ణయం :** పాలకుర్తి సంఘటనలపై విచారణ చేయమని పోలీసు శాఖాధిపతి (నాజం) అండర్సన్ (బ్రిటిష్ అధికారి) ఎస్.పి.ని (మెహెతెమిం) ఆదేశించాడు. ఆరుట్ల లక్ష్మీనరసింహారెడ్డి, విసునూరు పోలీసు స్టేషన్లో బి. యన్. రెడ్డి మొదలగువారిపై జరిగిన దౌర్జన్యాలు, హింసాకాండపై విచారణకోసం ఎస్. పి. వస్తున్నాడని తెలవటంతో ఆంధ్రమహాసభ తరపున సాక్ష్యాన్ని సిద్ధం చేయవలసిన బాధ్యత కార్యకర్తలపై పడింది. వారంతా జైల్లో వున్నారు. ప్రజలు భయపడుతున్నారు. అప్పటివరకు ధైర్యంగావున్న రైతులంతా వెనుకపట్టు పట్టినారు. కనీసం అయిలమ్మ, ఆమె కుటుంబ సభ్యులు (అంతా స్త్రీలే)

కూడా తమకు జరిగిన అన్యాయాన్ని గూర్చి చెప్పటానికి భయపడే పరిస్థితి ఏర్పడింది. సూర్యాపేటనుంచి కార్యకర్తలను తెచ్చి ఆంధ్రమహాసభ ఉద్యమాన్ని, రైతుల ధైర్యాన్ని నిలబెట్టాలని చేసిన ప్రయత్నంకూడా ఫలించలేదు. కాగా తీవ్రమైన హింసాకాండను ఎదుర్కోవలసివచ్చింది. కార్యకర్తలకే ఈ దుస్థితి ఏర్పడితే తమకు ఎంత ముప్పు వాటిల్లనున్నదో అని ప్రజలు మరీ భయపడి పోయారు. ఈ సందర్భంలో ఏమి చేయాలి అనే సమస్యపార్టీ, ఆంధ్రమహాసభల ముందుకు వచ్చింది. కేంద్రంలోవున్న నాయకులు దీన్ని గూర్చి ఆలోచించలేదు; పరిష్కార మార్గం చూపించలేదు. ఈ బాధ్యత జిల్లాకమిటీయే నిర్వహించాల్సి వచ్చింది. జిల్లాకమిటీ సభ్యులు, కార్యకర్తలు జైళ్ళలో వున్నారు. కొందరు ఇతర బాధ్యతలపై దూరప్రాంతాలకు వెళ్ళినారు.

**అప్పటి ఉద్యమ పరిస్థితి :** ఇతర తాలూకాలనుంచీ, జిల్లాలనుంచీ వలంటీర్లను కార్యకర్తలను తెచ్చి ఈ ప్రాంతంలో పనిచేయించి ఉద్యమాన్ని ప్రోత్సాహపరచటం నిరుపయోగం. ఎందుకు? తమకు ఇంకా ఎక్కడినుంచో కార్యకర్తలు వచ్చి తమకోసం పనిచేయాలనీ, తమకు సహాయపడాలనే చైతన్యమే ప్రజల్లో వున్నది; ముందుకువచ్చి పోరాటంలో పాల్గొనాలనే చైతన్యం వృద్ధికావటంలేదు. అలాంటి పరిస్థితిలో ప్రజలే స్వయంగా ఉద్యమంలో పోరాటంలో పాల్గొనటానికి కావలసిన ఏర్పాట్లు చేయాలని కమిటీ కార్యదర్శి (కామ్రేడ్ డి. వి.) ఒక నిర్ణయానికి వచ్చారు. ఆయనకు ఇలాంటి వైఖరి ముందునుంచీ వుండేది. కానీ ఆరుట్ల రామచంద్రారెడ్డి నిర్మాణ రాహిత్యపు వైఖరివలన ఉద్యమానికి అవసరమైన నిర్మాణ పునాదులు వేయటం సాధ్యపడలేదు. నిర్బంధం తీవ్రమైన స్థితిలో మరీ కష్టసాధ్యమయింది.

పాలకుర్తిలో వలంటీర్లు సిద్ధమైతే మంచిదే. కాని అక్కడి భయానక వాతావరణంలో ప్రజలనుంచి అప్పటికప్పుడు వలంటీర్లు ముందుకువచ్చే అవకాశం లేదు. అలాంటి స్థితిలో ఆ గ్రామానికందుబాటులో వుంటూ, విసునూరు దేశముఖుకు వ్యతిరేకంగా సంఘంలో చేరిన గ్రామాల ప్రజలనుంచి వలంటీర్లువస్తే ఈ నిర్బంధ విధానాన్ని ప్రజలు ఎదుర్కోగలుగుతారు. ఇతర ప్రాంతాలనుంచి వచ్చిన వలంటీర్లకూ, స్థానిక వలంటీర్లకూ ఉండే మరో భేదమేమంటే: విసునూరు దేశముఖు, అతని గూండాలు, గ్రామాల్లోని భూస్వాములు, ఇతర ప్రాంతాలనుంచి వచ్చేవారిని హింసించినట్టుగా స్థానికులను హింసిస్తే అది వారికి తీవ్రమైన

సమస్యగా తయారవుతుంది. ఏ స్థానిక ప్రజలనైతే లొంగదీసుకోవాలనుకుంటారో వారిని లొంగదీసుకోలేకపోగా భూస్వాముల మధ్యా ప్రజలమధ్యా అప్పటికే ఏర్పడిన గండి పెద్దదవుతుంది. దేశముఖుల బృందం దీనిని గుర్తించి ఇతర ప్రాంతాలనుంచి వచ్చిన కార్యకర్తలమీద వలంటీర్లమీద దౌర్జన్యాలు చేశారు. కాగా ప్రజలే స్వయంగా నిర్బంధ విధానాన్ని ఎదిరిస్తే వారూ, వారి గూండాలు ప్రజలను ఎదిరించలేరు. ఈ కారణాన స్థానిక ప్రజలనే ప్రతిఘటనకోసం సిద్ధం చేయటం అవసరమనీ, అది తగిన సమయమనీ, మరో అవకాశమనీ ఆయన ఈ నిర్ణయానికి వచ్చాడు. దౌర్జన్యాలు, దుర్మార్గాలు జరిగిన ప్రదేశమది. విచారణ సమయంలో పాలకుర్తినుంచి ఎక్కువమంది సాక్షులు రావలసి ఉంటుంది. వారిలో ధైర్యం కలిగించటానికి చుట్టుపక్కల గ్రామాల్లో కనీసం ఒక్కరైనా తమకు అందగా ఉందని వారికి నమ్మకం ఏర్పడితే, వారు సాక్ష్యం ఇవ్వటానికి ముందుకు వస్తారు.

ఈ దృష్టితో చూసినప్పుడు స్థానిక ప్రజలనుంచి వలంటీర్లను తయారుచేసి వారి సాయంతో ప్రజలు దేశముఖులను, వారి గూండాలను ప్రతిఘటించాలని చేసిన నిర్ణయం ఉద్యమాన్ని ఉన్నతస్థాయికి తీసుకువెళ్ళటానికి చేసినది. పోలీసు విచారణకోసం సాక్షులను సమీకరించాలనడం దీనిలో ఒక భాగమే. సాక్షులు వచ్చినా, రాకున్నా విచారణ ఒక తతంగం మాత్రమే. సాక్షులువస్తే ఈతతంగాన్ని ప్రజలముందు ఎండగట్టవచ్చును. మితవాద కమ్యూనిస్టులు దీనిని కేసులూ, లీగల్ వ్యవహారాలకు సంబంధించిన సమస్యగా పరిగణించారు. కానీ జిల్లా కమిటీ దీనిని కేసులకు ఎప్పుడూ పరిమితం చేయలేదు. ఉద్యమాన్ని నిర్మించటం దీనిని ఉన్నత స్థాయికి తీసుకువెళ్ళటాన్ని తక్షణ కర్తవ్యమని భావించి పని చేసింది. రెండు అవగాహనల్లోవున్న మౌలికమైన భేదం ఇది.

**ప్రజలనుంచి వలంటీరు దళ నిర్మాణం :** దేవరుప్పల గ్రామం అక్కడి ముఖ్యకేంద్రాల్లో ఒకటి. పాలకుర్తి సమస్యపై దేవరుప్పల ప్రజల సహాయ సహకారాలు అవసరమని, వారు ఆ పనులు చేయగలుగుతారనే నిర్ణయానికొచ్చి కార్యదర్శి (ఆయన ఆంధ్రమహాసభ నల్లగొండ జిల్లా సంఘానికి అధ్యక్షుడు కూడా) ఆ గ్రామ కమిటీ నాయకత్వంతో పాలకుర్తి సమస్యను చర్చించారు. గ్రామం నుంచి వలంటీర్లను తీసుకువెళ్ళి పాలకుర్తిలో మకాం పెట్టించి, ప్రజలకు ధైర్యం కలిగించి ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించి సాక్ష్యాలను ఇప్పించాలనీ, తర్వాత

అన్ని గ్రామాలనుంచీ వలంటీర్లను తయారుచేసి, గూండాలను ప్రతిఘటించడానికి పూనుకోవాలనీ, అప్పుడే ఉద్యమాన్ని రక్షించుకోగలుగుతామనీ గ్రామ నాయకత్వానికి నచ్చజెప్పటానికి ప్రయత్నించారు. కాని గ్రామసంఘ అధ్యక్షుడు దానికి సిద్ధపడలేదు. 'కొంత డబ్బైనా ఇస్తాం, ఇతర తాలూకాలనుంచి వలంటీర్లను తెచ్చి ప్రతిఘటన ఏర్పాట్లు చేయండి. ఇక్కడినుంచి మాత్రం వలంటీర్లను తీసుకు వెళ్ళవద్ద'ని సంపన్నుడైన ఆ అధ్యక్షుడు పట్టుబట్టాడు. 'ఇది సాధ్యం కాదు, ఇతర తాలూకాలలో వలంటీర్లు లేకకాదు నేను ఈ సూచనచేసింది. ఇక్కడ ఉద్యమాన్ని నిలబెట్టుకోవడం అవసరం. ఇవాళ పాలకుర్తిలో అయింది. రేపు దేవరుప్పలలో అవుతుంది. మీరుకూడా ఈ నిర్బంధానికి గురి కావలసివస్తుంది. ఈ పరిస్థితులలో మీరు వెనుకాముందాడకూడదు' అని నచ్చజెప్పటానికి ప్రయత్నిస్తే ఆయన వినలేదు. గ్రామంలోని రైతులతో ఈ విషయమై మాట్లాడి వారి అభిప్రాయాలను తెలుసుకుంటానంటే దానికీ అంగీకరించలేదు. అప్పుడు ఉభయులకూ సన్నిహితంగా ఉండే గ్రామకమిటీ సభ్యుని ఇంటికి కార్యదర్శి వెళ్ళారు. ఆయన గోలి కొండల రెడ్డి. 'ఏమిటీ పరిస్థితి? వలంటీర్లు కావాలంటే అధ్యక్షులు వద్దంటున్నారు. రైతుల ఇళ్ళకు వెళ్ళి వారి సలహాలు తీసుకుంటానంటే, వెళ్ళటం మంచిది కాదని వారించార'ని ఆయనకు చెప్పి "మీరు జోక్యం కలిగించుకోగలుగుతారా? మీ పరిస్థితి ఏమిటి? మీ గ్రామ కమిటీ పరిస్థితేమిటి?" అని ఆయనతో వున్న చనువూ, స్నేహితాన్ని ఉపయోగించి అడిగినారు. ఆయన అధ్యక్షునితో మాట్లాడటానికి అంగీకరించినాడు. అంతా కలిసి మాట్లాడి గ్రామకమిటీ సమావేశం చేయించటానికి నిర్ణయించారు. కమిటీ సమావేశంలో రైతుల ఇంటికి వెళ్ళటానికి బదులు రైతులనే పిలిపించి వారితో కార్యదర్శి మాట్లాడాలని గ్రామకమిటీ సభ్యులు పట్టుబట్టారు. దానికి అధ్యక్షుడంగీకరించాడు. ఆ గ్రామ సంఘానికి అండగా వున్న వారిలో కొద్దిమందిని ఎంపికచేసి రమ్మంటే 200 మంది వరకు వచ్చారు. వారి సమావేశంలో జాతీయ అంతర్జాతీయ పరిస్థితులతోబాటు ఉద్యమ భవిష్యత్తును గూర్చి చెప్పి ఈ ఉద్యమాన్ని కాపాడుకోవాలన్నా ఈ పోరాటాన్ని కొనసాగించాలన్నా వలంటీర్ల అవసరం వుంటుందనీ; ఈ గ్రామంలో నిర్బంధం తక్కువగా వున్నది, ఇతర గ్రామాలకు అండగా, సంఘ కార్యకలాపాలకు కేంద్రంగా వున్నది; ఈ గ్రామంనుంచి ముందు వలంటీర్లు బయలుదేరితే, తక్కిన గ్రామాలనుంచి తీసుకురావటానికి తర్వాత ప్రయత్నించవచ్చుననీ కార్యదర్శి వివరించారు.

'ఎంతమంది కావాలి ?' అని హాజరైనవారిలో ఒకరు అడిగారు. 'కనీసం 20 మంది అవసరమ'ని చెప్పాడు. ఒక యువకుడు 'ఎవరెవరు సిద్ధంగా వున్నారో చేతులెత్తమ'ని చెపితే 60మందిదాకా చేతులెత్తారు. వారంతా వలంటీర్లుగా వుంటామని ముందుకొచ్చిన యువకులు. అప్పటికప్పుడు నిర్ణయం తీసుకొని ఈ 60 మంది వలంటీర్లుగా పాలకుర్తి వెళతారని ప్రకటించాడు కార్యదర్శి. భయగ్రస్తులైన పాలకుర్తి ప్రజలు వెంటనే వలంటీర్లకు భోజన సదుపాయాలు చేయలేరని, 60 మందికి కావలసిన బియ్యం, ఉప్పు, పప్పులు, చింతపండు మొదలగునవి తయారుచేసి పంపాలని సూచించగా, గ్రామ కమిటీవారు దానికంగీకరించి అప్పటికప్పుడే ఏర్పాట్లుచేశారు. ఇళ్ళలో బియ్యం నిలువవుండని కారణాన వడ్లను పోసి దంచటం మొదలుపెట్టారు. పప్పులూ తయారుచేశారు. బళ్ళను సిద్ధం చేశారు. ఆ రాత్రి ఊరంతా కోలాహలంగా ఉంది.

చేతి కర్రలకు కొన్ని పరిమితులుంటాయి. పశువులను కొట్టడానికే గాని, గూండాలను ఎదిరించటానికి అవి ఉపయోగపడవు. ఈ పనికోసం క్రొత్త రకం కర్రలు కావలసి వుంటుందని వలంటీర్లు నిర్ణయించుకున్నారు. చేతిలో పట్టుకోటానికి తగినంత లావు, నిలువెత్తు పొడవు ఉండాలనీ, కర్రతో ఒక దెబ్బ వేస్తే గూండాలు లేవకుండా పడాలనీ వారి అభిప్రాయం. గ్రామం అడవి ప్రాంతంలో లేదు. చుట్టూ పొదలున్న ప్రాంతం కాదు. చుట్టుపట్ల గ్రామాల్లో కూడా అలాంటి సౌకర్యాలు లేవు. కాని పెద్ద తుమ్మచెట్లు మాత్రం గ్రామం చుట్టూ మెట్టచేలల్లో, బీళ్ళలో ఉన్నాయి. వలంటీర్లుగా చేరిన యువకులు తమ ఇష్టంవచ్చిన చెట్ల దగ్గరకు వెళ్ళి గొడ్డళ్ళతోకొట్టి కర్రలను కాల్చి, వాటిమీది తోలుతీసేసి గట్టిపరచి తమకు తగిన సైజులో కర్రలను తయారుచేసుకున్నారు. ఇలాంటి కర్రలను 'గుతుప' అంటారు. వలంటీర్లందరూ ఎవరి 'గుతుప'లు వారు తీసుకొని తయారైన సామానును రెండుబళ్ళలో వేసుకొని పాలకుర్తికి బయలుదేరి క్రమశిక్షణతో నడుస్తూ వెళ్ళారు. వలంటీర్లలో మధ్యతరగతి, పేదరైతు, వ్యవసాయకూలీ యువకులే హెచ్చుగా వున్నారు. వారివెంట కార్యదర్శి ఉన్నారు. ఆయన వారికి రాజకీయాలు చెప్పితే ఎంతో ఉత్సాహం, ఆసక్తితో విన్నారు. తమకొచ్చిన పాటలు పాడుతూ దారిలో వున్న 3—4 గ్రామాల్లో ప్రదర్శన చేస్తూ ఎంతో పట్టుదలతో పాలకుర్తి చేరుకున్నారు. అప్పటికి మధ్యాహ్నం 11 గంటలయింది. ఎండకూడా తీవ్రంగానే వుంది. ఆ సమయంలో భోజనం ఏర్పాట్లకోసం ముందు అయిలమ్మ ఇంటికి

వెళ్ళి మాట్లాడారు. ఆ కుటుంబంలోని వారంతా భయపడుతూ ఉండటంతో వారిపై భోజనాల బాధ్యతను పెట్టకూడదని ఇతర రైతులు ముందుకువచ్చి దీనికోసం పూనుకుంటారేమోనని తెలుసుకోటానికి ప్రయత్నించారు. ఈలోగా వలంటీర్లు పాలకుర్తిలోని ప్రధాన రహదారిగుండా "లెఫ్ట్‌రైట్" అంటూ ఒకటిరెండు వరుసల పెరేడ్ చేశారు. దానికి కడివెండి యువకుడు మోహన్‌రెడ్డి నాయకత్వం వహించాడు. ఆ సమయంలో ఇళ్ళలో వున్నవారు ముందు బయటకు రావటానికే భయపడినా క్రమంగా గుమ్మంలోకి (మొత్తలోకి) వచ్చి తొంగిచూసి వెళ్ళిపోతున్నారు. కానీ ఎవ్వరూ రమ్మనలేదు; మాట్లాడలేదు. కార్యదర్శికి అయిలమ్మతో మాత్రమేగాక గ్రామంలోని రైతుకూలీలు కూడా పరిచయమే. ఆయన ఎవరింటికి వెళ్ళినా ఆ ఇంటివారు మాట్లాడటానికే భయపడుతున్నారు. గ్రామంలో ఎక్కడో ఒకచోట మకాంచేసి భోజనాలకు ఏర్పాటుచేస్తే ప్రజలు మరింత భయపడిపోవచ్చును. ఎందుకైనా మంచిదని పక్కనేవున్న బమ్మెర అను గ్రామానికి వలంటీర్లతో సహా వెళ్ళటానికి నిర్ణయించారు.

బమ్మెర గ్రామ రైతులు సంఘానికి అనుకూలురు. మక్తాదారు ఇంతకు ముందే ఆరుట్ల లక్ష్మీనరసింహారెడ్డికి సహాయపడినాడు. ముందే కబురుచేస్తే అక్కడి రైతుపెద్దలూ, ఆ మక్తాదారూ ఆలోచించి కావాల్సిన ఏర్పాట్లు చేశారు. వలంటీర్లు ఆ గ్రామానికివెళ్ళేవరకు సుమారు 2 గంటలయింది. భోజనాలతోపాటు అందరికీ బసఏర్పాట్లు చేశారు. రైతులతో మాట్లాడితే 'ఎన్నిరోజులైనా వుండి మీ పనులు చేసుకోవచ్చ'ని, 'పాలకుర్తిలోనైనాగానీ, ఇతర గ్రామాల్లోనయినా మీ పనులకు కావలసిన సహాయం చేస్తామ'ని వారు వాగ్దానం చేశారు. దీనితో వలంటీర్లు తమ పనులు సాగించటానికి కేంద్రమొకటి ఏర్పడిందని సంతృప్తిపడి పాలకుర్తిలో చేయవలసిన పనులేమిటి అని ఆలోచిస్తున్న సమయంలో అక్కడి నుంచి నలుగురైదుగురు రైతులువచ్చి, "మీరు ఇంతమందిని దూరంనుంచి తీసుకు వచ్చినప్పటికీ మేము భయపడి మిమ్మలను ఆట్టిపెట్టుకోకుండా పంపించాము ఇది పొరపాటు. మీరంతా మా గ్రామానికి వస్తే ఎప్పటిమాదిరిగానే ఏర్పాట్లుచేస్తాం" అని చెప్పారు. రెండు గంటల వ్యవధిలోనే కబురు పంపించారంటే — ప్రజలు త్వరలోనే భయాన్ని పోగొట్టుకున్నారన్నమాట. కార్యదర్శి బమ్మెర రైతులతో అవసరమైనప్పుడు మళ్ళీ వారి సహాయం తీసుకుంటామని చెప్పి తిరిగి వలంటీర్లతో పాలకుర్తి చేరుకున్నారు. వెంటనే సంఘం పాటలు పాడుతూ గ్రామ వీధుల్లో

రెండుమూడుసార్లు పెరేడ్ చేశారు. అయిలమ్మ ఇంట్లో నివాసానికీ భోజనానికీ ఏర్పాట్లు చేశారు. ఆ ఇంట్లో తూర్పిల్లూ, పడమటిల్లూ అని భాగాలుండేవి. వాటిలో ఒకభాగాన్ని ఈ వలంటీర్లకు అప్పజెప్పిందామె. వలంటీర్లు ఇతర రైతుల ఇళ్ళను కూడా ప్రయోగిస్తూ తమ కార్యకలాపాలు సాగించారు. సుమారు 60 మంది వరకూ వున్న వలంటీర్లనూ, ప్రతిరోజూ వారు జరిపే పెరేడ్‌నూ చూచి విసునూరు గూండాలు పరారైనారు. వలంటీర్లు, నాయకులు గ్రామస్తులను కలిసి ధైర్యం చెప్పటంతో వారంతా సాక్ష్యం ఇవ్వటానికి ముందుకొచ్చారు. ఇంతలో యస్. పి. వచ్చి సాక్షులని తీసుకురమ్మని కబురుచేస్తే సాక్షులు సిద్ధంగావున్నారని ఇటు వైపు నుంచి కబురుపంపారు. ఒక్కొక్క సాక్షిని పిలిచి విచారణచేస్తే జంకు గొంకు లేక విసునూరు దేశముఖు గూండాలు, పోలీసులు చేసిన దుర్మార్గాల గురించి సాక్ష్యం చెప్పారు. ఒక్కరుకూడా కాదని చెప్పలేదు. నాలుగైదురోజులు విచారణ జరిపి మధ్యలో అకస్మాత్తుగా విచారణను ఆపివేసి ఎస్.పి. పాలకుర్తిని వదిలివెళ్ళిపోయాడు. సాక్ష్యాలు పోలీసులకు దేశముఖుకు అనుకూలంగా లేక పోవటం వలన నిస్సహాయుడై కోపంతో వెళ్ళిపోయాడని అనుకున్నారు అక్కడున్నవారు. కానీ అది వాస్తవంకాదని, ఆకునూరు అను గ్రామంలో ప్రభుత్వం నిర్బంధంగా ధాన్యం వసూలుచేస్తున్నప్పుడు అధికారులకు, పోలీసు లకు వ్యతిరేకంగా ప్రజలు తిరగబడ్డారని కబురురావటంతో వెళ్ళిపోయాడని తర్వాత తెలిసింది. అప్పటికి ఆకునూరు దురంతాలు ఎవరికీ తెలియవు.

ఎస్. పి. వెళ్ళగానే సి. ఐ. వలంటీర్లున్న చోటుకి (అయిలమ్మ ఇంటికి) వచ్చి బెదిరించడానికి ప్రయత్నించాడు. కాని వారు బెదరలేదు. 'అక్కడ వుండ టానికి వీలులేదు. ఎవరి గ్రామాలకు వారు వెళ్ళిపోవాలన్నా'డు. 'వెళ్ళిపోయేది లేదు. ఏంచేసుకుంటావో చేసుకో పొమ్మ'ని చెప్పారు. మళ్ళీ సి.ఐ. పోలీసులతో వచ్చి ఆయుధాలున్నాయి. సోదా చేస్తామని అన్నాడు. ఈ ఇంటిని సోదా చేయ టానికి వీల్లేదనీ, వెళ్ళిపొమ్మనీ, సోదాచేస్తే మర్యాద దక్కదనీ హెచ్చరించేసరికి అంతా వెళ్ళిపోయారు.

**వలంటీరుదళ నిర్మాణ విస్తరణ :** పోలీసు విచారణ మధ్యంతరంగా ఆగి పోయింది. పోలీసులు తాత్కాలికంగా వెనుకపట్టు పట్టారు. ఒకవైపున ప్రజల్లో మనోనిబ్బరం హెచ్చింది. రెండోవైపున వలంటీర్లను చూచి గుండాలు భయపడు తున్నారు. పోలీసులు గూండాలకు తోడ్పడటానికి ముందుకు రావటంలేదు. ఈ

అవకాశాన్ని, అనుభవాన్ని దృష్టిలో వుంచుకొని విసునూరు ప్రాంతపు 40 గ్రామాల్లో వలంటీరు దళాలని నిర్మించాలని నిర్ణయించింది జిల్లా కమిటీ. 15-20 మందిని పాలకుర్తిలో అట్టిపెట్టి తక్కినవారిని పక్క గ్రామాలకు పంపి వలంటీర్లను ఆర్గనైజు చేశారు. అలాంటి గ్రామాల్లో కడివెండి ఒకటి. అక్కడ 20నుంచి, 30 మందితో వలంటీరుదళమేర్పడింది. వారికార్యక్రమం 1) ప్రతిరోజూ సాయంత్రం ఊరేగింపు చేయాలి. 2) సంఘం పాటలు పాడాలి. 3) దౌర్జన్యాలకు వ్యతిరేకంగా నినాదాలు ఇవ్వాలి. వలంటీర్లకు గుతుపలుండాలి. గూండాలు కనపడకుండా పోయేసరికి అప్పటికప్పుడు వారిని ఎదిరించే సమస్యరాలేదు. కానీ ఎప్పుడైనా దాడిచేయవచ్చు ననీ, దాడులను తిప్పికొట్టడానికి సిద్ధంగా వుండాలని వలంటీర్లకు పార్టీ కార్యక్రమ మిచ్చింది.

ప్రతి గ్రామంలో వలంటీరుదళాల నిర్మాణం ప్రారంభమయింది. దేవరుప్పుల నుంచి వచ్చిన వలంటీర్లలో మిగిలినవారు తిరిగి స్వగ్రామానికి వెళ్ళి వారే గ్రామ వలంటీరు దళంగా ఏర్పడినారు. వారిలో కొందరు పక్క గ్రామాలకువెళ్ళి వలంటీర్లను తయారుచేశారు. క్రమంగా కొద్దిరోజుల్లోనే అన్ని గ్రామాల్లో వలంటీరు దళాలు ఏర్పడ్డాయి.

ఈ అనుభవాలను వుపయోగించుకొని ఇతర తాలూకాలలో కూడా ఇలాంటి ఏర్పాట్లే చేయాలని జిల్లాపార్టీ నిర్ణయించింది. సూర్యాపేట, నల్లగొండ, హుజూరు నగర్ తాలూకాల్లో దీనికోసం కార్యక్రమాన్ని రూపొందించింది. నల్లగొండ తాలూకాలో అంతంతమాత్రంగానే అమలుజరిగిందీ కార్యక్రమం. జనగామ, సూర్యాపేట, హుజూరునగర్ తాలూకాల్లో పెద్దఎత్తున ఈ కార్యక్రమం అమలు జరిగింది. అన్ని గ్రామాల్లో వలంటీరు దళాల నేర్పాటు చేయటం, నిర్బంధ విధానా నికి వ్యతిరేకంగా ఊరేగింపులు తీయటం కార్యక్రమంలోని ముఖ్యాంశాలు.

## 2. ఆకునూరు, మాచిరెడ్డిపల్లి సంఘటనలు

**పోలీసులతో ఆకునూరు ప్రజల ప్రతిఘటన-స్త్రీల మూకుమ్మడి మానభంగాలు :** ఈ కార్యక్రమం ప్రారంభం కాకముందే ఎస్.పి. పాలకుర్తి వదిలివెళ్ళిన సమయంలో జనగాంతాలూకాలోని ఆకునూరు గ్రామంలో తిరుగుబాటు

జరిగింపనీ పోలీసులు ఎన్నో దురాగతాలు చేశారనీ, స్త్రీలను చెరిచారనీ వార్త పిల్లాకమిటీకి చేరింది. విసునూరు రామచంద్రారెడ్డి రాజ్యం ఏలుతున్న ప్రాంతం అది. ఆరోజుల్లో ఆ ప్రాంతాన్ని పడమటి జనగామ అనేవారు. ఈ ప్రాంతం కాజీపేట-హైదరాబాదు రైల్వేలైనుకు పడమట ఉంటుంది. గ్రామంలో పోలీసుక్యాంపు ఉన్నదనీ, గ్రామానికి ఎవ్వరినీ రానివ్వటంలేదనీ, వచ్చినవారిని పట్టుకొని జైల్లోవేస్తున్నారనీ, పోలీసు నిర్బంధం తీవ్రంగా వున్నదనీ తెలిసింది. సంఘటనకు సంబంధించిన వివరాలు తెలుసుకోవాలంటే, ఇవన్నీ ఆటంకంగా వున్నాయి. పోలీసు దురాగతాల వివరాలు ఎలాగైనా తెలుసుకోవాలనీ, వదిలి పెట్టవద్దనీ, తెలుసుకున్న తర్వాత ఏమైనా చర్య తీసుకోవాలనే పట్టుదలతో జనగామకు అందుబాటులోవున్న కార్యకర్తల సమావేశంఏర్పాటుచేసి ఆలోచించింది పార్టీ. ఆకునూరు వెళ్ళి సమాచారం తీసుకువచ్చే మార్గాన్ని గురించి చర్చిస్తున్న సమయంలో ఆకునూరు గ్రామస్తులతో బంధుత్వంవున్న ఒక కార్యకర్త ఆపని చేస్తానని ముందుకవచ్చాడు. అతడు సంపన్న కుటుంబానికి చెందినవాడే. అయినా ఉత్సాహవంతుడు, నిజాయితీపరుడు. అతనిపేరు ధర్మయ్య. అతనికి ఆగ్రామంలో బంధువులున్నారు. బంధువుల ఇంట్లో మకాంవేసి వివరాలన్నీ సేక రించుకొని వస్తానంటే, అతనికి వివరమైన ప్లానుఇచ్చారు. ఆ బంధువుల సహ కారంతో ఒక్కొక్కరిని కలిసి పరిచయంచేసుకొని వివరాలు సేకరించుకొని రావాలని సూచనలిచ్చి అతనిని పంపించారు. అతడువెళ్ళి సుమారు ఒక 20 రోజులు మకాంవేసి రహస్యంగా వారిలో ప్రచారంచేసి స్టేటుమెంట్లు ఇవ్వటానికి అతికష్టంగా వారి ఆమోదాన్ని సంపాదించాడు. వివరాలనుకూడా తీసుకువచ్చాడు. సంఘటన వివరాలు స్థూలంగా ఈవిధంగా వున్నాయి.

ఆకునూరు గ్రామంలో అన్నదమ్ములిద్దరుండేవారు. అన్న పోలీసు పటేలు, దుర్మార్గుడు. పై అధికారులను ఆశ్రయించి గ్రామప్రజలపై దౌర్జన్యాలు చేసేవాడు. లంచాలు తీసుకునేవాడు. అతని తమ్ముడు సీతల్‌సింగు. ఇతడు అన్నను వ్యతిరేకించేవాడు. ప్రజలతో సన్నిహితంగా ఉండేవాడు.

అన్ని గ్రామాల మాదిరిగానే ఆకునూరులో లెవీధాన్యం వసూలు చేస్తు న్నారు. రైతులనుంచి అక్రమంగా వసూలుచేసే ధాన్యం ఎంతో వుండేది. పోలీసు పటేలు సాగిస్తున్న అక్రమాలకు నిరసనగా రైతులంతా ధాన్యం ఇవ్వ నిరాకరించారు. దానితో అతను తనకుతాను చేసేదేమీ లేక పోలీసు ఎస్.ఐ.

(అమీను)ను రెవిన్యూ ఇన్‌స్పెక్టరును (గిర్దావర్), కొంతమంది పోలీసు కానిస్టేబుళ్ళను తీసుకువచ్చి ప్రజలను భయపెట్టించాడు. ఎస్.ఐ. కచ్చడాన్ని కట్టుకొని అట్టహాసంగా వచ్చాడు. రైతులు వారి బెదిరింపులకు లొంగక ధాన్యాన్ని ఇవ్వ నిరాకరించారు. అప్పుడు పోలీసు, రెవిన్యూ ఉద్యోగులు రైతులను కొట్టి, దౌర్జన్యంతో వసూలు చేయప్రారంభించేసరికి వారుకూడా తిరగబడినారు. ఈ తిరుగుబాటు రైతులవరకే పరిమితంకాలేదు. వెట్టిపని చేసేవారు, వ్యవసాయ కూలీలు, ఇతర వృత్తులవారు రైతులతో భుజంభుజం కలిపి తిరుగుబాటులో పాల్గొన్నారు. సబ్ ఇన్‌స్పెక్టరునూ, రెవిన్యూ ఇన్‌స్పెక్టరును, పోలీసు కానిస్టేబుళ్ళనూ చేతికర్రలతో తిరిగి దెబ్బలుకొట్టారు. అంతటితో ఆగక తమపై పోలీసులు సాగించే నిర్బంధాలన్నీ తిరిగి వారిపై సాగించారు. రైతులు, వెట్టి పనివారు కచ్చడంమీద కూర్చుని ఎస్ఐనీ, రెవిన్యూ ఇన్‌స్పెక్టరును, కానిస్టేబుళ్ళను కచ్చడంముందు పరుగెత్తించారు. సాధారణంగా వెట్టిచేసేవారిని దేశముఖులు, పోలీసులు తమ కచ్చరాలముందు పరుగెత్తిస్తూ వుంటారు. కచ్చడం ఎంతవేగంగా పరుగెత్తితే వారు అంతవేగంగా పరుగెత్తాలి. అదేవిధంగా ఎస్ఐనీ, పోలీసులనూ కచ్చడంముందు పరుగెత్తించారు. వారితో బరువులు మోయించారు. తమను ఏవిధంగా హింసించేవారో అదేవిధంగా ఆపద్ధతులతోనే వారినికూడా హింసించారు. దాహం వేస్తున్నదని మంచినీళ్లు అడిగేసరికి ముంతల్లో మూత్రంపోసి తాగమని నిర్బంధించారు. ఇంకా ఎన్నోవిధాల నిర్బంధించారు. విసునూరు పోలీసు స్టేషనులో పోలీసులు పార్టీ, ఆంధ్రమహాసభ కార్యకర్తలను ఏఏవిధంగా హింసించారో ఆవిధంగానే ఆకునూరు ప్రజలు పోలీసులపై పగ సాధించారు. అదనంగా తమపైసాగే దౌర్జన్యాలను తిరిగి వారిపై ప్రయోగించారు. తర్వాత వారిని వదిలివేశారు.

ఈ వివరాలు ఎస్.పి. కి తెలియగానే ఆయన రిజర్వుపోలీసును పంపించి గ్రామ ప్రజలపై దౌర్జన్యాలను చేయించాడు. పోలీసులు ఇళ్ళను లూటీ చేశారు. కనపడ్డ వారినల్లా దెబ్బలు కొట్టారు. పూరిండ్లను లాగేశారు. కోళ్ళను, గొర్రెలను, మేకలను కోసుకుతిన్నారు. స్త్రీలను చెరిచారు. వీరిలో ధనిక రైతుస్త్రీలు, మధ్య తరగతి, పేద, వ్యవసాయ కూలీ స్త్రీలున్నారు. భర్తలను ఇంటి ముందు వుండే పందిరి గుంజలకుకట్టేసి వారిముందే భార్యలను, తల్లిదండ్రుల ముందు వారి బిడ్డలను చెరిచారు. అమానుషమైనటువంటి పనులెన్నో చేశారు. మొత్తం 76 లేక

77 మంది స్త్రీలను చెరిచినట్టు రిపోర్టు. కార్యకర్త ప్రయత్నం వలన 36 మంది స్త్రీలు జరిగిన దుస్సంఘటన వివరాలు చెప్పటానికి తయారయ్యారు. వారిలో అత్యధిక భాగం వ్యవసాయ కూలీ, పేదరైతు స్త్రీలే. తమ పేరు, తమ భర్తల పేర్లూ కూడా చెప్పినారు. ఇలాంటివి చెప్పుకుంటే మళ్ళీ ఆపద వస్తుందేమోనని ముందు చెప్పటానికి భయపడ్డారు. తమకు ఏ విధమైన సామాజిక అన్యాయమూ జరుగకుండా చూస్తామని హామీ ఇచ్చిన తర్వాత పేద కుటుంబాల స్త్రీలు వాస్తవాలు చెప్పటానికి ముందుకు వచ్చారు. ధనిక రైతు కుటుంబాల స్త్రీలు చెప్పటానికి ధైర్యం చేయలేదు. ఏమీ జరుగనట్టే చూపెట్టి సర్దుకోటానికి ప్రయత్నించారు.

కార్యకర్త సుమారు 20 రోజులు అక్కడ మకాంవేసి, పేర్లూ, వివరాలూ గల రిపోర్టు తెచ్చాడు.

**మాచిరెడ్డిపల్లి దురంతాలు-స్త్రీల ప్రతిఘటన :** దాదాపు ఇదే సమయంలో మాచిరెడ్డిపల్లిలో కూడా రైతులు ధాన్యసేకరణ సమస్యపై ప్రభుత్వానికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేశారు. తిరుగుబాటులో పాల్గొన్నది స్త్రీలే కావటంతో దీనికి ప్రత్యేక ప్రాధాన్యత వుంది. మాచిరెడ్డిపల్లి కర్ణాటక ప్రాంతమైన గుల్బర్గా జిల్లా సరిహద్దున వున్న ఒక తెలుగు ప్రజల గ్రామం. ఆ గ్రామంలో లెవీ ధాన్యాన్ని వసూలు చేయటానికి ముందు అధికారులు—తహశీల్దారు, రెవిన్యూ ఇన్‌స్పెక్టరు మంది మార్బలంతో వెళ్ళారు. అయినా రైతులు న్యాయమైన ధర రావటంలేదనీ, ప్రభుత్వం ధాన్యం తీసుకొని తమకు డబ్బు ఇవ్వటంలేదనీ ఆ కారణాన ధాన్యం ఇవ్వటానికి నిరాకరించారు. దానితో రెవిన్యూ అధికారులు పోలీసులను తీసుకొచ్చి నిర్బంధించి వసూలు చేయటానికి పూనుకున్నారు. పోలీసులను చూచి మగవారంతా పరుగెత్తారు. ఆడవారు ఇళ్ళలోనే వున్నారు. ఇంట్లో ప్రవేశించడానికి ప్రయత్నించిన పోలీసులను, రెవిన్యూ ఉద్యోగులను తమకు అందుబాటులో వున్న రోకలిబండలు (ఒన్న రోకళ్ళు) చీపుర్లతో కొట్టారు. కళ్ళల్లో కారంచల్లి ధాన్యంపై చేయివేయకుండా చేశారు. ఎలాగైతేనేమి, తమ ధాన్యాన్ని వారి చేతుల్లో పడకుండా కాపాడుకున్నారు. పోలీసు వాళ్ళనూ, రెవిన్యూ వుద్యోగులనూ చితక్కొట్టి పంపించేశారు మాచిరెడ్డిపల్లి ఆడవారు. దానితో గంగవెర్రులెత్తిన రెవిన్యూ పోలీసులు ప్రత్యేక సాయుధ పోలీసులను తెచ్చి గ్రామం మీద పడి ప్రజలను దెబ్బలుకొట్టి, ఇళ్ళను లూటీ చేసి, ఆడవాళ్ళను చెరిచి భీభత్సం చేశారు. దీనితో స్త్రీలూ, పిల్లలూ గ్రామం వదిలి వెళ్ళారు. కట్టివేసిన పశువులను వదిలేవారు

కాదు. వాటికి మేతలేదు. నీళ్ళులేవు. దీని ఫలితంగా మాచిరెడ్డిపల్లి పాడుపడిన గ్రామంలాగా తయారైంది. ఆలస్యంగా వార్తచేరినా ఒకవ్యక్తిని పంపి వివరాలన్నీ తెలుసుకున్నారు. ఆయన వెళ్ళే వరకు కూడా గ్రామం స్మశాన వాటిక మాదిరే ఉండినది.

## 3. ప్రచార కార్యక్రమం

ఈ వార్తలను వెంటనే ప్రకటించాలా లేదా అనే ప్రశ్న తలెత్తింది. ముందు పార్టీ పత్రిక (ప్రజాశక్తి) లో ప్రకటిస్తే మిగతా పత్రికల వారు ప్రకటించక పోవచ్చునని హైదరాబాదు పత్రికల వారితో సంప్రదిస్తే వారు భయపడి ప్రకటించమన్నారు. దానిలో మితవాద నాయకుల పత్రికలు కూడా వున్నవి. మందుముల నర్సింగరావు పత్రిక 'రయ్యత్' వాటిలో ఒకటి. ఆ పరిస్థితిలో "ప్రజాశక్తి" పత్రిక ఈ వార్తలను ప్రకటించింది. అదే సమయంలో మానభంగానికి గురిఅయిన స్త్రీల పేర్లతో సహా సంఘటనల వివరాలను ఒక కరపత్రంలో ప్రకటించాలని కూడా పార్టీ నిర్ణయించింది.

ఈ రెండు సంఘటనల వివరాలతో రావినారాయణరెడ్డి బొంబాయి వెళ్ళి, పార్టీ కేంద్ర కార్యాలయం సాయంతో పెద్ద దినపత్రికల్లో (ఇంగ్లీషు) ఈ వార్తను ప్రచురించటానికి ప్రయత్నించారు. ఫ్రీ ప్రెస్ జర్నల్ సంపాదకుడు శ్రీ సదానంద జాతీయవాది. ఆ కాలంలో ముఖ్యమైన దినపత్రికలన్నిటినీ నిజాం ప్రభుత్వం డబ్బిచ్చి కొనివేసింది. ఏ పత్రిక అయినా నిజాం ప్రభుత్వానికి వ్యతిరేకంగా రాస్తే ఆ పత్రికకు వచ్చే డబ్బు ఆగిపోయేది. పత్రిక సంస్థానంలోకి రాకుండా నిషేధాజ్ఞలు జారీ అయ్యేవి. ఫ్రీ ప్రెస్ జర్నల్ ఇలాంటి వాటికి భయపడేది కాదని ఆ రోజుల్లో ప్రతీతి. రావినారాయణరెడ్డి పార్టీ తరఫున వెళ్ళి ఆయనతో మాట్లాడినాడు. ఆయన ఈ వార్తలను వేసుకోటానికి అంగీకరించి ఒక విలేకరిని (reporterను) పార్టీ కేంద్ర కార్యాలయానికి పంపించాడు. వివరాలన్నీ సేకరించి తమ పత్రికలో దాదాపు పూర్తిపేజీలో వార్తలను ప్రకటించారు. దీనిని గాంధీగారు చూచి వార్తను గూర్చి వివరాలు తెలుసుకొని రిపోర్టుచేయమని పద్మజా నాయుడికి రాశారు. ఆమె సరోజినీదేవి కూతురు. హైదరాబాదులో వుండేవారు. ఆమె ఇటూ అటూ ఆదరాబాదరాగా తిరిగింది. ఈ వార్తలు చెప్పే

వారెవరూ కనిపించలేదు. ఆకునూరు వెళ్ళొచ్చింది. ఎవ్వరూ మాట్లాడలేదు. మాచిరెడ్డిపల్లి వెళితే అక్కడకూడా ఎవరూ చెప్పటానికి సిద్ధపడలేదు. దిక్కుతోచని స్థితిలో ఆమె ఆంధ్రమహాసభ నాయకులదగ్గరికి వచ్చింది. తాను వెడితే ఎవరూ నమ్మటం లేదనీ, తనకేమీ చెప్పటం లేదనీ, గాంధీగారు రిపోర్టు పంపమన్నారనీ చెపుతూ తనకు సాయంచేయమని కోరింది. సరేనని ఆ గ్రామం వెళ్ళిన కార్యకర్తనే పంపి ఆమె విచారణకు ఏర్పాట్లు చేశారు. విచారణ చేసేది పద్మజానాయుడు అయినందున రహస్యంగా వెళ్ళవలసిన అవసరం కలుగలేదు. అంతా బహిరంగంగా జరిగిపోయింది.

ముందు స్త్రీలు ఏమీ చెప్పలేదు. వారిలో ధైర్యం కలిగించటానికి ప్రయత్నించింది. అప్పటికీ వారు చెప్పలేదు. మళ్ళీ తమకు ఏ ముప్పు వాటిల్లునో అని భయపడినారు. "నేనూ ఒక స్త్రీనే మీ బాధలను నేను అర్థం చేసుకోగలుగుతాను. మీ ప్రాణానికి నా ప్రాణం అడ్డుపెడతాను. వాస్తవమేమిటో చెప్పండి" అని ఆమె ప్రాధేయపడ్డది. వారు ఒకసారి గొల్లున ఏడ్చి, ధైర్యం తెచ్చుకొని వివరాలన్నీ చెప్పారు. ముప్పయి ఆరు మంది స్త్రీలూ జరిగిన దురాగతాలను చెపుతూ వుంటే ఆమె కూడా భరించలేక బాగా ఏడ్చిందని ఒకవార్త. వారికి తెలిసిన కార్యకర్త వెంటవుండి అభయమిచ్చినందుననే ఆయనమీది విశ్వాసంతో స్త్రీలు మానభంగాల వివరాలు చెప్పారు.

వివరాలన్నిటినీ సేకరించి గాంధీగారికి రిపోర్టు చేసింది. గాంధీగారు అప్పటి నిజాం నవాబు ప్రధానమంత్రి అక్బరు హైదరీకి రాస్తే న్యాయవిచారణకై హైకోర్టు జడ్జీని ఏర్పాటు చేశారు. విచారణ జరిగింది. స్త్రీలు హైకోర్టుకు వచ్చి తమ వాంగ్మూలాలిచ్చారు. ఈ వాంగ్మూలాలు హైదరాబాదులోని విద్యావంతులైన స్త్రీలలో ఎంతో సంచలనం కలిగించాయి. హైదరాబాదులోనే గాక సంస్థానమంతటా, ఆంధ్రదేశంలోనూ గొప్ప సంచలనం కలుగజేసింది. కమ్యూనిస్టు పార్టీ "**ఆకునూరు, మాచిరెడ్డిపల్లి దురంతాలు**" అనే ఒక చిన్న పుస్తకాన్ని ప్రకటించి పెద్ద ఎత్తున ప్రచారం చేసింది (ఈ పుస్తకాన్ని రాసింది దేవులపల్లి వెంకటేశ్వరరావు). ఆంధ్రదేశమంతటా బహిరంగ సభల ద్వారా ఈ దురంతాలను ప్రచారం చేసింది. బి. స్వరాజ్యం అను మహిళా కార్యకర్త[81] బహిరంగ సభలలో మాట్లాడింది. ఇతరులు కూడా మాట్లాడేవారు. ఆకునూరు, మాచిరెడ్డిపల్లి దురంతాలను ఖండిస్తూ అంతటా

తీర్మానాలు చేశారు. ఈ ప్రచారంతోపాటు దేశముఖులు, భూస్వాములు చేసిన దురంతాలను ఎండగట్టారు.

"జనగామ ప్రజల వీరోచిత పోరాటం''అని—భూస్వాముల దోపిడీ, దురాగతాలను, వాటికి వ్యతిరేకంగా సంఘమేర్పడేనాటికి ప్రజలు జరిపిన పోరాటాన్ని తెలియజేసే పుస్తకాన్ని దేవులపల్లి వెంకటేశ్వరరావు రాశాడు. మొదటి రోజుల్లో పర్యటన సమయంలో సేకరించిన వివరాలను మరికొన్నిటితో చేర్చి ఒక పుస్తకరూపంలో ప్రజాశక్తి ప్రచురణాలయం ప్రకటించింది. దానిలో మితవాదులుచేసిన ద్రోహాన్ని, మందుముల నర్సింగరావు మొదలైనవారు ఆంధ్ర మహాసభకు చేసిన ద్రోహాన్ని బట్టబయలుచేశారు. పుస్తకంలోని వివిధభాగాలను చూస్తే దేశముఖుల, భూస్వాముల దోపిడీ స్వరూప స్వభావాన్ని యథార్థ సంఘటనలను ఉదహరిస్తూ, ఎవరెవరు ఏవిధంగా బాధపడ్డారో పేర్లతోసహా వివరించాడు. విసునూరుప్రాంతంలోని ఫ్యూడల్ దురాగతాలకు వ్యతిరేకంగాజరిగిన పోరాటాలను, అవి ఏమేరకు జరిగినా దానిలో వివరించారు. వాస్తవానికి బందగీ చేసినపోరాటమే దానిలో ముఖ్యమైనది. "బందగీ సాహెబు విషాద గాథ" అన్న శీర్షికతో బందగీ వృత్తాంతాన్ని, బందగీ ఏ విధంగా పోరాడిందీ, ఏవిధంగా అతన్ని చంపేసిందీ వివరించాడు. ఇదేవిధంగా ఆంధ్రమహాసభ కార్యకర్తలు ఏ సందర్భంలో ఆ ప్రాంతానికి వెళ్ళిందీ, ఆ సంస్థను ఏ విధంగా సంఘటిత పరచిందీ, ఆ సంస్థ కార్యకలాపాలంటే ఏమిటి? అనే అంశాలను కూడా వివరించారు. మితవాదులు భూస్వాముల పక్షానచేరి ప్రభుత్వానికి ఉద్యమాన్ని అణచమని సూచనప్రాయంగా చెప్పిన విషయాలను వారి పత్రికనుంచి ఉదహరించారు. ప్రభుత్వపు అండవున్న పెద్ద భూస్వాముల దురాగతాలను ఎండగడుతూ ఒక పుస్తకాన్ని ప్రచురించటమే ధైర్య సాహసోపేతమైన చర్య అని ప్రజాతంత్రవాదులు హర్షించారు. ఆ విధంగా పార్టీ పలుకుబడి ప్రతిష్ట దానివలన పెరిగాయి. ఆ సందర్భంలోనే అంతకుపూర్వం "మీరు చిన్న భూస్వాముల వెంటపడి పోరాటం చేశారేగాని పెద్ద భూస్వాముల జోలికి వెళ్ళటానికి కూడా సాహసించరు" అని అవహేళన చేసిన మితవాదులలో ఒకరు ముందుకువచ్చి మేమలా అన్నమాట నిజమే. కానీ విసునూరు రామచంద్రారెడ్డిని ఎదిరిస్తున్నారంటే మీరు నిజమైన విప్లవకారులు, అలాంటి మిమ్మల్ని ఇంతకుముందు అపార్థం చేసుకున్నాము, అని క్షమాపణ పూర్వకంగా చెప్పుకున్నారు.

"వెట్టిచాకిరీ" అనేది చిన్నపుస్తకం. దీనిని రచించింది దేవులపల్లి వెంకటేశ్వరరావు. దానిలో వెట్టిచాకిరీ నిబంధనల సమస్యపై అప్పటివరకు ఆంధ్రమహాసభ అనుసరించిన వైఖరిలోని లోపాలను ఎత్తిచూపుతూ దీనిని పూర్తిగా రద్దుచేయాలనే నినాదాన్ని వివరించాడు. ప్రతిఫలం ఎంత ఇస్తున్నారనే సమస్య ప్రధానంకాదనీ, నిర్బంధంతో పనిచేయించటమే వెట్టిచాకిరీ అని, పని చేయాలా లేదా అని నిర్ణయించుకోటానికి వ్యక్తికి స్వేచ్ఛవుండాలనీ ఆపుస్తకంలో రాశాడు. ఫ్యూడల్ వ్యవస్థను రద్దుచేయటంలో ఇదొక ముఖ్యాంశం.

ఈ కాలంలోనే సుంకర సత్యనారాయణగారు విసునూరు దేశముఖు ప్రాంతంలో వున్న భూస్వామ్య దోపిడీని ఆధారంగా చేసుకొని 'మా భూమి' అనే నాటకాన్ని వ్రాశారు. దీనిని సర్కారు జిల్లాలలో పెద్ద ఎత్తున ప్రదర్శించి, ఇక్కడి భూస్వామ్యదోపిడీకి వ్యతిరేకంగా పెద్ద ఎత్తున ప్రచారం చేశారు. నిజాం ప్రభుత్వం సంస్థానంలో ఇటువంటి నాటకాల ప్రదర్శనను అనుమతించేదికాదు. ఈ కారణాన తెలంగాణాలో ఈ నాటక ప్రదర్శన సాధ్యంకాలేదు.

**జన్నారెడ్డి ప్రతాపరెడ్డికి వ్యతిరేకంగా పోరాటం :** ఆ సమయంలోనే సూర్యాపేట తాలూకాలోని జన్నారెడ్డి ప్రతాపరెడ్డికి వ్యతిరేకంగా పోరాటం ప్రారంభమైనది. ఆయన లక్షా యాభైవేల ఎకరాల భూమి కలిగిన భూస్వామ్య కుటుంబంలో ఒక సభ్యుడు. వీరి కేంద్ర స్థానం మానుకోటతాలూకాలోని కుమ్మరికుంట్ల అను గ్రామం. సూర్యాపేట తాలూకాలో వీరి స్వాధీనంలోవున్న గ్రామాలు సుమారు 20. ఇవిగాక మరికొన్ని గ్రామాలపై ఏదోరూపంలో వారి పెత్తనం సాగేది. ఆయన విసునూరు రామచంద్రారెడ్డి లాంటి దుర్మార్గుడే అయినా తనకున్న భూమిలో హెచ్చుభాగాన్ని పాలేర్లతో సాగుచేయించేవాడు. ఇది ఈయన ప్రత్యేకత. ఇంతటితో ఆగలేదు. సుమారు 800 ఎకరాల భూమిలో మామిడి బత్తాయి మొదలగు పండ్లచెట్లు వేయించి పెద్దతోటను అభివృద్ధిచేశాడు. ఈ భూమిలో కొంతభాగం ఎర్రబాడులోవున్నా సరిహద్దు గ్రామాల భూమికూడా దీనిలోవుంది. దీనిని ఒకే ఖండంగా మార్చటానికి "తన" భూమితోపాటు రైతుల భూమిని చేర్చాడు. వారికి నామమాత్రపు పరిహారాన్నిచ్చి వారి భూములను స్వాధీనం చేసుకున్నాడు. ఈ తోటద్వారా క్రమంగా కొన్ని లక్షల రూపాయల ఆదాయాన్ని సంపాదించగలిగాడు. ప్రభుత్వ వ్యవసాయశాఖ ఉచితంగానో, నామమాత్రపు పరిహారంతోనో అందించే బోరింగులువేయటంమొదలైనవసరులన్నిం

టిని వుపయోగించాడు. అదేవిధంగా అక్కడి ధనవంతులనుంచి అప్పుపేరుతో డబ్బుసేకరించి ఖర్చుపెట్టారు; మళ్ళీవారికి తిరిగి ఇవ్వలేదు. ఎర్రబాడు ప్రాంత సరిహద్దున ఉన్న గ్రామాల్లో సాగిన ఆంధ్రమహాసభ కార్యకలాపాల ప్రభావం వలని దేశముఖు "స్వాధీనం"లో వున్న గ్రామాల్లోకూడా ఆంధ్రమహాసభ కార్య కలాపాలు విస్తరించాయి.

## 4. 1946 సాయుధ ప్రతిఘటనకు రాజకీయ పూర్వరంగం

అఖిల భారత కాంగ్రెసు మితవాద నాయకత్వం రెండు నాల్కలతో వ్యవహరించి, అటు జపాను ఫాసిస్టులతోను, ఇటు బ్రిటిషు సామ్రాజ్యవాదుల తోను రాజీపడటానికి సిద్ధమైంది. బ్రిటిషు సామ్రాజ్యవాదులను విప్లవం ద్వారా పారదోలటానికి బదులుగా వారితో రాజీపడటమే ఈ నాయకత్వపు మౌలిక విధానం. ఫాసిజం ఓడిపోయినందున బ్రిటిషు సామ్రాజ్యవాదులతో రాజీపడటా నికి కాంగ్రెసు మళ్ళీ సిద్ధమైంది. దానికనుగుణ్యంగానే బ్రిటిషు వారితో రాజీ సంప్రదింపులు సాగినాయి.

హైదరాబాదు సంస్థానంలో స్టేటు కాంగ్రెసు అఖిలభారత జాతీయ కాంగ్రెసుకు మారుపేరు. దీనిపై అంతవరకూ కొనసాగుతూ వచ్చిన నిషేధాన్ని 1946 మధ్య భాగంలో తొలగించారు. దీనితో స్టేటు కాంగ్రెసు నాయకులెవరు కావాలి అనే సమస్యపై తగాదాలు చెలరేగినవి. మడికొండ సమావేశం (పోటీ ఆంధ్ర మహాసభ) నాటికి కొంత సర్దుకున్నప్పటికీ కంది మహాసభ నాటికి మళ్ళీ బయటపడినాయని ఇది వరకే చెప్పినాము.

స్టేటు కాంగ్రెసుపై నిషేధం తొలిగే నాటికి స్వామీ రామానంద తీర్థ, ఆ సంస్థ అధ్యక్షపదవికి పోటీ చేయటానికి (contestant) ముందుకు వచ్చాడు. ఆయన నిషేధింపబడిన స్టేటు కాంగ్రెసు నాయకుడు. కాని ఆ సంస్థకు ఒక రూపమే లేకుండె. స్టేటు కాంగ్రెసు వారంతా తెలంగాణాలో ఆంధ్రమహాసభలో, మరట్వాడాలో మహారాష్ట్ర పరిషత్తులో, కర్ణాటకలో కర్ణాటక పరిషత్తులో చేరినారు. స్వామీజీ తన అనుచరుల ద్వారా మహారాష్ట్ర, కర్ణాటక పరిషత్తులతో సన్నిహిత సంబంధం కలిగే ఉండేవాడు. కాని ఆంధ్రమహాసభతో ఆయనకు అలాంటి సాన్నిహిత్యం లేదు. స్టేటు కాంగ్రెసు సత్యాగ్రహంలో ఆయనకు

సహచరులైన రావినారాయణరెడ్డి ప్రభృతులు కమ్యూనిస్టు పార్టీలో చేరటం వలన తెలంగాణాలో స్టేటు కాంగ్రెసుకు అతివాదులెవరూ మిగలలేదు ఆంధ్రమహా సభలో అభిప్రాయ భేదాలు తీవ్రతరమైనప్పుడే స్టేటు కాంగ్రెసు అనుకూల వర్గం మళ్ళీ తలఎత్తి పుట్టుకొచ్చింది.

స్టేటు కాంగ్రెసు అధ్యక్ష పదవికి జరిగిన ఎన్నికలో స్వామీ రామానంద తీర్థ, బూర్గుల రామకృష్ణారావు ఉభయులు పోటీ చేశారు. స్వామీజీ 13 ఓట్లతో గెలిచాడు.[32] ఓటింగులో ఎందరు పాల్గొన్నదీ తెలియదు. బూర్గులకు మరట్వాడా, కర్ణాటక మితవాదులు ఓటు వేశారనుకున్నా, స్వామీజీని బలపరిచే మితవాదులు అక్కడ కూడా ఉండేవారు. తెలంగాణాలో స్వామీజీ బలం తక్కువ. మొత్తంగా చూస్తే 13 ఓట్లతేడా ప్రధానమైనది కాదు. ఉభయపక్షాలూ సమఉజ్జీగా వుండే వారు. పరస్పర భేదాభిప్రాయాల యెడ వారిలో ఒకరు ఈ విధంగా అభిప్రాయ పడుతున్నారు.

"స్టేటు కాంగ్రెసు యొక్క నిర్మాణం 1946 తుదిలో జరిగింది. స్వామీజీ గోవిందదాస్ షరాఫ్‌లాంటి మార్క్సిస్టుల చేతిలో వున్నాడని, అతను ఆంధ్రులకు వ్యతిరేకి అని, కమ్యూనిస్టులకు అనుకూలుడని మితవాదులు ప్రచారం చేయ సాగారు. అలాగే రంగారెడ్డి గారు, రామకృష్ణారావుగారు ప్యూడల్ అనుకూలు రని ప్రచారం స్వామీజీ వర్గం లేవదీసింది. ఆంధ్ర జాతీయపక్షం నారాయణరావు గారి కార్యదర్శకత్వంలో ఈ రెండు విమర్శలతో యేకీభవించలేక పోయింది." (కోదాటి నారాయణరావుగారి షష్టిపూర్తి సందర్భముగా వెలువడిన సంకలనం 'ఆశీస్సులు—శుభాకాంక్షలు'లో శ్రీ యం.ఎస్. రాజలింగంగారు రాసిన వ్యాసం: పేజీ-125)

స్వామీజీ ఆంధ్రులకు వ్యతిరేకికాదు. కాని తెలంగాణా ప్రజాఉద్యమంలో స్వామీజీ నిర్వహించిన పాత్ర ఏమీలేదు. ఆ కారణాన ఆయనకు ఈ ప్రాంతంలో పలుకుబడికూడా లేదు. ఆయన కమ్యూనిస్టు అభిమానికాదు. కాగా కమ్యూ నిస్టు వ్యతిరేకి. ఆయన చెప్పేది ప్రజల్లో వేళ్ళూనుకొని వున్న కమ్యూనిస్టుల యెడ మితవాదుల మాదిరిగాకాక మరో విధమైన వైఖరి అనుసరించాలనే. ఆంధ్ర జాతీయాభిమానాన్ని, కమ్యూనిస్టు వ్యతిరేకతను సొమ్ము చేసుకోడానికి మిత వాదులు లేవదీసిన నినాదాలు ఇవి. కాగా మితవాదులు భూస్వాములకు అనుకూలురు. కాని జాతీయ పక్షం వారు ఇది కాదంటారు. అప్పటి హైదరాబాదు

మంత్రివర్గంలో చేరటంలాంటి కొన్ని అంశాలపై ఏకీభవించకున్నా వారు కాంగ్రెసులో ఉండతగిన వారేనని భావించారు. ఉభయులు వేసుకున్న బ్రహ్మముడి ఇది.

రెండవ ప్రపంచ యుద్ధం పూర్తి కాగానే ప్రపంచమంతటా పెద్ద ఎత్తున ప్రజావెల్లువ వచ్చింది. యుద్ధం పూర్తికాక ముందే ఈ పరిస్థితి ఏర్పడింది. 1945, ఏప్రిల్ 28 న ఇటలీ నియంత ముసోలినీని ఉద్రిక్తులైన ప్రజలు చంపివేశారు. వివిధ దేశాల్లో ఒక్కొక్క దేశం తమ స్వాతంత్ర్యం ప్రకటించ సాగాయి. యుద్ధానంతర విప్లవవెల్లువ భారతదేశాన్ని కూడా ఆవరించింది దీనితో బ్రిటిషు సామ్రాజ్యవాదులు భయపడి బ్రిటిషు క్యాబినెట్ ఏర్పరచిన 'క్యాబినెట్ మిషన్' పేరుగల కమిటీని పంపించారు. ఆ కమిటీ కాంగ్రెసు ముస్లింలీగ్ నాయకులతో సంప్రదింపులు జరిపి ఒక అంగీకారం కుదుర్చుకున్నది. దానిలో ప్రధానంగా 1935 రాజ్యాంగంలోని మూలసూత్రాలను పునరుద్ఘాటిస్తూ కొన్ని సర్దుబాట్లు చేశారు. రాజ్యాంగ పరిషత్తును ఏర్పాటు చేయటం దీనిలో ఒకటి. సంస్థానాధీశులపై బ్రిటిషువారికున్న పరమాధికారం (Paramountcy) రద్దు కావటం రెండవది. అధికార మార్పిడితో బాటు ఈ అధికారం రద్దవుతుందని ప్రక టించారు. దీని ప్రకారం అధికార మార్పిడి తర్వాత సంస్థానాలు బ్రిటిషు ప్రభు త్వపు ఆధిపత్యం కింద ఉండవు. కొత్తగా ఏర్పడే భారత ప్రభుత్వం ఆధిప త్యంలో కూడా వుండవు. కాగా స్వతంత్రంగా వుంటాయి. భారత ప్రభుత్వానికీ, సంస్థానాలకూ వుండే సంబంధాలపై సంప్రదింపులు జరిపి పరస్పరం ఒక అంగీ కారానికి రావాలని బ్రిటిషువారు నిర్దేశించారు. కాంగ్రెసు నాయకత్వానికి ఇష్టం లేకున్నా దానినంగీకరించింది.

ఆకునూరు, మాచిరెడ్డిపల్లి ఘటనలు జరిగిన తర్వాత కొన్ని సంవత్సరాల నుంచి ప్రధాన మంత్రిగా బాధ్యతలను నిర్వహిస్తున్న చత్తారీ నవాబు ఆ పదవిని వదులుకోవలసి వచ్చింది. తర్వాత మీర్జా ఇస్మాయిల్ ప్రధానమంత్రి అయినాడు. ఆయన సమర్థుడనీ, పరిపాలనా దక్షత కలవాడనీ ప్రతీతి. బ్రిటిష్ వారు కాంగ్రెసు అంగీకారంతో అతన్ని హైదరాబాదు సంస్థానానికి ప్రధాన మంత్రిగా నియమించారు. అతను ముస్లిం కావటంతో ఇత్తెహాదులు ముస్లిమీన్‌కు అంగీకార యోగ్యంగా ఉంటాడనీ, కాంగ్రెసు అనుకూలుడనే పేరు ఉండుటతో అటు యూనియన్ ప్రభుత్వంతో, ఇటు స్థానిక కాంగ్రెసు వాదులతో రాజీపడటానికి

వుపయోగపడతాడనీ అతన్ని ప్రధానమంత్రిని చేశారు. అతని నియామకంతో అప్పుడే నిషేధం తొలగిన కాంగ్రెసు కార్యకలాపాలు పుంజుకున్నాయి. కాంగ్రెసు వారు మీర్జా ఇస్మాయిల్‌ను తమ ప్రధాన మంత్రి అన్నట్టుగా చెప్పుకొని మురుస్తూ తమ కార్యకలాపాలు సాగించేవారు. కొమరయ్య అమరత్వానికి, 1946 లో జిల్లావ్యాపితంగా వృద్ధి పొందిన సాయుధ ప్రతిఘటనకు పూర్వరంగం ఇదే.

## 5. కొమరయ్య అమరత్వం : సాయుధ ప్రతిఘటన ప్రారంభం

ఆకునూరు, మాచిరెడ్డిపల్లి రైతాంగపు తిరుగుబాట్లు మన దేశంలో వచ్చిన యుద్ధానంతర విప్లవ వెల్లువలో ఒక భాగమే. అదేవిధంగా నల్లగొండ జిల్లాకమిటీ వలంటీరు దళాలను నిర్మించి వుద్యమాన్ని పునర్నిర్మించటానికి, విస్తరించటానికి సాయుధ ప్రతిఘటన సాగించటానికి చేసిన ప్రయత్నంకూడా ఈ సమయంలోనే.

జనగామ పోరాట ప్రారంభంలోనే (1944) నల్లగొండ జిల్లా కమిటీ వలంటీరు దళనిర్మాణానికి నిర్ణయించిందని ముందే చెప్పాం. కానీ అప్పుడున్న నిర్బంధ వాతావరణం, ప్రజల్లో వచ్చిన నిరుత్సాహం ఫలితంగా ఆ నిర్ణయం అప్పుడు అమల్లోకి రాలేదు. రైతు, కూలీయువకులపై తల్లిదండ్రుల ఇతర కుటుంబ సభ్యుల ప్రభావం చాలా వుండేది. ఇష్టమున్నా పెద్దలను కాదని వారు వలంటీరు దళాల్లో చేరలేకపోయారు. కార్యకర్తలుగా పనిచేయాలని వారు ఆలోచించే స్థితిలో లేరు. అంతా "సంఘం" చేసిపెడుతుందని వారి అభిప్రాయం. అన్నిటికీ, నాయకుడైన ఆరుట్ల రామచంద్రారెడ్డికోసం నిరీక్షించేవారు. ఈ పరిస్థితి 3-4 నెలలవరకు కొనసాగింది. ఆయన అరెస్టు అయిన తర్వాత పార్టీ నిర్మాణ కృషి ప్రారంభమైంది. సుమారు ఒక సంవత్సరానికి ఈ కృషి ఫలించి వలంటీరుదళ నిర్మాణమేర్పడింది. అన్నిగ్రామాల్లో వలంటీరు దళాలను ఏర్పాటు చేయాలని చేసిన నిర్ణయాన్ని అనుసరించి కడివెండిలో కూడా 20 మందితో ఒక దళం ఏర్పడింది. దళ సభ్యులు ప్రతిరోజూ సాయంత్రం ఊరేగింపు తీసేవారు.

యుద్ధం ముగిసినప్పటికీ సంస్థానంలో లెవీధాన్యపు వసూలు ఆగలేదు. రైతాంగం ధాన్యం ఇవ్వలేక విసిగి వేసారినారు. లెవీధాన్యాన్ని నిర్ణయించి వసూలుచేసే సందర్భంలో గ్రెడేషన్ (gradation) పద్ధతిననుసరించాలని ఆనాటి

పార్టీ, ఆంధ్రమహాసభల విధానం. దీని ప్రకారంగా మధ్య తరగతి, పేద రైతులను పూర్తిగా మినహాయించాలి. ధనిక రైతులనుంచి తక్కువ, భూస్వాముల నుంచి ఎక్కువ ధాన్యం వసూలు చేయాలనీ ఆంధ్రమహాసభ కోరింది ప్రభుత్వం దీన్ని అంగీకరించలేదు. వాస్తవానికి యుద్ధం ముగిసినాక లెవీ ధాన్యాన్ని వసూలు చేయాల్సిన అవసరమే లేదు. కాని భూస్వాములకు, ఆహార శాఖలోని ఉన్నతాధికారులకు ఈ విధానం లాభదాయకమైనది. ఈ కారణాన ప్రభుత్వం తన విధానాన్ని కొనసాగించింది.

ఆ స్థితిలోనే విసునూరు రామచంద్రారెడ్డి దగ్గర ఒక్క కడివెండిగ్రామంలోనే 100 పుట్ల ధాన్యంవుందనీ, విసునూరులో ఇతర గ్రామాల్లో చాలా పెద్ద మొత్తంలోనే ధాన్యంవుందనీ, ప్రభుత్వం ఆ ధాన్యాన్ని స్వాధీనం చేసుకొని రైతాంగాన్నుంచి వసూలుచేయటం మానివేయాలని ఆంధ్రమహాసభ తరపున నాయకులు కోరినారు. స్వాధీనం చేసుకోవాలా? వద్దా? అనే సమస్య అధికారుల ముందుకువచ్చింది. వారికి ఇష్టంలేకున్నా విచారణ చేస్తామని కార్యకర్తలకు చెప్పారు. ధాన్యాన్ని స్వాధీనం చేసుకోవటమటుంచి అధికారులు విచారణ చేయటానికి కూడా దేశముఖు ఇష్టపడలేదు. అధికారులు విచారణకై రాకముందే గ్రామంలో ఒక సంఘర్షణను సృష్టిస్తే వలంటీర్లపై కేసులుపెట్టి ప్రజల కదలికపై మరోసారి దెబ్బ తీయవచ్చుననీ, ఈ నెపాన ధాన్యంకోసం జరిగే విచారణను కూడా ఆపివేయవచ్చుననీ అతడు ఒక ప్లానువేశాడు. విసునూరులో వుండే అతనిపెద్ద గుమాస్తా మిస్కిన్ అలీ కొందరు రౌడీలను వెంటతీసుకొని ఆరోజు కడివెండివచ్చి గడిలో మకాంవేసి వలంటీర్లను కాల్చటానికి తయారైనాడు. కోటలోవుండే గోడకు ఒక కన్నంవుంది. దానిలోనుంచి ఊరేగింపును చూడవచ్చును. కోటముందు, గ్రామం ఒక చివరినుంచి మరో చివరివరకు వెళ్ళే విశాలమైన వీధివుంది. (గడీలున్న అన్ని గ్రామాల్లో ఇలాగే వుంటుంది) సాయంత్రం సుమారు 20 మంది వలంటీర్లు వున్న ఊరేగింపు కోటముందునుంచి వెళ్తున్నది. ఆ కన్నంలోంచి తుపాకి కాల్చాడు మిస్కిన్ అలీ. ఊరేగింపులో వున్న దొడ్డికొమరయ్య అనేయువకునికి తుపాకిగుండ్లు తగిలినవి. కొమరయ్య అక్కడికక్కడే చనిపోయాడు. అతని అన్న కూడా వూరేగింపులో వున్నాడు. అతనికికూడా ఒక గుండుతగిలి గాయపడ్డాడు. మరి కొంతమందికి కూడా గుండ్లు తగిలాయి. అప్పటికప్పుడు వలంటీర్లు చెదిరిపోయారు.

తుపాకీ కాల్పులకు కొమరయ్య ఆహుతికావటంతో ఊరేగింపులోవున్న వలంటీర్లు చెదిరిపోయారు. అప్పుడప్పుడే ఇళ్ళకు చేరుకున్న ప్రజలు తుపాకి శబ్దం విని ఒక్కడికి చేరుకున్నారు. మిస్కిన్ అలీ కొద్దిమంది గూండాలతో కొన్ని గంటలముందే గ్రామంచేరుకొని ఈపనిచేశాడని తెలిసి అతన్నిపట్టి బంధించాలని ప్రయత్నించారు. వాని గడీని చుట్టివేయకముందే వాడు గూండాలతో పలాయనం చిత్తగించినాడు.

ప్రజలూ వలంటీర్లూ కలిసి కొందరు శవందగ్గరున్నారు. కొందరు పక్కన గ్రామంలోవున్న కార్యకర్త (కె. రామచంద్రారెడ్డి)కు చెప్పగానే ఆయన కడివెండి చేరుకొన్నాడు. ఉదయంకాగానే చుట్టుపక్కల గ్రామాలనుంచి ప్రజలు రాసాగినారు. మధ్యాహ్నంవరకు వారిసంఖ్య సుమారు 4వేలకు పెరిగింది. ప్రజలు ఉద్రిక్తులైనారు. ఆంధ్రమహాసభ నినాదాలతో ఊరంతా మార్మోగగా ఊరేగింపు జరిపారు. కొమరయ్య శవాన్ని ఊరేగింపుతో తీసుకువెళ్ళి ఊరి వెలుపల బహిరంగసభ జరుపటానికి ఒకచోట చేరుకున్నారు.

విసునూరులోవున్న దేశముఖు కడివెండికి చుట్టుపట్టు గ్రామాల ప్రజలు చేరుతున్న సంగతి తెలుసుకున్నాడు. మళ్ళీ దాడిచేసి భీభత్సాన్ని సృష్టించి ప్రజలను తల ఎత్తనీయకూడదనుకున్నాడు.

70–80 మంది గూండాలను తుపాకులు, కర్రలు, బరిసెలు ఇచ్చి పంపించాడు. గూండాలకు నాయకత్వం వహించింది దేశముఖు కొడుకు బాబు రెడ్డి, మరొక గుమాస్తా రామిరెడ్డి. గూండాల రాకను ముందే తెలుసుకున్న ప్రజలు అప్పటికప్పుడు వలంటీరు దళాలుగా ఏర్పడినారు. తమ దగ్గరున్న వడిసెలలు చాలవని తోలుతో కొత్త వడిసెలలుతయారుచేసుకున్నారు. వడిసెలకు వుపయోగించటానికి రాళ్ళను తెచ్చుకున్నారు. అందరూ గుతుపలు వెంట తెచ్చుకున్నారు. రౌడీలనుచూచి వడిసెలలతో రాళ్ళు విసరసాగారు. రౌడీలు తుపాకులు కాల్చారు. ప్రజలు అప్పటికప్పుడు నేలమీద పడుకొని తుపాకి దెబ్బలను తప్పించుకొని రౌడీల దగ్గరికి వెళ్ళి వారినుంచి తుపాకులు లాక్కొని విరిచివేశారు. రౌడీలను బాగా చితక్కొట్టారు. రౌడీ నాయకుల కచ్చడాలను నుగ్గునుగ్గు చేశారు. వారి వెంటపడి చాలా దూరందాకా వెళ్ళి తరిమివేశారు. ఈ గందరగోళంలో దేశముఖు కొడుకు బాబురెడ్డి తప్పుకొని కాలికి బుద్ధిచెప్పినాడు. కానీ గుమాస్తా రామిరెడ్డిమాత్రం దొరికాడు. అతన్ని ఏంచేయాలనే సమస్య

ఎదుర్కొన్నది. ప్రజలంతా కోర్టును ఏర్పాటుచేసి అతడుచేసిన నేరాలను విచారించా లన్నారు. వారి కోరికప్రకారం ఏ గ్గురిని న్యాయమూర్తులుగా ఎన్నుకొని ఒక ప్రజాకోర్టును ఏర్పరిచారు. కోర్టు రాంరెడ్డిని ప్రజలముందు నిలబెట్టి అప్పటి దాడితో సహా చేసిన నేరాలను విచారణచేసి అతనికి మరణశిక్ష విధించింది. రాంరెడ్డి తన నేరాలన్నిటిని ఒప్పుకున్నాడు. ముందెప్పుడూ ఇలాంటి పనులు చేయనన్నాడు. క్షమాపణ కోరుకొని తనపై విధించిన మరణశిక్షను రద్దు చేయమని ప్రజాకోర్టును వేడుకున్నాడు. దానిపై కోర్టు మరణశిక్షను రద్దు చేసింది.

ఈలోగా రిజర్వు పోలీసులుకూడా అక్కడికి చేరుకున్నారు. ప్రజలను చూచి భయపడిన పోలీసులు అప్పటికప్పుడే రాజీ సంప్రదింపులు ప్రారంభిం చారు. మిస్కిన్ అలీని, బాబు రెడ్డిని ఇతర గూండాలను అరెస్టు చేస్తామనీ వారిపై కేసులు పెడతామనీ, ఇంకా ఏమేమో చేస్తామని చెప్పి సర్దేయటానికి ప్రయత్నించారు. కొమరయ్య శవాన్ని పోస్టుమార్టమ్ చేయించి తిరిగి ఇస్తామని తీసుకెళ్ళి పోస్టుమార్టం చేసి తిరిగి పంపించారు. తర్వాత కొమరయ్య శవానికి అంత్యక్రియలు జరిగినవి. ఆ సందర్భంలో పెద్ద సంతాపసభ జరిగింది. స్థానిక నాయకులు ఉపన్యసించారు.

ఈ సంఘటన జరిగిన వారంరోజుల్లో కడివెండికి సమీపాననే వున్న ధర్మా పురం రైతులు భూమి పంచుకోటానికి సిద్ధపడినారు. ధర్మాపురం గ్రామం అగ్రహారం పూసుకూరు రాఘవరావు పెద్ద భూస్వామి. ఆయన అనేక మాయో పాయాలతో ఈ అగ్రహారాన్ని తన చేజిక్కించుకున్నాడు. రైతుల్లో హెచ్చు మంది లంబాడీలు. వారు సాగుచేసే భూమిలో హెచ్చుభాగాన్ని లాక్కొని, మాగా ణిని "స్వయంగా సాగు" చేశాడు. మెట్టను బీడుపెట్టి పశువుల మేపుకు వుప యోగించాడు. భూస్వామి ఆక్రమించుకున్న ఈ భూమిలో కొంతభాగాన్ని తిరిగి ఆక్రమించుకోటానికి సిద్ధమైనారు రైతులు. దీనికై కడివెండి స్థానిక నాయకులను సాయపడమన్నారు. కొందరు వెళ్ళి సాయపడినారు. 200 ఎకరాల మెట్ట భూమిని పూర్వం సాగుచేసినవారికి పంచివేశారు. భూస్వామి సాయానికి పోలీ సులు రాగా రైతుయువకులంతా వలంటీరు దళంగాఏర్పడి తమతమ గుతపలతో పెరేడుచేశారు. వీరి తిరుగుబాటు మనస్తత్వాన్ని చూసి పోలీసులు తిరిగి వెళ్ళి పోయారు.

ఈ సంఘటనకున్న విశిష్ట లక్షణాలు: ఒకటి : కొమరయ్య ఆ నాటికి స్థానిక నాయకుడుగా కూడా ముందుకు రాలేదు. వలంటీర్లలో ఒకడు మాత్రమే. కాని అతని హత్య ఫలితంగా వచ్చిన ప్రజావెల్లువ అపూర్వమైనది.

రెండవది: కాల్పులవల్ల ప్రజలలో భయం ఏర్పడలేదు. నిరుత్సాహం రాలేదు. అంతకుముందే వాలకుర్తిలో గూండాలు దాడిచేసినప్పుడు ప్రజలు భయపడ్డారు. ఆ గ్రామంలోనే శివరాత్రి సంఘటన (1945) తర్వాత సుమారు ఒక సంవత్సరం దాకా తాత్కాలికమైన నిస్తబ్ధత ఏర్పడింది. ఆ నిస్తబ్ధత ఇప్పుడు కన్పించలేదు. కాల్పుల ఫలితంగా కొమరయ్య చనిపోవటంతో ప్రజల్లో దేశముఖు వ్యతిరేకత పెరిగి పోరాడాలనే పట్టుదల ఇనుమడించింది. వేలసంఖ్యలో ధైర్యంతో ఆత్మ విశ్వాసంతో కడివెండిలో సమీకృతులయ్యారు.

మూడవది : దేశముఖు మనుష్యుల కాల్పులకు భయపడకుండా ఎదిరించారు. వారిమీదపడి, చేతుల్లోంచి కర్రలు, ఆయుధాలు లాక్కున్నారు. తుపాకులను విరిచివేశారు. పెద్దఎత్తున వడిసెలలను వుపయోగించారు. ఇదంతా ప్రజలు ప్రతిఘటనకు తయారైనారని స్పష్టం చేస్తుంది.

నాల్గవది : ప్రజాకోర్టు ఏర్పడి భూస్వాముల దురంతాలను విచారణచేసి వారికి శిక్షలు విధించటం స్థానికంగా పోటీ ప్రభుత్వాన్ని స్థాపించటమే. అంతకుముందు గ్రామసంఘాలు, ప్రజలకు చేసే న్యాయసహాయానికి దీనికి మౌలికమైన భేదమున్నది.

ఐదవది : భూమి పంపకానికి రైతులు ముందుకు వచ్చారు. ఈ సంఘటనలు ఆనాటి ప్రజల వున్నతస్థాయి చైతన్యాన్ని సూచిస్తున్నవి.

## 6. నూతన పరిస్థితులు - విప్లవ కార్యక్రమం

ఈ అంశాలన్నిటినీ పరిశీలించి భూమిని పంచుకొని దానికోసం భూస్వాములను, ప్రభుత్వ సాయుధ బలాలను ప్రతిఘటించే సమస్య ముందుకు వచ్చిందని జిల్లాకమిటీ గమనించింది. ఈ నూతన పరిస్థితిలో వెనుకటి లీగల్ కార్యకలాపాలకు స్వస్తి చెప్పి, ప్రభుత్వాన్ని ధిక్కరించే సరికొత్త కార్యక్రమాన్ని రూపొందించింది.

**కార్యక్రమంలోని ముఖ్యాంశాలు :** ఒకటి : అన్యాక్రాంత భూమి : భూస్వాములు, ఈ శ్రేణికి చెందిన వడ్డీవ్యాపారులు ఆక్రమించుకున్న భూములు, కౌలుదారులనుంచి ఆక్రమించుకున్న భూములు, పట్టాభూములు, కౌలుభూములు, ఇంకా ఏ రకపు అన్యాక్రాంతపు భూములైనాసరే తిరిగి ఇవ్వాలి. పోగొట్టుకున్న రైతులు తమతమ భూముల వివరాలు చెబుతారు. గ్రామస్థులకూ, పక్కనవున్న రైతులకూ కూడా వివరాలు తెలుస్తాయి.

రెండవది : భూస్వాములు గ్రామీణ ప్రజలనుంచి అక్రమంగా వసూలు చేసిన డబ్బు తిరిగి ఇవ్వాలి. జుర్మానాలు, ధరావతులు (డిపాజిట్లు), దండుగలు (పెనాల్టీలు) గ్రామ ఉమ్మడి డబ్బు మొదలగునవి ఈ శ్రేణికి చెందినవి. డబ్బు లెక్కతేలడం చాలాకష్టం ఒక్కో గ్రామంలో సుమారు పది నుండి పదిహేను సంవత్సరాల లోపల ప్రజలనుంచి వసూలుచేసిన మొత్తాన్ని నిర్ణయించి, దాన్ని ప్రజలకు తిరిగి ఇవ్వాలనే కోర్కె రెండవది.

మూడవది : ఆ రోజుల్లో ప్రభుత్వం గ్రెయిన్ బ్యాంకులను (ధాన్యపుబ్యాంకులు) ఏర్పాటుచేసింది. కో-ఆపరేటివ్ బ్యాంకుల్లాగా ఈ గ్రెయిన్ బ్యాంకులు ఏర్పాటు చేసి, రైతులనుంచి ధాన్యం వసూలుచేసి స్థానిక భూస్వాముల కొట్లలో ఈ ధాన్యమంతా నిలువచేసి వుంచేవారు. భూస్వాములు దానిని తమ ఇష్టంవచ్చినట్టు వాడుకునేవారు. నాగులకిచ్చి తమ ఆదాయాన్ని పెంచుకునేవారు. అమ్ముకొని డబ్బు చేసుకునేవారు. రైతులకు భూస్వాములు లెక్కచూపించేవారు కాదు. రైతులు కూడా వాటిని నిర్బంధవసూళ్ళని భావించినందున బ్యాంకు నుంచి తిరిగి తెచ్చుకోవాలనే చైతన్యాన్ని ప్రదర్శించలేదు. కాని పోరాటం ఉధృతమవుతున్నప్పుడు ఈ ధాన్యపు బ్యాంకు పేరుతో వసూలుచేసిన ధాన్యమంతా తిరిగి ఇవ్వాలనే నినాదాన్ని చేపట్టారు.

చాలా దుర్మార్గులైన భూస్వాములెవరైనా వుంటే వారిని ప్రజాకోర్టుముందు విచారణ జరిపించి జుర్మానా విధించాలి లేదా శిక్ష విధించాలనేది కార్యక్రమంలో భాగంగా వుండేది.

వీటన్నిటిని సాధించాలంటే గ్రామసంఘ నాయకత్వం ధైర్యంతో ఈ పనులు అమలుజరుపగలగాలి. దీనితోబాటు అన్నిగ్రామాల్లో వలంటీరు దళాలను ఏర్పాటు చేసుకోవాలి. కోరికలను ముందుంచి ప్రజలను సమీకరించగానే భూస్వాములు తమ గూండా దళాలను రంగంలోకి దించే అవకాశముంది. విసునూరు ప్రాంతంలో

జరిగినది ఇదే. అక్రమంగా వసూలుచేసిన డబ్బు, నిలువచేసిన గ్రెయిన్ బ్యాంకు ధాన్యం తిరిగి ఇవ్వవలసి వస్తుందనీ, అన్యాక్రాంత భూములను వదులు కోవలసి వస్తుందనీ దేశముఖులు ముందే గూండాలను ప్రయోగిస్తారనీ, ఈ గూండా లను ఎదుర్కోవడానికి అన్ని గ్రామాల్లో వలంటీరు దళాలనేర్పాటుచేయాలనే కార్యక్రమం నిర్ణయించింది పార్టీ. ఈ కార్యక్రమం అమలుజరుగాలంటే ప్రజలను పెద్దఎత్తున సమీకరించాలి. ఈ సమీకరణ కోసం "జైత్రయాత్ర" పద్ధతిని అనుసరించింది పార్టీ. దీనిప్రకారం ఒకగ్రామం నుంచి ప్రజలు బయలుదేరుతారు. వారిసంఖ్య 500 నుంచి 2000 వరకు వుంటుంది. హెచ్చుతగ్గులు కూడ వుండ వచ్చును. వారంతా ఊరేగింపుగా పక్క గ్రామానికి వెళ్ళి ఆ గ్రామంలో ఊరేగింపు చేస్తారు. వారి పిలుపునందుకొని ఆ గ్రామ ప్రజలు కూడా ఊరేగింపులో కలుస్తారు. సాధ్యమైతే స్థానిక కార్యకర్తలు ముందేవెళ్ళి సన్నాహాలు చేస్తారు. ప్రజలందరూ కలిసి, రెండు గ్రామాల ప్రజలతో బహిరంగసభ జరుగుతుంది. దానిలో అయిదుగురు సభ్యులుగల గ్రామసంఘాన్ని ఎన్నుకుంటారు. అక్కడ వున్న కార్యకర్త గ్రామసంఘ సభ్యులకు, ప్రజలకు గ్రామసంఘ విధులను స్పష్టంచేస్తాడు. ఆసందర్భంలో—అన్యాక్రాంతభూములు తిరిగిఇవ్వటం,అక్రమంగా వసూలుచేసిన డబ్బును చెల్లించటం, గ్రెయిన్ బ్యాంకు ధాన్యాన్ని తిరిగి ఇచ్చి వేయటం మొదలగు కార్యక్రమాన్ని అమలుజరిపించాలని స్పష్టంచేస్తాడు. దీనితో పాటు ప్రజలమధ్య వున్న తగాదాలను గ్రామసంఘ సభ్యులు ఉచితంగా తీర్పు చెప్పాలనీ, వారినుంచి ఏరూపంలో కూడా పరిహారం తీసుకోగూడదనీ కార్య క్రమాన్ని అందిస్తారు.

ఈ కార్యక్రమాన్నందించి అక్కడికక్కడే వలంటీరు దళాలను ఏర్పాటు చేసేవారు. గ్రామజనాభాననుసరించి 20 నుంచి 50 వరకు వలంటీరు దళాల్లో చేరేవారు. ఈ విధంగా గ్రామసంఘాలను, వలంటీరుదళాలను ఏర్పరచి వాటికి కార్యక్రమాన్ని ఇచ్చి ప్రజలు తమ గ్రామానికి తిరిగివెళ్ళేవారు. కొత్తగా సంఘంలో చేరిన గ్రామస్థులు ఇదేపని చేసేవారు. జిల్లాకమిటీ ఈ కార్యక్రమాన్ని తయారుచేసి ప్రజలకందించింది. ప్రజలు దానికి ప్రతిస్పందించి, కదిలి, ఒక గ్రామం నుంచి మరోగ్రామానికి శరవేగంతో వెళ్ళి గ్రామసంఘాలను, వలంటీరు దళాలను ఏర్పాటుచేస్తూ కార్యక్రమాన్ని అమలుజరిపినారు. సుమారు 1946 జూలై నెలచివరినుంచి డిసెంబరు దాకా ఈ కార్యకలాపాలు సాగినవి. ఈ

కార్యక్రమం తూర్పుజనగామ, సూర్యాపేట, హుజూర్‌నగర్, భువనగిరి తాలూకా గ్రామాల్లో అమలుజరిగినవి. నల్లగొండ తాలూకాలో కార్యకర్తలు చురుకుగా ముందుకురానందున ఆ తాలూకా గ్రామాల్లో పెద్దకదలిక రాలేదు.

ఈ కార్యక్రమం సుమారు 150 గ్రామాలలో అమలుజరిగింది. గ్రామాల సంఖ్య, వలంటీర్ల సంఖ్య కూడా పెద్దదే ఏర్పడింది. దేవరుప్పలనుంచి పాలకుర్తికి వెళ్ళిన వలంటీర్లు ఉపయోగించిన గుతుపలు వీరు కూడా వుపయోగించారు. వీటితో పాటు వడిసెలలు కూడా ఉపయోగించారు. గూండాలను పైకిరాకుండా ఆపటానికి కొంతదూరానవున్న గుంపును కదలనీయకుండా చేయటానికి దానిమీద రాళ్ళు విసరడానికి ఈ వడిసెలలు ఉపయోగపడుతాయి. విసురుగా వెళ్ళే వడిసెల రాయివలన దూరానవున్న మనిషికి కూడా దెబ్బతగిలి ప్రమాదకరంగా ఉంటుంది.

వడిసెలను దారంతోగానీ, గోగు, జనపనారతోగాని తాడుపేని తయారు చేయవచ్చును. కానీ ఆలస్యమవుతుంది. తోలుతో అప్పటికప్పుడు తయారవు తుంది. ఆ రకంగా తయారుచేసి ఇస్తే వలంటీర్లు శిక్షణపొంది నేర్పుతో ప్రయోగించ సాగారు. పోలీసులు దాడిచేసినప్పుడు దూరంనుంచే కనిపెట్టి వడిసెలతో రాళ్ళు విసరసాగారు. పోలీసులు భయపడి వెనుదిరిగి వెళ్ళిపోయేవారు. ప్రజల మీద దాడిచేయడానికి సాహసించకపోయేవారు.

పోలీసుల రాకను కనిపెట్టడానికి సెంట్రీ పద్ధతి ఏర్పడింది. వలంటీరు దళాలలో ప్రతి ఒక్కరూ కొన్నిగంటలపాటు విధిగా సెంట్రీపని చేయాలని నిర్ణయించారు. ఎత్తైన ప్రదేశంపై లేదా గ్రామం వెలుపల వుండే కొండపై లేదా ఎత్తైన చెట్టుమీద సెంట్రీ వుండి దూరంగా వచ్చే పోలీసుల్ని చూసి గ్రామంలో వలంటీరు దళ నాయకునికి లేదా గ్రామ సంఘ అధ్యక్షునికి గుర్తుచేసేవారు. కొన్ని గ్రామాల్లో స్కూళ్ళల్లోనూ, ఇతరత్రా వాడేగంటలను ఉపయోగించేవారు. దూరంనుంచి వస్తున్న పోలీసులను చూసి గంటను కొట్టేవారు. దీనితో వలం టీర్లందరూ తమతమ గుతుపలతో ఒకచోటుకి చేరి తమతమ స్థానాల్లో నిలుచుని వడిసెలలతో రాళ్ళు రువ్వటానికి తయారు అయ్యేవారు.

ఆకునూరు, మాచిరెడ్డిపల్లిలో పోలీసులు స్త్రీలను చెరిచిన అనుభవాలతో స్త్రీల స్వీయరక్షణ సమస్య ముందుకువచ్చింది. గ్రామ సంఘాల్లో, వలంటీర్లలో స్త్రీలను చేర్చుకొని వారిని నాయకత్వంలో భాగస్వాములను చేశారు. మహిళా వలంటీర్లను తయారుచేశారు. ప్రతి గ్రామ సంఘంలో ఒకరో ఇద్దరో స్త్రీలు

ఉండేట్లు ఏర్పాట్లు చేశారు. దీనికై సిద్ధమైన స్త్రీలను, లేనిచోట వ్యవసాయ కూలీ స్త్రీలలో మేస్త్రీలను లేదా రైతుల్లో మిలిటెంటుగా ఉండే పెద్ద మనుష్యులను చేర్చుకునేవారు. ఈ విధంగా గ్రామ సంఘాల్లో స్త్రీల ప్రాతినిధ్యం వుండేది.

**స్త్రీలు-వలంటీర్లు :** స్త్రీలు వలంటీర్లలో చేరటానికి కొన్ని ఇబ్బందులను ఎదుర్కోవలసి వచ్చింది. వీరిలో యువతులే హెచ్చుభాగం వుండేవారు. యువకులు, యువతులు కలిసి ఒకే వలంటీరు దళంలో పనిచేయటం ఆనాటి పరిస్థితుల్లో సాధ్యం కాలేదు ఈ కారణాన ప్రత్యేకంగా స్త్రీల వలంటీరు దళాలు ఏర్పాటు చేసేవారు. ఈ ఏర్పాటు కొన్నిచోట్ల మాత్రమే సాధ్యమైంది. ఈ దళాలలో వ్యవసాయ కూలీ స్త్రీలు, పేదరైతు స్త్రీలదే హెచ్చు సంఖ్య. ఆనాటికి పార్టీలో ఐదారుగురు మహిళా కార్యకర్తలు పనిచేసేవారు. వారు మహిళలను ఆర్గనైజు చేయటంలో, వలంటీర్లను సమీకరించటంలో, గ్రామ సంఘాలలో మహిళలకు ప్రాతినిధ్యం కలిగించటంలో శ్రద్ధతీసుకునేవారు. పార్టీ వారికి కావలసిన శిక్షణ, సూచనలిచ్చి పంపించేది. వారు ఆ సూచనలను అమలుజరిపేవారు. గ్రామాల్లో ప్రజలను సమీకరించటంలో వలంటీరు దళాలను గ్రామ సంఘాలను ఏర్పాటు చేయడంలో ఆ సమయాన అనుసరించిన పద్ధతి ఇది.

ఈ కార్యక్రమమంతా జిల్లాకమిటీ (కమ్యూనిస్టు పార్టీ, ఆంధ్రమహాసభ) చొరవతో నిర్ణయించి అమలుజరిపించింది. తెలంగాణాలోని ఇతర జిల్లాలలో లేదు. సంస్థానవ్యాపితంగా లేదు. ప్రధానంగా నల్లగొండ జిల్లాలోనే ఈ కార్యక్రమం అమలు జరిగింది. ఇతర జిల్లాల్లో నిర్బంధ వ్యతిరేక ప్రచారం సాగింది. బహిరంగ సభలు పెట్టి నిర్బంధాన్ని ఖండించటమే దీనిసారాంశం. పార్టీ, ఆంధ్రమహాసభలు ఈ జిల్లాలకు అందించిన కార్యక్రమంకూడా ఇదే. అంతేకాని ఈ పద్ధతిలో ప్రజలను సమీకరించి, పోరాటానికి సిద్ధంచేయటం, భూస్వాముల భూమిని దున్నుకోవటం, భూస్వాములు అక్రమంగా తీసుకున్న డబ్బు, ధాన్యాన్ని తిరిగి వసూలు చేయటం మొదలగు కార్యక్రమాలేవీ తీసుకోలేదు ; అమలుజరుగలేదు.

**గ్రామసంఘాల ఉన్నతస్థాయి :** పూర్వపు గ్రామసంఘాలకన్నా ఈ గ్రామ సంఘాల స్థాయి కొంతవరకు వున్నతమైనది. జనగామ తాలూకాలో మొదట ఏర్పడిన గ్రామసంఘాల స్వభావంలో పెద్ద మార్పేమీ లేదు. ఉచిత న్యాయ సహాయం చేయటం డబ్బు వసూలుచేసి కేసులు మొదలగు అవసరాలకు ఖర్చు పెట్టటం మొదలగు కర్తవ్యాలు నిర్వహించేవి. పోరాట నినాదాల్లు వెట్టి చాకిరీ,

అక్రమ పన్నులు ఆపివేయటంలాంటివి. ఆ పరిస్థితుల్లో ఏర్పడినవి ఈ గ్రామ సంఘాలు. అయినా పెద్ద భూస్వాములకు, పెద్ద దేశముఖులకు వ్యతిరేకంగా ఏర్పడినవి. కాని కొమరయ్య అమరత్వం తర్వాత ఏర్పడినవి మౌలికంగా వేరే స్వభావం కలవి. ఉన్నత స్థాయికి చెందినవి. భూమి పంపక కార్యక్రమాన్ని అమలుజరుపుతూ గ్రామాన్ని వలంటీరు దళాలద్వారా భూస్వాముల గూండాలనుంచే గాక, పోలీసుల దాడులనుంచి రక్షించుకునే ఉన్నతస్థాయి కార్యక్రమాన్ని అమలు జరిపినవి. వాస్తవానికి ఇవి గ్రామరాజ్యాలేకాని ఆ కాలంలో వాటిని ఆ పేరుతో పిలువలేదు. స్వయంగా పార్టీకి కూడా అవగాహన లేదు.

పోలీసులు గ్రామసంఘాల నాయకులను, వలంటీర్లను, కార్యకర్తలను అరెస్టుచేయటానికి వ్యానులలో వచ్చేవారు. వచ్చే సమయానికి ప్రజలందరూ ప్రతిఘటనకు సిద్ధమయ్యేవారు. వలంటీర్లు తమతమ స్థానాలలో గుతుపలు వడిసెలలతో ఉండటమేగాక వడిసెలలతో రాళ్ళను రువ్వేవారు. ఈ స్థితిని చూచి వచ్చిన పోలీసులు తిరుగుముఖం పట్టేవారు. కొన్ని సందర్భాల్లో గ్రామంలోకి వచ్చి అరెస్టులు చేయకనే తిరిగి వెళ్ళిపోతుండేవారు కూడా. ఈ స్థితి సుమారు మూడునెలలు కొనసాగింది. ఒకవైపునుంచి పోలీసులు గ్రామాల్లోకి దాడులు చేయటానికి వస్తున్నప్పటికీ, మరోవైపున ఉద్యమం విస్తరించింది. పోలీసులు అరెస్టులు చేయటానికే వస్తున్నారనీ, వారు తిరిగి పోతున్నారంటే పెద్దబలంతో వచ్చి నిర్బంధాన్ని తీవ్రతరం చేస్తారని జిల్లాకమిటీకి తెలుసు. ప్రజలకు, గ్రామ సంఘ నాయకత్వానికీ, వలంటీర్లకూ కార్యకర్తలు ఇలాంటి అవగాహనను కలిగించారు కూడా.

## రహస్య కార్యకలాపాలకు జిల్లా కమిటీ నిర్ణయం

దీనికి తోడుగా నల్లగొండ జిల్లాలోని ముఖ్యకార్యకర్తలంతా రహస్య జీవితం గడుపుతూ పనిచేయటం ప్రారంభించారు. 1946 మధ్యకాలంలో ముఖ్య కార్యకర్తలందరినీ అరెస్టుచేయాలనే తలంపుతో వుందని తెలిసింది. వెంటనే వారు రహస్యంగా వుండి పనిచేయటానికి జిల్లాకమిటీ నిర్ణయించింది. కాని కొద్దిరోజులకే నిషేధాజ్ఞలను ఉపసంహరించినదని కూడా తెలిసింది. అప్పుడు కార్యకర్తలు బహిరంగంగా పనిచేయాలా లేదా అనే సమస్యను జిల్లాకమిటీ చర్చించి వెనుకటి నిర్ణయాన్ని మార్చనవసరంలేదనీ, కార్యకర్తలంతా రహస్యజీవితం కొనసాగించా

లనీ నిర్ణయించింది. వారు 4-5 సంవత్సరాల నుంచి బహిరంగంగా పనిచేయటం వలన వారికి రహస్యజీవితమంటే ఏమిటో తెలియదు. ప్రభుత్వం వారిని అరెస్టు చేయటాన్ని మానుకున్నా ఎప్పుడైనా అరెస్టుచేయవచ్చును. ఈ కారణాన రహస్య జీవితం అలవాటుచేసుకోవటం మంచిదని వారంతా రహస్యంగా వుంటూ పనిచేయా లని నిర్ణయించింది ఈ నిర్ణయం కార్యకర్తలకు ఎంతో ఉపయోగపడింది. గ్రామీణప్రజల్లో సంపూర్ణమైన ఐక్యత ఉండటం వలన వారు గ్రామాల్లో బహిరం గంగా తిరిగి పనిచేసినారు. భూస్వాముల కేంద్రీకరణ హెచ్చుగావున్న గ్రామా లకు వెళ్ళటం మానివేశారు. పోలీసుల నిఘానుంచి తప్పుకోటానికి అన్నిఏర్పాట్లు చేసుకున్నారు. సమావేశాలన్నీ రహస్యంగా జరిగేవి.

కార్యకర్తలు ఈమేరకు రహస్యజీవితాన్ని పాటిస్తూనే ఉద్యమాన్ని విస్తరించటానికి కృషిచేశారు. గ్రామరాజ్యాల, వలంటీరు దళాల నిర్మాణం, భూమి పంపకం సరైన పద్ధతుల్లో జరిగే విధంగా చూడటం మొదలగు పనులన్నీ కార్య కర్తలు చూసేవారు.

కార్యకర్తలు అప్పటికే స్థానికనాయకులైనారు. అయినా వారు గ్రామాల్లో ఉన్నప్పుడు ప్రత్యేక మర్యాదలు చేయటాన్ని పార్టీ నిషేధించింది. వారు రైతుల ఇళ్ళలోనే భోజనాలు చేయాలనీ, వారి ఇళ్ళలో విడిగావుండే స్థలాల్లో విశ్రాంతి తీసుకోవాలని పార్టీ ఆదేశించింది. 15-20 మంది కార్యకర్తలతో జరిపే సమా వేశాలు కూడా వేరే వంటలూ, ప్రత్యేక భోజన ఏర్పాట్లు లేకనే సాగిపోయేవి. తప్పనిసరిగా ఇంటికొకరు వెళ్ళి భోజనం చేసేవారు. ఈ ఏర్పాటు ఫలితంగా కార్యకర్తలు ఎప్పుడూ ప్రజలతో కలిసిమెలిసి వుండేవారు. వారుకూడా ప్రజలను ఆప్యాయంగా చూచుకొనేవారు. కార్యకర్తల కోసం, సమావేశాలకోసం గ్రామ సంఘాల నిధులనుంచి ఖర్చుచేయాల్సిన అవసరం లేకుండాపోయింది.

## 7. విప్లవ కార్యక్రమాన్ని అమలుజరిపే సందర్భంలో ముందుకు వచ్చిన సమస్యలు

**భూమి పంపకం :** భూమి ఎలా పంచాలి? ఒకటి, భూమి పంచడానికి హెచ్చుగా దొరికిన ప్రాంతాలు కొన్ని, కొద్దికొద్దిగానే లభించిన ప్రాంతాలు మరికొన్ని వున్నాయి. జనగామ తాలూకాలోని ధర్మవరం గ్రామంలో 200

ఎకరాల భూమి పంచడానికి లభించింది. రైతులు ఆ భూమి తమదని, భూస్వామి దాన్ని అక్రమంగా ఆక్రమించుకున్నాడని, 1944 పోరాటం ప్రారంభమైన సమయంలోనే చెప్పినారు. ఇదేగాక మరికొంత భూమి కూడా ఉండినది. అందు కోసం అప్పటికప్పుడే ఆ 200 ఎకరాల భూమిలో ఏ భూమి ఎవరిదో నిర్ణయించి వారికాభూమిని పంచటం సులభమైంది. అంటే ఒకరు 5 ఎకరాల భూమి తనదనీ ఆ భూమిని ఇవ్వమని అడిగితే అతనికి అది ఇచ్చేశారు. 10 ఎకరాలు తనదని అడిగితే 10 ఎకరాలు ఇచ్చేశారు. తక్కువ వున్నవారికి తక్కువ, ఎక్కువ వున్నవారికి ఎక్కువ. ఇక్కడ సమానంగా పంచలేదు. భూమి అడిగినవారిదేనా అనే అంశాన్ని నిర్ధారణ చేసుకొని దానిని వారికిచ్చేది. ఈ విధంగా పంచి నప్పుడు కొందరికి హెచ్చుగా దొరికింది. మరికొందరికి తక్కువగా దొరికింది.

**600 ఎకరాల బంచరాయి :** అర్ధగూడూరు గ్రామం రామన్నపేట తాలూకాలో ఉంది. అక్కడ సుమారు ఆరువందల ఎకరాల బంచరాయి బీడు వున్నది. ప్రభుత్వ యాజమాన్యాన వున్న సారవంతమైన నల్లరేగడి భూమి. ఆ గ్రామ దేశముఖు తన పశువులను మేపడానికి ఉపయోగించే ఆ ప్రభుత్వ భూమిని పేద రైతులకు పంపకం చేశారు. కాని వారితో దున్నించటానికి ప్రయత్నించలేదు. సమానమైన భాగాలుచేసి గట్లు (సరిహద్దులు) పెట్టి ఫలానావారికి ఫలానా భూమి అని నిర్ణయించారు. రైతులు ఒక్కొ ఖండంలో ఒక ఎర్రజెండా పాతారు. కాని అప్పటికప్పుడు పేదరైతులతో భూమిని దున్నించలేదు. ఆగస్టు, సెప్టెంబరు, అక్టోబరు మాసాలు దున్నటానికి అనుకూలమైన సమయం. ఆ భూమిలో చిన్న తుప్పలువున్నా వాటిని కొట్టి దున్నటం సులభమే. తర్వాతనే దున్నుకున్నారు. పోరాటం తర్వాత దేశముఖు మళ్ళీ ఆ భూమిని ఆక్రమించుకున్నాడనీ,లిటిగేషన్‌లో పడి ఇప్పటికీ తెమలకుండా వున్నదని తెలుస్తున్నది. ఆనాటి పరిస్థితులలో ఇది పెద్ద భూఖండమే.

బేతవోలు మక్తాదారు తనదని చెపుతున్న బీడుభూమి తమకు రావాలనేది అక్కడి రైతాంగపు పోరాట కోర్కెలలో ఒకటి. 1931 లో ఇక్కడ ప్రారంభ మైన పోరాటం 1946 వరకు సాగి 16 సంవత్సరాల తర్వాత 600 ఎకరాల భూమిని రైతులు స్వాధీనం చేసుకున్నారు. సంఘం నాయకత్వాన పేదరైతులు, వ్యవసాయ కూలీలు పంచుకున్నారు. మరికొంత భూమిని తక్కిన రైతుల పశువుల మేపుకోసం వదిలివేశారు. ఈ విధంగా సుమారు 16 సంవత్సరాల కాలంలో కోర్టుల

ద్వారా పరిష్కారంకాని సమస్య పోరాటం ఉన్నతస్థాయికి ప్రవేశించగానే పరిష్కారమైంది. రైతులు భూమిని పంచుకున్నారు. పూర్వం ఒక కాంగ్రెసు వ్యక్తి నాయకత్వాన పోరాటం సాగింది. 1941 లో చిలుకూరులో ఎనిమిదవ ఆంధ్ర మహాసభ సమావేశమైన తర్వాత సుమారు 5 సం॥ల కాలంలో ప్రజలందరూ క్రమంగా కమ్యూనిస్టుపార్టీ, ఆంధ్రమహాసభల నాయకత్వాన్ని అంగీకరించారు. వాటి నాయకత్వాన భూమిని పంచుకున్నారు. స్థానిక రైతాంగపు చొరవతోగాక జిల్లా పార్టీకేంద్రం ఒకప్లాను ప్రకారం అమలుజరిపిన కార్యక్రమమిది. దీనితో బాటు ఆ తాలూకాలోనే పత్తేపురం, దాచారం గ్రామాల్లో భూస్వాముల భూమిని రైతులు, కూలీలు పంచుకున్నారు. మల్లారెడ్డి గూడెంలో తగాదాలోవున్న రిజర్వు ఫారెస్టు భూమిని రైతులు పంచుకున్నారు. అది సుమారు 500 ఎకరాలు గల పెద్ద భూఖండమే. ఇవి పెద్ద భూఖండాలు పంచిన గ్రామాలు. ఇవిగాక కొద్ది భూములను పంచిన గ్రామాలున్నాయి. ఎక్కడ రైతులు ముందుకువచ్చారో అక్కడ పంచారు. ప్రతిగ్రామంలో 40-50 ఎకరాలు, కొన్ని సందర్భాల్లో హెచ్చుగా భూమి పంపకం చేశారు. ఒక గ్రామంలో అక్రమంగా తీసుకున్న భూమి 500 ఎకరాలు వున్నా, ఒక వంద ఎకరాలకు సంబంధించిన రైతులు తమకుకావాలని ముందుకువస్తే వారికి ఆ భూమిని పంపకం చేశారు. తక్కినవారు ముందుకు రానందున పంచలేదు. భూస్వాములంటే భయంవల్లనో, పంచుకున్న భూమి తమకు దక్కుతుందో లేదోననే అనుమానంవల్లనో వారు ముందుకురాలేదు వారు ముందుకు వచ్చినప్పుడే పంపకం చేయాలని ఆ పని తాత్కాలికంగా వాయిదావేశారు. కొన్నాళ్ళ తర్వాత మరికొందరు ముందుకువచ్చి పంచుకున్నారు ఈ విధంగా ఇలాంటి భూమిని పంచటానికి కొంతకాలం పట్టింది.

**అన్యాక్రాంతాలు :** అన్యాక్రాంతాలంటే ఏమిటి ? ఒక భూస్వామి అప్పులిచ్చి లేక దగాచేసి, లేక మరోవిధంగా రైతుకు ఇబ్బందులున్న స్థితిలో అతని భూమిని తనపేర పట్టాచేయించుకొని తాననుభవించటం. ఇలాంటి భూమిని కౌలుకివ్వవచ్చును, లేదా స్వంతసాగు చేయవచ్చును. ఇలాంటి భూములన్నింటికీ అన్యాక్రాంతాలని పేరుపెట్టారు. ఆ భూములను తిరిగి రైతులకు ఇవ్వాలని 'సంఘం' కోరింది. అప్పులకింద తీసుకున్న భూములు తిరిగి ఇవ్వాలంటే అప్పులు కూడా వడ్డీతో, నాగుతో తిరిగి ఇవ్వాలని భూస్వాములు కోరినారు. ఆ భూమిమీద రైతుకు రావలసిన కౌలు లేక మక్తాను భూమిని తీసుకున్న నాటినుంచి 1946

వరకు లెక్కవేస్తే రైతుకు రావలసిన మొత్తం వారు ఇచ్చిన అప్పులకన్నా ఎన్నోరెట్లు మించిపోతున్నది. అలాంటప్పుడు భూస్వాములకు పరిహారం ఇవ్వ నవసరంలేదు. అప్పులు తిరిగి ఇచ్చేదిలేదు. అంతేగాక కొనకుండా ఇతరవిధాల స్వాధీనం చేసుకున్న భూమికి ధర కూడా వుండదు. సాధారణరైతు భూమి అయి నందున అతడు తిరిగి తీసుకోవచ్చును. అతడు పేదరైతే కావచ్చును. లేదా మధ్యతరగతి రైతే కావచ్చును, లేదా వ్యవసాయకూలీ కావచ్చును. వీరిలో ఎవ రైనా వారికి తిరిగి తీసుకునే హక్కువుంది.

భూస్వామి మోసంచేసి రైతుల భూములు స్వాధీనం చేసుకున్నప్పుడు ఈమోసం ఏవిధంగా జరిగింది అనే సమస్యను సంఘం విచారించినది. భూస్వాములే పటేలు పట్వారీలుగా వుండటంవలన ఈ పట్టాలు చేయించుకున్నారు. తండ్రుల నుంచి కొడుకులు పట్టాలు చేయించుకునే సందర్భంలో లేదా సెటిల్మెంటు సమయంలో రైతుల్లో కొందరికి పట్టాలు చేయలేదు. మోసంతో పటేలు పట్వారీలు తమపేర పట్టా చేయించుకున్నారు. అయినా రైతులే భూమిని సాగుచేసుకున్నారు. క్రమంగా వారు కౌలుదార్లుగా అయిపోయారు. కొన్నాళ్ళతర్వాత రైతును భూమి నుంచి తొలగించి 'స్వంతసాగు'లోకి తెచ్చుకున్నారు. పాలేళ్ళద్వారా చేయించారు. ఇలాంటి భూమిని ఆయారైతుల కుటుంబాలవారికి సంఘం ఇప్పించింది. ఇది మరొక తరహా భూమి.

కరువు, కాటకాలవల్ల లేక శిస్తుకు సరిపోయినంత డబ్బు పుట్టకపోవడం వల్ల రైతు వరుసగా బకాయిపడి చెల్లించుకోలేని స్థితిలో దేశముఖు, పటేలు, పట్వారీలు దానిని చెల్లించి ఆ భూములను పట్టాలు చేయించుకున్నారు. అలాంటి భూములను కూడా తిరిగి పేద, మధ్యతరగతి రైతులకు, వ్యవసాయ కూలీలకు పంపకం చేశారు. పేదరైతుల నుంచి భూస్వాముల చేతికి ఏరూపంలో భూమి వచ్చినా దానిని రైతులకు ఇప్పించారు గ్రామసంఘంవారు.

**బీడు భూములు :** భూస్వాములు చాలా భూములను రైతులనుంచి ఆక్రమించు కొని వాటిని పచ్చిక బీళ్ళను చేశారు. ఆ బీళ్ళను కూడా రైతులకు ఎవరివివారికి పంచిపెట్టారు.

**ప్రభుత్వ భూములు :** ఇవి అనేకరకాలు. క్లుప్తంగా చెప్పాలంటే బంచరాయి భూములు. గ్రామంలో భూస్వాములతోసహా రైతులందరూ—పశువులున్నవారంతా

సమిష్టిగా పశువులను మేపుకోవడానికి ఈ బంచరాయి భూములను అట్టిపెట్టారు. ఈ పని సెటిల్మెంటు సమయంలోనే పూర్తయింది. ఇది సమిష్టి భూమి. సాధారణంగా ఇలాంటి భూములన్నీ భూస్వాముల స్వాధీనంలో వుంటాయి. ధనికరైతులు. పలుకుబడిగల ఇతరులు తమతమ భూములకందుబాటులోవున్న భూములను తమ స్వాధీనంలో అట్టిపెట్టుకొని పశువుల బీళ్ళకు ఉపయోగించేవారు. చిన్నచిన్న ఖండాలుగా వున్నచోట ఏరైతుకి ఏఖండం అందుబాటులో వుంటే ఆ ఖండంలో పశువులను మేపుకునేవారు. పెద్దవైతే భూస్వాములు మేపుకునేవారు. సాధారణ పేదరైతులకు, కూలీలకు దున్నుకోటానికి భూమి లేనందున గ్రామానికి సమిష్టి భూమి అవసరమా లేదా అన్న అంశాన్ని గమనించకుండా ఈ భూములను అందరికీ పంచి ఇచ్చారు. అదేవిధంగా సాగుకు లాయకైన పోరంబోకు భూములను కూడా పంచి ఇచ్చారు.

ఖాలిజ్ ఖాతా అనే పేరుతో మరొక రకపు భూములున్నాయి (relinquished lands). పాతకాలంలో రైతులు కొందరు శిస్తులు కట్టలేక బకాయిలు పడటంవల్ల ఈ భూములను గవర్నమెంటుకి వదిలిపెట్టారు. ఆ భూములను కూడా తిరిగి ఈ పేదరైతులకు కూలీలకు పంచిపెట్టారు.

**చెరువులోతట్టు భూములు :** చెరువులోతట్టులో రెండు భాగాలుంటాయి. చెరువు కట్టకు దగ్గరగా వున్న భాగం చాలా లోతైనది. సారవంతమైనదే అయినా నీళ్ళుండేచోటు. ఏ చిన్న వర్షం వచ్చినా మునిగిపోతుంది. దీన్ని వదిలివేస్తే లోతట్టు చుట్టూవున్న భూమి సాగుకు వీలుగా వుంటుంది. దీనిలో బావులు తవ్వుకొని మాగాణి సాగుచేసుకోవచ్చు. లేదా రబీలో మెట్టపైరు పండించవచ్చు. డిసెంబరు తర్వాత నీళ్ళు తగ్గిపోగానే రెండోపంట (వేసంగి) వరి, జొన్న కోసం ఈ భూమి ఉపయోగపడుతుంది. ఈ భూములనుకూడా పంచారు. ఇలాంటి భూముల్లో కొంత భాగం అప్పటికే రైతులు సాగుచేసుకున్నారు. వాటిని వారికే ఖాయపరిచి మిగతా భూములను పంచారు.

భూస్వాముల భూమినంతటినీ అప్పటివరకు పంపకం చేయలేదు. పేద రైతులు కూలీలు పంచుకోటానికి ముందుకు రానందువలన భూములను దక్కించుకోలేరని బలవంతంగా ఇవ్వలేదు. పంచిన భూములు దక్కించుకోవాలంటే రైతులు పోరాడాలి అనే దృష్టితో ముందుకు రానివారికి భూమిని పంచలేదు ఈ విధంగా భూమిపంపకం చేసినతర్వాత భూమి పంచుకున్న ప్రతికుటుంబంనుంచీ ఒక్కరూ,

ఇద్దరూ వలంటీరు దళాలలో చేరినారు. ప్రతిఘటించి భూములను రక్షించుకోవటానికి సిద్ధం అయినారు. ఇది ఆనాటి కార్యక్రమం.

ఇదేవిధంగా భూస్వాములు అక్రమంగా ప్రజలనుంచి దండుగనీ, లేక తగాదా పరిష్కారమనీ తీసుకున్న డబ్బునూ ధాన్యాన్నీ నాగులపేరుతో దొంగ లెక్కలురాసి లాగిన ధాన్యాన్నీ, డబ్బునూ సంఘ నాయకులు ప్రజలకు ఇప్పించారు. ఈ డబ్బు, ధాన్యపు లెక్కలను నిర్ణయించటానికి ప్రజల రిపోర్టుమీదనే ఆధారపడవలసివచ్చింది. తమ గుర్తుచొప్పున కొందరు 10 ఏళ్ళనుంచి వసూలు చేసిన డబ్బూ, ధాన్యమూ లెక్కలను చెప్పగలిగారు. కొందరు 15 ఏళ్ళనుంచి చెప్పగలిగారు. కొందరు 5 ఏళ్ళనుంచి చెప్పగలిగారు. ప్రజలు తమ గుర్తుతో ఎంత చెప్పితే అంతా రాసి మొత్తంగా పదివేలనుంచి యాభైవేల రూపాయల వరకు దేశముఖు, పటేలు, పట్వారీలనుంచి డబ్బు తిరిగిరావాలని కోరినారు. వారి కొట్టుల్లో వున్నంతవరకూ ధాన్యాన్ని తిరిగి తీసుకొని ప్రజలకు పంపకం చేశారు.

డబ్బుకి సంబంధించినంత వరకూ కొందరు భూస్వాములు రాజీబేరానికి వచ్చారు. 20 వేల రూపాయలు ఇవ్వాలని నిర్ణయిస్తే 8 వేలో 10 వేలో ఏకో ఒక మొత్తం ఇవ్వటానికి ఒప్పుకొని రాజీపడినారు. ఈ డబ్బును ఎవరిది వారికి ఇచ్చి వేసినా దాని నుంచి గ్రామానికి అవసరమైన ఖర్చులకు కొంత అట్టిపెట్టి కొంత సంఘం కార్యకలాపాలకు - కేంద్రానికి పంపేవారు. దీనికై ప్రజల అంగీకారం పొందటం తప్పని సరి. ధాన్యం అంతా ప్రజలదే. వారికే పంచిపెట్టాలి. ఉదా : భూస్వాముల కొట్టులో వందబస్తాల ధాన్యం వుంటే దానిని ప్రజలందరినీ పిలిచి పంచిపెట్టాలి. ఈ సందర్భంలో వున్నవారూ, లేని వారూ అనే సమస్య వచ్చింది. ధనిక రైతులకు ధాన్యం అవసరముండదు. మధ్యతరగతి రైతుల జీవితం బొటాబొటిగా సాగుతుంది. వారికి కొన్ని సందర్భాలలో అవసరముంటుంది. పేదరైతులకు, వ్యవసాయ కూలీలకు మాత్రం అవసరముంటుంది. వీరికి సమానంగా పంపకం చేయటమే అప్పటి విధానం. ఈ సమయంలో ధనిక రైతులు గంపలువేసుకొని వచ్చేవారు. వారిని 'మీకు డబ్బువున్నది, ధాన్యం వున్నది. ఇంట్లో గంపతీసుకొని ఎందుకువచ్చారు?' అని మందలించి వెళ్ళగొట్టడం అసాధ్యమయ్యేది ప్రజలకు. ఒక ధనికరైతు పెద్దమనిషి గంప వేసుకొనివస్తే ఉత్తచేతులతో పంపించటం మర్యాదకాదని ప్రజలు గంపనింపి పంపించేవారు. అనేక సందర్భాలలో ధనికరైతులు ముందుకువచ్చి కొలతవేసి పంపకం చేసేవారు. వారికి తెలివితేటలుంటాయి. గ్రామంలో ఎవరి పరిస్థితి ఏమిటో తెలిసివుంటుంది.

గ్రామ సంఘాల్లో నాయకత్వ స్థానాల్లో వుంటారు. దీన్ని అవకాశంగా తీసుకొని ధాన్యాన్ని పంచటానికి ముందుకు వచ్చేవారు. ప్రజల్లో వర్గచైతన్యం లోపించి నప్పుడు ఇలా జరుగుతుంది. పార్టీనాయకత్వం దీన్ని గమనించి ధనిక రైతులను పంపకపు బాధ్యతనుంచి తగ్గించడానికి ప్రయత్నించింది. అయినా వారు ఏదో విధంగా ఈవ్యవహారంలో తలదూర్చేవారు.

భూస్వాములు గ్రామంనుంచి పరారి చిత్తగించినప్పుడు డబ్బు సమస్య అప్పటికప్పుడు పరిష్కారమయ్యేదికాదు. వాయిదా వేసేవారు. వారి వ్యవసాయం సాగనివ్వక, రావలసిన ఆదాయాన్ని పట్టివేసి, ఇతరవిధాలా ఒత్తిడిచేస్తే వారు దిగివచ్చి గ్రామానికి వచ్చినారాకున్నా పరిష్కారం చేసుకునేవారు. ధాన్యంపంచే సందర్భంలో ఈసమస్యరాలేదు. భూస్వాములున్నా లేకున్నా గ్రామసంఘ నిర్ణయం ప్రకారం గ్రామీణ పేదలకు ధాన్యాన్ని పంపకం చేశారు.

స్త్రీలు : కష్టజీవులైన రైతుకూలీ స్త్రీలంతా సంఘంలో చేరారు. వారంతా ఇంట్లో నుంచి పనులకోసం బయటికి వస్తుంటారు. పొలాల్లో అంతాకలిసి పనిచేయ టమే వారి సామాజిక జీవితం. సంఘంలో చేరిన స్త్రీలంతా బహిరంగ సభలకు హాజ రయినారు. ఆకునూరు, మాచిరెడ్డిపల్లి సంఘటనలను వివరించి స్త్రీలు ఆత్మరక్షణకు సిద్ధంకావాలనీ, కారం, రోకలిబండలు స్వీయరక్షణకు ఆయుధాలుగా ఉపయో గించాలనీ సభల్లో చెప్పటం మామూలు. కొందరు వలంటీరు దళాల్లో చేరినారు.

**సాహిత్యం-సాంస్కృతిక కళారూపాలు :** స్త్రీలనుసమీకరించటానికి జానపద కళారూపాలు వుపయోగపడినవి. పండుగ రోజుల్లో రైతుకూలీ స్త్రీలు కోలాటాలు వేస్తూవుంటారు. ఈ కళారూపం బాగా ఉపయోగపడింది. పాతకాలపు పౌరాణిక గాథలపై ఆధారపడిన పాటల్ని వదిలేసి కొత్తపాటల్ని రూపొందించినారు. దేశ ముఖుల దోపిడీ ఏరూపంలో సాగుతున్నది. దానినేవిధంగా ఎదుర్కొని విముక్తి సాధించాలనేదే ఆ పాటల సారాంశం. జనగామ తాలూకా భూస్వాములు ప్రజలను పెట్టే బాధలు ఈపాటల్లో వర్ణించారు. వెట్టిచాకిరి, కూలిపనులు చేసేస్త్రీలు భూస్వాముల ఇళ్ళలో, పొలాల్లో పనిచేసే సందర్భంలో పడేబాధలు ఈ పాటల్లో కొట్టవచ్చినట్టు కన్పిస్తాయి.

అమరజీవి కొమరయ్యను కీర్తిస్తూ రాసిన పాటను అన్ని సందర్భాలలో పాడేవారు. కోలాటాలను, గ్రామీణ ప్రాంతాల్లో అమలులో వున్న ఇతర సాంస్కృ తిక రూపాలను ఈ పాటలకు వుపయోగించారు.

**వ్యవసాయ కూలీలు - వారి సమస్యలు :** సూర్యాపేట తాలూకాలోని రావిపాడు అను గ్రామంలో బహిరంగ సభలో భూస్వాములు రైతులపై సాగించే దోపిడీని గురించి ఒక కార్యకర్త మాట్లాడుతూ వున్నప్పుడు ఒక వ్యవసాయ కూలీ లేచి "మీరు ఎప్పుడూ రైతుల కష్టాలను గురించి మాట్లాడుతారేకాని పాలేర్ల వ్యవసాయ కూలీల కష్టాల సంగతి ఎత్తుకోరేమిటి?" అని ప్రశ్నించాడు. పార్టీ, ఆంధ్రమహాసభలు ఈ సమస్యలపై కార్యక్రమాన్ని అందించని మాట నిజమే. జనగామ తాలూకా ఉద్యమ ప్రారంభంలో వీరి సమస్యలు కొన్ని ఆంధ్రమహాసభ దృష్టికి వచ్చిన మాట కూడా నిజమే. కాని ఆనాటి కార్యక్రమ పరిధిలో ఈ సమస్యలు తీసుకొని పనిచేయలేదు. కొమరయ్య అమరత్వం తర్వాత వచ్చిన వెల్లువలో వ్యవసాయ కూలీలు ముఖ్యమైన పాత్రను నిర్వహించినా వారి సమస్యలను ముందే గుర్తించి కార్యక్రమంలో చేర్చలేదు. నిర్బంధ విధానం తీవ్రతరమై ప్రభుత్వ సాయుధబలాల కాల్పులు ప్రారంభమైన సమయంలో ఈ సమస్య ముందుకు వచ్చింది.

ఆ కార్యకర్త బహిరంగ సభలో జరిగిన సంఘటనను జిల్లాకేంద్రానికి వెంటనే తెలియజేశాడు. సమస్యలన్నీ జిల్లా కేంద్రానికి తెలిసినవే. జిల్లా కేంద్రం అప్పటికప్పుడు వ్యవసాయ కూలీలకు, పాలేర్లకూ ఒక కార్యక్రమాన్ని రూపొందించి కార్యకర్తలకు, గ్రామ సంఘాలకు అందించింది. గ్రామ సంఘాలద్వారా పాలేర్ల నెలజీతాలను, కూలీల రోజుకూలీ రేటును హెచ్చించి, పనిగంటలు, ఇతర సౌకర్యాలను అమలు జరిపించారు.

పెద్దపెద్ద గ్రామాలలో వ్యవసాయ కూలీల సంఖ్య హెచ్చుగా ఉంటుంది. సంవత్సరానికి మాట్లాడుకున్నా నెలవారీగా జీతం ఇచ్చేవారు ధనిక రైతులు, భూస్వాములు. ఆ కాలంలో అమల్లో వున్న రేటు నెలకు తూమెడు వడ్లు (30 కిలోలు). దాన్ని 5 నుంచి 10 మానికలవరకు పెంచాలని సంఘం తరపున కోరినారు. అదేవిధంగా అప్పులు, ఇతర సౌకర్యాలగురించి కోర్కెలను నిర్ణయించినారు.

ఈ విధంగా వ్యవసాయ విప్లవ కార్యక్రమంలో మరో ముఖ్యమైన అంశం చేరింది. దీనితో వ్యవసాయ కూలీలను పెద్దయెత్తున సమీకరించటానికి అవకాశం కలిగింది. మొదటి రోజుల్లో ధనిక రైతులు, పాలేర్లను పెట్టుకునే మధ్యతరగతి రైతులు కూడా కలిసివచ్చినారు. కాని వారు పాలేర్ల సంఖ్యను కనీసానికి తగ్గించి

కుటుంబ సభ్యులే హెచ్చుగా కష్టించసాగినారు. రోజు కూలీల సంఖ్య తగ్గలేదు. ఈ విధంగా సంఘ కార్యకర్తలు కూలిరేట్లను పెంచటానికి కృషిచేశారు. భూస్వాములకు ఇష్టంలేకున్నా మొదటి దశలో కూలీరేట్లను పెంచటానికి అంగీకరించారు. ప్రజా వుద్యమ భయమే దీనికి ప్రధాన కారణం.

## 8. మిలటరీదాడులు - కాల్పులు - కార్యకర్తల వీరమరణం

ఈ పరిస్థితుల్లో మీర్జా ఇస్మాయిల్ సంస్థానానికి ప్రధానమంత్రి అయినాడు (1946 ఆగస్టు). స్టేటు కాంగ్రెసు వారు బాధ్యతాయుత ప్రభుత్వం వస్తుందని మురుస్తూ మీర్జా ఇస్మాయిల్ తమకు అనుకూలమైన ప్రధాన మంత్రి అని ఉత్సాహంతో తమ కార్యకలాపాలు సాగించారు. ప్రభుత్వం నిర్బంధం తీవ్రతరం చేసింది. పోలీసులను ప్రతిఘటించడానికి ప్రజలు సిద్ధంగా వున్నందున మిలటరీని ఉపయోగించటానికి నిర్ణయించింది.

మిలటరీ దాడులు అక్టోబరు చివరలో ప్రారంభమై డిసెంబరు దాకా సాగినవి. కాల్పులు జరిపింది కొన్ని కేంద్రాల్లోనే. జనగామ తాలూకాలో దేవరుప్పల, కామారెడ్డి గూడెం గ్రామాలు, సూర్యాపేట తాలూకాలో బాలెంల, పాత సూర్యాపేట గ్రామాలు, హుజూరునగరు తాలూకాలో మల్లారెడ్డి గూడెం, భువనగిరి తాలూకాలో పులిగిల్ల గ్రామంలో మిలటరీ కాల్పులు చేసిన ఫలితంగా స్థానిక నాయకులు వీరమరణం పొందారు. సంఘటనలు క్లుప్తంగా ఈ విధంగా ఉన్నాయి:

**బాలెముల :** "సూర్యాపేట తాలూకా పోరాట కేంద్రమైన బాలెములపై సాయుధ దాడికై ప్రభుత్వం రిజర్వుదళాలను పంపింది. దళాలు తెల్లవారు జామున గ్రామంపై దాడిచేసి పొలాలకు కాలకృత్యాలకై వెళ్ళిన వారిపైనా, సోదాల పేరుతో ఇండ్లలో జొరబడి, స్త్రీ పురుషులపైనా దెబ్బలవర్షం కురిపించారు ఒక్క క్షణంలో రాక్షసత్వాన్ని నగ్నంగా ప్రదర్శించారు.

"అప్పటికప్పుడే బయటికి వచ్చిన 5-6 గురు రైతుకూలీ యువకులు వీరిని ప్రతిఘటించారు. గార్లపాటి అనంతరెడ్డి, పజేలు మట్టారెడ్డి తమకు దొరికిన కర్రలతో, మొద్దులతో, చెక్కలతో పోలీసుల దౌర్జన్యాలను ఎదుర్కొనడానికి తలపడినారు

"పోలీసుల కాళ్లు చేతులు విరిగి తలలు పగిలినవి. వీరికి నాయకత్వం వహించిన సర్కిల్ ఇన్‌స్పెక్టరుకు అదే గతి పట్టింది. 25 మంది సాయుధ పోలీసులు ఆరుగురు యువతులను ఎదిరించలేక తుపాకులు కాల్చారు. మొదటి గుండు గార్లపాటి అనంతరెడ్డి గుండెను చీల్చివేసింది. అనంతరెడ్డి అంతటితో ఆగలేదు. ప్రజలు తనపైనిడిన బాధ్యతను తుదిక్షణం దాకా నిర్వహించాలని పడిపోయిన వాడు లేచి కర్రనెత్తాడు. సర్కిల్ వెంటవెంటనే కాల్చగా 'టపా రాయలు వున్నట్టున్నాయే' అని నేలకొరిగినాడు.

"ఈ తుపాకి గుండ్లతోనే పటేలు మట్టారెడ్డి కిందపడినాడు ముస్లిం పేద రైతు జమాలు సాహెబు, మరి కొందరు కూడా గాయపడినారు.

"ఒక నిముషంలో గ్రామ ప్రజలంతా తమకు దొరికిన ఆయుధాలు తీసుకొని రంగానికి చేరుకున్నారు. ఆయుధాలు వెంట వున్నప్పటికీ పోరాడలేని పిరికిపందలు పోలీసులు పిక్కబలం చూపారు.

"ఒక పోలీసు చెప్పినట్లు '5 నిముషాలు ఆలస్యమైతే మేము మా భార్యా పిల్లలను చూచుకోలేక పోయేవారము' అనే స్థితిలో ఆ పోలీసు హంతకులుండిరి." (నల్లగొండ ప్రజల వీరోచిత పోరాటం : పేజీ - 15-16)

బాలెముల గ్రామంలో దౌర్జన్యపరులైన భూస్వాములెవరూ లేరు. కాని ఆ గ్రామం పార్టీ, ఆంధ్ర మహాసభ కార్యకలాపాలకు కేంద్రమై చుట్టుపట్టు గ్రామాలకు అండదండగా వుండేది. సూర్యాపేటకు సమీపాన రోడ్డుపైన ఉండుట వలన పార్టీ కార్యకర్తలు ఈ గ్రామంలో రహస్యంగా వుంటూ సూర్యాపేట పట్టణంలో కూడా రహస్యంగా తమ కార్యకలాపాలు సాగించేవారు. తాలూకాలోని లోదట్టు (interior) గ్రామాలకువెళ్ళటానికి ఈ గ్రామం ముఖ్య కేంద్రం కూడా.

కాల్పుల వలన ప్రజల్లో నిరుత్సాహం రాలేదు. వీరమరణం పొందిన మట్టారెడ్డి, అనంతరెడ్డి దహన సంస్కారాలకు ఆ గ్రామ ప్రజలే గాక చుట్టుపట్టు గ్రామాల నుంచి ప్రజలు హాజరైనారు. "కమ్యూనిస్టు పార్టీకి జై", "ఆంధ్ర మహాసభకి జై" అనే నినాదాలు మార్మోగుతూవుంటే అంత్యక్రియలు జరిపారు.

**దేవరుప్పల — కామారెడ్డిగూడెం :** దాదాపు ఇదే సమయాన జనగామ తాలూకాలోని దేవరుప్పల, కామారెడ్డి గూడెం గ్రామాల్లో మిలటరీ దాడులు చేసి స్థానికకార్యకర్తలను కాల్చివేసింది. సంఘటనలు ఈ విధంగా వున్నవి :

"కాల్పులతో ప్రాణాలను బలిగొన్నా, వేలకువేలు ఎదురుగా నిలిచి

పోరాడుతున్న ప్రజాశక్తిని చూచి మిలటరీ కూడా నిరుత్సాహపడే స్థితి వచ్చింది. అధికారులు ఈ దుస్థితి నుంచి కాపాడుకోటానికి దేవరుప్పులపై (జనగామ) సుమారు 3 గంటల రాత్రివేళ దాడిచేశారు. గ్రామంలోని పురుషులందరినీ అరెస్టు చేశారు.

"అప్పటికే కొమురయ్య జన్మస్థానంలో అరెస్టుకాగా మిగిలిన 30 మంది రైతుకూలీ యువకుల దళం దేవరుప్పుల ప్రజలకు సాయం చేయటానికి ఆ రాత్రే వచ్చి చేరింది. కాని మిలటరీ వాళ్ళు ఆ దళం గ్రామంలోనికి చేరకముందే దళ నాయకులలో ముఖ్యులైన మందడి సోమిరెడ్డిని రౌడీలు స్థానిక జమీందారీ ముఠా కనుసైగతో కాల్చిచంపినారు. తక్కినవారిని అరెస్టు చేశారు.

"ధర్మాపురం ప్రజలు—లంబాడీలు, గొల్లలు వడిసెలలతో గ్రామానికి చేరుకున్నారు. మిలటరీ వాళ్ళ నుంచి ఒక దళం వారిని కాల్చడానికి వెంట పడింది. కానీ లంబాడీలు వెనుకకు తగ్గుతూ వెళ్ళినారు. కొంతదూరం వరకూ మిలటరీదళం రాగానే దూరం నుంచి రాళ్ళ వానను కురిపించారు. తిరిగి గ్రామం చేరుకున్న దాకా మిలటరీని తరుమివేసినారు.

"వలంటీరు దళాలకు నాయకత్వం వహిస్తూ దేవరుప్పులలో మిలటరీచే హింసింపబడుతున్న స్త్రీలను రక్షించడానికి వెళుతూన్న గోలిపాపిరెడ్డిని గ్రామంలోకి ప్రవేశించకముందే కాల్చిచంపినారు.

"పక్కనే వున్న రామారెడ్డి గూడెం స్త్రీలు కారపు ముంతలు తీసుకొని గ్రామాన్ని చుట్టివేశారు. మిలటరి లారీలు గ్రామంలో జొరబడటానికి ధైర్యం చేయలేకపోయాయి." (పై పుస్తకం: పేజి-22 23)

కాల్పుల తర్వాత సుమారు 400 మందిని అరెస్టుచేసి తీసుకువెళ్ళారు. వారు వెళ్ళే సమయాన మిగిలిన ప్రజలు 'కమ్యూనిస్టు పార్టీకి జై', 'ఆంధ్రమహాసభకు జై' అంటూ తమ అసమ్మతిని ప్రదర్శించారు.

ఆ రోజు మరుసటి రోజు జరిగిన పరిణామాలు ఇలా వున్నవి :

"జనగామ, భువనగిరి తాలూకాలనుంచి సుమారు 3000 మంది ప్రజలు ఊరేగింపులో వచ్చి గ్రామంలో అసమ్మతి ప్రదర్శన చేశారు. అరెస్టు అయిన కుటుంబాలకు అవసరమైన సాయం కొరకు ఏర్పాట్లు జరిగినవి.

"దేవరుప్పుల స్త్రీలు సుమారు రెండు పుట్ల బియ్యం వండి వచ్చిన ప్రజానీకానికి అన్నం పెట్టినారు.

"గ్రామంలోని జమీందారీ రౌడీ ముఠాలు పలాయనం చిత్తగించాయి."
(పై పుస్తకం : పేజీ - 23)

కాల్పులకు గురి అయిన ఇద్దరూ స్థానిక కార్యకర్తలు. వలంటీరు దళాలకు నాయకులు. తమ తమ బాధ్యతల నిర్వహణలో శిక్షణ పొందినవారు కూడా. కామారెడ్డి గూడెంలో స్త్రీలు మిలటరీ లారీలను గ్రామంలోకి రాకుండా నిరోధించ గలిగారు. దేవరుప్పలలో అనేక గ్రామాల నుంచి వచ్చిన ప్రజలకు భోజన సదుపాయాలు కలిగించి తోడ్పడినారు.

దేవరుప్పల కూడా కమ్యూనిస్టు పార్టీ, ఆంధ్రమహాసభ కార్యకలాపాలకు ముఖ్య కేంద్రంగా ఉండేది. కామారెడ్డి గూడెం దీని శివారు గ్రామమే గాక రోడ్డుకు సమీపాన వున్నది. అమరుడు ఒందగీ జన్మస్థానం. కడివెండిలో కొమరయ్యను హత్య చేసినందున మిలటరీ ఈ గ్రామాలను ఎన్నుకున్నది.

**పాత సూర్యాపేట** : ఈ గ్రామంలో మిలటరీ కాల్పుల వివరాలు ఈ విధంగా వున్నవి :

"పాత సూర్యాపేట రెండుమూడువందల ఇండ్లువున్న చిన్నపల్లె. దీనిపై దాడిచేయటానికి 500 మంది మిలటరీని ప్రయోగించారు సర్కారువారు.

"తెల్లవారేసరికి గ్రామాన్ని చుట్టివేసింది మిలటరీ. గ్రామంలోని స్త్రీ పురుషులు ఖాళీచేసి బయటికి వెళ్ళిపోవటానికి ప్రయత్నించారు. కాని వారిని వెళ్ళ నీయకుండా సైన్యం చుట్టివేసింది

"పాపం మిలటరీవాళ్ళవెంట వచ్చిన అధికారులు, జమీందారులు మిలటరీ తుపాకులు మొదలగువాటిని చూచి భయపడి ప్రజలు కుయ్యో, మొర్రో అని తమ పాదాక్రాంతులవుతారని ఆశించారు. ఎప్పుడా అని మీసాలు ఎక్కపెట్టుకొని, ముసిముసినవ్వులు నవ్వుతూ చూస్తున్నారు జమీందారులు. కాని కొద్దిసేపటిలో వారు చూచింది మరోదృశ్యం. ప్రజలంతా గుంపులు, గుంపులుగా దూరంగా ఉండటం సాగించారు. మరికొంతసేపటికి వందలు వేల సంఖ్యలో ఇతర గ్రామాల నుండి ప్రజలు తయారు. అందరిచేతా లాఠీలు, వడిసెలలు వున్నాయి. నిముస నిముసానికి పెరుగుతున్నవారి సంఖ్యను చూసి అధికారుల గుండెలవిసిపోయినాయి. వచ్చినప్రజలు ఏదో అల్లరిచేస్తే పెద్దఎత్తున కాల్పులు సాగించుదామనుకున్నారు అధికారులు. కానీ అదేమీ జరుగలేదు. స్థానిక ప్రజానాయకుడు సరసాని నర్సయ్య వచ్చినవారినందరినీ చిన్నచిన్న గుంపులుగా సర్దివేస్తున్నాడు. ప్రజలు

శాంతంగా, గంభీరంగా నిలుచున్నారు. అధికారులకు ప్రజలను రెచ్చగొట్టడం తప్ప గత్యంతరం లేకపోయింది. కొంతసేపు చూచి ఒకవైపున ప్రజలను సర్దడానికి వస్తున్న సరసాని నర్సయ్యను అక్కడి జమీందారుల కనుసన్నలతో కాల్చివేశారు. మరోవైపు స్త్రీ పురుషులను చుట్టివేసిన సాయుధదళాలు పురుషులను దెబ్బలు కొడుతూ హింసించసాగినాయి.

"ఈ హింసాకాండను సహించలెని స్త్రీలు పురుషుల రక్షణకు పూనుకున్నారు. ప్రజలు ఒకవైపున, మరొకవైపున పోలీసు మిలటరీ హోరాహోరీగా పోరాడినారు.

"గుంపులుగుంపులుగా వున్న ప్రజలు ఈ రెచ్చగొట్టే విధానాన్ని సహించలేకపోయారు. ఒక్కుమ్మడిగా అంతా ముందుకుసాగినారు. తిరిగి కాల్పులు, టియర్‌గ్యాస్, మరికొంతమందికి గాయాలు.

"కొంతమంది ప్రజలు కాల్పుల తర్వాత వెనుకకు తగ్గినా మరికొంతమంది సుమారు 1000 మంది అదేవిధంగా తుపాకిగుండ్ల ఎదుట నిలుచున్నారు. కాని ఇకముందు కాల్పులు సాగించటానికి గుండెలు లేకపోయినవి.

"ఈ విధంగా ఒక గంటసేపు ఘర్షణ జరిగిన తర్వాత జమీందారులు చూపించినవారిని మొత్తం 150 మందిని అరెస్టుచేసుకొని తీసుకువెళ్ళినారు. సరసాని నర్సయ్యను ప్రజలకు, అతని బంధువులకు ఇవ్వనిరాకరించారు. జమీందారుల పూజను విడిచిన ప్రజలు వీరపూజ చేస్తారన్న భయం ప్రభుత్వానికి పట్టింది.

"ప్రజలంతా (సుమారు 3-4 వేలు) సమావేశమైనారు. ఈ ఆయుధాలకు ఎదురుగా మనమెక్కడ నిలుస్తామని ఎవ్వరూ అనలేదు. "వీళ్ళను ఎదిరించటానికి ఆయుధాలు కావాలి. ఇదీ ప్రతివాని నోటినుంచీ వచ్చినమాట." (పై పుస్తకం: పేజీలు : 20-21)

పాతసూర్యాపేట సూర్యాపేట తాలూకాలోని ఒక గ్రామం. తాలూకాలో అందరికన్నా పెద్దదేశముఖు గ్రామాలలో ఒకటి. ఇది కూడా పార్టీ, ఆంధ్ర మహాసభ కార్యకలాపాలకు ఒక ముఖ్యకేంద్రం.

బాలెంల, దేవరుప్పల గ్రామాల్లో జరిగిన మిలటరీ కాల్పుల అనుభవాలను దృష్టిలో వుంచుకొని ప్రజలంతా ఒకేచోట గుమికూడవద్దనీ, గుంపుగుంపులుగా చేరి ఆత్మరక్షణ చేసుకోవాలని, అకస్మాత్తుగా ఇళ్ళల్లోకి ప్రవేశిస్తే ఇళ్ళలో ఉండి

ఆత్మరక్షణ చేసుకోవాలని నిర్ణయించి, దానికి అనుగుణంగా వలంటీరు దళాలకు శిక్షణ ఇచ్చింది. ఎత్తుగడలు స్వల్పంగా మారినాయేగాని పూర్తిగా మారలేదు.

ఇక్కడే ప్రజలు మొదటిసారిగా "ఆతారాలు" కావాలి, గుతపలు, వడిసెల లతో మాత్రమే మిలటరీని ఎదిరించలేమనే అభిప్రాయాన్ని ప్రకటించారు. "ఆతారా"లంటే ఆయుధాలు (హతియార్ అనేది ఉర్దూపదం) తుపాకులు కావాలని వారి ఉద్దేశ్యం.

**పులిగిల్ల :** "పులిగిల్ల భోనగిరి తాలూకాలో జాగీరుగ్రామం. ప్రజలు జాగీరుదారుకు వ్యతిరేకంగా పోరాడి అనేక విజయాలుసాధించారు.

"జిల్లాలో మిలటరీ ఉండగానే ప్రజలను పూర్వంమాదిరిగా దోచుకోటానికి పీలయ్యే కట్టుబాట్లు చేసుకుంటున్నాడు అందరివలెనే ఈ జాగిర్దారు కూడా. మొదటి ప్రయత్నం కేసులుపెట్టి గ్రామనాయకులను అరెస్టుచేయించటం. ఈసారి లంచాలు పెట్టి రిజర్వు పోలీసు దాడి చేయించాడు.

"జేబులు నింపుకొని, తూటాలు నింపిన తుపాకులతో ఒక పోలీసుదళం 28-11-46 ఉదయం గ్రామాన్ని చేరుకున్నది. స్థానిక జమీందారీముఠా చెప్పిన వారిని అరెస్టుచేసి తీసుకుపోసాగింది. ప్రజలు తమ నాయకులను విడిపించుకోటా నికి బయలుదేరినారు. ఒకక్షణంలో పోలీసులను చుట్టివేసారు. తమ నాయకుల చేతులు కాళ్ళకు తగిలించిన సంకెళ్ళను తీసివేసి విడిచిపెట్టమన్నారు. లక్షలాదిగా సంపాదనకవకాశమున్న ఈ సమయంలో సంకెళ్ళను తీసివేసిందాని కన్న కొందరి ప్రాణంతీసి మరొకజేబు నింపుకుందామనుకున్నారు పోలీసులు.

"తుపాకులు పేల్చారు. వెంటనే ముగ్గురు (కొమ్మిడి బుచ్చిరెడ్డి, బొబ్బ నర్సిరెడ్డి, బండారి నర్సిరెడ్డి) మరణించారు. కొందరు అపాయకరంగా గాయ పడ్డారు. చుట్టూవున్న ప్రజలు వెనుకముందు చూడకుండా పోలీసులపైన పడ్డారు. చితుకగొట్టారు. ముగ్గురు పోలీసులు, ముగ్గురు జాగీరు ఉద్యోగుల ప్రాణాలు పోయినవి. మరికొందరికి తీవ్రమైన గాయాలు తగిలినవి.

"నాయకుల సంకెళ్ళను పగులకొట్టి విడిపించుకున్నారు. నల్లగొండలో పోలీసు కళేబరాల ప్రదర్శనం జరిగింది. ప్రజలతో పోరాడే వారిగతి ఏమవుతుందో

పోలీసు ఉద్యోగులు, వారి కుటుంబాలు తెలుసుకున్నారు. చనిపోయిన వారికోసం ఏడ్చేవారు కొందరైతే ముందేమికానున్నదోనని ఏడ్చేవారు మరికొందరు.

“జమీందారీ అధికారులు బొమ్మలలో, అరాచకంలో ఆరితేరిన రాయచూరు రి ప్రవాహాన్ని తెచ్చి పులిగిల్లపైన దాడిచేశారు. టాంకులు, ఫిరంగిదళాల విన్యాసాలు సాగారు గ్రామసమీపాన”. (పైపుస్తకం : పేజి–25, 26)

ఇక్కడ దాడిచేసింది పోలీసులు. దాడిలో స్థానికరైతులు చనిపోయారు. ప్రతిఘటన ఫలితంగా పోలీసులు, జాగీరు ఉద్యోగులు చనిపోయారు. తర్వాత గ్రామాన్ని భీభత్సం చేయటానికి మిలటరీ వచ్చింది. రాయచూరు ప్రస్తుతం కర్ణాటకలోని సరిహద్దు జిల్లా.

మల్లారెడ్డిగూడెం : “......1వ డిసెంబరునాడు తెల్లవారేవరకు మల్లారెడ్డి గూడెం గ్రామాన్ని చుట్టివేశారు. హుజూరునగర్ తాలూకాలో ఇది ఉద్యమానికి కేంద్రంగా ఉండటం దగ్గరగా ఉండే బక్కవంతుల గూడెం భూస్వామి భోగాల పీరారెడ్డి దోపిడీకి ఆటంకంగా ఉండటం వలనే ఈ దాడి జరిగింది.

“ప్రతిఘటించినా లేకున్నా మిలటరీ కొంతమందిని కాల్చిచంపటం తప్పదనుకున్నారు ప్రజలు.

“రిజర్వుదాడులను ఎదిరించటానికి సిద్ధంచేసిన వడిసెలలతో మిలటరీని గ్రామంలోకి రాకుండా నిరోధించబూనుకున్నారు. ఇండ్లలోనుంచి గోడలపైనుంచి సాధ్యమైనంతవరకు రాళ్ళురువ్వారు.

“స్త్రీలు రాళ్ళు అందించటం, పురుషులు రువ్వటం, కొందరు స్త్రీలు తామే వడిసెలలు తీసుకొని రాళ్ళురువ్వ ప్రారంభించారు. కొందరు మిలటరీవాళ్ళ తలపైని టొప్పెలు (ఇనుపటోపీలు) ఎగిరిపోతున్నవి. మరికొందరికి శరీరంపైన దెబ్బలు తగులుతున్నవి. కొందరు తాళలేక వెనుకకు తగ్గుతున్నారు.

“రాళ్ళకుప్పలు దగ్గరపడినవి. 3 గంటల పోరాటంలో ప్రజలు సొక్కిపోయినారు. అయినా తుదిక్షణం దాకా పోరాడుతూనే వున్నారు.

“మిలటరీవాళ్ళు తుపాకులు కిందవేసేసరికి ప్రజలు కూడా రాళ్ళురువ్వటం మానివేశారు.

“మోసంతో కొందరు మరొకవైపునుంచి వచ్చి గుంపుగావున్న స్త్రీ–పురుషుల పైన కాల్చారు. గ్రామ నాయకులను పిలిచి మాట్లాడుతామనే నెపంతో కాల్చివేశారు.

"ధనికరైతు యువకుడు ఎరబోలు అప్పిరెడ్డి, ముంగి వీరయ్య (యాదవుడు) ప్రాణం విడిచారు.

"హరిజన యువతులు, తోటికోడండ్రు గురవమ్మ తాండమ్మలు, మరొక కష్టజీవి అంకాళమ్మ నేలకొరిగినారు". (పైపుస్తకం, పేజి-24)

హుజూరునగరు తాలూకాలో ఏరహదారి సౌకర్యాలు లేక కృష్ణానది తీరానికి దగ్గరగావున్న లోతట్టు ప్రాంతగ్రామమిది. ఇది కూడా పార్టీ, ఆంధ్రమహాసభ కార్యకలాపాలకు కేంద్రం. ఇక్కడి రిజర్వు అడవిలో కొంతభాగాన్ని నరికి భూమిని సాగుచేసుకున్నారు రైతులు. ఈ సమస్యపై రైతులకూ, ప్రభుత్వానికీ ఏళ్ళతరబడి లిటిగేషన్ నడిచింది. రైతులు భూమిని వదలలేదు. ఆంధ్రమహాసభ తరపున వెదిరె రాజిరెడ్డి అనే సూర్యాపేట కార్యకర్త ఈ వ్యవహారాన్ని చూచేవారు.

మిలటరీ తెల్లవారకమునుపే గ్రామానికి దూరంగా ఒకచోటుకి చేరుకొని పక్కదారుల్లోంచి గ్రామాన్ని చేరుకున్నది. ఊరు చుట్టూవున్న చేలల్లో నక్కి ప్రజలకంటపడకుండా గ్రామాన్ని చుట్టివేసింది. ప్రజలు గ్రామాన్ని ఖాళీచేసి బయటకు వెళ్ళటానికి వీలులేకపోయింది. దీనితో వలంటీర్లలో ముఖ్యులు ఊళ్ళోకి వచ్చే దారిమొగలోకి చేరి ప్రతిఘటించారు. ఆ ప్రదేశంలోని ఇండ్లలో గోడలను చాటుచేసుకొని వడిసెలలతో రాళ్ళు రువ్వసాగినారు. స్త్రీలు రాళ్ళు అందించినారు. చనిపోయిన యువతులు రాళ్ళందించిన స్త్రీలే.

కాల్పుల తర్వాత పెద్ద ఎత్తున గ్రామాలపై మిలటరీ దాడులు సాగినవి. ప్రజలు మిలటరీరాకను కనిపెట్టి, గ్రామాలను ఖాళీచేసేవారు. అరెస్టుచేయటానికి, కొట్టి హింసించటానికి అవకాశంలేకుండా పోయింది. అయినా గ్రామానికి 5 నుంచి 10 వరకు అరెస్టు అయ్యేవారు. కాల్పులు జరిగిన గ్రామాల్లో పెద్ద సంఖ్యలో ప్రజలను అరెస్టుచేశారు. సుమారు 400 మందిని అరెస్టుచేశారు. 10,000 మందిని హింసించారు. గ్రామాలను కొల్లగొట్టిన సందర్భాలు కూడా ఉన్నాయి.

తెలంగాణాలో యుద్ధానంతర ప్రజావెల్లువ, నల్లగొండ జిల్లాలో భూమి పంపకం పోలీసులను మిలటరీని ప్రతిఘటించటం రూపంలో ప్రత్యక్షమయింది. జిల్లా కమ్యూనిస్టుపార్టీ, ఆంధ్రమహాసభ దీనికి నాయకత్వం వహించినవి. ఆకునూరు, మాచిరెడ్డిపల్లి, పాలకుర్తి, కడివెండి, ధర్మాపురంలోవచ్చిన అనుభవాల నుంచి గుణపాఠాలు తీసుకొని ఒక కార్యక్రమాన్ని రూపొందించి అమలు జరిపిందే

కాని దీనికి రాష్ట్రకమిటీ కేంద్రకమిటీ పాలసీలతో ఎలాంటి సంబంధంలేదు. ఆ రోజుల్లో మరే జిల్లాలోనూ ఇలాంటి పోరాటాలు అభివృద్ధి కాలేదు.

ఈ పోరాటానికి 1946కు పూర్వం జనగామ, సూర్యాపేట, ఇతర తాలూకాల్లో సాగిన పోరాటాలకు అవినాభావ సంబంధం వున్నది. ఆ ప్రాంతాలకు ఆనుకొని వున్న ప్రాంతాల్లోనే పోరాటం విస్తరించింది; ఆ ప్రాంతాల్లోనే ఉన్నత స్థానం అందుకున్నది.

పోరాట కార్యక్రమం ఈ విధంగా వున్నది:

1) వెట్టిచాకిరిని నిషేధించాలి
2) అక్రమ పన్నులను, లంచాలను అక్రమంగా వసూలుచేసిన ధాన్యాన్ని తిరిగి ఇచ్చివేయాలి. వీటి వసూళ్ళను నిషేధించాలి.
3) భూస్వాములు అక్రమంగా లాక్కొన్న భూములను తిరిగి ఇచ్చివేయాలి.
4) అన్నిరకాల ప్రభుత్వ నిర్బంధ చర్యలను పోలీసుదాడులను ఆపివేయాలి

ఇది ప్రచార కార్యక్రమం మాత్రమేకాదు. అమలు జరిపిన కార్యక్రమం.

ఈ పోరాటాన్ని నడిపింది కమ్యూనిస్టుపార్టీ, ఆంధ్రమహాసభలు. ఆంధ్రమహాసభకు 1940 పూర్వంనుంచే నిర్మాణం వుంది. తర్వాతకాలంలో ప్రజాసంస్థగా రూపొందింది. కమ్యూనిస్టుపార్టీ 1940లో ప్రారంభమై జిల్లా, తాలూకా, స్థానిక కమిటీలు ఏర్పడి పనిచేశాయి. పోరాట సమయంలో నల్లగొండ జిల్లా కమిటీయేగాక తాలూకా, స్థానిక కమిటీలు కూడా పనిచేశాయి. జిల్లా, తాలూకా కమిటీల విస్తృత సమావేశాలు తరచుగా జరుగుతూ జిల్లాకమిటీ అందించిన కార్యక్రమాన్ని అమలు జరుపుతూ ఉండినవి. పార్టీ అందించిన కార్యక్రమమే గ్రామీణ ప్రాంతాల్లో అమలు జరిగినది.

ఆంధ్రమహాసభ గ్రామకమిటీలు రైతాంగపు విప్లవ కమిటీలుగా పనిచేశాయి. పూర్వపు కమిటీలకు ఈ స్వభావంలేదు. వీటిని గ్రామరాజ్యాలుగా పరిగణించటానికి కావలసిన భౌతిక పరిస్థితులన్నీ ఆ రోజు వుండినవి.

## 9. నిస్తబ్ధత-భయవాతావరణం

గ్రామాల్లో నిస్తబ్ధత, భయవాతావరణం ఏర్పడింది. ఏం చెయ్యాలి ? అనే సమస్య ప్రజలముందుకు వచ్చింది. పాత సూర్యాపేటలాంటి గ్రామాల్లో ప్రజలకు "సంఘం"యెడ కోపం వచ్చింది. ఒక సంఘాన్ని ఏర్పాటు చేసుకొని తమ కష్టాలను పోగొట్టుకోవాలని ప్రయత్నిస్తే మళ్ళీ కష్టాలే దాపురించినాయనే ఆలోచనే "కోపానికి"కారణం. ప్రజలు కోపగించి మన కార్యకర్తలను కొద్దిసేపటిదాకా ఇళ్ళలోకి రానివ్వని ఉదాహరణలు కూడా కొన్ని ఉన్నాయి. కాని అది తాత్కాలికమైనదే. రాజకీయంగా సమస్యను వివరించిన తర్వాత ప్రజలు అర్థం చేసుకొని నిర్బంధవిధానాన్ని ప్రతిఘటించవలసినదే అనే నిర్ణయానికి వచ్చి అంతా సహకరించసాగినారు. గ్రామాల్లో భయవాతావరణం ఏర్పడింది. ప్రభుత్వాన్ని తామెందుకు ఎదిరించలేక పోయామనే ఆలోచన బాగా కలిగింది.

జిల్లా కమిటీ కార్యకర్తలను గ్రామాలకు పంపి ప్రజలు ఏమనుకుంటున్నారో తెలుసుకోటానికి నిర్ణయించింది. భయపడేవారు— 'మనం ఎదిరించలేము. ప్రతిఘటించటం తప్పు'అనే అభిప్రాయం కలవారు కొద్దిమంది ఉన్నారు. వారికి కార్యకర్తలు మితవాదులని పేరు పెట్టినారు. ప్రజలు కూడా అదేపేరుతో పిలువసాగినారు. వీరు వెనుకపట్టు పడుతూ ఉండేవారు. మిలిటెంటుగా ఉండేవారిని కలిసి మాట్లాడితే, 'మనకు తుపాకులుంటే ప్రతిఘటించేవారము; పోలీసు, మిలటరీ రైఫిళ్ళతోనూ, తుపాకులతోనూ వస్తే మనం వడిసెలలతో, కర్రలతో ప్రతిఘటించటం సాధ్యంకాదు' అని తమ అభిప్రాయాన్ని తెలిపారు. పార్టీ నాయకత్వం అప్పటినుంచీ తుపాకులు సాధించటం ఎలా ? వాటిని ఉపయోగించటం ఎలా ? అని ఆలోచించ సాగింది.

**యువరాజు పర్యటన** . కాల్పులు పూర్తికాగానే మీర్జా ఇస్మాయిల్ ఒక ఎత్తువేశాడు. నిజాంనవాబు కొడుకును కాల్పులు జరిగిన గ్రామాల్లో పర్యటన చేయించి ప్రజలను పరామర్శించి చనిపోయిన వారి కుటుంబాలకు కొంత డబ్బు దానం చేయించి ప్రజలను బుజ్జగించే ప్రయత్నం చేశాడు. ఈ రోజుల్లో ప్రజలపై కాల్పులుచేసి ఎక్స్‌గ్రేషియా పేరుతో కొంతడబ్బును ప్రజలమొహాన పడేసి ప్రజలు ఆందోళనకు పూనుకోకుండా ప్రభుత్వంచేసే ప్రయత్నం కొత్తగా కనిపెట్టిందేమీ

కాదు. ఆనాడు హైదరాబాదు ప్రధానమంత్రిగా వున్న మీర్జా ఇస్మాయిల్‌దాన్ని అమల్లోకి తెచ్చాడు.

యువరాజు పర్యటన ప్రారంభంలోనే సూర్యాపేటలో మకాం వేసినాడు. ఏర్పాటుచేసిన కార్యక్రమం ప్రకారం యువరాజు, ముందు సమీపాన వున్న బాలెముల గ్రామానికి వెళ్ళి, కాల్పుల్లో చనిపోయినవారి భార్యలకు ఒక్కొక్కరికి ఒక్కొక్క రూపాయలమూటను ఇవ్వటానికి ఏర్పాట్లుచేశారు. ఆరోజుల్లో కరెన్సీ నోట్ల చలామణీ తక్కువ. కరెన్సీ నోట్లకన్న రూపాయలమూట ప్రజలను ఆకర్షిస్తుంది. ప్రచారానికి తోడ్పడుతుంది. సుమారు 500 రూపాయలను పట్టుగుడ్డలో మూటకట్టి, ఆ మూటను ప్రజలముందు మృతవీరుల భార్యల చేతికందించటానికి ఏర్పాట్లుచేశారు. ఈ కార్యక్రమాన్ని బహిష్కరించాలనీ, ఆ డబ్బును నిరాకరించాలనీ, యువరాజు వచ్చినప్పుడు నిరసన ప్రదర్శనచేయాలనీ పార్టీ, ఆంధ్రమహాసభ జిల్లాకమిటీలు కార్యక్రమాన్ని నిర్ణయించాయి. ఈ కార్యక్రమాన్ని అమలు జరుపటానికి కార్యకర్తలు ప్రజలను సిద్ధంచేసినారు. మృతవీరుల కుటుంబాలవారు దీనికి అంగీకరించినారు. డబ్బు నిరాకరించటానికి సిద్ధమైనారు. ప్రభుత్వానికి ఈ సమాచారం అందింది. దీనితో యువరాజు కార్యక్రమం అంతా రద్దు అయింది. కాల్పులు జరిగిన ఇతర గ్రామాలకు వెళ్ళే కార్యక్రమం కూడా రద్దుచేసుకొని వచ్చిన దారినే వెళ్ళిపోయాడు.

మిలటరీ కాల్పులు పూర్తిఅవగానే అన్ని ముఖ్యమైన కేంద్రాల్లో సాయుధ పోలీసుల క్యాంపులు పెట్టి, పోలీసులు గస్తీలు తిరిగినారు. గ్రామాల్లో తీవ్ర నిర్బంధ విధానాన్ని అమలు జరిపినారు. గ్రామనాయకుల్లో చాలామందిని, వలంటీరు దళాల్లోని ముఖ్యులను అరెస్టుచేశారు. ఈ విధంగా నిర్బంధ విధానం తీవ్రమయింది.

దేశముఖులు, భూస్వాములు బాగా విజృంభించి ప్రజలపై కక్ష సాధించుకోవటానికి ప్రయత్నించారు. అలాంటి పరిస్థితుల్లో ఒకవైపున ప్రజలకు ధైర్యం కలిగించి వారిని నిర్బంధాన్ని తట్టుకోటానికి సిద్ధంచేయాల్సిన బాధ్యత కార్యకర్తలపైబడినది. మరోవైపున గ్రామగ్రామాన పోలీసులు భూస్వాముల గూండాలు దాడులుచేయటం ప్రజలలో కదలిక తగ్గిపోవటంతో కార్యకర్తలకు రక్షణ సమస్యకూడా తీవ్రంగా ఎదురైనది. ఆ స్థితిలో ముందు కేడర్లను కాపాడుకోవాలనే దృష్టితో వారందరినీ నిర్బంధం అమలు జరుగని పక్క గ్రామాలకు పార్టీ

పంపించింది. అక్కడ వారికి తెలిసిన కుటుంబాలు రక్షణ కల్పించారు. కార్యకర్తలు అక్కడినుంచి ఈ గ్రామాలకు వచ్చి ప్రజలను కలుసుకొనివెళ్ళే కార్యక్రమాన్ని రూపొందించి అమలు జరిపినారు. కార్యకర్తలందరినీ వెనక్కి రప్పించి రహస్య పద్ధతులలో శిక్షణ ఇచ్చి నిర్బంధం అమలు జరుగుతున్న గ్రామాలకు పంపించటానికి కొంత వ్యవధి అవసరమైంది.

క్రమంగా పార్టీ, ఆంధ్ర మహాసభ కార్యకర్తలు రహస్య కార్యకలాపాలు తీవ్రతరం చేసి అన్ని గ్రామాలతో సంబంధం ఏర్పాటు చేసుకున్నారు. ఇది ఒక వైపున జరుగుతూ వుంటే భూస్వాములు ఉద్యమాన్ని అణచివేయగలిగినామనే అల్ప సంతోషంతో రౌడీలను, గూండాలను తీసుకొచ్చి గ్రామాలమీద దాడులు చేయ మొదలుపెట్టినారు. దీనితో భూస్వాముల ఆటకట్టించటం అవసరమని పార్టీ నిర్ణయించింది. కానీ భూస్వాములను చంపాలనే కార్యక్రమాన్ని పార్టీ చేపట్ట లేదు. వారిని ఎక్కడైనా పట్టుకొని దెబ్బలుకొట్టి భయపెట్టాలనే కార్యక్రమం నిర్ణయించింది. అలాంటి కార్యక్రమం ఒకే ఒక గ్రామంలో అసలు జరిగింది. నిర్ణయించిన విధంగా అమలు జరిగింది. మంచి ఫలితాలు వచ్చినాయి కూడా. ఇతర గ్రామాలలో కార్యకర్తలు ఆ విధంగా చేయలేక కొందరు వ్యక్తులను చంపినారు. పార్టీ వెంటనే ఆ కార్యక్రమాన్ని పూర్తిగా నిషేధించింది. నిర్బంధం తీవ్రంగా వుంటే ఆ గ్రామాల్లో నాలుగురోజులపాటు కార్యకలాపాలను తాత్కాలికంగా మానుకొని పక్కగ్రామాలకు వెళ్ళి తిరిగివచ్చి మళ్లీ ప్రారంభించాలిగాని హత్యకు పూనుకోవద్దు అని నిర్ణయించి దానిని అమలుజరిపింది.

జయప్రదంగా అమలుజరిగిన కార్యక్రమం స్థూలంగా ఈ విధంగావున్నది. ఒక భూస్వామి —దేవులపల్లి గోవిందరావు— పోలీసులనుతెచ్చి ప్రజలపై దాడులు చేయించి గ్రామంలో (చందుపట్ల) చాలా దుర్మార్గాలు చేయించాడు. విజయగర్వంతో ఉండేవాడు. కొద్ది దూరానవున్న తన తమ్ముని గ్రామానికి పెళ్ళి సందర్భంలో బండిమీద భార్యతోసహా వెళుతున్నాడు. ముందే తెలుసుకున్న పార్టీ వలంటీర్లు దారిలో ఒకచోట బండిని ఆపేసి అతన్ని బయటికి లాగారు. భార్యవచ్చి కార్యకర్తలను తన భర్తనుకొట్టవద్దని బతిమిలాడుకున్నది. 'దుర్మార్గాలు చేసినవాడు కనుక కొట్టడం తప్పనిసరి' అని వలంటీర్లు అన్నారు. తనపైన వున్న నగలిస్తానని ప్రాధేయపడ్డది. 'మాకు నగలవసరం లేదు' అని ఆమెను కొద్ది దూరాన నిలబెట్టారు. ఇతన్ని పట్టుకొని బాగా దెబ్బలు కొట్టారు. కాళ్ళు,

చేతులూ విరగలేదు. కాని దెబ్బలుమాత్రం తీవ్రంగానే తగిలినవి. తర్వాత వారిని వదిలి వెళ్ళిపోయినారు. భూస్వామి వెళ్ళినచోట అతని బంధువులు, అన్న దమ్ములు వచ్చివున్నారు. వారికి సంగతి తెలిసింది. వారంతా భూస్వాములే. దోపిడీ చేసేవారే. పార్టీకి, ఆంధ్రమహాసభకూ వ్యతిరేకులే. అయినా వారు ఇతనిపై సానుభూతిని ప్రకటించలేదు. కాగా మందలించారు. కొట్టిన సంఘంవారు ఆడవారిదగ్గరున్న బంగారం తీసుకోలేదు. డబ్బు తీసుకోలేదు. చంపనుకూడా చంపలేదతన్ని. ఆడవాళ్ళను ముట్టుకోలేదు. అతడు చేస్తున్న దుర్మార్గాలకు ప్రతీకారంగా మాత్రమే దెబ్బలు కొట్టారు. అంతకన్నా మించి చేసిందేమీ లేదని అభిప్రాయపడినారు. ఇకనుంచి దుర్మార్గాలను మానుకోకపోతే తాము అతని ఇంటికిరామని అతనికి బుద్ధి చెప్పారు. కాని అతడు తన గుణాన్ని మానుకోలేదు. అయినప్పటికీ అక్కడికొచ్చిన బంధువులలో ఆతను ఏకాకి అయ్యాడు. జన సమూహంలో అవమానం పాలయ్యాడు. ఈ పరిణామం పార్టీకి ఉపయోగపడింది. అతడు అవమానంతో ఊరికి తిరిగి వెళ్ళాడు. వెంటనే దౌర్జన్యాలు చేయలేక పోయినాడు. త్వరలోనే మళ్లీ ప్రారంభించాడు.

హుజూర్‌నగర్, జనగాం, భువనగిరి తాలూకాల్లో రెండుమూడు ఘటనలు జరిగినవి. దెబ్బలు కొట్టాలని వెళ్ళి వ్యక్తులను చంపివేసి తిరిగి వచ్చినారు. హుజూరునగర్ తాలూకాలో భోగాల వీరారెడ్డి అను భూస్వామిని కొట్టడానికి వెళ్ళారు. అతన్ని కొట్టిన తర్వాత అతడు బతికుంటే తమను చంపేస్తాడనే భయంతో అతన్ని చంపేశారు. ఈ విధంగా పిరికితనంతో చంపివేసిన సంఘట నలు తర్వాతి కాలంలో కూడా కనిపించాయి. ఈ రెండు మూడు సంఘటనలను చూసి ఇవి తప్పుడు పద్ధతులనీ, దీనివలన ప్రజావుద్యమం నిర్మించలేమని జిల్లా కమిటీ నిర్ణయించి వాటిని మానేసింది. కొందరు కార్యకర్తలను పక్క గ్రామాలకు పంపి అక్కడ పనిచేయాలని నిర్ణయించింది. ఎక్కడైతే నిర్బంధం తక్కువగా వుందో అక్కడ పనిచేస్తూ క్రమంగా నిర్బంధం తీవ్రంగావున్న గ్రామాలతో సంబంధాలను వృద్ధిచేసి ప్రజలలో ధైర్య స్థైర్యాలు పెంచటానికి కృషిచేసింది. ఈ కార్యక్రమమంతా నల్లగొండ జిల్లాకు సంబంధించినదే. ఆగస్టు '47 వరకు ఆరు నెలల కాలం నిర్బంధ విధానం కొనసాగింది. పార్టీ ఆ కాలంలో మళ్లీ ప్రజలతో సంబంధాలు పెట్టుకోవటం, కొత్త గ్రామాలకు వెళ్ళటం, కార్యకర్తలకు

శిక్షణ ఇచ్చుకోవటంలాంటి కార్యక్రమాలలో పూర్తిగా నిమగ్నమైవుంది. ప్రజలు ఆయుధాలు కోరుతున్నారు కాబట్టి ఈ ఆయుధాలు సంపాదించి సాయుధ పోరాటం ప్రారంభించాలనే ఆలోచన కలిగింది.

తెలంగాణాలో ఇతర జిల్లాల్లో నిర్బంధ విధానానికి వ్యతిరేకంగా ప్రచారం సాగింది. తీర్మానాలు చేయటం, పత్రికా ప్రకటనలివ్వటం, బహిరంగ సభల్లో మిలటరీ పోలీసుల దుర్మార్గాలను గురించి చెప్పి ఖండించటం— ఇదంతా ఒక ఉద్యమంగా కొనసాగింది. దీనివల్ల ప్రజల్లో కదలిక వచ్చింది. కాని అది భూస్వామ్య వ్యతిరేక పోరాటంగా అభివృద్ధి కాలేదు. ఖమ్మం దగ్గరున్న తెల్దారుపల్లి జాగీరుపోరాటం మాత్రం యథావిధిగా నడుస్తూనే వుంది. మానుకోట తాలూకాలోని కొన్ని గ్రామాల్లో భూస్వామ్య వ్యతిరేక పోరాటం ప్రారంభమైంది. ఈ గ్రామాలు సూర్యాపేట తాలూకా సరిహద్దున వున్నవి.

## 10. స్టేటు కాంగ్రెసు (దు)స్థితి

మీర్జా యిస్మాయిల్ ప్రధానమంత్రి కావటంతో తమకేదో ఒరుగుతుందని స్టేటు కాంగ్రెసు నాయకులు భ్రమించారు. కాని అలాంటిదేమీ జరుగలేదు. తన మంత్రివర్గంలో కొన్ని స్థానాలు వారికిస్తానన్నాడు. బూర్గుల ప్రభృతులు వాటిని అంగీకరించాలని పట్టుబట్టినారు. కాని, స్వామి రామానందతీర్థ నాయకత్వానగల స్టేటు కాంగ్రెసు మెజారిటీతో వారి ప్రతిపాదనను తోసిపుచ్చింది. మీర్జా యిస్మాయిల్ మూలకుందలో వున్న అయ్యంగార్ రాజ్యాంగ సంస్కరణలను బయటకుతీసి అమలుజరిపినాడు. గాంధీజీతోపాటు స్టేటు కాంగ్రెసు నాయకులు కూడా దీనిని వ్యతిరేకించినారు. దీనితో మీర్జా ఇస్మాయిల్ ప్రభుత్వానికి స్టేటు కాంగ్రెసుకూ రాజీ కుదరలేదు. ఈ పరిస్థితుల్లో నల్లగొండ జిల్లాలో ప్రజల సాయుధ ప్రతిఘటన ముందుకు సాగింది. మీర్జా ఇస్మాయిల్ ప్రభుత్వం మిలటరీని ప్రయోగించి అణచటానికి ప్రయత్నించింది.

మిలటరీ కాల్పులు జరిగిన ప్రజలను పెద్దఎత్తున అరెస్టుచేసి, చిత్రహింసల పాలుజేసి భీభత్సం చేసిన తర్వాత స్వామి రామానందతీర్థ కొన్ని గ్రామాలను పర్యటించాడు. ఒక గ్రామంలో తాను పొందిన అనుభవాలను ఈ విధంగా వివరించినాడు :

"......కొద్దిమంది సహచరులతో నేను ఎన్నో గ్రామాలను సందర్శించి నాను. గ్రామాన్ని, దాని నివాసులు వదిలివేసిన లేదా, ఇండ్లనుంచి బయటికి రాని దయనీయమైన దృశ్యమే అది. ఆ ప్రాంతమంతా పెద్ద స్మశానవాటికగా కన్పించింది. దాపుకు వస్తున్న కారుచప్పుడు వారి మనస్సులో కలత కలిగించింది పోలీసు దళం గ్రామంలోకి ప్రవేశించుతున్నదని వారు నమ్మినారు. మేమున్నది అరడజనుమంది మాత్రమే. అరగంటసేపటివరకు మేమొక వేపచెట్టుకింద కూర్చు న్నాము. గ్రామంలో కొంత పరిచయమున్న ఒక మిత్రుడు కొత్తగా వచ్చిన వారిలో పోలీసులెవరూ లేరనీ, గాంధీగారి అనుచరులు కొందరు వారిని కలుసుకొని మాట్లాడాలని వచ్చినారనీ, ఇంటింటికీ వెళ్ళి బిగ్గరగా చెప్పినాడు. అప్పటికీ ప్రజలెవ్వరూ తమ ఇళ్ళల్లోనుంచి బయటికి రాలేదు. గ్రామస్థులలో కొందరు దగ్గరున్న గుట్టను ఎక్కి కనిపించేది సామాన్య మనుషులేనని నమ్మకం చేసుకొని, గంటతర్వాత వారంతా క్రమంగా దిగివచ్చినారు. మా చుట్టూ పెద్ద సంఖ్యలో పోగై తమ కష్టాల గాథలను వివరించినారు. మేము వారి ప్రకటనలను సేకరించి నాము. ఆ పరిస్థితిలో అవసరానికి ఎంతగానో మించిన (Far in excess)పోలీసు దౌర్జన్యాలు సాగినవని మేము స్పష్టంగా చూడగలిగినాము. పెరుగుతున్న ప్రజా వెల్లువను, లొంగటానికి సిద్ధంలేని చైతన్యాన్ని (spirit)ను అణచివేయాలని అధికారులు కోరుతున్నారనేది సుస్పష్టమే. సాయుధ దళాల తుపాకులకు వ్యతిరేకంగా ఇటుకలతో, రాళ్ళతో స్వీయరక్షణ చేసుకోవాలని చెప్పి కమ్యూ నిస్టులు ఒక మేరకు ప్రజలను పెడమార్గాన నడిపించినారు. నిరాయుధులైన ప్రజలు సాయుధులతో ఎలా పోరాడకలిగారనేది నేనర్థం చేసుకోలేకపోయాను. అహింసాయుతంగా ప్రతిఘటించవలసిందని ప్రజలతో నేను వాదించాను......"
(హైదరాబాదు స్వాతంత్ర్య పోరాట స్మృతులు, ఇంగ్లీషు ప్రతి, పేజి - 167)

"తలలు బోడివైతే తలపులు బోడివా" అని వేమన అన్నాడు అహింసా వాది స్వామీజీ పరిస్థితికూడా అంతేనని పై వాక్యాలు స్పష్టం చేస్తున్నాయి.

ఆయన వెళ్ళిన గ్రామంపేరు చెప్పలేదు. ప్రజలకూ ఆయన కొత్త; ఆయనకూ పోరాడే ప్రజలూ కొత్త. వెళ్ళిన అరడజనుమందికి ఊరి వెలుపల వున్న వేపచెట్టు శరణ్యమైనదే కాని, వారు ఊళ్ళోకి వెళ్ళటానికి సాహసించ లేదు. ప్రజల దయనీయమైన స్థితి చెప్పే పేరుతో, వారు తనను నమ్మలేదని తమ దయనీయమైన స్థితిని చెప్పుకున్నాడు.

పోలీసులు అవసరానికి మించిన దౌర్జన్యాలు చేశారని అన్నాడంటే ఒక మేరకు దౌర్జన్యాలు అవసరమేనని అభిప్రాయమని స్పష్టం. ఇది అధికార పార్టీ మన స్తత్వమే కాని మరొకటి కాదు. ప్రజలేమో అహింసాయుతంగా ప్రతిఘటిం చాలి. ప్రభుత్వమేమో పరిమిత దౌర్జన్యాన్ని ప్రయోగించవచ్చును. (నైజాం ప్రభుత్వం కావటంవలన పరిమితమైన దౌర్జన్యం. కాంగ్రెసు ప్రభుత్వానికి ఈ పరిమితులు కూడా ఉండవు.)

ప్రజలు, కమ్యూనిస్టుల నాయకత్వాన "ఇటుకలూ, రాళ్ళ"తో స్వీయ రక్షణచేసుకొనుట ఈయనకు హాస్యాస్పదంగా కనిపించింది. మిలటరీ తుపాకులను తుపాకులతో ఎదిరించాలంటే సరిగానే ఉంటుంది. కాని, అహింసాయుతంగా ప్రతి ఘటించాలనే ఈయనకు "ఇటుకలూ, రాళ్ళై"నా తుపాకులైనా హింసాయుతమే తర్వాతకాలంలో ప్రజలు తుపాకులు కావాలని గుర్తించి సాయుధపోరాటాన్ని జరిపినారేకానీ ఈయన ఉపదేశాలతో ప్రభావితులై అహింసా మార్గాన్ని పట్ట లేదు.

పర్యటనను పూర్తిచేసుకొని హైదరాబాదుకు వెళ్ళి మిలటరీ దురాగతాలను ఖండిస్తూ, మిలటరీ క్యాంపులను ఉపసంహరించాలని కోరుతూ ఒక ప్రకటన చేశానని, కమ్యూనిస్టులు దౌర్జన్యపూరితంగా ప్రతిఘటించాలనే భావాలను ప్రజల మనసుల్లో నాటటం తప్పనికూడా ప్రకటించానని చెప్పినాడు. ఈ ప్రకటన చేసి నందుకు మితవాదులు తనను కమ్యూనిస్టు అనుకూలుడని దుయ్యబట్టినారని కూడా స్పష్టంచేశాడు. ప్రజలను కమ్యూనిస్టుల ప్రభావం నుంచి తప్పించటానికే ఈ పని చేసినానని ఆయన వాదన.

నిర్బంధవిధానం తీవ్రంగా అమలు జరుగుతున్న కాలంలోనే—హైదరాబా దుతోసహా కొందరు పెద్ద సంస్థానాధీశులు తాము స్వతంత్రంగా ఉంటామని బ్రిటిష్‌వారితో రాజీబేరాలు సాగించినారు. చిన్న సంస్థానాలన్నీ ఏర్పడబోయే భారత యూనియన్‌లో చేరిపోవటానికి సిద్ధమైనాయి. కాంగ్రెసు నాయకులు పెద్ద సంస్థానాల స్వతంత్రంగా ఉండటానికి ఇష్టపడలేదు. వారికి కావలసిన సౌకర్యా లన్నీ కలిగిస్తామనీ వారి సంస్థానాలు యూనియన్‌లో అంతర్భాగంగా ఉండాలనీ కాంగ్రెసు నాయకుల అభిప్రాయం.

మీర్జా ఇస్మాయిల్ తాను ప్రధానమంత్రిగావున్న పదినెలల్లో సాధించ గలిగినది నల్లగొండ జిల్లాలో వ్యవసాయ విప్లవోద్యమాన్ని తాత్కాలికంగా

అణచివేయటం, 1939 నాటి రాజ్యాంగ సంస్కరణలను అమలు జరపటం. ప్రస్తుత మహారాష్ట్రలోని బీరారు జిల్లాలను (విదర్భ) నిజాం రాష్ట్రంలో కలుప డానికి బ్రిటిషువారితో, కాంగ్రెసు నాయకులతో సంప్రదింపులు జరిపినాడు కాని ఫలించలేదు. అదేవిధంగా హైదరాబాదు స్వాతంత్ర్యాన్ని గుర్తింపజేయటానికి చేసిన ప్రయత్నాలుకూడా ఫలించలేదు. సంస్థాన పాలనాయంత్రాంగాన్ని కట్టు దిట్టంచేసి స్టేటు కాంగ్రెసు నాయకులకు ఆమోదయోగ్యంగా మార్చటానికి చేసిన ప్రయత్నాలను అధికారవర్గం ఎదిరించింది. దీనిఫలితంగా నియమిత గడువు పూర్తికాక మునుపే బాధ్యతనుంచి తప్పుకున్నారు (1947 మే).

## 11. ముగింపు

పార్టీ పాలసీలో వర్గసంకర విధానాలు ఈ కాలంలోకూడా కొనసాగాయి. కాంగ్రెసుకు బ్రిటిషు పాలకులతో జరిగిన రాజీ ఫలితంగావచ్చే స్వాతంత్ర్యం కోసం కాంగ్రెసును బలపరచాలనేది ఆనాటి కార్యక్రమం. ఈ కార్యక్రమం ప్రకారం కాంగ్రెసును బలపరుస్తూ కాంగ్రెసుచేసిన తప్పుడు పనులను విమర్శిం చటం; లేదా అవి కాంగ్రెసు చేసినవికావు, అధికారవర్గం చేసినపనులని చెప్పటం ఆ రోజులలో మామూలై పోయింది. దీనినే 'జోషీలైన్' అని అంటారు. ఉదా: మద్రాసు రాష్ట్రంలో 1946 ఏప్రిల్‌లో జరిగిన ఎన్నికల ఫలితంగా అక్కడ కాంగ్రెసు ప్రభుత్వం ఏర్పడింది. దానికి టంగుటూరి ప్రకాశంపంతులు ముఖ్య మంత్రిగా వుండేవారు. ఆయన 1947 జనవరిలో 'పబ్లిక్ సేఫ్టీయాక్టు' అనే పేరుతో ఒక నిర్బంధచట్టాన్ని చేశారు. 'ప్రకాశం ఆర్డినెన్సు' అని దానికి పేరు. దానిప్రకారం పార్టీ నాయకులనందరినీ అరెస్టుచేయమని ఆర్డర్లు వచ్చినాయి. పోలీసులు పార్టీ ఆఫీసులమీద దాడులుచేశారు. దీనిని ప్రకటించింది గవర్నరు, ప్రకాశంకాదు అని పార్టీ నాయకత్వం వ్యాఖ్యానించింది. ప్రజలందరూ దీనికి ప్రకాశం ఆర్డినెన్సు అని పేరుపెట్టారు. గవర్నరు ఆర్డినెన్సు అని ఎవరూ అను కోలేదు. ఈవిధంగా ఒకవైపున కాంగ్రెసువారు యుద్ధానంతర వెల్లువను అణచి వేయాలని తీవ్రమైన నిర్బంధాన్ని అమలు జరుపుతున్నారు. మరోవైపున పార్టీ కాంగ్రెసును బలపరిచింది.[88]

ఈ దశలో గ్రామ సంఘాలు పోరాటాన్ని నడిపించే సంఘాలైనవి. అవి

అమలు జరిపినదంతా పోరాట కార్యక్రమమే. అవి గ్రామరాజ్యాలస్థాయిని అందు కోగలిగినంత శక్తిని ప్రదర్శించాయి. అయినా ఆనాడు ప్రభుత్వాన్ని కూలదోసి కొత్త ప్రభుత్వాన్ని స్థాపించాలనే నినాదాన్ని పార్టీ ఇవ్వలేదు; ఆ పనిలో నిమగ్నంకాలేదు. నిర్బంధవిధానాన్ని ప్రతిఘటించాలి; భూమిపంపకం సాగించాలి; గ్రామ పరిపాలన సాగించాలి అనే నినాదాలను అమలుజరిపే చైతన్యం ప్రజల్లో వుంది. ఈ కార్యక్రమంతో పోరాటాన్ని నిర్వహించింది పార్టీ. గ్రామ రాజ్యాల నినాదాలులేని ఈ కార్యక్రమం ఎలా అమలు జరిగింది? అనే ప్రశ్నకు ఆనాటి కార్యక్రమమే సమాధానం. కాంగ్రెసుకు బ్రిటిష్ పాలకులతో జరిగిన రాజీ ఫలితంగావచ్చే స్వాతంత్ర్యంకోసం కాంగ్రెసును బలపరచాలనేది ఆనాటి కార్యక్రమం. కాంగ్రెసులో అభివృద్ధి నిరోధకులు (సర్దారు పటేలు వర్గం), అభివృద్ధి కాముకులు (నెహూ్రవర్గం) వున్నారనీ, అభివృద్ధి నిరోధకులను వ్యతిరేకిస్తూ అభివృద్ధి కాముకులను బలపరచాలని ఆ కార్యక్రమ సారాంశం. ఆచరణలో ఇది నెహూ్ర భజనరూపంలో కాంగ్రెసును బలపరచాలనే కార్యక్రమమైంది. పాక్షిక పోరాటాలను పాక్షిక పోరాటాలుగానే నడపాలిగాని ఉన్నతస్థాయికి వెళ్ళనీయకూడదనే ఎత్తుగడ విధానాన్ని (Tactical line) కూడా పార్టీ అనుసరించింది. ఈ కార్యక్రమాన్ని దృష్టిలో వుంచుకుంటే దేశవ్యాపితంగా ప్రభుత్వాన్ని కూలదోయాలనే సమస్య పార్టీ నాయకత్వపు దృష్టిలో లేదు.

విశాలాంధ్రలో ప్రజారాజ్యం ఏర్పాటుచేయాలి అనేది ఆనాటి ఆంధ్ర కమ్యూనిస్టు కమిటీ ఇచ్చిన నినాదం. నైజాం సంస్థానం నుండి తెలంగాణానువిడదీసినప్పుడే విశాలాంధ్ర ఏర్పడుతుంది. ఈ దృష్టితోచూస్తే సంస్థానం రద్దు కావటమనేది అప్పటికే ఎజెండాలోకి వచ్చింది. నిజాం ప్రభుత్వాన్ని కూలదోయకనే సంస్థానం రద్దు అవుతుందా ?—ఇలాంటి ప్రశ్నలన్నీ ముందుకు వచ్చినా వాటికి సమాధానాలు దొరకలేదు.

రెండవది : సాయుధ ప్రతిఘటన, భూమిపంపకం—ఈరెంటి అవినాభావ సంబంధం గూర్చి ఆనాటికి పార్టీలో ఒక అవగాహనలేదు. తెలంగాణాలో నిర్బంధవిధానానికి వ్యతిరేకంగానే మొదటిదశలో సాయుధప్రతిఘటన సాగిందని చెపుతారు. యుద్ధానంతర వెల్లువ, ఆ కాలంలో వచ్చిన పరిణామాలను మొత్తంగా చూస్తే బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి, నిజాంరాజ్యానికి వ్యతిరేకంగా పోరాడి తక్షణమే ప్రభుత్వాన్ని కూలదోసి, కొత్త ప్రభుత్వాన్ని ఏర్పాటుచేయాలి అనే

నినాదం ముందుకు వచ్చింది. ఇక్కడ కూడా అది అదేవిధంగా వచ్చింది. అంటే ఆకునూరు, మాచిరెడ్డిపల్లిలో సాయుధ ప్రతిఘటన నడిచింది నిర్బంధ విధానానికి వ్యతిరేకంగా మాత్రమే కాదు. ధాన్య సేకరణ అనే సమస్యపై వచ్చిన నిర్బంధ విధానమది. ఆనాడైనా ఈనాడైనా దాన్ని ఒక మౌలిక సమస్యగానే మనం భావిస్తున్నాము. భూమి మాదిరిగానే ధాన్యం రైతు స్వంత ఆస్తి. చట్ట రీత్యా రైతులు ధాన్యాన్ని ఇవ్వటానికి నిరాకరించినప్పుడు, ధాన్యాన్ని వసూలు చేసే ప్రభుత్వం సాయుధ బలాలతో తమ అధికారాన్ని చూపెట్టటానికి పూను కున్నప్పుడు, సాయుధ దళాలను ప్రతిఘటించడమనేది ప్రభుత్వ వ్యతిరేక చర్య మాత్రమే కాదు.

చట్టరీత్యా తమ సమస్యలను పరిష్కరించుకోవచ్చుననే భ్రమలకు స్వస్తి చెప్పి ప్రత్యక్షంగా ప్రభుత్వాన్ని ప్రతిఘటించే రూపాలను ప్రజలు అనుసరించినట్లు కనిపిస్తుంది. చట్టానికి విరుద్ధమైన విప్లవకర పద్ధతుల ద్వారా తమ సమస్యలను పరిష్కరించుకోవాలనే చైతన్యాన్ని ప్రజలు ప్రదర్శించినారు. ఈ చైతన్యానికి అనుగుణ్యమైనది సాయుధ ప్రతిఘటన. ఆకునూరు, మాచిరెడ్డిపల్లిలో పార్టీ లేదు. ఆంధ్ర మహాసభ నిర్మాణం లేదు. ప్రజలు అప్రయత్నంగా (Spontaneous) చేసిన తిరుగుబాటు. అలాంటిది కాదీపోరాటం. దీనికి కమ్యూనిస్టు పార్టీ, ఆంధ్ర మహాసభల రాజకీయ, నిర్మాణయుతమైన నాయకత్వమున్నది. ఇదే విధంగా భూమి పంపకపు సమస్య ఈ పోరాటంలో విడదీయరాని అంతర్భాగం. ఆకునూరు, మాచిరెడ్డిపల్లి సంఘటనల తర్వాత కొద్దిరోజులకే పాలకుర్తిలో భూస్వాముల దౌర్జన్యాన్ని ప్రతిఘటించటానికి వలంటీర్లు సమీకృతులైనారు. ఏ దౌర్జన్యానికైనా ప్రజల సంఘటిత శక్తితోనే ఎదుర్కోవలసి వుంటుంది. కాని పాలకుర్తిలో సాగిన ప్రతిఘటన అప్పటికే సాగుతున్న పోరాటంలో ఒక భాగంగా వచ్చింది. విడిగా వచ్చినదికాదు. ఈ సందర్భంలోనే భూమి పంపకపు సమస్యకూడా ముందుకు వచ్చింది. అప్పటికే భూమి సమస్యవున్నా, రైతులు తమ స్వాధీనంలోవున్న భూమిని కాపాడు కోవడమే దాని సారాంశం. దొడ్డి కొమరయ్య అమరుడైన తర్వాత ముందుకు వచ్చిన భూమి సమస్య స్వభావం వేరు. భూస్వాముల చేతుల్లో వున్న భూమిని రైతులు లాక్కొని పంచుకున్నారు. పంచుకున్న భూమిని రక్షించుకోటానికి ప్రతిఘటించారు. ఇవి అఫెన్సివు ఎత్తుగడలు. ముందు అనుసరించిన ఎత్తుగడల్లో

ప్రతిఘటించటమనేది అఫెన్సివు లక్షణమే అయినా మొత్తంగా చూచినప్పుడు అవి డిఫెన్సివు ఎత్తుగడలే. ఈ కారణంవల్లనే అంతకుముందు సాగిన వలంటీర్ల ప్రతిఘటన స్వభావం వేరు. తర్వాత సాగిన ప్రతిఘటన స్వభావం వేరు. భూమి పంపకం లేకుండా వలంటీరు దళాలను ఎంతోకాలం నిలబెట్టటం సాధ్యమయ్యేది కాదు. అదేవిధంగా లెవీ ధాన్యపు సమస్యపై ప్రతిఘటించకుండా తర్వాత ఎలాంటి ప్రతిఘటన సాగకపోయేది. సాగినా తాత్కాలికంగా సాగి అణగి పోయేది. దీర్ఘకాలికంగా కొనసాగే ప్రతిఘటన ఆ సందర్భంలో వుండదు. ఇక్కడ కూడా జరిగిందదే.

నల్లగొండ జిల్లాలో ప్రతిఘటన ప్రారంభం కావటం, వెంటనే భూమిని పంచటం, యుద్ధానంతర విప్లవ వెల్లువలో ఒక భాగమే. ఆరోజు జిల్లా కమిటీ భావించింది కూడా అదే. అది సరైనదే. ఈ దృష్టితో చూచినపుడు ఇది భూమి పంపకానికి ముడిపడివున్న సాయుధ ప్రతిఘటన అని స్పష్టమవుతుంది. ప్రతి గ్రామంలో సాయుధ ప్రతిఘటన సాగినదా? సాగిన ప్రతి గ్రామంలో భూమిని పంచినారా? భూమిని పంచిన గ్రామాలన్నింటిలో సాయుధ ప్రతిఘటన జరిగినదా? అనే ప్రశ్నలకు సమాధానమొక్కటే. ప్రభుత్వం ఏర్పాటు చేసిన గ్రామ సరిహద్దులకు పరిమితమై ఈ ప్రశ్నకు సమాధానం చెప్పకూడదు. మొత్తంగా చూడాలి. ఒక గ్రామంలో భూమిని పంచిన ప్రభావం పక్క గ్రామంపై ఉండవచ్చును. ఒక గ్రామంలో 100 ఎకరాలు పంచితే ఆ పక్క గ్రామంలో 20 ఎకరాలే పంచవచ్చును. 20 ఎకరాలు పంచిన గ్రామంలో హెచ్చు సంఖ్యలో యువకులు ప్రతిఘటనకు తయారుకావచ్చును. 100 ఎకరాలు పంచిన గ్రామంలో తక్కువ సంఖ్యలో తయారు కావచ్చును. ఈ విధంగా ఉద్యమాన్నంతటినీ చూస్తే గ్రామాలెన్ని? లేదా జనాభా ఎంత? పంచిన భూమి ఎంత? ప్రతిఘటన దళాల్లో చేరిన యువకులు ఎందరు? మున్నగు ప్రశ్నలకు సమాధానం దొరుకుతుంది. ఈ కారణాన ఆ ప్రాంతపు మొత్తం ఉద్యమాన్ని చూడాలి.

ఈ దృష్టితో చూస్తే నల్లగొండ జిల్లాలోని సుమారు 150 గ్రామాల్లో ఆనాటి లెక్కల ప్రకారం 3000 ఎకరాలకు మించిన భూమిని రైతులు పంచుకున్నారని చెప్పవచ్చును. ఆ గ్రామాల్లోనే వలంటీరు దళాలు ఏర్పడినాయి. చాలా కాలంనుంచీ సంఘం పనిచేస్తున్న గ్రామాల్లో, రాజకీయ చైతన్యం హెచ్చుగావున్న గ్రామాల్లో వారు పెద్ద సంఖ్యలో చేరినారు. కానీ, భూమి

పంపకం జరిగిన గ్రామాల్లో అంతకన్నా హెచ్చు సంఖ్యలో వచ్చినారు. ఎందుకంటే భూమి పంపకం జరిగిన కుటుంబాలవారు పంచుకున్న భూమిని రక్షించుకోవటానికి చేరినారు. పంపకం జరగని కుటుంబాలలో రాజకీయ చైతన్యం గలవారు చేరినారు. ఈ విధంగా భూమి పంపకం జరిగిన గ్రామాలలో ఎప్పుడూ ఎక్కువమంది, భూమి పంపకం స్వల్పంగా జరిగిన గ్రామాలలో తక్కువ సంఖ్యలో వలంటీర్లలో చేరి ప్రతిఘటనా శక్తికి బలం చేకూర్చారు.

భూమి పంపకానికి, ప్రతిఘటనకి సంబంధంలేదు, భూస్వాములు గూండాలను తీసుకురాగానే చేసే ప్రతిఘటన అంతా సాయుధ పోరాటమనే ఒక అభిప్రాయముంది. కర్రతో ప్రతిఘటించినా, మరో విధంగా ప్రతిఘటించినా దానిని సాయుధ పోరాటమని చెప్పటం దీని సారాంశం. కానీ కర్రతో ప్రతిఘటించటమనేది ఎప్పుడూ వున్నదే. ప్రజలు వ్యక్తిగతంగా మూక వుమ్మడిగా ప్రతిఘటిస్తూవుంటారు. దీనిని ఆయా సమస్యలపై ప్రతిఘటన అని మాత్రమే అంటాం. ఈ ప్రతిఘటనకు చైతన్యంతో సంబంధం వుంటుంది. భూమి పంపకం కూడా ప్రజల చైతన్యానికి సంబంధించినదే. కాని అది ఉన్నతమైనది. సాయుధ ప్రతిఘటన కూడా దానితో ముడిపడి వున్నదే. ఉన్నత స్థాయికి చెందిన ఈ ప్రతిఘటనకు రాజకీయ స్వభావమేర్పడుతుంది. ఆనాడు పార్టీ దీన్ని గెరిల్లా పోరాటరూపంలో ఎందుకు సాగించలేకపోయింది అనే ప్రశ్నకు ఆనాటి ఉద్యమ పరిస్థితిని అర్థం చేసుకుంటే సమాధానం దొరుకుతుంది. అదేమంటే: ఒక జిల్లాలోని కొన్ని ప్రాంతాల్లోనే వృద్ధి పొందింది వుద్యమం. పార్టీ రాష్ట్ర వ్యాపితంగా ఇలాంటి కార్యక్రమంతో పని చేయలేదు. ఇలాంటి ప్రతిఘటన అభివృద్ధి అవుతుందని కూడా భావించలేదు. దీనిని గెరిల్లా పోరాటంగా అభివృద్ధి చేసి దీర్ఘకాలిక పోరాటంగా సాగించాలనే అవగాహన జిల్లా కమిటీకి కూడా లేదు.

చైనాలో సాగుతున్న గెరిల్లా పోరాటం వార్తలు, మావో రచనలు, ఇతర చైనా సాహిత్యం స్వల్పంగా పార్టీకి చేరుతూ వచ్చాయి. పార్టీ సాహిత్యంలో భాగంగా మావో చేసిన రచనలు ముఖ్యంగా 'నూతన ప్రజా స్వామ్యం' (New Democracy) అనే పుస్తకం ఆనాటి పార్టీ కార్యకర్తలను ఆకర్షించింది. చైనాలో సాగుతున్న సాయుధ పోరాటంపై వ్యాసాలు మార్క్సిస్టు మిస్సలెనీ ( Marxist Miscellany ) అనే ఇంగ్లీషు పుస్తకాల్లో వుండేవి.

పార్టీ తరఫున ప్రచురించిన పుస్తకాలు అవి. వాటితో ప్రభావితమైనారు కార్యకర్తలు. ఆ విషయాన్ని ఉపన్యాసాల్లో వివరిస్తున్నప్పుడు ప్రజలు ఉత్తేజితులయ్యేవారు. ఆ మేరకు దాని ప్రభావం వుండేది. కానీ గెరిల్లా పోరాటాన్ని ఏ రూపంలో నడపాలి? దాని మూల సూత్రాలు ఏవి? మొదలగు వివరాలు ఆనాటికి తెలియదు. ఆనాడు భూస్వాములనుంచి ఆయుధాలు తీసుకోవటానికి, శిక్షణ ఇవ్వటానికి అవకాశాలున్నా, గెరిల్లా పోరాటాన్ని సాగించే కార్యక్రమాన్ని అందుకోలేదు. అలాంటిదే వుంటే ఇతర జిల్లాల్లో కూడా దాన్ని నిర్వహించేవారు. కానీ అలాంటిదేమీ లేదు. ఇదొక స్థానిక ప్రజల సాయుధ ప్రతిఘటనగా ఆనాటి పార్టీ నడిపించింది. కానీ ప్రజల గెరిల్లా పోరాటంగా మాత్రం నిర్వహించలేదు. అయితే దానికి పరిస్థితులు పరిపక్వమైనాయా లేదా అనే ప్రశ్నకు పరిపక్వమైనాయనే చెప్పాలి. మిలటరీ వచ్చి కార్యకర్తలను, ప్రజలను కాల్చి తాత్కాలికంగా పోరాటాన్ని అణచివేసినప్పుడు ప్రజల్లో 'మన చేతుల్లో ఆయుధాలు లేకుండా సైన్యాలతో పోరాడలేము' అనే అభిప్రాయమేర్పడింది. ఈ కాలంలో ప్రభుత్వాన్ని ఎదుర్కోవటానికి కర్రలు, వడిసెలలుచాలవు. ఆయుధాలు (తుపాకులు) అవసరమని స్వానుభవంతో ప్రజలు నేర్చుకున్నారు. దీనితో తర్వాత సాగిన సాయుధ పోరాటానికి అవసరమైన పునాది ఏర్పడింది.

సర్కారు జిల్లాల్లో అప్పటికే వ్యవసాయ కూలీ ఉద్యమం వున్నా జిల్లా పార్టీకి ఆనాటికి ఈ సమస్యపై ఒక అవగాహన లేదు. ఇంతకు ముందే చెప్పినట్లుగా కార్యకర్తలు ఈ విషయాన్ని జిల్లా కేంద్రానికి రిపోర్టు చేసిన తర్వాత అన్ని గ్రామాల్లో, ముఖ్యంగా పెద్ద గ్రామాల్లో వ్యవసాయ కూలీ సమస్యలను పరిశీలించి కూలిరేట్లు పెంచటం, పని సౌకర్యాలు మొదలగు కోర్కెలను రూపొందించి పోరాటాన్ని నడుపటానికి జిల్లా కేంద్రం కార్యకర్తలందరికీ సూచనలిచ్చింది. ఈ కార్యక్రమం అమలు జరిగింది.

ప్రజలనుంచి నేర్చుకొని కార్యక్రమాన్ని రూపొందించుకొనే విధానాన్ని ఆనాడు జిల్లా కమిటీ అనుసరించినదని దీనినిబట్టి స్పష్టంగా కనిపిస్తుంది. ప్రజలు భూమి కావాలన్నందున భూమి పంపకానికి కార్యక్రమాన్ని రూపొందించి అమలు జరిపింది. వ్యవసాయ కూలీల్లో కన్పించిన చైతన్యాన్ని గుర్తించి ఆ సమస్యను తీసుకొని, వారిని సంఘటితపరిచింది.

అయితే రైతులను, వ్యవసాయ కూలీలను ఆంధ్రమహాసభలోనే సంఘటిత

పరిచి దానిద్వారానే వారి సమస్యలను పరిష్కరించటం ఆనాటి విధానం. రైతు సంఘాలు, వ్యవసాయ కూలీ సంఘాలు, ఇతర సంఘాలు వేరే ఏర్పాటు చేసి వాటిని సమన్వయం చేసే విధానం ఆనాడు లేదు. ఆంధ్రమహాసభ ఆనాడు పోరాటపు ఐక్య సంఘటన. రైతులు, వ్యవసాయ కూలీలు పోరాడే ప్రజలే కావున ఆంధ్రమహాసభలో ఐక్యంగా నిలిచినారు. వారి కోర్కెలకోసం సమిష్టిగా పోరాడినారు.

వ్యవసాయ కూలీల, పేద రైతుల నాయకత్వం ఉండాలా ? లేదా ? ధనిక, మధ్య తరగతి రైతులయెడ ఏ వైఖరి అనుసరించాలి ? అనే సమస్య ఆనాటికి ముందుకు రాలేదు. ఇది నిజాం వ్యతిరేక పోరాటంగానూ, నిర్బంధ విధానానికి వ్యతిరేక పోరాటంగానూ ఉండటమే దీనికి ప్రధాన కారణం. ఇదే సందర్భంలో వ్యవసాయ విప్లవాన్ని జయప్రదం చేయాలి, భూస్వామ్య విధానం రద్దు కావాలి, అనే నినాదాలు వున్నా, వాటికి ఒక స్పష్టమైన స్వరూపం ఇచ్చి ప్రజల ముందుకు తీసుకువెళ్ళటానికి ఆనాటికి అవకాశం కలుగలేదు. పోరాటంలో వచ్చిన అనుభవాల ద్వారా వాటి స్వరూప స్వభావాలనర్థం చేసుకోగలిగింది జిల్లా పార్టీ.

ఈ సమయంలో పోరాట రూపాల సమస్యకూడా ముందుకు వచ్చింది. ఈ ప్రభుత్వాన్ని కూలదోయటం వలన వచ్చే సమస్యలను పరిశీలించకనే నిర్బంధ విధానానికి వ్యతిరేకంగా సాగించే ప్రతిఘటన రూపంలోనే ప్రారంభమైనా ఈ దశలో భూమిని పంచటం, ప్రాథమిక స్థాయిలోనైనా గ్రామరాజ్యాలు పనిచేయటం, సాయుధ ప్రతిఘటనతో ముడిపడివున్నాయి. నిజాం వ్యతిరేక ఐక్య సంఘటన, పెద్ద భూస్వాములకు వ్యతిరేకమైన ఐక్య సంఘటన కూడా, దీనిలో ధనిక, మధ్య తరగతి, పేదరైతులు, వ్యవసాయ కూలీలు పార్టీ, ఆంధ్ర మహాసభల నాయకత్వాన ఐక్యం అయినారు. వీటన్నింటినీ పరిశీలిస్తే ఈ ఉద్యమం వ్యవసాయ విప్లవ స్వభావాన్ని- ప్రభుత్వాన్ని కూలదోసే విప్లవ స్వభావాన్ని సంతరించుకున్నది. ఈ కారణాన ఇది సారంలో (content) వ్యవసాయ విప్లవం. కాని రూపం (form) మాత్రం నిర్బంధ విధానాన్ని వ్యతిరేకించటం. ఈరూపంలోనే ప్రారంభమైనది. కాని ఆ పరిమితులను దాటి భూమి పంపకం, గ్రామ రాజ్యాలు ఏర్పడటం, సాయుధ ప్రతిఘటన సాగే రూపాలను అందుకున్నది. ఈ కారణాన దీన్ని నిర్బంధానికి వ్యతిరేకంగా వచ్చిన సాయుధ ప్రతిఘటన అని

అనటం వాస్తవాలకు విరుద్ధమైనది. ఇలా అనేవారు దీన్ని వికృతపరచటమే కాక 1946 పోరాట అనుభవాలను తిరస్కరిస్తున్నారు కూడా.

ఆనాటి అవగాహనకు అనుగుణ్యంగా 1946 పోరాటం పూర్తి అయిన తర్వాత రూపొందించిన కోర్కెలు ఈ విధంగా వున్నవి :

"1. ప్రజలు ఇంతవరకు సాగించిన పోరాటం, ప్రధానంగా వెట్టిచాకిరి, లంచాలు, దౌర్జన్యాలకు, ఇతర జమీందారీ దోపిడీకి వ్యతిరేకంగా మాత్రమే. ప్రభుత్వం పెద్దఎత్తున సాయుధ దాడులను జరిపినప్పటికీ, ప్రజలను తిరిగి ఈ పనులను చేయించే స్థితిలోకి తీసుకుపోలేకపోయింది. అయినా సాయుధ రౌడీ దళాలు, రిజర్వ్ దళాలు గ్రామాలకు జమీందారీ ముఠా అంగరక్షకులుగా వచ్చి తీవ్రమైన హింసాకాండ సాగిస్తూ, తిరిగి ప్రజలను వెనుకటి నరక కూపంలోకి పడదోయడానికి ప్రయత్నించుచున్నారు. రాజులు, యువరాజులు, ప్రధాన మంత్రులు, అధికార్లు ఇంకా యీ అమానుషపనులను ప్రోత్సహించుతూనే వున్నారు.

"ఎన్నో త్యాగాలు చేసి, జమీందారీ దోపిడీకి వ్యతిరేకంగా పోరాడి, వెట్టిచాకిరి, లంచాలు, దౌర్జన్యాలు రూపుమాపి సాధించిన విజయాలను జమీందారీ వర్గం తిరిగి సాయుధబలాల ద్వారా హరించడానికి ప్రయత్నించుచున్నది. ఈ ప్రయత్నాలను అరికట్టాలి, విజయాలను రక్షించుకోవాలి.

"2. జిల్లాలో దేశముఖులు రైతులనుండి వేల ఎకరాల భూమిని ఆక్రమించి వారిని కూలీలుగాను, కౌలుదారులుగాను చేశారు. జన్నారెడ్డి ప్రతాప రెడ్డి, కుందూరు లక్ష్మీకాంతరావు (సూర్యాపేట), విసునూరు రామచంద్రారెడ్డి (జనగామ), గడ్డం నరసింహారెడ్డి (నల్లగొండ) ఈ దురాక్రమణదారులలో కొందరు.

"ఈ దురాక్రమణ ఫలితంగా పేదరైతులు, కౌలుదారులు, వ్యవసాయ కూలీలైనవారు ప్రతిగ్రామంలో 95% వరకున్నారు. వీరు తాము పండించిన పంటను దేశముఖుల ఇండ్లకు చేర్చి, తిండికి లేక బాధపడుతున్నారు. అనుదినం కరువు కాటకాలకు లోనౌతున్నారు.

"ఈ విధంగా ఆక్రమించిన భూమిని తిరిగి రైతు కూలీలకిచ్చివేయాలి, బంజరు భూములు వ్యవసాయ కూలీలకు సాగుకు ఇవ్వాలి.

"3. ఈ జమీందారీ వర్గం గత 10-15 సంవత్సరాలలో గ్రామ ప్రజల నుండి లక్షల రూపాయలు లంచాలు దిగమ్రింగి తాము ఆర్థికంగా బలపడుటేగాక

ప్రజలకు నిలువ నీడలేకుండా చేసినారు. ఒక్కొక్క పేద కుటుంబం వందల రూపాయలు లంచాలు చెల్లించుకున్నారు. లెవీ ధాన్యపు డబ్బునంతా దిగమింగి లాభాలు లాగినారు. ఈ డబ్బు వారు అనుభవించటానికి వీలులేదు. వారు ఈ విధంగా వుంటున్నంతవరకు ప్రజలను దోచుకుంటూనే వుంటారు. నేడు రైతు కూలీలు తమ ఆర్థిక స్థితిని చక్కబరచుకోవాలంటే, తాము తిరిగి సంపాదించు కున్న తమ భూములలో వ్యవసాయం సాగించుకోవాలంటే, వారి డబ్బు జమీందారులనుండి తిరిగి వారికి ఇవ్వబడాలి. ఇది ప్రజల న్యాయమైన కోరిక.

"4. జమీందారులు, ధనిక రైతులు వ్యవసాయ కూలీలకు రోజుకు శేరు వరకు మాత్రమే ఇస్తూ, రాత్రింబవళ్లు పనిచేయిస్తూ, వారిని ఆర్థికంగా, భౌతికంగా, మానసికంగా కొల్లగొడుతున్నారు. లక్షాధికారులై గ్రామ ప్రజలను నిలువు దోపిడీకి గురిచేస్తున్నారు.

"వ్యవసాయ కూలీలకు నెలకు 90, 120 శేర్లు (పంటనుబట్టి), కూలీలకు రోజూ 7 గంటల పని, సెలవులు, వైద్య సౌకర్యాలు కావాలి. ఇవి వీరి కనీస జీవన భృతి, కనీస సౌకర్యాలు.

"5. జిల్లాలోని గ్రామగ్రామాలలో ప్రభుత్వం పోలీసు క్యాంపులను వేసి, ప్రజలను హింసించుతూ, వారిని వెట్టిచాకిరీవంటి అసహ్యకరమైన పనులను చేయటానికి నిర్బంధించి, జమీందారుల దోపిడీకి, రౌడీ దళాల అరాచకానికి రక్షణ కల్పించుతున్నారు. అందువల్ల ఈ పోలీసు క్యాంపులను ప్రభుత్వం ఎత్తివేయాలి.

"6. ప్రభుత్వం ప్రజల ప్రాణాలను బలిగొన్నవారిపైన, వారి ఆస్తులను కొల్లగొట్టి, స్త్రీలను చెరచిన వారిపైన కేసులను నడిపించలేదు. పైగా ఆత్మరక్షణకు పూనుకున్న ప్రజలపైన, కార్యకర్తలపైన దొమ్మీ, హత్య కేసులు తెచ్చి వారిని జైళ్ళలో పెట్టటానికి ప్రయత్నించుతున్నది. ఈ కేసులను ఉపసంహరించుకొని జమీందారీ ముఠాను, రౌడీ దళాలను శిక్షించాలి. అధికారుల అత్యాచారాలపై బహిరంగ విచారణ జరపాలి.

"7. జైల్లో వున్న రైతు కూలీ ఖైదీలను, ప్రజా నాయకులను విడుదల చేయాలి. వీరు రైతు కూలీ బిడ్డలు. జమీందారుల కనుసన్నలపైన, వారి స్వార్థం కొరకు అరెస్టు చేయబడినవారు. వారిని జైళ్ళలో వుంచటానికి ప్రభుత్వానికి అధికారం లేదు.

"8. ఆంధ్రమహాసభ, కమ్యూనిస్టు పార్టీలపైన నిషేధాలు తొలగాలి.

"9. ప్రజలందరిచే ఎన్నుకోబడిన ప్రజారాజ్యం కావాలి."

("నల్లగొండ ప్రజల వీరోచిత పోరాటం" పేజీ 30,31,32)

ఈ కోర్కెల్లో వ్యవసాయ విప్లవం, భూస్వామ్య విధానం రద్దు నినాదాలు లేకనే భూస్వాముల అన్యాక్రాంత భూములను తిరిగి రైతులకు ఇచ్చివేయాలని వున్నది. వ్యవసాయ కూలీలకు బంజరు భూములను పంచాలని ఉందే కాని భూస్వాముల మిగులు భూములను పంచాలని కోరలేదు. గ్రామరాజ్యాల ప్రసక్తే లేదు. కోర్కెలను ప్రభుత్వము అంగీకరించాలనే రూపంలో ముందుంచినారు. వాస్తవానికి భూస్వాముల భూమిని పంచటం మౌలికమైన కోర్కె. దీనిని ప్రభుత్వం అంగీకరించదు. నిరంకుశ ప్రభుత్వం కావటంవలన తక్కిన కోర్కెలను కూడా అంగీకరించలేదు[34].

# 9. నిజాం వ్యతిరేక పోరాటం - మొదటి దశ

## (స్టేటు కాంగ్రెసు సత్యాగ్రహం-కమ్యూనిస్టుల నాయకత్వాన ప్రజల పోరాటం, సాయుధ పోరాటం ప్రారంభం.)

1947 ఆగస్టు తర్వాత ప్రారంభమై 1948 సెప్టెంబరుదాకా సాగిన పోరాటానికి నిజాం వ్యతిరేక పోరాటమనే పేరు వాడుకలో ఉంది. వాస్తవంగా అంతవరకూ సాగినదంతా నిజాం వ్యతిరేక పోరాటమే. నిజాం అనుకూల పోరాట మెప్పుడూ జరుగలేదు. ఫాసిస్టు వ్యతిరేక యుద్ధకాలంలో కావచ్చు, తర్వాత కాలంలో సాగింది కావచ్చు, పైన పేర్కొన్న కాలంలో జరిగినది కావచ్చు- ఇదంతా నిజాం వ్యతిరేక పోరాటమే.

కొన్ని సందర్భాల్లో లెవీలాంటి సమస్యలపై నిజాం ప్రభుత్వాన్ని బలపరిచినట్టు కనిపించవచ్చును. రాయబారాలు (Deputations) నడుపటం లాంటి కార్యక్రమాల వలన నిజాం వ్యతిరేక ప్రజా ఉద్యమాన్ని పెద్దఎత్తున నిర్మించకపోవచ్చును. నల్లగొండ జిల్లాలో సాగినట్టుగా తక్కిన ప్రాంతాల్లో పోరాటాలు సాగకపోవచ్చును. అయినా సాగినదంతా నిజాం వ్యతిరేక పోరాటమే; నిజాం వ్యతిరేక ప్రజా ఉద్యమమే; కార్మికులు, కర్షకులు, ఇతర ప్రజాతంత్ర శక్తుల కోర్కెలకు సంబంధించిన పోరాటమే. వివిధ సమయాల్లో పార్టీ, ఆంధ్ర మహాసభల నాయకులను గృహ నిర్బంధంలో ఉంచేవరకూ, వారు పనిచేసే ప్రాంతాలనుంచి బహిష్కరించే వరకూ వచ్చిందంటే నిజాం వ్యతిరేక పోరాటం కావటం వల్లనే. అయితే కాంగ్రెసువారు రంగంలోకి వచ్చిన తర్వాతనే దీనికి నిజాం వ్యతిరేక పోరాటమనేపేరు వాడుకలోకి వచ్చింది. అంతవరకూ సాగిన పోరాటాన్ని గుర్తించకపోవటమే దీనికి కారణం.

### 1. కాంగ్రెసువారి సత్యాగ్రహానికి దారితీసిన రాజకీయ పరిణామాలు

కేంద్రంలో కాంగ్రెసు అధికారంలోకి వచ్చింది. నెహ్రూగారు ప్రధాన మంత్రి, సర్దార్ పటేలు హోంమంత్రి అయినారు. కాంగ్రెసు పెద్దలంతా మంత్రి

పదవులు, గవర్నరు పదవులు స్వీకరించారు.

కాని నిజాం రాజ్యంలో స్టేటు కాంగ్రెసు నాయకులకు ఏ పదవులూ రాలేదు. నవాబు స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకున్నాడు. ఆయన ప్రభుత్వానికీ, నెహ్రూ-పటేలు ప్రభుత్వానికీ రాజీ కుదరలేదు. ఈ స్థితిలో స్టేటు కాంగ్రెసు పోరాటం ప్రారంభించవలసివచ్చింది.

ఇంతకుముందే చెప్పినట్లు ప్రధానమంత్రిగా ఉన్న సర్ మీర్జా ఇస్మాయిల్ సంస్థాన పాలనా యంత్రాన్ని స్టేటు కాంగ్రెసుకు ఆమోదయోగ్యంగా మార్చటానికి చేసిన ప్రయత్నాలు ఫలించలేదు. కాశిం రజ్వీ నాయకత్వాన ఉన్న ఇత్తెహాదుల్ ముసల్మీన్ వారు ఇక్కడి పాలనా యంత్రంలో కాంగ్రెసు వారు ఒకరో ఇద్దరో ఉండటానికి ఒప్పుకున్నా, "ఇది ముస్లిం రాజ్యం, ముస్లిం రాజ్యంగానే ఉండాలి" అనే నినాదంతో ముందుకు వచ్చారు. వారిని అదుపులోకి తీసుకురావటం సర్ మీర్జా ఇస్మాయిల్‌కు సాధ్యం కాకపోయింది. దీనితో స్టేటు కాంగ్రెసు నిలదొక్కుకోలేకపోయింది. ఎందుకంటే దీనికి స్వతహాగా ప్రజలలో బలంలేదు. రెండవది: కాంగ్రెసువారి అహింసా సిద్ధాంతం, ఇత్తెహాదుల్ ముసల్మీన్ వారి అగ్రెసివ్ (దూకుడు, హింసాయుత) పాలసీకి వ్యతిరేకంగా నిలదొక్కుకోలేకపోయింది. ఆ తర్వాత మీర్జా ఇస్మాయిల్‌ను పంపించివేశారు. ఛత్తారీ నవాబును తిరిగి ప్రధాన మంత్రిగా తీసుకువచ్చారు. ఆయన కూడా వీరిని అదుపులో పెట్టలేకపోయినారు. కొన్ని నెలల తర్వాత వెళ్ళిపోవలసి వచ్చింది.

భారత యూనియన్‌లో దేశంలో ఉన్న సంస్థానాలన్నింటినీ కూడా ఒకదాని తర్వాత మరొకటిగా విలీనం ( Accession ) చేసుకున్నారు. యూనియన్‌లో చేరుతున్నాము అని మహారాజులు, నవాబులు ఒక ఒప్పందం (Instrument of Accession) మీద సంతకం చేసి యూనియన్‌లో చేరిపోయినారు. చిన్నచిన్న సంస్థానాలను పక్కనున్న రాష్ట్రాలలో కలిపివేశారు. ఇవన్నీ విలీనమైన తర్వాత కొన్ని పెద్ద సంస్థానాలు మిగిలిపోయాయి. హైదరాబాదు, మైసూరు, కాశ్మీరులు ముఖ్యమైనవి.

కాశ్మీరు సంస్థానాన్ని హస్తగతం చేసుకోటానికి అప్పుడే ఏర్పడిన పాకిస్తాన్, భారతదేశాల మధ్య యుద్ధం జరిగింది. యుద్ధ విరమణ పేరుతో కాశ్మీరును విభజించినారు. ఈ రెండు దేశాల మధ్య ఇప్పటికీ కాశ్మీరు తగాదా సమస్యగానే ఉన్నది.

మైసూరులో అక్కడి స్టేటు కాంగ్రెసువారు సత్యాగ్రహం చేశారు. ఒక దశకు వచ్చేవరకు అక్కడున్న కాంగ్రెసువారే కోలారు జిల్లాలోని ఒక పోలీసు స్టేషనుమీద దాడి చేశారు. దీనితో మైసూరు రాచరికానికి భయంవేసింది. సంస్థానం భారత యూనియన్‌లో చేరినది.

ఇక మిగిలింది నిజాం సంస్థానం ఒక్కటే. నిజాం నవాబు బ్రిటిషువారి సాయంతో స్వతంత్రంగా ఉండటానికే ప్రయత్నించినాడు. కానీ వారు సాధ్యం కాదని చెప్పినారు. స్వామీ రామానందతీర్థ తన స్మృతుల్లో బ్రిటిష వైఖరిని గూర్చి ఇలా ఉదహరించినారు:

"హైదరాబాదు పరిపాలనపై స్వతంత్ర భారతం ఒత్తిడి కూడా పెరుగుతున్నది. తన పదవిని విరమించేముందు హైదరాబాదును ఏదో విధంగా భారత యూనియన్ కక్ష్య (పరిధి)లోకి లాగాలని భారతదేశపు చివరి గవర్నరు జనరలు అయిన మౌంటుబాటన్ ప్రభువు ఆదుర్దాగా ఉండేవాడు. ప్రారంభంలో బలహీనమైన సంబంధం ఏర్పడినా ఆయన సంతృప్తిపడేవాడన్నట్టు కన్పించింది." (పేజి 188, ఇంగ్లీషు ప్రతి.)

యూనియన్ ప్రభుత్వంతో జరిగే సంప్రదింపులలో నిజాంకు సహాయ పడటానికి వాల్టర్ మాంక్టన్ అనే అతనిని రాజ్యాంగ సలహాదారుగా (constitutional advisor) బ్రిటిష ప్రభుత్వం పంపించింది.

అప్పుడు స్టేట్స్ హైకమాండ్‌కి నాయకుడుగా యూనియన్ ప్రభుత్వం నిజాం నవాబుతో సంప్రదింపులు జరుపుతూ ఉండేది. సంస్థానాలను విలీనం చేసుకునే హోం శాఖకు మంత్రిగా ఉన్న సర్దార్ పటేలు నాయకత్వాన యూనియన్ ప్రభుత్వం ఈ సంప్రదింపులు సాగిస్తూ ఉండేది. నిజాం నవాబుతో ఏదో ఒక రకమైన ఒడంబడిక కుదురుతుందనే భ్రమతోనూ, ఆశతోనూ యూనియన్ ప్రభుత్వం ఉండేది. శ్రీ కృష్ణమీనన్‌లాంటివారు ఏదో ఒక అనధికార మైన (informal) ఒప్పందం కుదరటానికి అవకాశం ఉన్నదని చెప్పినట్లుగా ఆ రోజుల్లో వార్తలు వెలువడ్డాయి. వారు అంతటితో ఆగక పోరాటానికి వెంటనే దిగవద్దని స్టేటు కాంగ్రెసుకి సలహాకూడా ఇస్తుండేవారు.

**రజాకార్లు :** రజాకార్లు అనేది ఉర్దూ పదం. వలంటీర్లు అని దాని అర్థం. అయితే వారు చేసిన పనులు క్రూరంగా ఉన్నందున, రజాకార్లంటే దుర్మార్గులకు మారు

పేరుగా చలామణీ అయింది. మజ్లిస్ ఇత్తెహాదుల్ ముసల్మీన్ నిజాం ప్రభుత్వపు తోడ్పాటుతో ఈ సంస్థను ఏర్పాటు చేయటానికి నిర్ణయించింది. మజ్లిస్‌నాయకులు ముందు పట్టణాల్లో ఉన్న ముస్లిములను రజాకారు సంస్థలోకి సమీకరించటానికి ప్రయత్నించి, చాలావరకు సఫలీకృతమయినారు. వారికి కవాతు, ఆయుధాలు ఉపయోగించే శిక్షణ ఇచ్చి, నిజాం సైన్యానికి, సాయుధ పోలీసు దళాలకు అనుబంధంగా (Supplement) ఉండేవిధంగా తయారుచేసినారు.

1946లో నల్లగొండలో సాగిన పోరాటంలో ప్రభుత్వం రజాకార్లను ఉపయోగించలేదు. మిలటరీని, సాయుధ పోలీసులను మాత్రమే ఉపయోగించింది. కాని హైదరాబాదు నగరంలోనూ, జిల్లా, తాలూకా కేంద్రాల్లోనూ మతకల్లోలాలను రెచ్చగొట్టటానికి రజాకార్లు ఉపయోగపడినారు. స్టేటుకాంగ్రెసువారి సత్యాగ్రహం, కమ్యూనిస్టుల ప్రజాపోరాటం ప్రారంభమైన తర్వాత రజాకార్లు గ్రామ ప్రజలపై దాడి చేయసాగినారు.

బ్రిటిషు సామ్రాజ్యవాదుల ప్లాను ప్రకారం 1947 ఆగస్టు 15 నాటికి భారత దేశపు విభజన జరిగింది. పాకిస్తాన్ ఏర్పడింది. హిందూ ముస్లింకొట్లాటలు పెద్దఎత్తున చెలరేగినవి. తూర్పున బెంగాలులోనూ, పశ్చిమాన పంజాబులోనూ ఇవి ఉధృతంగా సాగినవి. వీటి ప్రభావం హైదరాబాదు సంస్థానంలోకూడా పడింది. రజాకారు నిర్మాణంతో సిద్ధంగా ఉన్న మజ్లిస్ నాయకత్వం నిజాం రాజ్యం స్వతంత్రంగా ఉంటుందనీ, భారత యూనియన్‌లో చేరటానికి వీలులేదని రంకెలు వేస్తున్నది. ఈ స్థితిలో నిజాం ప్రభుత్వాన్ని లొంగదీసి సంస్థానాన్ని యూనియన్‌లో చేర్చటానికి నెహ్రూ-పటేలు కేంద్ర ప్రభుత్వం ఒకవైపున సంప్రదింపులు ప్రారంభించింది. మరోవైపున స్టేటు కాంగ్రెసుతో సత్యాగ్రహం చేయించింది.

ఈ సందర్భంలో మితవాదులు, స్వామీజీ పక్షంవారు కలిసి ఉన్న స్టేటు కాంగ్రెసు చేయవలసినదేమిటి ? యూనియన్ ప్రభుత్వ వైఖరికి అనుగుణ్యంగా, నిజాంకు వ్యతిరేకంగా జరుపవలసిన సత్యాగ్రహ పోరాటం గురించి నిర్ణయించటానికి స్టేటు కాంగ్రెసు మహాసభను జరిపారు. ఇది అధికార మార్పిడికి కొంత ముందే జరిగింది. పోరాటం నడపాలా, వద్దా అన్న సమస్యమీద స్టేటు కాంగ్రెసులోని మితవాదులకూ, స్వామీజీ పక్షంవారికీ భేదాభిప్రాయాలు రాలేదు. అయితే, ఈ పోరాటాన్ని నడిపించటానికి ప్రజాతంత్రం పేరుతో ఎక్కువ సభ్యులున్న

స్టేటు కాంగ్రెసు కౌన్సిలుకి అధికారం ఇవ్వాలని మితవాదులంటే, వర్కింగ్‌కమిటీకి ఇవ్వాలని స్వామీజీ పక్షంవారు అన్నారు. సమస్య ఏమిటంటే తక్కువసభ్యులతో ఉన్న వర్కింగ్ కమిటీలో స్వామీజీ పక్షంవారు ఎక్కువ సంఖ్యలో ఉండినారు. వారికి అధికారం ఇవ్వకుండా మితవాద నాయకులకు సంఖ్యాబలం ఉన్న కౌన్సిల్‌కి ఇస్తే, వారు స్వామీజీ పక్షం కంటే ముందు అరెస్టు అవుతారు. కొందరైనా బయట ఉండి, లేదా ముందు విడుదలై వచ్చి, కౌన్సిల్‌ని సమావేశ పరిచి పోరాటం విషయంలో తమకు అనుకూలమైన నిర్ణయాలు చేయవచ్చును. సంప్రదింపులు, తదితర వాటిలో తమకు సౌలభ్యంగా ఉంటుందని మితవాదులు భావించి ఉంటారు. అందుకొరకు సత్యాగ్రహ సమస్యమీద అభిప్రాయ భేదాలేమీ లేవు. జైళ్ళు నింపటమనె కార్యక్రమం అందరికీ ఉన్నదే. ఇదంతా ఎవరి నాయకత్వాన జరగాలన్నదే ప్రధాన విభేదం.

## 2. సత్యాగ్రహం ప్రారంభమైన నాటి పరిస్థితులు

సంస్థానంలో సత్యాగ్రహ పోరాటాన్ని నడిపించాలని నిర్ణయించుకున్నప్పుడు— కమ్యూనిస్టు పార్టీ బలం ఎంత? నాయకత్వం కమ్యూనిస్టు పార్టీ చేతుల్లోకి పోకుండా ఉండాలంటే తాము పోరాటాన్ని ఏ విధంగా నడిపించాలి? అనేది కాంగ్రెసు నాయకులకు తీరని సమస్య అయింది.

కమ్యూనిస్టు పార్టీ యువకులను, విద్యార్థులను సమీకరించటం వల్ల, రాష్ట్ర వ్యాపితంగా ఉద్యమం బాగా పెరిగి ఉన్న కారణంగా ఈ పోరాటాన్ని సమర్థవంతంగా నడపటానికి కావలసిన ఏర్పాట్లు పార్టీకి ఉన్నాయి. స్టేటు కాంగ్రెసుకు అటువంటి ఏర్పాట్లు లేవు. కేంద్రంలో అధికారంలో ఉండటంవల్ల కాంగ్రెసుపై భ్రమలతో, కొంతమంది ఉన్నత వర్గాలనుంచి వచ్చినవారు, మధ్యతరగతివారు, చదువుకున్నవారు స్టేటు కాంగ్రెసు వైపున చేరినవారు లేకపోలేదు. అయినా అప్పటి పరిస్థితుల్లో నిర్మాణరీత్యా నాయకత్వరీత్యా పార్టీయే బలంగా ఉండేది.

**కమ్యూనిస్టు పార్టీ, ఆంధ్ర మహాసభల పరిస్థితి:** సంస్థానంలో పార్టీ, ఆంధ్ర మహాసభల పరిస్థితి క్లుప్తంగా ఈ విధంగా ఉంది : హైదరాబాదులోనూ, నల్లగొండ జిల్లాతో సహా అన్ని జిల్లాల్లోనూ అఖిల హైదరాబాదు విద్యార్థి సంఘం

నాయకత్వాన ఏర్పడి ఉన్న విద్యార్థి ఉద్యమం చాలా ముందుకు పోయింది. విద్యార్థులు, యువకులు కార్యకర్తలుగా ముందుకువచ్చి బాగా పనిచేశారు. వీరిలో ముస్లింలు కూడా కొందరుండేవారు. కానీ, ముస్లిం జనసామాన్యం పోరాటంలో ముందుకు రాలేదు. అదే విధంగా ట్రేడు యూనియను ఉద్యమం కూడా హిందూ-ముస్లిం కార్మికులు కలిసి ఉన్నటువంటి ట్రేడు యూనియను ఉద్యమం. ట్రేడు యూనియను రాజకీయాలే సాగేవి. పార్టీ రాజకీయాలు, విప్లవ రాజకీయాలు లేవు. పార్టీ రాజకీయాలు వర్గ సామరస్య రాజకీయాలుగా మారటంతో (యుద్ధకాలంలో ఉత్పత్తిని పెంచమని ఇచ్చిన నినాదం, యుద్ధం తర్వాత కాంగ్రెసును బలపరచటమనే కార్యక్రమం) సాధారణ ట్రేడు యూనియను కోర్కెల కొరకు పోరాట కార్యక్రమాన్ని కూడా ప్రచారంలో పెట్టలేదు. విద్యార్థుల పరిస్థితి దాదాపు ఏమిటంటే—జాతీయ భావాలు, కాంగ్రెసు అనుకూల భావాలు ఉన్నవారు హిందూ విద్యార్థులలో ఎక్కువ సంఖ్యలో ఉండేవారు. అయితే పార్టీ శిక్షణ, పార్టీ రాజకీయాలు ఉన్న కార్యకర్తలు హెచ్చుగా ఉండేవారు. కాని పార్టీ రాజకీయాలు వర్గ సామరస్య రాజకీయాలుగా ఉండటం వలన వారు విప్లవ కార్యక్రమంతో ముందుకు పోలేదు. వీటితో పాటు గుమాస్తా సంఘాలవంటి మధ్యతరగతి ప్రజల సంఘాలు కూడా చాలా చోట్ల ఏర్పాటు చేశారు. పార్టీ నాయకులు ముందుండి వీటిని ఏర్పాటు చేసినారు. సికిందరాబాదులో వట్టికోట ఆళ్వారు స్వామిగారు గుమాస్తా సంఘాన్ని ఏర్పాటు చేశారు. ఇది బలమైన గుమాస్తా సంఘంగా రూపొందింది. ఖమ్మం వరంగల్ లాంటి ప్రాంతాలలో కూడా వీటిని ఏర్పాటు చేశారు. కొన్ని ప్రాంతాల్లో జాతీయపక్షంవారు వీటిలో పనిచేశారు.

విప్లవ రాజకీయాలు లోపించటం వీటిలో ప్రధానంగా కనిపిస్తుంది. నల్లగొండ జిల్లాలో పార్టీ సిద్ధాంతాలు, విప్లవ సిద్ధాంతాలు ఆధారం చేసుకొని ఆర్య సమాజానికి వ్యతిరేకంగా సిద్ధాంత పోరాటం జరిపి, విద్యార్థులను వారి ప్రభావం నుంచి పార్టీలోకి సమీకరించటం జరిగింది. ఫలితంగా తర్వాతి కాలపు పోరాటంలో నల్లగొండ జిల్లాలో హెచ్చు సంఖ్యలో విద్యార్థులు పాల్గొన్నారు. తక్కిన జిల్లాల్లో పాల్గొన్నా దానికి పరిమితులున్నాయి. గ్రామాల్లో పరిస్థితి చూస్తే, నల్లగొండ జిల్లాను మినహాయిస్తే, తెలంగాణాలోని ఇతర జిల్లాల్లో మొదట వెట్టి చాకిరికి వ్యతిరేకంగా చట్టాలను అమలు జరపాలనే ఉద్యమం,

తర్వాత కాలంలో లెవీ ధాన్యానికి వ్యతిరేకంగా ప్రభుత్వాన్ని బలపరిచే విధంగా సాగిన ఉద్యమం, ఆ తర్వాత నిర్బంధ విధానానికి వ్యతిరేకంగా సాగిన ఉద్యమం —ఈ అన్ని సందర్భాలలోనూ వ్యవసాయ విప్లవం సమస్య ముందుకు రాలేదు

ఈ కాలంలోనే మొదటిసారిగా కొందరు కమ్యూనిస్టు పార్టీ నుంచి వెళ్ళిపోయారు. హైదరాబాదు సంస్థానంలో వరంగల్ జిల్లా పార్టీ కార్యదర్శిగా పనిచేస్తున్న పెరవల్లి వెంకటరమణయ్య, మరి కొందరు కలిసి, పార్టీకి రాజీనామా లిచ్చి కాంగ్రెసులో చేరిపోయారు. మీర్జా ఇస్మాయిల్ ప్రభుత్వం దీనికి పెద్ద ప్రాధాన్యతనిచ్చి ప్రకటించి ప్రచారం చేసింది. దీనివల్ల కాంగ్రెసు చాలా బలపడుతుందని, పార్టీ బలహీనపడుతుందని భావించారు. కానీ అలాంటిదేమీ జరుగలేదు. వారు వారుగానే వెళ్ళిపోయారు. పార్టీ పార్టీగానే ఉన్నది. కాంగ్రెసు కాంగ్రెసుగానే ఉన్నది. అంతా మామూలుగానే సాగిపోయింది. ఈ విధంగా అధికార మార్పిడి రావటంతో కాంగ్రెసుద్వారానే కావలసిన మార్పులన్నీ చేయ వచ్చుననే భ్రమలు కలిగిన ఒక వర్గం కాంగ్రెసులో చేరిపోయింది. పార్టీ చైతన్యం ఉండి, నాయకులుగా, కార్యకర్తలుగా పార్టీకొరకు పనిచేసినప్పటికి వారు ఈ మార్పులను సరిగా అర్థం చేసుకోలేదు. జోషిలైను అనే మితవాద లైనుని పార్టీ అనుసరించినప్పటికీ, వారు దానితో కూడా సంతృప్తిపడక బయటికి వెళ్ళి, కాంగ్రెసులో చేరిపోయారు. ఆ తర్వాత వారు పెద్దగా బాధ్యతలు నిర్వహించిన రిపోర్టులేమీలేవు.

పార్టీ తెలంగాణా ప్రజలలో పనిచేయటం మొదలుపెట్టి 1947 ప్రారంభం వరకు సుమారు 6 సం॥లు దాటి 7 సం॥లు కావస్తున్నది. ఆంధ్రరాష్ట్రంలో పని చేయటం అంతకన్నా చాలాముందే ప్రారంభం అయి 10 ఏళ్ళు దాటుతుంది. అక్కడ పార్టీ మరో విధంగా - కాంగ్రెసు సోషలిస్టు పార్టీలో ఉంటూ కాంగ్రెసులో అతివాదులుగాఉండి పనిచేసిన ఘటనలుకూడా వున్నాయి. ఈరకంగా పనిచేసిన కాలంలో ఆ ప్రాంతాలలో పార్టీవారు కాంగ్రెసులో మంచి కాంగ్రెసు వాదులుగా, జాతీయవాదులలో మంచి జాతీయవాదులుగా, ప్రజా సేవకులలో మంచి ప్రజా సేవకులుగా ప్రజలముందు గుర్తింపుని సంపాదించారు.

**స్టేటు కాంగ్రెసు పరిస్థితి:** తెలంగాణాలో స్టేటు కాంగ్రెసు ఒక బల హీనమైన శక్తిగా ఉండినది. అందులోని జాతీయ పక్షం వారికి కొద్దిమంది

అనుచరులున్నా వారు వ్యక్తులుగానే ఉన్నారు. ఖమ్మం, మధిర ప్రాంతాలలో, వరంగల్ ప్రాంతంలో, కరీంనగర్ జిల్లాలో అక్కడక్కడ కొన్ని పాకెట్స్‌లో వీరు ఉండేవారు.

ఈ స్టేటు కాంగ్రెసుకు మహారాష్ట్ర, కర్ణాటకలో కూడా తగినంత బలం లేదు. అక్కడ అతివాదులనబడే గోవిందదాస్ ష్రాఫ్‌లాంటివారు దానికి నాయకత్వం వహించేవారు. చంద్రగుప్త చౌదరిలాంటి పార్టీ నాయకులు అఖిల భారత స్థాయిలో పార్టీ ఇచ్చిన ఫాసిస్టు వ్యతిరేకులతో ఐక్య సంఘటన, అతివాదులతో ఐక్య సంఘటన నినాదాల పేరుతో ఎప్పుడూ గోవిందదాస్ ష్రాఫ్, స్వామి చుట్టూ ప్రదక్షిణలు చేసుకుంటూ ఉండేవారు. రైతాంగ ఉద్యమాన్ని నిర్మించలేదు. దానితో వారికి రైతాంగంలో స్థానం ఏర్పడలేదు. పట్టణాలలో బట్టల మిల్లుల యూనియన్ నాయకత్వం వీరి చేతుల్లో ఉండేది. రైల్వేకార్మికులలో కూడా కొంత పనిచేస్తూ ఉండేవారు. ఇది వారికున్న పరిమితమైన బలం. దీనితో ఎంత కాలమైనా వారు ముందుకు పోలేకపోయారు. ఫలితంగా అతివాద శక్తులు స్టేటు కాంగ్రెసు నాయకత్వాన ఉండిపోయాయి.

## 3. కాంగ్రెసు వినాదాలు - పార్టీ వైఖరి

ఆనాటి కేంద్రకమిటీ విధానం కాంగ్రెసువారికి సహాయకారిగా ఉంది. అధికార మార్పిడివలన వచ్చిన నామమాత్రపు స్వాతంత్ర్యాన్ని నిజమైన స్వాతంత్ర్యంగా మార్చాలంటే నెహ్రూ నాయకత్వాన ఉన్న కేంద్ర ప్రభుత్వాన్ని బలపరచాలనే విధానాన్ని పార్టీ అనుసరించింది. సర్దారు పటేలు అభివృద్ధి నిరోధకుడనీ, నెహ్రూ అభివృద్ధి కాముకుడనీ, ఆ కారణాన నెహ్రూ విధానాలను బలపరచాలనీ, సర్దారు విధానాలను వ్యతిరేకించాలనీ చెప్పటం ఈ విధానంలోని ముఖ్యాంశాలు. అధికార మార్పిడి తర్వాత ఇద్దరూ అనుసరించిన విధానాల్లో మౌలికమైన విభేదాలు లేవు. అయినా హోం మంత్రి హోదాతో పటేలు హైదరాబాదుతో సహా సంస్థాన వ్యవహారాలన్నింటికీ బాధ్యుడు. కేంద్రకమిటీ విధానం ప్రకారం సంస్థానానికి సంబంధించినంతవరకు పార్టీ ఈయన అభివృద్ధి నిరోధకమైన విధానాలకు వ్యతిరేకంగా పోరాటం చేయాల్సి ఉంటుంది. ఈ సమస్యపై నెహ్రూ అభివృద్ధికర విధానాలేమిటో ఆనాటి కేంద్రకమిటీ స్పష్టం చేయలేదు.

**స్టేటు కాంగ్రెసుతో నిజాం వ్యతిరేక ఐక్య సంఘటన :** హైదరాబాదు సంస్థానంలో కాంగ్రెసు ప్రభుత్వం ఏర్పడలేదు. ఆ కారణాన కాంగ్రెసును బలపరచాలా లేదా అనే సమస్య పార్టీ ముందుకు రాలేదు. కానీ, నెహ్రూ అనుచరులైన స్వామీ రామానంద తీర్థ నాయకత్వాన స్టేటు కాంగ్రెసు ఉంది. దానిలో వున్న బూర్గుల రామకృష్ణారావు ప్రభృతులు సర్దారు పటేలు అనుచరులు. నెహ్రూను బలపరచాలనే నినాదానికి అనుగుణ్యంగా స్టేటు కాంగ్రెసుతో నిజాం వ్యతిరేక ఐక్య సంఘటన ఏర్పడాలనీ, దానిలో కాంగ్రెసు, కమ్యూనిస్టులు, ఇతర నిజాం వ్యతిరేక శక్తులు చేరి ఐక్యంగా పోరాడాలనీ రాష్ట్ర కమిటీ, సంస్థానంలోని మితవాద కమ్యూనిస్టు నాయకుల అభిప్రాయం. ఐక్య సంఘటన ద్వారా పోరాటాన్ని సమన్వయం చేస్తూ, కాంగ్రెసు కార్యక్రమానికి అనుగుణ్యంగా పార్టీ తన పోరాట కార్యక్రమాన్ని పరిమితం చేసి నడిపించాలని కూడా నాయకత్వం నిర్ణయించింది.

**సంస్థానం భారత యూనియన్‌లో చేరాలనే నినాదం-పార్టీ వైఖరి :** "నిజాం సంస్థానం భారత యూనియన్‌లో చేరాలి," "నిజాం సంస్థానంలో బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పడాలి" అనేవి కాంగ్రెసు నినాదాలు. వీటిని పార్టీ బలపరచటమే కాకుండా, తన నినాదాలుగా కూడా ముందుకు పెట్టింది. భారత యూనియన్‌లో చేరటం యొక్క పరిమితులను పార్టీ ప్రజలకు వివరించి చెప్పలేదు. 'సంస్థానం భారత యూనియన్‌లో చేరితే యూనియన్ ప్రభుత్వం లాంటిదే దాని స్థానిక శాఖ ఇక్కడ ఏర్పడుతుంది. ఈ ప్రభుత్వానికుండే అధికారాలు స్వల్పం. అలాంటి ప్రభుత్వపు ప్రజాస్వామిక స్వభావం నామ మాత్రంగానే ఉంటుంది. అందుకొరకు అది ప్రజలకు చేయగలిగిందేమీలేదు. ప్రజల పోరాటం కొనసాగవలసి ఉంటుంది' అనే అంశాన్ని ఆ రోజుల్లో ప్రజలకు చెప్పలేదు. యూనియన్‌లో చేరటం అనే నినాదం ప్రజాస్వామికమైన కోరిక. అయినప్పటికీ, అది ఏ విధంగా ప్రజాస్వామికమైనదీ, దానికున్న పరిమితులేమిటీ అనే అంశాలను పార్టీ ప్రజలకు వివరించలేదు. యూనియన్‌లో చేరటంతో హైదరాబాదు సంస్థానం భారతదేశంలో అంతర్భాగమవుతుంది. భారతదేశ ప్రజలందరితో కలిసి నిజాం ప్రభుత్వాన్ని కాపాడుతున్న యూనియన్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడవలసి ఉంటుంది. దీనిలో ఒక భాగంగా నిజాం నవాబు నిరంకుశ పాలనకీ వ్యతిరేకంగా పోరాటం చేయవలసి ఉంటుంది. నిజాం

ప్రభుత్వానికి వ్యతిరేకంగా చేసే పోరాటంతో పాటు ప్రధానంగా యూనియన్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా చేసే పోరాటంవల్లనే సంస్థానం రద్దు అవుతుంది. విశాలాంధ్ర ఏర్పాటు, సంయుక్త మహారాష్ట్ర, కర్ణాటక రాష్ట్రాల ఏర్పాటు, యూనియన్ ప్రభుత్వంతో పోరాడి మాత్రమే సాధించగలమనే అంశాన్ని వివరించి చెప్పలేము.

**బాధ్యతాయుత ప్రభుత్వ నినాదం-పార్టీ వైఖరి :** అస్పష్టమైన, పరిమితమైన ఓటింగుతో ఏర్పడిన శాసన సభ, ఆ శాసన సభకు బాధ్యత వహించే మంత్రివర్గం ఉండటమే కాంగ్రెసువారి దృష్టిలో బాధ్యతాయుత ప్రభుత్వమంటే. నిజమైన బాధ్యతాయుత ప్రభుత్వమంటే ప్రజాతంత్ర పద్ధతుల్లో వయోజన ఓటింగు ద్వారా ఏర్పడి, ప్రజలకు బాధ్యత వహించే ప్రభుత్వం. అలాంటి ప్రభుత్వం సంస్థానమూ, రాచరిక ప్రభుత్వమూ ఉన్నంతవరకూ ఏర్పడదు. సంస్థానమూ, రాచరికమూ రద్దు చేయబడి విశాలాంధ్ర, సంయుక్త మహారాష్ట్ర, సంయుక్త కర్ణాటక రాష్ట్రాలు ఏర్పడినప్పుడే అలాంటి ప్రభుత్వాలు ఏర్పడుతాయి. తక్కిన రాష్ట్రాలలో ఉన్న కాంగ్రెసు ప్రభుత్వాలలాగే ఇవి కొన్ని సంస్కరణలను (జమీందారీల రద్దు లాంటివి) తీసుకురావచ్చు. జాగిర్దారీ విధానంతోపాటు మొత్తం భూస్వామ్య విధానాన్ని రద్దుచేసి దున్నేవాడికే భూమిని ఇవ్వటం—అంటే భూస్వాముల నుంచి స్వాధీనం చేసుకున్న భూములను పేదరైతు, కూలీలకు పంచటం—లాంటి మౌలిక మార్పులు తీసుకువచ్చే కార్యక్రమం ఈ ప్రభుత్వాలకుండదు. వీటికొరకు ప్రజలు పోరాటం కొనసాగించవలసి ఉంటుంది. ఈ విధంగా ఈ నినాదాలు ప్రజాతంత్రమైనవి గనుక వీటిని బలపరుస్తున్నామే గాని, వీటివల్ల మన ప్రధాన సమస్యలేవీ పరిష్కారం కావు, వాటికొరకు పోరాటం కొనసాగించవలసి ఉంటుంది—అని ప్రజలకు వివరించే కార్యక్రమం పార్టీ తీసుకోలేదు.

ఈ బాధ్యతాయుత ప్రభుత్వం యొక్క స్వరూప స్వభావం ఏమిటన్నది తెలియదు. కాని నిజాం ప్రభుత్వం యొక్క భవిష్యత్తుని ప్రజలే నిర్ణయించాలి అనేది పార్టీ 1946లో ఇచ్చిన నినాదం. దీనిని అనుసరించి ప్రజలు కోరినట్లయితే నిజాం రాజరికాన్ని, సంస్థానాన్ని రద్దు చేయాలి. అప్పటికే కమ్యూనిస్టు పార్టీ తెలంగాణాను కలిపి విశాలాంధ్ర ఏర్పడాలనే నినాదమిచ్చి పెద్ద ఎత్తున ప్రచారం చేసింది. దీనికి ఆంధ్ర జాతీయవాదుల ఆమోదం లభించింది

సంస్థానంలో బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పడాలంటే సంస్థాన సరిహద్దులు అలాగే ఉండాలనీ, రాచరికం చట్ట సమ్మతమైనదిగా ఉండాలనీ దాని అర్థం. ఈ విధంగా కాంగ్రెసుయొక్క కార్యక్రమాన్నే పార్టీ అనుసరించింది. తన నినాదాలను తాత్కాలికంగానైనా మానివేయక వాటి కోసం పోరాడుతూనే బాధ్యతాయుత ప్రభుత్వాన్ని బలపరుచవచ్చును. కాని వాటిని మానివేసి కాంగ్రెసు నినాదాలను తమ నినాదాలుగా ముందుంచటం తప్పు.

దీనితో నిజాం ప్రభుత్వం చాలా క్రూరమైనదైనప్పటికీ, యూనియన్ ప్రభుత్వం మాత్రం ప్రజాతంత్రయుతమైనదని ప్రజలలో భ్రమలు కలిగించ టానికి పార్టీ కోద్పడింది. తాను నడిపిస్తున్న పోరాటాలద్వారా ప్రజలకున్న భ్రమలు తొలగిపోతుంటే, ఆ భ్రమలనే తిరిగి కలిగించటానికి పార్టీ తోడ్పడటం అవకాశవాదమే కాని మరొకటి కాదు. దీనివలన చాలా దుష్పరిణామాలు కలిగాయి. పార్టీ సుదీర్ఘమైన పోరాటాలు సాగించినా ప్రజల్లో ఈ ప్రభుత్వం పట్ల భ్రమలు ఏర్పడ్డాయి. పార్టీలోని మితవాద వర్గం స్వయంగా ఈ భ్రమలకు గురైంది.

పౌరసత్వహక్కులు అందరికీ కావాలనే కోరిక చిరకాలంనుంచీ వస్తూన్నం దున దాన్నికూడా స్టేటు కాంగ్రెసువారు తమ సత్యాగ్రహ కార్యక్రమంలో చేర్చారు.

**పార్టీలో మితవాద అవకాశవాద ధోరణి :** అయితే కాంగ్రెసువారి సత్యాగ్రహం ప్రారంభంకాకముందే జూలై 1947 ప్రాంతంలో ఒక సంఘటన జరిగింది. పార్టీ నాయకత్వాన నడుస్తున్న అఖిల హైదరాబాదు విద్యార్థి యూని యన్‌కు చెందిన సుమారు రెండువేల మంది విద్యార్థులు 'పోరాటాన్ని ప్రారం భించాలె,' 'నిజాంతో రాజీ పడవద్ద'న్న నినాదాలతో స్వామీజీ ఉన్న ఇంటి ముందుకు ఊరేగింపుగా వెళ్ళారు ఆయనవచ్చి ఈ విషయంలో తగిన చర్య తీసుకుంటామని హామీ ఇచ్చిన తర్వాత వీరంతా ప్రశాంతంగా వెళ్ళిపోయారు. తెలంగాణాకు సంబంధించినంతవరకూ స్వామీజీ పెద్ద పేరుబడిన వ్యక్తికూడా కాదు. హైదరాబాదు విద్యార్థులలో కాంగ్రెసుకు ప్రాబల్యమూ లేదు. కాంగ్రెసు అభిమానులు లేరా అంటే, ఉన్నారు. విద్యార్థి యూనియన్‌లో కూడా కొందరు కాంగ్రెసు అనుకూలురు ఉన్నారు. కానీ, అఖిల హైదరాదాదు విద్యార్థి యూని యన్‌కు, వారి నాయకత్వానికి స్వామీజీ వద్దకు వెళ్ళి పోరాటం నడపాలని వారి

నుంచి వాగ్దానం తీసుకోవలసిన దుస్థితి మాత్రం ఏమీ లేదు. వారు స్వతంత్రంగా తమ కాళ్ళమీద నిలబడగలిగేవారు. కాంగ్రెసు ఇటు హైదరాబాదులోగానీ, తెలంగాణా జిల్లాలలోగానీ ఎక్కడా విద్యార్థులను సమీకరించలేదు. అలాంటప్పుడు ఇవన్నీ చేయటమంటే స్వామీజీకి ఉన్న స్థానానికన్న ఆకాశానికెత్తి, ఆయనపట్ల ప్రజలలో భ్రమలను పెంచటమే.

రెండవది : నిజాంకు వ్యతిరేకంగా కాంగ్రెసుతో ఐక్యసంఘటన అనేది ఆనాటి పార్టీ పాలసీలోని ప్రధానాంశం. దాని ప్రకారం మితవాదులను పోరాటానికి వ్యతిరేకమని బట్టబయలు చేయటం, స్వామీజీ వర్గాన్ని పోరాటానికి అనుకూలమని ఆకాశానికెత్తటం జరిగింది. ఈ రెండూ తప్పే. ఇద్దరూ రెండు రకాల పోరాటాలు కావాలనేవారు. మితవాదవర్గం ఇదివరకే ప్రజలలో అపఖ్యాతిపాలై ఉన్నది. అందుకొరకు వారు తిరిగి రాజకీయంగా పునరావాసం కావటానికి అవకాశాలు చాలా స్వల్పం. వారేమైనా యూనియన్ ప్రభుత్వబలం, ఆశీర్వచనాలతో బతకవలసినదే. అలాంటి స్థితిలో వారు ఏదో ఒక విధంగా—సత్యాగ్రహంచేసి గానీ, చేయకగానీ—జైలుకి వెళ్తారు. తిరిగి వస్తారు. స్వామీజీ వర్గానికి సంబంధించినంత వరకు సత్యాగ్రహం లేదా ఏదో ఒక పోరాటం చేస్తే ప్రజలలో కొద్దో గొప్పో పలుకుబడి ఏర్పడి రాజకీయ పునరావాసం జరుగుతుందని వారు ఆశించారు. అక్కడక్కడా కొన్నిచోట్ల తప్ప తెలంగాణాలో వారి గ్రూపుకు ప్రజలను సమీకరించగలిగిన శక్తిలేదు. ఆనాడు కమ్యూనిస్టులు, వారి నాయకత్వంలోని ప్రజా సంఘాలే ప్రధానశక్తిగా ఉన్నారు. ఈ పరిస్థితులలో పార్టీలోని మితవాద సెక్షన్ 'సంస్థానం యూనియన్‌లో చేరాలి' అనే నినాదంద్వారా లేని ప్రతిష్ఠను సంపాదించుకోవటానికి కాంగ్రెసువారికి అవకాశం కల్పించింది. స్వామీజీ వద్దకు విద్యార్థులను తీసుకువెళ్ళి, ఆయన్నుంచి వాగ్దానాన్ని రాబట్టుకోవటం ఈ సందర్భంలో జరిగినదే.

ఆరు నెలల క్రితం 1946 లో నల్లగొండ జిల్లాలో జరిగిన పోరాటాలపై తీవ్ర నిర్బంధానికి (ఆకునూరు-మాచిరెడ్డిపల్లి దురాగతాలు; కడివెండి, బాలెంల-పాత సూర్యాపేట, దేవరుప్పల, మల్లారెడ్డిగూడెం పోరాటాలలో జరిగిన కాల్పులు) వ్యతిరేకంగా పార్టీ నాయకత్వాన ఉన్న విద్యార్థి యూనియను, ట్రేడు యూనియనులు, ఇతర పట్టణ ప్రజలు కదలలేదు. కొన్ని ప్రకటనలు ఇచ్చారేగాని ప్రజలను కదిలించలేదు. చూస్తూ కూర్చున్నారు. ఈ సందర్భంలో వారు

కదిలారు. దీని లోతుపాతులను పరిశీలించవలసి ఉంటుంది. సంస్థానం యూనియన్‌లో చేరాలి అనే నినాదం దేశవ్యాపితమైన ఒక ఉద్యమంలో భాగంగా ఉంది. రెండవది : ఈ సందర్భంగా కేంద్ర ప్రభుత్వబలంతో ముందుకువచ్చే కొన్ని శక్తులు, ముఖ్యంగా కాంగ్రెసు శక్తులు ఉన్నాయి. వారిది ప్రజాబలం కాదు. కేంద్రప్రభుత్వం చాలా బలమైనది గనుక నిజాం నవాబు ఇవాళోరేపో లొంగి పోవలసివస్తుంది. లేదా రాజీ చేసుకోవలసి వస్తుంది. తాము జైళ్ళకు పోయినా, కొద్దో గొప్పో నిర్బంధం అనుభవించినా, దాని ఫలితం వెంటనే అనుభవించ వచ్చుననే అవగాహనతో వారు ముందుకు వచ్చారు. ప్రజల్లో కూడా ఇలాంటి ఆలోచనను కలుగజేయటానికి వారు ప్రయత్నం చేశారు. పట్టణ ప్రజలు దీనికి త్వరగా గురిఅయ్యారు. ఈ అంశాలు ఆ రోజుల్లో సమీకరణలో ఉపయోగ పడ్డాయి. ఈ పరిస్థితుల్లో పట్టణాల్లో పార్టీ నాయకత్వాన ఉన్న ప్రజాసంఘాలు ప్రజలను సమీకరించటానికి ముందుకు వచ్చాయి. మౌలికమైన, ముఖ్యమైన ప్రజాతంత్ర సమస్యపైన, నిర్బంధానికి వ్యతిరేకంగా, భూములకోసం జరుగుతున్న ముఖ్యమైన ప్రజాతంత్ర పోరాటాలకు అనుకూలంగా పార్టీ నాయకత్వాన ఉన్న ప్రజా సంఘాలు, ప్రజా ఉద్యమాలు కదలక, ఈ సందర్భంలో ముందుకు రావటం అనేవి పార్టీలో ఉన్న అవకాశవాద లక్షణాన్ని ఎత్తిచూపుతున్నది. ఇందులో కాంగ్రెసు అనుకూలత ప్రధానమైనది. పార్టీ బలాన్ని పెంచుకోవటానికి ఈ అవకాశాన్ని, ప్రజల్లో ఉన్న వెల్లువను (upsurge) ఉపయోగించటంకన్నా, కాంగ్రెసు వారికి బలం చేకూరినా ఫరవాలేదు అనే విధంగా వ్యవహరించారు. యూనియనులో చేరాలనే ఈ కోరికమీద మాత్రం విద్యార్థులను సమీకరించటమే గాకుండా కాంగ్రెసువారి చుట్టూ ప్రదక్షిణలు చేశారు. పార్టీలో మితవాద అవకాశ వాదం ఆనాటినుంచే ఉందనే వాస్తవానికి ఇది నిదర్శనం.

## 4. కాంగ్రెసువారి జైళ్ళు నింపే కార్యక్రమం– పార్టీ నాయకత్వాన ప్రజా సమీకరణ

యూనియన్ జెండాను ఎగురవేసి జైళ్ళకు వెళ్ళటం కాంగ్రెసువారి కార్యక్రమం. మూడు నెలల్లో సుమారు 21 వేలమంది జైలుకు వెళ్ళినట్లు స్టేటు కాంగ్రెసు అధ్యక్షుడు స్వామీ రామానంద తీర్థ తన "స్మృతులు" అను పుస్తకంలో రాశారు (పేజి 182).

దీనికోసం అవసరమైన ఏర్పాట్లు చేశారు. కాంగ్రెసు అధికారంలో ఉన్న సరిహద్దు రాష్ట్రాల్లో సత్యాగ్రహ కేంద్రాలను నెలకొల్పినారు. ఇలాంటి కేంద్రాల్లో విజయవాడ ఒకటి. అధ్యక్షుడు జైలుకు వెళ్ళిన తర్వాత సత్యాగ్రహాన్ని నడప టానికి ఒక కార్యాచరణ కమిటీని (Action Committee) నియమించినారు. తెలంగాణాలో వారిని అరెస్టు చేసిన సందర్భాలలో వారితో పార్టీ సహకరిస్తున్నది కనుక ప్రజలను సమీకరించటంలో పార్టీ పాత్ర ఉంది. అదంతా స్టేటుకాంగ్రెసు సమీకరణ అనుకోవటానికి వీలులేదు.

పార్టీ సత్యాగ్రహం చేయటానికి అంగీకరించలేదు. తన సభ్యులను జైళ్ళకు పంపటానికి బదులు ప్రజలను సమీకరించాలని నిర్ణయించుకున్నది. హైదరాబాదు సంస్థానం భారత యూనియన్‌లో చేరాలి, సంస్థానంలో బాధ్యతా యుత ప్రభుత్వం ఏర్పడాలి అనే నినాదాలతో ఈ నిర్ణయాన్ని అంతటా అమలు జరిపినారు. తెలంగాణాలోని అన్ని జిల్లాల్లో, హైదరాబాదు నగరంలో ప్రజలు, ముఖ్యంగా విద్యార్థులు సమీకరణలో పాల్గొనటానికి ముందుకు వచ్చారు. పార్టీతో పాటు, గ్రామాల్లో ఆంధ్రమహాసభ, పట్టణాల్లో అఖిల హైదరాబాదు విద్యార్థి యూనియను, కార్మిక సంఘాలు నాయకత్వం వహించాయి. భారత ప్రభుత్వ పతాకాన్ని (మూడు రంగుల జెండా) ప్రజల ముందు ఎగురవేసి, స్థానిక నాయకులు ఉపన్యసించినారు. ఈ సభల్లో మూడు, నాలుగు వేల మంది ప్రజలు కూడిన సందర్భాలు కూడా ఉన్నాయి. పార్టీ, ఆంధ్రమహాసభ పనిచేస్తున్న అన్ని ప్రాంతాల్లోనూ ఈ కార్యక్రమం అమలు జరిగింది. పోలీసులు వచ్చి ప్రజలను చెదరగొట్టి, కార్యకర్తలను అరెస్టు చేయటానికి ప్రయత్నించారు. కొన్ని సందర్భాల్లో స్థానిక నాయకులు అరెస్టు అయినారు. కాని ఆయా సంఘాలు నాయకులు తప్పుకోవాలనీ, తిరిగి ప్రజల్లోకి వెళ్ళి పనిచేయాలనీ నిర్ణయించినవి. ఆ నిర్ణయం అమలుజరిగింది. దీనితో కార్యకర్తలు తప్పుకొని రహస్యంగా పనిచేయసాగారు.

జిల్లాలలో వందల సంఖ్యలో హైస్కూలు విద్యార్థులను సమీకరించి, జెండాను ఎగురవేసి, పోలీసులు వచ్చే లోపుగానే తప్పుకునేవారు. పోలీసులు ఈ జెండాను ఎగురవేయకుండా చెయ్యాలనే ప్రయత్నంలో ఉండేవారు. కొన్నిసార్లు చేరినవారిని చెదరగొట్టేవారు. ఎక్కడ ఎగురవేసేదీ వారికి తెలియకుండా, లేదా పోలీసులు ఒకచోట ఎదురుచూస్తూ ఉంటే, మరొకచోట విద్యార్థులూ, ఇతర

ప్రజలూ చేరటం, జెండా ఎగురవేయటం జరుగుతూ వచ్చింది. ఉద్యమం ఉన్న ముఖ్యమైన ప్రాంతాలంతటా గ్రామాలలో ఇలాంటి ప్రజా సమీకరణలు జరిగాయి.

పార్టీ బలంగా ఉండి, కాంగ్రెసు యెడ భ్రమల్లేని నల్లగొండ, సూర్యాపేట ప్రాంతాలలో, వరంగల్ జిల్లా మానుకోట తాలూకాలాంటి ప్రాంతాలలో ఎర్రజెండా ఎగురవేసేవారు. కొన్నిచోట్ల మూడు రంగుల జెండాతోపాటు ఎర్రజెండాను కలిపి రెండూ ఎగురవేసి జెండా వందనాన్ని చేసి ప్రజలను సమీకరించేవారు. కాంగ్రెసు నాయకత్వంలోని యూనియన్ ప్రభుత్వం నిజాం నవాబుకు, ఫ్యూడల్ వర్గాలకు బంటు అనీ, ఈ కారణం వలన యూనియన్‌లో చేరటంవల్ల ఏ సమస్యా పరిష్కారం కాదనీ ప్రజలకు చెప్పేవారు. అక్కడి పార్టీ కమిటీలకు, కార్యకర్తలకు ఈ విషయాలను వివరించారు. ఈ విధంగా ఎర్రజెండాను ఎగురవేసి, యూనియన్ జెండాను నామమాత్రంగా ఉంచి, పార్టీ ప్రత్యేకతను కాపాడుకుంటూ ఈ ప్రాంతాలలో ప్రజా సమీకరణ జరిగింది. ఇది విప్లవ స్వభావం కలిగినది. తక్కిన చోట్ల కాంగ్రెసులో లీనమయ్యే విధంగా జరిగింది. ఈ విధంగా ప్రజలను సమీకరించాలని, ఈ అరెస్టులు కావటం ప్రధానం కాదని ఖచ్చితంగా చెప్పి, పార్టీ దానికి తగిన కార్యక్రమం ఇచ్చింది. ప్రభుత్వ చట్టాలను ధిక్కరించటానికి ప్రజలను సమీకరించి, అదే సమయంలో నాయకత్వంలో హెచ్చుభాగాన్ని పార్టీ కాపాడుకున్నది. ఈ మొదటి దశలో ప్రజా సమీకరణకు మిలిటెంటు స్వభావాన్నివ్వటానికి పార్టీ ప్రయత్నించింది.

**గ్రామాలకు విస్తరించిన రజాకారు సమీకరణ :** ఇదంతా జరుగుతుంటే ప్రభుత్వం చూస్తూ కూర్చోలేదు. వారు రజాకార్లను సమీకరించటంతో పరిమితం గాక, అంతకన్నా ఒకడుగు ముందుకు వేసి గ్రామాల్లోకి కూడా ప్రవేశించారు. గ్రామాలలో జాగిర్దార్లుగానూ, బంజరుదార్లుగానూ, భూస్వాములుగానూ ఉన్న వారికి తాలూకా, జిల్లా కేంద్రాలలో ఇళ్ళు ఉండటంవలన వారు అక్కడ మకాం వేసి ఉండేవారు. స్థానికంగా ఉన్న ముస్లిములను రజాకార్లుగా సమీకరించటమే కాక, గ్రామాలలో ఉన్న ముస్లిములను కూడా సమీకరించి, రజాకార్లుగా శిక్షణనిచ్చి ఉపయోగించటం మొదలుపెట్టారు. అప్పటికే వారు ముస్లిమేతరులను, గ్రామీణ పేదలను, పట్టణ పేదలను భయపెట్టించేవారు. ఇప్పుడు ఎగురవేసిన జెండాలను ఎత్తివేయించటం, 'యూనియన్‌లో చేరాలని అంటే మీమీద విరుచుకు పడతారు, చాలా నష్టపడిపోతార'ని బెదిరించటం ప్రారంభించారు.

ఈ విధంగా విప్లవ వ్యతిరేక, ప్రజా వ్యతిరేక సమీకరణను వారు గ్రామాలకు కూడా విస్తరింపజేశారు. ఇక్కడ ముస్లిం వ్యతిరేకత అనేదానికన్నా హిందూ, ముస్లిం భూస్వాముల కలయిక కనిపిస్తుంది. నల్లగొండ జిల్లా జనగామ తాలూకాలో విసునూరు రామచంద్రారెడ్డికి వ్యతిరేకంగా పార్టీ, ఆంధ్ర మహాసభల నాయకత్వాన పోరాటం ప్రారంభమై ఉన్నతస్థాయికి చేరుకుంది. అతనిని జిల్లాలో రజాకార్లకు కమాండరుగా, ప్రధానమైన నాయకుడిగా చేశారు. విసునూరు రామచంద్రారెడ్డితోబాటు అతని గూండాలు కూడా రజాకార్లుగా పనిచేశారు. అదే విధంగా వరంగల్ జిల్లాలో జల్లేపల్లిలో ఒక దేశముఖు, మరొక భూస్వామి (అతను బంజరుదారుకానీ, పెద్ద భూస్వామిగానీ కావచ్చును.) ఇద్దరూ కలిసి అక్కడి రజాకార్లకు నాయకత్వం వహించారు. ఈ విధంగా రజాకార్లలో అత్యధిక భాగం (దాదాపు నూటికి 99 మంది) ముస్లిములే అయినా, రజాకార్ల నాయకులంతా కూడా ముస్లిములే అయినా, జిల్లా స్థాయిలో, తాలూకా స్థాయిలో, గ్రామస్థాయిలో అక్కడక్కడ హిందువులు కూడా దానిలో చేరారు. ముఖ్యంగా ఆనాటి దేశముఖులు, వారితో చేరిన వారి అనుయాయులు, కిరాయి మనుషులు ఈ దుర్మార్గాలకు పాల్పడ్డారు. ఈ అంశానికి ప్రాధాన్యత ఉన్నది. ఈ పోరాటానికి ముస్లిం పాలకులకు వ్యతిరేకమైన జాతీయ పోరాటం అనే అంశం ఉన్నా, ఈ హిందూ, ముస్లిం అభివృద్ధి నిరోధక (reactionary) శక్తుల కలయికతో దానికున్న ఫ్యూడల్ వ్యతిరేక ప్రజాతంత్ర స్వభావానికి తగినంత ప్రాధాన్యత వస్తుంది. దీన్ని గమనించకపోవటం పొరపాటు. ఇది నూటికి నూరుపాళ్ళు ముస్లిం వ్యతిరేక జాతీయ పోరాటం కాదు. దీనికున్న ఫ్యూడల్ వ్యతిరేక రైతాంగ పోరాట స్వభావాన్ని గుర్తించాలి.

సుమారు రెండు నెలలు ఈ కార్యక్రమం కొనసాగింది. దీని ఫలితంగా స్టేటు కాంగ్రెసు కొందరిని జైళ్ళకు పంపగలిగింది. కమ్యూనిస్టు పార్టీ గ్రామాల్లో, పట్టణాల్లో ప్రజా సమీకరణను తీవ్రతరం చేసింది. దీని ఫలితంగా పార్టీ, ఆంధ్ర మహాసభల పలుకుబడి బాగా వ్యాపించింది. విద్యార్థులు, గ్రామీణ ప్రాంతాల్లోని యువకులు ఈ సమీకరణకు బాగా తోడ్పడినారు.

## 5. కాంగ్రెసువారి ప్రత్యక్ష కార్యాచరణ-
## కమ్యూనిస్టుల నాయకత్వాన ప్రజల పోరాటం

నిజాం ప్రభుత్వం రాజీకి దిగిరానందున స్టేటు కాంగ్రెసు మరో అడుగు ముందుకువెళ్ళి ఒక కార్యక్రమం ఇచ్చింది. దాని ప్రకారం : 1) గ్రామాల్లో ప్రభుత్వాన్ని స్తంభింపచేయాలి. అంటే పటేలు పట్వారీలు తమ ఉద్యోగాలకు రాజీనామా ఇవ్వాలి. రికార్డులు ప్రభుత్వానికి ఇచ్చివేయాలి. 2) తాటిచెట్లు, ఈతచెట్లు నరికివేయాలి. అంటే ప్రభుత్వానికి ఆబ్కారీ (ఎక్సైజు) పై ఆదాయం రాకుండా చేయాలి. మద్యపాన నిషేధాన్ని అమలు జరుపాలి. 3) ప్రభుత్వానికి పన్నులను ఇవ్వ నిరాకరించాలి. లెవీధాన్యం ఇవ్వవద్దు. దీని సారాంశం ప్రభుత్వంతో సహాయ నిరాకరణ.

నిజాం వ్యతిరేక ఐక్య సంఘటన పేరుతో పార్టీ ఈ కార్యక్రమాన్ని అమలు జరిపింది. దీని ప్రకారం కాంగ్రెసు అనుకూలురైన పటేలు పట్వారీలు కొందరు తమ ఉద్యోగాలకు రాజీనామా చేశారు. రికార్డులన్నీ ప్రభుత్వానికి అప్పజెప్పారు. మరికొందరు కాంగ్రెసుకు వ్యతిరేకంగా ఉన్నా, కేంద్రంలో కాంగ్రెస్ అధికారంలో ఉంది కాబట్టి ఒకరోజు ముందో వెనుకో సంస్థానంలో కూడా కాంగ్రెసు అధికారం లోకి రాక తప్పదని గుర్తించి, తమ రంగును మార్చి కాంగ్రెసు అనుయాయుల్లో చేరినారు. ఈ విధంగా సుమారు వెయ్యిమంది రాజీనామా ఇచ్చినట్టుగా అనాటి వార్తలు తెలుపుతున్నాయి. రాజభక్తి పరాయణులైన తక్కిన వారు వారిలో చేరనందున ఆంధ్రమహాసభ కార్యకర్తలు ముందుకు వచ్చి రాజీనామాలు పెట్టించి, వారి ఇళ్ళమీద దాడచేసి రికార్డులు ధ్వంసం చేసినారు.

రికార్డులను తగుల బెట్టటం తప్పు. తర్వాతైనా రికార్డుల అవసరం ఉంటుంది. కమ్యూనిస్టుల నాయకత్వాన ఏర్పడే ప్రభుత్వానికైనా రికార్డులు అవసరం. కాబట్టి వీటిని స్వాధీనం చేసుకొని కాపాడు కోవాల్సిందే. తగులబెట్టటం ఒక నెగెటివ్ (ప్రత్యామ్నాయం చూపకుండా ఒక దాన్నికాదనే) చర్య. ఈ రికార్డులు లేకపోవటం వలన ప్రజలు తర్వాత కాలంలో చాలా ఇబ్బందుల నెదుర్కో వలసి వచ్చింది.

మరో విషయమేమంటే రాత్రిపూట సమూహంగా వెళ్ళి, దాడి చేసి ఈ రికార్డులను స్వాధీనం చేసుకున్నారు. రాత్రిపూట వెళ్ళి చేసేపనుల్లో కొన్నిలోపాలు ఉంటాయి. దొంగల భయానికి, లేక ఇతర భయానికి వెండి బంగారం లాంటివి

రికార్డులలో దాచి పెట్టుకుంటూ ఉండేవారు. కార్యకర్తలు వెళ్ళి దాడిచేసి బీరువా తలుపులు తెరిచి రికార్డులు మొత్తంగా తీసుకుంటుంటే, వారు భయానికేమీ చెప్పు కోలేక, రికార్డులతో పాటు వెండి, బంగారపు నగలను పోగొట్టుకున్న సందర్భాలున్నాయి. ఆ రికార్డులను స్వాధీనం చేసుకొని, బయటికి తీసుకువచ్చి విడదీసిన తర్వాత ఆ వెండి బంగారాన్ని తిరిగి ఇవ్వలేదు. ఇవన్నీ ఉన్న సంగతి దాడి సందర్భంగా వెళ్ళిన ప్రజలకు తెలియదు. వారంటే ఉన్న భయానికి ఇంటివారూ చెప్పుకోలేదు. ఆయా నాయకులు వాటిని కాజేశారు. ఈ రకంగా పార్టీలో అవినీతి ప్రాథమిక రూపంలో ఆనాడే ప్రారంభమైంది. ఇది ఒక తప్పుడు పద్ధతి. పగలు వెళ్ళి ప్రజలముందు రికార్డును స్వాధీనం చేసుకోవచ్చు. అందరిముందూ వాటిని విడదీసి వెండి, బంగారు నగలుంటే ఎవరివి వారికి ఇచ్చి, రికార్డులను తీసుకెళ్తే ప్రజలలో మంచి ప్రభావం కలిగించేది. పార్టీలోనూ, దళాలలోనూ ఉన్న అవినీతికర శక్తులకు ప్రాబల్యం రాకుండా చేయటానికి ఈ పద్ధతి ఉపయోగపడేది. ఒక వేళ రాత్రిపూట వెళ్ళవలసి వచ్చినా ఈ పద్ధతినే పాటించవచ్చు.

ఆదే విధంగా ఈతచెట్లు, తాటిచెట్లు నరికే కార్యక్రమాన్ని, పన్నులు, లెవీధాన్యం ఇవ్వనిరాకరించే కార్యక్రమాన్ని పార్టీవారు పెద్ద ఎత్తున అమలు జరిపారు. పన్నులు, లెవీధాన్యం నిరాకరించటంలో ఇబ్బంది కలుగలేదు. కానీ ఈతచెట్లు, తాటిచెట్లు నరికే కార్యక్రమాన్ని అమలు జరుపుతున్నప్పుడు గ్రామాల్లో ఉండే గీత పనివారు దానిని వ్యతిరేకించారు. వీరంతా పేదలు. ఈచెట్లు వారికి జీవనాధారం. మద్యపాన నిషేధాన్ని అమలు జరిపితే తమ జీవనాధారం పోతుందని కార్యకర్తలకు ఎదురు తిరిగినారు. చెట్లను నరికేయటానికి వెళ్ళిన వలంటీరు దళాల వెంటపడి తరిమివేసినారు. కొన్ని సందర్భాల్లో వారిని కొట్టటానికి కూడా ప్రయత్నించినారు. ఈ విషయం రాష్ట్ర కేంద్రానికి తెలిసింది. ఇది సరియైన కార్యక్రమం కాదనీ, ప్రజావ్యతిరేకమైన కార్యక్రమం అనీ, చెట్లను నరికివేయటం ఆపి వేయాలనీ నిర్ణయించింది. ఈ నిర్ణయాన్ని అనుసరించి కార్యకర్తలు తమ కార్యక్రమాన్ని మార్చుకున్నారు. పోరాట కాలంలో తాగుడు వలన నష్టం కలుగకుండా చేయటానికి ప్రతివ్యక్తి నియమితమైన మోతాదుకు పరిమితమై తాగాలనీ, దానికి నిర్ణీతమైన ధరను తీసుకోవాలనీ, కల్తీ చేయరాదనీ స్థానిక కమిటీలు నిర్ణయించినవి. దాన్ని అమలు జరుపటానికి ప్రయత్నించినారు.

మద్యపాన నిషేధాన్ని పార్టీ కార్యక్రమంగా అంగీకరించటం తప్పు.

మద్యపానాన్ని కంట్రోలు చేస్తాం. మితిమీరిన తాగుడుతో ప్రజలు తమ లక్ష్యాలను, ఆదర్శాలను మర్చిపోయే విధంగా అలవాటు పడనీయము. తాగుడు మంచిది కాదనే చైతన్యాన్ని వారిలో కలిగించి మాన్పించగలమే కాని, నిర్బంధంగా మాన్పించలేము. మాన్పించకూడదు.

ఆంధ్ర మహాసభ పని చేస్తున్న గ్రామాలలో రికార్డులు తగుల బెట్టటం వలన పన్నులు హెచ్చుభాగం వసూలు చేయలేదు. చేసినా ప్రజలు ఇవ్వలేదు. ధాన్యంకూడా ఇవ్వలేదు. రికార్డులు తగుల బెట్టిన గ్రామాలు, గ్రామాధికారులు రాజీనామా చేసి ప్రభుత్వానికి రికార్డులు అప్పజెప్పిన గ్రామాలు కాక తక్కిన గ్రామాలలో కొంతవరకు పన్నులు, ధాన్యం వసూలుచేసి ఉంటారు. ఈ విధంగా నూటికి నూరుపాళ్ళు పన్నులు, ధాన్యం నిరాకరించకపోయినా, ఈ కార్యక్రమం మాత్రం గ్రామాలలో అమలు జరిగింది.

**వలంటీరు దళాల, గ్రామరాజ్యాల ఏర్పాటు :** కాంగ్రెస్ వారు పన్నులు నిరాకరించమని చెప్పారు కానీ, దాన్ని ఏ విధంగా అమలుచేయాలి, వచ్చిన నిర్బంధాన్ని ఏ విధంగా ఎదుర్కోవాలనే విషయాలు వారి దృష్టిలో లేవు. సత్యాగ్రహం చేయటం, జైలుకు పోవటం, దెబ్బలు తినటం వరకే వారి కార్యక్రమం పరిమితమైంది. పన్నులు, ధాన్యం నిరాకరించినప్పుడు నిర్బంధం తప్పకుండా వస్తుందని, దానిని ఎదుర్కోవటానికి గ్రామాలలో వలంటీరు దళాలు ఏర్పాటు చేయాలని పార్టీ నిర్ణయించింది.

గ్రామ పరిపాలనా వ్యవహారాలను స్తంభింప చేయాలని కాంగ్రెసు చేసిన నిర్ణయాన్ని కమ్యూనిస్టు పార్టీ, ఆంధ్ర మహా సభలు అమలు జరిపిన సందర్భంలో కొన్ని సమస్యలు ముందుకు వచ్చినవి. గ్రామ పరిపాలనా వ్యవహారాలు స్తంభిస్తే ప్రజలకు ప్రత్యామ్నాయ పరిపాలన అవసరమవుతుంది. అప్పటికే ఏర్పడి ఉన్న గ్రామ సంఘాలను పునరుద్ధరించి, పోరాట సందర్భంలో అరెస్టులు జరిగిన చోట్ల కొత్త గ్రామ సంఘాలు ఏర్పాటు చేసి, ఈ పరిపాలనను నిర్వహించాలని పార్టీ, ఆంధ్ర మహాసభలు నిర్ణయించినవి. ఇదొక కొత్తమార్గం. కాంగ్రెసుకు సంబంధం లేకనే ఈ మార్గం అమలు జరిగింది.

ఈ విధంగా గ్రామ సంఘాలను ప్రాథమిక గ్రామ రాజ్యాలుగా ఏర్పాటు చేశారు. పన్నులు వసూలు చేయకున్నా గ్రామ పరిపాలనకు సంబంధించిన ఇతర కార్యకలాపాలను గ్రామకమిటీలు చేపట్టాలని నిర్ణయించారు. గ్రామంలో తగాదాలు

పరిష్కారం చేయటం, వలంటీరు దళం సహాయంతో ఊళ్ళో దొంగతనాలు జరుగకుండా ప్రజల ఆస్తిపాస్తులను కాపాడటం ఈ గ్రామ కమిటీల పనులలో ఒక భాగంగా పెట్టుకొని అమలు జరిపారు. ప్రభుత్వానికి ధాన్యం ఇస్తారని అనుమానం ఉన్న దేశముఖుల, భూస్వాముల ధాన్యాన్ని స్వాధీనం చేసుకొని ప్రజలు పంచుకోవాలనే కార్యక్రమాన్ని తీసుకున్నారు. ఈ కార్యక్రమాన్ని గ్రామ కమిటీలు అమలు జరిపాయి. పార్టీపనిచేస్తున్న చోట్ల, ప్రత్యేకించి నల్లగొండ జిల్లాలోనూ, వరంగల్ జిల్లాలోని కొన్ని ప్రాంతాలలో విస్తృతంగా చాలా గ్రామాలలో దీనిని అమలు జరిపారు. గ్రామ సంఘాల అవసరాల కొరకు ప్రజలు ఇవ్వగలిగిన మేరకు వస్తు రూపంలో గానీ, డబ్బు రూపంలో గానీ వసూలు చేశారు. ఆ సంవత్సరం పన్నులు మాత్రం వసూలు చేయలేదు. భూస్వాముల ధాన్యాన్ని ప్రజలు పంచుకున్నారు. భూస్వాములు గ్రామాల్లో లేకుండా వెళ్ళిపోవటంతో, వారు వేసే పెద్ద పెద్ద దండగలు, ఇతర రూపాల్లో వారి పీడన లేకుండా పోయాయి. వీటన్నిటి వలన ప్రజలు ఊపిరి పీల్చుకోవటానికి అవకాశం ఏర్పడింది.

**రజాకార్ల దౌర్జన్యాలు-ప్రజల ప్రతిఘటన :** అయితే రజాకార్లు దాడులు చేయటం, గ్రామాలను తగులబెట్టటం, దోచుకుపోవటం, స్త్రీలను చెరచటం లాంటివి జరుగుతూ ఉండేవి. దీనివలన ప్రజలు భీతావహులయ్యేవారు. కమ్యూనిస్టులు గ్రామాలలో అప్పటికే వలంటీరు దళాలను ఏర్పాటు చేశారు. రజాకార్లు రాగానే ప్రతిఘటించేది, లేదా వారికి ఏవీ దొరకకుండా గ్రామాలను ఖాళీ చేసేది. అయినా చెదురు మదురుగా అక్కడక్కడా కొన్ని సంఘటనలు జరిగినాయి. ప్రజలు ప్రతిఘటించిన ఉదాహరణలు కూడా ఉన్నాయి.

ఈ సందర్భంలో 1946 నాటి పోరాటం యొక్క కొనసాగింపుగా ఇర్రిపోతుల గూడెం ప్రాంతంలో ఒక సంఘటన జరిగింది. ఇర్రిపోతులగూడెం బేతవోలు అనే గ్రామం యొక్క శివారు. గతంలో ఇక్కడ పోరాటం బాగా నడిచింది. భూమి పంపకం జరిగింది. పోలీసుల నిర్బంధం కూడా తీవ్రంగా ఉండేది. ఇక్కడ వక్కవంతుల మట్టయ్య అనే పోలీసు పటేలు పోలీసులను తీసుకువచ్చి, గ్రామాలపై దాడులు చేయించాడు. వారు 18 మంది స్త్రీలను చెరిచారు. కొందరిని కాల్చి వేశారు. ఇంతటి తీవ్ర నిర్బంధ విధానానికి కారకుడైన అతడిని ప్రజా కోర్టులో పెట్టి విచారించాలని పార్టీ నిర్ణయించి, కోర్టును ఏర్పాటుచేసింది. ఆకోర్టు అతనికి మరణశిక్ష విధించింది. దానిని అమలు జరిపారు. దీని ఫలితంగా

ఆ గ్రామంతో పాటు ఎక్కడా వ్యతిరేకత రాలేదు. అతను చేసిన దుర్మార్గాలకు ఈ శిక్ష తగినది కావటం దీనికి ఒక కారణం. రెండవది : ప్రజాకోర్టులో విచారణ సందర్భంగా అతనికి చెప్పుకోవటానికి అవకాశమిచ్చారు. అతడు తాను చేసింది. అంగీకరించాడు. అతనికి మరణశిక్ష విధించిన తర్వాత, శిక్షను రద్దు చేయాలని కూడా అతనుకోరలేదు. అతని కుటుంబ సభ్యులు కూడా ఆ విధంగా కోరలేదు. ఇదంతా ఒక క్రమ పద్ధతిలో జరిగింది. దీనితో శిక్షను అమలు చేసినందుకు ప్రజల్లో ఏ రకమైన వ్యతిరేకతా రాలేదు

పన్నులను, ధాన్యాన్ని చెల్లించ నిరాకరించిన గ్రామాలమీద రజాకార్లు దాడులుచేసి ప్రజలను దోచుకోవటం, హింసించటం; ప్రజలు ఇళ్ళను వదిలిపెట్టి ఊరిబయటికి వెళ్ళిపోయిన సందర్భాలలో ఇళ్ళను తగులబెట్టటం లాంటివి చేస్తూ వచ్చారు. ప్రత్యేకించి అక్కడి పార్టీ నాయకుల ఇళ్ళను తగులబెడుతుండేవారు. హైదరాబాదు జిల్లాలో రావినారాయణరెడ్డిగారి ఇల్లు తగులబెట్టినట్టు వార్త. నల్లగొండ జిల్లాలో సూర్యాపేట తాలూకాలో దేవులపల్లి వెంకటేశ్వరరావుగారికి ఒక తాటాకుల పాక ఉండేది. ఆ పాకను వదిలిపెట్టిన తర్వాత అందులో ఎవ్వరూ ఉండకపోయేది. అయినా ఆ పాకను తగులబెట్టారు. ఆ పాక దగ్గరికి భయం భయంగా వెళ్ళి నిప్పు ముట్టించి వచ్చారు. ఇదే విధంగా కరీంనగర్ జిల్లాలోనూ, ఇతర ప్రాంతాలలోనూ పార్టీ నాయకుల ఇళ్ళను ప్రత్యేకంగా తగులబెట్టారు[86]. ప్రజలు ప్రతిఘటించిన చోట వారి ఇళ్ళను కూడా తగులబెట్టారు.

పార్టీలోని ఒక సెక్షను మాత్రం కాంగ్రెసును అనుకరిస్తూ, కాంగ్రెసుకీ పార్టీకి భేదం తెలియకుండా పోయే విధంగా వ్యవహరించింది. వారు పనిచేసే ప్రాంతాలలో ప్రజల అవసరాలను గుర్తించకుండా, ప్రభుత్వాన్ని స్తంభింప జేయాలనే పేరుతో తాటి చెట్లు, ఈత చెట్లను నరికివేసే కార్యక్రమాన్ని, ఆదర్శవాద కార్యక్రమమైన మద్యపాన నిషేధాన్ని అమలు జరిపారు. సాధక బాధకాలు ఆలోచించకుండా రికార్డులను ధ్వంసం చేశారు. వాటిలో నగలూ, ఇతర విలువైన వస్తువులూ ఉన్నా తిరిగి ఇవ్వలేదు. భూస్వాములనుండి ధాన్యం స్వాధీనం చేసుకున్నప్పుడు ప్రజలకు పంచకుండా ఎవరికందిందివారు తీసుకు వెళ్ళటం, లేదా దాచిపెట్టి సొమ్ము చేసుకోవటం లాంటివి కూడా జరిగినాయి. ఈ రకంగా ఆనాటి నుంచే అవినీతి క్రమంగా ప్రారంభమయింది. ప్రజా

వెల్లువలో ఈ ప్రజా వ్యతిరేక కార్యకలాపాలు మరుగున పడి పోయాయి. ఇలాంటి పద్ధతులను సవరించటానికి చేసిన ప్రయత్నాలు అన్ని సందర్భాలలో విజయవంతం కాలేదు. కానీ పార్టీ బాగా పనిచేసిన ప్రాంతాలలో—అంటే ఖమ్మం, వరంగల్ ఇటువంటి ప్రాంతాలలో—నాయకత్వం, కార్యకర్తలు మొదటి నుంచీ ఇలాంటివి జరుగకుండా కాపాడుతూ వచ్చారు.

ఈ కార్యక్రమం అంతా మరో రెండు నెలలు అన్ని ప్రాంతాలలో కొనసాగింది. రజాకార్లు దాడులు చేసినారు. ప్రజలు ప్రతిఘటిస్తూ ఈ కార్యక్రమం అమలు జరిపేవారు.

## 6. కాంగ్రెసువారి బూటకపు సాయుధపోరాటం- కమ్యూనిస్టుల నాయకత్వాన ప్రజల సాయుధ పోరాటం ప్రారంభం

కాంగ్రెసుకు మళ్ళీ అదే సమస్య ఎదురైంది. ఇంత జరిగినా నిజాం ప్రభుత్వం యూనియన్‌లో చేరటానికి సిద్ధంకాలేదు. పార్టీ, ఆంధ్ర మహాసభ వారు ప్రజలను బాగా సమీకరించగలుగుతున్నారు. బలపడుతున్నారు. నిజాం నవాబు లొంగిరావటం లేదు. 'భారత యూనియన్‌లో చేరకుంటే కమ్యూనిస్టులు బలపడుతారు; ఇటు యూనియన్ ప్రభుత్వానికీ, అటు నిజాం ప్రభుత్వానికి ప్రమాదం ఏర్పడుతుంద'ని నిజాం ప్రభుత్వాన్ని బెదిరించేవారు కాంగ్రెసువారు. నిజాం నవాబు తరపువారు కూడా 'మేం చెప్పినవి ఒప్పుకుని, ఏదో ఒకరకంగా రాజీ చేసుకోండి. లేకుంటే కమ్యూనిస్టులు బలపడుతారు. మీదే బాధ్యత' అని బెదిరించేవారు. ఈ విధంగా రాజీ సంప్రదింపులలో సర్దుబాట్లకోసం దీనిని ఉపయోగించటానికి వీరు ప్రయత్నించారు. ఈ సంప్రదింపులు ఒక కొలిక్కి రాలేదు.

ఈ పరిస్థితుల్లో నిజాం ప్రభుత్వంపై ఒత్తిడి తీసుకురావటానికి ఒక వైపున సాయుధ పోరాటం ప్రారంభించాలని సంస్థానంలోని కాంగ్రెసువారు సూచించారు. దానివలన పరిస్థితి చేయిజారి కమ్యూనిస్టుల చేతికి నాయకత్వం వెళ్తుందని, ప్రారంభించవద్దని కేంద్రంలోని కాంగ్రెసు ప్రభుత్వం—ముఖ్యంగా సర్దారు పటేలు—వ్యతిరేకించారు. చివరికి ప్రదర్శన కొరకు సాయుధ దళాలు

ఏర్పడాలనీ, ఇవి కస్టమ్స్ ఔట్‌పోస్టులమీద దాడులకు పరిమితమవ్వాలనీ వారు నిర్ణయించారు. నిజాం నవాబుకు, యూనియన్ ప్రభుత్వానికి మధ్యన అంగీకారం కుదిరితే అదంతా తమ పోరాట ఫలితమేనని చెప్పుకోవటానికి ఇలాంటి వికృతమైన సాయుధ పోరాటం జరపాలని కాంగ్రెసువారు తలపెట్టారు.

పోరాటం కమ్యూనిస్టు పార్టీ చేతుల్లోకి ఎక్కడపోతుందోననే భయంతో కాంగ్రెసువారు సాయుధపోరాటం నడిపించాలని నిర్ణయించారు. అది నిజానికి సాయుధ పోరాటం కాదు. ఒక కృత్రిమమైన, బూటకమైన సాయుధపోరాటాన్ని నడిపి, ప్రజలలో భ్రమలు కల్పించి, పార్టీ పలుకుబడిని దెబ్బతీసి, కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన నిజమైన సాయుధ పోరాటం అభివృద్ధి కాకుండా ఉండటానికి చేసిన ఒక ప్రయత్నం. కమ్యూనిస్టు పార్టీ అప్పటికి సాయుధ పోరాటం ప్రారంభించనప్పటికీ, అంతకుపూర్వం 1946లో జరిపిన సాయుధ ప్రతిఘటన వంటిది ఇప్పుడు కూడా నడిపిస్తుందని, ఆ ప్రతిఘటన అనుభవాలను దృష్టిలో ఉంచుకొని కాంగ్రెసు హైకమాండువారు ఒక నిర్ణయానికి వచ్చారు. దీనిని దృష్టిలో ఉంచుకోవాలి. ఎందుకంటే ఒక బూటకమైన, కృత్రిమమైన సాయుధపోరాటం ఆనాడేకాదు, ఈనాడు కూడా సాగుతున్నది. అలాంటి దాన్ని ప్రోత్సహించటం ఈనాడు కొత్తగా వచ్చిందికాదు. కాంగ్రెసువారు ఆనాటికే ఈ పని చేశారు.

మితవాదులు బూర్గుల రామకృష్ణారావుగారు దీనికి వ్యతిరేకమనీ, స్వామీ రామానందతీర్థ దీనికి అనుకూలమనీ ఆనాడు చెప్పుకున్నారు. ఈ విషయంలో వాస్తవాలెలా ఉన్నప్పటికీ, ఈ అహింసావాదులు హింసావాదులుగా మారటం ఒక కృత్రిమమైన వ్యవహారం. సరిహద్దుల్లో క్యాంపులు పెట్టి, కస్టమ్స్ ఔట్ పోస్టుల (customs outposts, వీటిని ఉర్దూలో కరోడ్గిరీ నాకాలంటారు.) పై దాడులు చేయటం వీరి కార్యక్రమం. బయటినుంచి సంస్థానంలోకి వచ్చే సరుకులపై ఈ కస్టమ్స్ ఔట్ పోస్టులవద్ద పన్నులువేసి, వీటినుంచి వచ్చే డబ్బును నిజాం ఖజానాకు జమచేస్తారు. ఇలాంటి ఔట్‌పోస్టులు గ్రామాల్లోకూడా ఉంటాయి. సాయుధ పోలీసులు కానీ, మిలటరీకానీ చాలా సందర్భాలలో ఉండరు. కాంగ్రెసువారు వారికి అనుకూలమైన ప్రాంతాలలో క్యాంపులు పెట్టుకున్నారేకానీ, ఈ కస్టమ్స్ ఔట్ పోస్టులున్న అన్ని చోట్లా క్యాంపులు పెట్టలేదు. దాడులలో కస్టమ్స్ వారివద్దనున్న ఆయుధాలను తీసుకునేవారుకాదు. డబ్బులు మాత్రం

తీసుకునేవారు. కస్టమ్స్ ఔట్ పోస్టులపై దాడులు చేసారని మాత్రం ఆల్ ఇండియా రేడియోలో, పత్రికల్లో పెద్దఎత్తున ప్రచారం చేసుకున్నారు. పోలీసు క్యాంపుల మీద దాడులు చేయకపోయేవారు.

**సాయుధ పోరాటం ప్రారంభించటానికి పార్టీలో జరిగిన చర్చలు, నిర్ణయాలు:** దీనితో కాంగ్రెసుకంటే వెనుకబడకుండా ఉండటానికి, తమ పలుకుబడిని కాపాడుకోవటానికి తాము కూడా సాయుధపోరాటం ప్రారంభించాలనే చర్చ పార్టీలో ప్రారంభమైంది. ఈ విషయంలో పార్టీ కేంద్ర నాయకత్వానికి కొంత భయం ఉంది. ఎందుకంటే కాంగ్రెసు సాయుధపోరాటం ప్రారంభించితే దానికి దాని పరిమితులుంటాయి. వారిమీద నిర్బంధం చాలా తక్కువగా ఉంటుంది. పార్టీ స్వయంగా ప్రారంభించితే చాలా తీవ్రమైన నిర్బంధాన్ని ఎదుర్కోవలసి ఉంటుంది. అంతేకాదు, 1946లో జరిగిన పోరాటాన్ని చూసిన తర్వాత పార్టీ నాయకత్వంలో జరిగే సాయుధ పోరాటం తమ చేతుల్లో ఉంటుందో లేదో అనే భయం కేంద్ర నాయకత్వానికి పట్టుకుంది. ఈ కారణాలవలన సాయుధపోరాటానికి అంగీకరించాలా, వద్దా అనే విషయంలో సందిగ్ధావస్థలో ఉంది. అదే సమయంలో (తమ అభిప్రాయాలకు అనుగుణ్యంగా) పట్టుపట్టే స్థితిలో కూడా ఉంది. ఈ విషయం గురించి చర్చించటానికి హైదరాబాదునుంచి ఒక ప్రతినిధివర్గం కేంద్ర ఆఫీసుకి వెళ్ళిన సందర్భంగా పి.సి. జోషి చెప్పిన మాటలు స్థూలంగా ఈ రకంగా ఉన్నాయి. "సాయుధపోరాటం తేలికయినదికాదు. ఒళ్ళు చిక్కి పోతుంది. చాలా తీవ్రమైన నష్టాలు భరించవలసి వస్తుంది. మీరనుకున్నట్లు తేలికైనదికాదు." ఆ తర్వాత ఉర్దూలో అతను 'పత్‌లోన్ పత్‌లా పడ్‌జాయెగా' అని అన్నారు. పత్‌లోన్ అంటే ప్యాంటు, పత్‌లా హోజాయెగా అంటే తడిసి పోతుంది. ప్యాంటు తడిసిపోతుందని అంటే మూత్రం పడిపోతుందని అర్థం. భయపెట్టాలనే దృష్టితో తిరస్కార పూరితంగా అతనామాటలన్నాడు. వెళ్ళినవారు తలవంచుకొని తిరిగివచ్చేశారు.

రాష్ట్రకమిటీ దీని సాధక బాధకాలను ఆలోచించింది. తర్వాత సాయుధ పోరాటం సాగించాలనే నిర్ణయించింది. దానికి కావలసిన ఏర్పాట్లు కూడా చేసింది. ఆ ఏర్పాట్లలో ఒకటి ఆయుధాలు ఉపయోగించటంలో, గెరిల్లా పోరాటంలో శిక్షణ, దీనికి అనుగుణ్యమైన పార్టీ నిర్మాణం; రైతాంగంలో, ప్రజలలో తీసుకోవలసిన ప్రజా కార్యక్రమం రెండవది

పైన చెప్పిన విధంగా కాంగ్రెసువారు ఔట్‌పోస్టులవరకే తమ కార్యక్రమాన్ని పరిమితం చేసుకున్నారు. ఔట్‌పోస్టులు సరిహద్దుల్లోనే ఉంటాయి. లోతట్టు ప్రాంతాల యువకులైన భూస్వాములు, దేశముఖులు, ఇతరులనుండి కొంత నేర్పరితనంగల వారితో 30 నుండి 50 మంది వరకు గుంపుగా ఉండే దళాలను కాంగ్రెసు నాయకులు ఏర్పరచినారు. గ్రామాలలో పర్యటన చేసి, ఒకవైపు రజాకార్ల దాడులనుంచి తప్పించుకోవటం, మరోవైపున గ్రామాలమీద పడి డబ్బులు వసూలు చేసుకోవటం, వారు తినటం, మిగిలిన కొద్దో గొప్పో వారి కేంద్రానికి పంపించటం ఈ దళాల కార్యక్రమం. మామూలుగా భూస్వాములు చేసే దౌర్జన్యాలనే కాంగ్రెసు పోరాటం, నిజాం వ్యతిరేక పోరాటం పేరుతో చేసేవారు. తుపాకులు చూపి, బెదిరించి డబ్బులు వసూలు చేసేవారు. అక్కడక్కడ కమ్యూనిస్టు పార్టీ వలంటీర్లకూ, ఈ దళాలకూ మధ్య ఘర్షణలు జరుగుతుండేవి.

**సరిహద్దు జిల్లాలలో పార్టీ కేంద్రాల ఏర్పాటు:** గెరిల్లా పోరాటం, ఆయుధాలుపయోగించటంలో శిక్షణ ఇవ్వటానికి సరిహద్దు జిల్లాలలో పార్టీ ఏర్పాట్లు చేసింది. 1947 ఆగస్టునాటికే పార్టీ జిల్లా కమిటీలలో ఎక్కువభాగం సరిహద్దు ప్రాంతాలలో కేంద్రాలు ఏర్పాటు చేసుకున్నాయి. తెలంగాణాకు సంబంధించినంతవరకు ఎక్కువభాగం కృష్ణా, గుంటూరు, కర్నూలు జిల్లాల ప్రాంతాలలో ఏర్పాటు అయినవి. ఉదా: నల్లగొండ జిల్లా కేంద్రం మునగాల పరగణాకు చెందిన రామాపురం గ్రామంలో ఏర్పాటు చేశారు. అక్కడి ప్రజలు బాగా సహకరించారు. మునగాల పరగణా ఖమ్మం తాలూకాతోపాటు నల్లగొండ జిల్లాకు చెందిన సూర్యాపేట, హుజూరునగర్ తాలూకాలకు ఆనుకొని ఉంటుంది. అందువలన నల్లగొండ జిల్లా కేంద్రం అక్కడ ఏర్పాటు చేశారు. జిల్లా పార్టీ కార్యదర్శి దేవులపల్లి వెంకటేశ్వరరావు రహస్యంగా అక్కడ ఉంటూ తమ కార్యకలాపాలు సాగించేవారు. పరగణాలోని ఇతర గ్రామాలలో కూడా అక్కడక్కడా ఉంటూ జిల్లా కమిటీ కార్యకలాపాలను నిర్వహిస్తుండేవారు. గెరిల్లా పోరాట శిక్షణా కార్యక్రమం వచ్చిన తర్వాత కేంద్రాన్ని ఇక్కడికి (రామాపురం) మార్చి, పటిష్ఠం చేశారు. ఒక ఇంట్లో వారుంటూ, ఒక ఇంటిని ఆఫీసుగా చేసుకున్నారు. ఆఫీసులో కార్యకర్తలు రావటానికి, ఉండటానికి,

వారికి కావలసిన సూచనలు ఇచ్చి పంపించటానికి అన్ని ఏర్పాట్లు ఉండేవి. గ్రామాలనుండి రైతులు, ప్రజలు ఎందరు వచ్చినా వారికి కావలసిన సహాయాన్ని అందిస్తుండేవారు. పరగణాలో సరిహద్దుకు ఇంతకంటే దగ్గరున్న గ్రామాలలో (రామాపురం పరగణా మధ్యన ఉంటుంది.) ఆయా తాలూకా పార్టీ కేంద్రాలను ఏర్పాటు చేశారు. ఉదా: జగన్నాధపురంలో సూర్యాపేట తాలూకా కేంద్రం ఉండేది. కొక్కిరేణి ఆ ప్రాంతంలో హుజూరునగరం తాలూకా కేంద్రం ఉండేది. ఈ విధంగా ఎవరికి అందుబాటులో ఉన్న గ్రామాలలో వారు కేంద్రాలు పెట్టుకున్నారు. కాంగ్రెసువారు కూడా పరగణాలో వారికందుబాటులో ఉన్న గ్రామాల్లో వారి కేంద్రాలు ఏర్పాటు చేశారు. నల్లగొండ జిల్లాలో, ప్రత్యేకించి సూర్యాపేట తాలూకాలో పార్టీకి పోటీగా రేపాల గ్రామంలో కేంద్రాన్ని ఏర్పాటు చేశారు. కోదాటి నారాయణరావుగారి ఆధ్వర్యంలో (వారి స్వగ్రామం కూడా అదే) అక్కడున్న కొంతమంది కాంగ్రెసు కార్యకర్తల సహాయంతో వారి ఏర్పాట్లు చేసుకున్నారు. అక్కడక్కడా రేలమర్రిలాంటి కాంగ్రెసు గ్రామాలలో కాంగ్రెసువారు క్యాంపులు ఏర్పాటు చేసుకొని తమ కార్యకలాపాలు ప్రారంభించారు. వారి కార్యక్రమం, పార్టీ కార్యక్రమం రెండూ పోటీగా నడిచాయి. ఇవేకాక ఖమ్మం, మధిర తాలూకాల పార్టీ కేంద్రాలు, వరంగల్ జిల్లా కేంద్రం కృష్ణా జిల్లాకు చెందిన తిరువూరు, నందిగామ ప్రాంతంలో ఏర్పాటు చేసి నడిపించారు. ఖమ్మం తాలూకా కేంద్రం సుద్దేపల్లి దగ్గర ఒక గ్రామంలో ఉండేది. ఇవి వారికి మామూలుగా రాకపోకలున్న ప్రాంతాలు కావటంతో చాలా తేలికగా జరిగిపోయింది. లోతట్టు ప్రాంతాలలో (Interior areas) కొందరు పనిచేసేవారు. కొందరు కరీంనగర్ జిల్లా సరిహద్దు ప్రాంతమైన సిరివంచ ఆప్రాంతంనుండి పనిచేయటం మొదలుపెట్టారు. బలార్షా సరిహద్దు ప్రాంతం వెళ్ళి అక్కడినుంచి పని చేశారు. అదే విధంగా మరట్వాడా, కర్ణాటక సరిహద్దు ప్రాంతాలనుంచి కొందరు పనిచేయటం మొదలుపెట్టారు. ఈ రకంగా సరిహద్దు ప్రాంతాల్లో క్యాంపులు ఏర్పాటు చేసుకొని అక్కడినుండి పని చేసుకోవటం ఒక పద్ధతిగా జరిగింది. ఆ కాలంలో మద్రాసు, బాంబే మధ్యప్రాంత (Central Provinces) రాష్ట్రాలలో కాంగ్రెసు ప్రభుత్వాలు పని చేస్తుండేవి. ఒకవైపున కాంగ్రెసు కార్యకలాపాలకు ఈ ప్రభుత్వాలనుండి పూర్తి సహకారం ఉండేది. దీనికొరకు వారికి ఏర్పాట్లు ఉండేవి. మరోవైపున పార్టీ కార్యకలాపాల

పట్ల వారు చూసీచూడనట్టుగా తటస్థ వైఖరితో ఉండేవారు. పోలీసును పార్టీ వారిమీద పూర్తిగా ఉపయోగించకపోయేది. మరోవైపున పూర్తి రక్షణకూడా ఉండకపోయేది. ఆనాటి మద్రాసు రాష్ట్ర ప్రభుత్వ హోం మినిస్టరు డా॥ సుబ్బరాయన్‌గారిని పార్టీ ప్రతినిధివర్గం వెళ్ళి కలిసినపుడు ఈ విధంగా చెప్పారు : "యూనియన్ ప్రభుత్వానికీ, నిజాం ప్రభుత్వానికీ ఏదో ఒక ఒడంబడిక జరిగేవరకూ మీకు కొంత స్వేచ్ఛ ఉంటుంది. ఆ తర్వాత మాత్రం ఈ అవకాశం ఉండదు. మీరు ఆలోచించుకోవలసి ఉంటుంది." త్వరలోనే అలాంటి ఒప్పందం (యథాతథ ఒడంబడిక) చేసుకోవటంతో వెంటనే జాగ్రత్తలు తీసుకోవలసివచ్చింది. ఈ విధంగా మొదటి నుంచీ జాగ్రత్తగానే ఉన్నారు. బహిరంగంగా ఎప్పుడూ పనులు చేయలేదు. అయినా అంతకుపూర్వం ఉన్న స్వేచ్ఛను ఈ యథాతథ ఒడంబడిక తర్వాత తగ్గించుకోవలసి వచ్చింది.

**గెరిల్లా పోరాట శిక్షణ :** తెలంగాణాలో సాయుధ పోరాటాన్ని ప్రారంభించిన సందర్భంలో దానికొరకు కావలసిన ఏర్పాట్లన్నీ సరిహద్దు జిల్లాల నుంచి చేయవలసి వచ్చింది. వాటిలో గెరిల్లా పోరాట శిక్షణ ఒక భాగం పార్టీకి సంబంధించినంతవరకు ఈ ఏర్పాట్లను ఆంధ్ర రాష్ట్ర కమిటీ చేసింది. ఆయుధాలుపయోగించటం, రాత్రివేళల తీసుకోవలసిన జాగ్రత్తలు, రాత్రిపూట పోలీసు, మిలటరీ క్యాంపులపై దాడిచేసే విధానం మొదలగునవన్నీ గెరిల్లాలకు నేర్పినారు. ఈ శిక్షణ సుమారు ఒకవారం రోజులవరకు నడిచింది. తెలంగాణా ప్రాంతం కార్యకర్తలకు ఇది కొత్త. ఫాసిస్టు వ్యతిరేక యుద్ధ సమయంలో రాష్ట్ర కేంద్రం తరపున కొంతమందికి గెరిల్లా శిక్షణ ఇచ్చారు. కాని ఆ శిక్షణ తెలంగాణా జిల్లాల వారికి లభించలేదు. మాజీ సైనికులు ఒకమేరకు ఉపయోగపడినారు. అయినా హెచ్చుమంది శిక్షణ పొందవలసివచ్చింది. వరంగల్ జిల్లాలోని ఒక ప్రాంతానికి ఫాసిస్టు వ్యతిరేక యుద్ధ కాలంలో మిలటరీ శిక్షణ పొందిన ఒక ఆర్గనైజరును రాష్ట్రకమిటీవారు పంపించినారు. హైదరాబాదు, భువనగిరి ప్రాంతంలో ఒక మాజీ సైనికుడు అక్కడి గెరిల్లా దళానికి నాయకత్వం వహించినాడు. కొంత ఆలస్యంగానే నల్లగొండ జిల్లాలోని మిర్యాలగూడెం ప్రాంతంలో కూడా ఒక మాజీ సైనికుడు దళాల్లో చేరినాడు. కరీంనగర్ జిల్లాలో ప్రభాకరరావు పార్టీ, ఆంధ్ర మహాసభలకు నాయకుడు. ఆయన ఒక దళానికి నాయకుడు. శిక్షణ పొందలేదు.

ఈ రకంగా చూసినప్పుడు తెలంగాణా సరిహద్దుల్లో కేంద్రాలు ఏర్పాటు చేసుకొని ఇచ్చిన మిలటరీ శిక్షణను ఆధారం చేసుకొని దళాలేర్పడి లోపలి ప్రాంతాలకు వెళ్ళి పనిచేయటం మొదలుపెట్టారు. ఈ శిక్షణలో ఒక లోపం ఉంది. స్థానిక పరిస్థితులకు అన్వయించి తగిన విధంగా ఈ శిక్షణను ఇవ్వలేదు. ఒక ప్రొఫార్మా (proforma) ప్రకారం ఇచ్చారు గనుక వారికి ఫాసిస్టు వ్యతిరేక గెరిల్లా యుద్ధ తంత్రంకోసం ఇచ్చిన శిక్షణను యథాతథంగా ఇచ్చారు.

**ఆయుధాల సేకరణ :** ముందు ప్రభుత్వ సాయుధ దళాలనుంచీ భూస్వాముల నుంచీ ఆయుధాలు తీసుకోవాలనీ, స్థానికంగా ఎక్కడ దొరికితే అక్కడ సంపా దించాలనేదే పార్టీ కార్యక్రమం. అయినా రాష్ట్ర కేంద్రంనుంచి ఆయుధాలు తెప్పించి ఒకమేరకు తోడ్పడినారు. కొన్నిటిని నేరుగా సంపాదించారు. మరి కొన్నిటిని చందాలు పోగుచేసి ఆ డబ్బుతో ఆయుధాలు కొనటానికి ఏర్పాటు చేశారు. కేంద్రానికి అందుబాటులో ఉన్నవారికవి ఎక్కువగా అందినాయి. లోతట్టు ప్రాంతాలవారికి తక్కువ సంఖ్యలో అందినాయి.

హైదరాబాదు దగ్గరలో ఉన్నవారు గ్రామాల్లో చందాలు వసూలు చేసి, నగరంలో ఆయుధాలు బేరంచేసి కొన్నవారే హెచ్చుమంది. సరిహద్దు ప్రాంతాల వారికి, ముఖ్యంగా వరంగల్ జిల్లావారికి సర్కారు జిల్లాలనుండి ఈ ఆయుధాలు లభ్యమయ్యేవి. డబ్బు పోగుచేసి కొన్న సందర్భాలుకూడా ఉన్నాయి. నల్లగొండ జిల్లావారు మాత్రం మొదట కొంత ఇబ్బంది పడ్డారు.

**సాయుధ పోరాట కార్యక్రమం – పార్టీలో చర్చలు, నిర్ణయాలు :**
ఈ సందర్భంలో అమలుజరుపవలసిన కార్యక్రమం సమస్య ముందుకు వచ్చింది. 'వెనుకటి కార్యక్రమమే అమలు జరుపాలి, కొత్తగా కార్యక్రమమేదీ అవసరం లేదు. భూమి కార్యక్రమం లాంటివి అమలు జరుపవద్దు' అనే వాదన మొదట వచ్చింది. దీనికి విరుద్ధంగా భూమి కార్యక్రమం అమలుజరపాలనే అభిప్రాయం రాష్ట్రకమిటీలో చర్చకు వచ్చింది. భూమి కార్యక్రమాన్ని అమలుజరిపితే భూస్వాములు వ్యతిరేకమవుతారనీ, వాళ్ళలో చాలామంది కాంగ్రెసు అనుకూలురు కనుక, నిజాం వ్యతిరేక ఐక్య సంఘటన దెబ్బతింటుందనీ, మనం బలహీనపడి పోతామనే బలమైన వాదన ముందుకు వచ్చింది. అందువలన కాంగ్రెసు ఇచ్చిన కార్యక్రమాన్నే అమలుజరుపుతూ ఈ సాయుధ పోరాటాన్ని సాగించాలని

అన్నారు. కాంగ్రెసువారు కస్టమ్స్ ఔట్‌పోస్టుల వరకే వారి దాడులను పరిమితం చేసుకున్నారు. పార్టీ అది కూడా చేస్తూ, పోలీసు స్టేషన్లమీద దాడిచేయవచ్చును అని దానిని కొంత సడలించారు. అంతకుముందే మైసూరు రాష్ట్రంలో సంస్థానానికి వ్యతిరేకంగా యూనియన్‌లో విలీనం కావాలని జరిగిన ఉద్యమంలో కాంగ్రెసువారు ఒక పోలీసు స్టేషనమీద దాడిచేశారు. అది బహుశా కోలారులోని పోలీసు స్టేషను. చెంగల్వ రాయరెడ్డి అనే ఆయననాయకత్వాన, ఆయన అనుచరులద్వారా జరిగిన దాడి ఇది. దీనిని చూసి ఇక్కడ కూడా పోలీసు స్టేషన్లమీద దాడి చేయవచ్చుననీ, అంతవరకూ ఫరవాలేదని చెప్పారు. రజాకార్లు దాడిచేసినప్పుడు వారు గ్రామాల్లోకి రాకుండా తిప్పికొట్టాలని చెప్పారు. ఇటువంటి పరిమితమైన కార్యక్రమంతో ఈ సాయుధ పోరాటం ప్రారంభమైంది. అన్యాక్రాంతాలూ, బంజరు భూములను పంచటంలాంటి 1946 నాటి కార్యక్రమం ఉన్నది కనుక వాటిని అమలుజరుపవచ్చునని చెప్పారు. ఈ కార్యక్రమం అమలుజరుగని గ్రామాలలో ఈ మేరకు భూమి పంపకం అమలుజరుపటానికి వెసులుబాటు ఏర్పడింది. అప్పటికీ ప్రభుత్వ భూములు భూస్వాముల స్వాధీనంలో ఉంటే తీసుకోవాలా వద్దా అనే సమస్య వచ్చింది. ఆ భూస్వాములు ఐక్యసంఘటన నుంచి పోతారనీ, సాధారణంగా భూస్వాములంతా హిందువులేననీ, వారంతా నిజాంకు వ్యతిరేకం కనుక కాంగ్రెసుకి అనుకూలంగా ఉంటారనీ, వారితో ఐక్య సంఘటన ఉండాలని ఒక సిద్ధాంతం. దీనికి అనుగుణంగా 'భూస్వాములను ముట్టకూడదు, వారి ఆస్తులను ముట్టకూడదు' అనే వాదన బయలుదేరింది. భూస్వాములలో దేశముఖులలాంటి పెద్ద భూస్వాములు ఉన్నారు. పటేలు పట్వారీలవంటి భూస్వాములున్నారు. వారుగాక, ధనిక రైతులనుంచి వడ్డీ వ్యాపారం ద్వారా, ఇతర విధాలా పెరిగి ఒకమాదిరి భూస్వాములుగా ఉన్న చిన్న భూస్వాములున్నారు. ఈ మూడు రకాలుగా ఉన్న భూస్వాములపట్ల విచక్షణ (differentiation) పాటించకుండా సాధారణంగా 'భూస్వాములందరూ నిజాంకు వ్యతిరేకంగా, కాంగ్రెసుకి అనుకూలంగా ఉంటారు కనుక వీరితో ఐక్య సంఘటన అవసరం, ఈ దృష్టితో వీరి ఆస్తులను ముట్టుకోకూడదు' అనే బలమైన వాదన ఉంటూ వచ్చింది. ప్రారంభంలో ఒక ఖచ్చితమైన నిర్ణయం అంటూ తీసుకోలేదు. అయినా వీలున్నంతవరకు భూస్వాములతో ఐక్యసంఘటన దెబ్బతినకుండా ఉండేవిధంగా కార్యక్రమాన్ని అమలుజరపటం మొదలుపెట్టారు.

# 7. నిజాం ప్రభుత్వం – యూనియన్ ప్రభుత్వం మధ్య సంప్రదింపులు : యథాతథ ఒడంబడిక

సంస్థానాన్ని యూనియన్‌లో చేర్చటానికి మౌంటుబాటన్ ప్రయత్నించారు. కాని నిజాం సంపూర్ణ స్వాతంత్ర్యం కావాలనే ప్రయత్నించాడు. బ్రిటిష్‌వారి సలహా ప్రకారం ఇతను అంగీకరించినా ఇత్తెహాదుల్ ముసల్మీన్‌వారు దానిని వ్యతిరేకించారు. అయితే వారు నిజాం నవాబుని కాదని వ్యతిరేకించలేదు. నిజాం నవాబుకు స్వతంత్రంగా ఉండాలనే కోరిక ఉంది. ఆ కోరికకనుగుణ్యంగానే వారు వ్యతిరేకించారు. మీర్జా ఇస్మాయిల్ తర్వాత సంస్థాన ప్రధాన మంత్రిగా వచ్చిన ఛత్తారీ నవాబు నాయకత్వానఉన్న నిజాం ప్రభుత్వ ప్రతినిధులకూ, యూనియన్ ప్రభుత్వ ప్రతినిధులకూ మధ్య సంప్రదింపులు ఎడతెగకుండా సాగినాయి. ఈ సందర్భంగా రక్షణ, విదేశాంగ వ్యవహారాలులాంటి అధికారాలు కొన్నింటిని కేంద్రానికి అప్పగించి అంతరంగిక స్వాతంత్ర్యం ఉండే విధంగా, లేక వెనుకటి పరిస్థితులు కొనసాగే పద్ధతులలో ఏదో ఒక ఒడంబడికను కుదుర్చుకోవటానికి ఒక ప్రయత్నం జరిగింది. దీనిని వ్యతిరేకిస్తూ సుమారు 80 వేలమంది ముస్లిములు హైదరాబాదులో ప్రదర్శన చేసి ఛత్తారీని పోనివ్వకుండా ఆపివేశారు. దీనితో సంప్రదింపులు భగ్నమైనాయి. దీని తర్వాత ఛత్తారీ నవాబు తన పదవికి రాజీనామా చేశారు. ప్రధాన మంత్రిగా మరొకరిని నియమించి సంప్రదింపులు కొనసాగించారు. ఇత్తెహాదుల్ ముసల్మీన్‌వారు ఇదంతా నిజాం నవాబు ఇష్టానికి విరుద్ధంగా చేయలేదు. ఇత్తెహాదుల్‌వారు కోరినట్లుగా సాగిపోతే నిజాం నవాబుకు మంచిదే. ఎందుకంటే ఆయనకూడా స్వతంత్రంగా ఉండాలని కోరుకునే వాడే. సాగకపోతే తన ఇష్టానికి విరుద్ధంగా వారు స్వతంత్రంగా చేశారని చెప్పుకోవచ్చు.

యూనియన్‌లో చేరటానికి నిజాం నవాబు అంగీకరించలేదు. నిజాం నవాబు స్వాతంత్ర్యాన్ని యూనియన్ ప్రభుత్వమూ అంగీకరించలేదు. ఇటువంటి ప్రతిష్టంభనను చట్టబద్ధం (legal form) చేయటానికి "యథాతథ ఒడంబడిక"ను కుదుర్చుకున్నారు. దీని ప్రకారం విభేదాలు పరిష్కారం చేసుకొని సంప్రదింపుల ద్వారా ఒప్పందం కుదిరేవరకూ పరిస్థితులు ఇదేవిధంగా కొనసాగుతాయి.

**యథాతథ ఒడంబడిక (Standstill Agreement):** నిజాం ప్రభుత్వ

ప్రతినిధులూ, యూనియన్ ప్రభుత్వ ప్రతినిధులూ సుదీర్ఘకాలం సంప్రదింపులు సాగించిన తర్వాత 1947 నవంబరు 29నాడు సంతకాలు చేసి కుదుర్చుకున్న యథాతథ ఒడంబడిక పూర్తి పాఠం ఈ విధంగా ఉంది.

"29 నవంబరు 1947 నాడు భారత డొమినియనుకి, హైదరాబాద్, బరారు నైజాంకి వొడంబడిక జరిగింది. పరస్పర లాభప్రదానికి కలిశి మెలిశి సఖ్యతతో వొహటిగా కృషి సలపడమే భారత డొమినియను, హైదరాబాద్, బరారు నైజాం వుద్దేశ్యం, విధానం. ఉభయుల మధ్య ఉండే సంబాధం యొక్క స్వరూప, స్వభావాల గూర్చి ఇంకా తుది ఒప్పందమేదీ కుదరలేదు.

ఉభయులకి సంబంధించిన విషయాల్లో ప్రస్తుతం అమల్లో వుంటూన్న ఒడంబడికలు, పరిపాలనా వ్యవస్థలు పైన విశదపరచబడిన తుది ఒప్పందం కుదిరే వరకి యథాతథంగా కొనసాగటం ఇరుపక్షాలకి సానుకూలమైనది. అందు వల్ల యీ క్రింది విధంగా వొప్పందం కుదిరింది.

1. ఈ విషయంలో కొత్త ఒడంబడికలు కుదిరేంతవరకి, విదేశ వ్యవహారాలు, రక్షణ, రహదారులతో పాటు ఉభయులకు సంబంధించిన వ్యవహారాలలో 15 ఆగస్టు 1947 నాటి వరకు క్రౌన్, నైజాం మధ్య అమల్లో గల వొడంబడికలు, పరిపాలనా వ్యవస్థలన్నీ సముచితమైనంత వరకి, భారత డొమినియను (లేక ఏ భాగంతోనైనా) నైజాం మధ్య చలామణిలో వుండగలవు.

ఈ ఒప్పందంలోని ఏ అంశం వలననైనా క్రింది విషయాల గురించి భారత ప్రభుత్వానికి కొత్త బాధ్యతలు గానీ, అధికారాలుగానీ ఏవీ సంక్రమించజాలవు:—

(i) సంస్థానాంతర్గత శాంతిభద్రతల సంరక్షణకి నైజాం సహాయార్థం సైన్యాలని బంపుట.

(ii) నైజాం వొప్పుదలపై తప్ప, యుద్ధ సమయమందు తప్ప సైన్యాలని సంస్థాన మందుంచ పీలుండదు. అలాంటి ఒప్పుదలను నైజాం సహేతుకమైన కారణం లేకుండా ఆప పీలుండదు. దీని ప్రకారం ఏవైనా సైన్యాలు వుండిన సంస్థానం నుండి సమరానంతరం 6 మాసాల్లో ఎత్తివేయబడును.

2. వొడంబడిక ప్రయోజనాలను మరింత మెరుగ్గా సాధించుటకు భారత ప్రభుత్వం, నైజాం హైదరాబాద్, ఢిల్లీలల్లో ఏజెంట్లును నియమించుటకు, వారి విద్యుక్త ధర్మ నిర్వహణానికవసరమైన సౌకర్యములు కలిగించుటకు అంగీకరించనైనది.

3. i) దీనియందు పరమాధికారాలు (Paramountcy function) లేక పరమాధికార సంబంధాలు (Paramountcy relationship) చేరటం గానీ, ప్రవేశింప జేయటం గానీ వుండ జాలదు.

ii) ఈ ఒడంబడిక వలనగానీ, దీనిని అమలు చేయుటకు తీసుకున్న ఏ చర్యలవలన గానీ, ఒడంబడిక అంతంపై ఉభయ పక్షాలకు ఎలాంటి కొత్త అధికారాలు కలగటంగానీ, లోపించటంగానీ యేదీ వుండజాలదు.

4. ఈ ఒడంబడికగానీ, లేక ఈ ఒడంబడిక ద్వారా కొనసాగించబడిన పరిపాలనా వ్యవస్థలవల్లగాని, ఒడంబడికల వల్లగాని యేదైనా పేచీ ఏర్పడిన, పరిష్కారార్థం యిద్దరు పంచాయితీదారుల పరం చేయబడును ; ఉభయులూ చెరొకరిని నియమించెదరు. ఈ ఇద్దరు కలిసి న్యాయ నిర్ణేతను నిర్ణయించుకొందురు.

5. ఒడంబడిక తక్షణం అమల్లోకి తీసుకరాబడును. ఒక యేడాదిపాటు అమలులో వుండును.

ఈ ఒడంబడికను అంగీకరిస్తూ భారత ప్రభుత్వపు పక్షంనుండి గవర్నరు జనరల్, హైదరాబాద్ బరారు నైజాం తమ తమ సంతకాలు చేశారు.

(సం) మీర్ ఉస్మాన్ అలీఖాన్
హైదరాబాద్, బరారు నైజాం.
(సం) మౌంట్‌బాటన్ ఆఫ్ బర్మా
గవర్నరు జనరల్ ఆఫ్ ఇండియా"

('హైదరాబాదుపై పోలీసు చర్య' : రచయితలు : వి. వీరభద్రరావు, వి. రామ చంద్రరావు ; తెలుగు అనువాదం ; పేజీలు : 143—145 ; ఈ ఒడంబడిక యొక్క ఇంగ్లీషు మూలంతో సరిపోల్చి, అనువాద లోపాలను సవరించి ప్రచురించాము —సం॥)

ఈ ఒడంబడిక సారాంశం : నిజాం నవాబు ఆనాటికున్న అధికారా లన్నింటినీ తర్వాత కాలంలో కూడా అనుభవిస్తాడు. హైదరాబాదు స్వతంత్ర రాజ్యమని భారత యూనియన్ ప్రభుత్వం గుర్తిస్తుంది. ప్రజా ఉద్యమాన్ని అణచటానికి నిజాం ప్రభుత్వానికి ఆయుధాలను కూడా సప్లయి చేస్తుంది. నిజాం ప్రతినిధులు కోరిన ఇలాంటి కోరికలన్నిటినీ అంగీకరించింది.

అప్పుడు భారతదేశానికి గవర్నరు జనరల్‌గా ఉన్న మౌంట్‌బాటన్ తన హయాంలో నిజాం సంస్థానాన్ని ఏదో ఒకమేరకు భారత యూనియన్ పరిధిలోకి

తెచ్చే ఒడంబడికను చేయించాలని కోరినట్టు స్వామి రామానంద తీర్థ పేర్కొన్న విషయాన్ని ఇంతకు ముందే ప్రస్తావించాము. "యథాతథ ఒడంబడిక" అలాంటి ఒప్పందమే. దీనిని బ్రిటిషు ప్రతినిధి కూడా కోరినట్టు దీనివల్ల స్పష్టమవుతుంది. కాంగ్రెసువారి కేంద్ర ప్రభుత్వం యూనియన్‌లో సంస్థానం చేరాలని కోరుకున్నా, ప్రారంభంలో ఇలాంటి ఒడంబడికతో సంతృప్తి పడినారు. ఒత్తిడి తెచ్చి క్రమంగా యూనియన్‌లో చేర్చుకోవచ్చునని భావించినారు.

## 8. తీవ్రతరమైన నిర్బంధ విధానం, సాయుధ దళాల ఏర్పాటు, పోరాటంలో వెనుకపట్టు

కస్టమ్స్ ఔట్‌పోస్టుల మీద దాడులు జరపటం ప్రారంభించటంతో ప్రజలపై మిలటరీ దాడులు తీవ్రమైనాయి. యథాతథ ఒడంబడిక తర్వాత గ్రామాలమీద, తాలూకా, పట్టణాలమీద, సాధారణంగా ప్రజలమీద రజాకార్లు దాడులను ఉధృతం చేశారు. వాటినుండి గ్రామాలను రక్షించుకోవలసిన అవసరం ఏర్పడింది. దీనికొరకు సాయుధ దళాలను ఏర్పాటుచేశారు. కొద్దిమంది రౌడీలు, రజాకార్లు వస్తే వారిని వలంటీరు దళాలద్వారా తరిమేయటం, ఎక్కువమంది వస్తే ఈ సాయుధ దళాలను ఉపయోగించటం ఆనాటి కార్యక్రమం. ఆయుధాలను సంపాదించటానికి ఒక నిర్ణీతమైన తేదీన ఆయుధాలున్న భూస్వాముల ఇళ్ళపై దాడిచేసి తీసుకోవాలని పార్టీ నిర్ణయించింది. రాష్ట్రమంతటా, ముఖ్యంగా తెలంగాణా అంతటా, పార్టీ యూనిట్లు పనిచేసే అన్ని ప్రాంతాలలో భూస్వాముల ఇళ్ళమీదకు వెళ్ళి, వారినేమీ అనకుండా తమకు తాముగా తుపాకులు ఇవ్వాలని డిమాండు చేశారు. చాలామంది ఇచ్చివేశారు. ఇవ్వనివారి ఇళ్ళను సోదాచేసి, దాచిపెట్టుకున్నవాటిని స్వాధీనం చేసుకున్నారు. వీటిద్వారా రెండు రకాల తుపాకులు దొరికినవి. ఒకటి నాటు తుపాకులు. వీటిలో మందుకూర్చి కాల్చవలసి ఉంటుంది. షాట్ గన్స్ అనేవి రెండవ రకం. వీటిలో రెండు గొట్టాలు కలిగినవి అక్కడక్కడా దొరికినా ఎక్కువ భాగం ఒకే గొట్టం ఉన్నవే. వీటిలో తూటాలు పెట్టి కాల్చవలసి ఉంటుంది. లైసెన్సు మొదలైన ఇబ్బందులు ఉన్నా తూటాలు మార్కెటులోదొరుకుతుంటాయి. షాట్‌గన్స్ పరిమితంగా దొరికాయి. రైఫిళ్ళు ఎక్కడా దొరకలేదు. ఇవి కొనుక్కున్నచోట్ల ఉండేవి. ఇతర జిల్లాల్లో ప్రత్యేకించి నల్లగొండ జిల్లాలో రైఫిళ్ళు దొరకలేదు. అందువలన నాటు తుపా

కులతోనూ షాట్ గన్స్‌తోను ఈ కార్యక్రమాన్ని సాగించారు.

**నిర్బంధాన్ని తట్టుకోలేక పోరాటం దెబ్బతినటం :** ఆ సందర్భంలోనే తీవ్రమైన నిర్బంధ విధానం వచ్చింది. పోలీసులమీద, రజాకార్లమీద దాడులు జరపటం ప్రారంభం కాగానే ప్రజలమీద చాలా తీవ్రమైన నిర్బంధం వచ్చింది. గ్రామాలు దీనిని తట్టుకోలేకపోయినాయి. వెనుక అమలుజరిపిన కార్యక్రమం, అంటే - గ్రామాధికారులు రాజీనామాలు ఇచ్చి, రికార్డులు గవర్నమెంటుకి అప్ప చెప్పటం, సహాయ నిరాకరణ, పన్నుల నిరాకరణ, ధాన్య నిరాకరణ, తాటి చెట్లను, ఈత చెట్లను నరికివేయటం - ఈ కార్యక్రమం సరిపోలేదు. ప్రజలు ఈ నిర్బంధానికి తట్టుకోలేని స్థితి ఒకటి వచ్చింది. సాయుధ పోరాటం చేసినా, పోలీసులమీద, రజాకార్లమీద దాడులు చేస్తుంటే ఇంకా పోలీసు నిర్బంధం తీవ్ర మవుతున్నది. నిర్బంధాన్ని తట్టుకోలేక దెబ్బతినే లక్షణాలు ప్రజలలో కనిపించాయి. ప్రజలలో భయం,భీతావహం ఎక్కువై పోయాయి. ఆయుధాలున్నా ఈ పరిస్థితినెదుర్కొనేదెట్లా ? అనే సమస్య ముందుకు వచ్చింది. అప్పుడు నల్లగొండ జిల్లా కమిటీ ప్రతినిధి దేవులపల్లి వెంకటేశ్వరరావు సాయుధ పోరాటాన్ని నిలబెట్టటానికి భూమి పంపకం కార్యక్రమం యొక్క తక్షణ అవసరాన్ని రాష్ట్రకమిటీలో చర్చకు తీసుకువచ్చారు.

# 10. నిజాం వ్యతిరేక పోరాటం - రెండవ దశ
## (భూమి పంపకం, గ్రామరాజ్యాలు, సాయుధపోరాటం)

### 1. భూమి పంపకం

పార్టీ ప్రారంభించిన సాయుధ పోరాటానికీ, కాంగ్రెసు వారి సాయుధ పోరాటానికీ ఉన్న భేదాన్ని దృష్టిలో ఉంచుకొని ప్రభుత్వం పార్టీ సాయుధ పోరాటం సాగిస్తున్న ప్రాంతాలలో కేంద్రీకరించి, రజాకార్లతో పాటు సైన్యాన్ని, సాయుధ పోలీసు దళాల్ని పెద్దఎత్తున దింపి, ప్రజల్లో భీభత్సాన్ని సృష్టించింది. అంతకుపూర్వం అమలు జరుపుతున్న కార్యక్రమం (లెవీ ధాన్యాన్ని, పన్నులను నిరాకరించటం, గ్రామ రాజ్యాలు ఏర్పాటు చేయటం, స్థానిక తగవులను తీర్చటం వంటివి) ప్రజలు ఈ నిర్బంధాన్ని తట్టుకోవటానికి సరిపోలేదు. దీనితో ప్రజల్లో వెనుకపట్టు లక్షణాలు, పోరాటం నీరుకారిపోయే సూచనలు కన్పించాయి. ముఖ్యంగా సరిహద్దు ప్రాంతాలకు దూరంగా ఉన్న లోతట్టు ప్రాంతాలలో ఈ లక్షణాలు ఎక్కువగా కన్పించినాయి. ఆనాటి కృష్ణా జిల్లాలో భాగంగా ఉన్న మునగాల ఒక దీవిలాగా ఉన్నా, మొత్తంగా చూసినపుడు నల్లగొండ జిల్లాలో ఈ లక్షణాలు కన్పించాయి. 1946లో జరిగిన పోరాటాన్ని దృష్టిలో ఉంచుకొని ప్రభుత్వం నల్లగొండ జిల్లాపై ఇంకా ఎక్కువగా కేంద్రీకరించింది.

**భూమి పంపకంపై ఆనాటి రాష్ట్ర కమిటీలో జరిగిన చర్చలు, నిర్ణయాలు:** ఈ పరిస్థితులలో జిల్లా కమిటీ కార్యదర్శి అయిన దేవులపల్లి వెంకటేశ్వరరావు (వారు రాష్ట్ర కమిటీ సభ్యులుగాకూడా ఉండేవారు.) భూమి పంపక కార్యక్రమాన్ని రాష్ట్ర కమిటీముందు పెట్టారు. 'భూస్వాముల భూములు పంచినప్పుడు మాత్రమే రైతాంగం ముందుకు వచ్చి పోరాటంలో గట్టిగా నిలబడుతుంది. గతంలో భూమి పంపకం కార్యక్రమం తీసుకున్న తర్వాతనే పోరాటానికీ, ప్రతిఘటనకూ పటిమ చేకూరింది. ఇప్పుడు కూడా తీసుకోవలసిన అవసరం ఉన్నది. లేకపోతే పోరాటం నీరుకారిపోయే సూచనలున్నాయి. నిజాం

నవాబుతో, యూనియన్ ప్రభుత్వానికీ మధ్యన అంగీకారం కుదిరే వరకు ఏదో ఒక పోరాటం చేస్తున్నట్టు నటిస్తేచాలు అనే దృష్టితో కాంగ్రెసు బయలుదేరింది. కనుక వారికికార్యక్రమం అవసరంలేదు అప్పుడప్పుడు కస్టమ్స్ ఔట్‌పోస్టుల మీద దాడిచేసి వస్తే వారికి సరిపోతుంది. ఈ విషయంలో మనం వారినుండి వేరుచేసుకొని ( demarcate ) ముందుకు సాగాలి' - అని భూమి పంపక కార్యక్రమాన్ని ముందుపెట్టారు. దాంతో రాష్ట్రకమిటీలో ఇతర సభ్యులు - ముఖ్యంగా తెలంగాణా నుంచి వచ్చిన రావినారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి, మగ్దూం మొహియుద్దీన్, వారితోపాటు మరికొందరు - ఐక్య సంఘటన సమస్యను ముందుకు తెచ్చారు. 'నిజాం వ్యతిరేక ఐక్య సంఘటనలో భూస్వాములు, దేశముఖులు మనతో కలిసి వస్తున్నారు. భూమి సమస్య తీసుకుంటే ఈ ఐక్య సంఘటన విచ్ఛిన్నమైపోతుంది. అందువలన భూమి పంపక కార్యక్రమం తీసుకోవద్దు' అని రాష్ట్ర కమిటీలో తీవ్రంగా ప్రతిఘటించారు. దీనిని ఎదుర్కొవటానికి, 'ఈ భూస్వాములు ఐక్య సంఘటనలో ఉన్నప్పటికీ, ప్రజలను ఉత్తేజపరచి సమీకరించటంలో అది మనకు ఉపయోగపడటంలేదు. కాగా అపఖ్యాతిపాలైనవారు తాము కూడా నిజాంకు వ్యతిరేకంగా ఉన్నామని చెప్పుకోవటంతో ప్రజలు వారిని విశ్వసించటంలేదు. వారిని చూసి పోరాటంలోకి ముందుకు రావటంలేదు. కాంగ్రెసువారు (జాతీయపక్షంవారు) తెలంగాణాలో కొన్ని ప్రాంతాలకు పరిమితమవటంతో అనేక ప్రాంతాలలో వారి ప్రభావం కూడా లేకుండా వున్నది. ఐక్య సంఘటనలో మనం వీరిని పెట్టుకున్నప్పటికీ, వీరు మన నుండి విడదొక్కుకుని పని చేస్తున్నారు. నిజాంకి వ్యతిరేకంగా వారు చేస్తున్న ప్రచారంతో ఇది అర్థమవుతుంది. మహారాష్ట్రలో వీరి ప్రభావం స్వల్పంగా ఉన్నది. ఇలాంటి పరిస్థితుల్లో వారికొరకు మనం పెనుగులాడ నవసరంలేదు. మనం భూస్వాముల భూమిని పంపకం చేయాలి. లేకుంటే ఈ పోరాటాన్ని నిలపటం కష్టం. సాయుధ పోరాటానికి ప్రజల అండదండలు చేకూర్చటం కష్టం' - అని ఇటువైపునుంచి వాదించారు. ఈ విధంగా తీవ్రమైన చర్చలు జరిగిన తర్వాత, నిజాం అనుకూల భూస్వాములు, నిజాం వ్యతిరేక భూస్వాములు అని విడదీసి నిజాం అనుకూల భూస్వాముల భూములను పంపకం చేయవచ్చుననీ, నిజాం వ్యతిరేక భూస్వాముల భూములను ముట్టుకోకూడదనీ మొదటి దశలో తీర్మానించారు.

'ఈ తీర్మానం కూడా ఆక్షేపణీయంగా ఉంది. నిజాం అనుకూల భూస్వాములు - వారు హిందూ భూస్వాములైనప్పటికీ - రజాకార్లను వెంటవేసుకొని తిరుగుతూ, వారికీ, పోలీసు, మిలటరీలకూ సహాయం చేస్తున్నారు. వారుండే అన్ని ముఖ్యమైన గ్రామాలలో క్యాంపులు ఉన్నాయి. అక్కడ అమలు జరుగుతున్న నిర్బంధం ఫలితంగా ఆ గ్రామాలలో మనం భూములను పంచటం కష్టం ఇతర కార్యక్రమాలు చాలా స్వల్పంగా అమలు జరిపాం, లేదా బొత్తిగా అమలు జరుపలేదు. అంతేకాక నిజాం అనుకూలురైన ఈ పెద్దపెద్ద భూస్వాముల భూముల్లో వారు పూర్వం నుంచీ పాలేర్లద్వారా సాగు చేయించుకునే (స్వంత సాగు) భూములు ఉంటాయి. ఇవి అనేక విధాలుగా ఇతరులనుంచి తీసుకున్న భూమి (అన్యాక్రాంతాలు) కాక, మాన్యం భూములనీ సావురం భూములనీ, ఇనాం భూములనీ ఇలా రకరకాలుగా ఉంటాయి. పేదరైతులు, కూలీలు ఆ భూములను వెంటనే పంచుకోవటానికి ముందుకు రావటంలేదు. అందువలన ఆ భూములను మనం వెంటనే పంచలేము. ఈ దృష్టితో చూస్తే రైతాంగం ఏ భూములనైతే పంచుకోవటానికి ముందుకు వస్తున్నారో వాటిని గురించి మనం ముందు ఆలోచించవలసివస్తుంది' - అని భూమి పంపకం జరగాలన్నవారు వాదించారు. ఈ చర్చలన్నీ పూర్తయిన తర్వాత 'నిజాంకు అనుకూలంగా ఉన్న భూస్వాముల భూములనూ, ఆస్తినీ మొత్తం స్వాధీనం చేసుకోవాలి. నిజాం వ్యతిరేక భూస్వాముల భూములకు 500 ఎకరాల సీలింగు పెట్టి, ఆ సీలింగుకి మించిన భూములను ముందుపంచాలి. వాటిలో మొదటి ప్రాధాన్యతనిచ్చి అన్యాక్రాంతాలని పంచాలి. రెండవది బీళ్ళు పంచాలి. తర్వాత వారి స్వంత భూములని పంచాలని తీర్మానించి, ఈ ప్రాధాన్యతా క్రమాన్ని (Order of Priority ) కూడా నిర్ణయించారు. దీని ప్రకారం కొంత భూమిని వివిధ ప్రాంతాలలో పంచారు. ఇది నల్లగొండ జిల్లాలో హెచ్చుగానూ, వరంగల్‌లో ఇతర జిల్లాల్లో తక్కువగానూ జరిగింది. నల్లగొండ జిల్లాలో కూడా సూర్యాపేట, హుజూరునగరు, నల్లగొండ, జనగామ తాలూకాల్లో హెచ్చుగా జరిగింది. భువనగిరి ప్రాంతాల్లో తక్కువగా జరిగింది. మిర్యాలగూడెం తాలూకాలో కూడా కొంత జరిగింది. దీనివల్ల కొంత ఉపయోగం కలిగింది. అయినా దీనివలన 500 ఎకరాల సీలింగు లోపు ఉన్న చాలామంది భూస్వాములకు చెందిన అన్యాక్రాంతాలు, ఇతర విధాలుగా పంచుకోవటానికి వీలుగా ఉన్న భూములు

తప్పిపోతున్నవి. వారు నిజాం వ్యతిరేకులు అనే పేరుతో ఉన్నారు. నిన్నటిదాకా వీరు నిజాంకు అనుకూలంగా ఉన్నవారే. కాంగ్రెసు ప్రభుత్వం వస్తుందని కొత్తగా నిజాం వ్యతిరేకతను తెచ్చిపెట్టుకొని, కాంగ్రెసు అనుకూల శక్తులుగా ముందుకు వచ్చారు. ఐక్య సంఘటన స్వభావం వలన ఇలాంటి వారికి కొంత ప్రాధాన్యత ఉన్నా, రైతాంగం, వ్యవసాయ కూలీల అవసరాలకు ఎక్కువ ప్రాధాన్యతనిచ్చి వారి భూములు కూడా పంచాలనే సమస్యను రాష్ట్ర కమిటీ చర్చించింది. చర్చలు తీవ్రంగానే జరిగాయి.

నిజాంకు, యూనియన్‌కు ఒకవైపున యథాతథ ఒడంబడిక జరిగి సంప్రదింపులు కొనసాగుతున్నప్పటికీ, రాజీ జరిగే లక్షణాలు కన్పించలేదు. దీనితో నిర్బంధం ఇంకా తీవ్రమయ్యే అవకాశాలు ఏర్పడినాయి. పార్టీయేతర శక్తులపై, ముఖ్యంగా కాంగ్రెసుపై నిర్బంధ విధానాన్ని తగ్గించి, పార్టీ, ఆంధ్ర మహాసభ పని చేస్తున్న ప్రాంతాలలో ఎక్కువగా కేంద్రీకరించారు. పోరాటాన్ని నీరుగారిపోకుండా నిలబెట్టి, ముందుకు తీసుకుపోవటమెలా? అనేది పార్టీ నాయకత్వం ముందు తీవ్ర సమస్యగా వచ్చింది. రెండవది: భూములు పంచిన ప్రాంతాలలో పోరాటం నిలదొక్కుకుని ముందుకు పోవటం కూడా అనుభవంమీద కనిపిస్తున్నది. ఈ పరిస్థితులలో సీలింగును 500 ఎకరాలనుంచి 200 ఎకరాలకు తగ్గించి, సీలింగుకి మించిన భూములను పంచాలని దేవులపల్లి వెంకటేశ్వరరావు చేసిన ప్రతిపాదనను రాష్ట్రకమిటీ అంగీకరించింది. దీని తర్వాత భూమి పంపకానికి నిర్దిష్ట రూపమేర్పడింది. అత్యధిక గ్రామాల్లో 200 ఎకరాల సీలింగుకి మించి భూమి కలిగిన భూస్వాముల సంఖ్య తగినంతగా ఉండేది. దాదాపు అన్ని గ్రామాలలో అటువంటి భూస్వాములుండేవారు. వారి భూములను పంచే కార్యక్రమాన్ని అమలు జరిపారు.

**భూమి పంపకం అమలు జరిపిన తీరు :** 350 ఎకరాల భూమి ఒక భూస్వామి చేతుల్లో ఉందని అనుకుంటే, 150 ఎకరాల భూమిని పంచటానికి మనం తీసుకుంటాం. వీటిలో సుమారు 80 ఎకరాల వరకు అన్యాక్రాంతాలుంటాయి. అన్యాక్రాంతాలంటే అక్రమంగా కాజేసిన భూములని ఆనాడు నిర్వచించారు. దీనికి చాలా విశాలమైన అర్థం ఉంటుంది. భూస్వాములు తమ పేరును, పలుకుబడిని, హోదాను ఉపయోగించుకొని సాధారణ రైతులనుండి

అక్రమంగా స్వాధీనం చేసుకున్న భూములన్నీ ఈ కోవకు చెందుతాయి. పట్టాలు ఉన్నా వాటిని అక్రమంగా వసూలు చేసుకున్న భూములుగానే పరిగణించారు. పట్టాలేకున్నా అదేవిధంగా పరిగణించారు. భూమిమీద సుదీర్ఘ కాలం కౌలుదార్లుగా ఉంటే దానినీ అన్యాక్రాంతంగా పరిగణించారు. అప్పులు పెట్టి తీసుకున్న భూములు కూడా ఈ కోవకు చెందుతాయి. (వడ్డీలు, అసలు కలిసే వరకు చాలా ఎక్కువవుతుంది. దానికి తోడు ఆ రోజుల్లో భూముల ధరలు చాలా చవకగా ఉండేవి. ఒక తూమెడు గింజలకు 10 ఎకరాల భూమి పోగొట్టుకున్న రైతులు కూడా ఉండేవారారోజుల్లో. ఈ విధంగా ఇలాంటి భూములను చాలా చవకగా తీసుకున్నారు. తర్వాత భూముల ధరలు పెరిగాయి ) అలాంటి భూములను పోగొట్టుకున్న రైతులకు తిరిగి పంచివేస్తారు. ఈ 80 ఎకరాలు పోగా యింకా 70 ఎకరాలు మిగిలి ఉంటాయి. దీంట్లో బీడు ఉంటుంది. సర్వసాధారణంగా 300-400 ఎకరాల భూమి ఉన్న భూస్వామికి 100 ఎకరాలన్నా బీడు ఉంటుంది. ఎందుకంటే వారికి ఎక్కువ సంఖ్యలో పశువులు ఉంటాయి. వాటిని ఈ బీళ్ళలో మేతకు పంపిస్తారు. బీళ్ళంటే వాటిలో కట్టె ఉంటుంది. ఇతర విధాలుగా కూడా లాభసాటిగా ఉంటుందని పెద్దఎత్తున బీళ్ళు పెట్టుకునేవారు. ఆ బీళ్ళలో హెచ్చు భాగాన్ని పంచేవారు. భూమి లేని వారికి, అన్యాక్రాంతాలైన భూమి కావాలని కోరని వ్యవసాయ కూలీలకు ఈ భూమి పంపకంలో ప్రాధాన్యతనిచ్చేవారు. ఈ విధంగా 50 ఎకరాల భూమిని పంచగా ఇంకా 20 ఎకరాలు భూస్వామి నుంచే రావలసి ఉంటుంది. అప్పుడు అతడి స్వంతసాగు భూమిని (పాలేర్లద్వారా సాగు అయ్యే భూమిని) తీసుకుని పంచేవారు. అతడు అనుకూలంగా ఉండి రాజీకొస్తే పరస్పర అంగీకారంతో ఒక ప్రాంతంలో ఉన్న భూమిని తీసుకొని పంపకం చేసేవారు. అతడు పెడసరంగా, బెట్టుసరిగా కూర్చుంటే ఆయా కమిటీలు నిర్ణయం తీసుకొని ఆ భూమిని తీసుకొని పంచేవి. అదే విధంగా 500 ఎకరాలు ఉంటే 300 ఎకరాల భూమిని వారి దగ్గరి నుంచి తీసుకొని పంచేవారు. వీటిలో అన్యాక్రాంతాలకు ముందు ప్రాధాన్యతనిచ్చేవారు; తర్వాత బీళ్ళు, ఆ తర్వాత మిగిలిన భూములను తీసుకునేవారు. ఇదీ భూమి పంపకం కొరకు అనుసరించిన పద్ధతి.

వీటితో పాటు గ్రామంలో బంజరు భూములు, ప్రభుత్వ భూములుంటాయి. వీటిని కూడా పంపకంచేసే భూములలో చేర్చేవారు. ఒక గ్రామంలో 200

ఎకరాలు ప్రభుత్వ భూమి ఉంది, 150 ఎకరాలు భూస్వాములనుంచి తీసుకున్న భూమి ఉంటే, మొత్తం 350 ఎకరాల భూమిని పేదరైతులు, కూలీలకు పంపకం చేసేవారు. వాటిలో మొదటి ప్రాధాన్యత భూములు (అన్యాక్రాంతాలు) పోగొట్టుకున్నవారికి ఇచ్చి, తర్వాత వ్యవసాయ కూలీలకు, ఆ తర్వాత పేద రైతులకు ఇచ్చి ఈ భూమి పంపకాన్ని పూర్తి చేసేవారు. గ్రామంలో లభ్యమయ్యే భూమినిబట్టి ఆయా గ్రామాలలో ఎంత భూమిని పంచగలమనేది ఆధారపడి ఉండేది. ప్రతి గ్రామంలో బంజరు భూములుండటం, సీలింగుని 200 ఎకరాలకు తగ్గించటం వలన కొద్దో గొప్పో భూములు పంపకానికి మిగులుతూ ఉండటంతో అన్ని గ్రామాలలో పంపకం చేయగలిగారు. పెద్ద భూస్వాములున్న చోట్ల, ఆ భూస్వాముల భూములను పంచుకోవటానికి ప్రజలు ముందుకు వచ్చిన చోట్ల హెచ్చు భూమి దొరికేది. ముఖ్యంగా పోలీసు, మిలటరీ క్యాంపులు లేని గ్రామాల్లో భూములను ఎక్కువగా పంచారు. భూస్వాముల భూములమీద క్లెయిములు (claims )లేని – అంటే రైతు తనది అనుకోని – భూముల సమస్య మాత్రం మొదటి దశలో ముందుకు రాలేదు. తీవ్రమైన దాడులు జరుగుతూ, వాటినుండి ధన, మాన, ప్రాణాలను కాపాడుకుంటూ జీవన్మరణ సమస్యగా ఉన్న మొదటి రోజుల్లో ఆ భూమిని పంపకం చేయలేదు తర్వాత దశలో ఆ భూమిని పంపకం చేశారు.

ఈ భూములను సాగుచేసుకోవటానికి పశువులు అవసరమయ్యాయి. భూస్వాముల పశువులను పేదరైతులకు పంపకం చేశారు. భూస్వాములు అప్పుల కింద, ఇతర విధాలుగా పేదరైతులు, వ్యవసాయ కూలీల దగ్గరినుంచి తీసుకున్న పశువులను తిరిగి వారికి ఇప్పించారు. అవి చాలకపోతే భూస్వాముల స్వంత పశువుల నుంచి ఇప్పించారు. విత్తనాలకు, పోషణ కొరకు ధాన్యం కావలసి వస్తే, భూస్వాముల కొట్లనుంచి తీసిపంచారు. పేదరైతులకూ, కూలీలకూ, ఇతర ప్రజలకూ విత్తనాలకు దొరికినంత వరకూ పంచి ఇచ్చారు. లేకుంటే ధనికరైతుల నుంచి విత్తనాలను ఇప్పించి, తిరిగి పంటవచ్చిన తర్వాత వారికి ఆ విత్తనాలను ఇచ్చే విధంగా ఏర్పాట్లు చేశారు. నాగులు కాకుండా, వడ్డీ కట్టించి ఇచ్చేవారు.

**భూమి పంపకం సందర్భంగా వచ్చిన సమస్యలు :** ఈ భూముల పంపకం సందర్భంలో కొన్ని సమస్యలు వచ్చేవి.

**ధనిక రైతులకు చెందవలసిన అనాక్రాంతాలు :** భూమి పోగొట్టుకున్న వారిలో ధనిక రైతులుంటారు. వారికప్పటికే సరిపోయినంత భూమి ఉండేది. మిగులు భూమి కూడా ఉండేది. పాలేర్లను, కూలీలను పెట్టి వాటిని సాగుచేయించేవారు. అలాంటప్పుడు వారికి 10 ఎకరాలు రావలసి ఉంటే 5 ఎకరాల భూమి ఇచ్చి, 5 ఎకరాలను లేనివారికి పంపకం చేయటానికి అనువుగా సాధారణ ఖాతాలో (general list) తీసి ఉంచేవారు. అప్పటికే భూమి కలిగి నతనికి అలాంటి భూమిని మొత్తంగా ఇస్తే, లేని వారికి దొరికే భూమి చాలా తక్కువగా ఉంటుంది. పొత్తిగా ఇవ్వకపోతే అతను ఐక్య సంఘటనలో నిలబడటం సమస్యగా ఉంటుంది. కొన్ని సార్లు అతను నిలబడక పోవచ్చును. ధనిక రైతు కుటుంబానికి మధ్య తరగతి, పేదరైతు కుటుంబంతో ఉండే సంబంధం వలన అలాంటి సందర్భాలలో భూస్వామ్య వ్యతిరేక ఐక్య సంఘటన బలహీన పడుతుంది. అందుకొరకు అతనికి కొంతభూమిని అట్టిపెట్టేవారు. తక్కిన భూమిని మాత్రం లేని వారికి ఇచ్చేవారు.

**ధనిక రైతుల నుండి, మధ్య తరగతి రైతుల నుండి రావలసిన అనాక్రాంతాలు :** ధనిక రైతుల వద్ద, అక్కడక్కడా మధ్య తరగతి రైతులవద్ద కూడాఈ అప్పులు పెట్టి తీసుకున్న భూములు (అనాక్రాంతాలు) ఉండేవి. వీటిని ఏం చేయాలి అనేదొక సమస్యగా ఉండేది. ధనిక రైతులు, మధ్య తరగతి రైతులు మనతో ఉన్నారని, భూస్వాముల భూమికన్నా ముందుగానే ఈ భూములు తమకు కావాలని వాటిని పోగొట్టుకున్నవారు కోరేవారు. ముందు తెలియక చాలా చోట్లలో అలాంటి భూములను ఇప్పించటానికి గ్రామసంఘాలు, దళాలు, చివరికి పార్టీ నాయకులు కూడా సిద్ధపడ్డారు. కొన్ని సందర్భాలలో ఆక్రమించుకున్నారు కూడా. దీనితో ధనిక రైతులు, మధ్య తరగతి రైతులు ఆందోళన చెంది మా భూములను తీసుకున్నారని పైకి ఫిర్యాదు చేసుకున్నారు. ఈ విధంగా ఈ విషయం జిల్లాకేంద్రానికి, రాష్ట్రకేంద్రానికి తెలిసింది. ఇటువంటి సమస్యలు ఎక్కువగా నల్లగొండ జిల్లానుంచి వచ్చాయి. వారు ఐక్య సంఘటనలో ఉన్నారనీ, అలాంటప్పుడు వారి భూములను తిరిగి తీసుకునే సమస్య ఈ దశలో ఉదయించదని, జిల్లా కమిటీ స్పష్టంచేసింది. ఆ భూములను పంచకూడదని రాజకీయంగా నచ్చజెప్పి ఆ భూములను అట్టిపెట్టడం జరిగింది. ఈ సమస్యను పరిష్కరించటం కొంత జటిలంగా ఉండేది.

తేలికమార్గాన్ని వెతుక్కునే ధోరణి : ఈ భూములు పోగొట్టుకున్న రైతులు బలహీనులైన భూస్వాముల నుండి, లేదా పార్టీకి, ఆంధ్ర మహాసభకి అనుకూలురైన భూస్వాముల నుండి భూములు తీసుకోవాలని ఎక్కువగా కోరేవారు. వ్యతిరేకంగా ఉండే బలవంతులు, సంపన్నులు అయిన వారినుండి లేదా రజాకారు క్యాంపులలో చేరి నిజాంతో షరీకైన భూస్వాములనుండి భూములు తీసుకోవటానికి ధైర్యం చేయకపోయేవారు. తేలికైన మార్గాన్ని వెతుక్కోవాలనే (line of least resistance) వైఖరి ఉండేది. బలహీనులనుండి భూములను ముందు రాబట్టుకోవటం, బలవంతుల జోలికి వెళ్ళకుండా ఉండటమనే వైఖరి పేదరైతులు, కూలీలలో మొదటినుంచీ ఉండేది. ఇది పార్టీముందు పెద్ద సమస్యగా వచ్చింది. అప్పుడు భూస్వాములు బలహీనంగా ఉన్నా వారిభూములను పంపకం చేశారు. వాటిని వదిలి పెట్టలేదు. బలవంతుల భూములను భయానికి వదిలివేసే వారికి ధైర్యం చెప్పి, ఆ భూములను తీసుకొమ్మని చెప్పేవారు. వారు సిద్ధంగా లేకపోతే ఆ భూములను వదులుకోవచ్చుననీ, అయితే ఆ భూములను వదులుకున్నారని ఇతర భూములు ఇవ్వటం జరగదని చెప్పేవారు. ఉదాహరణకు ఒకరైతుకు ఒక బలవంతుడైన దేశముఖునుండి 10 ఎకరాల భూమి రావలసి ఉంటుంది. ఆ భూమిని అతడు తీసుకోకుండా ప్రభుత్వ భూమిని తీసుకుంటానంటే, దానికి అంగీకరించక పోయేది. అతడు ఎప్పుడు తీసుకున్నా, ఆ భూమినే తీసుకోవాలి గానీ, దాని బదులు ప్రభుత్వ భూమిని తీసుకుంటానంటే అంగీకరించలేదు. అలాంటప్పుడు 'నాకు ఇప్పుడు ప్రభుత్వ భూమి ఇవ్వండి, ఆ భూమి వచ్చిననాడు దానిని మీరు తీసుకొని, ఇతరుల కెవరికైనా ఇచ్చుకోండి' అని అతడు వాదించేవాడు. దీనికి సమాధానంగా 'అప్పటి పరిస్థితి ఎలా ఉంటుందో తెలియదు. అతనితో పోరాటం చేయకుండా తప్పుకోవాలని ఈ విధానం అనుసరిస్తున్నావు కనుక, నిన్ను బలవంత పెట్టి తీసుకొమ్మని చెప్పం. కానీ తీసుకొన్ననాడు అవే తీసుకో. ఇప్పుడు మాత్రం నీకు ప్రభుత్వభూమి నుంచి ఇవ్వటానికి వీలులేదు. పోరాటానికి ముందుకు వచ్చేవారికే ప్రాధాన్యత నిస్తాం. ప్రభుత్వ భూములను పంచేటప్పుడు ఇతర విధాల క్లెయిములు లేని వ్యవసాయ కూలీలకు, పేదరైతులకు ప్రాధాన్యత నిస్తామ'ని చెప్పటం జరిగింది. ఇంతేకాక పార్టీ కుటుంబాల నుంచి (పార్టీకి అనుకూలమైన కుటుంబాలు, పార్టీ సభ్యులు లేక పార్టీ కార్యకర్తలు ఉన్న కుటుంబాలు. వారు భూస్వాములు గానీ, ధనిక రైతులు కానీ కావచ్చు. తరచుగా

భూస్వాముల కుటుంబాలు.) భూములు రావాలని పేచీ పెట్టేవారు. అవి ముందు పంచుకునేవారు. ఆ పక్కనే ఉన్న మరొక భూస్వామి భూమి కావాలని డిమాండు చేయక పోయేవారు. 'పోరాటంలేకుండా వచ్చే భూమిని ముందు సొమ్ము చేసుకోవాలి. పోరాటం చేసి సాధించాల్సిన భూమిని తర్వాత చూసుకుందాము' అనే స్థితిలో చాలామంది పేద రైతాంగం, వ్యవసాయ కూలీలు ఉండేవారు. ఇది ఆనాడు చాలా బలమైన ధోరణిగా ముందుకు వచ్చింది. అప్పుడు పార్టీ 'పోరాటంలో పాల్గొన్న వారికి మొదటి ప్రాధాన్యత నిస్తాము. పోరాటంలో పాల్గొనని వారికి రెండవ ప్రాధాన్యత నిస్తాము. పాల్గొనని వారికి ఎక్కువ ప్రాధాన్యత నిచ్చి, పోరాటంలో పాల్గొన్న వారి నెత్తిన చెయ్యిపెట్టే కార్యక్రమంమాత్రం తీసుకోము' - అని నిర్ణయం ప్రకటించింది. దీనితో ఈ సమస్య పరిష్కారమైనా స్థానిక నాయకత్వం, దళనాయకత్వం, ఆర్గనైజర్ల చైతన్యం మీద ఆధారపడి ఈ నిర్ణయం అమలు జరిగింది.

ప్రభుత్వ బంజర్లు : ప్రభుత్వ బంజర్లు పంచేటప్పుడు సామాన్యంగా ఈ ధనిక రైతులు, భూస్వాములకు ప్రోత్సాహం (వారికి అనుకూలంగా నిర్ణయాలు చేసే ధోరణి) కూడా ఉండేది. వారితో పాటు మధ్యతరగతి రైతులుకూడా బంజరు భూములను మొత్తంగా పంచకూడదని, పశువులను మేపటం కొరకు కొంత ఉంచాలని పట్టుబట్టేవారు. ఈ భూముల పంపకాన్ని తగ్గించటానికి ప్రయత్నం చేసేవారు. కానీ పార్టీ దానికి అంగీకరించలేదు. ధనిక రైతులకు తమ భూములలో కొంత భూమిని బీడుగా పెట్టుకొని పశువులను మేపుకోవటానికి అవకాశముంటుంది. ధనిక రైతులందరూ ఆ విధంగా చేస్తారు కూడా. మధ్య తరగతి రైతులకు మాత్రం సరిపోయినంత మాత్రమే భూమి ఉంటుంది కనుక, ఈ విషయంలో కొంత ఇబ్బంది కలుగుతుంది. ఈ కారణం వలన ఈ భూములు పంపకం చేసేటప్పుడు మధ్య తరగతి రైతులకు కూడా కొంత భూమిని కేటాయించేవారు. 'ఆ భూమిని వారు మొత్తం బీడుగా పెట్టుకోవచ్చు, లేదా దున్నుకొని, ఇంతకు పూర్వం వారికున్న భూమిలో కొంత బీడు పెట్టి పశువుల మేతకొరకు అట్టిపెట్టుకో వచ్చును' - అని వారికి ఏర్పాట్లు చేశారు. అంతేకానీ ప్రభుత్వ భూములను, ముఖ్యంగా బీడు భూములను, పంచకుండా ఉండాలని అనుకోలేదు. వాటిని పంచి వేశారు.

**కొన్ని పొరపాట్లు :** కొన్ని సందర్భాల్లో పొరపాట్లు జరిగాయి. జన్నారెడ్డి ప్రతాపరెడ్డికి 800 ఎకరాల తోట భూమి ఉంది. ఎంతోమంది పేద రైతుల, మధ్య తరగతి రైతుల, వ్యవసాయకూలీల భూములను స్వాధీనం చేసుకొని ఈ తోటను వేశారు. ఈ తోటను ఏం చేయాలి? అనే సమస్య వచ్చింది. 'తోటను నరికేసి ఆ రైతుల కివ్వాలి. లేదా ఆ తోటను వారు అట్టిపెట్టుకోదల్చుకుంటే, ఆ భూమిని తోటతో సహా వారికి ఇచ్చివేయాల'ని ఒక ప్రతిపాదన వచ్చింది. దీన్ని కాదని, 800 ఎకరాల విస్తీర్ణంగల తోట గనుక, తోటలో పెద్ద పెద్ద చెట్లు, ఆవరణ ఉన్నాయి కనుక, దళాలు రక్షణ తీసుకోవటానికి అవకాశం ఉంటుందనీ, దాన్ని కొట్టకూడదనీ, పంపకం చేయకూడదనీ స్థానికపార్టీ యూనిటు, దళాలు నిర్ణయించాయి. ఇదంతా తర్వాతి దశలో జరిగింది. మొదటి దశలో అక్కడ క్యాంపు ఉండటం వలన అక్కడికి వెళ్ళటమైనా, పంచుకోవటమైనా సాధ్యంకాలేదు.

**భూస్వాముల స్త్రీల భూమిసమస్య :** భూములు పంచేటప్పుడు కొన్ని సందర్భాలలో భూస్వాముల కుటుంబాలకు చెందిన స్త్రీలు, ముఖ్యంగా ఆడపడుచులువచ్చి తమకు భూములు కావాలని, లేదా పసుపు కుంకుమకింద తమకు భూములు ఇచ్చారనీ, వాటిని డిమాండు చేసేవారు. వారు భూస్వాముల కుటుంబాలకు చెందినవారే గనుక భూమి ఇవ్వటం అవసరంలేకున్నా, పోరాటానికి స్త్రీల సానుభూతిని సంపాదించటానికి, వారి కోర్కెను పూర్తిగా నిరాకరించక కొంత భూమిని కేటాయించేవారు. స్త్రీల సమస్యను కూడా వర్గ దృక్పథంతో చూడాలనీ, భూస్వాముల కుటుంబాలకు చెందినవారు కావటంవలన, స్త్రీలైనంతమాత్రంలో వారికి భూమి ఇవ్వవలసిన అవసరం లేదనీ దీనిపై విమర్శ వచ్చింది. ఆ మాట నిజమైనా, స్త్రీలు అణచబడిన వారు గనుక ఆ పోరాట కాలంలో స్త్రీల సానుభూతిని విశేషంగా సంపాదించాము. అది మనకు ఉపయోగపడింది కూడా. ఈ విధంగా స్త్రీలకు కొంత భూమినివ్వటం వలన రాజకీయంగా ఉపయోగంగా ఉండేది.

**స్త్రీ పురుషులకు భూమిలో సమాన భాగాలను పంచాలనే సమస్య :** భూమి పంపకం చేస్తున్నప్పుడు కుటుంబాలలో స్త్రీ పురుషులకు సమానంగా పంపకం చేసి, ఎవరిభాగం వారికివ్వాలా లేదా అనే సమస్య ఒకటి వుంది. (ఉదాహరణకి ఇద్దరు పురుషులు, ఇద్దరు స్త్రీలు వున్న ఒక కుటుంబానికి

5 ఎకరాలు ఇస్తే, సగభాగం స్త్రీలకు, సగభాగం పురుషులకు అనే సమస్య). ఆ కాలంలో మాత్రం స్త్రీలు తమకు భూమి కావాలని ముందుకు రాలేదు. కుటుంబ వ్యవస్థ (family system) ప్రకారం భార్య భర్తలను, వారిపై ఆధారపడిన వారినీ (పిల్లలూ, ఇతరులు) ఒక కుటుంబంగా భావించి, అందరికీ కలిపి ఆ భూమినిచ్చేవారు. అంతేకాని, స్త్రీలకు, పురుషులకు విడివిడిగా ఇవ్వలేదు. అటువంటి కోరికాలేదు. స్త్రీలకు వేరుగా భూమి ఉండాలనే కార్యక్రమం కూడా పార్టీకి లేదు.

ఒకే కుటుంబంలో పెరిగి పెద్దవారైన ఇద్దరు అన్నదమ్ములుంటే వారిని రెండు కుటుంబాలుగా భావించి, ఇద్దరికీ వేర్వేరు భూములు పంచి ఇచ్చేవారు. వారిని ఒకే కుటుంబంగా వ్యవహరించలేదు. వారు ఆ తర్వాత కలిసి సాగుచేసుకోవచ్చు. దానిని వారి ఇష్టాయిష్టాలకు వదిలి వేశారు. ఇవి భూమి పంపకంలో ఎదురైన ప్రధాన సమస్యలు.

## 2. గ్రామ రాజ్యాలు

**గ్రామ రాజ్యాల్లోని వివిధ వర్గాలు (composition) - అందులో మార్పులు :** ఈ గ్రామ రాజ్యాలు నిజాం వ్యతిరేక ఐక్య సంఘటనకు ప్రతి రూపాలుగా ఉండేవి. గ్రామాల నుంచి వెళ్ళిపోయిన భూస్వాములు వీటిలో ఎలాగూ వుండరు. గ్రామాలలో వున్న భూస్వాములు కొందరు పార్టీతో, ఆంధ్ర మహా సభతో రాజీపడి వుండేవారు. వారిని కూడా ఈ గ్రామ రాజ్యాలలో చేర్చలేదు. వర్గరీత్యా చూస్తే ధనిక రైతులు, మధ్య తరగతి రైతులు, పేద రైతులు, వ్యవసాయ కూలీలు ఈ గ్రామ రాజ్యాలలో ఉండేవారు. వీరితోపాటు ధనిక రైతుల నుంచి భూస్వాములైన వారుకూడా ఉండేవారు. వారు తమకు సంబంధాలున్న ప్రజలతో, ముఖ్యంగా ధనిక రైతులు, మధ్యతరగతి రైతులు, పేదరైతులతో కలిసి ఉంటూ, ధనిక రైతుల మాదిరి కనపడుతుండేవారు. అందువలన తరచుగా వీరుకూడా సంఘాలలో ఉండేవారు. తెలివి తేటలు, వ్యవహార పరిజ్ఞానం ఉండటంతో నాయకత్వంలో కూడా ఉండేవారు. వీరు నాయకత్వంలో ఉన్నంత వరకూ భూపంపకాన్ని సక్రమంగా జరగనివ్వక, దానికి విఘాతం (sabotage) కలిగించే వారు. సాధ్యమైనంత వరకూ

భూపంపకాన్ని దాటవేసి 100 ఎకరాలు పంచాల్సిన చోట 10 ఎకరాలు పంచి, పంచినట్టు చెప్పుకోవటానికి ప్రయత్నం చేసేవారు అదికూడా ఒత్తిడి ఉన్నచోట పంచేవారు. లేకపోతే అదికూడా పంచకుండా చేసేవారు. ఇది అంతటా జరిగింది. దీనిని కనిపెట్టి, గ్రామరాజ్యాలనుంచి ఆ భూస్వాములను తొలగించి, ధనిక రైతులను పెట్టేవారు. వారుకూడా భూపంపకాన్ని దెబ్బతీసే కార్యక్రమంలో పాల్గొనేవారు. ఇందులో వారికి కొన్ని ప్రయోజనాలుంటాయి. పేద రైతులకు, వ్యవసాయ కూలీలకు భూములు వస్తే వారు తమ చేతికింద ఉండరు, అప్పుల కోసం తమ దగ్గరికి రారు, ఇతర విధాలుగా తమ మీద ఆధారపడి ఉండరని వారుదాన్ని సాగనివ్వకుండా చేశారు. దీనిని ఎప్పటికప్పుడు కనిపెడుతూ, అలాంటివారిని తొలగించి, మధ్య తరగతి రైతులకు, పేద రైతులకు, వ్యవసాయ కూలీలకు పరిమితం చేసి, ఈ గ్రామ రాజ్యాలను ఏర్పాటు చేసేవారు. ఈ విధంగా కార్యక్రమం అమలు జరుపుతూ ముందుకు పోతున్న క్రమంలో, గ్రామరాజ్యాల్లో ఏఏ వర్గాలు ఉండేవన్న విషయం (composition) కూడా మారిపోతూ ఉండేది. భూమి పంపకం సమగ్రంగా జరిగే దశలో ధనికరైతులూ, భూస్వాములూ గ్రామరాజ్యాలలో లేకుండా పోయారు. మధ్య తరగతి రైతులు మాత్రం మిగిలిపోయారు. మధ్య తరగతి రైతులు భూపంపకాన్ని ఎప్పుడూ దెబ్బతీయలేదు, ద్రోహం చేయలేదు. వారెప్పుడూ చాలా నమ్మకంగా విశ్వాస పాత్రంగా వుంటూ, చాలా సందర్భాలలో ముందుండి పోరాడినారు. ఈ అంశం ఆనాటినుంచి ఈనాటి దాకా కూడా ముందుకు వస్తున్నది. మధ్యతరగతి రైతులు ఎప్పుడూ స్థిరమైన అభిప్రాయాలతో వుండేవారు. సిద్ధాంత గ్రంధాలలో వారిలో వుంటుందని చెప్పబడే ఊగిసలాట ఎక్కడా కనిపించలేదు. ఈ పరిస్థితి తర్వాత కూడా కొనసాగింది.

ధనిక రైతులనుండి భూస్వాములైనవారిని, ధనిక రైతులనూ ఒక క్రమ పద్ధతిననుసరించి తొలగించారు. భూమి పంపకాన్ని పర్యవేక్షిస్తున్న (జిల్లా కమిటీ ఏర్పాటుచేసిన) ఆర్గనైజరు ఇలాంటివి రిపోర్టు చేసినప్పుడు ఆ సమస్యను తీక్షణంగా చర్చించి జిల్లా కమిటీ కార్యక్రమాన్ని తీసుకునేది. దీనిలో ప్రజల చైతన్యానికి ప్రధాన పాత్ర ఉంటుంది. తమకు భూమి కావాలని ప్రజలు పట్టు పడుతుంటారు. గ్రామరాజ్యాల నాయకత్వం దాన్ని దెబ్బతీయాలని చూసినా ఆ రైతులు తమ పట్టు వదలరు. పార్టీ ఆర్గనైజరుద్వారాగానీ, దళందారా గానీ,

లేక ఇతర విధాలుగా గానీ తమకు భూమి దొరకటం లేదని పార్టీకి ఫిర్యాదు చేస్తారు. ఎందుకుదొరకటం లేదని పార్టీ విచారణ చేస్తుంది. గ్రామసంఘ నాయకత్వాన్ని సంజాయిషీ అడిగితే, వారు నీళ్ళు నములుతూ మాట్లాడుతూ తప్పుకోవటానికి ప్రయత్నించటం, విచారణలో ధనిక రైతుల, భూస్వాముల నాయకత్వమే దీనికి కారణమని నిర్ధారణ జరగటంతో వారిని తొలగించేవారు. తరచుగా ప్రజలముందు బహిరంగ సభలో ఈ విషయాన్ని తెలియజేసి, తొలగించేవారు. నిర్బంధం తీవ్రంగా ఉండటంవలన పార్టీనాయకుడు బహిరంగంగా పనిచేయలేనపుడు, కొంతమందికే నిర్ణయాన్ని వినిపించి పక్కకు తొలగించటం కొన్ని సందర్భాలలో జరిగింది. క్రమంగా ప్రజలకు తెలిసేది.

గ్రామ రాజ్యలలో అయిదుగురు సభ్యులుంటే తప్పకుండా ఒకరు స్త్రీ ఉండేవిధంగా ఏర్పాటు చేసేవారు. అదేవిధంగా వాటిలో తప్పనిసరిగా వ్యవసాయ కూలీలు ఒకరు లేక ఇద్దరు ప్రతినిధులుగా ఉండేవారు. భూమి పంపకం ముందుకు సాగుతున్న క్రమంలో వారి సంఖ్య పెరిగేది. వెనుకబడిన ప్రాంతాలలో కనీసం ఒక్కరైనా ఉండేది. ఒక్కరుకూడాలేని సందర్భాలు కూడా కొన్ని ఉన్నాయి.

**స్త్రీల సమస్యలు** : హెచ్చుగా భార్యాభర్తల సమస్యలు, కొన్ని సందర్భాలలో విడాకుల సమస్యలు, అత్తాకోడళ్ళ తగాదాలు, పొరుగింటివారితో తగాదాలవంటి సమస్యలన్నీ రావటంవలన స్త్రీలకు ఒక ప్రత్యేక విభాగం ఏర్పాటుచేశారు. గ్రామకమిటీ సభ్యురాలితోపాటు ధైర్యంగా వ్యవహరించగలిగిన మరో ఇద్దరు-ముగ్గురు స్త్రీలతో ఒక కమిటీవేసి, ఆ కమిటీముందు స్త్రీలు తమతమ సమస్యలు చెప్పుకునేట్టుగా ఏర్పాటుచేశారు. ఇది స్త్రీలతో కూడిన కమిటీ కావటంతో తమ ఆంతరంగిక సమస్యలను కూడా చెప్పుకొని, వాటిమీద తీర్పును పొంది, దాని ప్రకారంగా నడుచుకునే విధంగా ఏర్పాటుచేశారు. ఇది బాగా అమలుజరిగింది.

**వ్యవసాయ కూలీల సమస్యలు** : సర్వసాధారణంగా గ్రామాలలోవ్యవసాయ కూలీలు తీవ్రమైన సమస్యలు ఎదుర్కొనేవారు. వారి జీతాలు, పని గంటలు, ఇతర సౌకర్యాలు చాలా లోపభూయిష్టంగా ఉండటమే కాక, ఫ్యూడల్ దోపిడీతో కూడుకొని ఉండటంవలన ఆ సమస్యలు పరిష్కరించటానికి వ్యవసాయ కూలీలతో కమిటీలు ఏర్పాటు చేశారు. గ్రామసంఘ సభ్యులైన వ్యవసాయ కూలీల ప్రతినిధుల ఆధ్వర్యాన మరికొందరు కూలీలతో ఈ కమిటీ ఏర్పడేది. వ్యవసాయ

కూలీలు వచ్చి తమ సమస్యలన్నీ ఆ కమిటీకి చెప్పుకునేవారు. వాటిని గ్రామ కమిటీల ముందుకు తెచ్చి పరిష్కారం చేసుకునేవారు. అనేక సందర్భాలలో సమ్మెలవసరం లేకుండానే ఈ సమస్యలన్నీ పరిష్కారమైనాయి. వ్యవసాయకూలీ రేట్లు, అంటే నెలజీతాలు, రోజువారీ ఇచ్చే కూలీలు పెరిగినాయి. అప్పులు తదితర సమస్యలన్నీ పరిష్కారమైనాయి. అంతా ఐక్య సంఘటనలో కలిసి ఐక్యంగా పోరాడుతున్నందువలన సమ్మెల అవసరం కలగలేదు. ఎక్కడైనా అవసరమైతే సమ్మెలుకూడా చేసేవారు. అవికూడా ఒకటి రెండు రోజుల్లో పరిష్కారమయ్యేవి. ముఖ్యంగా ధనిక రైతులకు, భూస్వాములకు ప్రతిఘటించ గల శక్తి లేదు. దీనితోపాటు దళాలు ఉండటం వలన భయానికి కూడా వారు అంగీకరించేవారు. కోర్కెలను అతిగా పెట్టకుండా, ఐక్య సంఘటన నిలిచే విధంగా పెట్టి, వారికి నచ్చచెప్పి, పరిష్కారం చేసేవారు. సామాన్యంగా ధనిక రైతులు, మధ్య తరగతి రైతులు కూలీలు పెంచటాన్ని వ్యతిరేకించలేదు. వారివద్ద చాలా రోజుల్నుంచీ పాలేర్లుగా, కూలీలుగా పనిచేయటంవలన, వారితో ఉన్న సంబంధం వలన అది ఒక తీవ్రమైన సమస్యగా ఉండేదికాదు. అది ఆ రోజుల్లో మనకు ప్రత్యేకంగా ఉపయోగపడ్డది. కానీ ఈ రేట్లు పెంచటం ప్రారంభం కావటంతో పాలేర్ల సంఖ్యను, కూలీల సంఖ్యను కొంత తగ్గించేవారు. చౌకగా వచ్చినప్పుడు ఎక్కువ సంఖ్యలో పాలేర్లను, కూలీలను పెట్టుకునేవారు. రేట్లు పెరిగినప్పుడు కుటుంబ సభ్యులు బాగా పనిచేసి, కనీసంగా అవసరమైనంత మేరకే కూలీలను పెట్టుకునేవారు. దీనితో ప్రతిరోజూ స్వేచ్ఛగా పనిచేసేవారి (free labour) సంఖ్య పెరిగింది. దానివల్ల కూలీలకు కూడా సౌకర్యం కలిగింది. రాత్రింబగళ్లు రైతుల చేలలో పనిచేయవలసిన అవసరం లేకుండా పోయింది. వారు పగలంతా చేలలో పనిచేసి, నిర్ణీత సమయానికి తమతమ ఇళ్ళకువచ్చి, సుఖంగా ఉన్నంతలో కాలం గడుపుకోవటానికి అవకాశం కలిగింది. ఈ ఏర్పాట్ల ఫలితంగా ఈ రకంగా వారికి స్వేచ్ఛ లభించింది. వ్యవసాయ కూలీల విషయంలో ఈ విధమైనఏర్పాట్లు అన్నిచోట్లా జరిగినవని మాత్రం చెప్పలేము. భూమి పంపకం జరగటం, పార్టీ కార్యకలాపాలు, ప్రతిఘటనకూడా తీవ్రంగా సాగటం ఇవన్నీ వర్గచైతన్యంతో పనిచేసిన ప్రాంతాలలో మాత్రమే జరిగినాయి అని చెప్పాల్సి ఉంటుంది.

**అప్పుల సమస్య :** భూమి సమస్యతోపాటు అప్పుల సమస్యలు కూడా చాలా తీవ్రంగా ఉంటూ వచ్చాయి. అప్పులన్నీ రద్దు కావాలని పార్టీ, ఆంధ్ర

మహాసభ మొదట నిర్ణయించాయి. దీని ప్రకారం అప్పులన్నీ రద్దయినాయని ప్రకటించారు. గ్రామాలలో లేని భూస్వాముల అప్పులు రద్దయినాయని ప్రకటించటంవలన సమస్యలేమీ రాలేదు. అలాంటి భూస్వాములు కూడా తాము తిరిగి గ్రామంలోకి వచ్చి మళ్ళీ వెనకటిలాగా రాజ్యం చేయటమా లేదా అన్నదే సమస్యగా చూశారు కానీ, అప్పుల సమస్యగానూ, నాలుగెకరాల భూమి సమస్యగానూ చూడలేదు. కాని దీనివలన గ్రామాలలోఉంటూ అప్పులిచ్చే భూస్వాములు, ధనిక రైతులు, మధ్యతరగతి రైతులు తదితరులు మాత్రం అప్పులు ఇవ్వటం మానేశారు.

**గ్రామరాజ్యాల ఏర్పాటుకి పూర్వం అప్పుల సమస్య :** అసలు అప్పులిచ్చేవారు ఎవరు ? ఏ విధంగా ఇస్తారు ? భూస్వాములే ఇస్తారా ? లేక సంపన్నులు, లక్షాధికారులే ఇస్తారా ? అనే విషయాన్ని తెలుసుకుంటే ఈ అప్పుల స్వభావాన్ని అర్థం చేసుకోవచ్చును. వాస్తవమేమంటే గ్రామాలలో కొన్ని సందర్భాలలో భూస్వాములుకూడా అప్పులిచ్చేవారు. వారు పెద్దభూస్వాములైతే, అప్పులు పెద్దపెద్ద వారికి ఇస్తారు. కానీ, పేదవారికి ఇవ్వటం చాలా అరుదు. సూర్యాపేట దేశముఖును దీనికొక ఉదాహరణగా తీసుకోవచ్చు. అతడు 80 గ్రామాలకు దేశముఖు కావటమే కాక, సూర్యాపేట పట్టణంలో ఉండే పేరుబడ్డ లక్షాధికారి కూడా. దీనితో సంపన్నులు కూడా అతనివద్దకు వచ్చి, 10 వేలు, 20 వేలు, 50 వేలు ఈ విధంగా అప్పులు తీసుకొని పోయి, తాము వ్యాపారానికి ఉపయోగించుకొని తిరిగి చెల్లిస్తుండేవారు. ఉదాహరణకు : సంవత్సరానికి రూపాయికి 4 అణాలు (25 పైసలు) లేక 6 అణాలకు (37 పైసలు) మించని వడ్డీకి 20 వేల రూపాయలను ఒక సంపన్నుడికి ఇస్తాడు ఈ పెద్ద సంపన్నుడు. అతడు ఈ డబ్బును మరొకరికి అప్పుగా ఇస్తాడు. 4 లేక 6 అణాల వడ్డీకి బదులుగా అర్ధ రూపాయి, మూడు పావలాలు, లేదా రూపాయి వడ్డీకిస్తాడు. దీనివలన 4 అణాల వడ్డీతో తీసుకుపోయిన అతనికి రూపాయకి 25 పైసలు, 50 పైసలు లేక 75 పైసల వరకు లాభం ఉంటుంది. ఆరణాల వడ్డీకి తీసుకువెళితే రూపాయికి 12 పైసలనుండి 63 పైసల వరకు లాభముంటుంది. అప్పు తీసుకునే అతను నమ్మకస్తుడు, సంపన్నుడు కనుక తనకు ఏ ఇబ్బందీ లేకుండా తప్పకుండా తీసుకువచ్చి తిరిగి ఇస్తాడని ఈ పెద్ద సంపన్నుడు అతనికి వడ్డీకి

ఇస్తాడు. ఈ రకమైన వడ్డీ మామూలుగా వర్తక వ్యాపారాల్లో ఉపయోగిస్తారు. పశువుల బేరానికి ఉపయోగిస్తారు. బట్టల వ్యాపారానికి, కిరాణా వ్యాపారానికి, ఇతర వ్యాపారాలకు షావుకార్లు ఉపయోగిస్తుంటారు. వారికి వ్యాపారంలో బాగా లాభం వస్తూ ఉంటుంది కనుక, లాభంలో కొంత భాగం ఇతనికి ఇలా ఇస్తుంటారు. ఇది పెద్దవారు పెద్దవారికి ఇచ్చే వడ్డీ ఈ వడ్డీ వ్యాపారం కూడా ఆ రోజుల్లో పెద్ద ఎత్తున సాగుతుండేది.

గ్రామాలలో అతని ఏజెంట్లు ఈయన దగ్గర్నుంచి డబ్బు వడ్డీకి తీసుకుపోయి, ఇంకా ఎక్కువ వడ్డీకి ఇవ్వటం మామూలుగా జరుగుతుండేది. ఈ ఆర్థిక సంబంధాలవలన ఈ ఏజెంట్లు అతనికి నమ్మకమైనవారుగా ఉండేవారు. ఈ ఏజెంట్లు పెద్ద భూస్వాముల తరఫున గ్రామాలలో పరిపాలన చేయటమేకాకుండా, వీరివద్ద డబ్బు తీసుకొని, వడ్డీ వ్యాపారం చేసి, డబ్బు వసూలు చేసి తిరిగి ఇవ్వటంవల్ల రెండు విధాలుగా లాభం చేకూరుతుంది.

ఇక రెండో రకంవడ్డీవ్యాపారస్తులుంటారు. వీరు గ్రామాల్లోనేఉంటూ ప్రజలతో వడ్డీ వ్యాపారాలు చేస్తుంటారు. తరచుగా వీరు స్థానిక భూస్వాములు, లేక ధనిక రైతాంగాన్నుంచి భూస్వాములుగా వృద్ధిపొందినవారు. వర్తకులలో సంపన్నులు వడ్డీ వ్యాపారాలు చేస్తుంటారు. నాగులకిస్తుంటారు. హెచ్చుగా ఇచ్చేవారిలో ధనిక రైతులు కూడా ఉంటారు. వీరు తమ మిగులు ధాన్యాన్ని నాగులకు ఇస్తుంటారు. గతంలో ధాన్యం ధర చాలా తక్కువగా ఉండేది. ఆర్థిక మాంద్యపు రోజులలో, అంటే 1930 ఆ ప్రాంతంలో, ధరలు బాగా పడిపోయినాయి. ఆ రోజులలో 8 బస్తాల ధాన్యం ధర 25 రూ॥ల వరకు కూడా పడిపోయింది. అందువలన ఆ ధాన్యాన్ని అప్పుల రూపంలో ఇవ్వటం వారికి లాభసాటిగా ఉండేది. కారుకి పుట్టికి (అంటే 8 బస్తాలకు) రెండు బస్తాల నాగు ఇస్తారు. అంటే జూన్ నెలలో, లేక అంతకు ముందు 8 బస్తాలు నాగుకు తీసుకుంటే డిసెంబరులో పంట వచ్చినప్పుడు 10 బస్తాలు ఇవ్వవలసి ఉంటుంది. డిసెంబరులో ఇవ్వకుండా మళ్ళీ ఏప్రిల్, మే నెలల్లో (రెండో పంట సమయంలో) తిరిగి ఇస్తే, ఈ 10 బస్తాలకు నాలుగోవంతు (అంటే $2\frac{1}{2}$ బస్తాలు) జతచేసి మొత్తం $12\frac{1}{2}$ బస్తాలు ఇవ్వవలసివస్తుంది. ఈ విధంగా చక్రవడ్డీ అనేదీ ఉంటుంది. ఆరునెలల్లో ఎప్పుడు తీసుకున్నా, చివరికి ఒక నెలరోజులముందు తీసుకున్నా, కొత్త పంట వచ్చే సమయానికి తీసుకున్న దానిలో నాల్గవవంతు ధాన్యాన్ని అదనంగా చెల్లించవలసి వస్తుంది. అంటే 6నెలలకు

25% వడ్డీ చెల్లించవలసివస్తుంది. డబ్బు రూపంలోకి మార్చితే నెలకు వంద రూపాయలకు నాలుగునుండి నాలుగున్నర రూపాయలవరకు వడ్డీ ఉంటుంది. ఈ వడ్డీ – ఇచ్చేవారికి లాభసాటిగా ఉంటుంది. తీసుకునేవారికి డబ్బు మారకం, మార్కెటుకు తీసుకెళ్ళటంలాంటి సమస్యలు లేకుండా కళ్ళంముందే ధాన్యాన్ని కొలిచి ఇవ్వవచ్చు. ఈ కారణాలవలన చిన్న రైతులు తిండికి, విత్తనాలకు, ఇతర వ్యవసాయ ఖర్చులకు అవసరమయ్యే ధాన్యాన్ని నాగులకు తీసుకుంటారు. పండిన ధాన్యాన్ని అప్పులతనికి పోసేస్తారు. వారికి మిగిలేది స్వల్పం. లేక ఏమీ మిగలక పోవచ్చు.

వ్యవసాయ కూలీలకు మామూలుగా ఈ సమస్య రాదు. పాలేర్లుగా ఉంటే వారికి నెలజీతంగా కొంత ధాన్యం ఇవ్వాలని నిర్ణయించబడి ఉంటుంది. ఆధాన్యాన్ని తెచ్చుకుంటారు. పెళ్ళిళ్ళు, తదితర అవసరాలకు ముందు కొన్ని అప్పులు తెచ్చుకుంటారు. ఈ అప్పులను జీతంలోనుండి తీరుస్తుంటారు. జీతంపైన పెట్టుబడి అని, ఇతర విధాలుగా, సంవత్సరం మొత్తంమీద వీరికి అదనంగా వచ్చే ధాన్యముంటుంది. ఆ ధాన్యంనుంచి అప్పులకొరకు తగ్గిస్తూ ఉంటారు. ఫలితంగా మిగిలిన అప్పు ఉంటుంది– మామూలుగా ఈ అప్పుకొరకు నిర్బంధించటం ఉండదు. ఎందుకంటే ఈ అప్పు ఉన్నంతకాలం అతడు జీతం చేస్తూ ఉంటాడు. ఈ రకంగా భూస్వాములకు, ధనిక రైతులకు పనిచేసేవారు నమ్మకంగా కుదిరి పోతూ ఉంటారు. ఇది వ్యవసాయ కూలీలకు, పాలేర్లకు సంబంధించినది.

సామాన్యంగా పేదరైతులు, అనేక సందర్భాలలో మధ్యతరగతి రైతులు ఈ రకంగా వీరిదగ్గర అప్పులు తీసుకుంటారు. కొన్ని సందర్భాలలో దివాలా తీసిన భూస్వాములు ఈ రూపంలో అప్పులు తీసుకుంటారు. ఈ విధంగా నాగులు అనేది ఆ రోజుల్లో పెద్ద వ్యాపారంగా ఉండేది. కలిగిన వారికది ఆదాయం; లేనివారికది తీరని సమస్యగా ఉండేది.

దీనితోపాటు డబ్బురూపంలో కూడా వడ్డీ వ్యాపారం సాగుతుండేది. డబ్బు చలామణీ ఆ రోజుల్లో చాలా తక్కువ. పెళ్ళిళ్ళ సందర్భంగా బట్టలు తీసుకోవటానికి, చావులు తదితర అవసరాలకు, పశువులను కొనుక్కోవటానికి, బస్తీకి వెళ్ళి వస్తువులు తెచ్చుకోవటానికి డబ్బుల అవసరం ఉండేది. దీనితోపాటు గ్రామంలో కూడా కొద్దిపాటిగా డబ్బుల అవసరం ఉండేది. ఈ మేరకు డబ్బులు అప్పు తెచ్చుకునేవారు. ఇప్పటి

పరిస్థితులతో పోల్చిచూస్తే వడ్డీ చాలా తక్కువగా ఉండేది. (నెలకు వంద రూ॥లకు) రూపాయి వడ్డీ, రూపాయి పావలా వడ్డీ మామూలుగా ఉండేది. రోడ్డుకు సమీపంగా, జిల్లా కేంద్రానికి, తాలూకా కేంద్రానికి దగ్గరగా ఉన్న ప్రాంతాలలో వడ్డీలు ఎక్కువగా ఉండేవి. అనేక సందర్భాలలో నెలకు 100కి 5 రూ॥ల వరకు కూడా ఉండేవి.

వడ్డీలకు ఇచ్చేవారు భూస్వాములు, ధనిక రైతుల నుంచి వచ్చిన భూస్వాములు, ధనిక రైతులు మాత్రమే కాదు. గ్రామీణ ఆర్థిక వ్యవస్థలో మిగులు ఏ మాత్రం ఉన్నా వాటిని నాగులకు ఇవ్వటం మామూలు. రెండు సంవత్సరాలు పంట బాగా కలిసివస్తే, మధ్య తరగతి రైతులు కూడా ఉన్న కొద్దిపాటి మిగులు ధాన్యాన్ని నాగులకిస్తారు. ఉదా: రెండు బస్తాల ధాన్యం మిగులు ఉంటే వాటిని నాగులకిస్తారు. అది ఒక 10 సంవత్సరాలలో క్రమంగా పెరిగి 60, 100 బస్తాల ధాన్యమైపోతుంది. దీనితో అతడు కొద్దో గొప్పో ఆస్థిపరుడి స్థితికి చేరుకుంటాడు. భూములు కొనుక్కోవటం లేదా అప్పులకింద పేదల భూములను తీసుకోవటం మొదలు పెడతాడు. మధ్యతరగతి రైతులే కాక ఇతరులు కూడా ఏ రూపంలోనైనా వందరూపాయలు దగ్గర ఉంటే వాటిని వడ్డీలకిచ్చి, కూడబెట్టి క్రమంగా ఒక 10, 20 సం॥ల కాలంలో పెద్ద ఆస్థిపరులయ్యేవారు.

ఆ రోజుల్లో గ్రామాలలో జీవన ప్రమాణం చాలా తక్కువ స్థాయిలో ఉండేది. ధనిక రైతులు అన్నంలో పచ్చళ్ళు వేసుకొని పొద్దునా, సాయంత్రం రెండుసార్లు భోజనం చేసేవారు. కూరగాయలు చేసుకోకపోవటంతో నూనె ఖర్చువంటి నగదురూపంలో పెట్టవలసిన ఖర్చులనంతా తగ్గించుకునేవారు. కాఫీ, టీ, టిఫిన్‌ల లాంటివి ఆ రోజుల్లో లేకపోవటంతో పంచదార, టీ, కాఫీ పొడుల ఖర్చులేవీ ఉండకపోయేది. ధనిక రైతులనుంచి వచ్చిన భూస్వాముల పరిస్థితి కూడా ఇదే మధ్యతరగతి రైతులు పచ్చి మిరపకాయలు లేదా ఎండు మిరప కాయలు, ఉప్పు కలిపి నూరిన కారంతో అన్నం తినేవారు. ఈ విధంగా ఆ రోజుల్లో జీవన ప్రమాణాలని చాలా కనీసానికి తగ్గించి, మిగులును పెంచేవారు. తర్వాత కాలంలో జీవన ప్రమాణాలు పెరగటంతో పై ఖర్చులు కూడా పెరిగాయి. రైతు తన పొలంలో పండించే వాటితో వండుకొని తినవచ్చు. ఉదాహరణకి పప్పు ధాన్యాలు పండితే ప్రతిరోజూ పప్పు వండుకోవచ్చును. కానీ

వండుకోకపోయేవారు. ఎందుకంటే ప్రతిరోజూ పప్పు వండుకొని తినేకన్నా, కారంతో తిని పప్పు ధాన్యాలను అమ్ముకుంటే కొంత డబ్బు వస్తుంది. దాన్ని వడ్డీలకిచ్చుకోవచ్చును, లేదా బాకీలు తీర్చుకోవచ్చును. ఈ విధంగా కూడబెట్టిన డబ్బుతో కొందరు బంగారం కొని నగలు చేయించుకునేవారు. వెండి సామాన్ల లాంటివి కొనేవారు. ఈ విధంగా గ్రామంలో ఏమాత్రం మిగులున్నా, దానితో వడ్డీ వ్యాపారం చేయటం, నాగులకివ్వటం సర్వ సాధారణం. మధ్యతరగతి రైతుల నుండి మొదలుకొని ధనికరైతులు, భూస్వాములు, వర్తకులు, షావుకార్ల వరకూ అందరూ వడ్డీకి, నాగులకు ఇచ్చేవారు. ఈ విధంగా ఇది ఒకవైపున పేదవారికి అవసరం. మిగులున్నవారికి వాటిని వడ్డీకి, నాగులకు ఇచ్చుకోవటం అవసరం దీనితో ఇది పెద్దఎత్తున సాగుతుండేది.

**గ్రామరాజ్యాల ఏర్పాటు తరావాత అప్పుల సమస్య :** గ్రామరాజ్యాలు ఏర్పాటుచేసి, వడ్డీ వ్యాపారాన్ని, అప్పులను రద్దు చేయాలనే కార్యక్రమం తీసుకోవటంతో కొన్ని సమస్యలు వచ్చాయి. పెద్ద భూస్వాముల ఏజెంట్లు, పట్టణాలకు వెళ్ళి దూరంగా ఉన్నవారు, దుర్మార్గులు, ప్రజలను ఇతర విధాలుగా ఇబ్బంది పెట్టినవారు – వీరి అప్పులను రద్దు చేయటంవలన వచ్చిన ఇబ్బందులేమీ లేవు. అప్పులు రద్దయ్యాయని, తిరిగి ఇవ్వము అని ప్రకటించటంతో వారు చేయగలిగేదేమీ లేకపోయింది. ఉద్యమాన్నంతా అణచివేసిన తర్వాత రాబట్టుకోవచ్చు, లేకుంటే లేదు, అనే ధోరణితో ఉద్యమాన్ని అణచివేయటానికే పూనుకునేవారు. 'ఇది మా హక్కు. అప్పులను చెల్లించాలి' అని అనగలిగే స్థితిలోలేరు.

వీరు తప్ప వడ్డీకి, నాగులకు ఇచ్చేవారంతా ప్రజలతో కలిసి ఉంటున్నవారే. ధనిక రైతులనుంచి అభివృద్ధిచెంది భూస్వాములై ఈ వ్యాపారం చేసేవారు కూడా కొంతవరకు కలిసి ఉంటున్నారు. ఇలాంటి వారిలో ధనికరైతులు, మధ్యతరగతి రైతులుగా ఉన్నవారూ ప్రజలతో కలిసి ఉంటున్నవారే. ఈ చిన్నవారు ఇచ్చిన అప్పులు కూడా రద్దు అని ప్రకటించటంతో, ప్రజలకు మళ్ళీ అవసరమైనప్పుడు తమకు అప్పులిచ్చేవారు ఎవరు? అన్న సమస్య ఎదురైంది. అంతే కాదు, కొందరికి అప్పులు తిరిగి ఇవ్వకపోవటం నామోషీగా కూడా ఉండేది. ఈ దృష్టితో కూడా ప్రజలకు ఇదొక సమస్యగా తయారయింది. రెండవది : ప్రజలకు భూములు ఇవ్వటంతోనే వారి ఆర్థిక అవసరాలన్నీ తీరలేదు. అప్పటికి

వారికి వ్యవసాయ పెట్టుబడులకు, ఇతర అవసరాలకు అప్పులు కావలసివచ్చేది. అప్పులు ఇచ్చేవారంతా 'సంఘంవారు అప్పులు రద్దుచేశారు కనుక తిరిగి అప్పు లిచ్చేది లేద'ని చెప్పారు. దీనితో ఇబ్బందిపడిన ప్రజల్లో కొందరు సంఘ నాయకులతో ఏమీ చెప్పలేక చాటు చాటుగా వెళ్ళి అప్పులు తీసుకోవటం మొదలుపెట్టారు. ఇచ్చేవారు అప్పులివ్వటం మొదలుపెట్టారు. జిల్లా పార్టీ కేంద్రా నికి ఈ సమస్యలు తెలియగానే, వీటి గురించి ఆలోచించి, రాష్ట్ర కేంద్రానికి కూడా తెలిపి, కొన్ని సూచనలను పంపించింది. అప్పులను పూర్తిగా రద్దుచేస్తే, మనం కొత్తగా ఏర్పాటుచేసిన గ్రామీణ ఆర్థికవ్యవస్థ ఇప్పుడున్న స్థితిలో తట్టుకో లేదనీ, అప్పులు తిరిగి ఇప్పించవలసి ఉంటుందనీ, అందువలన అప్పులను రీగ్రేడ్ (కొత్తరేట్లు, కొత్త నియమాలతో తిరిగి ప్రవేశపెట్టటం) చేయాలని సూచించింది. దీనికనుగుణ్యంగా చర్యలు తీసుకున్నారు. అప్పులిప్పించి వాటిని తిరిగి ఇవ్వటానికి గ్రామసంఘాలు హామీ తీసుకున్నాయి. బ్యాంకు రేటు చొప్పున వడ్డీని నిర్ణయించారు. నాగులరేటు కూడా తగ్గించారు. 8 బస్తాలకు తూమెడు ధాన్యం ఇచ్చేవిధంగా ఏర్పాటు చేశారు. దీనితో ఈ వ్యవహారాలన్నీ సాఫీగా సాగిపోయాయి. ప్రజలకు అప్పులిచ్చేవారి సహకారం లభించింది. అప్పులిచ్చేవారికి తీసుకునేవారి సహకారం కూడా ఉంది. అప్పులను రద్దుచేయటాన్ని పెద్ద భూస్వాములవరకే వర్తింపజేశారు. ఈ విధంగా ఈ కార్యక్రమంలో మొదటచేసిన ముఖ్యమైన పొరపాటును పార్టీ సరిచేసుకున్నది

**ఉచిత న్యాయం - భూస్వాములకిచ్చే ముడుపులు రద్దు :** గ్రామ రాజ్యాల ద్వారా ఉచితన్యాయం కలుగజేశారు. గ్రామాల్లో అనేకరూపాల్లో తగాదాలు ఉండేవి. ఇందులో ఆస్థి తగాదాలు ప్రధానమైనవి. ఇవి అన్నదమ్ముల మధ్య, దాయాదుల మధ్య తగాదాలుగా, బాకీలు, లెక్కలు వీటికి సంబంధించిన తగాదాలుగా, అనేక ఇతరరూపాల్లోనూ ఉంటాయి. ఇవిగాక స్త్రీల మధ్యన తగాదాలు, భార్యాభర్తల తగాదాలలాంటి కుటుంబ తగాదాలు మొదటిరోజుల్లో కుప్పతెప్పలుగా ఉండేవి. అంతకుపూర్వం భూస్వాములు ఈ తగాదాలను పరిష్కారంచేస్తూ దండుగ అనే పేరుతోనూ లేక మరోపేరుతోనూ వారినుండి డబ్బు తీసుకునేవారు. కోడిపిల్లలనుండి మొదలుకొని ఆవులు, ఇతర పశువులు లేక డబ్బులు ఈ రకంగా తీసుకునేవారు. వీటినన్నింటినీ రద్దుచేసి, ఉచితంగానే ఈ తగాదాలను పరిష్కారంచేయాలని పార్టీ నిర్ణయించింది. దీనితో గ్రామ సంఘ

అధ్యక్షుడికి దాదాపు పూర్తిసమయమంతా ఈ తగాదాలను పరిష్కారంచేయటానికే వినియోగించవలసివచ్చేది. తరచుగా ఆ గ్రామ సంఘంలోని ఇతరసభ్యులు కూడా వచ్చి పాల్గొంటూ పరిష్కారం చేస్తుండేవారు. రెండుపక్షాలవారికి సంతృప్తికలిగే విధంగా పరిష్కారాలు చేస్తూ వాటిని అమలుజరుపుతుండేవారు. బలప్రయోగంచేసి అమలుజరుపవలసిన పరిస్థితులు చాలా అరుదుగా వచ్చేవి. దాదాపు ఐచ్ఛికంగానే ప్రజలు ఈ తగాదాలు పరిష్కారం చేసుకునేవారు. ఒకానొక గ్రామంలో హైకోర్టుకివెళ్ళి పరిష్కారంకాకుండా నడుగుతున్న కేసును, బహుశా 15, 20 సంవత్సరాలుగా పరిష్కారంకాని కేసును, ఈ గ్రామసంఘం ద్వారా పరిష్కారం చేశారు. హైకోర్టులో ఆ కేసును కొట్టివేయించుకున్నారు.

పరిష్కారాలకు నిర్ధారించబడిన క్రమ పద్ధతులు, మార్గదర్శకత్వం లోపించుట : ఈ పరిష్కారాలలో ఉన్న ప్రధాన లోపం ఏమిటంటే, దానికి నిర్ధారించబడిన క్రమ పద్ధతులు, మార్గ దర్శకత్వం (regulation and guidance) లేకపోయేవి. మంచీ-చెడూ, న్యాయమూ-అన్యాయమూ అనే అస్పష్టమైన అవగాహనతోనే పరిష్కారం జరిగేది. తనకు హక్కులేని భూమి కావాలని ఒకతను తగాదా పెడితే, అతని కోరిక అప్పటి సామాజిక వ్యవస్థలో న్యాయసమ్మతమైనదా కాదా అనే దృష్టితో ఆలోచించక, తగాదా పెట్టేవారికి కొద్దిగా ఇప్పిద్దామనే ధోరణి కొంత ఉండేది. దీనితో న్యాయంగా మొత్తం భూమి పొందవలసిన వారు కొంత భూమి నష్టపడవలసి వచ్చేది. ఏమాత్రం పొందటానికి వీలులేని వారికి కూడా ఎంతోకొంత భూమి లభించేది. ఈ విధంగా భూముల సమస్యల్లో, ఇంటి స్థలాల విషయాల్లో పరిష్కారాలు జరుగుతుండేవి. ఈ పరిష్కారాలు చేసే వారిలో స్వతహాగా చాలామంది స్వార్థపరులు కాకుండా, ఒకవేళ స్వార్థం ఉన్నా న్యాయస్థులని అనిపించుకోవాలని, సంఘంనుండి, పై కమిటీల నుండి మాటరాకుండా జాగ్రత్తగా వ్యవహరించేవారు. న్యాయం అంటే ఏమిటి? మనం ఏర్పరచబోయే నూతన సమాజంలో ఒక్కో సమస్యను ఏ విధంగా పరిష్కారం చేయాలని వివరించే ఒక నిర్ధారించిన క్రమపద్ధతిని (regulations) అప్పటికి రూపొందించ లేదు. అందువలన న్యాయాన్యాయాల పేరుతో న్యాయంతో పాటు కొంత అన్యాయం కూడా జరుగుతుండేది. తర్వాత కాలంలో ఈ పరిస్థితి పెచ్చుమీరి, తగాదాలతో ఇటుసగం, అటుసగం, ఇటుకొంత,

అటుకొంత ఇవ్వటమనే దృష్టితో కొంచెం తప్పుదారిన పోయిన సందర్భాలుకూడా ఉన్నవి. ఇలాంటి పరిష్కారాలకు 'పెద్దమనుషుల పరిష్కారం', 'దుప్పటి పరిష్కారం', 'ఖట్టిప్రోలు పరిష్కారం' అని ఎన్నో పేర్లు ఉండేవి.

**స్త్రీల సమస్యలు :** స్త్రీల సమస్యలలో భాగంగా విడాకుల సమస్యలు (divorce cases) కూడా వచ్చేవి. విడాకుల హక్కును అంగీకరించినట్టు పార్టీ ప్రకటించటంతో అనేక తగాదాలు ముందుకు వస్తుండేవి. అయినా ఆ విషయంలో జాగ్రత్తలు తీసుకొని, విడాకులు కోరినంత మాత్రాననే ఇవ్వకూడదని, నీతి నిజాయితీ కలిగిన ఆడవారినీ, పార్టీ వారినీ నియమించి ఇద్దరికీ సామరస్యాన్ని కుదర్చటానికి ప్రయత్నం చేసేది. చాలా ప్రయత్నం చేసిన తర్వాత, సాధ్యం కాదు అని అనుకున్న కేసులలో విడాకులు ఇప్పించటం జరిగేది. తరచుగా విడాకులు అవసరం లేకుండానే కేసులు పరిష్కారం అవుతూ ఉండేవి.

స్త్రీల ఆస్తికి సంబంధించిన తగాదాలు కష్టజీవుల్లో - అంటే మధ్య తరగతి రైతుల్లో, పేద రైతులు, వ్యవసాయ కూలీల్లో - రాకపోయేది. ఆనాటి పరిస్థితులలో వీరిలో స్త్రీల ఆస్థి సమస్య ముందుకు రాకపోవటంతో ఈ తగాదాలు కూడా లేవు. సాధారణంగా నగలు, లేక పుట్టింటినుంచి తెచ్చుకున్న వస్తువులు, దీంట్లో భాగాలు, భర్తలు తిట్టడం, కొట్టటం, తాగి బాగా దెబ్బలు కొట్టినసందర్భాలు - వీటికి సంబంధించిన తగాదాలు వచ్చేవి. సాధారణంగా స్త్రీలందరూ మద్యపాన నిషేధానికి అనుకూలంగా ఉండేవారు. మద్యపానంపై పరిమితి విధించటంతో తాగి దెబ్బలు కొట్టటం, తాగి తిట్టటం అనేది లేకుండా పోయింది. అప్పుడు స్త్రీలు చాలా సంతోషంగా ఉన్నారు. కొలత ప్రకారం తాగటం వలన నిషా ఎక్కువ ఇవ్వక మామూలుగా ఉండటంతో ఈ సమస్య ఎక్కువగా వుండేదికాదు. ఇది ప్రశాంత జీవనానికి దోహదం చేసింది.

తగాదాల సమయంలో భూస్వాములకు చెల్లించవలసిన ముడుపులు, వారికి చేయవలసిన వెట్టి చాకిరి వంటి దోపిడీ లేకపోవటంతో మొదటి రెండు మూడు నెలల్లోనే ప్రజలు ఊపిరి సలుపుకొని (relief) ఆర్థికంగా కొంతవరకు తమ కాళ్ళమీద తాము నిలబడే స్థితిని అభివృద్ధి చేసుకోసాగారు. ఆ రోజులలో రజాకార్లు దాడిచేసేవారు, లూటీ చేసేవారు, కొట్టేవారు. ఆ రకంగా కొంతనష్టమైనా సామాన్య ప్రజలు దానిని తట్టుకొని వుండగలిగారు.



గడీలో భూస్వాములు ప్రజలను హింసించేచోటు. ఈ వేపచెట్టుకే ప్రజలను వేలాడదీసి కొట్టేవారు. (పేజీ 42)



తెలంగాణా రైతు మోట తోలుతున్న దృశ్యం (పేజీ 52, 59)



మునగాల జమీందారు కోట లోపలిభాగం (నడిగూడెం గ్రామం) (పేజీ 98, 106)



1932 నుండి 1942 వరకు విసునూరు దేశముఖుకు వ్యతిరేకంగా పోరాడి అమరుడైన రైతుయువకుడు బందగీసమాధి (పేజీ 129, 130)



మైదం చెరువు, చెరువుకట్ట. కనిపించే ఊరు ముంద్రాయి. చెరువు క్రింది భూములను ప్రస్తుతం లంబాడీ రైతులు సాగుచేసుకుంటున్నారు. ఈ భూములను భూస్వాముల అక్రమ ఆక్రమణ నుంచి తిరిగి స్వాధీనం చేసుకోవాలని ముంద్రాయి లంబాడీ రైతాంగం 1944లోనే ముందుకు వచ్చింది. (పేజీ 286, 291)



విసునూరు దేశముఖు కిరాయి గూండాలు తెలంగాణా పోరాటంలోని తొలి అమర వీరుడైన దొడ్డి కొమరయ్యను కాల్చివేసిన స్థలం. (కడివెండి, పేజీ 349, 350)



దొడ్డి కొమరయ్యతో పాటు ఊరేగింపులో పాల్గొన్న వలంటీర్లు. వారు (ఎడమ నుంచి) 1. జంపాల లింగయ్య 2. రేశపల్లి కొండయ్య 3. పైళ్ళ యాదగిరి 4. యలమరెడ్డి కొండలరెడ్డి. ఈ మధ్య తీసిన ఫోటో ఇది. (పేజీ 349, 350)



బాలెముల గ్రామంలో 1946 పోరాటం జరిగిన వీధి. ఎదురుగా కనిపిస్తున్న బావిడిలోనుండి రజాకార్లు కాల్పులు జరిపారు. గుర్తు ఉన్నచోట కామ్రేడ్ అనంతరెడ్డిని కాల్చివేశారు. × గుర్తు ఉన్నచోట కామ్రేడ్ మట్టారెడ్డి దెబ్బ తిన్నాడు, తర్వాత చనిపోయాడు (పేజీ 367, 368)



1946లో బాలెముల గ్రామంలో రిజర్వు దళాల కాల్పులకు గురై అమరుడైన గార్లపాటి అనంతరెడ్డి (పేజీ 367, 368)



1946లో పాతసూర్యాపేటలో మిలటరీతో జరిగిన పోరాటంలో అమరుడైన సరసాని నరసయ్య చనిపోయిన స్థలం (× గుర్తు ఉన్నచోటు) (పేజీ 370, 371)



1946లో మల్లారెడ్డిగూడెంలో మిలటరీతో పోరాడిన ఒక వీధి. ఇక్కడ కష్టజీవులైన గురవమ్మ, తొండమ్మ, అంకాళమ్మలు అమరులయ్యారు. (పేజీ 373, 374)



1946లో మల్లారెడ్డిగూడెంలో మిలటరీతో పోరాడిన మరొక వీధి. ఇక్కడ కామ్రేడ్సు ఎరబోలు అప్పిరెడ్డి, ముంగివీరయ్యలు అమరులయ్యారు (పేజీ 373, 374)



1947లో నల్లగొండ జిల్లా పార్టీ కమిటీ కేంద్రాన్ని ఏర్పాటు చేసినఇల్లు. రామాపురం గ్రామం, మునగాల పరగణా. గడపకు ఇవతల ఉన్నభాగాన్ని తర్వాత కట్టారు. ఇది ఈమధ్య తీసిన ఫోటో. (పేజీ 417)



1947లో రామాపురం గ్రామంలో కా॥ డివి ఉండిన ఇల్లు. ఈ ఇల్లు ఏ మార్పులు లేకుండా అదేవిధంగా ఉన్నది. (పేజీ 417)



1947లో రామాపురం గ్రామంలో దళాలకు గెరిల్లా శిక్షణనిచ్చిన తోట. కొన్ని చెట్లను తర్వాతకాలంలో కొట్టివేశారు. (పేజీ 417, 419)



రావులపెంట గ్రామంలో పోలీసు క్యాంపు ఉన్న ఇంటిముందు భాగము. ఈ పోలీసు క్యాంపుపై దళాలు దాడిచేశాయి (1947-48). తర్వాతికాలంలో ఈ ఇంటి కట్టడంలో చాలా మార్పులు జరిగాయని చెప్పారు. (పేజీ 453)



కోటపాడు గ్రామంలో రజాకార్లు, పోలీసులు దాగిన మేడ. దళం వీరిపై దాడి చేసింది. (పేజీ 455)



చివ్వేముల గ్రామానికి, సూర్యాపేటకు మధ్యనగల మిట్ట ప్రదేశం. ఇక్కడే స్థానిక దళ సభ్యులు లెవీ ధాన్యం బండ్ల వెంటపోతున్న పోలీసువాడిపై మాటు దాడిచేసి, ఒక రైఫిలును సంపాదించారు. (పేజీ 457, 458)



నిజాం వ్యతిరేక పోరాటంలో అమరుడైన రేణిగుంటరామిరెడ్డి ఇల్లు. ఈ ఇంటి పైభాగం నుండే ఆయన రజాకార్లను, పోలీసులను ఎదుర్కొన్నాడు. తర్వాత కాలంలో పై అంతస్థును తీసివేశారు. (పేజీ 463)



చింతలమ్మగూడెంలో దళం సమావేశమైన ఇల్లు. ఈ ఇల్లు ప్రస్తుతం కూలిపోయి ఉన్నది. (పేజీ 468)



పెదవీడులో రజాకార్లు, పోలీసులు, మిలటరీ దాక్కున్న ఇండ్లు. ఈ దాడిలో ఈ ఇండ్లు కూలిపోయినవి. తర్వాత తిరిగి నిర్మించుకున్నారు. (పేజీ 468, 469)



మామిళ్ళగూడెం గ్రామంలో పోలీసు క్యాంపు పెట్టిన ఇల్లు. దళాలు ఈ క్యాంపుపై విజయవంతంగా దాడిచేశాయి. (పేజీ 470, 471)



కందగట్ల కొండల వరుస. ఇక్కడ దళంపై దాడి జరిగింది. (పేజీ 469, 470)



బిక్కుమళ్ళ గ్రామం దగ్గర దళాలు రజాకార్లపై, పోలీసులపై దాడి చేశాయి.దగ్గరలో ఉన్న మామిడి తోట వద్ద సంఘర్షణ కొనసాగింది. దృశ్యంలో ఈ తోటను చూడవచ్చును. ఇది మాచిన పల్లి గ్రామానికి చెందినది. (పేజీ 471)



పాతర్లపాడు గ్రామంలో రజాకార్లు, పోలీసులతో పోరాడుతూ దళ నాయకుడు కామ్రేడ్ గొట్టిముక్కల గోపాలరెడ్డి మరణించిన స్థలము. చెరువు కట్టక్రింద లోయలోపలి భాగం (పేజీ 483)



బైరానుపల్లి బురుజు. ఈ గ్రామంలో నిజాం మిలటరీ, పోలీసులకు, రజాకార్లకు వ్యతిరేకంగా పెద్ద పోరాటం నడిచింది. అయితే ఇక్కడి దళం పాతకాలపు యుద్ధ పద్ధతులను అనుసరించింది. (పేజీ 493)



కూటిగల్లు బురుజు. ఇక్కడకూడా పాతకాలపు పద్ధతులననుసరించి పెద్దఎత్తున ప్రజలు, దళం మిలటరీని, పోలీసు రజాకార్లను ఎదిరించారు. (పేజీ 500)



ఆత్మకూరు రజాకారు, పోలీసుక్యాంపు లోపలి భాగం. దళాలు ఈ క్యాంపు పై దాడిచేశాయి (పేజీ 503)



జన్నారెడ్డి ప్రతాపరెడ్డి (ఆనాటి దేశముఖు) కోట ముఖద్వారం. ఎర్రబాడు గ్రామం. ఇందులోనే రజాకార్లు, పోలీసులు క్యాంపువేశారు.దళాలు దీనిపై దాడి చేశాయి. (పేజీ 504)



నిజాం వ్యతిరేక పోరాటంలో మిలటరీని, పోలీసులను ప్రతిఘటిస్తూ అమరుడైన దళ నాయకుడు కామ్రేడ్ ప్రభాకరరావు, కరీంనగర్ జిల్లా (పేజీ 465, 466)



గానుగపాటి నారాయణ రెడ్డి. జనగామ తాలూకా గ్రామాలకు సంబంధించిన పార్టీ ఆర్గనైజరు. పోలిపురం గ్రామంలో భూమి పంపకం, స్థానిక సమస్యల పరిష్కారం చేస్తున్నప్పుడు పోలీసులు, మిలటరీ చేసిన దాడిలో అమరుడైనారు. (పేజీ 476, 494)



కామ్రేడ్ శేషగిరిరావు. కొత్తగూడెం బొగ్గుగని కార్మికుల నాయకుడు. దళాల్లో చేరి పోరాటం సాగించిన వీరిని ఒక ద్రోహి సమాచారం అందించగా పోలీసులు పట్టుకొని కాల్చి వేశారు (పేజీ 483-484)



అయిలమ్మ. ఆమె, ఆమె కుటుంబం పాలకుర్తి గ్రామంలో సంఘ కార్యకలాపాలకు అండగా నిలిచారు. ఫలితంగా విసునూరు దేశముఖు ఆగ్రహానికి గురైనారు. వీరి భూమిని, పంటను దేశముఖు నుండి రక్షించుకోవటానికి పోరాటం నడిచింది. (పేజీ 297)



రేణిగుంట రామిరెడ్డి. రజాకార్లు, పోలీసులతో పోరాడి అమరుడైనారు. (పేజీ 463).

## 3. దళాలు, పార్టీ నిర్మాణం

**స్థానిక వలంటీరు దళాలు :** స్థానిక వలంటీరు దళాలు కర్రలు, వడిసెలలు ఉపయోగించేవి. ముఖ్యంగా పేదరైతు, మధ్య తరగతి రైతు, వ్యవసాయ కూలీ కుటుంబాల నుంచి, చాలా సందర్భాలలో ధనిక రైతులనుంచి కూడా యువకులు దళ సభ్యులుగా చేరేవారు. వీరినుండి కుటుంబానికి ఒకరు చొప్పున మెరికల్లాంటి యువకులతో దళం ఏర్పడి ఉండేది. గ్రామ జనాభాని బట్టి 50 మంది, 30 మంది, 20 మంది లేక 10 మందితో ఏర్పడేది. ఈ దళాలకు ఒక కమాండరు, ఉప కమాండరు ఎన్నికల ద్వారా ఎన్నుకోబడేవారు. సహజంగా కొంచెం తెలివైనవారు, చొరవ, చురుకుతనం వున్న యువకులు కమాండర్లుగా ఉండేవారు. వారి కార్యక్రమం ఈ విధంగా ఉండేది: పనులు చేసుకుంటూనే వంతులవారీగా రాత్రిగాని, పగలుకాని కాపలా కాయటం ; గ్రామానికి పరాయివారు వస్తే తెలుసుకొని గ్రామ సంఘానికి చెప్పి, వారెందుకు వచ్చారో తెలుసుకోవటం, సిఐడీలు వస్తే పట్టి ఇవ్వటం; ఊళ్ళో దొంగతనాలు జరగకుండా చూడటం; గ్రామాలలో కొట్టుకోవటం, తిట్టుకోవటం లాంటి తగాదాలు ఏమైనా వస్తే వెళ్ళి వాటిని సర్దేయటం; వారికి సాధ్యం కాకపోతే గ్రామ సంఘానికి చెప్పి గ్రామరాజ్యంలో వాటిని పెట్టి పరిష్కారం చేయటం – ఇదీ ఈ దళాల కార్యక్రమం. వీరికి తప్పనిసరిగా డ్రిల్లు నేర్పించే ఏర్పాట్లుండేవి. క్రమంగా రోజులు గడుస్తున్న కొద్దీ వారిలో ఉండే మంచి మెరికల్లాంటి సభ్యులను ఎంపిక చేసి, దగ్గరలో ఉన్న రెగ్యులర్ కేంద్ర దళాలకు పంపిస్తుండే వారు. ఈ రకంగా ఆ దళాలలో దళ సభ్యుల సంఖ్య పెరుగుతుండేది.(ఈ రెగ్యులర్ కేంద్ర దళాలలో మొదట దళానికి 9 మంది సభ్యుల చొప్పున ఉండేది. క్రమంగా ఈ సంఖ్య పెరిగింది.) దళాల సంఖ్య పెరుగుతుండేది. అంటే స్థానిక వలంటీరు దళాలు, రెగ్యులర్ కేంద్ర దళాలకు రిక్రూటింగ్ (సమీకరణ) కేంద్రాలుగా ఉండేవి. ఆరోగ్యం విషయంలో, గ్రామాలను పరిశుభ్రంగా ఉంచటంలో, తగాదాలు సర్దటంలో, జబ్బుగా ఉన్నవారికి, పేదవారికి సహాయం అందజేయటంలో, అవసరమైన అన్ని సందర్భాలలో సహాయ సహకారాలను అందించటంలో ఈ గ్రామదళం చాలా నిర్ణయాత్మకమైన పాత్ర నిర్వహిస్తుండేది.

గ్రామం వదిలిపెట్టి ఉండవలసి వచ్చిన కార్యకర్తలందరికీ, ముఖ్యంగా పార్టీ కార్యకర్తలుగా, గెరిల్లా దళాల సభ్యులుగా దూరప్రాంతాలకు వెళ్ళిన వారికి,

తమ వ్యవసాయం, ఇంటి పనులు చూసుకోవటం సాధ్యం కాకపోయేది. అలాంటి కుటుంబాల వారికి వ్యవసాయం నిర్వహించటంలో పలంటీరు దళాలు సాయపడుతూ ఉండేవారు. గ్రామాలలో కూలీలను పంపించి, ధాన్యాన్ని ఇళ్ళకు చేర్పించి, వారికి వ్యవసాయాన్ని నడిపించటానికి తోడ్పడుతుండేవారు. ఇవి పార్టీ నిర్ణయించిన బాధ్యతలు కాబట్టి, వాటిని సక్రమంగా నిర్వహించుతుండేవారు. ఈ గెరిల్లా దళాలలో చేరిన భూమిలేని పేదలకు భూమి పంపకంలో ప్రాధాన్యత నిచ్చేవారు. లేదా భూమి పంచుకున్న కుటుంబాల నుంచి ఐచ్ఛికంగానే గెరిల్లా దళాలలో వారు చేరేవారు. మామూలుగా కుటుంబంనుంచి ఒకరు చేరుతుండేది. కార్యక్రమాలలో ఇదొక ప్రధాన అంశంగా ఉండేది.

ఈ దృష్టితో చూసినప్పుడు స్థానిక దళాలు ఒక కీలకమైన పాత్రను నిర్వహిస్తుండేవి. ఇవి ఎంత చక్కగా తమ పాత్రను నిర్వహిస్తే, అంతచక్కగా గెరిల్లా దళాలు ఏర్పడి పనిచేయటం జరిగేది.

**పార్టీ నిర్మాణం :** పార్టీ నిర్మాణం కూడా కొంత జరిగింది. పోరాటం ప్రారంభం కావటానికి ముందే గ్రామాలలో పార్టీయూనిట్లు ఉండేవి. ఇందులోని పార్టీ సభ్యులు కొందరు నాయకత్వంలోకి వచ్చి, పార్టీ ఆర్గనైజర్లుగా పనిచేశారు. వీరందరూ గెరిల్లా దళాల్లో కూడా ఉండేవారు. రాష్ట్రకమిటీ క్రింద జిల్లాకమిటీలు, జిల్లాకమిటీల క్రింద తాలూకా కమిటీలు, తాలూకా కమిటీల క్రింద దళాలు పనిచేస్తూ పార్టీనిర్మాణం ఏర్పడి ఉండేది. కేంద్రదళాలలో కొందరు పార్టీ సభ్యులుండేవారు. ఇతరులు పార్టీసభ్యులు కానివారుండేవారు. అదేవిధంగా స్థానిక దళాలలో కూడా పార్టీసభ్యులు, పార్టీసభ్యులుకానివారు ఉండేవారు. సాధారణంగా పార్టీసభ్యులైనవాళే నాయకులుగా కూడా ఉండేవారు. ఈవిధంగా దళనాయకులుగా ఉంటూ, విడిగా పార్టీ యూనిట్లను ఏర్పాటుచేసి పనిచేయించటం ఆచరణలో ఎప్పుడూ అమలులోకి రాలేదు. దళంతో రాజకీయాలు, ఇతరవిషయాల గురించి సమావేశాలు, చర్చలు జరిపేవారుకానీ, దళంలోఉన్న పార్టీసభ్యులు విడిగా చర్చలు జరిపేవారుకాదు. తక్కిన దళసభ్యులు తమమీదే ఏదన్నా మాట్లాడుతున్నారా? అని అనుమానపడినా, లేదా వారు మాట్లాడుకునే విషయం తమకు ఎందుకు తెలియకుండా ఉంచుతున్నారనే సమస్యను తీసుకువచ్చినా, దళం ఐక్యత దెబ్బతింటుందని దళాన్ని ఒక యూనిటుగా చేశారు. అదేవిధంగా స్థానిక దళాలలో కూడా విడిగా పార్టీయూనిటు సమావేశాలు అరుదుగా జరుగుతుండేది.

గ్రామసంఘాలతో ఉండే పార్టీసభ్యుల పరిస్థితి కూడా ఇదేవిధంగా ఉండేది. పల్లెటూళ్ళలో విడిగా పార్టీ సభ్యులను సమావేశపరచటం ఎప్పుడూ సమస్యగానే ఉంటూ వచ్చింది. ఈనాటికీ ఇదొక సమస్యగానే ఉన్నది. విడిగా పార్టీసభ్యుల సమావేశం ఏర్పాటుచేసినప్పుడు ఏంచెప్తారో వినాలని కుతూహలంతో, ఏమన్నా తమను గురించి మాట్లాడుతారేమో తెలుసుకోవాలని కుతూహలంతో తక్కినవారంతా వచ్చి కూర్చోవటం జరిగేది. తీవ్రమైన నిర్బంధ పరిస్థితుల్లో ఒకరినొకరు చూడటానిక్కూడా భయపడుతున్నకాలంలో పార్టీసభ్యులను పొలాలలోకో, పంటచేలలోకో పిలిచి, సమావేశం జరిపి, అక్కడ సమస్యలన్నీ చర్చించటం సాధ్యమైంది. మామూలు పరిస్థితుల్లో, పదిమంది ప్రజలు అందుబాటులో ఉన్న సమయంలో, విడిగా ఇలాంటి సమావేశాలు జరిపి సమస్యలన్నీ చర్చించటం ఆనాడు బొత్తిగా సాధ్యంకాలేదు. ఇదొక ప్రధానమైన లోపంగా ఉంటూ వచ్చింది. పార్టీ నిర్మాణం ఇటు గెరిల్లా దళంలో, అటు గ్రామసంఘాలలో, తర్వాత స్థానికదళాలలో కలిసిపోయిన (merge) స్థితి ఒకటి ఉంటూ వచ్చింది. దీనివలన కొన్ని సమస్యలు ఉత్పన్నమైనాయి.

**గెరిల్లా దళాలు - దళాలే సర్వస్వమనే ధోరణి :** గెరిల్లా దళాలు పని చేయటం ప్రారంభించేనాటికి భూమిపంపకం ప్రారంభం కాలేదు. భూమిపంపకం ప్రారంభం అయిన తర్వాత నిర్బంధం ఇంకా తీవ్రంకావటంతో గెరిల్లాదళాలు మరింత సమర్థవంతంగా పనిచేయవలసి వచ్చింది. దీనితో కొన్ని కర్తవ్యాలు అదనంగా వచ్చాయి. అదేవిధంగా గ్రామసంఘాలు సరిగా భూమి పంపకాలు జరపనిచోట వాటిని సమావేశపరిచి, మార్పులుచేసి భూమిపంపకాలు జరిపించటం చిన్న సమస్యేమీకాదు. ధనికరైతులైనా, చిన్నభూస్వాములైనా పదవులనుంచి అంతతేలిగ్గా తప్పుకోరు, తప్పుకోలేదు కూడా. ప్రజలను సమావేశపరచి గ్రామ సంఘాల సమావేశాలు జరిపి, వారేవిధంగా నష్టంచేస్తున్నదీ చెప్పి, తొలగించటం ఒక కార్యక్రమంగా ఉండేది. ఆ కార్యక్రమానికి పార్టీ ఆర్గనైజర్లు, లేక దళాలు వెళ్ళవలసివచ్చేది. ఒకదశలో పార్టీ ఆర్గనైజర్లను నిర్లక్ష్యంచేసి, దళాలు చెప్తేనే వినే పరిస్థితి ఏర్పడింది. పార్టీ ఆర్గనైజర్లు రాజకీయంగా ఎక్కువ అనుభవజ్ఞులుగానూ, ఎక్కువ తెలిసినవారుగానూ ఉంటూ, పార్టీ కార్యకలాపాలను సరిగ్గా అర్థంచేసుకోగలిగేవారు. అయితే ఈ రాజకీయ నాయకులకు గుర్తింపు తక్కువగా

ఉండటంతో, క్రమంగా గ్రామసంఘాల్లో, గ్రామదళాల్లో, సాధారణ ప్రజల్లో అన్ని గెరిల్లాదళం వచ్చి పరిష్కారంచేయాలి అనే ధోరణి బయలుదేరింది. తగాదాలు పరిష్కారంచేయటంవంటి గ్రామసంఘాలు చేసేపనులు దళాలతో చేయించేధోరణి, పార్టీ ఆర్గనైజర్లు చేసే పనులు దళాలే చేయాలనే ధోరణి ప్రబలంగా వచ్చింది. దళాలచేతిలో ఆయుధాలు ఉండటంతో వాటి అధికారం (Power) ఎక్కువ అవు తుండేది. ఈ పనులన్నీ తమ పరిధిలోనివి కాదనీ, పార్టీ ఆర్గనైజర్లు చెప్పినట్టు, గ్రామసంఘాలు చెప్పినట్టు వినాలని ఈ దళాలు కూడా గట్టిగా చెప్పేవికావు. తమ ఆధిపత్యం పెరుగుతున్నది. తమకు గుర్తింపు పెరుగుతున్నది. కనుక ఈ దళ నాయకులు సాధారణంగా ఉబ్బితబ్బిబ్బయి పార్టీ పద్ధతులను వదిలిపెట్టి, తమ ఆధిపత్యాన్ని స్థాపించటంకొరకు పార్టీ ఆర్గనైజర్లను, గ్రామసంఘాలను నిర్లక్ష్యం చేసి, తామే సంపూర్ణ సర్వాధికారాలను నిర్వహించిన సంఘటనలూ, సందర్భాలూ చాలా ఉన్నాయి. భూమిపంపకం విషయంలో శ్రద్ధతీసుకొని, ఈ అవాంఛనీయ శక్తులని తగ్గించి, నిజమైన నాయకత్వాన్ని అభివృద్ధిచేయటానికి ప్రయత్నం చేయనిచోట్ల, గ్రామసంఘాల నాయకత్వం, ముఖ్యంగా గెరిల్లాదళాల నాయకత్వం భూస్వాముల చేతుల్లో ఉన్న చోట్ల, గెరిల్లాదళాలే సర్వస్వం అనే పరిస్థితి ఉండేది. అలాంటిచోట్ల గ్రామసంఘాలు, వాటి పనులూ, గ్రామదళాలూ, చివరికి పార్టీ ఆర్గనైజర్లూ అంతా నామమాత్రంగానే ఉండేవారు. తక్కినచోట్లలో గ్రామసంఘా లలో, గ్రామదళాలలో పేదరైతుల, మధ్యతరగతి రైతుల, వ్యవసాయ కూలీల సంఖ్య పెరిగింది. ధనికరైతులనుంచి చురుకైన, చైతన్యవంతులైనవారు ఉండే వారు. అక్కడ చాలావరకూ పార్టీ ఆర్గనైజర్ల పనులకూ, దళాలుచేసే పనులకూ మధ్య సరైన విభజన (demarcation) జరిగింది. గెరిల్లాదళాలు పూర్తిగా రెగ్యులర్ మిలటరీ కార్యకలాపాలకొరకు ఉండేవి. స్థానికదళాలు స్థానిక వ్యవహా రాలను చక్కదిద్దటంకొరకు ఉండేవి. గ్రామరాజ్యాలు గ్రామరాజ్యాల పనిచేస్తూ ఉండేవి. ఈరకంగా ఎవరిపనులు వారు చేయటమనే పద్ధతి కొన్ని ప్రాంతాలలో అమలులోకి వచ్చింది. కానీ ఎక్కువ ప్రాంతాలలో ధనికరైతుల, ధనికరైతుల నుంచి వచ్చిన భూస్వాముల ప్రాబల్యం ఎక్కువగా ఉంటూవచ్చింది.

# 4. ప్రజల మిలటరీ కార్యకలాపాలు, నిర్మాణం - దాడుల వివరాలు, సమీక్ష

ఈ సాయుధ పోరాటానికి చరిత్రాత్మక ప్రాధాన్యత ఉన్నది. ముఖ్యంగా, ఈ సందర్భంగా జరిగిన మిలటరీ నిర్మాణం, మిలటరీ కార్యకలాపాలవలన ఈ ప్రాధాన్యత మరింత పెరుగుతుంది. దీనిని అర్థం చేసుకోవాలంటే గెరిల్లా దళాలు, వాటి నిర్మాణం, అవి నిర్వహించిన దాడుల పరిశీలన చాలా అవసరం.

**మొదటి దశలో దళాలు నిర్వహించిన కొన్ని దాడులు, వాటి సమీక్ష :**

కొన్ని కేంద్రాలు ఏర్పాటు చేసి, దళ సభ్యులను సమీకరించి, వారికి ఆయుధ శిక్షణ ఇచ్చారని ఇంతకు ముందే వివరించాము. అదే విధంగా ఆయుధ సేకరణ గురించి కూడా వివరించాము. నల్లగొండ జిల్లావారితో సహా లోతట్టు ప్రాంతాల వారికి ఆధునిక ఆయుధాలు దొరకలేదని చెప్పాము. భూస్వాముల నుంచి స్వాధీనం చేసుకున్నా, ఆ విధంగా నాటు తుపాకులు, షాట్‌గన్స్ మాత్రమే దొరికాయి. రైఫిళ్ళు దొరకలేదు.

నల్లగొండ జిల్లాలో జరిగిన కొన్ని ముఖ్యమైన దాడులను ముందు వివరిస్తాము.

1. రావులపెంట పోలీసు క్యాంపుపై దాడి : ఈ పరిస్థితుల్లో షాట్‌గన్స్‌తోనే దాడి చేయాల్సి వచ్చింది. ఒక రైఫిల్‌ను సంపాదించుకోవాలనే సమస్యను నల్లగొండ జిల్లాకమిటీ ఆలోచించింది. ఈ రైఫిల్ కొనుక్కోవటానికి పెద్ద మొత్తంలో డబ్బు కావాలి. దీనికి కావలసిన వనరులు లేవు మొదటి రోజుల్లో ఇంత డబ్బుకూడా రాలేదు. ఈ స్థితిలో ఒక పోలీసు క్యాంపుమీద దాడిచేసి రైఫిళ్ళను స్వాధీనం చేసుకోవాలని నల్లగొండ జిల్లా కమిటీ నిర్ణయించింది. రావులపెంట పోలీసు క్యాంపుమీద దాడి చేయాలని నిర్ణయించి, దానికొరకు నాయకత్వం వివరమైన ప్లాను తయారు చేసింది. పోలీసు క్యాంపు ఉన్న ఇల్లు ఎక్కడ ఉంది? చుట్టు పక్కల ప్రదేశం ఏ విధంగా ఉన్నది? క్యాంపు లోపల గోడలు, కిటికీలు, తలుపులు ఇవన్నీ ఏ విధంగా ఉన్నాయి? తుపాకులు పట్టుకున్న పోలీసులు అందులో ఎక్కడ ఉంటారు? ఎప్పుడు తుపాకి పట్టుకొని ఉంటారు? ఎప్పుడు వాటిని ఒకచోట పెట్టుకొని ఉంటారు? దీనికి సంబంధించిన వివరాలన్నీ

15, 20 రోజుల ముందే తెలుసుకొని వచ్చారు. ఈ పనికి తగిన స్థానిక గ్రామదళ సభ్యులు, ఇతరులు అందుబాటులో ఉండి, ఏదో పనిమీద లోపలికి వెళ్ళి చూసి తెలుసుకొని వచ్చారు. దీనితో ఆ దాడిలో కొన్ని రైఫిళ్ళు దొరుకుతాయనే నమ్మకం ఏర్పడింది. క్యాంపుమీదికి ఒక దళాన్ని పంపించి, నిర్ణయించిన విధంగా పొజిషన్లు తీసుకొని, సెంట్రీని కాల్చి, వెంటనే దూకి క్యాంపుపై పడి పోలీసులు సిద్ధంకాకముందే రైఫిళ్ళను స్వాధీనం చేసుకోవటానికి ప్లాను వేశారు. ఆ నిర్ణీత తేదీన దళం వెళ్ళి, అనుకున్నవిధంగా కాల్పులు జరిపారు. మొదటివాడు చనిపోయాడు. అయితే దళం వెళ్ళే వరకు క్యాంపులోపల పరిస్థితుల్లో కొన్ని మార్పులు చేశారు. స్థానిక దళ సభ్యులు వెళ్ళి చూసి వచ్చిన తర్వాత పకడ్బందీగా ఉండే విధంగా మార్పులు చేసుకొన్నారు. గోడల పక్కన అరుగులు కట్టేశారు. చప్పుడు వినగానే పొజిషన్ తీసుకోవటానికి వీలుగా ఏర్పాట్లు చేశారు. అకస్మాత్తుగా పైన దూకి పట్టుకోవటానికి వీలు లేకుండా ఆ ఏర్పాట్లు చేసుకొని ఉన్నారు. వీటి ఫలితంగా దళం క్యాంపుమీద దాడి చేసినా, పోలీసులు పట్టుబడలేదు. కాగా దళం మీదికి కాల్చారు. పోలీసులు గట్టి పొజిషన్ తీసుకొని గురిచూసి కాల్చ గలిగిన పరిస్థితుల్లో ఉండటం వలన, ఇద్దరు దళ సభ్యుల మీద వారు కాల్చ గలిగారు. ఫలితంగా వారిద్దరూ చనిపోయారు. వారిలో దళ నాయకుడు, మంచి ఆర్గనైజ రయిన దేవబత్తిని వెంకటేశ్వరరావు కూడా చనిపోయాడు. అతను పెంచికల్లు గ్రామనివాసి. స్థానిక కార్యకర్తగా పనిచేస్తుండేవాడు. క్రమంగా దళానికి నాయకత్వం వహించాడు. చురుకైనవాడు. అతను చనిపోవటం జిల్లా పార్టీతో పాటు మొత్తం పార్టీకి కూడా చాలా నష్టంగా భావించారు. ఇక చేయగలిగేదేమీ లేక మిగిలిన దళ సభ్యులు వెనుకకు మళ్ళారు. ఇంతకు ముందు వారికిచ్చిన సూచనల మేరకు – చనిపోయిన దేవబత్తిని వెంకటేశ్వరరావును, మరొక కామ్రేడును తీసుకొని నిర్ణీత ప్రదేశానికి చేరుకున్నారు. అక్కడి నుంచి ఆ అమర వీరుల గ్రామాలకు తీసుకువెళ్ళి మిలటరీ లాంఛనాలతో అంత్యక్రియలు చేశారు.

ఈ మొదటిదాడి విఫలంకావటంతో జిల్లాపార్టీకి ఎత్తుగడలను తిరిగి ఆలోచించవలసిన అవసరం కలిగింది. ఎందుకంటే దళం గట్టిది, అన్ని శిక్షణలు పొందినటువంటిది. అయినా దాడి విఫలమయింది. దీనితో ఈ దాడిని పూర్తిగా పరిశీలించారు. ఈ దాడులయొక్క పద్ధతి, ఈ ఎత్తుగడలు ఇదేవిధంగా ఉండాలా?

మార్చాలా అనే విషయాన్ని ఆలోచించారు. ఈదాడిలో జరిగిన లోటుపాట్లను కూడా సమీక్షించారు. దాన్లో తేలినదేమిటంటే - ఒకటి : సుమారు 20 రోజులకు ముందున్న పరిస్థితి ఆతర్వాత ఉండదు. ఎప్పటికప్పుడు మారుతూ ఉంటుంది. పోలీసుక్యాంపు, దాని పరిసరాలు, క్యాంపులోఉన్న నిర్మాణాలు, క్యాంపులో ఉన్న పోలీసుల సంఖ్య, వచ్చేవారు, పోయేవారు ఇవన్నీ మారుతూ ఉంటాయి. దాడి చేయటానికి ఒకరోజు ముందువెళ్ళి చూసుకొని, పరిస్థితిని తెలుసుకొని, దాడి చేయటం సరిగా ఉంటుందికానీ, 20 రోజులక్రిందటి సమాచారాన్నిబట్టి దాడి చేయటం తప్పు అనే నిర్ణయానికి వచ్చారు. దానికి కారణం ఈమధ్యకాలంలో వచ్చిన మార్పులు. రెండవది : ఈ ప్రారంభదశలోనే పోలీసుస్టేషన్లమీద దాడి చేయటం సరైనదా ? కాదా ? అన్నది కూడా ఆలోచించారు మొదటిదశలో దాడి చేయటం సరైనది కాదనే నిర్ణయానికి వచ్చారు. ఈప్రాంతాల్లోనేకాకుండా ఇతర ప్రాంతాల్లోకూడా అన్నిస్టేషన్లలో పోలీసులు కట్టుదిట్టాలుచేస్తున్నారు. క్యాంపులు వేసినచోట అదేవిధమైన ఏర్పాట్లు చేస్తున్నారు. ప్రారంభంనుంచీ పోలీసుస్టేషన్లు ఉన్నచోట్ల కట్టుదిట్టాలు చేస్తున్నారు. వెనుకటి పోలీసుస్టేషన్లే కాకుండా కొత్తరకం పోలీసుస్టేషన్లను ఏర్పాటుచేస్తున్నారు. వెనుకటి పోలీసుస్టేషన్లు కూడా కట్టుదిట్టంగా ఉండేవి. ఆతర్వాత ఏర్పాటుచేసినవీ అదేవిధంగా చేస్తూవచ్చారు. వారు పెద్దఎత్తున గ్రామాలమీద మిలటరీ దాడులు చేయటానికి నిర్ణయించిన తర్వాత ఈ ఏర్పాట్లు కూడా దానివెంబడే చేస్తూవచ్చారు. ఈకారణాలవలన అప్పటిస్థితిలో దళాలు పోలీసుస్టేషన్లమీద దాడులు చేయకూడదని, మాటుదాడులమీద కేంద్రీకరించాలని అక్కడి పార్టీకమిటీ కామ్రేడ్సు, దళం నిర్ణయించారు. దానిప్రకారం ఆ ఎత్తుగడను అప్పటికప్పుడే మార్చి, మాటుదాడులకొరకు ప్రయత్నం చేయటం ప్రారంభించారు.

**2. కోటపాడు సంఘటన :** ఈ సమయంలోనే కోటపాడు అనే గ్రామంలో ఒక సంఘటన జరిగింది. కొందరు రజాకార్లు, పోలీసులతోసహావచ్చి, ఆగ్రామం మీద పడి దాడిచేస్తున్నారు. అది ఉదయం 9-10 గంటల సమయం. ఈవిషయం దగ్గరలోఉన్న దళానికి తెలిసి వారిమీద దాడిచేయటంకొరకు వెళ్ళింది. ఈవిషయం తెలిసి రజాకార్లు, పోలీసులు కొందరు పరిగెత్తి తిరిగి వెళ్ళిపోయారు. కొందరు ఆ ఊరిలోఉన్న ఒక మేడలో దాక్కున్నారు. మేడ ఒక మోస్తరుగా ఉండి, గట్టిగానే ఉన్నది. అక్కడినుంచి కాల్పులు జరపటానికి ప్రయత్నంచేశారు. దళ

సభ్యులు ఆ మేడను చుట్టుముట్టి వారిని లొంగిపొమ్మని కోరారు. వారు లొంగిపోక ప్రతిఘటించటానికి తలపడి కాల్పులుకూడా చేశారు. దళసభ్యులకు శిక్షణఉండటం వలన కాల్పులను తప్పించుకొని, తిరిగి కాల్చటానికి ప్రయత్నించారు. కాని వారు మేడలో ఉండటం వలన కాల్చటం సాధ్యంకాలేదు. వారు కాల్చటం, దళసభ్యులు రక్షణతీసుకొని ఈ కాల్పులకు గురికాకుండా కాపాడుకోవటం, దళ సభ్యులు కాల్చటం, వారు కాల్పులకు గురికాకుండా తప్పుకోవటం – ఈవిధంగా పోరాటం కొన్నిగంటలు నడిచింది. అప్పుడు ఆ దళానికి నాయకత్వం వహించిన భీమిరెడ్డి నరసింహారెడ్డిగారు ఒక ఉపాయం ఆలోచించారు. ఇది ఊదరబాంబు అని అక్కడ పేరుపడింది. ఏమేరకు ఉపయోగపడినదో తర్వాత చూడవచ్చును. గడ్డిమోపులు తెప్పించి, మేడచుట్టూ పెట్టి, తగలపెట్టించారు. ఆపొగకు వారు భయపడి లొంగి పోతారని వీరు అనుకున్నారు. ఈవిధంగా కొంత ప్రయత్నంచేసినా, లోపల రక్షణ ఉండటంవలన వారు అప్పటికప్పుడు లొంగిపోలేదు. లొంగిపోవాలనేస్థితికి వచ్చారని కూడా చెప్పలేము. కాని వారు కొంత చికాకుపడి గందరగోళపడ్డారు. మేడలో కొంతభాగం తగలబడి ఉంటుంది. ఈ పరిస్థితుల్లో కొంత పోలీసూ, మిలటరీ తిరిగివచ్చేసింది. దళం తప్పుకోవలసివచ్చింది. తప్పుకుంది కూడా. వారు వచ్చి చక్కగా ఇంట్లోఉన్న రజాకార్లను, పోలీసులను విడిపించుకొని వెళ్ళిపోయారు. దీనివలన శత్రువును కొంత గందరగోళపరచగలిగాముగాని, ఆదళం, దళనాయకత్వం గ్రహించని ప్రధానలోపాలు కొన్ని ఉన్నాయి :

1) ఇది పగలు జరిగినదాడి. ఈదాడిలో గ్రామాన్ని చుట్టివేసి, ఎవరూ గ్రామం నుంచి బయటకు వెళ్ళకుండా పోలీసులకు, మిలటరీకి వార్తచేరకుండా చేసినప్పుడే, మొదటి విజయం సాధ్యమవుతుంది. దానికి బదులుగా దళం దాడిచేస్తున్న సమయం లోనే కొందరు రజాకార్లు, పోలీసులు తప్పుకొని వెళ్ళిపోయారు. వారు ఏమిచేస్తా రన్న ఆలోచన ఈదళ నాయకత్వానికి తట్టలేదు. సహజంగానే వారు వెళ్ళి వార్త అందించటంతో పోలీసు, మిలటరీ వచ్చారు. సాధారణంగా వారీవిధంగా రక్షణకొరకు వస్తుంటారు. వీరు వార్త అందిస్తారని కాని, అదనపు శత్రుబలాలు వస్తాయనిగాని ఈదళ నాయకత్వం గ్రహించలేదు. ఏసమయం ఎట్లావచ్చునో అని గ్రామానికి వచ్చేదారులను కాపలావేసి, వచ్చేవారిని ఆపటానికి ప్రయత్నం చేయవచ్చును. దళంలో కొందరిని చీల్చి, సుమారు పోలీసు, మిలటరీ రావటానికి అవకాశంఉన్న దారులలో మాటుస్థలం చూసుకొని, కాపలావేసి, వారు వచ్చినప్పుడు

గురిచూసి కాల్పులు సాగిస్తే ఆయుధాలు రాకున్నా, శత్రువులు కొందరు చనిపోవటం, లేదా కనీసం భయానికైనా తిరిగి వెళ్ళిపోవటం జరుగుతుంది. ఆ విధంగా పోలీసు, మిలటరీవారు ఈ గ్రామంలో ఉన్నవారికి రక్షణ ఇవ్వటానికి, సహాయ పడకుండా ఛేదించటానికి అవకాశం ఉంటుంది. ఈ పని చేయాలని దళానికి ఆలోచన తట్టలేదు. వెళ్ళిపోయిన రజాకార్లు, పోలీసులు ఏంచేస్తారనేది గ్రహించకుండా, దళం మామూలుగా మిగిలిన రజాకార్లమీద దాడిచేసింది. ఒకవైపున వారు లొంగిపోతామని చెప్తూ రాజీ సంప్రదింపులు జరుపుతున్నారు. కానీ లొంగిపోవటం లేదు. కాల్పులు జరుపుతున్నారు, రాజీకి వస్తామంటున్నారు. మళ్ళీ తిరిగి కాల్పులు జరుపుతున్నారు. ఈవిధంగా అవకాశంకొరకు ఎదురుచూస్తూ కాలంగడుపుతున్నారు (gaining time). ఇదెందుకు జరుగుతున్నదని కూడా వీరు ఆలోచించలేక పోయారు. అదేవిధంగా కాల్పులు జరుపుతూ కొంతకాలం గడిచి, వారు లొంగకుండా ఉండిపోయిన తర్వాత వీరు ఊదరపెట్టటానికి ప్రయత్నంచేశారు. దాని వల్ల వారికి కొంత కంగారుకలిగినప్పటికీ, తగిన సమయం మించిపోవటంతో, వారికి సహాయం చేసే పోలీసు, మిలటరీ వచ్చేశారు. ఆ సమయంలో చేయగలిగేది ఏమీలేక కామ్రేడ్సు తిరిగి వచ్చేశారు. ఆ సమయంలో దళానికి ఆయుధాలు దొరకలేదు. ఎదుటివారిని చంపలేదు. అయినా దళానికి ఏమీ నష్టం లేకుండా తిరిగి వచ్చారు. ఇది ఈ దాడిలో ఉన్న విజయం. రెండవది: కొద్దిసేపైనా దళం నష్టపడకుండా వారిమీద కాల్పులు చేసి, శత్రువును చికాకుపెట్టి, విసిగించ గలిగారు. అప్పటికప్పుడు ఆలోచించి, తుపాకులమీదనే ఆధారపడకుండా, స్థానికంగా లభ్యమయ్యే ఇతర వస్తువులను కూడా ఉపయోగించి, వారిని నష్టపెట్టటానికి, విసిగించటానికి లేదా లొంగదీయటానికి ప్రయత్నించటమనేది గడ్డిని తగలబెట్టి ఊదరపెట్టటంలో కనిపిస్తున్న ముఖ్యమైన అంశం. ఇది సవ్యమైనదే. కానీ దానికి అంతకన్నా ఎక్కువ ప్రాధాన్యతనివ్వటం, అదేదో కనిపెట్టిన పెద్ద విషయమనీ, తర్వాత కూడా ఉపయోగించటానికి ఒక సాధనంగా, ఒక మార్గంగా దాన్ని చిత్రించటం సరైనదికాదు. ఎందుకంటే తర్వాత జరిగిన ఇటువంటి కొన్ని ప్రయత్నాలు కూడా సఫలం కాలేదు. దానికటువంటి అవకాశాలులేవు.

3. చివ్వెములమాటుదాడి: రెండు దాడుల తర్వాతకూడా ఒక రైఫిల్ లాంటి ఆయుధం లేక, దూరంనుంచి పోలీసులను, మిలటరీ వారిని కాల్చటానికి అవకాశం

లేకుండా ఉండినవి. దగ్గరనుంచి కాల్చటంలో, గురిచూసి కాల్చినప్పటికీ, ప్రమాదం ఉంటుంది. శత్రువుకూడా అందుబాటులో ఉంటాడు. మనవారిని కాల్చటానికి అవకాశముంటుంది. చాటున ఉండి దూరంగా ఉన్న శత్రువును కాల్చటానికి రైఫిల్ ముఖ్యమైన అవసరంగా ఉంటుంది. దీనిని సంపాదించటానికి నల్లగొండ కామ్రేడ్సు ఒక ప్లాను వేశారు. రైఫిల్ ధరించిన ఒక పోలీసు వెంట ఉండి, లెవీ ధాన్యాల బండ్లను గ్రామాన్నుంచి తీసుకొని వెళ్తున్నాడు. ఆ పోలీసు బహుశా సాయుధ పోలీసు దళంనుంచి వచ్చిన వాడై ఉంటాడు. ఆ బండ్లు చందుపట్ల, నామవరం, మోతె, చివ్వేముల గ్రామాలకు సంబంధించినవి కావచ్చును. ఎక్కువ సంఖ్యలో ఆ బండ్లు వస్తున్నాయి. ముందు స్థానిక కామ్రేడ్సు చూసి, సెంటరుకు కబురందించటంతో ప్లానువేసి, ఓ ముగ్గురు, నల్గురు ముఖ్యమైన కామ్రేడ్సును వెంటపంపి, దారిలో అక్కడక్కడా ఉంచుతూ, అనుకూలమైన స్థలంలో ఆ పోలీసుని పట్టుకొని ఆయుధం లాక్కోవాలని నిర్ణయించారు. దగ్గర్లో గ్రామాలుండటం వలన అది సాధ్యం కాదని తెలిసి ప్లాను మార్చారు. చివ్వేముల, సూర్యాపేట మధ్యన ఒక చోట మిట్ట ప్రదేశం ఉంటుంది. దీనిని సైదులుమిట్ట అనికూడా అంటారు. చుట్టూ నిర్జన ప్రదేశం ఉంటుంది. తెలిసినవారూ, తెలియనివారూ ఎవ్వరూ ఉండటానికి వీలులేదు. ఆ ప్రదేశంలో కొంత మరుగు కూడా ఉంటుంది. అక్కడ కొందరిని ఉంచి, ఈ పోలీసు వాడిమీద పడి లొంగ దీసుకొని ఆయుధం తీసుకోవాలని నిర్ణయం చేశారు. ఆ ప్రకారం స్థానిక దళ సభ్యులు అక్కడికి వెళ్ళారు. దాగి ఉండి, వరుసగా బండ్లు వస్తున్నప్పుడు, అతను నిర్లక్ష్యంగా ఉన్న సమయం చూసుకొని, ముగ్గురు, నల్గురు అతనిమీద పడి ఆ రైఫిల్‌ని లాక్కొని పంపించేశారు. అతన్ని చంపలేదు. దాని ఫలితంగా అతన్ని ఉద్యోగం నుంచి తీసివేసి ఉండవచ్చును. ఏదైనా చేసి ఉంటారు. బండ్లు ఆయా గ్రామాలకు తిరిగి వెళ్ళిపోయినవి. అందులో కొన్ని మాత్రం తిరిగివచ్చేవి ఉండినవి. ఆ విధంగా బండ్లకు రక్షణ ఇవ్వడం జరిగింది. ధాన్యాన్ని తిరిగి అక్కడి గ్రామ సంఘాలు స్వాధీనం చేసుకొని ప్రజలకు పంచి ఇచ్చారు. ఈ విధంగా ఒక రైఫిల్ దొరికింది.

**నల్లగొండ జిల్లా దళం ఏర్పాటు :** దీనితో జిల్లా దళమని ఏర్పాటు చేశారు. అన్ని ప్రాంతాలలోని ముఖ్యమైన కామ్రేడ్సును, మంచి చురుకైన సభ్యులను ఎంపికచేసి తీసుకొని, సుమారు 9 మందితో ఈ జిల్లా దళాన్ని

ఏర్పాటు చేశారు. ఆ దళానికి భీమిరెడ్డి నర్సింహారెడ్డిగారిని నాయకుడుగా నిర్ణయించారు. ఒక రైఫిలు, కొన్ని షాట్ గన్సు, నాటు తుపాకులు-వీటన్నిటితో దళం ఏర్పడి దాడులు చేయటం ప్రారంభించింది. ఆ దాడుల్లో కొన్ని విజయవంతమయ్యాయి. ఈ విధంగా రావులపెంట, కోటపాడు, చివ్వెముల దాడులతో నల్లగొండ జిల్లాలో కేంద్ర దళానికి ఒక స్వరూపమేర్పడింది. దళంలోని ఆయుధాలన్నీ స్థానికంగా లభ్యమైనవే కావటం దీని ప్రత్యేకత. ఒకటి, రెండు దాడులలో విఫలమైనప్పటికీ, చివరికి ఆయుధాలు లాక్కోవటంలో సఫలమై ఒక కేంద్ర దళ నిర్మాణానికి కావలసిన సాధన సంపత్తిని సమకూర్చుకొని ముందుకు సాగారు.

వరంగల్ జిల్లాలో (ఆనాటి వరంగల్ జిల్లా) కూడా కొన్ని దాడులు జరిగినవి.

ఆ జిల్లాలో ఉన్న ప్రత్యేక పరిస్థితి వలన సరిహద్దుప్రాంతంనుంచి దళాలు దాడిచేయటానికి అవకాశం కలిగింది. తిరువూరు, నందిగామ తాలూకాలు అక్కడి ఖమ్మం, మధిర తాలూకాలకు సరిహద్దుప్రాంతంగా ఉండేవి. ఈ రెండు తాలూకాలు నిజాం పరిపాలనక్రింద లేకుండా యూనియన్ పరిపాలనక్రింద ఉండేవి. అప్పటికి తీవ్రమైన నిర్బంధవిధానం ప్రారంభం కాలేదు. దానివలన ఈ సరిహద్దులో దళాల శిక్షణ, రక్షణ వంటి అన్ని ఏర్పాట్లకు అవకాశం ఉండేది. సరిహద్దు దాటి, దాడి చేసి మళ్ళీ యూనియన్ సరిహద్దుల్లోకి వెళ్ళిపోవటానికి సౌకర్యం ఆ ప్రాంతాల్లో ఉండేది. వీటిని ఉపయోగించుకొని, అక్కడ ఒకదళం ఏర్పడి, కొన్నిదాడులు ఆర్గనైజు చేశారు.

1. పరిటాల దాడి : ఈ పరిటాల నందిగామతాలూకా గ్రామాలమధ్యనున్న జాగీరు ప్రాంతమని, అక్కడి రైతులు జాగీర్దారుకు వ్యతిరేకంగా కొన్ని పోరాటాలు సాగించారని ముందే వివరించాము. పరిటాల జాగీరుక్రిందఉన్న చుట్టుపక్కల గ్రామాలనుండి పన్నులు మాత్రం వసూలుచేసుకునేవారు. అక్కడ తహసీలాఫీసొకటి, పోలీసుస్టేషను ఉండేవి. మామూలు తుపాకులు కలిగిన 10-15 మంది పోలీసులు మాత్రమే అక్కడ ఉండేవారు. ఆవిధంగా అది బలహీనమైన సెంటరు. చుట్టూ వారికి రక్షణవచ్చేవారు ఎవ్వరూ లేరు. వారికి పెట్రోలింగుకు కూడా అవకాశముండదు. వీటన్నిటినీ అవకాశంగా తీసుకొని పోలీసుస్టేషనుమీద దాడి చేయ

టానికి అక్కడి దళం నిర్ణయించుకుంది. ఆ దళ నాయకత్వాన ఒకరాత్రి వెళ్ళి దాడిచేయగానే పోలీసులు లొంగిపోయారు. ప్రతిఘటన ఏమీ లేకుండినది. తుపాకులు దొరికినాయి. పోలీసులను నిరాయుధులనుచేసి పంపించేయటంతో ఆ సమస్య పరిష్కారమైంది. దొరికినవి మామూలు తుపాకులే. (బహుశా మస్కెట్స్ లేదా నాటు తుపాకులు కావచ్చును) రైఫిళ్ళవంటి అధునాతనమైన ఆయుధాలు దొరకలేదు. అయినా ఈ దాడికి రాజకీయ ప్రాధాన్యత ఉన్నది. అక్కడి గ్రామ ప్రజల్లోనే కాక, చుట్టుపక్కల గ్రామాల ప్రజల్లోకూడా సంచలనం కలిగించింది. ఈ దాడి గురించి విస్తృతంగా ప్రచారం చేశారు. అదే విధంగా మధిర, ఖమ్మం తాలూకాల్లో కూడా ఈ దాడిని గురించి బాగా ప్రచారం చేసి ప్రజలను ఉత్తేజ పరచటానికి ప్రయత్నం చేశారు. ప్రజలు ఉత్తేజ పడినారు కూడా. ముందు ముందు దాడులకు కావలసిన భూమిక ఏర్పడింది.

2. తిరువూరు సరిహద్దుల్లో పోలీసుల లారీపై దాడి: ఈ సందర్భంలోనే తిరువూరు ప్రాంతం సరిహద్దుల్లో ఉన్న ఒక దళం వెళ్ళి దాడులు చేసిన ఘటనలు కూడా వున్నాయి. ఒక గ్రామంలో పోలీసులు కూలీలను వెంట తీసుకొని రోడ్డు వేయించటానికి వస్తుండేవారు. ఉదయం వచ్చి పని చేయించుకొని సాయంత్రం తిరిగి వెళ్ళిపోతూ ఉండేవారు. స్థానిక పార్టీ, గ్రామ సంఘం కూలీలను పని చేయనివ్వరని వారికి రక్షణగా ఊళ్ళోకి పోలీసులు వస్తుండేవారు. అక్కడి దళానికి ఈ విషయం తెలిసింది. తెలిసిన సమాచారాన్ని బట్టి ఒక లారీలో పోలీసులు వస్తారు. మరొక లారీలో కూలీలుంటారు. చాటున కూర్చుండి కూలీల లారీని వెళ్ళనిచ్చి, పోలీసుల లారీమీద దాడి చేస్తే, ఆయుధాలు దొరుకుతాయి, పోలీసులను చిందర వందర చేయవచ్చునని దళం ప్లాను వేసింది. బహుశా పోలీసులకు ఈ సంగతి తెలిసింది. సంచలనాన్ని బట్టి కనిపెట్టి ఉంటారు. రెండు లారీల్లోనూ పోలీసులు, కూలీలు ఉండే విధంగా పోలీసులు విభజించారు. రెండు లారీల్లోనూ కూలీలుండటంతో దళం కాల్పులు సాగించటానికి సాధ్యం కాలేదు. పోలీసులు వీరిని చూసి కాల్పులు జరిపారు. తర్వాత ఒక లారీ ముందుకు వెళ్ళిపోయింది. ఒక లారీవెనకకు వెళ్ళిపోయింది. ముందుకుపోయే లారీలోని పోలీసులు వీరిని తప్పించుకొని ముందుకువెళ్ళి కూలీలను వదిలి, కాల్పులు సాగిస్తూ తిరిగి వెళ్ళిపోవటానికి ప్రయత్నం చేశారు. అప్పుడు దళంలోని కామ్రేడ్సు వారిమీద కూడా కాల్చారు. రెండువైపులా కాల్పులు జరిగాయి. దళం

ఒక గ్రెనేడ్ వేస్తే దానితో నలుగురు పోలీసులు చచ్చారని ఒక వార్త వచ్చింది. అయినా ఈ దాడిలో ఆయుధాలేమీ దొరకలేదు. పోలీసులు తిరిగి వెళ్ళిపోయారు. ఈ సంఘటన పగలు జరిగింది. పగలు జరిగే దాడులలో అంత తేలికగా దొరకరు. రెండవది : కూలీలు, పోలీసులు కలిసి ఉన్నప్పుడు పోలీసుల మీద విడిగా కాల్చటం సాధ్యం కాదు. దీనితో దళాలకు ఇబ్బందికరమైన పరిస్థితి ఏర్పడుతుంది. దళ సభ్యులు, దళ నాయకులు దీనిని గమనించకుండా దాడి చేయటానికి ప్రయత్నం చేశారు. ఆయుధాలు సంపాదించ టంలో విఫలమయినప్పటికీ, పోలీసులను విడదీసి, గ్రెనేడ్ వేసి నలుగురిని చంపి వేయటం (ఆ వార్త నిజమైతే) పెద్ద విశేషమే. పోలీసులు భయపడి, గుండె నిబ్బరం కోల్పోవటానికి ఆ దాడి ఉపయోగపడుతుంది. ప్రతి దాడిలో ఆయుధాలు ఎన్ని వచ్చినాయి అని లెక్క చూసుకోవటం సరైనదికాదు. మొదటి దశలో పోలీసుల గుండె నిబ్బరాన్ని పోగొట్టటం అనేది ప్రధాన కార్యక్రమంగానే ఉంటుంది. ఈ దృష్టితో ఆ ఎత్తుగడద్వారా దీనిని సాధించారా లేదా అని ఆలోచిస్తే, సాధించారని చెప్పవచ్చును. ఆ మేరకు ఈ దాడి విజయవంతంగానే జరిగిందని చెప్పవచ్చును.

3. మీనవోలు సంఘటన: మరొక సంఘటన పూర్తిగా దళానికి సంబం ధించినదికాదు. మరోవిధంగా జరిగింది. బహుశా అది మీనవోలు గ్రామం కావచ్చును. రజాకార్లను వెంటతీసుకొని ఒక సార్జంటు గ్రామానికి వచ్చాడు. ప్రజలు వెంటబడి తరిమేశారు. రజాకార్లు పరిగెత్తారు. ఈ సార్జంటుని కూడా తరిమితే అతడు తన దగ్గరున్న రైఫిల్‌తో కాల్చాడు. దగ్గరకు వచ్చిన ప్రజల మీద రివాల్వర్‌తో కాల్చాడు ప్రజలు కొందరు చనిపోయారు. అయినా ప్రజలు ధైర్యం చెడకుండా అతడి వెంటపడి పట్టుకొని చంపివేసి, అతని దగ్గరున్న ఆ రైఫిలును, రివాల్వరును స్వాధీనం చేసుకున్నారు. ఒక రివాల్వరును దగ్గరున్న కాంగ్రెసు క్యాంపుకు, ఒకటి పార్టీకి పంపించారు. అంటే అక్కడున్న ప్రజలు, ప్రజలకు నాయకత్వం వహించిన వారు అటు కాంగ్రెసువారికీ, ఇటు పార్టీకి ఇద్దరికీ అభిమానులుగా ఉన్నట్టు కన్పిస్తుంది. లేక స్థానిక నాయకత్వం కాంగ్రెసుకు అనుకూలంగా ఉండి ఉంటుంది. సాధారణ ప్రజలు పార్టీకి అనుకూలంగా ఉండటం వలన వారిలో వారికి తగాదా లేకుండా ఉండటానికి ఒక ఆయుధం అటు, ఒక ఆయుధం ఇటు పంపించే ఏర్పాటు చేశారు.

4. స్టేషను గేటువద్ద పోలీసుదళంపై దాడి : వరంగల్ జిల్లా దాడుల్లో మరొకటి మధిర దగ్గర సరిహద్దుప్రాంతంలో ఒక స్టేషనుగేటుదగ్గర జరిగింది. అక్కడ ఉండే వాచ్‌మన్ తదితరుల రక్షణకొరకు రైఫిళ్ళు కలిగివున్న కొందరు పోలీసులను పెట్టారు. ఆసంగతి తెలుసుకొని దళం సరియైన ప్లానుతో రాత్రిపూట వెళ్ళి ఆ పోలీసులపై గ్రెనేడ్ విసిరింది. ఆ గ్రెనేడు దెబ్బకు ముగ్గురు లేక నలుగురు పోలీసులు చనిపోయినట్టు తెలిసింది. ఇతరులంతా చిందరవందరైన పరిస్థితుల్లో వెళ్ళి మూడు, నాలుగు రైఫిళ్ళను సంపాదించుకొని, సురక్షితంగా తమ ప్రదేశానికి చేరుకున్నారు. ఆ దళానికి నాయకత్వం వహించింది మంచికంటి రాంకిషన్‌రావుగారు. ఆయనకు కొంత మిలటరీ శిక్షణ కూడా ఉంది. సరైన పోరాట పద్ధతులతో ప్లానువేసి, దానిని జయప్రదంగా అమలుజరిపిన దాడి ఇది. మంచి ఫలితాలు కూడా వచ్చాయి.

ఈ విధంగా అక్కడ జరిగిన ఈ నాలుగు దాడులు చాలా ముఖ్యమైనవి.

5. మధిర ప్రాంతంలో జరిగిన ఒక తప్పు : కొద్దిరోజులతర్వాత మధిర ప్రాంతంలో ఒక తప్పు జరిగింది. సైగల్ అనే యువకుడైన ఒక ఇంజనీరు రైల్లో ప్రయాణం చేస్తున్నాడు. రైలు బహుశా మధిరలో ఆగింది. ప్రభుత్వోద్యోగి కాబట్టి అతనిమీద కాల్చవచ్చునని గురిచూసి కాల్చారు. వెంటనే అతను చనిపోయాడు. పార్టీమీద దుష్ప్రచారం చేయటానికి ప్రభుత్వానికి మంచి అవకాశం దొరికింది. రెండవది : అతను ఉత్తరహిందుస్థానానికి చెందినవాడు; హిందువు కూడా. ఉత్తరహిందుస్థానానికి చెందిన హిందువులు నిజాంకు వ్యతిరేకంగాఉంటూ కాంగ్రెసుపార్టీకి కొంత సహాయం చేస్తుండేవారు. వారికి పార్టీ పట్ల అభిమానం లేకుండా చేయటానికి ఈ సంఘటనను ప్రభుత్వం పెద్దఎత్తున ఉపయోగించుకున్నది. అతని శవాన్ని పెద్దరాచమర్యాదలతో హైదరాబాదులో ఊరేగించి అంత్యక్రియలు ఏర్పాటుచేసింది. ఇది అక్కడి పార్టీవారు, దళంవారు చేసిన పెద్ద తప్పు. నిరాయుధులుగా ఉన్నప్పుడు, పార్టీమీద లేక దళాలమీద దాడుల్లో పాల్గొననప్పుడు ప్రభుత్వోద్యోగుల మీద దాడులు చేయటం తప్పవుతుంది. ఈ అంశాన్ని గమనించకుండా చేసిన ఈపని పార్టీకి నష్టం కలిగించింది. ముఖ్యంగా హైదరాబాదులో పార్టీ కొంత దెబ్బతింది.

రేణిగుంట పోరాటం : భువనగిరి ప్రాంతంలో జరిగిన రేణిగుంట దాడి పోరాటం కొంత ముందుకు సాగిన తర్వాతనే జరిగింది. హైదరాబాదుకు సమీపంగా భువనగిరి తాలూకాలో ఉంది ఈ గ్రామం స్థానిక భూస్వామి మరీ పెద్ద భూస్వామికాదు. మధ్యరకపు భూస్వామి. అతని పేరు రామిరెడ్డి. పార్టీతో కూడా అతనికి సంబంధముండేది. ఆ ప్రాంతమంతా పార్టీ ప్రభావం ఉండేది. కానీ ఉద్యమం లోతుగా వెళ్ళలేదు. భూమి పంపకం జరుగలేదు. ఉద్యమం కూడా బలహీనంగా ఉన్నది. అక్కడి గ్రామాలు జాగీరు ప్రాంతం చుట్టుపక్కల గ్రామాలు. జాగీరుకు వ్యతిరేకంగా పోరాటాలు నడిచినాయేకాని, నిర్మాణ యుతమైన ఉద్యమం అప్పటికి ఏర్పడలేదు. నిజాం వ్యతిరేక ఉద్యమం రావటంతో రజాకార్ల దాడులనుంచి గ్రామాలను, ప్రజలను రక్షించుకోవాలని ఊళ్ళో ఉన్న భూస్వాములు కూడా ఆ రోజుల్లో పార్టీతో సహకరించారు. ఇతనొక దళాన్ని ఏర్పాటు చేసుకున్నాడు. ఆ దళంలో గ్రామ ప్రజలు, కొందరు యువకులు ఉండేవారు. ఇతను దళానికి నాయకుడుగా ఉండేవాడు. రైఫిల్, ఇతర ఆయుధాలు కూడా దగ్గర పెట్టుకొని చుట్టూ మామూలుగా తిరిగివచ్చి, తన గ్రామానికి వచ్చిపోతున్నాడు. ఇతను ఇంటికి వచ్చిన సమాచారాన్ని అందుకొని రజాకారు నాయకుడైన స్థానిక జాగిర్దారు ఏజెంటు రజాకార్లను, పోలీసులను వెంటపెట్టుకొని వచ్చి, దళంపై దాడి చేయటానికి గ్రామంలోకి ప్రవేశించారు. వారు వచ్చిన సంగతి దళానికి తెలిసింది. గెరిల్లా పద్ధతుల్లో తప్పుకోవటానికి సమయం ఉండింది. ఆ ఇంటి ప్రదేశం కూడా తప్పుకోవటానికి అనుకూలంగా ఉండింది. స్థానికుల సహకారం కూడా ఉంది. కాని తప్పుకోవటానికి బదులుగా వీరితో అటో ఇటో తేల్చుకోవాలనుకున్నాడు. ఇంటిదాకా రానిచ్చి ఇంట్లోనుంచి కాల్పులు సాగించాడు. తుపాకీ మందుగుండు సామగ్రి తగినంతగా ఉంది. దళాన్ని తన మేడలోనే ఉండిపొమ్మనమని (తన మేడ పెద్దదేంకాదు, కొద్దిపాటిదే) ఆ మేడలో వివిధ చోట్ల ఉన్న కిటికీలను, బయటికి కాల్చటానికి వీలున్న గోడల్లో ఉన్న రంధ్రాలను ఉపయోగించుకొని శత్రువుపై కాల్చటానికి అన్ని ఏర్పాట్లు చేశాడు. మందుగుండు సామగ్రి తగినంతగా ఉండటంవలన చాలాసేపు వారిపైన కాల్పులు సాగించాడు. ఆ కిటికీ వైపుకి తగిలేవిధంగా వారు ఇంటిమీదికి కాల్పులు చేశారు. గోడలమీద రైఫిలు గుండ్లను పెద్దఎత్తున కాల్చి చిందరవందర చేయటానికి ప్రయత్నం చేశారు. దళంవారు కూడా చివరంటా కాల్పులు కాల్చారు. మందుగుండు సామగ్రి

చివరికి రావటంతో రామిరెడ్డి దళానికి ఏంచేయాలనే సమస్య వచ్చింది. అప్పుడు మిగిలిన ఉన్న కొద్దిపాటి మందుగుండుతో ఇంటినుండి బయటపడి బాహాబాహీ యుద్ధంకోసం ప్రయత్నం చేశారు. రజాకార్లు, పోలీసులు ఎక్కువ సంఖ్యలో ఉండటం వలన వీరిని దెబ్బతీసి, పట్టుకొని, కాల్చివేశారు. ఈ సంఘటనను గురించి పెద్దఎత్తున ప్రచారం జరిగింది. చుట్టుపట్ల అతని పేరుకూడా పెద్దఎత్తున ప్రచారంలోకి వచ్చింది. అయితే ఈ సంఘటన గురించి వివిధరకాల కథనాలు మాత్రం ఉన్నాయి. రజాకార్లు, పోలీసులు రాత్రి సమయంలో దాడికి వచ్చారని, వీరు ప్రారంభం నుంచి బాహాబాహీ యుద్ధంలో తలపడ్డారని ఒక కథనం. ఇంకా ఎన్నో విధాలైన కథనాలున్నాయి. ఆ గ్రామానికి వెళ్ళి పరిశీలించి చూస్తే, ఆ గోడలనిండా తుపాకీ గుండ్లు తగిలి, గుంటలు పడిన గుర్తులు ఇప్పటికీ కనిపిస్తాయి. అవి మనకు తిరుగులేని నిదర్శనం. పోలీసులు, రజాకార్లు ఆయన ఇంటిమీద కాల్చారనీ, ఆయన ఇంట్లో ఉండి కాల్పులు సాగించాడనీ కనిపిస్తుంది. గెరిల్లా పోరాట పద్ధతులపై ఆధారపడి పోరాడలేదని ఈ దాడిలో కనిపిస్తుంది. అతను భూస్వామి అయినప్పటికీ, గ్రామాలలో కూడా ఈ దళానికి మంచి పేరే వచ్చింది. ప్రజల సహాయ, సహకారాలు ఉండటంవలన శత్రువులు వస్తున్నారని వారు రాకముందే ఇతనికి తెలిసింది. తెలిసి, తప్పుకోవటానికి వీలుండి కూడా తప్పుకోలేదు. మధ్యయుగాలనాటి యుద్ధ నైపుణ్యం, ఆ సూత్రాలకు సంబంధించిన ఫ్యూడల్ వీరత్వంతో ఆయన ఆ విధంగా చేశారు 'శత్రువుకు తల ఒగ్గకూడదు, తప్పుకోకూడదు, శత్రువుకు వెన్ను చూపకూడదు. విజయమో, వీరమరణమో— అది యుద్ధభూమిలోనే తేల్చుకోవాల'నేది ఫ్యూడల్ నీతి. దీని ననుసరించే పనిచేశారు. బలానికి మించిన శత్రువులు ఉన్నప్పుడు వెనక్కితగ్గి, మనకు బలమున్న స్థానంలో చేరి శత్రువును దెబ్బతీయాలనేది గెరిల్లా పోరాట సూత్రము. ఈ పోరాటంలో అతడు దీనిని అనుసరించలేదు. భూస్వాములు దళాల్లోకి వచ్చి, దళ నాయకత్వంతో ఉన్నప్పుడు భూస్వాముల మనస్తత్వం, వారి నీతి నియమాలు, వారి పద్ధతులు అమలులోకి వచ్చేతీరును దీనిలో మనం చూడవచ్చును. వారికి గెరిల్లా సూత్రాలు చెప్పినా అర్థంకావు. అర్థమయినా అవి తప్పనుకుంటారు. దానివల్ల శత్రువుకు లోకువవుతామనీ, ఇంకా అటువంటి ఆలోచనలతో వారు వాటిని అనుసరించరు. గ్రామాలలో ఇప్పటికీ ఇటువంటి లక్షణాలు కన్పిస్తుంటాయి. పార్టీ నాయకత్వంలోకూడా 'వెనకాముందు చూడ

కూడదు. అటో ఇటో తేల్చుకోవాలి' అనే పద్ధతులలో ఆలోచిస్తుంటారు. మరో విషయమేమంటే ఈ ప్రాంతాల్లో ప్రజా ఉద్యమం బలహీనంగా ఉంది. భూస్వాముల నాయకత్వాన ఉంది. భూమి పంపకం జరగలేదనే విషయం దీనికి తార్కాణం. ఈ పరిస్థితులలో ప్రజల్లోకూడా 'తప్పుకోవాలి. తప్పుకొని యుద్ధం చేయాలి'-అనే ఆలోచనరాదు. భూస్వాములు యుద్ధం చేసిన పద్ధతినే, 'విజయమో, వీరమరణమో' అన్న సూత్రాన్నే వారూ అనుసరిస్తారు. ఇక్కడ కూడా అదే జరిగింది.

అతను గెరిల్లా పోరాటసూత్రాలను అనుసరించి ఉంటే, తప్పుకోవటానికి అవకాశమున్నప్పుడు తప్పుకొని, వారిమీద వెనుకనుంచి దాడిచేయటానికి కూడా వీలుండేది. అప్పుడు వీరికున్న బలం, ఆయుధసామగ్రితో శత్రువును చిందర వందరచేసి చెదరగొట్టటానికి అవకాశముండేది. దళం క్షేమంగా ఉండేది. శత్రువులు దెబ్బతినేవారు. అటువంటి పద్ధతికి రామిరెడ్డి పూనుకోలేదు. మరోపద్ధతి అనుసరించి వీరమరణం చెందాడు. ఇలాంటి బాహాబాహీయుద్ధాలు తెలంగాణా పోరాటంలో పెద్ద సంఖ్యలోనే జరిగినవి. వాటిని మనం వివిధ సందర్భాల్లో చూడవచ్చును.

కరీంనగర్ జిల్లాలో ప్రభాకరరావు దళం : కరీంనగర్ జిల్లాలో ప్రభాకర రావు ఒక ముఖ్యమైన జిల్లా నాయకుడు. అతని నాయకత్వంలో దళం ఏర్పడి ముందు ప్రచారంచేశారు. తర్వాత పోలీసులమీద దాడిచేయటానికి సిద్ధమయ్యారు. వారందరికీ గెరిల్లా పోరాట పద్ధతుల్లో శిక్షణఉన్నా, ఉత్సాహంవలన కానీ, సరైన అవగాహన లేకపోవటంవలనకానీ, మిలటరీ దుస్తుల్లోనే ఉంటూ, ఎప్పుడూ పెరేడ్ చేస్తూ, తిరుగుతూ ఉండేవారు. ఈవిధంగా గుట్టల్లోఉన్న ఒక సందర్భంలో పోలీసులకు, మిలటరీ వారికి తెలిసి గుట్టను చుట్టుముట్టారు. అయినా దళం తప్పుకోవటానికి ప్రయత్నం చేయలేదు. అవకాశముందా లేదా అన్నది వేరే విషయం. ఎలాఉన్నా తప్పుకోవటానికి ప్రయత్నం చేయవచ్చు. అలాంటిది చేయక ఆ మిలటరీ దుస్తుల్లోనే ఉండి, వారితో పోరాటం సాగించారు. కొంతసేపు గడచిన తర్వాత, వీటికి రక్షణలేకుండా ఉండటంతో, పోలీసులు, మిలటరీవారు ఈ మొత్తం దళాన్ని కాల్చివేసి తుడిచిపెట్టగలిగారు. కామ్రేడు ప్రభాకరరావు చనిపోయాడు. ఆ దళం పోవటం, నాయకుడు కూడా పోవటంవలన ఆ జిల్లాలో తీవ్రమైన నష్టం జరిగింది. కొంతకాలందాకా పోరాటాన్ని పునరుద్ధరించడానికి కూడా అవకాశం లేకపోయింది. నిజాం వ్యతిరేక పోరాటం చివరిదశలో ఇతర

జిల్లాలనుండి ఆ ప్రాంతాలకు దళాలు కొంతవరకు విస్తరించాయి. స్థానిక దళాలను కూడా కలుపుకొని మళ్ళీ పోరాటం సాగించగలిగాయి. కానీ అప్పటికిమాత్రం నష్టం కలిగింది.

కామ్రేడు ప్రభాకరరావు పార్టీ సభ్యుడు, పార్టీ నాయకుడు. చాలా తెలివి గలవాడు కూడా. ఒకమేరకు చదువుకున్నవాడు. త్యాగశీలి. భూస్వామ్య కుటుంబం నుండి వచ్చినవాడు. అతనికి ఈ గెరిల్లా పోరాట శిక్షణఉన్నా, అవగాహన లేకపోవటం వలన ఎదురుబడి బాహాబాహీయుద్ధం (positional warfare) కోసం తలపడటం జరుగుతూ వచ్చింది. ఆకాలంలో మొదటిదశల్లో చాలా పెద్దఎత్తునే ఈ ధోరణి అక్కడి పార్టీలో, దళాల్లో ప్రవేశించింది. రజాకార్లు ఒకగుంపుగా రావటం, వారిదగ్గర నాటుఆయుధాలుండటం, మిలటరీ నైపుణ్యం లేకపోవటంతో రెండుదెబ్బలు తీసేవరకు వారు వెళ్ళిపోవటం దీనికొకకారణం. ఇది కొంతకాలం తర్వాతనే జరిగింది. మొదటిరోజులలో రజాకార్లను దెబ్బతీయటానికి పీరు భయపడేవారు. దళాలు లేకపోతే రజాకార్లు గ్రామాలమీదపడి పెద్దఎత్తున విధ్వంస కార్యక్రమాలు చేస్తుండేది. క్రమంగా దళాలు రజాకార్లను భయపెట్ట గలిగిన స్థితికి వచ్చాయి. ఈ స్థితిలో ఈ దళాలు మిలటరీ దుస్తులు, బూట్లు వేసుకొని, పెరేడ్ చేసుకుంటూ, శత్రువుతో ఎదురుబడి పోరాటం జరిపేవి. ఆదశలో శత్రువుకు కావలసిందీ ఇదే. మన దళాలను ఎదురుబడి ఎదుర్కోవటం వారికి తేలికవుతుంది. అందువలన వారు తేలికగా దెబ్బతీయగలిగారు. ఈ దళాలు బలమైన గ్రామాల్లో మకాంవేసుకొని రాత్రివేళల మాటుదాడులు సాగిస్తూ, ఒకవేళ పగటివేళల దాడులు సాగించినా శత్రువును భయపెట్టటానికి, అలసట కలుగజేయటానికి పరిమితమైతే, కొన్నాళ్ళకు వారి మనోనిబ్బరం దెబ్బతింటుంది. ఆతర్వాత పెద్దఎత్తున దాడిచేయటానికి అవకాశముంటుంది. దీనికి విరుద్ధంగా ప్రారంభంలోనే బాహాబాహీ పద్ధతులు అనుసరించటంవలన నష్టాలు జరిగినవి.

సమీతు : వరంగల్‌లో ముఖ్యంగా మధిర ప్రాంతంలో నష్టాలేమీ జరుగలేదు. కొన్ని ఆయుధాలు దొరికినవి. నల్లగొండ జిల్లాలో మొదటి దాడిలో నష్టపడ్డారు. రెండవ దాడిలో ఆయుధాలు దొరకక పోయినా, కనీసం నష్టం లేకుండా వెనకకు తగ్గటానికి (retreat) అవకాశం కలిగింది. మూడవ దాడిలో చాలా కీలకమైన ఆయుధాన్ని సంపాదించుకొని తర్వాత కాలంలో దాడులు చేయటానికి ఒక సరియైన పునాది వేసుకోగలిగారు. భువనగిరి తాలూకాలో జరిగిన రేణిగుంట పోరాటం

బాహా బాహీ పద్ధతిలో జరగటంతో నష్టదాయకంగా తయారైంది. కరీంనగర్ జిల్లాలో బాహాబాహీ పద్ధతులలో పోరాడటంతో ఒక ముఖ్యనాయకుడు, అతని దళం తుడిచి పెట్టుకుపోయింది. అంటే ప్రారంభదశలో చూసినప్పుడు, గెరిల్లా పోరాట పద్ధతులలో అందరికీ శిక్షణ ఇచ్చినప్పటికీ, ఆచరణలోకి వెళ్ళేవరకు ఆ పద్ధతులను ఏ విధంగా ఉపయోగించాలనే విషయంలో దళాలకు సరియైన అవగాహన లేకుండినది. అవగాహన ఉన్నంతవరకు ఉపయోగించుకున్నారు. సరిహద్దు ప్రాంతాలనుంచి వచ్చి దాడులు చేయటానికి ఉన్న సౌకర్యాన్ని ఉపయోగించుకున్నారు. మాటున ఉండి దాడి చేయటం వలన మంచి ఫలితాలు వచ్చినవి. బాహా బాహీ యుద్ధానికి తలపడిన చోట్ల విజయం సాధించలేదు. ఇవి ఈ దశలో సాధించిన విజయాలు, వచ్చిన అనుభవాలు, గుణపాఠాలు.

ఈ విధంగా వివిధ ప్రాంతాలలో దాడులు జరుపుతూ, వచ్చిన అనుభవాలను సమీక్షించుకుంటూ పురోగమించారు. ఈ దశవరకూ పెద్దఎత్తున ఆయుధాలు సమకూరలేదు. సెంటరునుంచి కానీ, మరోచోటు నుంచి కానీ ఆయుధాలను అందించలేదు. జరిగినదంతా గెరిల్లా పోరాట శిక్షణ, దానికి అనుగుణ్యంగా స్థానికంగా దొరికిన ఆయుధాలు. ఈ పరిస్థితి ముఖ్యంగా లోతట్టు ప్రాంతాలలో ఉన్నది. సరిహద్దుల్లో ఉన్నవారికి కొన్ని సౌకర్యాలుండినవి. దాడులుచేసి ఆయుధాలను సంపాదించుకోవటానికి వారికి అవకాశముండినది. సరిహద్దున ఉన్న దళాలు ఈ అవకాశాలను బాగా ఉపయోగించుకున్నారు. అదే విధంగా హైదరాబాదు దగ్గరలో ఉండే గ్రామాలవారికి కూడా కొన్ని అవకాశాలు ఉండినాయి. ఈ గ్రామీణ ప్రాంతాల్లో పెద్దఎత్తున భూస్వామ్య వ్యతిరేక పోరాటాలు లేకపోవటంతో భూస్వాములు కొంత సానుభూతి చూపించారు. రజాకార్ల ఒత్తిడికూడా హైదరాబాదు చుట్టుపట్ల ప్రాంతాల్లో ఎక్కువగా ఉండేది. దాని ఫలితంగా భూస్వాముల్లో కొందరు ఈ ప్రతిఘటనోద్యమంలో చేరారు. వారు స్వయంగా డబ్బున్నవారు. హైదరాబాదునుండి ఆధునిక ఆయుధాలను సేకరించటానికి ఈ వనరులను వాడుకున్నారు. లోతట్టు ప్రాంతాల వారికి అవకాశాలేవీ లేకుండినవి.

## ప్రజల సమస్యలను పరిష్కరించే సమయంలో జరిగిన దాడులు :

దళాలపై జరిగిన దాడులన్నీ రాజకీయ ఆర్గనైజర్లు, దళాలు వారి వారి ప్రాంతాల్లో, గ్రామాల్లో ప్రజల సమస్యలను పరిష్కరించటానికి కూర్చున్న సమయంలో కానీ, బహిరంగ సభలు, సమావేశాలు ఏర్పాటు చేస్తున్న సమయంలో కానీ జరిగినవే.

నల్లగొండ జిల్లా, హుజూర్‌నగర్ తాలూకా

చింతలమ్మగూడెంలో దళంపై దాడి : చింతలమ్మగూడెం హుజూర్‌నగర్ తాలూకాలో పెదవీడుదగ్గర ఉండే చిన్న గ్రామం. కృష్ణానదికి దగ్గరలో ఉంటుంది. ఈ గ్రామంలో భూస్వాములకు వ్యతిరేకంగా వ్యవసాయ కూలీ సమ్మె జరిగింది. ఇందులో వ్యవసాయ కూలీలుగా ఉన్న ముస్లింలు కూడా పాల్గొన్నారు. దాని ఫలితంగా హిందూ, ముస్లిముల మధ్య ఏర్పడిన ఐక్యత స్థానిక ముస్లిం నాయకులకు రజాకారు నాయకులకు గిట్టలేదు. దానిని విచ్ఛిన్నం చేయటానికి ప్రయత్నంచేశారు. దీనితో గ్రామంలో ఇంతకుముందే భూస్వాములకు, వ్యవసాయకూలీలకు మధ్యఉన్న ఉద్రిక్తతకు ఈ ముస్లిం నాయకుల పట్ల వ్యతిరేకత కూడా తోడయి సంఘర్షణకు దారితీసే పరిస్థితులు ఏర్పడినవి. ఏమైనా ఈ ఐక్యతను నిలబెట్టుకోవటానికి ఆర్గనైజరుతో పాటు దళం అక్కడికి వచ్చింది. ప్రజలను సమావేశ పరచి, మాట్లాడి వారి సమస్యలను పరిష్కారం చేయాలని కూర్చున్నారు. ఆ సమయంలో రజాకార్లు, పోలీసులు దాడిచేశారు. దళం ఒకరిని సెంట్రీగా ఏర్పాటు చేస్తే ఆయన ఆ పని సరిగా చేయలేదు. వీరు అజాగ్రత్తగా ఉండటం వలన శత్రువులు వచ్చిన తర్వాత అప్పటికప్పుడే తయారై ఎదుర్కోవలసి వచ్చింది. వారిని ప్రజల సహాయంతో ఎదుర్కొన్నా, వారు ముందుకు నెట్టుకొని వచ్చారు. దళం వెనక్కు తగ్గి, తిరిగి దాడి చేయటానికి ప్రయత్నించింది. సమయానికి సిద్ధంగా లేకపోవటం వలన ఏర్పడిన గందర గోళంలో ఒకరిద్దరు ముఖ్యమైన కామ్రేడ్సు చనిపోయారు. మరొక కామ్రేడు మాటున ఉండి, పొజిషను తీసుకొని కాల్చటానికి సిద్ధంగా ఉన్నప్పుడు, ఒక దళ సభ్యుడు ద్రోహం చేసి, అతనిని పొడిచి, గాయ పరిచి శత్రువుపై దాడిచేయకుండా చేశాడు. (అతను మిలటరీ నుంచి వచ్చిన ఒక వ్యక్తి. ఈ కారణం వలన అతనిని దళంలోకి తీసుకున్నారు.) దీని తర్వాత కూడా ఈ దాడిలో రెండువైపులా కాల్పులు జరిగినవి. ఈ దాడిలో దళానికిచెందిన ముఖ్యమైన కామ్రేడ్సు చనిపోయారు. దీనివలన చాలా నష్టపోవటమేకాక, పార్టీలో చాలా తీవ్రమైన పరిస్థితి ఏర్పడింది. అటువైపున కొద్దిపాటి నష్టాలు జరిగినవి.

పెదవీడు క్యాంపుపై దళాల దాడి : మొదట రావులపెంట దాడిలో ఇద్దరు కార్యకర్తలు (కామ్రేడ్సు వెంకటరెడ్డి, దేవబత్తిని వెంకటేశ్వరరావు) చనిపోయారు. ఆ తర్వాత పైదాడిలో కూడా నష్టపడడంతో పార్టీలో ఏర్పడిన నిరుత్సాహాన్ని పోగొట్టటానికి రజాకార్ల క్యాంపుమీద దాడిచేయాలని నిర్ణయించుకున్నారు. చుట్టుపట్ల

ఉన్న ముఖ్యమైన స్థానిక దళాలన్నిటినీ దీనికొరకు సమీకరించారు. రఘునాథ పాలెం అని దగ్గరలో ఉన్న గ్రామంలో రజాకార్లు క్యాంపువేసి ఉన్నారు. చింతలమ్మగూడెం దాడి తర్వాత రఘునాథ పాలెం క్యాంపును ఖాళీచేసి రజాకార్లంతా పెదవీడు చేరారు. వారితోపాటు పోలీసులు, మిలటరీ కూడా ఉన్నారు. అక్కడొక పెద్ద భూస్వామి ఉంటాడు. పెదవీడుకు మారటానికి కారణం అతని అండ కావచ్చును; లేక అది ఇతర విధాల అనుకూలమైన ప్రదేశం కావచ్చును. వారిమీద దాడి చేయటానికి ఈ దళాలన్నీ కలిసి ఒక ప్లాను ప్రకారంగా ముందుకు వెళ్ళి వారు అజాగ్రత్తగా ఉన్నప్పుడు దాడి చేశారు. వారుకూడా అప్పటికప్పుడు ఎదురు కాల్పులకు తయారయ్యారు. ఈవిధంగా సంఘర్షణ కొన్ని గంటలపాటు జరిగింది. ఇది జరుగుతున్నప్పుడు దళాలు ముందుకు సాగి, కోటపాడు అనుభవాలు చూసుకుని, వారిని ఇళ్ళనుండి బయటికి రప్పించటానికి అందుబాటులో ఉన్న గడ్డి, చొప్పలాంటివి తీసుకొచ్చి తగల బెట్టారు. ఈ ప్రయత్నం కొంత ఫలించింది. ఇదంతా ఒక ప్లాను ప్రకారం చేయటంవలన ఇటు దళాలు నష్టపడలేదు. తుదకు వారు బయటకు రాక తప్పలేదు కొందరు రజాకార్లు చనిపోయారు. తక్కినవారు లొంగిపోలేదు కాని, కాల్పులు ఆపేశారు. దానితో సంఘర్షణ పూర్తయింది. వాళ్ళు కాల్పులు ఆపేశారు. దళాలు ఊరేగింపు చేసి, జయజయ ధ్వానాలు చేసుకుంటూ వచ్చేశారు. వీరు వెళ్ళిపోయిన తర్వాత మళ్ళీ మిలటరీ, రజాకార్ల గుంపు వచ్చి మృతదేహాలను తీసుకువెళ్ళారు.

సూర్యాపేట తాలూకాలో జరిగిన కొన్ని దాడులను గురించి తెలుసుకుందాం.

**కందగట్లలో దళంపై దాడి :** కందగట్ల అనేది సూర్యాపేటనుండి జనగామ వెళ్ళే రోడ్డుకు కొద్దిగా లోపలికి ఉన్న ప్రాంతంలోని గ్రామం. గ్రామ సరిహద్దుల్లో కొండల వరుస ఒకటుంటుంది. ఇందులో మూడో, అయిదో పెద్ద కొండలు ఉంటాయి. ఆ కొండలకు క్రింది భాగంలో బావులూ, ఆ బావుల కింద మాగాణి, సాగయ్యే భూములు ఉంటాయి. బావులదగ్గర చెట్లుంటాయి. వీటి మరుగున అక్కడి గ్రామ సమస్యలను కొన్నింటిని పరిష్కరించటానికి అటువైపు వచ్చిన ఆర్గనైజర్లు, దళాలు కూర్చున్నాయి. ప్రజలను పిలిపించి మాట్లాడు

తున్నారు. ఆ సమయంలోనే రజాకార్లు, పోలీసులు, పోలీసు అధికార్లు (బహుశా కలెక్టరు లాంటి పై అధికారులు కూడా ఉన్నారు) వెంబడే వచ్చేశారు. గ్రామంనుంచి వార్తచేరి వారు వచ్చారు. దళాలు అజాగ్రత్తగా ఉన్నాయి. సెంట్రీ ఉన్నా, కనిపెట్టటంలో కొంత ఆలస్యం జరిగింది. బాగా దగ్గరికి వచ్చిన తర్వాతనే చూడగలిగారు. అప్పటికప్పుడు దళం పొజిషన్ తీసుకొని కాల్పులు కాల్చింది. దళం పొజిషన్ తీసుకోవటమంటే దళ నాయకుడు, దళ సభ్యులు ఎవరు ఎక్కడెక్కడ రక్షణ తీసుకొని, ఎక్కడెక్కడ కాల్చాలనేది నిర్ణయించుకొని, దాని ప్రకారం కాల్చుతారు. అక్కడ మూడు పెద్దరాళ్ళు (బోళ్ళు) ఉండేవి. ఈ రాళ్ళన్నింటిని వారు ఆక్రమించుకొని పొజిషన్ తీసుకుంటే, దళం మైదానంలోనే ఉండిపోయి, దానికి రక్షణ లేకుండా పోతుంది. అందుకొరకు ఈ దళం ఆ రాళ్ళను ఆక్రమించు కోవటానికి ప్రయత్నం చేసింది. ఈలోగానే పోలీసులు, మిలటరీ వారు ఒక పెద్ద రాయిని ఆక్రమించేశారు. అది చిన్నపాటి బోడని చెప్పవచ్చును. తక్కినవి కూడా ఆక్రమించేస్తే దళానికి రక్షణ ఉండటం చాలా కష్టమని వీరూ ఒక చిన్న బోడును ఆక్రమించుకున్నారు. దాని చాటునుండి కాల్పులు సాగించటం మొదలు పెట్టారు. ఇంకొక రాయికూడా అందుబాటులో ఉండింది. దానిని కూడా దళమే స్వాధీనం చేసుకుంది. దీనితో వారు రక్షణ తీసుకొని కాల్పులు కాలుస్తుంటే, వీరు మరోవైపునుండి కాల్చటం - ఈ రకంగా రెండు వైపులనుండి కాల్పులు జరిగాయి. ఎవరూ నష్టపోలేదు. దళం కూడా నష్టపోలేదు. కొంతసేపటి తర్వాత పోలీసులు, రజాకార్లు వెళ్ళిపోయారు. ఆ తర్వాత బహుశా పనిని పూర్తిచేసుకొని దళం, ఆర్గనైజరు వెళ్ళిపోయారు.

మామిళ్ళగూడెం క్యాంపుపై దాడి : మామిళ్ళ గూడెం సూర్యాపేట తాలూకా సరిహద్దులో సూర్యాపేట—ఖమ్మం రోడ్డుపై ఉన్న ఒక గ్రామం. రోడ్డు పక్కన ఉండటంతో చాలా కీలకమైన ప్రాంతం. పోలీసులు, రజాకార్లు అక్కడ మకాం వేసి, చుట్టు పట్ల గ్రామాలకు పోయి, వస్తూ ఉండేవారు. గ్రామాలను లూటీలుచేయటం, స్త్రీలను మానభంగాలు చేయటం మొదలైనవి వారి కార్యక్రమం. ఒకసారి వెళ్ళి బుద్ధిచెప్పడం అవసరమని ఇద్దరు, ముగ్గురు దళ సభ్యులు మామూలు దుస్తుల్లో గ్రామంలో ప్రవేశించారు. రాత్రిపూట ఈ పోలీసు, మిలటరీ వారు కబుర్లు చెప్పుకుంటున్న సమయంలో అక్కడికి వెళ్ళి, అకస్మాత్తుగా ఇద్దరు

ముగ్గురి మీద దాడి చేసి వారిని కాల్చేశారు. వారుకూడా అప్పటికప్పుడు తయారై కాల్పులు సాగించారు. రాత్రిపూట కావటం వలన ఈ దళ సభ్యులు ఏమీ నష్టం లేకుండా వెనక్కి రాగలిగారు. దీని ఫలితంగా తుపాకు లేమి లభించకున్నా ఒకరిద్దరు చనిపోయారు. దీనితో వారిలో కలిగిన భయం వలన మరుసటి రోజు నుంచి గ్రామాల మీద దాడులు చేయటం, స్త్రీలను మానభంగం చేయటం, లూటీలు చేయటం లాంటివి ఆగిపోయాయి. ఆ గ్రామంలో కూడా ప్రజలను బలాత్కారం చేయటం లూటీలు చేయటంలాంటి పనులు ఆగిపోయాయి. ఇది ఆ దాడిలో ఉన్న ప్రత్యేకత.

బిక్కుమళ్ళ దగ్గర దాడి : మరోదాడి లోతట్టున ఉన్న ఒక గ్రామం దగ్గర జరిగింది. ఈ గ్రామం పాలేరుపైన ఉంటుంది. దగ్గర కొన్ని ఏర్లు ఉంటాయి. బిక్కుమళ్ళ అనే ఒక ఊరు దగ్గరలో ఉంటుంది. ఆ ఊరు సమస్యలేవో పరిష్కరించటానికి దళం వెళ్ళిన సందర్భంలో రజాకార్లు, పోలీసులు దాడి చేయటానికి వచ్చారు. ముందే వారిని కనిపెట్టి, గ్రామానికి దాడికి వస్తున్నారని తెలిసి దళం ఆ గ్రామంలో ప్రవేశించింది. గ్రామంలో పరిస్థితిని తెలుసుకొని ఊరుబయట దారిలో మాటువేసుకొని కూర్చున్నారు. రాగానే వారిమీద కాల్పులు చేశారు. దీనితో వారు వెనక్కి తగ్గారు. కాల్పులు కాల్చుకుంటూ వెనక్కి పోయారు. దళం వారివెంటబడి వెనక్కితరిమింది. మైదాన ప్రాంతాల్లో రక్షణ చేసుకోవటం చాలా కష్టంగా ఉంటుంది. ఉన్న కొద్దిపాటి రక్షణలు తీసుకొని, కాల్పులు కాల్చుతూ దాడిచేశారు. పోలీసులు, రజాకార్లు కొంతదూరంపోయాక ఒక మామిడితోట వచ్చింది. అందులో జొరబడి అక్కడినుండి కాల్పులు సాగించటం మొదలుపెట్టారు. దళం కూడా ఆ తోటచుట్టూఉన్న కొన్నిచెట్లను చాటు చేసుకొని తిరిగి దాడిచేశారు వారు వెనక్కు వెళ్ళిపోవలసివచ్చింది. కొంతసమయం అయిన తర్వాత దళం తిరిగి వచ్చింది. పెద్దనష్టాలేమీ జరుగలేదు. కానీ రజాకార్లు, పోలీసులు వచ్చిన పనిని దళాలు భగ్నంచేయగలిగాయి.

నశింపేట, నూతనకల్లు గ్రామాల్లో లెవీధాన్యం బండ్లపై దాడులు : లెవీధాన్యం బండ్లమీద దాడిచేసి, పోలీసులనుంచి ధాన్యాన్ని విడిపించిన సంఘటనలు సూర్యాపేట తాలూకాలోని నశింపేట, నూతనకల్లులో జరిగినాయి. ఆ ధాన్యం రైతులకు అప్పగించారు. పోలీసులు భయపడి వెళ్ళిపోయారు.

జనగామ, భువనగిరి తాలూకాలు

ఇప్పటి రామన్నపేట తాలూకా ప్రాంతం కూడా అప్పటి భువనగిరి తాలూకాలో చేరి ఉండేది.

**అనంతపురంలో పోలీసులపై దాడి :** జనగామ తాలూకాకు చెందిన అనంతపురం అనే గ్రామంలో పోలీసులు ఒక స్త్రీని చెరచటానికి ప్రయత్నం చేసిన సందర్భంలో అక్కడున్న దళానికి తెలిసి, వెళ్ళి, జోక్యం కలిగించుకున్నారు. గ్రామంలో పోలీసుక్యాంపు ఉంది. ఆ స్త్రీని ఊరి వెలుపల ఉన్న చెట్లలోకి తీసుకెళ్ళి చెరచటానికి పోలీసులు ప్రయత్నిస్తున్నారు. ఆసందర్భంలో దళం వెళ్ళి పోలీసుల మీద కాల్పులు కాల్చారు. పోలీసులు ఎదురు కాల్పులు కాల్వటం మొదలుపెట్టారు. ఈ కాల్పుల సందర్భంలో ఆ స్త్రీ తప్పుకొని గ్రామంలోకి వచ్చేసింది. ఈలోగా క్యాంపులో ఉన్న పోలీసులు కూడా గ్రామం నుంచి బయటికి వచ్చారు. దళంమీద కాల్పులు కాల్చటానికి ప్రయత్నం చేశారు. దళం ఎదురు కాల్పులు కాల్చి తప్పుకున్నారు.

**చీటకోడూరులో పోలీసులపై దాడి :** ఆదే తాలూకాకు చెందిన చీటకోడూరు గ్రామంలో కొందరు పోలీసులు ఒక మహిళను మానభంగం చేసి తమకు ఎవ్వరూ అడ్డులేరనే ధీమాతో విచ్చలవిడిగా తిరగటం ప్రారంభించారు. ఈ పరిస్థితుల్లో వీరు ఆ గ్రామంలోనే తాళ్ళలోకి వెళ్ళి, కల్లు తాగుతున్న సమయంలో దళం వెళ్ళి దాడిచేసి వారిని పట్టుకుంది. వారిలో ఒకతను పూర్వపు దళ సభ్యుడు. ద్రోహం చేసి పోలీసులతో కలిసినాడు. అతన్ని మందలించి పంపించివేశారు. తక్కిన వారిని కాల్చివేశారు. అతను వెళ్ళి చెప్తే రజాకార్లు, పోలీసులు వచ్చి మళ్ళీ పెద్దఎత్తున దాడి చేశారు. రజాకార్లు గ్రామంలో స్థానిక నాయకులను కొందరిని చంపివేశారు. ప్రజలమీద చాలా హింసాకాండను అమలు జరిపారు. గ్రామాన్ని తగులబెట్టారు. చేయగలిగిన దుర్మార్గాలన్నీ చేశారు.

**పులిగిల్లలో దళంపై దాడి :** ఇప్పటి రామన్నపేట తాలూకా, ఆనాటి భువనగిరి తాలూకాకు చెందిన పులిగిల్ల జాగీరుగ్రామం. అక్కడ కూడా దళ సభ్యులు, ఆర్గనైజరు వెళ్ళి సమావేశం ఏర్పాటుచేస్తున్న సందర్భంలో, స్థానిక పోలీసు ఏజెంటు (informant) దగ్గరున్న ఒక క్యాంపుకు వార్తపంపితే ఆ రజాకార్లు దాడిచేశారు. దళసభ్యులు కాల్పులుకాల్చి తప్పుకున్నారు. దాదాపు

గ్రామంచుట్టూ కొండలు, అలాంటి రక్షణ ప్రాంతాలున్నాయి. వాటిని ఉపయోగించుకొని వీరు తిరిగి కాల్పులు కాల్చారు. రజాకార్లు కాల్పులు కాల్చుకుంటూ తప్పుకొని వెళ్ళిపోయారు. నష్టాలేవీ జరుగలేదు. కాని ఆతర్వాత పోలీసులు, రజాకార్లు గ్రామంపై తిరిగి దాడిచేసి, చాలామంది ప్రజలను కాల్చిచంపారు. ప్రతిచోట ఇదొక పద్ధతిగా రజాకార్లు, పోలీసులు దాడిచేస్తూ వచ్చారు. దళంతో సంఘర్షణ జరుగగానే మళ్ళీ తెల్లవారుఝామున దాడులుచేసి, గ్రామప్రజలను పట్టి కాల్చివేసేవారు. ఇదేవిధంగా ఈ గ్రామంలో కూడా చేశారు.

**అడ్డగూడూరువద్ద దళంపై దాడి :** ఇదేవిధంగా రామన్నపేట తాలూకాలో అడ్డగూడూరు అనే పెద్ద గ్రామంలో పోలీసులు, రజాకార్లు క్యాంపు వేశారు. అక్కడినుండి చుట్టుపక్కల గ్రామాల్లో ఆదేపనిగా దాడులుచేసి భీభత్సం చేస్తుండేవారు. క్యాంపుమీద దాడిచేసి భయపెట్టాలనే దృష్టితో చుట్టుపట్ల దళాలన్నింటినీ పోగుచేసుకొని సాయంత్రంవరకు అడ్డగూడూరు దగ్గరలో ఉన్న గ్రామానికిచేరుకొని మకాంవేశారు. అక్కడ సన్నాహాలు పూర్తిచేసుకొని ఉదయం నుంచి మధ్యాహ్నంవరకు దాడిచేసి, ఎంతవరకు వీలైతే అంతవరకు వాటిని చెదరగొట్టాలని వీరి కార్యక్రమం. ఇన్నిదళాలు గ్రామం వచ్చి మకాంవేయటంతో పోలీసుఏజెంట్లు వారికి వార్తనుచేర్చారు. పోలీసులు తెల్లవారేవరకు ఈ గ్రామాన్ని చుట్టుముట్టారు. దీనితో ఆ గ్రామంలోనే సంఘర్షణ ప్రారంభమైంది. రెండువైపులా కాల్పులు పెద్దఎత్తున జరిగాయి. ఆ గ్రామం పార్టీకి బలమైన కేంద్రం. అప్పటికప్పుడు దాడి ప్రారంభంకావటంతో ప్రజలు కూడా పాల్గొని, పోలీసులను తరమటానికి సహాయంచేశారు. కాల్పులలో ఇరుపక్షాలవారూ గాయపడ్డారు. అటు పోలీసులలో కొందరు చనిపోయారు. ఇటు దళసభ్యులు కూడా కొందరు చనిపోయారు. తుదకు ఎటువైపువాళ్ళు అటు వెళ్ళిపోయారు. దీనిఫలితంగా ఆక్యాంపును తాత్కాలికంగా ఎత్తివేశారు.

**కొండూరువద్ద లెవీధాన్యం బండ్లపై దాడి:** భువనగిరి తాలూకాకు చెందిన కొండూరు అనే గ్రామం వద్ద ఒక సంఘటన జరిగింది. పడిశాల తదితర చుట్టుపట్ల గ్రామాలనుంచి లెవీధాన్యం వసూలుచేసి, బండ్లమీద పోసుకొని పోలీసులు వెంట వస్తున్న సమయంలో, దళం వారిమీద దాడిచేసింది. బండ్ల చాటునుంచి శత్రువులు కాల్పులు చేయటానికి ప్రయత్నించారు. కొన్ని బండ్లను చాటు చేసుకొని దళసభ్యులుకూడా కాల్చారు. ఎటువైపూ నష్టం జరుగలేదు. పోలీసులు భయపడి

వెళ్ళిపోయారు. వసూలు చేసిన గ్రామాలకు ఆ బండ్లను తీసుకువెళ్ళి ఎవరిధాన్యం వారు తీసుకొమ్మని దళం రైతులకు పంపకం చేసింది. ఈ విధంగా రైతుల ధాన్యం రైతులకు దక్కింది.

అమ్మనబ్రోలు వద్ద లెవీధాన్యం బండ్లపై దాడి : అమ్మనబ్రోలు గ్రామం నేటి రామన్నపేట తాలూకా, ఆనాటి భువనగిరి తాలూకాలోనిది. ఇదొక జాగీరు గ్రామం. జాగీర్దారుకు వ్యతిరేకంగా చాలా కాలం రైతాంగ పోరాటాలు నడిచాయి. అవి ప్రధానంగా స్థానిక పెత్తందార్లు, చిన్న భూస్వాముల నాయకత్వాన నడిచినవి. చిన్న భూస్వాములంటే పెద్ద భూస్వాములకన్నా చిన్న భూస్వాములేకాని, స్థానికంగా వారు పెద్ద భూస్వాములే. జాగీరు పోరాటాలలో సాధారణంగా పన్నులు, వీటికి సంబంధించిన వ్యవహారాలే ఉంటాయి పార్టీ ఆ ప్రాంతంలో పని చేయటం ప్రారంభించిన తర్వాతకూడా వర్గపోరాట స్థాయికి, అంటే వ్యవసాయ కూలీ పోరాటాలు, భూమి పంపకంలాంటి కార్యక్రమాల వరకూ వెళ్ళలేదు. ప్రభుత్వం లెవీధాన్యం తీసుకొని, రైతుల చేతనే బండ్లు కట్టించి, వారి వెంట పోలీసులను ఉంచి తీసుకు వెళ్ళేవారని ఇంతకు ముందే చెప్పాము. అలాగే ఇక్కడకూడా ధాన్యాన్ని తీసుకుపోవటం ప్రారంభించింది. మోతుకూరు క్యాంపు పరిధిలో ఉన్న గ్రామమిది అక్కడి పోలీసులు రజాకార్లను వెంట తీసుకొని గ్రామంపై దాడిచేసి, ఇళ్ళకు నిప్పు పెట్టించారు. ఇతర విధాలుగా ప్రజలను హింసించి, ధాన్యాన్ని, ఇతర కొల్లగొట్టిన సామానును తీసుకొని వెళ్తున్నారు. గ్రామంలో ఉన్న ముస్లిం ప్రజలను రజాకార్లలో చేర్చటానికి నిర్బంధంగా తీసుకు వెళ్ళారు. ఇది ఒక పద్ధతిగా కూడా అమలు జరిపారు. పోలీసులను ప్రతిఘటించటానికి ప్రజలు దళంతో పాటు బయలుదేరారు. రోడ్డుకు గండి కొట్టటం, ఇంకా ఇతర విధాల రాక పోకలకు ఇబ్బంది కలగజేయటానికి ప్రయత్నం చేశారు. ఈ గ్రామం మూసీ ఒడ్డున ఉండటం దీని ప్రత్యేకత. ఈ గ్రామాలకు కొన్ని సౌకర్యాలు ఉంటాయి. నదిలోని ఇసుకలో ప్రయాణం చేయవలసి రావటంతో ఎవరైనా నిదానంగా వెళ్ళ వలసిందే. ఒడ్డున ఉన్న చెట్లు, అక్కడక్కడ ఉన్న కొద్దిపాటి కొండలు కూడా రక్షణగా ఉపయోగపడేవి. ఇవి ప్రజలకూ, దళానికే కాకుండా, రజాకార్లకు, పోలీసులకు కూడా ఉపయోగపడ్డాయి. ముందు ప్రజలు చొరవ తీసుకోవటం వలన రజాకార్లకు, పోలీసులకు ఇబ్బంది కలుగజేసే విధంగా వీటిని ఉపయోగించారు. రాళ్ళు రువ్వటం తదితర పద్ధతులను చేపట్టారు. ఉన్నంత

వరకు వారు తుపాకులతో కాల్పులు చేశారు. దీనికి పోలీసులు తిరిగి కాల్పులు కాల్చి, కొందరిని చంపివేయగలిగారు. ఇంతలో చీకటి పడటం వల్ల పోలీసులు, వారు వెంట తీసుకువెళ్ళిన ముస్లిములు వెళ్ళిపోయారు. ప్రజలు చనిపోయిన కార్యకర్తలకు అంత్యక్రియలు చేశారు.

వడ్లకొండపై పోలీసుల, రజాకార్ల దాడి : వడ్లకొండలో కూడా ఇలాంటి సంఘటన ఒకటి జరిగింది. జనగామకు దగ్గరలో ఉన్న ఈ గ్రామంలో ఇతర చోట్లలాగే స్థానికంగా ఒకదళం ఏర్పడింది. పోలీసులు, రజాకార్లు దాడికి రాగానే ముందు ప్రజలను హెచ్చరించి, దళాలు కాల్పులు సాగించటం పరిపాటి. ఒక సందర్భంలో పోలీసులు దాడికి రాగానే స్థానిక దళం ముందే గమనించి కాల్పులు కాల్చింది. దానితో వారు అప్పటికప్పుడు పలాయనం చిత్తగించారు. పది, పదిహేను రోజుల తర్వాత పెద్దఎత్తున బలాన్ని సమీకరించుకొని పోలీసులు మళ్ళీ దాడిచేశారు. దళ సభ్యులు తమకు అనుకూలమైన స్థానాల్లో పొజిషన్ తీసుకొని పోలీసులమీద, మిలటరీమీద కాల్పులు కాల్చారు. తమ వద్దనున్న బలమైన ఆయుధాలనుపయోగించి మిలటరీవారు తిరిగి కాల్పులు కాల్చారు. దానివలన పొజిషన్ తీసుకొని ఉన్న కొందరు దళ సభ్యులపై వారు కాల్చగలిగారు. కొందరు కామ్రేడ్స్ చనిపోయారు. వారు గ్రామంలో జొరబడి ప్రజలను హింసించినారు. ఇంతకుముందు దాదాపుగా కాల్పులు జరుపలేని దళం ఇప్పుడు కాల్పులు సాగించగలిగింది. పక్క గ్రామంనుండి ప్రజలు వచ్చినా పోలీసుల బలం ఎక్కువగా ఉండటం, ఆధునిక ఆయుధాలతో ముమ్మరంగా కాల్పులు జరపటంతో వారు దెబ్బతిని వెనక్కి తగ్గవలసి వచ్చింది.

ఆకునూరుపై పోలీసుల, రజాకార్ల దాడి : 1945 వ సంవత్సరం చివరగాని, 1946 ప్రారంభంలోగాని జనగామ తాలూకాలోని ఆకునూరు గ్రామంలో అప్రయత్నంగా ఒక పోరాటం సాగింది. లెవీ ధాన్యాన్ని నిర్బంధంగా వసూలు చేయటానికి వ్యతిరేకంగా స్థానిక ప్రజలు తిరుగుబాటు చేస్తే, సాయుధ పోలీసులు వచ్చి, క్రూరంగా అణచివేశారు. స్త్రీలను మానభంగం చేశారు. దీనికి భారతదేశమంతటా పెద్దఎత్తున ప్రచారం లభించింది. ఈ దురాగతాలకు వ్యతిరేకంగా పెద్దఎత్తున ఉద్యమం నిర్వహించబడింది. తాత్కాలికంగా దెబ్బ తిన్నప్పటికీ, ఆ గ్రామంలో ఉద్యమం పూర్తిగా అణగిపోలేదు. మళ్ళీ సాయుధ పోరాట కార్యక్రమాన్ని అందుకున్నది. అంతకుముందు లొంగిపోవటానికి

సూచనగా కొంత డబ్బును చెల్లించమని పోలీసులు కబురు చేస్తే ప్రజలు నిరాకరించారు. దళాన్ని ఏర్పాటు చేసుకొని ప్రతిఘటించటానికే సిద్ధమయ్యారు. ఒక సందర్భంలో కొందరురజాకార్లను వెంట తీసుకొని పోలీసులు దాడిచేస్తే, దళం వారిలో కొందరిని చంపివేసింది తర్వాత వారు పెద్దఎత్తున బలాన్ని సమీకరించుకొని గ్రామంపై దాడిచేసి, బాగా కాల్పులు జరిపి, కొందరిని చంపివేసి, గ్రామాన్ని తగులబెట్టి, ధాన్యాన్ని, ఇతర వస్తువులను కూడా తగుల బెట్టి వెళ్ళిపోయారు. ఈ విధంగా నిర్బంధకాండ సాగించారు. స్థానికంగా ఉన్నంతలో దళాలు ప్రతిఘటించాయి. ఆనాటి జనగామ తాలూకా గ్రామాలన్నీ ఆనాటి నల్లగొండ జిల్లాలోనే ఉండేవి. వాటిలో కొన్ని మాత్రమే ప్రస్తుతం నల్లగొండ జిల్లాలో ఉన్నాయి.

**సోలిపురం గ్రామంపై దాడి :** జనగామ తాలూకాలోనే సోలిపురం గ్రామంలో అక్కడి ఆర్గనైజరు భూమి పంపకం, స్థానిక సమస్యల పరిష్కారానికి దళంతో సహా అక్కడికి వచ్చాడు. మిలటరీవారు చుట్టుపక్కల గ్రామాలమీద దాడులు చేసి, అక్కడి నాయకుడు గానుగపాటి నారాయణరెడ్డి ఈ గ్రామంలో ఉన్నాడని తెలిసి, వచ్చి వెంటనే అతనిమీద కాల్పులు కాల్చటానికి ప్రయత్నం చేశారు. అతను తప్పుకొని, వారికి దొరకకుండా తిరిగి, పక్కనున్న గ్రామాలకు తప్పుకోవటానికి ప్రయత్నం చేశాడు. మిలటరీ, పోలీసులు జీపులలో ఆయన వెంటపడి తుదకు అతన్ని పట్టుకొని కాల్చివేశారు. ప్రజల్లో బాగా పలుకుబడి కలిగిన ముఖ్యమైన నాయకుడవటంతో ప్రజలు చాలా బాధపడ్డారు. అతని వెంటఉన్న మరికొందరు దళ సభ్యులను కూడా పోలీసులు కాల్చివేశారు.

**గుండ్రాంపల్లి క్యాంపుపై దాడి :** ఇదేవిధంగా లక్ష్మీదేవిగూడెం తదితర గ్రామాలపై రజాకార్లు దాడిచేసి అనేకమంది రైతులను చంపారు. రజాకార్లు ఈ గ్రామానికి దగ్గరఉన్న గుండ్రాంపల్లి క్యాంపునుండి వచ్చి ఇదంతా చేసేవారు. దీనితో అక్కడి దళాలు ఈక్యాంపుమీద దాడిచేశాయి. కొందరు రజాకార్లను చంపి వేశారు. దళం గతంలో మందలించి వంపివేసిన ఒకతని ద్రోహంవలన రజాకార్లు, పోలీసులు దళాన్ని పట్టుకున్నారు. దళసభ్యులను, మరికొందరిని కాల్చివేశారు. ఈ దాడి తర్వాత ఈక్యాంపుకు దగ్గరున్న కాపత్రి అనే గ్రామానికి చెందిన పెద్ద భూస్వామి పాసం పుల్లారెడ్డి ఆ రజాకార్లను వెంటతీసుకొని గ్రామస్థులను కొందరిని కాల్చిచంపాడు రజాకార్లకు నాయకత్వం వహించినవారిలో హిందూ భూస్వా

ములు, తెలుగు భూస్వాములు కూడా కొందరు ఉన్నారనే విషయాన్ని గమనించాలి.

వరంగల్ జిల్లాలో జరిగిన దాడులు

నల్లగొండ జిల్లాలోనేకాక ఆనాటి వరంగల్ జిల్లాలో కూడా చెప్పుకోదగినంతగా సాయుధపోరాటం సాగింది.

మధిర తాలూకా : ఈ జిల్లాకు చెందిన మధిర తాలూకాలో రాయనపేట గ్రామానికి రజాకార్లు, పోలీసులు వచ్చి, దాడిచేసి పశువులను వదిలేసి తమవెంట తీసుకుపోవటానికి ప్రయత్నించారు. అక్కడఉన్న దళం దీనిని ప్రతిఘటించింది. దళం రజాకార్లను, పోలీసులను తట్టుకోలేకపోయింది. దళ నాయకులను వారు పట్టుకోగలిగారు. చిత్రహింసలుచేసి చంపారు. ఇదేవిధంగా లక్ష్మీపురం, గోవిందాపురం అనే గ్రామాల్లోకూడా స్థానికదళం, ప్రజలు కలిసి రజాకార్లను, పోలీసులను ఎదుర్కొన్నారు. అయినా స్థానిక నాయకులు ఒకరు పోరాటంలో చనిపోయారు. సిరిపురం అనే గ్రామంలో కూడా ప్రతిఘటన జరిగింది. స్థానిక నాయకులను రజాకార్లు కాల్చివేయగలిగారు. గ్రామాన్ని తగులబెట్టి ఎంతో నష్టాన్ని కలుగజేశారు.

మధిర తాలూకాలో కలకోట అనే గ్రామంలో వ్యవసాయ కూలీలకు, ధనిక రైతు భూస్వాములకు తగాదా ఏర్పడటంతో దాన్ని పరిష్కరించటానికి ఆ ప్రాంతం రాజకీయ నాయకుడు (ఆయన పేరు మాధవరెడ్డి. ఆ కామ్రేడు దళ నాయకుడు కూడా.) అక్కడికి వచ్చారు. తగిన ఏర్పాట్లులేకుండా నేరుగా వచ్చి పరిష్కారానికి పూనుకున్నారు. అక్కడి మిషనరీ స్కూలు టీచరు ప్రజల్లో కలిసి మెలిసి ఉంటూ, పోలీసు ఏజెంటుగా పనిచేస్తూ ద్రోహంచేసిన ఫలితంగా పోలీసులు, మిలటరీ దాడిచేసి, ఆయన దగ్గరున్న ఆయుధాన్ని లాగివేసి, అతన్ని కాల్చివేశారు. దగ్గరున్న ఒకరో ఇద్దరో తప్పుకోగలిగినప్పటికీ, అక్కడి ముఖ్యమైన కామ్రేడు మాత్రం చనిపోయాడు. ద్రోహం చేసినతన్ని ప్రజలు చంపివేశారు.

తాటికొండ : తాటికొండ అనేగ్రామం వరంగల్లు తాలూకాలో వరంగల్లుకు సమీపంలో ఉంటుంది. అక్కడి స్థానిక నాయకత్వం, ఏరియా నాయకత్వం, దళాలు చాలా గ్రామాలలో ప్రచారం చేసి ముందుకుసాగారు. తాటికొండలో మిలటరీ, రజాకారులు ఈ దళంతో తలపడ్డారు. దగ్గరున్న కొండవద్ద పొజిషన్

తీసుకొని రజాకార్లను కాల్చి, దెబ్బతీయటానికి ఈ దళం ప్రయత్నం చేసింది. చాలావరకు సఫలమైంది. కృష్ణాజీ గూడెం అని దగ్గరలో మరొక గ్రామం ఉంది. అక్కడకూడా పోలీసు, మిలటరీని తరిమి కొట్టారు. అక్కడ కొందరు విద్యార్థి నాయకులు ఈ దళాల్లో చేరి నాయకత్వం వహించారు. వారిని అరెస్టు చేసి కాల్చి చంపారు.

సమీక్ష :

పీటిని పరిశీలిస్తే మనకు కొన్ని గుణపాఠాలు స్పష్టంగా తెలుస్తాయి. దళాలు గ్రామాల్లో ఎక్కువసేపు మకాం పెట్టటం; వార్తలనుచేరవేసే పోలీసు ఏజెంట్ల (ఇన్ఫార్మెంట్లు) పై నిఘా లేకపోవటం :-రాజకీయ ఆర్గనైజర్లు దళసహాయంతో గ్రామానికి వెళ్ళటం, ప్రజలు దళానికి అండదండగా ఉండటం, అక్కడికి వచ్చి వారు తమ సమస్యలను పరిష్కారం చేసుకోవటం అప్పటికే ప్రారంభమైంది. వీటిలో ప్రజలమధ్య ఉన్న తగాదాలతోపాటు అక్కడి భూస్వాములు, ప్రజావ్యతిరేకులకూ ప్రజలకూ మధ్యనున్న సమస్యలు కూడా ఉండేవి. దీనితో అక్కడి ప్రజావ్యతిరేకులను ఒక కంటకనిపెడుతూ జాగ్రత్తగా ఉండేవారు. కొందరు ముఖ్యమైన భూస్వాములు పట్టణాలకు వెళ్ళి పోయినా, ఇంకా కొందరు గ్రామాల్లో మిగిలిపోయారు. పట్టణాలకు వెళ్ళిపోయిన వారు కూడా గ్రామాల్లో తమ ఏజెంట్లను ఉంచేవారు. అన్ని సందర్భాల్లోనూ దళం, ఆర్గనైజరు వచ్చి, సమస్యల పరిష్కారంకోసం కూర్చున్న కొంతసేపటికే దాడులు జరిగాయని తెలుస్తుంది. అంటే వార్తలను చేరవేసే ఈ ఏజెంట్లు వీరు రాబోతున్నారని తెలిసి, ముందే పోలీసు క్యాంపుకు తెలియజేసైనా ఉండాలి. లేదా గ్రామంలో దళం మకాం వేసిన కొంతసేపటికి ఏజెంటు వెళ్ళి, పోలీసులను తీసుకురావటానికి తగినంత వ్యవధి ఉండేంత తాపీగా ఉంటూ, దళం ప్రజా సమస్యల పరిష్కారానికి పూనుకొని ఉండాలి. ఉదాహరణకు: ఆర్గనైజరు దళం రాత్రి చేరుకుంటారనుకుందాం. ఆ రాత్రంతా అక్కడ విశ్రాంతి తీసుకుంటారు. వారికి భోజన సదుపాయాలన్నీ గ్రామంనుంచి ఊరి బయట ఉన్నవారి దగ్గరికి తీసుకువెళ్తారు. ఉదయం అంతా కాలకృత్యాలు తీర్చుకున్న తర్వాత, రైతులందరూ తమతమ పనులు తీర్చుకున్నాక సుమారు 8-9 గంటలకు సమస్య పరిష్కారానికి కూర్చుంటే, సుమారు 11-12 గంటలకు రజాకార్లు, పోలీసులు దాడికి వస్తారు. అంటే దళం గ్రామానికి

చేరుకోవటానికి, రజాకార్లు, పోలీసులు దాడి చేయటానికి మధ్యన 10-12 గంటల కాలందాకా ఉంటుంది. దళం గ్రామానికి రాగానే వార్తలు చేరవేసే ఏజెంటు (ఇన్ఫార్మెంటు) క్యాంపుకి వెళ్ళి పోలీసులకి చెప్పటానికి, మరుసటిరోజు పోలీసులు దాడి చేయటానికి తగినంత వ్యవధి ఉంటుంది. ఈ దృష్టితో చూస్తే దళం రాకముందే చెప్పవలసిన అవసరంలేదు. దళం వచ్చిన తర్వాత కూడా చెప్పి, పోలీసులు దాడి చేయటానికి తగినంత వ్యవధి దొరుకుతుంది. అంతసేపు ఒక గ్రామంలో మకాం పెట్టటం ఆనాటి గెరిల్లా పోరాట స్థాయిలో తప్పు అనేది స్పష్టమవుతుంది. అనేక సందర్భాల్లో జరిగింది ఇదే.

దళం ఉదయమే చేరుకొని పగలే ప్రజలను సమావేశపరుస్తుందనుకుందాము. లేదా చేరిన రాత్రే ప్రజలను సమావేశపరిచి సమస్యలు పరిష్కారం చేస్తుంది. అటువంటి పరిస్థితుల్లో ముందే ఆ గ్రామంలోని ఈ ఏజెంట్లకు దళం వచ్చే సంగతి తెలిస్తే వారు పోలీసులకి వార్త చేరవేస్తారు. దళం వచ్చి సమస్యలను పరిష్కరించే సమయానికి దాడిచేసే ఏర్పాట్లు జరిగి ఉంటాయి.

ప్రజల సానుభూతి, సహకారాలు ఉన్నప్పుడు శత్రువుకు వార్తలను చేరవేసే ఈ పోలీసు ఏజెంట్లను పట్టుకోవటం అంత కష్టమేమీ కాదు. ప్రజల్లో వారు కలిసే ఉన్నప్పటికీ ఎవరు పోలీసు ఏజెంట్లు, ఎవరుకారు అని ప్రజలు మెలకువగా ఉంటే పట్టుకో గలుగుతారు. కానీ, పార్టీ ప్రజలకు అటువంటి అవగాహన కలిగించలేదు. వారిమీద నిఘా పెట్టించలేదు. దీని ఫలితంగా ఈ ఏజెంట్లు వెళ్ళి పోలీసులకు చెప్పి, ఒకసారి దాడి చేయించిన తర్వాతనే వీరెవరో బయటికి వచ్చేది. వారిని శిక్షించటానికి ప్రయత్నించేవారు. ఈలోగా వారు పోలీసు క్యాంపులో మకాం వేసేవారు. ఒకసారి దాడి చేయించిన తర్వాత, ఆ ఏజెంటు ఆ ఊర్లో ఉండటం సాధ్యంకాదు. అతడు పోలీసు క్యాంపులోకి చేరిపోతాడు. తర్వాత రెండవ ఏజెంటు తయారవుతాడు. అతడు దాడి చేయించిన తర్వాత మరొకడు అదేపని చేస్తుంటాడు. ఈ పద్ధతిలో ఏజెంట్లు ఏర్పడటం, వారిమీద నిఘాలేక పోవటం, దాని వలన దళం అజాగ్రత్తగా ఉండే సమయంలో వారు దాడులు చేయటం సర్వ సామాన్యాంశంగా కనిపిస్తుంది.

సెంట్రీ విధానంలో లోపం : మరో అంశమేమిటంటే అడ్డగూడూరులో జరిగిన సంఘటనలో తప్ప తక్కిన అన్ని సందర్భాల్లోనూ సెంట్రీ అజాగ్రత్తగా ఉండటం మనం చూడవచ్చును ఎందుకు ఈ విధంగా అజాగ్రత్తగా ఉంటున్నా

రనే ప్రశ్నకు అతనిలో ఉన్న లోపమే దీనికి కారణమని తీసి పారేస్తూ ఉండే వారు. కానీ ఇన్ని సందర్భాల్లో అజాగ్రత్తగా ఉండటాన్ని బట్టి చూస్తే, సెంట్రీ విధానంలోనే ప్రధాన లోపం ఉన్నదనేది స్పష్టం. సెంట్రీ అంటే కాపలాకాయటం కాబట్టి, దీనిని చాలా క్రింది స్థాయి (inferior) పనిగా భావించేవారు. దీనితో పాటు సమాజంలో ఉన్న హెచ్చుతగ్గుల వలన, ఇతరులు చదువుకొని ఉండటం వలన, దళ సభ్యులలో అందరికన్నా బలహీనమైన వారిని, లేదా ఏ పనీ చేతకాని అసమర్థులను సెంట్రీగా నియమించేవారు. అతడు చాలా అజాగ్రత్తగా ఉండేవాడు. కొద్దిసేపు కూర్చున్న తర్వాత (8 గంటలు, 10 గంటలు కూర్చోవలసి వస్తే మొదటి గంట, రెండు గంటలు జాగ్రత్తగా ఉండి) శత్రువులు ఇకరారులే అని భావించటం వలన కానీ, వస్తే తెలుస్తుందిలే అని అనుకోవటం వలన కానీ, అతనిలో అజాగ్రత్త ప్రవేశిస్తుంది. దీనితో అతడు కునికిపాట్లు పడటమో, లేకపోతే ఇంకేదైనా ఆలోచిస్తూ ఉండటమో జరుగుతుంది. ఈ పని చేయటం ప్రమాదకరమని కూడా అతడు భావించవచ్చును. సెంట్రీ చెట్టుమీద ఉన్నప్పుడుకానీ, ఎత్తైన ప్రదేశంలో ఉన్నప్పుడుగానీ బయటపడితే, వచ్చే శత్రువులు కాల్పులు అతనిమీదనే కాలుస్తారు. ఆ భయం కూడా ఉంటుంది. వీటన్నిటి ఫలితంగా చాలా సందర్భాల్లో వారు తమ బాధ్యతల నిర్వహణలో విఫలమయ్యారు. శత్రువులు దూరంగా ఉన్నప్పుడే సెంట్రీచూసి చెప్పటం జరగలేదు. దీని ఫలితంగానే పోలీసు, మిలటరీవారు దళానికి దగ్గరికి వచ్చిన తర్వాతనే తెలుస్తుంది. అనేక సందర్భాల్లో పోలీసులు దగ్గరికి వచ్చి, కాల్పులు సాగించిన తర్వాత, ఆ చప్పుడుకు వీరు మేల్కొవటం జరుగుతుంది. చాలా చురుకైన వారినీ, చాలా స్వార్థత్యాగం, మెలకువ ఉన్నవారిని చూసి సెంట్రీగా పెట్టకుండా, అందరికన్నా బలహీనుణ్ణి ఈ పనికి నియమించటం సరైన పద్ధతికాదు. జరిగిన నష్టాల్లో అత్యధిక భాగం ఇందువల్లనే జరిగినాయంటే ఆశ్చర్యమేమీలేదు. ఇది సెంట్రీ విధానంలో (system లో) ఉన్నలోపం.

ప్రజల సమస్యల పరిష్కారాన్ని, మిలటరీ కార్యకలాపాలను కలగాపులగం చేయటం : ప్రజల సమస్యలు పరిష్కరించవలసిందే. ప్రజలతో నిత్యం సజీవమైన సంబంధాలు లేకపోతే మన పోరాటం సాగదు. కాని శత్రు దాడులు జరిగిన అన్ని సందర్భాల్లో, దళాలు ఈ ప్రజా కార్యకలాపాలకోసం గ్రామాలకు వచ్చాయనే విషయాన్ని గమనించాలి. ఒకచోట

బహిరంగ సభకోసమైతే, మరొక చోట స్థానిక సమస్యలు పరిష్కారం చేయటానికి దళం వచ్చింది. ఈ సమస్యలకూ, దళానికీ ఉన్న సంబంధం తప్పు. ఒకసారి దళం ఏర్పడిన తర్వాత అది మిలటరీ జీవితం సాగించవలసి వస్తుంది. ఒకవేళ, దళ సభ్యులే వెళ్ళి ఈ పార్టీ కార్యకలాపాలు సాగించవలసి వచ్చి, ఇవి దళం యొక్క మిలటరీ జీవితంలో ఒక భాగంగా మారినా, వాటిని మరో పద్ధతిలో సాగించవలసి వస్తుంది. దీనికొరకు దళాలను రద్దు చేయకుండానే, అప్పటికప్పుడు కొన్ని సర్దుబాట్లు చేసుకోవచ్చును. దళ సభ్యులు విడిపోయి, ఈ పనులు చేసుకొని మళ్ళీ ఒకచోటుకి వచ్చి, దళంలో చేరుకునే ఏర్పాటు చేయాలి. దీనికి బదులు ఒక రాజకీయ ఆర్గనైజరు, అతని వెంట దళం ప్రజల సమస్యలను పరిష్కారం చేయటానికి రావటం అవగాహనాలోపం వలన జరిగినదే. రాజకీయ ఆర్గనైజరుకు రక్షణగా దళం ఉండాలనే అవగాహన సరైనదికాదు. ప్రజల అండదండలు ఉన్నప్పుడు, ముఖ్యంగా ప్రజలు పెద్దఎత్తున కదులుతున్నప్పుడు ఇలాంటి అవసరం ఉండదు.

మరొక విషయమేమంటే దళం రావటంతో ప్రజలకు దళంవైపు చూడటం ఎక్కువవుతుంది. తమ ఆర్గనైజరుద్వారా, తమ గ్రామ కమిటీలద్వారా సమస్యలను పరిష్కరించుకోవాలనే ధోరణి క్రమంగా తగ్గుతూ వచ్చింది. చిన్నచిన్న సమస్యల పరిష్కారానికి గ్రామకమిటీ సభ్యులుండేవారు. ముఖ్యమైన సమస్యలు దళం దగ్గరికి వెళ్ళేవి. రాజకీయ ఆర్గనైజరుకు తగినంత ప్రాధాన్యత ఉండక పోయేది. గ్రామంలో నోరుగలవారు లేక పలుకుబడిగలవారు తమ సమస్యలను పైనాయకులద్వారా, దళాల ద్వారా పరిష్కారం చేసుకోవాలని కోరుకునేవారు. సాధారణ ప్రజలు గ్రామకమిటీల ద్వారా పరిష్కారం చేసుకుంటుండేవారు. ఈ హెచ్చుతగ్గులనేవి అప్పుడే ఏర్పడినవి. దళాలు వచ్చినప్పుడు నోరుగలవారు, పలుకుబడిగలవారు ఏర్పాట్లు చేయటంలో ప్రధానపాత్ర నిర్వహించేవారు. ఈ విధంగా వీరు తమకు రాజకీయ నాయకుల యొక్క, దళం యొక్క సహాయ సానుభూతులున్నాయని చూపించుకొని గ్రామంలో అదనపుపలుకుబడి సంపాదించు కునేవారు. దీనినుపయోగించుకొని తమ సమస్యలను పరిష్కరించుకునేవారుకొందరు గ్రామాల్లో తయారుకావటానికి ఇది తోడ్పడింది. దళం వచ్చినప్పుడే సమస్యలు పరిష్కారంకావాలనే ధోరణి ప్రబలి, స్థానికపార్టీ, స్థానిక కమిటీల ద్వారా పరిష్క రించుకునే పద్ధతి క్రమంగా తగ్గిపోయింది. తర్వాతకాలంలో ఇది కొంత నష్టం కలిగించింది.

మొత్తంమీద పనులను ఈవిధంగా కలగాపులగం చేయటంవలన గెరిల్లాదళం మిలటరీ శక్తిగా అభివృద్ధికావటంలో లోపం ఏర్పడింది. ఈ సమయాన్ని వారు మిలటరీ నైపుణ్యాన్ని మరింత పెంపొందింపచేసుకోవటానికీ, దాడులు ఇంకా క్రమ బద్ధంగా చేయటానికి ఉపయోగిస్తే సమర్థత, నైపుణ్యం పెరిగేవి.

అయినా ఇవి ప్రజలతో సంబంధాలు పెంపొందింపచేసుకోవటానికి ఉప యోగపడ్డాయి. అనేక సందర్భాలలో రజాకార్ల గుంపు వచ్చినప్పటికీ, ప్రజలు కూడా పెద్దఎత్తున పాల్గొని రాళ్ళురువ్వటంలాంటి పద్ధతులద్వారా ప్రతిఘటించారు. అయితే మొదటిదశలో ప్రజల్లో కూడా భయం ఉండేది. కొన్నాళ్ళ తర్వాతనే నిబ్బరం చేసుకొని ప్రతిఘటన సాగించటం మొదలుపెట్టారు.

**పోలీసుచర్యకు ముందుకూడా వార్తలను చేరవేసే పోలీసు ఏజెంట్లు (ఇన్ఫార్మెంట్లు) ఉన్నారు :** 'యూనియన్ సైన్యాలు వచ్చిన తర్వాతనే పెద్దఎత్తున సిఐడీలు తయారయ్యారు ; అంతకుముందు ప్రజాబాహుళ్యం అందు బాటులో ఉండటంతో గ్రామాలలో సిఐడీలు ఎవరూ ఉండకపోయేవారు' అనే భావన అంతటా ఉండేది. ఈ సంఘటనలు తెలిపేదేమంటే ఆరోజులలో ధనికరైతులతో సహా అన్నివర్గాల ప్రజల మద్దతు ఉన్నప్పటికీ, ఈ పోలీసు ఏజెంట్లు ఉండేవారు. వారు దాడులు చేయించేవారు. ప్రజలు వారిని ప్రతిఘటించి ఎదుర్కొనేవారు. అంతేకాని ఆ పరిస్థితుల్లో పోలీసు ఏజెంట్లు లేరు అని అనుకోవటం పొరపాటు. కాకపోతే అప్పుడు పెద్దసంఖ్యలో ఉండకపోయేది. ప్రజల మనోనిబ్బరమనేది చాలా పనిచేసింది. అయితే అది కూడా రజాకార్లను, పోలీసులను కొన్నిసందర్భా లలో దెబ్బతీసిన తర్వాతనే వచ్చిందికాని, అంతకుముందు లేదు. అయినా అన్ని సందర్భాలలో ప్రజలు పాల్గొనేవారు.

**ప్రతీకారం కొరకు దాడిచేయటం - గెరిల్లా పద్ధతులు :** ప్రతీకారంకోసం దాడిచేయటం ఎంతవరకు సరైనదో ఆలోచించవలసి ఉంటుంది. రావులపెంట దాడిలో దెబ్బతిని, చింతలమ్మ గూడెంలో రజాకారులు చేసిన దాడిలో నష్టపడ్డ తర్వాత, ప్రతీకారం కొరకు పెదవీడులో రజాకార్లపై, పోలీసులపై దాడిచేయటం జరిగింది. తమకు అనుకూలమైన ప్రదేశంలో, అనుకూలమైన సమయంలో దాడి చేయటమొకటే గెరిల్లాలకు ప్రధానసూత్రంగా ఉంటుంది. ప్రతీకారంకోసం దాడి చేయటమనేది అన్నిసందర్భాలలో ఉపయోగపడదు. ప్రత్యేక పరిస్థితుల్లో

రజాకార్లు, పోలీసులు కలిసికున్నప్పటికీ స్థిరమైన శక్తిగా లేకుండా, చిందర వందరగా బలహీనమైన శక్తిగా ఉండటంతో ఈదాడులు తాత్కాలికంగా పని చేశాయి. అన్ని సందర్భాల్లో ఇలాంటివి పనిచేయలేదు.

ఇప్పటివరకూ సెంట్రీలను పోలీసువారు కాల్చటమనేది జరుగలేదు. సెంట్రీలు అజాగ్రత్తగా ఉంటే వారు ముందుకు చొచ్చుకురావటం, తర్వాత సెంట్రీగాని, ప్రజలుగాని చూసి చెప్పటం; లేదా పోలీసులు కాల్పులుకాల్చటంతో దళం సర్దుకొని పొజిషన్ తీసుకోవటం ఇంతవరకూ జరుగుతూవచ్చింది. తర్వాత కాలంలో ఇతర పరిణామాలు వచ్చాయి.

## మరికొన్ని దాడులు

ఇంతవరకూ వివరించిన దాడులలో ఎక్కువభాగం స్థానిక నాయకులు, లేదా దళాలు, లేక ఇద్దరూ ఉండి ప్రజాసమస్యలు పరిష్కరిస్తున్న సమయంలో జరిగినవే. ఇప్పుడు మరొకరకం సంఘర్షణలను ఉదహరించటం అవసరం.

**పాతర్లపాడు గ్రామంపై దాడి :** పాతర్లపాడు సూర్యాపేట తాలూకాకు చెందిన ఒకగ్రామం. మంచి సమర్థవంతమైన దళం ఒకటి ఆప్రాంతాల్లో పోలీసులను ఎదుర్కొంటూ ఉండేది. ఆదళానికి నాయకుడు గోపాలరెడ్డి. సమర్థ వంతమైన నాయకుడుగా పేరుపడ్డాడు. ఆదళం ఆ గ్రామంలో ఉన్న సమాచారం పోలీసులకు తెలిసిన తర్వాత, వారు రజాకార్లను వెంటపెట్టుకొని ఆగ్రామంపై దాడిచేసారు. ఈదళం పొజిషన్ తీసుకొని ఎదురుకాల్పులు కాల్చింది. ఈ సంద ర్భంగా 'శత్రువుకి లొంగిపోకూడదు, ఆయుధాలతో పట్టుబడకూడదు' అని దళ నాయకుడు దళ సభ్యులకు ఖచ్చితమైన సూచనలిచ్చాడు. వారు కూడా అదే విధంగా ప్రతిఘటించారు. ఈ ప్రతిఘటన ఆరోజు కొన్నిగంటలదాకా నడిచింది. ఈ దళ నాయకుడు, మరికొందరు చనిపోయారు. కొద్దిమంది బయటపడ్డారు. వారు తిరిగి దళాన్ని పునర్నిర్మించుకొని, మంచి దళంగా ఏర్పడి, కొన్ని కార్య కలాపాలను సాగించారు. ఈవిధంగా దళం చేసిన పోరాటం ప్రజల్లో ఎంతోపేరు సంపాదించింది.

**కార్మికనాయకుడు కామ్రేడ్ శేషగిరిరావు అమరత్వం :** ఒక కార్మిక నాయకుడు పోరాటంలో పాల్గొని ప్రాణాలర్పించిన సంఘటన కూడా తెలుసుకోవటం అవసరం. ఆయన కొత్తగూడెం బొగ్గుగని కార్మికుల నాయకుడు.

ఆయన పేరు శేషగిరిరావు. 1940-41 కాలంలోనే కొత్తగూడెం ప్రాంతంలో రహస్యంగా పనిచేసి, పార్టీ నిర్మాణాన్ని రూపొందించి గని కార్మిక సంఘాన్ని ఏర్పాటు చేశాడు. చాలా అధ్వాన్న పరిస్థితిలో జీవితాన్ని గడుపుతున్న కార్మికుల కోర్కెలను రూపొందించి, వాటికోసం పోరాడి ఈ సంఘం ఎన్నో విజయాలు సాధించింది. ఆ పోరాటానికి కామ్రేడు శేషగిరిరావు నాయకత్వం వహించాడు. ప్రతిఘటనోద్యమంలో అతను దళాల్లో చేరి పనిచేశాడు. జిల్లా కేంద్రానికి వెళుతున్న సమయంలో, ఎవరో ద్రోహం చేసిన ఫలితంగా, పోలీసులు అతన్ని పట్టుకొని కాల్చివేశారు. కార్మికులంతా సమ్మె చేస్తారనే భయంకొద్దీ ఆ వార్తను కూడా పొక్కనీయకుండా కొన్ని నెలలపాటు దాచిపెట్టారు. వార్త బయటపడిన తర్వాత కార్మికులు కూడా చాలామంది ప్రతిఘటనలో పాల్గొనటానికి ముందుకు వచ్చారు.

ఎర్రబెల్లి గ్రామంపై పోలీసుల దాడి : ఇదేవిధంగా వరంగల్ తాలూకాలో ఎర్రబెల్లి గ్రామం ఉంది. దళం అక్కడ భోజనం చేస్తున్నప్పుడు పోలీసులు దాడిచేశారు. పోలీసులను దళం తరిమింది. దళం ప్రజలపై కాల్చదని తెలిసిన పోలీసులు, ప్రజలను రక్షణగా ముందు పెట్టుకొని వెనక్కి తగ్గుతూ వెళ్ళిపోవటానికి ప్రయత్నం చేశారు. దీనితో దళం పోలీసుల మీద కాల్చలేదు. క్రమంగా పోలీసులు తప్పుకొని పోగలిగారు. ఈ గ్రామంతో సహా చుట్టుపక్కల గ్రామాలమీద సైనికులు ఎప్పుడూ దాడి చేస్తుండేవారు. ఒక దాడి సందర్భంలో వీరు కల్లు తాగుతూ తాటివనంలో కూర్చున్నప్పుడు చూసి దూరంనుంచి దళం వారిని వెంటాడింది. వారు బండ్లలో అన్నం వండించుకొని వారి క్యాంపుకి తిరిగి పోతున్న సమయంలో దళం వారిని చుట్టుముట్టి, ఆ బండ్లమీద కాల్పులు కాల్చింది. బండ్లను చాటు చేసుకొని సైనికులు, పోలీసులు కాల్పులు కాల్చారు. ఈవిధంగా జరిగిన కాల్పుల్లో కొంతమంది సైనికులు, ఇతరులు చనిపోయారు. తక్కిన వారు బండ్లను వదిలి వెళ్ళిపోయారు. ఆ సందర్భంలో వీరికి ఒక రైఫిలు దొరికింది.

## ఆశ్విక దళం దాడులు – దళాల ప్రతిఘటన

**ఆశ్విక దళాల ప్రవేశం – వీటిని ఎదుర్కొనటానికి నల్లగొండ జిల్లా కమిటీ నిర్ణయించిన కార్యక్రమం :** అనేక సందర్భాలలో పోలీసులమీద

దళాలు దాడులు చేయగలగటం, కొన్ని సందర్భాలలో పోలీసులు చనిపోవటం, మరికొన్ని సందర్భాలలో రెండువైపులా నష్టాలు లేకుండా వెళ్ళిపోవలసిరావటంతో నిజాం ప్రభుత్వానికి తన మిలటరీ వ్యూహాన్ని కొంత మార్చుకోవలసిన అవసరం ఏర్పడింది. అశ్విక దళాలని ఉపయోగించటం ప్రారంభించారు. ముఖ్యంగా నల్లగొండ జిల్లాలో మూసీనది ప్రాంతంలో వీటిని ఉపయోగించారు. మూసీ వెడల్పుగా ఉంటూ, లోపల ఇసుక, రెండువైపులా గట్లు ఉండేవి. అక్కడ తాటిచెట్లు, ఇతర చెట్ల పొదలు ఉండేవి. రెండువైపులా నల్లభూమి కావటంతో జొన్న చేను ఉండేవి. ఈ భాగాలు దళాలకు రక్షణగా బాగా ఉపయోగపడేవి. రెండువైపులా ఉన్న గ్రామాలలో పార్టీ, ఆంధ్ర మహాసభ చాలా బలంగా ఉండేవి. దళాలు ఈ మూసీ ప్రాంతంలో రక్షణ తీసుకొని పోలీసులను ఎదుర్కోవటం ప్రారంభించాయి. అంతకుముందున్న పద్ధతుల్లో దళాలపై దాడులు చేయటం సాధ్యంకాకపోయేది. ఈ దళాలు ఉన్నంతవరకు ప్రజలను భీభత్సం చేయటం కూడా సమస్యే అవుతుంది. దీనితో దళాలపై, ప్రజలపై దాడులు జరపటానికి అశ్విక దళాలను ఉపయోగించారు. ఈ దళాల్లో సాధారణంగా 15-20 మంది అశ్వికులు ఉన్నప్పటికీ, ఇద్దరు, ముగ్గురు సైనికులు రెండు గుర్రాలెక్కుకొని కలిసి దాడులు చేసేవారు. వారి చేతిలో రైఫిలుతోపాటు ఇతర ఆయుధాలు కూడా ఉండేవి. దూరంనుండి చూసి కాల్చటానికి రైఫిలు ఉపయోగపడుతుంది. గుర్రంమీదనుండి గురిచూసి, రైఫిలు రేంజిలో ఉన్న దళంమీద కాల్చటం సాధ్యమవుతుంది. దగ్గరికి వచ్చిన వారిని బల్లాలతో పొడవటం, లేక షాట్ గన్ను, స్టెన్ను, రివాల్వరు, పిస్టలులాంటి ఆయుధాలతో కాల్చటం సాధ్యమవుతుంది. వీటిని పెట్టుకొని ఈ అశ్విక దళం సైనికులు దాడులు చేస్తుండేవారు. దళాలు పరిగెత్తటానికి కొంత ఇబ్బందయేది. పోలీసులు పరిగెత్తితే దళాలు కూడా పరిగెత్తటంలో ఇద్దరూ సమ ఉజ్జీలుగా ఉంటారు. పోలీసుకి పైచేయి ఉండదు. కాని గుర్రాలుండటంతో ఈ అశ్వికదళం త్వరగా పరిగెత్తి దళాన్ని పట్టుకొనటం, లేదా వారిని చుట్టుముట్టటం తేలికవుతుంది. ఈ రకంగా మూసీకి రెండువైపులా ఉన్న గ్రామాలపైన అశ్విక దళం సైనికులు ఇద్దరు, ముగ్గురుగా వచ్చి దాడి చేసేవారు. మొదటి దశలో – వచ్చిన మార్పును అర్థం చేసుకోలేక దళాలు ఇంగుతిన్నాయి. అప్పుడు జిల్లా కమిటీ వీటిని గురించి ఆలోచించి ఒక కార్యక్రమమిచ్చింది. మొదటిది : దళాలు రక్షణ ప్రాంతాల్లో

ఉంటూ పోలీసుల, అశ్విక దళం కంటపడకుండా ఉండాలి. ఒకసారి కంటపడినా, వారు దగ్గరికి రాగానే, పొజిషన్ నుండి వారు కాల్చక ముందే కాల్చాలని సూచించారు. వారు ముందే కాలిస్తే పక్కకు తప్పుకోవాలనీ; వారు కదులుతూ కాలుస్తుంటారు కనుక కాల్చటం చాలా కష్టం, అసంభవమనీ ; అందువల్ల వారి కాల్పులకు భయపడవలసిన అవసరం లేదనీ ; వారి గుళ్ళు గురిలేకుండా వెళ్ళి పోతాయనీ, ఎవరికీ తగలవనీ, అధైర్యపడవద్దనీ స్పష్టం చేయటం జరిగింది. రెండవది : ఈ దళాలు గనుక కాల్చితే ఆ దెబ్బల చప్పుడుకు గుర్రాలు బెదిరి పోతుంటాయి. గుండ్లు వాటిదగ్గర నుండి దూసుకుపోతే గుర్రాలు చావకున్నా బెదిరిపోతాయి. మూడవది : గుర్రాలు పరిగెత్తుతున్నప్పుడు ఒక పరిధి (range)లో పరిగెత్తుతుంటాయి కనుక, వాటిపై కాల్పులు కాల్చితే కొన్ని సందర్భాలలో గుర్రాలకు తగులవచ్చును. వాటికి గాయాలు తగిలి, బెదిరి, ఖంగుతిని కంట్రోలులో లేకుండా పరిగెత్తుతాయి. దానితో సైనికులే చిందర వందర అవుతారు. అందువలన భయపడవలసిన అవసరం లేదని దళాలకు జిల్లా కమిటీ కొత్తగా సూచనలు పంపించింది. వాటిననుసరించి దళాలు పనిచేశాయి. దానితో ఈ అశ్విక దళాల వలన శత్రువుకు అంత ఉపయోగం లేకపోయింది. కానీ మొదటి రోజుల్లో కొంత గందరగోళం చెలరేగింది. కొన్ని గ్రామాల దాడుల్లో వాటి వివరాలు చూడవచ్చును.

అర్రూరు గ్రామంపై అశ్విక దళ దాడి : అశ్వికదళాలు రావటానికి కారణాలు వివరించాము. వారు తమ దాడులకు ప్రధానంగా మూసీఒడ్డు ప్రాంతాన్ని కేంద్రంగా చేసుకున్నారు. దానికి దగ్గర్లోఉన్న అర్రూరు గ్రామం (అప్పటి భువనగిరి తాలూకా; ఇప్పటి రామన్నపేట తాలూకాలో ఉంటుంది.) మీద దాడి చేశారు. భూస్వాముల కుటుంబాలున్న పెద్దగ్రామమిది. ఇది పార్టీకి బలమైన కేంద్రంగా ఉండేది. ఆగ్రామాన్ని రజాకార్లతోపాటు అశ్వికదళంవారు చుట్టుముట్టి, గ్రామంలో చేరి ఇళ్ళలో జొరబడి లూటీచేశారు; స్త్రీలను మానభంగంచేశారు. అక్కడున్న ప్రజలను ఊరిబయటకు తీసుకెళ్ళి, వారిని పెద్దఎత్తున హింసించటానికి తయారయ్యారు. మధ్యయుగాలనాటి పద్ధతులు అనుసరించారు. చింత బరిగెలు, ఈత బరిగెలు తీసుకొని కొట్టటం ఆపద్ధతుల్లో ఒకటి. అప్పటికి దగ్గరలో ఉన్న దళాలకు వార్తచేరింది. దళాలతోపాటు దెబ్బతిన్నవారందరూ విడివిడిగా చీలి, శత్రువుమీద దాడిచేయటానికి ప్రయత్నంచేశారు. ప్రజలను హింసిస్తున్న

సందర్భంలో ఒక బృందంవారు గ్రామంలో ఒక ఎత్తైన చెట్టుమీదికి ఎక్కి కాల్పులు కాల్చటానికి సిద్ధమయ్యారు. మరొకబృందంవారు ప్రజలను హింసిస్తున్న చోటుకి ప్రక్కనేఉన్న గుట్టపైకి ఎక్కారు. మూడో బృందంవారు వీరు తప్పుకోవటానికి పోయే దారిలో, దగ్గరలోఉన్న మరొకప్రదేశంలో మాటువేసుకొని కూర్చున్నారు. ఒకేసారి కాల్పులు కాల్చటం మొదలుపెట్టారు. వారు కట్టేసిన గుర్రాలమీదికి కాల్చారు. కొన్ని గుర్రాలు చనిపోయాయి. అప్పటికప్పుడే మిలటరీవారు పొజిషన్ తీసుకొని, తిరిగి కాల్పులు కాల్చటానికి ప్రయత్నంచేశారు. కానీ వారికి సాధ్యంకాలేదు. దీనితో గెరిల్లాలు సురక్షితంగా ఉన్నారు. దళాలు మూడువైపుల నుండి కాల్పులుకాలుస్తుంటే శత్రువులు ఎటుపోవాలో తెలియకఉన్న సందర్భంలో, వారు నిర్బంధించిన ప్రజలంతా గ్రామంలోకి తిరిగివచ్చారు. దళాలు కాల్పులు ఆపేయటంతో దెబ్బతినిఉన్న రజాకార్లు, అశ్వికదళం పారిపోయారు.

వెలమజాల గ్రామంపై దాడి : పాత భువనగిరి తాలూకాకు చెందిన వెలమజాల అనే గ్రామంలో ఒకదళం అక్కడి సమస్యలను పరిష్కరించటానికి వచ్చి, బహిరంగ సభను జరుపుతున్నది. ఆ సందర్భంలో అశ్వికదళం దాడి చేసింది. అప్పటికప్పుడు సభను జరపటం మానేసి ఎదురుదాడి చేయటానికి సిద్ధమయింది దళం. ఒక దళ సభ్యుడు అశ్వికదళం నాయకుని మీద తన నాటు తుపాకీని గురిపెట్టి కాల్చాడు. అది కొద్దిలో తప్పిపోయింది. ఇతనిమీద అశ్వికదళం వారు కూడా కేంద్రీకరించి కాల్పులు కాల్చటం మొదలుపెట్టారు. ఎట్లైనా తను చనిపోవటం ఖాయమని భావించి ఆ దళ సభ్యుడు ఎదురు కాల్పులు కాలుస్తూ వారిపై బాగా కేంద్రీకరించాడు. ఆ సమయంలో తక్కిన దళ సభ్యులంతా తప్పుకున్నారు. తిరిగి దళాన్ని పునర్నిర్మించుకొని తమ పనిని కొనసాగించారు.

రాపాక గ్రామంపై దాడి : మూసీ ఒడ్డు ప్రాంతాననే 'రాపాక' అని ఒక గ్రామం ఉంది. అక్కడికి ఈ అశ్వికదళం బయలుదేరి దాడి చేస్తూ, గ్రామాలను లూటీ చేయటం, స్త్రీలను మానభంగం చేయటం లాంటి పనులు చేస్తూ ఉండేది. ఒకసారి గ్రామంపై దాడి చేసినప్పుడు గెరిల్లాదళం తప్పుకుపోవటానికి ప్రయత్నం చేసింది. ఆ సందర్భంలో అశ్వికదళాలు దళాల వెంట పరిగెత్తాయి. వేరే మార్గం లేక అప్పటికప్పుడు పొజిషన్ తీసుకొని దళాలు ఆ గుర్రాలమీద కాల్పులు సాగించారు. గుర్రాలు బెదిరిపోయి వారు వెనక్కి

పోవలసి వచ్చింది. పోతూపోతూ వారికి ఒక స్థానిక నాయకుడు కనిపిస్తే అతన్ని కాల్చి చంపారు. అయితే ఈ సంఘటన అశ్విక దళాలను ఎదుర్కోవచ్చుననే విషయాన్ని రుజువు చేసింది. అంతకుపూర్వం పార్టీ జిల్లా కేంద్రం నుంచి వచ్చిన సూచనలను అమలు జరిపిన ఫలితంగా వారు జయప్రదంగా ఎదుర్కోగలిగారు. ఆ విధంగా ఆత్మవిశ్వాసం కూడా ఏర్పడింది.

**సోలిపేటపై దాడి :** సూర్యాపేట తాలూకా సోలిపేట గ్రామం చుట్టుపట్ల పెద్ద తాటివనం ఉంది. ఇది ఒక దళానికి కేంద్రంగా ఉంది. దళం ఇక్కడ ఫలానా చోట ఉందన్న సంగతి అంతకుముందే పోలీసు ఏజెంట్లద్వారా వారికి తెలిసింది. రజాకార్లను వెంటబెట్టుకొని పోలీసులు అశ్వికదళం సహాయంతో అక్కడ దాడిచేశారు. అశ్వికదళం వస్తున్నదని తెలిసి ముందే దళం మాటు వేసుకొని కూర్చున్నది. రాగానే కాల్పులు చేశారు. దానితో ఒక గుర్రం, పోలీసులు అక్కడికక్కడ మరణించారు. ఆ తర్వాత అక్కడ నిలుచోవటం వారికి చాలా కష్టమైంది. కాల్పులు కాలుస్తూ పారిపోయారు. వారి వెంటబడి గెరిల్లాలు తరిమారు. రజాకార్లు దెబ్బతినటాన్ని చూసిన ప్రజలలో ఉత్సాహం వచ్చిన ఫలితంగా వారిలో వెల్లువ రాకుండా ఉండటానికి తిరిగి గ్రామాలమీద దాడిచేసి, ప్రజలను పెద్దఎత్తున కాల్చి చంపారు.

**అశ్విక దాడిలో అమరుడైన పసునూరు వెంకటరెడ్డి :** అశ్విక దాడిలో చనిపోయిన మరొక కామ్రేడు పసునూరు వెంకటరెడ్డి. నల్లగొండ తాలూకాకు చెందినవాడు. విద్యార్థిగా చాలా చిన్నతనంలోనే పార్టీలోకి వచ్చాడు. విద్యార్థి రంగంలో పని చేశాడు. కాలేజీలను, చదువులను వదిలేసి పోరాటాలకు సిద్ధం కావాలని పార్టీ, విద్యార్థి సంఘాలు ఇచ్చిన పిలుపును అందుకొని వచ్చి, నకిరేకల్లు చుట్టుపట్టు ప్రాంతంలో గ్రామాల్లో పని చేశాడు. నకిరేకల్లు ప్రాంతంలో మూసీ ఒడ్డు ప్రాంతం కూడా చాలానే ఉండేది. అక్కడ ఇతను, ఇతని దళం పనిచేసే వారు. ప్రజల మన్ననలు పొందిన యువ నాయకుడతను. ఇతను అన్నారం గ్రామంలో ఉండగా పోలీసు ఏజంట్లు (సిఐడీలు) ఇచ్చిన సమాచారాన్ని ఆధారం చేసుకొని శత్రువులు వచ్చి దాడిచేసి పట్టుకొని కాల్చి చంపారు. ఇతనివెంట ఉన్న ఇంకొక కామ్రేడును కూడా చంపివేశారు[87].

సమీక్ష :

నిజాం మిలటరీ, పోలీసులు, రజాకార్లు ఒకవైపున; పార్టీ, గెరిల్లా దళాలు, స్థానిక దళాలు, ప్రజలు మరొక వైపున ఉంటూ జరిపిన దాడులు, ఎదురు దాడులు, సంఘర్షణలలో పార్టీ నాయకత్వం, ముఖ్యంగా స్థానిక నాయకత్వం చాలా నష్టపడింది. ప్రజలుకూడా చాలామంది చంపివేయ బడ్డారు. లూటీలు, మానభంగాలు మామూలు అయిపోయాయి. అయినా శత్రుపక్షంవారిని కూడా చంపివేయటం సాధ్యమయింది. రెండవది : గ్రామరాజ్యాలు ఏర్పాటు చేయటం, భూమి పంపకం, ఇతర భూస్వామ్య వ్యతిరేక కార్యక్రమాన్ని అమలు జరుపటం వంటి ప్రజా కార్యక్రమం వలన ప్రజల్లో ప్రతిఘటనా శక్తి పెరిగిపోయింది. ప్రజలకు ఆత్మ విశ్వాసం ఏర్పడింది.

'కంపెనీ దళాల' పెడధోరణి : దీనితో ఒక అవలక్షణం కూడా వచ్చేసింది. దళాలు ప్రతిఘటించటం చూసి, వాటిలో చేరటం వలన రక్షణ ఎక్కువ ఉంటుందని యువకుల్లో ఒక అభిప్రాయం ఏర్పడింది. గ్రామాల్లో దళాల్లో చేరితే ప్రజల్లో చాలా పలుకుబడి, ఆదరణ ఉండటం మరో కారణం. దీనిని చూసి యువకులు ఎక్కువమంది దళాల్లో చేరటం మొదలుపెట్టారు. దళాల్లో చేరటం వలన నష్టమేమీ లేదు. చేరవలసిందే. కానీ ముఖ్యమైన దళంలో వీరంతా చేరటంవలన అంతకుపూర్వం 9 మంది ఉన్న దళ సంఖ్య క్రమంగా పెరిగి 20, 30, 40, 50, 100 మంది వరకు గల దళాలు కూడా ఏర్పడినాయి. వీరు దళాల్లో సభ్యులుగా ఉండేవారు. ఎక్కడికి వెళ్ళినా పెద్ద దళం ఉంటుందని దళ నాయకులు కూడా దాన్ని కాదనలేదు. అది గెరిల్లా సూత్రాలకు వ్యతిరేకమైనప్పటికీ, దళ నాయకులు దాన్ని ప్రోత్సహించారు. దీనితో ఈ దళాలు ఎక్కడికి వెళ్ళినా పెద్ద అట్టహాసంతో వెళ్ళవలసి వచ్చేది. తల బరువుగా తయారై అనేక సందర్భాలలో రజాకార్ల దాడిలో చిందరవందర కావలసివచ్చింది. ఇవన్నీ 'కంపెనీ దళాల'ని పేరుబడినాయి. అది దానంతటది వచ్చిన పేరు. వాస్తవంలో కంపెనీకి అటువంటిదేమీ ఉండదు. కంపెనీలో మామూలుగా 9 నుండి 11 మంది వరకు ఉంటారు. ఇంతకంటే ఎక్కువమంది ఉండరు. కాని పైన చెప్పిన విధంగా కంపెనీ దళాలు ఏర్పడి గ్రామాలలో తిరుగుతున్నప్పుడు, అనేక సందర్భాలలో రజాకార్లు పోలీసులు, మిలటరీవారు వాటిమీద జయప్రదంగా దాడులు చేసి, చాలావరకు నష్టపరచగలిగారు.

ఈదళాలను నిర్వహించటం సాధ్యం కాకుండాపోయింది. రెండవది: పిరికి సన్యాసులు కూడా తమ ఆత్మరక్షణకొరకు ఈ దళాలలో చేరేవారు. ఆత్మరక్షణ కొరకు చేరినవారికి దళాలలో స్థానం ఉండదు. ఆత్మ రక్షణ ఎక్కడికక్కడ స్థానిక ప్రజల్లో ఉండి చేసుకోవలసిందే. అఫెన్సివ్ (దెబ్బతీసే) చర్యలు తీసుకోవలసిన గెరిల్లా దళాల్లో ఈ ఆత్మరక్షణ కొరకు పిరికితనంతో చేరిన వారికి అవకాశం ఉండదు. వారు తల బరువుగా తయారు కావటమే కాక, మిలటరీవారు, పోలీసు వారు దాడిచేసినప్పుడు ముందు పరిగెత్తేది వీరే. వీరి పిరికితనంవలన వారు చెదిరి పోవటమేకాక, వీరి చర్యలు దళాన్నంతటినీ చెదరగొట్టటానికి దారితీసేవి. దళంలో ఏదో పనితీసుకొని చేసేవారు కనుక, సమయం వచ్చినప్పుడు వారు నిబ్బరంగా, స్థిమితంగా, దళంలో ఉండవలసిన క్రమశిక్షణతో ఏ పనీ చేయలేకపోయేవారు. అనేక సందర్భాలలో దాడులు జరగటానికి, కాపలా ఉంచినా కాపలా పనిని నిర్వర్తించలేకపోవటానికి ఈ కొత్తగా వచ్చిన సభ్యులే కారణమయ్యారు. ఈ విధంగా కొన్ని నష్టాలు జరిగిన తర్వాత, రాష్ట్రకేంద్రానికి ఈ వార్తలు తెలిసి, పెంబడే కంపెనీ దళాలని రద్దుచేసి, చిన్న చిన్న దళాలను ఏర్పాటు చేయమని సూచనలు పంపించింది. దాని ప్రకారం పెద్ద దళాలను రద్దుచేసి, 9 నుండి 11 లేక 13 మంది సభ్యులుండే దళాలుగా పునర్నిర్మాణం చేశారు. అప్పటికి 20 మంది గల దళాలను పెట్టుకోవాలనే ఒక ధోరణి బలంగా ఉండేది. ఎందుకంటే ఈ దళ నాయకులకు కూడా ఎక్కువమంది ఉంటే ఆత్మవిశ్వాసం ఉండేది. తక్కువమంది ఉంటే ప్రతిఘటించలేము అనే భయం ఉండేది. దానికి ఆస్కారమేమీ లేదు. వాస్తవమేమంటే, తక్కువమంది ఉండే దళమే ఎక్కువ సమర్థవంతంగా పనిచేస్తుంది. ఎక్కువమంది ఉన్నప్పటికీ, అసమర్థులు కూడా దానిలో చేరి ఉండటం వలన దళ సామర్థ్యం దెబ్బ తింటుంది. అంతా సమర్థులైతే, ఎక్కువ దళాలు ఉండే అవకాశమున్నచోట ఒకేదళం ఉండటంవలన నష్టం జరుగుతుంది. ఆ దళానికి కావలసిన తిండి ఏర్పాట్లు చేయటం కూడా ప్రజలకు భారంగా ఉంటుంది. రహస్యాన్ని కాపాడటానికి కూడా అవకాశముండదు. దాడులలో నూటికి 99 వంతులు సిఐడిల (పోలీసు ఏజెంట్ల) సూచనల ప్రకారం జరిగినవే కాని సాధారణ పద్ధతులలో వారు చేసినవికావు. ఈ విధంగా దళాల పునర్నిర్మాణం జరిగింది.

**దళాల మిలటరీ నైపుణ్యం, సంఖ్య పెరుగుదల :** ఈ సంఘర్షణ,

పోరాటం ఫలితంగా, ప్రజలకు, గెరిల్లా దళాలకు, పార్టీకి అనుకూలమైన మరికొన్ని పరిణామాలు కూడా సంభవించాయి. దళాలకు కొన్ని అధునాతన ఆయుధాలు దొరికినవి. అధునాతన ఆయుధాలంటే 303 రైఫిళ్ళు, స్టెన్‌గన్లు ఇటువంటివి. రెండవది: మందుగుండు సామగ్రి, తుపాకిమందు పెద్దఎత్తున సమీకరించి నిల్వ చేసుకోగలిగారు. ఇది బర్మార్లు వంటి (Muzzle-loaders) ఆయుధాలకు ఉపయోగపడుతుంది. అంతకుముందు రోజుల్లో సరిపడినంతగా తుపాకి మందు లేకపోవటంవలన, వెంటవెంట నాటు తుపాకులను కాల్చటం సాధ్యం కాకపోయేది. ఎందుకంటే కొద్దిపాటి మందుతో కొన్ని దెబ్బలు మాత్రమే కాల్చగలుగుతారు. ఒక దెబ్బకు, మరో దెబ్బకు మధ్య కొంత వ్యవధి, సుమారు 5 నిముషాలు, లేక బాగా సమర్థవంతంగా మందు నింపగలిగితే ఒక నిముషమైనా అవసరమవుతుంది.

కొంత అనుభవం ద్వారా నేర్చుకోగలిగి నప్పటికీ, మందుగుండు సామగ్రి తగినంత లేకపోవటం వలన ఎక్కువ దెబ్బలు కాల్చలేకపోయారు. ఈ దాడుల సందర్భంలో వనరులుకూడా ఏర్పడ్డాయి. దళాలు ఎక్కువ మందుగుండు సామగ్రిని సంపాదించ గలిగాయి. ఇదే విధంగా వివిధ ప్రాంతాలనుంచి డైనమైట్లు, ప్రేలుడు పదార్థాలు కూడా సంపాదించగలిగారు. వాటిద్వారా రోడ్లను తెంపటం చిన్న చిన్న వంతెనలను కూలదోయటం, ఇటువంటి వన్నీ సాధ్యమయ్యేది. అదే విధంగా ఎక్కువకాలందాకా ప్రతిఘటన సాగించటం సాధ్యమయ్యేది. దళాల పునర్నిర్మాణంతో దళాల సంఖ్య పెరిగింది దళాల సమర్థత కూడా పెరిగింది. దళాలలో ఆత్మవిశ్వాసం కూడా పెరిగింది. వాటికి కావలసిన ఆయుధాల సప్లై కూడా జరిగింది. సమర్థవంతమైన కామ్రేడ్సుకు, గెరిల్లాదళ సభ్యులకు అధునాతనమైన ఆయుధాలిచ్చేవారు. కొత్తగా వచ్చేవారికి, నేర్చుకునేవారికి నాటు తుపాకులు, వారి నాయకత్వానికి షాట్‌గన్స్ లాంటివి ఇచ్చేవారు. ఈ విధంగా ఆయుధాలు సమకూర్చుకోవటంలో గెరిల్లా దళాలు కొంతవరకు సఫలం కాగలిగాయి. కేంద్రం నుంచి కూడా కొన్ని ఆయుధాలు అందించటం జరిగింది. వాటిలో ముఖ్యమైనవి గ్రైనర్లు. ఇవి సబ్‌మిషిన్ గన్లే కాని కొత్త రకంవి. చాలా పెద్ద ధ్వనితో ఎక్కువ దూరం వరకు తుపాకి గుండ్లు దూసుకు పోయేవి. ధ్వని చూసి పోలీసులు, మిలటరీ వారు భయపడి పరిగెత్తిపోయేవారు. శత్రువును చంపగలిగే శక్తి కూడా ఉండేది. అయితే ఈ ఆయుధాలు చాలా స్వల్పంగానే సరఫరా అయినాయి.

సరిహద్దుల్లో ఉండే దళాలకు, రాష్ట్ర కేంద్రానికి అందుబాటులో ఉన్న ప్రాంతాలకు ఎక్కువగా వాటి సరఫరా జరిగింది. లోతట్టు ప్రాంతాలకు తక్కువ జరిగింది. హైదరాబాదుకు సమీపంలో ఉన్నవారు అక్కడినుంచి తెప్పించుకోగలిగేవారు. ఆ రోజుల్లో అక్కడ ఆయుధాల అమ్మకం కూడా పెద్దఎత్తున జరిగింది. ఈ విధంగా ఆయుధాల సేకరణ బహుముఖాలుగా జరిగింది. దళాల యొక్క దెబ్బతీసే శక్తి, సామర్థ్యం (effectiveness) కూడా ఈ రకంగా పెరిగింది. అక్కడక్కడ మిలటరీలో పనిచేసినవారు కొందరు వచ్చి దళాలలో చేరటంతో వాటి కాల్చగలిగిన సామర్థ్యం (firing capacity) పెరిగింది. అయితే వీరిలో కొందరు ద్రోహం చేసిన వారున్నారు. నిలబడి పనిచేసిన వారు కూడా కొందరున్నారు. ఈ రకంగా దళాల మిలటరీ నైపుణ్యం, సంఖ్య రెండూ పెరిగినవి. తర్వాత కాలంలో ఇది బాగా ఉపయోగపడింది.

## పాతకాలపు పద్ధతులను అనుసరించి జరిగిన కొన్ని పెద్ద పోరాటాలు

ఒకవైపున ఈ స్థితి ఉంటే, లోతట్టు ప్రాంతాలలో దళ నాయకత్వం గెరిల్లా పోరాట సూత్రాలను అవగాహన చేసుకోలేకపోయిన చోట్ల, వెనుకటి బాహాబాహీ పోరాట పద్ధతులని అనుసరించారు. కంపెనీ దళాలనేవి కొన్ని ప్రాంతాల్లో ఉంటే, కొన్ని ప్రాంతాల్లో వెనుకటి పద్ధతులను అనుసరించారు. ఉదా : వలంటీర్లు, ప్రజలుంటారు. ఎత్తైన ప్రదేశంలో ఒక భేరీ ఉంటుంది. రజాకార్లు, పోలీసులు రావటంచూసి భేరి చప్పుడు చేస్తారు. ప్రజలంతా ప్రతిఘటనకు సిద్ధమవుతారు. ఇటువంటి పద్ధతి కొన్ని ప్రాంతాల్లో అమలు జరుగుతునే ఉన్నది.

### బైరానుపల్లి పోరాటం :

బైరానుపల్లి గ్రామం ఒక పెద్ద పోరాట కేంద్రంగా తయారైంది. ఈ పద్ధతిలో జరిగిన పోరాటంగా దీనిని కొంత వివరించవలసి ఉంటుంది. గ్రామ ప్రజలు ఎక్కువభాగం ఈ పోరాటంలో పాల్గొన్నారు. అయితే ప్రజలలో కొంత చీలిక ఉండేదని తెలుస్తున్నది. అంటే ప్రజలలో పార్టీ నాయకత్వాన ఉన్న ఒక భాగం పోరాటానికి సిద్ధంగా ఉన్నారు. ఒకభాగం తటస్థంగా ఉండేవారు. మరొక భాగం దేశముఖు నాయకత్వాన ప్రభుత్వానికి అనుకూలంగా ఉన్నారు. తటస్థంగా ఉన్నవారు, పార్టీకి అనుకూలంగా ఉన్న వారు కలిస్తే మెజారిటీగా ఉండేదని ఒక రిపోర్టు ఉండేది.

కోటలంతా ఈ రోజుల్లో శిథిలావస్థలో ఉన్నాయి. చాలా వరకు నేలమట్టం చేసి, వాటి రాళ్ళను, ఇతర వస్తువులను గ్రామస్థులు ఉపయోగించుకున్నారు. అప్పటికి అక్కడక్కడ ఏదో రూపంలో ఉన్న ఈ కోటలు కనిపిస్తూనే ఉంటాయి. సుమారు 50 సంవత్సరాలకు పూర్వం, తెలంగాణా సాయుధ పోరాటం నడుస్తున్న కాలంలోనూ, ఈ కోటల్లో చాలా భాగం ఒక మేరకైనా గట్టిగానే ఉండేవి. ప్రతి కోటకూ ఎత్తైన గోడలు ఉంటాయి. మూడు మూలల బురుజులుంటాయి. ఈ బురుజులు రాతితో కట్టబడి ఎత్తుగా ఉంటాయి. అక్కడక్కడ బురుజులకు కొన్ని ద్వారాలుంటాయి. లోపలి భాగంలో ఖాళీగా ఉండి, మనుష్యులుండటానికి, లోపలినుండి బయటికి చూడటానికి కావలసిన ఏర్పాట్లు ఉంటాయి. బురుజులపైన చిన్న పిట్టగోడలు ఉంటాయి. ఆ గోడల మధ్య ఉండి ఊరు, ఊరు చుట్టూ చూడటానికి వీలుంటుంది. దూరంనుండి వచ్చే మనుష్యులను కనిపెట్టవచ్చును. అయితే అన్ని గ్రామాల్లో, అన్ని కోటలలో కట్టుదిట్టంగా ఉండే బురుజులుండవు. కొన్ని గ్రామాల్లో మాత్రమే ఇలాంటి బురుజులుంటాయి. కట్టుదిట్టంగా లేకున్నప్పటికీ, బురుజు గ్రామంలోని ఎత్తైన భాగంగా ఉంటుంది. అప్పటికి బురుజుకన్నా మించిన మేడలు గ్రామంలో తయారుకాలేదని చెప్పవచ్చును. ఎక్కడన్నా ఉంటే అరుదుగా ఉంటాయి. ఈ బురుజులు ఆనాటి దేశముఖులు, జాగీర్దార్లు, ఇలాంటి వారికోసం కట్టబడినవి. వీరంతా ఫ్యూడల్ భూస్వాములని చెప్పవచ్చును. బైరాన్‌పల్లిలో అలాంటికోట ఒకటి ఉంది. కోటకు బురుజులున్నాయి. బహుశా ఒక బురుజు, లేక మూడు బురుజులుకూడా ఉండవచ్చును. అక్కడి పోరాటానికి సంబంధించిన రిపోర్టులలో బురుజు గురించి చెప్పారు. అప్పుడు కోటలో అక్కడి భూస్వాములు దేశముఖులు ఎవరైనా నివసిస్తున్నారో లేదో తెలియదు. అనేక కోటలు సర్దుకోవటానికి వీల్లేకుండా పెద్దగా (unwieldy) ఉండటంవలన ఈ దేశముఖులు కోట వెలుపలికి వచ్చి, కొత్త ఇండ్లను ఏర్పాటు చేసుకొని, ఆ కోటను పాడుపెట్టి ఉంచిన సందర్భాలు అనేకం ఉన్నాయి. లేదా కోటలోని భూమిని ఇతర విధాలుగా ఉపయోగిస్తూ వచ్చారు.

తెలంగాణాలో 1946లో సాగిన పోరాటంలో ప్రతి గ్రామంలో వలంటీరు దళాలు ఏర్పరచి, వడిసెలలు, కర్రలు, ఇతర నాటు ఆయుధాలను ఉపయోగించి, పోలీసులను తరిమివేసిన అనుభవాలు ఉన్నాయి. ఆ సందర్భంలో ప్రతి

గ్రామంలో అక్కడ ఉన్న ఎత్తైన ప్రదేశంలోగానీ, అది లేకపోతే ఊరి వెలుపల వున్న ఒక ఎత్తైన చెట్టుమీదగానీ సెంట్రీ కూర్చునేవాడు. దూరంనుంచి పోలీసులు వస్తున్నట్టు చూడగానే, వెంటనే అతను గ్రామంలోకి వెళ్ళి వలంటీరు దళానికి చెప్పేవాడు. లేదా కొన్ని గ్రామాల్లో గంట, భేరీ ఇటువంటివి ఉపయోగించి, ప్రజలను అప్రమత్తులుగా చేయటం కొరకు గంటకొట్టేవారు, భేరీని మ్రోగించేవారు. ఇదివినగానే ప్రజలు వ్యవసాయ పనులు చేసుకుంటున్నా, అన్నంతింటున్నా, లేక ఏ ఇతరపనులు చేసుకుంటున్నా, అప్పటికప్పుడే వాటన్నింటినీ వదిలి పోరాటానికి సిద్ధంగాఉండేవారు. వలంటీరు దళాలు వడిసెలలతో సిద్ధంగాఉండి, పోలీసులు గ్రామ సమీపంలోకి చేరగానే బాగా రాళ్ళు రువ్వేవారు. వాటి ధాటికి తట్టుకోలేక వారు తిరిగి వెళ్ళి పోతుండేవారు. ఇలాంటి పద్ధతులను కొంత అభివృద్ధి పరిచి శత్రువు లను ఎదుర్కొన్న సంఘటనలు బైరానుపల్లి, ఇంకా ఇతర గ్రామాల్లో చాలా ఉన్నాయి. ఇక్కడి సంఘర్షణ తీవ్రంగా జరిగింది.

బైరానుపల్లి జనగామ తాలూకాలోని గ్రామం. ఆ ప్రాంతపు ఆర్గనైజరు గానుగపాటి నారాయణ రెడ్డి. ఆయన ఈ ప్రాంతంలోని గ్రామాలన్నీ తిరిగి, గ్రామాల్లో గ్రామ రక్షణ దళాల నేర్పాటుచేసి, పజలను ప్రతిఘటనకు సిద్ధం చేశాడు. ఇందులో భాగంగా బైరానుపల్లిలో గ్రామ రక్షణ దళం ఏర్పడింది. దళం, నాయకత్వం, గ్రామ కమిటీ ఇదంతా ఏర్పడి, గ్రామంలో ప్రభుత్వానికి పన్ను లివ్వటం మానివేశారు. లెవీధాన్యం ఇవ్వటం మానివేశారు. పోలీసు క్యాంపు కొరకు ప్రతి గ్రామానికి కొంత జుర్మానా విధించి వసూలు చేసేవారు. దానికి నిరాకరించారు. ప్రతిఘటనకు సిద్ధమయ్యారు. ఇది గ్రామంలోని పరిస్థితి.

ఈ గ్రామం లొంగటం లేదని తెలిసి ప్రభుత్వం ముందు ఒక పోలీసు బలగాన్ని పంపించింది. వారేమీ చేయలేక పోయారు. గ్రామం వెలుపలినుంచే గ్రామదళం, అక్కడున్న గెరిల్లాదళం కలిసి వారిని తరిమేశాయి. మరో సంద ర్భంలో పోలీసులూ, రజాకార్లు వచ్చారు. వారి పరిస్థితి కూడా ఇదే విధంగా తయారయింది. ఈ విధంగా సుమారు నాలుగు సార్లు, ప్రతిసారి సాయుధ బలా లను పెంచుతూ, గ్రామం మీదికి దాడులకి పంపించారు. ప్రతి సందర్భంలో వారిని ప్రతిఘటించి తరిమివేశారు. కొందరు పోలీసులకు, రజాకార్లకు గాయాలు తగిలాయి. తగినంత మంది చనిపోయారు. దళాల్లో ఉన్నవారు కూడా కొందరు చనిపోయారు. అయినా పెద్దఎత్తున

పోరాటం జరుగలేదు. ఇతర గ్రామాలతో పోల్చితే ఇది పెద్ద పోరాటమే. అయినా మిలటరీ వారు, పోలీసులు తలపెట్టినంత పెద్ద పోరాటం జరుగలేదు. ఈ విధంగా నాలగు దాడుల తర్వాత కూడా ప్రజలు లొంగిపోకుండా ప్రతిఘటించటం చూసి, పెద్దఎత్తున 500 మిలటరీతో గ్రామంపై దాడిచేశారు. దాడికి సుమారు 2-3 రోజుల ముందే మిలటరీ జనగామ చేరుకున్నది. అక్కడ బైరాను పల్లిమీద దాడిచేయబోతున్నదని అందరూ అనుకుంటున్నారు. ఈ విషయం అక్కడి స్థానిక రాజకీయ ఆర్గనైజరుకు తెలిసింది. వారు ఇక్కడుంటున్న గెరిల్లా దళానికి, స్థానిక గ్రామనాయకత్వానికి కొన్ని సూచనలు పంపించారు. పెద్దఎత్తున మిలటరీ వస్తున్నదనీ, ప్రతిఘటించడం సాధ్యం కాదనీ, గ్రామాన్ని ఖాళీ చేసి అక్కడున్న దళాలుకూడా తప్పుకోవాలనీ, మిలటరీ చేతిలో ఏదీ పడనివ్వకుండా ఉండాలనీ కబురు చేశారు. అయినా స్థానిక దళం, గ్రామ వలంటీరు దళం, గ్రామ నాయకత్వం అంతా కలిసి ప్రతిఘటించాలని నిర్ణయించు కున్నారు. ఇంతకు ముందు జరిగిన దాడుల్లో కొంత నష్టం జరిగినా, తిరిగి తరిమికొట్టగలిగారనే విషయాన్ని వీరు దృష్టిలో పెట్టుకున్నారు. ఒక దాడిలో లోపల ఉండి కొంత ప్రతిఘటించిన తర్వాత, ఇప్పుడూ అదేవిధంగా ప్రతిఘటించటం సరైనది కాదు. బురుజు నుండి, కోట లోపల నుండి బయటికి వచ్చి, రజాకార్లపైన, పోలీసులపైన పడి దాడిచేసి, ప్రతిఘటించి తరిమివేయవచ్చు. ఇందులో డిఫెన్సివ్ (దెబ్బ కాచుకోవటం), అఫెన్సివ్ (దెబ్బతీయటం) ఎత్తుగడలకు సంబంధించిన అవగాహన ఇమిడి ఉంటుంది. అంతకు ముందే రేణికుంటలో జరిగిన దాడిలో ఒకచోట ఉండి కాల్చటంవలన ప్రతిఘటించలేకపోయారు; ఒకమేరకే శత్రువును ఆపగలిగారు. తర్వాత శత్రువులు ముందుకు రాగలిగారు. వారిమీద పడి దాడిచేయాలనే దృష్టితో తమ స్థానాలను వదిలివేసి గ్రామంలో ముందుకు వచ్చి రజాకార్లు, పోలీసులమీద పడి కాల్చి తరిమేసిన సంఘటనలు అంతకు ముందు ఇక్కడ జరిగిన పోరాటంలో కూడా ఉన్నాయి. అయినా తాము ఇదివరకు వేసుకున్న ప్లాను ప్రకారం ప్రతిఘటించాలని మళ్ళీ నిర్ణయించుకున్నారు. దీనిప్రకారం బురుజుమీద బాగా తుపాకిమందు నింపుకున్నారు. నాటు తుపాకులు పెద్ద ఎత్తున ఉపయోగించారు. ఒకటి, రెండు అధునాతనమైనవి కూడా ఉండవచ్చును. కానీ హెచ్చుగా నాటు తుపాకులే ఉన్నాయి. తుపాకి మందు కూడా తగినంతగా ఉన్నది. వీటితోపాటు జజ్జాయి అనే ఒక ఆయుధాన్ని

ఉపయోగించారు. ఇది అధునాతనమైనదేమీకాదు. స్థానికంగా తయారు చేసినటు వంటిది. బహుశా ముందు దీన్ని సూర్యాపేట తాలూకాలోని ఎర్రబాడు గ్రామంలో అక్కడి దళం తనకు తానుగా ఆలోచించి తయారుచేసింది. ఆయిల్ ఇంజన్లకు ఉపయోగించే పెద్ద గొట్టాలను తీసుకువచ్చి, వాటినిండా తుపాకి మందు నింపి, దాన్లో కొన్ని సీసపు గుండ్లు, రాళ్ళు, ఇనుపముక్కలు, ఉవ్వెత్తున వెళ్ళి బాగా దెబ్బతీసే ఇతర వస్తువులను పెట్టేవారు. దానిని కాల్చి కోట గోడలను ధ్వంసంచేయటానికి, కోట వెలుపలనుంచి కోటలోపల రక్షణ తీసుకుంటున్న పోలీసులమీద, మిలటరివారిమీద గుళ్ళ వర్షాన్ని కురిపించటానికి వీరు ఉపయోగించారు.

బైరాన్‌పల్లిలో కూడా అటువంటివే రెండు, మూడు తయారు చేసి, బురుజులో పెట్టి, అక్కడ ఉండే కంతల ద్వారా బయటికి దెబ్బలు తగిలే విధంగా ఆ జజ్జాయిలను తయారుచేసి, ఆనించి పెట్టారు. అంతకుపూర్వం జరిగిన దాడుల్లో కూడా వీటిని ఉపయోగించారు. దీనిలో ఉన్న రాళ్ళు, ఇనుపముక్కలు లేక సీసపు గుండ్లు దూరంగా వెళ్ళి తగిలి, చుట్టివేసిన పోలీసులకు, మిలటరీకి దెబ్బలు తగిలినవి. ఇప్పుడు కూడా ఉపయోగించటానికి ఆ జజ్జాయిలను తయారు చేసిపెట్టారు. మందుగుండు సామగ్రి ఉంది కనుక, నాటు తుపాకుల్లో వరుసగా పేర్చటానికి కూడా తగిన ఏర్పాటు చేశారు. దీనిని ఉపయోగించగల గెరిల్లాదళం అక్కడ సిద్ధంగా ఉంది.

సైన్యం తెల్లవారుఝామున వచ్చి గ్రామాన్ని ముట్టడించింది. బయటికి వచ్చిన వారినందరినీ పట్టేసింది. దీనిని కనిపెట్టటంతో భేరీ మ్రోగింది. గ్రామ ప్రజలందరూ ప్రతిఘటనకు సిద్ధమయ్యారు. ఎవరికి తోచిన విధంగా వారు రాళ్ళతోను, వడిసెలలతోనూ గ్రామంలో ప్రతిఘటిస్తున్నారు. బురుజులోనుంచి తుపాకులు కాలుస్తూ, జజ్జాయిని కూడా ఉపయోగిస్తూ కాల్పులు సాగించటం మొదలుపెట్టారు. సైన్యంకూడా రెండోవైపునుంచి కాలుస్తూనే ఉన్నారు. వీరుపయోగించే జజ్జాయికి ఎదురుగా వారు ఒకటి, రెండు ఫిరంగులను కూడా తీసుకువచ్చారు. బురుజుపైకి గుళ్ళను కాల్చటానికి అవకాశం ఉండేవిధంగా ఈ ఫిరంగులను ఏర్పాటుచేసి తెచ్చి, అమర్చి దానిని ఉపయోగించారు. ఈ రకంగా చాలాసేపటిదాకా ఇరువైపులా పోరాటం జరిగింది. ఒక కథనం ప్రకారం ఉదయంనుంచి సాయంత్రం 4 గంటలదాకా ఇలాంటి పోరాటం

సాగింది. ఈ సందర్భంలో కొందరు సైనికులు గ్రామంలో ప్రవేశించి ప్రజలను చిత్రహింసలు చేశారు. దెబ్బలు కొట్టారు. పట్టుకొని తీసుకెళ్ళారు. ఈరకంగా చాలా తీవ్రంగా హింసాకాండ ఒకవైపునుంచి అమలు చేస్తున్నారు. ఒకవైపున ప్రతిఘటన సాగుతున్నది. మిలటరీ కూడా కాలుస్తున్నది. వారివైపున కొందరు ఈ సంఘటనలో చనిపోయారు. బురుజులో ఉండటంవల్ల దళానికి ప్రమాదం రాలేదు. కాని గ్రామంలో కోటను, ఇతర రక్షణను తీసుకొని, ప్రతిఘటన సాగిస్తున్న మిలిటెంట్లను, ఇతరులను కొందరిని తీసుకుపోయి హింసించి, కాల్చివేశారు.

ఒక కథనం ప్రకారం అంతకుపూర్వం తటస్థంగా ఉన్న దేశముఖు రాజీ ప్రయత్నం చేశాడని చెప్తారు. దాని ప్రకారం దళం ప్రతిఘటనాశక్తి సన్నగిల్లే పరిస్థితుల్లో ఆ దేశముఖును సైనికులు పిలిపించారు. జరిగిందేదో జరిగిందనీ, లొంగిపోతే ఎవరికేమీ ప్రమాదం లేకుండా బయటపడవచ్చుననీ, అతని ద్వారా దళానికి ఒక రాజీకబురు చేశారు. అతనువచ్చి దళం, స్థానిక నాయకులతో మాట్లాడి ఏమీ ప్రమాదంలేకుండాచేస్తానని బాధ్యత తీసుకొనివెళ్ళాడు. ఈ కథనం ప్రకారం లొంగిపోయిన తర్వాత అందరినీ కాల్చివేశారు.

మరో కథనం ప్రకారం ఈరకంగా రాజీప్రయత్నం చేసినది దేశముఖు కాదనీ, గ్రామ పోలీసుపటేలనీ చెప్తారు. అతను అమాయకుడనీ, వీరి రాజీమాటలు నమ్మి రాజీకోసం ప్రయత్నం చేశాడనీ, అయినా గ్రామ నాయకత్వం, దళం, దళ నాయకత్వం ఎవ్వరూ వినలేదని చెప్తారు. అప్పుడు పోలీసుపటేలు 'మీరు అందరూ కలిసిఉంటే ఏమీ ప్రమాదంలేకుండా బయటపడవచ్చును. ఇప్పుడు పోలీసుల చేతుల్లో కొంతమంది ప్రజలున్నారు. మీరు రాజీకి అంగీకరించకపోతే వారినీ, గ్రామప్రజలందరినీ కూడా కాల్చేస్తారు. రాజీచేసుకుంటే ఏదోఒకవిధంగా ఈ మారణకాండ లేకుండా బయటపడవచ్చున'ని చెప్పాడట. తర్వాత దళం, దళ నాయకత్వం అంతాకలిసి, తమ రక్షణకోసం ప్రజలందరినీ బలిఇవ్వవలసి వస్తున్నదిగదా అని ఆలోచించి, తుదకు లొంగిపోవటానికి నిర్ణయించుకున్నారని ఈ కథనం ప్రకారం చెప్తారు.

ఇంకో కథనం ప్రకారం — అది సుందరయ్యగారు రాసిన పుస్తకంలో ఉన్నది — దళం చివరంటా పోరాడారని, ప్రతిఘటనా శక్తి సన్నగిల్లిన తర్వాత మిలటరీవారు బురుజులోకి కూడా ప్రవేశించి, వీళ్ళందరినీ లాగివేసి, బయటికి

తీసుకువెళ్ళి కాల్చిచంపారని చెప్తారు. అక్కడున్న ప్రజలను, మొత్తం దళ నాయకత్వాన్ని, సంఘ నాయకత్వాన్ని కాల్చి చంపారని వారి కథనంలో ఉంది. ఈ విధంగా ఈ సంఘటన గురించి రెండుమూడు కథనాలు ఉన్నాయని గమనించాలి.

ఏమైనా ఇది స్థానిక భూస్వామి (అతను పటేలు కావచ్చును, దేశముఖ్ కావచ్చును. అతడే పటేలు, దేశముఖు రెండూ కావచ్చును.) ద్రోహంవల్ల జరిగిందని స్పష్టమవుతున్నది. ద్రోహం చేసినందుకు ఇతన్ని కాల్చి చంపారని చెప్తారు. తుదకు ఒక దశలో సైనికులే అతన్ని కూడా కాల్చి చంపారని మరో కథనం ఉన్నది.

ఈ దాడి గురించి మరికొన్ని వివరాలు ఉన్నాయి. గోడల చాటున ఉండి వలంటీర్లు, ప్రజలు ప్రతిఘటించిన ఉదాహరణలు ; ఒక సందర్భంలో పోలీసులు తెల్లవారుఝామున దాడిచేయటానికి గ్రామం వెళ్ళినప్పుడు స్థానిక దళ సభ్యుడైన సెంట్రీ పట్టుబడి, తప్పించుకొనివచ్చి గ్రామంలో చెప్పి, అందరిని ప్రతిఘటనకు సిద్ధం చేసిన ఒక వివరణ ఇవన్నీ వీటిలో ఉంటాయి.

**సమీక్ష :** అక్కడి ఆర్గనైజరు గ్రామ నాయకత్వానికి, దళానికి మొత్తం గ్రామాన్ని ప్రజలతో సహా ఖాళీ చేయమని చేసిన సూచనను వారు పాటించలేదనే విషయాన్ని గమనించాలి. ఈ విషయం ముందే తెలిసినప్పటికీ, వారు ప్రతిఘటనకు సిద్ధమయ్యారే కాని, ఖాళీచేయటానికి సిద్ధం కాలేదు. ఇదొక ముఖ్యమైన అంశం. గ్రామం మీద దాడి జరగబోతున్నప్పుడు గ్రామంలో, గ్రామం చుట్టూ ప్రతిఘటించేకంటే, వారు వచ్చేదారిని ముందే తెలుసుకొని, దారిమధ్యనే దళాలకు అనుకూలమైన స్థలాన్ని చూసుకొని, అక్కడ వారిని ప్రతిఘటించి మాటుదాడుల ద్వారా దాడిచేసి, నష్టంచేసి, తిరిగి వెనక్కి పంపించే పద్ధతులు అవలంబించవలసి ఉంటుంది. అలాంటివేమీ చేసినట్టు కన్పించదు. అంతకుపూర్వం గ్రామంపై జరిగిన మూడు, నాలుగు దాడుల్లో ఎదుటివారి సంఖ్య తక్కువగా ఉండటం, వారు అటో ఇటో తేల్చుకోవటానికి సిద్ధంగా లేకపోవటం వలన వారిని తరిమికొట్టి పంపించారు. బహుశా వీటిలో ఏదో ఒక దాడి సందర్భంలో దారిమధ్యలో కాల్పులు కాల్చి వారిని తరిమివేసిన సంఘటనలు కూడా ఉండవచ్చును. ఈ పెద్దదాడి సందర్భంలో గ్రామంలో ఉండి ప్రతిఘటించినదానికన్నా వారు వచ్చే దారులను చూసుకొని, వారు రాకుండా ఉండేవిధంగా గోతులు తవ్వటం, ఇలాంటి

విధ్వంసక కార్యక్రమాలు చేపట్టటం సరైంది. వచ్చినా వారిని చిందరవందర చేయటంకొరకు కొన్ని పనులు చేయవచ్చు. అలాంటి ప్లానుకూడా లేదు. ఈ దాడి సందర్భంలో గ్రామానికి వచ్చేదారి ఫిరంగిని అమర్చిన వాహనాన్ని కూడా రానివ్వటానికి వీలుగా ఉందంటే నాయకత్వం పోలీసును, మిలటరీని గ్రామానికి రాకుండా అడ్డుకోవాలనే విషయాన్ని ఆలోచించలేని స్థితిలో ఉన్నదని కనిపిస్తున్నది. రెండవది : సైన్యం వస్తున్నదని ముందే తెలిసినప్పుడు, శత్రువు చేతిలో ఏ విలువైన వస్తువుకూడా పడకుండా తీసుకొని, ఖాళీ చేయటానికి ఏర్పాట్లు చేయవలసి ఉండినది. ఇతర ప్రాంతాల్లో అప్పటికే గ్రామాల్లో ధాన్యాన్ని శత్రువు చేతిలో పడకుండా పాతరలు వేసి దాచిపెట్టటం, తెల్లవారు ఝాముననే అన్నం వండుకొని తీసుకొనివెళ్ళి, తమ పొలాల్లో ఉండిపోవటం, గ్రామంలో ఎవ్వరూ ఉండక (ముసలివాళ్ళు, పిల్లలు తప్ప) పోవటం అప్పటికే ప్రారంభమైంది. కానీ ఇక్కడ అవేవీ చేయక గ్రామస్థులంతా అక్కడే ఉండి ప్రతిఘటన సాగించాలనే నిర్ణయం జరిగింది. ఈ దృష్టితో చూస్తే వారు గ్రామాన్ని ఖాళీ చేయదలచుకోలేదని కనిపిస్తుంది. మామూలుగా ఫ్యూడల్ కాలంలో కోటలను ఏ లక్ష్యంతో నిర్మించారో ఆ లక్ష్యంతోనే కొంచెం అధునాతనం చేసి జజ్జాయిలను, పెద్దఎత్తున తుపాకులను ఉపయోగించటంలాంటి ఏర్పాట్లు చేశారని దీనినిబట్టి తెలుస్తున్నది. ఒక కథనం ప్రకారం వడిసెలల వంటివేకాక, సలసల కాగుతున్న నీటిని పైనుంచి పోస్తే బొబ్బలెక్కుతాయని వాటిని కూడా ఉపయోగించారని చెప్తారు. ఇళ్ళమీదికి వచ్చినప్పుడు వాటిని పడబోసితే ఆత్మరక్షణకు ఉపయోగపడేవి. ఆ రకంగా ఉపయోగించటంలో తప్పేమీలేదు. దానికి సన్నద్ధంగా ఉండవలసిందే. ఎక్కువ సంఖ్యలో వచ్చినప్పుడు, ఆకస్మాత్తుగా మనకు తెలియకుండా వచ్చినప్పుడు, చేయవలసిన పనులు కొన్ని ఉంటాయి. ముందే తెలిస్తే, వీటిని ఉపయోగించి ప్రతిఘటించటానికి బదులు, గ్రామాన్ని ఖాళీచేసి, దళాలు, స్థానిక దళాలు అక్కడక్కడా గుంపులుగా చేరి, సైన్యం పొలాలమీదుగా వస్తే కాల్చేవిధంగా ఏర్పాటు చేసుకుంటే వారిని ఎక్కువ దెబ్బతీసే విధంగా ఉండేది. తక్కువ ప్రాణ నష్టంతో బయట పడటానికి అవకాశం ఉండేది. అలాంటి పద్ధతులను ఇక్కడ అనుసరించలేదు. బాహాబాహీ యుద్ధ పద్ధతులను, కొంతవరకు పాతకాలపు యుద్ధ పద్ధతులను అనుసరించారు. ఇవి గెరిల్లా పోరాట పద్ధతులు కావు. ఈ అంశాన్ని గమనించాలి.

అయితే ఈ ప్రజా ప్రతిఘటన, ఆ సందర్భంగా వారు ప్రదర్శించిన ధైర్య సాహసాలు, పోరాట పటిమ మాత్రం అమోఘమైనవి. వీటిని మనం ఎప్పుడూ గుర్తుంచుకోవాలి. అయితే పోరాటంలో ధైర్య సాహసాలొకటే చాలదు. యుక్తి, ఎత్తుగడ అనేదొకటుంటుంది. సరైన ఎత్తుగడల ననుసరించాలి. ఈ కాలపు పరిస్థితులకనుకూలమైన ఎత్తుగడల ననుసరించటానికి ప్రయత్నం చేయాలి. పాతకాలపు ఎత్తుగడలనే యథాతథంగా అనుసరించకూడదు. పాత కాలంలో ఇలాంటి ఎత్తుగడలు అనుసరించినా, శత్రువు బలంగా ఉన్నప్పుడు తక్కువ బలం కలిగిన రెండో పక్షంవారు అనేక పరోక్ష పద్ధతులను అవలంబించి దెబ్బతీసిన ఉదాహరణలు మనకు కన్పిస్తాయి. వాటికి అనుగుణ్యంగా లేని ఈ పద్ధతులను మనం గమనించాలి.

కూటిగల్లు పోరాటం :

బైరానుపల్లిపై జరిగినట్లుగానే కూటిగల్లు (జనగామ తాలూకాకు చెందినది) అనే గ్రామంపై కూడా దాడి జరిగింది. ఇక్కడ అంతకుపూర్వం కొన్ని సంఘర్షణలు జరిగినవి. ఈ గ్రామంలో కొందరు ముస్లిములు ఉండేవారు. ముస్లిములున్న ఇతర గ్రామాల్లో చేసినట్లుగానే ఇక్కడి ముస్లిములను పోలీసులు వచ్చి, తీసుకువెళ్ళి రజాకార్లలో చేర్చారు. అయితే వాళ్ళ ఆస్తిపాస్తులు గ్రామంలో ఉండిపోవటంతో, వారు పోలీసు బలగంతో తిరిగివచ్చి ఈ ఆస్తులను తీసుకుపోవటానికి ప్రయత్నించారు. అప్పటికే గ్రామదళం ఏర్పడి ఉండటంవలన వారిని రానివ్వకుండా తరిమికొట్టారు. ఈ సంఘర్షణలో కొందరు రజాకార్లు, పోలీసులు చనిపోయారు. దీనితో సుమారు రెండు వందలమంది మిలటరీతో ఈ గ్రామంమీద దాడి జరిగింది. ఇక్కడకూడా దేశముఖు రాజీకోసం ప్రయత్నం చేస్తున్నానని చెప్పి, ప్రజలను, స్థానిక నాయకత్వాన్ని మోసగించాడని రిపోర్టు. వీరు ప్రతిఘటించారు. రాజీ పేరుతో జరిగిన ద్రోహంవల్లనే మిలటరీ గ్రామంలో జొరబడి మొత్తం 20 మందిని చంపింది. ఈ రెండు గ్రామాల్లో పెద్దఎత్తున మారణకాండ జరిగింది. దీనితో రజాకార్లు తమకు విజయం కలిగిందని భావించి, పెద్ద గుంపుతో వచ్చి ఈ గ్రామాలమీద పడి దోచుకోవటానికి ప్రయత్నం చేశారు. కాని అప్పటికే మిగిలిన దళాలు ఆ ప్రాంతంలో ఉండి, వీరు వచ్చిన జాడ తెలుసుకొని, వారిమీద కాల్పులు కాల్చి, వారి చేతికి ఏమీ దొరకకుండా చేశారు. తమ ఆస్తులను కాపాడుకోగలిగారు. ఆ తర్వాత రజాకార్లు ఈ గ్రామాలకు రావటం మానివేశారు.

# 11. నిజాంవ్యతిరేక పోరాటం-మూడవదశ

## (ఇరుపక్షాలు సమఉజ్జీలుగా ఉండటం, దళాల అఫెన్సివ్)

### 1. దళాలు డిఫెన్సివ్ నుండి అఫెన్సివ్‌కు వెళ్ళటం

తెలంగాణా అంతటా ప్రజా వెల్లువ ఇంకా ముందుకు పోయింది. అంతకు పూర్వం నేరుగా క్యాంపులమీద దాడిచేసే కార్యక్రమంలేదు. ఈ దాడులలో నష్టాలు జరిగినా, ఈ ప్రజా వెల్లువను గమనించిన తర్వాత డిఫెన్సివ్‌నుండి అఫెన్సివ్‌కు వెళ్ళే పరిస్థితులు ఏర్పడినాయని, దానికి తగిన కార్యక్రమం నిర్ణయించారు. దళాలన్నీ క్యాంపులమీద దాడిచేసి, వాటిని ఎత్తివేయించాలనే కార్యక్రమం తీసుకున్నారు. పై కమిటీలనుండి వచ్చిన సూచనల (directives) ప్రకారం ఇవి అంతటా అమలు జరిగినవి. ప్రారంభంలో ముఖ్యంగా నల్లగొండ, వరంగల్ జిల్లాల్లో జరిగినవి. ఆ తర్వాత ఇతర జిల్లాల్లో కూడా జరిగినవి.

వరంగల్ జిల్లా

**వర్ధన్నపేట క్యాంపుపై దాడి :** వరంగల్ తాలూకాలో వర్ధన్నపేట ఒక ముఖ్యమైన గ్రామం. దానికి దగ్గరలో ఉన్న కలనుపల్లె అనే గ్రామంలో స్థానిక ఆర్గనైజరు వచ్చి భూమి పంపకానికి ఏర్పాట్లు చూస్తున్నాడు. రక్షణ ఏమీ లేక పోవటం వలన పోలీసులు దాడిచేశారు. ఒకరిద్దరు మాత్రమే తప్పుకోగలిగారు. తక్కిన వారంతా పోలీసుల చేతిలో పడ్డారు. చిత్రహింసలు చేసి వారిలో చాలా మందిని చంపివేశారు. రహస్యాలు చెప్పమని చాలా నిర్బంధించారు. ఎవరూ చెప్పలేదు. పార్టీ సభ్యుల, దళ సభ్యుల వివరాలు తెలిపే కొన్ని నోటు పుస్తకాలు వారికి దొరకటంతో గ్రామంమీద పడి పేరుపేరునా వరుసగా హింసించటం మొదలు పెట్టారు. కానీ ఎవ్వరూ ఏమీ చెప్పలేదు. దానితో వారు విసుగెత్తి కొందరిని చాలా హింసించారు. కొన్ని ఇళ్ళను తగుల బెట్టారు. ఆ సందర్భంలో అక్కడున్న నాటు బాంబు ఒకటి బయటపడి పేలటంతో భయపడి పారిపోయారు.

ఈ సంఘటన తర్వాత, క్యాంపులను ఎత్తివేసే కార్యక్రమాన్ని అనుసరించి, ఆ ప్రాంతంలోని దళాలన్నీ వర్ధన్నపేట క్యాంపుపైన దాడి చేశాయి ఈ దాడిలో దళాలేకాక ప్రజల్నికూడా వెంట తీసుకొని వెళ్ళారు. క్యాంపులో ఉన్నవారిమీద దాడి చేసి కాల్పులు కాలుస్తుంటే, వారు పక్కనున్న కొండదగ్గరకు వెళ్ళి దాని చాటున రక్షణ తీసుకొని కాల్పులు కాల్చారు. రెండువైపుల కాల్పులు కాల్చటంతో వారు ఏమీ చేయలేక పోయారు. దళాలు ఎక్కువ సంఖ్యలో ఉండి, రక్షణ తీసుకొని కాల్పులు చేయటంతో, ప్రజలు గ్రామంలోకి వెళ్ళి తమధాన్యం, పశువులు మొదలైన తమ వస్తువుల నన్నింటిని తిరిగి స్వాధీనం చేసుకున్నారు. దీనితో అక్కడున్న పోలీసులు, రజాకార్లు క్యాంపు ఎత్తివేసి వెళ్ళిపోవలసి వచ్చింది. ఇది ప్రధాన రహదారిపైనున్న పెద్దగ్రామం.

దగ్గరలో ఉన్న రాయనపర్తి క్యాంపుమీదకూడా వెళ్ళి దళాలు దాడి చేశాయి. రజాకార్లు దోచుకువెళ్ళిన ధాన్యాన్ని, పశువులను, ఇతర వస్తువులను తిరిగి తీసుకువచ్చారు. దీనితో రజాకార్లు, పోలీసులు, ఆ క్యాంపులో ఉన్న ఇతరులు అంతా వరంగల్లు సెంటరు చేరుకున్నారు. ఈ రకంగా క్యాంపుల మీద దాడిచేసే కార్యక్రమం జయప్రదమైంది.

**రోడ్లను ధ్వంసంచేసి, క్యాంపులపై చేసిన దాడులు :** క్యాంపులను ఎత్తివేసే కార్యక్రమంలో ఒకభాగంగా రోడ్లను ధ్వంసం చేయటం కూడా ప్రారంభించారు. ప్రజల కదలిక హెచ్చు స్థాయిలో ఉన్నదని ఇంతకుముందే చెప్పాము. స్థానిక దళాలు కూడా బాగా రంగంలోకి వచ్చాయి. పోలీసులు తిరగని వేళల్లో (రాత్రులు లేక ఉదయంవేళ) పెద్ద సంఖ్యలో ప్రజలు గడ్డపారలు, పారలు తీసుకొని వెళ్ళి, రోడ్లలో బలహీనంగా ఉన్నచోట్ల పెద్ద ఎత్తున గండ్లు పెట్టేవారు. దీనితో పోలీసు వ్యాన్లు, లారీలు, జీపులు రావటం ఆగిపోయింది. లేక తగ్గిపోయింది. అదే సమయంలో క్యాంపులమీద దాడి చేయటంతో వాటికి రక్షణ లేకుండా పోతున్నదని, చిన్నచిన్న క్యాంపులన్నిటిని ఎత్తివేసి, ప్రధానంగా తాలూకా కేంద్రాల్లో ఉన్న క్యాంపులను మాత్రమే ఉంచారు. బోనకల్లు-వైరా రోడ్డు, కోదాడ-ఖమ్మం, ఖమ్మం-సితంపేట రోడ్డు వీటిపై ఉన్న క్యాంపులను ఎత్తివేయించటానికి ఒకవైపున ఆ రోడ్లను ధ్వంసం చేశారు. మరోవైపు ఆ క్యాంపులపై దాడులు చేశారు. దీనితో ఆ క్యాంపులను ఎత్తివేశారు. వీటిలో గన్నవరం దగ్గరున్న క్యాంపు ఒకటి. దమ్మపేట-

పాల్వంచ రోడ్డుపైన ఉన్న ముల్కలపల్లి గ్రామంలోని క్యాంపు మరొకటి. ఇలాంటి ఇతరచోట్ల కూడా క్యాంపులు ఎత్తివేయించగలిగారు. కోదాడ-ఖమ్మం రోడ్డును సీతంపేటతో కలిపే రోడ్డుమీద సాయుధ పోలీసులు గస్తీ తిరుగుతూ ఉండేవారు. గస్తీ దళం మీద దళాలు కాల్పులు సాగించటంతో వారిలో కొంత మంది చనిపోయారు వేగంగా వెళ్ళిపోవటంవలన లారీని ఆపటం సాధ్యంకాలేదు. ఈ కారణంవలన ఆయుధాలు స్వాధీనం కాలేదు. కానీ పెద్ద సంఖ్యలో పోలీసులు చనిపోవటంతో పోలీసు క్యాంపుకు చాలా నిరుత్సాహం కలిగింది. దీనినొక పెద్ద విజయంగా చెప్పవచ్చును.

నల్లగొండ జిల్లా సూర్యాపేట తాలూకాలో కొన్ని క్యాంపులను ఎత్తి వేయించటానికి దాడులు చేశారు.

**ఆత్మకూరు క్యాంపుపై దాడి :** ఆత్మకూరు రోడ్డుకు దూరాన లోతట్టు ప్రాంతంలో ఉన్న ఒక పెద్దగ్రామం. ఇక్కడ రజాకార్లు, పోలీసులు క్యాంపు వేశారు. ఇక్కడ దేశముఖుల ఇళ్ళు, ఇతర పెద్ద ఇళ్లు ఉండటంతో క్యాంపుకు కావలసిన ఏర్పాట్లన్నీ ఉన్నాయి. ఈ స్థితిలో క్యాంపుమీద దాడి చేయాలని దళాలు నిర్ణయించాయి. దీనికొరకు అంతకు ముందు వచ్చిన అనుభవాలనన్నింటినీ ఉపయోగించుకోవటానికి ప్రయత్నం చేశారు. తెల్లవారు ఝామున చీకట్లోనే దాడి చేయటానికి గ్రామానికి చేరుకున్నారు. గ్రామాన్ని చుట్టుముట్టకుండా పథకం ప్రకారం దళాల్లో కొంతమంది ఒకవైపునుంచి ఊరి లోపలికిచేరి అనుకూలమైన పొజిషన్ తీసుకున్నారు. దానితో పాటు సెంట్రీని చంపటానికి ఏర్పాటు చేశారు. సూర్యాపేట ఈ గ్రామానికి దగ్గర్లోనే ఉంటుంది. కనుక అక్కడి నుంచి వారికి సహాయంగా పోలీసు రాకుండా ఆపటానికి గ్రామం చుట్టూ కొన్ని దళాలు ఉండి ఆ దారిని కాచుకొని ఉన్నాయి. ఈ పరిస్థితుల్లో దాడి ప్రారంభమైంది. సెంట్రీని కాల్చగానే అతడు చనిపోయాడు. వెంటనే లోపల ఉన్న పోలీసు, మిలటరీ అంతా పొజిషను తీసుకొని కాల్చటం ప్రారంభించారు. ఏ మాత్రం చప్పుడైనా, చివరికి కాలు చప్పుడైనా కాల్పులు కాలుస్తారని తెలిసిన దళాలు వీటికి గురి కాకుండా జాగ్రత్తగా ఉన్నాయి. తుదకు హ్యాండ్ గ్రెనేడ్ (చేతిబాంబు) వేయటానికి ప్రయత్నం చేసినా అది ఫలించలేదు. ఒక దళ సభ్యుడుమాత్రం చనిపోయాడు. కొన్ని గంటల దాకా జరిగిన పోరాటం వలన ఏమీ ఉపయోగం లేనందున, దళం

తిరిగి సురక్షితంగా వెనకకు మళ్ళింది క్యాంపుమీద దాడి చేసి ఎత్తివేయించటానికి ఇదొక ప్రయత్నం.

**ఎర్రబాడు క్యాంపుపై దాడి :** తర్వాత ఎర్రబాడు క్యాంపుమీద దాడి చేశారు. ఇది సూర్యాపేట తాలూకాలోనే లోతట్టు ప్రాంతంలో ఉంటుంది. లక్షా యాభై వేల ఎకరాల భూమి ఉన్న పెద్ద దేశ్‌ముఖు జన్నారెడ్డి ప్రతాపరెడ్డి ముఖ్య స్థానం. ఆ పెద్ద భూస్వామ్య కుటుంబంలో వీరొకరు. సూర్యాపేట తాలూకాలో ఉన్న భూమి అంతా వీరి యాజమాన్యంలో, స్వాధీనంలో ఉండేది. ఆయనది పెద్దగడి. చుట్టూ బురుజులున్నా, బలమైన గోడలుగల కోటగా ఇల్లును నిర్మించుకున్నాడు. ఆ ఇంటిమీద దాడి చేయటం కొరకు జజ్జాయిలను ఉపయోగించాలని నిర్ణయించారు. ముందు ఒక బండిమీద ఈ గొట్టాన్ని పెట్టి, అందులో తుపాకిమందును, సీసపు గుండ్లను, రాళ్ళను, ఇనుపముక్కలను బాగా నింపి, ఆ గొట్టాన్ని బండికి గట్టిగా కట్టి, దాన్ని పేల్చారు. అది వెళ్ళి గోడకు తగిలింది. గోడ కొంచెం సడలింది కాని కూలలేదు. జజ్జాయి ఎదురుతాకిడి (reaction) వలన బాగా కదిలి బండి తిరిగిపోయి, ముక్కలు ముక్కలై పనికి రాకుండా పోయింది. దీనితో మరొక ప్రయత్నం చేశారు. ఈసారి దగ్గరున్న ఒక మర్రి చెట్టుకు కట్టి మళ్ళీ పేల్చారు. తిరిగిపోవటమనేదేమీ లేకుండా సాగిపోయింది. భయంకరమైన శబ్దంతో గోడకు తగిలింది. కాని అప్పటికీ గోడ పగలలేదు. గడ్డపారలతో గోడను పగలగొట్టడానికి చేసిన ప్రయత్నం కూడా ఫలించలేదు. ఈ సందర్భంలోనే ఒక కామ్రేడు లోపలున్న వారిమీద గ్రెనేడ్‌వేసి చంపాలని ప్రయత్నించాడు. అది లోపల పడకుండా గోడకు తగిలి వెనక్కు పడటంతో అక్కడ మూగిన ప్రజలపై పేలి, కొందరు చనిపోయారు. ఈ విధంగా మొత్తంగా నష్టపోయి దళం వెనక్కి తిరిగి రావలసి వచ్చింది. గాయపడ్డవారిని, చనిపోయిన వారిని మాత్రం తీసుకువెళ్ళారు. గాయపడ్డవారిని సురక్షిత ప్రాంతానికి చేర్చి, చికిత్స చేశారు.

ఇటువంటివి ఊహాజనితమైన, ఆచరణ సాధ్యంకాని దాడులుగా మిగిలాయి. వీటిని జజ్జాయి ప్లాన్ అని ఆ రోజుల్లో నామకరణం చేశారు. దీని కొరకు ప్రయత్నం చాలా పెద్దఎత్తున జరిగినా, ఇది విఫలమవటమేకాక, కొంత నష్టం కూడా జరిగింది.

**కొడకండ్ల క్యాంపుపై దాడి :** కొడకండ్ల సూర్యాపేట తాలూకా సరిహద్దున ఉన్న, జనగాం తాలుకాకు చెందిన పెద్ద గ్రామం. ముస్లింల జనాభాకూడా ఎక్కువ గానే ఉంది. ఇతర గ్రామాల ముస్లింలను కూడా ఇక్కడికి తీసుకువచ్చి, రజాకార్లలో చేర్చి, అక్కడి మిలటరీ క్యాంపులో పెట్టి, అక్కడినుండి అన్ని గ్రామాల పైన దాడులు చేయటం మొదలు పెట్టారు. ఈ క్యాంపుని ఎత్తివేయించాలన్న ప్రయత్నంలో భాగంగా సూర్యాపేట తాలూకా దళాలు, జనగామ తాలూకా దళాలు అన్నీ కలిసి ఈ గ్రామంపై దాడి చేశాయి. అక్కడ ఎక్కువ సంఖ్యలో ముస్లింలు ఉండటం, వారిలో స్త్రీలు, వృద్ధులు, పిల్లలు ఉండటం వలన దాడి చేయటం కొంత సమస్యగానే ఉంటుంది. ముందే జాగ్రత్త తీసుకొని దళాలను చిన్న చిన్న భాగాలుగా చీల్చి, ఒక్కొక్క బజారులో కొన్ని, గ్రామం చుట్టూ కొన్ని పొజిషన్ తీసుకొని కాల్పులు సాగించారు. అటువైపు నుంచి కూడా వారు చాలా తీవ్రంగా ప్రతిఘటించారు. గ్రామంలో ఉన్న ముస్లింలు కూడా చాలా ప్రతిఘటించారు. చివరికి స్త్రీలు కూడా అడ్డం రావటానికి ప్రయత్నిస్తే, అడ్డం రాకూడదని హెచ్చరించారు. వారికేహాని కలుగ జేయమని, రావద్దని చెప్పినా, వారుకొంత అడ్డు తగిలారు. దీనితో దళాలు గ్రామంలో ప్రవేశించి, ఎదురువచ్చిన వారిని కాల్చి చంపారు. ఇళ్ళలో ఉండి దొరకకుండా ప్రతిఘటించే వారందరినీ బయటికి రమ్మన్నారు. రాకపోతే ఇళ్ళకు నిప్పంటించి బయటకు తీసుకు రావటానికి ప్రయత్నం చేశారు. కొందరైనా ఆ ఇళ్ళలో తగలబడిపోయారు. ఈ విధంగా కొన్ని గంటల పాటు భీషణమైన పోరాటం సాగిన తర్వాత, మిగిలిన వారందరూ గ్రామాన్ని వదిలి పెట్టి పోయారు. ఈ దాడిలో పెద్ద సంఖ్యలో ఆయుధాలు దొరికినవి. తుపాకులు, రైఫిళ్లు, స్టెన్ గన్లు, షాట్ గన్లు, నాటు తుపాకులు – ఇవి ఎక్కువ సంఖ్యలో దొరికాయి. ఆ విజయంతో కామ్రేడ్సు, దళాలు వెనక్కి వచ్చారు.

ఇక్కడ మనకొక సమస్య ఎదురైంది. రజాకార్లు, సాధారణంగా దాడులకు వచ్చే ఇతరులే కాకుండా, ఇండ్లలో ఉండే స్త్రీలతో సహా మొత్తం ముస్లిం ప్రజలుకూడా ప్రతిఘటించారు. వారిని ఏమి చేయాలి అనే సమస్య ఎదురయింది. అప్పుడు దళాలు కొంత నిర్దాక్షిణ్యంగానే ప్రవర్తించాయి. వారిని కాల్చివేశాయి. ఇది జరిగిన సంఘటన. ఇతర సందర్భాలలో దాడులకు వచ్చి, దుర్మార్గాలు చేసిన వారి మీదనే కాల్పులు కాల్చటానికి పిలుండేది. క్యాంపుల మీద దాడి

చేయటంతో వీరినికూడా కాల్చవలసి వచ్చింది. రాజకీయంగా దుష్పరిణామమేమీ లేకున్నా, సామాన్య ప్రజలను కూడా ఎదుర్కొనే పరిస్థితి ఏర్పడింది. ఒక రకంగా ఇది అంతర్యుద్ధ (civil war) రూపమని చెప్పవలసి ఉంటుంది.

**ముప్పాళ్లపల్లి క్యాంపుపై దాడి :** భువనగిరి తాలూకాలో ముప్పాళ్లపల్లి క్యాంపుమీద దాడిచేశారు. దళాలన్నీ కలిసి సుమారు 150 మందిదాకా ఏర్పడి ఈ దాడిచేశారు. ఆ గ్రామంలోని మేడలలో రజాకార్లు, పోలీసులు, మిలటరీవారు క్యాంపువేసి ఉన్నారు. వారికి కావలసిన ఆర్థిక, తదితర వనరులన్నీ పెట్టుకొని సిద్ధంగా ఉన్నారు. దూరంనుంచి వచ్చినవారినందరినీ కలుపుకొని ఈ దళాలు వెళ్ళటంతో, రాత్రివేళ చేరుకోవలసినవారు తెల్లవారుతుండగా చేరారు. దీనివలన, తమమీద దాడి చేయకముందే కనిపెట్టిన శత్రువులు కాల్పులు ప్రారంభించారు. చుట్టుపట్ల మైదాన ప్రాంతం కావటంతో దళాలు పొలాలగట్లచాటునుండి కాల్చవలసి వచ్చింది. దళాలు ఒకతన్నిమాత్రం చంపగలిగారు. తక్కినవారు అటువైపు నుండి కాల్చటం, ఇటువైపునుండి దళాలు కాల్చటంతో ఇరుపక్షాలూ ఏమీ సాధించ లేకపోయాయి. దళాలు చాటుగా వెళ్ళి మేడలో ఉన్న కొన్ని లారీలను తగులబెట్టి నష్టం చేయగలిగారు. సాయంత్రమయిన తర్వాత ఎటువారు అటు వెనక్కి పోవలసివచ్చింది. ఇరుపక్షాలూ సమానమైన బలం ప్రదర్శించటంవలన, దళాలు వేసుకున్న ప్లానులో కొన్ని లోపాలు ఉండటంవలన, ఎవరూ ముందుకు సాగలేకపోయారు. దళాలు నష్టంలేకుండా బయటపడవలసిన పరిస్థితి ఏర్పడింది.

**రోడ్లను ధ్వంసంచేసే కార్యక్రమం :** ఇంతకుముందే రోడ్లను ధ్వంసంచేసే కార్యక్రమం ప్రారంభించారని చెప్పాము. ఇదివరకు ఖమ్మం-వైరా రోడ్డు, ఖమ్మం-కోదాడ రోడ్డు, బూర్గంపాడు అటువైపు ఈ విధ్వంసక కార్యక్రమం పెద్దఎత్తున సాగింది. నల్లగొండజిల్లాలో ఈ కార్యక్రమం పెద్దఎత్తున అమలుజరిగింది. దీనిలో ప్రజలు పెద్దఎత్తున పాల్గొన్నారు. స్థానిక రాజకీయ నాయకులు, దళనాయకులు ప్రజలను సమీకరించి వారిని చిన్నచిన్న జట్లుగా విడదీసి రోడ్లను తవ్వించేవారు. ప్రజలు పారలు, గడ్డపారలు, తట్టలు తీసుకొని రోడ్లను అక్కడక్కడ గండ్లు కొట్టేవారు. పోలీసులు, మిలటరీ లారీలు తిరగకుండా చేయటమే వీటిలక్ష్యం. జనగామ-సూర్యాపేట సరిహద్దుల్లో ఈ పని హెచ్చుగా జరిగింది. పోలీసులు, మిలటరీ ప్రజలను నిర్బంధించి, బలవంతపెట్టి, తిరిగి ఆగండ్లను వారితో పూడ్పించే

వారు. కొన్ని సందర్భాల్లో ప్రజలను కాల్చి చంపి, వారిని ఈ బొందల్లో పూడ్చి వేసిన సంఘటనలు కూడా ఉన్నాయి. రోడ్లను గండికొట్టటంతోపాటు, చిన్నచిన్న వంతెనలను (culvertsను) కూడా కూలగొట్టారు. ఇవి చాలా బలంగా ఉండేవి. కూలగొట్టటం కష్టంగా ఉండేది. అయినా వాటిని కొన్నిటిని కూలగొట్టారు. ఈ విధంగా చేయటంవలన శత్రువులు చిందరవందర (dislocation) అయ్యారు. వారు పూడ్చుకొని ముందుకు పోగలిగినా, ఈ కార్యక్రమాన్ని చూసి, పోలీసు, మిలటరీ భయపడ్డారు.

వరంగల్ జిల్లాలోని ఖమ్మం, కొత్తగూడెం ప్రాంతంలో అడవుల్లోనుండి వచ్చే రోడ్లలో కొన్ని చిన్న వంతెనలను (culvertsను) డైనమైట్లద్వారా పేల్చటానికి ప్రయత్నించారు. ఈ విధంగా అందుబాటులో ఉన్నంతవరకు చేసినారు. మిలటరీకి దీనిని ఎదుర్కోవటం పెద్ద కష్టమేమీకాకపోయినా, ఈ పని చేయటానికి ప్రజలు ముందుకు రావటమంటే, ప్రజలు ఈ పోరాటంలోనే తమ నిర్మాణ శక్తిని మరింత పెంచుకొని సాయుధ పోరాటాన్ని బలపరచటానికి సంసిద్ధమయ్యారని దీనివలన స్పష్టమవుతుంది. ముఖ్యంగా సూర్యాపేట-ఖమ్మం రోడ్డుపైన అక్కడక్కడ ఇనప చీలలు నాటి, వచ్చిపోయే మిలటరీ ట్రక్కుల, పోలీసువ్యాన్ల టైర్లను పగులగొట్టటానికి ప్రయత్నం చేశారు. మొదటి ప్రయత్నాలు విఫలమైనవి. తర్వాత పెద్దచీలలు, వాటికి తగిన ఏర్పాట్లు చేసి పెట్టటంతో వాటిమీదనుంచి ఈ ట్రక్కులువెళ్ళి అవి గుచ్చుకుపోవటం, ఫలితంగా టైర్లలోనుంచి గాలిపోవటం, ఆ ట్రక్కులు అక్కడికక్కడనే ఆగిపోవటం జరిగింది. ఈ ప్రయత్నం ఫలించింది. ఈ రకంగా విధ్వంసక కార్యక్రమాలను కూడా ఒక కార్యక్రమంగా అమలుజరిపి కొంతవరకు విజయం సాధించారు.

**క్రోషేడు యాదగిరి అమరత్వం :** ఈ కాలంలోనే సూర్యాపేట-జనగామ రోడ్డుమీద ఒక సంఘటన జరిగింది. సూర్యాపేట తాలూకా సరిహద్దు దగ్గరలో ఈ రోడ్డుమీదనే తిరుమలగిరి అనే పెద్దగ్రామం ఉన్నది. దానికి సూర్యాపేటకి ఇటువైపు కొద్దిదూరాన వంపులు, మలకలు ఉన్నాయి. దళం అక్కడికి వెళ్ళి, మిలటరీ లారీమీద దాడిచేయాలని ఒకచోట పొజిషన్ తీసుకొని కాల్పులుకాల్చింది. మొదట వచ్చిన లారీమీద కాల్చటంతో కొందరు చనిపోయారు. బహుశా విధ్వంసక కార్యక్రమంతో ఆ లారీని ఆపివేయగలిగారు. అందులో మిగిలిన వారు ఏమీ తోచక ఉండిపోయారు. ఇంతలోనే దీనివెనుక మరో లారీ వచ్చి

దళంమీద దాడిచేసింది. ఇద్దరు, ముగ్గురు ముఖ్యమైన కామ్రేడ్సు చనిపోయారు. కాల్పులకు గాయపడినవారిలో యాదగిరి అనే కామ్రేడు కూడాఉన్నాడు. అతన్ని పట్టుకొని చాలా హింసించి చంపివేశారు. 'బండెనక బండికట్టి, పదహారు బండ్లు కట్టి... నా కొడక ప్రతాపరెడ్డి' అనే గేయాన్ని ఆతను మాటలలో కట్టాడు. అతను వ్యవసాయ కూలీ కుటుంబంనుంచి వచ్చినవాడే. ఎప్పుడూ నవ్వుతూ, ఇతరులను నవ్విస్తూ దళాన్ని ఎప్పుడూ ఉత్సాహంగా ఉంచేవాడు. చాలా చాకచక్యంగా మాట్లాడేవాడు. కల్లాకపటం ఎరుగని స్వభావం, చక్కని ఆలోచనా శక్తి ఉన్న కామ్రేడు. వ్యవసాయకూలీ కుటుంబంనుంచి వచ్చి, ఇంత ఉన్నతమైన ఆశయాలు, కవిత్వ లక్షణాలు, నిండు మనసులాంటి మంచిలక్షణాలు కలిగిన ఈ కామ్రేడ్ జీవితం అందరికీ ఆదర్శంగా ఉండాలి. ఉంటుందికూడా. అటువంటి కామ్రేడును ఈ దాడిలో కోల్పోవటం జరిగింది.

**డిఫెన్సివ్‌నుండి అఫెన్సివ్‌కు వెళ్ళటం వలన వచ్చిన అనుకూల పరిణామాలు :** మొత్తం పరిస్థితి చూసినప్పుడు తెలంగాణా అంతటా మొదటి వరుసలో మిలటరీ, పోలీసులు, రజాకార్లు పెద్దఎత్తున దాడులు జరిపారు. వాటిని తిప్పికొట్టటంలో అనుభవం లేక, తగిన శిక్షణ లేక గెరిల్లా దళాలు, స్థానిక దళాలు మొదటివరుసలో కొంత ఇబ్బంది పడినప్పటికీ, క్రమంగా పుంజుకొని వాళ్ళను తిప్పికొట్టగలిగాయి. పార్టీ నిర్మాణం, గ్రామరాజ్యాల నిర్మాణం, భూమి పంపకం లాంటి కార్యక్రమాలు లేని జిల్లాల్లో మొదటి వరుసలోనే దళాలు, స్థానికనిర్మాణం దెబ్బతిన్నాయి. ఈ నిర్మాణం, విప్లవ కార్యక్రమం ఉన్న జిల్లాల్లో, ముఖ్యంగా నల్లగొండ, వరంగల్లు జిల్లాల్లో, మొదటి వరుసలో జరిగిన ఈ దాడులను తట్టుకోవటమే కాకుండా, వీటిని తిప్పికొట్టగలిగిన శక్తి సామర్థ్యాలను ఈ దళాలు, స్థానిక నిర్మాణం ప్రదర్శించాయి. ఈ ప్రతిఘటనద్వారా నిర్మాణమూ పెరిగింది. దళాల సంఖ్య, దళ సభ్యుల సంఖ్య పెరిగింది. స్థానిక దళాల సంఖ్య, వారి సభ్యుల సంఖ్య పెరిగింది. గ్రామరాజ్యాల సంఖ్య పెరిగింది. పార్టీ కార్యకర్తల సంఖ్యకూడా పెరిగింది ఈ విధంగా నిర్మాణం సర్వతో అభివృద్ధిచెంది, దానితో పాటు ఉద్యమంకూడా అభివృద్ధి చెందింది. ఈ అభివృద్ధి క్రమంలో కొన్ని తీవ్రమైన నష్టాలు కూడా జరిగినప్పటికీ, మొత్తంగా చూస్తే ఈ కాలంలో ముందుకుపోయిన మాట నిజం. ఇదంతా సుమారు 6 నెలల కాలంలో జరిగింది.

మిలటరీ, పోలీసులు దెబ్బతినటమే కాకుండా, గ్రామాల్లో ఉన్న క్యాంపుల

మీద మన దళాలు దాడులు చేయగలిగిన స్థితి ఏర్పడిన తర్వాత, వారు గ్రామాల్లో క్యాంపులు పెట్టటం మానుకున్నారు. ఇలాంటి క్యాంపులనన్నిటిని తీసివేసి, ప్రధానంగా తాలూకా కేంద్రాలకు తరలించారు. తాలూకా కేంద్రాలలో వారికి కావలసిన ఏర్పాట్లుండేవి. దీనితోపాటు పట్టణాలలో ఉద్యమంకూడా బలహీనంగా ఉంది. రహదారుల సౌకర్యాలుంటాయి. రాజధాని హైదరాబాదు నుండి ఎప్పటికప్పుడు అదనపు మిలటరీ, పోలీసులను, రిజర్వు పోలీసులను పంపుతుంటారు. వీటిని ఉపయోగించు కొని వారు తమ కార్యకలాపాలు సాగించటానికి వీలవుతుందని అన్ని క్యాంపులను ఈ కేంద్రాలకు తరలించారు. దీనివలన కొన్ని సదుపాయాలు కలిగినవి. అంటే గ్రామస్థాయిలో క్యాంపులు లేకపోవటంతో, ఈ క్యాంపులు వేసిన గ్రామాలతో పాటు చుట్టుపట్ల గ్రామాల్లోకూడా దళాలు, పార్టీ తమ కార్యకలాపాలు పెద్ద ఎత్తున సాగించటానికి అవకాశమేర్పడింది. తాలూకా కేంద్రాలనుంచి గ్రామాలపై మిలటరీ దాడులు చేసినప్పటికీ, గ్రామాల్లో క్యాంపులు పెట్టినప్పుడున్నంత ఎక్కువ సంఖ్యలో వరుసగా దాడులు చేయటానికి వీలుకలుగకపోయేది. ఒక గ్రామంలో దాడిచేసిన తర్వాత తిరిగి ఆ గ్రామంపై మళ్ళీ దాడిచేయటానికి మధ్య సుమారు 15 నుండి 20 రోజుల వ్యవధి ఏర్పడుతుండేది. ఈ విధంగా మొదలు దెబ్బకాచుకునే డిఫెన్సివ్ స్థాయిలో ఉన్న గెరిల్లా పోరాటం ఒకమేరకు ఎదురు దెబ్బతీసే అఫెన్సివ్ స్థాయికి పోవటంవలన మంచి పరిణామాలు వచ్చినవి. గ్రామాల్లో గ్రామసంఘాలు, ఇతర కార్యక్రమాలు విస్తరించటానికి అవకాశం ఏర్పడిందనే అంశాన్ని ఈ సందర్భంలో గమనించాలి.

## 2. మారిన పరిస్థితులలో భూమి పంపకం, గ్రామ రాజ్యాలు, మిలటరీ రంగం

మొత్తంగా పోరాట ప్రాంతాలలో విప్లవ శక్తులకు ఒక అనుకూలమైన పరిస్థితి ఏర్పడింది. నిజాం నవాబు మిలటరీకి, పోలీసులకు అననుకూల పరిస్థితులు ఏర్పడినవి. వారు గ్రామాల్లో క్యాంపులు వేసుకుని నిలువలేని పరిస్థితుల్లో దళాలకు వెసులుబాటు కలిగింది దీనితో కార్యకలాపాలను తీవ్రతరం చేశారు.

## భూమి పంపకం

భూమి పంపక కార్యక్రమాన్ని ఇంకా పెద్ద స్థాయిలో సాగించారు. దీనికి కొన్ని పరిస్థితులు కూడా అనుకూలించినవి. ఈ పోరాటం వేసవికాలం, వర్షాకాలమంతా నడిచింది. ఈ కాలం ముఖ్యంగా భూములు పంచుకోవటానికి, చదును చేసుకోవటానికి, దున్నుకోవటానికి అనుకూలమైన సమయం.

**పెద్ద భూసామ్యముల మిగులు భూముల పంపకం :** అన్యాక్రాంతాలు పోరాట ప్రాంతాల్లో ఎక్కడ ఉన్నా మొదటి వరుసలో వాటిని తిరిగి రైతులకు ఇచ్చారు. ఆ సందర్భంలో వచ్చిన కొన్ని సమస్యలను ఇంతకుముందే వివరించాము. ఈ పోరాటంలో మిలటరీ, పోలీసులు వెనుకపట్టు పట్టటంతో ప్రజలలో మరింత ఉత్సాహం వచ్చింది. భూస్వాముల మిగులు భూములను పంచటానికి ఒక పథకాన్ని తయారుచేశారు. దాని ప్రకారం పంచుకోవటానికి రైతులు ముందుకు వచ్చారు. గ్రామాల్లో క్యాంపులు ఎత్తివేయటంతో పెద్ద భూస్వాములు గ్రామాల్లో మకాం చేయటం మానివేశారు. అప్పటికీ, మరీ పెద్ద భూస్వాముల గ్రామాల్లో క్యాంపులు ఉంటూనే వచ్చాయి. ఆ రోజుల్లో విసునూరులో క్యాంపు ఉండేది. అది చివరంటా ఉంది. యూనియన్ సైన్యాలు వచ్చిన తర్వాత దళాలు దానిమీద దాడి చేసినప్పటికీ, ఆ క్యాంపువారు దళాలకు లొంగిపోలేదు. యూనియన్ సైన్యాలకు కానీ వారు లొంగిపోలేదు. ఈ రకంగా కొన్ని పెద్దపెద్ద భూస్వాములున్న గ్రామాల్లో క్యాంపులు మాత్రం ఉన్నాయి. మూడు, నాలుగు మైళ్ళకొక క్యాంపు చొప్పున వెనకటి పథకం ప్రకారం వేసిన క్యాంపులన్నిటిని ఎత్తివేశారు. ఆ క్యాంపుల్లో ఉండిన భూస్వాములు గ్రామాలను వదిలి వెళ్ళిపోయారు. దీని ఫలితంగా ఆ భూస్వాముల భూములను పంచటానికి అవకాశం ఏర్పడింది.

పెద్ద భూస్వాములలో రెండురకాలవారుంటారు. పోలీసులను, మిలటరీ వాళ్ళను వెంటవేసుకొని, గ్రామాల్లో తిరిగి, కాల్పులు చేయించి, దోపిడీలు ఇటువంటి వాటిలో పాల్గొన్నవారు ఒకకోవకు చెందుతారు. వీరంటే ప్రజలకు చాలా వ్యతిరేకత ఉంటుంది. ప్రజలు ఇలాంటివారి భూములను పంచుకోవటానికి ముందుకువచ్చారు. అది సాధ్యమయింది కూడా. రెండవరకంవారు కొంత బలహీనులు. వారి భూములు పంచుకుంటే పెద్దగా ప్రతిఘటించగలిగిన శక్తి వారికుండదు. వారి భూములను కూడా పంచుకోవటానికి ముందుకువచ్చారు. కానీ

మూడవరకం భూస్వాములున్నారు. వారు మరీ అంత దౌర్జన్యంచేసినట్టుగా లెక్క ఉండకపోయేది. అలాంటప్పుడు వారిభూములను పంచుకోవాలని ప్రజలు తహతహ పడలేదు. ఇది అక్కడక్కడా కన్పించింది. కానీ ఈ క్యాంపులలో ఉండి, దాడులు చేయించినవారి భూములను పంచుకోవటానికి మొదటిరోజుల్లో చాలా భయపడ్డారు. తమ భూములే అన్యాక్రాంతాలుగా వారి స్వాధీనంలో ఉన్నప్పుడు ముందుకువచ్చి, వాటిని పంచుకున్నారేకాని, ఈ మిగులుభూములను పంచుకోవటా నికి మాత్రం ముందుకురాలేదు. ఈకాలంలో సిద్ధపడ్డారు.

భూస్వాముల భూములను పంచటానికి ఒక స్కేలును (ప్రమాణము) నిర్ణ యించారు. సీలింగును 500 ఎకరాల నుంచి 200 ఎకరాలకు తగ్గించినప్పుడు, అన్యాక్రాంతాలను తీసివేసి రైతులకిచ్చిన తర్వాత, మెట్ట,మాగాణి రెండూ కలిపి వారికి 200 ఎకరాలే మిగిలిఉంటే వారినుండి తీసుకునేదేమీ ఉండదు. రైతుల కివ్వవలసిన అన్యాక్రాంతాలు ఏమీలేకుండా స్వంతభూమి 200 ఎకరాలకు మించి ఉంటే, ఆభూమిని రైతులకుపంచాలి. 200 ఎకరాలకు మించిన భూమి సుమారు 100 ఎకరాలుండి, దానిలో 90 ఎకరాలు మెట్ట, 10 ఎకరాలు మాగాణి ఉంటే మొత్తం నూరెకరాలను రైతులకు పంచాలి. ఈవిధంగా పంచిన భూములలో వ్యవసాయకూలీలకు హెచ్చుగా లభించేది. అన్యాక్రాంతాలను తీసుకున్నవారిలో వ్యవసాయకూలీలు కానివారు ఉండేవారు. తమ భూములను పోగొట్టుకున్నతర్వాత వ్యవసాయకూలీలుగా మారిపోయిన వారికి కూడా అలాంటిభూమి కొంత దొరికింది. ఇలాంటి భూములతోపాటు మిగులుభూమిని ముఖ్యంగా వ్యవసాయ కూలీలకు పంచారు. ఇతరత్రా భూములుదొరకని రైతులకుకూడా మిగులుభూమిని పంపకం చేశారు. ఈవిధంగా పోలీసు, మిలటరీ క్యాంపులు గ్రామాలనుండి ఎత్తివేసి ముఖ్యమైన కేంద్రాలకి తరలించిన తర్వాత పెద్దభూస్వాముల భూమిని కూడా పెద్దఎత్తున పంపకంచేశారు. ఈ భూమిపంపకం ఎక్కువభాగం నల్లగొండజిల్లాలో జరిగింది వరంగల్ జిల్లాలో కూడా తగినంతగా జరిగింది.

**భూమి పంపకంలో అతివాద ధోరణి :** 200 ఎకరాలకు మించిన మిగులు భూములను పంచుకోవటానికి రైతాంగం, వ్యవసాయ కూలీలు ముందుకు రావటం చూసిన ఉత్సాహంతో పార్టీలో కొందరు 'భూస్వాముల భూముల కుండవలసిన పరిమితిని 70–80 ఎకరాలకు తగ్గించి వేసి, మిగతా భూమినంతా పంచివేయాలి' అనే ఒక ప్రతిపాదనను ముందుకు పెట్టారు. అక్కడ ఆగక కొంత అమలు

జరుపటానికి కూడా ప్రయత్నం చేసి విఫలమయ్యారు. ఈ ప్రతిపాదన రావటానికి కారణాలను పరిశీలించవలసి ఉంటుంది: గ్రామాల్లో భూములను పంచే సందర్భంగా ఈ ఆన్యాక్రాంతాలు, మిగులు భూములు అన్నీ కలిసినా వ్యవసాయ కూలీలకు, పేద రైతులకు భూమి సరిపడక పోయేది. అప్పటికీ కొంతమందికి భూమి దొరకకపోయేది. లేక దొరికినా బొత్తిగా సాగు చేయటానికి వీలు లేనంతగా కొద్దిపాటి భూమి మాత్రమే వారికి దక్కేది. దీనితో మరికొంత భూమి ఉంటేనే అందరికీ పంచటానికి వీలుంటుందనే అవగాహనతో ఈ ప్రతిపాదన వచ్చింది. దీనిని ఆలోచించి ఒక స్థాయిలో అంగీకరించినట్టు కూడా కన్పిస్తుంది.

దీనిని అమలు జరపటంతో చిన్న భూస్వాముల భూములను మరింత తీసుకొని పంచవలసి వచ్చింది. అన్యాక్రాంతాల వరకూ భూమిని వదులుకొని తక్కిన భూమిని తమకు మిగిలిన భూమిగా భావించే వీరు (ఇలాంటి భూములు 200 ఎకరాల వరకు కలిగిన వారు) గతంలో దాదాపు తటస్థంగా ఉండేవారు. పార్టీకి వ్యతిరేకంగా ఉండకపోయేవారు. పెద్ద భూస్వాముల క్యాంపుల్లో ఉండి, పోలీసు, మిలటరీ బలంతో దాడులు, కాల్పులు సాగిస్తూ తమ భూములను కాపాడుకునేవారు. దీనితో అన్యాక్రాంతాలను ఇవ్వటానికి అంగీకరించి, తక్కిన భూములను మాత్రం కాపాడుకోవాలని కోరుకున్న చిన్న భూస్వాముల మీదనే మళ్ళీ ఒత్తిడి చేసి, వారి మిగతా భూమిని కూడా పంచుకోవలసిన స్థితి ఏర్పడింది. దీనితో తమ భూములను కాపాడుకోవటం కొరకు నిజాం ప్రభుత్వాన్నో, అటు కాంగ్రెసునో శరణు జొచ్చాలనే ఆలోచన వీరికి కలిగింది. వారి సహకారం తగ్గిపోయింది. రెండవది: ప్రజలు కూడా అన్యాక్రాంతాలు కాక, చిన్న భూస్వాములకు చెందిన తక్కిన్న భూములను పంచుకోవటానికి అప్పటికప్పుడు ముందుకురాలేదు. వారిలో చాలామంది దౌర్జన్యపరులు కాకపోవటం దీనికొక కారణం. అలాంటి భూములపై తమకు హక్కున్నదని పేదరైతాంగమైనా, వ్యవసాయకూలీలైనా భావించక పోవటం మరొక కారణం. కొన్నిచోట్ల బలవంతంగా పంచినా, దానివలన చిన్న భూస్వాములు వ్యతిరేకమవటం, గ్రామాల్లో అంతకుపూర్వం ఉన్న ఐక్యత దెబ్బ తినటం లాంటి పరిణామాలు కొన్నిరావటంతో ఈ కార్యక్రమాన్ని మానుకొని, వెనుకటిలాగానే 200ఎకరాలకు మించిన భూములను పంపకంచేసే కార్యక్రమానికి పరిమితమయ్యారు. ఇది రెండవపార్టీ కాంగ్రెసు తర్వాత వచ్చిన అతివాద పెడధోరణిలో భాగంగా, భూమి పంపకంలోవచ్చిన పెడధోరణి అని గమనించాలి.

భూమి పంపకంలో మితవాద ధోరణి : భూపంపకానికి సంబంధించినంత వరకూ నల్లగొండజిల్లాలో ముఖ్యంగా సూర్యాపేట, నకిరేకల్లు ప్రాంతం, కొంత వరకు హుజూరునగరు సరిహద్దు ప్రాంతం, తదితర ప్రాంతాల్లో భూస్వాముల భూపరిమితిని 70-80 ఎకరాలకు తగ్గించాలనే అతివాదధోరణి వచ్చింది. కానీ ఇతర ప్రాంతాల్లో మితవాదధోరణి వచ్చిందని చెప్పాల్సిఉంటుంది. ఇలాంటిచోట్ల చాలా సందర్భాలలో 'భూస్వాములు వ్యతిరేకమవుతారుకదా' అనే వాదనతో భూమిపంపకాన్ని మానివేశారు. చాలాకొద్ది ప్రాంతాల్లో భూమిపంపకం జరిగింది. భువనగిరి ప్రాంతానికి చెందిన బేగంపేట ప్రాంతంలో జాగిర్దారుకు సంబంధించిన 4వేల ఎకరాల బీడు భూమిపంచినట్టుగా చెప్తున్నారు. అప్పటికప్పుడు ఆక్రమించు కోవటానికి అవకాశమున్న భూమిఇది. దాన్ని పంచారు. ఇదే ప్రాంతంలో గౌరాయిపల్లి తదితర గ్రామాల్లో కొద్దికొద్దిగా భూమి పంచారు. ఈ ప్రాంతాల్లో భూమిపంపకం నామమాత్రంగా జరిగింది. ముఖ్యంగా సూర్యాపేట తదితర ప్రాంతాల్లో భూమిపంపకం జరుగుతుంటే చూసి కార్యకర్తలు చేసిన ఒత్తిడి ఫలితంగా, కొద్దిగా భూమిని పంచినారు. భూస్వాముల భూమి పంచకూడదని, ముఖ్యంగా హిందూ భూస్వాముల భూమి పంచకూడదని, ఈవిధంగా పంచటంవలన వారు పోరాటానికి వ్యతిరేకమవుతారనీ, పోరాటం బలహీనపడుతుందనే అవగాహనతో వారు ఈ విధంగా చేసినారు. ఇది భూస్వాములకు అనుకూలమైన వైఖరి అని చెప్పవచ్చును. వాస్తవమేమంటే భూమిపంపకం వలన రైతాంగం, పేద రైతులు, కూలీలు ఇంకా ఎక్కువ ఉత్సాహంతో, పట్టుదలతో విప్లవచైతన్యంతో పోరాటంలో పాల్గొంటారు. పంచకపోవటంవలన వారు ప్రేక్షకులుగా ఉండిపోతారు. అలాంటి పరిస్థితుల్లో వారు ఒకవేళ పాల్గొన్నా, అది చాలా పైపైనేఉండిపోతుంది. ఈ ప్రాంతాల్లో భూస్వాముల పాలేర్లు దళాల్లో వచ్చి పనిచేసేవారు. ఆరోజుల్లో భూస్వాములు తాము త్యాగంచేయటానికి బదులుగా తమపాలేర్లద్వారా త్యాగం చేసినట్టు చెప్పుకునేవారు. ఎప్పటిలాగానే ఆపాలేర్లకు జీతంఇస్తుండేవారు. వరంగల్ జిల్లాలో కూడా ఇలాంటి పద్ధతి పెద్దఎత్తునే అమలుజరిగింది. వరంగల్ జిల్లాకు చెందినప్పటికీ, సూర్యాపేట తాలూకాకు సరిహద్దున ఉండటంవలన మానుకోట తాలూకాలో కొంతభూమి పంపకం జరిగింది. కానీ మొత్తంగా చూసినప్పుడు ఇక్కడ నల్లగొండ జిల్లాకంటే తక్కువగానే భూమి పంపకం జరిగింది. నల్లగొండ జిల్లాను మినహాయించిన తర్వాత ఇతర ప్రాంతాలలో ఏమేరకు భూమిపంపకం

జరిగినా అది ఇక్కడ, వరంగల్ జిల్లాలోనే జరిగింది. ఈవిధంగా భూమిపంపకంలో మితవాదధోరణి వరంగల్ జిల్లాలో ప్రత్యక్షమయింది. ఇతరప్రాంతాల్లో భూమి పంపకం చాలా తక్కువగా జరిగింది.

## గ్రామ రాజ్యాలు

**గ్రామ రాజ్యాలు స్థిరపడటం :** ఈ కాలంలోనే గ్రామ రాజ్యాలకు కొంత స్థిరత్వం ఏర్పడింది. అంతకుముందు ఏరోజు అనకుండా దాడులు జరగటంవలన గ్రామ రాజ్యాలు గ్రామంలో ఉండి అక్కడి వ్యవహారాలు చక్కపెట్టటం సాధ్యంకానిపనిగా ఉండేది.

ఈ దాడులు చేసేవారు పగలేవచ్చి సాయంత్రంలోగా వెళ్ళిపోవటంవలన, ఆ రోజుల్లో మామూలుగా ప్రజలు రాత్రిపూట గ్రామాల్లో ఉండి తమ కార్య కలాపాలు సాగించుకునేవారు. గ్రామ కమిటీలు సమావేశమై ప్రజల సమస్యలను పరిష్కారం చేస్తుండేవి. పగలంతా గ్రామాలను ఖాళీచేసి రైతులు, కూలీలు తమ పొలాల్లో, చేలల్లో ఉండేవారు. ముసలివారు, పిల్లలు అలాంటివారిని కూడా సాధ్యమైనంతవరకు తీసుకువెళ్ళి పొలాల్లో, చేలల్లో అట్టిపెట్టేవారు. ఆ విధంగా తీసుకువెళ్ళటంకూడా సాధ్యం కానప్పుడు అలాంటివారు గ్రామాల్లో ఉండేవారు. అక్కడే వంట చేసుకొని తింటూ జీవించేవారు. గ్రామాల్లో ఈ రకంగా ఉండటం వలన అప్పుడప్పుడు రజాకార్లు, పోలీసులు వచ్చి కొంత ధాన్యాన్ని తీసుకువెళ్ళే వారు. దీనితో పండిన ధాన్యాన్నంతా తమ చేలల్లో పాతరలు తీసి అక్కడ దాచిపెట్టేవారు. చేనుచేనుమీద పడి ఈ పాతరలు తీసి తీసుకువెళ్ళటం వారికి సాధ్యం కాకపోయేది. దీనితో వారికేదీ దొరకకుండా పోయింది. రైతులకు పొలమో, చేనో ఉండేది. పేద రైతులకు, కూలీలకు కొత్తగా పంచిన భూమి దొరికింది. కుటుంబాలంతా ఈ చేలలో ఉండేవారు. వాటిని సాగుచేసుకొని మొత్తం పోరాటకాలంలో రెండు పంటలు పండించుకున్నారు. ఈ పోరాటం సాగుతున్న కాలంలో ఒకపంట అప్పటికే వచ్చేసింది. దానిని ఈ పాతరలలో వారు దాచుకున్నారు. ఈ విధంగా అస్థిరమైన జీవితమైనప్పటికీ భూమి పంపకం వలన వారు పొలాల్లో జీవించగలిగారు. ఈ కార్యక్రమం వల్లనే పెద్దఎత్తున నష్టాలు కలుగకుండా కాపాడుకోగలిగారు. దళాల్లో చేరి వారితో సంబంధాలు కలిగి ఉండేవారు. రాత్రులలో దాడులు జరగకపోవటంతో, అప్పుడు గ్రామాలకు

వెళ్ళి అక్కడ తమ పనులేమైనా ఉంటే పూర్తి చేసుకొని తెల్లవారేలోపుగా తమ పొలాలకు తిరిగి వచ్చేవారు. ఇలాంటి జీవితం కొన్ని నెలల వరకూ నడిచింది.

దళాలు దెబ్బతీసే కార్యక్రమం చేపట్టిన తర్వాత గ్రామాల్లోని క్యాంపులన్నీ ఎత్తివేసి, కొన్ని ముఖ్యమైన కేంద్రాల్లో క్యాంపువేసి దాడులుచేసేవారు. రెండుదాడులమధ్యన వ్యవధి ఎక్కువగా ఉండేది. ఒకసారి గ్రామానికి వచ్చిన తర్వాత సుమారు 10-15 రోజులకు మరోదాడి జరిగేది. ఈ మధ్యకాలంలో దాడులు జరగకపోయేవి. దీనితో ఒకదాడి పూర్తికాగానే ప్రజలు మరుసటిరోజు వచ్చి గ్రామాలలో ఉంటూ (రాత్రులు) తమపనులు చక్కబెట్టుకునేవారు. ఏరోజుకారోజు ఫలానా గ్రామంమీద దాడి జరిగిందని తెలుస్తుండటంవలన తిరిగి తమ గ్రామంపై దాడి జరిగే సమయాన్ని సుమారుగా అంచనా వేసుకొని, జాగ్రత్తగా తమ కార్యకలాపాలు సాగించేవారు. భూమి పంపకం, గ్రామాన్ని పరిశుభ్రంగా ఉంచుకోవటం, గ్రామాల్లో తగాదాలను పరిష్కారం చేసుకోవటం లాంటి ఈ కార్యకలాపాలన్నీ సాగుతుండేవి. గ్రామదళాలు ఏర్పాటు చేశారు. గ్రామరాజ్య కమిటీలు నిలకడగా గ్రామాల్లోనే ఉంటూ సమస్యలను పరిష్కారం చేస్తూ ఉండేవి. పార్టీ ఆర్గనైజర్లు, దళాలు అవసరమైన సహాయం చేస్తుండేవారు.

**గ్రామరాజ్యాలలో చిన్నభూస్వాముల నాయకత్వాన్ని మార్చటం :**

గ్రామ రాజ్యాల నిర్మాణం ప్రారంభంలో తరచుగా చిన్న భూస్వాముల నాయకత్వాన ఉండేది. ఈ చిన్న భూస్వాములంటే దేశముఖుల లాంటి పెద్ద భూస్వాములు కానివారు; గ్రామాల్లో అప్పులుపెట్టి పేదవారి భూములను కొనుక్కొనిగానీ, అప్పులక్రింద వాటిని తీసుకొనిగానీ భూస్వాములైనవారు. వీరు దేశముఖుల పెత్తనాన్ని సహించలేరు. కాని వారుమాత్రం తరచుగా పెత్తందార్లుగా ఉండేవారు. వీరు ఆనాడు ఆంధ్రమహాసభలో పెద్ద సంఖ్యలో చేరారు. ఈ వర్గానికి చెందిన చాలామంది యువకులు పార్టీలోకి కూడా వచ్చారు. సాధారణంగా వీరే గ్రామసంఘాలకు నాయకత్వం వహించేవారు. ఈ యువకులు పార్టీ ఆర్గనైజర్లుగానూ, దళనాయకులుగానూ ఉండేవారు. ఈ రకంగా వీరికి మిలటరీ రంగంలో ప్రాబల్యం వచ్చింది. పార్టీలోకూడా కొంత ప్రాబల్యం వచ్చింది. గ్రామసంఘ నాయకత్వంలో వీరి పెద్దలు, తండ్రులు, పినతండ్రులు లేక ఈ కుటుంబాలకు చెందినవారు ఉండేవారు. వారు చాలా సందర్భాలలో అక్రమంగా భూములు కాజేసి ఉండటంతో భూమి పంపకానికి సుముఖంగా ఉండకపోయేవారు.

అలాంటి భూమిని కోల్పోవలసి వస్తుందనే భయంతోపాటు, భూములు ఇచ్చిన తర్వాత పేదలు తమకు వ్యవసాయకూలీలుగా ఉండరని, స్వతంత్రులుగా ఉంటారని, తమ అదుపాజ్ఞలలో ఉండటానికి అవకాశం ఉండదని వారు భూమి పంపకానికి వ్యతిరేకంగా ఉండేవారు. అందువలన వీరి నాయకత్వం ఉన్న చాలా చోట్ల మొదటిదశలో భూమి పంపకం జరుగలేదు. భూమి పంపకానికి అడ్డుతగులుతున్నప్పుడు గ్రామసంఘాల నాయకత్వాన్ని మార్చి, మధ్య తరగతి రైతులను, పేద రైతులను, వ్యవసాయ కూలీలను తీసుకువచ్చిన తర్వాత భూమి పంపకం సక్రమంగా జరిగింది. గ్రామరాజ్యాల్లో క్రమంగా వ్యవసాయకూలీల, పేదరైతుల సంఖ్యను పెంచటం జరిగింది. ఇది భూమి పంపకం తీవ్రంగా జరిగిన ప్రాంతాల్లో వచ్చిన పరిణామం.

గ్రామరాజ్యాల్లో, ప్రజాసమీకరణలో మితవాద ధోరణి : భూమి పంపకం తీవ్రంగా జరగని ప్రాంతాల్లో పెత్తందార్లు గ్రామరాజ్యాలనాయకత్వంలో ఉండిపోయారు. ఫలితంగా గ్రామరాజ్యాలు పెత్తందార్ల అదుపాజ్ఞలలో ఉండిపోయినవి. గ్రామరాజ్యాలలో ఉంటూ తమ భూస్వామ్య పెత్తందారీ పద్ధతినంతా సాగించేవారు. దీనితో చాలా సందర్భాలలో ప్రజలు విప్లవ కార్యకలాపాలలో పాల్గొనకపోయేవారు. ఈ ప్రాంతాలలో రజాకార్ల వ్యతిరేకతతో, నిజాం వ్యతిరేక పోరాటమనే దృష్టితో కొంతమంది ప్రజలను కూడా సమీకరించారు. భూస్వాములు నిజాంకి, జాగిర్దార్లకి, రజాకార్లకి వ్యతిరేకంగా ఉన్నప్పుడు, భూస్వాముల అండతో సామాన్యప్రజలు కూడా ముందుకురావటం జరుగుతుంది. ప్రజలు స్వతంత్రంగా చైతన్యంతో ముందుకు రావటమొకటి; భూస్వాముల అండఉన్నదిగదా అనే ధైర్యంతో ముందుకురావటం మరొకటి. ఈ రెంటి మధ్య ఉన్న తేడాను గమనించాలి. భూస్వాముల అండతోవచ్చిన ప్రజల్లో చైతన్యం చాలా తక్కువగానూ, వెనుకబడినదిగానూ ఉంటుంది. స్వతంత్రంగా తమకు తాముగా పార్టీ నాయకత్వాన తమ కర్తవ్యాన్ని అర్థంచేసుకొని, పోరాటానికి ముందుకువచ్చే ప్రజల చైతన్యం మరో విధంగా ఉంటుంది. భూమి పంపకం బాగా జరిగిన ప్రాంతాల్లో ప్రజలు ఇలాంటి చైతన్యమే ప్రదర్శించారు. భూమి పంపకం లేకుండా, భూస్వాముల పెత్తనంక్రింద ముందుకువచ్చిన ప్రాంతాల్లో భూస్వాముల అనుబంధశక్తిగా వారు తమ చైతన్యాన్ని ప్రదర్శించారు. ఈ రెండింటిమధ్య భేదాన్ని గమనిస్తే, ఈ ప్రాంతాలలోని గ్రామ రాజ్యాలలో, ప్రజా సమీకరణలో మితవాద ధోరణి

ఉండేదని కన్పిస్తుంది. భువనగిరి ప్రాంతం, వరంగల్లు జిల్లాలో మరికొన్ని ప్రాంతాల్లో ఇలాంటి ధోరణి బాగా వ్యక్తమయింది.

## మిలటరీ రంగం

దళాల, కార్యకర్తల సంఖ్య పెరుగుదల : దళాలు దెబ్బతీసే స్థితికివచ్చి ఈ భూములను పంపకంచేయటంతో ఇంకా హెచ్చు సంఖ్యలో దళాల్లోకి సభ్యులు వచ్చారు. పేదరైతు, వ్యవసాయ కూలీ కుటుంబాలనుంచీ, మధ్యతరగతి రైతు కుటుంబాలనుంచి కూడా హెచ్చుసంఖ్యలో దళాల్లోకి వచ్చారు. ఆ విధంగా దళాలసంఖ్య పెరిగిపోయింది. కార్యకర్తలసంఖ్య పెరిగిపోయింది.

**మిలటరీ రంగంలో అతివాద ధోరణి :** 50 నుంచి 100 మందిదాకా ఉండే విధంగా కంపెనీ దళాలు ఏర్పడటం మిలటరీ రంగంలో వచ్చిన అతివాద పెదధోరణి. దానివల్లకూడా చాలా నష్టాలు జరిగినాయి. అంతేకాకుండా బారకాసు పద్ధతులని ఆ రోజుల్లో ఉండేవి. బారకాసు పద్ధతులంటే బహిరంగ పద్ధతులని చెప్పవచ్చును. దళాలు బహిరంగంగా తిరగటం, బహిరంగంగా భోజనాలు చేయటం, బహిరంగంగా తమకు కావలసిన వస్తువులన్నింటిని తెప్పించుకోవటం, ఇటువంటి వ్యవహారాలన్నీ ఈ పద్ధతులలో భాగంగా జరుగుతూ ఉండేవి. ఆ రోజుల్లో కొన్నిచోట్ల బాగా విజయాలు సాధించిన ఫలితంగా రజాకార్లను, మిలటరీని ఎదిరించగలుగుతామనే అనవసరమైన ధీమా కలిగింది. రజాకార్ల మీద దాడిచేసి దెబ్బతీయటం మొదటి రోజుల్లో కష్టమైనా తర్వాతి కాలంలో సులభమైంది. అప్పుడు వారు గుండె నిబ్బరం కోల్పోయి తుపాకి దెబ్బ వినగానే పారిపోయేవారు. బాంబు చప్పుడు వినగానే పరిగెత్తేవారు. ఈ రకంగా వారు ఒక దశలో దాడి చేయగలిగిన శక్తిగా లేకుండా పోయారు. పోలీసులు కూడా దాడిచేయలేని స్థితికి వచ్చారు. కాని మిలటరీ వారిలో ఆ పరిస్థితి లేదు. ఈ పోరాట ప్రాంతాల్లో, ప్రత్యేకించి నల్లగొండ, వరంగల్లు జిల్లాల్లో మిలటరీని పెద్ద ఎత్తున కేంద్రీకరించి దాడులు చేశారు. అయినా రజాకార్లలాగా ఒక గ్రామంలో ప్రతిరోజూ, లేక దినం తప్పించి దినం దాడి చేయటం మిలటరీ వారికి సాధ్యం కాలేదు. వారు అంత సంఖ్యలో లేరు. దానితో ఒక దాడి తర్వాత తిరిగి అదే గ్రామంపై దాడి చేయటానికి మధ్య ఉండేకాలంలో కార్యకలాపాలు సాగించటానికి అవకాశం ఉండేది. అయితే అనేక సందర్భాలలో ఈ కాలాన్ని ఉపయోగించుకొని

బారకాసు పద్ధతులు అనుసరించారు. ఇంతవరకు జరిగిన దాడుల్లో చాలా సందర్భాలలో ఈ బహిరంగ పద్ధతుల వల్లనే దళాలు నష్టపోయాయి. శత్రువు ఏజెంట్లు, ఇన్‌ఫార్మెంట్లు ఈ దళాల ఉనికిని గురించి పోలీసులకు, మిలటరీకి చేరవేసేవారు. వారు దాడిచేసి ఈ దళాలను నాశనం చేయటంకొరకు ప్రయత్నం చేసేవారు. చివరి క్షణంలో దళాన్ని కాపాడుకొని బయటపడిన ఉదాహరణలు అనేకం ఉన్నాయి. అయినా పార్టీ ఆర్గనైజర్లు, దళనాయకులు నష్టపడిన సందర్భాలే ఎక్కువగా ఉన్నాయి. ఈ విధంగా ఈ కంపెనీ దళాలు ఏర్పరచటం, బహిరంగమైన బారకాసు పద్ధతులను అనుసరించటం—వీటిని మిలటరీ రంగంలో వచ్చిన అతివాద పోకడగా గుర్తించాలి. ఈ పెదధోరణి సాయుధ పోరాట ప్రాంతమంతటా వచ్చింది. తర్వాత దీనిని సరిచేసుకున్నారు. బహిరంగంగా పనిచేసే బారకాసు పద్ధతులు అంతటా ఉంటూ చివరిదాకా పోలేదు. నిర్బంధం ఎక్కువైనప్పుడు తగ్గి, నిర్బంధం కొంత తక్కువకాగానే తిరిగి బహిరంగంగా పనిచేయటం మామూలుగా జరుగుతుండేది. రహస్య పద్ధతులు అనుసరించటానికి కొంత క్రమశిక్షణ అవసరమవుతుంది. కొన్ని ఇబ్బందులు పడవలసివస్తుంది. ఆ ఇబ్బందులను మొదటి రోజుల్లో తట్టుకోలేదు. ఇది ఆ కాలంలో అంతటా వచ్చిన పెదధోరణి.

## స్త్రీల పాత్ర

ఈకాలంలో స్త్రీలపాత్ర స్థానికంగా చాలా ఉంటూ వచ్చింది. పురుషులతో పాటు స్త్రీలు కూడా పోరాటంలో పాల్గొన్న సంఘటనలు ఇదివరకే చెప్పాము. అదేవిధంగా గ్రామ వ్యవహారాలను చక్కబెట్టటంలో వీరు పాల్గొనేవారు. తగాదాల తీర్పులను ప్రైవేటుగా చెప్పకపోయేవారు. పరిష్కారాల పద్ధతి ఈవిధంగా ఉండేది: గ్రామరాజ్యం సమావేశమవుతుంది. తగాదాకు సంబంధించిన ఇరుపక్షాల వారూ గ్రామరాజ్యం ముందుకువస్తారు. ప్రజలందరూ అక్కడికివచ్చి, పరిష్కారంలో పాల్గొంటారు. ఆ తగాదా విషయంలో తమకు తెలిసినవన్నీ చెప్పి, సరైన నిర్ణయానికి రావటానికి తోడ్పడుతూ ఉంటారు. గ్రామరాజ్యాల్లో స్త్రీలను కూడా సభ్యులుగా తీసుకున్న సందర్భాలు చాలా ఉన్నాయి. స్వతహాగా పురుషులతో పాటు వీరు కూడా కష్టజీవులు. దీనితోపాటు గ్రామ వ్యవహారాల్లోనూ, పోరాటం లోనూ పురుషులతో సమానంగా పాల్గొనాలనే లక్ష్యంతో పనిచేశారు. కొద్దిగా తెరపిగా ఉన్నరోజుల్లో రాత్రులందు జరిగే సమావేశాలలో కూడా పాల్గొనేవారు.

తర్వాతకాలంలో కూడా చాలాకాలంవరకు నల్లగొండజిల్లాలో ఏ బహిరంగసభ జరిగినా సర్వసాధారణంగా అందులో స్త్రీలు సగానికి సగం పాల్గొనేవారు. క్రమంగా అది తగ్గిపోయింది. చాలా తక్కువసంఖ్యలో స్త్రీలు కార్యకర్తలుగా పనిచేశారు. వారిలో ముగ్గురు, నలుగురిని మినహాయిస్తే తక్కినవారు స్థానికంగా ఉన్నవారే. కొంత మిలటరీ ట్రైనింగు ఇచ్చి దళాల్లో చేర్చటానికి ప్రయత్నం చేసినా వారు ప్రతిభావంతంగా పాల్గొన్న సంఘటనలు చాలా అరుదు. కొంతవరకు వారు మాటవరుసకు దళాల్లో ఉండేవారు. ట్రైనింగులో పాల్గొన్నారు. దళాలతో పాటు దాడుల్లో పాల్గొనటం లాంటి కార్యక్రమాలేవీ అమలుజరుపలేదు.

## సాంస్కృతిక కార్యకలాపాలు

పోలీసుల తీవ్రమైన దాడులనుండి వ్యవధి దొరికిన చివరి నెలల్లో (అంటే సుమారు 3-4 నెలలు) సమావేశాలు జరుపటానికి ఎక్కువగా వీలుండేది. ఈ వ్యవధిని సాంస్కృతిక కార్యకలాపాలు అభివృద్ధి చేయటానికి కూడా ఉపయోగించారు. గ్రామాల్లో సాధ్యమైన చోట పగలు పాఠశాలలు కూడా నడిపి పిల్లలకు చదువు చెప్పేవారు, రాత్రి పాఠశాలల్లో యువకులకు చదువు చెప్పేవారు. పాటలు, పద్యాలు, కోలాటం లాంటి జానపద కళా రూపాలన్నిటిని ముందుకు తీసుకువచ్చి ప్రదర్శిస్తూ, ప్రజలను ఉత్తేజితులను చేయటానికి వాటిని ఉపయోగించినారు. స్థానిక ప్రజా కవులు, కార్యకర్తలే రచయితలుగా గేయాలను, బుర్రకథలను రూపొందించి, ప్రజలకు చెప్పి, ఆ కళా రూపాల్లో వారు పాల్గొనేట్టు చేసేవారు. ఆ కాలంలో పాడిన పాటలను ఇటీవలి కాలంలో కొందరు సేకరించి పుస్తకాల రూపంలో ప్రకటించారు. వాటిని గమనిస్తే, ఆ కళా రూపాలలో ఎంత వైవిధ్యమున్నదీ, ప్రజలనుంచి వచ్చే కార్యకర్తలు, రచయితలు ఏ విధంగా ప్రజల మనోభావాలను స్పందింపజేసే విధంగా తమ రచనలను సాగించగలిగారో స్పష్టమవుతుంది.

# 3. సిద్ధాంత సమస్యలు, పార్టీలోని పరిణామాలు

ఒక వైపున ప్రజల కార్యక్రమాలు ఉధృతంగా ముందుకుసాగి పోతుంటే రెండవ వైపున పార్టీలో సిద్ధాంత చర్చలు జరిగినవి. వీటిని గురించి కొంత తెలుసు కోవలసి ఉంటుంది. పోరాట కార్యక్రమం, భూమి పంపక కార్యక్రమం సందర్భంలో వచ్చిన సమస్యలు కూడా అర్థం చేసుకోవాలి.

## జోషి పంథా

అఖిలభారత స్థాయిలో నెహ్రూను బలపరచటం : ఈ సాయుధపోరాటం ప్రారంభమయ్యేనాటికి పార్టీలో కేంద్రకమిటీస్థాయిలో జోషిపంథా అమలుజరుగుతున్నది. ఆ పంథా సారాంశమేమిటంటే : 'నెహ్రూ జాతీయ బూర్జువా వర్గానికి నాయకుడు. సర్దార్ వల్లభ్‌భాయి పటేలు ఒక అభివృద్ధినిరోధక దళారీ బూర్జువా వర్గానికో లేక భూస్వామ్యవర్గానికో ప్రతినిధి. వీరిద్దరిమధ్యన మౌలికమైన వైరుధ్యాలున్నాయి. కాంగ్రెసులోఉన్నప్పటికీ ఈవైరుధ్యాలు కొనసాగుతున్నాయి. ప్రభుత్వంలో కూడా కొనసాగుతున్నాయి. దేశానికి వచ్చిన స్వాతంత్ర్యాన్ని నిజమైన స్వాతంత్ర్యంగా మార్చటానికి పార్టీ జాతీయ బూర్జువావర్గ నాయకుడైన నెహ్రూను బలపరచాలి. ఈవిధంగానే సర్దారు వల్లభ్‌భాయి పటేలు ప్రాతినిధ్యం వహించే అభివృద్ధినిరోధకశక్తుల కుట్రలను ఓడించగలుగుతాము. ఈ దృష్టితో కాంగ్రెసులోని నెహ్రూ నాయకత్వంలోఉన్న భాగంతో ఐక్యసంఘటన ఏర్పరచుకోవాలి.' ఆనాడు కేంద్రకమిటీలో ఈపంథాకే మెజారిటీ ఉండేది. దాన్ని అమలు జరుపుతుండేవారు.

సంస్థానంలో స్వామీజీ వర్గాన్ని బలపరచటం : దీనికి ప్రతిబింబంగానే హైదరాబాదు స్టేటుకాంగ్రెసులో నెహ్రూ అనుచరుడైన స్వామీ రామానందతీర్థను బలపరిచారు. సర్దార్ వల్లభ్‌భాయి పటేలు అనుచరులైన బూర్గుల రామకృష్ణారావు తదితరులను వ్యతిరేకించారు. స్వామీ రామానందతీర్థను ఈమేరకు బలపరచటమే కాక, వారికి ఎన్నోవిధాల సహాయంకూడా చేశారు. అవకాశముంటే కాంగ్రెసులో కూడా చేరి వారికి సహాయపడేవారేమోగాని, దీనికి పార్టీలో ఉన్న పరిస్థితులు ఆనాడు అవకాశమివ్వలేదు. కాని వారితో ఐక్యసంఘటన పేరుతో కొంతకాలం దాకా వారిచుట్టూ తిరిగారు. తర్వాత పార్టీకేంద్రం నుంచి వారికి వచ్చిన సూచనలతో, ఇక్కడ కూడా పోరాటం ముందుకుపోవటంతో, ఈ ఐక్యసంఘటన ఏర్పడలేదు. స్వామీజీ గ్రూపుకి చెందినవారుకూడా పార్టీకి వ్యతిరేకంగా తయారై తమ పనులు సాగించారు. అయితే ఇక్కడ స్వామీజీ అనుకూలురు తక్కువమంది ఉన్నారు. వారికి సంబంధించిన సాహిత్యంలో అలాంటివారిలో కొంతమంది పేర్లిచ్చారు: వరంగల్‌జిల్లాలో కోదాటి నారాయణరావు, కాళోజీ నారాయణరావు, కొమరగిరి నారాయణరావు. వీరిలో కోదాటి నారాయణరావు ప్రస్తుత నల్లగొండ

జిల్లాలోని మునగాల పరగణాతో సంబంధముండటంవల్ల నల్లగొండ జిల్లా వారుగా కూడా అన్పించేది. ఈముగ్గురూ స్వామీజీ అనుచరులుగా పేరుపడ్డారు. కరీంనగరు జిల్లాలో పి. వి. నరసింహారావుగారికి ఆయన అనుచరుడని పేరు. ఇదే విధంగా అక్కడక్కడ తెలంగాణాలో కొందరు ఉండేవారు. ఈ అనుచర బృందానికి ఆనాడు చెప్పుకోదగిన పలుకుబడి ఏమీలేదు. వారు చేయగలిగింది కూడా ఏమీలేదు. ఒకవైపున వారు కమ్యూనిస్టు వ్యతిరేకులు. కానీ బూర్గుల రామకృష్ణారావు తదితరులతో ఉన్న తగాదాలవలన తమ కమ్యూనిస్టు వ్యతిరే కతను పూర్తిగా బయటపెట్టలేక పోయేవారు. ఇటువైపు కమ్యూనిస్టులతో బాగుం డాలని మాటల్లో చెప్పేవారు. స్వామీజీద్వారా మితవాదులతో కలిసిపోవాలని వారు ప్రయత్నించేవారు. ఆంధ్రమహాసభనుండి చీలినతర్వాత వారు మితవాదు లతో ఐక్యమై కమ్యూనిస్టులకు వ్యతిరేకంగా, ఆంధ్రమహాసభకు వ్యతిరేకంగా పని చేసిన సంగతి మనకు తెలిసిందే. తర్వాతకాలంలో కూడా వారు ఆ వైఖరిని వదులుకోలేదు. వీరు ఎప్పుడూ కేంద్రంవైపు చూస్తూ, ఏదో ఒక పరిష్కారం జరిగితే హైదరాబాదులో రాజ్యం ఏలుకోవచ్చునని ఎదురుచూస్తూ ఉండేవారు.

**సంస్థానం పార్టీలో జోషీ పంథా అనుచరులు :** జోషి పాలసీని అనుస రించేవారు సంస్థాన పార్టీలోకూడా ఉండేవారు. వీరు తెలంగాణాలో రావినారాయణ రెడ్డి, ఆయన అనుచరులు, మరఠ్వాడాలో వి. డి. దేశ్‌పాండే మొదలగువారు. వీరు స్వామీజీకి, ఆయన అనుచరులకు సన్నిహితంగా ఉండేవారు. పార్టీలో తక్కినవారికన్నా వీరు అనుకూలంగా ఉండేవారు. వీరే కమ్యూనిస్టుపార్టీ అని కాంగ్రెసువారు అనుకునేవారు. స్వామీజీగ్రూపునే కాంగ్రెసు అని వీరనుకునేవారు. కానీ స్వామీజీకి, బూర్గులకి మధ్య జరిగిన సంఘర్షణలో చివరికి బూర్గుల రామకృష్ణారావుగారే గెలిచారు. స్వామీజీ ఓడిపోయారు. ఇది తర్వాతకాలంలో జరిగింది. పార్టీలో స్వామీజీ పక్షాన్ని ప్రతిబింబిస్తూ వీరు అధికార స్థానంలో చాలా కాలందాకా ఉంటూ వచ్చారు. దీనిని అర్థంచేసుకోవాలి.

**పోరాట ప్రాంతాల్లో జోషీ పంథాకు వ్యతిరేకంగా విప్లవ ధోరణి :** పోరాట ప్రాంతాలకు సంబంధించినంత వరకూ వీరితో ఐక్య సంఘటన అనే సమస్య రాలేదు. వీరిననుసరించే భూస్వాముల భూమిని చాలావరకు పంచకుండా జాగ్రత్త తీసుకున్నారు. పార్టీ ఆ మాత్రం అవకాశ మిచ్చింది. 'ఇక నిజాం ప్రభుత్వం నిలువదు. ఇవాళో రేపో కాంగ్రెసు ప్రభుత్వంతో రాజీచేసుకుంటుంద'ని

తేలిపోయిన తర్వాత, ఈ పెద్ద భూస్వాములలో చాలా భాగం కాంగ్రెసు వైపుకి వచ్చారు. వీరి భూమినంతా వదిలిపెడితే రైతులకూ, కూలీలకూ దక్కేదేమీ ఉండదని వీరి భూములని కూడా సీలింగుకి అనుగుణంగా పంపకం చేశారు. ఇది కాంగ్రెసు నాయకత్వానికి ఇష్టంలేదు, భూస్వాములకు సహజంగా ఇష్టంలేదు. దీనితో ఈ భూముల పంపకంపై, కమ్యూనిస్టులపై దుష్ప్రచారం చేయటం ఒక కార్యక్రమంగా పెట్టుకున్నారు. జోషి పాలసీని పోరాట ప్రాంతాల్లో అమలు జరపాలని ఎంత ప్రయత్నం చేసినా పోరాటశక్తులు, ముఖ్యంగా పార్టీలో, ప్రజల్లో ఉండే విప్లవ ధోరణి దీనిని సాగనీయలేదు. కొన్ని ప్రాంతాల్లోనైనా భూమి పంపకాన్ని కొనసాగించారు. ఇది రాజీ శక్తుల విధానాన్ని, పరిధిని మించి పోయింది.

## బి.టి. రణదివె పంథా, రెండవపార్టీ కాంగ్రెసు

**బి.టి. రణదివె పంథాకు కేంద్ర కమిటీలో మెజారిటీ :** కొంతకాలం తర్వాత సుమారు డిసెంబరు 47 ప్రాంతంలో మళ్ళీ కేంద్రకమిటీ సమావేశమైంది. జోషి లైనుకు విరుద్ధమైన ఒక లైనును బి.టి. రణదివె ప్రతిపాదించారు. నెహ్రూ ప్రభుత్వాన్ని బలపరిచే బదులుగా ఆ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజాతంత్ర ఐక్య సంఘటనను ఏర్పరచాలి అనే లైనును ఆయన ప్రతిపాదించారు. దీనితో సెంట్రల్ కమిటీలో జోషి లైనుకున్న మెజారిటీ పోయి బి.టి. రణదివె లైనుకు మెజారిటీ వచ్చింది. ఆయన కార్యదర్శిగా ఉంటూ రెండవ పార్టీ కాంగ్రెసును నడిపించారు. 1948 ఫిబ్రవరిలో రెండవ పార్టీ కాంగ్రెసు జరిగింది. సుమారు 1947 డిసెంబరు నుండి మొదలుకొని రెండవ పార్టీ కాంగ్రెసు జరిగే వరకూ ఈ కొత్తలైను అమలు జరగటం ప్రారంభమయింది. కలకత్తాలో 1948 ఫిబ్రవరిలో జరిగిన రెండవపార్టీ కాంగ్రెసులో దీనికి తుది స్వరూప మిచ్చారు.

**ఆంధ్రలో తాలూకా, జిల్లా పార్టీ మహాసభలు, బుద్ధవరం రాష్ట్ర మహాసభ :** ఈ సందర్భంలోనే రాష్ట్ర కాన్ఫరెన్సు, జిల్లా కాన్ఫరెన్సులు కూడా జరిగాయి. ఆంధ్రదేశానికి సంబంధించినంతవరకూ రాష్ట్ర కాన్ఫరెన్సు బుద్ధవరంలో జరిగింది. సర్కారు, రాయలసీమ జిల్లాల్లో జిల్లా, తాలూకా స్థాయి కాన్ఫరెన్సుల వరకూ జరిగాయి. పోరాట ప్రాంతాలు కావటం వలన తెలంగాణాలో కాన్ఫరెన్సులు జరుపలేదు. ఈ పోరాటాలకు నాయకత్వం వహిస్తున్నవారు,

వాటిలో పాల్గొంటున్నవారు ఎవ్వరూ ఈ కాన్ఫరెన్సులకి హాజరు కానవసరంలేదని నిర్ణయించారు. ఎందుకంటే 'కాన్ఫరెన్సులకి వెళ్ళి రావటానికి కనీసం 10-15 రోజుల వ్యవధి అవసరం. ఇంతకాలం పోరాట ప్రాంతంనుండి గైరుహాజరు కావటం వల్ల పోరాటం చాలా నష్టపడుతుంద'ని కారణం చెప్పారు. 'పోరాటానికి ఎక్కువ ప్రాధాన్యత ఉంటుంది కనుక ఈ ప్రాంతాల వారెవ్వరూ కాన్ఫరెన్సుల్లో, మహాసభల్లో హాజరు కానవసరంలేద'ని నిర్ణయించారు. దీనితో ఋద్ధవరం మహాసభలో పోరాటంలో పాల్గొంటున్న కామ్రేడ్సు, నాయకులూ ఎవ్వరూ పాల్గొనలేదు. అప్పటికి తెలంగాణానుంచి కొందరు పాల్గొన్నారు. పాల్గొన్నవారిలో హెచ్చు భాగం, లేదా దాదాపు అందరూ విజయవాడ పార్టీ ఆఫీసులోగానీ, కృష్ణా గుంటూరు జిల్లాల్లో, ఇతర ప్రాంతాల్లోగానీ కాందిశీకులుగా విశ్రాంతి తీసుకుంటున్న నాయకులు, లేక కార్యకర్తలే. ఈ విధంగా పోరాటంతో సంబంధంలేని కార్యకర్తలు ఈ సభల్లో పాల్గొన్నారు. ఈ విషయాన్ని ప్రత్యేకంగా గమనించాలి. కొంత పలుకుబడి ఉండి, పనీపాటా లేనివారికి మహాసభల ప్రతినిధులుగా ప్రాధాన్యతనివ్వటం, పోరాటాల్లో ఉన్నవారికి ప్రాధాన్యత నివ్వకపోవటం జరుగుతూ ఉంటుంది. ఈ విషయాన్ని కాన్ఫరెన్సుకి తెలియజేసి, వారు ప్రతినిధులుగా ఉన్నా ఇబ్బంది లేకుండా ఉండేది. కానీ పోరాట ప్రాంతాన్ని, పోరాట ధోరణులను ప్రతిబింబిస్తున్నట్లుగా వారిని చూపెట్టడం, వాస్తవంగా పోరాటానికి నాయకత్వం వహిస్తున్నవారికి దీనిలో అవకాశం లేకుండా ఉండటం దీనిలో స్పష్టంగా కనిపిస్తుంది. ఇదంతా బుద్ధిపూర్వకంగా చేశారని చెప్పటంకానీ, పోరాటానికి నాయకత్వం వహించిన వారానాడు అక్కడికి వెళ్ళాలని చెప్పటంకానీ దీని ఉద్దేశ్యంకాదు. ఈ విషయంలో దీనికున్న (పోరాట ధోరణులను ప్రతిబింబించటంలో తెలంగాణా నుంచి వెళ్ళిన ప్రతినిధి వర్గానికి ఉన్న) పరిమితిని, ఆనాడున్న కొన్ని తప్పుడు ధోరణులను అర్థం చేసుకోవటానికి ఇది తెలుసుకోవటం అవసరం. ఆంధ్ర రాష్ట్రంలో జరిగిన ఈ సభలలో ఆనాటి విధానాల గురించి చర్చించి, తుదకు బి. టి. రణదీవె లైనును బలపరుస్తూ, తీర్మానాలు చేశారు. ఆంధ్ర రాష్ట్ర మహాసభలో కూడా ఇలాంటి తీర్మానమే జరిగింది.

**రెండవ పార్టీ కాంగ్రెసు (కలకత్తా) :** దీని తర్వాత రెండవపార్టీ మహాసభ కలకత్తాలో జరిగింది. దానికి కూడా ఆంధ్రరాష్ట్రంనుంచి పెద్ద డెలిగేషను

వెళ్ళింది. ఆనాడు తెలంగాణాలో సాయుధపోరాటం సాగుతున్నందున ఆంధ్ర డెలిగేషను ప్రత్యేకత సంతరించుకున్నది. అందరూ ఉత్సాహంతో ఆంధ్రప్రతి నిధులయెడ మన్ననలను, గౌరవాన్ని చూపెట్టారు. మహాసభలోకూడా వీరుబాగానే పాల్గొని తమ అభిప్రాయాలని చెప్పారు. బుద్ధవరంలో జరిగినట్లుగానే, ఇంకా పెద్దఎత్తున ఆఫీసులో ఉన్న నాయకులే వెళ్ళి మహాసభలో ప్రాతినిధ్యం వహించారు. పోరాట ప్రాంతంలోని నాయకత్వంకానీ, కార్యకర్తలుకానీ వాటిలో పాల్గొనలేదు. ఈ విషయాన్ని అక్కడ చెప్పినట్లు కూడా తెలియదు. మహాసభకు వెళ్ళినవారే పోరాటానికి నాయకత్వం వహించినట్లుగా చెప్పుకున్నారు. వీరినే తెలంగాణా వీరులని చెప్పటం, మితవాద ధోరణిలో ఉండి జోషీ నాయకత్వాన్ని బలపరచిన రావినారాయణరెడ్డిని పోరాటానికి నాయకత్వం వహించినట్లుగా గుర్తించటం ఆడెలిగేషన్‌లో ఉన్న లోపం ; నాయకత్వంలో ఉన్న అవగాహనా లోపం. ఈ విషయాన్ని ఆనాడు స్పష్టం చేసుకోలేదు. తర్వాత కూడా ఎవ్వరూ స్పష్టంచేయలేదు.

రెండవ పార్టీ కాంగ్రెసు రాజకీయ థీసిసు : రెండవ పార్టీ మహాసభలో ఆమోదించిన రాజకీయ థీసిస్‌లో పార్టీ కార్యక్రమాన్ని స్థూలంగా (outline) చెప్పారు. దీనిలో కొత్త సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు. దీనిలోని మౌలికాంశాలు ఇవి : బూర్జువా వర్గం, ఫ్యూడల్ వర్గం, సామ్రాజ్యవాద వర్గాల రాజ్యమిది. దీనిని కూలదోయటానికి ఐక్య సంఘటనను ఏర్పరచాలి. ఈ ఐక్య సంఘటనలో కార్మికులుంటారు. రైతాంగముంటుంది. వారిలో మధ్యతరగతి రైతులవరకు ఉంటారు. ఇది కొంచెం అస్పష్టంగానే ఉన్నది. వీరితోపాటు పట్టణ మధ్యతరగతి వారుంటారు. ఈ విధంగా ఒకవైపున కూలదోయవలసిన వర్గాలుంటే, రెండవ వైపున విప్లవ వర్గాలుంటాయని నిర్వచించి, విప్లవ వర్గాలకు కార్మికవర్గం నాయకత్వం వహిస్తుంది అని అందులో చెప్పారు. దీనిలో అనేకలోపాలున్నాయి. తూర్పు యూరపు రాజ్యాల్లో అనుసరించిన వ్యూహాన్ని ఇక్కడకు తీసుకువచ్చి పెట్టటం ఒకలోపం. ఇది మార్క్సిజం-లెనినిజానికి మౌలికంగా విరుద్ధమైనది. మార్క్సిజం-లెనినిజం ప్రకారం పెట్టుబడిదారీ దేశాలకు వలస-అర్ధవలస దేశాలకు మౌలికమైన భేదముంటుంది. వలస-అర్ధవలస దేశాల్లో జాతీయ బూర్జువా వర్గం సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా మౌలికమైన వైరుధ్యాలు కలిగి ఉంటుంది. ఈ జాతీయ బూర్జువా వర్గం ఐక్యసంఘటనలో కలిసి ఉంటుంది. కొన్ని సందర్భాల్లో

ఒక మేరకు కలిసివస్తుందని ముందు చెప్పినప్పటికీ, చైనా విప్లవ అనుభవాల ద్వారా జాతీయ బూర్జువా వర్గం విప్లవ వర్గంగా ఐక్యసంఘటనలో ఉంటుందని తర్వాత స్పష్టంచేయటం జరిగింది. ఈ విధంగా పెట్టుబడిదారీ దేశాలకు, వలస-అర్ధవలస దేశాలకు ఉండే మౌలికమైన భేదాన్ని గుర్తించక, అధికారంలో ఉన్న వర్గాలను, విప్లవ వర్గాలను నిర్ణయించటంలో దాన్ని వదిలివేశారు. ఇలాంటి తప్పును సిద్ధాంత గ్రంథాలలో ట్రాట్స్కీ వాదమని చెప్పారు. వాస్తవంలో ట్రాట్స్కీ వాదాన్ని అనుసరించినా, లేకున్నా ఈ తప్పుమాత్రం ట్రాట్స్కీ వాదానికి సంబంధించినదేనని చెప్పవలసి ఉంటుంది.

జోషీకి వ్యతిరేకంగా తెలంగాణా మార్గమనే నినాదాన్ని ఉపయోగించిన బి.టి.ఆర్. : రెండోవైపున ఉపన్యాసాలలో తెలంగాణా మార్గమే మన మార్గమని చెప్పారు. తెలంగాణా మార్గమేమిటి ? మన మార్గమేమిటి ? అది ఏ విధంగా ఉంటుంది అనే విషయాలను వివరించకుండా అంతటితో వదిలేశారు. కేంద్ర కమిటీ స్థాయిలో జోషి గ్రూపని, బి.టి. రణదీవె గ్రూపని కొన్నిముఠాలు పనిచేస్తూ వచ్చినాయనే విషయాన్ని మనమీ సందర్భంలో గుర్తుంచుకోవాలి. పి.సి. జోషి అంతకుపూర్వం చాలాకాలంనుంచి కార్యదర్శిగాఉండటంవలన ఆంధ్ర రాష్ట్రంలో కూడా ఆయన రాజకీయాలను బలపరిచేవారు తగినంత సంఖ్యలో ఉండేవారు. కొత్తగా కార్యదర్శి కావటంవలన బి.టి. రణదీవె గ్రూపు బొంబాయి వరకే పరిమితమై ఉండేది. వీరిది మహారాష్ట్రలోనూ, ఇతర ప్రాంతాల్లో అక్కడక్కడా ట్రేడు యూనియనుద్వారా ఏర్పడిన గ్రూపుగా ఉండవచ్చును. రెండవ పార్టీ మహాసభలో తెలంగాణా పోరాటాన్ని బాగా పైకి ఎత్తి, పొగిడి, జోషీకి వ్యతిరేకంగా ఈ పోరాటాన్ని బి. టి. రణదీవె ఉపయోగించారు. అదే సమయంలో ఆయన తెలంగాణా నాయకత్వంలోనూ, ఆంధ్ర నాయకత్వంలోనూ జోషి అనుచరుల జోలికి వెళ్ళలేదు. ఈ విధంగా జోషీని దెబ్బతీయటానికి, కేంద్ర కమిటీలో ఆయన అనుచరులను చాలా కనీస సంఖ్యకు కుదించటానికి, తెలంగాణా పోరాటాన్ని బి.టి. రణదీవె ఉపయోగించారు. ఆ విధంగానే జరిగింది. తుదకు జోషీనికూడా కేంద్రకమిటీనుంచి తొలగించటానికి ప్రయత్నంచేసి విఫలమయ్యారు. ఎందుకంటే ఆంధ్రాడెలిగేషన్ అతన్ని తొలగించటానికి సిద్ధం కాలేదు. వారు ఈ ప్రయత్నాన్ని వ్యతిరేకించారు కూడా. ఈ పరిణామాలు ఆనాటి పరిస్థితులను అర్థం చేసుకోవటానికి కొంత ఉపయోగపడతాయి. ఏదైతేనేమి కొత్త కేంద్ర

కమిటీ ఏర్పడింది. అందులో ఆంధ్రనుంచి పెద్దసంఖ్యలోనే కేంద్రకమిటీ సభ్యులను తీసుకున్నారు.

## ఆంధ్ర థీసిసు

మహాసభ నుండి తిరిగివచ్చిన తర్వాత ఈ పోరాటాన్ని ముందుకు తీసుకు పోవటానికి కొంత ప్రయత్నం చేశారు. అవి జయప్రదంగానే సాగిపోయినవి. అప్పటికి పోరాటంలో కూడా ఒక కొత్తదశ ఏర్పడింది. సంఖ్యలోనూ, నైపుణ్యం లోనూ నిజాం మిలటరీని, పోలీసులను దెబ్బ తీయగలిగిన విధంగా గెరిల్లా దళాలు ఏర్పడినవి. ఆ దృష్టితో చూసినప్పుడు మొత్తంమీద పరిస్థితి బాగానే ఉన్నదని, ఈ పరిస్థితి ఇంకా కొనసాగవచ్చునని రాష్ట్ర సెక్రటేరియటు (రాష్ట్ర కమిటీ కార్యదర్శి వర్గం) భావించింది. దీనితో ఈ తెలంగాణా పోరాటం భవిష్యత్తు ఏమిటి అనే సమస్య రాష్ట్ర సెక్రటేరియటు ముందుకు వచ్చింది. రెండవపార్టీ కాంగ్రెస్‌లో ఆమోదించిన రాజకీయ థీసిసుతో సమస్యలన్నీ పరిష్కారం కావటంలేదు. దీని కొరకు కొత్తమార్గం ఏదైనా ఆలోచించవలసి ఉంటుందన్న దృష్టితో తెలంగాణా పోరాట అనుభవాలను ఆధారం చేసుకొని రాష్ట్ర సెక్రటేరియటు ఒక థీసిసును రూపొందించింది. 1948లో సుమారు ఏప్రెల్ - మే నెలల్లో ఈ థీసిసు వ్రాయ బడింది.

**రాష్ట్ర సెక్రటేరియటులోని మెజారిటీ, మైనారిటీ అభిప్రాయాలు :** దీనికి ముందు రాష్ట్ర సెక్రటేరియటులో కొన్ని ప్రాథమిక చర్చలు జరిగినవి. ఈ సెక్రటేరియటులో రెండు అభిప్రాయాలు ఉన్నట్టుగా ఈ చర్చలలో స్పష్ట మయింది. ఒక్కరు తప్ప తక్కిన వారంతా ఒక అభిప్రాయం, ఒక్కరు మరో అభిప్రాయం కలిగినవారుగా ఉండేవారు.

**ఆంధ్ర థీసిసులోని ముఖ్యాంశాలు :** మొదటి (మెజారిటీ) అభిప్రాయం కలవారు అప్పటి ప్రభుత్వ వర్గ స్వభావం గురించి ఒక స్పష్టమైన అభిప్రాయం చెప్పారు. కేంద్రంలోని కాంగ్రెస్ ప్రభుత్వం దళారీ బూర్జువా వర్గానికి, భూస్వామ్య వర్గానికి ప్రాతినిధ్యం వహిస్తుందనీ, దీనిని కార్మిక వర్గం కూలద్రోయవలసి ఉంటుం దని ఇందుకొరకు ఐక్య సంఘటనను ఏర్పరచాలని వారు చెప్పారు. ఈ ఐక్య సంఘటనలో కార్మికులు, కర్షకులు, జాతీయ బూర్జువా వర్గం ఈ మూడు వర్గాలు ఉంటాయనీ, కార్మికవర్గ నాయకత్వం ఉంటుందని చెప్పారు. గ్రామస్థాయికి

వెళ్ళినప్పుడు ఫ్యూడలిజానికి వ్యతిరేకంగా జరిగే పోరాటంలో వ్యవసాయ కూలీలు, పేద రైతాంగం, మధ్య తరగతి రైతాంగం, ధనిక రైతులు కూడా ఉంటారు. ఈ ధనిక రైతులు రెండు భాగాలుగా ఉంటారు. వారిలో ఫ్యూడల్ లక్షణాలు లేక తోకలు (feudal tails) కలిగి ఉన్నవారు ఒక భాగం. వీరు వడ్డీ వ్యాపారం చేసి, పెద్ద ఎత్తున భూములు కలిగిఉండి ఫ్యూడల్ భూస్వాములతో కలిసి పోతారు. తక్కినవారు ధనిక రైతులుగా ఈ ఐక్య సంఘటనలో కలిసివస్తారు.

పోరాటమార్గం గురించి చూస్తే, ఈపోరాటం రష్యామార్గాన కాకుండా చైనా మార్గంలో నడుస్తుంది అని చెప్పారు. రష్యామార్గం అంటే పట్టణాలలో కార్మిక వర్గం సాయుధ తిరుగుబాటుచేసి, అధికారాన్ని హస్తగతంచేసుకొని, ప్రభుత్వాన్ని స్థాపించి, గ్రామాల్లో రైతాంగాన్ని ఫ్యూడలిజం నుండి విముక్తి చేసే కార్యక్రమం అని అర్థం. అది రష్యాలో అమలుజరిగింది. చైనాలో ముందు పట్టణాలలో తిరుగుబాటు చేయటానికి ప్రయత్నంచేస్తే, అది విఫలమయింది. తర్వాత ప్రజా సైన్యాలన్నీ గ్రామాలకు వెళ్ళి, విముక్తి స్థావరాలను ఏర్పాటుచేసి, ముందు గ్రామాలను విముక్తిచేసి, తర్వాత పట్టణాలను విముక్తిచేసి, తర్వాత కేంద్ర ప్రభుత్వాన్ని హస్తగతం చేసుకోవటం జరిగింది. సుదీర్ఘకాల సాయుధపోరాటాలలో, అంతర్యుద్ధం, జాతీయవిముక్తి పోరాటంలో అధికారం హస్తగతం చేసుకోవటం జరిగింది. భారతదేశంలో కూడా అదేవిధంగా జరుగుతుంది. ఇక్కడ కార్మికవర్గ సాయుధతిరుగుబాటు సాధ్యంకాదు. ఇక్కడ అర్ధవలస దేశపరిస్థితి ఉండటంవలన చైనాలో లాగానే మనం గ్రామాలలో గెరిల్లాపోరాటాన్ని ఆర్గనైజు చేసి, విముక్తిసైన్యాన్ని ఏర్పాటుచేసి, గ్రామాలను విముక్తిచేసి, విముక్తిస్థావరాలను ఏర్పాటుచేసి, క్రమంగా పట్టణాలను విముక్తిచేసి అధికారాన్ని హస్తగతం చేసుకోవలసి ఉంటుంది. ఇది చైనామార్గం. అది మన భారతదేశానికి కూడా వర్తిస్తుంది. తెలంగాణా మార్గం అనేది ఈ చైనా అనుభవాలకు అనుగుణ్యంగా ఉంటుంది. ఈమార్గాన్ని అనుసరించాలని చెప్పారు.

ప్రభుత్వం యొక్క వర్గ నిర్వచనాన్ని ఇచ్చే సందర్భంలో సామ్రాజ్యవాదంతో కలిసిఉన్న బూర్జువా వర్గాలు అని చెప్పారు. చాంగ్-కై-షేక్ ప్రభుత్వాన్ని నెహ్రూ ప్రభుత్వంతో పోల్చారు. 1930కి పూర్వం, అంటే 1927-28లో చాంగ్-కై-షేక్ ఏ పరిస్థితిలో ఉన్నాడో దాదాపు ఆ పరిస్థితి

లోనే నైహూ ప్రభుత్వంకూడా ఉంది - అని చెప్తూ ఈమార్గాన్ని అనుసరించాలని చెప్పారు.

ఇవి ఆంధ్రథీసిసులోని ముఖ్యాంశాలు.

మైనారిటీ సభ్యుని థీసిసు : దీనితో విభేదించే రాష్ట్ర సెక్రటేరియట్ సభ్యుడు ఈ విధంగా చెప్పారు: ఈ ప్రభుత్వం దాదాపు రష్యాలో ఫిబ్రవరి విప్లవం తర్వాత ఏర్పడిన ప్రభుత్వంలాగా ఉంటుంది. అంటే భూస్వాములు, బూర్జువా వర్గంయొక్క ప్రభుత్వమిది. దీన్ని కూలదోయటం అవసరం. ప్రస్తుత విప్లవదశ ప్రధానంగా రెండు విప్లవాలు అంటే ప్రజాతంత్ర విప్లవం, సోషలిస్టు విప్లవం, ఈ రెండూ కలగలుపుగా (intertwining) వచ్చిన దశ. రష్యాలో ఆనాటి పరిస్థితిలాగానే ఇక్కడకూడా ఉన్నది. మన విప్లవం బూర్జువా వర్గాన్ని కూలదోస్తూ, సోషలిస్టు విప్లవంలో ఈ ప్రజాతంత్ర కార్యక్రమాన్ని అమలు జరుపవలసిన సోషలిస్టు విప్లవంగా ఉంటుంది. ఈ విధంగా రష్యాలో ఫిబ్రవరి-అక్టోబరు విప్లవాల మధ్యనున్న దశలాగా ఇక్కడ ఉంటుందని చెప్పారు. చైనా మార్గానికి సంబంధించినంతవరకూ భారతదేశంలో చైనా మార్గంలోనే విప్లవం పయనిస్తుంది అనే విషయాన్ని ఆ అభిప్రాయం అంగీకరించింది.

- ఈ రెండు థీసిసులు ఏర్పడి, చర్చించిన తర్వాత రాష్ట్రకమిటీ తరపు నుంచి మెజారిటీ మైనారిటీ థీసిసులని వాటికి పేరుపెట్టి పైకి పంపించారు. ఈ మైనారిటీ థీసిసు ప్రత్యేకత ఏమిటంటే మెజారిటీ థీసిసును సంస్కరణవాద సిద్ధాంతం అని, ఇది దాదాపు జోషీలైనుకు పోతుందని, మితవాదమని అందులో నిర్ధారణ చేసి, దాన్ని ఖండించాలని కూడా చెప్పారు.

ఆంధ్రథీసిసు-తెలంగాణాసాయుధపోరాటానికి సంబంధించిన పాలసీ[89] : ఈ థీసిసు (ఆంధ్ర థీసిసు) తెలంగాణా సాయుధ పోరాటానికి సంబంధించిన వివరాలు, పాలసీ ఏమీ చెప్పలేదు. తెలంగాణామార్గం అనే అంశం పార్టీకాంగ్రెసు అంగీకరించినట్లుగా భావించబడింది. అదేవిధంగా మెజారిటీ డ్రాఫ్టులోనూ, మైనారిటీ డ్రాఫ్టులోనూ ఈ రెండింటిలో తెలంగాణా మార్గానికి సంబంధించినంత వరకూ విభేదాలేమీ లేవు. భారత విప్లవం చైనామార్గంలో పయనించాలని రెండు డ్రాఫ్టులూ చెబుతున్నాయి. కానీ రాజకీయమైన, పాలసీకి సంబంధించిన కొన్ని ముఖ్యమైన ఇతరఅంశాలు దీనిలో ఇమిడి ఉన్నాయి. తెలంగాణాలో వ్యవసాయ విప్లవాన్ని ఆధారంగా చేసుకొని సాయుధపోరాటం నడుస్తున్నది. నిజాంవ్యతిరేక

ఐక్యసంఘటన అంటే రెండుఅర్థాలు రావటానికి అవకాశముంటుంది. జాతీయ పరంగా చూస్తే, నిజాం వ్యతిరేకంగా ఉండే భూస్వాములు, కాంగ్రెసుకు అనుకూలంగా ఉండే ఇతరవర్గాలతో ఐక్యసంఘటన అనేది ఒకటి. రెండవది వ్యవసాయ విప్లవం. అంటే భూస్వాములకు వ్యతిరేకంగా సాగించే వ్యవసాయ విప్లవం. భూస్వాముల భూములను రైతాంగానికి, ముఖ్యంగా పేదరైతాంగానికి, వ్యవసాయకూలీలకు పంచి, ముందుకు తీసుకుపోవలసిన విప్లవం. ఈ రెండింటికి భేదమున్నది. నిజాంవ్యతిరేక ఐక్యసంఘటనలో కొంత జాతీయఅంశం (element) ఉంటుంది. ఎందుకంటే—నిజాంకి వ్యతిరేకంగా కాంగ్రెసుశక్తులు కూడా ఉన్నారు. నిజాం యూనియన్‌లో చేరితే ఈ కాంగ్రెసు అనుకూలశక్తులు నిజాంకి అనుకూలం గానే ఉంటాయి. భూస్వామ్యవర్గంలో ప్రధానభాగం లేక మొత్తంగా భూస్వామ్య వర్గమంతా కాంగ్రెసుకు, నిజాంకూ ఇద్దరికీ అనుకూలంగా ఉండేవారు. కానీ తాత్కాలికంగా ఒక మధ్యకాలంలో - అంటే నిజాంకి, యూనియన్ ప్రభుత్వానికి రాజీ జరిగే ఒక మధ్యంతర (transition) దశలో - భూస్వాములు నిజాంకు అనుకూలమైన భూస్వాములు, కాంగ్రెసుకు అనుకూలమైన భూస్వాములు అని రెండుగా విభజింపబడినట్లుగా కన్పిస్తుంది. కానీ వాస్తవం ఏమిటంటే చిన్న భూస్వాములు కాంగ్రెసుకు అనుకూలంగా ఉండేవారు. పెద్ద భూస్వాములు నిజాంకు అనుకూలంగా ఉండేవారు. కాంగ్రెసుకు, నిజాంకు సంప్రదింపులు జరిగి, ఇవాళో రేపో రాజీ కుదురుతుంది అని తేలిన తర్వాత ఈ పెద్ద భూస్వాములలోకూడా ఒకవర్గం నిజాం అనుకూలతను మార్చుకొని, కాంగ్రెసు అనుకూలురుగా మారారు. ఈ విధంగా ఒకే వర్గంలో ఒకభాగం ఇటు నిజాంకు అటు కాంగ్రెసుకు అనుకూలంగా ఉన్నారు. ఇక చిన్న భూస్వాములు కొందరు ఇదివరకే ఆంధ్ర మహాసభకు అనుకూలంగా ఉండేవారు. కొందరు కాంగ్రెసుకు అనుకూలంగా ఉన్నా తటస్థంగా ఉండేవారు. వీరు స్థిరమైన కాంగ్రెసు అనుకూలురు అని చెప్పవలసి ఉంటుంది. ఈ విధంగా ఉన్నప్పుడు నిజాం వ్యతిరేక ఐక్య సంఘటనకు, వ్యవసాయ విప్లవంలో ఉండే ఫ్యూడల్ వ్యతిరేక ఐక్యసంఘటనకు కొంత భేదముంటుంది. ఈ భేదాన్నిబట్టి చూసినప్పుడు ఈ వ్యవసాయ విప్లవ ఐక్య సంఘటనలో కలిసివచ్చేదెవ్వరు ? వ్యతిరేకించేదెవ్వరు ? అనేది అప్పుడు చర్చనీయాంశంగా ఉండేది. కానీ ఆఫీసిసులో ఆ భాగాన్ని చర్చించలేదు. కానీ ఫ్యూడలిజానికి వ్యతిరేకంగా పోరాటంచేసే సందర్భంలో ధనిక రైతులు ఐక్య

సంఘటనలో ఉంటారని థీసిసులో చెప్పటం జరిగింది. నిజాం వ్యతిరేక పోరాటంలో ధనిక రైతులే కాక భూస్వామ్యవర్గంలో కూడా ఒక భాగం తటస్థంగా ఉండటమో, కలిసిరావటమో జరిగింది. భూములు పంచనిచోట కలిసివచ్చారు. దాదాపు వారు పార్టీ పేరకూడా పెట్టుకున్నారు. భూములు పంచినచోటమాత్రం వారు తటస్థంగా ఉండటం, లేక కాంగ్రెసుకు అనుకూలమైన శక్తిగా ఉండిపోవటం జరిగింది.

**ధనిక రైతు సమస్య :** ధనికరైతులు విస్పష్టంగా ఐక్యసంఘటనలో ఉన్నవారే. అప్పులు పెట్టి, నాగులకు ఇచ్చి, దోచుకుంటూ, ఇతర భూములను ఆక్రమించుకొని, లేక కొనివేసి పెద్దవారయిన ధనికరైతులని ఫ్యూడల్ ధనిక రైతులన వచ్చును. ధనిక రైతుకున్న ప్రత్యేక లక్షణాలు ఇతనికీ ఉంటాయి. అంటే కుటుంబంలో ఉన్నవారంతా పొలంలో, చేలో పనిచేసుకుంటారు. ఈ కాయకష్టం చేసుకోవటం వలన వీరు ఇంకా ధనిక రైతులుగా ఉంటారు. వీరుకాక పెట్టుబడిదారీ ధనిక రైతులు తెలంగాణా ఆర్థిక వ్యవస్థలో చాలా అరుదుగా ఏర్పడినారు. అప్పటికి ప్రాజెక్టు ప్రాంతాలలో కొన్నిచోట్ల వీరు ఉండటానికి అవకాశముండేది. వీరు పాలేర్లను, కూలీలను పెట్టి పని చేసుకుంటారు. ఇంకా అవసరమైతే కొన్ని ఆధునాతనమైన పనిముట్లతో వారు సాగుచేసుకుంటారు. కానీ వడ్డీ వ్యాపారంలాంటి వాటికి పాల్పడరు. ఇది వీరి ప్రత్యేకత. ఇలాంటివారు అరుదుగా ఉంటారు. ప్రాజెక్టు ప్రాంతాలలో కూడా ఇలాంటివారుంటారా లేదా అనేది ఆలోచించవలసిన అంశంగా ఉంటుంది. ఎందుకంటే మిగులు ఉంటే దానిని వడ్డీ వ్యాపారాల్లో పెట్టటమనేది సర్వసామాన్యంగా జరుగుతుంది. ఆదాయంలో, పంటలో మిగులువస్తే వడ్డీవ్యాపారం చేసి దానిని పెంచుతూ ఉంటారు. తెలంగాణా ఆర్థిక వ్యవస్థలో మధ్యతరగతి రైతులు కూడా తమ ఆదాయంలో కొద్దిపాటిమిగులున్నా వెంటనే నాగులకిస్తూ, వడ్డీలకిస్తూ దానిని పెంచుతూ ఉంటారు. ధనిక రైతు స్థాయికి వచ్చేవరకు ఈ మిగులు ఇంకా ఎక్కువగా ఉంటుంది. అందుకొరకు ప్రతి ధనికరైతూ తప్పనిసరిగా వడ్డీ వ్యాపారం చేస్తూ ఉంటాడు. అందువలన ఫ్యూడల్ తోకలు అనేవి ప్రతి ధనిక రైతుకూ ఉంటాయి. ఈ ఫ్యూడల్ తోకలు ఉండటంవలన వారంతా వ్యతిరేకమవుతారా అంటే అలాంటిదేమీ ఉండదు. ఆదాయంలో హెచ్చుభాగం వడ్డీవ్యాపారంనుండి నాగులనుండి వస్తే, వారు బలమైన ఫ్యూడల్ తోకలున్నవారుగా ఉంటారు. ఆదాయంలో తక్కువ భాగం ఈ రకంగా వస్తే, వారిని పెట్టుబడిదారీ లక్షణాలు కలిగిన ధనిక రైతులని

మనం అనుకుంటాం. ఇలాంటివారంతా ఐక్య సంఘటనలో ఉన్నారు. అనుభవం ప్రకారం చూస్తే, ధనిక రైతులు ఐక్య సంఘటన నుంచి దూరంగా లేరు. కలిసే ఉన్నారు. ప్రారంభపు రోజుల్లో కొంత ఊగిసలాట ప్రదర్శించారు. తర్వాత కాలంలో అదికూడా లేదు.

గ్రామస్థాయిలో వర్గాలను నిర్వచించటంలో, అనుభవాలను క్రోడీకరించటంలో అతివాద తప్పులు : భూస్వాములను ధనికరైతులుగా వర్గీకరించటం ఆరోజుల్లో జరిగింది. ఇది మితవాదదృష్టి. ధనికరైతులను మధ్యతరగతి రైతులుగా చూపెట్టటానికి, మధ్యతరగతి రైతులను కొందరిని పేదరైతులలో, కొందరిని మధ్యతరగతి రైతులలోని క్రిందితరగతివారిలో జమకట్టడానికి వీలుగా నిర్వచనాలు ఇచ్చారు. దీనికి విరుద్ధంగా అతివాదపు నిర్వచనం కూడా ఒకటుండేది. రూపాయల్లో లెక్కవేసి ఆదాయాన్ని బట్టి ఫలానా ఆదాయం వచ్చినవారిని ధనిక రైతులనాలనీ, నిర్ణయించిన మరొక స్థాయిలో (range) ఆదాయం కలవారిని మధ్యతరగతి రైతులనాలనీ, ఇలాంటి నిర్వచనాలు ఇవ్వటానికి ప్రయత్నం జరిగింది. దానికి కావలసిన లెక్కలు తీసి వివరించటానికి ప్రయత్నించారు. ఆదాయాన్ని పునాదిగా తీసుకోవటంలో ఉన్న లోపంవలన ఇది ఆనాడుకూడా వర్తించటానికి వీలులేదు. ధరలు ఎప్పుడూ మారుతూఉంటాయి. దీనితోపాటు పంటలలో మార్పునుబట్టి నికర ఆదాయంకూడా మారుతూఉంటుంది. అంతమాత్రాన అతని వర్గస్వభావంలో మార్పు ఉండదు. ఉదాహరణకు ఒకతను రెండుజతల పశువులతో వ్యవసాయం చేస్తాడు. ఒక పాలేరును పెట్టుకుంటాడు. ఒక జతను తనకు తానుగానే దున్నుతాడు. ఆరకంగా అతను, అతని కుటుంబసభ్యులు కూడా కొంత కష్టపడుతారు. దానినుండి కొంత ఆదాయం వస్తుంది. ఈ ఆదాయం ఒక సంవత్సరంలో ఉండే వర్షపాతాన్ని బట్టి, పంటను బట్టి మారుతూ ఉంటుంది. కొన్ని ఋతువులలో, కొన్ని పరిస్థితులలో, వర్షాలూ వాతావరణం అన్నీ అనుకూలంగా ఉంటే పంట ఎక్కువగా ఉంటుంది. అననుకూలంగా ఉంటే మరోవిధంగా ఉంటుంది. ఈ విధంగా పంటలో కొంతమార్పు (fluctuation) ఉంటుంది. ఆదాయంలో కూడా మార్పు ఉంటుంది. నిర్వచనానికి దీనిని పునాది (basis)గా తీసుకోవటం కష్టంగా ఉంటుంది. వరుసగా 10 సంవత్సరాలో, 5 సంవత్సరాలో పంటలో మార్పు ఉంటే దాని ప్రభావం అతని జీవిత విధానం మీద ఉంటుంది. అంతేకాని ఏ ఒక్క సంవత్సరం, రెండు సంవత్సరాలలో వచ్చే

మార్పులవలన జీవిత విధానంలో మార్పుండదు. ఈ అంశాన్ని పరిగణించకుండా ఆదాయాన్ని పునాదిగా తీసుకోవటంలో ఈ లోపం ఉంది. శాస్త్రీయంగా చూస్తే మార్క్సిస్టు దృక్పథం ప్రకారం ఉత్పత్తి సాధనాలమీద అతనికి ఉండే యాజమాన్యం, ఉత్పత్తి సంబంధాలను పునాదిగా తీసుకోవాలి. అంటే అతను వ్యవసాయకూలీలను ఏమేరకు దోచుకుంటున్నాడు, ఏ మేరకు అతని కుటుంబ కష్టం ఉంటున్నదీ—ఈ విషయాలను పరిగణనలోకి తీసుకుంటే ధనికరైతుల నిర్వచనం మరోవిధంగా ఉంటుంది. ఈ నిర్వచనాన్ని ఆధారం చేసుకోకుండా అతివాద దృక్పథంతో కొన్ని సందర్భాలలో మధ్య తరగతి రైతులను ధనిక రైతులక్రింద, లేక ధనిక రైతులను భూస్వాముల క్రింద జమకట్టారు. భూస్వాములు శత్రువులైతే ధనిక రైతులుకూడా శత్రువులైనారని చూపెట్టి, విప్లవం సోషలిస్టు దశలో ఉంది, విప్లవోద్యమం ఆ దశకు వెళుతున్నది అని చెప్పటానికి ప్రయత్నించారు. ఆంధ్ర థీసిసుతో విభేదించిన థీసిసులో ఈ విధంగా చెప్పారు. పోరాట ప్రాంతాల అనుభవాలను ఆధారం చేసుకొని తర్వాత దానిని సమర్థించటానికి కూడా ప్రయత్నం జరిగింది. ఈ విధంగా అనుభవాలను క్రోడీకరించటంలో కూడా తప్పు ఆనాడు కనిపించింది. ఆనాటి రాష్ట్ర కమిటీ తర్వాత కాలంలో దీనిని విమర్శించి సరిదిద్దింది.

**ఆంధ్ర థీసిసు ప్రాధాన్యత, లోపాలు :** మెజారిటీ థీసిసులో ఉన్న ప్రత్యేకత ఏమిటంటే ఇందులో ఇక్కడి ప్రత్యేక పరిస్థితులను దృష్టిలో పెట్టుకొని చైనా అనుభవాలను మనం ఏ మేరకు వర్తింపజేసుకోవాలనే అంశాన్ని మొదటి సారిగా పరిశీలించి కొన్ని నిర్ణయాలకి రావటం జరిగింది. ఈ నిర్ణయాలలో కొన్ని పొరపాట్లుకూడా ఉన్నాయి. వాటిలో ప్రధానమైనవి ఇవి :

(i) చైనాలో 1927–30 నాటి పరిస్థితి భారతదేశంలో 1947–48లో ఉన్నదని తేల్చి చెప్పటం సరైనది కాదు. ఆ నాటికి చైనాలో పార్టీ నాయకత్వంలో ఉన్న 40 వేల ఎర్ర సైన్యానికి తోడుగా పెద్ద సంఖ్యలో స్థానిక సాయుధ బలాలు ఉండేవి. ఈ సైన్యాలుండటం ఒక ముఖ్యమైన రాజకీయ పరిణామం. భారతదేశంలో 1947–48 నాటికి ఈ పరిస్థితిలేదు. కానీ యూనియన్ సైన్యాలు ప్రవేశించేనాటికి కేంద్ర దళాలలో అయితేనేమి, స్థానిక దళాలలో అయితేనేమి, సుమారు 10వేల మంది సాయుధులైనవారు ఉండేవారు. ఆనాడు అన్ని ప్రాంతాలలో వచ్చిన పోరాటాలను ఉన్నత స్థాయికి తీసుకువెళ్ళి ప్రజలను సాయుధం

చేసిఉంటే, చాలా హెచ్చు సంఖ్యలో సాయుధ బలాలు ఉండేవి. మహారాష్ట్రలో బొంబాయికి దగ్గరలో ఉన్న వర్లీ జిల్లాలో ఆదివాసుల పోరాటం ముందుకు వచ్చింది కేరళలోని పున్నప్రవాయలార్ అన్న ప్రాంతంలో పోరాటాన్ని ఉన్నత స్థాయికి తీసుకువెళ్ళటానికి అవకాశముండినది. వీటిని ఉన్నత స్థాయికి తీసుకు వెళ్ళిఉంటే ఇక్కడకూడా సాయుధ బలాలు ఉండేవి. త్రిపురలో సాయుధ పోరాటం ఆలస్యంగానే ప్రారంభమైనది కాని అప్పుడే ప్రారంభించితే త్రిపురలో కూడా సాయుధ పోరాటానికి అవకాశాలుండేవి. ఈ విధంగా వివిధ ప్రాంతాలలో అప్పటికే పరిస్థితులు పరిపక్వమై, ఉద్యమంకూడా ఉన్నత స్థాయికివచ్చి, ప్రజలను సాయుధం చేయటానికి వీలుండినది. సరైన దృక్పథమే ఉండి ఉంటే ఇక్కడకూడా పోరాటాలు ఇతర ప్రాంతాలకు వ్యాపించి కొన్నివేలసంఖ్యలో సాయుధ బలాలుండేవి. వాటిని ముందుకు నడిపించటానికి తగిన పరిస్థితులు, నాయకత్వం ఉండేవి. అంటే 1927-'30 నాటికి చైనాలో పార్టీ నాయకత్వాన పోరాడుతున్న సాయుధ బలాలుండేవి. ఇక్కడ తెలంగాణాలో మాత్రమే కొద్దిగా ఉండినవి తక్కిన ప్రాంతాలలో ఇంకా అభివృద్ధి చేయవలసినవిగా ఉన్నవి ఇది చిన్న భేదమేమి కాదు. మౌలికమైనది.

(ii) ఇదే విధంగా చైనా దళారీ బూర్జువా వర్గానికి, భారత దళారీ బూర్జువా వర్గానికి కొన్ని భేదాలున్నాయి. ఇక్కడి దళారీ బూర్జువా వర్గం బ్రిటిషు వారి ఆధ్వర్యంలో తయారై, పరిశ్రమలు ఏర్పాటు చేసుకొని, విదేశీ పెట్టుబడులతో మిలాఖతు అయినవారు ఈ భేదాన్ని గమనించటం అవసరం. అయితే ఇది మౌలికమైనది కాదు. కొందరు భావిస్తున్నట్లుగా ఇక్కడి బూర్జువా వర్గం పారిశ్రామిక బూర్జువా వర్గం కావటంతో బడా బూర్జువా వర్గంకూడా జాతీయ బూర్జువా వర్గం అవుతుందనీ, దీనితో సామ్రాజ్యవాదానికి ఏదో ఒక మేరకు వైరుధ్యాలుంటాయని చెప్పటం సరియైనది కాదు ఇక్కడి బూర్జువా వర్గం పారిశ్రామిక బూర్జువా వర్గం కావటం ఒక అంశంగా ఉన్నా, దానికి ఎక్కువలో ఎక్కువ ఒక మితవాదమైన, చాలా పరిమితమైన వ్యతిరేక పాత్ర ఉంటుంది. దీనిని మనం మాటల్లో చూస్తున్నాం కానీ ఆచరణలో చూడటం లేదు. గత ఇన్ని సంవత్సరాల కాలంలో ఆవగణలో ఇది అంతర్జాతీయంగా బలంగా ఉన్న ఏదో ఒక పెట్టుబడి దారీ వర్గంతో ముడి వేసుకొని ఉన్నది, ఉంటున్నది. రెండు రకాల అగ్రరాజ్యాలైన అమెరికా, రష్యాలతో ముడివేసుకొని ఉన్న దళారీ బూర్జువా వర్గమే ఇది

పారిశ్రామిక బూర్జువా వర్గమైనా, దాని దళారీ స్వభావం మాత్రం పోగొట్టుకోలేదు. పేరు మాత్రం మార్చి మిలాఖతుదారీ బూర్జువా వర్గంగా చలామణీ అవుతున్నది. దీనిని ఇంకా స్పష్టం చేయవలసి ఉంటుంది. ఆనాటి అధ్యయనం కానీ, పరిశీలనకానీ ఆ పరిస్థితిలోకి రాలేదు.

(iii) ధనిక రైతు పాత్రను గురించి ఇంతకుముందే వివరించాము. అది ఐక్యసంఘటనలో మిత్రుడుగా ఉంటుంది అనటం సరైనదే. శాస్త్రీయ నిర్వచనం ఇవ్వటానికి కూడా అవకాశం ఉన్నది. ఇదేవిధంగా సామ్రాజ్యవాదం రాజకీయాధికారంలో పాల్గొంటున్నదని అందులో చెప్పబడింది. సామ్రాజ్యవాదం రాజకీయాధికారంలో నేరుగా పాల్గొనటం లేదు. అగ్రరాజ్యాలలో ఏదో ఒకటి లేదా రెండూ ఈ దళారీ, మిలాఖతుదారీ బడాబూర్జువా వర్గానికి అండదండగా ఉంటూ దాన్ని బలపరుస్తున్నాయేకాని, ప్రత్యక్ష పాత్ర అనేదేమీ లేదు. తర్వాత కాలంలో కొన్ని సందర్భాల్లో రాజకీయ నిర్ణయాలు చేయటంలో అవి కొంత ప్రత్యక్షపాత్ర వహిస్తూ వచ్చాయి. వారికి ఇంతకన్నా మించిన పాత్రలేదు. ఈ విధంగా సామ్రాజ్యవాదాన్ని అధికారంలో భాగస్వామిగా స్వీకరించటం సరియైనదికాదు. ఈ లోపాలున్నా కొన్ని ప్రధాన సమస్యలలో ఈ థీసిసు సరైన వైఖరిని తీసుకున్నది. దానిని సమగ్రంగా చర్చించి సరియైన పంథాను రూపొందించటం సాధ్యమయ్యేది.

ప్రధాన సమస్యల గురించి ఈ థీసిసులో సరైన లైను ఇచ్చారు. ముందు గ్రామాలలో ప్రజా సైన్యాలను ఏర్పాటుచేసి, గ్రామాలను విముక్తిచేసి, విముక్త స్థావరాలను ఏర్పాటు చేయాలని, తర్వాతి కాలంలో పట్టణాలలో సాయుధ తిరుగుబాటు వస్తుందని చెప్పటం సరైనదే. అదేవిధంగా అందులో దళారీ బూర్జువా వర్గంయొక్క అభివృద్ధి నిరోధక పాత్రను, విప్లవ వ్యతిరేక పాత్రను స్పష్టంగా చెప్పటం జరిగింది. ఇది సరైనది. అదే విధంగా ధనికరైతులుకూడా ఒక వర్గంగా విప్లవ ఐక్య సంఘటనలో ఉంటారని చెప్పటం సరైనదే. మౌలిక పంథాకు అవసరమైన కొన్ని ప్రధానాంశాలలో సరియైన అవగాహనను ఈ డాక్యుమెంటు అందించింది.

ఆంధ్ర థీసిసును ప్రక్కకు పెట్టి, సాయుధ పోరాటానికి ఎలాంటి సహాయం చేయని కేంద్ర నాయకత్వం : సుమారు ఏప్రిల్ - మే నెలల్లో దీనిని తయారుచేసి కేంద్రానికి పంపించారు. అంటే ఈ డాక్యుమెంటును

కేంద్రానికి పంపించటానికి, పోలీసు చర్యకు మధ్యన ఒక నాలుగు నెలల వ్యవధి ఉండినది. దీనిపై త్వరగా ఒక తాత్కాలిక నిర్ణయమైనా తీసుకొని పార్టీకి ఒక లైను అందించగలిగితే, పోరాట ప్రాంతాలలో ఆ లైనును ఆధారంచేసుకొని, పార్టీని, దళాలను పునర్నిర్మించి, కావలసిన సిద్ధాంత తర్ఫీదునిచ్చి, పరిస్థితులు చక్కబెట్టుకోవటానికి అవకాశముండినది. కానీ పార్టీకేంద్రం, పొలిట్ బ్యూరో ఆ పని చేయలేదు. ఇచ్చిన డాక్యుమెంటును అలా పెట్టేసి, ఒక పొలిట్ బ్యూరో సమావేశాన్ని ఏర్పాటుచేసి, సుదీర్ఘమైన చర్చకు తయారై కూర్చున్నది. కొన్ని తాత్కాలిక నిర్ణయాలుకూడా చేయలేదు. ఈ విధంగా తెలంగాణా అనుభవాలను, సాయుధ పోరాటం నడుస్తున్న ప్రాంతపు అనుభవాలను ఆధారం చేసుకొని పాలసీని అందించిన పరిస్థితిలో కేంద్రం దానిని చల్లగా ప్రక్కన పెట్టింది. పోలీసు చర్య తర్వాత దాన్ని చర్చించి కొన్ని నిర్ణయాలు చేశారు. నిర్ణయాలు వచ్చేవరకు డిసెంబరు 1948 అయింది. అంటే పోలీసు చర్య తర్వాత మరొక నాలుగు నెలలు పట్టింది. అంటే ఆ డాక్యుమెంటు వచ్చిన 8 నెలలకుగాని, పార్టీ కేంద్రం దానిపై కొన్ని తుది నిర్ణయాలు చేయలేదని దీనివల్ల స్పష్టమవుతున్నది.

మరొక వైపున సాయుధ పోరాటానికి కావలసిన ఆయుధాలు పంపించటానికిగానీ, ఇతర విధాల సహాయం పంపించటానికి కానీ కేంద్రంవైపునుండి ఎలాంటి ప్రయత్నమూ ఆ కాలంలో జరుగలేదు. సాయుధ పోరాటంయొక్క లోతుపాతులను కేంద్రం అర్థం చెసుకోలేకపోవటం దీనికి కారణం కావచ్చును. లేదా ఈ పోరాటం తాత్కాలికమైనదని, కొద్ది రోజుల తర్వాత అంతరించిపోతుందని వారు భావించి ఉండవచ్చును. వారు ఈ పోరాటంలో తలదూర్చటానికి సిద్ధంగా లేకపోవచ్చును. ఏదైనప్పటికీ పార్టీ కేంద్రంనుండి, సెంట్రల్ కమిటీ నుండి, పొలిట్ బ్యూరో నుండీ ఎలాంటి సహాయం ఇక్కడికి అందలేదనేది వాస్తవం. తుదకు పోలీసు చర్యకోసం కేంద్రప్రభుత్వం సన్నాహాలు చేస్తున్నా, ఆ సన్నాహాలను గురించి కేంద్రంలోని పొలిట్ బ్యూరో సభ్యులలో కేంద్రకమిటీ సభ్యులలో కొందరికి ఆనాటికి తెలిసినా, ఆ సమాచారాన్నికూడా రాష్ట్రకేంద్రానికి అందించలేదు. యూనియన్ ప్రభుత్వంవారు మహారాష్ట్ర, కర్ణాటక, మద్రాసు తదితర ప్రాంతాలనుంచి సివిల్ అడ్మినిస్ట్రేటర్సును (పౌరపరిపాలనా అధికారులు), ఇతరులను ఇక్కడికి నమీకరించి, కొత్తపాలనకొరకు ఏర్పాట్లు చేస్తూ ఉండిరి.

ఆ విషయాలు వీరికి తెలిసినప్పటికీ, 'పోలీసు చర్య ఒకటి జరగబోతున్నది, ఇటువంటి ఏర్పాట్లు ఇక్కడ జరుగుతున్నవి. కావలసిన జాగ్రత్తలు తీసుకోవాలి' అనికూడా ఇక్కడికి సూచనలు పంపలేదు. అంత నిర్లక్ష్యంగా ఉన్నారు. ఇటువంటివి చాలా జరిగాయి. ఇక తెలంగాణాకు సహాయంగా భారత దేశమంతటా ప్రజలను సమీకరించటం ప్రధాన కర్తవ్యంగా ఉండినది. అటువంటిదేమీ నిర్వహించలేదు.

అప్పటికి బి. టి. రణదీవే కార్యదర్శి కాకున్నా, సుమారు డిసెంబరు 1947 నాటికి ఆయన పంథాను కేంద్రకమిటీ అంగీకరించింది. అప్పటికి పోరాటం ప్రారంభమై ముందుకి సాగుతున్నది. అప్పటినుండి పోరాటం గురించి శ్రద్ధ తీసుకోవటానికి ప్రయత్నం చేసి ఉంటే, ఈ డాక్యుమెంటు వచ్చేనాటికే కొంత ముందడుగు వేసి ఉండేవారు. కానీ అటువంటిదేమీ చేయలేదు. 'కేంద్రంలో కొత్తగా వ్యవహారాలన్నీ చూడవలసి రావటం వలన ఈ పనులు చూడలేక పోయినాము'—అని వాదిస్తే ముందుకు పోతున్న సాయుధ పోరాటాన్ని నడిపించటంకన్నా మించినపని కేంద్రంలో వేరే ఏమీ ఉండదని, ఎప్పుడూ ఉండదని చెప్పవలసి వుంటుంది. 'ఇంకా వేరే పనులు ఉంటాయి. సాయుధ పోరాటం అంత ముఖ్యమైనది కాదు' అని అనుకున్న అన్ని సందర్భాలు ఆ సాయుధ పోరాటాన్ని సిక్కు గార్చటానికి తోడ్పడ్డాయి. ఇక కేంద్రంలో చక్కబెట్టే పనులన్నీ ముఠా తగాదాలకు, ముఠా సమీకరణలకు ఉపయోగ పడినవేకాని మరొకటి కాదు. బి. టి. రణదీవే అధికారం తీసుకున్న మొదటి రోజుల్లో కూడా జరిగినదంతా ఇదే. రెండవ కాంగ్రెసుకు సంబంధించిన సన్నాహాలలో ఎవరి మెజారిటీ ఏవిధంగా ఉంటుంది? ఏ రకంగా ఎవరిని సమీకరించాలి? అనే అంశాలను చూసుకున్నారేగాని, తెలంగాణా సాయుధ పోరాటానికి సహాయం చేయటానికి ఎలాంటి ప్రయత్నాలూ చేయలేదు. ఆనాటి పత్రికా విలేఖరిని ఒకరిని మాత్రం పంపించి, వార్తలు సేకరించి, ఆనాటి కేంద్ర పార్టీ పత్రికలో (పీపుల్స్ ఏజ్ అనుకుంటాను) ప్రకటించటానికి ప్రయత్నం చేశారు. ఇంతకుమించి కేంద్రం నుంచి చేసిన ప్రయత్నాలేమీ లేవు.

ఈ విధంగా పొలిట్ బ్యూరో ఆంధ్ర థీసిసును తాత్కాలికంగా పక్కకు పెట్టి, సాయుధ పోరాటానికి సహాయం చేయటానికి ఎలాంటి ప్రయత్నాలు చేయలేదు. ఎందుకు ఈ విధంగా జరిగిందని అడిగితే, 'ఇద్దరు పొలిట్ బ్యూరో

సభ్యులు అక్కడనే ఉన్నారు, ఇంకా కేంద్రం చేయవలసింది ఏముంటుందని ఒకమాట అన్నారు. దీనికి దానికి సంబంధం లేదు. వీరిలో ఒక పోలిట్ బ్యూరో సభ్యుడు అరెస్టయ్యారు. మరొక సభ్యుడు రాష్ట్రకమిటీ కార్యదర్శిగా ఉంటూ, రాష్ట్ర కమిటీ సభ్యులలో ఒక భాగంగా రాష్ట్రకమిటీ నాయకులుగా పనిచేశారే గాని, ఆనాడు పోలిట్ బ్యూరో సభ్యులుగా కేంద్రం తరఫునుంచి వ్యవహరించలేదు.

రాష్ట్ర సెక్రటేరియటుకే పరిమితమైన సిద్ధాంత చర్చలు : ఈ సిద్ధాంత చర్చలు రాష్ట్ర సెక్రటేరియటు వరకే పరిమితమై ఉండినవి. అంతకు దాటి వెళ్ళలేదు. సెక్రటేరియటులో అభిప్రాయ భేదాలున్నాయనికాని, సెక్రటేరియటు ఇటువంటి లైను తీసుకొని ఒక థీసిసును తయారుచేసి, చర్చకోసం, నిర్ణయం కోసం పోలిట్ బ్యూరోకు పంపించిందని కాని రాష్ట్రకమిటీ సభ్యులెవరికీ తెలియదు. పోరాట ప్రాంతాలలో ఉండే ఏరియా కమిటీ నాయకత్వాలకు కూడా ఈ విషయం బొత్తిగా తెలియదు. ఈవిధంగా ఇంత తెలియకుండా ఎందుకు అట్టిపెట్టారని తర్వాత కొన్ని ప్రశ్నలు వచ్చాయి. క్రమశిక్షణ గురించి ఆనాడున్న అవగాహన ప్రకారం దీనిని సెక్రటేరియటువరకే పరిమితం చేయటం జరిగింది. అయితే సెక్రటేరియటు రాష్ట్ర కమిటీకి లోబడి ఉంటుంది. మౌలికమైన పాలసీకి సంబంధించిన ఇలాంటి వ్యవహారాలు రాష్ట్ర కమిటీ దృష్టికి తెచ్చి, దాని నిర్ణయం ప్రకారం చేయవలసి ఉంటుంది. అది సరైన పద్ధతి. కాని తీవ్రమైన నిర్బంధం ఫలితంగా ఆనాటి రాష్ట్రకమిటీ పనిచేయకుండా (defunct) ఉండేది. దాని ఫలితంగా సెక్రటేరియటే రాష్ట్ర కమిటీ తరఫున అన్ని బాధ్యతలు నిర్వహించింది. అందులో ఒక భాగంగానే ఈ ముఖ్యమైన బాధ్యతను కూడా నిర్వహించి డాక్యుమెంటును పైకి పంపించింది. అయినా ఆనాడు రాష్ట్ర కమిటీ సమావేశం జరపటానికి అవకాశముండెనా? లేదా? అని ఆలోచించి చూస్తే, ప్రయత్నం చేస్తే ఏదో ఒక విధంగా సాధ్యమయ్యేదని చెప్పవచ్చును. ఆనాడు సాధ్యంకాదని భావించి దానిని వాయిదా వేయటం జరిగింది. దీనివలన కలిగిన దుష్పరిణామాలలో భాగంగా ఈ పంథాను గురించి సెక్రటేరియటు సభ్యులకు తప్ప తక్కిన వారికెవ్వరికీ తెలియలేదు. ఇలాంటి పంథా ఒకటి చర్చనీయాంశంగా ఉన్నదని గానీ, దీని కనుగుణ్యంగా తాముకూడా చర్చలకు సిద్ధపడాలనే అవగాహన కానీ క్రిందికి వెళ్ళలేదు. రెండవపార్టీ కాంగ్రెసు ఆమోదించిన థీసిసును ఎవరెంత అర్థం చేసుకుంటే ఆ మేరకు అర్థం చేసుకొని ముందుకు సాగిపోయారు.

## 4. కొన్ని పరిణామాలు

**కాంగ్రెసువారి కార్యకలాపాలు :** కాంగ్రెసువారు సరిహద్దుల్లో క్యాంపులు వేసుకొని, అప్పుడప్పుడు కస్టమ్స్ ఆఫీసులమీద కొన్నిదాడులు చేసేవారు. వీటిలో ప్రతిఘటన ఉండదు. సంఘర్షణ అనేది ఉండదు. వీరు దాడిచేయగానే వారు ఖాళీచేసి వెళ్ళిపోయేవారు. వీటిని వారు పెద్దఎత్తున ఆలిండియా రేడియోలో ప్రచారం చేసుకునేవారు. ఈ విధంగా ప్రచారం కొరకు చేసే దాడులుగా ఉండేవి. వారు పోలీసులమీద చేసిన దాడులు ఏవీలేవు. రెండవది : వారిలో కొందరు ఆయుధాలు తీసుకొని, దళాలు ఏర్పాటుచేసి, గ్రామాలమీద పడి బాగా దోచుకున్నారు. కాంగ్రెసు పేరుతో ప్రజలమీద పన్నులలాగా వేసి, దోచుకొని వేలకువేలు తీసుకునేవారు. కొన్ని వారి కేంద్రానికి ఇచ్చుకునేవారు. ఎక్కువ భాగం ఆ దళ నాయకులు తమకోసం అట్టిపెట్టుకునేవారు. ఇది ఈ కాలంలో పెద్దఎత్తున జరిగింది. కాంగ్రెసువారి ఈ కార్యకలాపాలకు అంతగా ప్రాధాన్యత లేదు. వీటిని ప్రచారం కొరకు, పార్టీ కార్యకలాపాలకు పోటీగా తాముకూడా కార్యకలాపాలు సాగిస్తున్నామని చేసే ప్రచారం కొరకు ఎక్కువ భాగం ఉపయోగించారు. మరోవైపున పార్టీ కార్యకలాపాలను పెద్దగా చిత్రించి, దళాలు గ్రామాల మీద దాడులు చేస్తున్నాయని ఒక ప్రచారం లేవదీశారు. పగలు రజాకార్లు దాడి చేసి ప్రజలను హింసిస్తున్నారని, రాత్రివేళ కమ్యూనిస్టుపార్టీ దళాలు దాడిచేసి ప్రజలను హింసిస్తున్నాయని, ఈ ఇద్దరిమధ్యా ప్రజలు నలిగిపోతున్నారనీ— ఈ రకంగా ఇద్దరినీ ఒకేగాటకట్టి పాలక వర్గాల పత్రికలు, ఆలిండియా రేడియో ద్వారా ఈ కాంగ్రెసువారు పెద్దఎత్తున ప్రచారం సాగించారు. ఇది నీచమైన అసత్య ప్రచారం. రాత్రివేళ పార్టీ దళాలు వారి కార్యకలాపాలు సాగించినమాట వాస్తవమైనా, అవి పగటివేళ కూడా రజాకార్లమీద, మిలటరీవారిమీద చేసిన దాడులు అసంఖ్యాకంగా ఉన్నాయి. రాత్రివేళల్లో గ్రామాల్లో ఉంటూ తమ కార్యకలాపాలు సాగించేవారు. ఈ దళాలవల్ల ఇబ్బందులు ఎవరికైనా ఉన్నాయంటే పెద్ద భూస్వాములకు ఉన్నాయి. పెద్ద భూస్వాములంతా బస్తీలకు వెళ్ళి క్యాంపులలో మకాం వేసేవారు. గ్రామాలలో క్యాంపులుంటే వాటిలో మకాం వేసేవారు. వారంతా ఎక్కువ క్యాంపుల వెంట, సైన్యాల వెంట, పోలీసులవెంట తిరిగినవారే. తక్కినవారు బస్తీల్లో తమతమ నివాసాలలో ఉండేవారు. కొన్నాళ్ళ

తర్వాత (యథాతథ ఒడంబడికకు కొంత ముందువెనుకగా) నిజాం నవాబు నిలదొక్కుకోవటం సాధ్యంకాదనీ, ఇక్కడ కూడా ఇవాళో, రేపో కాంగ్రెసు ప్రభుత్వం వస్తుందనీ వారు భావించినప్పుడు చాలామంది భూస్వాములు కాంగ్రెసు వైపున సానుభూతి ఉన్నట్టు ప్రకటించి, సరిహద్దు ప్రాంతాలకు కాందిశీకులుగా వచ్చేశారు.

ఆనాడు పార్టీ పాలసీ ప్రకారం కాంగ్రెసును బలపరిచేవారు. కాంగ్రెసు వారితో మనకు ఆ దశలో సంఘర్షణ లేదని, నిజాం నవాబుమీదనే ప్రధానంగా మనదాడి ఎక్కుపెట్టాలనేది ఆనాటి పార్టీ పాలసీ. దీనిప్రకారం మన పోరాట కార్యక్రమమంతా నిజాం పరిపాలనకు వ్యతిరేకంగా ఉంటుంది. కాంగ్రెసుతో ఐక్య సంఘటన కొంతకాలంగా ఉండేది. అయితే కాంగ్రెసువారు కలిసి పనిచేయటానికి ఒప్పుకోలేదు. దీనితో అది సాధ్యంకాకుండా పోయేది. అయినా వారితో సంఘర్షణ లేకుండా ఉండాలని ప్రయత్నించేవారు. అయితే వారి దళాలు పార్టీ గ్రామాలమీద, పార్టీ దళాలమీద దాడులు చేయటం, సంఘర్షణకు దిగటంతో వారిని ప్రతిఘటించవలసి వచ్చింది. ఇలాంటి సందర్భాలలో ప్రతిఘటించిన ఉదాహరణలు కూడా ఉన్నాయి. కాంగ్రెసుకు చెందిన ఒకానొక దళం ఈ రకంగా గ్రామంమీద దాడులు చేస్తుంటే, పార్టీ దళాలు వారిని చుట్టివేసి, నిరాయుధం చేయటానికి ప్రయత్నం చేశాయి. దీనితో ఆ దళం పార్టీ దళంలో చేరిపోయింది. ఈ దళ నాయకులు, దళ సభ్యులు చాలాకాలం పార్టీలోఉన్నారు. తర్వాతకూడా పార్టీలో కొనసాగారు. పార్టీ చీలిన తర్వాత ఏదో ఒక గ్రూపులో చేరిపోయి ఉన్నారు.

ఈ రకంగా దాడులు చేస్తూ కాంగ్రెసువారు కార్యకలాపాలు సాగించేవారు. సరిహద్దు క్యాంపులలో కాంగ్రెసువారందరూ భోజనాలు తదితర ఏర్పాట్లు చేసుకునేవారు. ఇతర కార్యకలాపాలేమీ లేవు. వారు నిజాం నవాబుకూ యూనియన్ ప్రభుత్వానికీ ఎప్పుడు రాజీ జరుగుతుందా, ఎప్పుడు తిరిగి వెళ్లిపోదామా అనే ఆలోచనలో ఉండేవారు. ఈ ఆలోచనలతో పొద్దుపుచ్చటానికి ఏవో కొన్ని పనులుమాత్రం చేస్తుండేవారు. ఇవీ కాంగ్రెసువారి కార్యకలాపాలు.

**హైదరాబాదు పార్టీ నాయకులు చేసిన ''ఘనకార్యం'' :** ఈకాలంలో హైదరాబాదు నగరంలోని పార్టీ నాయకులు ఒక "ఘనకార్యం" చేశారు. వీరికి కాంగ్రెసు, ప్రజలు, ప్రజల కార్యక్రమం, కాంగ్రెసు వ్యతిరేకపోరాటం, నిజాం వ్యతి

రేక పోరాటం, వీటి సందర్భాలు, వీటిమధ్య ఉండే భేదాలు అంతగా తెలియనట్టుగా వారి కార్యకలాపాలవల్ల స్పష్టమవుతున్నది. రెండవ పార్టీ కాంగ్రెసు నుంచి వారు నేర్చుకొన్నదొక్కటే : అది 'బూర్జువా వర్గ అధికారం వచ్చింది. ఆ బూర్జువా వర్గాన్ని కూలదోయాలి' అన్న విషయం. దీనితో ఇక్కడ వారి అంచనాలు ఈ రకంగా ఉండేవి : 'సంస్థాన ప్రజలకు కేంద్ర ప్రభుత్వం ఒక బరువైతే, నిజాం ప్రభుత్వం మరొక బరువు. కేంద్ర ప్రభుత్వం హైదరాబాదులోకి వచ్చి, ఇక్కడ కాంగ్రెసు ప్రభుత్వం ఏర్పడితే, ప్రజలు ఈ రెండు బరువులను మోయవలసి వస్తుంది. దీనికన్నా ఒక్కబరువు మోయటం మంచిది. కేంద్ర ప్రభుత్వం లేకుండా నిజాం ప్రభుత్వమే గనుక ఉంటే ఒకే బరువు ఉంటుంది. దానివల్ల ప్రజలకు ఎక్కువ సౌలభ్యం ఉంటుంది. ఈ దృష్టితో ఈ నిజాం ప్రభుత్వాన్ని బలపర్చాలి. నిజాం ప్రభుత్వాన్ని బలపరచటమంటే ఆనాడు ఆ ప్రభుత్వమిచ్చిన ఆజాద్ హైదరాబాద్ నినాదాన్ని, అంటే హైదరాబాదు స్వతంత్రంగా ఉండాలనే నినాదాన్ని బలపరచాలి. దీనివలన కాంగ్రెసు ప్రభుత్వ బెడద లేకుండా ఉంటుంది. నిజాం ప్రభుత్వం బలహీనమైనది కావటంతో ప్రజలకు ఎక్కువ సౌకర్యాలుంటాయ'నే వాదన (logic) తో ఈ ఆజాద్ హైదరాబాద్ నినాదాన్ని బలపరిచారు. బలపరచటమేకాక ఈమేరకు ఒక ప్రకటన కూడా ఇచ్చారు. అంతటితో ఆగకుండా సుల్తాన్‌బజారులో ఉన్న హష్మత్‌గంజ్ హాలులో ఒక బహిరంగ సభను ఏర్పాటు చేసి రాజబహదూర్ గౌర్, ఇంకా ఎవరో ఒకరిద్దరు ఉపన్యసించారు. దీనికొరకు కొంతవరకు ప్రజలను కూడా సమీకరించారు. ఈ ఆజాద్ హైదరాబాద్ నినాదాన్ని, దాని ప్రాధాన్యతను వివరిస్తూ రాజబహదూర్ గౌర్ ఒక ఉపన్యాసం ఇచ్చారు. ఆయన రహస్య జీవితంనుంచి వచ్చి, ఉపన్యాసం ఇచ్చి, తిరిగి రహస్య జీవితంలోకి వెళ్ళిపోయాడని అప్పుడు అనుకునేవారు. ఈ రకంగా చేయటంతో, నిజాం ప్రభుత్వానికి అనుకూలమైన హైదరాబాదు పత్రికలలో దీనికి పెద్దఎత్తున ప్రచారం లభించింది. ఆనాడు సంస్థానంలో కమ్యూనిస్టు పార్టీ బలమైన పార్టీ. కాంగ్రెసు బలహీనమైన పార్టీ. దీనితో హైదరాబాదులో అన్నిటికంటే బలమైన పార్టీ అయిన కమ్యూనిస్టు పార్టీ తమను బలపరుస్తున్నదని చెప్పుకోవటానికి నిజాం ప్రభుత్వం ఈ ప్రచారాన్ని ఉపయోగించుకున్నది. ఈ ప్రకటనను కమ్యూనిస్టు పార్టీకి వ్యతిరేకంగా యూనియన్ ప్రభుత్వం ఉపయోగించింది. 'ఇదిగో చూడండి, ఆజాద్

హైదరాబాద్ నినాదాన్ని కమ్యూనిస్టు పార్టీ బలపరుస్తున్నది. దేశానికి, ప్రజలకు ద్రోహం చేస్తున్నది. భారత యూనియన్ నుండి నిజాం నవాబుని ఒక్కడిని విడిగా ఉంచటానికి, యూనియన్‌ను బలహీనపరిచిదెబ్బతీయటానికి, ప్రక్కపోటు పొడవటానికి ఇదంతా చేస్తున్నది' అని పెద్దఎత్తున ప్రచారం చేశారు. ఆలిండియా రేడియోద్వారా ఈ ప్రచారాన్ని సాగించారు. 'వెనక 1942 ఆగస్టులో క్విట్ ఇండియా ఉద్యమాన్ని వీరు వ్యతిరేకించి బ్రిటిషువారికి అనుకూలంగా పనిచేశారు. ఈ రోజు నిజాం నవాబుకి అనుకూలంగా పనిచేస్తున్నార'ని పెద్దఎత్తున ప్రచారం చేశారు. ఈ విధంగా వీరుచేసిన తప్పుకు పార్టీ చాలా చెడుఫలితాలను అనుభవించవలసి వచ్చింది. ఈ సంగతి తెలియగానే, బొంబాయి లేదా కలకత్తా నుంచి పార్టీ కేంద్ర కార్యాలయం (బి.టి.రణదీవె అప్పుడు కార్యదర్శిగా ఉండేవారు) అప్పటికప్పుడు ఈ నినాదం తప్పు. పార్టీకి దీనితో సంబంధం లేదు. ఎవరైనా ఈ నినాదం ఇస్తే వారు తప్పు చేస్తున్నార'ని స్పష్టంగా ప్రకటించారు. ఈ ప్రకటనకు చాలా తక్కువ ప్రచారం ఇచ్చారు. ఈ ఆలిండియా రేడియోవారు, కాంగ్రెసువారు చేసిన ప్రచారం ఎక్కువగా సాగింది. దీనితో 'కమ్యూనిస్టుపార్టీ ఇలా చేస్తున్నదేమిటి ?' అని దేశంలో గందరగోళం బయలుదేరి, కమ్యూనిస్టుపార్టీ మీద దురభిప్రాయం కలుగటానికి ఆస్కారం ఏర్పడింది ఒకవైపున కమ్యూనిస్టులు, కమ్యూనిస్టుపార్టీ దళాలు వీరోచితంగా పోరాడి, త్యాగాలుచేసి, ఎంతో మంది అమరవీరులై విజయవంతంగా పోరాటం సాగిస్తుంటే, దానికి వెన్నుపోటుగా ఈ ప్రకటన వచ్చింది. ఈ సిటీ కమిటీ నాయకులు ఆనాడు చేసిన ప్రకటనలకూ, తీసుకున్న ఈ వైఖరినీ తర్వాత ఏనాడూ శ్రద్ధగా ఆత్మవిమర్శన చేసుకున్నట్లు కన్పించలేదు. అయితే పార్టీకేంద్రం మాత్రం ఈ నినాదాన్ని ఖండించి, పార్టీ విధానాలకూ దీనికీ ఎలాంటి సంబంధం లేదని స్పష్టంచేసింది ఈ నినాదం తప్పని రాష్ట్రకేంద్రం కూడా ఇలాంటి ప్రకటన చేసింది.

## రజాకార్ల దౌర్జన్యాలు

**షోయబుల్లాఖాన్ హత్య :** ఈ కాలంలో హైదరాబాదు నగరం రజాకార్ల కేంద్రంగా ఉండేది. నగరమంతా రజాకార్ల స్వాధీనంలో ఉన్నదని చెప్పవచ్చును. అయినా హిందువులు - ఉత్తర హిందూస్థానీలు, గుజరాతీలు, మార్వాడీలు, కాయస్థులు, వీరితోపాటు తెలుగు వారు కూడా చాలామంది నగరంలో ఉంటుండే

వారు. కొన్ని సందర్భాలలో రజాకార్లు వీరిని దోపిడి చేసేవారు. కొన్ని సందర్భాల్లో వారు ఏదో ఒక విధంగా ప్రభుత్వంతో, రజాకారు నాయకులతో రాజీ పడుతూ ఉండేవారు. ఈ సందర్భంలో షోయబుల్లాఖాన్ అనే ఒక జాతీయ వాది కాంగ్రెసును, యూనియన్ ప్రభుత్వాన్ని బలపరిచేవాడు అతడు 'ఇమ్రోజ్' అనే ఉర్దూ దినపత్రికను నడుపుతుండేవాడు. ఇలాంటి పత్రిక ఇక్కడ నుండి నడవటం ప్రభుత్వానికి, రజాకారు నాయకులకు ఇష్టంలేదు. ఆ పత్రికను నిషేధించటమేకాకుండా అతనిని ఈ రజాకారు నాయకులు చంపివేశారు. ఇది చాలా దారుణంగా జరిగిన సంఘటన. దేశమంతటా దీని ప్రచారం జరిగింది.

బీబీనగర్‌పై రజాకార్ల దాడి : ఈకాలంలో రజాకార్లదాడులలో పేరుబడ్డది ఖాసిం రజ్వీ నాయకత్వాన బీబీనగర్‌మీద చేసినదాడి. ఈదాడిలో చాలా ఘోరాలు జరిగినవి. రైల్వేస్టేషనుఉన్న పెద్ద గ్రామమిది. ఈగ్రామాన్ని లూటీచేసి, ప్రజల్ని అనేకవిధాలుగా హింసించినారు. ఈ సంఘటనపై తర్వాత విచారణ కూడా జరిగింది. అయినా వాటికి కారకుడైన ఖాసిం రజ్వీని శిక్షించక పోవటంతో ఇది ఉపయోగపడకుండాపోయింది. తర్వాతకాలంలో అరెస్టుచేసిన ఖాసిం రజ్వీని యూనియన్ ప్రభుత్వంవారు శిక్షించకుండా వదిలివేశారు.

**మరత్వాడా, కర్ణాటక జిల్లాల్లో కార్యకలాపాలు :** మరత్వాడా, కర్ణాటక జిల్లాల్లో కూడా పార్టీ నాయకత్వం ఉండేది. సరిహద్దుల్లోఉండి కొంత పనిచేశారు. కొన్ని దాడులుచేశారు. కాని భూమిపంపకం, ఇతర కార్యక్రమాలు ఏవీ చేపట్ట లేకపోయారు. చేపట్టలేదు కూడా. సాధారణంగా వారు కాంగ్రెసుతో కలిసి పనిచేస్తూ ఉండేవారు. వీరికి, కాంగ్రెసుకు భేదమేమీ లేకుండా కార్యకలాపాలు సాగించేవారు. కాంగ్రెసులో అతివాదులనబడేవారు కొందరుండేవారు. వారికి, వీరికి సన్నిహిత సంబంధాలుండేవి. ఆ సంబంధాలలో ఒక భాగంగానే వీరి కార్య కలాపాలు జరిగినవి. ఆ దృష్టితో పార్టీ నాయకత్వాన జరిగిన కార్యకలాపాలు కొన్నిఉన్నాయని విడిగా చెప్పటానికి వీల్లేకుండా సాగిపోయినవి. అయినా కొన్నిటిని మనం పేర్కొనవచ్చును. కాంగ్రెసువారు సరిహద్దుల్లో ఉంటూ కొన్ని దాడులు చేశారు. ఉమ్రి బ్యాంకు నాందేడు జిల్లాలో సరిహద్దులో ఒక తాలూకా హెడ్‌క్వార్టర్స్‌లో ఉండేది. దానిమీద దాడిచేసి చాలా ప్రారంభపు రోజుల్లోనే కొన్నిలక్షల డబ్బుని స్వాధీనంచేసుకొని ఉపయోగించారు. దేనికి ఉపయోగించారు

అన్నది తెలియదుకాని, కొంతడబ్బును మాత్రం అక్కడస్వాధీనం చేసుకున్నారు. పేరుబడ్డ దాడులలో ఒకటి ఇది[88].

## 5. 1948 సెప్టెంబరులో జరిగిన పోలీసుచర్యనాటి పరిస్థితి

**నిజాం మిలటరీ, పోలీసులు, రజాకార్లు డిఫెన్సివ్‌లో పడిపోవటం :** జూన్ నెలలో వర్షాలు ప్రారంభమవుతాయి. దాదాపు అదే సమయాన పోలీసు, మిలటరీలపై దెబ్బమీద దెబ్బ తీయటంతో దళాలు కొంత అఫెన్సివ్‌లోకి వెళ్ళటానికి అవకాశం కలిగింది. అదే సందర్భంలో, జరిగిన తప్పులను సవరించి దళాలను పునర్నిర్మాణం చేయటం, ఇతర కార్యకలాపాలను కూడా సవరించి చక్కపెట్టటం ఈ పరిస్థితికి మరి కొంత దోహద పడింది. ఈ తర్వాత కాలంలో అంటే జూన్, జూలై, ఆగస్టు నెలల్లో వర్షాలు బాగా పడటం వలన వ్యవసాయం చేయటానికి అనుకూలమైన పరిస్థితులు కూడా ఉంటూ వచ్చాయి. వర్షాకాలంలో గ్రామాల మీద దాడి చేయటానికి మిలటరీ, పోలీసులకు కూడా ఇబ్బంది కలిగింది. దళాల సంఖ్య పెరిగి అదనపు బలం చేకూరటంతో ఈ మధ్య కాలంలో పార్టీ, గ్రామరాజ్యాలు, గెరిల్లా దళాల కార్యకలాపాలు ఉధృతంగా సాగాయి. నిజాం మిలటరీ, పోలీసు, రజాకారు మూకలు డిఫెన్సివ్ (దెబ్బకాచుకునే) స్థితిలో పడిపోయాయి. అప్పుడప్పుడు మాత్రమే వారు గ్రామాలపై దాడి చేయగలిగేవారు.

**ప్రక్కజిల్లాల్లోకి విస్తరించిన కార్యకలాపాలు, నిర్మాణం :** జూన్ నాటికే దళాలు, పార్టీ కార్యకర్తలు నల్లగొండ, వరంగల్ జిల్లాలనుంచి పక్కజిల్లాలలోకి తమ కార్యకలాపాలను విస్తరించారు. రంగారెడ్డి జిల్లాలో (ఆనాడు దీనిని అతరాఫ్ బల్దా అనేవారు. తర్వాత హైదరాబాదు జిల్లా అయింది. ఇప్పుడు రంగారెడ్డి జిల్లా అని అంటున్నారు.) అంతకు పూర్వమే పని జరుగుతుండినది. నల్లగొండ జిల్లా నుండి విస్తరించి, అక్కడ నిర్మాణాన్ని మరింత పెంచారు. ఉద్యమాన్ని కొత్త గ్రామాలకు తీసుకువెళ్ళారు. ఈ విధంగా మహబూబ్‌నగర్, మెదక్, కరీంనగర్ జిల్లాల ప్రాంతాలకు ఈ ఉద్యమం విస్తరించింది. నల్లగొండ, వరంగల్లు జిల్లాలలాగా ఈ జిల్లాల్లో మూలమూలనా ఉద్యమం వ్యాపించలేదు. ఎందుకంటే ఈ జిల్లాలే స్వయంగా పెద్దవి. 1947 ఆగస్టునుండి డిసెంబరువరకు దళాలు ఏర్పడి, కొంత పురోగమించి, పోలీసు, మిలటరీ, రజాకార్ల దాడులను

తట్టుకోలేక దాదాపు అవన్నీ దెబ్బతిన్నాయి. దీనితో ఈ ప్రాంతాల్లో ఉద్యమం తాత్కాలికంగా స్తంభించిపోయింది. అక్కడి ముఖ్య నాయకత్వమంతా చనిపోవటమో లేక పట్టుబడి జైళ్ళకు పోవటమో జరిగింది. ఇందువలన స్థానిక బలంతో ఈ ఉద్యమాన్ని పునర్నిర్మాణం చేయటం సాధ్యం కాలేదు. ఇతర జిల్లాలనుండి కానీ, కేంద్రంనుండి కానీ, ఎవరో ఒకరు వెళ్ళి, అక్కడవుండి, ఉద్యమాన్ని పునర్నిర్మించటం అప్పుడు సాధ్యపడలేదు. అలాంటివారు కూడా ఎవ్వరూ లేకుండిరి. ఆ పరిస్థితుల్లో ఉన్న ఒకేఒక ప్రత్యామ్నాయం – ఈ జిల్లాలకు ఆనుకొని ఉన్న సరిహద్దు జిల్లాలనుండి దళాలువెళ్ళి ఆ జిల్లాల్లో ఉద్యమాన్ని నిర్మించటం. దీనికొరకు జిల్లా సరిహద్దులను పాటించలేదు. ఆనాటి పార్టీ కమిటీలు, దళాలు, మొత్తం నిర్మాణమంతా జిల్లా సరిహద్దులను పక్కకునెట్టి ఆ సరిహద్దు ప్రాంతాల్లో ఎంతవరకు ముందుకు చొచ్చుకు పోవటానికి వీలుంటే అంతవరకు ముందుకు వెళ్ళిపోయారు. ఈ కారణంవలననే పెద్ద సంఖ్యలో గ్రామాలు పార్టీ నాయకత్వం క్రిందికి వచ్చాయి. మూడువేల గ్రామాలను విముక్తిచేసి, వాటిలో నిజాం పరిపాలనను స్తంభింపజేసి లేకుండా చేశారంటే, ఇది దీనివలననే సాధ్యమైంది. ఈ మూడువేల గ్రామాలు నల్లగొండ, వరంగల్లు జిల్లాల్లో నేలేవు. ఈ జిల్లాలకు ఆనుకొని ఉన్న మహబూబ్‌నగర్, రంగారెడ్డి, మెదక్, కరీంనగర్ జిల్లాలలోకి వ్యాపించిన ఉద్యమమంతా కలిసినప్పుడే మూడువేల గ్రామాలకు వచ్చింది. పార్టీ దళాల బలం పెరగటం వలన నల్లగొండ, వరంగల్లు జిల్లాలలో సాయుధపోరాటం సాగిస్తూనే, వీటిని సరిహద్దులలో ఉన్న జిల్లాలకు పంపించి, అక్కడకూడా ఉద్యమాన్ని నిర్మించటం సాధ్యమయింది. ఈ కార్యక్రమమంతా జూన్ నాటికే ప్రారంభమయి కొంత అమలు జరిగింది. తర్వాత కాలంలో మరికొంత వ్యాపించటానికి అవకాశం కలిగింది. ఇది ఆనాడు మనకున్న అనుకూల పరిస్థితి.

**భూముల పంపకం, సాగు :** తొలకరి ప్రారంభం కాగానే భూములు దున్నటం కూడా ప్రారంభమవుతుంది. దీనికనుగుణ్యంగానే వర్షాలు రావటంతోనే వేసవికాలంలో పంచగా మిగిలిన భూములను కూడా పంచారు. పంచిన భూములన్నిటిని దున్ని పైర్లు వేసుకోవటానికి అవకాశం కలిగింది. అంతకుముందు సంవత్సరం కూడా వర్షాలు బాగా పడటంవలన, 1947 డిసెంబరు నాటికే పంచిన భూములను దున్ని, రెండవ పంట వేసి ఉగాది నాటికి - ఒక పంట పండించు

కున్నారు. అవకాశమున్నవారు మూడవపంట (దీనిని ఎడగారు అని అంటారు. ఏప్రిల్, మే నెలల్లో వేస్తారు. జూన్, జూలై నెలలో చేతికి వస్తుంది) కూడా వేశారు. అవి అప్పటికి పండాయి. జూన్‌లో వేసిన (ఖరీఫ్) సజ్జలు, పెసలు లాంటి మెట్టపంటలన్నీ సెప్టెంబరు నాటికి వచ్చేశాయి. నాలుగు నెలలు, ఆరు నెలలు తీసుకునే వరి, తక్కిన పంటలన్నీ సెప్టెంబరు తర్వాతనే వస్తాయి. పోలీసు చర్య తర్వాతనే ఈ పంటలు వచ్చాయి. పోలీసు చర్య నాటికి వరిపంట మాత్రం ఇంకా నిలిచే ఉంది. జొన్న, వేరుశెనగలాంటి మెట్ట పంటలూ నిలిచే ఉన్నాయి. కొన్ని పంటలు వచ్చినా అవేవీ రైతుల ఇంటికి చేరలేదు. అన్నీ పొలాలలోనే ఉన్నాయి. ఈవిధంగా ఈకాలంలో దున్ని, విత్తనాలు వేయటానికి కావలసిన అవకాశం దొరికింది. పంటలుకూడా మొలిచి పెద్దవైనాయి. ఈ నాలుగు నెలల కాలంలో భూములు పంచటానికి, భూములు దున్నటానికి చాలా అవకాశం కలిగింది. 1948 మొదటి భాగంలో వేరుశెనగపంట (దీనిని రబీపంట అనీ, మాగీ పంట అనీ అంటారు) వచ్చింది. ఇప్పుడు ఈ సంవత్సరపు మొదటి పంటకోసం సిద్ధమవుతున్నారు. ఈవిధంగా ఋతువుల దృష్టినుండి చూస్తే ఇది వ్యవసాయానికి అనుగుణ్యమైన తరుణం.

అయితే దళాలు వేసవికాలమంతా ఖాళీగా కూర్చోలేదు. ఒకవైపున దళాలు నిజాం సాయుధ బలాలతో పోరాడుతున్నాయి. పోరాడుతూనే మరోవైపున భూముల పంపకం చేశాయి. ఈ భూముల పంపకం చేసేటప్పుడు దున్నటం సాధ్యం కాకుండినది. అన్యాక్రాంతాలు ఎవరికి చెందాలనేది నిర్ణయించటం సాధ్యమయింది. బంజరు భూములను గట్లుపెట్టి ఎవరి భూమి ఎంత ఉన్నదని నిర్ణయించటం సాధ్యమయింది. కౌలు భూములు ఎవరివి వారు పంచుకుంటూనే ఉన్నారు. ఇలాంటి భూములు ఎవరికి చెందాలని నిర్ణయించటం వేసవికాలంలో జరిగింది. ఇంకా ఏమైనా మిగిలి ఉంటే వర్షాలు పడి దున్నే సమయాన నిర్ణయించారు. చిన్నచిన్న సమస్యలేమైనా వస్తే వాటిని పరిష్కారంచేశారు. ఈ దృష్టితో చూసినప్పుడు ఈ జూన్ తరువాత పంచినవాటిలో కొత్త ప్రాంతంలో అన్ని రకాల భూములు, అంటే — బంజరు భూములు, కౌలు భూములు, అన్యాక్రాంతాలు ఇవన్నీ ఉంటాయి. పాతప్రాంతాల్లో ఎక్కువగా భూస్వాముల మిగులు భూములను పంచటానికి ప్రయత్నం జరిగింది. ఒకమేరకు పంచగలిగారు. ఒకమేరకు ప్రయత్నంలోనే ఉండిపోయారు. ఈ నాలుగు నెలల కాలంలో వర్షాలు బాగాపడి, భూములను సేద్యం చేయటానికి అవకాశమున్నదని గమనించాలి.

**విధ్వంసక కార్యక్రమాలు :** వర్షాకాలం ప్రారంభం కావటంవలన భూమి తడిసి ఉంటుంది. కనుక రోడ్లకు గండిపెట్టటానికి కూడా ఎక్కువ అవకాశం కలిగింది. వేసవికాలంలో కొంత కష్టమయ్యేది. అప్పుడు ట్రక్కుల టైర్లు పంక్చరు చేయటానికి వీలుగా చీలలునాటి విధ్వంస కార్యక్రమం చేయటం సాధ్యమయింది. కానీ వర్షాలు ప్రారంభమైన తర్వాత రోడ్లను తెగకొట్టటం సులభమైంది. అదే విధంగా ఊళ్ళలోకి రాకుండా మధ్యమధ్యలో గోతులు తవ్వటం, ఇంకా ఇతర విధాల విధ్వంసక కార్యక్రమాలు చేయటం సాధ్యమయింది ఈ వర్షాకాలపు రోజుల్లోనే. ఈ దృష్టితో చూస్తే, ఈ నాలుగు నెలల్లో పోరాట ప్రాంతంలో ప్రజల కార్యకలాపాలు అత్యున్నత స్థాయికి చేరుకున్నాయి. ఒకవైపున భూమి పంపకం తీవ్రంగా ముందుకు సాగటంతో గ్రామీణ జనాభాలో కదలిక ఇంకా హెచ్చుస్థాయిలో సాగింది.

# 12. నిజాం వ్యతిరేక పోరాటం-
# విజయాలు, బలహీనతలు

## 1. పోరాట విజయాలు

ఈ కాలంలో ప్రజల జీవితం ఏ విధంగా సాగేదనే విషయాన్ని వివరించ టానికి ఇంతకుముందే కొన్ని అంశాలను ఉదహరించాము. గ్రామ రాజ్యాలు ఏవిధంగా పనిచేసేవి, దళాలు ఏవిధంగా ఉండేవి, తగాదాలు ఏవిధంగా పరిష్కారం అయ్యేవి ఇటువంటివి కొన్నింటిని చెప్పాము. దీనిని మరింత స్పష్టంగా తెలుసు కోవటం కొరకు మరికొన్నిటిని ఉదహరించవచ్చును.

**పోరాట ప్రాంతాల్లో అభివృద్ధిచెందిన కొత్త సాంఘిక జీవితం**

దౌర్జన్యపరులైన భూస్వాములు గ్రామాలు విడిచి బస్తీలకు వెళ్ళుట, గ్రామాల్లో ఉన్నవారు సంఘానికి దాసోహమనుట వలన వచ్చిన ఫలితాలు : గ్రామాల్లో భూస్వాములు ఆనాడు రెండు రకాలుగా ఉన్నారు. ఒక తరహావారు ముందే బస్తీలకు వెళ్ళిపోయారు. ఇలాంటివారు హెచ్చుగా క్రూరులు, దౌర్జన్యపరులు, కంటకులుగా ఉండటంతో ప్రజలు వీరిని వ్యతిరేకించేవారు. రెండవరకంవారు గ్రామాల్లో ఉన్నారు. తరచూ చిన్న భూస్వాములు తటస్థంగా ఉండేవారు. వీరు పార్టీతో, గ్రామ రాజ్యాలతో రాజీపడి తమ తమ సమస్యలను, తమకూ, ప్రజలకూ మధ్యనున్న సమస్యలను ఏదో ఒక మేరకు పరిష్కరించు కోవటానికి సిద్ధమైనవారు. ఈ విధంగా దుర్మార్గులు వెళ్ళిపోవటం వల్ల ప్రజలపై దౌర్జన్యం, దుర్మార్గాలు చేసేవారెవ్వరూ లేకుండా పోయారు. ఆ విధంగా వారి నుంచి తాత్కాలికంగా విముక్తి కలిగింది. సైన్యాలను, రజాకార్లను, పోలీసులను వెంట తీసుకువచ్చి దాడులుచేసిననాడే వారి బెడద. ఒకసారి వారిని తీసుకువచ్చిన తర్వాత మళ్ళీ తీసుకువచ్చేవరకు మధ్యకాలంలో వారి బెడద ఉండకపోయేది. దాడికి వచ్చిననాడు వారికి ఎంత చేతిలో పడితే అంత లూటీ చేసుకొని వెళ్ళే

వారు. అది ఆ గ్రామస్థులు ఇళ్ళలో ధాన్యం, డబ్బు, ఇతర విలువైన వస్తువులు ఎంత మిగిల్చి ఉంచారు అనేదానిమీద ఆధారపడి ఉంటుంది. ఇవికాక తక్కిన వాటిని కొన్నింటిని తీసుకువెళ్ళేవారు. ఆ మేరకు నష్టంకూడా జరుగుతూ ఉండేది. అంతేకాని, ఏరోజు అనకుండా, చీటికి మాటికి ఏదో ఒక పేరుతో డబ్బులు వసూలు చేయటం, కోళ్ళను, గొర్రెలను, ఇతర వస్తువులను వసూలు చేయటం, పాలు, పెరుగు, పాడిని లాక్కువెళ్ళటం, వారితో వెట్టిచాకిరీ చేయించుకోవటం ఇలాంటివి ఏమీ లేకుండా పోయినవి. ప్రజలకు స్వేచ్ఛా వాయువులు పీల్చుకోవటానికి అవకాశం కలిగింది. గ్రామాలలో ఉన్న భూస్వాములు రాజీకి వచ్చిన వారు కనుక, వారు ప్రజలమీద ఏవిధమైన ఒత్తిడి చేయకపోయేవారు. వెనుకటి కన్నా వారికి చేసే పనులు తగ్గిపోయినవి. చాలా వరకు వారి కుటుంబాలవారు ఎక్కడికక్కడ చేసుకునేవారు. ఖర్చులు, అవసరాలు కూడా తగ్గించుకొని జీవించేవారు. ఏవైనా పనులు ప్రజలు చేయవలసివస్తే, దానికి న్యాయమైన కూలీ రేట్లను ఏర్పాటుచేసి, ఆ ప్రకారంగా ఇప్పించారు. దాని వలన ప్రజలకు భూస్వాముల వైపునుండి ఏవిధమైన ఒత్తిడిగాని, దోపిడీగానీ లేకుండా పోయింది. ఇదొక అంశం.

భూస్వాములు వసూలుచేసే అక్రమ పన్నులు, జుర్మానాలు, ఇలాంటివి ఏవీ లేకుండా పోయినాయి. ఇంతకు ముందురోజుల్లో దీనివల్ల ప్రతిగ్రామంలో ప్రతినెల భూస్వాములకు కొంత ఆదాయం ఉండేది. గ్రామం మొత్తంమీద చూస్తే ప్రతినెలా కొన్నివేల వరకు, ప్రతిరోజూ కొన్ని వందల వరకు ఉంటుంది ఈ ఆదాయం. (ఇంతకు మించి ఉండటం ఆ రోజుల్లో సాధ్యంకాదు) అన్ని సందర్భాల్లో వేలుండవు, అన్ని సందర్భాల్లో వందలుండవు. ఇవికొన్ని సందర్భాల్లో తక్కువగా ఉంటాయి, కొన్ని సందర్భాలల్లో ఎక్కువగా ఉంటాయి. అయినా ఎంతో కొంత మొత్తం ప్రజలనుంచి భూస్వామికి ప్రతిరోజూ, ప్రతినెలా చెందుతూ ఉండేది. అదిలేకుండా పోయింది. ఈ విధంగా ఈ రూపంలో ప్రజలపై జరిగే దోపిడీ లేకుండా పోయింది. దెబ్బలు, కొట్లు, తిట్లూ, ఇటువంటివి ఏ కోశానా లేకుండా, కనిపించకుండాపోయినవి. కచ్చడాల వెంట ఒక గ్రామంనుంచి ఇంకొక గ్రామానికి వెళ్ళటం మానిపోయింది. బంధువుల ఇళ్ళకు వెట్టి మనుషులను పంపించటం, ఇలాంటి పనులు కూడా మానిపోయినవి ఈ విధంగా వెట్టి చాకిరీ పేరుతో సాగుతున్న పనులన్నీ ఆగిపోవటంతో, వెట్టి చాకిరీ చేసే వారందరూ తమ

పొలంలో ఉండి పని చేసుకోవటానికి అవకాశాలు ఏర్పడినవి. వారికి నష్టం లేకుండా పోవటమే కాక అదనంగా లాభం చేకూరింది. వారి కుటుంబ పోషణకు వారు చేసేపనే సహాయపడుతూ వచ్చింది. భూస్వాములు, ధనిక రైతులు పెట్టుకునే పాలేర్లు, రోజు కూలీలు వీరందరికీ నెలసరి జీతానికి, రోజువారీ ఇచ్చే కూలీకి రేట్లు నిర్ణయించబడినవి. ఆ ప్రకారంగా వారు ఇచ్చేవారు. వీరు వెళ్ళి పనిచేస్తుండే వారు. దీనితో గ్రామంలో నిరుద్యోగం లేకుండా పోయింది. వ్యవసాయకూలీలుగా పనిచేసే వారికి కొంత హెచ్చుగా కూలీ ఉంటూ దుర్భర జీవితం నుంచి కొంత వరకు మంచి జీవితం గడపటానికి అవకాశం కలిగింది. ఇదే విధంగా జీతగాళ్ళను దెబ్బలు కొట్టటం, తిట్టటం వంటి పనులన్నీ లేకుండా పోయినవి.

అదేవిధంగా స్త్రీలమీద జరిగే అత్యాచారాలు, పిల్లతల్లులకుండే ఇబ్బందులు, భూస్వాముల పనిమనుషులద్వారా, సేరీదార్ల ద్వారా, ఇతర విధాలా స్త్రీలపై జరిగే దుర్మార్గాలన్నీ అరికట్టబడినవి. రజాకార్ల నిర్బంధం, దోపిడీవలన నష్టాలు జరిగినప్పటికీ, స్త్రీలు తమతమ పనులు చేసుకుంటూ సుఖమయంగానే జీవించారు.

**రైతులు, కొత్తగా భూములు లభించినవారు స్వేచ్ఛగా సేద్యం చేసుకొనుట :** అప్పటికే భూమి ఉన్న రైతులకు తమ భూమిని సేద్యం చేసుకునే సందర్భంలో భూస్వాములనుండి ఎలాంటి ఇబ్బందులులేకుండా పోయినవి. వారినుండి అప్పులు తెచ్చుకోవటం, వారు ఇచ్చిన నాసిరకంవిత్తనాలను తెచ్చుకొని దానివలన నష్టపడటం, వారికి అరకలను వెట్టిగా పంపించి తమ భూములను వెనుక దున్నుకోవలసిన స్థితి ఏర్పడటం, చెరువులోనుంచి నీళ్లు పెట్టుకోవటంలో భూస్వాములకు మొదటి ప్రాధాన్యత ఇచ్చి చివరగా ఈ రైతులకు రావటంవలన కలిగే ఇబ్బందులు - ఇవేవీ లేకుండా పోయినవి. రైతులు అన్నివిధాలా స్వేచ్ఛగా, భూస్వాముల ఆధిపత్యం, పెత్తనం లేకుండా తమకు రావలసిన న్యాయమైన నీటిని, ఇతర సౌకర్యాలన్నింటినీ పొందుతూ వ్యవసాయం చేసుకో గలిగారు. పంపకంద్వారా కొత్తగా భూమి లభించినవారు తమతమ భూములను సాగుచేసుకున్నారు. ఈ విధంగా బంజరు భూములను సాగు చేసుకునేవారు, కౌలు భూములు సాగు చేసుకునేవారు కౌలు ధాన్యాన్ని చెల్లించకుండా ఉండటంవలన వారికి కొంత ఆదాయం కలిగింది. వీటిని సాగుచేసుకోవటంతోపాటు తమకు రావలసిన అన్యాక్రాంతాలను తిరిగి సంపాదించుకొని వాటిని సాగుచేసుకునేవారు. పశువులు, పనిముట్లు లేని వ్యవసాయ కూలీలు, పేదరైతులకు భూస్వాముల

పశువులను, నాగళ్ళను, ఇతర పనిముట్లను గ్రామరాజ్యాలద్వారా పంచి ఇచ్చారు. దీనివలన వీటిని కొనుక్కోవలసినఅవసరం లేకుండానే వారు తమతమ భూములను సాగుచేసుకోగలిగారు. ఆ భూములను ఇతర విధాలుగా అభివృద్ధి చేసుకున్నారు. అప్పటికీ కొందరికి అందకపోతే వారికి కొంత సహాయం చేశారు. లేక వారికి వంశ పారంపర్యంగానో, మరొక విధంగానో వస్తున్న పశువులను ఉపయోగించు కొని, వారు దున్నుకోవటం జరిగింది. వీటి ఫలితంగా ఏమేరకు పంటభూములున్నా తమకున్నంతలో వాటిని చక్కగా సాగుచేసుకొని పండించేవారు. కొద్దిగా భూమి ఉండటంవలన రాత్రింబవళ్ళూ ఆ భూమిలోనే ఉంటూ కష్టపడి పనిచేసుకొని, వాటికి ఎరువు పోసుకొని అన్నివిధాలుగా దానిని పెంపు చేసుకున్నారు. అదే విధంగా ఒక కాలంలో బీడుగా ఉండి, గడ్డిపోచ కూడా పెరగని భూములనుకూడా వారు సారవంతం చేసుకొని మొదటి సంవత్సరమే వాటిమీద కొద్దోగొప్పో పండించుకోగలిగారు. ఈ పంట వారికి అదనపు ఆదాయం. ఈ ఆదాయం వారికి తిండికి సరిపోయేది. ఆర్థిక ఇబ్బంది లేకుండా ఉండేది. ఆ రకంగా ఆదివరకటికన్నా సుఖజీవితం గడపటానికి వారికి అవకాశం కలిగింది.

**చెరువుల, కుంటల మరమ్మతు, కాలువల నిర్మాణం, కొత్త భూము లను సాగు క్రిందికి తీసుకురావటం :** కొత్త భూములను సాగు చేసుకోవ టానికి నీటి వనరులు కావలసి వచ్చింది. కొన్ని మెట్టభూములు వర్షాధారంతో పండేవైనా, కొన్నిటికి నీటి ఆధారం అవసరమైనది. ముఖ్యంగా వ్యవసాయ కూలీ, పేద రైతులకు కొద్ది కొద్దిగా (అంటే ఎకరం, రెండెకరాలు) భూమి ఇచ్చినప్పుడు అందులో చిన్న బావి తవ్వుకొని దానిని మాగాణిగానో, లేక నీటి ఆధారంపై పెట్టుకోవలసిన ఇతర పైర్లనో సాగుచేసుకోవాలని వారు కోరేవారు. ఈ విధంగా చేసుకోవటానికి గ్రామరాజ్యాలు, పార్టీ అవకాశమిచ్చాయి. గతంలో నిజాం ప్రభుత్వం చెరువులు, కుంటలు తదితర జలాధారాల లెవెల్స్ (అలుగు లేక మత్తడి లెవెల్స్) తగ్గించి, తక్కువ నీరు నిలిచేట్టుగా మరామ్మతులు చేయించింది. దీనివలన పూర్వం ఒక కారు పండటానికి సరిపోయే నీరు నిలువ ఉండే జలాధారాలలో ఒక నెలా, రెండు నెలలు, మూడు నెలలు మాత్రమే నీరు ఉంటూ వచ్చింది. ఈ విధంగా పంటలకు నీరు తక్కువయి, బావుల మీద ఆధారపడ్డారు. బావులకింద మొత్తం సాగుకాక పోవటంతో రెండెకరాలున్నవారు అర ఎకరం చేసుకోవటం, నాలుగెకరాలున్నవారు ఎకరం చేసుకోవటం మొదలు పెట్టారు. ఈ విధంగా

భూమి తగ్గించి సాగుచేసుకోవటం వలన రైతులకు కుటుంబ పోషణకు సరిపడిన ఆదాయం లేకుండా పోయినది. పోరాట కాలంలో గ్రామరాజ్యాల నాయకత్వంలో చెరువులన్నిటి లెవెల్స్ (levels) పెంచారు. ఈ జలాధారాలలో మిగులు నీరు వెళ్ళే ప్రదేశం ఉంటుంది. దాన్ని అలుగు అని, మత్తడి అనీ అంటారు. వాటి లెవెల్ పెంచేవరకు వాటిలో నీళ్లు ఎక్కువగా నిలువ కావటం మొదలయ్యింది. కట్టలు బలహీనంగా ఉండటం వలన చెరువు కట్టను కూడా పెంచి, లేక వెడల్పు చేసి, ఆ నిలువ నీరును తట్టుకునే విధంగా చేశారు. వీటన్నిటి ఫలితంగా అంతకు పూర్వం 20 ఎకరాలు సాగయ్యే కుంటకింద 30, 40 ఎకరాలు సాగయింది. 60, 70, 80 ఎకరాలు సాగయ్యే చెరువు కింద 100, 120, 150 ఎకరాల వరకు సాగయింది ఈ రకంగా హెచ్చు భూమిని నీటి క్రింద సాగులోనికి తీసుకు రావటం జరిగింది. ఇదేకాక బావుల క్రింద కూడా సాగుచేశారు. ఇదివరకున్న భూమిని సాగుచేయటమే కాకుండా, మెట్టభూములను కూడా సాగుచేశారు. ప్రతి గ్రామంలో ఎంత వరకు సాధ్యమయితే అంతవరకు క్రొత్త భూమిని మాగాణిగా మార్చి సాగుచేయటం జరిగింది. వీటన్నిటి ఫలితంగా పంట దిగుబడి పెరిగింది. రైతులకే కాకుండా గ్రామం మొత్తం మీద ఆదాయం పెరిగింది. చెరువు, కుంటల వరకే పరిమితం కాక క్రొత్త కాలువలు కూడా తీయించారు. మూసీనది నల్లగొండ జిల్లాలో ఉన్నది. దానిలో కలిసే చిన్న ఏర్లు, వాగులు అనేకం ఉన్నాయి. వరంగల్ జిల్లాలో కూడా ఇటువంటివే ఉన్నాయి. వీటికి ఎక్కడికక్కడ కొద్దిపాటి కట్టలు వేసి, నీరు మళ్ళించి, కాలువ తీసి నీరు పెట్టించారు. ఆనాటి నిజాం పరిపాలనలో ఈ విధంగా నీటిని ఆపివేయటం నిషేధం. ఇలాంటి కట్టడాలపై ఎక్కువ పెనాల్టీ వసూలు చేయటమే కాక, తరచుగా వాటిని కూలగొట్టేవారు. అటువంటి చట్టాలేవీ పనికిరావని చెప్పి, ఇలాంటి నిషేధాలను రద్దుచేసి, గ్రామ రాజ్యాల నాయకత్వంలో క్రొత్తగా నీటితో సాగుచేయటానికి ఎక్కడ ఎంత అవకాశముంటే అంత అవకాశమిచ్చారు. పన్నులన్నీ రద్దు చేసేశారు. కనుక ఇవేవీ లేకుండా సాగు చేసుకోవటానికి అవకాశమిచ్చారు. దీనితో చెరువులు, కుంటల క్రిందనే కాక, కాలువల క్రింద కూడా క్రొత్త భూములు సాగయినవి. వీటి వలన క్రొత్తగా పంచిన భూములతో పాటు అదివరకు సాగుచేసుకుంటున్న భూములకు కూడా నీటి సౌకర్యం దొరికింది. మెట్ట భూములను మాగాణి భూములుగా మార్చటానికి అవకాశాలు దొరికాయి. ఒకవైపునుంచి వర్షాలు అనుకూలించటంతో

మెట్ట పంటలు కూడా పండాయి. చెరువులు నిండి వాటికింద సాగుకు వచ్చిన కొత్త భూములలో అదనపు పంట పండినది. కాలువల క్రింద అదనపు భూమి సాగైంది. ఇదంతా గ్రామ సౌభాగ్యానికి, రైతుల సౌభాగ్యానికి ఉపయోగపడింది. అంటే భూస్వాముల భూములను పంచటమే కాకుండా, ఆ భూములు సాగులోకి వచ్చి పంట పండటానికి వీలుగా కావలసిన సౌకర్యాలు కూడా అప్పుడు కలిగించారు. ఒక వైపున రజాకార్లను, పోలీసులను, మిలటరీని ప్రతిఘటిస్తూ, మరో వైపున రైతులకు కలుగజేసిన సౌకర్యాలు ఇవి. వీటిలో రైతులూ, వ్యవసాయ కూలీలూ అందరూ పాల్గొన్నారు. ఇది చాలా ముఖ్యమైన విషయం. ఈనాటికి కూడా ప్రజలు వీటిని గురించి చెప్పుకుంటారు. లెవెల్స్ పెంచి, రైతులు అనుభవిస్తున్న నీటి సౌకర్యాలను ఈనాటికి కూడా మనం గ్రామాలలో చూడవచ్చును.

**అధికవడ్డీలను అరికట్టి, న్యాయమైన వడ్డీతో ప్రజలకు అప్పులు ఇప్పించుట :** వడ్డీ వ్యాపారాన్ని గురించి ఇంతకుముందే కొంత చెప్పాము. గ్రామాలలో వడ్డీ వ్యాపారాన్ని నిషేధిస్తూ పార్టీ నిర్ణయం తీసుకుంది. ఇదివరకు అప్పులు తెచ్చిన వారు చెల్లించవలసిన అవసరం లేదని నిర్ణయించారు. దీనివలన అప్పులు రద్దయినా, కొన్ని నష్టాలు జరిగినవి. రైతులకు, భూములు పంచుకొని కొత్తగా వ్యవసాయం చేసుకునే వారికి కావలసిన కనీస పెట్టుబడి దొరకకుండా పోయింది. అదే విధంగా జరుగుబాటుకోసం, తిండికోసం కావలసిన ఏర్పాట్లు కష్టమయ్యాయి. వారికి తిరిగి అప్పు ఇచ్చేవారు లేకుండాపోయారు. పార్టీ దగ్గరకాని, గ్రామరాజ్యాల దగ్గరకాని వారికి సాయం చేయటానికి కావలసిన డబ్బులేదు. ధాన్యమూ లేదు. పంపకం చేసిన ధాన్యాన్ని పేదలకు పంచినా అందులో కొంత ధనిక రైతులకు కూడా పోయింది. మిగిలినది అప్పటికప్పుడు తిండి వరకే సరిపోయింది. ఆ ధాన్యం ఇంట్లో నిలువ చేసుకొని వ్యవసాయానికి పెట్టుబడిగా పెట్టటానికి కాని, మళ్ళీ పంట వచ్చినదాకా వారికి జరుగుబాటుకు సరిపోయేదిగా కాని లేదు. ఈ స్థితిలో ప్రజలకు పంట వచ్చేదాకా ధాన్యాన్ని, డబ్బును ఎడతెగకుండా అందించేవారు కావలసి వచ్చింది. నిషేధించిన తర్వాత బహిరంగంగా వడ్డీ వ్యాపారం చేయటం బందైంది. కొందరు వడ్డీ వ్యాపారస్థుల దగ్గరికి చాటుగా వెళ్ళి పార్టీకి, సంఘానికి తెలియకుండా అప్పులు తేవటం ప్రారంభించారు. ఈ పరిస్థితి మంచిది కాదని తిరిగి ఆలోచించి, వడ్డీ వ్యాపారాన్ని మళ్ళీ అనుమతించటం జరిగింది. ఈ కొత్త ఏర్పాట్ల ప్రకారం ఒక నిర్ణీత వడ్డీకి

అప్పులు ఇవ్వాలి. అది బ్యాంకు రేటుకన్నా కొంచెం మించి ఉండేది. మామూలు రేటుకన్నా తక్కువగా ఉండేది. నెలకు వంద రూపాయలకు రూపాయికంటే తక్కువగానే ఉండేది. దీనితో అధిక వడ్డీలకు అవకాశం లేకుండా పోయింది. ఈ విధంగా నిర్ణయించి గ్రామాల్లో డబ్బుగల వారినుంచి, ధాన్యం గలవారినుంచి అప్పులు ఇప్పించారు. ధాన్యానికి నాగుపద్ధతి తీసివేసి వడ్డీరేటు ప్రకారం ఆ ధాన్యానికి ఎంత ధాన్యమవుతుందో లెక్కించి ఆ మేరకు అదనంగా ఇచ్చేవారు. ఈ ఏర్పాట్లతో అందరికీ ధాన్యం ఇప్పించారు. వారు తమ పంటలమీద వీరికి ధాన్యం తిరిగి ఇచ్చేవారు. దీనితో అంతా ప్రశాంతంగానే జరిగిపోయింది. వడ్డీ పేరుతో, నాగు పేరుతో జరిగే అధిక దోపిడీ తగ్గిపోయింది.

**పట్టణాలతో సంబంధాలు :** ఈ కాలంలో పట్టణాలతో కూడా సంబంధాలు ఏర్పడినవి. గ్రామాల్లో స్వయం పోషకంగా అన్ని సామాన్లూ దొరకవు. మరో వైపున రజాకార్లు, పోలీసులు దాడులు చేస్తుండటం వలన కొన్ని సామానులకైనా బస్తీలకు వెళ్ళవలసి వచ్చేది. దగ్గరలో ఉన్న బస్తీలలో దుకాణాలద్వారా గ్రామాలకు అవసరమైన సామాను చేరవేయటానికి రహస్యంగా ఏర్పాటు చేయటం జరిగింది. రజాకార్ల దాడులను కనిపెట్టుకుంటూ, వారి కంటబడకుండా ఈ ఏర్పాట్లు జరిగేవి. గ్రామరాజ్యాలు, దళాలు రాకపోకలకు కావలసిన సహాయం కూడా చేశాయి. గ్రామాల్లో ఉండే వ్యాపారస్తులు అధికంగా దోచుకోకుండా ధరలను అదుపులోపెట్టి, సరకులను ప్రజలకు ఇప్పించటం జరిగింది. దీనితో ఒకవైపున ప్రజలకు ఇబ్బంది కలుగలేదు. వ్యాపారం చేసేవారికి న్యాయమైన లాభం కలుగుతూ వచ్చింది.

**పెళ్ళిళ్ళు :** మార్చి, ఏప్రిల్, మే, జూన్—వేసవి కాలంలోని ఈ నాలుగు నెలలూ పెళ్ళిళ్ళు జరిగే సమయం. ఈ కాలంలో చాలా పెద్ద ఎత్తున పెళ్ళిళ్ళు జరిగినవి. గ్రామాల్లో రజాకార్లు దాడులు జరుపుతున్నా, వారు దాడిచేసి వెళ్ళిపోగానే మొదలై మళ్ళీ దాడి జరిగేలోగా కొన్ని పెళ్ళిళ్ళు జరిగేవి. మరో దాడి జరిగిన తర్వాత మరికొన్ని పెళ్ళిళ్ళు జరిగేవి. ఈ రకంగా పెద్ద ఎత్తున హెచ్చు సంఖ్యలో పెళ్ళిళ్ళు జరిగినవి. సర్వసాధారణంగా తెలంగాణా గ్రామాలలో పంటలు బాగా పండిన సంవత్సరం పెళ్ళిళ్ళు ఎక్కువగా జరుగుతాయి. పంటలు పండక కరువు వచ్చిన సంవత్సరం రైతులు పెళ్ళిళ్ళను వాయిదా వేసుకుంటారు. ఇది ఇక్కడ పూర్వం నుండి వస్తున్న సాంప్రదాయం. ఇప్పుడు పంటలు పండినాయి.

డిసెంబరు నుంచి మార్చి నాటికి వేసంగి వరిపంట, రబీలో ఉండే జొన్నలు, ఆముదాల లాంటి వ్యాపార పంటలు బాగా పండినవి. ఆ ఆదాయంతో పెళ్ళిళ్ళు చేశారు. పెళ్ళిళ్ళ కొరకు కొనే బట్టలు తదితర సామాను పట్టణాలనుంచి కొని తెచ్చారు. పోరాటకాలంలో గ్రామాల్లో బాగా పెళ్ళిళ్ళు జరిగిన ఫలితంగా తమకు వచ్చిన ఆదాయం తర్వాత కాలంలోగానీ, అంతకు పూర్వపు కాలంలోగానీ రాలేదని ఆనాటి వర్తకులు స్వయంగా చెప్పినారు. రైతాంగం సౌభాగ్యంగా ఉండనటానికి ఇది నిదర్శనం.

### స్థానిక గ్రామదళాల సహాయంతో గ్రామాల్లో శాంతి, భద్రతలు నెలకొల్పుట

దొంగతనాలు లేకుండా చేయుట : గ్రామ రాజ్యాలు గ్రామాలలో దొంగతనాలు లేకుండా చేసివేశాయి. వ్యవసాయ కూలీలు, పేదరైతులు అందరూ పార్టీవెనుక ఉండటంతో దొంగతనం చేయటానికి అలవాటుపడి ఉన్నవారెవరో ముందే తెలిసి ఉండేది. వారిని గట్టిగా హెచ్చరించటం జరిగింది. రైతుల ఆస్తులను, సంఘపు ఆస్తిని వేటినైనా ముట్టుకోవటం నిషేధించబడింది. దీనితో దొంగతనాలన్నీ ఆగిపోయినవి. ఈ అలవాటు ఉన్నవారు అప్పుడప్పుడు ఈ పనులు చేసిన సందర్భాలలో వారిని గ్రామరాజ్యం ముందుకు తీసుకువచ్చి, అందరిముందూ విచారణ జరిపి, కఠినశిక్ష విధించేవారు. కాల్చిచంపటంలాంటివేమీ లేనప్పటికీ, గట్టిగా మందలించి తీసుకుపోయిన వస్తువును ఇప్పించటమే కాకుండా కొంత నష్ట పరిహారమిప్పించి, ఇంకా ఇలాంటి పనులుచేస్తే ఇంతకన్నా కఠినమైన శిక్ష విధిస్తామని హెచ్చరించేవారు. ఆ భయానికి వారు దొంగతనాలు చేయటం మానివేశారు. ఎవరు దొంగతనం చేసినా ప్రజలంతా వారిని పట్టుకోవటానికి సిద్ధంగా ఉండటంతో వారు ఆ పనిని మానుకున్నారు. ప్రజలు ధాన్యాన్ని తమ పొలాల్లో, చేలల్లో పాతరపెట్టి దాచుకునేవారు. కొత్తలో, ఒకటి రెండు సందర్భాలలో, కొందరు దీనిని కనిపెట్టి, వారులేని సమయాన్ని చూసి ఈ ధాన్యాన్ని దొంగిలించారు. దీనిపై విచారణచేసి దొంగలను పట్టివేసి వారిని శిక్షించటం జరిగింది. దీనితో ఎవ్వరూ పాతిపెట్టిన ధాన్యాన్ని తీసుకోకుండా చేయగలిగారు.

ప్రజలు నిజాయితీ ప్రదర్శించారు. ఎవరైనా దారిలో ఒక వస్తువు లేక డబ్బు పోగొట్టుకుంటే, ప్రజల్లో ఎవరికి దొరికినా వారు దానిని తీసుకువచ్చి గ్రామారాజ్యానికి అప్పజెప్పేవారు. తమ చేతిలోకి తీసుకోకపోయేవారు.

పశువులు లేక ఇంకేవైనా తప్పిపోతే వాటిని తీసుకువచ్చి, గ్రామరాజ్యాలకు వప్పజెప్పి ఎవరి సొమ్ము వారికి ఇచ్చేవారు. ఈ రకంగా దొంగతనం అనేది లేకుండా పోయింది. అక్రమ సంపాదన, అవినీతి అనేది లేకుండా పోయింది.

**వ్యభిచారాన్ని నిర్మూలించుట :** వ్యభిచారాన్ని కూడా నిర్మూలించటానికి ప్రయత్నించారు. చాలా సందర్భాలలో అది జయప్రదమైంది. ఎవరైనా పరస్త్రీతో పోవటాన్ని, పరపురుషుడితో ఉండటాన్ని నిషేధించారు. దీనికి విరుద్ధంగా జరిగిన సందర్భంలో దానికి సంబంధించినవారు వచ్చి గ్రామరాజ్యం ముందు చెప్పుకుంటారు. భర్త ఇతర స్త్రీలతో ఉంటే, భార్య వచ్చి చెప్పుకుంటుంది. ఆ భర్తనూ, పరస్త్రీని పిలిపించి, మందలించి, అటువంటివి మానుకోమని చెప్తే అనేక సందర్భాలలో వారు మానుకున్నారు. కొన్ని సందర్భాలలో మానుకోకపోతే కొద్దిపాటి శిక్షలు విధించి మాన్పించారు. ఈ విధంగా ఎవరింట వారు కాపురాలు చేసుకోవటం, వ్యభిచారం లేకుండా చేయటం జరిగింది.

**స్త్రీలపై దౌర్జన్యాలను అరికట్టుట :** ప్రజల సహకారం ఉండటం వలన స్త్రీలు నిర్భయంగా వచ్చి తమ సమస్యలను గ్రామ రాజ్యానికి చెప్పుకునేవారు. వారు స్త్రీల కనుకూలంగా వీటిని పరిష్కారం చేసేవారు. పురుషుల దౌర్జన్యానికి అవకాశం లేకుండా పోయింది. భార్యను కొట్టటమనేది పూర్తిగా రద్దయింది. బూతులు తిట్టటం, ఇతర విధాలుగా స్త్రీలను హింసించటం పూర్తిగా మానివేశారు. స్త్రీలు బహిరంగ సభలలో పాల్గొనటం, ఇతర కార్యకలాపాలతో పాటు ప్రతిఘటనలో కూడా పాల్గొనటం నేర్చుకున్నారు. దీనితో స్త్రీలపై దౌర్జన్యాలు లేకుండా, స్త్రీపురుష సంబంధాలు ఉన్నత స్థాయికి వచ్చాయి. ఈ కాలంలో ఎలాంటి అవినీతికర పనులకు ఆస్కారం లేకుండా పోయింది. కల్లు, సారాయి తాగటాన్ని తగ్గించినట్లు చెప్పాము. దీనిని అమలు జరిపారు. దీనితో గ్రామంలో అల్లర్లు, తిట్టుకోవటం, తాగి తందనాలాడటం ఇవేవీ జరగకుండాపోయాయి.

**ఒక యదార్థ సంఘటన :** ఈ సందర్భంలో వాస్తవంగా జరిగిన ఒక సంఘటనను చెప్పటం అవసరం. ఒక గ్రామానికి చెందిన కష్టజీవియైన ఒక పేద యువకునికి చెరుకుపల్లి అనే దూరపు గ్రామంలో ఒక కులపెద్ద కూతురునిచ్చి పెళ్ళి చేశారు. వారి పద్ధతులవల్లనో, లేక తగాదాలవల్లనో తల్లితండ్రులు తమ కూతురిని అత్తవారింటికి, భర్తదగ్గరికి పంపించటానికి నిరాకరించారు.

అమ్మాయి తలిదండ్రులు కులపెద్దలు, సంపన్నులు కావటంతో అక్కడి (చెరుకుపల్లి) దేశముఖ్ ప్రాపకం వారికుండటంతో, వారిని ఎవ్వరూ ఏమీ చేయలేక పోయారు. వారు కులపెద్దలు కావటంతో, కుల పంచాయితీలో కూడా పరిష్కారం సాధ్యంకాలేదు. ఆ గ్రామానికి చెందిన పెద్ద దేశముఖుకు వ్యతిరేకంగా పార్టీ ఏర్పడక పూర్వంనుంచీ ఆంధ్ర మహాసభ నాయకత్వాన పోరాటం నడిచింది. పార్టీ పని ప్రారంభించిన తర్వాతకూడా ఆ పోరాటం ఉధృతంగా నడిచింది. సాయుధ దళాలు ఏర్పడి గ్రామంలో భూమి పంపకం ప్రారంభించటంతోపాటు సమస్యలను కూడా పరిష్కరించటానికి సహాయ పడుతూ వచ్చారు. అప్పుడు ఆ యువకుడు తన తల్లిదండ్రులతో పాటు వచ్చి తన గ్రామంలో ఉన్న పార్టీకి, ఆర్గనైజరుకు, దళ నాయకులకు తన దుస్థితి చెప్పుకున్నాడ.. వారు అమ్మాయిని పంపటంలేదని, ఆ అమ్మాయి రావాలనుకున్నా రాలేని స్థితిలో ఉన్నదని, తనకు సహాయం చేయమని అడిగాడు. అప్పుడు అక్కడి పార్టీ నాయకత్వం చెరుకుపల్లి ప్రాంతంలో ఉన్న నాయకత్వానికి ఈ సంఘటన వివరాలను తెలుపుతూ, అతని సమస్యను పరిష్కరించమని కోరుతూ ఉత్తరం రాసి ఇతన్ని అక్కడికి పంపించారు. వారు ఆ కులపెద్దను, తలిదండ్రులను పిలిపించి, గట్టిగా మందలించి అమ్మాయిని పంపించమని చెప్పారు. అమ్మాయిని అడిగితే వెళ్తానని ఒప్పుకున్నది. తర్వాత ఆమెను పంపించివేశారు. వారు చక్కగా కాపురం చేసుకోగలిగారు. తర్వాత కాలంలో సంతానం కూడా కలిగింది. తర్వాత కాలంలో ఆ యువకుడు ఆ గ్రామ కార్య కలాపాలలో ఏదో ఒక బాధ్యత తీసుకొని పని చేస్తుండేవాడు. దళం వచ్చినప్పుడల్లా దళానికి అందుబాటులో ఉండి కావలసిన సహాయ సహకారాలు అందించేవాడు. ఇది మచ్చుకు ఒక ఉదాహరణ మాత్రమే. ఇలాంటి సంఘటనలు అసంఖ్యాకంగా జరిగాయని చెప్పవచ్చును.

దొంగతనాలను నివారించటంలో, గ్రామరాజ్యాలు చేసిన నిర్ణయాలను అమలు జరుపటంలో, ఎవరికైనా అన్యాయం జరిగితే వారికి సహాయం చేయటంలో, గ్రామ దళాలు చక్కగా తమ బాధ్యతను నిర్వహించేవి. ముందు వలంటీరు దళాలుగా ఉన్న వీటికి క్రమంగా కొన్ని ఆయుధాలు కూడా దొరికాయి. వాటిని తమ బాధ్యతల నిర్వహణకు ఉపయోగించారు. ఆయుధాలనెప్పుడూ దుర్వినియోగం చేయలేదు. సామాన్య ప్రజలకు వ్యతిరేకంగా ఉపయోగించలేదు.

శాంతి భద్రతల పరిరక్షణ గురించి ఈ రోజుల్లో ప్రభుత్వాలు ఎంతగానో చెప్పుకుంటాయి. ఆ రోజుల్లో ఈ సమస్యను సులభంగా పరిష్కరించగలిగారు. ఒకవైపున రజాకార్లు, నిజాం మిలటరీ, పోలీసులు శాంతిభద్రతల సమస్యను సృష్టించినప్పటికీ, దానినెదుర్కొంటూనే మరోవైపున గ్రామంలో ప్రజలు ప్రశాంతంగా జీవితం గడపటానికి ఏర్పాట్లు చేశారు.

**గ్రామ పేదలకు ఇళ్ళ స్థలాలు కేటాయించి, ఇళ్ళ నిర్మాణానికి సహాయపడుట**

గ్రామ పేదలకు ఇళ్ళస్థలాలు లేక ఇరుకుగా ఉంటూ జీవించేవారు. వారికి ఇళ్ళ స్థలాలు కావలసివచ్చింది. అంతేకాక పట్టణాలకు, ఇతర ప్రాంతాలకు వెళ్ళిన వారు తిరిగి గ్రామాలకు వచ్చి, తమకు రావలసిన భూములను పంచుకున్నారు. వారికికూడ ఇళ్ళు కావలసి వచ్చింది. వీరికి ఇళ్ళస్థలాలు కావాలి. ఇళ్ళు వేసుకోవటానికి, కప్పుకు చొప్ప, గడ్డిలాంటివి కావాలి. అదేవిధంగా గుంజలు, తలుపులు ఇటువంటి వాటికి కనీసంగా అవసరమైన కలప కావాలి. గ్రామానికి ఆనుకొని ఉన్న భూముల యజమానులను అడిగి తీసుకొని ఇలాంటి వారికి గ్రామరాజ్యాలు ఇళ్ళస్థలాలు కేటాయించాయి. కొన్ని సందర్భాలలో నష్టపరిహారం ఇచ్చారు. కొన్ని సందర్భాలలో ఆ భూములకు బదులు మరోచోట భూమి ఇచ్చి మార్చుకున్నారు. ఈ రకంగా ఇళ్ళస్థలాలనిచ్చారు. చెరువుల్లో, కుంటల్లో, ప్రభుత్వ భూముల్లో ఈ చెట్టూచేమా తగినంతగా ఉండేది. నిజాంకాలంలో అదంతా ప్రభుత్వ ఆస్తి కావటంతో, అక్కడి భూస్వాములు వాటిని తమ ఆధీనంలో ఉంచుకొని తమకు కావలసినంత ఉపయోగించుకునేవారు. తక్కినవాటిని అట్టిపెట్టి ఉంచేవారు. ఈ కాలంలో పెద్దఎత్తున ఈ చెట్లను నరికివేసి, వచ్చిన కలపనంతా ఇళ్ళకు ఉపయోగించారు. అదేవిధంగా పంటలో వచ్చిన గడ్డిని, చొప్పను ఇళ్ళపైకి ఉపయోగించారు. చెరువుల్లో, వాగుల్లో, ఏట్లో ఉండే తుంగను తెచ్చి, ఇళ్ళపైకి కప్పు వేసుకున్నారు తలుపులను కొనుక్కున్నారు. లేదా ఉన్నదానిలో చాటుచేసుకున్నారు. తడికలతో కూడా చాటు చేసుకున్నారు. ఈ రకంగా కొత్త ఇళ్లు ఏర్పడినవి. పాత ఇళ్ళను బాగుచేసుకున్నారు. వారికి కలప, పై కప్పుకు వాడేవి ఉచితంగా దొరికాయి. అడవి దాపులో ఉండేవారికి ఈ సమస్య రానేలేదు. అక్కడ కలప పుష్కలంగా ఉంటుంది. దానిని తెచ్చుకొని వారు ఉపయోగించుకున్నారు. మైదాన ప్రాంతాలలో ఇదొక సమస్యగా ఉండేది. ఆ మేరకు

పై చర్యలు ప్రజలకు ఉపయోగపడినవి. భూస్వాముల బీళ్ళల్లో చెట్టూచేమా బాగానే ఉంటుంది. బీళ్ళను పంచినప్పుడు రైతులకు ఆ చెట్టూచేమా కూడా వచ్చింది దానినికూడా ప్రజలు బాగా ఉపయోగించుకున్నారు. ఈ విధంగా వారికి ఇంటికీ, పై కప్పుకూ ఇబ్బంది లేకుండా పోయింది. అంతకుపూర్వం వంట చెరకు దొరకటం గ్రామీణ పేదలకు పెద్ద ఇబ్బందిగా ఉండేది. ఎనుగు కంచెను, బీళ్ళలో ఉండే చిన్నచిన్న పుల్లలను ఏరుకువచ్చి పొయ్యిలకు వంటచెరకుగా ఉపయోగించుకోవలసివచ్చేది. దానివల్ల స్త్రీలు ఎంతో ఇబ్బందిపడేవారు. ఇప్పుడు గ్రామాల్లో సమిష్టి భూములలో, లేక పంచిన భూముల్లో చెట్టూచేమా దొరకటంవల్ల వంటచెరకు సమస్య లేకుండా చక్కగా ఉపయోగించుకోగలిగారు. ఆ కాలంలో ఊళ్ళలో చెట్లు చాలా హెచ్చు సంఖ్యలో ఉండేవి. తర్వాతి కాలంలో ఆ చెట్లన్నీ పోయి, నరికివేసినట్టు కన్పిస్తుండేది. ఒకవైపునుండి చూస్తే ఇంత చెట్టూచేమా లేకుండాపోవటం మనకు అసాధారణంగా కన్పిస్తుంది. మరోవైపున ప్రజల అవసరాలనుబట్టి వాటిని కొట్టి ఉపయోగించవలసివచ్చింది. ఆ రకంగా ఉపయో గించారు. ఇందులో పొరపాటేమీ లేదు. కానీ వాటి స్థానంలో కొత్తచెట్లనుపెట్టి, పెంచి ఎప్పుడూ గ్రామాల్లో చెట్లూచేమలు ఉండేవిధంగా ఏర్పాట్లు చేయవలసి ఉండినది. ఇలాంటి కార్యక్రమాన్ని అమలుజరపటంకొరకు గ్రామరాజ్యాలకు తగిన వ్యవధి దొరకలేదు. అందువలన కొట్టివేతవరకే జరిగింది కానీ మళ్ళీ చెట్లను పెంచటానికి అవకాశం లేకుండాపోయింది. అయినా మొత్తంగా చూసినప్పుడు అది సామాన్య ప్రజలకు ఉపయోగపడింది.

## సాంస్కృతిక రంగంలో మార్పులు

పోరాటం మధ్యన ఉన్నతస్థాయినందుకున్న సాంస్కృతిక కార్యకలాపాలు : కమ్యూనిస్టుపార్టీ, ఆంధ్ర మహాసభ, గ్రామరాజ్యాలు, దళాలు ఇవన్నీ సాంస్కృతిక రంగంలో చాలా మార్పులను తీసుకువచ్చాయి. సామాన్యంగా స్త్రీలు, పురుషులు ఏ పండుగ సమయంలోనో తప్ప సమిష్టిగా ఒక చోట చేరి, పాటలు, ఆటలతో కాలం గడపటం ఆరోజులలో అరుదుగా జరుగు తుండేది. బతకమ్మ పండుగ ఆశ్వయుజ మాసంలో దసరాకు పూర్వం తొమ్మిది రోజులు నడుస్తుంది. స్త్రీలందరు ఒకచోట కూడటానికి అవకాశముండే పండుగ ఇది. దీనితోపాటు దేవుళ్ళ పండుగలుంటాయి. దేవాలయాలుండే కళ్యాణోత్సవా

లుంటాయి. ఆ సందర్భంలో స్త్రీలు, పురుషులు వేరువేరుగా ఒకచోట చేరుతారు. ఆదేవిధంగా కులదేవతల పండుగలుంటాయి. వీటి సందర్భంలో కూడా అందరూ కలిసివెళ్ళి పండుగ చేసుకుంటారు. తరచుగా ఈ పండుగలు శ్రావణ మాసంలో జరుగుతుంటాయి. ఇతర సందర్భాలలో కూడా జరుగుతాయి. ప్రధానంగా పెళ్ళిళ్ళు, పండుగల సందర్భంగా అంతా ఒకచోట కలవటానికి అవకాశాలు ఉండేవి. ఇప్పుడు పార్టీ కార్య కలాపాలు సాగినప్పుడు కలిసి ఉండే అవకాశం కలిగింది. ప్రతిరోజూ పనులు చేసుకొని ఇంటికి వచ్చిన తర్వాత స్త్రీలంతా వంటలు చేసుకొని, రాత్రిపూట 7-8 గంటల నుండి 9-10 గంటల వరకు ఆట పాటల్లో కాలం గడపటానికి కావలసిన ఏర్పాట్లు చేశారు. సంఘం వైపునుంచి మన కార్యకర్తలు రాసిన పాటలు వారికి నేర్పి, వారితో పాడించేవారు. కోలాటం, అడుగులు, వారికి తెలిసిన ఇతర జానపద నృత్యాలన్నీ వేసేవారు వారికి తెలిసిన బాణీల్లో, వారి వారి భాషల్లో, రోజూ పాడుకునే పాటలను సంఘానికి అనుకూల మైన, భూస్వామ్య వ్యతిరేకపోరాటానికి, విప్లవ పోరాటానికి అనుకూలమైన పాటలుగా కార్యకర్తలు మార్చిరాశారు. వాటిని పాడేవారు. అన్ని సందర్భాలలో వాటిని పాడుతూ సమయాన్ని పూర్తిగా ఉపయోగించుకునేవారు. అవకాశమున్నది కనుక, మామూలు పాటలు కూడా పాడేవారు. ఈ విధంగా ప్రతిరోజూ ఈ కార్య కలాపాలు సాగేవి. రజాకార్లు వచ్చి, దాడులు చేసిన రోజుల్లో అవి సాధ్యం కాకపోయేవి. వారు లూటీలు, విధ్వంసం చేసిన తర్వాత సవరించుకోవటమే వారికి సరిపోయేది. ఒకటి రెండు రోజుల తర్వాత తిరిగి తమ ఆటపాటల కార్యక్రమాన్ని ప్రారంభించేవారు. ఆదేవిధంగా పురుషుల్లో యువకులు కూడా కోలాటం లాంటివి వేసేవారు. వారు వేరే జట్లుగా ఉండి వేరుగా పాటలు పాడుకునేవారు. యువకు లంతా గ్రామ దళాల్లో ఉండటం, గెరిల్లాదళాల్లో చేరటం వలన వాళ్ళకు ఎక్కువ అవకాశం ఉండకపోయేది గ్రామాన్ని కాపాడుకోవటం, దానికి సంబంధించిన ఏర్పాట్లను చూడటంపై వారు ఎక్కువ కేంద్రీకరించే వారు. అయినా వారు ఎక్కువ సంఖ్యలో ఉన్నప్పుడు, కొందరు గ్రామ రక్షణ పనిలో ఉంటూగానీ, లేక బ్యాచీలుగా సాంస్కృతిక కార్యక్రమాలలో పాల్గొనటానికి గానీ కావలసిన ఏర్పాట్లుండేవి. ఇవి ప్రజల్లో నిరాశా నిస్పృహలు లేకుండా చేయటానికి ఉపయోగ పడినవి. అంతేకాక ఇంతటి పోరాటాల మధ్యన కూడా వారు తమ సాంస్కృతిక కార్యకలాపాలు సాగించటానికి, వాటిని అంతకు ముందున్న స్థాయినుంచి పై స్థాయికి తీసుకువెళ్ళటానికి ఇది ఉపయోగ పడ్డాయి.

కొన్ని సంఘ సంస్కరణలు : కొన్ని సంఘ సంస్కరణలు కూడా అప్పుడు ప్రవేశపెట్టారు. విడాకుల పద్ధతిని ప్రవేశపెట్టారు. స్త్రీలందరికీ పూర్వపు పద్ధతి చాలా ఇబ్బందిగా ఉండేది. కుల సంఘాల తీర్పుల ప్రకారం తగాదాలు పరిష్కారం చేసుకోవటం, జరిమానాలు చెల్లించి చెల్లు చీటీలు పెట్టుకోవటం, పెళ్ళి ఖర్చులిప్పించటం ఇటువంటివన్నీ జరిగేవి. ఇలాంటి సమస్యలను గ్రామ సంఘాల ముందు పెట్టి తిరిగి ఇద్దరూ కలిసి ఉండటానికి వీలుగా చేయవలసిన ప్రయత్నాలన్నీ చేసేవారు. అయినా స్త్రీ పురుషులు కలిసుండటం సాధ్యంకాని స్థితిలో చివరి చర్యగా వారికి విడాకులు ఇప్పించేవారు. అటువంటిని చాలా అరుదుగా జరిగినవి. వారు మళ్ళీ కలిసి జీవించటానికి చేసిన కృషి ఎక్కువగా జరిగింది. అలాంటి వారు తిరిగి సుఖంగా దాంపత్య జీవితం గడిపిన ఉదాహరణలు ఎన్నో ఉన్నాయి.

కొన్ని కులాలలో స్త్రీలలో ఘోషా పద్ధతి ఉండేది. ఈ ఘోషా పద్ధతి తీసేసి, అందరూ పొలం పనులు చేసుకోవటానికి వీలుగా ఏర్పాటు చేయటం జరిగింది. అయితే ఘోషా పద్ధతిని అంత పెద్దఎత్తున నిర్మూలించ లేకపోయారు. కొంత మేరకు మాత్రం జరిగింది. ఆ మేరకు వారు బయటకి వచ్చి పని చేసుకోవటం జరిగింది.

ఆ రోజుల్లో యువకులకు పెద్దవారికి కూడా చొక్కాలు తొడుక్కునే అలవాటు లేదు. కొద్దో గొప్పో చొక్కాలు కొనుక్కొని తొడుక్కో గలిగినవారు కూడా ఒక సాంప్రదాయంగా తొడుక్కోకుండా ఉండేవారు. అదే విధంగా మోకాలు పైకి గుడ్డలు కట్టేవారు. నెత్తికి ఎప్పుడూ రుమాలుంటుండేది. నెత్తి గొరిగించుకోవటం (బోడినెత్తి) మామూలే. ఈ పద్ధతులను మార్చివేసి చొక్కాలు ప్రవేశపెట్టారు. చొక్కాలు తొడుక్కోమని అందరినీ ప్రోత్సహించారు. ముందు యువకులు తొడుక్కున్నారు. తరువాత పెద్దవారు కూడా తొడుక్కున్నారు. నెత్తికి గుడ్డలు చుట్టడాన్ని తగ్గించి వేశారు. పెద్దవారు, సాంప్రదాయం నుండి బయట పడలేని కొందరు నెత్తికి గుడ్డ చుట్టుకునేవారేకాని, తక్కినవారు, ముఖ్యంగా యువకులు, అంతా క్రాపులు పెట్టుకొని అందంగా ఉండటానికి ప్రయత్నం చేసేవారు. వారు చూడటానికి చక్కగా ఉండేవారు. దీనితో ఆ క్రాపులు చేసే నాయీబ్రాహ్మల అవసరం ఎక్కువయింది. వారికి పని దొరికింది.

వాళ్ళందరి ఆదాయం పెరిగింది. అదే విధంగా వారు నూనె పెట్టుకొని దువ్వు కోవటం, ఇవన్నీ నేర్చుకోవటంతో ఇటు వ్యాపారం కూడా ఆ మేరకు పెరిగింది.

దీనితోపాటు బట్టలను శుభ్రంగా, తెల్లగా ఉతుక్కొని తొడుక్కోవటం కూడా అలవాటు చేశారు. బట్టలు ఉతుక్కొని శుభ్రంగా ఉండటమనేది దళాల్లో తప్పనిసరి విధిగా ఉండేది. గ్రామాల్లో యువకులు, ప్రజలు కూడా అదేవిధంగా తొడుక్కునేవారు. ఈరకంగా వాళ్ళ సంస్కృతి (culture)లో కూడా కొంత మార్పు తీసుకువచ్చారు.

కొన్ని తెగల్లో స్త్రీలు రవికెలు తొడుక్కోకపోయేవారు. అవి లేకుండానే ఉండేవారు. ఆ పద్ధతులు మార్చి వారు కూడా తక్కిన స్త్రీలలాగానే ఉండటానికి ప్రోత్సహించటం జరిగింది. వాటిలో చాలా మార్పులు కూడా వచ్చాయి. ఈ మార్పులు తర్వాత కాలంలో ఉపయోగపడ్డాయి.

అదేవిధంగా లంబాడీ కుటుంబాల సాంప్రదాయంలో ఒకసారి పెళ్ళి అయిన తర్వాత ఆడపిల్లలు పుట్టింటికి వెళ్ళటమనేదిలేదు. ఎప్పుడో ఏదో సంతలో ఈ పుట్టింటివారు, ఆమె కలుసుకొని, చాలాకాలం నుంచి కలవలేదని, మళ్ళీ కలిసే అవకాశం లేదని సాంప్రదాయంగా ఏడుస్తూ, బాధతో విడిపోయేవారు. పోరాట కాలంలో పార్టీ ఈ సాంప్రదాయాన్ని మార్చింది. పుట్టింటికి వెళ్ళ వచ్చని, దానిలో తప్పేమీలేదనీ చెప్పి, వారిని ప్రోత్సహించి పంపించారు. దీనితో ఆ కాలంలోనూ, తర్వాత కాలంలోనూ స్వేచ్ఛగా వెళుతున్నారు. ఇప్పటికీ కొన్ని కుటుంబాల్లో వెళ్ళకపోయినా, పుట్టింటికి వెళ్ళటం తప్పుకాదనే అభిప్రాయం వారిలో వచ్చేసింది. ఈ మార్పు కూడా బాగా పెద్దఎత్తున జరిగింది.

పుట్టింటికి వెళ్ళకపోవటమనే సాంప్రదాయం బానిస సమాజపు లక్షణం. దాని ప్రకారం అమ్మాయిని అబ్బాయి ఇంటివాళ్ళకు అమ్ముకుంటారు. అబ్బాయి అమ్మాయికి 5 ఆవులు, ఇటువంటివేవో కొన్ని వస్తువులు ఇచ్చి కొనితెచ్చు కుంటాడు. అమ్మాయిని తెచ్చుకున్న తర్వాత ఆమె అబ్బాయి ఇంటివారి సొత్తవు తుంది కనుక, ఆమె తన పుట్టింటికి వెళ్ళటానికి వీలులేదు. ఈ సాంప్రదాయాన్ని తొలగించివేసి సమానత్వాన్ని కొంతవరకు పునరుద్ధరించగలిగారు. బానిస సమా జపు సాంప్రదాయాలను, కట్టుబాట్లను రద్దుచేశారనటానికి దీనినొక ఉదాహరణగా చూడవచ్చును. ఇటువంటివి ఇతరత్రాకూడా చాలా పెద్దఎత్తున జరిగాయి.

అదే విధంగా వారు పాతకాలపు దుస్తులను వదిలేసి, మంచి దుస్తులను

కట్టుకోవచ్చునని కూడా వారికి చెప్పారు. కానీ మార్చటానికి తగిన వ్యవధి లేక పోయింది. ఒకసారి వారు కట్టుకున్న దుస్తులు కొన్ని సంవత్సరాలపాటు ఉంటాయి కనుక, వాటిని మానివేసి కొత్తవాటిని తెచ్చుకొని, వాటిని ఉపయోగించడం అప్పటికప్పుడు సాధ్యంకాలేదు. ఈ కొద్ది కాలంలో వారు వెనుకటి దుస్తులనే ఉపయోగించారు కానీ దళాల్లోకి వచ్చినవారు మాత్రం పూర్తిగా మారి, మామూలు దుస్తుల్లో ఉండి, తక్కిన స్త్రీలతో సమానంగా పనిచేశారు.

ఆ కాలంలో తెలంగాణాలో వరకట్నమనేది పెద్దసమస్యగా లేకుండినది. సాధారణ ప్రజల్లో బొత్తిగా లేకుండినది. పెళ్ళిళ్ళు మామూలు సాంప్రదాయం ప్రకారంగా జరిగేవి. అందువలన వరకట్నానికి సంబంధించిన సంస్కరణ ఆ రోజుల్లో అవసరం లేకపోయింది. అది ధనిక కుటుంబాలవారికి, పై కులాలవారికి సంబంధించిన సమస్యగానే ఉండేది. సంస్కరించాల్సిన ప్రధాన సమస్యగా ముందుకురాలేదు.

ఈ మార్పులు ప్రవేశపెట్టటంలో ఎన్ని లోపాలున్నా, పోరాటం ప్రారంభ మయిన తర్వాత ప్రజల జీవితంలో వచ్చినమార్పు చాలా మౌలికమైనది. రజాకార్లు, నిజాం పోలీసు, మిలటరీవారు గ్రామాల్లో ఎంత అరాచకాన్ని, ఎంత భీభత్సాన్ని సృష్టించినా, గ్రామాలకు గ్రామాలను తగులబెట్టినా, ఆ మేరకే ప్రజల జీవితంలో ఇబ్బంది కలిగింది. కాని ఈ పోరాటంలో భూస్వామ్య విధానాన్ని రద్దు చేయటం ద్వారా వచ్చిన ప్రశాంత జీవితమే చాలా హెచ్చుగా ఉన్నది. దీనితో వారు ఆర్థికంగా సౌష్టవంగా అభివృద్ధికావటమేకాక, సాంస్కృతిక జీవితంలోనూ, సాంఘికంగానూ, ఇతర విధాలుగానూ వారు అభివృద్ధి అయ్యి, తమ భవిష్యత్తును తామే నిర్ణయించుకునేవారుగా తయారయ్యారు. ఇది కొన్నివేల సంవత్సరాలలో కూడా సాధించని విజయం. ఈ విజయాన్ని తగ్గించి, లేనట్టుగా చెప్పి, ఆ పోరాట ప్రాధాన్యతను తగ్గించటానికి ప్రయత్నం చేశారు, చేస్తున్నారు.

### పది లక్షల ఎకరాల భూమి పంపకం

ఈ విజయాల్లో అన్నిటికన్నా గొప్పది, భూస్వామ్య వ్యవస్థనే కిందుమీదు చేసిన విజయం భూమి పంపకం. దీన్ని అన్ని సందర్భాల్లోనూ చెప్తున్నాము. ఇక్కడకూడా దీన్ని గురించి క్లుప్తంగా చెప్పి, దాని సాధక బాధకాలను వివరిస్తాము.

సుమారు 10 లక్షల ఎకరాల భూమి పంపకం జరిగిందని చెప్పినప్పుడు తు. చ. తప్పకుండా 10 లక్షల ఎకరాలని కాదు. అంతకన్నా తక్కువ జరిగి ఉంటుంది. లేక అంతకన్నా ఎక్కువ జరిగి ఉంటుంది. అది గ్రామాలలో పంచిన భూములను సుమారుగా లెక్కవేసి తీసిన సంఖ్య. ఇదేకాక పంపకం చేసిన మరికొంత భూమి లెక్కకు రావచ్చును. లేదా పొరపాటువల్లనో, సరైన అవగాహన లేకపోవటంవల్లనో, స్థానిక కార్యకర్తలు పంపకం చేసిన భూమి గురించి సరియైన లెక్కలు చెప్పక హెచ్చించి చెప్పవచ్చును. కానీ లెక్కకు రాని భూమే చాలా మిగిలిపోయింది. ఇది తర్వాత చేసిన పరిశీలనలో తేలిన విషయం. ఈ విధంగా లెక్కకురాని భూమిని కలుపుకుంటే 10 లక్షల ఎకరాలకు ఎక్కువగానే ఉండాలి. లేదా ఇంకా ఏవైనా పొరపాట్లు ఉంటే లెక్కకు రాని భూమితో కలుపుకొని 10 లక్షల ఎకరాలు తేలికగా ఉంటుందని చెప్ప వచ్చును.

దీనిలో కౌలుభూములున్నాయి. ఆనాడు కౌలుభూములది పెద్ద సమస్యగా ఉండేది. ఈ నాడు కూడా ఆ సమస్య ఉంది. ఆ నాడున్న తీవ్రత ఈనాడుకూడా ఉన్నప్పటికీ, అది బయట పడుతున్నదా లేదా అనే విషయాన్ని విచారించవలసి ఉంది. ఆనాడు మాత్రం భూస్వామి ఉన్న ప్రతిచోటా కౌలుదారుకూడా ఉండే వాడు. ఈ విధంగా కౌళ్ళని రద్దుచేసి కౌలుదారులకే ఈ భూములు ఇచ్చారు. భూస్వాములు పట్టణాలకు వెళ్ళిపోవటం, గ్రామాల్లో ఉన్న భూస్వాములు రాజీపడి ఒక పరిష్కారానికి రావటంతో కౌలుభూములన్నీ కౌలుదార్లకే దక్కినవి. కౌలుశిస్తు చెల్లించవలసిన అవసరం లేకుండా, ధాన్యం చెల్లించవలసిన అవసరం లేకుండా వారు వీటిని అనుభవించారు. ఇందులో కొన్ని సమస్యలు వచ్చాయి. కొందరు భూస్వాములకు కొద్దిపాటి భూమి మాత్రమే ఉండేది. అది వారి జీవనోపాధికి కూడా సరిపోకపోయేది. వీరు పేరుకి మాత్రమే భూస్వాములుగా ఉండేవారు. ఇలాంటి భూమినుండి ఏమైనా ఆదాయం వస్తేనే వారు జీవించగలుగుతారు. మరో విధంగా జీవించటం సాధ్యంకాదు. అటువంటి భూములు కౌలుదార్ల చేతిలో ఉన్నప్పుడు, వాటికి ఏమీ ఇవ్వకుండా తక్కినవాటిలాగా తీసుకోవాలా లేదా అనేది ఒక సమస్య. ఉద్యోగాలు చేసుకుంటూ ఎకరమో, అరఎకరమో గ్రామాల్లో కౌలుకిచ్చుకున్న వారి భూమి సమస్య ఏమిటి? అదేవిధంగా కొన్ని కుటుంబాలలో పురుషులు చనిపోయి, స్త్రీలు మాత్రమే ఉంటారు. వారు అనాధలుగా ఉంటారు.

లేక చిన్నపిల్లలుండి సాగు చేసుకోలేని స్థితిలో ఉంటారు. అలాంటివారి పరిస్థితి ఏమిటి? ఇలాంటి సమస్యలు వచ్చినప్పుడు వారికి కొన్ని మినహాయింపులు ఇవ్వటం జరిగింది. ఐక్య సంఘటనా విధానం దీనికి ప్రధాన కారణం. పోరాటానికి పట్టణాల్లోని ఉద్యోగస్తులు, మధ్యతరగతి వారినుండి సహాయ సానుభూతులు ఉంటున్నాయి. ఒక్కొక్కరు విడిగా సహాయం చేస్తున్నారా లేదా అని లెక్కించక ఈ వర్గాన్ని సహాయం చేసే వర్గంగా పరిగణించి, వారిని గైరుహాజరు భూస్వాములుగా (Absentee Landlords గా) పరిగణించకుండా ఆ భూములను తీసుకోకుండా వారికే ఉంచివేశారు. ఈ భూములకు నిర్ణయించిన కౌలు ఇవ్వాలనే ఏర్పాటు జరిగింది. కొన్ని సందర్భాలలో పరస్పర అంగీకారంతో కౌలు నిర్ణయించుకున్నారు. ఇలాంటి భూముల విషయంలో జోక్యం కలిగించుకో లేదు. అదేవిధంగా భర్తలు లేకుండా స్త్రీలు, పిల్లలుండటంవలన సాగుచేసుకో లేకపోతే అలాంటి కౌలుభూములను తీసుకోలేదు. అవివారికే చెందేవిధంగా ఏర్పాటు చేశారు. ఇలాంటి భూముల విషయంలో కొన్ని రాయితీలిచ్చి, భూస్వాములకు చెందిన తక్కిన కౌలుభూములన్నింటిని మళ్ళీ బేదఖలు కాకుండా చేసి, కౌలుదార్లకు ఇవ్వటం జరిగింది. ఆ సందర్భంలో భూస్వాములు స్వంతంగా సాగుచేసుకోవటం కొరకు కొన్ని మినహాయింపులు ఇచ్చారు. వారికి అప్పటికే సాగుచేసుకుంటున్న భూములుంటే అంతవరకు ఇచ్చారు. లేకుంటే తగిన ఏర్పాట్లు చేశారు. ఇదొక తీరని సమస్యగా ఉండేది. పరిష్కారం చేయటానికి చాలా వరకు ప్రయత్నం జరిగింది.

అన్యాక్రాంత భూముల సమస్య చాలా చిక్కుగా ఉండేది. దీనిగురించి ఇది వరకే వివరించాము. ఇప్పుడుకూడా వాటిని అదేవిధంగా పరిష్కారం చేశారు. ఇదేవిధంగా బంజరుభూములు, జాగీరు భూములు, మిగులుభూములను పంచినారు. పెద్దఎత్తున ఈ భూములను పంచటం ఒక ఎత్తు. వాటిని సాగుచేయటానికి ఏర్పాట్లుచేయటం ఒకఎత్తు.

చాలా సందర్భాలలో భూస్వాముల మిగులుభూములను పంచుకోవటానికి ఆలస్యంగా ముందుకొచ్చారు. తర్వాత నిలబెట్టుకోటానికికూడా వారు ఎక్కువ ప్రయత్నం చేయలేదు. ఈ విధంగా ఆ భూములమీద ఊగిసలాట ఉండేది. అయినా కొన్ని ప్రాంతాలలో ఆ మేరకు పంపకం చేయటం జరిగింది. ముఖ్యంగా వ్యవసాయకూలీలు వీటిని పంచుకున్నారు.

ఈ రకంగా అందరికీ భూమి పంపకం చేయటంతో గ్రామంలో చాలామందికి సాగుచేసుకోవటానికి భూమి దొరికింది. సాగుచేసుకోగలిగారు. గ్రామాల్లో నిరుద్యోగం లేకుండాపోయింది. అప్పటికీ భూమిలేని వారుంటే వారికి వారివృత్తి ఉండేది. గ్రామంలో అందరికీ పంటలు పండేవి. ఆదాయం ఉండేది. కనుక బట్టలు నేసేవారికి బట్టలకు గిరాకీ ఉండేది. కుండలపని చేసుకొనేవారికి కుండలకు డిమాండుండేది. ఇదే విధంగా చేతిపనిచేసుకునే వారందరికీ డిమాండు ఉండటంతో అందరికీ సరిపోయేపని ఉండి, సరిపోయే ఆదాయం కూడా దొరికింది. ఇది ఆ కాలంలో వచ్చిన మరొక పరిణామం.

## భూస్వాముల ధాన్యం, పనిముట్లు, పశువులపంపకం

గ్రామాల్లో భూస్వాముల ధాన్యాన్ని పెద్దఎత్తున పంపకం చేశారని చెప్పాము. ఆ ధాన్యాన్ని ప్రధానంగా పేద ప్రజలకు పంచారు. తాత్కాలికంగా వారి రోజువారీ ఆదాయానికిది తోడయింది (supplement). దొరికినదానినిబట్టి 10 రోజులు, 15 రోజులు, నెలరోజులు ఈ రకంగా వారు ఆ ధాన్యాన్ని అనుభవించగలిగారు. అయితే ఆ ధాన్యం పెట్టుబడిగా ఉపయోగపడే స్థితిలేకుండా ఉండేది. కానీ, భూస్వాముల ధాన్యాన్ని పంచుకోవటం, తాము పండించిన ధాన్యాన్ని, లేదా తాము అప్పుక్రింద చెల్లించిన ధాన్యాన్ని తాము తిరిగి తీసుకుంటున్నామనే చైతన్యం రావటం అన్నిటికన్నా ముఖ్యమైనది. వ్యవసాయానికి కావలసిన పెట్టుబడులకు ప్రధానంగా అప్పులమీద ఆధారపడవలసి వచ్చేది. ఈ అప్పులను పార్టీ గ్రామాల్లో మొదలు నిషేధించినప్పటికీ, తర్వాత నిషేధాన్ని రద్దుచేసి మళ్ళీ ఏర్పాటు చేసింది. భూస్వాముల దగ్గర హెచ్చుగా ధాన్యం ఉండి అది పెట్టుబడికి ఉపయోగించుకోవటానికి అవకాశమున్నప్పుడు దాని కనుగుణ్యంగానే ఉపయోగపడింది. ఆ మేరకు రుణాలకు వెళ్ళటం తగ్గింది. కానీ ఆ మోతాదులో ధాన్యం దొరకటం అన్ని సందర్భాలలో సాధ్యంకాలేదు. ఇదే విధంగా పెద్ద భూస్వాముల దగ్గర ఉండే నాగళ్ళు, ఇతర వ్యవసాయపనిముట్లు, దున్నటానికి పశువులు, ఇలాంటి వాటిని తేలికగా పంచివేయగలిగారు. చిన్న భూస్వాములు రాజీకివచ్చి ఊళ్ళోనే ఉంటూ వ్యవసాయం కొనసాగించుకోవటం వలన, లేదా బస్తీలకు వెళ్ళినవారు కూడా ఏదో విధంగా వ్యవసాయం కొనసాగించుకోవటానికి ప్రయత్నం చేయటం వలన, వారి పనిముట్లు, పశువులు పంచటానికి వీలుకాలేదు. అవి అలాగే ఉండిపోయాయి. ఆ పరిస్థితుల్లో కొత్తగా భూములు పంచుకొని సాగుచేసుకునేవారు

పనిముట్లను తయారుచేసుకోవలసి వచ్చేది. గ్రామంలో సమిష్టి భూముల్లో, చెరువు లోతట్టుల్లో, చెరువు కట్టలమీద ఇంకా ఇతరత్రా లభ్యమైనమేరకు పనిముట్ల కక్కరకొచ్చే చెట్లు కొట్టుకొని, వాటిని పనిముట్లుగా మార్చుకోవటానికి వారికి అవకాశాలు ఇచ్చారు. గ్రామంలో పనిముట్లు చేసే చేతివృత్తులవారికి చాలా పని దొరికింది. దీనివలన వారి జీవనాధారానికి ఎక్కువ ఉపయోగం కలిగింది. తమ కుటుంబంలోని ఇతరుల సహాయంతోగానీ, ఊళ్ళో ఉన్న ఇతర రైతుల సహాయంతోగానీ, పశువులను తెచ్చుకొని దున్నుకున్నారు. చాలామందికి ఒకటీ అరా పశువులు ఉండటంవలన వాటి సహాయంకూడా తీసుకున్నారు. ఆవులున్నవారు వాటిని ఉపయోగించుకునేవారు. పేదప్రజలు మామూలుగా ఈ ఆవులను దున్నటానికి ఉపయోగిస్తారు. ఈ విధంగా ఎంతవరకు అవకాశముంటే అంతవరకు ఉపయోగించుకున్నారు. చాలా కొద్దిగా భూమిదొరికినవారు—పారలతో, పలుగులతో భూమిని తవ్వి, చదును చేసుకొని పంటవేసుకున్న ఉదాహరణలు కూడా ఎన్నో ఉన్నాయి. ఈ విధంగా పంపకం జరిగినమేరకు భూస్వాముల పనిముట్లను ఉపయోగించారు. అది సాధ్యంకానిచోట మరోవిధంగా సాగుచేశారు.

**ప్రజల విప్లవ చైతన్యం – దాని ప్రాధాన్యత :** ధాన్యం పంచుకున్నా, పనిముట్లను పంచుకున్నా వీటిని పంచుకోవటం ద్వారా తాము న్యాయమైన తమ హక్కును ఉపయోగించుకుంటున్నామనే చైతన్యం ప్రజలకు రావలసి ఉంటుంది. దీనికి విరుద్ధంగా తరచుగా దొంగచాటుగా చేసే ప్రయత్నాలను పంపకం క్రిందికి తెస్తూ, గందరగోళ పరిచే ధోరణి ఉంది. ఆ రోజుల్లో అంత ప్రస్ఫుటంకాకున్నా, దీనిగురించి స్పష్టంగా తెలుసుకోవాలి. చైతన్య యుతంగా, చైతన్య స్థాయి పెంచే విధంగా సాగించే పంపకం, చైతన్యానికి సంబంధం లేనటువంటి పంపకం–ఈ రెండిటి మధ్యగల భేదాన్ని గమనించాలి. ఒక మిత్రుడు లేక ఒక పెద్ద మనిషి ఈ విధంగా ప్రశ్నిస్తున్నాడనుకోండి : 'గ్రామంలో ఉండే వ్యవసాయ కూలీలు రాత్రివేళ భూస్వామి ఇంట్లో పడి, అతని గుమ్మలను (వీటిని తెలంగాణాలో గుమ్ములు అని, సర్కారు జిల్లాల్లో పురి అని అంటారు.) విప్పేసి, అందులోని ధాన్యాన్ని తీసుకొని అందరూ పంచుకుంటే తప్పేమిటి?' ఈ ప్రశ్నకు సమాధానం 'రాత్రే ఎందుకు పంచుకోవాలి? పగలే వెళ్ళి ఆధాన్యాన్ని తెచ్చుకొని ఎందుకు పంచుకోకూడదు?' అనే ఎదురు ప్రశ్న. అప్పుడు 'పగలుకన్నా రాత్రే సౌకర్యంగా ఉంటుంది. రాత్రిపూట అయితే పంచుకున్నవారిని ఎవరూ గుర్తుపట్టరు

వారి గురించి పోలీసులకు సమాచారం ఇవ్వటానికి వీలుండదు. ఇచ్చినా ఎవరో వచ్చి తీసుకు వెళ్ళారని మాత్రమే భూస్వాములు చెప్పగలుగుతారు. ఆ విధంగా పోలీసులు దాడిచేసి, కేసులు పెట్టడానికి వీలు లేకుండా ఉంటుంద'ని చెప్తాడు. దానికి సమాధానం : "పోలీసు కేసు నుండి తప్పించుకోవటమే ప్రధానమైతే ఇలాంటివి ఎన్నైనా ఆర్గనైజు చేయవచ్చును. ఈ రోజుల్లో ఊళ్ళలో జరిగే దొంగతనాలు, హత్యలు అన్నీ ఈ రకంగా రాత్రిపూట జరుగుతున్నవే. ఎవరు చేశారు అన్నది తెలియదు. కేసు నడుస్తుంది. కేసులో ఎవరు చేశారు అనేది తేలక పోవటంతో దానిని కొట్టి వేస్తారు. ఈ విధంగా ఈ పనులు నడిచిపోతూ ఉంటాయి. 'ఇది తమ న్యాయమైన హక్కు కాబట్టి తాము పంచుకుంటున్నాము. పోలీసులు, భూస్వాములు దాడిచేసినప్పటికీ, వాటినుండి తమ ఆస్తులను రక్షించుకున్నట్టే పంచుకున్న ధాన్యాన్ని కూడా రక్షించుకోవాల'నే చైతన్యం ఇందులో పాల్గొనే వ్యవసాయ కూలీలకుండదు. కేసువస్తే దాన్ని ఎలా కొట్టేయించుకోవాలనే చైతన్యమే వీటిలో ఉంటుంది. తమ సొమ్ము తమ హక్కు అనే చైతన్యం ఉండదు. అంటే దొంగసొమ్ము చైతన్యమే కాని మరో విధమైన చైతన్యముండదు. పార్టీ పేరుతో జరిగితే, ఈ దొంగసొమ్ముకు కొంత గౌరవముంటుంది. పార్టీలేకుండా జరిగితే, దీనికి గౌరవం ఉండదు. కానీ ఈ రోజుల్లో అన్నీ సాంప్రదాయమై పోయినాయి. ఈ చైతన్యం ఉన్నవాటికీ, దీనికీ భేదం కన్పిస్తుంది." అప్పటికి ఆ మిత్రుడు 'ఈ చర్యల ఫలితంగా కనీసం భూస్వాములు నిరుత్సాహ పడిపోతారని, లేక వారి ప్రతిష్ట దెబ్బ తింటుంద'ని అభిప్రాయ పడవచ్చు. అనుభవం కనుక చూసుకుంటే అలాంటి సందర్భాలలో చుట్టుపట్ల ఉన్న బంధువులు, మిత్రులు, ప్రత్యర్థి రాజకీయ పార్టీలవారు, అతనికి సహాయం చేస్తారు. నష్టపడిన ధాన్యాన్ని అతనికి చందాలు పోగుచేసైనా ఇస్తారు. లేదా గ్రామంమీద పడి దోచుకొని వారికి తిరిగి ఇస్తారు. ఆ రకంగా ఇచ్చి అతనినొక హీరోగాచేసి, అతని పేరు ప్రతిష్టలను పెంచుతారే కాని పడిపోనివ్వరు. ఈ విధంగా ఆ మిత్రుడు కనీసంగా ఆశించినది కూడా నెరవేరదు. అంతే కాకుండా వ్యవసాయ కూలీలు, సాధారణ రైతుల వర్గ చైతన్యం, పోరాట పటిమ ద్వారా భూస్వాముల ప్రతిష్టను దెబ్బతీయవలసిందే కాని, ఇలాంటి పరోక్ష పద్ధతుల ద్వారా అది సాధ్యం కాదు. ఉద్యమానికి ఏ విధంగానూ ఉపయోగపడదు. ఈ అంశాన్ని గుర్తుంచుకోవాలి.

### మూడువేల గ్రామరాజ్యాల ఏర్పాటు

నల్లగొండ, వరంగల్లు జిల్లాల్లోనేకాక ఈ రెండు జిల్లాలకు అనుకొనిఉన్న సరిహద్దు ప్రాంతాల్లో కూడా ఉద్యమం, పోరాటం విస్తృతం కావటమనేది ఒక విశేషం. ఈ విస్తృతం కావటంలో గ్రామరాజ్యాల సంఖ్య కూడా పెరిగింది. సుమారు మూడువేల గ్రామరాజ్యాలు ఉన్నాయని అంచనా. ఇవి సరిగ్గా మూడువేలే ఉన్నాయా ? ఎక్కువగా ఉన్నాయా ? తక్కువ ఉన్నాయా ? అని సందేహం ఇంతవరకూ ఎవరూ వెలిబుచ్చలేదు. కాని అలాంటి సమస్య ఒకటి ఉంటుంది, వాటిసంఖ్య సుమారుగా మూడువేలు. ఇంతకన్నా కొంత హెచ్చుగా ఉండవచ్చును, లేక కొంత తక్కువగా ఉండవచ్చును. దళాలు, ఉద్యమం విస్తరించిన మొత్తం ప్రాంతంలో ఉన్న గ్రామాలన్నిటినీ లెక్కవేస్తే సుమారుగా మూడువేలకు వచ్చినాయి. కొన్ని సందర్భాలలో కొన్ని గ్రామాలను వదిలివేసి ఉంటారు. కొన్ని అదనంగా కూడా చేరి ఉంటాయి. పోరాటాన్ని కించపరచటానికి తరచుగా చేసే వాదన ఒకటి యూనియన్ సైన్యాలు వచ్చిన తర్వాత బయలుదేరింది. మిలటరీ దృక్పథంతో చూసినప్పుడు విముక్తి స్థావరాలు ఏర్పడలేదనీ, కాబట్టి ఆ గ్రామాలను విముక్తి ప్రాంతమనిగానీ, విముక్తి అయినాయనిగానీ అనటం తప్పనీ దీని సారాంశం. ఈ వాదన ప్రకారం నిజాం మిలటరీ, పోలీసులు చివరిదాకా దాడి చేస్తున్నారు. కాబట్టి వాటిని గెరిల్లా ప్రాంతాలుగా చెప్పవలసి ఉంటుంది. విముక్త ప్రాంతాలని చెప్పటం తప్పు. వాస్తవమేమంటే ఇవి గెరిల్లాలు విముక్తి చేసిన స్థావరాలనే అర్థంతో ఎప్పుడూ ఈవిధంగా చెప్పలేదు. రాజకీయ దృష్టితోనే చెప్పటం జరిగింది. మూడువేల గ్రామాలు విముక్తి అయినాయంటే ఈ గ్రామాల్లో నిజాం పరిపాలన లేకుండా పోయిందని దాని సారాంశం, దాని అర్థం. వాస్తవం కూడా. వారి పని దాడులు చేసినప్పుడు లూటీద్వారా కొల్లగొట్టటమేకాని, పన్నులు వసూలు చేయటంలేదు. వారివద్ద రికార్డులు లేవు. వారి చట్టాలు ఏవీ గ్రామాల్లో అమలు జరుగలేదు. ఈ దృష్టితో పరిపాలనతోబాటు మొత్తం రాజకీయ పరిపాలనా యంత్రాంగమంతా స్థంభించి పనిచేయకపోవటమేకాక, లేకుండా పోయింది. గ్రామ రాజ్యాలు ఏర్పడి పోటీ అధికార కేంద్రాలుగా పనిచేశాయి. ఈరకంగా ద్వంద్వ అధికారం (dual power) అక్కడ ఏర్పడింది. హైదరాబాదులోనూ, పట్టణాలలోనూ నిజాం నవాబు ప్రభుత్వ పరిపాలన ఉండేది. గ్రామాల్లో ఈ

ప్రభుత్వాధికారంలేదు. అక్కడ ప్రజలరాజ్యం ఏర్పడింది. అవే గ్రామ రాజ్యాలు. ఈవిధంగా రెండు ప్రభుత్వాలు, రెండు అధికార కేంద్రాలు పని చేయసాగాయి. అయితే ప్రజల అధికార కేంద్రాల్లో మూడువేల గ్రామ రాజ్యాలు ఏర్పడినా వాటికి సంస్థాన స్థాయిలోగానీ, తెలంగాణా స్థాయిలో గానీ ఒక ప్రభుత్వం ఏర్పడలేదు. అలాంటి ప్రభుత్వంక్రింద పనిచేయకున్నా గ్రామరాజ్యాలు ఏర్పడి పార్టీ, ఆంధ్రమహాసభల నాయకత్వాన పనిచేశాయి. ఆంధ్రమహాసభకూడా అప్పుడు అంతంత మాత్రంగానే పనిచేసింది. సమావేశాలు జరుపటంలేదు. నిర్ణయాలు తీసుకోవటంలేదు. తీవ్ర నిర్బంధ విధానం, చాలామంది జైళ్ళలో ఉండటం లేక పోరాట ప్రాంతాల్లో ఉండటం —ఈ కారణాల వలన ఆంధ్రమహాసభ కేంద్రం కూడా పనిచేయలేదు. పేరుకి మాత్రం ప్రకటనలిస్తూండేవారు. ప్రధానంగా పార్టీ కేంద్రం, పార్టీ నాయ కత్వం ద్వారానే పనులు జరిగినవి. సాధారణంగా ఇలాంటి పరిస్థితులలో తాత్కాలిక ప్రభుత్వం ఏర్పాటు చేస్తుంటారు. కానీ అటువంటిదేమీ ఏర్పాటు చేయలేదు. గెరిల్లా ప్రాంతాలుగానే ఉంచి ముందుకు సాగించారు. ఈ దృష్టితో చూసినప్పుడు మిలటరీరీత్యా ఇవి విముక్త స్థావరాలేమీకావు. రాజకీయంగా ఈ మూడువేల గ్రామాల్లో నిజాం ప్రభుత్వ పరిపాలనను లేకుండా చేసి, ఒక పోటీ పరిపాలనను, ప్రజల పరిపాలనను నెలకొల్పటం జరిగింది. ఈ మూడువేల గ్రామాల పరిపాలనను సమన్వయం చేసేది పార్టీ కేంద్రమని గుర్తుంచుకోవాలి.

## పదివేల సాయుధ కార్యకర్తలు

ప్రజల్లో పెద్దఎత్తున కదలిక రావటంతో అసంఖ్యాకంగా యువకులు పని చేయటానికి ముందుకువచ్చారు. అనేక రకాల బాధ్యతలను వారు నిర్వర్తించారు. యువకులే కాదు, మధ్య వయస్కులు, పెద్దవారుకూడా కదిలి పనిచేశారు. స్త్రీలు, పురుషులు, పిల్లలు కూడా ఏదో ఒక మేరకు పనిచేసిన సందర్భాలున్నాయి. ఈ మూడువేల గ్రామాలలో ఆనాడున్న గెరిల్లా దళాలు, గ్రామరక్షణ దళాలు, వలంటీరు దళాలు, గ్రామకమిటీలు, పార్టీ నిర్మాణం—వీటిలో పనిచేసే వారందరినీ లెక్కవేస్తే, సుమారుగా పదివేలమందికి వచ్చారు. వీరు రంగంలో ఉండి ఎన్నో రకాలుగా పనిచేశారు.

కేంద్రదళాలు, గ్రామదళాలు, గ్రామ వలంటీరు దళాలు : గెరిల్లా దళాల నిర్మాణం మూడుస్థాయిల్లో జరిగింది. కేంద్రస్థాయిలో కేంద్ర హెడ్‌క్వార్టర్స్ ఉంటుంది. ఏరియా కేంద్రంలో ఏరియా కమాండరు ఉంటాడు. అతను ఏరియా కమిటీలో సభ్యుడుగా ఉంటాడు. లేదా ఆయనే ఏరియా కమిటీ సెక్రటరీగా ఉంటాడు. రాష్ట్రకేంద్రంలో మిలటరీకి, రాజకీయ విభాగానికి విభజన లేదు. కానీ జిల్లా కేంద్రాల్లో మాత్రం మిలటరీ, రాజకీయాలయొక్క విభజన ఒకమేరకు జరిగింది. ఈ జిల్లా కమిటీలను రద్దుచేసి, ఏరియా కమిటీలను ఏర్పాటుచేసిన తర్వాత ఈ ఏరియా కమాండరు కమిటీ సభ్యుడుగా ఉండేవాడు. కొన్ని సందర్భాలలో ఏరియా కమిటీ కార్యదర్శిగా ఉండేవాడు. ఏరియా కమిటీ క్రింద ఏరియా కేంద్ర దళాలుండేవి. ప్రారంభంలో ఒకటే కేంద్ర దళం ఉండేది. దళసభ్యులు వస్తున్నాకొద్దీ, అనుభవం పెరుగుతున్నాకొద్దీ, ఆయుధాలు దొరుకుతున్నాకొద్దీ అన్ని ఏరియాల్లో ఎక్కువ సంఖ్యలో ఈ కేంద్ర దళాలను ఏర్పాటుచేశారు. ఈ కేంద్ర దళాలలో శిక్షణ, సమర్థత ఎక్కువగా ఉండేది. స్థాయి కూడా కొంత ఎక్కువగానే ఉండేది. ముఖ్యమైన దాడుల్లో ఈ కేంద్రం దళాలను ఉపయోగించేవారు. క్యాంపులమీద చేసే దాడులలో, ముఖ్యమైన దాడుల సందర్భంలో, ఒక లక్ష్యంతో చేసే పెద్దపెద్ద దాడులన్నింటిలో ఈ కేంద్ర దళాలను ఉపయోగించేవారు. కొన్ని సందర్భాలలో ఒకేదళం దాడి చేసేది. మరి కొన్ని సందర్భాలలో కొన్ని దళాలను సమీకరించి దాడిచేసేవారు. ఈ కేంద్ర దళాలు ఎక్కువసంఖ్యలో లేనప్పుడు కంపెనీ దళాలు ఎక్కువగా తయారయినవి. ఏరియా కమాండరు దానికి కమాండరుగా ఉండేవాడు. ఈ రకంగా కేంద్ర దళాలసంఖ్య లేకుండాపోయేది. ఇదంతా తలబరువుగా తయారవటంతో ఈ కంపెనీ దళాలను రద్దుచేసి, చిన్నచిన్న వాటిని ఏర్పాటుచేసి, ఎంపికచేసి సమర్థులైన వారిని కేంద్రదళాల్లో ఉంచటం, తక్కినవారిని గ్రామదళాలకి పంపించటం జరిగింది. గ్రామస్థాయిలో గ్రామదళాలు ఉండేవి. ముందు వలంటీరు దళాలని ఉండేవి. తర్వాత గ్రామరక్షణ దళాలు ఏర్పడినవి. అవి క్రమంగా గ్రామ దళాలుగా ఏర్పడ్డాయి. కొంత రాజకీయస్థాయి ఉండి, కేడరుకు తగినంత శిక్షణ ఉన్నప్పుడు ఈ గ్రామదళాలు ఆ చుట్టుపక్కల గ్రామాలలో జరిగే దాడుల్లో కేంద్ర దళాలకు సహాయంగా ఉండేవి. తమ గ్రామాన్ని కూడా వదిలిపెట్టి కేంద్ర దళాలకు అనుబంధంగా సహాయంగా ఉంటూ ఈ దాడుల్లో పాల్గొనేవి. అటువంటి

సమర్థత, స్థాయిలేనిచోట గ్రామవ్యవహారాల వరకే పరిమితమవుతుండేవి. ప్రధానంగా గ్రామ కమిటీకి సహాయంగా ఉంటుండేవి. ఈ రకంగా దళాలు కేంద్ర దళం, గ్రామదళం అని ఉండేవి.

సాధారణంగా ఉన్నవి కేంద్ర దళాలూ, స్థానిక గ్రామ వలంటీరు దళాలే. గ్రామ వలంటీరు దళాల స్థాయిని మించి వాటికి ఆయుధాలిచ్చి, కేంద్రదళాలకు సహాయంగా తీసుకు వెళ్ళిన చోట్ల మూడు స్థాయిల్లో ఈ దళాలు ఉంటూ వచ్చాయి. కేంద్ర దళాలు, వాటికి సహాయం చేసే గ్రామ దళాలు, అవి కాక గ్రామ వ్యవహారాలను చూసే గ్రామ వలంటీరు దళాలు–ఈ రకంగా ఉండేవి. అయితే చాలా ముందుకు వచ్చిన ప్రాంతాల్లోనే ఇలాంటివి ఏర్పడ్డాయని చెప్పవలసి ఉంటుంది.

తమ చేతిలోని ఆయుధాలను తమ అధికారానికి మారు రూపంగా భావించిన ప్రజలు

ఒక ప్రాంతంలో ఈ దళం ఏర్పడటంతో ప్రజల జీవితంలో కొన్ని మార్పులు వచ్చాయి. దళం ఏర్పడటమంటే ప్రజల చేతికి ఆయుధాలు వచ్చినట్టు. ఒకసారి చేతికి ఆయుధాలు రాగానే వ్యవసాయకూలీలు, పేదరైతులు, మధ్యతరగతి రైతులు, చివరకు ధనిక రైతుల్లో కూడా 'తమకు అధికారం వచ్చింది, తమకు అధికారాన్ని చలాయించగలిగినశక్తి ఏర్పడింది. భూస్వాములు, రజాకార్లు, వీరిమీద మనం అధికారం చలాయించవచ్చును. వారిని ఎదుర్కోవచ్చును' అనే మన స్తత్వం, దృక్పథం ఏర్పడింది. రజాకార్లు ప్రతిరోజూ ఉండేవారు కాదు, దాడులు వచ్చినప్పుడే కనపడేవారు. రోజూ కనపడేవారు భూస్వాములు, అతని మనుష్యులు, అతని అధికారం. ఒకసారి చేతికి ఆయుధం వచ్చిన తర్వాత 'అధికారము మాదే, భూస్వామిదికాదు' అనే చైతన్యం వారికి వచ్చింది. ఈచైతన్యం చాలా ముఖ్యమైనది. చాలామంది నాయకులమని చెప్పుకునేవారు-వారు కమ్యూనిస్టు నాయకులే కావచ్చును, లేక విప్లవకారులే కావచ్చును - ఈ అంశాన్ని ఎప్పుడూ గుర్తించినట్లుగా కన్పించలేదు. తమచేతికి వచ్చిన ఆయుధాన్ని ప్రజలు అధికారానికి మారుపేరుగా కూడా గుర్తించి ఉపయోగించారు. దాన్ని ఉపయోగించటానికి ప్రయత్నం చేశారు. వీటి సహాయంతో తమ కార్యక్రమాన్ని భూస్వాముల పైన బలవంతంగా రుద్ది (dictate), అమలుజరిపించటానికి వారు ప్రయత్నం చేయగలిగారు. ఈ చైతన్యానికి చాలా లోతైన ప్రభావం ఉంటుంది. వ్యవసాయ

కూలీలు, పేదరైతులు బానిసత్వం నుండి విముక్తయి, అధికారం నడిపించేవారుగా ముందుకురావటంతో, వారి ఆలోచనలు, కార్యకలాపాలు మరోవిధంగా ఉండినవి. భూస్వాముల దగ్గర ఆయుధాలుంటూ, ప్రజలదగ్గర ఆయుధాలు లేనప్పుడు, ప్రజలు బానిసలుగా, భూస్వాములు యజమానులుగా ఉంటారు. ప్రజలచేతికి ఆయుధాలు వచ్చి, భూస్వాముల దగ్గర కూడా ఆయుధాలుంటే, అధికారంకోసం పోటీపడుతున్న రెండుశక్తులు పోరాడుతున్నట్లుగా మనకు కన్పిస్తుంది. భూస్వాములను నిరాయుధులను చేసి, ప్రజలు సాయుధులైనప్పుడు ప్రజలు యజమానులై భూస్వాములు బానిసలైన స్థితి ఏర్పడుతుంది. ఈ అంశాన్ని ప్రజలు గుర్తించినంతగా పార్టీ నాయకత్వం, ముఖ్యంగా కేంద్ర నాయకత్వం, రాష్ట్రస్థాయిలో ఉన్న నాయకత్వం గుర్తించినట్టుగా కన్పించదు. పోలీసుయాక్షన్ తర్వాత పోరాటాన్ని విరమించాలని అనేవారూ, 'ఇది నెహ్రూ వ్యతిరేకపోరాటంకాదు, భూమికోసం జరిగే పోరాటమే' అని చెప్పి ఒకానొక దశలో పోరాటాన్ని విరమించటం సరైందని చెప్పేవారూ ఈ అంశాన్ని గుర్తించినట్లుగా కన్పించదు. అధికారం కోసం జరిగే ప్రతి పోరాటంలో, ప్రతి విప్లవంలో ఇది కీలకమైన, మౌలికమైనసమస్య. ప్రజలు, ముఖ్యంగా పేదలు తమకు అధికారం వచ్చినట్టుగా ఆయుధాన్ని అధికారానికి ప్రతిబింబంగా ఉపయోగించారు. దీనితో వారు ప్రతి సమస్య పరిష్కారంలో పాల్గొనటానికి ముందుకురావటం, తమ అభిప్రాయాలను నిర్భయంగా చెప్పటం, బాధ్యతను గూడా గుర్తించడం జరిగింది. 'చేతికి ఆయుధం వచ్చిందికదా! అధికారం వచ్చిందికదా! ఎవరికైనా అన్యాయం చేయవచ్చును' అనే అభిప్రాయం లేకుండా, 'మనకు బాధ్యత ఉన్నది, ఒక రాజ్యాన్ని నడపవలసిన బాధ్యత ఉన్నది. ఆ బాధ్యతతో మనం వ్యవహరించాలి' అనే చైతన్యాన్ని ప్రదర్శించిన ఎన్నో సంఘటనలు ఉన్నవి. ఒక 10 రూపాయల నోటు దారిన పడిపోతే దానిని తిరిగి గ్రామ సంఘానికి, గ్రామరాజ్యానికి వప్పజెప్పే చైతన్యం ఆ దారిన పోయే సాధారణ రైతుకో, కూలీకో ఏర్పడిందంటే అది ఈ చైతన్యానికి ప్రతిబింబమే. అతడే గనక పూర్వపు బానిస అయితే, ఆ పది రూపాయలు జేబులో పెట్టుకుని అది దొరికింది అనే సంతోషంతో వెళ్ళేవాడు. కాని ఇవ్వాళ అతనికి రాజ్యం వచ్చింది. 'ఈ సొమ్ము నేను గ్రామరాజ్యానికి వప్పజెప్పాలి, నేను అనుభవించవలసింది కాదు' అనే చైతన్యాన్ని అతడు ప్రదర్శించాడు. అదేవిధంగా ఒకరో ఇద్దరో

వెనుకటి అలవాట్ల ప్రకారం సమిష్టి ఆస్తిని, లేక గ్రామంలోని రైతుల ఆస్తిని దొంగిలిస్తే అతన్ని శిక్షించటానికి ప్రజలందరూ అంగీకరించి ముందుకు రావటం ఆ చైతన్యానికి నిదర్శనంగానే ఉన్నది. రజాకార్లు వచ్చి ఎంతో లూటీ చేసినా, హత్యలు చేసినా ప్రజలు అనేక త్యాగాలు చేసి పోరాటంలో నిలబడటం కూడా ఈ చైతన్యంలో ఒక భాగమే. ఈ చైతన్యాన్ని అర్థం చేసుకోవటం విప్లవ కారులందరికీ, విప్లవాన్ని పరిశీలించే వారందరికీ చాలా అవసరం.

గ్రామ వ్యవహారాలలో యువకులంతా పాల్గొనటం : దాదాపు ఇంట్లో కూర్చున్న యువకుడనేవాడు లేడు. వారంతా ఒకవైపున వ్యవసాయం చేసుకుంటూ రెండోవైపున ఈ గ్రామ వ్యవహారాలలో పాల్గొంటూ ఉండేవారు. కుటుంబంలో పెద్దలు ఉంటే యువకులను ఈ పనులు చేయటానికి పంపించేవారు. యువకులే పెద్దవారుగా కూడా ఉంటే, వారు ఒకవైపు పొలంపనులు చేసుకుంటూ తీరిక సమయమే కాకుండా, మరికొంత సమయాన్ని మిగిలించుకొని గ్రామ వ్యవహారాల్లో పాల్గొనేవారు. ఎవరిడ్యూటీ ప్రకారం వారు తమ తమ బాధ్యతలను నిర్వహించే వారు. ఉద్యమం ప్రారంభమైన రోజుల్లో ఇంటికొకరు పార్టీలోకి, సంఘంలోకి వెళ్ళి పనిచేయాలనే నిబంధన ఒకటుండేది. అది ప్రజలనుంచి వచ్చిన నిబంధనే, ప్రజలందరు సమావేశమయినప్పుడు పార్టీలో పనిచేయటం కొరకు, లేక గ్రామ వ్యవహారాలు చూడటం కొరకు ముందుకురావాలని అడిగితే, తప్పకుండా వస్తామని, ఇంటికొకరు చొప్పున రావాలని నిర్ణయించి అమలు జరిపారు. ఆ కాలంలో సమిష్టి కుటుంబాలు ఎక్కువగా ఉండేవి, భూమి కొద్దిగా ఉన్నా, లేదా హెచ్చుగా ఉన్నా మధ్య తరగతి రైతులు, ధనిక రైతులు, భూస్వాములూ దాదాపు అందరూ సమిష్టి కుటుంబాలుగా జీవించేవారు. భూస్వాములు తమ ప్రాబల్యం కోసం సమిష్టి కుటుంబాలుగా జీవించేవారు. ధనిక రైతులు ధనిక రైతులుగా తమవంతు ప్రాబల్యాన్ని నిలబెట్టుకోవటానికోసం సమిష్టి జీవితం గడిపేవారు. మధ్యతరగతి రైతులు, తక్కినవారుకూడా అదేవిధంగా ఉంటుండే వారు. దీనివలన మిగులు ఉండేవారికి ఎక్కువ మిగులు ఉంటుంది. మిగులు లేని వారికి ఆర్థికంగా కలిసి వస్తుంది. ఈ రకంగా సమిష్టి కుటుంబాలుగా ఉన్నప్పుడు ఇంటికొకరు అన్న సూత్రం పాటించారు. పోరాటం ఉన్నతస్థాయికి వెళ్ళినతర్వాత ఇంటికొకరు అన్న సూత్రం పోయి, యువకులంతా ముందుకి వచ్చారు. ఇంట్లో సహాయపడేవారు లేకుంటే, కొంత సమయాన్ని వినియోగించి పనిచేయటం,

సహాయపడేవారుంటే ఎక్కువ సంఖ్యలో, దాదాపు యువకులంతా వచ్చి ఎవరి చేతనైనపని వారు చేసేవారు. కొద్దిగా చదువువచ్చిన వారుంటే, చదువుకు సంబందించిన వ్యవహారాలు చూసేవారు. తుదకు వీరు టీచర్లుగా పనిచేసి రాత్రి పాఠశాలలు నడిపిన ఉదాహరణలు కూడా ఉన్నాయి. అదేవిధంగా గ్రామ వ్యవహారాల్లో వ్యాపారం, ధరలు దానికి సంబంధించి నిర్ణయించాల్సి వచ్చినప్పుడు, వర్తక వ్యాపారానికి సంబంధించిన యువకుల సలహా తీసుకునేవారు. పనిముట్లు చేసే రేట్లు, లేక ఎలాంటి చెట్లను కొట్టాలి – ఇలాంటి విషయాలు నిర్ణయించటంలో పనిముట్లను చేసే వారి అభిప్రాయానికి ప్రాధాన్యత ఉండేది. ఆ యువకులు ముందుకువచ్చి నిర్ణయాలు చేయటంలో సహాయపడుతుండేవారు. ఈరకంగా వివిధరకాల పనులకు సంబంధించి నిర్ణయాలు చేయటానికి ఆయా పనులకు సంబంధించిన యువకులు ముందుకువచ్చి సహాయం చేసేవారు. ఈరకంగా గ్రామంలో అందరూ కదలికలో ఉంటూ ఏదో ఒక బాధ్యతను నిర్వర్తించేవారు, ఇది చాలా ముఖ్యమైన అంశంగా ఉండేది.

**స్త్రీల పాత్ర :** స్త్రీలు కూడా ప్రతిఘటనలో పాల్గొనటం మరొక ప్రత్యేకత. వీరు ఆ కుటుంబాల్లో పురుషులకి అన్నివిధాల సహాయంగా ఉన్నారు. ఒకమేరకు వలంటీర్లుగా పనిచేశారా అంటే, ఆనాటి సామాజిక పరిస్థితులలో వారు రాత్రివేళల విడిగా ఉండి పని చేయటం సాధ్యం కాకపోయేది. వారు అంతకన్నా ఉన్నత స్థాయికి వెళ్ళి పాల్గొనటానికి అవకాశాలుండినవి. దీనిని తెలుసుకోవటానికి ఒక సంఘటనను ఉదహరించవచ్చును.

ఒక గ్రామానికి దళం వెళ్ళింది. దారిలో వెళ్తున్నప్పుడు అక్కడికి సాయంత్రం అయింది కనుక, మకాంవేసి భోజనం చేసుకొని విశ్రాంతి తీసుకొని మళ్ళీ తమ దారిలో వెళ్ళటానికి వీలుగా అక్కడ ఆగింది. సాయంత్రం తర్వాత దాడులు జరుగవు. మళ్ళీ తెల్లవారుఝామునో లేక ఉదయం 8 గంటల ప్రాంతంలోనే దాడులు జరుగుతాయి. ఈ మధ్యన సుమారు 12–14 గంటల కాలం స్వేచ్ఛగా ఇబ్బందిలేకుండా గడపటానికి వీలుంటుంది. ఆ దళంలో ఉండే ఒకరిద్దరు సభ్యులు ఆ గ్రామ నివాసులు కూడా. దళ నాయకులు వాళ్ళిద్దరిని ఇళ్ళకు పంపించారు. తక్కిన సభ్యులంతా విశ్రాంతి తీసుకోవటానికి వీలుగా ఉన్న ఒకచోట ఉన్నారు. దళానికి భోజనపు ఏర్పాట్లు జరిగినవి. అప్పుడు ఇంకా కొంత వెలుగున్నది. సుమారు 16 ఏళ్ళనుంచి 20, 22

ఏళ్ళదాకా ఉన్న కొందరు యువతులు దళ సభ్యులను, దళాన్ని చూడటానికి వచ్చారు. వారంతా దళానికి కొంత దూరంలో నిలుచున్నారు. వారికేదో ఆసక్తి ఉన్నది, కాని దానిని వారు చెప్పలేకపోతున్నారు. అక్కడున్న పార్టీ నాయకుడు దళ సభ్యులను, దళ నాయకుణ్ణి పిలిచి 'వారు వచ్చి ఉన్నారు, వారికేదో కావల్సి ఉంటుంది, ఏదో అడగవలసింది ఉంటుంది. అంతా యువతులు ఉన్నారు గనుక వారికి ఆయుధాలు చూడాలని, ఎలా పని చేస్తాయో తెలుసుకోవాలని ఆసక్తి ఉండవచ్చును. మీలో ఒకరో ఇద్దరో వారికి మీ దగ్గర ఉన్న ఆయుధాలు తీసుకువెళ్ళి చూపించండి. అవి ఎలా పనిచేస్తాయో చెప్పండి' అని చెప్పాడు. ఆ దళనాయకుడు వెళ్ళి వారిని పిలిచి, 'మీకేమైనా ఆయుధాలు చూడాలని ఉన్నదా ?' అంటే అవునని తల ఊపారు. వారిని తీసుకువచ్చి, వారికి ఒక్కొక్కటిగా ఆయుధాలను చూపెట్టారు. ఆ దళానికి మంచి ఆయుధాలే ఉండినవి. 303 రైఫిల్స్, షాట్‌గన్స్, నాటు తుపాకులు ఇవన్నీ ఉండేవి. ఈ మూడురకాల తుపాకులు ఏరకంగా పనిచేస్తాయో ఒక్కొక్కరికి వాటిని తీసి చూపెట్టారు. ఆ తూటాలు ముందు తీసేసి, అవి ఏవిధంగా పని చేస్తాయి, దానిమీద దెబ్బతగిలితే అవి పేలి ఏవిధంగా వెళ్తాయి, ఇవన్నీ ముందు చెప్పారు. మేగజైన్స్ తీసి అవి ఏవిధంగా పని చేస్తాయో చూపెట్టారు. ట్రిగ్గరు ఏవిధంగా నొక్కాలి, నొక్కినప్పుడు ఎక్కడ పడుతుందీ, ఎక్కడ దెబ్బతింటుందనే మెకానిజం గురించి చెప్పారు. అదేవిధంగా తుపాకి గొట్టం ఏవిధంగా ఉంటుంది వివరించారు. రైఫిలుకూ, షాట్‌గన్‌కూ, నాటు తుపాకికీ—మూడురకాల వాటికి ఒక్కొక్కటిగా విడదీసి చెప్పారు. ఆ స్త్రీలందరూ వచ్చి, ఎంతో ఆసక్తితో చూశారు. అందరూ తాము చేయిపెట్టి నొక్కటానికి ప్రయత్నం చేశారు. ఈ రకంగా ఎంతో సంతోషంగా, ఎంతో ఉత్సాహంగా, శ్రద్ధతో వారు ఆ కార్యక్రమాన్ని చూశారు. చూడటమేకాకుండా ఆసక్తికూడా కనపర్చారు. ఇది ఒకరకంగా వారి చైతన్యానికి నిదర్శనం. తుపాకులంటే ఈ రోజుల్లో పెద్దపెద్దలే భయపడతారు. ఆ రోజుల్లో కూడా అదేవిధంగా ఉండేది. తుపాకి అంటే ఎంత చదువుకున్నవాడైతే అంత భయపడేవాడు. ఎంత ఉన్నవాడైతే అంత భయపడేవాడు. ఈ రకంగా ఉన్న ఆ రోజుల్లో సైతం తుపాకులను గురించీ, వాటి మెకానిజం గురించీ తెలుసుకోవటానికి ఆ యువతులు ముందుకు రావటం వారి చైతన్యంలో ఒక ప్రధానాంశం. వారంతా సాధారణ రైతు కూలీ స్త్రీలు. వారి కుటుంబాలనుంచి వచ్చిన ఇద్దరు దళ సభ్యులు వారి ఇళ్ళలోకి

వెళ్ళారు. తక్కిన దళ సభ్యులందరూ తమకు చెందినవారే, తమకుటుంబాలు లేక తమ వర్గానికి చెందినవారే, అన్న ఆప్యాయతను, దగ్గరి సంబంధాన్ని వారందరూ కనపరిచారు. ఇది చాలా ముఖ్యమైన అంశం. స్త్రీల చైతన్యం పెరిగి, చివరిరోజుల్లో వారిని పెద్ద సంఖ్యలో దళాల్లో చేర్చుకోవటానికి కావలసిన పరిస్థితులు కూడా ఏర్పడినవని కన్పిస్తుంది.

## పోరాటకాలంలో అభివృద్ధిచెందిన సాహిత్యం, కళలు- కొన్ని అంశాలు

ఈ కాలంలో రూపొందిన సాహిత్యం కొంత ఉన్నది. సర్కారు జిల్లాల్లో, ఇతర ప్రాంతాల్లో నవలలు, కథలు ఇలాంటివి కొన్ని తర్వాత వచ్చాయేకాని ఈ కాలంలో అంతగా రాలేదు. ముఖ్యంగా ప్రజలను ఉత్తేజితులను చేయటానికి రూపొందించిన గేయాలు, బుర్రకథలు, యక్షగానాలు, వీధి భాగవతాలు ఎక్కువగా ఉన్నాయి. ఇవన్నీ అక్కడి కార్యకర్తలు, చదువు వచ్చినవారు ఈ పోరాటంతో ఉత్తేజితులై రాసినవే. వీటిలో చదువురాని వారు వ్రాసినవి కూడా ఉన్నాయి. 'రామబాణం వంటి రైతన్నా రాజ్యంబు నీదిరా కూలన్నా' లాంటి ఉత్తేజకరమైన గేయాలు, బుర్రకథలు ఇటువంటివి చాలా హెచ్చుగానే ఉన్నాయి. జన్నారెడ్డి ప్రతాపరెడ్డికి వ్యతిరేకంగా ఆ ప్రాంతపు ప్రజలు దళాల నాయకత్వాన ఒక వీరోచితమైన పోరాటం నడిపారు. అమర వీరుడైన యాదగిరికి చదువురాదు. రాయటం అనే సమస్యే లేదు. అతడు 'బండెనక బండిగట్టి, పదహారుబండ్లుగట్టి.. ఓకొడక ప్రతాపరెడ్డి' అనే పాటను తనకు తానుగా రూపొందించాడు. అతను ఈ గేయాన్ని దేశముఖు జన్నారెడ్డి ప్రతాపరెడ్డికి వ్యతిరేకంగా రూపొందించినాడు కానీ నిజాంమీద రాసినది కాదు. తర్వాత దాన్ని నిజాంకి వ్యతిరేకమైన పాటగా మార్చారు. పోలీసు యాక్షనుకు ఒకటి, రెండు నెలలముందు, ప్రతిఘటన తీవ్రమైన పరిస్థితుల్లో, ఈ దేశముఖు రహస్యంగా హైదరాబాదుకు వెళ్ళిపోయాడు. ఆ సందర్భంలో పదహారు బండ్లు కట్టుకొని, అతను ఏ బండ్లో ఉన్నదీ తెలియకుండా కప్పిపుచ్చి వెళ్ళిపోయాడని అక్కడ ప్రజలు అనుకున్నారు. ఎర్రబాడు ఆయన ఉండే గ్రామం. అక్కడికి రోడ్డులేదు. బస్సులు రావటానికి వీలులేదు. రోడ్డులేదు కనుక సైన్యాలతో జీపులమీద వెళ్ళిపోయుంటాడు. అయినా బండ్లమీద సామాన్లు తీసుకెళ్ళుంటాడు. సామానువెంట జీపులు, సైనికుల ట్రక్కులు ఇవి

ఉండి ఉంటాయి. వీటినిచూసి కావచ్చును, అతను ఆ గేయాన్ని రూపొందించాడు. ఇలాంటి సాహిత్యం పెద్ద ఎత్తున ఉత్పత్తి అయింది.

ప్రజలు వీటిని పాడుకున్నారు. గెరిల్లా దళాల్లో వాటికి అనుబంధంగా ఒక సాంస్కృతిక దళం ఉండేది. వారు విశ్రాంతి తీసుకున్నప్పుడు సైన్యాలు, క్యాంపులు దూరంగా ఉండి, వినటానికి వీలులేని స్థితిలో ఉన్నప్పుడు పాటలు, ఆటలతో కొంత వినోదం జరుగుతుండేది. దళాలకే కాకుండా ప్రజలకు కూడా కాలం గడపటానికి ఇలాంటి వినోదం అందించేవారు. దినమంతా దాడులు జరుగుతాయేమోనని ఎదురుచూస్తూ పొలాల్లో, చేలల్లో ఉండేవారు. రాత్రివేళ వచ్చినప్పుడు దాడులు జరిగే ప్రమాదం లేదని, వంటలు, ఇంటిపనులను పూర్తి చేసుకొని సుమారు రాత్రి 9 గంటల తర్వాత అంతా ఒకదగ్గర చేరేవారు. ఈ కథలు, కాలక్షేపాలు, బుర్రకథలు ఇటువంటి వాటితో కాలం గడిపేవారు. ఎందుకంటే ఒకదశలో రాత్రి పూట ఏ పరిస్థితుల్లోనూ దాడులు సాధ్యంకాని పరిస్థితి ఏర్పడింది. అందువలన నిశ్చింతగా ఉండగలిగేవారు. అయినా జాగ్రత్తగా కాపలాపెట్టుకొని చూస్తుండేవారు.

ఈ స్థితిలో ఈ సాహిత్యం అభివృద్ధి అయింది. ఈ సందర్భంలోనే అమరవీరులైన వారిపేరుమీద కూడా గేయాలు, బుర్రకథలు ఇంకా ఇలాంటివి ఏర్పడినవి. గోపాలరెడ్డి అనే దళ నాయకుడు పోరాటంలో చనిపోయిన సందర్భంలో 'సైసై గోపాలరెడ్డి' అనేపాట, నల్లగొండ తాలూకాలో పసునూరు వెంకటరెడ్డి చనిపోయిన సందర్భంలో ఇలాంటిగేయాలు, బుర్రకథలు, తదితర సాహిత్యం రూపొందినాయి. వీటన్నిటిని ప్రజలు ఈనాటికికూడా మర్చిపోకుండా చెప్పుకుంటున్నారు. అవి చాలా వరకు ప్రజలస్మృతి పథంలో మిగిలిపోయాయి. ఇది సాహిత్య రంగానికి సంబంధించినది.

కళారూపాల్లో యక్షగానాలు, వీధి భాగవతాలు ఇవన్నీ ముందుకు వచ్చాయి. ఇదివరకు ఉన్నవే ప్రస్ఫుటంగా, పెద్ద ఎత్తున వాడకంలోకి వచ్చినాయి. సాధారణంగా పశువుల కాపరులైన పిల్లలు వాటిని బీళ్ళలో మేపుకుంటూ నలుగురు ఒకచోట చేరి, ఒకతను భూస్వామిగా, రెండవతను రైతుగా, మూడవ అతను కూలీగా, మరొకతను భూస్వామి ఏజెంటుగా వేషాలు వేసేవారు. భూస్వామి తన ఆధిపత్యాన్ని చలాయించే విధంగా మాట్లాడటం, ఈ రైతులు కూలీలు నమ్రతగా భూస్వామికి లొంగి ఉన్నట్లు ముందు ఉండటం, తర్వాత సంఘం పెట్టుకోవటం,

సంఘ నాయకత్వాన పోరాటం సాగించటం, భూస్వామి రైతులను దెబ్బలు కొట్టటం, వారు భూస్వామిని దెబ్బలు కొట్టటం ఇటువంటివన్నీ జరుగుతుండేవి. కొన్నిచోట్ల ప్రత్యక్ష రామాయణం కూడా అమలులోకి వచ్చేది. అంటే భూస్వామి వేషం వేసిన పిల్లవాడు వ్యవసాయ కూలీలుగా, రైతులుగా ఉన్నవారిని చావబాదేవాడు. నెత్తురు కారేవిధంగా వారికి దెబ్బలు తగిలేవి. మరికొన్ని సార్లు తిరుగుబాటు సీనులో ఈ రైతులు, కూలీలు భూస్వామిని దెబ్బలు కొట్టేవారు. అతడికి బాగా దెబ్బలు తగిలేవి. నెత్తురు కారేది. గ్రామస్థులు వీరిని చూసి మంచిదికాదని చెప్పి వారించేవారు. రెండోవైపున వారు చేసిన పనులకు నవ్వుకునేవారు. వీధి భాగవతాలు, యక్షగానాలు కూడా ఈ పిల్లల కొరకు ప్రదర్శించటం జరుగుతుండేది. తమలో తాము ఆటలో ఒక భాగంగా ఈ పని చేస్తుండేవారు. పాటల విషయానికి వస్తే ప్రజలు సంఘం పాటలను విస్తృతంగా పాడుకునేవారు. మోట తోలుకుంటూ పాడేవి ఇవే పాటలు, పసులను కాసుకుంటూ పాడేపాటలు ఇవే. అన్ని సందర్భాల్లో ఈ సంఘం పాటలు ఉండేవి. తెలంగాణా వ్యాప్తంగా, ముఖ్యంగా పోరాట ప్రాంతంలో మూల మూలలా వ్యాపించి ఆబాలగోపాలం వాటిని పాడుకొని ఆనందించేవారు. ఇంత వ్యాప్తంగా ప్రజల్లోకి చొచ్చుకుపోయిన ఈ పరిణామం మనకు ఆశ్చర్యం కలిగించక మానదు. ఒకవైపున చదువు వచ్చినా రాకున్నా ప్రజలు, ముఖ్యంగా యువకులు గేయాలను రూపొందించారు. లేక వ్రాశారు. వీటిని ప్రజలు పాడుకునేవారు. స్త్రీలు పాడుకునేవారు. పురుషులు పాడుకునేవారు. పెద్దలు, యువకులు, పిల్లలు అందరూ ఇవి పాడుకునేవారు. వెనకటి రామాయణ భాగవతాలకు సంబంధించిన పాటలు అదృశ్యమైపోయినాయి. ఎవరూ వాటిని ఖాతరు చేయలేదు. ఎవరు కోరినా ఈ సంఘం పాటలే కోరుకునేవారు, పాడుకునే వారు. సర్కారు జిల్లాల్లో హేతువాద, నాస్తికవాద సంఘాల నాయకత్వాన కొన్ని దశాబ్దాలపాటు రామాయణంలాంటి పురాణ కాలక్షేపాలకు వ్యతిరేకంగా ప్రచారం జరిగింది. తెలంగాణా ప్రాంతంలో అలాంటి ప్రచారం కూడా జరుగలేదు. జరిగినా బహుస్వల్పం. పట్టణాల్లో కొంతమంది చదువుకున్నవారి వరకే అది పరిమితమై ఉంటూవచ్చింది. ప్రజలకు వాటి సంగతి తెలియనే తెలియదు. అయినా పోరాటక్రమంలో ప్రజలు పురాణ కాలక్షేపాలను పక్కకు పెట్టేసి, తమ జీవితానికి తమ పోరాటానికి అందుబాటులో ఉన్న ఈ పాటలను,

పురోగకమైన పాటలను పాడుకున్నారు. ఈ పరిణామాన్ని బాగా అర్థం చేసుకోవలసి ఉంటుంది. ఎప్పుడైనా ప్రజలు వారికి అందీపొందని ప్రచారంకన్నా అందుబాటులో ఉన్న ప్రచారానికి ఎక్కువ ప్రాధాన్యత ఇస్తారు. పోరాట గమనంలో ఉన్నప్పుడు ఇతర సమస్యలకు, అనవసరమైన వాటికి చెవి ఒగ్గరు. వారికి తెలిసిన, వారు కావాలని కోరుకునే పురాణ కాలక్షేపాలున్నాయి. కానీ పోరాట కాలంలో వాటి సంగతి పట్టించుకోలేదు. వాళ్ళకు కావలసిందంతా పోరాటమూ, పోరాటం విజయవంతం కావటమూను. ఆ పోరాట సమస్యలే ప్రధానంగా ఉండటంతో వాటిని వారు పాడుకొని ముందుకు సాగారు.

## పోరాటంలో కులాల, మతాల ఐక్యత

ఆదే విధంగా కులభేదాలు, మతభేదాలు అన్నీ సమసి పోయినాయి. రజాకార్లు ముస్లింలయినా, వారు దాడులు చేసినా, వారిని కనికరించి, వారి విషయంలో ఉదారంగా ప్రవర్తించిన ఘటనలు చాలా ఉన్నాయి. పేరుబడి అందరూ చెప్పుకునే ఘటన ఒకటి ఉన్నది. గుండ్రాంపల్లి అనే గ్రామంలో ఒక క్యాంపు ఉండేది. అది హైదరాబాదు, విజయవాడ రహదారిమీద ఉన్నది. ఒక ముస్లిం కుటుంబంవారు పెళ్ళి జరుపుకోవటం కొరకు అక్కడికి వచ్చారు. క్యాంపున్నది కదా అని నిర్భయంగా పెళ్ళి ఆనందోత్సాహాలతో వారున్నారు. ఆ క్యాంపుమీద గెరిల్లా దళాలు దాడిచేసి, దెబ్బతీశారు. వారిని దెబ్బ కాచుకునే స్థితిలో (డిఫెన్సివులో) పడవేసి, ఆ క్యాంపులో ఉన్న పోలీసులను, రజాకార్లను, మిలటరీని తరిమివేయ గలిగారు. ఆ సందర్భంలో ఈ పెళ్ళివారు ఒంటరిగా చిక్కిపోయారు. వాళ్ళకు రక్షణ లేకపోయింది. అప్పుడువారు 'మేము పెళ్ళికి వచ్చిన వారము. మాకు రక్షణ కావాల'ని దళ నాయకులకు కబురు చేశారు. ఇంకొక కథనమేమంటే - పెళ్ళికూతురు స్వయంగా వచ్చి, 'మేం చేసిన తప్పేమీలేదు, మాకు రక్షణ ఇవ్వాల'ని కోరితే వారికి పూర్తిగా రక్షణ ఇచ్చి, వెళ్ళిపొమ్మని చెప్పారు. వారికెలాంటి హాని కలుగజేయలేదు. దీనివలన దళాలు జీవకారుణ్య దృష్టితో, సహృదయతతో వ్యవహరిస్తున్నారనీ, వారు పోరాడుతున్నారే గాని ముస్లింలను, నిర్దోషులను పట్టుకొని చంపటం లేదనీ హైదరాబాదులో పెద్ద ఎత్తున ప్రచారం జరిగింది. పార్టీ ప్రతిష్ఠ, దళాల ప్రతిష్ఠ పెరగటానికి ఈ చర్య ఎంతో దోహదం చేసింది. ఇలాంటి ఘటనలు వివిధ సందర్భాలలో అనేకంజరిగాయి. మతాల ప్రమేయం లేకుండా కులాల ప్రమేయం లేకుండా అన్ని కులాలకు

చెందిన ప్రజలు కలిసి పోరాడారు. ఇలాంటి ఐక్యత పోరాటకాలంలో ఏర్పడింది. క్రిస్టియన్లు సర్వసాధారణంగా ఈ పోరాటాల నుండి దూరంగా ఉండేవారు. అక్కడక్కడ వ్యక్తులుగా ఫాదరీలు, ఇటువంటివారు ప్రభుత్వానికి సహాయం చేస్తుండేవారు. కాని క్రిస్టియన్ ప్రజా సామాన్యం మాత్రం పోరాటానికి ముందు రోజుల్లో తటస్థంగా ఉండేది. తర్వాతి కాలంలో కలిసివచ్చారు కూడా. క్రైస్తవ మతానికి చెందిన కొందరు యువకులు, ముఖ్యంగా వ్యవసాయ కూలీ యువకులు దళాల్లో చేరి, దళ నాయకులుగా ఉండి, వీరోచితంగా పోరాడిన ఘటనలనేకం ఉన్నాయి. జాజిరెడ్డిగూడెం ప్రాంతంలో ఒక దళం ఉండేది. మూసీ మధ్య భాగంలో ఉంటూ, అటు నల్లగొండ ప్రాంతానికీ, ఇటు సూర్యాపేట ప్రాంతానికి చెందిన, రెండు ప్రాంతాలనూ కమాండు చేయగలిగిన దళం ఒకటి ఉండేది. దళ నాయకులు, దళ సభ్యులలో క్రిస్టియన్లుండే వారు. దళ నాయకుడు జాన్ అని ఉండేవాడు. అతను తర్వాత కాలంలో చనిపోయాడు. ఈ రకంగా క్రిస్టియన్లు కూడా సాయుధ పోరాటంలో పాల్గొన్నారు. సాధారణంగా నిజాం నవాబుకు భక్తులుగా ఉన్నవారు కూడా తమ వైఖరి మార్చుకొని మత ప్రమేయం లేకుండా పోరాటంలో పాల్గొని సహాయం చేశారు.

## కొత్త నైతిక సూత్రాలు, క్రమశిక్షణ

ఈ చైతన్యాన్ని ఆధారం చేసుకొని ఒక కొత్తరకపు సంస్కృతి ఏర్పడినది. ఇదే నూతన ప్రజాతంత్ర సంస్కృతి అని చెప్పవలసి ఉంటుంది. ఈ సంస్కృతికి సంబంధించిన నైతిక సూత్రాలు కూడా అప్పుడు ఏర్పడినవి. భూస్వాములు తమ శత్రువులు కదా అని ఎవ్వరిమీదా దళాలు అత్యాచారాలు జరుపలేదు. ఆయుధాలు చేతికి వచ్చిన తర్వాత ఏ కారణం వలననైనా వారి ఇళ్ళకు వెళ్ళినప్పుడు తాము నిర్ణయించుకున్న మేరకు వస్తువులను తీసుకున్నారు. తక్కిన వాటిని ముట్టుకోలేదు. కొన్ని సందర్భాల్లో పొరపాట్లు జరిగినా, సర్వ సామాన్యంగా తక్కిన వస్తువులను ముట్టుకోలేదు. ధాన్యం కొరకు వెళితే ధాన్యం వరకే పరిమితమయ్యారు. ఆయుధాల కొరకు వెళ్ళినవారు ఆయుధాలవరకే పరిమితమయ్యారు. స్త్రీలనెవ్వరిని ముట్టుకోలేదు. స్త్రీల విషయంలో ఎంత ఖచ్చిత మైన వైఖరి అనుసరించారంటే, భూస్వాముల స్త్రీలుకూడా తమకెలాంటి అపాయం లేదని భావించి, నిశ్చింతగా ఇళ్ళలో ఉండిపోయినారు. భర్తలు, మగవాళ్ళే బస్తీలకు పారిపోయారు. శత్రువుల కుటుంబాలలో కూడా స్త్రీలు ఇళ్ళలో ఉండి

పోయారు. కమ్యూనిస్టులు, వారి దళాలు స్త్రీలవిషయంలో తప్పుగా ప్రవర్తించరనీ, స్త్రీల మాన సంరక్షణకొరకు ముందుకు వస్తారేకాని, వారికెలాంటి అపాయం కలిగించరనే విశ్వాసం ఏర్పడటమే దీనికి కారణం. దానికనుగుణ్యంగా వీరు ప్రవర్తించారు. దోపిడీ దుర్మార్గాలు చేసిన భూస్వాములు తమ ప్రాణానికి అపాయం ఉంటుందని భావించి పట్టణాలకు పరిగెత్తారు. కొందరు పోలీసులను, మిలటరీని వెంట తీసుకువచ్చి దాడులు చేయించి, ఉద్యమాన్ని అణచివేయటానికి ప్రయత్నం చేశారు. అలాంటివారు చాలావరకు కుటుంబాలతో సహా బస్తీలకు వెళ్ళిపోయారు.

మిలటరీ, పోలీసుల వెంట ఉంటూ ప్రజలను హింసించటంలో, కాల్చి చంపటంలో పాల్గొన్న భూస్వాములను దళాలు చంపినప్పుడు వారి కుటుంబాలు పార్టీకి, దళాలకి వ్యతిరేకంకాని సంఘటనలు ఉన్నాయి. ఎందుకంటే దళాలు, పార్టీ కార్యక్రమం గురించి వారికి స్పష్టంగా తెలుసు. ఇవి పగతో చంపాలని చేసిన హత్యలు కావనీ, ప్రజలను చంపటం, దళాలను పట్టుకోవటం లాంటి పనులలో పోలీసు, మిలటరీ వారిలాగానే పని చేయటం వలన వారిని చంపారనీ వారు భావించారు. స్త్రీలమీద, కుటుంబాలమీద దుర్మార్గాలు జరపటం పార్టీ కార్య విధానం కాదన్న విశ్వాసం వలన వారు పార్టీకి వ్యతిరేకంగా తయారుకాని సంఘటనలు ఉన్నాయి.

భూమి పంపకం సందర్భంలో కూడా పార్టీ ఒక నిబంధనను ఏర్పాటు చేసింది. ఏ భూస్వామి అయినా సోమరిపోతుగా ఉండకుండా కుటుంబంతో సహా కాయకష్టం చేసుకుంటే అతన్ని ధనికరైతుగా పరిగణించి అతని భూమిని పార్టీ పంపకం చేయదని నిర్ణయించి, గ్రామంలో అందరికీ తెలిపేది. దీనితో సోమరి పోతులుగా ఉన్న చాలా మంది చిన్న భూస్వాములు కుటుంబాలతో సహా వచ్చి పొలంలో పనిచేసిన సంఘటనలు కూడా ఉన్నాయి. సహజంగా వారు ఆ స్తి దక్కించుకునే ఉద్దేశ్యంతోనే ఆ పని చేశారు. ఈ భూస్వాములు తమ భూమి దక్కించుకోవటం కొరకు వేరే మార్గం లేక భూస్వాములకుండే సహజలక్షణాల్లో ఒక ముఖ్య లక్షణాన్ని వదులుకన్నారని కన్పిస్తుంది. 'కాయకష్టం చేయటం తమ ప్రతిష్ఠకు విరుద్ధం, సోమరిపోతుగా ఉండేనే గొప్పతనం' అనే దృక్పథాన్ని వారు మార్చుకొని, కాయకష్టం చేసుకోవటానికి ఈ నిర్ణయం దోహదపడింది. ఈవిధంగా దృక్పథంలో, భావాల్లో మార్పు తీసుకురావటానికి కృషి జరిగింది. దాని ఫలితాలు

కూడా కన్పించాయి. అయితే భూస్వాములందరూ ఈవిధంగా మారలేదు. పోలీసు, మిలటరీపై ఆధారపడి దుర్మార్గాలు చేసిన భూస్వాములున్నారు. గ్రామంలో ఉంటూ, పార్టీతో రాజీపడి కొంత భూమి వదులుకొని కొంతభూమిని దక్కించుకున్న భూస్వాములూ ఉన్నారు. భూమిని దక్కించుకొనడానికైనా భూస్వాములకుండే ముఖ్యలక్షణాన్ని వదులుకొని సాంస్కృతికంగా మార్పుచెందినవారు మూడవరకానికి చెందుతారు. పెద్దఎత్తున జరుగకున్నా ఒకమేరకైనా ఇది జరిగింది.

## కొన్ని వేల సంవత్సరాలలో మొదటిసారిగా ఏర్పడిన కొత్త జీవితం

ఈ విధంగా గ్రామీణ ప్రాంతంలో ఒక కొత్త జీవితం ప్రారంభమయి, అభివృద్ధి అయింది. దీనికి వెనుకటి జీవితంతో సంబంధంలేదు. సాయుధ పోరాటం ప్రారంభం కాక ముందు ఇది బానిస జీవితం. ఈ బానిస జీవితాన్ని గండికొట్టి, దానిపై మొదటి దెబ్బకొట్టి దాన్ని క్రమంగా తొలగించటానికి ప్రయత్నం 1940లో పోరాటం ప్రారంభమైన నాటినుంచే మొదలయ్యింది. ఒకసారి ఆయుధాలు చేపట్టి, సాయుధ పోరాటం ప్రారంభించిన మొదట్లో తాము యజమానులము, తమ ఎదుట ఉన్నవాడు తమతో సమానంగా పోరాడుతున్నవాడు అనే చైతన్యం ప్రజల్లో వచ్చింది. వారు ఆయుధాలు క్రింద పడేసి పట్టణాలకు పరిగెత్తిన తర్వాత వారు బానిసలుగా, ప్రజలే యజమానులుగా భావించుకునే చైతన్యం వచ్చినది. దీని ఆధారంగా వచ్చిన జీవితమంతా కొత్త జీవితం. ఇది కొన్నివేల సంవత్సరాలలో మొదటిసారిగా వచ్చిన కొత్త జీవితం. ఈ జీవితంలో వారు దాడులవల్ల ఇంత నష్టపడ్డా, వ్యవసాయం చేసుకోవటానికి అనేక ఆటంకాలున్నా, ప్రతిగ్రామంలో ప్రతి కుటుంబం కడుపునిండా అన్నం తిన్నారు. వంటినిండా బట్టకట్టారు. అన్నిటికంటే ముఖ్యంగా ఆత్మగౌరవంతో కూడిన చైతన్యయుతమైన కొత్త జీవితాన్ని గడిపారు. 'ప్రజలందరూ సమానులే, భూస్వాములే బానిసలు, తామే యజమానులము' అనే చైతన్యంతో ప్రజలు తలఎత్తుకొని జీవించారు. సమాజంలో సాధారణంగా ఉండే అవలక్షణాలు తమలో లేకుండా తుడిచిపెట్టి, త్యాగశీలత, ఆశయం కోసం పోరాడి సాధించడమనే మంచి లక్షణాలను అలవర్చుకొని, కొత్తసమాజంలో భాగస్వాములుగా, నాయకులుగా, ప్రతినిధులుగా వారు జీవించారు. ఈ జీవితం తర్వాతకాలంలో కొరవడింది. అది వేరే అంశం.

## పోరాట కాలంలో రూపుదాల్చిన జనతా ప్రజాతంత్ర ఆర్థిక, రాజకీయ, మిలటరీ, సాంస్కృతిక వ్యవస్థ

వీటన్నిటినీ పరిశీలిస్తే, సాయుధ పోరాటం గ్రామీణ జీవితంలో, ప్రజల్లో విప్లవాత్మకమైన మార్పు తెచ్చిందని స్పష్టమవుతుంది. దీనితో గ్రామాల్లో కొత్త జీవితం ఏర్పడింది. అదే జనతా ప్రజాతంత్ర జీవితం. ఈ విప్లవం ద్వారానే ఇలాంటి మార్పు వస్తుంది. భూస్వాముల భూమిని పంపకం చేయటం, గ్రామీణ జీవితంలో పేదరికాన్ని నిర్మూలించటం, నిరుద్యోగాన్ని నిర్మూలించటం లాంటి మార్పులను వందలు, వేలు, లక్షల, కోట్ల రూపాయలు ఖర్చు చేసినా, 38 సంవత్సరాలు గడిచినా, నేటికీ కాంగ్రెస్ ప్రభుత్వాలు గానీ, ఇతర పార్టీలకు చెందిన ప్రభుత్వాలు కానీ సాధించలేదు. ఈ మార్పులను ఆనాడు ఒక సంవత్సరం కాలంలో ఈ విప్లవోద్యమం ద్వారా సాధించారు. దీని ద్వారా కొత్త ఆర్థిక వ్యవస్థ ఏర్పడింది. గ్రామరాజ్యాలు ఏర్పడటం ద్వారా కొత్త రాజకీయ వ్యవస్థ ఏర్పడింది. కిరాయి మనుషులకు బదులుగా తమ భూమిని, ఇళ్ళను కాపాడుకోవటానికి ప్రజల బిడ్డలతో ఏర్పడిన గెరిల్లా దళాలతో కొత్త మిలటరీ నిర్మాణం ఏర్పడింది. అంతే కాకుండా స్థానిక దళాలు తమ వ్యవహారాలను తామే చక్కబెట్టుకుంటూ, తామే శాంతి, భద్రతలను పరిరక్షిస్తూ, కొత్త శాంతి, భద్రతల వ్యవస్థ ఏర్పడింది. నూతన ఆర్థిక, రాజకీయ జీవితంతో పాటు కొత్త సాంస్కృతిక జీవితం కూడా ఏర్పడింది దొంగతనాలు లేక పోవటం, అందరూ చదువుకోవటం, వ్యభిచారం లేక పోవటం, విడాకుల హక్కు స్త్రీలనుభవించటం, స్త్రీలు అన్ని రంగాల్లో తమ చైతన్యానికి, నిర్మాణానికి అనుగుణ్యంగా పాల్గొనటం, పాల్గొనేందుకు ముందుకు రావటం, ఇంతే కాకుండా కష్టించి పనిచేయటం, సాయుధ బలాల్లో భాగంగా ఉన్న వారి యెడ ఒక వైఖరి, నిరాయుధులైన శత్రువుల యెడ మరొక వైఖరి- ఈ విధంగా అత్యున్నతమైన సంస్కృతి, నీతి సూత్రాలు ఏర్పడిన దశ అది. నూతన ప్రజాతంత్ర సంస్కృతి అంటే పుస్తకాలలో చదివి నేర్చుకోవలసిందే కాక 1947 సెప్టెంబర్, అక్టోబర్ నుండి మొదలుకొని 1948 సెప్టెంబర్ నాటి వరకు అమలు జరిపిన సంస్కృతి అని గమనించాలి.

ఈ కాలపు చివరి 3-4 నెలల్లో ఈ ఆర్థిక, రాజకీయ, మిలటరీ, సాంస్కృతిక వ్యవస్థకు ఒక స్వరూప మేర్పడింది. ఈ వ్యవస్థ అంతకుముందు రూపొందుతున్న దశలో ఉన్నది. అప్పటికి పోరాట ప్రాంతాలు గెరిల్లా ప్రాంతాల

స్థాయిలోనే ఉండినవి. విముక్తి ప్రాంతం ఏర్పడలేదు. కనుక ఈ వ్యవస్థను సమగ్రంగా రూపొందించటానికి అవకాశం లేకుండినది. అయినా ఆలాంటి నూతన వ్యవస్థ ఆచరణలో ఏర్పడి రూపు దాల్చటానికి చాలా ప్రాముఖ్యత ఉంటుంది.

## 2. ఉద్యమ బలహీనతలు

### పోరాటంలోని బలహీనతలపట్ల రెండు విభిన్న దృక్పథాలు :

ఈ ఉద్యమంలో ఉన్న బలహీనతల గురించి కూడా అర్థం చేసుకోవాలి. ఈ బలహీనతలగురించి రెండురకాల దృక్పథాలు ఇంతకుముందునుండి ఉంటూ వచ్చాయి. పోలీసు చర్య జరగగానే ఈ పోరాటాన్ని ఉపసంహరించాలని అనేవారు. ఉద్యమంలో ముఖ్యాంశంగా ఉన్న విజయాలను తిరస్కార దృష్టితో హేయభావంతో చూస్తారు; లేక వీటిని కనీసంగా తగ్గించటానికి ప్రయత్నం చేస్తారు. 'వాస్తవంలో ఏదో కొంత జరిగింది. చాలా గొప్ప విషయాలే జరిగినవి, వాటిని వీరగాథల్లాగా చెప్పుకోవచ్చును. కాని ఇప్పుడు పోరాటాన్ని విర మిద్దాము; ఎందుకంటే నిలిచేదేమీలేదు. మిగిలిందేమీలేదు, అంతా ఖాళీ అయి పోయింది; ఇళ్ళకు చేరుకుందాము' అనే ధోరణి అప్పుడు వచ్చింది. దీనికొరకు ఈ విజయాలను కనీసానికి తగ్గించి చూపెట్టి, తమ వాదనను బలపరచుకోవటానికి ప్రయత్నం చేశారు, పోలీసుయాక్షను తర్వాత పోరాటాన్ని విరమించాలనే పెద్దలు. పోలీసు యాక్షను జరగటం, పోరాటాన్ని విరమించటం, ఇదంతా జరిగి సుమారు 30–35 సంవత్సరాలు అయింది. ఇప్పుడు పోరాట విజయాలను ఆకాశానికెత్తి చూపెడుతూ, బలహీనతలను తగ్గించి చూపెడుతున్నారు. లేకుంటే బలహీనతలు దాదాపు ఏమీ లేనట్టుగా చూపెట్టుతున్నారు. ఈవిధంగా పోరాటాన్ని ఉపయోగించు కొని, తమ సంస్కరణవాద, పోరాట వ్యతిరేక, విప్లవ వ్యతిరేక అభిప్రాయాలను చలామణి చేసుకోవటానికి ప్రయత్నిస్తున్నారు. మొదటినుండి విప్లవ వ్యతి రేకతను ప్రదర్శించకుండా, విప్లవభావాలను, విప్లవ విజయాలను, విప్ల వోద్యమాన్ని పొగడుతూ, దాని చాటున విప్లవ వ్యతిరేక అభిప్రాయాలను చలామణీ చేసుకోవటం చాలా తేలిక. మార్క్సిస్టు వ్యతిరేక భావాలను మార్క్సిజం పేరుతో ఈ రోజుల్లో చక్కగా చలామణీ చేయవచ్చును. కానీ, మార్క్సిజం వ్యతిరేకత పేరుతో ఆ భావాలు చలామణీలోకి రావటం చాలా కష్టం. ప్రజల్లో, మేధావుల్లో మార్క్సిజం పట్ల అభిమానం చాలా

ఎక్కువగా ఉంది. ఈ పరిస్థితుల్లో మార్క్సిజం పేరుతోనే మార్క్సిస్టు వ్యతిరేక అభిప్రాయాలను చలామణీ చేస్తున్నారు. అదే విధంగా, ఈ రోజుల్లో విప్లవాలన్నా, విప్లవోద్యమాలన్నా ప్రజల్లో, మేధావుల్లో చాలా అభిమానం పెరిగింది. వాటిని నగ్నంగా, సూటిగా వ్యతిరేకిస్తే వీరెవ్వరూ దాన్ని గుర్తించరు. అలాంటివారిని విప్లవ వ్యతిరేకులని కొట్టిపారేస్తారు. వాటిని సూటిగా వ్యతిరేకించకుండా, పొగడుతూనే, విప్లవానికి అభిమానులుగా నటిస్తూనే, విప్లవ వ్యతిరేక అభిప్రాయాలు చలామణీ చేయటం సౌకర్యంగా ఉంటుంది. పూర్వపు విప్లవ వ్యతిరేక భావాలకు, ఈనాటి విప్లవ వ్యతిరేక భావాలకు ఉన్న ఈ మౌలికమైన భేదాన్ని గమనిస్తే విప్లవకారులమని, లేదా విప్లవాన్ని అభిమానించే వారమని చెప్పుకునేవారు చాలామంది ఏ విధంగా విప్లవానికి వ్యతిరేకంగా పనిచేస్తున్నారో, ఏవిధంగా వారి అభిప్రాయాలు విప్లవానికి వ్యతిరేకంగా, మార్క్సిజం-లెనినిజానికి వ్యతిరేకంగా ఉన్నవో మనం స్పష్టంగా అర్థం చేసుకోవచ్చును. ఆ కాలపు విజయాలను విమర్శనా రహితంగా పొగడటం, బలహీనతలున్నాయని చెప్పినా వాటిని నామమాత్రమైనవిగా చెప్పి దాటవేయటం ఈరోజుల్లో సర్వసాధారణంగా జరుగుతున్నది. విప్లవోద్యమాన్ని నిర్మిస్తున్నవారికి ఈ రకంగా దాటివేయటం వలన ఉపయోగముండదు. కాగా నష్టం చేస్తుంది. ఆనాడు చేసిన తప్పులను సరిగా అర్థంచేసుకొంటేనే తిరిగి వాటిని చేయటానికి వీల్లేకుండా ఉంటుంది. అందుకొరకు ఆ తప్పులను నిశితంగా పరిశీలించి, అర్థంచేసుకోవాలి. వాటినుండి గుణపాఠాలు తీసుకోవాలి. తిరిగి ఆ తప్పులు చేయకుండా ఉండటానికి తీసుకోవలసిన చర్యలన్నీ తీసుకోవాలి. అప్పుడే విప్లవోద్యమం సరైన పద్ధతిలో నిర్మాణమై ముందుకు సాగుతుంది. ఈ దృష్టితో చూస్తే ఆ కాలంలో జరిగిన తప్పులు తక్కువేమీకావు, కొద్దివేమీకావు. వాటిని మనం జాగ్రత్తగా పరిశీలించాలి. ఈ దశలో జరిగిన తప్పులలోని కొన్ని అంశాలను ఇక్కడ క్లుప్తంగా చెప్తాము.

## పోరాటం విషయంలో స్పష్టమైన, సరైన రాజకీయ విధానం లోపించుట :

ప్రధాన బలహీనతలు రాజకీయ విధానంలోనూ, మిలటరీ విధానంలోనూ, ఇతరరంగాల్లోనూ కన్పిస్తాయి. ఇవి రూపొందించిన విధానాలలోనూ, అమలు జరిపిన తీరులోనూ కన్పిస్తాయి. ఆ రోజుల్లో ఒక స్పష్టమైన విధానం లేకుండా ఉండటం అన్నిటికంటే ముఖ్యమైన బలహీనత. ఈ కాలంలో, పార్టీలో జోషి

విధానం పోయి, రణదీవె విధానం వచ్చింది. జోషి విధానమున్నా, రణదీవె విధాన మున్నా ఈ పోరాటం విషయంలో గానీ, ఈపోరాటానికి సంబంధించిన నినాదాల విషయంలో గానీ ఒకస్పష్టమైన అవగాహనలేదు. నిజాంసంస్థానం యూనియన్‌లో చేరాలనే నినాదంలోని లోతుపాతులేమిటి ? చేరవద్దనే నినాదంలోని లోతుపాతు లేమిటి ? ఏ వర్గం యొక్క పాలసీలు ఏవిధంగా ఉంటున్నాయి ? వీటికి సంబం ధించిన వివరాలేవీ రూపొందించలేదు. దీనితో భారత యూనియన్‌లో చేరాలని కాంగ్రెసు ఇచ్చిన నినాదానికీ, పార్టీ ఇచ్చిన నినాదానికీ ఉన్న భేదాలేమిటి ? ఏకీభావమేమిటి ? అని మళ్ళీ చర్చనీయాంశమవుతుంది. నిజాం నవాబు చేరనని అంటున్నాడు చేరకపోవటానికీ, చేరటానికీ ఉన్న సంబంధమేమిటి ? ఈ ప్రశ్న లన్నిటిని సమగ్రంగా చర్చించి, క్రింది నాయకత్వానికీ, కేడర్లకూ, ప్రజలకూ ఒక అవగాహన ఇవ్వలేదు.

వర్గసంబంధాలగురించి సంస్కరణవాద, మితవాద పరిశీలన–పార్టీ విధా నంలోని ప్రధానలోపం : పార్టీలోకూడా యూనియన్‌లో చేరాలనే నినాదం గురించి అనేక అభిప్రాయాలుండేవి. భారత బూర్జువా వర్గం జాతీయ బూర్జువా వర్గమనీ, నిజాం నవాబు ఫ్యూడల్ వర్గాలప్రతినిధి అనీ; ఈ బూర్జువా వర్గానికి ఫ్యూడలిజానికి మధ్యన ఉన్న మౌలిక వైరుధ్యంవల్లనే నిజాం చేరనంటున్నాడు, వారు చేరాలంటున్నారనీ; ఈ సంఘర్షణా, పోరాటం అంతా దీని ఫలితంగానే వస్తు న్నదని పార్టీ అభిప్రాయం. దీని ప్రకారం బూర్జువా వర్గంలోకూడా మితవాద వర్గమూ, జాతీయ వర్గమూ ఉన్నది కనుక, మితవాద వర్గప్రతినిధులుగా సర్దారుపటేలు లాంటి వారు నిజాంతో రాజీపడాలంటున్నారు. నెహూ్రు విషయంలో వీరేమీ మాట్లాడరు. వీరి దృష్టిలో నెహూ్రు ఎప్పుడూ అభివృద్ధి కాముకుడుగానే జాతీయ బూర్జువా వర్గం ప్రతినిధిగానే ఉంటాడు. 'నిజాం స్వతంత్రంగా ఉంటే స్వతంత్ర భారత యూనియన్‌కది ప్రమాదంగా ఉంటుంది. అందువలన నిజాం స్వతంత్రంగా ఉండడానికి వీల్లేద'ని కాంగ్రెసు అంటున్నది. వీటిలో ఉన్న సమ స్యలను ఆనాడు పరిశీలించలేదు. ఇప్పుడైనా తెలుసుకోవటం అవసరం. ఆనాడు పార్టీ చెప్పిన అంశాలను పరిశీలించాము. భారత బూర్జువా వర్గానికి ఫ్యూడలిజంతో వైరుధ్యమున్నదని చెప్పారు. అదే వాస్తవమైతే తక్కిన సంస్థానాధీశులు (రాజులు మహారాజులు) యూనియన్‌లో ఎందుకుచేరాలి? వారు ఫ్యూడల్ వర్గాల ప్రతి నిధులే అయినా యూనియన్‌లో చేరారుకదా! నిజాం నవాబు ఒక్కడే ఎందుకు

చేరలేదు? పై అభిప్రాయాలు కలవారెవరూ ఈ ప్రశ్నకు సమాధానం చెప్పలేదు. వాస్తవమేమంటే ఈ సంస్థానాధీశులంతా ఆనాడు బ్రిటిషు వారిమీద ఆధారపడి బతికారు. ఆ తర్వాత వారు యూనియన్ ప్రభుత్వం దయాదాక్షిణ్యాలమీద ఆధారపడి బ్రతుకవలసిందేకాని, తమకుతాముగా నిలబడగలశక్తి వారికెన్నడూ లేదు. వారు స్వతంత్రంగా ఉండగలగటం అసంభవం. మొదట్లో వారు చేరము అని అన్నారంటే, ఏదోవిధంగా కొన్ని అధికారాలో, సౌకర్యాలో రాబట్టుకొని చేరటంకొరకేగాని, తాము స్వతంత్రంగా ఉండగలుగుతామనే దృష్టి వారికి ఏర్పడటంవలన కాదు. ఈ దృష్టితో కొన్నాళ్ళదాకా, కొన్ని సంస్థానాలవారు చేరకుండా ఉన్నారు. మైసూరు సంస్థానం, తిరువాన్కూరు సంస్థానం, ఉత్తర హిందుస్థానంలో కొన్ని పెద్ద సంస్థానాలు ఈవిధంగా చేరకుండా ఉన్నాయి. నిజాంనవాబు యూనియన్‌లో చేరకపోవటానికి, తాను స్వతంత్రంగా ఉంటానని అనగలగటానికి ఆతను ఫ్యూడల్ కావటం కారణమా? లేక ఇతర కారణాలేమైనా ఉన్నాయా? నిజాంనవాబు మొదటినుండీ బ్రిటిషువారికి తాబేదారుగా, ఏజెంటుగా, కీలుబొమ్మగా ఉన్నాడు. ఇప్పుడు బ్రిటిషువారు తొలగిపోయారు. బ్రిటిషు వారితో కాంగ్రెసు రాజీపడ్డది కనుక, వారు తమ పలుకుబడిని ఉపయోగించి తనకు ఏదోఒక విధంగా కొంత స్వతంత్ర ప్రతిపత్తి కల్పిస్తారన్న ఆశతో బ్రిటిషు వారిని ప్రాధేయపడసాగాడు. కొన్ని సౌకర్యాలు తాను సంపాదించి, కొన్ని రాయితీలు (concessions) యూనియన్ ప్రభుత్వానికి కూడా ఇచ్చి, బ్రిటిషు వారి దగ్గర తనకు ఉన్నట్టు కనీసపు, నామమాత్రమైన స్వాతంత్ర్యమైనా పొందాలని నిజాం నవాబు కోరాడు. నిజాం నవాబు సంస్థానం కూడా తమ చేతికిందికి రావాలని కాంగ్రెసు కోరింది. 'బ్రిటిషు సామ్రాజ్యవాదులకు నిజాం ప్రభుత్వం క్రింద హైదరాబాదు సంస్థానంలో దొరికే సౌకర్యాలన్నిటితోబాటు, కావలిస్తే మరికొన్ని సౌకర్యాలను కూడా ఏర్పాటుచేస్తాంకానీ, ఈ సంస్థానాన్ని విడిగా పెట్టటం మంచిదికాదు' అనేది కాంగ్రెసు వైఖరి. సామ్రాజ్యవాదులకు రాయితీలు ఇవ్వటానికి సంబంధించినంతవరకు నిజాం నవాబుకన్నా కాంగ్రెసే ఎక్కువ ఇవ్వగలుగుతుంది. మౌంటుబాటన్‌ను గవర్నరు జనరల్‌గా పెట్టుకున్నతర్వాత దీనికి ఇంకా ఎక్కువ ఆస్కారముంటుంది. ఈవిధంగా బ్రిటిషు సామ్రాజ్యవాదులకు సంబంధించినంతవరకూ ఇద్దరూ సౌకర్యాలు కలిగిస్తారు. కాని నిజాం నవాబుకు నామమాత్రపు స్వతంత్రప్రతిపత్తినైనా ఇవ్వాలా లేదా అనే సమస్య వచ్చినప్పుడు

కాంగ్రెసు వద్దని చెప్పింది. మొదటిదశలో మాత్రం నామమాత్రపు స్వతంత్ర ప్రతిపత్తిని ఒకమేరకు అంగీకరిస్తూ ఒడంబడిక చేసుకోవటానికి కాంగ్రెసువారు సిద్ధంగా ఉండినారు. యథాతథ ఒడంబడికను కుదుర్చుకున్నారంటే నిజాంనవాబు యొక్క నామమాత్రపు స్వతంత్ర ప్రతిపత్తిని అంగీకరించటమే. కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన జరిగే పోరాటం ద్వారా అసలు సంస్థానమే కూలిపోయే పరిస్థితి ఏర్పడటంతో, ఈ స్వతంత్ర ప్రతిపత్తిని అంగీకరిస్తే సంస్థానం భవిష్యత్తు ఎవరిచేతులలో ఉంటుందో అనే ఆందోళన బయలుదేరింది. నిజాం నవాబు తన స్వంత బలంతో ఈ ఉద్యమాన్ని అణచివేయలేకపోవటంతో, కమ్యూనిస్టు ఉద్యమాన్ని చూపి భయపెట్టి నిజాం నవాబును లొంగదీసుకోవటానికి యూనియన్ ప్రభుత్వం ప్రయత్నం చేసింది. 'ఈ ఉద్యమ బలాన్ని చూపెట్టుకొని మీరు నా స్వతంత్ర ప్రతిపత్తిని అంగీకరించటంలేద'ని నిజాంనవాబు వాదన. ఈవిధంగా రెండువైపులా కొన్ని బేరాలు జరిగాయి. 1948 జూన్ నాటికి కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన ఉద్యమం చాలాముందుకుపోవటంతో, అప్పటినుంచి యూనియన్ ప్రభుత్వం సైన్యాలు పంపటానికి సన్నాహాలు చేసింది. సలహా, సంప్రదింపుల ద్వారా యథాతథ ఒడంబడికకు అనుగుణ్యంగా మరే ఒడంబడిక చేసినా విప్లవో ద్యమాన్ని అణచటం సాధ్యంకాదు. ఈ విప్లవోద్యమం హైదరాబాదు సంస్థానం లోని మూడు భాగాలకు (తెలంగాణా, మరత్వాడా, కర్ణాటక ప్రాంతాలు) వ్యాపిస్తే మూడురాష్ట్రాలకు అప్పటికప్పుడు వ్యాపించే ప్రమాదం ఉంటుంది. దీనివల్ల భవిష్యత్తు చాలా ప్రమాదంగా ఉంటుందని భయపడి, వారు ఈ ప్రజాఉద్యమాన్ని అణచటానికి సైన్యాలను పంపించినారు.

ఈ విధంగా లేని వైరుధ్యాలను చూడటం సరైన విధానం కాదు. తప్పుడు విధానం. సంస్కరణవాద విధానం. పార్టీ నాయకత్వం మొదటినుంచీ ఈ విధానాన్ని అనుసరిస్తూవచ్చింది. వ్యవసాయ విప్లవానికి యూనియన్ ప్రభుత్వం ఏవిధంగా విరుద్ధమైనదీ, దాన్ని అణచటానికి సైన్యాలు పంపటానికి ఏ విధంగా సిద్ధమవుతున్నదీ, అర్థంచేసుకొని, దాన్ని ఎదుర్కోవటానికి ముఖ్యంగా పోరాట ప్రాంతాల్లో రాజకీయంగా, మిలటరీ రీత్యా చేసుకోవలసిన మార్పులు, వీటన్నిటి గురించి సంసిద్ధత లేకపోవటానికి ఈ సంస్కరణవాద, మితవాద అవకాశవాద దృక్పథమే కారణం. ఇది పార్టీ పాలసీలో ఉన్న ప్రధాన లోపం. ఇదేవిధంగా కాంగ్రెసు పాత్రను కూడా సరిగా అర్థం చేసుకోలేదు.

నిజాంకి వ్యతిరేకంగా కమ్యూనిస్టు పార్టీ పోరాడుతుంటే ఈ ఉద్యమాన్ని రాజీ బేరాలకు కేంద్రంలోని కాంగ్రెసు ఉపయోగించుకున్నది. మరోవైపున సంస్థానంలో కాంగ్రెసువారు జైళ్ళకువెళ్ళి ఎప్పుడు యూనియన్ ప్రభుత్వంతో రాజీ జరుగుతుందా అని ముందు ఎదురు చూశారు. సైన్యాలు వస్తాయని తర్వాత ఎదురు చూశారు. సైన్యాలు వస్తాయా రావా అన్న సంగతి వారికి తెలిస్తే తెలియవచ్చును. ప్రధానంగా కేంద్రంవైపు ఎదురుచూస్తూ అక్కడినుండి వచ్చే సూచనలమేరకు పనిచేయటం, కేంద్రం రక్షణపై ఆధారపడటం వారిపని. ఇక్కడ వారు చేయగలిగింది ఏమీలేదు. ఉన్నవారందరూ జైళ్ళకు వెళ్ళారు. తక్కినవారు ముందుకు వెళ్ళలేకపోయారు. పార్టీ నాయకత్వాన విప్లవోద్యమం ముందుకు వెళ్తుంటే వారు చేయగలిగేదేమీ లేకుండినది. మరఠ్వాడా. కర్ణాటక ప్రాంతంలో పార్టీ బలహీనంగా ఉండటంవలన, కాంగ్రెసు కొన్నిదాడులు జరిపి అక్కడ ఒక శక్తిగా ఉన్నట్లు, ఆందోళన చేస్తున్నట్లు ప్రదర్శించుకోగలిగింది. తెలంగాణాలో అటువంటి పరిస్థితి లేక, నామరూపాలు లేకుండా మిగిలిపోయారు. వారి భవిష్యత్తు అంతా కేంద్రప్రభుత్వంవారు తీసుకున్న చర్యలపై ఆధారపడి ఉండేది. కాంగ్రెసు పాలసీలు ఈ విధంగా ఉన్నవి. వీటిని సరిగా అర్థం చేసుకోక నెహ్రూ వింగ్ ఒకటున్నదనీ, సర్దారుపటేలు వింగ్ ఒకటున్నదనీ, నెహ్రూవింగ్ అభివృద్ధి కాముకమైనదనీ, సర్దార్ పటేలుది అభివృద్ధి నిరోధకమైనదనీ — ఈ తర్జన భర్జనల్లో, పండిత చర్చల్లో పడి, ప్రజలను వదిలివేసి అప్పటి నాయకత్వం త్రిశంకు స్వర్గంలో ఉండిపోయింది. ఇది ఆనాటి చర్చల సారాంశం.

రాష్ట్రకమిటీ ఇచ్చిన ప్రధాన కార్యక్రమమంతా క్రింది కమిటీల ఒత్తిడి ఫలితమే : ఈ రకంగా సరియైన విధానం లేకపోవటం ఆనాటి ప్రధాన లోపం. అందువలన ప్రజలు చొరవ తీసుకున్నమేరకే పార్టీ నాయకత్వం వహించింది. ప్రజలు చొరవ తీసుకొనని పరిస్థితుల్లో వారు నాయకత్వం అందించలేకపోయారు. ప్రజలు చొరవ తీసుకోవటమంటే అర్థం ఇక్కడ స్థానిక పార్టీ నాయకత్వాన ప్రజలు ముందుకు వచ్చి ఒక కార్యక్రమాన్ని ముందుకు పెట్టారు. దానిని అవును, కాదు, అనటమే గాని పార్టీ నాయకత్వానికి మరోవిధమైన పాత్రలేదు. ఇతర జిల్లాల పరిస్థితి చూస్తే, వరంగల్లు జిల్లాలోని కొన్ని ప్రాంతాల్లో, కరీంనగరు, ఆదిలాబాదు, మెదక్ లాంటి ఇతర ప్రాంతాల్లో

పార్టీ యూనిట్లుండి పనిచేసినా అక్కడ ప్రతిఘటనా ఉద్యమం ముందుకు పోలేదు. వ్యవసాయ విప్లవకార్యక్రమం ముందుకుపోలేదు. ఎందుకంటే నాయకత్వంలో కొందరు అరెస్టయ్యారు. కొందరు చనిపోయారు. ఈ వ్యవసాయ విప్లవ పంథాను ఆధారం చేసుకొని అక్కడ ఉద్యమాన్ని నిర్మించేవారు అంతకుముందు లేరు. తర్వాత లేరు. నల్లగొండ, వరంగల్లు జిల్లాల్లో వ్యవసాయ విప్లవోద్యమాన్ని ముందుకు తీసుకుపోవటంతో భూమి పంపక సమస్యను తీసుకువచ్చింది క్రింది కమిటీలే. క్రింది కమిటీ నాయకత్వాన ప్రజలే. ఎందుకంటే 1946లో కొంత భూమిని పంచారు. అదే వరుసలో భూములు పంచటానికి ప్రతిపాదనను ముందుకు తీసుకువచ్చారు. దానిమీద రాష్ట్రకమిటీలో చర్చ, తర్జన భర్జన జరిగి ఒక నిర్ణయం తీసుకున్నారు. తర్వాతకాలంలో భూమి పంపకంలో సీలింగును తగ్గించాలనే ప్రతిపాదన కూడా క్రిందినుండి వచ్చినదే. ఫలితంగా దానిని కూడా అంగీకరించారు. రాష్ట్రకమిటీ ఇచ్చిన ప్రధాన కార్యక్రమమంతా క్రిందినుంచి వచ్చిన ఒత్తిడి ఫలితంగా రూపొందించినదే. రాష్ట్రకమిటీ భూమిపంపక కార్యక్రమమిచ్చినా, గ్రామరాజ్యాల కార్యక్రమమిచ్చినా ఈ ఒత్తిడి ఫలితంగానే జరిగింది. ఆనాడున్న తప్పుడు అవగాహన వలన నిజాం నవాబు పాత్ర, యూనియన్ ప్రభుత్వం పాత్ర - వీటిపట్ల సరైన అవగాహనలేదు. నూతన ప్రజాతంత్ర విప్లవం విషయంలో ఇంకా స్పష్టమైన అవగాహనలేదు. తర్వాత ఆంధ్ర కమిటీకున్న అవగాహనను క్రింది దాకా తీసుకువెళ్ళటంకానీ, ఆ అవగాహన చర్చలో ఉన్నప్పటికీ, దాని కనుగుణ్యంగా కార్యక్రమాన్ని రూపొందించి అమలు చేయటంకానీ జరుగలేదు ఆ అవగాహనను ముందు పార్టీ కేంద్రంతో అంగీకరింపజేసి, తర్వాత దాన్ని అమలు జరుపాలన్న ఈ ధోరణి పోరాటం నడుస్తున్న కాలంలో చాలా నష్టం కలిగిస్తుంది. నష్టం కలిగించింది కూడా. అలాంటి ధోరణి తప్పు. పార్టీ కేంద్రానికి ఆనాడు సరైన అవగాహనకానీ, విధానంకానీలేదు. ముఖ్యంగా సంస్థానాలన్నిటిగురించి ఇదే పరిస్థితి ఉన్నది.

**నిజాం వ్యతిరేక పోరాటాన్ని ముస్లిం వ్యతిరేకతతో సమానం చేయటం:** ఆనాడున్న రాజకీయ వాతావరణంలో భారతదేశ విభజన (partition) జరిగి, పాకిస్తాను, భారతదేశం రెండుదేశాలుగా ఏర్పడటంతో దేశంలో ముస్లిం వ్యతిరేకత ఉండేది. అది ఈనాటికీ ఉన్నా, ఆనాడెక్కువగా ఉండేది. ఒక సంస్థా

నంలో ఫ్యూడలిజంపట్ల ఉండే వ్యతిరేకతకు, ముస్లిం ఫ్యూడలిజంపట్ల ఉండే వ్యతిరేకతకు రెండింటికీ కొంతభేదం వుంటూవచ్చింది. నిజాంనవాబు ముస్లిం కావటంతో భారతదేశానికి వ్యతిరేకంగా, అతని కుట్రలు, కూహకాలగురించి గోరంతలు కొండంతలుచేసి చెప్పేవారు. స్వతహాగా కాంగ్రెసు ప్రభుత్వం ఎంత బలహీనంగా ఉన్నదో ఇందులో కనిపిస్తుంది. మరోవైపున అతిశయోక్తులు చేసి, చిన్న సమస్యను కూడా పెద్దగా చేసి, ప్రజలదృష్టిని మళ్ళించటానికి కాంగ్రెసువారు ఈ విధంగా చేసినారు. పార్టీ నాయకత్వం దీనితో కొట్టుకుపోయింది. నిజాం నవాబు ఫ్యూడలిజంలోని ఆదోపీడీ విధానాన్ని, నిరంకుశత్వాన్ని చూపెట్టి – ఇదొక ప్రత్యేక సమస్య, తక్కిన సంస్థానాల సమస్యలకూ, దీనికీ సంబంధంలేదని చెప్పే ధోరణి పార్టీలో వచ్చింది. విప్లవోద్యమం ఈ ఒక్కచోటే ఎందుకు ముందుకుపోతున్నది, తక్కినచోట్ల ఎందుకుముందుకు పోవటంలేదనే విషయాన్ని వివరించి చెప్పటానికి ఈవాదనను ముందుకు తెచ్చారేకాని, ఇది వాస్తవాలపై ఆధారపడినదికాదు. ఇక్కడ విప్లవోద్యమం ముందుకు వచ్చిందంటే ఇక్కడి పార్టీ దీనికొరకు చేసిన కృషి ఫలితమే. తక్కినచోట్ల ముందుకుపోలేదంటే అక్కడి పార్టీ దానికొరకు కృషి చేయకపోవటమే కారణం. వాస్తవపరిస్థితి అనుకూలంగాలేక కృషిచేయలేదా? అనుకూలంగా ఉండికూడా కృషి చేయలేదా అంటే, ఉండికూడా కృషిచేయలేదనే చెప్పవలసి వస్తుంది. తెలంగాణాలోని ఇతరజిల్లాల్లో కృషిచేయకపోవటాన్ని దీనికి మనం తార్కాణంగా చూపెట్టవచ్చును. ఈ దృష్టితో చూసినప్పుడు ముస్లిం వ్యతిరేకత, ఫ్యూడల్ వ్యతిరేకత రెండూ కలిసిపోయి, ఫ్యూడల్ వ్యతిరేకత కన్నా ముస్లిం వ్యతిరేకతే పార్టీ నాయకత్వంలో ప్రధానంగా పనిచేసింది. భూస్వాముల భూమిని పంచటాన్ని వ్యతిరేకించటంలో ఈ వ్యతిరేకత పనిచేసింది. ముస్లిం వ్యతిరేకతతో 'హిందూ భూస్వాములు సహజంగా నిజాంకి వ్యతిరేకంగా ఉంటారు కనుక, వారి భూములు పంచకూడద'ని ముందు వారు వాదించారు. వాస్తవానికి హిందూ భూస్వాములలో ఒకవర్గం మొదటినుండీ నిజాంతో కలిసి ఉన్నారు. పింగళి వెంకట్రామరెడ్డి పెద్ద భూస్వామి. నిజాం మంత్రివర్గంలో అతనికి స్థానం ఉండేది. నిజాంతరపున యూనియన్ ప్రభుత్వంతో సంప్రదింపులు జరిపే రాయబార వర్గంలో అతడు సభ్యుడుగా ఉన్నాడు. అదే విధంగా జిల్లాల్లో కూడా హిందూ భూస్వాములు రజాకార్లతో చేరి దాడులుచేయించిన ఉదాహరణలు ఎన్నో ఉన్నాయి. నల్లగొండ జిల్లాలోని హిందువులైన పెద్ద భూస్వాములలో చాలామంది

ఈ రజాకారు దళాలకు నాయకత్వం వహించారు. వీటి వివరాలను ఇంతకుముందే చెప్పాము. ఇతర జిల్లాల్లో కూడా ఈ పరిస్థితి కనిపిస్తుంది. నల్లగొండ జిల్లాలో ఉద్యమం స్థిరంగా ముందుకుపోతున్నది కనుక, తమ ప్రయోజనాలను కాపాడుకోవటానికి హిందూ భూస్వాములు కూడా రజాకారుదళాలను ఏర్పాటుచేసి నగ్నంగా ముందుకువచ్చారు. ఇతర జిల్లాల్లో ఇటువంటి వ్యవసాయ విప్లవోద్యమం లేకపోవటంవల్ల భూస్వాముల ప్రయోజనాలకు అప్పటికప్పుడు ప్రమాదమేమీ కలగకపోవటంతో, వారు నగ్నంగా ముందుకురాలేదు. ఇది భూస్వామ్య వ్యతిరేక ఉద్యమం, ఫ్యూడలిజానికి వ్యతిరేకమైన ఉద్యమమేకాని కేవలం నిజాం వ్యతిరేక ఉద్యమంకాదని ఈ ఉదాహరణలన్నీ తెలియజేస్తాయి. పార్టీ దీన్ని అర్థంచేసుకోవటంలో చాలా వెనుకబడి ఉండేది. నిజాం వ్యతిరేక ఉద్యమమంటే ముస్లిం ఫ్యూడలిజానికి వ్యతిరేకమైన ఉద్యమంగా భావించింది. ఇది తప్పు. కాంగ్రెసుని అనుసరించే భూస్వామ్యవర్గం ఒకటుండేది. అదిగాక నిజాంను అనుసరించే భూస్వామ్య వర్గం మరొకటుంది. ఈ విధంగా రెండుగా చీలిన పరిస్థితిని తప్పుగా వ్యాఖ్యానించారు. కాంగ్రెసును అనుసరించే భూస్వామ్య వర్గంతో మనకు ఐక్య సంఘటన ఉండాలా లేదా అనేది ఆలోచించవలసిన విషయం. వైరుధ్యాలని ఉపయోగించుకోవాలి. పెద్ద భూస్వాములు కాంగ్రెసులో ఉన్నా వారి భూములను కూడా ఏదో ఒక మేరకు పంచటం అవసరమవుతుంది. పంచిన తర్వాతకూడా వారు నిజాంకు వ్యతిరేకంగానే ఉంటే వారు తటస్థులుగా ఉంటారు. లేకుంటే వ్యతిరేకులుగా ఉంటారు. మరో విధంగా ఉండరు. అయితే తర్వాతకాలంలో నిజాం అనుకూల భూస్వాములుకూడా కాంగ్రెసుకు అనుకూలంగా మారి, వారి ఆస్తులను రక్షించుకోవటానికి ప్రయత్నించటం, వారి విషయంలో రాయితీలు ఇవ్వటం ఇవన్నీ జరిగినాయి. అవగాహనలోని లోపం ఫలితంగా వీటన్నింటిలో కొన్ని తప్పులు జరిగాయి. ఈ పెద ధోరణి సంస్కరణ వాదానికి, భూస్వామ్య విధానం తోకపట్టుకుపోవటానికి చాలా దోహదపడింది. దీని ఫలితంగా వ్యవసాయవిప్లవం బలహీనపడింది. పార్టీలో ఉన్న చాలా బలహీనతలకు ఇది కారణమైంది.

**పోరాటంలో హిందూ-ముస్లిం ఐక్యత గురించి అతిశయోక్తులు :**
ఆదేవిధంగా పార్టీ నాయకత్వాన నడిచిన వ్యవసాయ విప్లవోద్యమంలో హిందూ-ముస్లిం ఐక్యత గురించి అతిశయోక్తులు చెప్పటం జరిగింది. కొన్ని ప్రాంతాల్లో, ముఖ్యంగా హుజూరునగరు తాలూకాలో, ముస్లిం వ్యవసాయ కూలీలు హిందూ

వ్యవసాయ కూలీలతో కలిసి పోరాటం సాగించారు. అంతవరకు ఇక్కడ ఐక్యత ప్రదర్శించారు. దీనికి పార్టీ నాయకత్వం వహించింది. అత్యధిక భూస్వాములూ, ధనికరైతులూ హిందువులు కావటం వలన, ముస్లిం వ్యవసాయ కూలీలు వారికి వ్యతిరేకంగా పోరాడటానికి ఈ రజాకారు నాయకత్వానికి అంతగా వ్యతిరేకత లేకుండినది. ఈ భూస్వాములే గనక రజాకార్లలో చేరిఉండే, వారు ఈ పోరాటాలను వ్యతిరేకించేవారు. హిందూ భూస్వాములలో కొందరైనా రజాకార్లతో సంబంధమున్నవారు కనుక, ముస్లిం వ్యవసాయ కూలీలు ఏదో ఒక రకంగా ఈ సమస్యను సామరస్యంగా పరిష్కారం చేసుకోవాలని వారు ప్రయత్నం చేశారు. హుజూరు నగరు తాలూకాలో ఇలాంటి కొన్ని సంఘటనలు జరిగినవి. అంతేకాని రైతాంగం, వ్యవసాయ కూలీలు ముస్లింలుగా ఉన్నచోట వారు ఎక్కడా పెద్ద ఎత్తున తక్కినవారితో కలిసి రాలేదు. పట్టణాల్లో పార్టీ నాయకత్వాన నిర్మించిన ట్రేడ్ యూనియన్ ఉద్యమం, ఇతర ప్రజాతంత్ర ఉద్యమాల్లో చాలా చీలిక వచ్చింది. ముస్లింలలో హెచ్చు భాగం ఇంతవరకు ట్రేడ్ యూనియన్‌లో ఉన్నప్పటికీ, వీరు ప్రభుత్వంతో సహకరించారు. కొందరు మాత్రం తటస్థంగా ఉన్నారు. పార్టీ ప్రభావం వలన ముస్లిములందరినీ సమీకరించటం ప్రభుత్వానికీ, ఖాసింరజ్వీ, ఇత్తెహాదుల్ ముసల్మీన్ నాయకత్వాన ఉన్న రజాకార్లకూ సాధ్యంకాలేదు. ఈ మేరకు వాస్తవికంగా దాన్ని చూపెట్టటం అవసరముండినది. దీనికి భిన్నంగా ఒకటి, రెండు సందర్భాల్లో కనపడిన ఆ ఐక్యతను అతిగా చూపెట్టటం జరుగుతూ వచ్చింది. ఈ ఐక్యతకు చాలా పరిమితులున్నాయి. అదేవిధంగా కాంగ్రెసువాదిగా ఉంటున్న షోయబుల్లాఖాన్ అనే అతనిని హైదరాబాదులో రజాకార్లు చంపివేశారు. కొందరు ముస్లింలు కాంగ్రెసుతో కూడా సంబంధం కలిగి ఉండేవారు. కేంద్రంలో మౌలానా అబుల్‌కలామ్ ఆజాద్ ఉండటం వలన కొన్ని పెద్ద పెద్ద ముస్లిం కుటుంబాల వారు కూడా కాంగ్రెసులో ఉన్నారు. హైదరాబాదులో కూడా కొందరు వారిననుసరించేవారు ఉన్నారు. అయినా అత్యధిక భాగం ముస్లింలు కాంగ్రెసుకు కూడా వ్యతిరేకంగా ఉన్నారని స్పష్టంగా తెలుసుకోవాలి. ముస్లింలు కాంగ్రెసుతో ఉన్న కొన్ని సందర్భాలను ఎక్కువగా అంచనావేసి చూపెట్టకూడదు.

పోరాటం యొక్క వ్యవసాయ విప్లవోద్యమ స్వభావాన్ని తిరస్కరించి, నిజాం వ్యతిరేకతను గోరంతలు కొండంతలు చేయటం: పార్టీలోని మితవాద నాయకత్వం ఈ పోరాటం యొక్క వ్యవసాయ విప్లవ

స్వభావాన్ని పూర్తిగా నిరాకరించింది. ఈ పోరాటం జాతీయ స్వభావం కలదనే పేరుతో కాంగ్రెసుకుండే నిజాం వ్యతిరేకతను గోరంతలు కొండంతలుగా చేసి, వారి రాజీ స్వభావాన్ని తగ్గించి చూపెట్టింది ఈ నాయకత్వం. ముఖ్యంగా తెలంగాణా నాయకత్వంలోని రావినారాయణరెడ్డి ప్రభృతులు ఈ కోవకు చెందినవారు. వారెప్పుడూ ఈ పోరాటం యొక్క వ్యవసాయ విప్లవ స్వభావాన్ని గుర్తించలేదు. భూమి పంపకానికి, ఇలాంటి ఇతర కార్యక్రమాలకు కొందరు ముందుకు వచ్చారు. కనుక, దానినుపయోగించుకోవటం కొరకు ప్రాధాన్యత (highlight) నిస్తున్నారు. కాని దానినొక కార్యక్రమంగా అమలు జరపాలని వారెన్నడూ ప్రయత్నం చేయలేదు. వారి ధోరణికి ప్రాబల్యమున్న భువనగిరి తదితర ప్రాంతాల్లో కార్యక్రమాన్ని అమలుజరిపిన తీరుచూస్తే, భూమి పంపకానికి కనీస ప్రాధాన్యత ఇచ్చినట్లు కన్పిస్తుంది. ఉద్యమంలో మొదటినుంచీ ఈ బలహీనత ఉంటూవచ్చింది. ఎక్కువ జిల్లాల్లో వ్యవసాయ విప్లవోద్యమం పాదుకోక పోవటానికి ఈ బలహీనత ఒక ప్రధాన కారణం.

నిజాం నవాబు ఇచ్చిన 'ఆజాద్ హైదరాబాద్'నినాదం-ఫ్యూడలిజం, బడా బూర్జువా వర్గాల మిలాఖతులో ఒకభాగమే : నిజాం నవాబు ఆజాద్ హైదరాబాద్ నినాదం ఇచ్చి తాను స్వతంత్రంగా ఉంటానని అన్నప్పుడు, అంతర్జాతీయంగా సామ్రాజ్యవాదం బలహీనపడి తనను రక్షించలేని స్థితిలో ఉన్న దని అతను తెలుసుకున్నాడో లేదో కాని, కనీసం పార్టీకైనా అలాంటి అవగాహన ఉండవలసింది. ఆజాద్ హైదరాబాద్ నినాదం ఇవ్వటం, రజాకార్లను ఒక సాయుధశక్తిగా రూపొందించి పని చేయించటం, ఇవన్నీ పూర్వం బ్రిటిషువారు నిజాం నవాబును, అతని సంస్థానాన్ని స్వతంత్రంగా ఉంచటానికి చేసిన పథకంలో ఒక భాగంగానే జరిగినవి. మరోవిధంగా పరిణమించే సరికి దాన్ని కంట్రోలు చేయటం సాధ్యం కాకపోయింది. మరోవిధంగా దాన్ని పరిష్కారం చేయవలసి వచ్చింది. అంతే కాని, ఫ్యూడలిజానికి, బూర్జువా వర్గానికి మధ్యనున్న సంఘర్షణకూ, దానికి ఎలాంటి సంబంధమూ లేదు. ఈ వర్గాల మిలాఖతులో ఒక భాగంగానే ఇది జరిగింది. పార్టీ, విప్లవోద్యమం ముందుకుపోవటంవలన ప్రశాంతంగా జరిగిపోవలసిన ఈ మిలాఖతుకు సైన్యాలను కొంత ప్రయోగించవలసి వచ్చింది. తక్కిన చోట్ల కూడా కొద్దో గొప్పో ఉద్యమం జరిగి తర్వాత ప్రశాంతంగా యూనియన్‌లో చేరిపోయిన సంస్థానాలున్నాయి. ఇక్కడ సైన్యం జోక్యం

కలిగించుకోవటం ద్వారా జరిగింది. ఇవి ఇతర సంస్థానాలకూ, ఈ సంస్థానానికీ ఉన్న భేదం. దీనిని గురించి సరైన అవగాహన ఆనాటికీ, ఈనాటికీ లేదు. మిత వాదులు మితవాద పద్ధతిలోనే దాన్ని వివరిస్తున్నారు. తక్కినవారు మరోవిధంగా వివరిస్తున్నారు.

## భూమి పంపకంలో మితవాద, అతివాద ధోరణులు

కార్యక్రమం మొత్తంగా అమలు జరిపే సందర్భంలో, ముఖ్యంగా భూమి పంపక కార్యక్రమం అన్ని ప్రాంతాలలో ఒకే విధంగా అమలు జరగలేదని ఇదివరకే చూశాము. కొన్ని ప్రాంతాల్లో కార్యక్రమం నిర్ణయించిన మేరకు స్థానిక కార్యకర్తలు, గ్రామరాజ్యాలు, దళాలు నిక్కచ్చిగా అమలు జరిపారు. ఆ మేరకు అది విజయమే. అయితే దీనిని మరికొంత ముందుకు తీసుకువెళ్ళి పట్టు విడుపులు లేని పద్ధతులు అనుసరించిన కొన్ని ప్రాంతాలు కూడా లేకపోలేదు. ఒకవైపున 200 ఎకరాల పరిమితి తగ్గించి, 60 లేక 70 ఎకరాల వరకు భూస్వాములకు అట్టిపెట్టి, తక్కిన భూములను పంచాలనే ప్రయత్నం జరిగింది. దీనిలో పట్టువిడుపులు లేకపోవటం అనేది జరిగింది. పేద రైతాంగం, వ్యవసాయ కూలీల చైతన్యం, ఉద్యమస్థాయి చూడకుండా పంచి పెట్టటానికి ప్రయత్నం జరిగింది. అది సఫలం కాలేదు. మంచి ఫలితాలనుకూడా ఇవ్వలేదు. మరొకవైపు పూర్తిగా భూస్వాముల భూమిని వదిలివేయటం జరిగింది. మితవాద పెడధోరణి అక్కడ ప్రబలంగా ఉంటూవచ్చింది. ఈ భూస్వాములు నిజాం వ్యతిరేకపోరాటంలో పాల్గొంటున్నారుకనుక, ఎన్నివందలు, ఎన్నివేల ఎక రాలు అట్టిపెట్టుకున్నా ముట్టుకోవలసిన అవసరంలేదని వారి భూమిని ముట్టుకో లేదు. దీనిప్రకారం అక్కడక్కడ నిజాంతో కలిసిఉన్న ముస్లిం జాగీరుదార్ల భూమిని (అది బీడు భూమి, సాగులో ఉండదు.) కొన్నిచోట్ల పంపకం చేశారు. దాని ఫలితంగా వ్యవసాయకూలీల్లో, రైతాంగంలో తాము పంచుకున్న భూమిని రక్షించుకోవటం కొరకు పోరాడాలనే చైతన్యం అభివృద్ధి కాలేదు. ఆ మేరకు పోరాటం బలహీనంగానే ఉండిపోయింది. అంతేకాక, నిజాం వ్యతిరేకపోరాటం అనే నినాదం పేరుతో భూమిపంపకం, వ్యవసాయవిప్లవం సమస్య వారు ముందుకు తీసుకురాకపోవటంవలన, రజాకార్లుపోతే తమ కష్టాలు తీరిపోతాయనే అభిప్రాయమే ప్రజల్లో ప్రబలంగా ఉండిపోయింది. దాని ఫలితంగానే యూనియన్ సైన్యాలు వచ్చినప్పుడు ప్రజలు 'రజాకార్లు పోయారు, ఇక తమ కష్టాలు పోయాయి,

సుఖపడవచ్చును. యూనియన్ సైన్యాలు తమను విముక్తి చేయటానికి వచ్చాయి' అనుకొని వారిని ఆహ్వానించటం జరిగింది. పార్టీ, దళాలేకాక ప్రజలు కూడా ఈ మితవాద పెడధోరణి ప్రభావంలో పడటంవలన కాంగ్రెసుమీద భ్రమలు అట్టిపెట్టుకున్నారు. యూనియన్ సైన్యాలు, నెహ్రూ ప్రభుత్వం తమకేదో ఒరగ పెడ్తాయని భావించారు. ఈ విధంగా నాయకులు ప్రజలను పెడమార్గాన పెట్టారు. మరోవైపున 'ఈ యూనియన్ సైన్యాలను ప్రజలు ఆహ్వానిస్తున్నారు. వారిమీద భ్రమలున్నాయ'ని సిద్ధాంతీకరించి పోరాటాన్ని విరమించాలని వీరు ముందుకు వచ్చారు. ఈ విధంగా ఈ కార్యక్రమం అంతటా ఒకే విధంగా అమలు జరుగ లేదని మనకు స్పష్టంగా తెలుస్తున్నది. ఈ మేరకుకూడా అమలుజరుగని ప్రాంతాలు ఇతర జిల్లాల్లో ఉన్నవి. చివరిరోజుల్లో మాత్రమే నల్లగొండ, వరంగల్లు జిల్లాల నుంచి దళాలు ఇతర జిల్లాలకు వెళ్ళి భూమి పంపక కార్యక్రమాన్ని అమలు జరిపినవని మనం గమనించాలి.

## గ్రామ రాజ్యాలు

**స్పష్టమైన మార్గదర్శక సూత్రాలు లోపించుట :** ఇదే విధంగా గ్రామ రాజ్యాలు ఏర్పడి భూమి పంపక కార్యక్రమం రూపొందించి అమలుజరిపినప్పటికీ, ఇతర సమస్యలు వచ్చినప్పుడు వాటిని ఆ గ్రామ రాజ్యాలు ఏవిధంగా పరిష్కారం చేయాలి అనే విషయంలో స్పష్టమైన కార్యక్రమంలేదు. తీర్పులు ఏవిధంగా చెప్పాలనే సమస్య గురించి ఇలాంటి కార్యక్రమం లేకపోవటం వల్ల న్యాయా న్యాయాలు, మంచి చెడ్డలు, ఆనాడు అమలులో ఉన్న సాంప్రదాయాలు, తదితర విషయాలను దృష్టిలో పెట్టుకొని వారు తీర్పులు చెప్పారు. కానీ వీటికవసరమైన రాజకీయ దృక్పథం వారు కన్పరచలేదు. గ్రామ రాజ్యాలు, వాటి కార్యకలాపాల ద్వారా గ్రామంలో ప్రజలమధ్య ఐక్యతను పెంపొందింపజేయటం; వ్యవసాయ కూలీల, పేదరైతుల, మధ్యతరగతి రైతుల చైతన్యాన్ని, సంఘటిత శక్తిని పెంపొందింపచేయటం; వారి ప్రయోజనాలకు భంగం కలుగకుండా వారికి ఉప యోగపడే విధంగా చేయటం— ఈ లక్ష్యాలకు తగిన రాజకీయ దృక్పథంతో తగాదాలను పరిష్కారం చేయవలసి ఉంటుంది. ఉదాహరణకు : గతంలో ధనిక రైతులుగానో, భూస్వాములుగానో ఉన్నప్పుడు కొందరు అప్పులు పెట్టి తీసు కున్న భూమి ఉంటుంది. వారు ఇప్పుడు పేద రైతులుగానో, మధ్య తరగతి

రైతులుగానో ఉంటారు. అయినప్పటికీ తమకు వారి నుంచి అన్యాక్రాంతంగా రావలసిన భూమిని అడిగిన అనేక సందర్భాలున్నాయి. అడిగిన వారు పేద రైతులే కావచ్చును. పెత్తందారులే కావచ్చును. వీటిని పరిష్కారం చేసేటప్పుడు కిందుమీదయ్యేవారు. కొన్ని సందర్భాలలో అలాంటి భూమిని ఇప్పించటం కూడా జరిగింది. మధ్యతరగతి రైతులనుంచీ, ధనిక రైతులనుంచీ రాబట్టుకోవటం తేలిక. అన్యాక్రాంతాలను భూస్వాములనుంచి రాబట్టుకోవటం కష్టం. అందువలన ఎవరు బలహీనులుగా ఉంటే వారి దగ్గర్నుంచి రాబట్టుకోవటానికి ప్రయత్నాలు చేశారు. దానిని ఎదుర్కోవటం చాలా కష్టతరమైనది పార్టీ కొన్ని సందర్భాలలో ఖచ్చితంగా వ్యవహరించి దీనినెదుర్కొని, 'ఐక్య సంఘటన విచ్ఛిన్నమవుతుంది. కనుక పేద, మధ్య తరగతి రైతుల నుంచి భూములను తిరిగి ఇప్పించటం అన్న సమస్య రాదు. తప్పనిసరైతే తప్ప ధనికరైతుల నుంచి కూడా ఇప్పించేది లేదు. అన్యాక్రాంతాలను భూస్వాముల నుంచే తీసుకోవాల'ని నిర్ణయం చేసి ఆపటం జరిగింది. అయినప్పటికీ ప్రజల్లో, ముఖ్యంగా రైతాంగంలో, బలహీనులనుండి వారికున్న హక్కులను రాబట్టుకోవాలనే తహతహ ఎక్కువ. బలవంతులను వదిలి పెట్టటం, లేక వారిని ఎదుర్కొనకుండా ఉండటం అనే ధోరణి బయలుదేరింది.

అదేవిధంగా గ్రామ నాయకత్వంలో ధర్మరాజుల ప్రాబల్యం, పలుకుబడి ఎక్కువయింది. ధర్మరాజుగా ఉండే భూస్వామి, ధర్మరాజుగా ఉండే ధనిక రైతు – వీరికి ప్రాధాన్యత ఎక్కువ ఉంటూ వచ్చింది. వర్గ దృక్పథంతో ప్రజల ప్రయోజనాలకోసం పోరాడే వ్యవసాయ కూలీలు, మధ్యతరగతి రైతుల కుటుంబాలనుండి వచ్చినవారికి మొదట్లో ప్రాధాన్యత తక్కువగా ఉంటూ వచ్చింది. దీనికొరకు చైతన్యయుతంగా కృషిచేసి, భూస్వాములను, పై తరగతి వారిని తగ్గించి వేయ (eliminate) వలసి వచ్చింది. ఈ బలహీనత అన్ని ప్రాంతాల్లో పనిచేస్తూ వచ్చింది.

ఇక్కడ గుర్తించవలసిన విషయమేమంటే ప్రభుత్వానికి కొన్ని చట్టాలు ఉన్నాయి. అవి సామ్రాజ్యవాదాన్ని, ఫ్యూడలిజాన్ని బలపరచటానికి ఏర్పడినవి. ఆ చట్టాలను గ్రామరాజ్యాలు పాటించవలసిన అవసరం లేదు. కానీ వాటికి ప్రత్యామ్నాయంగా వేసే చట్టాలు, కనీసం కొన్ని సూత్రాలను (guidelines) రూపొందించి, వాటి ప్రకారం వచ్చే సమస్యలను పరిష్కారం చేసి తీర్పులు ఇవ్వాలనే నిబంధనలు లేకపోతే, గ్రామరాజ్యాలు తాము ఏవి

సరైనవనుకుంటే వాటినే పాటిస్తాయి. సమస్యలు కొంత చిక్కుగా ఉన్నప్పుడు, లేదా తగాదా పడ్డవారిలో ఏదైనా ఒకపక్షం వారు చేసిన నిర్ణయం సరైనదికాదని అనుకున్నప్పుడు, పైవారికి అప్పీలు చేసుకొని, వారితో పరిష్కారం చేసుకోవటం జరుగుతూవచ్చింది. అనేక సందర్భాలలో వారి నిర్ణయాలే తుది నిర్ణయాలుగా అమలు జరిగాయి. కొంత పలుకుబడి కలిగినవారు, నోరు కలిగినవారు పై నాయకులను కలిసి తమ సమస్యలు చెప్పుకొని గ్రామ కమిటీలోకాకుండా, పైవారు తమ సమస్యలు పరిష్కారం చేసేవిధంగా ఏర్పాటు చేసుకోగలిగేవారు. ఇటువంటి వాటికి అవకాశం ఏర్పడింది. మార్గదర్శక సూత్రాలే ఉంటే దాని ప్రకారం క్రింది కమిటీలలో వాటిని పరిష్కారం చేసుకున్న తర్వాత అప్పీలుగా పైకమిటీల దగ్గరికి రావటం, ఆ విధంగా జరగటం బాగా ఉండేది. అటువంటి దానికి అవకాశమే లేకుండాపోయింది. దీనివలన కొన్ని ప్రమాదాలు కూడా వచ్చేశాయి. పలుకుబడి కలిగినవారు, ముఖ్యంగా భూస్వాములు, డబ్బున్న వారు, నోరుగలవారు ఈ నాయకుల దగ్గరచేరి, వాళ్ళకు కావలసినవి చెప్పి డబ్బుతోగానీ, యితర విధాలుగాగానీ వారిని ప్రలోభాలకు గురిచేసి తమకు అనుకూలమైన తీర్పులు చెప్పించుకున్న ఘటనలు కూడా ఉన్నాయి.

గ్రామరాజ్యాలు దళాలకు అనుబంధంగా మారి నామమాత్రంగా తయారు అయ్యే పెడధోరణి : అనేక సందర్భాల్లో ఈ గ్రామరాజ్యాలు గ్రామ వ్యవహారాలపై తీర్పులిచ్చే కమిటీలుగాకాక, అక్కడి వ్యవహారాలు చూసే కమిటీలుగాకాక, దళం వచ్చినప్పుడు వారికి కావలసిన సరఫరా సౌకర్యాలు, సామాను, భోజనాలు ఇతర సౌకర్యాలు ఏర్పాటు చేసే కమిటీలుగా తయారైనాయి. ప్రజలంతా దళంవైపు చూస్తూ, దళంద్వారా తమతమ సమస్యలు పరిష్కారం చేసుకోవటానికి ప్రయత్నించేవారు. గ్రామరాజ్య కమిటీలు నామమాత్రంగా మారిన ఉదాహరణలుకూడా చాలా ఉన్నాయి. ఇలాంటి బలహీనతలు గ్రామరాజ్య కమిటీలలో ఏర్పడినాయి. ప్రజల్లో దళం మీద ఉండే భ్రమలు, మోజుతోపాటు, ఈ కమిటీలను శక్తివంతమైన, అధికార యుతమైన కమిటీలుగా పని చేయించటానికి పార్టీద్వారా, దళాలద్వారా చేయవలసినంత కృషి చేయలేదు. దళాలమీద మోజు ఏర్పరచుకుంటే దళానికి ప్రాధాన్యత ఏర్పడుతున్నదని, ఆ అధికారం తమకే వస్తుందని, వారు చూసీ చూడకుండా ఊరుకొని, దానిని ప్రత్యక్షంగా, పరోక్షంగా ప్రోత్సహించటం

జరిగింది. ఇది ఈ బలహీనతకు ప్రధాన కారణం. ఇది గ్రామరాజ్యాలతో ఆగకుండా దళ నిర్మాణం, దళానికి సంబంధించిన ఇతర విషయాలన్నింటిలో ప్రవేశించి ఎన్నో అనర్థాలకు దారితీసింది.

**దళాలు**

దళాలు ఏర్పాటు చేసి శిక్షణ ఇచ్చినప్పుడు వారు ఒక ఉన్నతమైన క్రమ శిక్షణ, ఉన్నతమైన నైతిక సూత్రాలు, ఆశయాలకోసం త్యాగం చేయటం, తక్కిన పార్టీ విధానానికి కట్టుబడి ఉండటం, ఇవన్నీ కలిగి ఉంటామని ప్రతిజ్ఞ తీసుకొని, దళాల్లో చేరారు. చాలా మంది దాన్ని చైతన్యయుతంగా, శక్తివంచన లేకుండా పాటించారు. ఆ మేరకు సమస్యేమీ రాలేదు. వాస్తవంగా పోరాటం సరిగా ముందుకు పోయిందంటే ఇలాంటి దళ సభ్యులు, ఇలాంటి దళనాయకుల వల్లనే అది సాధ్యమయింది. దీనితోపాటు కొన్ని అవలక్షణాలు కూడా ఉన్నాయి.

గెరిల్లాపోరాట శిక్షణలో, ఆచరణలో లోపాలు : నాయకత్వానికి ఇచ్చిన గెరిల్లా శిక్షణలోనే కొన్ని లోపాలు ఉన్నాయి. క్యాంపులమీద, పోలీసుస్టేషన్లమీద ఎలా దాడి చేయాలనే విషయాన్ని ఒక ముఖ్యమైన అంశంగా తీసుకొని శిక్షణ ఇచ్చారు. కొన్ని ఇతర అంశాలగురించి కూడా శిక్షణ ఇచ్చారు. కొన్ని భాగాలు ఉపయోగపడేవి ముఖ్యంగా మాటుదాడుల గురించిన శిక్షణ అలాంటిది. రెండవది: స్కైలైను, బోర్డర్సు (borders) ఇవన్నీ చూసుకోవటం, చీకట్లో చప్పుడు కాకుండా నడవటం, క్రమశిక్షణ, వీటికి సంబంధించిన అంశాలన్నీ చాలా ముఖ్యమైనవి. కానీ క్యాంపులమీద దాడి చేయటం మొదటిదశలో సాధ్యం కాదు. అనవసరం కూడా. ఈ దాడులను, ఎత్తుగడలను ఏరకంగా వర్తింపజేసుకోవాలనేది ఆ శిక్షణలో లేదు. ఇదొక టెక్నికల్ శిక్షణ అని చెప్పవచ్చును. ఆమేరకది సరైనదే.

కానీ రాజకీయ నాయకత్వం—అంటే జిల్లా నాయకత్వం, రాష్ట్ర నాయకత్వం—వీటిని అక్కడి పరిస్థితులకు అన్వయింపజేసి, ఎప్పటికప్పుడు ఎత్తుగడలను రూపొందించే కార్యక్రమం తీసుకోలేక పోయింది. ప్రధానంగా స్థానికంగా వచ్చిన అనుభవాలతో వాటిని రూపొందించుకోవలసి వచ్చింది. దీనిలో ఉండే లోపమేమంటే తరచుగా ప్రజలు, కేడర్లు నాయకత్వం యొక్క ఇష్టాయిష్టాలకు లొంగిపోవటం, లేక దానికనుగుణ్యంగా నడుచుకోవటం జరుగుతుంటుంది. కొన్ని సందర్భాలలో ఇష్టాయిష్టాలకు సంబంధం లేకుండా, వాస్తవిక

పరిస్థితులకు అనుగుణ్యంగా ఎత్తుగడలను రూపొందించి, ముందుకు పోవలసి ఉంటుంది. ఉదాహరణకు ఆ దశలో మాటు దాడులు ప్రధానమైన కార్యక్రమంగా ఉండవలసి వస్తుంది. కానీ రజాకార్లు గ్రామాల మీదకు వచ్చినప్పుడు ముఖాముఖి (open warfare) ఎదుర్కోవటం ఒక కార్యక్రమంగా ఆనాడు అభివృద్ధి అయింది. ఇది అనవసరమే కాక, దానివలన గ్రామాల్లో చాలా నష్టాలు కూడా జరిగినవి. రజాకార్లు వచ్చి గ్రామాలను తగులబెట్టిన తర్వాత వారిని ప్రతిఘటించే వారు. స్త్రీలను చెరిచిన తర్వాతనో, కొందరిని చంపిన తర్వాతనో ప్రతిఘటన ప్రారంభమవుతుండేది. దానికి ముందే, వారు రాకుండానే తగిన ఏర్పాట్లుచేయటం, తగిన ప్రతిఘటన సాగించటం, వచ్చిన తర్వాత గ్రామాలు ఖాళీ చేయటం లాంటి పద్ధతులు అనుసరించక, ఈ ముఖాముఖి పద్ధతులను అనుసరించటంపై కేంద్రీక రించేవారు. ఈ విధంగా చేయటానికి అవకాశమిచ్చారు. పైనుంచి కార్యక్రమం లేనప్పుడు అప్పటికప్పుడు దళాలు, పార్టీ స్థానిక నాయకత్వం చేయగలిగింది ఇదే. ఆవిధంగానే చేసేవి. దీనివలన కొన్ని నష్టాలు జరిగినవి.

పోలీసులకు వార్తలు చేరవేసే ఏజెంట్లకు వ్యతిరేకంగా నిఘా తదితర కార్యక్రమం లేకపోవటం: పోలీసులకు వార్తలు చేరవేసే ఏజెంట్ల విష యంలో కూడా ఇదే విధంగా జరిగింది. ఒక దళం నష్టపడిన తర్వాతనో, లేక గ్రామం మీద దాడిచేసి కార్యకర్తలను, ప్రజలను కొందరిని చంపిన తర్వాతనో ఈ పోలీసు ఏజెంటు వెంటపడి అతన్ని చంపటమో, తరిమివేయటమో జరిగేది. ముందునుంచే జాగ్రత్త తీసుకొని గ్రామాల్లో పోలీసు ఏజెంట్లు ఎవరు ? కాని వారెవరు ? వారిమీద ఎలాంటి నిఘా పెట్టించాలి ? వారు సమాచారం ఇవ్వటానికి అనుసరిస్తున్న పద్ధతులు ఏమిటి? వాటిని ఏవిధంగా కనిపెట్టాలి? వారు సమాచారం ఇవ్వటానికి పోయినప్పుడు మనం తీసుకోవలసిన జాగ్రత్తలేమిటి? ఈ విషయా లన్నిటి గురించి స్థానిక నాయకత్వానికి, ఏరియా నాయకత్వానికి లేక జోనల్ నాయకత్వానికి, జిల్లా నాయకత్వానికి తగిన విధంగా తర్ఫీదు ఇవ్వాలి. అటు వంటిదేమీ లేదు, ప్రతిదీ అనుభవంలో నేర్చుకొని దానిని అన్వయించుకోవలసి వచ్చింది.

కంపెనీ దళ నిర్మాణం గురించి మావో చెప్పిన భాగాలను యాంత్రికంగా, పాక్షికంగా అమలు జరుపుట : ఈ సందర్భంలోనే మావో రచించిన గెరిల్లా పోరాట సూత్రాలను అధ్యయనం చేయటం, వాటిని

గురించి చెప్పటం కూడా జరిగేది. ఆయన వ్రాసిన 'జపాను వ్యతిరేక గెరిల్లా యుద్ధంయొక్క కొన్ని అంశాలు' (Some aspects of anti-Japanese) guerilla war) అనే ఒక పుస్తకాన్ని ఆనాడు పీపుల్స్ పబ్లిషింగ్ హౌస్ ప్రకటించింది. ఇందులో దళాల నిర్మాణం, తదితర విషయాల గురించి వివరణ ఉన్నది. కంపెనీ అనే పదం దానిలో ఉన్నది. క్లుప్తంగా అందులోని ముఖ్యమైన భాగాలని తర్జుమాచేసి ఒక పుస్తకాన్ని ప్రకటించారు. దాన్ననుసరించారు. కంపెనీ అనే పదాన్ని, కంపెనీలో ఉండే సంఖ్యను చూసి పెద్ద దళంగా రూపొందించటం జరిగింది. దాని ప్రకారం సుమారు 30, 40, 50 మంది దాకా ఉండటానికి అవకాశముంది. క్రమంగా అది పెరిగిపోయింది. మావో రచనలో గెరిల్లా దళ నిర్మాణానికి సంబంధించిన కొన్ని సూచనలు చేశారు. ఆయన ఒక కంపెనీని ప్రాతిపదికగా తీసుకొని, దాన్లో ఎన్ని ప్లెటూన్లుండాలి, ఒక్కొక్క ప్లెటూన్లో ఎంతమంది సభ్యులుండాలి, ఆ ప్లెటూన్లో ఈ సభ్యులు ఉపయోగించ వలసిన ఆయుధాలు—నాటు ఆయుధాలు, నవీన ఆయుధాలు—ఇలాంటి వివరాలన్నీ అందులో సూచించారు. అదేవిధంగా ఆ ప్లెటూన్లో ఉండవలసిన ఇతర దళాలు, వాటికి సంబంధించిన వివరాలిచ్చారు. ఇవన్నీ ఆనాటి చైనా గెరిల్లా పోరాటస్థాయికి అనుగుణ్యమైనవి. ఇక్కడ చాలా ప్రాథమిక దశలో ఉండి సాగిస్తున్న గెరిల్లా పోరాటంలో ఆస్థాయి దళనిర్మాణానికి అవకాశం ఉండదు. ఆ దృష్టితో ముందు చిన్నదళాలు నిర్మాణం చేసి, ఎక్కువ దళాలు అవసరమైనప్పుడు ఈ చిన్న దళాలన్నిటినీ ఒకచోటుకి చేర్చి, వాటికి తగిన బాధ్యతలప్పగించేవారు. ఈ విధంగా దళాలన్నీ ఒక చోటుకి వచ్చినప్పుడు అది ఒక కంపెనీగానే ఉండి పోతుంది. దాడి పూర్తికాగానే విడిపోవటమనేది ఒక మూల సూత్రంగా ముందే నిర్ణయించి ఈ విధంగా ఏర్పాటు చేయటం జరిగింది. కాని క్రమంగా ఈ చిన్న చిన్న దళాలన్నీ ఒక కంపెనీ దళంగా మారిపోయాయి. ఆ నాటికి గెరిల్లా పోరా టానికి కంపెనీ దళం ఏర్పాటు చేసే స్థాయి లేదు. అంతేకాదు, ఈ కంపెనీదళం ఏర్పాటు చేసినప్పుడు దాని ఆకారం ఇచ్చారేగాని, దాని వివిధ భాగాలను ఏర్పాటు చేయలేదు. విడిపోవటానికి కలవటానికి తగిన ఏర్పాట్లూ చేయలేదు. ఈ విధంగా మావో రచనలను ఆధారం చేసుకొని దళాల నిర్మాణం, దళాలకు శిక్షణ అవన్నీ జరిగినప్పటికీ, కొంత యాంత్రికంగా, పాక్షికంగా అమలు జరిపారు. ఆ మేరకు దుష్ఫలితాలు వచ్చాయి. ఈ లోపాన్ని సరిదిద్దుకొని, తిరిగి పోరాట

స్థాయికి తగినట్టుగా దళాలను పునర్నిర్మాణం చేసి, ముందుకు సాగిపోవటం జరిగింది.

దళాలుబాగా పనిచేసినా, క్రమశిక్షణా, చైతన్యం ప్రదర్శించినా కొన్ని ప్రాంతాలలో, దళాలలో కొన్ని తప్పుడు ధోరణులు ఉంటూ వచ్చాయని ఇది వరకే చెప్పాము. వాటిలో మావో కంపెనీ దళనిర్మాణం గురించి చేసిన సూచనలను యాంత్రికంగా అమలుజరపటం ఒకటి.

దళాల్లో పెత్తందారీతనం : దీనితోపాటు దళాల్లో కొంత పెత్తందారీతనం ఏర్పడింది. రాజకీయ నాయకులకన్నా, గ్రామ రాజ్యాలకన్నా దళాలకు ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చి, వాటికి సర్వాధికారాలను ఏర్పాటుచేయడం ఒక క్రమంలో అభివృద్ధి అయింది. అంటే మిలటరీ బాధ్యతలేగాక రాజకీయ బాధ్యతలు నిర్వహించే కార్యక్రమం దళాలకు వచ్చేసింది. ముఖ్యమైన నాయకులు దళాల్లో ఉండటం, ప్రజలకు దళాలమీద గౌరవం, విశ్వాసం ఉండటం, వీటి ఫలితంగా ఈ పరిణామం వచ్చింది. దీనితో క్రమంగా ప్రజలమీద, గ్రామ నాయకత్వంమీద, స్థానిక దళాలమీద పెత్తనం చలాయించే పద్ధతి దళాలలో ఏర్పడింది. అంతటితో ఆగక దళజీవితంలో కూడా అలాంటిపద్ధతి ఏర్పడింది. దళనాయకులు దళ సభ్యులపైన క్రమశిక్షణను అమలుజరపటం అన్నది ఒకఎత్తు. ఆ క్రమశిక్షణ పేరుతో నిరంకుశత్వాన్ని ప్రదర్శించటం, పెత్తందారీ విధానాన్ని అమలు జరపటం మరొకఎత్తు. కొంతకాలం తర్వాత కొన్నిప్రాంతాల్లో ఈ రెండవపద్ధతి ఏర్పడింది. గ్రామాలలో ఉండే వర్గవిభజన ఫలితంగా భూస్వాములు ప్రజలమీద ఏవిధంగా పెత్తనం చేస్తారో, దళనాయకులు దళంమీద అదేరకమైన పెత్తనం చేస్తూఉండేవారు. దళనాయకులు భూస్వామ్య కుటుంబంనుంచో, ధనిక రైతు కుటుంబంనుంచో వచ్చినవారేకాక, సాధారణ సభ్యులలో నుంచి వచ్చినవారు కూడా ఈ ఫ్యూడల్ పద్ధతిని, ఈ పెత్తందారీ పద్ధతిని అలవరచుకొని అమలు జరుపుతూ ఉండేవారు. తరచుగా పై వర్గాలనుంచి వచ్చినవారే దళనాయకులుగా ఉండేవారు, లేదా మధ్యతరగతి కుటుంబాలనుంచి వచ్చినవారు ఉండేవారు. పేద కుటుంబాలనుండి వచ్చినవారు దళ సభ్యులుగా ఉండేవారు. దళ నాయకుడు పేద కుటుంబాలనుండి వచ్చి, భూస్వాములనుంచో, ధనికరైతులనుంచో వచ్చిన దళ సభ్యులున్నప్పుడు, ఆతని నిర్ణయాలను (command) స్వీకరించి, అమలు జరపటం కొంత అరుదుగా జరిగింది. వర్గపోరాటం, భూమిపంపకం ఇంకా ఉన్నత

దళకువెళ్ళని మొదటిదళలో భూస్వామ్య కుటుంబాలనుంచీ, ధనికరైతు కుటుంబాల నుంచీ దళ నాయకులుగా ఉన్నవారు వచ్చారు. ఆకాలంలో చదువుకున్న విద్యార్థుల నుంచి వచ్చినవారు తరచుగా ఈ కుటుంబాలకు చెందినవారే. ఏ విద్యార్థి అయినా దళంలోకి వచ్చినప్పుడు అతడు కమాండర్ గా ఉండేవాడు. ఇది సర్వసాధారణంగా జరుగుతున్నందువలన పెత్తందారీతనం (commandism) దళాల్లో ప్రవేశించి, దళ జీవితంలో కూడా ప్రవేశించింది. ఇదొక భాగం.

జీవితంలోని ఇతర అంశాల్లోకూడా ఇది ప్రవేశించటం రెండవది. ఉదాహరణకు ఒకదళం గ్రామానికి వచ్చినప్పుడు ఆ గ్రామంలో ఉండే పెత్తందారులో లేక గ్రామ కమిటీ సభ్యులో- తరచుగా పెత్తందార్లు- వారికి టీ చేసి పంపిస్తే, దళనాయకులకొరకు ప్రత్యేకంగా పంచదారతో టీ చేసి పంపించేవారు. దళ సభ్యులకు బెల్లంతో టీ తయారుచేసిపంపించేవారు. ఈ రకంగా అప్పుడు బెల్లం ఎందుకు వాడారంటే యుద్ధకాలంలో పంచదార సరఫరా తగినంతగాలేక, బెల్లాన్ని పెద్ద ఎత్తున టీలోకి ఉపయోగించేవారు. ఆ రకంగా ఉపయోగించటం పోరాటకాలంలో కూడా కొనసాగింది. దళ సభ్యులకు బెల్లంతో టీచేసి, నాయకునికి చక్కెరతో చేసి ప్రత్యేకంగా పంపించేవారు. ఈ హెచ్చుతగ్గులను ఆ రకంగా పాటించటం పెత్తందార్లు అలవాటుచేశారు. దళనాయకులు కూడా దీన్ని నిరాకరించి, అందరికీ ఒకే విధంగా టీ తయారుచేయమని నిర్ణయించి, అమలుజరుపకుండా ఆ పెత్తందార్లు చేసిన ఏర్పాట్లను స్వీకరించి అమలుజరిపారు. దళనాయకులు దీన్ని తమకు ప్రత్యేక గౌరవమనుకోవటంవలన కానీ, క్రమశిక్షణ, చైతన్యం తక్కువ ఉండటం వలనకానీ ఈ రకంగా జరిగింది. ఇది ఒక ఉదాహరణగా చూపెడుతున్నాము. దళ సభ్యుల సంఖ్య ఎక్కువవుతున్నా కొద్దీ ఈ పరిస్థితి మరీ ఎక్కువయ్యేది. దళసభ్యుల సంఖ్య తక్కువ ఉన్నా, మామూలుగా ఈ పరిణామం అమలులోకి వచ్చింది. పెత్తందారీ పద్ధతులు చోటుచేసుకొని, ప్రజల పద్ధతులు, ప్రజలమీద ఆధారపడే పద్ధతులు క్రమంగా తగ్గిపోవటం గురించి మరికొన్ని ఉదాహరణలు చూడవచ్చును.

గ్రామ ఉమ్మడి డబ్బునుంచి దళాలకు సప్లైలు : ముందురోజుల్లో దళం కొద్ది సంఖ్యలో (ఏడుగురు-తొమ్మిదిమంది) ఉన్నప్పుడు ఒక గ్రామానికి వస్తే, దళసభ్యులందరూ రైతుల ఇళ్ళకు విడివిడిగా వెళ్ళి, అక్కడ భోజనం చేసేవారు. కానీ, దళసభ్యుల సంఖ్య ఎక్కువయినందువల్ల కావచ్చును, క్రమంగా

ఈ గ్రామంలో వసూలయ్యే డబ్బు, ధాన్యాన్ని గ్రామనాయకత్వం దగ్గర అట్టిపెట్టుకొని, దళాలు వచ్చినప్పుడు వారికి సప్లయిలు చేయటానికి ఈ ఉమ్మడి డబ్బులోనుంచి ఖర్చు పెట్టేవారు. హుందాగా, బాగా వంటకాలు చేయించి దళానికి సప్లై చేసేవారు. మాంసం, నెయ్యి, కూరగాయలు ఇంకా ఇతర వంటకాలన్నీ తయారుచేసి వారికి ఇస్తుండేవారు. వారు వీటిని స్వీకరించి వెళుతుండే వారు. ఈ రకంగా ఈ గ్రామ సంఘం వసూలు చేసిన డబ్బును గ్రామ బడ్జెటులో ఒక భాగంగా దీనికి ఖర్చులు పెట్టేవారు. తర్వాత దీనికి ఒక కారణం చూపెట్టారు. 'ప్రజలందరూ పేదవారు, వారు భోజనాలు పెట్టలేరు. అలాంటప్పుడు పార్టీ డబ్బుతో వంట చేయించి తినటం సరిగా ఉంటుంది'. ఈ విధంగా ప్రజలు పెట్ట లేరన్న ఒక వాదనను తయారు చేశారు. 'అది సరైనది కాదు. వారు పెట్టిందేదో తింటే ప్రజలు పెట్టడానికి సిద్ధంగా ఉంటారు', అని సూచన చేస్తే, మొదలు వెనుక ముందు చేసినప్పటికీ, తర్వాత అమలు జరిపారు. దీనితో వారి అభిప్రాయం తప్పని తేలింది. ప్రజలు చాలా సంతోషంగా, చాలా ఇష్టంగా ఉన్నంతలో వీరికి పెట్టేవారు. ప్రజలు వెనుకటి పరిస్థితిలో లేరు. భూమి పంపకం, ఇలాంటి కార్య క్రమాల వల్ల ప్రజలు అన్నం పెట్టగలిగిన స్థితిలోకూడా ఉన్నారు. లేనినాడే ప్రజలు తమకు ఉన్నంతలో, తమతోపాటు ఈ దళాలకు, వచ్చిన కార్యకర్తలకు అన్నం పెట్టేవారు. తర్వాత కాలంలో అంత ఇబ్బంది కాలేదు. గ్రామరాజ్యాలు, గ్రామ కమిటీలు వేరే బాధ్యతలన్నింటిని తగ్గించి, వాటి కార్యక్రమాలన్నీ దళాలు హస్తగతం చేసుకున్న తర్వాత, వారికి మిగిలిన కార్యక్రమం ఇదే. ఇది ఒక తప్పుధోరణిగా ప్రవేశించింది. చాలా ఆలస్యంగానే దీనినిసరిచేసుకోవటం జరిగింది. జనగామ పోరాటకాలంలో ఇది ప్రారంభమైంది. దీనిని ఇదివరకే చెప్పాము. దేవరుప్పుల గ్రామంలో సమిష్టి డబ్బు వసూలు చేసి ఆ గ్రామ నాయకుల వద్ద పెట్టి, కార్యకర్తలు వచ్చినప్పుడల్లా భోజనాలు పెట్టి వాటికయిన ఖర్చులను నిర్ణీతమైన రేటు ప్రకారం ఆ డబ్బులోనుంచి తీసుకునేవారు. ఆ రోజుల్లో ఒక్క గ్రామంలో ప్రారంభమై, తర్వాత కాలంలో పెద్ద ఎత్తున అమలు జరిగింది.

**ఆశ్రిత పక్షపాతం :** ఇంతేకాకుండా బంధుప్రీతి లేక ఆశ్రిత పక్షపాతం అనే ధోరణి ఒకటి ఏర్పడింది. గ్రామాల్లో ఉండిపోయిన భూస్వాములు పెత్తందార్లు — వీరు కొంచెం పలుకుబడి కలిగినవారు — దళాలు వచ్చి నప్పుడు వాటిని బాగా ఆశ్రయించి, వాటిద్వారా తమ పనులను

చేయించుకునేవారు. దళాలు కూడా ఆ ప్రయత్నాలను భగ్నంచేయక, వారిపట్ల సామరస్య ధోరణిని అనుసరించాయి. రాజకీయంగా వారికి కొన్ని రాయితీలు ఇవ్వటం ఒక ఎత్తు. దీనికొరకు పార్టీ నిర్ణయమున్నది. దాని ప్రకారం చేయవచ్చును. అంటే 200 ఎకరాలకు మించిన భూమిని పంచి, 200 ఎకరాల వరకు ఆ కుటుంబాలకు అట్టిపెట్టటం పార్టీ రాజకీయ నిర్ణయం. మొత్తంగా పంచాలని పార్టీ నిర్ణయం తీసుకోలేదు. ఆ ఉద్యమ స్థాయిలో అది సాధ్యం కూడా కాదు. అందుకొరకది ఒక ఎత్తుగడ. అది సరైన ఎత్తుగడే. అది రాజకీయమైనది. కాని ఆ క్రమంలో దళాలు తమను ఆశ్రయించిన భూస్వాములకు ఇతర రాయితీలను కల్పించటం, ఈ వచ్చే 200 ఎకరాల విషయంలో కూడా కొన్ని రాయితీలను కల్పించి, ఎక్కువ భూమిని అట్టిపెట్టు కోవటానికి అవకాశమివ్వటం, ఇటువంటి కొన్ని సదుపాయాలు కలుగజేయటం కొంత జరిగింది. ఈ విధంగా పక్షపాతం, ఆశ్రితులను చేరదీసే పద్ధతి ఆనాడు కొంత అమలులోకి వచ్చింది. కొన్ని సందర్భాలలో అవినీతికరమైన పనులుకూడా జరిగినవి. చాలా స్వల్పంగా జరిగినవి.

**పార్టీ కుటుంబాలకు ప్రత్యేక సౌకర్యాలు, వాటి దుర్వినియోగం:**
అదేవిధంగా దళ సభ్యుల కుటుంబాలకు పార్టీ కొన్ని ప్రత్యేక సౌకర్యాలు కల్గించింది. వారు సాధారణంగా గ్రామాల్లో ఉండి, కష్టపడి వ్యవసాయం చేసుకునేవారు కనుక, వారు లేని సందర్భంలో ఆ కుటుంబాలు ఇబ్బంది పడకుండా, వారి వ్యవసాయం మూలపడకుండా నిరాఘాటంగా సాగేవిధంగా ఆ గ్రామరాజ్యం ప్రత్యేక శ్రద్ధ తీసుకోవాలని, సాధారణ రైతుల సహాయంతో వారి పొలాలు, భూములు దున్నించి వ్యవసాయం సాగేట్టు చూడాలని సూచన చేసింది. ఆ ప్రకారం అమలు జరిగింది. భూస్వాములకు, ధనిక రైతులకు ఇలాంటి సౌకర్యం అవసరం లేకుండినది. ఎందుకంటే భూస్వాముల తల్లి దండ్రులతో, ఇతర కుటుంబ సభ్యులతో గ్రామాల్లో ఉండేవారు. భూస్వాముల కుటుంబం నుండి దళ సభ్యుడు వస్తే, వారు భయపడవలసిన అవసరం లేకుండింది. ఏదన్నా భయం ఉంటే వారికి రజాకార్లు, నిజాం ప్రభుత్వం నుండే కాని ఇతరత్రా ఏమీ లేకుండింది. చాలామంది గ్రామాల్లో ఉండిపోయారు. ఆ కుటుంబాలనుంచి దళాలకు సభ్యులు, కార్యకర్తలు రావటంవలన, వారు రజాకార్లనుంచి కొంత ఇబ్బంది పడ్డారు. అయితే వారికి ఇతర

వనరులున్నాయి. పాలేర్లుంటారు. డబ్బుంటుంది. సౌకర్యాలుంటాయి. కానీ, తమ కొడుకులు పార్టీలోకి వెళ్ళారని, లేక దళాల్లో చేరారని తమ వెనుకటి పెత్తందారీ పద్ధతిని, లేక గ్రామ ప్రజలను ఉపయోగించుకునే పద్ధతిని కొత్త రూపాల్లో, పార్టీ పేరుతో మొదలుపెట్టి, కొంతవరకు అమలు జరిపారు. దళ సభ్యులకు ఉండే సౌకర్యాల గురించిన సూచనలను వారు తమకు తామే విస్తరింప జేసుకున్నారు. తెలివిగలవారు, నోరు కలవారు కనుక, వారికి నచ్చచెప్పి ఆ పనులు చేసుకున్నారు. ఆ విధంగా వారి వెనకటి ప్రత్యేకతను, భూస్వాములుగా ఉండే ప్రత్యేకతను ఈ రూపంలో కొనసాగించు కోవటానికి ఉపయోగించారు. ఇది హెచ్చు ప్రాంతాలలో జరిగిందని చెప్పవచ్చును.

**ఆయుధాల విషయంలో ప్రత్యేక సదుపాయాలు :** ఆయుధాల విషయంలో కూడా కొంత ప్రత్యేక సదుపాయాలు (preferential treatment) ఉండేవి. చదువుకున్నవారు, భూస్వాముల, ధనిక రైతుల కుటుంబాలనుంచి వచ్చినతను ఉంటే, అతను ఉపయోగించగలిగినా లేకున్నా ఒక మంచి ఆయుధం అతను తీసుకునేవాడు. తక్కినవారు చూసీ చూడనట్టు ఊరుకునేవారు. అతన్ని ఏమనక పోయేవారు. అదే పేద కుటుంబాలనుంచి వచ్చిన దళసభ్యులు వాటిని బాగా ఉపయోగించ గలిగినప్పటికీ, వారికి అవి ఇవ్వకపోయేవారు. వారికి సాధారణ ఆయుధాలే ఇచ్చేవారు. ఈ విధంగా చేయటంతో దళాల యొక్క పోరాటశక్తి కూడా ఒక మేరకు తగ్గిందని చెప్పాలి. ఇది ఒక అంశం. రెండవది: రాష్ట్ర కేంద్రం నుంచి కొన్ని ఆయుధాలను ఏరియాలకు పంపించారు. ఏ ప్రాంతంలో పోరాటం తీవ్రంగా జరుగుతున్నదీ, అధునాతనమైన ఆయుధాలను సవ్యంగా ఉపయోగించిగలిగిన దళాలు ఏవిధంగా ఉన్నాయి, ఎక్కడ వీటి అవసరం ఎక్కువగా ఉన్నదీ, ఇవన్నీ ఆలోచించి వీటిని పంపలేదు. రాష్ట్రకమిటీకి బాగా తెలిసినవారు, లేక అందుబాటులో ఉన్నవారు, ముఖ్యంగా సరిహద్దు ప్రాంతాల నుంచి దాడులు సాగించే వారు ఈ అధునాతన ఆయుధాలలో ఎక్కువ భాగాన్ని అందుకోగలిగారు. రాష్ట్ర కమిటీ ఆ విధంగా అందించింది. లోతట్టు ప్రాంతంలో భీషణమైన పోరాటం జరుగుతున్నప్పుడు, వారికి ఈ నవీనమైన ఆయుధాలు ఎక్కువ అవసరం. అలాంటి చోట్లకు తక్కువ సంఖ్యలో సప్లైచేశారు. వారు ఇతరత్రా ఆయుధాలను సంపాదించుకోలేక, దాడులు చేసి సంపాదించు కున్నమేరకే వాటిని పొందగలిగారు. అందుబాటులో ఉన్నవారికి ఎప్పుడూ

కొన్ని సౌకర్యాలుంటాయి. అందుబాటులో లేనివారికి ఇబ్బందులుంటాయి. ఇది ఆ కాలంలోనేకాదు, ఇప్పుడు కూడా జరుగుతున్నది. సాయుధ పోరాట కాలంనుండి మొదలై తర్వాత కాలంలోకూడా జరుగుతూ ఉన్నది. హైదరాబాదుకు దగ్గరున్న ప్రాంతాలలో భూమి పంపకం తీవ్రంగా సాగకపోవటం వలన, భూస్వాములతో సన్నిహితంగా ఉన్న అక్కడి పార్టీ నాయకత్వానికి డబ్బులు పెట్టి హైదరాబాదులో ఆయుధాలు కొనటానికి చాలా సౌకర్యం ఉండేది. కాని ఇటు సరిహద్దుకూ, హైదరాబాదుకూ దూరంగా ఉన్న మధ్యప్రాంతంలో ఆయుధాలు కొనుక్కొని తెచ్చుకోవటానికి అవకాశం లేకుండింది. బయటినుంచీ సప్లైలేదు. స్థానికంగా భూస్వాములనుంచి సేకరించిన ఆయుధాలు, నాటు తుపాకులు, ప్రజల్లో కొందరి దగ్గర ఉండే నాటుతుపాకులు, పోలీసులమీద, మిలటరీ మీద చేసిన చిన్నచిన్న దాడుల్లో పెద్దదాడుల్లో వచ్చిన ఆయుధాలు - ఈ ఆయుధాలకే పీరు పరిమితం కావలసి వచ్చింది. కేంద్రంనుంచి కొన్ని ఆయుధాలు వచ్చినా, తక్కువ మోతాదులో వచ్చినవి. తక్కిన ప్రాంతాలకి, ముఖ్యంగా సరిహద్దు ప్రాంతానికి అందుబాటులో ఉన్న ప్రాంతాలకు వచ్చినన్ని రాలేదు. ఇది ఒక ముఖ్యమైన అంశం.

దీనితో వీటిని ఉపయోగించి ఇంకా శక్తివంతంగా పోరాటం సాగించవలసి ఉండినచోట్ల అది సాధ్యంకాలేదు. ప్రజల సహకారం దళాలయొక్క సమర్థత, ఉన్న ఆయుధాలను ఉపయోగించటంవలన ఆ మేరకు బాగానే సాగింది. కాని అదనంగా ఆయుధాలు ఉంటే మరింత ఎక్కువగా సాగేది. ఉదాహరణకు ఆశ్వీక దళాలు వచ్చినవి. వాటిమీద దాడులు సాగించవలసి ఉండినది. వారు చాలా వేగంగా పరిగెత్తుతూ మన దళాలను వెన్నంటి తరిమేవారు, దళాలమీద కాల్పులు కాల్చేవారు. గ్రెడర్‌లాంటి సబ్ మిషన్‌గన్ను అందుబాటులో ఉంటే దీనిని ఉపయోగించి ఆ ప్రాంతాల్లో కాలిస్తే గుండుదెబ్బ తగిలినా, తగలకున్నా ఆ చప్పుడుకు భయపడి గుర్రాలు, ఆశ్వీకదళం మొత్తంగా పరిగెత్తి పొయ్యేవారు. ఒకటి రెండు దెబ్బలతో దాని పరిధిలో (range) ఉన్న గుర్రాలను కాని, సైనికులను కాని చంపటానికి ఉపయోగపడే శక్తివంతమైన ఆయుధం ఇది. దాన్ని ఉపయోగించటానికి అప్పుడవకాశం లేకపోయింది. దగ్గరున్న షాట్‌గన్స్, నాటుతుపాకులు, ఉన్న ఒకటి, రెండు రైఫిళ్ళను ఉపయోగించి, వాటిని తరిమి, వారి పథకాలను భగ్నం చేయవలసివచ్చింది.

అదేపనిగా ప్రచారంకోరే ధోరణి (publicity mania) : బాగా పోరాటాలు జరిగిన ప్రాంతాలవారికి, బాగా శక్తివంతంగా పోరాడి, ప్రాణాలర్పించిన దళాలకు కూడా తగినంత ప్రచారం రాలేదు. వారు పోరాడి చనిపోయిన తర్వాత అక్కడి ప్రజల్లో వారిపట్ల అభిమానం బాగా పాతుకుపోయి, అక్కడ వారి విషయంలో కొన్ని గేయాలు, బుర్రకథలు వ్రాయబడినాయి. ఇటువంటి వాటి ద్వారా వచ్చిన ప్రచారమే కాని, ఇతర విధాలుగా వచ్చినదికాదు. సరిహద్దు ప్రాంతాల్లో దళాలకు కొంత లీగాలిటీ ఉంటుంది. దాడులుచేసి, తిరిగి సరిహద్దు ప్రాంతంలోకి (అంటే సర్కారు జిల్లాల్లోకి, యూనియన్ సరిహద్దుల్లోకి) వస్తే అక్కడ లీగాలిటీ ఉంటుంది. ఫోటోలు తీసి పత్రికల్లో వేయటంద్వారా బాగా ప్రచారం జరిగింది. ఆ మేరకు జరగటంలో తప్పేమీలేదు. చాలా తీవ్రమైన పోరాటం జరిగి, ఎక్కువప్రచారం జరుగవలసిన అవసరం ఉన్న ప్రాంతాల్లో దళాలకు అవసరమైన ప్రచారం లభ్యంకాలేదు. ఒక సంఘటన జరగటం, ఆ సంఘటన జరిగినట్టు రిపోర్టుకేంద్రానికి చేరటం, తర్వాతనే పత్రికలో వేయటం ఇది మామూలు పద్ధతి. అంతకుమించినటువంటిదేమీ లేదు. ముఖ్యంగా లోతట్టు ప్రాంతాల ఏరియా కమిటీలు, అక్కడున్న ఇతర కమిటీలు కేంద్రంతో సంబంధం పెట్టుకోవటానికి ఏర్పాట్లు చేసుకొని రిపోర్టులు పంపేవి. కొంత ఆలస్యంగానైనా చేరి పబ్లిసిటీ దొరికేది. ముఖ్యంగా సరిహద్దుప్రాంతాల్లో ఉన్నదళాలకు ప్రచారదృష్టికొంత ఎక్కువగా ఉండేది. తుపాకులు తీసుకొని దాడులకు వెళ్తున్నప్పుడు ఫోటో తీయటం, మళ్ళీ దాడిచేసి వచ్చినతర్వాత ఫోటోలు తీయటం, ఆ డ్రెస్సులతో, తుపాకులతో ఫోటోతీయటం, అక్కడ ట్రైనింగు జరుగుతున్న సందర్భంలోకూడా ఫోటోలుతీయటం, ఇటువంటివన్నీ జరిగినాయి. ట్రైనింగు జరుగుతున్న అన్ని ప్రాంతాల్లో ఇలాంటి ఫోటోలు తీయలేదు. ఇది ఆనాడు ఉన్నలోపం. దళనాయకుల్లో చదువుకున్నవారిలో కొందరు అదేపనిగా ప్రచారం కోరేవారు (publicity mania).

స్థానిక వలంటీర్లకు తర్ఫీదునిచ్చి అభివృద్ధి చేయకపోవటం : ఇదే విధంగా స్థానిక అవసరాలకు తగినట్టుగా వలంటీర్లను అట్టిపెట్టి, అక్కడి దళాలయొక్క శిక్షణ, రాజకీయస్థాయి అంతాపెంచి, కేంద్ర దళాలకు సహాయంగా ఉండేవిధంగా, కేంద్ర దళాల్లో చేరేవిధంగా వాటిని పెద్ద సంఖ్యలో నిర్మాణం చేయవలసినది. ఈ విధంగా చేయక, కొన్ని కేంద్రదళాలు ఉండటం,

గ్రామస్థాయిలో వలంటీరు దళాలను అట్టిపెట్టడం ఎక్కువ ప్రాంతాల్లో జరుగుతుండేది. దానికి కారణం : గ్రామస్థాయిలో ఇంతో అంతో బాగా పనిచేసేవారు, స్థాయిగలవారు ఉంటే, వారు తమకు అనుబంధంగా ఉంటూ, తాము చెప్పినపనులు చేయటానికి ఎక్కువగా ఉపయోగపడుతారని కేంద్రదళాల నాయకులు భావించేవారు. తరచుగా పై నాయకులు వీరికి ఇదిచెయ్యి, అదిచెయ్యి అని సూచనల (commands) లాగా ఇస్తుండేవారు. రాజకీయంగా తర్ఫీదుచేసి, రాజకీయ స్థాయిని, సిద్ధాంత స్థాయిని, క్రమశిక్షణను పెంచి, వారిలోఉన్న బలహీనతలను పోగొట్టి అభివృద్ధిచేయటానికి చాలా తక్కువగా కృషిచేసేవారు. అందువలన ఈ దళాల రాజకీయస్థాయి మొదటి నుంచి చాలా లోపించి ఉన్నది. అదేవిధంగా ఆర్గనైజర్ల స్థాయి కూడా.

**రాష్ట్ర కేంద్రం నుంచి పంపిన ఆర్గనైజర్లు, మిలటరీ నాయకులు- కొన్ని సమస్యలు :** ఈ కాలంలో రాష్ట్రకేంద్రంనుంచి కొందరిని ఈ పోరాట ప్రాంతాలకు పంపించారు. వారిని పొలిటికల్ ఆర్గనైజర్లుగానూ, మిలటరీ నాయకులుగానూ పంపించారు. ఈ మిలటరీ నాయకులు రాష్ట్రస్థాయిలో ముఖ్య మైన బాధ్యతలు నిర్వహించినవారు. అంటే విద్యార్థి ఉద్యమంలో, యువజనోద్య మంలో నాయకులుగా ఉన్నవారు. కొంతవరకు రాజకీయాలు తెలుసు. రాజకీ యాలు చెప్పగలిగినవారు. పోరాటప్రాంతాలకు వచ్చిన తర్వాత సహజంగా వారు నాయకులనీ, రాజకీయాలు తెలిసినవారనీ, స్థానిక నాయకులున్నప్పటికీ ఆచరణలో వారే నాయకులుగా చలామణీ అయ్యారు. కానీ వారి పాటవం, శక్తి సామర్థ్యాలు, ప్రజల్లో కలిసిపోయే తత్వం, ప్రజల సమస్యలను అర్థంచేసుకో గలిగిన శక్తి చాలా పరిమితంగానే ఉంటూ వచ్చింది. దీనితో ఇక్కడున్న నాయకులూ రాజకీయంగా అభివృద్ధికాలేదు; కేంద్రం పంపించిన వారికీ రాజకీ యాలు తెలిసినా, రాజకీయస్థాయి లోపించి ఉండేది. ఇది మొదటినుంచీ పార్టీ నిర్మాణంలో, గెరిల్లా నిర్మాణంలో బాగా పనిచేస్తూ వచ్చింది. రాజకీయాలు తెలవటం, రాజకీయస్థాయి ఉండటం— ఈ రెండింటికీ ఉన్నభేదాన్ని ఆరోజు పాటించలేదు. దాదాపు ఈరోజు కూడా ఆ పరిస్థితులు ఉంటున్నాయి. అంటే కొందరికి విద్య, విజ్ఞానం వల్ల, పరిసర వాతావరణం వల్ల రాజకీయ విజ్ఞానం ఉంటుంది. చక్కగా ఏ రాజకీయ సమస్యనైనా వివరించగల శక్తి వారికిఉంటుంది. పార్టీ పాలసీకి అనుగుణ్యంగా వారు వివరిస్తూ ఉంటారు. అందువలన వారు దళాల మధ్య ఉన్నా, ప్రజల మధ్య ఉన్నా, ఒక్క ఉపన్యాసం ద్వారా ఆ కట్టుకోగలుగు తారు. కాని ఒక రాజకీయ నిర్ణయం చేయవలసి వచ్చేవరకు వారు తికమకలు

పడటమే కాకుండా ప్రజలను అర్థంచేసుకోలేక అనేక రకాల వ్యాఖ్యానాలు చేసిన సందర్భాలూ; ప్రజల విషయంలో దురభిప్రాయాలు ఏర్పాటు చేసుకున్న సంఘటనలు ఉన్నాయి. ప్రజల్లో ఆయా ప్రాంతాలలో ఉన్న సాంప్రదాయాలు, అలవాట్లను ప్రతికూల దృష్టితో (negative) అర్థం చేసుకునేవారు. ఉదాహరణకు: తెలంగాణాలోని ఎక్కువభాగం వెనకబడిన ప్రాంతం. సరిహద్దు గ్రామాల్లో తప్ప తక్కిన ప్రాంతాల్లో కారం ఎక్కువగా తింటారు. ఈ కారం ఎక్కువ తినటాన్ని గోరంతలు కొండంతలుగా చేసి చెప్పి, దానికి చిలువలు పలువలు అల్లి ఒక భరించరాని కష్టంగా లేక దృశ్యంగా చూపించిన ఘటనలున్నవి. వాస్తవంగా చూస్తే అన్ని ప్రాంతాలలోనూ పేద కుటుంబాల్లో కారం ఎక్కువగా తింటారు. మధ్య తరగతి, పై కుటుంబాల్లో తక్కువగా తింటారు. నూనె ఎక్కువ వాడటం మామూలుగా ఉంటుంది. ఇక్కడ పేద కుటుంబాల్లోనే కాకుండా పై తరగతుల్లో కూడా కారం ఎక్కువ వాడుతుంటారు. ఈ మేరకు వర్గ విభజన తక్కువగానే ఉంటుంది. భూస్వాముల ఇళ్ళలో కారం వాడుతారు, పేదవాళ్ళ ఇళ్ళలో కారం వాడుతారు. ఇక్కడమాత్రం సమానత్వం ఉంటుంది. సెంట్రల్ జిల్లాల్లో (అంటే కృష్ణా, గుంటూరు, ఉభయ గోదావరి జిల్లాలు), పంటలు బాగా పండే ప్రాంతాల్లో ఇలాంటి వర్గవిభజన ఉంటుంది. ఇక్కడున్న సామాజిక పరిస్థితులను దృష్టిలో ఉంచుకొని అర్థం చేసుకోకుండా, దాన్ని చిలువలు పలువలుగా చేసి, ఇక్కడి సంస్కృతి వెనుకబడిన సంస్కృతి అని చూపెట్టటానికి, దాని భీకరరూపాన్ని చూపెట్టటానికి దాన్ని ఉపయోగించేవారు. ప్రజల్లో దాగిఉండి, పోలీసులకు సమాచారం చేరవేసే ఏజెంట్లు ద్రోహం చేస్తే వారిని దళాలు దెబ్బతీసినప్పుడు, వారు గిజ గిజ తన్నుకుంటున్నప్పుడు, లేక అలాంటి ఇతర సందర్భాల గురించి కొందరు నాయకులు పాశవికంగా (sadistic) ఉండే వర్ణనలు చేసి, గోరంతలు కొండంతలు చేసి చెప్పేవారు. అరుదుగా జరిగిన కొన్ని ఘటనలు అటువంటివి ఉంటే ఉండవచ్చును. కానీ సర్వ సామాన్యంగా అటువంటిదేమీ ఉండదు. దళాలు శత్రువులమీద దాడి చేసినప్పుడు ఏ విధంగా దాడి చేయాలో ఆ విధంగానే దాడి చేసేవారు. వారిమీద పాశవిక పద్ధతులు అనుసరించిన ఘటనలు లేనేలేవు, లేక ఉన్నా చాలా అరుదు. వెయ్యికి ఒకటి ఉన్నదో లేదో అని చెప్పవచ్చును. ఒక చిన్న సంఘటన జరిగితే, దాన్ని గోరంతలు కొండంతలు చేసి, ఇతర ప్రాంతాల్లో ప్రచారం చేయటం ఆ వచ్చిన కామ్రేడ్సులో ఒక అవలక్షణంగా తయారైంది. వారు దాన్ని

గొప్పతనంగా భావించేవారు. వారు చదువుకున్నవారు, బాగా రాజకీయాలు వచ్చిన వారని ఈ ప్రాంతపు కార్యకర్తలు సహజంగా వారిని గౌరవించారు. అన్ని విధాలుగా వారితో కలిసి పోవటానికి ప్రయత్నం చేశారు. వారి నాయకత్వాన కూడా పని చేశారు. పనిచేయటానికి ప్రయత్నం చేశారు. సరిహద్దు ప్రాంతాల్లో ఇలాంటి సమస్యలు రాలేదు. సాంఘికంగా కలిసిపోవటానికి అవకాశాలుండటం వలన సహజంగానే కలిసిపోయారు. ఇతర ప్రాంతాల్లో మాత్రం ఇలాంటి సమస్యలు వచ్చినవి.

## పార్టీ నిర్మాణం

సాధారణ నిజాం వ్యతిరేకతను, పార్టీ చైతన్యాన్ని సమానం చేయటం, శిక్షణా విధానం లోపించటం : పార్టీ నిర్మాణంలో కొన్ని ముఖ్యమైన లోపాలే జరిగినవి. సర్వత్రా రాజకీయ శిక్షణ చాలా లోపించిందని చెప్పాము. నిజాం వ్యతిరేకత, పార్టీ చైతన్యం రెంటినీ సమానస్థాయికి తెచ్చారేగాని, విడివిడిగా చూడలేకపోయారు. పార్టీ రాజకీయాలు లేని చదువుకున్నవారు కూడా అతివాద జాతీయ వాదులుగానో, ముస్లిం వ్యతిరేకులుగానో, నిజాం వ్యతిరేకులుగానో ఉండటానికి అవకాశమున్నది. మిలిటెంటుగా పోరాడటానికి కూడా అవకాశమున్నది. పోరాడారు కూడా. పార్టీ సభ్యులుగా ఉన్నటువంటి వారు పార్టీ కార్యక్రమాన్ని తెలుసుకోవటం, పార్టీ చైతన్యాన్ని అలవరచుకోవటం అవసరం. 'ఈ పోరాటం నిజాం వ్యతిరేక పోరాటమేకాదు. తర్వాత కూడా కొనసాగవలసిన పోరాటం' అని అర్థంచేసుకొని దానికి సిద్ధమై ఉండటం – ఇది పార్టీ చైతన్యానికి ఆ రోజుల్లో గీటురాయిగా ఉంటుంది. కానీ అలాంటి చైతన్యాన్ని కలిగించటానికి, అలాంటి శిక్షణ ఇవ్వటానికి ప్రయత్నం దాదాపు జరగనే లేదని చెప్పాలి. సీనియర్ నాయకత్వానికి అంతకుపూర్వమే క్లాసులద్వారా, లేక పార్టీ సాహిత్యం ద్వారా పార్టీ విధానాలు తెలిసినందువలన వారికి కొంతవరకు అవగాహన ఉన్నదేకాని, పోరాటకాలంలో వచ్చిన యువకులకు ఇటువంటి అవగాహనలేదు. ఆ విధంగా కొత్త నాయకత్వానికి అలాంటి రాజకీయ అవగాహన లేకుండా ఉండేది. నిజాం వ్యతిరేకత అంటే నిజాం వ్యతిరేకతే అని అక్షరాలా అమలు జరిపారే గాని, రాజకీయ దృష్టితో దాన్ని అమలు జరిపినది స్వల్పం. ఈ రకంగా రాజకీయ శిక్షణ, రాజకీయ స్థాయిలోపం మొదటినుండే ఒక తీవ్రమైన సమస్యగా ఉండేది. పోరాటకాలంలో కూడా అదే

విధంగా ఉండేది. నిజాం వ్యతిరేక ఐక్యతలో అనేక ఇతర శక్తులు - అతివాద జాతీయవాదులు, జాతీయ విప్లవకారులు, ఇతర శక్తులు కూడా ఉండటానికి అవకాశం ఉంటుంది. వీరితోపాటు పార్టీ చైతన్యం ఉన్న నాయకత్వం, సభ్యత్వం ఉన్నారు. నాయకత్వంలో ఈ రెండు రకాల వారు కలిసి ఉండేది. దీనిలో జాతీయ విప్లవకారులు, ఇతరత్రా ఉన్నవారికి పార్టీ సిద్ధాంతాలను, పార్టీ విధానాలను బాగా వివరించి, నచ్చజెప్పి, నిజాం వ్యతిరేక పోరాటం వ్యవసాయ విప్లవ కార్యక్రమం కోసం పోరాటమనీ, ఈ పోరాటం తర్వాత నెహ్రూ ప్రభుత్వానికి వ్యతిరేకంగా వ్యవసాయ విప్లవ కార్యక్రమంతో సాయుధ పోరాటం సాగించవలసి ఉంటుందనీ, దీనికి సంబంధించిన ఈ రాజకీయ అంశాలను ఆనాటి పార్టీ పాలసీ మేరకైనా వివరించిన పాపాన పోలేదు. ఈ విధంగా చాలామంది నిజాం ప్రభుత్వం పోవటంతో విప్లవం, సాయుధ పోరాటం పూర్తవుతాయనే అవగాహన అస్పష్టంగానైనా కలిగి ఉండటానికి దోహదం చేసింది. ఆనాటి పార్టీ శిక్షణా విధానం వలన, ఆ విధానం అన్నదానికన్నా అది లోపించటంవలన, ఇలాంటి పరిణామాలకు అవకాశం కలిగింది. ఇది తర్వాత కాలంలో చాలా నష్టాన్ని కలిగించింది.

మిలటరీ నాయకత్వం ప్రాబల్యం సంపాదించి, రాజకీయ నాయకత్వాన్ని తగ్గించివేయటం : ఇదేవిధంగా జిల్లా కమిటీలను రద్దుచేసి, ఏరియా కమిటీ నాయకత్వాన్ని ఏర్పాటు చేసినప్పుడు, వాటిలో అక్కడున్న సీనియర్ కామ్రేడ్సుండి, ఆ కమిటీలను నిర్వహించారు. అందులో ఆ ప్రాంతపు మిలటరీ కమాండర్లు ఉన్నచోట పూర్తిగా అవి మిలటరీ నాయకత్వంగా రూపొంది, రాజకీయ భాగాన్ని తగ్గించివేశాయి. లేదా మిలటరీ నాయకత్వం లేకుండా అక్కడున్న సీనియర్ నాయకులతో ఈ కమిటీలు ఏర్పడితే, దళాలే వాటి స్థానాన్ని ఆక్రమించి, కమిటీలను నామమాత్రంగా చేసేశాయి. ఇది ఆ కాలంలో వచ్చిన పరిణామం. ఈ విధంగా పార్టీ—నాయకత్వపు పాత్రను రాష్ట్ర కమిటీ స్థాయిలో అమలు జరిపింది; ఏరియా కమిటీ స్థాయిలో కొంత మేరకు అమలు జరిపింది.

గ్రామస్థాయిలోని పార్టీనిర్మాణం దళాల్లో, గ్రామరాజ్యాల్లో కలిసిపోవటం : క్రమంగా కిందికి పోతున్నకొద్దీ గ్రామాలలో సెల్సు నిర్మాణం చేయటంకోసం ఎన్ని ప్రయత్నాలు చేసినా అవి ఏర్పడలేదు. 1946లో

గ్రామాలలో సెల్స్ ఏర్పాటుచేసి, పార్టీ సభ్యత్వాన్ని తీసుకోవటం జరిగింది. 1947 అక్టోబరులో సాయుధపోరాటం ప్రారంభమైన తర్వాత ఈ సెల్లు, స్థానికపార్టీ నిర్మాణం దళాల్లో, గ్రామరాజ్యాల్లో కలిసిపోయింది. తర్వాత కాలంలో కూడా దళాల్లో పార్టీ యూనిట్ నిర్మాణం ఏర్పాటు చేయాలంటే, అది సాధ్యం కానిపనిగా తయారైంది. ఎందుకంటే కొందరిని పార్టీ సభ్యులుగా చూసి, తక్కిన వారిని పార్టీలో చేర్చుకోకపోవటంవల్ల ప్రత్యేక సమావేశాలు ఏర్పాటు చేయవలసి వస్తుంది. దీనితో ఆ దళ జీవితం విడిపోయి, తక్కిన దళ సభ్యులు 'మేముకూడా పోరాడి చనిపోవటానికి సిద్ధంగా ఉన్నప్పుడు, మమ్ములకూడా పార్టీ సభ్యులుగా ఎందుకు పరిగణించరు' అని డిమాండు చేస్తూ ఉండేవారు. అందువలన సర్వసాధారణంగా విడిగా కాకుండా దళ సభ్యులందరినీ పార్టీ సభ్యులుగానే వ్యవహరించి, వారి సమావేశాలను జరుపుతూ ఉండేవారు. కానీ, దళ సభ్యులందరి పోరాట పటిమ ఒకటిగా ఉన్నా, చైతన్య స్థాయి ఒకటిగా ఉండదు. వ్యక్తిగత జీవితం, రాజకీయ స్థాయి, ఇంకా ఇతర అంశాల్లో తరతమ భేదాలే కాకుండా, కొన్ని మౌలికమైన భేదాలే ఉండేవి. అయితే ఈ భేదాలను, వారిలో ఉండే ఆ బలహీనతలను, పరిమితులను పోగొట్టి త్వరగా వారిని పార్టీ సభ్యత్వంలోకి తీసుకురావటానికి ప్రయత్నం చేయాలి. కానీ అలాంటివి లేకుండానే వారికి ఆటోమాటిక్‌గా, సహజంగా సభ్యత్వ మిచ్చేశారు. దీనితో కొన్ని అవాంఛనీయ పరిణామాలు, స్థాయిలేని, బలహీనత లున్న కామ్రేడ్స్‌కు సభ్యత్వమిస్తే వచ్చే లోపాలన్నీ అక్కడ ప్రత్యక్షమైనాయి. ఇది గ్రామస్థాయిలో సెల్లు నిర్మాణం లేని ఫలితంగా వచ్చిన పరిణామం. అదే విధంగా గ్రామాల్లో స్థానిక పార్టీ కమిటీల సమావేశాలు జరిగినప్పుడు సహజంగా ఇతర మిలిటెంట్లు, ఇతరులూ అంతా వచ్చి కూర్చుని వింటారు. తక్కిన వారికి గ్రామ నాయకత్వం ఏం మాట్లాడుకుంటారో విందామని ఆసక్తి ఉంటుంది. ఇది వెనకబడినతనం వలన వచ్చిన ఆసక్తి గానీ, ప్రత్యేకంగా వారిని అనుమానించ వలసిన అవసరమేమి లేదు. రాజకీయ చర్చలు, ఇలాంటి ఇతర సమస్యలమీద చర్చలు జరిగినప్పుడు వారుండటం వలన నష్టమేమీ ఉండదు. దానివల్ల ఉపయోగమే ఉంటుంది. వీటి ద్వారా సమస్యలు ఏ విధంగా తీసుకొని శ్రద్ధతో పరిశీలిస్తారు అనే విషయాలు ప్రజలు తెలుసుకుంటే గ్రామ నాయకత్వంమీద, పార్టీమీద మరింత విశ్వాసం ఏర్పడటానికి అవకాశముంటుంది. కొన్ని నిర్మాణ

సమస్యలు చర్చించేటప్పుడు జాగ్రత్త పాటించాలి. వారులేని సమయంలో, లేక వారు రావటానికి వీలులేని సమయంచూసి చర్చిస్తే సమస్యలు తేలికగా పరిష్కారమవుతాయి. ఈ విధంగా చేయక కమిటీ నిర్మాణాన్ని, స్థానిక పార్టీ నిర్మాణాన్ని తాత్కాలికంగా వదిలివేయటం జరిగింది. తర్వాత కాలంలో, ముఖ్యంగా పోరాట కాలంలో తమకు సంబంధించని రహస్యాలు తాము తెలుసుకోకూడదనే చైతన్యం ప్రజల్లో పెద్ద ఎత్తున వచ్చింది. అప్పుడు ఎవరూ సమావేశాల్లోకి రావటానికి ప్రయత్నం చేయలేదు. రహస్యాలు తెలుసుకోవటానికి ప్రయత్నం చేయలేదు. ఇదంతా తర్వాత కాలంలో జరిగింది. ముందు కాలంలో ఇది సాధ్యం కాలేదు. ఇది ఆనాటి పార్టీ నిర్మాణంలో ఉన్న మరో లోపం.

ఈ స్థాయిలో దీనివలన వచ్చిన కష్టనష్టాలు చాలా ఉన్నాయి. ప్రజా సంఘాల్లో, దళాల్లో, గ్రామరాజ్యాల్లో ఉండే పార్టీ సభ్యులను విడిగా, ప్రత్యక్షంగా సమావేశపరిచి సూచనలివ్వలేదు. జనరల్‌గా పార్టీకిచ్చే సూచనలే గ్రామ రాజ్యాలకిచ్చే సూచనలుగా, పార్టీకిచ్చే సూచనలే దళాలకిచ్చే సూచనలుగా రూపొందినాయి. ఆ రకంగానే అమలు జరిగింది.

**కార్యకర్తల్లో అవలక్షణాలు పోగొట్టటానికి కృషి, అందులో లోపాలు :** ఈ సందర్భంలో పెద్ద సంఖ్యలో కేడర్లు రావటంవలన, వారు తమ వెంట అనేక అవలక్షణాలను కూడా తెచ్చుకున్నారు. తాగుడు, వ్యభిచారం, అక్కడక్కడా ఇంకా ఇతర చెడు అలవాట్లు కూడా తమతో తెచ్చుకున్నారు. దళ జీవితంలో వాటిని చాలావరకు, నూటికి 90 వంతులు పోగొట్టారు. వారి జీవితంలో కూడా అలాంటిదవసరం. క్రమశిక్షణఉంటే దళంగా ఉంటారు. క్రమశిక్షణ తప్పితే పోలీసు, మిలటరీ దాడుల వలన వారు నష్టపడటమేకాక, ప్రజల్లో కూడా దళాలు, దళ జీవితంమీద విశ్వాసం లేకుండా, గౌరవం లేకుండా పోయే స్థితి ఏర్పడింది. అందువలన క్రమంగా దళాల్లో క్రమశిక్షణ పెరిగింది. అవలక్షణాలు కూడా తగ్గిపోయాయి. చైతన్యయుతంగా ప్రయత్నం చేసిన దానికన్నా, ఎప్పుడు అవకాశముంటే అప్పుడు తిరిగి తలెత్తడానికి వీలుగా, అవసరాల చొప్పున వీటిని మార్చుకునే ధోరణి ఒకటుండేది. ఆ ధోరణి వలన ఆ అవసరం తీరిన తర్వాత మళ్ళీ ఆ బలహీనతలు ప్రత్యక్షమయ్యేవి. ఇవి ఆ రోజుల్లో ఉన్న బలహీనతలలో కొన్ని. ముఖ్యంగా రాజకీయ విధానంలో ఈ లోపాలు ఉండటంతో ఈ బలహీనతలకు అదనంగా బలం ఏర్పడింది.

## ఇతర ప్రజా సంఘాలు

ఇక ప్రజా సంఘాల గురించి చెప్పవలసి వస్తే ,1946లోనే వ్యవసాయ కూలీ సంఘం యొక్క అవసరాన్ని గుర్తించి, వ్యవసాయ కూలీ సమస్యలను తీసుకొని పనిచేశారు. అప్పుడు ప్రత్యేక సంఘమేమీ పెట్టకుండా, గ్రామ కమిటీ స్థాయిలోనే వ్యవసాయ కూలీలకు ఒక కమిటీ ఏర్పాటు చేసి, ఆ కమిటీ ద్వారా వ్యవసాయ కూలీ సమస్యలను పరిష్కారం చేస్తూ ఉండేవారు. ఇది కొంతకాలం జయప్రదంగా అమలు జరిగింది. భూమి పంపకం జరిగిన ప్రాంతాల్లో ఇలాంటి కమిటీలు ఏర్పాటు చేసి, వ్యవసాయ కూలీల పరిస్థితులను చక్కబెట్టటానికి ప్రయత్నం చేశారు. ఆ మేరకు అది చాలా వరకు జయప్రదమైంది. కొన్ని ప్రాంతాల్లో, ముఖ్యంగా వ్యాపారపంటలు పండించే ప్రాంతాల్లో పనిగంటలు కూడా నిర్ణయించి, అమలు జరుపటానికి ప్రయత్నం చేశారు. అక్కడ ఆమేరకు ముందు ధనిక రైతుల వైపునుండి వ్యతిరేకత వచ్చినప్పటికీ, తర్వాత సర్దుకొని వారు దాన్ని అంగీకరించారు పొగాకు, మిర్చి పండే రేగడి ప్రాంతాలలో హెచ్చుగా ఈ పని గంటలు అమలు జరిపారు. తక్కిన ప్రాంతాల్లో పని గంటలు మామూలుగా ఉంటూ కొత్త సౌకర్యాలు, సౌలభ్యాలు కలుగ జేశారు.

అదే విధంగా మహిళా సంఘాలు, యువజన సంఘాలు, బాలసంఘాలు ఇవన్నీ గ్రామరాజ్యానికి అనుబంధంగానే ఏర్పడినాయి. వేరే కేంద్ర సంఘాలుగా, లేక జిల్లా స్థాయి సంఘాలుగా ఏర్పడలేదు. ఈ దాడుల తీవ్రత వలన ఏర్పడ టానికి అవకాశాలు లేకుండినవి. చివరి రోజుల్లో కొన్ని అవకాశాలు ఉన్నా, అప్పుడు ఉద్యమాన్ని విస్తరించే కార్యక్రమంపై కేంద్రీకరించారు. ఇటువంటి ప్రజా సంఘాలను కేంద్ర స్థాయిలో ఏర్పాటు చేసి సంఘటిత పరచే దిశలో కృషి జరుగలేదు. కానీ గ్రామస్థాయిలో భూమి పంపకం తీవ్రంగా జరిగిన అన్ని చోట్లలో ఇతర అనుబంధ సంఘాలు కూడా ఏర్పడి ఉండేవి. ఇవన్నీ గ్రామ రాజ్యానికి లోబడి పనిచేస్తూ ఉండేవి.

# 3. గ్రామరాజ్యాలు – ద్వంద్వ అధికారం

గ్రామరాజ్యాలు ఏర్పడినప్పుడు సిద్ధాంతరీత్యా వాటి స్వభావమేమిటి ? అనే విషయం చర్చనీయాంశం కాకున్నా తర్వాత అది చర్చనీయాంశమయింది. వీటిని గ్రామ సోవియట్లు అనటం, లేక గ్రామాలను విముక్తి చేశారనటం గురించి

ఆనాడు ఒక చర్చ మాత్రం ఉండేదని ఇంతకుముందే చెప్పాము. ఇది మిలటరీ రీత్యా విముక్త ప్రాంతంకాదని, రాజకీయంగానే గ్రామాలలో నిజాం నవాబు అధికారం లేకుండా చేయటం జరిగిందని చెప్పాము. అయితే ఏర్పడిన అధికారం స్వభావమేమిటి ? ఇది ద్వంద్వ అధికారమని (dual power) సిద్ధాంతరీత్యా నిర్వచించవచ్చును. నిజాం నవాబు అధికారం కేంద్రంలో, జిల్లా స్థాయిలో, ఒకమేరకు తాలూకా స్థాయిలో, పట్టణాలలో ఉంది. గ్రామస్థాయిలో మాత్రం హెచ్చు భాగంలేదు. ఆ విధంగా అది పాక్షికమైనదే. ఒక అధికారం రాజధాని హైదరాబాదులోనూ, జిల్లా తాలూకా కేంద్రాలలోనూ నడుస్తున్నది. మరొక అధికారం హెచ్చుభాగం గ్రామాల్లో సాగుతున్నది. కమ్యూనిస్టు పార్టీ, ఆంధ్ర మహాసభ పనిచేయని ప్రాంతాల్లో పటేలు పట్వారీలు కాంగ్రెసులో ఉండి సహాయ నిరాకరణ చేయనంతవరకు పటేలు పట్వారీలు పనిచేస్తున్నారు. చివరి రోజుల్లో, అంతకుముందు తటస్థంగా ఉన్న చాలామంది, ప్రభుత్వానికి సహాయం చేసిన కొంతమందైనా, కాంగ్రెసులో చేరి, వారికి అనుకూలంగా తమ ఉద్యోగాలకు రాజీనామా చేశారు. వారు తమ దగ్గరున్న రికార్డులన్నిటిని ప్రభుత్వానికి వప్పగించేసి, పనిచేయకపోవటంవలన ఆ గ్రామాల్లో కూడా పని స్తంభించిపోయింది. అయితే అక్కడ గ్రామస్థాయిలో ఒకపోటీ ప్రభుత్వాన్ని కాంగ్రెసువారు ఏర్పరచలేకపోయారు. అక్కడక్కడ ఏమైనా ఏర్పరచి ఉంటారేగాని, మొత్తంమీద వారికలాంటి కార్యక్రమమేదీలేదు. కొన్నిచోట్ల ఏర్పరచినట్లుగా ప్రచారం చేసుకున్నారు. ఈ పటేలు పట్వారీలు పనిచేయక పోవటంతో నిజాం నవాబు అధికారం స్తంభించిపోతుంది. కాని ఆయన అధికారానికి పోటీగా గ్రామరాజ్యాన్ని ఏర్పాటుచేసి నిర్వహించనంతవరకూ మరొక అధికారం ఏర్పడినట్టుగా మనం చెప్పలేము. కాంగ్రెసు వారి పరిస్థితి అదే విధంగా ఉండినది.

ఈ విధంగా ఏర్పడిన ద్వంద్వ అధికారంయొక్క స్వభావమేమిటి ? మనకు ఇలాంటి ఉదాహరణ రష్యా విప్లవంలో కనిపిస్తుంది. 1917 ఫిబ్రవరి విప్లవం ద్వారా జారు ప్రభుత్వం కూలదోయబడి, ఒక తాత్కాలిక ప్రభుత్వం (Provisional Government) చేతిలోకి కేంద్ర అధికారం వచ్చింది. మరో వైపున సాయుధ కార్మికుల, సైనికుల, కర్షకుల అధికార కేంద్రాలైన సోవియట్లు ఏర్పడినవి. ఇవి 1905లో ఏర్పడిన సోవియట్ల లాంటివే. కార్మిక కేంద్రాలైన

పట్టణాలలోనేకాక, గ్రామస్థాయిలోకూడా ఈ సోవియట్లు ఏర్పడినవి. ఈ పరిస్థితిని లెనిన్ ద్వంద్వ ప్రభుత్వమని అన్నాడు. ఈ సోవియట్లలో కొన్ని మెన్షివిక్కుల చేతుల్లో, కొన్ని బోల్షివిక్కుల చేతుల్లో ఉండినవి. శ్రామికవర్గం చేతుల్లో సోవియట్లు ఉండటం, బూర్జువా భూస్వామ్య ప్రభుత్వం చేతుల్లో కేంద్ర అధికారం ఉండటం వలన వచ్చిన సమస్యలను లెనిన్ చర్చించాడు. అయితే ఈ పరిణామం ఫిబ్రవరి విప్లవం - అక్టోబరు విప్లవం మధ్యకాలంలో జరిగింది. ఇది జరిగిన కొద్ది కాలానికే అక్కడ మరొక విప్లవం వచ్చింది. అదే అక్టోబరు విప్లవం. ఆనాటికి సోవియట్లలో బోల్షివిక్కులు మెజారిటీ కూడా సంపాదించుకోగలిగారు. కేంద్ర అధికారాన్ని హస్తగతం చేసుకున్నారు. ఈ విధంగా ద్వంద్వ అధికారం ఒకే అధికారంగా మారిపోయింది. రెండు విప్లవాల మధ్యకాలంలో, సుమారు 8-10 నెలలకాలంలో అధికారం మారిపోయింది. ఇక్కడ అలాంటి పరిస్థితి లేదు. ఈ గ్రామ సోవియట్లు సుదీర్ఘకాలం కొనసాగాయి. ఇవి ఏర్పడిన తర్వాత పోలీసు యాక్షన్‌వరకు చూసుకుంటే సుమారు ఆరు నెలలపాటు కొనసాగినట్టుగా మనం భావించవచ్చును. పోలీసు యాక్షను తర్వాత కొన్ని పరిణామాలు వచ్చాయి. అయితే ఈ ఆరునెలల పాటు కొనసాగిన ఈ గ్రామ సోవియట్లను మనం తాత్కాలికంగా వచ్చినవిగా భావించకూడదు. సుదీర్ఘకాల సాయుధ పోరాట దృష్టితో ఆలోచించినప్పుడు ఈ ద్వంద్వ అధికారం గెరిల్లా పోరాట క్రమంలో ఏర్పడుతుంది. సుదీర్ఘకాలం కొనసాగుతుంది. తర్వాత పట్టణాలను గెరిల్లాలు స్వాధీనం చేసుకునే సందర్భంలో ఏకీకృతమైన పరిపాలన క్రిందికి ఇవన్నీ వస్తాయి.

ఇక్కడ మనకు తిరిగి ఆదే సిద్ధాంత సమస్య ఎదురవుతుంది. కార్మిక వర్గ సాయుధ తిరుగుబాటు జరుగకుండానే ఈ పరిణామం వచ్చింది. కార్మిక వర్గం సాధారణంగా పార్టీ నాయకత్వాన ఉంటూ, సానుభూతిగా ఉన్నప్పటికీ, వారిలో కొందరు, ముఖ్యంగా ముస్లింలు, ఇత్తెహాదుల్ ముసల్మీన్‌వారి ప్రభావంలో ఉండేవారు. మరొకవైపున పార్టీమీద విశ్వాసంఉండేది. అందుకొరకు కొంత ఊగిసలాట ప్రదర్శించారు. ఒకభాగం మాత్రం రజాకార్లవైపునే చేరి పోయారు. ఒకభాగం తటస్థంగా ఉండిందని చెప్పవచ్చును. ఏదెట్లున్నా పట్టణాల్లో ఉన్న కార్మికవర్గం కార్యరంగంలోకి (action) రాలేదు. అయినా రైతాంగం పోరాటంలో ముందుకువచ్చింది. ఆయుధాలు తీసుకుంది. అక్కడ కార్మికవర్గం

పోరాటంలోకిరాలేదు. కాబట్టి రైతాంగం ఆయుధాలు తీసుకోవటం తప్పని వాదించేవారు స్వయంగా తప్పుచేస్తున్నారు. ఎందుకంటే కార్మికవర్గంలో తగిన చైతన్యం రాకముందు రైతాంగంలో చైతన్యంవస్తే, ఆ చైతన్యాన్ని కాదనే సమస్య రాకూడదు. ముఖ్యంగా పార్టీ నాయకత్వాన రైతాంగం సాయుధపోరాటం సాగిస్తున్నప్పుడు, భూమిపంపకం సాగిస్తున్నప్పుడు కార్మికవర్గ పోరాటంలోకి రాకపోతే చేయవలసింది — కార్మికవర్గాన్ని పోరాటంలోకి తీసుకురావటంకాని, రైతాంగాన్ని వెనకపట్టు పట్టించటంకాదు. అందువలన ఆ విధంగా చెప్పేవారి దృక్పథంకూడా తప్పే. సిద్ధాంతరీత్యా కూడా ఇది తప్పే అవుతుంది. రష్యాలో అలా జరిగితే తెలంగాణాలో, భారతదేశంలో అదేవిధంగా జరగాలని లేదు. అదేవిధంగా చైనా సమస్యకూడా. చైనాలో కార్మికవర్గసాయుధ తిరుగుబాటు వచ్చింది. అది విఫలమయింది. అయితే ఆ సందర్భంలో కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన కొంత సైన్యముండేది. ఆ సైన్యాన్ని తీసుకొని నాయకత్వం గ్రామీణ ప్రాంతాలకువెళ్ళి, చాంగ్ కై షేక్ దురాగతాలని, వారిసైన్యాన్ని ఎదుర్కొని అక్కడ విముక్తి స్థావరాలని ఏర్పాటుచేసుకొని పట్టణాలను విముక్తిచేశారు. అక్కడ భారతదేశంలో సాయుధ తిరుగుబాటు లేకుండానే రైతాంగం సాయుధపోరాటానికి ముందుకు వచ్చింది. ఇంకా భారతదేశ దృష్టితో చూస్తే 1946లో కొంతవరకూ సైనికుల్లో వచ్చిన తిరుగుబాటునుకూడా గమనించవచ్చును. అయితే అది దేశవ్యాప్తంగా వచ్చినదికాదు. దాని ప్రభావం మాత్రం అంతటా ఉంటూ వచ్చింది. కార్మికులు 1946—'47లో జనరల్ సమ్మెచేశారు. అయినా భారతదేశంలో సాయుధ తిరుగుబాటు మాత్రం చేయలేదు. అంతకుముందే, 1946 నాటికే, తెలంగాణాలో రైతాంగం ఆయుధాలు తీసుకున్న విషయం అందరికీ తెలిసిందే. అదేవిధంగా ఇతర రాష్ట్రాల్లో కూడా రైతాంగపోరాటాలు ఉన్నతస్థాయికి చేరుకున్నాయి. కానీ అక్కడ రైతాంగం ఆయుధాలు తీసుకోలేదు. పార్టీ అలాంటి పోరాటానికి నాయకత్వం వహించలేక తాను వెనక్కు తగ్గింది. రైతాంగాన్ని వెనక్కు తగ్గించింది. అందువలన సిద్ధాంతరీత్యా 'కార్మికవర్గం సాయుధతిరుగుబాటు చేయకముందు రైతాంగం ఆయుధాలు తీసుకోవటం, పోరాటాలుచేయటం తప్పు, చేసినా అది నిలువదు' అనే సిద్ధాంతంకూడా తప్పే. పార్టీ నాయకత్వం వహిస్తున్నంత వరకూ రైతాంగ పోరాటం కూడా నిలుస్తుంది. మనగలుగుతుంది. ముందుకు పోగలుగుతుంది. తెలంగాణాలో అలాంటిపోరాటం సాగింది. ముందుకుపోయింది కూడా[40].

# 4. పోలీసు చర్యకు దారితీసిన రాజకీయ పరిణామాలు

బ్రిటిషువారి ద్వారా నిజాం నవాబు, యూనియన్ ప్రభుత్వం మధ్య జరిగిన సంప్రదింపులు : ఇక నిజాము కాంగ్రెసు నాయకత్వం చేస్తున్న పనులు, వారిమధ్య జరుగుతున్న వ్యవహారాలను పరిశీలించటం ఉచితంగా ఉంటుంది. బ్రిటిష ప్రభుత్వంద్వారా కాంగ్రెసుతో రాజీపడటానికి ఆనాడు నిజాం చేసిన ప్రయత్నాలు కొన్ని తర్వాత కాలంలో బయటపడ్డాయి. ఆనాటికి తెలిసిన విషయమేమిటంటే నిజాం నవాబు ఒక మంత్రి వర్గాన్ని ఏర్పాటుచేసి, అందులో హిందూ మంత్రులను కూడా చేర్చుకున్నాడు. వారిలో పింగళి వెంకట్రామారెడ్డి అనే పెద్ద భూస్వామికూడా ఉన్నాడు. అతను నిజాం నవాబుకు నమ్మిన బంటు. హిందువుకావటం, ఆంధ్రుడు కావటంవలన కాంగ్రెసు ప్రభుత్వానికి కూడా కొంత అంగీకారంగా ఉంటాడని ఆయనను చేర్చారు. యూనియన్ ప్రభుత్వంతో సంప్రదింపులు జరపటంకొరకు ఒక ప్రతినిధివర్గం ఉండేది. అందులో ఆయన కూడా ఉంటూ ఢిల్లీ, హైదరాబాదు మధ్యన ఈ ప్రతినిధివర్గం వస్తూ వెళుతూ, సంప్రదింపులు కొనసాగించింది. ఇది ఒకవైపున సాగిస్తూనే బ్రిటిష్ ప్రభుత్వ ఏజెంట్లద్వారా కాంగ్రెసు ప్రభుత్వంతో మంతనాలు జరిపి, సాధ్యమైనంత స్వాతంత్ర్యాన్ని, అదనపు సౌకర్యాలను యూనియన్ ప్రభుత్వంనుంచి పొందటానికి నిజాం నవాబు ప్రయత్నించాడు. దీని వివరాలు తర్వాత వివిధ సందర్భాల్లో బయటపడినాయి. ఫ్రీడమ్ ఎట్ మిడ్‌నైట్[41] (Freedom at Midnight) అనే ఇంగ్లీషు పుస్తకంలో నిజాం నవాబు చేసిన మంతనాల గురించి ఉదహరించారు. ఏదోవిధంగా తన స్వాతంత్ర్యాన్ని ఒక మేరకైనా నిలబెట్టమని, యూనియన్ ప్రభుత్వాన్ని ఒప్పించమని బ్రిటిషు ప్రభుత్వంతో నిజాం నవాబు ప్రాధేయపడిన కొన్ని విషయాలను అందులో ఉదహరించారు. బ్రిటిషు ప్రభుత్వం కూడా దానికొరకు ప్రయత్నం చేస్తూ వచ్చింది.

కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన విప్లవోద్యమం ముందుకు పోవటాన్ని చూసి, యూనియన్‌లో చేరమని నిజాంకు సలహా ఇచ్చిన బ్రిటిషు సామ్రాజ్య వాదులు : ఇక్కడ గమనించ వలసిందేమంటే పాకిస్తాన్, ఇండియాలను రెండుగా విభజించిన తర్వాత పాకిస్తాన్ మీద కూడా

బ్రిటీషు ఆధిపత్యం ఉన్నదీ. కాశ్మీరులోకి సైన్యాన్ని నడిపినవారు బ్రిటీషు సేనానులే. రెండో వైపున ఇటు భారతదేశంలో కూడా లార్డు మౌంటు బాటన్ (ఇంతకు ముందు ఆయన వైస్రాయిగా ఉన్నాడు) గవర్నరు జనరల్‌గా ఉన్నాడు. అటు పాకిస్తానుకు జిన్నా గవర్నరు జనరల్‌గా ఉన్నాడు. కానీ సైన్యాధిపతులు మాత్రం ఇంగ్లీషువారే. మౌంటు బాటన్ ద్వారా భారత సైన్యాధిపతులు కూడా ఇంగ్లీషువారే ఉన్నారు. అప్పుడు యూనియన్ ప్రభుత్వం ద్వారా దాన్ని చీల్చటం కొరకు[42] చేసిన ప్రయత్నాలన్నీ చూస్తే, బ్రిటీషువారు హైదరాబాదు సంస్థానం స్వతంత్రంగా ఉండలేదని భావించి యూనియన్‌లో కలవటమే మంచిదని నిజాం నవాబుకు సలహా ఇచ్చారని స్పష్టమౌతుంది. అంటే సంస్థానం స్వతంత్రంగా ఉండగలిగితే తమ పలుకు బడిని ఉపయోగించి, స్వతంత్రంగా ఉంచటానికి ప్రయత్నం చేసే వారన్నమాట. ఆనాటి నెహ్రూ ప్రభుత్వాన్ని కూడా ఒప్పించటానికి ప్రయత్నం చేసేవారు. అయితే ఒప్పందం కుదిరేదా లేదా అంటే, ఆనాటి పరిణామాలన్నింటినీ చూస్తే బ్రిటీషువారిని కాదని నెహ్రూ ప్రభుత్వం ఏ చర్యా తీసుకోలేదనీ, తీసుకోగలిగిన శక్తి లేదనీ స్పష్టమౌతుంది. అందువలన బ్రిటీషు వారిని కాదని సంస్థానంలోకి సైన్యాలను పంపించి, లేక ఇతర విధాలుగా యూనియన్‌లో చేర్చటానికి నిర్బంధించగలిగిన స్థితి యూనియన్ ప్రభుత్వానికి లేకుండినదని స్పష్టమవుతుంది. ఇక్కడ కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన విప్లవం, సాయుధ పోరాటం ముందుకు పోవటం చూసి, బ్రిటీషువారు కూడా ఒక నిర్ణయానికి వచ్చారు. ఈ సంస్థానం స్వతంత్రంగా ఉండలేదనీ, స్వతంత్రంగా ఉండటమంటే కమ్యూనిస్టు పార్టీ, దాని నాయకత్వాన విప్లవోద్యమం ముందుకుపోయి, హైదరాబాదుకూడా చేతిలో లేకుండా పోతుందనీ వారు గ్రహించి, యూనియన్‌లో చేరవలసిందేనని నిజాం నవాబుకు మౌంటు బాటన్ ద్వారా, ఇతరత్రా కూడా స్పష్టం చేశారు.

మరోవిధంగా జరిగిన పరిణామాలు : ఆఖరుక్షణంలో చేరటం ఆచరణలో సాధ్యంకాలేదు. దీనితో యూనియన్ సైన్యాలు పంపటానికి నిర్ణయించింది. ఖాసిం రజ్వీ ఆఖరి క్షణంలో లొంగిపోవటంకన్నా, లొంగకుండా సైన్యాలకు పట్టుబడితే నాయకుడుగా, వీరుడిగా ముస్లింలముందు చలామణీ కావచ్చుననే ఆలోచనతో యూనియన్‌లో చేరటానికి సిద్ధంగా లేడు. మతోన్మాదం కూడా దానికి కారణం. రెండోవైపున పాకిస్తాన్‌లో జిన్నా తదితరులుకూడా సంస్థానాన్ని

స్వతంత్రంగా అట్టిపెట్టటానికి కొంత ప్రయత్నం చేశారు. ఇవన్నీ కలిసి నిజాం యూనియన్‌లో చేరలేదు. చివరి దశలో నిజాం నవాబుకూడా యూనియన్‌లో చేరటంకన్నా, మరో మార్గంలేదని నిర్ణయించుకున్నాడు. అయితే ఖాసిం రజ్వీ అతనికి సహకరించలేదు. ఈ పరిస్థితుల్లోనే యూనియన్ సైన్యాలు పంపించింది. దీనికి కొన్ని రోజులముందు పాకిస్తాన్ గవర్నరుగా ఉంటున్న జిన్నా అనారోగ్యంతో బాధపడుతూ చనిపోయాడు. దీనితో పాకిస్తాన్ చాలా గందరగోళంలో పడిఉంది. ఇక్కడ ఇత్తెహాదుల్ ముసల్మీన్ కూడా జిన్నా పోవటంవలన తమకు ఆప్తులు, తమను బలపరిచే శక్తులు బలహీనపడ్డాయని గందరగోళంలో ఉంది. ఆ అవకాశాన్ని ఉపయోగించుకొని సైన్యాలను హైదరాబాదుకి పంపించారు.

సైన్యాలను పంపటానికి పోలీసుయాక్షన్ అని పేరుపెట్టి, అంతర్జాతీయ ప్రజాభిప్రాయాన్ని మభ్యపెట్టిన యూనియన్ ప్రభుత్వం: హైదరాబాదు సమస్యను ఐక్యరాజ్య సమితిలో పాకిస్తాన్ తీసుకురావటం, పాకిస్తాన్‌లో కొందరు హైదరాబాదు మంత్రులకు రక్షణ కల్పించి, వారిద్వారా ఐక్యరాజ్య సమితిలో మాట్లాడించటం, ఇదంతా భారత ప్రభుత్వానికి తలనొప్పిగా పరిణమించటమే కాక, దానికి సమాధానం చెప్పటం కూడా సాధ్యం కాని దుస్థితి ఏర్పడింది. చట్టరీత్యా సంస్థానాలన్నీ స్వతంత్ర రాజ్యాలు. తక్కినవన్నీ ఐచ్ఛికంగానే చేరిపోయినవి. మిగిలినవల్లా హైదరాబాదు, కాశ్మీరు. కాశ్మీరు సమస్య ఆనాటికీ ఈనాటికీ ఐక్యరాజ్య సమితిలో మిగిలే ఉన్నది. అది తగాదా సమస్యగా చాలాకాలందాకా ఉంటూ వచ్చింది. తర్వాత ఇరుపక్షాలవారూ కూడా పట్టుపట్టకుండా, సమస్యను ఇటూ అటూ తేల్చకుండా (freeze) అట్టిపెట్టి ఉంచారు. చట్టరీత్యా ఒక స్వతంత్ర రాజ్యంలోకి మరొక రాజ్యమైన యూనియన్ ప్రభుత్వం సైన్యాలను పంపటం దురాక్రమణ అవుతుంది. దాన్ని పాకిస్తానైనా, మరేదేశమైనా ఐక్యరాజ్యసమితిలో లేవనెత్తవచ్చు. ఆలాంటప్పుడు తనకు సమాధానం చెప్పుకోడానికి వీలులేకుండా ఉంటుందని భారత ప్రభుత్వం భయపడుతూ వచ్చింది. ఏదో విధంగా బ్రిటిషువారిని ఒప్పించి యూనియన్‌లోగనుక ఐచ్ఛికంగా నిజాంనవాబు చేరితే, ఈ సమస్య రాకుండాపోతుం దని ఇంతకాలంగా వేచిఉంటూ వచ్చింది. జిన్నా చనిపోవటంతో రజాకార్లకు ప్రతిఘ టించే శక్తి తగ్గుతుందని, అదేవిధంగా ఉన్నమేరకైనా నిజాంనవాబు సైన్యం ప్రతిఘటించదని, చిందరవందరలో ఉండి లొంగిపోతుందని, సైన్యాలను పంపిం చారు. దీనికి పోలీసుయాక్షన్ అని పేరు పెట్టారు. పోలీసుయాక్షన్ అంటే శాంతి

భద్రతలను కాపాడటానికి సైన్యాన్ని పంపించటం. వచ్చినవారు పోలీసులేమీకాదు. యూనియన్ సైన్యాలు వచ్చినవి. సైన్యాలవెంట సాయుధ రిజర్వ్‌లు కూడా వచ్చినవి. కానీ వచ్చినవి ప్రధానంగా సైన్యాలే. ఈ సైన్యాలు పంపటాన్ని పోలీసుయాక్షన్ అని చెప్పి, ఐక్యరాజ్య సమితితోనూ, అంతర్జాతీయంగానూ యూనియన్ ప్రభుత్వం ప్రజాభిప్రాయాన్ని మభ్యపెట్టటానికి ప్రయత్నం చేసింది. కానీ వాస్తవంగా ఇది హైదరాబాదు ప్రభుత్వంమీద సైన్యాలను పంపటమే అవుతుంది.

విప్లవోద్యమాన్ని అణచటమే పోలీసు యాక్షను ప్రధానలక్ష్యం : సైన్యాలను పంపినది నిజాం ప్రభుత్వం మీదికా లేక ప్రజలమీదికా అన్నది ఆనాటికి అంతర్జాతీయంగా ఒక సమస్య కాకపోవచ్చును. కాని ఇతరత్రామాత్రం అది సమస్యగా ముందుకువచ్చింది. ఎందుకంటే కమ్యూనిస్టుపార్టీ, ఆంధ్ర మహాసభల నాయకత్వాన ఒక విశాలప్రాంతంలో నిజాం ప్రభుత్వం లేకుండా పోయింది. సాయుధదళాలు నిజాం ప్రభుత్వం సైన్యాన్ని దెబ్బమీద దెబ్బతీసి డిఫెన్సివ్ స్థితిలో పడవేశాయి. ఇది యధార్థం. ఈ స్థితిలో పంపిన సైన్యాలు నిజాంనవాబుకు వ్యతిరేకంగాకాక, ఈ విప్లవోద్యమాన్ని అణచటానికేనని స్పష్టమవుతున్నది. నిజాం నవాబు స్వతంత్రంగా ఉండటం సాధ్యంకాదనుకున్న తర్వాత, సైన్యాలు పంపి యూనియన్‌లో చేరే విధంగా అతన్ని ఒప్పించటం యూనియన్ ప్రభుత్వానికి విజయమవుతుంది. అతను లొంగిపోయినట్టుగా, తాము లొంగదీసినట్టుగా ఇది కన్పించి ప్రజాభిప్రాయానికి అనుకూలంగా ఉంటుందని యూనియన్ ప్రభుత్వం ఆ పని చేసింది. యూనియన్ సైన్యాలు సరిహద్దుల్లోకి ప్రవేశించిన వెంటనే తన సైన్యాలు లొంగిపోవటానికి, యూనియన్ సైన్యాలతో సహకరించటానికి, నిజాం నవాబు ఆర్డర్సు జారీచేశాడు. నిజాం నవాబు యూనియన్ సైన్యాలకు స్వాగతం పలికాడు. తర్వాత యూనియన్‌లో చేరిపోయాడు. దీనితో సమస్య పరిష్కారమయింది.

యూనియన్ ప్రభుత్వం హైదరాబాదు సంస్థానాన్ని రద్దు చేయటం వెనుకగల అసలు కారణాలు48 : ఒకసారి నిజాం నవాబు యూనియన్‌లో చేరిపోయిన తర్వాత, ఆ సమస్యను ఐక్య రాజ్య సమితిలో తీసుకురావటానికి వీలుండదు. అయినా పాకిస్తాన్ పదే పదే తీసుకు వచ్చింది. దీనికి సమాధానంగా

పేరు హైదరాబాదు ప్రభుత్వం యూనియన్‌లో చేరి పోయిందని స్పష్టం చేస్తూ వచ్చారు. అయినా చాలా కాలం వరకు ఈ సమస్య ఐక్య రాజ్య సమితిలో మగ్గుతూనే వచ్చింది : ఈ సంస్థానాన్ని రద్దుచేసి, ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత అది లేకుండా పోయింది. కేంద్రప్రభుత్వం ఈ సంస్థానాన్ని రద్దుచేయటానికి అంగీకరించటానికి గల కారణాల్లో ఇదొకటి. ఐక్యరాజ్యసమితి ముందు ఈ సమస్య ఉండి, ఎప్పటికీ తల నొప్పిగా ఉండటంతో, ఈ బెడదను వదిలించుకోవటానికి కూడా యూనియన్ ప్రభుత్వం సంస్థానాన్ని రద్దుచేసి ఆంధ్రప్రదేశ్‌ను ఏర్పాటు చేసింది. అంతేకాని భాషారాష్ట్రాలమీద అభిమానం ఉండటం వలన కానీ, ఈ విషయంలో చేసిన వాగ్దానానికి కట్టుబడి ఉండటం వలన కానీ ఇది జరుగలేదు. ఇతర అనేక కారణాల వలన ఈ చర్య తీసుకోవటం జరిగింది. ఇవి నిజాం నవాబు ప్రభుత్వం యూనియన్‌లో చేరిపోవటానికి దారితీసిన పరిణామాలు. సైన్యాలుకూడా ఈ దృష్టితోనే వచ్చాయి.

బ్రిటీషు సామ్రాజ్య వాదుల ప్రయోజనాలకు అనుగుణ్యంగా జరిగిన పరిణామాలు : నిజాంనవాబు ఫ్యూడల్ కావటం వలన, యూనియన్ ప్రభుత్వం బూర్జువా ప్రభుత్వం కావటం వలన, ఫ్యూడలిజానికి, పెట్టుబడి దారీ విధానానికి ఉన్న వైరుధ్యం వలన, ఈ తగాదా ఏర్పడలేదని ఇదివరకే చెప్పాము. ఇతర సంస్థానాలన్నీ చేరిపోయాయి. నిజాం సంస్థానం కూడా చేరి పోలేదంటే కొన్ని సౌకర్యాలను రాబట్టడం కొరకే. రెండవది: బ్రిటీషు వారికి ఒక అనుబంధ రాజ్యంగా, కీలుబొమ్మ రాజ్యంగా ఉంటూ, స్వాతంత్ర్యాన్ని కాపాడుకోవటానికి వెనుకటి బ్రిటీషు ప్రభుత్వ పథకం ప్రకారం నిజాం ప్రభుత్వం ప్రయత్నం చేసింది. యూనియన్ ప్రభుత్వం బ్రిటీషువారికి ఆధీనంగా ఉండటంతోపాటు, నిజాం సంస్థానం స్వతంత్ర రాజ్యంగా ఉండటం సాధ్యంకాదని తేలిపోయినతర్వాత, బ్రిటీషువారుకూడా యూనియన్‌ప్రభుత్వంతో మంతనాలు చేసి, నిజాం నవాబుతో దీన్ని ఒప్పించేశారు. ఈ రెండూ ఈవిధంగా జరిగినవి. దీనిలో వైరుధ్యం సమస్య రాదు. అయితే స్వతంత్ర రాజ్యాలుగా ఉండటానికి ఈ ఫ్యూడల్ ప్రభుత్వాలు ప్రయత్నం చేసిన మాట నిజమే. యూనియన్ ప్రభుత్వంకూడా పాకిస్తాన్ భాగాన్ని వదిలిపెట్టుకొని కనీసం మిగతా దేశాన్నైనా కేంద్రంయొక్క ఆధిపత్యం క్రింద ఉంచితే, ఇటు బ్రిటీషు వారికి, తమ పెట్టుబడులకు లాభదాయకంగా ఉంటుందని భావించింది.

నిజాం నవాబు ఉండి బ్రిటిషు పెట్టుబడులకు ఏ సౌకర్యాలుంటాయో అంతకన్నా హెచ్చు సౌకర్యాలుకూడా కలిగిస్తామని యూనియన్ ప్రభుత్వం బ్రిటిష్‌వారికి హామీ ఇచ్చింది. వాస్తవానికి బ్రిటిషు ఆధిపత్యంలో ఉన్నప్పుడు వారి పెట్టుబడులమీద వచ్చిన లాభాలకన్నా, యూనియన్ ప్రభుత్వ ఆధీనంలో ఉన్నప్పుడే బ్రిటిషు ప్రభుత్వానికి ఎక్కువ లాభాలు వచ్చినవి. హైదరాబాదు ప్రాంతంలో బ్రిటిషు పెట్టుబడి ఏమాత్రం ఉండింది, తర్వాతఏమాత్రంపెరిగినది, ఏమాత్రం వారికి లాభాలు వచ్చినవి అని మనం విడిగా లెక్కలుతీసి చెప్పలేము. కాని మొత్తంమీద భారతదేశంలో తర్వాతి కాలంలో బ్రిటిష్ పెట్టుబడులు తమ లాభాలను సంపాదించుకోవటం యధావిధిగా కొనసాగించటమే కాకుండా, వాటిని మరింత పెంచుకున్నాయి. యూనియన్ ప్రభుత్వం దానికి ఒక సాధనంగా ఉపయోగపడింది. దాన్ని ఏ విధంగానూ అడ్డుకోలేదనేది వాస్తవం.



(దీనితో మొదటిభాగం ముగుస్తుంది.)

# వివరణలు

1. (పేజీ 5) : హైదరాబాదు నగరంలో కోఠీ ప్రముఖమైన కూడలి ప్రాంతం. దీనికి రెసిడెన్సీ అనే పేరు కూడా ఉంది. ప్రస్తుతం స్త్రీల కళాశాల, వైద్య కళాశాల ఉన్న ప్రాంతమంతా రెసిడెంటు కోట. ఈ కారణం వల్లనే ఈ ప్రాంతానికి రెసిడెన్సీ అనేపేరు వచ్చింది.
2. (పేజీ 6) : ఉర్దూలో అత్రాపు అంటే చుట్టు పక్క ప్రాంతం. బల్దా అంటే నగరం. హైదరాబాదు నగరం చుట్టు పక్కల ప్రాంతాన్ని ఒక జిల్లాగా మార్చి దానికీ పేరు పెట్టారు.
3. (పేజీ 9) : సూర్యాపేట తాలూకాలో వర్ధమానుకోట అనే గ్రామం మూసీనది ఒడ్డున ఉన్నది. ఆ తాలూకాలోని హెచ్చు జనాభా కలిగి, హెచ్చు భూమిశిస్తు చెల్లించే గ్రామాలలో ఇది ఒకటి. ఇది 'సర్ఫేఖాసు' గ్రామంకూడా. ఈ గ్రామాన్ని ఆనుకొనిగానీ, తాలూకాలోగానీ మరే "సర్ఫేఖాసు" గ్రామాలు లేవు. ఈ ఒక్క గ్రామంలో వసూలయిన శిస్తు అంతా సూర్యాపేట తహశీలు ఆఫీసుకు చేరి అక్కడి నుండి నవాబు ఖజానాకు చేరిపోయేది. ఆయనకు రెవిన్యూ పరిపాలనా వ్యయ ప్రయాస లేకనే వచ్చే ఆదాయమిది. ఇలాంటి గ్రామాలు వరంగల్లులో 4, నల్లగొండలో 15, కరీంనగరులో 25, మెదక్‌లో 18, మహబూబ్ నగర్‌లో 15, నిజామాబాద్‌లో 1 ఉండేవి.
4. (పేజీ 12) : జాగీరు పరిపాలనను సంస్కరించటానికి ప్రభుత్వం ఒక కమీషన్‌ను ఏర్పాటు చేసింది. అది ఒక రిపోర్టు తయారుచేసి కొన్ని సిఫార్సులను చేసింది. వాటిలో ఇచ్చట ఉదహరించినవి ముఖ్యమైనవి.
5. (పేజీ 13) : నేరుగా ప్రభుత్వం పరిపాలనలో ఉన్న ప్రాంతాన్ని 'ఖాల్సాప్రాంతం' అనేవారు.
6. (పేజీ 15) : గ్రామాల్లో 'బారాఖూన్‌మాఫ్' అనే ఉర్దూ పదాల సముదాయాన్ని ప్రజలు నేటికీ వాడుతుంటారు. పన్నెండు నెత్తురులకు మాఫీ ఉంటుందని దీని ప్రతిపదార్థం. ఒకరు పన్నెండు హత్యలు చేసిందాకా అతన్ని ప్రభుత్వం ఏమీ అనదని, అంతకన్నా హెచ్చుమందిని హత్య

చేసే అధికారం ఉండదని దీని అర్థం. ఎలాంటి అదుపులేక స్వేచ్ఛగా వ్యవహరించటానికి ఈ పదాలను ఉపయోగిస్తారు.

7. (పేజీ 15) : బ్రిటిషువారు, ఇతర సామ్రాజ్యవాదులు మనదేశంలో ప్రవేశించకపూర్వంనుండే ఈ విధానం అమల్లో ఉంది.

8. (పేజీ 15) : ఉత్తర హిందూస్థానంలో ఈ కొలత నేటికీ వాడుకలో ఉన్నట్టు కనిపిస్తుంది. బిగా లేక బిగము మూడవవంతు ఎకరానికి (33 సెంట్లు) సరిగా ఉంటుంది.

9. (పేజీ 15) : బ్రిటిషువారు నిజాంనవాబుల రాజ్యంలో అడుగుపెట్టగానే తమ కష్టాన్ని రాబట్టుకోవటానికి రెవెన్యూ ఆదాయాన్ని క్రమబద్ధంచేయసాగారు. తమ సైన్యాలకయ్యే ఖర్చులను నవాబులనుంచి వసూలు చేసేవారు. నవాబులు తమ భోగలాలసత్వానికి బ్రిటిషు వారినుంచి అప్పులు తీసుకొని తిరిగి చెల్లించేస్థితిలో లేకుండేవారు. రెవిన్యూను క్రమబద్ధంచేసి దానినుంచి తమ బాకీలను తీర్చుకునేవారు.

1833 నాటికే రెవిన్యూను నేరుగా వసూలుచేసే పద్ధతిని ప్రవేశపెట్టారు. అయినా దేశముఖు, దేశపాండ్యాలు, పటేలు పట్వారీలు పూర్వపు పద్ధతినే కొనసాగించారు. రైతులనుంచి ఎప్పటిలాగానే శిస్తును వసూలుచేసి ప్రభుత్వ భాగాన్ని చెల్లించి, మిగతా రెవిన్యూను తాము అనుభవించేవారు; ప్రజలపై దౌర్జన్యాలను కొనసాగించేవారు. ఈ అక్రమాలను అదుపులో పెట్టటానికి 1833లో ప్రభుత్వం ఒక ఆర్డరును జారీ చేసింది. దానిలో ముఖ్యాంశాలు ఈ విధంగా ఉన్నవి :

"ఈడైటన్ తన గుత్తాలో చేరిన జిల్లాలలో పన్నుని, వసూలు పద్ధతులను గమనింపవలెను. ప్రతి గ్రామమునకు కొంత పన్నును నిర్ణయించెను. ఆ నిర్ణయముకన్నా హెచ్చుగా పటేలు పట్వారీలు వసూలు చేయకూడదని ఆజ్ఞాపించెను. రైతులకు భూముల పట్టాలు లేవు. కౌళ్ళ ఏర్పాటు అగుచుండెను. పటేలు, పట్వారి, దేశముఖు, దేశపాండ్యాలు-వీరు నలుగురు గ్రామాలలో అధికారులు. వీరి "జులుము" "జ్యాదతి" (అనగా దౌర్జన్యము) చేయుచుండినట్లు కనబడుచున్నవి. అందుచేతనే అట్టిది జరిగినట్లు తెలిసిన వారి నౌకరీకి బదులుగా ఇచ్చుచుండిన "రుసుములు, సేరీలు, వతనులు" జప్తి చేయబడుచుండెను.

"గ్రామాధికారుల విధులు : రైతుల విచారించుకొనుట, వసూలగు రకమును తాలూకుదారుకు పంపుట, లెక్కలు వ్రాయుచుండుట, సరిహద్దులలోని తగవులని సర్కారునకు తెలుపుకొనుట, అన్యాయముల మూలమున పారిపోయిన రైతులు తిరిగివచ్చిన వారి కౌలుభూములు తిరిగి వారికిచ్చుట, దొంగలపట్టుట, దొంగలుదొరకనట్లైన తామే ద్రవ్యనష్టమును ఇచ్చుకొనుట, మొకద్దమాలు వచ్చిన 'ఇన్సాఫు' వెంట తీర్పుచేయుట.

"తాలూక్దారు : పటేలు, పట్వారీ, దేశముఖు, దేశపాండ్యాలపై అధికారి తాలూక్దారు. అతడు తన క్రింది నలుగురి అక్రమముల విచారించవలెను. దొంగలను, ఖూనీలను పట్టవలెను. వారు దొరికిన బేడీలువేసి సరకారులో పంపవలెను.

"బేగారి లేక వెట్టి : తాలూక్దారు వెట్టి పట్టకూడదు. రెండవ వారిని పట్టనీయకూడదు.........ఈ బేగారి పద్ధతి చాలా రుచికరమైనది. ఉచితముగా నౌకరీ దొరికిన ఎవరొల్లరు? ఇప్పటికిని ఈ పీడ పూర్తిగా వదిలినట్లు కానరాదు. మన ప్రభుత్వమువారు నేటి వరకును వెట్టిని గురించి గష్తీలు, హుకుములు ఇచ్చుచున్నారు. ఈ తాకీదులోని కడపటి 14 పదఫా గమనింపతగినది. ఆ కాలములో మునాఫిర్లు (బాటసారులు కూడా) సిపాహీలు, ఇంగ్లీషువారు విశేషముగా వెట్టిపట్టినట్లు దీనివలన విశదమగును."

('గోలకొండ పత్రిక' : 21-10-1935)

ఈ ఆర్డరు జారీ అయిన తర్వాత కూడా పరిస్థితి చక్కబడలేదు.

1853 నాటికి సంస్థానపు పరిపాలన, ఆర్థిక వ్యవహారాలు అస్తవ్యస్తంగా ఉండేవి. వాటిని చక్కదిద్దటానికి అప్పటి ప్రధానమంత్రి సర్ సాలార్‌జంగ్ పూనుకున్నాడు. ఇతడు జాగీర్దారే అయినా పరిపాలనా వ్యవహారాల్లో ఇంగ్లండులో శిక్షణపొంది సంస్థానం చేరుకున్నాడు. బ్రిటిషువారి మద్దతు ఉన్న ఇతడు క్రమంగా సంస్థాన వ్యవహారాలను చక్కదిద్ది న్యాయశాఖ, ఆరోగ్య, మునిసిపల్, విద్య, పోలీసు, పబ్లికు వర్క్సు శాఖలను ఏర్పరిచాడు.

"1867లో "జిల్లాబందీ" అనే పద్ధతి ప్రవేశపెట్టబడింది. ఈ స్కీమునను సరించి సంస్థానం 5 డివిజనులలో, 17 జిల్లాలలో విభజింప

బడింది. డివిజనులకూ, జిల్లాలకూ, తహశీల్దారులకూ వేతనాలు పొందే అధికారులు నియమింపబడినారు." "భూమిశిస్తు విధించే పద్ధతి లోప భూయిష్టంగా ఉండేది. ఈ కారణాన 1875లో భూమిశిస్తు, సర్వే సెటిల్మెంటు శాఖను ఏర్పరచటానికి నిర్ణయించబడినది. కొద్దికాలంలోనే శిస్తు విధించే పద్ధతిని చక్కబరిచి బొంబాయి, సరిహద్దున ఉన్న ఇతర రాష్ట్రాలమాదిరి భూమిశిస్తు పరిపాలనా వ్యవస్థ నెలకొల్పబడినది." ('హైదరాబాదు స్వాతంత్ర్య పోరాటం' - రెండవ సంపుటి - ఇంగ్లీషు ప్రతి, పేజీ 254).

10. (పేజీ 16) : నేటికి గ్రామాలలో కులాల పేరుతో మాగాణి, మెట్టభూములు న్నాయి. బావులనుంచి మోటల (కపిలల) సాయంతో నీరుతోడి మాగాణి సాగుచేయుట పరిపాటి. అందువలన బావులకు కూడా కులాల పేర్లున్నాయి. ఉదా: బాపని బావి, కుమ్మరి బావి, చాకలి (రజక) బావి, దాసరి బావి, మాలబావి మొదలైనవి. ఇదే విధంగా మెట్ట భూములకు కూడా పేర్లున్నాయి. ఈ పేర్లు ఇప్పటికీ వాడుకలో ఉన్నాయి.

11. (పేజీ 16) : ఇతర కులాలవారుకూడా కొందరు తమ కులానికి సంబంధిం చని పనులు చేస్తున్నప్పటికీ, గ్రామాలలో నేటికీ కులాలవారీగా పని విభజన అమల్లో ఉంది. తమకై కేటాయించిన భూములను వారసత్వం గానే అనుభవిస్తున్నారు. ఇనాములన్నీ రద్దయి పట్టా భూములుగా మారి పోవటం మూలాన, పేద రైతులందరి లాగానే వీరు కూడా తమ భూములను అప్పులను తీర్చి వేయటానికి అమ్ముకున్నారు; అమ్ముకుంటు న్నారు.

12. (పేజీ 16) : "బేచిరాగు" అనేది ఉర్దూపదం. చిరాగు అంటే దీపం. బేచిరాగు గ్రామం అంటే దీపం లేని నిర్జన ప్రదేశమని అర్థం. ఇలాంటి గ్రామాల భూములకు పక్క గ్రామాల వారు యజమానులుగా ఉంటారు.

13. (పేజీ 16) : దీనిని ఇంగ్లీషులో బార్టరు (Barter) పద్ధతి అంటారు. డబ్బు చలామణిలోకి రాకపూర్వం అన్ని దేశాల్లోనూ అమల్లో ఉన్నది. తెలం గాణా గ్రామాల్లో సుమారు 50-60 సంవత్సరాలకు పూర్వం విస్తారంగా అమల్లో ఉంది. తర్వాతకాలంలో కూడా ఈ పద్ధతి ఏదోమేరకు అమల్లో ఉంటూ వచ్చింది. నేటికీ దీని అవశేషాలు బలంగానే ఉన్నాయి.

14. (పేజీ 17) : 1950-51 వరకు లక్షాయాభై వేల ఎకరాల భూమిపై యాజమాన్యం కలిగిఉన్న జన్నారెడ్డి కుటుంబం కొన్ని లక్షల రూపాయల మేరకు ప్రభుత్వానికి బాకీపడి ఉన్నదనీ, 1937 నిజాం నవాబు రజితోత్సవం సందర్భంలో (25 సంవత్సరాల పరిపాలనా కాలం) సుమారు 40 లక్షల రూపాయల "రైతాంగపు" బకాయిలను రద్దుచేసినట్లు ప్రకటించినప్పుడు ఈ పెద్ద భూస్వామి కుటుంబపు లక్షల రూపాయల బకాయి రద్దయిందనీ, ఈ సౌకర్యంవలన అందరికన్నా హెచ్చుగా లాభపడింది ఈ కుటుంబమేననీ ఆ కాలంలో అందరికీ తెలిసిన విషయమే. ఈ కుటుంబం ఒకవైపున రైతాంగపు భూమిపై యాజమాన్యాన్ని సంపాదించింది. మరోవైపున ఏ పన్నులనైతే చెల్లించలేక రైతులు తమ భూములపై యాజమాన్యాన్ని పోగొట్టుకున్నారో ఆ పన్నులనే సంవత్సరాల తరబడి చెల్లించక బాకీపెట్టి చివరకు రద్దు చేయించుకోగలిగిందీ కుటుంబం. ఈ విధంగా వీరి స్వాధీనంలో ఉండిన భూమిలో అత్యధిక భాగం ఎలాంటి శ్రమ, నష్టపరిహారం లేకుండా ఉచితంగా సంపాదించుకొన్నదే. ఇతర భూస్వాముల కుటుంబాలు కూడా ఈ రాయితీలవలన లాభపడినవి.

15. (పేజీ 21) : తహ అంటే అడుగు భాగం. నీటి నిలువను నిర్ణయించటానికి చెరువు అడుగు భాగాన్ని కొలత వేసేవారు.

16. (పేజీ 25) : గవర్నరు.

17. (పేజీ 25) : సెటిల్మెంటు డైరెక్టరు.

18. (పేజీ 25) : ఆనాటి బ్రిటీషు ఇలాకా-కృష్ణా, గుంటూరు మొదలగు జిల్లాలు.

19. (పేజీ 29) : మాంచెస్టరు బ్రిటన్‌లోని పెద్ద పారిశ్రామిక నగరం.

20. (పేజీ 42) : దేశముఖులు మొదలగు వారందరినీ భూస్వాములనే పేరుతో వ్యవహరించాము.

21. (పేజీ 69) : అడవిని నరికి, భూమిని సాగుచేసి, భూమిలోని సారం తగ్గిపోగానే మరో భూమిని సాగుచేసే పద్ధతిని "పోడు" అంటారు.

22. (పేజీ 110) : ఇజారా = కంట్రాక్టు; బంజరు = సాగుచేయని భూమి. ఇజారా బంజరులంటే సాగుచేయని భూమిని (అడవి, బీడు) సాగు చేయటానికి ప్రభుత్వం నుంచి కంట్రాక్టుకు తీసుకోవటం.

23. (పేజీ 115) : స్వంత సాగు

24. (పేజీ 115) : కౌలుశిస్తు—అసలు శిస్తును మించినది మునాఫా.

25. (పేజీ 121) : ఆ రోజుల్లో దేశముఖులు, పెద్ద భూస్వాములు ప్రయాణానికి పెద్ద గుర్రాలు ఉపయోగించేవారు. చిన్న భూస్వాములు చిన్న గుర్రాలను (తట్టు గుర్రాలు) ఉపయోగించేవారు. దూరపు ప్రయాణాలకు అప్పుడప్పుడు ఉపయోగించినా ఒక గ్రామంనుంచి మరో గ్రామానికి వీటిపై ప్రయాణించేవారు. పెద్ద గుర్రాలను తమ హోదాను పెంచుకోడానికి ఉపయోగించేవారు. పెద్ద దేశముఖులందరికీ పెద్ద గుర్రాలుండేవి. 'పెద్ద గుర్రాన్ని కట్టి మేపినట్టు' అనే సామెతను ఉపయోగంలేని, శక్తికి మించిన ఖర్చు అనటానికి మారుగా వాడుతారు.

26. (పేజీ 124) : విసునూరు దేశముఖు.

27. (పేజీ 124) : అబ్బాస్ అలీ.

28. (పేజీ 125) : దాయాదులు.

29. (పేజీ 294) : ఆ ఇల్లు అయిలమ్మదనీ, ఇల్లు చేరగానే ఆయనకు ఒక చీర కట్టించి వేషాన్ని మార్పించి బండిమీద దూరప్రాంతానికి పంపినట్టు అయిలమ్మ కథనం.

30. (పేజీ 295) : 20 నాగళ్ళు, 20 జతల పశువులు, నాగళ్ళకు ఉపయోగించే పనిముట్లు (కాండ్లు) బళ్ళు మొదలగునవన్నీ కలిస్తే "20 అరకల వ్యవసాయం" అవుతుంది. కొన్ని ప్రాంతాల్లో వ్యవసాయాన్ని సేద్యమనీ, కాపురమనీ అంటారు.

31. (పేజీ 343) : కామ్రేడ్ డి. వి. ఈ విషయాన్ని రాసేనాటికి ఆమె శాసన సభ్యురాలుగా ఉన్నారని గమనించాలి.

32. (పేజీ 347) : మాదిరాజు రామకోటేశ్వరరావు గారి స్వీయ చరిత్ర, పేజీ-388.

33. (పేజీ 383) : ఇక్కడ టేపులో రికార్డుచేసిన కొంత భాగాన్ని తొలగించి 'పార్టీ పాలసీలో మార్పులు-వర్గసంకర విధానపు కొనసాగింపు' అనే శీర్షికతో తిరిగి వ్రాయాలని రచయిత అనుకున్నారు. కాని తిరిగి వ్రాయక ముందే ఆయన చనిపోయారు. ఈ కారణం వలన టేపులో రికార్డు చేసిన భాగంలో ఈ అంశానికి సంబంధించిన కొంతభాగాన్ని ఎడిట్ చేసి ఈ పేరాగా చేర్చాము. ఈ అధ్యాయంలోని తర్వాతి భాగంలో ఆనాటి పార్టీ పాలసీపై కొంత వ్యాఖ్యానాన్ని చూడవచ్చును.

34. (పేజీ 392) : రచయిత ఈ పేరాను పూర్తి చేయలేకపోయారు.

ఈ అధ్యాయంలో మిలటరీ కాల్పులు, అమలు జరిగిన నిర్బంధ విధానం తర్వాత ఈ క్రింది భాగాన్ని చదువుకోవాలి. రచయిత చెప్పిన విషయాలనుంచి ఎడిట్ చేసి క్రింద ఇస్తున్నాము:

ఈ కాల్పులు, ఆ తర్వాత అమలు జరిగిన తీవ్ర నిర్బంధ విధానం గురించి దేశ వ్యాప్తంగా వార్తా పత్రికలలో వార్తలు ప్రచురించ బడినాయి. వీటితో ఆంధ్రమహాసభ, కమ్యూనిస్టు పార్టీల నాయకత్వాన ఇక్కడ భూమి పంపకం కొరకు పోరాటం నడిచిందనే విషయం దేశ మంతటా తెలిసింది. అఖిల భారత కాంగ్రెసు కమిటీ అధ్యక్షులుగా ఉన్న నెహ్రూగారు కమిటీ కార్యదర్శులలో ఒకరైన శ్రీ ద్వారకానాథ్ కచ్రూను రిపోర్టు సేకరించటానికి ఇక్కడికి పంపించారు. ఈ గ్రామాలు తిరిగి, వారు రిపోర్టు సేకరించి ప్రకటించారు. ఇందులో దోపిడీ విధానం గురించి కూడా వివరించారు. అయినప్పటికీ వారు ప్రభుత్వాన్ని తీవ్రంగా ఖండించకుండా, ప్రజలు ఏ కోరికల కొరకు పోరాడుతున్నారో వాటిని సమర్థించకుండా, కాంగ్రెసు దృష్టితో దాన్ని వివరించారు. భూస్వాములకు వ్యతిరేకంగా భూమి సమస్య తీసుకోవటం, గ్రామరాజ్యాలు ఏర్పాటు చేయటం, సాయుధ ప్రతిఘటన సాగించటం ఈ రిపోర్టులోని ముఖ్య విషయాలు. వచ్చే పరిణామాలు ఎలా ఉంటాయో ఊహించటానికి వీటినొక దిక్సూచిగా తీసుకొని వాటికి వ్యతిరేకంగా జాగ్రత్తలు తీసుకోవటానికి ఇదంతా వారు చేశారని చెప్పవచ్చు.

35. (పేజీ 395) : ఆ రోజుల్లో కాంగ్రెస్‌వారి నాయకత్వంలో సంస్థాన ప్రజల మహాసభ ఏర్పడి ఉండేది. ఆచరణలో ఇది కాంగ్రెసుకు అనుబంధ సంస్థగా పని చేసేది. ఈ మహాసభ అగ్రనాయకత్వమే ఈ స్టేట్స్ హై కమాండ్. నెహ్రూ దీనికి అధ్యక్షులుగా ఉండేవారు.

36. (పేజీ 418) : పార్టీ నాయకుల ఇళ్ళను తగుల బెట్టటం ప్రత్యక్ష కార్యాచరణ మొదలు కాకముందే జరిగిందని రచయిత ఈ సందర్భంగా చెప్పారు.

37. (పేజీ 488) : ఇక్కడ రచయిత ఈ విధంగా చెప్పారు : "అశ్విక దళాల దాడుల గురించి, మూసీ ఒడ్డు ప్రాంతంలో జరిగిన ప్రతిఘటన

గురించి ఇంకా వివరాలు వ్రాయవలసి ఉంది. ఇదే విధంగా మిర్యాల గూడా తాలూకాలోనూ, హుజూరునగరు తాలూకాలోనూ ఈ కాలంలో జరిగిన ప్రతిఘటన గురించి కూడా వ్రాయవలసి ఉంది. వరంగల్ జిల్లాలో వరంగల్ తాలూకా గురించి ఇప్పుడిచ్చిన వివరాలు సరిపోవు. మరికొంత వివరంగా వ్రాయవలసి ఉంది. తిరిగి ఇక్కడ చేర్చటం జరుగుతుంది." ఆయన ఈ పనిని పూర్తిచేయలేకపోయారు.

38. (పేజీ 543) : మరఠ్వాడా, కర్ణాటక ప్రాంతాల్లోని కార్యకలాపాల గురించి మరికొన్ని వివరాలు చేర్చాలని రచయిత అనుకున్నారు. ఈ పని పూర్తి చేయలేకపోయారు.

39. (పేజీ 528) : మెజారిటీ, మైనారిటీ రూపొందించిన రెండు డాక్యు మెంట్లలో మెజారిటీ డాక్యుమెంటు ఆంధ్ర రాష్ట్రకమిటీ సెక్రటేరియటు రూపొందించిన థీసిసుగా ఉంటుంది. దీనినే ఆంధ్ర థీసిసుగా వ్యవహ రిస్తారు. అనాటి ఆంధ్ర రాష్ట్రకమిటీ సెక్రటేరియటులో చండ్ర రాజేశ్వరరావు (కార్యదర్శి), పి. సుందరయ్య, యం. బసవపున్నయ్య, దేవులపల్లి వెంకటేశ్వరరావు, భీమిరెడ్డి నరసింహారెడ్డి సభ్యులుగా ఉండేవారు. (కా॥ డి.వి. వ్రాసిన "తెలంగాణా సాయుధ పోరాటం విరమించాలనే తప్పుడు ధోరణులపై విమర్శ" అనే డాక్యుమెంటుకు రచయిత ముందుమాట; ప్రొలిటేరియన్ లైను ప్రచురణ, పేజీ xxiv ). ఇది 1949 మధ్యభాగంలోని పరిస్థితిని తెలుపుతుంది. ఆంధ్ర థీసిసును రూపొందించినది 1948 మొదటి అర్ధభాగమని దృష్టిలో పెట్టుకోవాలి. ఇదంతా రెండవ పార్టీ కాంగ్రెసు జరిగిన తర్వాతి కాలం. అందువలన సెక్రటేరియటులో పెద్ద మార్పులేమీ జరిగివుండవని భావించవచ్చు.

ఆంధ్ర థీసిసుతో విభేదించిన మైనారిటీ సభ్యులు పి. సుందరయ్య గారు (కామ్రేడ్ డి.వి. వ్రాసిన "భారత విప్లవ పంథాను చూపించిన తెలంగాణా సాయుధ పోరాటం." ప్రొలిటేరియన్ లైన్ ప్రచురణ, పేజీ 23, 32).

40. (పేజీ 618) : 'గ్రామరాజ్యాలు-ద్వంద్వ అధికారం అనే సమస్యను ఇక్కడ కొంతవరకు చర్చించాము. అవసరమైన వివరాలు చేర్చ వచ్చున'ని రచయిత ఈ చోట చెప్పారు. ఆ పని చేయలేకపోయారు.

41. (పేజీ 619) : 'అర్ధరాత్రివేళ వచ్చిన స్వాతంత్ర్యం' అని దీని అర్థం. ఈ పుస్తక రచయితలు లారీ కాలిన్స్, డొమినిక్ లాపియర్ అనే యూరోపు వాసులు.

42. (పేజీ 620) : కాశ్మీరును చీల్చటంకొరకు చేసిన ప్రయత్నాలని సందర్భాన్నిబట్టి అర్థం చేసుకోవచ్చును.

43. (పేజీ 622) : పోలీసుచర్య నాటివరకు జరిగిన పరిణామాలను వివరించటంతో ఈ గ్రంథం మొదటిభాగం ముగుస్తుంది. పోలీసుచర్య, తదనంతర పరిణామాలను రెండవభాగంలో చూడవచ్చును. దీనికి లోబడే పోలీసుచర్య తర్వాత జరిగిన కొన్ని పరిణామాలను క్లుప్తంగా పేర్కొన్నారు.



# తప్పు - ఒప్పుల పట్టిక

| పేజీ | పేరా/లైను | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 16 | 4వ పేరా 4, 5లైన్లు | విధానంతో | విధానంలో |
| 25 | 6వ పేరా 2వ లైను | నాజాం | నాజం |
| 61 | 3వ పేరా 4వ లైను | ఎకాస్లా | ఏక్‌సాలా |
| 72 | చివరిలైను | తడకవున్న | తడకమళ్ళ |
| 78 | 2వ పేరా 7వ లైను | wein | weir |
| 110 | 3వ పేరా 6వ లైను | ఇజారా-బంజరుదారు | ఇజారా బంజరుదారు |
| 114 | 2వ పేరా 3వ లైను | 1907లో | 1907 |
| 117 | 3వ పేరా 3వ లైను | వారికి | వారిని |
| 122 | 4వ పేరా 1వ లైను | విషయమది. | సమయమది. |
| 123 | మొదటిలైను | సంచరించుకోలేక | సంతరించుకోలేక |
| 131 | 5వ లైను | (పేజీ ) | (పేజీ 286) |
| 133 | 5వ పేరా 1వ లైను | కలిగించేదేకాని | కలిగించిందేకాని |
| 148 | 3వ పేరా 2వ లైను | 1939 | 1839 |
| 154 | 4వ పేరా 4వ లైను | ఫతె హజగుంవారి | ఫతెహ జంగువారి |
| 155 | రెండోలైను | కొండావెంకటరెడ్డి | కొండా వెంకటరంగారెడ్డి |
| 165 | 5వ పేరా 1వ లైను | కళచలువే. | కళ్ళ చలువే. |
| 169 | చివరనుంచి రెండోలైను | ప్రక్రియగా | ప్రతిక్రియగా |
| 175 | 2వ పేరా 8వ లైను | లేనట్టే. | లేనట్టే, |
| 187 | గేయం 5వ లైను | పుల్ల కుసుమిత | పుల్ల కుసుమిత |
| 194 | హెడ్డింగు | కమ్యూనిస్టు | కమ్యూనిస్టుల |
| 195 | చివరినుంచి3వ లైను | చిర్రాపూరి | చిర్రావూరి |
| 199 | 4వ పేరా చివరిలైను | విదేశీయులను | దేశీయులను |
| 228 | చివరనుంచి9వ లైను | అంగీకరించిన | అంగీకరించని |

| పేజీ | పేరా/లైను | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 267 | 5వ లైను | కమ్యూనిస్టులు | కమ్యూనిస్టుల |
| 273 | 4వ పేరా 6వ లైను | 1947 | 1944 |
| 274 | శీర్షికలో | 11వ మహాసభ | 11వ ఆంధ్రమహాసభ |
| 279 | 5వ లైను | జిల్లాకమిటీ | నల్లగొండ జిల్లాకమిటీ |
| 293 | 1వ పేరా 7వ లైను | మీదకట్టు | కట్టమీద |
| 311 | 2వ పేరా 4వ లైను | దీక్ష, క్రమశిక్షణను | దీక్ష, పట్టుదల, క్రమశిక్షణను |
| **356*** | **నాలుగోలైను** | **150 గ్రామాలలో** | **250 గ్రామాలలో** |
| 363 | 2వ పేరా 1వ లైను | ఖాలిజ్ ఖాతా | ఖారిజ్ ఖాతా |
| 364 | 3వ పేరా 3వ లైను | ఒప్పుకొని రాజీపడినారు. | ఒప్పుకొని ఇచ్చి రాజీ పడినారు. |
| 375 | 5వ లైను | ఉన్నతస్థానం | ఉన్నతస్థాయి |
| 380 | 4వ పేరా 1వ లైను | జరిగిన | జరిగి |
| **386*** | **3వపేరా 1వలైను** | **150 గ్రామాలలో** | **250 గ్రామాలలో** |
| 487 | మొదటిలైను | చెట్టుమీదికి ఎక్కి కాల్చులు | చెట్టుమీదికి ఎక్కి కూర్చుని కాల్చులు |
| 499 | 18వ లైను | పైనుంచి పోస్తే | పై నుంచి శత్రువుమీద పోస్తే |
| 584 | సబ్ హెడ్డింగు క్రింద 4వ లైను | అనేవారు. ఉద్యమంలో... | అనేవారు ఉద్యమంలో... |

| | | | |
|---|---|---|---|
| 587 | 10-11లైన్లు | ...చేరకుండా వున్నాయి. నిజాం నవాబుయూనియన్‌లో... | ...చేరకుండా ఉన్నాయి. ఇంత వరకిది స్పష్టంగానే కన్పిస్తుంది.నిజాంనవాబు యూనియన్‌లో... |
| 618 | 5వ లైను | కార్మికవర్గ పోరాటంలోకి | కార్మికవర్గం పోరాటం లోకి |
| 622 | 4వ లైను | ఐక్యరాజ్యసమితి తోనూ | ఐక్యరాజ్య సమితిలోనూ |

* **వివరణ**

ఈ పుస్తకంలోని 356, 386 పేజీలలో —1946 చివరి అర్ధభాగంలో నల్లగొండ జిల్లాకు చెందిన 150 గ్రామాల్లో భూమి పంపకం, తదితర విప్లవ కార్యక్రమం అమలు జరిగిందని చెప్పబడింది. రచయిత కేసెట్‌లో 250 గ్రామాల్లో ఈ కార్యక్రమం అమలు జరిగిందని చెప్పారు. కా॥ డి వి 1970 తర్వాత వ్రాసిన కొన్ని రచనలలో ఉద్యమం విస్తరించిన గ్రామాల సంఖ్యను 120 అనీ, ఇతర చోట్ల 150 అనీ పేర్కొన్నారు. 'భారత జనతా ప్రజాతంత్ర విప్లవం, కార్యక్రమం—ఒక వివరణ' (డి వి కోర్టు స్టేటుమెంటు)లో 150 గ్రామాల్లో ఈ విప్లవ కార్యక్రమం అమలు జరిగిందని ఉన్నది. దానిని చూసి ఈ 250 గ్రామాలను 150 గ్రామాలుగా మార్చాము.

కా॥ డి వి 1946 చివర్లో వ్రాసిన 'నల్లగొండ ప్రజల వీరోచిత పోరాటం' అనే పుస్తకంలో ఈ పోరాటం 200 గ్రామాలకు విస్తరించినట్లు ఆయన పేర్కొన్న విషయాన్ని తర్వాత గమనించాము. దీనితో కేసెట్ కథనంలో కా॥ డి వి స్వయంగా చేసిన మార్పులను జాగ్రత్తగా పరిశీలించాము. రచయిత ఈ 250 గ్రామాలను మార్చవద్దనే దృష్టితో అదేవిధంగా ఉంచినట్లు కనిపించింది. ఈ వాక్యాలచుట్టూ ఇతర మార్పులు చేసినా, ఈ గ్రామాల సంఖ్యను అదేవిధంగా ఉంచినారు. కాబట్టి ఈ రెండు పేజీలలో 150 అని ఉన్నచోట్ల 250 అని చదువుకోవాలి.

386వ పేజీలోని రెండవ పేరాలో ఇచ్చిన వివరణను దృష్టిలో ఉంచుకుంటే ఈ ఉద్యమం విస్తరించిన గ్రామాల సంఖ్యను సరిగా అర్థం చేసుకోవచ్చును.